శ్రీరస్తు

# శ్రీ సీతారామాంజనేయ సంవాదము

(టీకా తాత్పర్య విశేషార్థ సహితము)

శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తిచే

విరచింపబడినది.

బ్రహ్మశ్రీ వఝ్ఝల - నారాయణశాస్త్రులచేతను

వ్యాఖ్యాతము.



మద్రాసు

[illegible] అండ్ కంపెనీ వారిచే

ప్రకటితము.

ఆనంద [illegible] యమున

ము[illegible]

# తొలిపలుకు

శ్రీ సీతారామాంజనేయ మను నీ యద్వైత గ్రంథమును శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి యను మహాకవి "శ్రీమన్నారాయణ మహాదేవగురు కరుణాకటాక్షవీక్షణమున" శ్రీమదధ్యాత్మరామాయణమునందలి శ్రీరామహృదయమును నాధారముగాఁ జేసికొని రచించెను. ఈ గ్రంథము ముముక్షుజనానందసంధాయకము, ప్రౌఢకవిమనోరంజకము.

ఏతత్కృతికర్త నియోగిబ్రాహ్మణుఁడు. ఈతని తల్లి తిమ్మాంబ. తండ్రి రామమంత్రి. ఏతద్గ్రంథమును జదువఁగా నీతఁడు సర్వశాస్త్రపారంగతుఁ డని తెలియఁగలదు. ఈ కవి తన నిరుపమాన పాండిత్యమును ననర్గళ కవితాధోరణిని గనబఱచుటకై యీ గ్రంథమం దేకాక్షర ద్వ్యక్షర పద్యములను, నానావిధ వృత్తములను రచించియున్నాఁడు. నారదపరమేష్ఠి సంవాదము, సాంఖ్యయోగము మొదలుగాఁగల గ్రంథములును నేతత్కవి కృతము లని ఆంధ్రపరిషత్పత్రికవలనఁ దెలియవచ్చుచున్నది.

ఈ గ్రంథరాజమునకు బ్రహ్మశ్రీ వఝ్ఝల నారాయణ శాస్త్రులుగారును, శ్రీమాన్ దేవరాజ సుధీమణిగారును పండిత పామరజన మనోరంజకమగునట్లు వ్యాఖ్యానమును విరచించిరి.

దీని మహోపయోగమునుబట్టి యిదివఱ కచ్చొత్తించిన రెండు కూర్పుల ప్రతులును విక్రయింపఁబడినవి. ఈ మూఁడవ కూర్పున నిందలి యక్షరస్ఖాలిత్యములు చక్కఁగ దిద్దఁబడి, పండితులచే పునఃపరిశోధనము గావింపఁబడియున్నది.

ఇట్టి గ్రంథరాజమును జదివి, కృతికర్త యాశయము చొప్పున జనులు జీవబ్రహ్మైక్యతత్వ, పరబ్రహ్మస్వరూపాదుల నెఱింగి, వైరాగ్య మోక్షసుఖాదులను బడయ యత్నింపవలయు నని యాపించుచున్నారము.

ప్రచారకులు.

శ్రీః

శ్రీ రామచన్ద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీ సీతారామాంజనేయసంవాదము

టీకా తాత్పర్య విశేషార్థ సహితము.

---

## అవతారిక.

శ్రీ సీతా రామాంజనేయ సంవాద మను నీ గ్రంథ మును నధ్యాత్మరామాయణమునందలి శ్రీ రామహృదయ మును నాధారముగాఁ జేసికొని "సీతా రామ మరుత్సూను సంవాదం మోక్షదాయకమ్" అని యందుఁ జెప్పఁబడినయట్లే యీ సందర్భమునకును నామం బిడి స్వానుభవసిద్ధంబు లగు ఖిలోపనిషద్రహస్యంబుల నిందుఁ బొందుపఱిచి ముముక్షు నానంద సంధాయకముగను, ప్రౌఢకవి మనోరంజకముగను రశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి యను మహా వి యసమానకవితాధోరణితో రచియింపంబూని "మంగళా ని మంగళమధ్యాని మంగళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే" అను మహాభాష్య వచనానుసారముగ నీ మోక్షశాస్త్రము నిర్విఘ్న ముగఁ బరిసమాప్తి నొందుటకు నిజేష్టదైవ శ్రీ జానకీ రామ రబ్రహ్మానుసంధానరూపం బగు మంగళమును

కం. " శ్రీకారము గృత్యాదిని।
ప్రాకటముగ నున్నఁ జాలు ౯ బహుదోషములం।

బోకార్చి శుభము లొసఁగును।
బ్రాకృతముగ నినుము సోఁకుశపరుసముభంగిన్ ''

అని చెప్పఁబడుటచే శ్రీకారమును మఱియు "మగణస్య శుభం ఫలమ్" అని చెప్పుటచే మగణమును మొట్టమొదటఁ గ శ్రీమదిత్యాది పద్యముచే నాచరింపుచున్నాఁడు.

శా. శ్రీమద్దివ్య నిజాంఘ్రిపద్మములు సంసేవింపుచున్ భక్తిచే
ధీమంతుం డగునాంజనేయుని నసద్దేహేంద్రియాతీత చి
ద్వ్యోమానందుఁడ వీవ నేనని కృపన్ బోధించు శ్రీ జానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాన్తమున్.

టీ. శ్రీ...లు - శ్రీమత్ = స్వప్రకాశసమేతుండును, (కావుననే) దివ్య = దేదీప్యమానుండును నగు, నిజ = తన (శ్రీరామచంద్రుని) యొక్క, [1]అంఘ్రిపద్మములు = కమలములవంటి పాదములను, [2]భక్తిచేన్ = ("స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" అనుటచే నిట్టియంత రంగ భక్తిచేత, సంసేవింపుచున్ = (నిరంతరమును) భజియింపుచు (నిట్లుగొలుచుటచేత,) ధీమంతుండగు = ("మోక్షసాధనసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" శ్రవణ మననాదులగు మోక్షసాధనములలోనెల్ల భక్తిదే

1. "క్వచిదపిదృష్టో విభక్తి పరిణామః=ఒకానొకచో నొండొక విభక్తికి వేఱొకవిభక్తియు నగు" ననుటచే నిచట ద్వితీయకు బదుల ప్రథమావిభక్తి యని తెలియందగు.

2. అనఁగా తనయొక్క స్వరూపమును నిత్యము ననుసంధించుటయె భక్తి యనఁబడును. "భక్తిః ప్రసిద్ధా భవమోక్షణాయ నాన్యత్ తత్సాధన మస్తి కించిత్" అనుటచే నట్టి భక్తి సంసారబంధవిముక్తికి గారణ మనియు నెఱుంగునది.

గొప్పది యనుటచే నట్టి తనయందలి యనన్యభక్తిచే నతిపవిత్ర మగుట వలనఁ దనచేఁ జెప్పఁబడు నిఖిలలోపనిషద్రహస్యముల నెల్ల విని గ్రహించుట సమర్థమగు) బుద్ధిగలవాఁడగు, ఆంజనేయునిన్ = అంజనాతనయుం డగు హనుమానునిఁగూర్చి, అసత్...ఆనందుఁడవు-అసత్ = (మరుమరీచికలవలె (భ్రాంతికల్పితములగుటంజేసి) అనిత్యములగు, దేహ=స్థూలసూక్ష్మకారణరూపోపాధిత్రయమునకును, ఇంద్రియ = త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియములకును, వాక్పాణిపాదపాయూపస్థములను కర్మేంద్రియములకును, ("మనష్షష్ఠానీంద్రియాణి" అనుటచే జ్ఞానేంద్రియ పంచకాపేక్షచే నాఱవయింద్రియ మగు మనస్సుయొక్క భేదములగు) మనోబుద్ధిచిత్తాహంకారములకును, అతీత=(సాక్షిభూతుఁడవగుటచే) పరుండవును, చిత్ = శుద్ధచైతన్యస్వరూపుఁడవును, భూమ = సద్రూపుఁడవును, ఆనంద=ఆనందమయుఁడవును (కాన), [1]ఈవ=(త్వంపదలక్ష్యార్థభూతుఁడవగు) నీవే, నేను=(తత్పదవాచ్యుఁడనగు) నేను, అని = ఈవిధమున, కృపన్ = (ఐకాంతికం బగు) కారుణ్యముచే (వాత్సల్యముచే), బోధించు=(అపరోక్షానుభవజ్ఞానము) నుపదేశించెదు, శ్రీ...ము-శ్రీ = శుద్ధసత్త్వప్రధానమాయాస్వరూపయగు, జానకీ = సీతాదేవితోఁగూడిన, రామబ్రహ్మము = ("రమన్తే యోగినో యత్ర రామ ఇత్యుచ్యతే బుధైః" అనుటచే యోగిహృదయపుండరీకాంతర్వర్తి యగు శ్రీరామచంద్రపరబ్రహ్మమును, అశ్రాంతమున్ = అవిచ్ఛిన్నముగ, ఆరాధింతున్ = తదేకతానమానసుండ నగుదును.

తా. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః । తమేవ భాన్త మనుభాతి సర్వం తస్యభాసా

1. ఇచట "నీవు" శబ్దము అవధారణార్థకం బగు 'అ' అను పదంబుతో సంబంధించి యుండుటను తత్త్వమస్యాదిమహావాక్యతాత్పర్యార్థమగు జీవేశ్వరైక్యమును సూచింపుచున్నది.

సర్వమిదం విభాతి" ఆ చిత్ప్రాకాశము స్వయంప్రకాశమాన మగుచుండ సూర్యచంద్ర నక్షత్రములును, మెఱపులును, ప్రకాశింపఁజాల వనునపుడు ఈ యగ్నిమాట కేమి లెక్క? అట్లు వెలుఁగుచుండెడు నా పరమాత్మ ననుసరించి సూర్యచంద్రాదిక మెల్ల వెలుంగుచున్నది. ఆ పరమాత్మతేజస్సుచేతనే యిదియెల్లఁ బ్రకాశించుచున్నది. అను నీశ్రుతిప్రమాణమునుబట్టి యవిచ్ఛిన్న తేజోనిధియగు తనయొక్క చరణసరోజముల నేకాన్తభక్తిచే భజింపుచు శమదమాది సాధనసంపన్నుఁడయి యుత్తమాధికారి యగు పవనతనయునకు "తద్యోహం సోఽసౌ యోఽసౌ సోఽహం త్వం వా అహమస్మి భగవో దేవతేఽహం వై త్వమసి"=నీవే నేను నేనే నీవు అను నపరోక్షానుభవైక్యజ్ఞానము సిద్ధించుటకు, కార్యకరణసంఘాత విలక్షణుండ వగు నీవే సచ్చిదానంద స్వరూపుండ నగునే నయితినని యవ్యాకృతాత్మస్వరూపమును బరమకారుణికుండయి యుపదేశించునట్టి శుద్ధసత్త్వప్రధానమాయాశబలితం బగు శ్రీరామబ్రహ్మమును నేనే నీవు నీవే నే నని నిరంతరము ననుసంధించెదను.

అవ. "యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ యథా పృథివ్యామోషధయస్సంభవన్తి। యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాస్సహస్రశః ప్రభవన్తే సరూపాః। తథాక్షరాద్వివిధా స్సోమ్యభావాః ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి' ఏవడువున సాలెపురుగు తనలోనుండి దారములను బైకిఁ బఱపి మరలఁ దనలోనికిఁ దీసికొనునో పుడమినుండి యెట్లు తరు గుల్మ లతాదులు పొడముచున్నవో, మండుచున్న యగ్గినుండి వేలకొలఁది మిణుఁగుఱులు లేకరీతిని వెడలుచున్నవో, యట్లు నిమిత్తోపాదాన కారణ మగు బ్రహ్మమునుండి పలుదెఱంగుల నీప్రాపంచిక

పదార్థములు పొడముచున్నవి. ఆ బ్రహ్మమునందే యడఁగుచున్నవి. అను శ్రుత్యర్థమును మనంబున నుంచుకొని దేశకాలవస్తుపరిచ్ఛేదరహితుం డగు పరమాత్మునేకదేశమునందుండి యతని సంకల్పస్వరూప యై నిఖిలప్రపంచ సృష్టిస్థితిలయములను జేయుచున్న యాదిశక్తి యగుసీతను "ఆవృణోతు నమాం మాయా సృష్టిస్థిత్యంతకారిణీ" అనుటచే నన్ను మహామోహంబున ముంపక రక్షింపవలయు నని ఈ పద్యమునందు వేఁడుకొనుచున్నాఁడు.

సీ. తన రజోగుణముచేఁ దనరంగ నేదేవి
  గల్పించు నఖిలలోకముల నెల్లఁ
దనసత్త్వగుణముచే నొనరంగ నేకొమ్మ
  పోషించు నీ సర్వభూతములను
దనతమోగుణముచేఁ దగ నే వధూమణి
  జగములనెల్ల సంక్షయముఁ జేయుఁ
దా శుద్ధసత్త్వప్రధాన యై యేరామ
  రామాంకమున నజస్రము వసించు
తే-గీ. నట్టి భువనైకమాత దయాసమేత
  సద్గుణవ్రాత నిర్మలస్వాంతపూత
  భక్తజనమానసోద్యానపారిజాత
  సీత కరుణించి నన్ను రక్షించుఁగాత.  ౨

**టీ. ఏ దేవి = (సత్త్వరజస్తమోగుణ సామ్యావస్థాస్వరూపయు, నాదిశక్తియు నగు) నే జానకీదేవి, తన రజోగుణముచేఁ = (చతుర్ముఖబ్రహ్మరూపమున) స్వాంశభూతమగు రజోగుణము నవలంబించి, అఖిల**

లోకముల, [1]నెల్లన్ = సమస్త బ్రహ్మాండములను, నాయా గోళములయందలి యవాంతరలోకములను, తనరంగన్ = తనయందుఁ బ్రబలుటకై, కల్పించున్ = సృజియింపుచున్నదో, ఏ కొమ్మ = ఏ వనిత, తన సత్త్వగుణముచేన్ = స్వకీయ సత్త్వాంశమునుబట్టి, ఈ సర్వ భూతములను = (తనచే మొదట సృజింపఁబడిన) పరిదృశ్యమానములగు భూతజాతమును, ఒనరంగన్ = నియమితకాలముదనుక తమతమ మర్యాదలను మీఱకుండునట్లు, పోషించున్ = విష్ణురూపమునఁ గాపాడుచున్నదో, (పిమ్మటఁ గల్పాంతము తటస్థింపఁగా), ఏ వధూమణి = ఏ వనితారత్నము, [2]జగములనెల్లన్ = సమస్త లోకములను, సంక్షయమున్ - చేయున్ = (రుద్రరూపమున) వినాశము నొనర్చునో, (మఱియు) [3]ఏరామ = ("సుందరీ రమణీ రామా" యని యమరము. కాన రామాశబ్దము స్త్రీపర్యాయంబు) ఏ పొలఁతుక, [4]తాన్ = తాను, శుద్ధ సత్త్వప్రధాన యై (రజస్తమోగుణసంపర్కము లేని) సత్త్వగుణము ప్రధానముగాఁగలదియై, రామాంకమునన్ = భర్త యగు రాముని తొడమీఁదను, (మఱియు పరబ్రహ్మముయొక్క యేకదేశమునందును) అజస్రము = సంతతమును, వసించున్ = ఉండునో, అట్టి =

---

1. ఇందు సర్వపర్యాయం బగు 'నెల్ల' శబ్దమునకు నసమాసమున విశేష్యమునకుఁ బరనిపాతంబు.

2. హలంతమగు జగచ్ఛబ్దము తుదిహల్లునకు ద్విత్వాగమంబులు రాఁదగియున్నను బాహుళకంబుగఁ గడపటిహల్లు లోపింపఁగా నదంతామహద్వాచకంబునకుం బోలె ముప్రత్యయంబు వచ్చినది.

3. "దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్" నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు" అనుటచే రామాశబ్దము రామ అని నిష్పన్న మైనది.

4. "ద్రుతస్య తత్స్వరస్యాపి లోపోహలవసానయోః" అను నస్మత్కృతాంధ్రవ్యాకరణచింతామణిచేఁ దా శుద్ధ అనుపట్ల ద్రుతలోపము.

సర్వజనప్రసిద్ధురా లగు, భువనైకమాత = జగముల కన్నిటికి నొక్క జననియు, దయాసమేత = (తన సంతతియగు ప్రాణికోటియందు వైషమ్యాదికము లేని) దయతోఁ గూడినదియు, సద్గుణ...పూత - సత్ =యోగ్యము లగు, గుణ = సకల కల్యాణగుణములయొక్క, వ్రాత = సముదాయము చేత, నిర్మల = అత్యంతపరిశుద్ధ మైన, స్వాంత = అంతఃకరణము చేత, పూత = పరమపావనయు, భక్త...జాత - భక్త = ఏకాంతభక్తు లగు, జన=మనుజులయొక్క, మానస = హృదయము లనియెడు, ఉద్యాన = పూఁదోఁటలకు, పారిజాత = (ఎలమి గొలిపెడు) కల్పవల్లియు నగు, సీత = జానకీదేవి, కరుణించి = కనికరము నూని, నన్నున్ = స్వాశ్రితుండనగు నన్ను, [1]రక్షింపుఁగాతన్ = సంసారదుఃఖమునుండి కడతేర్చి రక్షింపవలెను.

తా. "అసద్వా ఇద మగ్ర ఆసీత్" అను శ్రుతిచేత సృష్టికిఁ బూర్వమునందు నిజగుణత్రయసంకోచావస్థచేత నవ్యక్తయై యుండ "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అనుటచే సృష్టికాలము రాఁగా సర్వేశ్వరసంకల్పరూపప్రేరణచేతఁ దనయందలి రజోగుణ ముద్రేకింపఁగా సర్వేశ్వరసంకల్పశబలిత ంబగు నా రజోగుణముచే నీ కార్యకరణ సంఘాతము నెల్ల సృజించి, పిదపఁ దనదగు సత్త్వగుణము నవలంబించి తనచే సృజింపఁబడిన ప్రపంచమును గొంతకాలము వినోదార్థమునకుఁబోలెఁ బాలింపుచుఁ దరువాత "బాలో వాలుకకేళివత్" బాలుఁడు ఇసుకపొకలనుబెట్టి కొంత దనుక క్రీడించి యా యిసుకపొకల నన్నిటిని జెఱుపునట్లు ప్రళయకాలమున నాయా లోకముల నెల్ల తనతమోగుణముచే నుపసంహరించి వెనుక నీ జగద్విరచనావన నాశనరూపక్రీడచేత నలసట నొందినదియుంబోలె స్వాధి

---

1. "ప్రార్థనే కాత కావుతా" అను సూత్రముచేత నిచటఁ బ్రార్థనార్థకమునందుఁ గాత యను ప్రత్యయము.

స్థానభూతం బగు పరబ్రహ్మముయొక్క అంకతలమున నిశ్చింతతోనున్న యాదిశక్తియగు సీత నా తప్పులనెల్ల సైఁచి మాతవలె నన్నుఁ బ్రోచుఁ గాత!

అ. ఇట్లు ప్రపంచోత్పత్తిస్థితిలయముల నొనరించు సత్త్వరజస్తమోగుణాత్మిక యగు నాదిశక్తిని బేర్కొని తద్గుణాంశ సంభూతు లైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులను వేఁడు కొనుచున్నాఁడు.

సీ. తతశుద్ధ సత్త్వప్రధానవిగ్రహుల ని
  మ్ముల రజస్సత్త్వతమోగుణకుల
స్వసుధర్మశృంగారవైరాగ్యవేషుల
  విశ్వోద్భవస్థితివిలయకరులఁ
దప్తకాంచననీరధరచంద్రవర్ణుల
  శుభ కమండలు చక్ర శూలధరుల
ఘన సత్య వైకుంఠ కైలాసవాసుల
  వర హంస ఖగ వృషవాహనులను

తే-గీ. షడ్గుణైశ్వర్యయుతుల భాషావధూ ప్ర
  సన్నమంగళదేవతా సర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పరమాత్మమయుల
  బ్రహ్మ విష్ణు మహేశులఁ బ్రస్తుతింతు. 3

టీ. తత...హులన్ - తత = అంతటను వ్యాపించెడు, శుద్ధ = నిర్మలమగు, సత్త్వ = సత్త్వగుణమే, విగ్రహులన్ = స్వరూపముగాఁ గలవారును, (ఇట్లయ్యు), ఇమ్ములన్ = క్రమంబుగ, రజస్సత్త్వతమోగుణకులన్ = రజోగుణము సత్త్వగుణము తమోగుణమును ప్రధానముగాఁ గలవారును, స్వసుధర్మ శృంగార వైరాగ్యవేషులన్ - స్వ=(క్రమంబున)

తమకు నుచితములైన, సుధర్మ = (కాషాయవస్త్ర) కమండలుధారణాది వైదికధర్మోపేత మైనట్టియు, శృంగార = వనమాలా కౌస్తుభ శ్రీవత్స కనకాంబర ప్రముఖానేక సహజ) దివ్యాలంకార భూషితంబును, వైరాగ్య= (గజచర్మ కపాల రుద్రాక్ష విభూతిధారణాది) విరక్తిసూచకంబు నగు, వేషులన్ = వేషములు గలవారిని, (కనుక నే తదనురూపంబుగ), విశ్వ... కరులన్, విశ్వ = నిఖిల భువనములయొక్క, ఉద్భవస్థితి లయ కరులన్= జననమునురక్షణమును సంహారమును గావించువారిని, (మఱియును) తప్త... వర్ణులన్-తప్త = పుటము వేయఁబడిన, కాంచన = బంగారుయొక్కయు, నీరధర = నల్లని మేఘముయొక్కయు, చంద్ర = నిండు పున్నమ చందురునియొక్కయు, వర్ణులన్ = కాంతివంటి కాంతి గలవారలను, శుభ... ధరులన్-శుభ = (తమ తమ పనులకు ననుకూలించుటచే) క్షేమదాయకములగు, కమండలు = (చల్లినంతన స్వసంకల్పితపదార్థములను సృజింపఁదగిన మంత్రపూతోదకముచే నిండిన) కలశవిశేషమును, చక్ర = (తలఁచినమాత్రముచే నే తెంచి దుష్టశిక్షణమును జేసి శిష్టరక్షణ మొనర్చు) సుదర్శన చక్రరాజమును, శూల = కల్పాంతకాలమునందు చరాచరాత్మక జగజ్జాలముల నెల్ల నువ్వెత్తుగఁ బొడిచి పటాపంచలుగఁ జేయనోపు) త్రిశూలమును, ధరులన్ = కైకొనియున్నవారిని (ఇంకను), ఘన...వాసులన్- ఘన = గొప్పదియగు, సత్య = ("సత్యాదుత్పద్యతే సర్వం సత్యే సర్వం ప్రతిష్ఠితమ్'' అనుటచే సమస్తసృష్టికి నుత్పత్తిస్థానమగు, లేక సత్పురుషులగు సృష్టికర్తలుండునదియు నగు) సత్యలోకమును, వైకుంఠ = అకుంఠిత పరిపాలన స్థానమగువైకుంఠనగరమును, కైలాస = (కే-తనశిఖరమునందు, లాసః .. మహాప్రళయమునం దీశ్వరునితాండవము గలది గాన) కైలాస మనఁబడు పర్వతమును, వాసులన్ = నివాసస్థానముగాఁగలవారును, వర...నులను-వర=పక్షిశ్రేష్ఠమగు, హంస = రాజహంసము (మఱియు సృష్టికి హేతుభూతమగుమనోవృత్తి హంస యనఁబడునని యర్థాంతరము), ఖగ = (సకల

ప్రపంచమునందలి పరిపాలనా విషయములను నిమిషములోఁ బరికించుటకుఁ దగినయాకాశయానము గల) గరుత్మంతుండును, [1]వృష = (ప్రళయసమయమునందుఁ జెలరేఁగి ప్రపంచమునకు శత్రువువలెనుండు) వృషభమును, వాహనులను = వాహనముగాఁగలవారును, [2]షడ్గుణైశ్వర్యయుతులన్ = (అణిమాద్యష్టైశ్వర్యము, వీర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము) అనునాఱుగుణముల సంపత్తితోఁ గూడుకొనినవారును, భాషా... పతులన్ - భాషావధూ - సరస్వతీదేవికి ("ధాతా యథాపూర్వ మసృజత" అనుట చేత వేదవాక్యముల ననుసరించి పూర్వకల్పానుసారముగనే బ్రహ్మ ప్రపంచమును రచించువాఁడుగాన నట్టివేదవాణికిని, [3]ప్రసన్నమంగళదేవతా (సకల ప్రాణులను రక్షించుచుఁ బ్రసన్నురాలై సర్వశుభముల నిచ్చు) లక్ష్మీదేవికిని, [4]సర్వమంగళా = పార్వతీదేవికిని, అధిపతులన్ = పెనిమిటులను (ఇట్లు కార్యార్థము గుణత్రయానుగుణరూపంబులఁ దాల్చినవా రయ్యు నస్తుత త్వ

1. "వృషస్స్యా ద్వృషభే శత్రౌ" అని కోశము.

2. అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా। ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః; అని అమరము - లేక వీరు సృష్టిస్థితిలయకారులు గాన నాయాసమయములందు నుపయుక్తములగు భూతములయొక్క యుత్పత్తి వినాశగమనాగమనవిద్య లనెడు నాఱు గుణములయొక్క సంపద కలవా రనియును నర్థము.

3. 'రమా మంగళదేవతా' అని అమరము.

4. "శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమంగళా" సర్వాణి మంగళాని యస్యాస్సా సర్వమంగళా = సర్వమంగళములను గలదియనుట లేక ప్రళయమునందుఁ బ్రపంచమంతయు పాపభూయిష్ఠము కాఁగా నప్పుడు పెచ్చురేఁగు దుష్టులకెల్లఁ గ్రూరగ్రహమగు కుజునివలె నుండి మహాకాళీ రూపమున నాదుష్టులఁ బరిమార్చునది యనియు నర్థము.

ముచేత), సాక్షాత్పరమాత్మ మయులన్ = అపరోక్షానుభవసిద్ధ పరబ్రహ్మ స్వరూపులు నగు, బ్రహ్మవిష్ణు మహేశులన్ = త్రిమూర్తులను, ప్రస్తుతింతున్ = కొనియాడెదను.

తా. "తతశుద్ధసత్త్వప్రధాన విగ్రహులన్" అని యుపక్రమము నందుఁ జెప్పఁబడిన మాయాప్రతిబింబిత చైతన్యము "స ఈక్షతే మేను లోకాల్లోకపాలాన్ను సృజా ఇతి" అను మొదలగు శ్రుతులనుబట్టి లోకములనెల్ల సృజియింపఁదలంచి అప్పుడు దనకు నుపాధిభూతమై యున్న రజస్సత్త్వతమోగుణంబులఁ బరిగ్రహించి బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మకంబులగు రూపంబులఁ గ్రమంబునఁ బూని యా గుణంబులకును, రూపంబులకును ననుగుణంబులగు వేషంబులును, దేహకాంతులును, పరికరములును, నునికిపట్లును, వాహనములును, సంపదలును, భార్యలును గలిగి తన సత్యసంకల్పానుగుణముగ తుదముట్ట నీ ప్రపంచనాటకమును జరిపి ముగించి మరల నెప్పటియట్ల సచ్చిదానందఘనంబై యుండె నని సాక్షాత్పరమాత్మ మయుల నను నుపసంహారమునందుఁ జెప్పఁబడిన పరిశుద్ధచిద్రూపము నను సంధింతును.

అవ. తొలుత "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" అనుశ్రుతిప్రమాణసిద్ధ మగు శ్రీరామచంద్ర బ్రహ్మమును స్వేష్టదైవముగ భావించి, పిమ్మట "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశంతి" అను శ్రుతిచేతను "జన్మాద్యస్య యతః" అను బాదరాయణసూత్రిచేతను గోచర మగుచున్న శుద్ధసత్త్వప్రధానమాయోపాధిక చైతన్యస్వరూపిణియు, సృష్టిస్థిత్యన్తకారిణియు నగు సీతామహాశక్తిని బేర్కొని తరువాత నా సృష్టిస్థితిలయములకు నాధికారికపురుషు లగు

త్రిమూర్తులం గొనియాడి యిపు డాయాదిశక్తియొక్క యంశ సంభూత లగుటంజేసి తమభర్తలకు స్వస్వకృత్యములకుం దగినశక్తుల నొసంగుచు వారల నాక్రమించియున్న తమ యావరణాది శక్తులఁ దీసి వారికి మరల శుద్ధాత్మజ్ఞానము నొసంగువాణీ రమా భవానులను వేఁడుకొనుచున్నాఁడు.

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంపసమయిం
పం జాలు సామర్థ్యముల్
బ్రహ్మోపేంద్ర నగేంద్రచాపులకు సం
పాదించుచుఁ వారికిఁ
బ్రహ్మాత్మైక్యవివేక మిచ్చుచును సం
భావించుచు నోచుచు నా
బ్రాహ్మీమంగళదేవతాగిరిజలఁ
బ్రార్థింతు నశ్రాంతమున్. ౪

టీ. బ్రహ్మాండంబుఁ - చతుర్దశభువనాత్మకంబగు నీ మహాప్రపంచమునెల్ల, సృజింపన్ = నిర్మించుటకును, పెంపన్ = పాలించుటకును, సమయింపన్ = రూపుమాపుటకును, చాలు = సమర్థములగు, సామర్థ్యముల్ = శక్తులను, బ్రహ్మోపేంద్ర నగేంద్రచాపులకుఁ = (క్రమంబుగఁ దమమగలగు) లోకేశ కేశవ శివులు మువ్వురకును, సంపాదింపుచుఁ = ఒడఁగూర్చుచు, వారికిఁ ఆ మువ్వురకును, బ్రహ్మ...కము - బ్రహ్మ = శుద్ధచైతన్యమునకును, ఆత్మ - ప్రతిబింబచైతన్యమునకును గల, ఐక్య = ఏకత్వముయొక్క, వివేకముఁ = జ్ఞానమును, ఇచ్చుచుఁ = (వారల నావరించియున్న తమ యావరణాదిశక్తుల నుపసంహరించి) కలుగఁజేయుచు, వీరల నిట్లు మాశక్తులచే నాడించుచుంటి మనుగర్వమును మాని వారలను మిగుల సన్మానింపుచు నని యర్థము. ప్రోచు = పాలించుచున్న, ఆ =

సుప్రసిద్ధురాండ్రగు, బ్రాహ్మీ...జలన్ - బ్రాహ్మీ = సరస్వతీదేవిని, మంగళదేవతా = లక్ష్మీదేవిని, గిరిజలన్ = పార్వతీదేవిని, అశ్రాన్తమున్ = నిరన్తరముగ, ప్రార్థింతున్ = (మీ భక్తుఁడ నగు నాకుఁగూడ నట్టి వివేకము నొసంగుఁడని) వేఁడుకొనియెదను.

విశేషార్థము.—జగత్తునకు మూలకారణంబగుప్రకృతి బ్రహ్మమునకంటె భిన్నమైనదియా లేక యభిన్నమైనదియా యను విచారణ, సమస్త వేదాంత వాక్యములనుబట్టి పరమాత్మయే ప్రపంచమునకు నిమిత్తోపాదానకారణ మని ముగియుచున్నది. ఇట్లు బ్రహ్మమే ప్రధానకారణమగునపుడు ప్రకృతి యని వేఱె యేల యెత్తికొనవలయునన్న, ప్రకృతి యనునది మూలకారణమునకు వేఱు కాకయున్నను కల్పితభేదమును గనఁబఱచుటకొఱకు ప్రకృతి కార్యాత్మక యని చెప్పఁబడినది. ప్రకృతికి బ్రహ్మస్వరూపము ముఖ్యము. కార్యాత్మకత్వము గౌణము. ఇట్లు ద్వివిధాకారమయ్యోనేని తనయందలి నానాత్మకత్వముచేః దాను పలుదెఱంగు లగుటవలనఁ బ్రకృతియు జగత్కారణ మనఁబడుచున్నది. ప్రకృతి యిట్లు జగత్కారణమగుటచే బ్రహ్మమేయని స్పష్టముగ నీదిగువ శ్రుతి వక్కాణింపుచున్నది. "అథపరాయయా తదక్షర మధిగమ్యతే" దేనిచే నాశరహితమగుబ్రహ్మము పొందఁబడుచున్నదో యది పరాప్రకృతి యనఁబడు నని తొలుత పరాప్రకృతినిఁ జెప్పి "యత్తదద్రేశ్య మగ్రాహ్యమగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రమ్। తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" అనఁగా చక్షురాదీంద్రియములకు గోచరముకానిదియు, కర్మేంద్రియములచేఁ బట్టువడనిదియు, తనకు నొండొక కారణము లేనిదియు తెలుపు మొదలగు పదార్థ వర్ణములు లేనిదియు జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును లేనిదియు, వినశ్వరముకానిదియు, బ్రహ్మమొదలు స్థావరముదనుకఁగల భూతజాతములు తానే

యగుచున్నదియు, సర్వవ్యాపకమును, వృద్ధిక్షయములు లేనిదియు నగు నే యక్షరబ్రహ్మము గలదో యదియే చరాచరాత్మకమగు భూతజాతము నకు హేతువు అని చెప్పఁబడినది గావున "యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ" సాలెపురుగు తనలోనుండి వచ్చెడి దారమునకుఁ దా నుపాదానకారణము నిమిత్తకారణము నెట్లగుచున్నదో యట్లు బ్రహ్మచైతన్యము తన్ను నాశ్రయించి యున్న మాయ యందు మొదటఁ బ్రతిఫలించి యా మాయా సంగమువలన "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" సృష్టికొఱకుఁ బలువిధములుగ నే నగుదు నని సంకల్పించి "ఇదగ్ం సర్వమసృజత" ఈ ప్రపంచమునంతను దన యంశమగు ప్రకృతిచే సృజియించెను, అని శ్రుతులు చెప్పుటచే జగత్తు నకు నిమిత్తకారణము నుపాదానకారణము నగుచున్నది.

కావున ప్రకృతమునందు నిర్వికల్పమగు బ్రహ్మమునకు మాయ తన సంగమువలన సృష్టిస్థితిలయకరణసామర్థ్యము నిచ్చి కొంతదనుక నీ ప్రాపంచిక వినోదమును జరిపి పిమ్మట "యయా తదక్షర మధిగమ్యతే" అను శ్రుతిచేఁ దన యావరణమును దీయఁగా మరల తొంటియట్ల నా బ్రహ్మము నిరంజనమై యుండు నని తాత్పర్యము.

అవ. ఇట్లు "శక్తిశక్తిమతో రభేదః" అనున్యాయముచేఁ జిదచిదాత్మకంబగు బ్రహ్మము ననుసంధించి సంప్రదాయానుసారముగఁ దన గ్రంథము నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందుటకు విఘ్నాధినాథుండగు గణపతిని గూడ త్రిమూర్త్యాత్మకం బగు బ్రహ్మముగ భావించుచున్నాఁడు.

క. వరవిశ్వోద్గతిహేతువు
పరముఁడుఁ బురుషుండుఁ బ్రకృతి బ్రహ్మముఁ బరమే

శ్వరుఁ డంచుఁ దజ్జ్ఞు లెవ్వనిఁ
బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతున్. ౫

టీ. తత్+జ్ఞులు ("తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అనుటచే జగత్కారణంబును దచ్ఛబ్దవాచ్యమునగు) బ్రహ్మమును దెలిసిన ధీరులు, వర... హేతువు-వర=(వైషయికానందప్రచుర మగుటచేఁ) బ్రియ మగు, విశ్వ=స్థావరజంగమాత్మకమగు - సర్వప్రపంచముయొక్క, ఉద్గతి= ఉద్భవించుటకు, హేతువు = జగదుత్పత్తికిఁ గారణభూతుఁడగు నలువ యనియు, పరముఁడు పురుషుండు = ప్రపంచరక్షణమును జేయు పురుషోత్తముఁడనియు, (మఱియు) ప్రకృతి = (ఆ త్రిమూర్తులకును గారణ మగు) మూలప్రకృతిస్వరూపుఁ డనియు, బ్రహ్మము=ఆ మూలప్రకృతికి నధిష్ఠానభూతమగు పరబ్రహ్మ మనియు, ఎవ్వనిన్=ఏ మహాత్ముని, పరికింపుదురు = (జ్ఞానదృష్టిచే) కనుఁగొనియెదరో, 1 అగ్గణాధిపతిన్-ఆ = అట్లు సర్వాత్మకుఁడైన, గణ = ఆదిత్యులు, విశ్వులు, వసువులు, తుషితులు, భాస్వరులు, అనిలులు, మహారాజికులు, సాధ్యులు, రుద్రులు నను నవవిధగణదేవతలకును బ్రమథాధిగణములకును, అధిపతిన్=అధీశ్వరుండగు హేరంబుని, అర్చింతున్ = పూజించెదను. "ఏకో దేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీసర్వభూతాన్తరాత్మా" ఈశ్వరులకెల్లఁ బరమేశ్వరుండును దేవతలకెల్లఁ బరమదైవతమును, ఆధికారిక పురుషులకెల్లఁ బరమాధికారియు నగు నాయొక పరమాత్ముఁడే సర్వభూతములయందుఁ దెలియఁబడక సర్వాన్తర్యామియై యున్నవాఁడని యుపదేశించుటచే నాధికారిక

1 ఆ+గణాధిపతి=అగ్గణాధిపతి-ఇచట ఆ ఈ ఏ అను నీ సర్వనామపదంబులకుఁ బరంబులగు శషసహారభిన్నంబులగు నసంయుక్తహల్లులకు ద్విత్వంబును, బూర్వస్వరంబులకు హ్రస్వంబును వైకల్పికముగ నగును గాన నగ్గణాధిపతి నని ప్రయోగము.

పురుషులగు చతుర్ముఖబ్రహ్మ మొదలగు వారెల్లరు నుపాధిభేదముచే వేఱుగ నున్నను వస్తుస్వరూపముచే నే దేవునికంటె వేఱుగాక యున్నవారని మహాజ్ఞానులు నుడివిరో యా గణపతిబ్రహ్మమును సేవించెదను.

తా. జగదుత్పత్తిస్థితిలయకరులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను, వారికిఁ గారణభూతంబగు మూలప్రకృతిని, తదుపాదానంబగు బ్రహ్మంబును జ్ఞానులే మహాత్మునిగాఁ దలఁచెదరో యట్టి గజముఖుని బ్రార్థించెదను.

అవ. ఇంకను దాను జెప్పఁదలఁచినశాస్త్ర మెవ్వని కొఱకుఁ దొలుత నుపదేశింపఁబడినదో యా యుత్తమాధికారి యగు హనుమానునిఁ బేర్కొనుచున్నాఁడు.

మ. తనరంగాయముచేతరామచరణద్వంద్వైకదాస్యంబు హెచ్చినభక్తిం దగువాక్కుచే ననిశముం శ్రీరామనామప్రకీర్తనముం జిత్తముచేతరామపరతత్త్వధ్యానముం జేయుశ్రీహనుమంతుం సముపాశ్రయింతు మదభీష్టార్థంబుసిద్ధింపఁగన్.

టీ. హెచ్చిన=అత్యధికమయిన, భక్తి = (కరణత్రయకృత్యమునకు హేతువగు నిరతిశయ) ప్రేమచేత, కాయముచేతం=(త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియపంచకములోఁ బ్రధానమగు త్వగింద్రియమునకు నంగమైన) శరీరముచేత, కరయుగముతో నని భావము. రామ...స్యంబుం రామ=వ్యక్తస్వరూపుఁడగు శ్రీరామచంద్రునియొక్క, చరణ=అడుగులయొక్క, ద్వంద్వ=ద్వయముయొక్క, ఏక=ప్రధానమగు, దాస్యంబుం=(సంవాహనరూపమగు) శుశ్రూషను, మఱియును, తగు=(మృదుమధురమై) యొప్పు, వాక్కుచేం=(వాక్పాణిపాదపాయూపస్థము లను కర్మేంద్రియములలోఁ దొలిదియగు) వాగింద్రియముచేత, అనిశముం = నిర

1. ఈ భక్తిపదము నామకీర్తన తత్త్వధ్యానములతోఁ గూడ సంబంధించుచున్నది.

స్తరమును, శ్రీ...నముఁ - శ్రీ=శోభాయుక్తుఁడగు, రామ=రామునియొక్క, నామ = నామధేయరూపమగు మూలమంత్రముయొక్క, ప్రకీర్తనముఁ= సంతతోచ్చారణమును, (అట్లే) చిత్తముచేతఁ (చిత్తశబ్ద మిచట మనశ్శబ్ద పర్యాయము గాన మనోబుద్ధిచిత్తాహంకారము లను నన్తఃకరణచతుష్టయ ములలో ముఖ్యమయిన వృత్త్యంతర రహితం బగు శుద్ధమానసముచేతను, రామ...నముఁ - రామ = శ్రీరామబ్రహ్మముయొక్క, పరతత్త్వ = వాస్తవ స్వరూపముయొక్క, ధ్యానముఁ = నిత్యానుసంధానమును, తనరఁ = తదేకపరత్వముగ, చేయు = కావించెడు, శ్రీ హనుమంతుఁ = (శమ దమాది సాధనసంపత్తి గల) యాంజనేయుని, మత్...ర్థము-మత్ = నాకు, అభీష్ట = (మిగుల) నిష్టమగు, అర్థంబు = (ఈ గ్రంథమును సాంత ముగ రచియించి కృతకృత్యతం బొందుట యను) ప్రయోజనము, సిద్ధిం పఁగఁ = నెఱవేఱుటకొఱకు, సముపాశ్రయింతుఁ = భజించెదను.

తా. మనోవాక్కాయము లను కరణత్రయముచేఁగూడ నెడ లేకుండ శ్రీరామచంద్రారాధనపరాయణుం డగు మారుతకుమారుని ఎడతెగక నా యభీప్సితంబు నెఱవేఱుటకు నారాధింతును.　౬

అవ. ఇట్లు తన యిష్టదైవమును నిష్టదైవాంశభూత ప్రధానదేవతలను నమస్కరించి గురుదైవమును నమస్క రించు చున్నాఁడు.

క. ఆరయ మద్బాల్యంబున
గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుం
దారకయోగముఁ దెలిపిన
నారాయణగురువులను మనంబునఁ గొలుతున్.　౭

టీ. మ...నఁ - మత్ = నాయొక్క, బాల్యంబునఁ = ('బాల స్స్యా త్పంచవార్షికః' అనుటచే) ఐదేండ్ల ప్రాయమునందు, గారవ

మునన్ = వాత్సల్యముతో, నాకున్ = (గ్రంథకర్తకనుట), చిత్తశుద్ధికర మగన్ = ('పంచమేబ్దే బ్రాహ్మణోపనయనం బుద్ధిశుద్ధిదం' ఐదవయేఁట బ్రాహ్మణునకు నుపనయనము చిత్తశుద్ధి నొసఁగును అనుటచేతఁ రాగద్వేషాది కలుషితము గాకుండ) చిత్తము నిర్మలముగ నుండుటకొఱకు, తారక యోగమున్ = ('న గాయత్ర్యాః పరంమంత్ర' మ్మని ప్రసిద్ధికెక్కి జనన మరణాది దుఃఖసముద్రమును దరింపఁజేసెడు మంత్రరాజ మగు) గాయత్రీ మంత్రముయొక్క యుపాసనారూపయోగమును, ఆరయన్ = ఆత్మానాత్మవివేచనమును జేసి స్వస్వరూపమును బరికించుటకు, తెలిపిన = ఉపదేశించిన, [1] నారాయణగురువులను = తనకు బ్రహ్మోపదేశమును జేసిన నారాయణుం డను నాచార్యుని, మనమునన్ = హృదయమునందు, కొలుతున్ = అనుసంధానము చేయుదును.

తా. "గురు స్సాక్షాత్పరంబ్రహ్మ గురుర్దేవో జనార్దనః" గురువు ప్రత్యక్షమగు పరబ్రహ్మము, గురువు దేవదేవుండగు నారాయణుం డగు ననుటచే, సాక్షాన్నారాయణస్వరూపుండును, నారాయణాఖ్యుండు నగు నా దేశికేంద్రుని ముందు యౌవనాది దశలయందు నా మనస్సు కామ క్రోధాది కలుషితము గాకుండ శమదమాది సాధనసంపన్నమై స్వస్వరూపానుసంధానపరం బగుటకొఱ కుపనయనమును గావించి గాయత్రీ మంత్రోపాసనావిధము నుపదేశించిన మేలును మనంబున మఱవక భజించెదను.

అవ. ఇట్లు తనకు బాల్యమున గాయత్రీమంత్రోపాసనావిధానమును దెలిపి తదుపాసనాబలంబున శమదమాది సాధనసంపన్నునిగను, బరిశుద్ధాంతఃకరణునిగను, నుత్తమాధికారిగను, తన్నుఁ జేసిన ప్రథమగురువునకుఁ దొలుత నమ

1. ఇచట బహువచనము పూజార్థకము.

స్కరించి పిమ్మటఁ దనకు నపరోక్షబ్రహ్మసాక్షాత్కారము నుపదేశించిన మహాదేవదేశికుని ప్రత్యక్షత్త్వస్వరూపునిఁగ భావించుచున్నాఁడు.

సీ. ఘనపాపమును మాపఁ | దనుతాపమును బాపఁ
దనరూపమును జూపఁ | దనరువానిఁ
దనుకాయమును ద్రోయఁ | బెనుమాయ నొగి మాయ
ముగఁ జేయ గుఱి డాయఁ | దగినవాని
మనుకారణశరీ|రమును జీఱి నవికార
వరకారణముఁ జేరఁ | బరఁగువానిఁ
దనయందు జగమందు | దాఁ బొందుగా నొందు
చెలు వొందువిందుగాఁ | దెలియువాని
తే. నిగమనిగదిత సుగుణము | లగణితముగ
మిగుల నిగుడఁగ సగుణుఁడై | యగుణుఁ డగుచుఁ
బగలు రే యన కొకరీతి | నెగడువాని
శ్రీ మహాదేవ గురుని భ|జింతు నెపుడు. ౮

టీ. ఘన = (అనేక జన్మసంచిత మగుటచేఁ బెరిఁగి) గొప్పదైన, పాపమును = దురితమును, మాపన్ = ('జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసా త్కురు తేఽర్జున' అనుటచే) రూపుమాపుటకును, తనుతాపమును - తను = స్థూలశరీరసంబంధ మగు, తాపమున్ = తాపత్రయమును, పాపన్ = తొలఁగించుటకును, తనరూపమును = (సచ్చిదానందఘనం బగు) తనయొక్క స్వరూపమును, చూపన్ = (ఉత్తమాధికారులగు శిష్యుల) కుపదేశించుటకు, తనరువానిన్ = పూనుకొని యున్నవాఁడును, 1 తనుకాయమును - తను =

---

1. 'దేహాభిమానే గళితే మూలాజ్ఞానం వినశ్యతి। తస్మిన్నష్టే బ్రహ్మపదం ప్రాప్యతే నాత్ర సంశయః' అనుటచే మూలాజ్ఞానము నశిం

సూక్ష్మమైన, కాయమును = (అజ్ఞానమువలనఁ గలిగిన) దేహాద్యభిమానమును, త్రోయన్ = తూలఁగొట్టుటకును, పెనుమాయన్ = (ఆ దేహాద్యభిమానమునకుఁ గారణంబగు) మూలాజ్ఞానమును, ఒగిన్ = క్రమముగా, మాయముగన్ = కనఁబడకుండునట్లు, చేయన్ = కావించుటకును (ఇట్లు మూలాజ్ఞానము నశించిన పిమ్మట), గుఱిన్ = లక్ష్యభూతమగు స్వస్వరూపమును, డాయన్ = చేరుటకును, తగినవానిన్ = సమర్థుఁడును, మును = మొదటిదియగు, కారణశరీరమును=ఆ మూలాజ్ఞానమును, చీఱన్ = నశింపఁజేయుటకును, అవి...ణము - అవికార = షడ్భావవికారములు లేని, వర= ('పరోవరీయస్త్వాత్' అనుటచే ఉపనిషదుక్తపరోవరనిర్ణయస్త్వాదిగుణ) విశిష్టంబగు, [2]కారణము = బ్రహ్మమును, చేరన్ = పొందుటకును (కలదను బ్రహ్మమును తానే యని తెలిసికొనుటకు నని భావము) పరఁగువానిన్= ఒప్పుచుండెడు వాఁడును, తనయందున్ = తనలోపలను, జగమందున్ = నిఖిలప్రపంచములోపలను, తాన్ = తాను, పొందుగాన్ = లెస్సగ, ఒందుచెలువు = పడసిన యానందమును, ఒందువిందుగాన్ = లభించిన పండుగఁగ, తెలియువానిన్ = ఎఱుంగుచున్నవాఁడును ('ఏతద్బ్రహ్మైతత్సర్వం - సచ్చిదానందరూప మిదగ్ం సర్వం సత్తామాత్రం హీదగ్ం సర్వం మత్స్వరూపమే వేదగ్ం సర్వం' అను మొదలగు వేదవాక్యములచే సర్వాత్మభావనచే నెప్పుడు నానందించుచున్నవాఁడని భావము); నిగమ=వేదములయందు, నిగదిత = చెప్పఁబడిన, సుగుణములు = (సర్వజ్ఞత్వము మొదలగు) సద్గుణములు, అగణితముగన్ = లెక్కకెక్కుడుగ, మిగులన్ =

---

చుటవలనఁ బొందఁదగినవాఁ డని యెఱుంగునది. 2. జన్మాద్యస్యయతః = ఈ ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు దేనివలనఁ గలుగుచున్నవో యది బ్రహ్మము' అని బాదరాయణసూత్రము గాన నిచటఁ గారణశబ్దమునకుఁ బ్రపంచమునకుఁ గారణ మగు బ్రహ్మ మని యర్థము.

మిక్కుటముగ, నిగుడఁగ = క్రిక్కిఱిసియుండుటంజేసి, సగుణుఁడై = (మాయాసంగమున నారోపింపఁబడిన సర్వజ్ఞత్వ సత్య సంకల్పత్వాది) గుణములతోఁ గూడియున్నవాఁ డయ్యు, అగుణుఁడు + అగుచున్ = నిర్గుణుండగుచు, పగలు + రేయి + అనక = ఇది పగలు ఇది రాత్రి యను మాట లేకుండ నెల్లప్పుడును, ఒకరీతిఁ = ఒక్కపడువున, నెగడువానిన్ = ప్రకాశించుచున్నవాఁడునగు (అనఁగా నాకాశమునందు నలుపునుంబోలి, నిరంజన మగు బ్రహ్మమునందు మాయాసంబంధమునుబట్టి గుణారోపమును జేసియు 'సర్వజ్యోతి రసావహమ్' అను శ్రుతినిబట్టి వాస్తవముగ నిర్గుణం బగు నా పరవస్తువు స్వయంప్రకాశమని యర్థము.) మహాదేవగురునిఁ = మహాదేవుఁడను జ్ఞానోపదేశకుని, ఎపుడుఁ = నిరంతరమును, భజింతుఁ = (పైనిఁజెప్పిన లక్షణములుగల పరబ్రహ్మ స్వరూపునిగ) సేవించుచున్నాను.

తా. స్థూల సూక్ష్మ కారణశరీరములకు విలక్షణుండును, సర్వాంతర్యామియుఁ, దనయందు నారోపింపఁబడిన మూలాజ్ఞానముచే సగుణునివలెఁ దోఁపనట్టియు వస్తుస్వరూపముచే నిర్గుణుండు నగు పరమాత్మునకు వేఱుకానివానిఁగ నా గురువర్యుని ననవరతమును దలంచెదను. గా

అవ. ఇట్లు తన గురువులను వేఁడుకొని జగద్గురువులును ప్రాచీనకవులు నగు ప్రాచేతస వ్యాసముఖ్యులనుగూడఁ దన ప్రబంధము వారి గ్రంథములవలె సత్కవితా సంప్రదాయములు గలిగి లోకోపకారముగ నుండుఁగావుత మను నభిప్రాయముతోఁ బ్రార్థించుచున్నాఁడు.

శా. లోకాలోక పరీతభూచర మహాశ్రీ లోకోపకారంబుగా
శ్రీ కల్యాణకరోరు కావ్యచయముల్ శ్రీసిద్ధంబు గావించి సు

శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లుచున్నట్టి వా
ల్మీకివ్యాసమయూరబాణకవికాళీదాసులం గొల్చెదన్. ౯

టీ. లోక...బుగాన్ - లోక = కేవల లోకజ్ఞానముచేతను, ఆ లోక = బ్రహ్మజ్ఞానముచేతను, పరీత = ఆవరింపఁబడిన, భూచర = భూమి యందని దృశ్యపదార్థములయందు మాత్రము ప్రవర్తించెడు కర్మఠులకును, మహాలోక = మహాత్ములగు జ్ఞానిజనులకును, ఉపకారంబు + కాన్ = మేలగునట్లు, శ్రీ...ముల్ - [1] శ్రీ = (ప్రేయోరూపములగు) ప్రాపంచిక సంపదలను, కల్యాణ = శ్రేయోరూపమగు మోక్షమును, కర = కలుగఁ జేసెడు, ఉరు = సర్వోత్కృష్టములయిన, కావ్య = కబ్బములయొక్క, చయముల్ = సముదాయములను, సిద్ధంబున్ కావించి = పూర్తిఁజేసి, (లేక) లోకాలోక = చక్రవాళ పర్వతముచేత, పరీత = చుట్టఁబడిన, భూ= భూమండలమునందు, చర = సంచరించెడు, మహా = మహాత్ములగు, లోక= జనులకు, ఉపకారంబుగాన్ = మేలుగ, శ్రీ = సంపదను, కల్యాణ = శుభ ములను, కర=చేసెడు, ఉరుకావ్య=రామాయణము మొదలగు మహాకావ్య ములయొక్క, చయముల్ = సంఘములు, సిద్ధంబు గావించి= లెస్సగ రచి యించి, [2] సుశ్లోకుల్ = శోభనమైన యశముగలవారును, జగద్గురువులు = లోకములకెల్ల మంచిచెడ్డల నుపదేశించువారును, ఐ=అగుచు, [3] శోభిల్లుచున్ + ఉన్న + అట్టి = ప్రకాశించుచున్నవారగు, వాల్మీకి వ్యాస మయూర

---

1. 'అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే ఉభే నానార్థే పురు షగ్ సినీతః। తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయోవృణీతే' అని కఠోపనిషత్తునందుఁ జెప్పఁబడిన యట్లు శ్రేయ మనఁగా మోక్షజ్ఞానము. ప్రేయమన ప్రాపంచిక జ్ఞానము. అందు శ్రేయ మును గోరువాఁడు మోక్షమును, ప్రేయమును గోరువాఁడు స్వర్గాదిభోగ మును పడయును. 2. "శ్లోకోయశసిపద్యేచ" అని నిఘంటువు. 3. "అక

**బాణకవి కాళిదాసులఁ**=వాల్మీకిని, బాదరాయణుని, మయూరుని, బాణభట్టును, మహాకవియగు కాళిదాసుని, 4 **గొల్చెదఁ**=సేవించెదను.

తా. లోకజ్ఞాననిష్ఠు లగు మందాధికారులకు స్వర్గాది సుఖంబును, బ్రహ్మజ్ఞాననిష్ఠు లగు నుత్తమాధికారులకు మోక్షమును, నొసంగెడు నుత్తమగ్రంథములను బెక్కురు రచియించి సద్యశోవిభవులును, సకలలోక హితోపదేశకులు నగుమఁ బ్రకాశించుచున్న ప్రాచేతసుని, బాదరాయణుని, మయూరుని, బాణభట్టును, మహాకవి కాళిదాసుని సేవించెదను.

అవ. ఇట్లు సంస్కృతమహాకవులం బేర్కొని వారిలోఁ బ్రధాను లగు వాల్మీకివ్యాసులచే రచియింపఁబడిన పారమార్థికగ్రంథము లగు భారత భాగవత రామాయణముల నాంధ్రీకరించిన నన్నయభట్టారకుఁడు మొదలగు నాంధ్రకవులను నమస్కరింపఁదలఁచి, తొలుత సత్కవిలక్షణములను దెలుపుచున్నాఁడు.

గీ. మహిత గురులఘువర్ణ ధర్మములు నియమ
 ములుఁ గలిత కర్తృకర్మక్రియలును దెలిసి
 నామరూపావ్యయ విలక్షణంబు లాత్మ
 నెఱిఁగిన కవీశ్వరుండె కవీశ్వరుండు. ౧౦

---

ర్మకంబులగు కొన్నితత్సమక్రియల యించునకు నాదేశంబగు నిల్లునకు గురువర్ణము ముందుండెనేని ద్విత్వంబు వైకల్పికంబుగనగు'' ననుటచే శోభిల్లు ననురూపము నిష్పన్నంబయ్యె. 4. ''కొన్నిశబ్దముల నడుమనున్న రలడలయుత్వంబునకులోపము వైకల్పికముగ నగు'' ననుట నిచటఁ గొలుచు ధాతువునకుఁ గొల్చుఅని రూపాంతరము.

టీ. మహిత = సుప్రసిద్ధములగు, గు...ములు-[1]గురు=గురుసంజ్ఞ గలవియు, [2] లఘు = లఘుసంజ్ఞగలవియు నగు, వర్ణ = అక్షరములయొక్క, ధర్మ=లక్షణములను, నియమములు=("ఆద్యోవళిర్ద్వితీయోవర్ణః ప్రాసోత్ర పాదపాదేషు। స్వస్వచరణేషు పూర్వః ప్రాసస్సర్వేషు చైక ఏవస్యాత్" అను మొదలగు) కవిత్వ విధానములను, కలిత=వ్యాకరణ సమ్మతములగు, కర్తృ=("స్వతంత్రః కర్తా" అను పాణినీయసూత్రోక్తలక్షణము గల) కర్తృపదములను, కర్మ=("కర్తు రీప్సితతమం కర్మ" "అకథితంచ" అని విధింపఁబడిన) కర్మపదములను క్రియలును=("క్రియావాచీ ధాతుః" "ఉపకృతి పరిణతిసంవృతి భేదాత్త్రివిధాక్రియా" అని చెప్పఁబడిన భేదముగల సమస్త) క్రియాపదములను, తెలిసి=గుర్తెఱిఁగి, నామ...ణంబులు-నామ ("ప్రాతిపదికం హినామ" "అర్థవదధాతుర ప్రత్యయః ప్రాతిపదికమ్" అని వచింపఁబడిన నామవాచకము లనఁబడు వస్తువుల పేళ్ళకును, రూప=(తత్తద్విభక్తి విశేషములచే నగు) పదస్వరూపములకును, (లేక నామ వాచకములయొక్క విశేషణ విశేష్యరూపములకును), అవ్యయ= (ప్రతిపదోక్తములు లాక్షణికములు నగు) నవ్యయపదములకును గల, విలక్షణంబులు=పరస్పర భేదములను (లేక విశేషలక్షణములను), ఆత్మక=(నిశ్చయాత్మకంబగు) స్వప్రతిభచేత, ఎఱిఁగిన=తెలిసికొనినట్టి, కవీశ్వరుండు + ఎ=మహాకవియే, కవీశ్వరుండు=కవీంద్రుఁ డనఁబడును.

---

1. "ద్వంద్వాన్తే శ్రూయమాణశ్శబ్దః ప్రత్యేక మనుసంబధ్యతే" అనుటచే 'గురులఘు' అను ద్వంద్వసమాసము కడపట నున్న వర్ణశబ్దము గురులఘు శబ్దముల రెంటితో వేర్వేఱ యన్వయించుచున్నది. 2. "కం. ఇలజమిలి యక్కరములకు, బలుసున్నకు నెడమనూఁది పల్కెడువర్ణం। బులుఁజూఁపి పలుకునవియును, లలి గురువులుకడమలివులు లఘు వులగుహారీ" అనియు "హ్రస్వం లఘుః" "దీర్ఘం గురుః" "సంయోగే గురుః" అనియు గురులఘునిర్ణయము.

మఱియు నీపద్యమునందుఁ దాను జెప్పఁబూనిన జ్ఞానశాస్త్రార్థమును సూచించుచున్న యర్థాంతరమును ధ్వనించుచున్నది. అది యెట్లనిన:—

మహిత...ములు - మహిత=పూజ్యములగు, గురువర్ణ = బ్రాహ్మణ క్షత్రియ వైశ్య లను త్రైవర్ణికులకును, లఘువర్ణ=బ్రాహ్మణాద్యపేక్షచే (తక్కువకులము గల) శూద్రాదులకును గల, ధర్మములు=మర్యాదలను, నియమములు= ("బ్రాహ్మణస్య ధనం భైక్ష్యం రాజన్యస్య ప్రజాపాలనం వైశ్యస్య పాశుపాల్యం శూద్రస్య ద్విజశుశ్రూషణమ్" అను మొదలగు నాయా వర్ణములకు నియమింపఁబడిన) విధులను, కర్తృ=యజమానునకును, కర్మ=(జాతేష్ట్యాదిస్మార్త) కర్మములకును-ఆధానాది శ్రౌతకర్మములకును గల, క్రియలను=ఆచరణవిశేషములను, తెలిసి=(తొలుత బుద్ధిశుద్ధికిఁ గారణములుగా) నెఱిఁగి (పిమ్మట), నామ...ణంబులు-నామ+రూప = (ఘటము పటము అను మొదలగు) దృశ్యవస్తువులపేళ్లు, దృశ్యపదార్థముల యాకారములు అను నీరెండింటికిని, అవ్యయ=(నాశరహితం బగు) బ్రహ్మమునకును గల, విలక్షణంబులు=(క్రమముగ) అనిత్యత్వము నిత్యత్వము నను పరస్పర విరుద్ధలక్షణములను, ఆత్మన్=(నిత్యానిత్యవస్తు వివేచనా సమర్థం బగు) మనస్సునందు, ఎఱింగిన=పరిశీలించెడు, కవి+ఈశ్వరుండు+ఎ = మహాజ్ఞానియే, కవీశ్వరుండు=ఉత్తమజ్ఞాని యనఁబడును.[1]

---

1. ఈపద్యమునందు "అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే। సంయోగాద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతిరంజనమ్" పెక్కులర్థములు గల శబ్దమునకు నాయా యర్థములను దెలుపుట నియమింపఁబడియుండఁగా సంయోగమువలన నొక ముఖ్యార్థజ్ఞానము గలుగఁజేయుచు నితర వ్యాపృత్తిచే మనోరంజన మగునది యర్థాంతరధ్వని యనఁబడునని కావ్యప్రకాశమునందుఁ జెప్పఁబడియున్నది. కావున శబ్దశక్తిమూలం బగు నర్థాంతరధ్వనిగాని వేఱొండు కాదు. ఉభయశ్లేష యంటిమా విశేష్యము శ్లేషిం

తా. తొలుత శాబ్దబ్రహ్మమునకుఁ గల గురులఘువర్ణనిర్ణయమును, ఛందశ్శాస్త్రమునందుఁ జెప్పఁబడిన యతిప్రాసములు మొదలగు కట్టుఁబాట్లును, వ్యాకరణశాస్త్రమునందుఁ జెప్పఁబడిన కర్త, కర్మ, క్రియ, విశేషణము, విశేష్యము, అవ్యయము అను నీభాషాభాగములకుం గల విశేష లక్షణములను సరిగఁ దెలిసికొని పిమ్మట నా వాఙ్మయముచేఁ దెలియఁదగిన స్ఫోటబ్రహ్మము నెఱుంగుటకుఁ జిత్తశుద్ధికరము లగు వర్ణాశ్రమధర్మ పరిజ్ఞానపూర్వకశ్రౌతస్మార్తకర్మముల యొక్క స్వరూపము నెఱిఁగి నిత్యానిత్యవస్తువివేకజ్ఞానము గలవారే విద్వత్కవు లనంబడుదురు. ౧౦

వ. అట్లు గావునన్. ౧౧

టీ. విద్వన్మహాకవుల లక్షణ మిట్టిది యగుటంజేసి.

ఉ. నన్నయభట్టు నాంధ్రకవిఽనాథునిఁ దిక్కనసోమయాజినిం
బన్నుగ సోమసత్కవిని ఽ భాస్కర బమ్మెరపోతరాజులన్
మున్ను ప్రసిద్ధిగాంచు కవిఽముఖ్యుల నందఱ నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద నఽభీష్టఫలాప్తి దనర్చునట్లుగాన్. ౧౨

టీ. నన్నయభట్టున్=(ఆంధ్రకవులలో మొదటివాఁ డగు) నన్నయభట్టారకుని, ఆంధ్రకవినాథునిన్=(తెలుఁగుకవులకు ఱేఁడగు) నెఱ్ఱప్రగ్గడను, తిక్కనసోమయాజినిన్=(నన్నయభట్టు ఎఱ్ఱప్రగ్గడ రచియింపఁగా మిగిలిన భారతమునంతయుఁ దెనిఁగించిన) తిక్కనసోమయాజిగారిని, సోమసత్కవినిన్=(భారతాంతర్గత మగు హరివంశము నాంధ్రీకరించిన) నాచన

---

పకుండవలెను; తుల్యయోగిత యంటిమా ప్రకృతాప్రకృతవిషయము కావలయును; సమాసోక్తి యంటిమా విశేషముగా సామ్యమువలనఁ గలుగవలయును, గావునఁ దుల్యయోగిత కాని, సమాసోక్తి గాని, యుభయశ్లేష గాని యిచటఁ బట్టదు.

సోముఁ డను మహాకవిని, భాస్కర బమ్మెర పోతరాజులన్=(రామాయణ మును తెనిఁగించిన) మంత్రిభాస్కరుని, (భాగవతమును జెప్పిన) బమ్మెర పోతరాజుగారిని, మున్ను + ప్రసిద్ధిగాంచు = ఇట్లు తొల్లి ఘనత నొందిన ప్రధానకవులను, అందఱన్=ఎల్లవారిని, [1] నెమ్మనంబులోన్=పరిశుద్ధమగు చిత్తమునందు, పన్నుగన్=బాగుగ, ఎన్ని=వినుతించి, అభీష్ట=అభీప్సిత మగు, ఫల=లాభముయొక్క, ఆప్తి=పొందుట, తనర్చునట్లుగాన్= ఒప్పెడిరీతిని, సమస్కరించెదన్=వందనము చేసెదను.

తా. భారత భాగవత రామాయణములను దెనిఁగించిన నన్నయ మొదలగు పూర్వకవులను వారి గ్రంథములవలె నా గ్రంథముగూడ లోకోప కారప్రవణం బగుఁగాత మను నాకోరిక యీడేరుటకొఱకు నిండుమనం బునందు ధ్యానించుచు మ్రొక్కెదను.

అవ. ఇట్లు మహాజ్ఞాను లగుపూర్వకవులను గొనియాడి యిఁక జ్ఞానహీను లగు పామరకవులను "మూర్ఖం ఛందానువర్తనాత్" మూర్ఖు ననుసరించుటవలననే లోఁబఱచుకొనవలయు నను న్యాయమున నభినందించుచు వారి యుద్ధతి నణఁపఁగోరి వేఁడుకొనుచున్నాఁడు.

† క. శుద్ధపదయుక్తిఁ దొలఁగి య
బద్ధమును నిబద్ధి గా నిబద్ధి నొగి మహా.

---

1. సమాసంబున కొన్ని దేశ్యపదముల పూర్వస్వరంబుమీఁది వర్ణం బులకెల్ల లోపంబును పైహల్లునకు ద్విత్వంబును బహుళముగఁ గలుగఁగా నెఱ + మనము = నెమ్మనము అని సంధి.

† ఈ పద్యము మా వ్రాఁతపుస్తకమున లేదు. మఱియు "నిష్టదేవతా ప్రార్థనంబును, సద్గురు కీర్తనంబును, సంస్కృతాంధ్ర సత్కవిస్తోత్రంబును గావించి" అని మాత్రము ముందు వచనమునఁ జెప్పియుండుటచే సర్వాత్మ

బద్ధము గాఁ గనుకుకవుల
నౌద్ధత్యము మానుకొఱకు నభినందింతున్. ౧౩

టీ. శుద్ధ = (వ్యాకరణశాస్త్రపరిష్కృతము లగు, పద = ఆయాభాషాభాగములయొక్క, యుక్తిన్ = కూర్పును, తొఱఁగి = పరిత్యజించి, అబద్ధమును = సందర్భింపని యంశమును, నిబద్ధి = ప్రాకరణికాంశముతోఁగూడినది, కాన్ = అగునట్లును, నిబద్ధిన్ = సందర్భాంశమును, మహాత్ = అత్యంతము, అబద్ధము = సందర్భింపనిది, కాన్ = అగునట్లును, ఒగిన్ = వరుసగా, కను = పరికించెడు, కుకవులన్ = కుత్సితకవులను, ఔద్ధత్యమున్ = మిట్టిపడుటను, మానుకొఱకున్ = విడనాడుటకై, అభినందింతున్ = వేఁడుకొనుచున్నాను.

ఇంక నీ పద్యమునకు నజ్ఞానిపరముగ నర్థ మెట్లనిన:—

శుద్ధ = (కార్యకారణ సంఘాత విలక్షణం బగుటచే) నిర్మలం బగు, పద = బ్రహ్మపదవియొక్క, యుక్తిన్ = పొందుటను, తొఱఁగి = మాని, అబద్ధమును = అనృత జడభూయిష్ఠం బైన సంసారమును, నిబద్ధిగాన్ = సతముగను, నిబద్ధిన్ = నిత్యమును సత్యమునగు పరమాత్మను, మహా బద్ధముగాన్ = ఏమియు లేనిదానిఁగను, ఒగిన్ = ఓలిని, కను కుకవులన్ = తలఁచెడు నజ్ఞానులను, ఔద్ధత్యము మానుకొఱకున్ = అట్టి దురభినివేశమును విడుచుటకొఱకు, అభినందింతున్ = వేఁడుకొనుచున్నాను.

ఇచటఁ జెప్పఁదగినయంశములు మెండుగ నున్నవి. అవి యన్నియు ముందు పొందుపఱుపఁబడును.

తా. "ఏక శ్శబ్ద స్సుప్రయుక్త స్స్వర్గే లోకే కామధు గ్భవతి" యనియు 'తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ' అను శ్రుతిస్మృతులచే సుశబ్ద

---

భావనము చేయు నీ కవి యేరిని నిందింపఁడు. శైలియు భేదించియున్నది. కాన నిది ప్రక్షిప్తము.

ప్రయోగము, ఇహపర ఫలప్రద మనియు, దోషరహిత పదములును, నిర్దుష్టంబగు నర్థమును గలది కావ్య మనియు విధింపఁబడియుండఁగా దానికి విరుద్ధముగ శబ్దసౌష్ఠవమును నర్థసందర్భమును లేక కవిత్వమును జెప్పుచు గర్వించెడు కుకవుల గర్వము మాన్పుటకు వారల ననునయించుచున్నాను.

లేక 'అతస్మిన్ తద్బుద్ధి రధ్యాసః = నిజము కానిదానియందు నిజమను బుద్ధి యధ్యాస మనఁబడు' నని చెప్పఁబడినట్లు నశ్వరంబగు దేహాదికమే యాత్మ యనియు నిత్యమగు నాత్మయే దేహాదిక మనియు నన్యోన్య తాదాత్మ్యమును నజ్ఞానముచే నమ్మియున్న మూఢులను వారికిం గల యాపట్టుదలను వదలుటకొఱకు వేఁడుకొనుచున్నాను.

అవ. "అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ । ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం ప్రతిరూపో బహిశ్చ । వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ । ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపఙ్ రూపం ప్రతిరూపో బహిశ్చ।సర్వం ఖల్విదంబ్రహ్మ" అగ్నిగాని లేక గాలిగాని యెట్లు సమపదార్థములయందు వ్యాపించి తత్తదాకారమును బొంది యుండునో యట్లే యన్నిటిలోఁ బ్రవేశించి పరమాత్ముఁ డొక్కఁడే యుండును గాన నతనికి వేఱొండును లేదు అను మొదలగు శ్రుతుల యర్థమును మనంబున నిడుకొని సర్వాత్మభావనను జేయుచున్నాఁడు.

మ. గరిమన్ స్వర్ణ మనేకభూషణములై కన్పట్టుచందంబునన్
బరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లు నట్లాటచే

సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాది శశ్వచ్చరా [దన్.
చరరూపోజ్జ్వలసర్వభూతములకున్ సద్భక్తితో మ్రొక్కె

టీ. స్వర్ణము = బంగారు, అనేక = కటకకుండలాది భేదముచేఁ బలువిధములగు, భూషణము లై = తొడవు లై, గరిమన్ = నానాత్వము చేతను, కన్పట్టు చందంబునన్ = చూడఁబడుచుండెడు వడువున, పరమాత్ముండు = చిద్రూపుఁడు, అఖిల = సమస్తమగు, ప్రపంచ = స్థావర జంగమాత్మకమగు లోకము, [1] మయుఁడు = స్వరూపము గలవాఁడు, ఐ = అగుచు, భాసిల్లున్ = జగద్రూపమునఁ బ్రకాశింపుచుండును, అట్లు + ఔటచేన్ = ఆ వడువున వెలుఁగుచుండుటంజేసి, సుర...ములకున్ - సుర = ఇంద్రుఁడు మొదలగు వేల్పులయు, సిద్ధ + ఉరగ + యక్ష + కిన్నర = సిద్ధులు నాగులు యక్షులు కిన్నరులు విద్యాధరులు మొదలగు దేవయోనులయు, నర = మనుష్యులయు, స్తోమ = సముదాయము, ఆది = తొల్లిగ, శశ్వత్ = మాటికి, చర = సంచరించెడు మనుష్యాదులయు, అచర=కదలక యొకచోట నుండెడు తరు గుల్మ లతాదులయు, రూప = ఆకారముచేత, ఉజ్జ్వల = విలసిల్లుచున్న, సర్వభూతములకున్ = ఎల్లయు పాధులకును, సత్ + భక్తితోన్ = మిక్కుటమగు ప్రేమతో, మ్రొక్కెదన్ = వందన మొనర్చుచున్నాను.

తా. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్। యథా సోమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యమ్, ఏవగ్ం సోమ్య స ఆదేశో భవతి" అని ఛాందోగ్యమునఁ జెప్పినట్లు మట్టిచేఁ జేయఁబడిన కడవలు మొదలగునవి మంటికన్న భిన్నములు గానట్లును, బంగారు మొద

1. ఇచట 'మయట్' ప్రత్యయము వికారార్థము.

లగు లోహములచే నిర్మింపఁబడిన వస్తువులు లోహముకంటె వేఱు గానట్లును పరమాత్మవలనఁ గలిగినప్రపంచము పరమాత్మకంటె వేఱు గాదు గాన సర్వభూతములను పరమాత్మగా భావించెదను.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, సద్గురుకీర్తనంబును, సంస్కృతాంధ్రసత్కవిస్తోత్రంబును గావించి, ఏను ముముక్షు జనహితంబును, సంసార సాగరోత్తారకంబును, తారక సాంఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్య సాక్షాత్కారాసాధారణకారణంబు నైన రాజయోగం బంతయు నొక్క ప్రబంధంబుగా రచియింప నిశ్చయించి పరమైకాంతంబున శ్రీ గురుమంత్ర దేవతా తత్త్వానుసంధానంబు సేయుచున్న సమయంబున. ౧౫

టీ. అని = ఇట్లు, ఇష్టదేవతా = నా యుపాస్యదైవ మగు శ్రీరామ పరబ్రహ్మముయొక్కయు, తదంగ దేవతలయొక్కయు, ప్రార్థనంబుc = వేఁడుకొనుటను, సద్గురు = నా దేశికేంద్రు లగు నారాయణభట్టు యొక్కయు, మహాదేవమానియొక్కయు, కీర్తనంబును = కొనియాడుటను, సంస్కృత + ఆంధ్ర + సత్ + కవి = గీర్వాణ భాషాకవులయుఁ దైలింగ భాషాకవులయు, స్తోత్రంబును = పొగడికను, కావించి = ఒనర్చి, ఏను = గ్రంథకర్తను, ముముక్షు + జన + హితంబును = సంసార బంధవిముక్తియందుఁ దలఁపు గల మనుజులకుఁ బథ్య మయినదియు, సంసార + సాగర + ఉత్తారకంబును = కాఁపురపుఁ గడలియావలి దరిఁ జేర్చునదియును, తారక + సాంఖ్య + అమనస్క + ఆత్మకంబును = తారక మంత్రోపదేశ శ్రవణముఁ దన్మననరూప సాంఖ్యయోగము, చిత్తవృత్తి నిరోధపూర్వకైక తత్త్వానుసంధానరూప నిధిధ్యాసనము నను మూఁడింటిని బ్రతిపాదించునదియు, జీవ ... బును - జీవ= (కార్యకరణ

సంఘాతాభిమాని యగు) జీవునకును, బ్రహ్మ = (మహదాద్యతీతంబగు) పరమాత్మకును, ఐక్య = ఏకత్వముయొక్క, సాక్షాత్కార = అపరోక్షానుభవమునకు, అసాధారణ = లోకోత్తరమగు, కారణంబును = నిదానమును, ఐన = అగునట్టి, రాజయోగంబు = ("రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్" అను మొదలుగ గీతాశాస్త్రమునందును నిఖిలోపనిషత్తులయందును నుపదేశింపఁబడిన) రాజవిద్యను, అంతయున్ = సమగ్రముగ, ఒక్క + ప్రబంధంబున్ + కాన్ = (గద్యపద్యాత్మకం కావ్యం ప్రబంధ ఇతి కథ్యతే' అను లక్షణము గల) యొక మహాప్రబంధరూపమున [1]రచియింపన్ = చేయుటకు, నిశ్చయించి = తలంచి, పరమ + ఏకాంతంబునన్ + పరబ్రహ్మమునందలి యేకతానత్వముతో, శ్రీ...నంబున్ - శ్రీ = స్వయంప్రకాశమును, గురు = ("మహతో మహీయాన్" అను శ్రుతిచే) గొప్పదానికంటె గొప్పదియునగు, మంత్రదేవతా = మూలమంత్రాధిష్ఠానదైవమగు శ్రీరామబ్రహ్మముయొక్క, తత్త్వ = వాస్తవస్వరూపముయొక్క అనుసంధానంబున్ = ధ్యానమును, [మోక్షలక్ష్మీసమన్వితుఁడగు శ్రీమహాదేవగురుస్వరూపుఁడును తారకమంత్రాధిదైవమునగు రామబ్రహ్మముయొక్క యాథార్థ్యమగు రూపముయొక్క అనుసంధానమును అనియు నర్థము.] చేయుచు + ఉన్న+సమయంబునన్ = కావించుచుండెడుకాలమునందు ముందున కన్వయము.

తా. ఇవ్విధంబున నిజాభిలషితపరమదైవతనమస్కరణంబును స్వకీయాచార్యసంస్మరణంబును గైర్వాణత్రిలింగమహాకవిస్తవాచరణంబు నాచరించి యేను బంధవిముక్తిం గోరుమనుజులకు నత్యంతోపయుక్తంబును సంసారసాగరసముత్తరణ తరణియు శ్రవణ మనన నిధిధ్యాసనాస్వరూప

1. గురువర్ణములు లేనివియు, యాంతములు గానివియునగు ధాతువులకు నించు పరంబగునపు డిగాగమంబు వైకల్పికముగ నగును గాన 'రచియింపన్' అనురూపము నిష్పన్న మైనది.

నిరూపణప్రవణంబును జీవాత్మ పరమాత్మానన్యత్వ పరోక్షానుభవజ్ఞాన ప్రధాననిదానంబు నైన వేదాంతవిద్య. నెల్ల నొక్క మహాప్రబంధరూపమున నిర్మింప నిర్ణయించుకొని యత్యంత రహస్యప్రదేశంబునందుఁ దారకమంత్ర రాజాధిష్ఠానదైవం బగు శ్రీరామబ్రహ్మము ననుసంధించుచు నుండు నవ సరంబున. ౧౫

సీ. కమనీయవరదివ్య కాంచనచేలంబుఁ
గాషాయవస్త్రంబు గా ధరించి
చాపబాణంబులఁ జంచత్కమండలు
దండము ల్గాఁగ హస్తములఁ బూని
రమణీయరత్నహారంబు రుద్రాక్షమా
లిక గా గళంబున లీలఁ దాల్చి
సీతావధూటిని శ్రీరాజయోగాహ్వ
యాధ్యాత్మవిద్యగా నవధరించి
గీ. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ
యనుచుఁ దనపేరు నుడువుచు నద్భుతముగ
శ్రీ మహాదేవగురుఁ డైన రామవిభుఁడు
గరుణతోడుత నెదుట సాక్షాత్కరించె. ౧౬

టీ. కమ...బుౕ - కమనీయ = మనోహరమైనదియు, వర = లోకోత్తరమైనదియు, దివ్య = వెలుఁగొందుచున్నదియు నగు, కాంచన + చేలంబు = పసిఁడిపుట్టమును, కాషాయ+వస్త్రంబుౕ + కాౕ =నీరుకావి మడుఁగుదోవతి యగునట్లు, ధరించి = కప్పుకొని, చాప+బాణంబులు = వింటిని అమ్ములను, చం...కౕ - చంచత్ = ఒప్పిదములగు, కమండలు+ దండములు + కాఁగౕ = జలకుండికయు యోగదండము నగునట్లు, హస్తములౕ + పూని = రెండుచేతులతోఁ బట్టుకొని, గళంబునౕ = మెడ

యందు, రమణీయ = సొగసుమీఱిన, రత్నహారంబున్ = మేలి పచ్చల పేరును ("జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్న మభిధీయతే" అనుటచే నిచట గరుడపచ్చలు రత్నశబ్దముచేఁ జెప్పఁబడును. లేనిచో రుద్రాక్ష సామ్యము సరిపడదు.), రుద్రాక్షమాలికన్ + కాన్ = రుద్రాక్షలపేరగు నట్లు, లీలన్ = ఒయ్యారముగ, తాల్చి = పూని, సీతావధూటినిన్ = జానకీ దేవిని, శ్రీ... గాన్ - శ్రీ = మోక్షలక్ష్మీప్రదమగు, రాజయోగ = జ్ఞానయోగ మనియెడు, ఆహ్వాయ = నామము గల, అధ్యాత్మవిద్యన్ + కాన్ = పరమాత్మ నుద్దేశించి చెప్పఁబడిన జ్ఞానశాస్త్రమునట్లు, అవధరించి = ఇయ్యకొని, ప్రేమమీఱన్ + కన్ = కూరిమి యెక్కుడగునట్లు, శ్రీరామ రామ రామ యనుచున్ = "శ్రీరామ రామరామ" అను మూలమంత్రరూపమగు, తనపేరున్ = తన నామమును, నుడువుచున్ = శ్రవణమాత్రమున లోకులు తరించుటకుఁ బైకి నుచ్చరింపుచు, అద్భుతము + కన్ = అచ్చెరువగునట్లు, కరుణతోన్ = నాయందలి కనికరముతో, శ్రీ మహాదేవగురుఁడు + ఐన = యోగలక్ష్మీవిరాజమానుం డగు మహాదేవుం డను పేరం బరఁగు నా దేశికేంద్రుని స్వరూపుఁడగు, రామవిభుఁడు = శ్రీ రామచంద్రుఁడు, ఎదుటన్ = ముంగలను, సాక్షాత్కరించెన్ = దృగ్గోచరుం డయ్యెను.

తా. సొగసుల బంగరు దువ్వలువను గాషాయవస్త్రముగను, ఎక్కుడి యుండుటచే గుండ్రముగఁ గమండలువువడువున నున్న సింగిణి నొకకేలను వేఱొకకరంబున యోగదండముచందమున నున్న నారసములను, గంఠమున నల్లని రుద్రాక్షములవలె నున్న గరుడరత్నములమాలను, ఉపనిషద్విద్యపగిదిం దగుజనకరాజతనయను వామాంకమునను బూని గోప్యమయ్యుఁ దారకమంత్రరాజమును జగత్పాపోపశమనమునకుఁ బైకి నుచ్చరింపుచు, మహాదేవుఁ డను నా గురుమూర్తిస్వరూపుఁడై శ్రీ రామచంద్రుఁడు నాకుఁ బ్రత్యక్షంబుగఁ జూపట్టెను. ౧౬

వ. ఇట్లు శిష్యవాత్సల్యంబున సాక్షాత్కరించి, మదీయదీర్ఘదండ నమస్కారంబులు చతుర్విధ పురుషార్థప్రద చతురక్షర సమన్విత నారాయణస్మరణపూర్వకంబుగా నంగీకరించి కలకల నవ్వుచు శరీరత్రయ విలక్షణావస్థాత్రయసాక్షి పంచకోశ వ్యతిరిక్త సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండ వైన నీవ సత్యజ్ఞానానంద పరమాత్మస్వరూపుఁడ నైన నేను, సచ్చిదానందరూపప్రత్యగాత్ముండ వైన నీవని సర్వోపనిషత్సారభూతంబైన పరమతత్త్వరహస్యార్థం బుపదేశించి యీయభేదవిజ్ఞానదృష్టిచేత నిరతంబు నన్నవలోకించుచు జీవన్ముక్తిసుఖం బనుభవింపుము. ప్రారబ్ధభోగావసానసమయంబున ఘటాకాశంబు మహాకాశంబునం గలిసినవిధంబున నాయందు విదేహకైవల్యంబు నొందెదు. సందేహంబు లేదు; అని యాజ్ఞాపించి యిప్పు డీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మరామాయణం బుమామహేశ్వరసంవాదరూపం బై యొప్పు, నందు శ్రీ రామహృదయం బను నితిహాసంబు సీతారామాంజనేయసంవాదం బనం బ్రవర్తిల్లు, నదిసంక్షేపరూపంబుగావున నయ్యర్థంబు విస్తరించి యొక్కప్రబంధంబుగా రచియించి నాపేర నంకితంబు సేయుము; సర్వపాపవినిర్ముక్తుండ వై కృతార్థుండ వయ్యెద వని యానతిచ్చి తిరోహితుండయ్యె; నంతట మేల్కని పరమానందభరితాంతఃకరణుండ నై. ౧౭

టీ. ఇట్లు = ఈలాగున, శిష్యవాత్సల్యంబునన్ = తనశిష్యుఁడ నగు నాయందలి పుత్త్రీభావమున, సాక్షాత్కరించి = పొడచూపి, మదీయ = నాసంబంధములగు, దీర్ఘ = నిడుపగు, దండ = కఱ్ఱవలె భూమిపైఁ బడి

చేయఁబడిన, నమస్కారంబులు = సాష్టాంగప్రణామములను (" ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా । పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే " అని సాష్టాంగప్రణామమునకు లక్షణము), చతుర్విధ = ధర్మ, అర్థ, కామ, మోక్షము లను నాలుగువిధము లయిన, పురుష + అర్థ = పురుషుఁడు పడయఁదగిన ప్రయోజనములను, ప్రద = ఒసంగెడు, చతుః = నా-రా-య-ణ అని నాలుగగు, అక్షర=వర్ణములతో, సమన్విత = కలసియున్న, నారాయణ = ("ఓం నమో నారాయణాయేతి మన్త్రోపాసకః" అని శ్రుతియందుఁ జెప్పఁబడిన) శ్రీమన్నారాయణ మంత్రముయొక్క, స్మరణపూర్వకమ్మగాక్ = ఉచ్చారణ ముందు గలుగు నట్లు (శిష్యు లాచరించిన వందనమును యతులు నారాయణ యనుచు గ్రహించుట సంప్రదాయము), అంగీకరించి=స్వీకరించి, కలకల నవ్వుచుక్ = నాకుఁ గల భక్తిశ్రద్ధలకు నానందింపుచు, శరీరత్రయ = "స్యాత్పంచీకృతభూతోత్థో దేహః స్థూలోన్నసంజ్ఞకః" - అనుటచే పంచీకృతభూతసంభవంబును, అన్నమయకోశాత్మకంబు నగు స్థూలశరీరమునకును (లింగశరీర మను నామాంతరముగల సూక్ష్మశరీరమునకును, కారణశరీరమునకును, విలక్షణ = "యథా ముంజాదిషీకైవ మాత్మాయుక్త్యాసముద్ధృతః। శరీరత్రితయా ద్ధీరః । పరం బ్రహ్మైవ జాయతే - ముంజ యను గడ్డినుండి దాని మృదువగు కాఁడను నేర్పుగఁ బైకిఁ దీయునట్లు బ్రహ్మచర్యాది సాధన సంపన్నులగు నుత్తమాధికారులు శరీరత్రయమునుండి పరమాత్మను విభజించి కాంచిరేని అదియే తా మగుదురు" అనుటచే నా శరీరత్రయమునకు) భిన్నమైనవాఁడవును, అవస్థాత్రయసాక్షి = ("ఇంద్రియై రర్థోపలబ్ధి ర్జాగరితం - చక్షురాదీంద్రియములచే నగుపదార్థజ్ఞానము జాగరితము" అను లక్షణము గల) జాగ్రదవస్థకును, "కరణేషూపసంహృతేషు జాగరితసంస్కారజన్య ప్రత్యయ స్స్వప్నః-ఇంద్రియము లన్నియుఁ దమ తమ వ్యాపారములనుండి మరలునపుడు జాగ్రదవస్థయందలి సంస్కారమువలనఁ గలిగిన

మనోవ్యాపారము స్వప్నము నాఁబడును" అను లక్షణము గల) స్వప్నావస్థకును, ("మూలాజ్ఞానే మనోవృత్తి విలయ స్సుషుప్తిః - కారణశరీరమందు మనోవ్యాపారము లన్నియు నడఁగియుండుట సుషుప్తియనఁబడును" అను లక్షణము గల) సుషుప్త్యవస్థకును, సాక్షి = పరికించువాఁడవును, పంచకోశ = (మీఁద వివరింపఁబడిన) అన్నమయాది కోశపంచకమునకు, వ్యతిరిక్త = భిన్నుఁడవును, సత్ = ("సదేవసౌమ్యేదమగ్రఆసీత్" అను శ్రుతినిబట్టి) కాలత్రయాబాధ్యమానమును, చిత్ = ("చిదేకరసో హ్యాయమాత్మా" అను శ్రుతిచే) శుద్ధచైతన్యస్వరూపమును, ఆనంద = ("ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అను శ్రుతిచే) అఖండానందఘనంబును నగు, స్వరూప = దివ్యదేహము గలవాఁడవును, ప్రత్యగాత్ముండవు = కార్యకారణసంఘాతమునకు వే ఱగు ప్రత్యక్తత్త్వంబవును, ఐన = ఐనట్టి, నీవ = నీవే, సత్య + జ్ఞాన + ఆనంద, స్వరూప + పరమాత్ముండను = ("సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను మొదలగు శ్రుతులచే) అనృత జడదుఃఖ విలక్షణమైన స్వరూపముగల పరాత్పరం బగు బ్రహ్మమును, ఐన = అగునట్టి, నేను = నేను, (అట్లు) సత్యజ్ఞానానంద స్వరూపుండ నైన నేన = పూర్వోక్తస్వరూపుండ నైన నేనే, సచ్చిదానంద ప్రత్యగాత్ముండ వైన నీవు = పూర్వోక్త లక్షణలక్షితుండ వైననీవు (అనఁగా సచ్చిదానంద స్వరూప ప్రత్యగాత్మత్వమునకు సత్యజ్ఞానానంద స్వరూప పరమాత్మత్వమునకు నెట్లు శబ్దభేదమేగాని యర్థభేదము లేదో అట్లు కార్య కారణ సంఘాతాత్మ కోపాధులకు భేదముగాని యాత్మస్వరూపమున కెంతను భేదము లేదు), అని = ఈ రీతిని, సర్వోపనిషత్ = ("సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే - స ఏకః, సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మైవాత్ర నేహ్యైవ విచికిత్స్యం, త్వం బ్రహ్మాసి అహం బ్రహ్మాస్మి అవయోరంతరం నవిద్యతే త్వమేవాహ మహమేవత్వంగతాః కలాః పంచదశ ప్రతిష్ఠాదేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు । కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ

ఏకీభవన్తి '' అను మొదలగు) నిఖిలోపనిషత్తులయొక్క, సారభూత = ప్రధానభూతంబగు, అర్థంబైన = తాత్పర్యమగునట్టి, పరమపురుషుని వాస్తవస్వరూపముయొక్క, రహస్యార్థంబున్ = నిగూఢ మగు నర్థమును, ఉపదేశించి = ప్రసాదించి తెలిపి, ఈ = ఇట్లుపదేశించిన, అభేదవిజ్ఞాన = జీవబ్రహ్మైక్యజ్ఞానసంబంధ మగు, దృష్టిచేతన్ = దర్శనముచేత, నిరంతరము = ఎడలేకుండ, నన్నున్ = పరమాత్మస్వరూపుఁడ నగునన్ను, అవలోకించుచున్ = (నిన్నుఁగా నన్నును శేషశేషిత్వముచేఁ) జరికింపుచు, జీవన్ముక్తి సుఖంబు = ("హర్షామర్ష భయక్రోధ కామకార్పణ్యదృష్టిభిః। నహృష్యతి గ్లాయతి యః సజీవన్ముక్త ఉచ్యతే॥ మానవాన్నిరహంభావో నిర్మానో ముక్తమత్సరః । యః కరోతి గతోద్వేగ స్సజీవన్ముక్త ఉచ్యతే॥ యావతీదృశ్యకలనా సకలేయం విలోక్యతే। సాయేన సుష్ఠు సంత్యక్తా సజీవన్ముక్త ఉచ్యతే॥ ఉద్వేగానందరహిత స్సమయాస్వచ్ఛయా ధియా । నశోచతే నచోదేతి సజీవన్ముక్త ఉచ్యతే॥ సర్వేచ్ఛా స్సకలాశ్శంకా స్సర్వేహా స్సర్వనిశ్చయాః । ధియా యేన పరిత్యక్తా స్సజీవన్ముక్త ఉచ్యతే॥ జగత్స్థితివినాశేషు శోదయాస్తమయేషుచ । సమమేవ మనోయస్య సజీవన్ముక్త ఉచ్యతే॥ విశ్వాధిష్ఠాన చిన్మాత్రే నిర్వికల్పే చిదాత్మని । యో జీవతి గతస్నేహ స్సజీవన్ముక్త ఉచ్యతే॥' అను మొదలగు శ్రుతిశిరస్సులయందుఁ జెప్పఁబడిన) జీవన్ముక్తివలనఁ గలిగెడు పరమసౌఖ్యమును, అనుభవింపుము = కనుము. ప్రారబ్ధ = (ప్రస్తుతోపాధిచే నవశ్యముగ ననుభవింపఁదగిన)కర్మ విశేషముయొక్క, భోగ = ఫలానుభవముయొక్క, అవసాన సమయంబునన్ = సమాప్తికాలమునందు (శరీరము నశించినవెంటనే యనుట), ఘటాకాశంబు = ఘటమునందున్నమిన్ను, మహాకాశంబునన్ = భూతాకాశంబునందు, కలసినవిధంబునన్ = (ఘటము నశించినవెంటనే) యేకీభవించిన రీతిని, " ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశాదయో యథా । మహాకాశే ప్రలీయన్తే తద్వజ్జీవా ఇహాత్మని'' అని గౌడపాదీయము,

నాయందుఁ = బ్రహ్మము నగు నాలో, విదేహకైవల్యంబుఁ = ("జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే । విశత్యదేహముక్తత్వం పవనోఽస్పందతామివ॥ తద్యథాహి నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదం శరీరం శేతేఽథాయ మశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ అశరీరో నిరింద్రియోఽప్రాణోఽతమాః సచ్చిదానంద మాత్రస్స స్వరాడ్భవతి" అను మొదలగు శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడిన) విదేహకైవల్యమును, ఒందెదు = పడయఁగలవు, సందేహంబులేదు = ఇందులకు సందియ మావంతయును లేదు; అని, ఆజ్ఞాపించి = ఇట్లాశీర్వదించి, ఇప్పుడు + ఈవు = ఇంక నీమీఁదను, బ్రహ్మాండ పురాణంబునందుఁ + అధ్యాత్మ రామాయణంబు + ఉమామహేశ్వర సంవాద రూపంబు + ఐ + ఒప్పుఁ = బ్రహ్మాండ మను పేరం బరఁగు మహా పురాణంబునందు, ఒక భాగముగా నున్న అధ్యాత్మమను సార్థకనామముగల యొక రామచరిత్రము, గౌరీశంకరుల పరస్పరసంభాషణాత్మకముగ నున్నది; అందుఁ + శ్రీరామహృదయం బను నితిహాసంబు + సీతారామాంజనేయ సంవాదంబు + అనఁ + బ్రవర్తిల్లుఁ = ఆ యధ్యాత్మ రామాయణమునందు సీతాదేవికిని శ్రీరామచంద్రునకును, హనుమంతునకును, జరిగిన సంభాషణముగల శ్రీరామహృదయ మను నొకచిన్నకథ గలదు. అది = ఆ రామహృదయము, సంక్షేపరూపంబు + కావునఁ = సూత్రప్రాయమై క్లిష్టముగ నున్నది కనుక, అయ్యర్థంబు = ఆ గ్రంథమునందలి భావమును, విస్తరించి = విరివి చేసి, ఒక్క ప్రబంధంబు + కాఁ + రచియించి = గద్యపద్యాత్మక మగు నొక మహాకావ్యముగ నిర్మించి, నా పేరఁ + అంకితంబు + చేయుము = నాకుఁ గృతిగా సమర్పింపుము, సర్వపాపవినిర్ముక్తుండవు + ఐ + కృతార్థుండవు + అయ్యెదవు = అందువలన జ్ఞానాజ్ఞానకృతము లగు సమస్త దురితములవలన విడువఁబడినవాఁడవై కృతకృత్యుఁడవు కాఁగలవు, అని యానతిచ్చి = ఇట్లాజ్ఞాపించి, తిరోహితుండు + అయ్యెఁ = అగపడక

పోయెను (అంతర్ధానమయ్యెను). అంతటఁ = ఆ వెనుక, మేలు + కని = తెలివినొంది, పర...ఐ - పరమ = సర్వోత్కృష్టమగు, ఆనంద = సంతోషము చేత, భరిత = సంపూర్ణమగు, అంతఃకరణుండఁ + ఐ = చిత్తము గలవాఁడనై.

తా. ఇవ్విధంబునఁ బ్రియశిష్యుఁడ నగు నాయందలి పుత్రాధిక ప్రేమతోఁ బ్రత్యక్షమయి నాచేఁ జేయఁబడిన సాష్టాంగదండప్రణామంబులఁ గ్రమంబునఁ బురుషార్థ చతుష్టయము నీయఁజాలిన నా-రా-య-ణ అను నాల్గు బీజవర్ణములతోఁ గూడిన 'నారాయణ' అను మంత్రోచ్చారణ పూర్వకముగ నియ్యకొని శ్రీ మహాదేవగురుండు మందహాస సుందర వదనారవిందుండై యిట్లనియె: వత్సా! స్థూలసూక్ష్మకారణంబు లనుమూఁడు మేనులకుం బెరయైనదియు, మెలఁకువగలదియు, నిదురయు ననుమూఁడుంగు లగు నవస్థలం బరికించుచుండు నదియు, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమ, యానందమయంబు లను నైదు కోశములకును వేఱగు నదియు, సత్తు - చిత్తు - ఆనందము స్వరూపముగాఁ గలదియు నగు ప్రత్యక్తత్త్వమ వగునీవే, నిక్కువము తెలివి యెలమియు రూపుగఁ గల పరబ్రహ్మమ నైన నేను, సత్యజ్ఞానానంద స్వరూప పరమాత్ముండ నైన నేనే సచ్చిదానంద స్వరూప ప్రత్యగాత్ముండవైన నీ వని యనులోమవిలోమంబులచే నిట్లు నిఖిలోపనిషత్తుల నిగ్గగునంశమైన బ్రహ్మతత్త్వముయొక్క పరాక్ప్రత్యగాత్మైక్యరూప మగు పరమరహస్యమును నాకుఁ దెలిపి మఱియు నీ జీవాత్మైక్య జ్ఞానావలోకనముచే నెల్లపుడును బరాత్పర స్వరూపుండ నగు నన్ను వీక్షించుచు బ్రతికి యుండఁగనే కలిగిన మోక్షసంతోషము నొందుము. పిమ్మట నీ యుపాధి ననుసరించి వచ్చిన ప్రారబ్ధరూపకర్మ విశేషము క్షీణించునంతనే దేహపాతానంతరమునఁ గుండలో నుండు మిన్ను కుండ పోయినవెంటనే పెద్దమింటం గూడినవడువున నాలో నీవు గలియఁ గలవు; ఇందులకు సందేహము లేదని దీవించి, మఱియు నిటపై నీవు

("అసుప్తేరామృతేః కాలం నయేద్వేదాన్త చిన్తయా" అని చెప్పుటంజేసి) బ్రహ్మాండపురాణాంతర్గతం బగు నధ్యాత్మరామాయణం బనునది శర్వాణీశ్వరునిచే నుపదేశింపఁబడినదై విలసిల్లుచున్నది. దానియందలి శ్రీరామహృదయ మను నితివృత్తము శ్రీసీతారాములచేఁ బవనతనయునకు నుపదేశింపఁబడి భాసిల్లుచున్నది. ఆ శ్రీరామహృదయము సూత్రప్రాయముగ సంస్కృత భాషలో నుండుటంజేసి యెల్లరకును సులభముగ బోధపడదుగాన దానియందలి నిగూఢార్థము నెల్ల వివరింపుచు సుబోధమగు శైలితో నాంధ్రభాషను గద్యపద్యాత్మకం బగు మహాకావ్యమునుగ విరచించి నాకుఁ గృతినిమ్ము. ఇట్లొనర్చితివేని నీ జీవితశేషంబు సార్థకం బగు. సాంసారిక దోషంబులు నిన్నంటవు. చేయఁదగినదానిం జేసినవాఁడ వయ్యెదవని యాజ్ఞనిడి యదృశ్యుం డయ్యె; నయ్యెడ నేను మేల్కాంచి యనంత సంతోషాక్రాంత స్వాంతుఁడ నై. ౧౭

అవ. శ్రీగుర్వాజ్ఞ యిట్టి దయినందులకుఁ దన యదృష్టమును గొనియాడుకొనుచున్నాఁడు.

శా. శ్రీవిశ్వేశ్వరపార్వతీప్రియదముల్ శ్రీజానకీరామవా
క్యావిఖ్యాతముమారుతాత్మజసుబోధ్యంబైతగన్ శ్రీమహా
దేవాచార్యవరాంకితంబుగసుధాశ్రీరాజయోగంబు సం
భావింపన్ రచియింపఁగల్గెనిఁక నాభాగ్యంబుసామాన్యమే.

టీ. శ్రీ...దముల్ - శ్రీ = "అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా। ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః" అను నణిమాద్యష్టైశ్వర్యసంపన్నుఁ డగు, విశ్వేశ్వర = జగదీశ్వరుం డగు సదాశివునకు, పార్వతీ = భవానికిని, ప్రియదముల్ = సంతోషము నిచ్చునదియు, శ్రీ...తమున్ - శ్రీ = రమాంశసంభూతురా లగు, జానకీ = జనకరాజనందనయొక్కయు, రామ = శ్రీరామచంద్రునియొక్కయు, వాక్య =

వేదసమ్మతములగు బోధవచనములవలన, ఆవిర్భూతమున్ = అవతరించి నదియు, మారు...ధ్యంబు - మారుత + ఆత్మజ = పవనతనయుండగు హనుమంతునికి, సు + బోధ్యంబు = సులభముగ బోధింపఁదగినది, ఐ - అగుచు, రాజయోగంబు = ఉపనిషద్రహస్యవిద్యను, శ్రీ...గను - శ్రీ = జ్ఞానసంపత్తి గల, మహాదేవ = మహాదేవుఁడనం బరఁగు, ఆచార్యవర = నా దేశికేంద్రునకు, అంకితంబుగను = సమర్పింపఁబడినకృతి యగునట్లు, ధాత్రిన్ = భూమండలమందు, తగన్ = ఆచంద్రార్కముగ వెలయునట్లును, సంభావింపన్ = ఎల్లజనులు పఠన పాఠనములచే నాదరించునట్లుగను, రచియింపన్ = ప్రబంధరూపముగఁ జెప్పుటకు, కన్గాన్ = కట్టడించినది; ఇఁకన్ = ఇటమీఁదను, నా = నా సంబధమగు, భాగ్యంబు = ఐశ్వర్యాది షడ్గుణసంపత్తి, సామాన్యము + ఏ = సర్వజన సాధారణ మైనదియా? (కాదు లోకోత్తర మైనదని యర్థము.) ఇచ్చట ఏ యను నవ్యయము వ్యతిరేకార్థకము.

తా. తొలుత శ్రీ సీతారాములచేఁ దమ భక్తుఁ డగు హనుమంతునకు సుబోధముగ నుపదేశింపఁబడినయట్లు శ్రీపరమేశ్వరునిచేఁ దనప్రియురాలగు పార్వతీదేవికి సంతోషముతోఁ దెలుపఁబడిన శ్రీ రామహృదయ మనుపనిషద్రహస్యవిద్యను నస్మద్గురువరుం డగు శ్రీ మహాదేవాచార్యునకుఁ గృతిగ భూలోకమున శాశ్వతముగ నుండునట్లు సహృదయహృదయాహ్లాదజనక ప్రబంధరూపముగ నిర్మింపఁగలిగెను గాన, నా యదృష్టము లోకోత్తర మైనది.

అవ. చదువరులకు దీనియందు మిక్కుటమగు మక్కువ గలుగుటకు దీనిచేఁ బ్రతిపాదింపఁబడు బ్రహ్మమునకును దీనికిని నభేదాధ్యవసాయమును జేయుచు నీ ప్రబంధమాహాత్మ్యమును బ్రకటించుచున్నాఁడు.

క. దివ్యము భవ్య మ్మగు మ
త్కావ్యము సంతతము మోక్షకాములచే శ్రో
తవ్యము వక్తవ్యము మం
తవ్యము భావ్యమును గీర్తితవ్యముఁ గాదే. ౧౯

టీ. దివ్యము = (శబ్దార్థసౌష్ఠవము గల్గి లక్షణయుక్తం బగుటచే) లోకోత్తరమయినదియు, [1]భవ్యమ్ము=(వర్ణగణాది శుద్ధి గలుగుటచే) క్షేమదాయకమును, అగు = ఐనట్టి, మత్+కావ్యము=నా ప్రబంధము, మోక్ష + కాముల చేత[2] = ముముక్షువుల చేతను, సంతతము = నిరంతరమును శ్రోతవ్యము = ఆలకింపఁదగినదియు, వక్తవ్యము = విని ఎల్లరకుం జెప్పఁదగినదియు, మంతవ్యము = (ఉపనిషద్రహస్యప్రతిపాదకము గాన పలుమాఱు) పరిశీలింపఁ దగినదియు, భావ్యము = పరిశీలించి బాగుగ నాలోచింపఁదగినదియు, కీర్తితవ్యము = (ప్రతిపాదింపఁబడిన యంశములన్నియు డెందమున నిలుకడగఁ బట్టుటకు పుస్తకాపేక్షలేక ముఖస్థముగఁ) బఠింపఁదగినదియు, కాదు + ఏ[3] = కాకుండునా ?

తా. లోకోత్తరమును, శుభప్రదము నగు నాకబ్బము బ్రహ్మమువలె ముక్తియందు నిచ్చగలవారిచేత వినఁదగినదియు, నొకరికిఁ జెప్పఁదగినదియు,

---

1. "తదుపరి పునర్మ్నో బూ ప్రాచాం" మువర్ణమునకు మాముడియేని బిందుపూర్వక బువర్ణంబేని వైకల్పికముగ నగుననుటచే 'భవ్యమ్ము' అనుపట్ల మాముడియైనది. "భావుకం భవుకం భవ్యం కుశలం క్షేమమస్త్రియాం" అని అమరము.

2. చేత, తోడ, లోపల - వీని యాద్యక్షరశేషంబునకు లోపంబు వైకల్పికంబు గాన మోక్షకాములచే నని యైనది.

3. వ్యతిరేకక్రియపై నుండు "నవధారణార్థకము స్వార్థక మగు" ననుటచే, కాదే ? యనుపట్లు నగు నని యర్థము.

బాగుగ వివేచింపఁదగినదియు ననుసంధింపఁదగినదియు, వినుతింపఁదగినది యుఁ గాక యుండునా ?

ఇంక పరమార్థపరంబగు నర్థ మె ట్లనిన.

టీ. దివ్యము = స్వయంప్రకాశమును, భవ్యమ్ము = నిరతిశయానంద మును, అగు = ఐనట్టి, మత్కావ్యము - మత్ = నాయొక్క, కావ్యము= (విద్వదనుభవసిద్ధమైన) పరమాత్మ, మోక్షకాములచేత = నావలెనే మోక్షేచ్ఛగలవారిచేతను, సంతతము = [1] ("ఆసుప్తేరామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా" అనుటచే) ననిశమును, శ్రోతవ్యము = ("ఆత్మావా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః" అనుటచే) సద్గురువువలన నుపదేశము పొందఁదగినదియు, వక్తవ్యము=[2]("తచ్చిన్తనం తత్కథన మన్యోన్యం తత్ప్రభాషణం । ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" అనుటచే) నొండొరులుం జెప్పుకొనదగినదియు, భావ్య మును = నిదిధ్యాసనముఁ జేయఁదగినదియు, కీర్తితవ్యము = ("హావు హావు హావు" "ఆశ్చర్యో వక్తాకుశలోఽస్యద్రష్టా ఆశ్చర్యో జ్ఞాతా" అను మొద లగు శ్రుతులచే) అత్యాశ్చర్యముగఁ గొనియాడఁదగినదియు, కాదే=కాక యున్నదా? "ఏకద్విత్ర్యాదివర్ణానా మావృత్తి ర్యమకం మతమ్ । పదాన్తే

1. నిదురవచ్చుదనుకను, చచ్చువఱకును, నుపనిషదర్థవిచారముతోఁ గాలమును గడపవలెను.

2. తత్కథనం = తనకుఁ దెలిసినమట్టున కొకరికి నుపదేశించుటయు, అన్యోన్యం = ఒండొరులును, తత్ప్రభాషణం = ఆ బ్రహ్మస్వరూపమును ప్రవచనము చేసి చెప్పుకొనుచుండుటయు, ఏతదేకపరత్వంచ = ఆ బ్రహ్మ మునందుఁ జిత్తవృత్తి నిరోధపూర్వకముగ నేకతానత్వమును, బుధాః = జ్ఞానులు, బ్రహ్మాభ్యాసం = బ్రహ్మమునుగూర్చి యభ్యాస మని, విదుః = తెలిసికొనిరి.

చాపి పాదాన్తే తత్తద్భేదైరనేకధా" అని యమకలక్షణము. కావున నీపద్యమున పదాంతయమకము. ౧౯

అవ. "గురురేవ పరంబ్రహ్మ గురురేవపరాగతిః। గురురేవ పరావిద్యా గురురేవ పరాయణమ్॥గురురేవ పరాకాష్ఠా గురురేవ పరంధనమ్।యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరో గురుః॥ గుశబ్దస్త్వన్ధకారస్స్యా ద్రుశబ్దస్తన్నిరోధకః। అన్ధకారనిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే" అను మొదలగు శ్రుతులచేతఁ బరమాత్మస్వరూపుఁడగు తన గురువర్యునకుఁ బూర్ణోక్తకర్తృ నీ గ్రంథము నంకితముఁ జేయ నిశ్చయించి తొలుత గురుపరంపరాభివర్ణనమును జేయుచున్నా నని చెప్పుచున్నాఁడు.

వ. అనివిచారించి సంతోషభరితస్వాంతుండనై మదీయాచార్య పరంపరావతారంబు నభివర్ణించెద. ౨౦

టీ. అని=పైనిజెప్పినయట్లు, విచారించి = (నాలోనేను) యోజించి, సంతో...నై-సంతోష = (నా కిట్టి యోగ్యత గలిగినది కదా యను) సంతసముచేత, భరిత=పరిపూర్ణమగు, స్వాంతుండను = చిత్తముగలవాఁడను, ఐ = అగుచు, మదీ...రంబున్ - మదీయ = నాయొక్క, ఆచార్య = గురువులయొక్క, పరంపరా = క్రమముయొక్క, అవతారంబున్ = అవతరణికను, అభివర్ణించెదను = పేర్కొనియెదను.

తా. ఇట్లు నా నెమ్మనంబున నాలోచించి సంతోషాక్రాంతాంతరంగుఁడ నగుచు గురు పరమగురు పరాపరగురు ప్రముఖావతరణ క్రమముం జెప్పెద నది యె ట్లనిన. ౨౦

అవ. "దత్తాత్రేయో దేశికానాం ప్రథమః పరికీర్తితః" అనుటచే నుపదేష్టల కెల్ల మొదటివాఁడగు దత్తాత్రేయమహర్షినిఁ బరమాత్మస్వరూపునిగ భావించుచున్నాఁడు.

శా. సత్తామాత్రుఁడునిర్విశేషుఁడు దనూకసర్వేంద్రియప్రాణహృ
చ్చిత్తాహంకృతిధీప్రకాశకుఁడు సచ్చిత్తోషకాయుండు వి
ద్వత్తాపాంధతమఃప్రదీపమయుఁ డాత్మస్వామి భాసిల్లె శ్రీ
దత్తాత్రేయ గురుం డనంగజగదంతర్యామియై మున్నిలన్.

టీ. సత్తామాత్రుఁడు=("కేవల సత్తామాత్ర స్వభావం పరంబ్రహ్మ-సత్తామాత్రం నిర్వికల్పం ప్రశాన్తం" అను శ్రుతిస్మృతులచే భూతభవిష్యద్వర్తమానరూప) కాలత్రయాబాధిత స్వరూపుఁడును, నిర్విశేషుఁడు = ("అక్షరం పరమం బ్రహ్మనిర్విశేషం నిరంజనం" అను బ్రహ్మస్వరూప ప్రతిపాదక వేదవాక్యమునుబట్టి) స్వేతర విశేష విరహితుండును, తనూ...కుఁడు-తనూ = స్థూలదేహరూపమగు నన్నమయకోశమునకును, సర్వేంద్రియ = కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములును గల (ఈ సర్వేంద్రియ శబ్దము, పైనున్న ప్రాణ, హృత్, చిత్తశబ్దములతోఁ బ్రత్యేకించి యన్వయించును గాన), ప్రాణ = (కర్మేంద్రియములతోఁ గూడిన) ప్రాణమయకోశమునకును, హృత్ = జ్ఞానేంద్రియములతోఁ గూడిన మనోమయకోశమునకును, చిత్త = ఆ జ్ఞానేంద్రియములతోఁ గూడిన చిత్తశబ్దవాచ్యమగు విజ్ఞానమయకోశమునకును, అహంకృతి = కేవలాహంకారముతోఁ గూడిన, ధీ = ధీశబ్దవాచ్యమగు నానందమయకోశమునకును, ప్రకాశకుఁడు=సాక్షిస్వరూపుఁ డగుటచేఁ బ్రకాశింపఁ జేయుచున్నవాఁడును, సత్+చిత్ + తోష + కాయుండు = ("సచ్చిదానంద తేజఃకూటరూపం తారకం బ్రహ్మ" అను శ్రుతి చే) సచ్చిదానందస్వరూపుఁడును, విద్వత్...మయుఁడు-విద్వత్ = జ్ఞానులయొక్క, తాప = (దేహేంద్రియాద్యధ్యాసవలనఁ గలిగిన) సంసారతాపత్రయమను, అంధతమః = గాఢాంధకారమునకు, ప్రదీపమయుఁడు = పెద్ద దీపమువంటివాఁడును (అగు), ఆత్మస్వామి = సకలజీవాత్మకులను (ప్రేరకుఁ డగుటచేఁ బ్రభువగు పరమాత్ముఁడే, శ్రీ...

రుండు-శ్రీ = భగవంతుఁ డగు, దత్తాత్రేయ = (అత్రిమహర్షి నేత్రమువలన విష్ణ్వంశచే జనించిన) దత్తాత్రేయమహాముని యను, గురుండు = ఆచార్యుఁడు, అనంగన్ = అనునట్లు, జగ...ర్యామి-జగత్ = చరాచరాత్మకం బగు సకలప్రపంచముయొక్క, అంతర్యామి = లోపలనుండి నియమించువాఁడు, ఐ = అగుచు, మున్ను = పూర్వమునందు, ఇలన్ = భూమియందు, భాసిల్లెన్ = అవతరించి వెలుఁగొందెను.

తా. నిత్యమును, సర్వాభిన్నమును, మహదాది కార్యకరణ సంఘాతమున కెల్ల సాక్షి యై చిత్ప్రకాశముచేఁ బ్రకాశింపఁ జేయుచున్నదియు, సచ్చిదానంద ఘనంబును, ముముక్షుజనుల సంసారసంతాపమనియెడు ధ్వాంతమును దూలఁజేయు చైతన్యజ్యోతియే స్వరూపముగఁ గలదియునగు ప్రత్యక్తత్త్వమే దత్తాత్రేయాచార్య రూపమున నీ భూలోకమునందుఁ బూర్వకాలమున నవతరించి సకల జీవహృదయాంతర్వర్తియై ప్రకాశించెను.

అవ. ఇట్లు శ్రీమన్నారాయణాంశసంభూతుఁ డగు శ్రీ దత్తాత్రేయదేవునకుఁ బ్రియశిష్యుం డగు జనార్దనాచార్యుం బేర్కొనుచున్నాఁడు.

క. ఆ దత్తాత్రేయగురు
శ్రీదివ్యపదారవిందసేవాదిశ్రీ
మోదుఁడు ప్రత్యక్షప్ర
హ్లాదుం డన శ్రీ జనార్దనాహ్వయుఁ డొప్పున్. ౨౨

టీ. ఆ...మోదుఁడు-ఆ = అట్లు సుప్రసిద్ధుండగు, దత్తాత్రేయ = దత్తాత్రేయమహర్షి యను, గురు = ఆచార్యునియొక్క, శ్రీ=సకల సాముద్రిక లక్షణసంపదలచేత, దివ్య = దేదీప్యమానము లగు, పద + [1]అరవింద = పద్మములంబోలిన పాదములయొక్క, సేవా = పరిచర్యయనెడు, ఆది= మొదటిదియగు (ముఖ్యమగు) శ్రీ = సంపత్తిచేతనైన, మోదుఁడు =

1. ఇచట నుపమితసమాసము.

1 (ఇష్టవస్తులాభమువలనఁ బొడమిన సంతోషము గలవాఁడు, ప్ర...డు-ప్రత్యక్ష = దృగ్గోచరుఁడగు, ప్రహ్లాదుఁడు = ప్రహ్లాదుఁ డను మహాభక్తుఁ డితండు, అనన్ = జనము లనుకొనుచుండఁగా, శ్రీ...డు-శ్రీ = గురు భక్తిసంపద్యుక్తుం డగు, జనార్దన = జనార్దనుఁ డను, ఆహ్వయుఁడు = పేరుగల యాచార్యుఁడు, ఒప్పున్ - 2 తగెను.

తా. అత్రి దత్తాత్రేయదేవుని యడుగుఁదమ్ములయొక్క సంవాహన ధ్యానవందనాదిపరిచర్యయే తనకు గొప్పసంపదగాఁ దలంచి యానందించెడు జనార్దనాచార్యుఁడు ప్రహ్లాదా పరావతారమో యనునట్లు పరమభాగవతాగ్రేసరుఁడై ధరణిఁ జెలు వొందెను. ౨౨

అవ. మఱియు నా జనార్దనస్వామిని త్రిమూర్త్యాత్మకునిగా వర్ణించుచున్నాఁడు.

మ. తన సౌశీల్యము శాస్త్రచింతనము నా
త్మజ్ఞానముం జూచి హె
చ్చినకూర్మి న్నిజదివ్యరూపములతో
శ్రీ భారతీమోక్షకా
మిను లేతెంచి యహర్నిశంబుఁ దను నె
మ్మిం గొల్వఁగా శ్రీ జనా
ర్దనయోగీశ్వరుఁ డొప్పె నెల్లెడ నవి
ద్యాధ్వాంతమార్తాండుఁడై. ౨౩

టీ. తన = (జనార్దన మునియొక్క), సౌశీల్యము = మంచిస్వభావము గలుగుటను, శాస్త్రచింతనమున్ = వేదవేదాంగముల నెల్లఁ బరిశీలించు

1. "మోదుఁడు = ఆనందించువాఁడు" అని కొందఱు ఉత్తరపద ప్రాధాన్యముం జెప్పిరి. కాని ధర్మ మెన్నఁడునుధర్మి కాదు. 2. ఇచట తద్ధర్మంబు భూతార్థకంబు.

టను, ఆత్మజ్ఞానము𑱁 = పరమాత్మవిషయకబోధను, చూచి = కనిపెట్టి, హెచ్చినకూర్మిన్ = అత్యధికమగు ప్రియముతో, శ్రీ...కామినులు-(క్రమంబున-శ్రీ = ఇందిరాదేవియును, భారతీ = వాణియు, మోక్షకామినులు = ఈశ్వరునివలన నెప్పుడు నధ్యాత్మవిద్యను వినుచుండునది గాన మోక్షము నందుఁ గోరిక గల) భవానియు, నిజ...లతో-నిజ = తమతమసంబంధములగు, దివ్య = అతిమనోహరములైన, రూపములతోన్ = మూర్తులతో, ఏతెంచి = అరుదెంచి, నెమ్మిన్ = అనురాగముతో, అహర్నిశంబు = రేయుంబగలును, కొల్వఁగాన్ = కొలుచుచుండఁగా, శ్రీ జనార్దనయోగీశ్వరుఁడు = జనార్దనస్వామి యను మునితిలకుఁడు, అవి...డుఁడు-అవిద్యా = మూలాజ్ఞానమనియెడు, [1] ధ్వాంత = అంధకారమునకు, మార్తాండుఁడు = వేవెలుఁగు, ఐ = అగుచు, ఎల్లెడన్ = ఎల్లప్రదేశములయందును, ఒప్పెన్ = వెలుఁగొందెను.

తా. ఆ జనార్దన యోగీశ్వరునికిం గల జగద్రక్షణమునందలి మంచి స్వభావమును గనుఁగొని యితఁడు తప్పక జనార్దనుఁడే యనుకొని సిరియు, ఆతని శాస్త్రజన్య జ్ఞానమును గాంచి యీయన నలువయే యగునని తలంచి పలుకులవెలందియు, ఆయనకుం గల బ్రహ్మజ్ఞాన సంపత్తిం జూచి, ఈతండు శంకరుండగునని యూహించి జిజ్ఞాసువురాలగు శర్వాణియు స్వస్వరూపములతో నరుగుదెంచి మిక్కుటమగు మక్కువతోఁ దన్నారాధింపుచుండ నయ్యోగీంద్రుండు దనశిష్యుల యజ్ఞానమనియెడు చెంజీఁకటిని సదుపదేశమనెడు వెలుఁగుచేఁ దొలఁగింపుచు నెల్లెడల విలసిల్లెను.

ఇచట నిజముగ లక్ష్మి మొదలగువారు రాకున్నను వచ్చినట్లు వర్ణించుటచే నసంభవద్వస్తువర్ణనరూపం బగు నతిశయోక్తి యలంకారము. ౨౩

---

1. "అంధకారోஉస్త్రియాం ధ్వాన్తం" అని అమరము.
2. ఎల్లన్ + ఎడన్ " ఎల్లశబ్దద్రుతంబునకు సమాసంబున లోపం బగు.

అవ. అతనికి నేకోదేవగురుం డనునతం డంతేవాసి యయ్యె నని చెప్పుచున్నాఁడు.

తే-గీ. ఆ జనార్దనగురున కత్యద్భుతముగ
శ్రీమదేకోగురుస్వామి శిష్యుఁ డయ్యె
మును వసిష్ఠమహామునీంద్రునకు నర్థి
దాశరథి భక్తుఁ డైనచందంబు దనర. ౨౪

టీ. ఆ=అట్టి, జనార్దనగురునకున్ = జనార్దనుఁ డనునాచార్యునకు, శ్రీమత్ = బ్రహ్మజ్ఞానసంపత్తిగల, ఏకోగురుస్వామి = ఏకోగురుం డను యోగి, అత్యద్భుతముగన్ =(గురుశుశ్రూషయు, విద్యాగ్రహణధారణసామర్థ్యము మొదలగువానిచే నెల్లరకు) మిగుల నబ్బుర మగునట్లు, శిష్యుఁడు = అన్తేవాసి, మును = తొల్లి, వసిష్ఠ = మైత్రావరుణి యను, మహామునీంద్రునకున్ = మహర్షిశ్రేష్ఠునకు, దాశరథి = దశరథతనయుఁ డగు శ్రీరామభద్రుఁడు (అపత్యార్థక తద్ధితము) అర్థిన్ = విద్యాగ్రహణాభిలాషతో, భక్తుఁడు = భక్తియుక్తుఁ డైన ఛాత్రుఁడు, ఐన చందంబు = అయినట్టి పోలిక, తనరన్ = వెలయఁగ, అయ్యెన్ = అయి పరఁగెను.

తా. ఆ జనార్దనస్వామికి నేకోగురుస్వామి తొల్లి వసిష్ఠమహర్షిశ్రేష్ఠునకు శ్రీరామభద్రుండు ప్రియశిష్యుఁ డైనయట్లు తన యోగ్యత చూపఱకు నచ్చెరువుగొలుప శిష్యుఁడయి వెలసెను.

అవ. ఏకోగురుస్వాముల భక్తిజ్ఞానవైరాగ్యాదుల నభినందించుచున్నాఁడు.

సీ. తనదువైరాగ్యంబుఁ గనుఁగొని సిగ్గుచే
సనకాదిమును లజుకవెనుక నొదుఁగఁ
దనదుసద్భక్తిచేఁ దగఁ గట్టువడి యింట
శ్రీకృష్ణుఁ డాత్మీయసేవఁ జేయఁ

దనదు విజ్ఞాన తీర్థమునందుఁ గ్రుంకుచు
గంగాదినదు లెల్ల గంతు లిడఁగఁ
దనదు పూర్ణాత్మసంతతసమాధిని జూచి
ప్రహ్లాదుఁ డాశ్చర్యపరత నొంద
తే-గీ. స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబు లెల్ల
వేదతుల్యంబులై ధాత్రిఁ వెలయుచుండ
వామదేవశుకార్జునవ్యాసభీష్మ
సదృశుఁ డేకోజనార్దనస్వామి వెలసె. ౨౫

టీ. తనదు = ఏకోగురుయోగియొక్క ("దుగ్వ్యవ్మ దస్మదాత్మార్థ పదానాం స్యాత్సమాసకే'' అను కారికచేఁ దనదు వైరాగ్యంబను మొదలగుపట్ల నాత్మార్థకంబగు తా శబ్దమునకు షష్ఠీసమాసమునందు దుగాగమము) వైరాగ్యంబుకె - "దృష్టానుశ్రవికవిషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞావైరాగ్యం, తత్పరంపురుష ఖ్యాతే ర్గుణవైతృష్ణ్యమ్'' అని పాతంజల దర్శనమునందుఁ జెప్పఁబడినయట్లు ఈ లోకమునందలి సుఖములయందును పారలౌకిక సుఖములయందును "యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధినిర్మలం'' అనుటచే కాకిరెట్టయందుఁబోలి అత్యంతమువిరక్తిని, కనుఁగొని = పరికించి, సనకాదిమునులు = సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లను మహాత్ములుగూడ, సిగ్గుచేకె = లజ్జచేత, అజు + వెనుకకె = తమ జనకుండగు విరించి వెనుకటిభాగమున, ఒదుఁగకె = దాఁగికొనియుండ (బ్రహ్మమానసపుత్రులగు సనకుఁడు మొదలగువారు నమ్రతతోఁ దండ్రివెనుక నుండఁగా నేకోగురుని వైరాగ్యసంపత్తిని జూచి మాకిట్టి వైరాగ్యము లేదుగా యని సిగ్గుపడి మోము చూపనోడి బ్రహ్మ వెనుక దాఁగియుండిరని కవి యుత్ప్రేక్షించినాఁడు. ముందును నిట్లె గమనించునది) తనదు సద్భక్తిచేకె = ("అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః

సా తస్మిన్ పరమప్రేమరూపా । అమృత స్వరూపాచ । యల్లబ్ధ్వాపుమాన్ సిద్ధోభవత్యమృతోభవతి తృప్తోభవతి’’ అను మొదలగు నారదభక్తి సూత్రములచే నిర్వచింపఁబడిన స్వేష్టదైవమునందలి పరమప్రేమయే స్వరూపముగాఁ గల భక్తివిశేషముచేత, శ్రీకృష్ణుఁడు = భగవంతుఁ డగు గోవిందుఁడు, తగన్ = బాగుగ, కట్టువడి = అరికట్టఁబడినవాఁడై, ఇంటన్ = తన మందిరమునందు, ఆత్మీయసేవన్ = తనయొక్క పరిచర్యను, చేయన్ = ఒనర్చుచుండఁగా, తనదు విజ్ఞానతీర్థమునందున్ = తనదు = తన సంబంధమగు, విజ్ఞాన = ఆత్మానాత్మ స్వరూప విచారణ వలనఁ గలిగిన బ్రహ్మానుభవజ్ఞాన మనియెడు, తీర్థమునందున్ = పరమపావన జలమునందు, క్రుంకుచున్ = జలకమాడుచు, గంగ+ఆదినదులు + ఎల్లన్ = గంగ గోదావరి మొదలగు పుష్కరనదు లన్నియు, గంతులు ఇడఁగన్ = మా కిట్టి మహాపుణ్యము అబ్బెనుగా యని సంతోషముతో నుప్పొంగుచుండఁగా, మఱియును, తనదు = తనయొక్క, పూర్ణ = (“పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే । పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే’’ అను శ్రుతిచేత) సర్వపరిపూర్ణ మగు, ఆత్మ = పరమాత్మయందు, సంతత = తెంపులేని, సమాధిన్ = (“అవితర్క విచారానందాస్మితారూపానుగమాత్ సంప్రజ్ఞాతః విరామప్రత్యయాభ్యాసపూర్వః, సంస్కార విశేషోఽన్యః’’ అను పతంజలియోగసూత్రములచేఁ బ్రతిపాదింపఁబడిన సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతాత్మకం బగు) సమాధి విశేషమును, చూచి = కనుఁగొని, ప్రహ్లాదుఁడు = ప్రహ్లాదుం డనునతఁడు, ఆశ్చర్యపరతన్ = అద్భుత పారవశ్యమును, ఒందన్ = పొందుచుండఁగా, స్వ...బులు - స్వ = తనచేత, కృత = రచియింపఁబడిన, గీతా = భగవద్గీతలు, ఆది = మొదలగువానియొక్క, భాష్యంబులు = “సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదైః సూత్రానుసారిభిః। స్వపదానిచ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః’’ అను లక్షణము గల వ్యాఖ్యానవిశేషములు,

ఎల్లన్ = అన్నియు, ధాత్రిన్ = భూలోకమునందు, వేదతుల్యంబులు = ఆమ్నాయ సమ్మితములు, ఐ = అగుచు, వెలయుచున్ = అంతట వ్యాపించుచు, ఉండన్ = ఉండఁగా, వామ...శుఁడు - వామదేవ = యాజ్ఞవల్క్యశిష్యుఁ డగు వామదేవుఁ డను మునితోను, శుక = వ్యాసాత్మజుఁడగు శ్రీ శుకమహర్షితోను, అర్జున = శ్రీ కృష్ణశిష్యుఁడగు ధనంజయునితోను, వ్యాస = వేదములనెల్ల విభజించి బ్రహ్మసూత్రములను నష్టాదశ పురాణములను, ననేక స్మృతులను జెప్పిన కృష్ణద్వైపాయనునితోడను, భీష్మ = ధర్మరాజునకు సమస్త ధర్మముల నుపదేశించి యఖండ బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠుండగు శ్రీ భీష్మాచార్యునితోడను, సదృశుఁడు = సమానుఁడగు, ఏకోజనార్దనస్వామి = ఏకోజనార్దనుం డను యోగి, వెలసెన్ = ప్రసిద్ధికెక్కెను.

## వైరాగ్యస్వరూప నిరూపణము.

సచేతనములగు స్త్రీలు మొదలగునవియు, నచేతనములగు నన్నము పానము ఐశ్వర్యము మొదలగునవియు నగు దృష్టపదార్థములయందును, "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను మొదలగు శ్రుతులవల్ల వినఁబడుచున్న స్వర్గాదిలోకములయందుఁ బడయఁదగిన యానుశ్రవికవిషయములయందును, త్రివిధదుఃఖసమన్వితములనియు, వినశ్వరములనియుఁ దలఁచి ఆ దివ్యాదివ్య విషయములు సంప్రాప్తము లగునపుడుగూడ వానియందు విరక్తంబగు చిత్తముయొక్క సంప్రాప్తవిషయసుఖానుభవమునందు సంగదోషము లేని యుపేక్షాబుద్ధియే స్వరూపముగాఁ గలదియు, యతమాన వ్యతిరేకైకేంద్రియ సంజ్ఞాత్రయమునకంటె నుత్కృష్టంబగు వశీకార సంజ్ఞయే వైరాగ్య మనంబడు; అందు యతమానసంజ్ఞయన చక్షురాదీంద్రియములు తమతమ విషయములగు రూపాదులయందుఁ బ్రవర్తించుచుండ వానిని స్వస్వవిషయములనుండి మరలించుటకుఁ బ్రబలప్రయత్నము. అట్లు ప్రయత్నించునపుడు రాగాదులగు కొన్నిచిత్తకషాయములు పరిపక్వము లగును;

గొన్ని పక్వములు గాఁబోవును. పక్వములు గాఁబోవువానికంటె పక్వము లైనవానిని వ్యతిరేకముగ నవధరించుట వ్యతిరేకసంజ్ఞ యనఁబడును. అట్లు పరిపక్వంబులగు రాగాదులకుఁ జక్షురాదీంద్రియములను దత్తద్విషయముల యందుఁ బ్రవర్తింపఁజేయుటకు సామర్థ్యములేమిం జేసి విషయములయందలి వేడుకతో మాత్రము మనస్సులో నడఁగియుండుట యేకేంద్రియసంజ్ఞ; ఆ వేడుకతోఁగూడ నుండుటయు తమామునూని సంప్రాప్తములగు దివ్యాదివ్య విషయములందు నుపేక్షాబుద్ధివశీకారసంజ్ఞ యనఁబడు, నీవశీకారసంజ్ఞయే యపరవైరాగ్య మనఁబడును. ఇఁక పరవైరాగ్యస్వరూపం బెట్లనిన, వేద వాదములవలనను సద్గురూపదేశమువలనను స్వానుభవమువలనను అనుమాన ప్రమాణమువలనను యుక్తివలనను దెలిసికొనఁబడిన పురుషోత్తముండగు శ్రీమన్నారాయణుని సాక్షాత్కారముయొక్క నిరంతరాభ్యాసమువలన రజస్తమోగుణ విరహితంబైన సత్త్వగుణపరిశుద్ధిచేతఁ గలిగిన పరమపురుషుం డగు శ్రీమన్నారాయణుండు పరిశుద్ధుండు. విషయంబు లతనికి విభిన్నంబు లను వివేకముచేఁ బరితృప్తినొందిన చిత్తముగలయోగి వ్యక్తంబులగు నైహిక విషయములయందును, నవ్యక్తంబులగు నాముష్మిక విషయములయందును, నత్యన్తమును విరక్తుం డయి శ్రీమన్నారాయణప్రాప్తిరూపం బగు పరమ పురుషార్థము నాచేఁబొందఁబడినదనియు నవిద్యాదివాసనలెల్ల నశించిన వనియుఁ జననమరణ ప్రవాహరూపం బగు సంసారబంధంబెల్ల మొదలంటఁ దెగినదనియుఁ దలంచును. ఇట్లు శ్రీ పురుషోత్తమఖ్యాతిరూపంబగు జ్ఞాన ప్రసాదంబుగల మహాయోగియొక్క విషయములయందు నాసలేమియే యపరవైరాగ్యం బగును.

ఇట్లు వ్యాసభాష్య వాచస్పత్యాదులయందుఁ గల పాతంజలదర్శన మర్మంబులెల్ల ముందు ఆయా ఘట్టములయందు విపులముగ వ్రాయఁదలఁ చితిమి. భక్తిజ్ఞానసమాధుల స్వరూపమును గూడ ముందు విశేషించి వివ రింపఁగలము.

తా. తనకుం గల యిహాముత్రఫలభోగవిరాగమును బరికించి బ్రహ్మమానసపుత్రులును నతులవైరాగ్య సంపన్నులు నగు సనక సనందన సనత్కుమార సనత్సుజాత నారదాదులు మా కిట్టివిరక్తి లేదుగా యని నానఁగోని మోము చూపనోడి తన తండ్రివెనుక దాఁగియుండ, తనకు శ్రీమత్పరమపురుషునియందుఁ గల ప్రేమాతిశయగుణంబుచే నిబద్ధుఁడై ముకుందుండు నిరంతరము దనమందిరమునఁబడి పరిచర్యలం జేయుచుండ, మఱియు నంతటను బరిపూర్ణంబగు పరమాత్మయందుఁ దనకుం గల మానసైకతానత్వరూపసమాధివిశేషమునవలోకించి హిరణ్యకశిపునందనుండగు ప్రహ్లాదుఁ డాహ్లాదపూర్వకాద్భుతసముద్రమునందు మునుంగుచుండ, ఇంకను దనసంబంధం బగు విశేషజ్ఞాన మనియెడు తీర్థమునందుఁ గ్రుంకులిడి గంగాయమునాసరస్వతులు లోనుగాఁగల పుణ్యాపగలు మాకిప్పుడుగదా తీర్థనామం బన్వర్థంబయ్యెనని సంతోషతరంగితాంతరంగలై యుప్పొంగి తాండవంబులు సలుపుచుండ, భగవద్గీతలు బ్రహ్మసూత్రములు మొదలగు సకల శాస్త్రంబులకును దనచేఁ జెప్పఁబడిన మహాభాష్యములన్నియు నుపనిషత్సమానములై ధరణీతలంబున వ్యాపించియుండఁగ వసిష్ఠ వామదేవులు శ్రీశుకులు కవ్వడియు బాదరాయణుండు భీష్ములు మొదలగు పరమభాగవతాగ్రగణ్యులతో సమానుం డగు నేకోజనార్దనయోగి ప్రఖ్యాతినొందెను. ౨౫

అవ. ఆ యేకోజనార్దనయోగికి నరహరిమహేశయోగి ఛాత్రుం డయ్యె నని పలుకుచున్నాఁడు.

క. ధరలో నారాయణునకు
నరుగతి నేకోజనార్దనస్వామికి శ్రీ
నరహరి మహేశగురుఁ డ
చ్చెరువుగ సద్భక్తి మెఱయ శిష్యుం డయ్యెన్. ౨౬

టీ. నారాయణునకున్ = నారాయణమహర్షియొక్క యవతారరూపుఁ డగు జనార్దనునకు, నరుగతిన్ = నరమౌనియొక్క యంశసంభ

వుండగు సవ్యసాచివడువున, ఏకోజనార్దనస్వామికిన్ = ఆ యేకోజనార్దన యోగికి, శ్రీ నరహరి మహేశగురుఁడు = శమదమాది సాధనచతుష్టయ సంపత్తిగల నరహరిమహేశుం డను యోగి, ధరలోన్ = పుడమియందుఁ గల చూపఱకు, అచ్చెరువు + కన్ = ఆశ్చర్యమగునట్లు, సద్భక్తి = పరమ ప్రేమాతిశయము, మెఱయన్ = విలసిల్లుచుండఁగా, శిష్యుండు = అంతేవాసి, అయ్యెన్ = అయితగెను.

తా. ఆ ఏకోజనార్దనుండను యోగీంద్రునకు నరహరిమహేశుం డను యోగి తొల్లి శ్రీకృష్ణరూపమున నవతరించిన నారాయణమహర్షికి నర్జునరూపమునఁ బుట్టిన నరుఁడను మానిపగిదిని చూచువారికి నాశ్చర్యకరమగు ననన్యభక్తి యొప్పుచుండ నంతేవాసి యయ్యెను. ౧౮

అవ. ఆ నరహరిమహేశయోగిని గొనియాడుచున్నాఁడు.

చ. అతఁడు సమస్తభూతబహిరంతరనావృతబోధమూర్తియై
వితతసమాధి నుండు నెడ వేల్పులు సూచి యితండయా రెయా
శతధృతియో రమావరుఁడొ శంకరుఁడో శుకుఁడో యటంచు
నద్భుతమును బొందుచుండఁ బరిపూర్ణత నొప్పె ధరాతలం
[బునన్. ౧౯

టీ. సమస్త...మూర్తియై - సమస్త = నిఖిలములైన, భూత = పృథివ్యప్తేజో వాయ్వాకాశము లను పంచమహాభూతములచేతను, మఱియు నాపంచమహాభూతముల కూడికవలనఁ గలిగిన నిఖిల జీవరాసులచేతను, బహిః = పైని, అంతః = లోను, అనావృత = చుట్టువాఱుకొనఁబడని, బోధ = శుద్ధచైతన్యమే, మూర్తి+ఐ = స్వరూపముగాఁ గలవాఁడై, వితత = అఖండాకారమగు, సమాధిన్ = అసంప్రజ్ఞాతాత్మకంబగు సమాధి

యందు, ఉండుక్[1] + ఎడక్ = ఉండెడి తఱిని, వేల్పులు[2] = త్రింశత్కోటి దేవతలు, చూచి = వీక్షించి, ఇతండు = ఈ మహాత్ముఁడు, ఆ = సుప్రసిద్ధుఁడగు, శతధృతి ఓ = నలువయో ? లేక, రమావరుఁడో = లక్ష్మీపతియో, లేక, శంకరుఁడో = మహేశ్వరుఁడో, లేక, శుకుఁడో = శ్రీశుకుండో, అయారె = ఏమియాశ్చర్యము, అటంచుక్ = అనుకొనుచు, అద్భుతమును = అబ్బురమును, పొందుచుక్ = పడయుచు, ఉండక్ = ఉండఁగా, ధరాతలంబునక్ = పుడమి మొదలగు ప్రపంచమునందంతటను (ఇచట ధరాతలశబ్దము చతుర్దశభువనాత్మక మగు ప్రపంచమునకంతకు నుపలక్షణము.) పరిపూర్ణతక్ = (బ్రహ్మమే తానగుటచేత) నిండియుండుటచేతను, ఒప్పెక్ = వెలింగెను.

తా. ఆ నరహరిమహేశయోగి పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచమహాభూతములచేతను, భూతపంచక పంచీకృతంబు లగు సకల జీవరాసులచేతను పైని లోన వ్యాపింపఁబడని శుద్ధచైతన్యమే స్వరూపముగఁ గలవాఁడై యఖండాకారం బగు నసంప్రజ్ఞాతనామక సమాధియం దుండు నపుడు, పురందరాది సకలగీర్వాణులు పరికించి యీ మహామహుఁడు చతురాననుఁడా ? లేక యా తూదినారాయణుఁడా ? లేక యాయీశానుఁడా ? లేక యా బాదరాయణియా ? అని తలంచుకొనుచు నాశ్చర్యము నొందుచుండఁగా వసుమతీతలమునందు నెల్లెడ నిండియుండిన చిద్రూపముతో వెలుంగుచుండెను. ౨౭

అవ. నరహరియోగికి నాగోజీరామయోగి శిష్యుఁ డయ్యెనని చెప్పుచున్నాఁడు.

---

1. తద్ధర్మంబునధాతువుపై ద్రుతాంతంబు లగు నెడియెడులు వైకల్పికముగ నగుటచే నాయెడియెడులు రానపుడు, ఉండుక్ అని తద్ధర్మార్థకము.

2. ప్రథమమీఁది కచటతపలకు గసడదవ లగును గాన, వేల్పులు సూచి యని సంధి.

క. ఆనరహరిసద్గురునకు
శ్రీనాగోరామగురుఁడు శిష్యుం డై వి
జ్ఞానంబునఁ బ్రత్యక్ష
శ్రీనారాయణుఁ డనం బ్రసిద్ధి వహించెన్. ౨౮

టీ. ఆ = అట్లు సుప్రసిద్ధుండగు, నరహరి = నరహరియను పేరుగల, సత్ = విద్వాంసుఁడగు, గురునకున్ = ఆచార్యునకు, శ్రీ-బ్రహ్మతేజస్సంపన్నుఁడైన, నాగోరామ = నాగోజీరాములను, గురుఁడు = దేశికుఁడు, శిష్యుండు + ఐ=ఉపాసకుఁడై, విజ్ఞానంబునన్ = బ్రహ్మజ్ఞానముచేత, ప్రత్యక్ష = స్వస్వరూపముచే నవతరించిన, శ్రీనారాయణుఁడు + అనన్ = ఇతఁడు శ్రీమన్నారాయణమూర్తియో యనునట్లు, ప్రసిద్ధిన్ = ప్రఖ్యాతిని, వహించెన్ = పొందెను.

తా. ఆ నరహరిమహాశయుం డనుమహాయోగికి నాగోజీయనుయోగి శిష్యుండై విశేషజ్ఞానసంపదచేత నితఁడు సాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తియో యనునట్లు లోకమున ఘనత నొందెను. ౨౮

అవ. ఇట్లు తనపరాపరగురుఁ డగు నాగోజీరామగురుని బేరుకొని యమ్మహాత్ముని మాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు.

శా. రాజన్మూర్తులతోడఁ బెంపెసఁగు వైరాగ్యోపరత్యాఖ్యలు
త్తేజం బొప్ప సహాయ లై మెఱయ నిర్ద్వంద్వప్రబోధస్ఫుర
ద్రాజాస్యన్వరియించి మోక్షసుఖసామ్రాజ్యంబుతో నొప్పె నా
గోజీరామగురుండు పండితులు గోర్కుల్దీర సేవింపఁగన్.

టీ. రాజత్ + మూర్తులతోడన్ =భాసిల్లుచుండెడు నాకారములతో, పెంపు + ఎసఁగు = సొబగొందుచున్న, వైరాగ్య = పూర్వోక్తరూప విరక్తియు, ఉపరతి = ("ఇంద్రియాణాం విషయేభ్య ఉపరణముపరతిః") ఇంద్రియములనెల్ల శబ్దాదివిషయములనుండి మరలించి బ్రహ్మమునందుఁ

జేర్చుట యుపరతి నాఁబడు నసులక్షణముగల యుపరతియు, అనెడు, ఆళులు = కూర్మినెచ్చెలులు, ఉత్తేజంబు = అత్యధిక ప్రేమప్రకాశము, ఒప్పన్ = వెల్లడియగునట్లు, సహాయలు+ఐ=తోడుపడువారలై, మెఱయన్ = విలసిల్లుచుండఁగా, ఆ దివ్య... ఆస్యన్-ఆ=సర్వమహర్షి ప్రసిద్ధంబగు, దివ్య= లోకోత్తరమగు, ప్రబోధ = బ్రహ్మజ్ఞానసంపత్తి యనెడు, రాజాస్యన్ = చంద్రవదనను (కాంతను), వరియించి = చేపట్టి, నాగోజీరామగురుండు= నాగోజీరాము లను రాజయోగి, పండితులు = జిజ్ఞాసువులగు తత్జ్ఞులు, కోర్కుల్ = తమయభీష్టములు, తీరన్ = నెఱవేఱునట్లు, సేవింపన్ + కన్ = తన్నుఁ గొలుచుచుండఁగా, మోక్ష+సుఖ+సామ్రాజ్యంబుతోన్= ముక్తిరూపం బగు పరమసౌఖ్య మనియెడు మహాసామ్రాజ్యసంపదతో, ఒప్పెన్ = వెలుఁగొందెను.

తా. విరక్తి, యుపరతి యను నెచ్చెలులు మూర్తీభవించి తనకుఁ దోడునీడై కొలుచుచుండ నొప్పెడు దివ్యజ్ఞానసంపత్తి యను కాంతారత్న మును బరిగ్రహించి యానాగోజీరాముం డనురాజయోగి మోక్షసౌఖ్య మని యెడు మహాసామ్రాజ్యపదవిం బడసి ముముక్షువులగు పండితులు నిరంతరము దన్ను నారాధింపుచుండ భాసిల్లెను.

అవ. ఇఁకఁ దనపరమగురుం డగు కోనేరుగురునిఁ బేర్కొనుచున్నాఁడు.

క. ఆ నాగోరామునకున్
శ్రీనారాయణున కజునికై చెలువున భక్తుం
డై నెగడె నెల్లదిక్కులఁ
గోనేరుగురుండు దత్త్వకోవిదుఁ డగుచున్. 30

టీ. శ్రీనారాయణునకున్ = శ్రీమద్దామోదరునకు, అజుని+చెలువు నన్ = శతానందుని చందమున, ఆనాగోరామునకున్ = అట్లు ప్రసిద్ధుఁ

డగు నాగోజీరామయోగికి, కోనేరుగురుండు = కోనేరప్పయను నాచార్యుండు, భక్తుండై = శిష్యుఁడైనవాఁడై, తత్త్వ-పరమాత్మతత్త్వమునందు, కోవిదుఁడు=విశేషజ్ఞానముగలవాఁడు, అగుచున్ = ఔచు, ఎల్లదిక్కులన్ = నిఖిల దిగంతములయందును, నెగడెన్ = ప్రసిద్ధి కెక్కెను.

తా. ఆ నాగోజీరామయోగికి శ్రీమన్నారాయణమూర్తికిఁ జతురాననుండుఁ బోలి కోనేరుగురుఁడు శిష్యుఁడై బ్రహ్మజ్ఞానసంపన్నుం డగుచు సకలదిగంతవిశ్రాంతయశస్కుఁడై విలసిల్లెను. 30

అవ. ఆ కోనేరుగురుని నభినందింపుచున్నాఁడు.

శా. ఆకాశీతలసేతుమధ్యకలితక్ష్మాధీశ్వరోద్యచ్ఛిర
శ్శ్రీకోటీరమణిప్రభార్చితనిజాంఘ్రిద్వంద్వపంకేరుహుం
డాకాశాది సమస్తతత్త్వసముదాయాతీతవిశ్వేశుఁడై
శ్రీకోనేరుగురుండు మోక్షవరలక్ష్మీకాంతుఁడై రంజిలెన్.

టీ. ఆకాశీ...పంకేరుహుండు = ఆ [1]కాశీతల+సేతు = వారాణసీ క్షేత్రము మొదలుకొని సేతుబంధమువరకుఁ గల, మధ్య = మధ్యదేశములయందు, కలిత = ఘనతనొందిన, క్ష్మాధీశ్వర = పుడమిఱేండ్లయొక్క, ఉద్యత్ = పైకివ్యాపించుచున్న [ఇది మణిప్రభలకు విశేషణము] శిరః = మకుటములయందు, శ్రీ=శోభాయుక్తములయిన, కోటీర=కిరీటములసంబంధమయిన, మణి = గరుడపచ్చలు మొదలగు మానికములయొక్క, ప్రభా = దీప్తులచేతను, అర్చిత = ఆరాధింపఁబడుచున్న, నిజ = స్వకీయములగు, అంఘ్రిద్వంద్వ+పంకేరుహుండు = కమలములనుబోలిన చరణములయొక్క యుగ్మముగలవాఁడును, [పంకే=బురదయందు, రుహము=మొలచునదియని, పంకేరుహశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము, అలుక్ సమాసము నుపపదసమాసమును] ఆకాశ...ఈశుఁడు - ఆకాశ = మిన్ను, ఆది = మొదలగు, సమస్త =

1 "ఆఙ్మర్యాదాభివిధ్యోః" అనుటచే నిచట నాఙ్మర్యాదార్థకము.

ఇరువదినాలుగుసంఖ్య గల, తత్త్వ = తత్త్వములయొక్క, సముదాయ= మొత్తమునకు (కార్యకరణసంఘాతమునకు), అతీత = మించియున్న, విశ్వేశుఁడు - ప్రపంచమునకు నధిష్ఠాత, ఐ = అగుచు, మఱియును, మోక్ష = ముక్తియనెడు, వర = యోగ్యురాలగు, లక్ష్మీ = సిరికి, కాంతుఁడు+ఐ - వరుఁ డగుచు, శ్రీకోనేరుగురుండు = విద్యాదిసంపన్నుండగు కోనేరుగురు యోగి, రంజిలెన్ = భాసిల్లెను.

తా. కాశీరామేశ్వరక్షేత్రములకు నడుమ నున్న పుడమిలోఁ గల యెల్లపుడమిఱేండ్ల శిరములయందు వెలుఁగుచున్న కిరీటములయందలి మానిక ముల వెలుంగులను పలురంగులుగల పూలచే నెల్లపుడును బూజింపఁబడుచున్న యడుగుఁదమ్ములదోయి గలవాఁడును, ఆకసము మొదలగు చతుర్వింశతి తత్త్వములకుఁ బైవాఁడగు నీశ్వరుని స్వరూపుండును, నగు నాకోనేరు గురువరుండు ముక్తిరమాకాంతకుఁ గాంతుఁడగుచుఁ జెలంగెను.

చతుర్వింశతి తత్త్వనిరూపణము.

ప్రధానము - (లేక మూలప్రకృతి) మహాతత్త్వము (లేక బుద్ధి) అహంకారమును శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదుతన్మాత్రలును, పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను నైదుమహాభూతములు,త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను నైదుజ్ఞానేంద్రియములును, వాక్పాణిపాదపాయూపస్థ ము లను నైదుకర్మేంద్రియములు మనస్సును గలసి యిరువదినాలుగుతత్త్వ ములు. వీనికి నతీతుఁడు పురుషుఁడు. ఈ పురుషుని యోగీశ్వరుఁ డందురు. అందుఁ బ్రధానము మహాతత్త్వము మొదలగు ప్రకృతివికృతులకు నేడింటికి మూల మగుటవలన మూలప్రకృతి యనఁబడుచున్నది. ఈమూలప్రకృతి దేనియొక్కయు వికృతి కాదు. దీనివలన మహాతత్త్వము నాఁబడు బుద్ధి యుత్పన్న మగుచున్నది గాన నీ బుద్ధి ప్రధానముయొక్క వికృతి. దీనివలన నహంకారము పుట్టుచున్నది గాన నహంకారమునకుఁ బ్రకృతి యగుచున్నవి. ఇట్లు అహంకారమువలన శబ్ద స్పర్శ రూప రసగంధము లను పంచతన్మాత్ర

లును జనించినవి. అందు శబ్దతన్మాత్రమువలన నాకాశంబును, స్పర్శ తన్మాత్రమువలన వాయువును, రూపతన్మాత్రమువలన నగ్నియు, రస తన్మాత్రమువలన నుదకమును, గంధతన్మాత్రమువలన భూమియుఁ బుట్టుటం జేసి యిట్లు శబ్దాదు లాకాశాదులకుఁ బ్రకృతులును నహంకారముయొక్క వికృతులు నగుచున్నవి. కాన నిట్లు మహత్తత్త్వము, అహంకారము, శబ్దాది పంచతన్మాత్రలు ననునేడును బ్రకృతులును వికృతులును నగుచున్నవి. ఇంక, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, పంచమహాభూతములును, మనస్సును, గలసి యీ పదియాఱును కేవలము వికృతులే కాని ప్రకృతులు గావు. పురుషుఁ డన్ననో ప్రకృతియును గాదు. వికృతియును గాదు. ఈ యర్థమునెల్ల సంక్షిప్తముగ నీశ్వర కృష్ణాచార్యుఁడు చెప్పెను. "మూల ప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతి యస్సప్త షోడశకశ్చ వికారో న ప్రకృతి ర్నవికృతిః పురుషః" కావున "పంచవింశతితత్త్వజ్ఞో యత్రకుత్రాశ్రమేవసేత్, జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతేనాత్రసంశయః ॥ "పురుషునితోఁ గలిపి యిరువదియైదు తత్త్వములను వివేచించి బాగుగఁ దెలిసికొనిన మనుజుఁడు ముక్తుఁడగునని కాపిలమతసిద్ధాన్తము - కాని దీనిని "ఈక్షతే ర్నాశబ్దం" అను మొదలగు సూత్రములచేత శ్రీ బాదరాయణా చార్యు లుత్తరమీమాంసలో ఖండించిరి. ఈ యంశముల నెల్ల ముందు విరివిగ వివరింపఁగలము. ప్రకృతమునందు - 'ఆకాశాది సమస్తతత్త్వ సముదాయాతీత విశ్వేశుఁడు' అనుపట్ల ప్రకృతి వికృతి సంఘాతమున కెల్ల జగదీశ్వరుండగు శ్రీమన్నారాయణుఁడు నిమిత్తోపాదానకారణుం డగు చున్నాఁ డని సమీచీనముగనే చెప్పఁబడినది.

అవ. తనకు సాక్షాద్గురుం డగు శ్రీమహాదేవాచార్యు లాకోనేరు గురూత్తమునకు నంతేవాసి యయ్యె నని చెప్పు చున్నాఁడు.

శా. ఆకోనేరు గురూత్తముం గొలిచి ది
వ్యాధ్యాత్మయోగంబు దా
శ్రీకల్యాణగుణప్రసిద్ధుఁ డగుచున్
శ్రీమన్మహాదేవలో
కైకాచార్యుఁడు సంగ్రహించె నతిసౌ
ఖ్యం బొప్ప సాందీపనిన్
శ్రీకృష్ణుండు భజించి విద్యలొనరం
జేకొన్నచందంబునన్. 32

టీ. శ్రీ...ఆచార్యుఁడు - శ్రీమత్ = విరక్తిసంపత్సమన్వితుఁ డగు మహాదేవ = మహాదేవుండను, లోక = ప్రపంచమునకెల్ల, ఏక = ప్రధానుఁ డగు, ఆచార్యుఁడు = సదుపదేష్ట, శ్రీ...అగుచున్ - శ్రీ = ఒప్పిదము లును, కల్యాణ = క్షేమదాయకములునగు, గుణ = ఓర్మి యడఁకువ భక్తి, వైరాగ్యము మొదలగు సాత్త్వికగుణములచేత, ప్రసిద్ధుఁడు = ఎన్నిక గలవాఁడు, అగుచున్ = అయినవాఁడై [ఈ విశేషణము శ్రీ కృష్ణునకుఁగూడ నన్వయించును] ఆ - కోనేరు + గురు + ఉత్తమున్ = సర్వోత్తముఁడగు నాకోనేరు గురువర్యుని (విశేషణోత్తర పదసమాసము) కొలిచి = సేవించి, శ్రీకృష్ణుండు = భగవంతుఁ డగు గోవిందుఁడు, శ్రీ = లక్ష్మిచేతను, కల్యాణగుణ = సర్వనియంతృత్వ, సర్వేశ్వరత్వ, సత్యసంకల్పత్వ ప్రభృత్యనంతకల్యాణ గుణములచేతను, ప్రసిద్ధుఁడగుచున్ = విఖ్యాతుండగుచు, సాందీపనిన్ = సాందీపుఁ డను మహర్షిని, భజించి = ఆరాధించి, విద్యలు = సమస్త శాస్త్రములను, ఒనరన్ = సమగ్రముగ, చేకొన్న చందంబునన్ = అభ్యసించిన వడువున, దివ్య + అధ్యాత్మ + యోగంబున్ = సమస్త విద్యలకెల్ల మిన్నయగు వేదాన్త శాస్త్రమును, తాన్ = తాను (మహాదేవాచార్యుఁడు), అతిసౌఖ్యంబు + ఒప్పన్ = అనాయాసముగ, సంగ్రహించెన్ = తెలిసికొనెను.

తా. ముక్తిసంపత్సమన్వితుండగు మహాదేవుం డను జగదేకగురుఁడు పైని పేర్కొనఁబడిన కోసేరువర్యు నారాధించి శమము, దమము, తితిక్ష, ఉపరతి లోనుగాఁ గల కైవల్యసంపత్ప్రదము లగు సద్గుణగణములచే ఘనత నొందుచు తొల్లి హేయగుణవర్జితుండును, ననంత కల్యాణ గుణగణ విరాజమానుండు నగు నందనందనుండు సాందీపుని సేవించి యచిరకాలములో సకలశాస్త్ర రహస్యములనెల్లఁ దెలిసికొనిన యనువున జ్ఞానశాస్త్రము నెల్ల నభ్యసించెను. 32

అవ. ఇట్లు తనసాక్షాద్గురుండగు శ్రీ మహాదేవయోగిని పేరుకొని మఱియు నతని ననంతశక్తిసపన్నుఁ డగు పరమాత్మస్వరూపునిగ నభివర్ణింపుచున్నాఁడు.

సీ. అఖిలభూతంబుల \ నాడించుమాయను
సొంపుగా నెవ్వఁ డాడింపుచుండు
గురుజనంబుల కెల్ల \ గురువులై తగుహరి
హరుల కెవ్వఁడు గురు \ వగుచు నుండు
వివిధలోకంబుల \ వెలిఁగించువెలుఁగుల
మించి యెవ్వండు వెలింగించుచుండుఁ
బ్రభువుల కెల్ల సత్ప్రభు వైన బ్రహ్మకుఁ
బ్రభుఁ డౌచు నెవ్వఁడు \ పరఁగుచుండు
తే-గీ. సగుణ నిర్గుణరూపుఁ డై \ నెగడుచుండు
నమ్మహాదేవ గురువరు \ నభినుతింప
సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
వనఁగ మముబోంట్లకు నుతింప \ నలవి యగునె. 33

టీ. అఖిల + భూతంబులన్ = చరాచరాత్మకంబగు సమస్త భూత జాతమును, ఆడించు + మాయను = స్వవశము గావించుకొని త్రిప్పుచున్న

మూలావిద్యను, ఎవ్వఁడు=ఏ జగన్నాటకసూత్రధారుఁడు, సొంపుగాన్ = అతి వినోదముగ, ఆడింపుచున్ + ఉండున్ = నాట్యము చేయించుచుండునో ("మాయాబింబో వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః । అవిద్యావశగ స్త్వన్య స్త ద్వైచిత్ర్యాదనేకధా ॥ సర్వాన్తర్యామియు సర్వజ్ఞుండునగు నా జగదీశ్వరుఁడు మాయాధిష్ఠాతయై ప్రపంచమును తన వశము చేసికొని త్రిప్పుచున్న యామాయను లోఁబఱుచుకొని యాడింపుచున్నాఁ" డను నీవాక్య మిందులకుఁ బ్రమాణము.) గురుజనంబులకున్ = లోకమునందలి యాచార్యపురుషుల కందఱకును, గురువులై = ఉపదేశకులై, తగు = ఒప్పుచుండెడు, హరిహరులకున్ = శివకేశవులకుఁ ఎవ్వఁడు = ఏ మహనీయుఁడు, గురువు = ఆచార్యుఁడు, అగుచున్ = ఔచు, ఉండున్ = ఉండెనో ("అగురూణా మప్యహం గురుః" అనుటచే నవతారపురుషుల కెల్లఁ బరమాత్ముఁడే పరమగురువు గాన నిట్లు చెప్పఁబడియెను.) వివిధ + లోకంబులన్ = పలుదెఱంగుల నున్న చతుర్దశ భువనములను, వెలిఁగించు + వెలుఁగులన్ = ప్రకాశింపఁ జేయుచున్న సూర్యచంద్రాది దీప్తులను, మించి = హెచ్చి, ఎవ్వఁడు = ఏ స్వయంప్రకాశస్వరూపుఁడు, వెలిఁగించుచున్ = ప్రకాశింపఁ జేయుచు, ఉండున్=ఉన్నవాఁడో ("న తత్ర సూర్యోభాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః । తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" అను శ్రుతినిబట్టి పరమాత్ముఁడు సర్వావభాసకుండగుటకుఁ బ్రమాణము) ప్రభువులకున్ + ఎల్లన్ = ఇంద్రుఁడు మొదలగు నాధికారిక పురుషుల కందఱకును, సత్ + ప్రభువు = ప్రధానాధికారి, ఐన = అగు, బ్రహ్మకున్ = చతుర్ముఖునకు, ప్రభుఁడు = శాస

1. మహద్వాచకంబు లగు నుకారాన్త తత్సమపదంబులకు మువు వర్ణకములలో నేదియైనం గావచ్చును గాన, ప్రభువు ప్రభుఁడు అని ప్రయోగము.

కుఁడు, ఔచున్ = అగుచు, ఎవ్వఁడు = ఏ సర్వనియంత, పరఁగుచున్ + ఉండున్ = ప్రబలియున్నవాఁడో, సగుణ = "ఉపాసకానాం ధ్యానార్థం బ్రహ్మణోరూపకల్పనా" అనుటచే మందాధికారులగు నుపాసకులకు నుపాసననిమిత్తము సర్వనియామకత్వము, సర్వేశ్వరత్వము, సత్యసంకల్పత్వము లోనగు ననంత కల్యాణగుణములతోఁ గూడినదియు, నిర్గుణ=హేయగుణవిహీనము నగు, రూపుఁడు + ఐ = స్వరూపము గలవాఁడునగుచు, నెగడుచుండున్ = ఎవ్వఁడు ప్రకాశించుచుండునో, అమ్మహాదేవ గురువరున్ = పైని చెప్పఁబడినట్లు సాక్షాత్పరమాత్మస్వరూపుండగు నా మహాదేవుం డను నాచార్యవర్యుని, అభినుతింపన్ = వర్ణించుటకు, సకల... శాస్త్రింబులు - సకల = సమస్తములైన, నిగమ = మన్త్ర బ్రాహ్మణరూపంబు లగు ఋగ్యజుస్సామాథర్వము లను నాల్గువేదములును, ఆగమ = వేదాంగములగు శిక్ష వ్యాకరణము మొదలగునవియు, అంత=పర్యవసానము గల, శాస్త్రింబులు = తత్తద్భాష్యాదులైన శాస్త్రిములు, ఓపవు + అనఁగన్ = చాలి యుండవనునపుడు, మముబోంట్లకున్ = మాబోఁటి వారలకు, నుతింపన్ = కొనియాడుటకు, అలవి + అగున్ + ఎ = వీలుపడునా ? [నుతించుటకు శక్యము కాదని యర్థము.]

తా. బ్రహ్మమొదలు పిపీలికదనుకఁ గల స్థావరజంగమాత్మక మగు సమస్తప్రపంచమును ద్రిప్పుచున్న మహామాయను లోఁబఱుచుకొని యేమహాత్ముఁడు ద్రిప్పుచుండునో మఱియు నాచార్యపురుషులకెల్లఁ బరమాచార్యులగు శివకేశవులకుఁ గూడ నేమహానీయుఁడు దేశికేంద్రుఁ డగుచుండెనో - ఇంకను - స్వర్గమర్త్యపాతాళాది చతుర్దశ భువనములనుఁ బ్రకాశింపఁ జేయుచున్న సూర్యుఁడు చంద్రుఁడు నక్షత్రములు మెఱపులు మొదలగు వాని దీప్తులనుఁగూడ నే స్వయంప్రకాశస్వరూపుఁడు ప్రకాశింపఁజేయుచుండెనో పురందర ప్రముఖాష్ట దిక్పాలురకును మఱియు నితర పరిపాలకులకును శాసకుండగు చతురాననునకుఁగూడ నే పరమపురుషుఁడు నియంత

మై యొప్పుచుండెనో, ఇట్లు అనంతకల్యాణ గుణగణ విరాజమానుండును హేయగుణవిహీనుండు నగు నా మహాదేవదేశికేంద్రుని గొనియాడుటకు ఋగ్యజుస్సామాథర్వణము లనియెడు నాల్గువేదములును, "శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా। కల్ప శ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః" అని చెప్పఁబడిన పాణినీయ నారదీయాది శిక్షాశాస్త్రమును, పాణినీయము, బోపదేవీయము, కాలాపము, సారస్వతము, మొదలగు వ్యాకరణశాస్త్రము, పింగళఋషి కేదారాంతర్వాణి ప్రముఖ కృత ఛందశ్శాస్త్రము, ఋగాది మన్త్ర నిర్వచన రూపం బగు నిరుక్తమును, వేదవిహిత జ్యోతిష్టోమాది కర్మకాలాది నిర్ణాయకం బగు జ్యోతిశ్శాస్త్రంబును, తత్తద్వేదములయందలి మంత్రముల ప్రయోగాదికముం దెలిపెడు కల్పశాస్త్రమునను నాలువేదాంగములును, పరిపూర్ణముగఁ గల, తత్తద్భాష్యాది శాస్త్రములుగూడ సమర్థములు కావైనపుడు, మాబోఁటివారలకు పేర్కొనుటకు వీలుపడునే? 33

పరమాత్మ స్వప్రకాశత్వ నిరూపణము.

"వెలుఁగులమించి యెవ్వఁడు వెలింగించుచుండు" ననుపట్లు నుదాహరింపఁబడిన "నతత్ర సూర్యోభాతి" అను మొదలగు మాంత్రవర్ణికము శ్రీ రంగరామానుజాచార్యుల వారిట్లు వివరించిరి "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ సదేకరూప రూపాయ" అను మొదలగు శ్రుతిస్మృతి ప్రమాణములను బట్టి, శ్రీ భగవన్నారాయణ బ్రహ్మమునకు శుభాశ్రయం బగు దివ్యమంగళ విగ్రహము గలదు. అట్టి దివ్యమంగళవిగ్రహము గల పరమాత్ముఁడు సూర్యాదుల తేజస్సుల నెల్ల మీఱిన తేజస్సు గలవాఁడు. అను నీ మంత్రార్థమును "జ్యోతి ర్దర్శనాత్" అను బాదరాయణసూత్రము యొక్క భాష్యమునందు శ్రీ భాష్యకారులవారు "సర్వతేజసాం బాధకం, సర్వతేజసాం కారణభూతం మనుగ్రాహకం చాంగుష్ఠప్రమితస్య జ్యోతి ర్దృశ్యతే" అను వాక్యముచే వివరించిరి. అందు "సర్వతేజసాం బాధకం"

సూర్యాదులతేజముల నెల్ల నావరించియున్నదను నర్థము గల పదము, ఆ పరమాత్మతేజస్సుదాపున సూర్యుఁడును, చంద్రుఁడును, నక్షత్రములు, మెఱపులును, నగ్నియు మొదలగు కాంతివిశిష్టపదార్థములు వెలుఁగఁజాలవను నర్థముగల "నతత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః" అను మంత్రపూర్వభాగమును దెలుపుచున్నది. మఱియు సూర్యాది సర్వతేజస్సులకును కారణమైనదను నర్థము గల "తమేవభాన్తమనుభాతి సర్వం" అను మంత్ర తృతీయపాదార్థమును "సర్వతేజసాం కారణభూతం" అను పదము వివరింపుచున్నది. ఇంకను, పరిదృశ్యమానమగు నీ సూర్యాది తేజోవిశిష్టవస్తుజాత మెల్ల నా పరమాత్ముని వెలుఁగుచేతనే వెలుఁగుచున్నదను నర్థముగల "తస్యభాసా సర్వమిదం విభాతి" అను మఱినాల్గవపాదార్థమును "అనుగ్రాహకం" అను పదము ప్రకటింపుచున్నది. ఆ భగవత్తేజమే సూర్యాది తేజస్సులకు ననుగ్రాహక మనుటకు "యమాదిత్యోచాము ముపయుజ్యభాతి" అను మొదలగు శ్రుతిగూడ ప్రమాణము. ఇంతియకాక, శ్రీమన్నారాయణబ్రహ్మముయొక్క వెలుఁగు సాక్షాత్కరించునపుడు వెఱలగు సూర్యాదితేజస్సు లన్నియుఁ దిరోహితంబు లగు నని మంత్రపూర్వభాగమునకును వేఱొక వెలుఁగు గలుగునపు డా వెలుఁగునకు నుపాదానభూతమగు ద్రవ్యమునకు ననుగ్రాహకత్వమే నిమిత్తత్వమని మంత్రతృతీయ పాదమునకును, పరిదృశ్యమానములగు పదార్థములను గనుఁగొనఁజాలిన కన్నులవెలుఁగునకు ననుగ్రాహకము లగు వెన్నెల యెండ మొదలగువానికింబోలె జనించిన తేజస్సునకుఁ దనసంబంధముచే నిజకార్యకరణ సామర్థ్యము నొసంగుట యను లక్షణముగల యనుగ్రాహకత్వమును అని నాల్గవపాదమునకును నర్థమ్ము సరియె కాని, దేదీప్యమానమగుచు సూర్యాదుల తేజస్సు ఎల్లరకు గోచరమగుచుండఁగా నది ప్రకాశింపదని చెప్పుట ప్రత్యక్షమునకు విరుద్ధమేయనిన నెల్లరకు నగపడుచున్న యతిభాస్వరమగు నీ సూర్యాదిదీప్తి శ్రీమద్భగవన్నారాయణ

బ్రహ్మాముచే నీయఁబడిన స్వకీయకాంతియేకాని సూర్యాదులకు స్వతస్సిద్ధమైనదికాదు. మఱియు నీయర్థము భగవంతునిచే “యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ । యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం-అర్జునా! సకల ప్రపంచమును వెలింగింపుచున్న యీ సూర్యాచంద్రమసాదుల తేజస్సును నా తేజమునుగా నెఱుంగు’’ మని చెప్పఁబడినదిగాన, కంటికి చీఁకటిలో మెఱయుచున్న మెఱుగుడుఁబురువులం బోలిన యీ సూర్యాదులు శ్రీ భగవత్తేజముచెంత స్వయముగ వెలుంగఁజాలరనియు నా భగవంతుఁడే యీ సూర్యాదులను వెలిఁగింపు చున్నాఁడనియుఁ జెప్పుట సమీచీనము. ఇట్లు ప్రతిపదమునకును శ్రుతిస్మృతుల నుదాహరింపుచు వ్యాఖ్యానము వ్రాయవలసినప్పు డొక్కొక్క పద్య వ్యాఖ్యానము ప్రత్యేకించి యొక్కొక్క గ్రంథ మగునని యింతతో విరమించుచున్నాను.

అవ. ఇట్లాచార్యావతారక్రమమును జెప్పి తన సంగతిని దెలుపుకొనుచున్నాఁడు.

తే-గీ. అనుగ్రహా దేవగురు చరణారవింద
పరపరాగాంశభజనతత్పరుఁడఁ బరశు
రామపంతులకులజాత రామమంత్రి
మౌళి తిమ్మాంబికాప్రియాత్మజుఁడ నేను. ౩౮

టీ. అ...పరుఁడన్ - అ=అట్లు జగత్ప్రసిద్ధుండగు, మహాదేవ = మహాదేవుఁడనియెడు, గురు = ఆచార్యునియొక్క, చరణ + అరవింద = అడుగుఁదామరలయందలి, వర = మేలగు, పరాగ = పుప్పొడియొక్క, అంశ=ఒక చిన్నభాగమగు పరమాణువుయొక్క, భజన=ఆరాధనయందు, తత్పరుఁడన్ = తదేకనిష్ఠుఁడను, పరశురామపంతుల = పరశురామపంతుల వారను నింటిపేరుగల, కుల = వంశమునందు, జాత=జన్మించిన, రామ = రామనామకుఁడగు, మంత్రిమౌళి = ప్రెగ్గడలతలమానికమునకును, తిమ్మాంబి

కా = తిమ్మమ్మగారికిని, ప్రియ + ఆత్మజుఁడన్ = ముద్దులపట్టిని నగు, నేను (లింగమూర్తి గురుమూర్తి యనుకవిని), ముం దున్నషష్ఠ్యంత పద్యముల = కడపటనున్న "సమర్పితంబుగా నొనర్పం బూనిన" యను వచనరూపముతో నన్వయము.

తా. ఇట్లు సర్వలోకసుప్రసిద్ధుం డగు శ్రీమహాదేవాచార్యుల యడుగుఁ దామరలయం దుండు మేలిపుష్పాడియొక్క చిన్నవలుసును గొలుచుటయం దు నెల్లప్పుడుఁ గడునిచ్ఛగలవాఁడను, పరశురామపంతులవా రను నింటిపేరు గల రామయామాత్యునకుఁ దిమ్మమ్మకును గూర్మికొమరుఁడను నగు నేను.

అవ. "నా పేర నంకితంబు సేయుము" అను నాచార్యా జ్ఞానుసారంబుగ తన దేశికేంద్రుం డగు మహాదేవయోగికి నీకబ్బమును సమర్పించెద నని చెప్పుచున్నాఁడు.

క. శ్రీరామనామమంత్రా
కారునకు నసంగనిర్వికారునకు మహా
కారునకు నిర్జితాహం
కారున కజ్ఞానభూమికాదూరునకున్. 3౫

టీ. శ్రీ...ఆకారునకున్ - శ్రీరామ = శ్రీరామ యను బీజవర్ణవిశిష్టం బగు, నామ = పరబ్రహ్మాభిధేయంబైన, మంత్ర = మూలమంత్రమే, ఆకారునకున్ = స్వరూపముగాఁ గలవానికిని ("యదిద మర్థజాత మభిధేయభూతం తస్యాభిధానా వ్యతిరేకాత్ । బ్రహ్మాభిధానాభిధేయోపాయ పూర్వకమేవ గమ్యతే" అని మాండూక్యోపనిషద్భాష్యమునందుఁ జెప్పఁ బడినది గాన మంత్రప్రతీకమునకును బ్రహ్మమునకును భేదములేదు) అసంగ నిర్వికారునకున్ - అసంగ = మహదాది మాయా కార్యకరణసంఘాత సంపర్కము లేనివారికిని, నిర్వికారునకున్ = ఉపచయాపచయ జనన మరణ పరిణామాస్తిత్వరూపము లగు షడ్భావవికారములు లేనివానికిని, మహాకారు

కునక్ = "సహస్రశీర్షా పురుషః" అను మొదలగు శ్రుతులయందుఁ బ్రతిపాదింపఁబడిన విశ్వరూపము గలవానికిని, నిర్జిత = తనకు లోఁబఱుచుకొనఁబడిన, అహంకారునకున్ = అహంకారాత్మక యగు మహామాయ గలవానికిని, అజ్ఞానభూమికా - ("బీజజాగ్రత్తథాజాగ్రన్మహాజాగ్రత్తథైవచ, జాగ్రత్స్వప్న స్తథా స్వప్న స్స్వప్నజాగ్రత్సుషుప్తకం॥") అను నను జ్ఞానభూమిక లేడింటికిని, దూరునకున్ = దవ్వులనే యున్నవానికిని.

తా. శ్రీరామనామరూపమూలమంత్రమే స్వస్వరూపముగాఁ గలవాఁడును, మహదాది కార్యకరణసంఘాత సంపర్కము లేనివాఁడును, ఉనికి-పుట్టువు-పెరుగుట - మార్పు - చిక్కుట - రూపుమాయుట-అనియెడు నీవస్తువికృతులు నాఱునులేనివాఁడును, "సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్ సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులం" అను మొదలగు శ్రుతులలోఁ జెప్పినట్లు లనంతస్వరూపుఁడును, అహంకార మమకారాది మాయాగుణ విరహితుండును, క్షిప్త-మూఢ - విక్షిప్తంబులను నజ్ఞానభూమికలు లేనివాఁడును.

అజ్ఞానభూమికా స్వరూప నిరూపణము.

బీజజాగ్రత్తు, జాగ్రత్తు, మహాజాగ్రత్తు, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రత్తు, సుషుప్తి, అని అజ్ఞానభూమిక లేడు - ఇట్లు గుప్తావస్థా విశిష్టంబగు మోహము "పునరేవ పరస్పరం శ్లిష్టా భవత్యనేకాఖ్యాః" అనుటచే రెంటికినిగాని మూఁడిటికిఁగాని నాల్గింటికిఁగాని యైదిటికిఁగాని యాఱిటికిఁగాని యేడిటికిఁగాని ప్రతిలక్షణమునందు నన్యోన్యమేళనము గలుగుచుండునపుడు పలుదెఱంగులఁ బరఁగుచుండును. పైని చెప్పిన యేడుభూమికలలో మొదటిదియగు బీజజాగ్రద్భూమికాలక్షణం బెట్లన "ప్రథమం చేతనం యత్స్యాదనాఖ్యం నిర్మలంచితః । భవిష్యచ్ఛిత్తి జీవాదినామశబ్దార్థభాజనమ్, బీజరూపం స్థితం జాగ్రద్బీజ జాగ్ర త్తదుచ్యతే॥" అనుటచే గాఢనిద్రనుండి లేచినవెంటనే సర్వస్వరూపిణి యగు

చిత్తుయొక్క పరిశుద్ధమగు మొదటి మాయాప్రతిబింబితచైతన్య మెద్ది గలద
యది తత్కాలమున జీవాదినామములచేఁ జెప్పఁబడుటకు వీలు లేనిదియుఁ
ముందు గలుగఁబోవు జీవుఁడు, చితి - అను మొదలగు నామములకు న
జీవాదిశబ్దముల యర్థములకు నాలంబన మైనదియు నై పైయవస్థలకెల్ల బీ
రూపముగ నుండు జాగ్రత్తుగాన నది బీజజాగ్రత్తు నాఁబడును. ఇది వృత
మునకు నంకురావస్థపడువున జ్ఞప్తిరూపుండగు జీవునకు నూతనావస్థ యః
రొటుంగునది. రెండవదియగు జాగ్రద్భూమికయొక్క లక్షణం బె ట్లనిః
"నవ ప్రసూతస్య పరాదయం చాహ మిదం మమ। ఇతి యః ప్రత్య
య స్స్వచ్ఛస్త జ్జాగ్రత్ప్రాగభావనాత్" అనుటచేఁ బరమాత్మయొక్క
మహదాది కార్యకరణసంఘాతాత్మకం బగు దేహాదికమే నేనైతిననియు, నీ
గృహక్షేత్రారామాదికము నాయవి యనియు నను పూర్వానుభవసంస్కార
విహీనంబైన యే ప్రబల మగు నమ్మిక (ప్రత్యయము) గలదో యది జాగ్ర
ద్భూమిక, ఇది యంకురావస్థ తరువాతఁ గలిగిన ద్విదళావస్థను బోలినది
గాన, మొదటి బీజజాగ్రత్తులోఁ జేరదు. మఱియు నిది పూర్వానుభవ
సంస్కారము లేనిదిగాన మహాజాగ్రత్తులోను జేరదు. ఇంక మూఁడవది
యగు మహాజాగ్రత్స్వరూప మెట్లనిన "అయం సోహ మిదం తన్మ, ఇతి
జన్మాంతరోదితః, పీవరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్ర దితిస్ఫురన్"
అనుటచే వెనుకటి పుట్టువులో నట్లుండెడువాఁడను ఈ నేను, ఆజన్మములో
నాసంబంధ మగునదియ యిది యను మొదలుగ జన్మాంతరానుభవసంస్కా
రమువలన కలిగిన బలిష్ఠమగు ప్రతీతియె మహాజాగ్రత్తు నాఁబడును. ఇది
పూర్వజన్మజ్ఞానము గలమహాపురుషులయందే యుండును. దీనియందు దీర్ఘ
కాలపుసంగతు లన్నియు జ్ఞాపకముగ నుండునుగాన, మహాజాగ్ర త్తనఁబడి
నది. ఇఁకను నాల్గవదియగు జాగ్రత్స్వప్నముయొక్క లక్షణ మెట్టిదనిన
"ఆరూఢ మథవారూఢం, సర్వథా తన్మయాత్మకమ్। య జ్జాగ్రతో మనో

రాజ్యం జాగ్రత్స్వప్న స్స ఉచ్యతే" అనుటచేఁ జూడఁబడినదియు జూడఁబడనిదియునై తత్తద్విషయరూపం బగుమనోరాజ్యము జాగ్రదవస్థయం దెయ్యది గలుగునో యదియే జాగ్రత్స్వప్న మనఁబడును. ఇచ్చట ప్రమాణరూపంబగు స్మరణకు వేఱగు ప్రత్యయంబెల్ల మనోరాజ్య మనఁబడును గావున "ద్విచంద్రశుక్తికారూప్య మృగతృష్ణాదిభేదతః। అభ్యాసం జాగ్రతః ప్రాప్య స్వప్నో౽నేకవిధో భవేత్।" అని చెప్పఁబడినది. అనఁగా నానా యభ్యాసములనుబట్టి జాగ్రత్స్వప్నము, (చిపిటీకరణము చేయునపుడు వ్రేలితో మీఁదికంటి ఱెప్పను నొక్కునపుడు) ఒకచంద్రుఁడే యిరువురు చందురులుగను, ముత్తెపుఁజిప్ప వెండిగను, ఎండమావులు నీరుగను, దోఁచుట మొదలగుభేదమువలన ననేకవిధము లగుచున్నది. ఇఁక నైదవదియగు స్వప్నముయొక్కలక్షణ మెట్లనిన, "అల్పకాలం మయా దృష్ట మేతన్నోవేతి యత్రహి। పరామర్శః ప్రబుద్ధస్య స స్స్వప్న ఇతి కథ్యతే। చిరసందర్శనాభావా దప్రఫుల్ల బృహద్వపుః।" అనుటవలన కలగాంచి మేలుకొనినవాఁడు తాను గలలోఁ జూచినయంశము నిజమగునా కాదాయని కొంత తడ వనుకొనుట యెద్ది కలదో యది యస్వప్నము నాఁబడును. స్వప్నజ్ఞానము విశేషకాలము చూచుటలేమింజేసి చిత్తమున నిలుకడగ నుండఁజాలదు. ఇఁక నాఱవది యగు స్వప్నజాగ్రత్తుయొక్క లక్షణ మెట్టిదనిన "చిరకాలానువృత్తిశ్చ స్వప్నో జాగ్రదివోదితః। స్వప్న జాగ్రదితి ప్రోక్తో జాగ్రత్యపి పరిస్ఫురన్" అనుటచే, జాగ్రదవస్థవడువున విస్పష్టముగఁ దాను బ్రత్యక్షముగఁ జూచినట్లు స్ఫురించుచు చాలకాలము మనస్సునఁ బట్టియుండెడు స్వప్నము స్వప్నజాగ్రత్తనఁబడును. ఇఁకను నేడవదియగు సుషుప్తిస్థితి యెట్లనిన "షడవస్థా పరిత్యాగే జడా జీవస్య యాస్థితిః। భవిష్యద్దుఃఖబోధాఢ్యా సుషుప్తి స్సోచ్యతేగతిః" అనుటవలన పైని జెప్పిన యాఱవస్థలను విడిచినపిమ్మట, జీవునియొక్క జడరూపం బగు స్థితియే సుషుప్తి యనఁబడును. ఇది మరల ముందు జాగ్రత్స్వప్నముల

యందుఁ గలుగఁబోయెడు దుఃఖానుభవసంస్కారముతోఁ గూడి ౦
డును. ఈ యవస్థయందుఁ బ్రపంచమెల్ల గాఢాంధకార బంధురముగ ను
నజ్ఞానములో మునిఁగియుండును. ఈ యజ్ఞానభూమిక లేదను మీఁదఁ దై
నట్లు పరస్పరమేళనముచే నొక్కొకటి నూలులకొలఁదిగఁ బ్రస్తరింపఁ
బహువిధకార్యాత్మకంబు లగు పెక్కురూపములు గలిగియుండును.

ఇఁక 'మహాకారుణకుఁ' అనుపట్లు "సహస్రశీర్షా" ఇత్యాది శ్రు
ప్రతిపాదిత

విశ్వరూప స్వరూప నిరూపణము.

జగత్కారణభూతుం డగు శ్రీమన్నారాయణుం డను పరమపు
షుండు "పురుష ఏవేదగ్ంసర్వం యద్భూతం యచ్చభవ్యమ్" అనుటచే
భూతభవిష్యద్వర్తమానకాలములయం దుండెడు నీ చరాచరాత్మకంబగ
ప్రపంచమెల్ల "విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"
అను శ్రీభగవద్వాక్యమును బట్టి తానే యై "పాదోస్య విశ్వాభూతాని
త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతిచే నీ సమస్త ప్రపంచమును నప్రప
మేయుండగు తనయొక్క యొకపాదముగ ననఁగా నొక స్వల్పాంశముగ
నుండఁగా, తాను త్రిపాద్విభూతిసంపన్నుం డై యొప్పుచుండును. జగ
ద్రూపంబగు తనయొక్క స్వల్పభాగము "పాదోఽస్యేహాభవత్పునః"
అనుటచేత తనయొక్క మాయయం దిట్లు పలుమఱు నగుచు వచ్చుచున్నది.
ఇట్లు వచ్చినతరువాత "తతో విష్వఙ్ వ్యక్రామత్ - సాశనానశనే
ఉభే" అనుటచేతఁ దాను దేవతిర్యఙ్మనుష్యాదినానాకారుం డై యీ
ప్రపంచమునం దంతటనుగూడ వ్యాపించి "అత్యతిష్ఠ ద్దశాంగులం"
బ్రహ్మాండగోళమునకుఁ బైఁగకూడఁ దనత్రిపాద్విభూతిచే నతిక్రమించి
యుండెను. సర్వవేదాంతవేద్యుం డగు నా పరమాత్ముఁడే "తస్మా ద్విరా
డజాయత" అనుటచే విరాడ్దేహరూపంబగు నీ బ్రహ్మాండమునెల్ల సృజి
యించి "విరాజో అధిపురుషః" అనుటచే నా బ్రహ్మాండమునందు జీవ

రూపముగఁగూడఁ దానే యుండెనను నీ యర్థమెల్ల నుత్తరతాపనీయము నందుఁగూడ "సవా ఏష భూతానీంద్రియాణి విరాజో దేవతాః కోశాంశ్చ సృష్ట్వా ప్రవిశ్యామూఢో మూఢఇవ వ్యవహరన్నాస్తే మాయయైవ" అని యిట్లు చెప్పఁబడినది.

క. ధీరునకు, భక్తజనమం
దారునకు, నిరంతరాత్యుదారునకు, నిరా
ధారునకు, నిఖిలజగదా
ధారునకు, ననాద్యఖండితశరీరునకున్. ౩౬

టీ. ధీరునకున్ = ("ధీరస్తత్ర న ముహ్యతి" అను గీతావచనమును బట్టి లాభాలాభములు జయాపజయములు మొదలగునవి తనకుఁ గలుగునపుడు ఖేదమోదములు లేక యెప్పుడు నొక్కతీరుగనే) ధైర్య స్థైర్యములు గలిగియుండువానికిని, భక్త.....నకున్ - భక్త = తన్నాశ్రయించిన, జన = మనుజులకు, మందారునకున్ = (వాంఛితముల నీడేర్చు చుండుటచే) సంతానపాదపమైనవానికిని, నిరం...నకున్ - నిరంతర = ఎల్లప్పుడును, అతి + ఉదారునకున్ = మిక్కుటమగు నౌదార్యము గలవానికిని, నిరాధారునకున్ = సకలమునకు నధిష్ఠానభూతుఁడగు తనకు నొక యాలంబనముతోఁ బని లేనివానికిని, నిఖిల జగత్ + ఆధారునకున్ = అనేక కోటి బ్రహ్మాండములకు నధిష్ఠానమైనవానికిని, అనాది...నకున్ - అనాది= పుట్టువులేనిదియు, అఖండిత = వినశ్వరము కానిదియు నగు, శరీరునకున్ = దివ్యమంగళవిగ్రహము గలవానికిని.

తా. "ధైర్యేణ హిమవానివ" అనునట్లును "గీ. సంపదలు గల్గు తఱి మహాజనుల హృదయ । మభినవోత్పలాకోమలం బగుచు నుండు । నాపదలు గల్గునపుడు మహామహీధ । రాశ్మసంఘాత కర్కశం బై తనర్చు" అనునట్లును మహాధైర్య స్థైర్యములు గలవాఁడును, తన్నుఁ

గొలిచెడు జనులకు సమరతరువు వడువున నభీష్టఫలముల నిచ్చుచుండు వాఁడును, అనారతమును అత్యధికమగు నౌదార్యము గలవాఁడును, సర్వాధిష్ఠానభూతుండు గావున తన కొకనిప్రాపుతోఁ బని లేనివాఁడును, సమస్త ప్రపంచమునకు నాలంబనం బైనవాఁడును, జననమరణములు లేని దివ్య మంగళవిగ్రహము గలవాఁడును. ౩౬

అవ. ఇట్లు తటస్థలక్షణమును జెప్పి, స్వరూపలక్షణమును బ్రతిపాదింపుచున్నాఁడు.

క. వ్యాపకునకుఁ, ద్రిశరీరా
లేపకునకు, నిర్జితావలేపకునకు ధీ
దీపకునకు, సచ్చిత్సుఖ
రూపకున, కనంతవిశ్వరూపాత్మునకున్. ౩౭

టీ. వ్యాపకునకున్ = "అంతర్బహిశ్చ నారాయణః" అను శ్రుతిచే లోన పైని దానె యైనవానికిని, త్రిశ...నకున్ - త్రిశరీర = స్థూలసూక్ష్మకారణములనియెడు మూఁడుశరీరములయొక్క, ఆలేపకునకున్ = సంపర్కము లేనివానికి, నిర్జిత = జయింపఁబడిన, అవలేపకునకున్ = (కామక్రోధాద్యరిషడ్వర్గముయొక్క) దర్పము గలవానికి, ధీ...నకున్ - ధీ = బుద్ధికి, దీపకునకున్ = ఆత్మానాత్మనిశ్చయజ్ఞానము నిచ్చి) ప్రకాశింపఁజేయుచున్న వానికిని, సత్...రూపకునకున్ - సత్ = ఎల్లప్పుడు నుండునదియు, చిత్ = శుద్ధచైతన్యఘనంబును, సుఖ = నిరతిశయానందసాంద్రంబును నగు, రూపునకున్ = స్వరూపము గలవానికిని, అనంత...ఆత్మునకున్ - అనంత = అప్రమేయమగు, విశ్వరూప = (తన మాయచేఁ దాను గైకొనిన) విరాట్స్వరూపమే, ఆత్మునకున్ = దివ్యశరీరముగాఁ గలవానికిని, శ్రీకృష్ణ భగవానులు సవ్యసాచికి "పశ్య మే పార్థ రూపాణి శతశోథ సహస్రశః" అను మొదలుగఁ జెప్పి కనఁబఱచిన "అనేకవక్త్రనయన మనేకాద్భుత

దర్శనమ్ । అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ । సర్వాశ్చర్యమయం దేవ మనంతంవిశ్వతోముఖమ్॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగప దుత్థితా॥ యది భా స్సదృశీసా స్యా ద్భాస స్తస్య మహాత్మనః॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభ క్త మనేకధా॥ " అను మొదలుగఁ జెప్పఁబడిన విశ్వరూప మిచట గమనించునది.

తా. మఱియు, "సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్" అను శ్రుతిచే సర్వమును వ్యాపించియున్నవాఁడును, స్థూలసూక్ష్మకారణ శరీర సంపర్కము లేనివాఁడును, కామక్రోధలోభమోహ మదమాత్సర్యాదులు లేక నిరహంకారుఁడైనవాఁడును, ఇది సత్యము, ఇది యసత్యము-అను నిశ్చయజ్ఞానము నొసఁగి బుద్ధితత్త్వమును బ్రకాశింపఁజేయుచున్నవాఁడును, కాలత్రయాబాధ్యమానంబును, స్వయంప్రకాశమై సర్వావభాసకంబును, నిరతిశయానందఘనంబు నగు విగ్రహంబు గలవాఁడును, తనమాయచేతఁ దాను సర్వప్రపంచమయుఁడైనవాఁడును.    32

అవ. ఇట్లు భగవంతునియొక్క సాలంబన నిరాలంబనాత్మకం బగురూపద్వయము స్వరూపము గలవాఁడుగ నభివర్ణింపఁబడిన శ్రీమహాదేవుఁ డను తన యాచార్యుని నామోచ్చారణపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు.

క. శ్రీమద్దత్తాత్రేయమ
హామునిసదృశునకు, శ్రీమహాదేవగురు
స్వామికిఁ దతసర్వాంత
ర్యామికి విజ్ఞానభూమికారామునకున్.    33

టీ. శ్రీమత్ ... సదృశునకున్ - శ్రీమత్ = జ్ఞానసంపత్సమేతుండగు, దత్తాత్రేయ మహాముని = సాక్షాన్నారాయణావతారమూర్తి యగు దత్తా

త్రేయ మహర్షితో, సదృశునకున్ = సమానుఁడైనవానికిని, తతసర్వాంత ర్యామికిన్ - తత = ప్రపంచమునం దంతటను వ్యాపించియున్న, సర్వ = చేతనాచేతనరూపములతో నున్న పదార్థములన్నిటియొక్క, అంతః = లోపలనుండి, యామికిన్ = నియమించుచున్నవానికిని, విజ్ఞానభూమికా రామునకున్ - విజ్ఞాన = విశేషజ్ఞానాత్మకములయిన, భూమికా = స్థాన ములయందు, ఆరామునకున్ = రమించుచున్నవానికిని, ఇట్టి విశేషణ విశిష్టుం డగు, శ్రీ మహాదేవగురుస్వామికిన్ = శ్రీమహాదేవ = శ్రీ మహా దేవుఁ డను, గురుస్వామికిన్ = నాయొక్క గురువులగు యోగీంద్రునకు.

తా. ఆచార్యుల కెల్లఁ బ్రథమాచార్యుండగు నత్త్రాత్రేయమహర్షితో సమానుఁడైనవాఁడును "య ఆదిత్యే తిష్ఠన్-" అను మొదలుగ నంత ర్యామి బ్రాహ్మణమునందుఁ జెప్పఁబడినయట్లు సర్వాంతరుండగువాఁడును షట్చక్ర మొదలగు విజ్ఞానభూమికలయం దెల్లపుడును క్రీడించుచున్నవాఁడు నగు శ్రీ మహాదేవగురుం డను యోగీంద్రునకు.

అంతర్యామిస్వరూప ప్రతిపాదనము.

బృహదారణ్యకమునందు సప్తమబ్రాహ్మణమునందు "యః పృథి వ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరోయం పృథివీ నవేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరోయమయత్యేషత ఆత్మాన్తర్యా మ్యమృతః" = ఏ పరమపురుషుఁడు పుడమి మొదలగు పంచభూతములయందును, చీఁకటి మొదలగు వానియన్నిటియందునుండి ఆ పృథివ్యాదులకుఁ దెలియంబడ కుండ నా పృథివ్యాదులే శరీరముగఁ గలవాఁడై యా పృథివ్యాదులనెల్ల నియమించుచుఁ జిద్రూపుఁడై యున్నవాఁడో యతఁడే నీలో నున్న జననమరణాదులు లేని యాత్మయై యంతర్యామి నాఁబడును—అను శ్రుతి చే నంతర్యామిస్వరూపమును దెలియందగును.

విజ్ఞానభూమికా నిరూపణము.

జ్ఞానయోగభూమికలను జ్ఞానయోగులు పెక్కుతెఱంగుల నుడువుచున్నారు. ఐనను వసిష్ఠమహర్షి శ్రీ రామచంద్రునితోఁ జెప్పిన రీతినిబట్టి మోక్షము నీయఁజాలిన విజ్ఞానభూమికలు ఏడే తోఁపట్టుచున్నవి. అవి యెవ్వి యనిన :— "జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా। విచారణా ద్వితీయాతు తృతీయా తనుమానసా ॥ సత్త్వాపత్తిశ్చతుర్థీస్యాత్ తతో సంసక్తినామికా పదార్థభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా "= ఆ యేడిటిలో మొదటిది శుభేచ్ఛ యనియు, రెండవది విచారణ యనియు, మూఁడవది తనుమానస యనియు, నాల్గవది సత్త్వాపత్తి యనియు, నైదవది యసంసక్తి యనియు, నాఱవది పదార్థభావన యనియు, నేడవది తుర్యగ యనియు సార్థకనామములతోఁ జెప్పఁబడుచున్నవి.

శ్రీ రామచంద్రునకు వసిష్ఠమహర్షి చెప్పిన విధం బెట్టి దనిన :— "ఇమాం సప్తపదాంజ్ఞాన భూమి మాకర్ణయానఘ। నా నయా జ్ఞాతయా భూయో మోహపంకే నిమజ్జతి" = ఆజన్మశుద్ధుండ వగు నో శ్రీరామభద్రా! ఏడువిధములుగ నున్న యీ జ్ఞానభూమికను నీవు సావధానముగ నాలకింపుము. దీని స్వరూపమును బాగుగ నెఱింగినవాఁడు మఱల మోహమనియెడు నడుసులోఁ బడి మునుఁగఁడు- అనియు "వదన్తి బహుభేదేన యోగినో యోగభూమికాః। మమత్వభిమతానూన మిమా ఏవ సుఖప్రదాః" = యోగులు యోగభూమికలను పలువిధములుగఁ జెప్పుచున్నారు కాని నాకు శుభేచ్ఛ మొదలగు నాచేఁ జెప్పఁబోయెడు నీ యేడే మోక్షసౌఖ్యము నీఁజాలినవని తోఁపట్టినవి.

(1) అందు మొదటిదియగు శుభేచ్ఛానిర్వచన మెట్టిదన :— "కిం మూఢ ఇవ తిష్ఠామి ప్రేక్షేహి శాస్త్రసజ్జనైః। వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః" నేను మూఢునివడువున నేల యిట్లూరక యుండెదను? బ్రహ్మాత్మతత్త్వసాక్షాత్కారమునకు నుపాయభూతము లగు

నుపనిషచ్ఛాస్త్రములచేత, జ్ఞానుల సహవాసము మొదలగువానిచేతను పరవస్తుతత్త్వము గనుఁగొనియెద నను నతులవైరాగ్యపూర్వకంబగు తలంపు శుభేచ్ఛ నాఁబడును.

ఈ మొదటిజ్ఞానభూమిక "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా నాశకేన" అను శ్రుతిచేఁ బ్రసాదింపఁబడిన జన్మాంతరీయ సుకృతకర్మఫలభూత మగు ప్రత్యక్తత్త్వ వివిదిషయే యై యున్నది. మఱియు నిందులకు "ప్రత్యగ్వివిదిషాం బుద్ధేః కర్మాణ్యుత్పాద్య శుద్ధితః। కృతార్థాన్యస్తమాయాన్తి ప్రావృడన్తే ఘనా ఇవ" తనచే నీజన్మమునఁగాని జన్మాంతరమునందుఁగాని విధ్యుక్తముగ నాచరింపఁబడిన సత్కర్మను లన్నియుఁ జిత్తశుద్ధిద్వారా ప్రత్యక్తత్త్వమును దెలిసికొనియెదుతలఁపును గలిగించి కృతకృత్యములై "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అను శ్రుతిప్రమాణానుసారంబుగా వర్షాకాలమునంతమందలి మొగుళులఁ బోలి నశించును.

(2) విచారణా జ్ఞానభూమికా లక్షణము :— "శాస్త్రసజ్జనసంపర్కైర్వైరాగ్యాభ్యాసపూర్వకమ్ సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా" అధ్యాత్మశాస్త్రవిచారణము, సత్పురుషసేవయుం నను మొదలగువానిచేఁ బరమవైరాగ్యమునకుఁ గారణభూత మగు దృశ్యపదార్థములెల్ల మాయికములని వానియందు దోషారోపణపూర్వకముగ సదాచారమునందుఁ బ్రవర్తించుచుండుట విచారణ యనఁబడును.

(3) తనుమానస జ్ఞానభూమికా నిరూపణము :— "విచారణా శుభేచ్ఛాభ్యా మిన్ద్రియార్థేష్వరక్తతా। యత్ర సా తనుతాభావాత్ ప్రోచ్యతే తనుమానసా" మీఁదఁ జెప్పఁబడిన విచారణచేతను, శుభేచ్ఛచేతను గలిగిన శబ్దాది విషయములయందలి వైరాగ్యము దేనియందుఁ గలదో యది తనుమానస యనఁబడును.

* పైమూఁడును జాగరణసంజ్ఞ గలవి.

ఈ భూమికయందు విషయములయందలి దోషదర్శనముచేత మనస్సాయావిషయములయందుఁ బ్రసరింపక క్షీణించునుగాన దీనికి తనుమానసయని పేరు. మఱియు "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని శ్రుతియందుఁ జెప్పఁబడిన శ్రవణమననసమేత మగు నిదిధ్యాసయే యిది యగును.

(4) సత్త్వాపత్తిస్వరూపము:—భూమికాత్రితయాభ్యాసా చ్చిత్తార్థనిరతేర్వశాత్ । సత్త్వాత్మని స్థితి శ్శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా" పైని జెప్పఁబడిన మూఁడుభూమికలయొక్క సంతతాభ్యాసమువలన వనాత్మపదార్థములయందుఁ జిత్తము దగులువడక సత్త్వామాత్రస్వరూపంబగు శుద్ధబ్రహ్మమునందు నిలుచుట సత్త్వాపత్తి యనఁబడును. "సత్త్వావశేష ఏవాస్తే చతుర్థం భూమికాం గతః" అనుటచే నీనాల్గవభూమికయం దారూఢుఁడు బాహ్యావృత్తులనెల్ల మఱచి బ్రహ్మైకతానచిత్తుండై యుండును. మఱియు "సమ్యగ్జ్ఞానోదయే చిత్తే పూర్ణచంద్రోదయోపమే । నిర్విభాగమనాద్యంతం యోగినో యుక్తచేతసః । సమం సర్వం ప్రపశ్యన్తి చతుర్థీం భూమికాం గతాః" । అనుటచేత నీనాల్గవభూమిక యపరోక్షజ్ఞానరూపము గాన, సాధనకోటిలోఁ జేరదు. మఱియును, "జీవన్ముక్తే స్తారతమ్యం శిష్టే భూమిత్రయేభవేత్ । విదేహముక్తిసదృశీ సప్తమీ భూమి రుచ్యతే" అనుటచే ముందు చెప్పంబోవు మూఁడుభూమికలయందును జీవన్ముక్తిలో నవాన్తరభేదములు గలుగును. అందు నేడవభూమిక విదేహకైవల్యముం బోలినది.

---

* భేదసత్యత్వబుద్ధి నివర్తింపకుండుటంజేసి శుభేచ్ఛ, విచారణ, తనుమానస,అను నీమూఁడుభూమికలును బ్రహ్మజ్ఞానమునకు సాధనభూతములుగాని జ్ఞానకోటిలోఁ జేర నేరవు. కావుననే "భూమికాత్రితయం త్వేతద్రామ జాగ్రదితి స్మృతమ్। యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే" అను వాక్యముచే నీమూఁడును జాగరణ మని చెప్పఁబడినవి.

"పంచమ్యాదయ స్త్రిస్రోభూమయో నిర్వికల్పసమాధ్యభ్యాసక్ళప్తేన చిత్త విశ్రాన్తితారతమ్యేన సంపద్యన్తే" అనుటచేత నసంసక్తి, పదార్థభావని, తుర్యగ, అను నీమూఁడుభూమికలును నసంప్రజ్ఞాత మనియెడు సమాధివిశేషముయొక్క నిరన్తరాభ్యాసమువలనఁ గలిగెడు చిత్తవిశ్రాంతియొక్క తారతమ్యముచే సిద్ధించును.

(5) ఇఁక నైదవది యగు నసంశక్తియను భూమియొక్క స్వరూపం బెట్లనిన:—"దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలాయచ । రూఢసత్త్వ చమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా" పైని జెప్పఁబడిన శుభేచ్ఛ మొదలగు నాల్గుభూమికలయొక్క నిరంతరాభ్యాసమువలనఁ బ్రాతిభాసిక విషయములందు రాగాభాసము నివర్తించుట యను లాభముకొఱకును, నిరతిశయానందప్రాప్తికొఱకును, పరమసూక్ష్మంబగు బ్రహ్మానందమును గ్రహించుటకు నతిపృథముగ నిష్పన్నంబగు నేర్పుగలది యసంసక్తి యను నైదవభూమికయగును. "పంచమీ భూమికామేత్య సుషుప్తిపదనామికామ్। శాన్తాశేషవిశేషాంశ స్తిష్ఠత్యద్వైతమాత్రకః" అనుటచే నీ యైదవ భూమిక సుషుప్తి యనఁబడును. ఇఁక నాఱనభూమిక యగు పదార్థభావనియొక్క నిర్వచనం బెట్లనిన.

(6) "భూమికాపంచకాభ్యాసా త్స్వాత్మారామతయా దృఢమ్ । అభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్ । పరప్రయుక్తేన చిరంప్రయత్నే నావబోధనమ్ । పదార్థభావనీ నామ షష్ఠీ సంజాయతే గతిః" పైఁ జెప్పఁబడిన యైదుభూమికలయొక్క సంతతాభ్యాసమువలన నతిదృఢంబగు నాత్మారామత్వముచేత బాహ్యములు నాభ్యంతరములు నగు పదార్థములయుపలబ్ధి లేకయుండుటయే స్వరూపముగాఁ గల యసంప్రజ్ఞాత మనఁబడు నిర్వికల్పసమాధినుండి యితరజనప్రయత్నముచేత లేచుట పదార్థభావని యను నాఱవభూమిక యగును. నిర్వికల్పసమాధినిష్ఠయందు నత్యన్త

మును మఱవఁబడిన యనాత్మపదార్థముయొక్క పరజనప్రబలప్రయత్నముచే నైనభావన గలది పదార్థభావని యనఁబడు నని యర్థము.

కొందఱు మహావాక్యార్థగోచరం బగు పరిశుద్ధబ్రహ్మముయొక్క భావన(జ్ఞానము) దీనివలనఁ గలుగునుగాన నిది పదార్థభావని యనఁబడునని నిర్వచింపుచు నీ యాఱవభూమికను బ్రహ్మవిద్యాసాధనములలో నొకటిగా నెన్నెదరుకాని "భూమికాయాం వివాసనః, షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్పతతిభూమికామ్ । యత్ర నాసన్న సద్రూపో నాహం నాప్యనహం కృతిః । కేవలంక్షీణమనన ఆస్తేఽద్వైతైక్యనిర్గతః । నిర్గ్రంథి శ్శాన్తసందేహో జీవన్ముక్తోవిభావనః । అనిర్వాణోపి నిర్వాణ శ్చిత్రదీప ఇవ స్థితః" అను వచనములకు విరోధము సంభవించును గాన, నీభూమికను సాధనకోటిలోఁ జేర్చుట సమీచీనము గాదు.

(7) ఇఁక నేడవది యగు తుర్యగ యను భూమికయొక్క లక్షణం బెట్లనిన: "భూమిషట్క చిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనః। యత్స్వభావైకనిష్ఠత్వం సాజ్ఞేయాతుర్యగాగతిః" పైని జెప్పినయాఱుభూమికల యొక్క యసకృదభ్యాసమువలన బ్రాపంచిక భేదముయొక్క యుపలబ్ధి లేకపోవుటచే నెల్లప్పుడును స్వస్వరూపమునందు నిలుకడగనుండుట తురీయగ యను నేడవభూమిక యగును. మొదటిమూఁడవస్థలకు జాగరిత మనియు నాలుగవయవస్థకు స్వప్న మనియు నైదవయాఱవయవస్థలు రెండింటికిని సుషుప్తి యనియు పేరు గాన, నా జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడిటినిబట్టి నాల్గవది యగు స్వస్వరూపము తురీయ మనఁబడును. కాన నీతుర్యమును బొందియున్న యేడవభూమికకు తుర్యగ యని పేరు. "సప్తమీ సా పరిప్రౌఢా విషయోఽస్యాం నజీవితాత్" అనుటవలన నీ యేడవభూమికను బొందినయోగికి నితరులప్రయత్నముచేతఁగాని తనకుఁదానుగాని మరలఁ బ్రాపంచికవస్తుజ్ఞానము గలుగదని తోఁచుచున్నది. మఱియు "తురీయాభిధాం సప్తమభూమిం ప్రాప్తస్య స్వతఃపరతోవా పునరుత్థానమేవనాస్తి"

అనుటచేఁగూడ నీయర్థము స్పష్టపఱుపఁబడినది. "ఏషాహి జీవన్ముక్తేషు తుర్యావస్థేహ విద్యతే। విదేహముక్తవిషయం తుర్యాతీత మతః పరమ్" అనుటచే నీ తురీయగావస్థ శ్రీ శుకులు మొదలగు జీవన్ముక్తులయందుఁ జూడఁబడియున్నది; గాన నిది జగంబున నెచ్చటను లేదనుటకు వీలు లేదు.

అవ. సమర్పితంబుగా నొనర్పంబూనిన శ్రీ సీతారామాంజనేయసంవాదం బను వేదాంతగ్రంథమునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 3౯

టీ. సమర్పితంబు+కాన్ = నివేదింపఁబడినదానిఁగ, ఒనర్పన్ = చేయుటకు, పూనిన = వహించుకొనిన, శ్రీ...దంబు - శ్రీ = సమస్త సత్కావ్య లక్షణసంపత్తి గల, సీతారామాంజనేయ సంవాదంబు = (సీతాదేవికిని, శ్రీరామచంద్రునకును, ఆంజనేయునకును, జరిగిన ప్రశ్న ప్రతివచనరూపంబగు పరస్పరసంభాషణ మిందుఁ గలదు గాన) సీతారామాంజనేయసంవాదము, అను = అనఁబడు పేరు గల, వేదాంత గ్రంథమునకున్ = ఔపనిషదుల మతము ప్రతిపాదించెడు కబ్బమునకు, కథా... మంబు-కథా = ఇతివృత్తముయొక్క, క్రమంబు = ప్రారంభము, ఎట్టిది = ఏలాటిది ? అనినన్ = అని యడిగిన, (చెప్పుచున్నాను) అధ్యాహారణము, ఇచట "ఒనర్పంబూనిన" అనుదానికి "ప్రియాత్మజుఁడ నేను" అను పట్లు నున్న నేతి అనునది కర్తృపద మున్నది గాన "నాయొనర్పంబూనిన" అని పాఠమును గల్పించి నాచే రచియింప నుపక్రమించిన యని వ్యాఖ్యానముచేయుట సుసంగతము కాదు.

తా. ఆ మహాదేవగురునకు నివేదితమగునట్లు విరచించుటకు మొదలు పెట్టిన సకల సత్కావ్య లక్షణ సంపత్తితోఁ గూడుకొనిన సీతారామాంజనేయసంవాదం బనియెడు పేరు గల యౌపనిషదప్రబంధమునకు నితివృత్తపు మొదలెట్లనిన.

అవ. తాఁ జెప్పఁబోవు గ్రంథమునకు మూలభూతు లగు పార్వతీపరమేశ్వరులకు నునికిపట్టగు కైలాసపర్వతమును గ్రంథ ప్రతిపాద్య పరబ్రహ్మస్వరూపమునుగాఁ బేర్కొను చున్నాఁడు.

క. శ్రీసుఖదశుద్ధసత్త్వా
వాసము, శివపార్వతీనివాసము, సుమహో
భాస, మనాభాసము, కై
లాసము దనరారుఁ జిద్విలాసం బగుచున్. ౪౦

టీ. శ్రీ...ఆవాసము-శ్రీ = కాంతిసంపన్నమును, సుఖద = (ఒం డొంటికి నాహారాదికము నిచ్చుకొనుటచే) సౌఖ్యమును గలుగఁ జేసికొను చున్నవియు, శుద్ధ=(సహజవైరములను విడుచుటచే) శాంతస్వభావముగల వియునగు, సత్త్వ = సింగములు నేనుఁగులు పులులు లేళ్లు మొదలగు నడవి మెకములకు, ఆవాసము = ఉనికిపట్టైనదియు, శివ...నివాసము-శివ = పర మేశ్వరునకును, పార్వతీ = గౌరీదేవికిని, నివాసము - గృహమైనదియు, సు+మహో + భాసము = రజతమయ మగుటచేఁ గడునెక్కువగు కాంతి కలదియు, అనాభాసము = (తనయందు నివసించు జీవకోటులకు) నేయుప ద్రవములును లేనిదియునగు, కైలాసము = కైలాస మనియెడు వెండికొండ, చిద్విలాసంబు = (సంతత సంతోషయుక్తంబు లగు చేతనముల యొక్క పలుదెఱంగులగు) వినోదములు కలది, అగుచున్ = అయి, తనరు+ఆరున్ = మిగుల నొప్పుచుండును.

మఱియు బ్రహ్మపరంబగు నర్థ మెట్లనిన.

శ్రీ...ఆవాసము - శ్రీసుఖ = కైవల్య లక్ష్మియొక్క యానంద మును, ద = ఒసఁగెడు, శుద్ధసత్త్వ = రజస్తమోగుణ సంపర్కము లేని మాయకు, ఆవాసము = అధిష్ఠానభూత మైనదియు, శివ...నివాసము -

శివ = మాయాప్రతిఫలితుం డగు నీశ్వరునకును, పార్వతీ = చిచ్ఛక్తికిని, నివాసంబు = ఆలంబన మైనదియు, సుమహాభాసము = ("జ్యోతిషాం జ్యోతిః" అనుటచే) స్వప్రకాశ స్వరూపంబును, అనాభాసము = అధ్యాస విరహితంబును, అగు, కైలాసము = (క - సుఖమునకు, ఇలా - భూమి యైనదియే కైలము. ఇట్లు అఖండానందముతో నుండునదిగాన కైలాస మనఁబడును) పరమాత్మ, చిత్...సము-చిత్ = ప్రతిబింబచైతన్యముయొక్క, విలాసము = ప్రపంచ నానాత్వరూప విలసనము గలది, అగుచున్ = అయి, తనరారున్ = ఒప్పుచుండును.

శివపార్వతీనివాస మనుపట్ల లక్ష్మీనారాయణులు, పార్వతీ పరమేశ్వరులు, రాధాకృష్ణులు, సీతారాములు, అను మొదలగు చోట్లయందు ద్వంద్వసమాసమునందు భార్యా భర్తృవాచక పదముల రెంటిలో భార్యా వాచక పదమునకుఁ బూర్వనిపాతము గన్పట్టుచున్నను "అల్పాచ్తరం - అభ్యర్హితంచ" అను సూత్రములచేత నల్పాచ్తరత్వాభ్యర్హితత్వములనుబట్టి శివపార్వతు లనియుఁ బ్రయోగ ముండవచ్చును. భారతమునందు "నలదమయంతులు" అని ప్రయోగ మున్నది.

తా. కైవల్యసౌఖ్యము నొసంగెడు రజస్తమస్సంపర్కములేని కేవల సత్త్వగుణము వీనియందు ఘనీభవించి యుండెనో యనునట్లు ప్రకాశించుచు నన్యోన్యము నాహార ప్రదానాదికముచే సుఖమును గలుగఁజేసికొనుచు స్వభావసిద్ధం బగు పరస్పరవైరమును మాని పరిశుద్ధస్వభావము గల సింహములు గజములు పులులు జింకలు మొదలగు జంతువులకు స్థానభూతమును శుద్ధసత్త్వప్రధాన యగు మాయయందుఁ బ్రతిబింబించిన స్వస్వరూపమునకును నా మాయకును నధిష్ఠానం బగు బ్రహ్మమువడువునఁ బార్వతీ పరమేశ్వరులకు నునికిపట్టును, రజతమయం బగుటచే స్వయంప్రకాశమానం బగుబ్రహ్మమువలెఁ బ్రకాశించు చున్నదియుఁ, గామక్రోధాద్యాభాసములు లేకయుండుటచే నధ్యాసశూన్యంబగు శుద్ధచైతన్యము పగిది నొప్పు

చున్నదియు, నగు కైలాసపర్వతము పెక్కుచేతనముల సంతోషవిలాసములు గలదియై పరమాత్మవలె విలసిల్లుచున్నది. ४०

వ. అది మఱియు నాదిమధ్యాంతవిహీనంబును, సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశాపహసితానంత కోటి సూర్యచంద్రానలా లోకంబును, వేదశాస్త్ర పురాణేతిహాసాగమాగమ్యంబును, బహువిధ వర్ణధర్మ కర్మగుణనామ రూపవికార శక్తి విరహితం బగు బ్రహ్మేంద్రాద్యమరాసురోరగ గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధసాధ్య విద్యాధర చారణాప్సరో యక్ష గుహ్యక భూతఖేచర దేవర్షి బ్రహ్మఋషీశ్వర యోగీశ్వర మునీశ్వర యతీశ్వర కవీశ్వరాద్యుపాస్యంబును, నిత్య నిర్గుణ నిర్వికల్ప నిర్వికార నిరాకార నిరంజన నిర్విషయాతీంద్రియావాఙ్మనస గోచరాప్రమేయ శుద్ధ బుద్ధ ముక్త కేవలాఖండసచ్చిదానంద మయంబు నైనతురీయాతీత పరతత్త్వ కైలాసంబున నవ్యక్తమహదాది సప్తావరణ పరివేష్టితంబును, చతుర్దశలోక కందర సుందరంబును, సార్వభౌమాది హిరణ్యగర్భాంతానంద గండశైల భాసురంబును, భాను సోమ నక్షత్ర తారా గ్రహ పావక సౌదామన్యాది వివిధతేజో రత్న శర్కరిలంబును బ్రవిమల వైరాగ్యోపరత్యేకాంతాత్యంత ముముక్షుతాధిత్యకాధ్యాత్మానంద జీవనాభిషిక్త నిర్మల నిశ్చలతా కలికా కలితఫలిత నిష్కామ కర్మోపాసనా యోగ యోగ జపతప స్సత్య శౌచదయాశీల వ్రతదానాది నానా విధానోకహోద్యానవిరాజితంబును, శాస్త్రపుష్పోపేత

నిగమాగమాంత కల్పలతా విలసితంబును, షడ్విధ సమాధిసౌధ విభ్రాజితంబును, బరమాధ్యాత్మ విద్యానంద జలాభిషిక్త నిర్మలచిత్త వృత్త్యంగణ శమదమోపరతి తితీక్షాశ్రద్ధా సమాధానామానిత్వాదంభిత్వాది కల్యాణ గుణ మణిగణ రంగవల్లీ ప్రకాశితంబును నిరతిశయ కైవల్య భాండాగార శోభితంబును, ఫలకామనాభావ స్వభావనియత కర్మాచరణ చిత్తశుద్ధి సర్వకర్మ పరిత్యాగ గురుభక్తి వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసన ధ్యానాది సోపాన సమన్విత విజ్ఞాన రాజమార్గ లలితంబును, బంచాక్షరీ మహామంత్ర మాణిక్యతోరణాలంకృతంబును, ప్రణవ నాథ మంగళవాద్యరవ పూరితంబును నగు తురీయ మహాస్థాన మంటపాంతరంబున సర్వోపనిషత్సారభూత బ్రహ్మాత్మైకత్వ దర్శనరూపోంకార సింహాసనాసీనుం డై శుద్ధ సత్త్వ ప్రధాన మాయామయ దివ్యశోభన విగ్రహుం డును, సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వ స్రష్టృత్వ సర్వరక్షకత్వ సర్వసంహారకత్వా ద్యగణిత సమగ్ర సుగుణ పరిగ్రహుండును, సత్యజ్ఞానానంద స్వరూపుండును, సర్వవ్యాపకుండును, దేవదేవుండును నగు శ్రీ మహాదేవుండు మూర్తిమంతంబులైన చతుర్వింశతితత్త్వం బులును నిచ్ఛాజ్ఞాన క్రియాది శక్తులును హృషీకేశ్వర వాణీశ్వర సురేశ్వర నందికేశ్వర భృంగీశ్వర విఘ్నేశ్వర కుమారాది ప్రమథగణాధీశ్వరులును బ్రాహ్మీ మాహే శ్వర్యాది సప్తమాతృకలును స్వసాన్నిధ్యంబున నిజకరుణా కటాక్ష వీక్షణంబు నపేక్షించి కొలువ స్వస్వరూపావలోక

నంబు సేయుచు నాత్మారాముఁడై యున్న సమయంబునఁ దదీయ వామార్ధశరీరిణియుఁ, బరాపరప్రకృతిస్వరూపిణి యు, నిఖిలజగదుపాదానకారణభూతయు, నఖిలలోకైక మాతయుఁ, ద్రిభువనగేహినియు, విశ్వమోహినియు, ధీము ఖియు, జ్ఞానవిజ్ఞానలోచనయు, విషయవిరక్త్యధరయు, విచార మందస్మితయు, నిర్మమతా నిరంతాహస్తయు, యోగబోధస్తనియు, సందేహమధ్యయు, సంసార చక్ర నాభియు, రాగద్వేషజఘనయుఁ, గామలోభోరు యుగ ళయు, సంకల్ప వికల్ప చరణయుఁ, గాలానుగత కర్మ యానయు, వేదాంత విద్యావ్యసన వసనోపరతి కంచుక ధారిణియు, రజస్సత్త్వతమోగుణగ్రంథి నీవీబంధ కంచుక బంధ వేణీబంధ సురుచిరయు, ఫలత్యాగ పూర్వక వర్ణా శ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాచార్యోపాస నేంద్రియాత్మ వినిగ్రహ స్థితప్రజ్ఞత్వాది సాత్త్వికగుణ భూషణాలంకారిణియు, శుద్ధవాసనా వాసితయు, నిత్యాన పాయినియు, దేవదేవియు నగు శ్రీ మహాదేవి యతిప్రీతి పూర్వకంబుగాఁ జతుర్విధ శుశ్రూషలు గావించుచు సేవిం చుచుఁ బూజించుచు భావించుచు నమస్కరించుచు నారా ధించినఁ బ్రసన్నుండై మెచ్చి నీకు నెయ్యది యిష్టం బిచ్చెద నడుగు మనిన సంతోషభరితచిత్తయై యమ్మత్త కాశిని చిఱునవ్వు నగుచు నిట్లనియె. ౪౧

టీ. ఆది = ఆవెండికొండ, తత్పదవాచ్యంబగు పరమాత్మ యనియు నర్థము; మఱియుఁ = ఇంకను, ఆది + మధ్య + అంత + విహీ నంబును - ఇ దిక్కడనుండి ప్రారంభము, ఇది మధ్యభాగము, ఇది

తుదయని తెలిసికొనుటకు వీలులేని కడు గొప్పదియు నని కైలాసపరమగు నర్థము, "న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం భూత్వా భవితా వా నభూయః" అనుటచే సృష్టిస్థితిలయములు లేనిది యని పరమాత్మ పరమగు నర్థము. స్వ...శూన్యంబును - స్వజాతీయ = బ్రాహ్మ ణ్యాది యగు తమతమ జాతుల సంబంధ మైనట్టియు, విజాతీయ = తమతమ వర్ణములకు వెలలగు వర్ణముల సంబంధ మైనట్టియు, స్వగత = తమతమ వర్ణములను బొందినట్టియు, భేద = పరస్పరభేదము, శూన్యంబు= తాను కర్మభూమికి పైబడి యుండుటచేఁ దనయందు లేనిదియు, అని కైలా. "వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదిభిః । వృక్షాంతరాత్సజా తీయో విజాతీయ శ్శిలాదిభిః" = లోకమునం దొక చెట్టునకుఁ దనయందలి పండ్లు ఆకులు పువ్వులు మొదలగువానిచే స్వగతభేదము (తనలోఁ దనకు గల యేర్పాటు) ఇంకొక జాతిచెట్టుతోఁ దనకు సజాతీయ భేదము, రాళ్లు మొదలగువానిచే దానికి విజాతీయ భేదమును గలదు. ఇట్లు దృశ్యపదార్థ ములకెల్ల నీభేద మున్నదిగాని బ్రహ్మమునకన్నను స్వజాతీయభేదము గాని విజాతీయభేదము గాని స్వగతభేదము గాని లేదు. ఈ యర్థమును "ఏక మేవాద్వితీయం" అను శ్రుతియందుఁ గల 'ఏకం' అను పదము స్వగత భేదమును, 'ఏవ' అను నవధారణార్థకపదము సజాతీయ భేదమును, 'అద్వి తీయం' అను ద్వైతము నిషేధించుచున్న పదము విజాతీయ భేదమును బ్రహ్మమునకు లేదని చెప్పుచున్నది - అని పరమాత్మపర మైనయర్థము. నిత్య...ఆలోకంబును - నిత్య = శాశ్వతమైన, అపరోక్ష = స్వతస్సిద్ధ మగు, స్వ = తనయందలి వెండి రత్నములు మొదలగువానియొక్క ప్రకాశ = కాంతులచేత, అపహసిత = జయింపఁబడిన, అనేక కోటి + సూర్య + చంద్ర + అనల + అలోకంబును = పెక్కు కోట్లసంఖ్య గల సూర్యులయు చంద్రులయు నగ్నులయు వెలుఁగులు గలదియు నని కైలా

"నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం నేమావిద్యుతో భాన్తి కుతో యమగ్నిః" అను శ్రుతిచేఁ గాలత్రయాబాధ్యమానము ననుభవైకసిద్ధము నగు తన చిద్రూపజ్యోతిస్సుచే సూర్యచంద్రాద్యవభాసకంబును నని పరమా॥ వేద...అగమ్యంబును - వేద = ఋగ్యజుస్సామాథర్వము లను నాల్గు వేదములకును, శాస్త్ర = వేదాంగము లగు శిక్షాదిశాస్త్రములకును, పురాణ = శ్రుత్యర్థప్రతిపాదకము లగు నష్టాదశ పురాణములకును, ఇతిహాస = భారతము మొదలగు నితివృత్తములకును, ఆగమ = రుద్రయామళము మొదలగు నాగమములకును, అగమ్యంబును = "యతో వాచో నివర్తన్తే" అనుటచే నిట్టి దని ప్రతిపాదించుటకు వలనుపడనిదియును, బహువిధ...రహితంబును - బహువిధ = పెక్కు భేదములు గల, వర్ణ = బ్రాహ్మణాది వర్ణములయొక్క, ధర్మ + కర్మ + గుణ + నామ + రూప + వికార + శక్తి + రహితంబును= ఆయా ధర్మంబులు నాయా కర్మములు గుణములు పేరులు నాకారవిశేషములు మార్పులు సామర్థ్యములు మొదలగువానిచే విడువఁబడినదియు, కైలాసము కర్మభూమిలో లేదు గావున బ్రహ్మము కార్యకరణసంఘాతవిలక్షణం బగుటంజేసియు నని రెండర్థములయందు నిచట హేతువులం దెలియునది. బ్రహ్మ...ఉపాస్యంబును - బ్రహ్మ - ఇంద్ర- అసుర - గరుడ - గంధర్వ - కిన్నర - కింపురుష- సిద్ధ - సాధ్య - విద్యాధర - అప్సరస్ - యక్ష - గుహ్యక - భూత - ఖేచర - దేవర్షి - బ్రహ్మర్షి - యోగీశ్వర - మునీశ్వర - యతీశ్వర - కవీశ్వర - ఆది - ఉపాస్యంబును = నలువ మొదలగు నవబ్రహ్మలు, పురందరుఁడు మొదలగు ముప్పదిమూఁడుకోట్ల దేవతలు, బలిచక్రవర్తి విభీషణ ప్రముఖ దానవులును,వైనతేయుఁడు మొదలగు గరుడులును, ఆహా ఊహూ మొదలగు గంధర్వులును,మఱియుఁ గిన్నరులు కింపురుషులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు చారణులు అప్సరసలు యక్షులు గుహ్యకులు అను దేవయోనులు, గణదేవతలును, భూతప్రేతపిశాచములు, నారదుఁడు తుంబురుఁడు మొద

లగు దేవర్షులును, వసిష్ఠాదిబ్రహ్మర్షులును, పతంజలి మొదలగు యోగీశ్వరు లును, సనకసనందన ప్రముఖ మానీంద్రులును, కపిలుఁడు మొదలగు యతీం ద్రులు, శుక్రాచార్యుఁడు మొదలగు మహాకవులును లోనగువారిచే నిండి యున్న దని, క్లైలా = ఆరాధింపఁబడుచున్న దని, పరమా॥ నిత్య...... మయంబుగా - నిత్య = ప్రళయమునందు నాశము లేనిదియు, నిర్గుణ = హేయగుణములు లేనిదియు, నిర్వికల్ప = ఏయిడుములు లేనిదియు, నిర్వి కార=మార్పులు లేనిదియు, నిరంజన = పాపసంపర్కము లేనిదియు, నిర్వి షయ = పామరులకు గోచరము కానిదియు, అతీంద్రియ = దివ్యంబగుటచే మానుషేంద్రియములకుఁ బట్టువడనిదియు, అవాఙ్మానసగోచర = మాటల చేతను మానసముచేతను జెప్పుటకును దెలిసికొనుటకు శక్యము కానిదియు, అప్రమేయ=కొలతకు మీఱినదియు, శుద్ధ = రజతమయం బగుటచేఁ దెల్ల నిదియు, బుద్ధ = దేవతాత్మక మగుటచే జ్ఞానవిశిష్ట మయినదియు, ముక్త= క్లేశములచే విడువఁబడినదియు, కేవల+అఖండ = ఎన్నఁడును ఖండింపఁ బడనిదియు, సత్ = యోగ్యమైన, చిత్ = స్వభావమును, ఆనంద = సం తోషమును, మయ = ప్రచురముగాఁ గలదియు నని పర్వతార్థము. నిత్య= "నిత్యం-శుద్ధం-బుద్ధం" = శాశ్వతమును, నిర్గుణ="నిర్గుణం నిరుపప్లవం" సత్త్వాదిగుణాతీతంబును, నిర్వికల్ప = "సర్వకల్పనాతీతం" నిరుపాధి కముగాన వికల్పములు లేనిదియు, నిరంజన = "నిర్వికారనిరంజనం" అను శ్రుతిచే నిర్లేపంబును, నిర్విషయ = "నిర్విషయంసుదాన్తం - ఏతద్ధ్యశబ్ద మస్పర్శమరూప మరసగంధం" అను శ్రుతిచే శబ్దాది విషయములు లేని దియు, అతీంద్రియ = "అనింద్రియ మవిషయ మకరణం" ఇంద్రియము లకు గోచరము కానిదియు, అవాఙ్మానస గోచర = "యతోవాచో నివ ర్తన్తే, అప్రాప్యమనసాసహ" అనుశ్రుతిచే వాక్కులకును మనస్సునకును దెలియఁబడనిదియును, అప్రమేయ = స్వవ్యతిరిక్తప్రమేయము లేనిది గాన నప్రమేయమగు "అప్రమేయ మనాద్యన్తం" అని శ్రుతి, శుద్ధ = అపరి

శుద్ధమగు నుపాధి తనకు లేమింజేసి పరిశుద్ధమైనదియు, బుద్ధ = పరిపూర్ణబోధస్వరూపముచేతఁ దెలియఁబడునది గాన బుద్ధంబును, ముక్త=మాయామాయాకార్యములవలన విడువఁబడినది గాన ముక్తంబును, కేవల = కార్యకారణభావముచే విడువఁబడి పరిపూర్ణబోధమాత్రస్వరూపం బగుటచేఁ గేవలంబును, అఖండ = ఖండప్రపంచవిలక్షణం బగుటచే నఖండైకరసంబును, చిత్ = అచిద్రూపంబులగు నంతఃకరణాదులు లేనిదిగాన చిత్తును, సత్ = అసత్యభూతంబగు ప్రపంచమునకు విలక్షణం బైనదిగాన సత్తును, ఆనంద = దుఃఖరూపజగత్తునకుఁ బ్రతియోగి యగుటచే నానందమును, మయంబును = ప్రచురముగఁ గలదియు (ఇచట మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థకము గాని వికారార్థకముగాదు). ఐన = అయినట్టి, తురీయాతీత = అర్ధమాత్రారూపంబగు తురీయమునకు నతీతమగు నిర్విశేషబ్రహ్మాత్మక మగు, పరతత్త్వ= పరమాత్మస్వరూపం బగు, కైలాసంబునక్ = కైలాసమనియెడు పేరు గల వెండికొండయందు, అవ్యక్త...వేష్టితంబును - అవ్యక్త = మూలప్రకృతి యొక్క వికృతులగు, మహదాది = మహత్తత్త్వము, పంచతన్మాత్రలు అను, సప్త = సప్తసంఖ్యాకము లైన, ఆవరణ = చుట్టుగోడలచేత, పరివేష్టితంబును = చుట్టువారుకొనఁబడినదియు, చతుర్దశ = పదునాల్గుసంఖ్య గల, లోక = భూర్భువస్స్వరాది భువనము లనియెడు, కందర = చిఱుగుహలచే, సుందరంబును = సొగసైనదియు, సార్వ...భాసురంబును - సార్వభౌమ = చతుస్సముద్ర ముద్రితమైన భూమండలమున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యము గల మహారాజాధిరాజు, ఆది = మొదలు, హిరణ్యగర్భ = బ్రహ్మ, అంత = తుదగాఁగల, మనుష్య, గంధర్వ, దేవగంధర్వ, చిరలోక లోకాఖ్య పితృదేవ, అజానజదేవ, కర్మదేవ, దేవ, ఇంద్ర, బృహస్పతి, ప్రజాపతి అనువారలయొక్క, ఆనంద = సంతోష తారతమ్యము లనియెడు, గండశైల = దిగుడుబండలచేత, భాసురంబును = ఒప్పుచున్నదియు, భాను...శర్కరిలంబును - భాను = రవియు, సోమ = చందురుఁ

డును, నక్షత్ర = సాధారణపు చుక్కలును, తారా = అశ్విని మొదలగు నవియు, గ్రహ = తక్కిన కుజుఁడు మొదలగు గ్రహములును, పావక = వహ్నియు, సౌదామని = మెఱపులు, ఆది = లోనుగాఁగల, వివిధ = పలుదెఱంగు లగు, తేజః = వెలుఁగులు గల, రత్న "జాతౌజాతా యదు త్కృష్టం తద్రత్న మభిధీయతే" అనుటచే నుత్కృష్టవస్తువులచే, శర్కరిలంబును = కఱకుటిసుక గలదియును, (అనేకములగు దీప్తిమంతములైన పదార్థములాకొండనిండ నిసుకపఱచినయట్లున్న వని యభిప్రాయము.) ప్రవిమల...విరాజితంబును - ప్రవిమల = మధ్యను రాగాదులచేఁ గలుషితముగాని, వైరాగ్య = (ఈ లోకమునందలి స్రక్చందనాది విషయభోగములు స్వకర్మానుగుణముగఁ గలుగునట్లు స్వర్గాదివిషయభోగములు గూడఁ గర్మజన్యములగుటచే వినశ్వరంబులని తలఁచి, వానియందుఁ దలఁపు నొకించుకయుఁ జేయకుండుటయు నిర్మలవైరాగ్య మను లక్షణము గల) ఇహాముత్ర ఫలభోగ విరక్తియు, ఉపరతి = (శ్రవణమననాదులకుం బెర లగు విషయములనుండి గ్రహింపఁబడిన శ్రోత్రాదులగు నింద్రియములు మరల నాశబ్దాది విషయములయందుఁ బడకుండ దేనిచేఁ జేయఁబడునో యావృత్తివిశేషము పరమోపరతి యనఁబడు నుపరతియు, ఏకాంతతా = (శబ్దాది విషయజాతమునుండి నిగ్రహింపఁబడిన) మనస్సును నద్వితీయ బ్రహ్మమునందు లయము చేయుటయు, అత్యంత ముముక్షుతా = తీవ్రమగు మోక్షేచ్ఛయు ననెడు, అధిత్యకా = "ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వ మధిత్యకా" అనుటచే నాకైలాస పర్వతరూప బ్రహ్మముయొక్క మీఁదిభాగమున నున్న, అధ్యాత్మానంద = పరమాత్మానుభవమువలనఁ గలిగెడు నఖండానందమనియెడు, జీవన = "జీవనం భువనం వనం" అనుటచే జీవనశబ్దవాచ్యంబగు) నుదకముచేత, అభిషిక్త = నిరంతరమును దడుపఁబడినవియు, నిర్మల నిశ్చలతా = బాహ్యదృష్టిలేని చిత్తైకాగ్రత యనెడు, కలికా = కోరకములచేత (మొగ్గలచేత), కలిత = ఒప్పుచున్నవియు, ఫలిత = బాగుగ

ఫలించినవియు అయిన, నిష్కామకర్మ = ఫలాపేక్షను విడిచి చేయఁబడిన శ్రౌతస్మార్తకర్మములును, ఉపాసనా = (సగుణబ్రహ్మవిషయము లయిన మానసవ్యాపారరూపము లగు శాండిల్యవిద్య మొదలగు) నుపాస్తులును, యాగ = జ్యోతిష్టోమాదియజ్ఞములును, యోగ = "యోగ శ్చిత్తవృత్తి నిరోధః" అని చెప్పఁబడిన మానసవ్యాపార నిగ్రహాత్మక మగు యోగమును, జప = గాయత్రీ ప్రభృతిమంత్ర పురశ్చర్యయు, తపః = బ్రహ్మవిచారణ రూపమగు తపస్సును, సత్య = యథార్థకథన మను వ్రతమును, శౌచ = చిత్తశుచిత్వమును, దయా = సకలభూతములయందు నక్కటికమును, శీల= సత్స్వభావమును, వ్రత = ఏకాదశ్యుపవాసాది వ్రతములును, దాన = బీద లకు నన్నము పెట్టుట మొదలగు దానములును, ఆది = లోనుగాఁ గలవి యనెడు, నానావిధ = పెక్కుజాతులు గల, అనోకహ = వృక్షములు గల ("అనోకహః కుట స్సాల" అని అమరము) ఉద్యాన=విహారవనములచే, విరాజితంబును=రంజిల్లుచున్నదియు, శాస్త్రి... విలసితంబును - శాస్త్రి= శిక్షాది వేదాంగము లనియెడు, పుష్ప = ప్రసూనములతో, ఉపేత = సంయు క్తములయిన, నిగమ = వేదములను ("నిగమకల్పతరోర్గలితం" అని శ్రీ భాగవతము) ఆగమ = ["ఆగతం శివ వక్త్రేభ్యో గతంచ గిరిజాశ్రుతౌ। మతంచ వాసుదేవస్య తస్మా దాగమ ముచ్యతే" అనియు "సృష్టిశ్చ ప్రళ యశ్చైవ దేవానాంచ తథార్చనమ్। సాధనంచైవ సర్వేషాం పురశ్చరణ మేవచ॥ షట్కర్మసాధనంచైవ ధ్యానయోగ శ్చతుర్విధః। సప్తభి ర్లక్షణై ర్యుక్తం త్వాగమం తద్విదోవిదుః" అనియు, సదాశివుని యైదుముఖముల నుండి వెలువడినదియు, మొదటఁ బార్వతీదేవిచే నాలకింపఁబడినదియు, శ్రీ పరవాసుదేవునిచే నియ్యకొనఁబడినదియుఁ, గాన నాగమ మనఁబడును. సృష్టిక్రమము, ప్రళయప్రకారము, దేవతార్చనవిధి, సర్వకార్య నిర్వహణ ప్రకారము, పురశ్చర్యావిధి, షట్కర్మవిధానమును, చతుర్విధధ్యానయోగ మును నను నీయేడును దేనియందు ప్రతిపాదింపఁబడు, నది యాగమ మనఁ

బడును] అను లక్షణముగల రుద్రయామళాది తంత్రగ్రంథములును, అంత=వేదాంతములునుఁలేక నిగమాగమముల సిద్ధాంతములు) అనియెడు, కల్పలతా=కల్పవల్లులచే, విలసితంబును = వెలుఁగుచున్నదియును, షట్...బున్ - షడ్విధ=సవికల్పము - సబీజము - నిర్బీజము - సంప్రజ్ఞాతము - అసంప్రజ్ఞాతము - అను నాలువిధములు గల, సమాధి - ("ధ్యాతృ ధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్। నివాతదీపవచ్చిత్తం సమాధి రభిధీయతే" నిరంతరాభ్యాసమువలన నేను ధ్యానముచేయుచున్నాను. ఇది ధ్యానము అనుసంగతిని నోలిని మఱచి ధ్యానముచేయఁబడునొకవస్తువునందే చిత్తము నిలుచుట సమాధియనఁబడు") నను లక్షణముగల సమాధులనియెడు, సౌధ = మేడల చేత, విభ్రాజితంబును = విశేషముగ విలసిల్లుచున్నదియును, పరమ...... ప్రకాశితంబును-పరమ = సర్వోత్కృష్టంబగు, అధ్యాత్మవిద్యా = బ్రహ్మావబోధమువలనఁ గలిగిన, ఆనంద = సంతోషమనియెడు, జల = నీటిచేత, అభిషిక్త = చల్లఁబడిన, నిర్మల = పరమపవిత్రమగు, చిత్త = హృదయముయొక్క, వృత్తి = వ్యాపారములనియెడు, అంగణ = వాకిళులయందున్న, శమ = (మిక్కుటమగు నాఁకలి గలిగినపుడు భుజియించుటకంటె వేఱగు వ్యాపారము మనంబునకు రుచింపకున్నట్లు స్రక్చందనాది విషయముల యందు నత్యంతము నరుచియుఁ దత్త్వజ్ఞాన సాధనంబు లగు శ్రవణ మననాదులయందు మిగుల నభిరుచియుఁ గలుగునప్పుడు పూర్వవాసనాబలములవలన శ్రవణమననాది సాధనములను విడిచి స్రక్చందనాది విషయములయందు లోలుపమగు చిత్తము దేనిచేత నిగ్రహింపఁబడు నాయంతఃకరణవృత్తివిశేషము శమ మగునను) శమమును, దమ = (జ్ఞానసాధనము లగు శ్రవణాదులకు భిన్నములగు శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించుచుండెడు శ్రోత్రము మొదలగు బాహ్యేంద్రియములనుండి మరలింపఁబడునో యాయన్తఃకరణవృత్తి విశేషము దమమనఁబడునను) దమమును, ఉపరతి=(విధివిహితము లగు నిత్యనైమిత్తిక కామ్యాదికర్మములను సంన్యాసాశ్రమ

స్వీకారపూర్వకముగ నేను కర్తను గానని పరిత్యజించుట యుపరతి యనఁబడు) నుపరతియును, తితీక్షా=(దేహధర్మములగు శీతోష్ణాదులనుఁ దజ్జన్యము లగు సుఖదుఃఖాదులను దేహముచే విడుచుటకు వీలులేకుండుటంజేసి స్వయం ప్రకాశ చిద్రూపం బగు నాత్మయందు నా శీతోష్ణాదులు లేవను వివేక ప్రదీపముచేతఁ దెలిసికొని మిథ్యాభూతంబగు శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములను సహించుట తితీక్ష యనఁబడును. "సహనం సర్వదుఃఖానా మప్రతీకార పూర్వకమ్। చిన్తావిలాపరహితం సా తితీక్షా నిగద్యతే" అను లక్షణము గల) తితీక్షయు, శ్రద్ధా = (దేశికేంద్రోపదిష్ట వచనములయందును నుపనిషద్వాక్యముల యందును) నమ్మకమును, సమాధాన = (శబ్దాది విషయములనుండి నిగ్రహింపఁబడిన యంతఃకరణమును శ్రవణాదుల యందును దదుపకారకంబు లగు నమానిత్వాదంభిత్వాది సాధనముల యందును నెడ లేకుండఁ బ్రవేశపెట్టుట యనఁబడు) సమాధానమును, అమానిత్వ = దేహాదులయందు నభిమానము లేకపోవుటయు, అదంభిత్వ = డంబము లేకపోవుటయు, ఆది = మొదలయిన, కల్యాణగుణ = మేలిగుణమ్ము లనియెడు, మణీ = మానికములయొక్క, గణ = సముదాయము చేత నైన, రంగవల్లీ = (గడపలమీఁద లతలవడువున రంగుగుండలచేఁ దీర్పఁబడిన) ముగ్గుపట్టులచేత, ప్రకాశితంబును = శోభిల్లుచున్నదియు, నిరతిశయ = సర్వోత్కృష్టమగు, కైవల్య = నిర్వాణమనియెడు, భాండాగార = బొక్కసముచేత, శోభితంబును = విలసిల్లుచున్నదియు, ఫల... లలితంబును - ఫల = ఫలితార్థముయొక్క, కామనా = కోరిక, అభావ = లేకపోవుటయే, స్వభావ = ప్రకృతిగఁ గల, నియత = తత్తద్వర్ణములకు నియమింపఁబడిన, కర్మ = నిత్యనైమిత్తికాది కర్మములయొక్క, ఆచరణ = చేయుటచేతనైన, చిత్తశుద్ధి = అంతఃకరణ నైర్మల్యమును, సర్వ కర్మ పరిత్యాగ = నిత్యనైమిత్తికాదులగు నిఖిలక్రియలను యథావిధిగ విడుచుటయు, గురు + భక్తి = దేశికేంద్రునియందుఁ బ్రేమపూర్వకమగు నమ్మక

మును, వేదాన్త = తత్త్వమస్యాది మహావాక్య తాత్పర్యముయొక్క, శ్రవణ = ("ఇత్థంవాక్యై స్తదర్థానుసంధానం శ్రవణం భవేత్" అనుటచే "అహం బ్రహ్మాస్మి - తత్త్వమసి" అను మొదలగు మహావాక్యముల చేత నా మహావాక్యములకుం గల తాత్పర్యార్థమగు జీవబ్రహ్మములకు నైక్యమును నిరన్తరము ననుసంధించుట యను లక్షణముగల) శ్రవణమును, మనన= ("యుక్త్యా సంభావితత్వానుసంధానం మననంతు తత్" అనుటచేఁ దాను మననముచేసిన మహావాక్యార్థమును యుక్తిచే నూహించి సరిపఱుచుకొనుట యనఁబడు) మననమును, నిదిధ్యాసన = ("తాభ్యాం నిర్విచికిత్సే ఽర్థే చేతనస్థాపి తస్య యత్ । ఏకతానత్వమేతద్ధి నిదిధ్యాసన ముచ్యతే" మీఁదఁ జెప్పఁబడిన శ్రవణమననముల రెండింటిచేతను నిస్సందిగ్ధమగు పరాపరాత్మైకత్వరూప విషయమునందు నిలుపఁబడిన ధారణోపేత చిత్తముయొక్క ఏకాకారవృత్తిప్రవాహము నిదిధ్యాసనము అను లక్షణము గల) నిదిధ్యాసమును, జ్ఞాన = స్వాత్మతత్త్వ పరిజ్ఞానమును, ఆది = లోనుగాఁ గలవి యనెడు, సోపాన = పావంచాలతో, సమన్విత = కూడియున్న, విజ్ఞాన = అపరోక్షజ్ఞాన మనియెడు, రాజమార్గ = రాచబాటలచేత, లలితంబును = సొగసు మీఱునదియు, పంచాక్షరీ...అలంకృతంబును - పంచాక్షరీ = "నమో రామాయ" అను నైదుబీజవర్ణములు గల, మహామన్త్ర = రామతారక మహామంత్ర మనియెడు, మాణిక్య = నాయకమణి గల, తోరణ = మంగళ మాలికచేత, అలంకృతంబును = కైసేయఁబడినదియు, ప్రణవ...పూరితంబును - ప్రణవ = ఓం అను మంత్రాది వర్ణోచ్చారణ సంబంధ మగు, నాద = శబ్ద మనియెడు, మంగళవాద్య = వీణామృదంగాది కల్యాణవాద్య విశేషములయొక్క, రవ = నినాదములచేత, పూరితంబు = పరిపూర్ణమైనదియు, అగు = అయిన, తురీయ...బునన్ = తురీయ = చతుర్థావస్థ యనెడు, మహాస్థాన = నిండుకొలువుకూటము నందలి, మండప = మంటపముయొక్క, అంతరంబునన్ = మధ్యభాగము

మునందు, సర్వ...ఆసీనుండై - సర్వ = సకలములైన, ఉపనిషత్ = శ్రుతిశిరస్సులయొక్క, సారభూత = ఫలితార్థమగు, బ్రహ్మ = పరమాత్మకును, ఆత్మ = జీవాత్మకును, ఏకత్వ = ఐక్యముయొక్క, దర్శన = చూచుట, రూప = అకారముగఁగల, ఓంకార = మంత్రాదివర్ణ మనియెడు, సింహాసన = సింగపు గద్దియయందు, ఆసీనుండై = అధిష్ఠించియున్నవాఁడై, శుద్ధ = రజస్తమోగుణమిశ్రితము గాని, సత్త్వ = సత్త్వగుణము, ప్రధాన = ముఖ్యముగాఁగల, మాయామయ = మాయయందుఁ బ్రతిఫలించిన, దివ్య = ప్రకాశమాన (దేదీప్యమాన) మగు, శోభన = స్మరణమాత్రముచే శుభప్రదమును శుభలక్షణములు గలదియు నగు, విగ్రహుండును = స్వరూపము గలవాఁడును, సర్వ...పరిగ్రహుండును - సర్వజ్ఞత్వ = సకలమును డెలిసినవాఁ డగుట, సర్వేశ్వరత్వ = నిఖిలమునకు నధీశుఁడగుట, సర్వాన్తర్యామిత్వ = అన్నిటిలోపల నుండి నియమించుచుండువాఁ డగుట, సర్వస్రష్టృత్వ = సమస్తప్రపంచమును సృజియించువాఁడగుట, సర్వరక్షకత్వ = నిఖిలలోకములను గాపాడువాఁ డగుటయు, సర్వసంహారకత్వ = సృజింపఁబడి పాలింపఁబడిన ప్రపంచమునెల్ల నుపసంహరించువాఁ డగుట, ఆది = లోనుగాఁగల, అగణిత = లెక్కించుటకు నలవిగాని, సమగ్ర = పరిపూర్ణములయిన, సుగుణ = మేలిగొనములయొక్క, పరిగ్రహుండును = స్వీకారము గలవాఁడును, సత్య...పుండును, సత్య = సత్తును, జ్ఞాన = చిత్తును, ఆనంద = సంతోషమును, స్వరూపుండును = ఆకారముగఁ గలవాఁడును, సర్వవ్యాపకుండును = సర్వకాలసర్వావస్థలయందు నంతటను నిండియున్నవాఁడును, దేవదేవుండును = బ్రహ్మ మొదలగు వేల్పులకెల్ల నేలికయు, అగు = అయినట్టి, శ్రీ...వుండు - శ్రీ = అణిమాద్యష్టైశ్వర్య సంపత్తితోఁ గూడిన, మహాదేవుండు= శంకరుఁడు, మూర్తిమంతంబులు+ఐ = మూర్తీభవించినవి యగు, చతుర్విం

శతితత్త్వంబులును = (మూలప్రకృతి - మహత్తు - అహంకారము - పంచతన్మాత్రలు - పంచమహాభూతములు - శబ్దాదివిషయ పంచకము - శ్రోత్రాదీంద్రియపంచకము - మనస్సు అను) నిరువదినాల్గు తత్త్వములును, ఇచ్ఛా...శక్తులను - ఇచ్ఛా = ("తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" పరమాత్ముఁడు మొట్టమొదటఁ బ్రపంచ నిర్మాణముకొఱకు బలుదెఱఁగు లయ్యెద నను సంకల్పరూపమగు) నిచ్ఛాశక్తియు, జ్ఞాన=స్వసత్యసంకల్పానుసారముగ జగద్రచనావిభాగజ్ఞానరూపంబగు) జ్ఞానశక్తియు, క్రియా = లోకరచనారూపం బగు క్రియాశక్తియు, ఆది = లోనుగాఁగల, శక్తులును= మఱియు లౌకికములగు ప్రభుమంత్రోత్సాహాది శక్తులును, వ్యాప్తీ... శ్వరులు - వ్యాప్తీశేశ్వర = భక్తవత్సలుండగు శ్రీమన్నారాయణమూర్తియు, వాణీశ్వర = చతురాననుఁడును, సురేశ్వర = పాకశాసనుఁడును, నందికేశ్వర = నందీశుఁడును, భృంగీశ్వర = భృంగిరిటుండును, విఘ్నేశ్వర = గణపతియును, కుమార = కార్తికేయుఁడును, ఆది = లోనుగాఁగల, ప్రమథగణ = ప్రమథుల వర్గములకు, అధీశ్వరులును = నాయకులును, బ్రాహ్మీ + మాహేశ్వరీ+ఆది + సప్తమాతృకలును = బ్రాహ్మీ మొదలగు నేడ్గురు మాతృకలును "బ్రాహ్మీ మాహేశ్వరీచైవ కౌమారీ వైష్ణవీ తథా, వారాహీచైవ చాంద్రాణీ చాముండా సప్తమాతృకాః'' అని అమరము, స్వ+సాన్నిధ్యంబునన్ = తన చెంతను, నిజ...వీక్షణంబుల్ - నిజ = తనదగు, కరుణా = కనికరముతోఁ గూడిన, కటాక్ష+వీక్షణంబుల్ = కడగంటి చూపును, అపేక్షించి = కావలసి, కొలువక్ = భజింపుచుండఁగ, స్వ+స్వరూప+అవలోకనంబు = స్వకీయమగు సచ్చిదానంద పరతత్త్వముయొక్క అనుసంధానము, చేయుచున్ = ఒనర్చుచు, ఆత్మారాముఁడు + ఐ = తనలో తా నానందించుచు, ఉన్న సమయంబునన్ = ఉండెడు తఱిని, తదీయ+వామ + అర్ధ + శరీరిణి + యున్ = ఆ జగదీశ్వరునిది యగు ఎడమవైపు నొడలు సగపాలు తన మేను గలదియు,

పర + అపర + ప్రకృతి + స్వరూపిణియున్ = "అథపరాయయాదదక్షర మధిగమ్యతే" అను మొదలగు శ్రుతులయందుఁ బ్రతిపాదింపఁబడిన మాయయు నవిద్యయునను ప్రకృతులు రెండును స్వరూపముగఁ గలదియు, నిఖిల...భూతయున్ - నిఖిల + జగత్ = ఈశ్వరసృష్టము జీవసృష్టము నగు ప్రపంచమునకెల్ల, ఉపాదాన = ప్రధానమగు, కారణభూతయు = కారణమయినదియు, [ఇచ్చట నుపాదానశబ్దము నిమిత్తమునకుఁగూడ నుపలక్షణముగానఁ జిదచిద్రూపములచే నుపాదాన నిమిత్తకారణములు రెండు నగుచున్నదనుట] నిఖిల + లోక + ఏక + మాతయు = ఎల్లజగములకుఁ బ్రధానజననియు, త్రి + భువన+గేహినియున్ = ముజ్జగంబులు నిల్లుగాఁ గలదియు, విశ్వ + విమోహినియున్ = తన యావరణ విక్షేపశక్తులచే నెల్లరకు భ్రాంతినిఁ గలిగించుచున్నదియు, ధీ + ముఖియున్ = తనదు వికృతియగు మహత్తత్త్వమే సృష్టికి మొదలుగాఁగలదియు [నిశ్చయాత్మకజ్ఞానమే స్వస్వరూపమును దెలిసికొనుటకు ముఖ్యముగాఁ గలదియు - ననియు, బుద్ధియే వదనముగాఁ గలదియుననియు నిచట విశేషార్థములు గమనించునది] జ్ఞాన...నయున్ - జ్ఞాన = పరోక్షజ్ఞానము, విజ్ఞాన = అపరోక్షజ్ఞానము నను నివి రెండును, లోచనయు = ఎడమకన్ను కుడికన్నుగాఁ గలదియు, విషయ+విరక్తి+అధరయు = శబ్దాది విషయములయందలి విరక్తి యను నెఱ్ఱనిమోవి గలదియు, విచార...తయు - విచార = నిత్యానిత్యవివేకమనియెడు, మందస్మితయు=మందహాసము గలదియు, నిర్మ...స్తనయు-నిర్మమతా = మమత్వములేమియు, నిరహంకరతా = అహంకారములేమియు నను నవి రెండును, హస్తయు = ఎడమచెయ్యి కుడిచెయ్యిగఁ గలదియు, యోగబోధ స్తనియున్-యోగ = కర్మము, బోధ = జ్ఞానము నను నివి రెండును, స్తనియున్ = చనుదోయిగాఁ గలదియు, సందేహ + మధ్యయున్ = వ్యావహారికదశయందుఁగాని విచారణయందుఁగాని యిది యిట్లగునా కాదా యనుసందియమే సన్నపుఁగౌనుగఁ గలదియు "సదసత్సంశయ గోచరోదరీ"

అనునట్లు కలదా లేదా యనుసందియమునకు నాశ్రయమగు నెన్నడుము గలదియు ననియు నర్థము), సంసార...నాభియు - సంసార = జననమరణరూపంబగు కాఁపురపు, చక్రం = పరివర్తనమే (సుడియే), నాభియు = బొడ్డుగాఁ గలదియు, రాగ + ద్వేష = ఇష్టవస్తువునందలి మక్కువయు ననిష్టపదార్థమునందలి యసహ్యతయు ననురెండును, జఘనయు = కటిప్రదేశములుగాఁ గలదియు, కామ...యుగళయుక్ - కామ = కోరికయు, లోభ = లుబ్ధత్వము ననురెండును, ఊరు + యుగళయుక్ = రెండుతొడలుగఁ గలదియు, సంకల్ప = ఈపని నిట్లుచేసెద ననుతలంపును, వికల్ప = పలుదెఱంగుల నూహించుటయు నను నివిరెండు, చరణయు = అడుగులుగఁ గలదియు, కాల...యానయు-కాల = తత్తత్కర్మఫలానుభవకాలమును, అనుగత = అనుసరించివచ్చెడు, కర్మ = క్రియయే, యానయు = నడకగఁ గలదియు, వేదాన్త...ధారిణియు - వేదాన్త = ఉపనిషత్తులయందుఁ బ్రతిపాదింపఁబడిన, విద్యా = దహరశాండిల్యాద్యుపాసనలయందు, వ్యసన = ఆసక్తిని, వసన = కట్టుబట్టను, ఉపరతి= శ్రోత్రాదీంద్రియములను శబ్దాదులనుండి మరలించి శ్రవణాదిజ్ఞానసాధనములయందుఁ జొనుపుట యను నుపరమమును, కంచుక = రవికగను, ధారిణియుక్ = తాల్చినదియు, రజః...రుచిరయుక్ - రజః = రజోగుణము, సత్త్వ = సత్త్వగుణము, తమః = తమోగుణము, అనునీగుణత్రయసంబంధమగు, గ్రంథి=హృదయగ్రంథు లనియెడు, నీవీబంధ = ఎఱ్ఱచీరకట్టుముడియు, కంచుకబంధ = తెల్లరవికముడియు, వేణీబంధ = నల్లనికొప్పు ముడియు ననువీనిచే, సురుచిరయుక్ = మిగులనొప్పుచున్నదియు, ఫల...అలంకారిణియుక్ - ఫల=కర్తృఫలముల యొక్క, త్యాగ = విడుచుట, పూర్వక = ముఖ్యముగాఁగల, వర్ణ = బ్రాహ్మణజాతి మొదలగు వర్ణములకును, ఆశ్రమ = బ్రహ్మచర్యము మొదలగు నాశ్రమములకును, ఉచిత = తగినవియగు, ధర్మ=బ్రహ్మోపాసనము - ప్రజాపాలనము, పాశుపాల్యము - ద్విజశుశ్రూష - లోనుగాఁగల) ధర్మ

ములును, అనుష్ఠాన=ఆయానియమములను విధివిహితముగ నాచరించుటయు, ఈశ్వర+ప్రణిధాన = సర్వజగదీశ్వరుండగు శ్రీమన్నారాయణునియందుఁ జిత్తము నెల్లప్పుడు నిలుపుటయు, ఆచార్య + ఉపాసన = సద్గురుశుశ్రూషయు, ఇంద్రియ = బాహ్యేంద్రియములయొక్కయు, ఆత్మ = మనోబుద్ధిచిత్తాఽహంకారరూప మగు నంతఃకరణచతుష్టయముయొక్కయు, వినిగ్రహ = శబ్దాదివిషయములయందుఁ దగులువడకుండ జ్ఞానసాధనములగు శ్రవణాదులయందు నిలుచునట్లు చేయుటయు, స్థితప్రజ్ఞత్వ = "ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ఆత్మన్యేవాత్మనాతుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే" తనమనంబునం గలకోరికలనెల్ల విడిచి, శ్రీమన్నారాయణధ్యానతత్పరుండై తనలోఁదా నానందించువాఁడు స్థితప్రజ్ఞుం డనఁబడు నను స్థితప్రజ్ఞత్వము, ఆది=లోనుగాఁగల, సాత్త్వికగుణ=సత్త్వగుణప్రధానములగు ధర్మములనియెడు, భూషణ = తొడవులు, అలంకారిణియు = అలంకరణములుగఁ గలదియు, శుద్ధ = పరిశుద్ధమగు, వాసనా = ("శుద్ధాజన్మవినాశినీ... పునర్జన్మాంకురాం త్యక్త్వా స్థితాసంభ్రష్టబీజవత్ । దేహార్థంధ్రియతేజ్ఞాత జ్ఞేయాశుద్ధేతి చోచ్యతే । యేశుద్ధవాసనాభూయోనజన్మానర్థభాజనం । జ్ఞాతజ్ఞేయా స్త ఉచ్యన్తే జీవన్ముక్తా మహాధియః" అని వివరింపఁబడిన) చిత్తసంస్కార విశేషముచేత, వాసితయు = పరిమళింపఁజేయఁబడినదియు, నిత్యానపాయినియు = సదాశివునకు నర్ధాంగలక్ష్మి యగుటచేత నెన్నఁడు నెడఁబడనిదియు, దేవదేవియు = బ్రహ్మాదిదేవతలకెల్ల దేవుఁడగు నీశ్వరునకు నిల్లాలును, అగు = అయినట్టి, శ్రీ=పరమపాతివ్రత్యసంపదతోఁ గూడిన, మహాదేవి = పార్వతీదేవి, అతిప్రియ = అత్యంతానురాగము, పూర్వకంబుగన్ = తొలుతఁ గలుగునట్లుగ, చతుర్విధ = మానసిక, వాచిక, కాయిక, వ్యంజకము లనియెడు నాల్గువిధములగు, శుశ్రూషలన్ = ఉపచారములను, కావించి = ఒనర్చి, సేవించుచున్ = అర్ఘ్యపాద్యాదులచే సేవించుచు, పూజించుచున్ = సహస్రనామాద్యుచ్చారణపూర్వకముగఁ

బువ్వులు మొదలగువానిచేఁ బూజ లొనర్చుచు, భావించుచున్ = ధ్యానించుచు, నమస్కరించుచు = వందనములు గావించుచు, ఆరాధించినన్ = కొలువఁగా, ప్రసన్నుండై = దయాళుఁడై, మెచ్చి = ఆమె చేసినయారాధనను గొనియాడి, నీకున్ = (పార్వతి కనుట), ఎయ్యది = ఏపదార్థము లేక కోరిక, ఇష్టంబు = ప్రియమైనది, ఇచ్చెదన్ = దానిని తప్పక ఇడియెదను, అడుగుము = కోరుము, అనినన్ = ఇట్లు పలుకఁగా, సంతోష + భరిత + చిత్త + ఐ = ఆనందముచే నింపఁబడిన హృదయముగలదియగుచు, అమ్మత్తకాశిని = ("మత్తేవకాశత ఇతి మత్తకాశినీ" ఒయ్యారముచే మదించినదియుంబోలె ప్రకాశించునది యని వ్యుత్పత్త్యర్థము "ఉత్తమా మత్తకాశినీ" అని శబ్దస్తోమకోశము) మహాపతివ్రతయగు నాకాత్యాయని, చిఱునవ్వునగుచున్ = (తన యభీష్టము నెఱవేఱునుగా యని) దరహాసితమును గావించుచు, ఇట్లు అనియెన్ = ముందు చెప్పఁబోవువడువున నుడివెను.

ఈ వచనమునందలి విశేషార్థములు.

"నిత్యనిర్గుణ నిర్వికల్ప" అనుపట్ల నిర్వికల్పమనఁగా "వికల్పేన విపరీతత్వేన నామజాత్యాదినారూపేణ నిర్గత ఇతి నిర్వికల్పః పరమాత్మా" అను వ్యుత్పత్తిచేఁ బరమాత్ముఁడు తనకు వైపరీత్యముగఁ గల్పింపఁబడిన పేరు జాతి మొదలగువానిచే విడువఁబడినవాఁడుగాన నిర్వికల్పుఁ డనఁబడుచున్నాఁడు సరేకాని "తత్త్వమస్యాది మహావాక్యములయందు భాగలక్షణచే "మాయావిద్యే విహాయైవ ముపాధీపరజీవయోః।అఖండం సచ్చిదానందం పరబ్రహ్మైవ లక్ష్యతే" అనుటంజేసి పరమేశ్వరునకు నుపాధియగు మాయను, జీవునకు నుపాధియైన యవిద్యను విడిచినచో నిర్వికల్పం బగు సచ్చిదానందపరబ్రహ్మమే లక్ష్యంబగుననుట సరిపడియుండలేదు. ఏల యనిన "నిర్వికల్పస్య లక్ష్యత్వం నదృష్టం నచసంభవి" అనుటచే, నిర్వికల్ప = నామజాత్యాదిరహితమగునది గోచరమగుట యెచ్చటను లోకమునందు కనఁబడలేదు సరే

కదా యుక్తియుక్తమును గాదు. నామము జాతి మొదలగునవి ఎవరికైన గోచరమగునా పోనిమ్ము మహావాక్యార్థముచేఁ దోఁపట్టు వస్తువు సవికల్పమే యగుఁగాక యనిన "సవికల్పస్యలక్ష్యత్వే లక్ష్యస్య స్యా దవస్తుతా" అనుటచే నామజాత్యాదివిశిష్ట మగునదియే మహావాక్యతాత్పర్యవిషయ మగునపుడు దాని వస్తుత్వమే సిద్ధింపదు. నామరూపవిశిష్టం బగు పదార్థము వినశ్వరంబగుటంజేసి యిది పరవస్తు వెట్లగును? అని పూర్వపక్షము రాఁగా సిద్ధాన్తమెట్లనిన "వికల్పతదభావాభ్యా మనం స్పృష్టాత్మవస్తుని వికల్పితత్వ లక్ష్యత్వ సంబంధాద్యాస్తు కల్పితాః" అనుటచేత వికల్పముచేతనుగాని, వికల్పరాహిత్యముచేతనుగాని యంటఁబడని యఖండ సచ్చిదానందస్వరూప పరమాత్మవస్తువునందు వికల్పము సంకల్పమునకా? నిర్వికల్పమునకా? అని బ్రహ్మమును వికల్పవిషయముగఁ జేయుటయు మహావాక్యార్థముచే బ్రహ్మము దెలియఁబడు ననుటయు, సంయోగాదిసంబంధము, జాతి, గుణము, క్రియ, మొదలగునవి యెల్లఁ గల్పింపఁబడినవి. మఱియు నిచట "వికల్పో నిర్వికల్పస్య సవికల్పస్య వా భవేత్" అను మొదలగు వాక్యముల నుదాహరింపుచు వ్రాయఁదగిన యంశములు విశేషముగ నున్నను చదువరులకు ముఖపిధానమగునని యీయంశమునుగూర్చిచర్చనింతతో విరమించుచున్నారము.

## ఓంకారస్వరూపనిరూపణము.

"బ్రహ్మాత్మైకత్వ దర్శనరూపోంకార" అనునట్లు "ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవ ద్భవిష్యదితి సర్వమోంకారఏవ యచ్చాన్య త్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ" అను మొదలగు మాండూక్యోపనిషద్వాక్యార్థము నిట్లు సంధింపవలయును. అకారము, ఉకారము, మకారము, అర్థమాత్రము, అను నాల్గుపాదములు గల ఓంకారమునందు ననిరుద్ధ - ప్రద్యుమ్న - సంకర్షణ - వాసుదేవు లను నామాంతరములుగల విశ్వ - తైజస - ప్రాజ్ఞ - తురీయము అనునాల్గుపాదములతోఁ గూడిన బ్రహ్మమును ధ్యానింపవలయు నెట్లనిన చేతనాచేతనాత్మక

మగు నీప్రపంచమెల్ల నోంకారాత్మకంబై యున్నది. "తద్యథాశంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవ మోంకారే సర్వావాక్ సంతృణ్ణ ఓంకార ఏవేదగ్ం సర్వం" అను మొదలగు శ్రుతులుగూడ నీ యర్థమున కుపబలములు గావున భూతభవిష్యద్వర్తమానరూపమగు కాలత్రయముచే బరిచ్ఛిన్నంబును నపరిచ్ఛిన్నంబు నగునది యెల్ల నోంకారమునకు వేఱు గాదు. మఱియు నీ శ్రుతి కిట్లు విశిష్టాద్వైతపరముగ నర్థమును దెలియ దగును.—మోక్షేచ్ఛ గల యధికారికి సకలక్లేశములును బోయి యఖండానందము చేకూరుటకు సమష్టిరూపమును వ్యష్టిరూపమునగు నోంకారముచేఁ బ్రతిపాదింపఁబడు శ్రీ భగవంతుని యుపాసనమును జేయుటకుఁ దొలుత నీప్రక్రియను గమనించునది "జితం జగదస్మిన్నితి ఓం" చిదచిదాత్మక మగు ప్రపంచమెల్ల దీనియందు గ్రుచ్చఁబడియున్నది గాన ఓం అను పదముచేఁ జెప్పఁబడుచున్న బ్రహ్మను పరిదృశ్యమానమగు ప్రపంచమై యున్నది. మఱియును, అక్షరము (నాశములేనిది) గాన భూతకాలమునందును వర్తమాన కాలమునందును నాగామికాలమునందును నొక తీరుగనే యుండునది "ఓమిత్యాక్రియతే ప్రతిపాద్యత ఇత్యోంకారః" అను వ్యుత్పత్త్యర్థముచే నోంకారముచే ప్రతిపాదింపఁబడుచున్న యక్షరబ్రహ్మమే చిదచిదాత్మకంబగు ప్రపంచముగాని వేఱు కాదు. మఱియును గాలత్రయకృతవికారాతీతమగు వస్త్వంతరముగూడ నా యక్షరబ్రహ్మమే గాన నా బ్రహ్మమున కన్న భిన్నమైన దెద్దియును లేదు. మఱియు నిచట కేవలాద్వైతపరముగ నిట్లు గమనించునది "ఓ మిత్యేతత్ । ఏతదాలంబనం. ఏతత్త్వసత్యకామ పరంచాపరంచ బ్రహ్మయదోంకారః. ఓమిత్యాత్మానం యుంజీత - ఓమితి బ్రహ్మ - ఓంకార ఏవేదగ్ం సర్వం-" అను మొదలగు శ్రుతులచేత త్రాడు మొదలగునది పాము మొదలగు వికల్పమునకు నాస్పదమగునట్లు అద్వయమగు పరమాత్మ పరమార్థభూత మై ఇంద్రియ ప్రాణాది వికల్పమునకు నాస్పదమై యుండునట్లు సమస్త వాక్ప్రపంచము నోంకారమే

యగును. ఆ ఓంకారము పరబ్రహ్మప్రతిపాదక మగుటచేఁ బరమాత్మ స్వరూపమే యగును. మఱియు "వాచారంభణం వికారో నామధేయం తస్యేదం వాచాతంత్ర్యానామభిర్దామభి స్సర్వంసితం సర్వగ్ంహీదంనామని" అను మొదలగు శ్రుతులచే నోంకారముయొక్క వికారమగు సకల వాగ్విశేషముచే నగు తత్తదభిధానములచేఁ జెప్పఁబడు ప్రాణము లోనుగాఁ గల వికల్పమెల్లఁ దత్తదభిధానములకు వేఱుగాదు గాన "ఓమిత్యేదక్షర మిదంగ్ంసర్వం" అభిధేయములగు నీ యర్థములెల్ల నభిధానములకు వేఱు కాకుండుటచేతను నాయభిధానము లోంకారమునకు భిన్నములు కాకపోవుటచేతను నోంకారాత్మకమే ఈసర్వము నగును. పరబ్రహ్మము నభిధానాభిధేయోపాయపూర్వకముగనే తోఁపట్టును గానఁ గాలత్రయపరిచ్ఛేద్య మగు నదియెల్ల నోంకారమే. మఱియుఁ ద్రికాలాతీతంబును గార్యముచేఁ దెలియఁ బడుచున్నదియు, కాలముచే నపరిచ్ఛేద్యమునగు నవ్యాకృతము మొదలగు నదియుఁగూడ నోంకారమే యగుచున్నది. ఇట్లు ఓంకారమాత్రమే యగు సర్వమును "సర్వంహ్యేతద్బ్రహ్మ" అనుటచే బ్రహ్మమే యగుచున్నది. ఇట్లు పరోక్షజ్ఞానసిద్ధమగు బ్రహ్మము "అయమాత్మా బ్రహ్మ" అనుటచేతఁ గార్యకరణసంఘాతసాక్షియగు నీయపరోక్షకూటస్థచైతన్యమే యగును, గావున "బ్రహ్మైకత్వదర్శనరూపోంకార" అనుట సమీచీన మై యున్నది.

ప్రతిబింబవాదప్రతిపాదనము.

"శుద్ధసత్త్వప్రధానమాయామయదివ్యశోభనవిగ్రహుండు ననుపట్ల నీ యర్థమును గమనించునది. అప్రమేయుఁడగు పరమాత్మునియందు నేకదేశమున మూలాజ్ఞానరూపిణి యగు మాయ యున్నది. ఈమాయ రజ్జువునందుఁ బొడకట్టు సర్పము రజ్జువునకు వేఱుకానట్లు ప్రపంచకారణభూతుఁడగు పరమాత్మునికన్న భిన్నముకాదు. ఇది యాకసము మొదలగు కార్యజాతమును బట్టియున్నదని తెలియఁబడుచున్నది. సత్యస్వరూపమగు పరవస్తువునకుఁ గల

యాకాశాది ప్రపంచోత్పాదనసామర్థ్యమే మాయ యనఁబడుచున్నది. పరమాత్మనిశక్తిరూపమగు నీమాయ సద్వస్తువనికాని యసద్వస్తువనికాని చెప్పుటకు వీలులేదు. "తమఆసీత్తమసాగూఢమగ్రే" అను శ్రుతి ఇందుకు ప్రమాణము. మఱియు "నాసదాసీన్నో సదాసీత్తదానీం కింత్వభూత్తమః। సద్యోగాత్తమసస్సత్త్వం-నసత్త్వన్నిషేధనాత్" అనుటచేత సద్వస్తుసంబంధము వలన మాయకు సత్త్వముగాని స్వయముగా సత్త్వములేదు. మఱియు పైని చెప్పినయట్లు "నకృత్స్నే బ్రహ్మవృత్తి స్సాశక్తిః కింత్వేకదేశభాక్ ఘటశక్తిర్యథా భూమౌ స్నిగ్ధ మృద్యేవవర్తతే" అనుటచేతఁ బుడమియందలి మెత్తని మట్టియందే ఘటోత్పాదనశక్తి యుండునట్లు బ్రహ్మమునందు నొకతావుననే మాయారూపశక్తియున్నది గాని యంతటను లేదు. అంతటనుండెనేని ముక్తులచేఁ బొందఁదగిన బ్రహ్మమే లేక పోవలసివచ్చును. "పాదోస్య విశ్వభూతాని త్రిపాదస్యాఽమృతం దివి" అను శ్రుతి బ్రహ్మమునం దొకభాగమున మాయ యున్న దనుటకుఁ బ్రమాణము, అట్టి శక్తి త్రిగుణాత్మక గాన, రజస్తమోగుణసంబంధము లేక కేవల శుద్ధసత్త్వప్రధాన యగునది మాయ యనియు మలినసత్త్వప్రధాన యగునది యవిద్య యనియుఁ జెప్పఁబడుచున్నది. అందు మాయయందుఁ బ్రతిబింబించి మాయోపాధికమైన బ్రహ్మచైతన్యము ఈశ్వరుఁ డనియు, నవిద్యయందుఁ బ్రతిఫలించి యవిద్యోపాధికమైన బ్రహ్మచైతన్యము జీవుఁ డనియు వ్యవహారము. ఈశ్వరుండు పరిశుద్ధోపాధికుండు గావున సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వా ద్యనంతకల్యాణగుణ సమన్వితుఁడై యొప్పును. జీవుఁడు మలినోపాధికుఁడుగాన, కించిజ్జ్ఞత్వ అనీశ్వరత్వ నియమ్యత్వాది స్వల్పగుణ విశిష్టుండై యవిద్యావశవర్తియై కర్మపాశబద్ధుఁడై జననమరణాదిరూప సంసారచక్రమునందుఁ బడి తిరుగుచుండును. సద్గురూపదేశమువలన నెప్పుడు దా నుపాధికన్న నేను విలక్షణుండనని తెలిసికొనునో యప్పుడు విముక్తుఁ డగును.

వర్ణాశ్రమధర్మవివేచన.

"వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠాన" అనునట్లు "బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రయోవర్ణా ద్విజాతయః । చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః ।" అను మనుస్మృతివచనమునుబట్టి మొదటి వర్ణములు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రు లని వర్ణములు నాల్గు. "బ్రాహ్మణా ద్వైశ్య కన్యాయా మంబష్ఠోనామ జాయతే" అను మొదలగు వచనములచే నంబష్ఠాద్యనులోమ విలోమజాతులును గలవు. "అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా । దానం ప్రతిగ్రహశ్చైవ షట్కర్మాణ్యగ్రజన్మనః" అనుటచే బ్రాహ్మణునకు వేదశాస్త్రములను జదువుటయు నొకరికిఁ జెప్పుటయు యజ్ఞాదిక్రతువులను జేయుట యొకరిచేఁ జేయించుట తనకుం గలిగినదాని నొరుల కిచ్చుట, తనకు లేనివస్తువు నొరులవలనఁ బుచ్చుకొనుట యనునివి యాఱును కర్మములు. వానిలో "షణ్ణాంతు కర్మణా మస్య త్రీణికర్మాణి జీవికాః । యజనాధ్యాపనం చైవ విశుద్ధాచ్చ ప్రతిగ్రహః॥" అనుటచే క్రతువులను చేయించుట విద్యలను జెప్పుట యోగ్యులవలనఁ బ్రతిగ్రహించుట, అను నీమూఁడును బ్రాహ్మణునకు జీవనోపాయములు. "వేదాభ్యాసో బ్రాహ్మణస్య క్షత్రియస్యచ రక్షణం । వార్తాకర్మైవ వైశ్యస్య విశిష్టానిస్వకర్మసు" అనుటచే బ్రాహ్మణునకు వేదాధ్యయనము, క్షత్రియునకుఁ బ్రజారక్షణము, వైశ్యునకు వాణిజ్య పాశుపాల్యములును ధర్మములు. శూద్రునకు బ్రహ్మక్షత్రియవైశ్య లను త్రైవర్ణికులను నాశ్రయించుకొని వారికి లోఁబడి కృషి మొదలగు వానివలన జీవించుట ధర్మము - ఇవి యట్లుండ "అథాతో ధర్మజిజ్ఞాసా" అను మొదలగు ద్వాదశలక్షణియందుఁ జర్చింపఁబడిన కర్మకాండోక్త ధర్మము లన్నియు నూహించునది.

తా. ఇంతియుకాక యా కైలాసాచలము తురీయావస్థకుఁగూడ నతీతం బగు పరతత్త్వంబువడువున ననేకయోజన విస్తీర్ణాయతోచ్ఛ్రాయంబులు-

గలదగుటచేఁ దుద మొదలు నడుమయు లేనిదియుఁ, గర్మభూమి కావల నున్నది గాన, తనయందు స్వకులము పరకులము అను మొదలగు వర్ణాశ్రమ ధర్మభేదములు లేనిదియుఁ, దనయందుఁ గల స్ఫటికమణులు మొదలగు మానికములయొక్కయు వెండి మొదలగు లోహములయొక్కయు, గైరికాది ధాతు విశేషములయొక్కయు, శేయుంబవ ళ్లనక వెలుంగుచున్న కాంతుల చేత ననేకకోటిసంఖ్య గల సూర్యులయు, చంద్రులయు, వహ్నులయు, దీప్తుల నెల్లఁ దిరస్కరింపుచున్నదియు, చతుర్విధవేదములకును, షట్చాస్త్రములకును, నష్టాదశపురాణములకును భారతాదీతిహాసములకును దన మాహాత్మ్యమును గొనియాడుటకు వలనుపడక యున్నదియు, కర్మభూమికిఁ బైఁబడియుండుటచే బ్రాహ్మణాది వర్ణములయు బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మములయు జ్యోతిష్టోమాదికర్మలయు గుణములు పేరులు స్వరూపములు మార్పులు సామర్థ్యములు మొదలగునవి తనయందు లేనిదియు, చతురాననుఁడు ఇంద్రుఁడు లోనుగాఁగల దేవతలు దైత్యులు దానవులు నాగులు గరుడులు గంధర్వులు కిన్నరులు కింపురుషులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు చారణులు నప్సరసలు యక్షులు గుహ్యకులు నాఁబడు దేవయోనులు, నారదాది దేవర్షులును వసిష్ఠాది బ్రహ్మర్షులును, సనక సనందనాది యోగీంద్రులును, శౌనక ప్రభృతి మునీంద్రులును, కపిల ప్రముఖయతీంద్రులును, శుక్రాచార్యుఁడు మొదలగు కవీంద్రులును మొదలుగాఁ గల వారిచే నిరంతరము నారాధింపఁబడుచున్నదియు, కల్పావసానమునందుఁ గూడ సదాశివుని త్రిశూలాగ్రముననుండి నశింపనిదియు, హేయగుణములు లేనిదియు నెట్టి వికల్పములును లేనిదియు, నెన్నఁడును మార్పులేనిదియు, నిర్దుష్టమును, పాపాత్ములకు గోచరము కానిదియు, పుణ్యైకలభ్యం బగుటచే మన యీ యింద్రియములకు నందనిదియు, ఇట్టిదని గ్రహించుటకు వాక్కునకును మనస్సునకును శక్యముగానిదియు, మేర మీఱినదియు, పరమ పవిత్రమైనదియు, దేవతాత్మకం బగుటచే జ్ఞానస్వరూప మయినదియు,

సాంసారికదుఃఖవిముక్తం బైనదియు, ప్రళయాంతమునందుఁ గూడ ఖండించుటకు వీలు లేనిదియు, సర్వకాల సర్వావస్థలయందును దనయందలి చేతనముల యానందముచే సాంద్రమైనదియునై విలసిల్లుచుండు నా వెండికొండయందు మహత్తత్త్వము, నహంకారము శబ్దతన్మాత్రము మొదలగు పంచతన్మాత్రములును నను సప్తావరణములచేఁ జుట్టుకొనబడినదియు, భూర్భువస్స్వరాదులు నతలాదులు నగు చతుర్దశ భువనంబు లనియెడు చిన్న చిన్న గూఁడులచే సొగసైనదియు, మానుషానందము మొదలు బ్రహ్మానందము దనుకఁ గల యానందవిశేషము లనియెడు దిగుడుబండలచే నొప్పుచున్నదియు, వేవెలుఁగు రేవెలుఁగు రిక్కలు గ్రామలు నగ్గి మెఱుపులు మొదలగు పలుదెఱంగుల నలరు వెలుంగు లనియెడు మానికములకటకటెనుక గలదియు, అతులవిరక్తియు నుపరతియు మోక్షేచ్ఛ యనఁబడు కొండమీఁది భాగములయం దున్నవియు, బ్రహ్మానంద రసానేచనముచేఁ బెరిఁగిన నిశ్చలత్వమనియెడు మొగ్గలచే నొప్పుచున్నదియు, బాగుగ ఫలించునవియు నగు ఫలాపేక్ష లేని నిత్యాగ్నిహోత్రాదికర్మలును, శాండిల్య విద్యాద్యుపాసనలును, జ్యోతిష్టోమాది యాగములును యమనియమాద్యష్టాంగ యోగములును గాయత్రీప్రభృతి మంత్రపునశ్చర్యలును, చాంద్రాయణ వ్రతప్రముఖ తపంబులును, సత్యసంధత్వము, శుచిత్వము, దాక్షిణ్యము, సత్స్వభావము, ఏకాదశ్యాది వ్రతములును, ఈవియు మొదలగు సత్క్రియ అనియెడు పలుదెఱంగులఁ బరఁగు మ్రాఁకులు గల పూఁదోఁటలచే నొప్పుచున్నదియు, తత్త్వజ్ఞాభ్యము లనియెడు కుసుమములతోఁ గలసియున్న వేదములు వేదాంగములు వేదాంతములు ననియెడు సురతరులతికలచే నలరుచున్నదియు, నాలుతెఱంగుల నున్న సవికల్ప నిర్వికల్పాది సమాధిభేదము లనియెడు మేడలచే బెడఁగు మీఱుచున్నదియు, సర్వోత్కృష్టం బగు వేదాంతశాస్త్రజన్యమైన పరిపూర్ణానంద మనియెడు తోయముచేఁ జల్లఁబడిన పరమపావనమగు మానసవ్యాపార మనియెడు వాకిటియందు శమము - దమము - ఉపరతి -

తితిక్ష - నమ్మకము - సమాధానము- దేహాద్యభిమాన శూన్యత్వము - ద
రాహిత్యము - లోనుగాఁగల మేలిగొనంబు లనియెడు మానికములగమి
గూర్పఁబడిన ముగ్గులచే నందమైనదియు, లోకోత్తరమైన ముక్తి యను ధ
పేటికచే రంజిల్లుచున్నదియు, కోరిక లేనిదియు సస్వవర్ణోచితములు
శాస్త్రవిహితములును, నగు చెయ్వులను జేయుటచే నైన బుద్ధిశుద్ధిచేఁ ద
త్క్రియా కలాపములఁ బరిత్యజించుటయు, పెద్దలయెడల విధేయత
పెద్దలు చేసిన యుపనిషదుపదేశము నాలకించుట, యుపదిష్టార్థమును దనలో
నాలోచించుకొనుట, యట్లాలోచించుటచే నిశ్చింతంబగు పరమవస్తు
నందుఁ జిత్తైకాగ్రత, స్వాత్మావబోధము లోనగు నభ్యాసములనియెడ
చీడీలు గల యపరోక్షజ్ఞాన మనియెడు రాచబాటచే సొబగయినదియుఁ
'నారాయణాయ' యను నైదుబీజవర్ణములు గల మూలమంత్రమనియెడు
నాయకమణి గల మాలికావిశేషముచేఁ గైసేయఁబడినదియు, ఓంకారనాద
మనియెడు వీణాదికల్యాణవాద్యవిశేషముల నినదములచేఁ బరిపూర్ణ మైన
దియు నగునట్టి తురీయపదాత్మకం బగు కొలువుకూటంబు మధ్యభాగంబున
సమస్త శ్రుత్యంత ఫలితార్థం బగు పరమాత్మ జీవాత్మైక్యముయొక్క యవ
లోకనమే యాకారముగాఁగల ప్రణవంబను సింగపుగద్దియపైఁ గూర్చుండి
యున్నవాఁడును, రజస్తమోగుణముల నంటని సత్త్వగుణంబు ప్రధానముగాఁ
గలమాయచేఁ గైకొన్న దివ్యమంగళమగు నాకారము గలవాఁడును, సక
లము నెఱుంగుట - సమస్తమునకు నేలికఁడగుట - అన్నిటిలో నుండుట -
అన్నిటిని సృజించుట, నిఖిలమును గాపాడుట - సమస్తమును రూపు
మాపుట లోనుగాఁ గల లెక్క కెక్కుడుగఁ గొఱంతలేని కల్యాణగుణంబుల
నవలంబించి యున్నవాఁడును, సత్యము - జ్ఞానము - ఆనందము అనునివి
స్వరూపముగఁ గలవాఁడును, అంతటను గ్రమ్మి యున్నవాఁడును, బ్రహ్మ
మొదలగు వేల్పులకెల్ల నాదిదేవుడును అగునట్టి శ్రీమన్మహాదేవమూర్తి
మూర్తీభవించియున్న ప్రధానము లోనుగాఁ గల యిరువదినాల్గుతత్త్వం

బులును, ప్రపంచరచనా స్పృహారూపేచ్ఛాశక్తియు, జగద్రక్షణాత్మక జ్ఞానశక్తియు, లోకోపసంహారాత్మక క్రియాశక్తియు, నేతచ్ఛక్తి త్రయాధిష్ఠాన భూతప్రధానశక్తియు, నిరధిష్ఠాన శుద్ధచిచ్ఛక్తియు, వెన్నుడు-నలువ - పాకశాసనుఁడు మరియు నంది భృంగి వినాయక కార్తికేయ ప్రముఖ ప్రమథగణప్రభువులును, బ్రాహ్మియు - మహేశ్వరియు - కౌమారియు వైష్ణవియు వారాహియు నింద్రాణియు నను సప్తమాతృకలును, తన చెంతను తన యక్కటికంపుఁ గడగంటిచూపును గోరుచు సేవింపుచుండఁ దనదు నిక్కపురూపును గనుఁగొనుచుఁ దనలోఁ దాను రమించుచుండు తఱి నాముక్కంటి యెడమయెడలి సగపాలు మేనుగాఁ గలదియు, శుద్ధ సత్త్వప్రధానయగు మాయయు మలినసత్త్వప్రధానయగు మాయయు మలిన సత్త్వప్రధానయగు నవిద్యయు నను ప్రకృతిద్వయము స్వరూపముగాఁ గలదియు, స్థూలసూక్ష్మకారణరూప మగు సమస్త ప్రపంచమునకుఁ బ్రధాన కారణ మయినదియు సర్వజగజ్జననియు, ముల్లోకములే యిల్లుగాఁ గలదియు, ప్రపంచమునకెల్ల మోహమును బుట్టింపుచున్నదియు, మఱియును, నిశ్చయాత్మకప్రజ్ఞయే వదనముగాఁ గలదియు, పరోక్షజ్ఞానము నపరోక్షజ్ఞానము నను కనుంగవ గలదియు, వేదాన్తశాస్త్రపరిశీలనమనియెడు చిఱునగవు గలదియు, మమకారరాహిత్యము నహంకారాభావము ననియెడు రెండు చేతులు గలదియు, కర్మజ్ఞానము లనియెడుచనుదోయి గలదియు, దేహాదికమే యాత్మయా? లేక యాత్మ దేహాదివిలక్షణ మైనదియా? యను సందియ మనియెడు సన్నని నడుము గలదియు, జనన మరణాత్మక భ్రమణ విశిష్టం బగు సంసృతిచక్ర మనియెడు నాభిప్రదేశము గలదియు, ప్రియాప్రియంబు లనియెడు పిఱుదులు గలదియు, కామము లోభము ననియెడు రెండుదొడలు గలదియు, సమకల్పన విరుద్ధకల్పన యను రెండును గుడియడుగు నెడమయడుగు గలదియుఁ, దత్తత్కాలము ననుసరించివచ్చెడు శుభాశుభకర్మ యనెడు నడక కలదియు, వేదాంతశాస్త్రమును వలువ

గను - నుపశమమును రవికగను బూనినదియు, రాజసమోహానుబంధం బనియెడు నెఱ్ఱని కట్టుబట్ట ముడిచేతను సాత్త్వికవృత్త్యనుబంధం బనియెడు తెల్లని రవికముడిచేతను, తామసమోహానుబంధం బనియెడు నల్లనికొప్పు ముడిచేతను నొప్పుచున్నదియు, కర్మఫలాపేక్షను విడిచి చేయఁబడు బ్రాహ్మణ్యాది వర్ణములకును బ్రహ్మచర్యాద్యాశ్రమములకును ననురూపము లగు నాయా ధర్మములును, భగవద్ధ్యానము దేశికేంద్రారాధనము, చక్షురాదీంద్రియములను మనస్సును దత్తద్విషయములయందుఁ జిక్కుపడకుండ నరి కట్టుట - సుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుత్వము మొదలగు సాత్త్విక సద్గుణంబులనియెడు తొడవులం దొడుగుకొనినదియు, పరిశుద్ధవాసనలచే సంవాసింపఁబడుచున్నదియు, తను నెప్పుడు నెడఁబాయక యుండునదియు- దేవతలకెల్లఁ బ్రధానదేవతయు నైన శ్రీమత్పార్వతీదేవి యత్యధికప్రేమ పురస్సరంబుగా - వాచిక - మానసిక - కాయిక - భావికంబు లను నలు తెఱంగులు గల పరిచర్యలు చేయుచు నారాధింపుచు నర్చింపుచు ధ్యానింపుచు మ్రొక్కుచుఁ గొలుచుటచేఁ గొనియాడి యనుగ్రహించినవాఁడై నీ కెద్ది ప్రియంబు కోరు మొసంగెద ననిన నమందానందతుందిలహృదయారవింద యగుచు నమ్మందయాన మందస్మితసుందరవదనారవింద యగుచు నీవడువున నుడివెను. ౪౧

ఆ-వె. ప్రాణనాథ! తనదుపతిని గొల్చుటకంటె
వేఱుపనులు గలవె? చారుమతికిఁ
గాన నీదుసేవ గావించుటయ కాని
యొండుకోర్కి లేదు ఖండమూర్తి! ౪౨

టీ. ప్రాణనాథ = జీవితేశ్వరుఁడ, "సంబోధనమున , ఋవర్ణకమునకు లోపంబును, నంత్యహ్రస్వంబునకు దీర్ఘంబును వైకల్పికముగా దేశముగ నగును". చారుమతికిన్ = పరిశుద్ధమగుబుద్ధి గలవనితకు, తనదు = తనభార్యయొక్క, పతి

నిన్ = పెనిమిటిని, కొల్చుటకంటెన్ = ఆరాధించుటకన్న, వేఱుపనులు = ఇతరములగు కార్యములు, కలవు - ఎ = ఉన్నవా? లేవు, కానన్ = అట్లగుటచేత, నీదు = నీయొక్క, సేవన్ = పరిచర్యను, కావించుట - అ - కాని = ఒనరించుచుండుటయే తప్ప, ఒండు = వేఱొక, కోర్కి = తలంపు, లేదు = నాకు లేదు.

తా. ఓ జీవితేశ్వరా! లోకమునందు సాధారణముగ మంచిస్వభావము గలపతివ్రతకుఁ దన పెనిమిటిని సర్వకాలసర్వావస్థలయందును సేవించుటకన్న, వేరలగు కృత్యములు దన కెవ్వియైన నుండునా? ఉండవు. కావున దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య మగు స్వరూపముగల నీయొక్క యారాధనమును గావించుకొనుచు నిట్లుండవలయునను కోరికయే కాని, నాకు వేఱొకయభిలాష యెద్దియును లేదు. ౮౨

ఆ-వె. అయిన నీయభీష్ట మడుగు మిచ్చెదనని
యానతిచ్చితిరి మహాత్మ యిపుడు
గాన నాకు నెల్లమానవులకు మేలు
గలుగ నొకటి యడుగవలసె ననఘ! ౮౩

టీ. అయినన్ = పైని జెప్పినట్లు నాకుఁ బెఱకోరిక లేకయున్నను, మహాత్మ! = ఉదారమగు శీలము గలవాఁడా! నీ అభీష్టమున్ = నీయిచ్ఛకు వచ్చినదానిని, అడుగుము = కోరుకొనుము, ఇచ్చెదను = తప్పక నీకు దయచేసెదను, అని = ఈ పడువున, ఇపుడు = ఇత్తఱిని, ఆనతిచ్చితిరి = ఆజ్ఞాపించియుంటిరి, కానన్ = అట్లాజ్ఞాపించుటంజేసి, అనఘ! = దోషములు లేనియోయేలికా, నాకున్ = పార్వతి కనుట, ఎల్లమానవులకున్ = మనుజులకెల్లరకును, మేలు = బంధముక్తిరూప మగు శ్రేయస్సు, కలుగన్ = లభించుటకు, ఒకటి = ఒకయంశము, అడుగన్ - వలసెన్ = ప్రార్థించుటకుఁ దటస్థించినది.

తా. ఓ యుదారశీలా ! దోషవిదూరా ! ఇట్లు నాకు మీ శుశ్రూషఁదప్ప వేఱొకకోరిక లేకపోయినను మీరు 'నీకు వరము నిచ్చెదను వేఁడుకొ'మ్మని యనుగ్రహించి పలికితిరి. దానంజేసి లోకమునందలిజనుల కెల్లరకును, నాకును, శ్రేయము లభించుటకొఱకు మిమ్ము నొకయర్థము ప్రార్థింపఁదగియున్నది. ౪౩

క. నిఖిలకలుషసంక్షయకర
మఖిలాభీష్టప్రదం బనంతావ్యయచి
త్సుఖదము జగదధిపత్యభి
ముఖకర మగుమంత్రరాజకము గృపఁ జెపుమా ! ౪౪

టీ. నిఖిల...కరము - నిఖిల = వాచికములు కాయికములు మానసికములునై జ్ఞానాజ్ఞానకృతములగు, కలుష = "నకలంజం భక్షయేత్ - నపరదారా న్గచ్ఛేత్ - నాప్సు మూత్రపురీషం కుర్యాత్ - నవివసన స్స్నాయాత్" అను మొదలగు శ్రుతులచేత నిషేధింపఁబడిన సామాన్యపాతకములు, బ్రాహ్మహత్యాది మహాపాతకములు వాని ననుసరించి వచ్చెడు నన్యతకథనాదులగు నుపపాతకములు నను మొదలగు దుష్కృతములయొక్క, సంక్షయ = వినాశమును, కరము = చేయునదియు, అఖిల-అభీష్ట - ప్రదంబు= అనేకవిధములగు వాంఛితములనెల్ల నొసఁగునదియు, అనంత...దము - అనంత = నాశములేనట్టియుఁ, అవ్యయ = "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అనునట్లు స్వర్గాదిసుఖములవలె క్షయిష్ణువు గానట్టియు, చిత్ - సుఖ = చిద్రూపబ్రహ్మానందమును, దము = ఒసంగునట్టియు, జగత్... కరము - జగత్ = సమస్తప్రపంచమునకు, అధిపతి = అధీశ్వరుం డగు శ్రీమన్నారాయణమూర్తియొక్క, అభిముఖ = సాన్నిధ్యమును, కరము = కలుగఁజేయునదియు, అగు = ఐనట్టి, మంత్రరాజకుక్ = సర్వోత్కృష్టమగు మంత్రమును, కృపక్ = కనికరముతో, చెపుము-ఆ = ఉపదేశింపుమా. (ఇచటం గ్రియాంతమునం దున్న ఆ యనుశబ్దము ప్రార్థనార్థకము.)

తా. ఎల్లదోషములను రూపుమాపునదియు కోరినకోరికలనెల్ల నిచ్చునదియు నపరిచ్ఛిన్నము శాశ్వతమునగు బ్రహ్మానందము నొసఁగునదియు, ప్రపంచముల కెల్ల నధీశ్వరుండగు శ్రీమన్నారాయణుని యాభిముఖ్యమును (అనుగ్రహమును) గలుగఁజేయునదియు నగు నొకమహామంత్రమును నాకు దయతో నుపదేశింపుము. ౨౪

తే-గీ. అనిన విని నవ్వి గిరిజ కి ట్లనియె శంభుఁ
డడుగరాని రహస్యార్థ మడిగి తీవు
తగ నది మదీయనిక్షేప మగుపదార్థ
మైన నెఱిఁగింతు నీకు నెయ్యంబుగలిమి. ౨౫

టీ. అనినన్ =ఇట్లు పార్వతీదేవి వేడఁగా, విని=ఆలకించి, శంభుండు= శంకరుఁడు, నవ్వి=ఆమెకుఁగల భక్తివిశ్వాసములకు సంతసించి, గిరిజకున్ = పార్వతికి, ఇట్లు అనియెన్ = ఈ వడువున నుడివెను, ఈవు=నీవు, అడుగన్ = కోరుటకు, రాని = వీలులేని, రహస్య - అర్థమున్ = మిగుల గోప్యమగు విషయమును, అడిగితివి = చెప్పుమనికోరితివి, అది=నీవడిగినయాయంశము, మదీయ = నాసంబంధమైన, నిక్షేపము = కాణాచి, అగు = అయినట్టి, పదార్థము = మూలధనము, ఐనన్ = అట్లు దాని నెవ్వరికిని దెలుపుటకు వీలు లేకపోయినను, నెయ్యంబు = నీయందు నాకు మక్కువ, కలిమిన్ = కలిగియుండుటచేత, నీకున్-తగన్ - ఎఱిఁగింతున్ = నీకు సరిగఁ దెలియఁ జెప్పెదను, "అడిగితీవు" అనుపట్ల "లిఙ్గాటోర్వ్యస్యలోపోవా" అనుటచే భూతార్థవృత్తి యగు 'నడిగితివి' అను క్రియయొక్క వకారమునకు లోపము రాఁగా అడిగితి ఈవు "అడిగి తీవు" అని సంధి. ౨౫

తా. ఈవడువునఁ దనపడఁతినుడి నాలించి వలిమలయల్లుఁడు గట్లరా యని పట్టితో నిట్లు నుడివెను. ఓపడఁతీ! యడుగుటకు వలనుపడని గోప్యమగు విషయమును నుడువుమని నీవడిగితివి. నీవడిగినయంశము నాకు నెఱింగింపఁ

దగని మూలధన మగువస్తువు- ఇట్లయ్యు నాకు నీయందు మిక్కిలి యెక్కుడగు మక్కువ గలుగుటచే నీకు వక్కాణించెదను. ౪౫

అవ. "శ్రీరామరామ రామేతి రమేరామే మనోరమే సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే"॥ అను మూలమంత్రార్థమును జెప్పుచున్నాఁడు.

తే-గీ. శ్రీమనోరామ శ్రీరామ ! రామరామ
యనుచు రమియింతు రామునియందు రామ
నామము వరానన సహస్రనామతుల్య
మట్లు గావున దీనిని నవధరింపు. ౪౬

టీ. శ్రీ = సౌందర్యము మొదలగు సుగుణసంపత్తిచేత, మనోరామ = మనోహారిణి వగు నోప్రేయసీ! రామునియందుఁ = నాయిష్టదైవ మగు శ్రీరామచంద్రునియందు, శ్రీరామ రామ రామ అనుచుఁ = శ్రీరామరామ రామయను మహామంత్రమును వాక్కుచే జపించుచు, రమియింతుఁ = భక్తియుక్తమగు మనస్సుచేఁ బ్రేమించి యుందును, ఓవరానన - వర = సొగసగు, ఆనన = మోముగల యోముద్దియా, రామనామము = పరాత్పరుండగు శ్రీరామచంద్రుని నామధేయము, సహస్ర-నామ = "విశ్వం విష్ణుర్వషట్కార" అను మొదలగు శ్రీమన్నారాయణమూర్తియొక్క వెయ్యి నామములతో, తుల్యము = సమానమైనది, (యగును), రామరామరామయని ముమ్మాఱు శ్రీరామనామము నుచ్చరించిన వెయ్యిసారులు శ్రీవిష్ణుసహస్ర నామపారాయణమును జేసినంతమహాఫలము లభించు నని భావము. అట్లు గావునఁ = శ్రీరామనామమహామంత్రమునం దిట్టిమాహాత్మ్య ముండుటచేత, దీనినిఁ = ఈ శ్రీరామనామమహామంత్రమును, అవధరింపుము = నీవును నిరంతరమును జపింపుము.

తా. సుగుణగణసౌందర్యాదిసంపదచే మనోహారిణి వగు నో చంద్రవదన! శ్రీరామయనునామము - నొకముమ్మారు అుచ్చరించిన శ్రీవిష్ణుసహస్రనామములను వేయిసారులు పారాయణము చేసిన నెంతసుకృతము గలదో యంత సుకృతము గలుగును గావున శ్రీరామచంద్రభక్తాగ్రగణ్యుండ నగు నేను నాయిష్టదైవ మగు నారామచంద్రునియందు నిరంతరమును శ్రీరామ రామరామ యను మహామంత్రమును జపియించుచు నుందునుగాన నీమహామంత్రమును నీవును జపించుకొనుచుండుము.

## శ్రీరామమంత్రమాహాత్మ్యము.

"రామఏవ పరంబ్రహ్మ రామఏవ పరన్తపః। రామఏవ పరంతత్త్వగ్ శ్రీరామో బ్రహ్మతారకం" "కేవల మకారోకార మకారార్ధమాత్రాసహితం ప్రణవ మూహ్య యో రామమంత్రం జపతి, తస్య శుభకరోఽహంస్యాం" రామ అను మంత్రమునందలి రేఫ ఆకార - మకార - అకారములు నాల్గును ఓంకారమునందున్న అకార ఉకార మకార అర్ధమాత్రములకు వేఱుకావు గాన శ్రీరామమంత్రమును ప్రణవాత్మక మని తలచి యేజనుఁడు జపించునో వానికి క్షేమములను నేను నిరంతరము నొసంగెదను'' అని రామరహస్యోపనిషత్తు "వహ్నిస్థగ్ శయనం విష్ణో రర్ధచంద్ర విభూషితం। ఏకాక్షరో మనుః ప్రోక్తో మంత్రరాజ స్సురద్రుమః'' అని రామైకాక్షర మంత్రోద్ధారణము॥ "వహ్ని ర్నారాయణో నాడ్యో జాఠరః కేవలోఽపిచ। ద్వ్యక్షరో మంత్రరాజోయం సర్వాభీష్టప్రదం తతః'' అని ద్వ్యక్షర రామంత్రోద్ధారము॥ "తారమాయారమానంగ వాన్స్వబీజైశ్చ షడ్విధః। త్ర్యక్షరోమంత్రరాజ స్స్యా త్సర్వాభీష్టఫలప్రదః'' అని త్ర్యక్షర రామమంత్రోద్ధారము॥ "ద్వ్యక్షర శ్చంద్రభద్రాన్తో ద్వివిధ శ్చతురక్షరః'' అని చతురక్షర రామమంత్రోద్ధారము॥ "సంప్రతిష్ఠ రమావాయా హృత్పంచార్ణో మనుర్మతః'' అని రామపంచాక్షరమంత్రో

ద్ధారము॥ఇట్లు రామమంత్రోద్ధారములు "ప్రోక్తోమాలా మనుస్సప్తచత్వారింశద్భిరక్షరైః" అనుదనుక శ్రీరామరహస్యోపనిషత్తునందు పెక్కుదెఱంగుల నుపదేశింపఁబడినవి. వాని నెల్ల నుపాసకులు గురుశుశ్రూషాపూర్వకముగఁ దెలియందగును; మఱియు శ్రీరామమంత్రయంత్రోద్ధార క్రమను గూడ నీ యుపనిషత్తునందును, రామతాపన్యుపనిషత్తునందును, "ఆదావష్టోకోణం తన్మధ్యే రామబీజంసశ్రీకం" అను మొదలగు నేకాక్షరి మొదలు నవాక్షరిదనుకఁ గల తొమ్మిదిమంత్రములకు యంత్రోద్ధారమును, "ఆదా షట్కోణం- తన్మధ్యే స్వబీజం - తన్మధ్యే సాధ్యనామాని" అను మొదలగు దశాక్షరి మొదలు ద్వాత్రింశాక్షరిదనుకఁ గల మంత్రముల యంత్రోద్ధారము చెప్పఁబడినది. వీనికి వివరమును చిత్రలేఖనపూర్వకముగ ముందు గావించెదము. "సర్వేషు రామమంత్రేషు మంత్రరాజ ష్షడక్షరః। ...షడక్షరస్య మాహాత్మ్యం శివోజానాతి తత్పరః" "రకారో వహ్నివచనః ప్రకాశః పర్యవస్యతి। సచ్చిదానందరూపోఽస్య పరమాత్మార్థ ఉచ్యతే॥...మకారోభ్యుదయార్థత్వా త్తన్మాయేతి చ కీర్త్యతే।...బిందునాదాత్మకం బీజం వహ్నిసోమకలాత్మకం। అగ్నిషోమాత్మకం బీజం రామబీజే ప్రతిష్ఠితం॥ యథైవవటబీజస్థః ప్రాకృతశ్చ మహాద్రుమః। తథైవరామబీజస్థం జగ దేతచ్చరాచరం॥...ఆద్యోరాతత్పదార్థస్స్యాత్ మకార స్త్వంపదార్థవాన్ । తయో స్సంయోజనమసీ త్యర్థేతత్త్వవిదో విదుః। సమ స్త్వమర్థోవిజ్ఞేయో రామ స్తత్పద ముచ్యతే॥ అసీత్యైక్యే చతుర్థిస్స్యా దేవం మన్త్రేషుయోజయేత్। తత్త్వమస్యాదివాక్యం తు కేవలం ముక్తిదం యతః॥ భుక్తిముక్తిప్రదంచైత త్తస్మాదప్యతిరిచ్యతే। ...రామమంత్రార్థవిజ్ఞానీ జీవన్ముక్తో న సంశయః॥ అను మొదలగు వాక్యములయందలి విశేషములను ముందు సవిశేషముగ వివరింపఁగలము. ౪౮

అవ. ఇట్లు తొలుత నామె కోరినయట్లు పార్వతికి నీశ్వరుండు సామాన్యముగ శ్రీరామమంత్రరాజము నుపదేశించి

యీమహామంత్రముయొక్క మహిమమును విశేషించి ప్రతి
పాదింపుచున్నాఁడు.

క. ఆదిపరబ్రహ్మప్రతి
పాదక మత్యంతపరమపావనము సుమీ
యీదివ్యమంత్రరాజము
మోదితధర్మార్థకామమోక్షప్రదమున్. ౮౭

టీ. అత్యంత + పరమ + పావనము = మిగుల నుత్కృష్టమైన
దియుఁ గడుఁబవిత్రమైనదియు, మోదిత...ప్రదమున్ - మోదిత = తమ్ము
సేవించువారికిఁ దమకు నియతములగు ఫలముల నిచ్చి సంతోషపెట్టెడు,
ధర్మ = ["శ్రుతిస్మృతిభ్యాం విహితం యత్సధర్మ ఇతిస్మృతః। విహిత
క్రియయాసాధ్యో పుంసాం ధర్మో గుణోమతః॥" అని చెప్పఁబడినదియు
శాస్త్రములయందు విధింపఁబడిన సత్కర్మల నాచరించుటవలనఁ గలుగు
నదియు - రాఁబోవు ఫలమునకు సాధనభూత మయినదియు నగు] శుభా
దృష్టమును, అర్థ = రెండవపురుషార్థముగ నెన్నఁ బడు ధనమును, కామ =
"పుంసోయా విషయాపేక్షా సకామ ఇతి భణ్యతే" అని చెప్పఁబడిన
మూఁడవపురుషార్థ మగు అభీష్టవస్తు లాభాపేక్షయు, మోక్ష = చతుర్థ
పరమపురుషార్థమై సంసారబంధముక్తిరూప మగు పరమకైవల్యమును,
ప్రదమున్ = తప్పక యొసఁగునదియును, ఆది = సమస్తప్రపంచమునకు
నాదికారణ మగు, పరబ్రహ్మ = పరమాత్మస్వరూపమును, ప్రతిపాదకము=
ప్రతిపాదించునదియును, సుమీ=సుమ్మా (సుమ్మీ యను నీమధ్యమపురుష
స్వరూపమగు నవ్యయపదము నిశ్చయాద్యర్థములయందు వాడఁబడును).

తా. ఓ ప్రియురాలా ! మఱియు లోకోత్తరమగు నీ శ్రీరామమహా
మంత్రము సర్వాధిష్ఠానభూత మగు పరమాత్మస్వరూపమును నిరూపించు
నదియు, నుపాసించువారి నత్యధికముగఁ బవిత్రము సేయునదియు ధర్మము

నర్థముఁ గామము మోక్షము నను చతుర్విధ పురుషార్థముల నిచ్చునదియును సుమీ. ౪౭

అవ. "ఆదిపరబ్రహ్మ ప్రతిపాదక" మను దాని యర్థమునే రామశబ్ద నిర్వచన పూర్వకముగ వివరించి చెప్పుచున్నాఁడు.

క. సత్యజ్ఞానానంద
ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మాదిబుధుల్
నిత్యము రమించుచుండఁగఁ
గాత్యాయని రామపదము గలిగెఁ బరునకున్. ౪౮

టీ. బ్రహ్మ - ఆది - బుధుల్ - బ్రహ్మ = [illegible]ండుఁడు, ఆది = మొదలగు, బుధుల్ = జ్ఞానులయిన దేవతలు "జ్ఞాతృచాంద్రిమరాబుధాః" అని కోశము, సత్య...ఆత్మునందున్ - సత్య = కాలత్రయాబాధ్యం బగుటచే సత్తును, జ్ఞాన = జడవిలక్షణం బగుటచేఁ జిత్తును, ఆనంద = దుఃఖాసంభిన్నం బగుటచే నిరతిశయసుఖరూపము నగు, ప్రత్యక్ = ప్రత్యక్తత్త్వమునకు, అభిన్న = వేఱుకాని; ఆత్మునందున్ = స్వరూపము గల శ్రీరామచంద్రునియందు ("అవిరాసీ జ్జగన్నాథః పరమాత్మా సనాతనః" అను మొదలగు వచనములవలనఁ బరవాసుదేవస్వరూపుఁడే రాముఁ డని తెలియందగును), నిత్యము = ఎల్లప్పుడును, రమించుచున్ = తమచిత్తములను జేర్చి యానందించుచు, ఉండన్ - కన్ = ఉండుటచేత, కాత్యాయని = ఓగౌరీ, పరునకున్ = పరవాసుదేవునకు, రామపదము = రాముఁ డను నామవాచకశబ్దము, కలిగెన్ = వచ్చినది ("యస్మిన్ రమన్తే మునయోవిద్యయాఽజ్ఞానవిప్లవే। తం గురుః ప్రాహ రామేతి రమణా ద్రామ ఇత్యపి" అను రామశబ్దనిర్వచన మిచ్చుట ననుసంధించునది.)

తా. ఓ సర్వమంగళా! నలువ మొదలుగాఁగల జ్ఞానులు సచ్చిదానందాత్మకంబగు ప్రత్యక్తత్త్వమునకు భిన్నముగాని స్వరూపము గల శ్రీరామ

యద్దురితం-పక్షమాసర్తువర్షజం । సర్వం దహతి నిశ్శేషం తూలాంచలమివానలః॥ బ్రహ్మహత్యా సహస్రాణి జ్ఞానాజ్ఞాన కృతానిచ । స్వర్ణస్తేయ సురాపాన గురుతల్పాయుతానిచ॥ కోటికోటి సహస్రాణి ఉపపాతకజాన్యపి। సర్వాణ్యపి ప్రణశ్యన్తి రామమంత్రానుకీర్తనాత్॥ గ్రామ్యారణ్య పశుఘ్నత్వం సంచితం దురితంచ యత్ । అభక్ష్యభక్షణోత్పన్నం మిథ్యాజ్ఞాన సముద్భవం॥ సర్వం విలీయతే రామ మన్త్రస్యాస్యైవ కీర్తనాత్ '' ఇత్యాది రామతాపన్యుపనిషద్వాక్యార్థ మిందులకుఁ దార్కాణము.)

తా. ఓ సుందరీ! ఉపాసకులను దరింపఁజేయునదియుఁ బరమపవిత్ర మైనదియు నగు శ్రీరామ యను నభిధానము పోఁగొట్టఁజాలనంతటి ఘోరపాతకమును శునకమాంసమును వండుకొని భక్షించెడు పంచముఁడు గూడ సలుపుటకు నసమర్థుఁడగునపుడు అట్టిరామమంత్రమాహాత్మ్యమును వర్ణించుటకు నాకు నలవికాదు. ౫౦

క. ఈరేడు జగములందును
నారీమణి విమలరామనామముచేతం
జీరఁబడని ఘనదుర్భర
ఘోరమహాఘంబు లేదు కోరి వెదకినన్. ౫౧

టీ. నారీమణి = ఓ పతివ్రతాశిరోమణి- రుద్రాణీ! ఈరు + ఏడు = రెండేడులు పదునాల్గగు, జగములందును = లోకములయందునుగూడ, కోరి = కలదా లేదా యను సందియమును బోఁగొట్టుకొనుటకుఁ దలఁచి, వెదకినన్ = పరిశీలించినప్పటికిని, విమల = పరమపవిత్రమగు, రామ = శ్రీరామచంద్రునియొక్క, నామముచేతన్ = నామరూప మగు మంత్రరాజము చేత, చీరన్ + పడని = చిందఱవందఱగఁ జీల్చివేయఁబడక యుండు నట్టిదియు, ఘన = గొప్పదియు, దుర్భర = పట్టఁజాలనిదియు, ఘోర = బీభత్సమైనదియు నగు, మహాఘంబు = గొప్పపాపము, లేదు = కనుపట్టదు.

తా. మఱియు నో పతివ్రతాశిరోమణీ ! శర్వాణీ ! పరమపావన మగు శ్రీరామచంద్రుని నామమంత్రముచేత, పటాపంచలుగాఁ గావింపఁబడ కుండెడు గొప్పదియుఁ బట్టఁజాలనిదియు మహాఘోరమయినదియు నగు దుష్కృతము బుద్ధిపూర్వకముగ వేచివేచి చూచినను జతుర్దశభువనముల యందుఁ దోపట్టదు. ౫౧

అవ. "బ్రహ్మహత్యా సహస్రాణి జ్ఞానాజ్ఞాన కృతానిచ । స్వర్ణస్తేయ సురాపాన గురుతల్పాయుతానిచ" అను నుదాహృత శ్రుత్యర్థమును బ్రతిపాదింపుచున్నాఁడు.

తే. బ్రహ్మహత్యాయుతము మద్యపానదశశ
తమును గుర్వంగనాకోటిగమనదురిత
మపరిమితహేమచౌర్యంబు గలనవరతము
రామనామాభిహతము లోకరాజవదన. ౫౨

టీ. ఓ రాజవదన ! - రాజ = చంద్రునిఁబోలు, వదన = మోముగల యోముద్దియా ! బ్రహ్మ = బ్రాహ్మణుని, హత్యా = చంపినపాపముయొక్క, అయుతము = పదివేలును, మద్య + పాన + దశ + శతము = సురాపానముఁ జేయుటవలనఁ గలిగినపాతకముయొక్క సహస్రమును, గురు... దురితము - గురు = ఆచార్యునియొక్క, అంగనా = యిల్లాలితో, కోటి = నూఱు లక్షలసారులు, గమన = వెళ్లుటచే (కలియుటచేఁ) గలిగిన, దురితము = మహాదోషమును, (ఇచట "తమును, గురుతల్పగమనపాపములకోటి" అను పాఠము సమీచీనముగ నుండును), అపరిమిత = ఇన్ని యను లెక్కయొక్క పరిమితిలేని, హేమ - చౌర్యంబులు = బంగారును దొంగిలించుటవలనఁ గలిగిన దోషములును, అనవరతమున్ = ఎపుడును, రామనామ = శ్రీరామ చంద్రుని నామమంత్రముచే, అభిహతములు = మొదలంటఁగొట్టఁబడునవి, (అగును అనుపద మధ్యాహార్యము).

తా. ఓ చంద్రముఖీ! పార్వతీ! శ్రీరామచంద్రుని నామమంత్రము నొకసారి నోటఁ బలికినంతనే పదివేల బ్రహ్మహత్యలు, వెయ్యి సురాపాన పాపములు, కోటి గురుతల్పగమనపాతకములు, లెక్కలేని సువర్ణస్తేయమహా దోషములును నశించును.     ౫౨

అవ. పైని జెప్పిన యర్థము నిరూపించి యుల్లేఖనముఁ జేయుచున్నాఁడు.

సీ. బ్రహ్మహత్యాఖ్యపాపతమోర్కబింబంబు
        మధుపానదోషాభ్రమారుతంబు
    తపనీయ చౌర్యపాతకశైలభిదురంబు
        గురువధూగమనాఘకుంజరహరి
    జననీ పితృభ్రాతృ వనితార్భకాచార్య
        గోవధారణ్యోరుదావవహ్ని
    పరసతీసంగమ పరధనహరణాది
        ఘోరపంకోరగ క్రూరబర్హి
తే-గీ. యనృతభాషణవల్లి మహాలవిత్ర
    మార్యదూషణపంకేరుహ ద్విపేంద్ర
    మఖిలకలుషాంబునిధి బడబానలంబు
    రామనామంబు హిమశైలరాజతనయ.     ౫౩

టీ. హిమ...తనయ - హిమ = మంచు విశేషముగఁ గల, శైల+ రాజ = గట్లరాయనియొక్క, తనయ = పట్టి, రామనామంబు - రామ = శ్రీరామచంద్రునియొక్క, నామంబు = నామమంత్రరాజము, బ్రహ్మ... బింబంబు - బ్రహ్మహత్య = బ్రహ్మవేత్తను జంపుటచేఁ గలుగు బ్రహ్మహత్య యను, ఆఖ్య = పేరుగల, పాప = దురితమనియెడు, తమః = అంధకార మునకు, అర్క + బింబంబు = సూర్యమండలము, సూర్యుఁడు కటికిచీఁక

టని గొట్టునట్లు శ్రీరామనామము బ్రహ్మహత్య యను పాపమును రూపుమాపునని యర్థము - ఇచట రూపకానుప్రాణిత మగు నుల్లేఖాలంకారము, లక్షణసమన్వయమును గడపటఁ దెలిపెదము. ఇంక ముందటివాక్యముల యందుఁగూడ నిట్లే యూహించునది. మధు...మారుతంబు - మధు=కల్లు యొక్క, పాన = త్రాగుటచే నగు, దోష = దోషమనెడు, అభ్ర=మబ్బునకు, మారుతంబు = తూలఁదోలుగాలియు, తపనీయ...భిదురంబు - తపనీయ = సువర్ణముయొక్క, చౌర్య = దొంగిలించుటచే సంభవించెడు, పాతక=కలుషమనియెడు, శైల-పర్వతమునకు, భిదురంబు=వజ్రాయుధము "కులిశం భిదురం పవిః" అని అమరము. గురు...హారి - గురు = ఉపాధ్యాయునియొక్క, వధూ = ఇల్లాలితో, గమన = సంగమించుటవలనఁ గలుగు, అఘ = దుష్కృతమనియెడు, కుంజర = గజమునకు, హారి = సింగమును, జననీ...వహ్ని - జననీ = తల్లియొక్కయు, పితృ = తండ్రియొక్కయు, భ్రాతృ = అన్నయొక్కయు,వనితా = స్త్రీలయు, అర్భక = పిల్లలయు ("పోతః పాకోఽర్భకో డింభః" అని యమరము), ఆచార్య= గురువుయొక్కయు, గో = గోవులయు, వధ = చంపుటవలనఁ బొడము మాతృహత్యా పితృహత్యా అను మొదలగు మహాపాతకము లనియెడు, అరణ్య = కాననమునకు, ఉరు = పెద్దవియగు, దావవహ్ని - కారగ్గియు, పర...బర్హి, పర=ఇతరులయొక్క, సతీ = భార్యలతో, సంగమ = చేరుటయు, పర = అన్యులయొక్క, ధన = విత్తముయొక్క, హరణ = దొంగిలించుటయు, ఆది = లోనగు, ఘోర = భీషణములైన, పంక = దోషములనియెడు, ఉరగ = పాములకు, క్రూర = భయంకరమైన, బర్హి= మయూరమును, అనృత...లవిత్రము - అనృత = పబ్బులగు, భాషణ = పలుకులనియెడు, వల్లీ = తీఁగెలకు, మహా లవిత్రము = పెద్ద కొడవలియు, ఆర్య...ఇంద్రము - ఆర్య = పూజ్యులయొక్క, దూషణ = తూలనాడుటవలనఁ గలిగెడు పాపము లనియెడు, పంకేరుహ=తామ

రలకు, ద్విపేంద్రము = గజరాజును, అఖిల...అనలంబు - అఖిల = పెక్కువిధములగు, కలుష = వృజినములనియెడు, అంబునిధి = కడలికి, బడబానలంబు = బడబాగ్నిహోత్రమును, అగును అను పద మంతట నధ్యాహార్యము. "ఆరోపవిషయస్యస్యా దతిరోహిత రూపిణః । ఉపరంజక మారోప్యమాణం తద్రూపకం మతం" ఒక వస్తువునం దింకొక వస్తువు ధర్మము నారోపించుట యారోపంబనఁబడునట్టి మాటువడకుండెడు నారోపణమునకు విషయమగు ముఖాదికమునకు నారోపింపఁబడెడు చంద్రాదికము తాద్రూప్యప్రతీతినిమిత్తముఁ బుట్టించెనేని రూపకంబగునను లక్షణముచే నిందు బ్రహ్మహత్యాది పాపములయందు నంధకారత్వాద్యారోపణము చేయఁబడెను గానఁ గేవలరూపకాలంకారము. "అర్థయోగరుచిశ్లేషై రుల్లేఖన మనేకధా । గ్రహీతృభేదాదేకస్య సఉల్లేఖ స్సతాంమతః" ప్రయోజనమునుబట్టి యభిరుచినిబట్టి శ్లేషనుబట్టి యొకవస్తువు పెక్కుదెఱంగుల నుల్లేఖనముఁజేయుట యుల్లేఖాలంకార మగు ననుటచే నిందు శ్రీరామమంత్రరాజమును పాపనివారకత్వ ప్రయోజనమునుబట్టి సూర్యబింబాది రూపముగ నుల్లేఖింపఁబడినదని లక్ష్యలక్షణ సమన్వయము. మఱియు సూర్యుఁడు మొదలగునవి చీఁకటిని మొదలగువానిని గొట్టునట్లు రామమంత్రము బ్రహ్మహత్యాది మహాపాతకములఁ బటాపంచలుగఁ జేయునను నుపమాలంకారము గర్భితమయి యున్నదిగాన నీయుల్లేఖ ముపమాగర్భిత మనియుఁ దెలియునది.

తా. ఓగౌరీ! శ్రీరామచంద్రునియొక్క నామ మహామంత్రము సూర్యుఁడు గాఢాంధకారమును గొట్టునట్లు బ్రహ్మహత్యా మహాపాపమును నశింపఁజేయును; మఱియు ఝంఝామారుతము మేఘముల నెగయఁగొట్టునట్లు, కల్లు ద్రాగినపాపమును, వజ్రాయుధము కొండలను బగులఁగొట్టునట్లు బంగారమును దొంగిలించిన పాపమును, సింహము గజములను జంపునట్లు గురుతల్ప గమన మహా పాపమును, గొప్ప యడవులను కార్చిచ్చు

భస్మము చేయునట్లు మాతృహత్య పితృహత్య భ్రాతృహత్య స్త్రీహత్య శిశు హత్య మొదలగు ఘోరపాపములను, నెమిలి పాములను బట్టి చంపునట్లు పరస్త్రీ పరధనాపహరణములు మొదలగు గొప్ప దోషములను, కొడవలి గడ్డితీగెలను మొదలంటఁ గోయునట్లు కల్లలాడుటచేఁ గలుగుపాతకమును, మదపుటేనుఁగు తామరలను బెకలించునట్లు పెద్దలను మించనాడుటవలనఁ బుట్టుమహాదోషములను నశింపఁజేయును. వెక్కేల యిదియది యనక సకల కలుషములను రామనామము బడబాగ్నిహోత్రము సముద్రముల నింకించు చున్నట్లు క్షీణింపఁజేయును. ౫౩

తే-గీ. రమణి యవశముచేనైన రామనామ
మమరఁ గీర్తింపఁబడుచుండ నఖిలపాత
కములచే విడ్వఁబడుసుమ్ము సుమతి యపుడ
సింహ మతిభీతమృగములచేతఁబోలె. ౫౪

టీ. రమణి ! = ఓ సుందరీమణీ-"సుందరీ రమణీ రామా యని యమరము" రామనామము = శ్రీరామభద్రునియొక్క నామరూప మంత్ర రాజము, అవశముచేన్ - ఐనన్ = స్మరించుటకుఁ దలఁపులేకపోయినను లోక పరిపాటిచేత, అమరన్ = సామాన్యముగ, కీర్తింపన్ - పడుచున్ - ఉండన్ = తనచే నుచ్చరింపఁబడుచు నుండెనేని, అప్పుడు - అ=అట్లు చ్చరించిన వెంటనే, సుమతి = రామనామోచ్చారణ బలముచేతఁ బరిశుద్ధ మగు బుద్ధిగలవాఁడైన మనుజుఁడు, అఖిలపాతకములచేన్ = అనేక కోటి జన్మములనుండి జ్ఞానాజ్ఞానకృతంబులగు పెక్కుదుష్కృతములచేతను, సింహము=హర్యక్షము, అతి... చేతన్ = అతి - అత్యంతమును, భీత = సింహ గర్జనమును విని భయపడిన, మృగములచేతన్=లేళ్లమందలచేతను, పోలెన్= వలెనే, విడ్వఁబడున్ - సుమ్ము = పరిత్యజింపఁబడును సుమీ. "ఆగమాన్య చయోస్స్యాత్తాం ముజ్జీలోః పరయోఃపడా" అను హారికారికనుబట్టి విడుచు

ధాతువు చకారమునకుఁ బరుటపరముగుచుండ వకారము రాఁగా విడువఁబడు నని యైనది. కాఁగా "పదమధ్యస్థడాదీనా ముల్లోపో బహుళంభవేత్" అనుటచే డకారముయొక్క యుకారమునకు లోపము రాఁగా విడ్వఁబడునను క్రియారూపము నిష్పన్నమైనది. ఇందు సింహసుమతులకును, పాపమృగములకును, రామనామసింహగర్జనములకును నుపమానోపమేయ భావము గలుగుటచే నుపమాలంకారము.

తా. ఓ ప్రియురాలా! సింహముయొక్క గర్జనమును వినినంతనే లేళ్లు భయపడి పరుగెత్తిపోవునట్లు రామనామమును స్మరించినవెంటనే పాపము లన్నియు సమూలముగ నశించును. ౫౪

తే-గీ. అనవరతరామనామకీర్తనపరుండు
వెనుకటియఘంబులఁ దలంచి వెఱవవలదు
ఘనత నేనుఁగు నెక్కి కుక్కలను గాంచి
భయపడఁగనేల మనుజుఁ డో పంకజాక్షి! ౫౫

టీ. పంకజ = పద్మములను బోలిన, అక్షి=కన్నులుగల యోప్రియురాలా! అనవరత...పరుండు - అనవరత = నిత్యమును, రామ = శ్రీరామచంద్రునియొక్క, నామ = నామమంత్రముయొక్క, కీర్తన=నోట నుచ్చరించుటయందు, పరుండు = ఆసక్తిగలనరుఁడు, వెనుకటి = పూర్వము దాను జేసిన, అఘంబులన్ = దురితములను, తలంచి = జ్ఞప్తికిఁ దెచ్చుకొని, వెఱవన్ = బెంగపెట్టుకొనుటకు, వలదు = పనిలేదు, ఘనతన్ = అతి గౌరవముతో లేక మహదైశ్వర్యముతో, ఏనుఁగున్ = భద్రగజమును, ఎక్కి = అధిష్ఠించి, మనుజుఁడు = నరుఁడు, కుక్కలను = శునకములను, కాంచి = చూచి, భయపడన్ + కన్ + ఏల? = అడలుఁగొననేటికి? (భీతినొంద నక్కఱలేదనుట); ఇందు గొప్ప భద్రదంతావళము నెక్కినవాఁడు క్రిందనున్నకుక్కలను జూచి యెట్లుభయపడ నవసరములేదో యట్లు సంతతము శ్రీరామనామమంత్రోపాసనమును జేయువాఁడు పాపములను

దలఁచుకొని భయపడఁ బనిలేదని రెండువాక్యములయందును వస్తుప్రతివస్తుభావముచే సామాన్యము నిర్దేశించుటచేత నౌపమ్యము తోఁచబడుచున్నది గాన ప్రతివస్తూపమాలంకారము "యత్రసామాన్యనిర్దేశః పృథగ్వాక్యద్వయే యది। గమ్యౌపమ్యాశ్రితాసాస్యాత్ప్రతివస్తూపమామతా॥ లేక "యత్ర వాక్యద్వయేబింబ ప్రతిబింబతయోచ్యతే। సామాన్యధర్మో వాక్యజ్ఞైస్స దృష్టాన్తో నిగద్యతే'' అనుటచేత నిందలి రెండువాక్యములయందు రామనామకీర్తనపరునకును, భద్రదంతావళము నెక్కినవానికిని బింబప్రతిబింబభావముచే నౌపమ్యము దోఁపట్టుచున్నది గాన, దృష్టాన్తాలంకారము ఇందు. నిదర్శనాలంకారమనుటకు వీలులేదు. "అసంభవం ధర్మయోగా దుపమానోపమేయయోః। ప్రతిబింబక్రియాగమ్యా యత్ర సాస్యాన్నిదర్శనా॥'' అనుటచేత నే వాక్యమునందు నుపమానముయొక్క ధర్మము నుపమేయమునందుఁ బొందునట్లు చెప్పినప్పు డన్వయము సంబంధింపకపోవుటచే నాయన్వయము సంబంధించుటకొఱకు బింబప్రతిబింబ భావము చేయఁబడునో యది నిదర్శనాలంకారము గాన నిచట నీలక్షణము పట్టుటలేదు. "భయపడఁగక'' అనుపట్ల "ద్యుప్రత్యయస్య లోపో వా పద్యాదా బిందురేవవా'' అనుటచే మువర్ణకమునకు లోపము.

తా. తామరరేకులంబోలిన కన్నులుగల యోపార్వతీ! నిరంతరము శ్రీరామభద్రుని నామమంత్రమును నోటనుడువుచుండెడు మనుజుఁడు దానదివఱకుఁ జేసినపాపములను మదిలోఁ దలఁచుకొనుచు నే నిట్టిఘోరపాతకములను జేసియుంటి నిఁక నాకేమిగతియని భీతి నొందం బనిలేదు. గొప్ప భద్రగజరాజుపై నధిష్ఠించియున్నవాఁడు క్రిందనున్న శునకములను గనఁగొని మనమున భయము నెన్నఁడైనం గొనునా? ౫౫

క. ఇలలోన రామనామము
సులభం బై వెలుఁగుచుండఁ జులుకగఁ బలుకం

బలునాలుక గలుగఁగ న
ల్పులు మిన్నక నరకములను బొందెద రకటా. ౫౬

టీ. రామనామము = శ్రీరామభద్రుని నామమంత్రము, సులభంబు-ఐ=ఎల్లరకు సుకరముగ లభించునదియగుచు, ఇలలోన్ = ధరణియందు, వెలుఁగుచుండన్ = (ఎల్లకలుషముల రూపుమాపుటకు సిద్ధపడి) యున్నప్పటికిని, చులుకగన్ = (రామ యను నామముఁ జిలుకలుగూడ) మిగులఁ దేలికగ, పలుకన్ = నోటనుచ్చరించుటకు, బలు = పెద్దదియగు, నాలుక= జిహ్వ, కలుగఁగన్ = లభించినప్పటికిని, అల్పులు = బుద్ధిహీనులు, మిన్నక= నిష్కారణముగ, నరకములను = నారకబాధలను, పొందెదరు = పడెదరు, అకటా = అయ్యయో.

తా. శ్రీరామచంద్రునియొక్క నామమహామంత్రము పుడమిలో సర్వజనములకు నతిసులభమగుచుఁ దనరుచున్నను, ఆ మంత్రరాజమును గడు సుకరముగ నుచ్చరించుటకు బెద్దరసన దమకు నున్నప్పటికిని తెలివి మాలిన హీనమానవు లూరకయ ఘోరనారక దారుణంపు బాధం బడియెదరయ్యయో. ౫౬

ఉ. ప్రాపుగ రామనామము ని
రంతరముఁ భజియించువారికిన్
బాపము లేదటంచుఁ బెనుఁ
బాముఁ బట్టఁగవచ్చు, నగ్నిసం
దీపిత లోహఖండము న
తిత్వరితంబుగ మ్రింగవచ్చు, బ
ల్లోకపముఁ బెంచు పెద్దపులి
కోఱలు దీయఁగవచ్చు, నియ్యాలన్. ౫౭

టీ. రామ నామమున్ = శ్రీరామునియొక్క నామమంత్రమును, నిరంతరమున్ = ఎడలేక, ప్రాపుగ = తమకు నన్నివిధముల నాధారభూతముగ, ఇయ్యిలన్ = ఈ భూలోకమునందు, భజియించు వారికిన్ = నమ్మి యుపాసనచేసెడునరులకు, ("ధాతుజవిశేషణానాం తచ్ఛబ్దోఽను ప్రయుజ్యతే క్త్వక్తౌ" క్రియాజన్యవిశేషణము లగు వండెడు, కొలిచిన, చూచుచున్న మొదలగువానికి, క్త్వక్తౌ-క్తి = విభక్తియొక్క, ఉక్తౌ = చెప్పఁదలఁచినపుడు, తచ్ఛబ్దః = ఆ యను తదర్థకసర్వనామపదము, అనుప్రయుజ్యతే - కలిపి పలుకఁబడును" అనుటచే భజియించు అను తద్ధర్మార్థకధాతుజన్యవిశేషణమునకు విభక్తి వివక్షింపఁబడినది గాన, వాఁడు అను తచ్ఛబ్ద మనుసరించి ప్రయోగింపఁబడినది. మఱియు "అగుర్వయాన్త స్వల్పాచ్కధాతో ర్వేంచావియుగ్భవేత్" అనఁగా గురువర్ణములు లేనివియు, యకారము గడపటలేనివియు, నొకటిరెం డచ్చులు గలవియు నగు ధాతువులకు నించు పరంబగునపుడు, ఇయ్ అను నాగమము వికల్పముగ నగుననుటచే నిచట భజ అను ధాతువునకు ఇంచు పరమగుచుండ - ఇయ్ - అనునది రాఁగా భజియించు అని తద్ధర్మవిశేషణరూపము నిష్పన్నమయినది), పాపము = అనేక కోటి జన్మాంతరకృత మగు దుష్కృతము, కేదు = నశించును, అటంచున్ = అని పలుకుచు, పెనుఁబాముసు = గొప్ప త్రాఁచుపామును, పట్టన్-వచ్చున్ = నిర్భయముగఁ జేకొనవచ్చును. మఱియు అగ్ని...ఖండమున్-అగ్ని = కొలిమినిప్పుచేత, సందీపిత = ఎఱ్ఱగఁ గాల్పఁబెట్టబడిన, లోహ-ఖండమున్ = ఉక్కుముక్కను, అతిత్వరితలబునక్ష్... కొలిమినుండి తీసినవెంటనే, క్రమింగన్ = దిగ్రమింగుటకు, ః వలనుపడును, బల్...కోఱలు - బలుకోపమున్ = ప్రబలమగు ంచు = ఏపుజేసెడు, పెద్దపులి = బెబ్బులియొక్క, కోఱలు ముందు నిడుపగు పళ్ళను, తియ్యన్-కన్-వచ్చున్ = చేతితోఁ ఊ టకు శక్యమగును.

తా. సకల విధములచేతను రామనామము మాకు నాధారభూత మయినదని నమ్మి ఎప్పుడును దానిని జపింపుచు నుండు మనుష్యులకు పాపము లేదని ప్రమాణముగ చేతితో నల్లత్రాఁచుపామును బట్టుకొనవచ్చును, మఱియు నగ్గిలో నెఱ్ఱఁగఁ గరఁగఁబెట్టిన యినుపముద్దను గుటుక్కుమని నోట మ్రింగవచ్చును, గట్టిగ కోపించియున్న పెద్దపులి కోఱలను బెకలింప వచ్చును. ౫౭

క. ఏపాపమునైనఁ దగం
బాపఁగలదు రామనామభజనపరునకుం
బాపము గల దని పలుకు మ
హాపాతకి యఘము నడఁపఁ నది యోప దిలన్. ౫౮

టీ. అది = ఆ శ్రీరామనామమంత్రము, ఏపాపమున్ - ఐనన్ = ఎంతటి ఘోరకలుషమునైనను, తగన్ = నిశ్శేషముగా, పాపన్ = తొలంగించుటకు, కలదు = శక్తిగలది యగునుగాని, రామ...పరునకున్ - రామ = శ్రీరామభద్రునియొక్క, నామ = నామమంత్రముయొక్క, భజన = ఉపాసించుటయందు, పరునకున్ = తాత్పర్యముగల మనుష్యునకు, పాపము = దురితము, కలదు = పోకయుండును, అని = ఇట్లు, పలుకు = చెప్పెడు, మహాపాతకి = అతిపాపాత్మునియొక్క, అఘమున్ = పాపమును మాత్రము, అడఁపన్ = పోఁగొట్టుటకు, ఓపదు = శక్తికలది కాదు.

తా. ఎట్టి మహాపాతకములనైనను శ్రీ రామమంత్రము నశింపఁజేయఁ గలదుగాని "రామమంత్రమును జపము గావించునంతమాత్రముచే పాపాత్ముని పాపములు పోవుట కల్ల" అని పలుకుచు నాస్తికుఁడగు మహాపాపాత్ముని పాపమును మాత్రము నశింపఁజేయఁజాలదు.

అవ. ఇట్లు శ్రీరామమంత్రమహత్త్వమును జెప్పి యిఁక నామంత్రోపాసనమునకు నధికారులను బ్రతిపాదింపుచున్నాఁడు.

సీ. ద్విజవరేణ్యులకును § విప్రోత్తములకు యో
గీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకు నే
కాంతవాసులకు వేదాంతులకునుఁ
జండాల పుల్కస § శ్వపచ కంక కిరాత
శబర హూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యా సురాపాన హేమ స్తేయ
గురువధూసంగమ § కర జనులకు

తే-గీ. సుందరీక్షత్రియోరవ్యశూద్రులకును
మఱియు నానావిధానేకమానవులకుఁ
బరమపావన మై శుభప్రదము నైన
రామనామంబ శరణంబు § రాజవదన. ౫౯

టీ. ద్విజ = "జన్మనా జాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః" అనుటచే జన్మకర్మలనెడి రెండుపుట్టువులుగల బ్రహ్మక్షత్రియవైశ్యు లను త్రైవర్ణికులలో, వరేణ్యులకున్ = మిక్కిలియోగ్యులయినవారికిని, విప్ర ఉత్తములకున్ = "వేదవాదరతా విప్రా" అనుటవలన వేదవేదాంగ పారంగతులగు బ్రాహ్మణులలో ముఖ్యులకును, యోగి + ఈశ్వరులకును = యమనియమాద్యష్టాంగయోగసిద్ధి గలవారలలోఁ బ్రధానులకును యతీశ్వరు లకును "పంచవింశతితత్త్వ యత్రకుత్రాజ్ఞో శ్రమేవసేత్" అనుటచేఁ బ్రధానాదులగు నిరువదియైదు తత్త్వముల వివేచనముం దెలిసిన సంయమి శ్రేష్ఠులకును, భక్తి...విశిష్టులకును- భక్తి = భగవద్భక్తియొక్కయు, వైరాగ్య = సమస్తవిషయోపభోగములయందలి విరక్తియొక్కయు, సంపత్ =

ఐశ్వర్యముతో, విశిష్టులకున్ = కూడుకొని యున్నవారలకును, ఏకాంత వాసులకున్ = వివిక్తప్రదేశములయందు నివసించువారికిని, వేదాంతులకును = ఉపనిషద్రహస్యముల నెఱింగిన జ్ఞానులకును, చండాల...సంగతులకున్-చండాల, పుల్కస, శ్వపచ, కంక కిరాత శబర హూణ = మాలలు, బోయలు బాసంగులు, కోదులు, ఎఱుకలు, చెంచులు, హూణులు లోనుగాఁగల నీచజాతులయొక్క, అంగనా = పడఁతుకలతో, సంగతులకున్ = సంభోగించువారికిని, బ్రహ్మహత్యా...నరులకున్ - బ్రహ్మహత్యా=బ్రహ్మజ్ఞానిని జంపుటను, సురాపాన = మద్యమును ద్రోలుటను, హేమ+స్తేయ = బంగారు దొంగిలుటను, గురువధూ = గురుపత్నితో, సంగమ = కూడుటను, కర నరులకున్ = కావించెడు జనులకును, సుందరీ...శూద్రులకును - సుందరీ = రమణులకును, క్షత్రియ = రాచవారికిని, ఊరవ్య = వైరాజ్ఞపురుషుని తొడలవలనఁ బుట్టినకోమటులకును, శూద్రులకును=నాలవజాతివారలకును, మఱియున్ = ఇంకను, నానావిధ = పలుతెఱంగులంగల, అనేక = పెక్కండ్రగు, మానవులకున్ = మనుష్యులకును, పరమ పావనము-ఐ = అత్యంతమును బరిశుద్ధిని జేయునదియు, శుభప్రదమున్ = మేలుల నిచ్చునదియు, ఐన = అగునట్టి, రామనామంబు = శ్రీరామమహామంత్రము, శరణంబు = ఆధారభూత మగుటచే నాశ్రయించి యుపాసింపఁదగినదని యర్థము.

తా. నిండుచందురుంబోలు మోము గల యోసుందరీ! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను త్రైవర్ణికులలో నుత్తములును, బ్రాహ్మణులలో వేద వాదరతులగు యోగ్యులును, పాతంజలమతాభిమాను లగు యోగివర్యులును, సాంఖ్యదర్శన నిరతులగు యతీంద్రులును, మొదలగు మధ్యమాధికారులకును భగవద్భక్తియొక్కయు, సకల విషయభోగ విరక్తియొక్కయు, సంపత్తితోఁ గూడుకొనినవారును బుణ్యారణ్యములు మొదలగు వివిక్త ప్రదేశములయందు నివసించియుండువారును, మఱియు నౌపనిషద మతావలంబ

నులును, మొదలగు నుత్తమాధికారులకును, మఱియుఁ బశుపధోపజీవులగు చండాలురు, తెఱవాట్లుగొట్టి జీవించెడు పుల్కసులు, కుక్కలను జంపి జీవించెడు శ్వపచులు, పక్షులం దిని జీవించెడు కంకులు, జింకలు మొదలగువానిం దిని జీవించు కిరాతులు, బోయలు, హూణులు మొదలగు నీచజాతులయొక్క వనితలతో సంగమించువారును, బ్రహ్మహత్యను మద్యపానమును స్వర్ణాపహారమును గురుతల్పగమనమును జేయువారునగు నధమాధికారులకును, వనితలు, సాధారణులగు క్షత్రియులు, వైశ్యులు, మఱియు శూద్రులు, మొదలగు బలుతెఱంగులుగల మందాధికారులకును, మిగుల పవిత్రకరమైనదియు, మంగళప్రద మైనదియు నగు శ్రీరామనామ మంత్రమే దిక్కుగాన, దాని నెల్లరు నిరతమును స్మరింపుచుండునది. ౫౯

అ. ఇట్లెల్లరకు నతిసులభముగ నుపాసింపఁబడి సకలాభీష్టప్రదమగు శ్రీరామమంత్ర మున్నను, మూర్ఖులు దానిం దెలియఁజాల రని చెప్పుచున్నాఁడు.

చ. కనదురురామనామమునకుంటె ఘనం బగుపాపనాశసా
ధనము, నిరంతరేష్టఫలదాయక మైన విశేషకారణం
బును,మఱిలేదులోకమునమూఢులెఱుంగరుదానినాశ్రయిం
చిన సకలార్థసంపదలు చేకుఱు సిద్ధము శైలనందనా. ౬౦

టీ. కనత్...కంటెన్ - కనత్ = సర్వలోకప్రసిద్ధమై విలసిల్లుచున్నదియు, ఉరు = సర్వోత్కృష్ట మైనదియునగు, రామనామము కంటెన్ = శ్రీరామభద్రునియొక్క నామ మహామంత్రమునకన్న, ఘనంబు = గొప్పది, అగు = అయినట్టి, పాపనాశ సాధనము = సకల దురితముల యొక్క వినాశమునకు నుపాయమును, నిరంతర...కారణంబును-నిరన్తర= అనవరతమును, ఇష్ట = కోరికలయొక్క, ఫల = లాభములకు, దాయక = ఒసఁగునది, ఐన = అగునట్టి, విశేష కారణంబును = వేఱొక హేతు

వును, లోకమునన్ - ప్రపంచమునందు, మఱి - లేదు = ఇంకొకటుండదు, దానిన్ = ఆ రామమన్త్రమును,ఆశ్రయించినన్ = ఉపాసించినయెడ, సకల అర్థ సంపదలు = సమస్తములైన కార్యములయొక్క సంసిద్ధులను, చేకుఱున్ = సంప్రాప్తించును, సిద్ధము = ఇది యథార్థము, (అవి) మూఢులు = మూర్ఖజనులు, ఎఱుంగరు = తెలిసికొనలేరు. ఈ పద్యమునందు మూఁడవచరణమునందున్న 'కారణంబును' అను పదమునందు మువర్ణకమునకు నాదేశ మగు బిందుపూర్వక బువర్ణంబు స్థానివంటిది గాన మూఢు లను పదమునందున్న ముకారముతో మిశ్రమగుచున్నది. దీనికి నాదేశవిరతి యని పేరు. ఇచట మువిభక్తియతిగాని ముకారయతిగాని కాదు. లేక, "మువర్ణకస్య ద్విత్వంవా బువర్ణో బిందుపూర్వకః" అనుటచేత కారణమ్ము అని మువర్ణమునకు ద్విత్వమును జేసిన నేచర్చయుఁ గలుగదు.

తా. ఓ పార్వతీ! నిఖిలమంత్రములలో శ్రేష్ఠమై సుప్రసిద్ధమైన శ్రీరామమంత్రముకంటె వేఱొకటిసకలపాపములను నశింపఁజేయఁదగిన సాధనమును, సకలాభీష్టములనొసఁగఁదగినగొప్ప హేతువును ప్రపంచములో లేదనియు ఆ మహామంత్రమును జపించినయెడల సర్వకార్యములు తప్పక సిద్ధించుననియు మూర్ఖు లగువార లెఱుంగఁజాలరు. ౬౦

తే-గీ. అబల! శ్రీరామరామరామాఖ్యమంత్ర
మీప్సితంబుల నర్థుల కిచ్చుచుండఁ
గాంచు నెఱి సిగ్గుపడుచుండుఁ గల్పతరువు
కామధేనువు నలఘుచింతామణియును. ౬౧

టీ. అబల=ఓకాంతామణీ "స్త్రీయోషిదబలాయోషా" అని యమరము - శ్రీ... మంత్రము - శ్రీరామరామరామ = మోక్షలక్ష్మీప్రద మగు రామరామరామ యనెడు, ఆఖ్య = పేరుగల, మంత్రము = రామమడక్షర

రూప మహామంత్రము (మొదట శ్రీరామ రామరామ యనుచు రమియింత వని యుపక్రమించుటచే నిచట శ్రీరామరామరామాఖ్యమంత్ర మను పాఠ మే యుక్తము) ఈప్సితంబులన్ = అభీష్టము లగు చతుర్విధ పురుషార్థము లను, అర్థులకున్ = కోరువారికి, ఇచ్చుచున్ ఉండన్ = కలుగఁజేయుచు నుండఁగా, కాంచి = పరికించి, కల్పతరువు = కల్పవృక్షము, కామ ధేనువు = దేవతల మొదవును, అలఘు - చింతామణియును = ఘనమగు వేల్పుమానికమును, సిగ్గుపడుచున్ - ఉండున్ = (మ్రానునగు నా కిట్టి యౌదార్యమెక్కడిదని కల్పవృక్షమును, పశువునగు నా కింతఘనత లేదని కామధేనువును, రాయినగు నా కీపాటియోగ్యత యుండదని చింతామణి యును లజ్జపడుచునుండును. రామమంత్రమహత్త్వమును జూచి కల్ప వృక్షము మొదలగునవి లజ్జపడుచున్నట్లుత్ప్రేక్షించెను గాన నిందు నుత్ప్రేక్షాలంకారము.

తా. ఓ వనితామణి! శ్రీరామరామరామ అను పేరుగల మంత్రము యాచకులకు నభీష్టములనెల్ల నొసఁగుచుండుటను జూచి కల్పవృక్షము, కామధేనువు చింతామణియును మా కిట్టి యౌదార్యము లేదుగా యని లజ్జించుచుండును. ౬౧

అవ. "ఈప్సితంబుల నర్థుల కిచ్చుచుండు" నను నర్థ మునే వివరించి చెప్పుచున్నాఁడు.

సీ. ధర్మార్థులకు సర్వధర్మంబు లొనఁగూర్చు
  నర్థార్థులకుఁ జేయు నర్థములను
గామార్థులకు నెల్ల కామంబుల నొసంగు
  నాత్మజార్థుల కిచ్చు నాత్మజులను
శ్రీ ధృతి స్మృతి యశ శ్శ్రేయ స్సుఖ క్షమా
  విద్యార్థులకు వాని వెలయ నిచ్చు

ఛత్రచామరగజాశ్వప్రభుత్వార్థుల
కవియు సంపాదించు నననరతముఁ

తే-గీ. జంద్రసూర్యాలయంబుల స్వర్గలోక
సత్యవైకుంఠకైలాస సదనములను
గోరువారల కవియుఁ జేకూరఁ జేయుఁ
రామనామంబు విలసిల్లి రాజవదన. ౬౨

టీ. రాజవదన - రాజ = చంద్రునింబోలు, వదన = ముఖముగల యో ప్రియురాలా ! రామనామంబు = శ్రీరాముని నామమంత్రము, విలసిల్లి = అంతటను వ్యాపించి, ధర్మ = జ్యోతిష్టోమాది ధర్మకార్యముల ఫలమును, అర్థులకున్ = కాంక్షించు జనులకు, సర్వధర్మంబులు = ఆయా ధర్మఫలములనెల్ల, ఒనగూర్చున్ = లభింపఁజేయును, అర్థ అర్థులకున్ = ధనరూపమగు తృతీయపురుషార్థము నభిలషించువారికి, అర్థములన్ = పశు దాసీదాస గృహక్షేత్రారామాద్యర్థములను, చేయున్ = సమకూరఁజేయును, కామ - అర్థులకున్ = స్రక్చందనాది విషయభోగముల నపేక్షించువారలకు, ఎల్ల కామంబులన్ = అఖిల వైషయిక భోగములను, ఒసంగున్ = ఇడును ("వృత్త్యేద్రుతస్య లోపస్స్యాత్" అనుటచే సమాసమునందు ద్రుతప్రకృతికమగు నెల్లశబ్దముయొక్క నకారమునకు లోపము గాని, యిచట సరళాదేశాదిద్రుతప్రయుక్తమగు కార్యము లేదు) ఆత్మజ + అర్థులకున్ = కొమరులను బడయఁ గోరువారలకు, ఆత్మజులన్ = కొడుకులను, ఇచ్చున్ = ఇడును, శ్రీ...అర్థులకున్ - శ్రీ = సిరిని, ధృతి = ధారణశక్తిని, స్మృతి = జ్ఞాపకశక్తిని, యశః = యశస్సును, శ్రేయః "న అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే ఉభేనానార్థే పురుషగ్ంసినీతః" అను మొదలగు శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడిన) పరమపురుషార్థమును, సుఖ = సౌఖ్యమును, క్షమా "సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వ

కం । చిన్తావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే'' అను లక్షణము గల తితిక్షను, విద్యా "విద్యాఽభీప్సినం నచికేతసమన్యే నత్వా కామా బహవో లోలుపంత'' అను శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడిన సర్వకామనారహితం బగు శ్రేయోవిషయక జ్ఞానమును, అర్థులకుఁ = కోరెడు జనులకు, వానిఁ = ఆసిరి మొదలగువానినెల్ల, వెలయఁ=సమగ్రముగ, ఇచ్చుఁ = ఒడఁగూర్చును, ఛత్ర = శ్వేతచ్ఛత్రము, చామర = చమరవాలపు వీవనను, గజ = భద్రదంతావళములను, అశ్వ = తురంగములను, అను మొదలగు మహారాజలాంఛనములతోఁ గూడిన, ప్రభుత్వ = సామ్రాజ్యాధి పత్యమును, అర్థులకుఁ = యాచించువారికి, అదియుఁ = దానిని (ఆ ప్రభుత్వమును), సంపాదించుఁ = సమకూర్చును, చంద్ర - సూర్య - ఆలయంబులఁ = ధూమాదిమార్గమునఁ బొందఁదగిన చంద్రలోకమును, అర్చిరాదిమార్గమునఁ బడయఁదగిన సూర్యలోకమును, స్వర్గ...సదనములను - స్వర్గలోక = ఇంద్రలోకమును, సత్య = సత్యలోకమును, వైకుంఠ= వైకుంఠనగరమును, కైలాస = శంకరస్థానమును, కోరువారలకుఁ = ఆకాంక్షించెడు నరులకు, అవియుఁ = ఆయా పదములను, చేకూరఁ చేయుఁ = దొరకునట్లు గావించును.

తా. చందురుంబోలు మోముగల యో ప్రేయసీ! శ్రీరామభద్రుని నామమంత్రము, ధర్మార్థకామము లను త్రివర్గము నపేక్షించు జనులకు నా త్రివర్గమును సంతానము గలుగవలె ననువారికి సంతతిని, సిరియు, ధైర్యము, జ్ఞప్తి, యశము, మేలు, సౌఖ్యము, కీర్తి, చదువు, అనునివి కావలయు ననువారికి నా సిరి మొదలగువానిని, ఛత్రము, వింజామరలు, ఏనుఁగులు, గుఱ్ఱములు, చతురంతయానములు మొదలగు రాజచిహ్నములతోఁ గూడిన సామ్రాజ్యమును గోరువారికి దానిని, చంద్రలోకము - సూర్యలోకము - స్వర్గలోకము - సత్యలోకము - వైకుంఠము - కైలాసము -

మొదలగు మహాపదవులను నాకాంక్షించువారికి నాయా పదవులనుఁ దప్పక యొసంగును. ౬౨

ధూమాదిమార్గనిరూపణము.

"అథయ ఇమేగ్రామా ఇష్టాపూర్తేదత్తమిత్యుపాసతే తేధూమమభిసంభవంతి ధూమాద్రాత్రిగ్ం రాత్రే రపరపక్ష మపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతి మాసాగ్స్తాన్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి। మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా చ్చంద్రమసమేష సోమోరాజా తద్దేవానా మన్నం తం దేవాభక్షయంతి॥" యే ఇమేగ్రామాః = ఏయీగృహస్థులు, ఇష్టాపూర్తే-ఇష్ట = అగ్నిహోత్రాదికర్మను, పూర్త = చెఱువులు కోనేరులు బావులు త్రవ్వించుట - తోఁటలువేయుట మొదలగు సత్కార్యములను, దత్తం - పూజ్యులకొఱకు ధనమును బంచిపెట్టుటను, ఇతి = అట్టి - అతిథిపూజనము దీనరక్షణము మొదలగు ధర్మకార్యములను, ఉపాసతే = ఆచరించెదరో, తే = వారు, ధూమం = ధూమాభిమానియగు దేవతను, అభిసంభవంతి = పొందెదరు. పిమ్మట వా రాధూమాధిదేవతచేత వహింపఁబడినవారై యాపొగనుండి, రాత్రిం=రాత్ర్యధిదేవతను, రాత్రేః= నిశాధిదేవతనుండి, అపరపక్షం = కృష్ణపక్షాధిదేవతను, అపరపక్షాత్ = ఆ కృష్ణపక్షాభిమాన దేవతనుండి, యాన్ షట్-దక్షిణా-ఏతి మాసాన్ = సూర్యుఁడు దక్షిణపుదిశను-ఏ యాఱునెలలఁ బొందునో, తాన్-ఆ దక్షిణాయన మాసాభిమానిదేవతను - ఆకర్మఠులు పొందుదురు. కాని, సంవత్సరం=సంవత్సరాభిమానిదేవతను, ఏతే = ఈ కర్మఠులు, నప్రాప్నువంతి = పొందరు. జ్ఞానులు సంవత్సరాధిదేవతను బొందెదరు కాని కేవలకర్మఠులు పొందరని శ్రుతి నిషేధించినది. మాసేభ్యః = దక్షిణాయనమాసాధిదేవతలనుండి, పితృలోకః = పితృదేవలోకమును, పితృలోకాత్ - ఆ పితృలోకమునుండి, ఆకాశం = ఆకాశమును, ఆకాశాత్ = ఆకాశమునుండి, చంద్రమసం = చందురుని, పొందెదరు. ఏషసోమః = ఈకర్మఠులగు బ్రాహ్మ

ణులచేఁ బొందఁబడు చంద్రుఁడు, రాజా = ఆ బ్రాహ్మణులకు రాజున్న, దేవానాం అన్నం = దేవతలకు నన్నము నగుచున్నాఁడు గాన, తం = ఆ చంద్రుని, దేవాః = వేల్పులు, భక్షయంతి = భుజింపుచున్నారు, కావున కర్మఠులు పైని జెప్పినపగిదిని ధూమాదిమార్గమునఁ బోయి చంద్రరూపులై యింద్రాది దేవతలచేత భక్షింపఁబడుదురు. ఇట్లు వేల్పులచే భ్రమింగఁబడి రేని యజ్ఞాదిధర్మకార్యములను జేయుటచేఁ గీడుమూఁడుననినఁగాదు. అన్న శబ్ద మపకరణమాత్రమునందు వివక్షింపఁబడుటచేత స్త్రీ పశు సేవకాదుల వడువున దేవతలకుఁ బనిపాటులయందు నుపచరించుచునుందురని తాత్పర్యము. "స్త్రియోఽన్నం పశవోఽన్నం విశోఽన్నం రాజ్ఞాం" అను మొదలగుపట్ల అన్నశబ్ద మపకరణ మాత్రమునందుఁ జూపట్టుచున్నది. ఇట్లు కర్మానుష్ఠాతృకృతులు వేల్పులకు మిత్రులగుచు వారితోఁపాటు సుఖులై క్రీడింపుచుందురు. ఇట్లు సురలతో సుఖముగ విహరించుటకుఁ దగిన శరీరము కర్మఠులకుఁ జంద్రమండలమునందు నుదకమయమగునది యారంభింపఁబడును అను మొదలగు విశేషములు ఛాందోగ్యమునందు సావకాశముగఁ బ్రతిపాదింపఁబడినవి.

ఇఁక సూర్యలోకప్రాపకమగు నర్చిరాది మార్గపువివరణం బెట్లనిన—"తద్య ఇత్థం విదుర్యే చే మేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేఽర్చిష మభిసంభవ న్త్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణ పక్ష మాపూర్యమాణ పక్షా ద్యాన్ షడుదఙ్జేతిమాసాగ్ స్తాన్। మాసేభ్యస్సంవత్సరగ్ం సంవత్సరా దాదిత్య మాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవ స్స ఏనాన్బ్రహ్మ గమయత్యేష దేవయానః పంథా ఇతి" ఆరణ్యకులగునే వైఖానసులు పరివ్రాజకులును శ్రద్ధాతపస్సులు మొదలగువాని నాచరించెదరో వారు అర్చిరభిమాని దేవతను, దినాభిమాని దేవతను, శుక్లపక్షాధిదేవతను, సంవత్సరాధిదేవతను, సూర్యుని చంద్రుని విద్యుదధిదేవతనుఁ గ్రమముగ నొకదానినుండి యొకదానినిం బొందుదురు. పిదప విద్యుద్గతు

లయి యున్న ఆయుపాసకులను బ్రహ్మలోకమునుండి యొకదివ్యపురుషుఁడు వచ్చి యాసత్యలోకమునం దున్న బ్రహ్మదేవునిగూర్చి తీసుకొనిపోవును. పిమ్మట నా యుపాసకులు బ్రహ్మతోఁగూడ ముక్తులగుదురు గాని, మరల జననమరణరూపమగు నీసంసారచక్రమునం బడి తిరుగరు. ఈయర్చిరాది మార్గము దేవయానమనియు బ్రహ్మపథమనియు ననఁబడును. "బ్రహ్మగమయతి" అనుపట్ల కార్యబ్రహ్మగాని ముఖ్యబ్రహ్మ కాదు. పొందుట, పొందఁదగినది, పొందించువాఁడు ననునవి కేవల సన్మాత్రబ్రహ్మప్రాప్తియందు నుపపన్నములు కావు గాన, కార్యబ్రహ్మ యని చెప్పక వలనుపడదు.

దేవయాన పితృయానము లనఁబడు నీ రెండుమార్గములలోఁ బితృయానమగు ధూమాదిమార్గమునఁ బోవు కర్మఠులకుఁ బుణ్యక్షయము కాఁగా వెంటనే మరల నీసంసారము గలదు. దేవయాన మనఁబడు నర్చిరాదిమార్గమునఁ బోవువారు బ్రహ్మతోఁగూడ ముక్తి నొందుదురు - అను మొదలగు విశేషములను ముందు నాయా ఘట్టములయందు సవిశేషముగఁ బ్రతిపాదింపఁగలము.

## ప్రేయశ్శ్రేయోనిరూపణము.

ఈపద్యమునందలి "శ్రీధృతిస్మృతియశశ్శ్రేయస్సుఖక్షమా విద్యార్థులకు" ననుపదమును శ్రీ ధృతి స్మృతియశః - అనియు, శ్రేయస్సుఖక్షమావిద్యా - అనియు రెండు భాగములుగఁ జేసి, అందు మొదటిభాగమునకు, శ్రీ = ప్రేయస్సంబంధమగు సంపద, ధృతి = ధైర్యము, స్మృతి = జ్ఞానశక్తి, యశః = కీర్తియు ననియు, రెండవభాగమునకు, శ్రేయః = ముక్తిరూపశ్రేయస్సంబంధ మగు, సుఖ = ఆనందము, క్షమా = శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుత్వము, విద్యా = జ్ఞానము అనియు నర్థము.

ప్రేయశ్శ్రేయస్సు లను రెండిటిని, అర్థులకున్ = అపేక్షించువారికి, = ఆప్రేయశ్శ్రేయస్సులను రెంటిని, వెలయన్ = తగునట్లు, = ఒసఁగును అని యర్థముఁ జెప్పునపుడు ప్రేయశ్శ్రేయస్సుల

స్వరూపమును దెలిసికొనవలసి యుండునుగాన నది యె ట్లనిన, పూర్వము వాజశ్రవసుం డను ఋషి యొకఁడు గలదు. అతనికి నచికేతసుం డనునొక పుత్త్రుఁడు గలఁడు. వాజశ్రవుఁడు, సర్వవేదస మనునొకక్రతువును జేయుచు నందుఁ బెక్కులు గోవులను బ్రాహ్మణులకు నిచ్చుచుండఁగాఁ జూచి నచికేతసుఁడు తనలో నిట్లనుకొనెను. నీళ్లుత్రావి గడ్డితిని పాలిచ్చుచు జ్ఞానహీనము లగు నీపశువులను దానముఁజేయువాఁ డజ్ఞానలోకములకే పోవునను కొని తండ్రికడ కేఁగి, తండ్రీ నన్నుఁగూడ నెవనికేని నిమ్ము-అని పలుకఁగాఁ దండ్రి యందులకు బదులు సెప్పకయుండె. నచికేతసుఁడు మరల న న్నెవనికిచ్చెదవని రెండుమూఁడుసారు లడుగఁగా వాజశ్రవసుఁడు. కోపించి నిన్ను మృత్యువున కిచ్చితినని పలికెను. అప్పుడు నచికేతసుఁడు వైవస్వతుఁడు లేనపు డతనియింటికిఁ బోయి మూఁడురాత్రులు భోజనములేక యుండెను. పిమ్మట యముఁడు వచ్చి నాయింట నిరాహారుఁడ వై మూఁడురాత్రు లుంటివిగాన మూఁడువరములను గోరు మిచ్చెద ననఁగా మాతండ్రి కోపము మాని నీచే విడువఁబడి తనకడకు వెళ్లిన నాయెడఁ బ్రసన్నుఁ డై నన్నుఁ దనపుత్రునిగా గు ర్తెఱుంగున ట్లొకవరము నిమ్ము అనియు, స్వర్గలోకప్రాప్తికి సాధన మగునగ్ని స్వరూపమును రెండవవరముచే నుపదేశింపు మనియు, చచ్చినవాని విషయమై దేహేంద్రియాదులకు విలక్షణమై యాత్మ కలదని కొందఱు, లేదని కొందఱును జెప్పుచున్నారు గాన దీనియాథార్థ్యమును మూఁడవవరముచేఁ దెలుపుము అనియు, నచికేతసుఁడు గోరఁగా యముఁడు మొదటి రెండువరములు నీకోరినయట్లు యిచ్చితిని గాని మూఁడవవరమునకు బదులుగ మఱిదేని నేనిఁ గోరు మిచ్చెద ననఁగా నాకు నింతకన్న వేఱే కోరఁదగిన దేదియును లే దనఁగా నానచికేతసుని యతులవైరాగ్యమునకు నంతసించి వైవస్వతుఁడు అధ్యారోపాపవాదన్యాయమున బ్రహ్మతత్త్వ మునుపదేశించునపుడు "శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌ సంపరీత్య వివిన క్తిధీరః। శ్రేయోహి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మం దోయోగక్షేమాద్వృణీతే॥

యోగక్షేమాద్వృణీతే " శ్రేయము ప్రేయము అను భిన్నఫలము లగు నీ రెండును బురుషు ననుబంధించి యుండును; అందు శ్రేయమును గోరు వానికి స్థిరమగు మేలు గలుగును. ప్రేయము నపేక్షించు వానికిఁ బరమపురుషార్థము దొరకదు. ఈ శ్రేయః ప్రేయములు రెండును బురుషునకు నాచరించుటకు స్వాధీనములే యైనను మూఢుఁడు వీని నవలంబించుటవలనఁ గలిగిన లాభనష్టములను దెలిసికొనఁజాలక యవివేకముచే నాపాతమధురముగఁ దోపట్టు గృహక్షేత్రారామ పశుపుత్రమిత్రకళత్రాదిరూపం బై వినశ్వరం బగు ప్రేయముఁ యపేక్షించును. ధీరుఁడన్ననో క్షీరనీరములను విభాగించు హంసముపగిది నా శ్రేయః ప్రేయములకుం గల గురులఘుత్వములను సదసద్వివేచనాసమర్థం బగు తనమనంబున బాగుగఁ బరిశీలించి ప్రేయముకంటె మోక్షరూపం బగు శ్రేయమే గొప్పది యని తెలిసికొని యా శ్రేయమునే కోరును. ఇట్లు జ్ఞాన్యజ్ఞానివాంఛితంబు లగు శ్రేయః ప్రేయములను రెండిటినిఁగూడ శ్రీరామమంత్ర మొసంగు నని ఫలితార్థము. ఇచటఁ జేయఁదగిన విచారణ విశేషముగ నున్నను ముందు విశేషించి చెప్పఁదలఁచి యింతటితో విరమించుచున్నారము.

వ. అదియునుం గాక. ౬౯

టీ. ఇంతియకాకుండ "ద్రుతోపరి ద్రుతో౽పి స్యాత్" అనుటచే "అదియును+ను" అని సముచ్చయార్థంబగు నుశబ్దముపై నువర్ణము.

సీ. నిఖిలరోగంబుల ✱ నిర్మూలముగఁ జేయు
భవభయంబు నెల్లఁ ✱ బాఱఁదోలుఁ
బంధనంబులఁ బటాపంచలు గావించు
నోలయు నాపదలను ✱ నులిమివైచు
శాత్రవవిజయంబు ✱ సతతంబు సమకూర్చుఁ
దూలించు బహువిధ✱దుఃఖములను

దలఁ జూపకుండ దుర్దశలను దొలఁగించు
సకలశుభంబుల సంగ్రహించుఁ
తే-గీ. బరమపావనమంగళప్రదము గానఁ
గలితధర్మార్థకామమోక్షములలోన
నెసఁగుభక్తుల కొసఁగని దెద్ది లేదు
ఏమి చెప్పుదు శ్రీరామనామమహిమ. ౬౮

టీ. రామనామంబు, నిఖిలరోగంబులన్ = మానసికములు శారీరకములు నగుతెగుళ్లనెల్ల, నిర్మూలముగన్ - చేయున్ = నిశ్శేషముగఁ బోఁగొట్టును. భవభయంబులన్ - ఎల్లన్ = కాఁపురమునఁ గలిగెడు నడలుల నన్నిటిని, పాఱన్ - తోలున్ = పరుగిడునట్లు నెట్టును. బంధనంబులన్ = పుత్రమిత్రకళత్రాదులయందుఁ గల మోహపుఁగట్లను, పటాపంచలు = ఎక్కడి కక్కడఁ దెగి విడునట్లు, కావించున్ = ఒనరించును. ఒలయు = కలిగెడు, ఆపదలను = ఇడుములను, నులిమి = నలిపి, వైచున్ = విసరును. శాత్రవ = బాహ్యు లగు వ్యావహారికశత్రువుల యొక్కయు, ఆభ్యంతరము లగు కామక్రోధాదు లనియెడు పగతుర యొక్కయు, విజయంబుల్ = గెలుపును, సతతంబుల్ = అనారతమును, సమకూర్చుల్ = కలుగఁజేయును, బహువిధ = పలుతెఱంగులగు "అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః" అను మొదలగు పాతంజలదర్శనమునఁ బ్రతిపాదింపఁబడిన, దుఃఖములను = క్లేశములను, తూలించుల్ = ఎగురఁగొట్టును, దుర్దశలను = దురవస్థలను, తలచూపకుండల్ = మొగమెత్తలేక యుండునట్లు, తొలఁగించుల్ = చెదరఁజేయును; సకల-శుభంబులల్ = ("తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" అను భగవద్వాక్యమును బట్టి) సమస్తయోగక్షేమములను, సంగ్రహించుల్ = సమకూర్చును. (మఱియు నిట్లు ఆ రామనామము) పరమ...ప్రదము - పరమ =

అత్యంతమును, పావన = పవిత్రముఁజేయునదియు, మంగళ=కల్యాణములను, ప్రదము=ఒసఁగునదియును, కానన్ =కావున, ఎసఁగు భక్తులకున్ = నిత్యాభియుక్తులగు స్వాశ్రితులకు, కలిత...లోనన్-కలిత = శ్రేష్ఠములగు, ధర్మ - అర్థ - కామ - మోక్షములలోనన్ = ధర్మము - అర్థము-కామము-మోక్షము అను చతుర్విధ పురుషార్థములలోను, ఒసఁగనిది = ఇడరానిది, ఎద్ది = ఎదియును, లేదు = ఉండదు. శ్రీరామ - నామ - మహిమన్ = శ్రీరామచంద్రుని సంబంధ మగు నామమంత్రముయొక్క మాహాత్మ్యమును, ఏమి చెప్పుదున్ = ఏమని వర్ణింపఁగలను? కొనియాడ నలవికా దనుట.

తా. శ్రీరామమంత్రము - జబ్బులనెల్ల మొదలంటఁ బోఁగొట్టును, గాఁపురపునడఁకల నన్నిటిని దప్పగ గెంటును. పుత్రమిత్రకళత్రాదులందుఁ గల మోహానుబంధములను దెగఁగోయును. సంభవించెడు నిడుమలను నలిపి విసరును. బాహ్యశత్రువులను, కామక్రోధాద్యరిషడ్వర్గమును, గెలుచుటను నిరంతరము నిచ్చును. పలుదెఱంగులం గల దుఃఖములను దూలఁదోలును. దురవస్థలనెల్లఁ బొడసూపకుండునట్లు చేయును. సమస్తమంగళముల నొడఁగూర్చును. మిగులఁ బవిత్రమైనదియు మేలుల నొసఁగునదియుఁ గావున నుపాసించు మహాభక్తులకు ధర్మార్థకామమోక్షము లనియెడు చతుర్విధ పురుషార్థములలో దేనిం గోరిన దానిఁ దప్పక యిచ్చును. కావున నో పరమసాధ్వీ! శ్రీరామచంద్రునియొక్క నామమంత్రమహత్త్వము నేమని వర్ణింపఁగలను? ౬౪

రోగనిరూపణము.

"మానసా దైహికారోగా ద్వివిధాః పరికీర్తితాః । మానసాః పుత్రమిత్రాది వియోగాది భవామతాః॥ దైహికా క్షుత్పిపాసాద్యా జ్వరాద్యాః పరితాపినః" అనుటచే మానసికములనియు శారీరికములనియు రోగములు రెండువిధములు. అందుఁ గొడుకులు చెలికాండ్రు మొదలగువారివియోగము మొదలగువానివలన సంభవించునవి మానసికములు. ఆఁకలి దప్పి మొదలగునవియు, జ్వరము మొదలగునవియు శారీరికము లనఁబడును.

సంసారభయనిరూపణము.

"రోగాద్భీతి ర్మృతేర్భీతి ర్ద్వంద్వాద్భీతి శ్చ ప్రాదపి । చోరా త్సావ ద్ద్విషో ర్భీతి ర్భవో భయమయ స్సదా" అనుటచేత సంసారమునందు నెప్పు డేరోగములు గలుగునో యని రోగములవలనను తనవారికిఁగాని, తనకుఁగాని, ఎవరికి నెప్పుడు మరణము వచ్చునో యని చావువలనను, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములవలనను, రాజువలనను, దొంగలవలనను, కఱవు వలనను, పగతురవలనను, భయము గలదు గాన నిట్లు సంసారము పెక్కు భయములకు నునికిపట్టు.

మోహబంధనవివేచనము.

"అవిద్యా బంధనా నిస్యుః కామక్రోధాదయ స్తథా । దేహాదావభిమానశ్చ మమేదంచ ధనాదికం । అహం దుఃఖీ సుఖీ చేతి హృదయగ్రంథయశ్చమే" అనుటచేఁ గామము క్రోధము లోభము మొదలగునవియు, నా శరీరము నాయిల్లు నావాకిలి నాపొలము అను మొదలుగ దేహాదులయందు నాది యను నభిమానము, నేను సుఖవంతుఁడ, నేను దుఃఖిని-అను మొదలగు హృదయగ్రంథులు-మోహైకనిబంధనములగు నవిద్యాబంధనము లనఁబడును.

బాహ్యాభ్యంతరశత్రుస్వరూపము.

"స్వభావతో భవన్త్యేతే హింస్రో దుర్వృత్త ఏవచ । ఋణకారీ పితా శత్రు ర్మాతా స్త్రీవ్యభిచారిణీ॥ ఆత్మపితృభ్రాతరశ్చ తత్త్రిన్ని పుత్రాశ్చశత్రవః । స్నుషా శ్వశ్రూ స్సపత్నీచ ననందాయాతర స్తథా॥ మూర్ఖః పుత్రః కువైద్యశ్చారక్షకస్తు పతిః ప్రభుః । చండశ్చండా ప్రజాశత్రు రదాతా ధనికశ్చయః॥ దుష్టానాం నృపతి శ్శత్రుః కులటానాం పతివ్రతా । సాధుఃఖలానాం శత్రుస్స్యా న్మూర్ఖాణాం బోధకో రిపుః" అను మొదలగు శుక్రనీతిసారమునఁ బ్రతిపాదింపఁబడిన హింస్రుండు మొదలగువారలు బాహ్యశత్రువు లగుదురు. మఱియును, "కామః క్రోధశ్చ లోభశ్చ మదో

మాత్సర్యమేవచ । మోహశ్చేత్యాంతరాః ప్రోక్తా శ్శత్రవ షడ్విధా స్తథా" అనుటచేఁ గామము క్రోధము మొదలగునవి యాభ్యంతరశత్రువులు.

బహువిధదుఃఖములు.

"అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశాః క్లేశాః" అను పాతంజల సూత్రముచే నవిద్య అస్మిత రాగము ద్వేషము అభినివేశము అని తొలుత దుఃఖాత్మకములగు క్లేశము లయిదువిధములు. ఈయైదును సూక్ష్మములనియు, స్థూలములనియుఁ బ్రత్యేకముగ రెండువిధములు గావున పదిదెఱంగులం బరఁగు; నందు నవిద్యాక్లేశము పైనాలుగిటికిని మూలమైనది యని యా పాతంజలదర్శనమునందు నిట్లు చెప్పఁబడినది:—"అవిద్యాక్షేత్రము త్తరేషాం ప్రసుప్తతనూవిచ్ఛిన్నోదరాణాం" అనఁగా నాత్మ కానిదానియందు నాత్మ యనునభిమాన మవిద్య యగు నది యస్మితాదులగునాల్గిటికిని జన్మస్థానము. విపర్యయజ్ఞానరూపమగు నవిద్య లేనిచో నస్మితాదులు గలుగవు గాన వానికి నవిద్య మూలము. అస్మితారాగద్వేషాఽభినివేశములు నాల్గును బ్రత్యేకముగఁ బ్రసుప్తము తనువు విచ్ఛిన్నము ఉదారము అని నాల్గు విధములు. (1) ప్రసుప్తము లనఁగా:—బాల్యావస్థయందు బాలకునకుఁ గ్లేశములు వాసనా రూపమున నున్నను బ్రబోధకు సహకారి లేకపోవుటచే నభివ్యక్తములు కాకుండునట్లు చిత్తభూమియందుఁ గ్లేశములు ప్రబోధకము లేనపుడు దమ తమకార్యమును మొదలుపెట్టఁ జాలవు గానఁ బ్రసుప్తము లనఁబడును. (2) తనువులనఁగా:—తమతమకు విరోధులగు భావనలచేత శిథిలపఱుపఁబడి కార్యసంపాదనసామర్థ్యము లేనివి యై వాసనలుమాత్రము కొఱవడి యుండుటచేఁ జిత్తమునందుండి గొప్పదియగు సామగ్రిలేక కార్యములను నారంభించుటకు నసమర్థములయిన యాయస్మితాదులు తనువు లనఁబడును. (3) ఒండొకప్రబల మగు రాగాదిక్లేశముచేత నణఁచబడినశక్తి గలవియై యుండునవి విచ్ఛిన్నము లనఁబడును. ద్వేషావస్థయందు రాగమును రాగావస్థయందు ద్వేషమును గలుగకుండుట యిందుల కుదాహరణము. (4)

సహకారసాన్నిధ్యమును బడసి తమతమ పనులను నెఱవేర్చునవి యుదారము
లనఁబడును. ఇట్లు ప్రత్యేకముగ నాలుగువిధములగు నస్మితాదులకు మూ
భూతమయి యవిద్య యుండును. అవిద్య యన నేమి? "అనిత్యాశుచి
దుఃఖానాత్మనిత్యాశుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా" అను సూత్రము చేత,
పుడమి శాశ్వత మనియు, చందురుఁడు నక్షత్రములు మొదలగువానితోఁ
గూడిన యాకసము శాశ్వతమనియు, వేల్పులు చావులేనివారనియు మొద
లగు ననిత్యములగు కార్యములయందు నిత్యము లను నమ్మికయు, "స్థానా
ద్బీజాదుపష్టమ్భా న్నిష్యందా న్నిధనాదపి । కాయమే ధేయశౌచత్వా
త్పండితా హ్యశుచింవిదుః" అనుటచేఁ గడుబీభత్సమయి యపవిత్రమగు
మేనునందుఁ బరమశుచియైన దనుతలఁపును, దుఃఖబహుళములగు స్రక్చంద
నాదివిషయములయందు సుఖకరము లనునభిమానమును, నాత్మకాని మేను
నందు నాత్మభ్రాంతియు, అపుణ్యమునందుఁ బుణ్యభ్రమయు, అనర్థము
నందు నర్థభ్రాంతియు నను నిదియే యవిద్య యనఁబడును. మఱియు
"అతస్మిం స్తత్ప్రతిభాసోఽవిద్యా" అనియు నవిద్యాసామాన్యలక్షణము॥
ఇక నస్మితయనఁగా నెట్టిది? "దృగ్దర్శనశక్త్యో రేకాత్మతైవాస్మితా" అను
సూత్రముచేత నపరిణామిత్వధర్మము గల పురుషుఁడు దృక్శక్తి, పరిణా
మిత్వధర్మముగల బుద్ధి దర్శనశక్తి ఇట్లు భిన్నలక్షణంబు లగు నీ రెండు
శక్తులు నొకటియే యనుకొనుట యస్మితాక్లేశము. వాస్తవముగఁ దనకుఁ
గర్తృత్వభోక్తృత్వములు లేకపోయినను, నేను కర్తను నేను భోక్త నను
కొనుట యనువిపర్యాస మస్మిత యనఁబడు ననుట. రాగాఖ్యక్లేశమన నేమి?
"సుఖానుశయీ రాగః" అనుటచే సుఖమన నేమో యెఱుఁగనివానికి సుఖ
స్మృతియే గలుగదు గాన సుఖాభిజ్ఞునకు సుఖమునందును, దత్సాధనము
నందును, సుఖానుస్మృతిపూర్వకమగు తృష్ణ రాగ మనఁబడును. "సుఖ
మనుశేత ఇతి సుఖానుశయీ" అని వ్యుత్పత్తి. ద్వేషమన నేమి? "దుఃఖాను
శయీ ద్వేషః" అను సూత్రముచే దుఃఖమన నేమో యెఱుఁగనివానికి దుఃఖ

స్మరణయే యుండదుగాన దుఃఖము నెఱింగినవానికి దుఃఖమునందును దుఃఖసాధనములయందును నిందారూపమగు క్రోధము ద్వేష మనఁబడును. ఇఁక నభినివేశమన నేమి? "స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః" యథా = ఏరీతిని, అవిదుషః = అజ్ఞానికి, రూఢః = ప్రసిద్ధమయినదో, తథా = ఆరీతిని, విదుషః - అపి = జ్ఞానికిని, రూఢః = ప్రసిద్ధమైనదై, స్వరసవాహీ = వాసనారూపమగు స్వభావముచేతఁ బ్రవహించునట్టి - యాత్మవిషయకమగు ప్రేమానుబంధము, అభినివేశః - అభినివేశ మను పేరు గల క్లేశము అగునని సూత్రార్థము. కాఁగా, సమస్తప్రాణికోటికిని నే నెప్పుడును లేనన్నమాటలేక శాశ్వతముగఁ జావులేకయుండెదఁగాత మను నాత్మ విషయక మగు ప్రార్థన (కోరిక) గలదు. ఈ కోరిక వెనుకటిపుట్టువునందు ననుభవింపఁబడిన మరణదుఃఖముయొక్క యనుభవవాసన లేనిచో సంభవింపదు గాన, దీనిచేఁ బ్రతిజంతువునకును బూర్వజన్మమున్నదని తోఁచుచున్నది. ఈ యభినివేశము (నేను చచ్చెద ననుభయము) కేవలము నజ్ఞాన జంతువగు పురుగునకుఁ గూడఁ బుట్టినదిమొదలు స్వతస్సిద్ధమై యున్నది గాని, యాగంతుకముకాదు (మధ్యను వచ్చినదికాదు). మఱియు నీమరణ భయము వెనుకటి పుట్టువునందు ననుభవింపఁబడిన మరణదుఃఖమును దెలియఁ జేయు చున్నది (సూచింపుచున్నది). ఇది యత్యంతమూఢులయందుఁ జూపట్టుచు నున్నట్లు-అనిత్యమగు సంసారస్వరూపమును నిత్యమగు కైవల్య స్వరూపమును దెలిసిన జ్ఞానులయందును గన్పట్టుచున్నది. బాగుగఁ జూడుఁడు-లోకజ్ఞానమేమియు లేని పసిపాపఁడు, దను నేదేనిఁ జంపుటకు వచ్చుచున్నట్లు గనుఁగొనెనేని నాకిఁక చావు దగ్గఱ పడినదని గడగడ వడఁకుచు నడలుపడుట చూడఁబడుచున్నది. వానిచే నప్పటి కీజన్మములో మరణ మనుభవింపఁబడలేదు, చూడఁబడుటలేదు, వినఁబడుటలేదు. ఐనను మొదటనే వానిచే మరణము దుఃఖదాయకమని తెలిసికొనఁబడినది. వానికప్పుడు మరణము దుఃఖకరమను స్మృతి కలదు. సంస్కారము లేనిచో నట్టిస్మృతి

యును, ననుభవము లేనిచో నాసంస్కారమును నుండదు. ఈజన్మములో మరణదుఃఖానుభవము లేదు గాన నాయనుభవమునుబట్టి పుట్టినదిగాని యిప్పటిదిగాదు గాన, నేనెన్నఁడుఁ జావకుండవలె ననుకోరిక పూర్వజన్మ సంబంధమైనది. ఈప్రార్థనయే యభినివేశాఖ్యక్లేశ మనఁబడునని ఫలితార్థము. అను మొదలగు పాతంజలయోగశాస్త్రరహస్యము లిచట గమనించునది. గ్రంథవిస్తరభీతిచే నింతటితో నీచర్చను ముగించుచున్నారము. ఎద్దిలేదు+ ఏమిచెప్పుదు ననుపట్ల వాక్యాంతముగానఁ బూర్వస్వరమునకుఁ బరస్వర మాదేశముగ రాలేదు. ౬౪

క. అచ్చటనె సరస్వతియును
నచ్చట భాగీరథియును ౕ యమునానదియుఁ
నచ్చట సమస్తతీర్థము
లెచ్చట శ్రీరామనామ ౕ మెప్పుడుఁ గలుగున్. ౬౫

టీ. ఎచ్చటన్ = ఏతావునందు, శ్రీరామనామము - శ్రీరామ = శ్రీరామచంద్రునియొక్క, నామము=నామమంత్రము, ఎప్పుడున్ కలుగున్= ఎల్లప్పుడు జపింపఁబడుచుండునో, అచ్చటన్ + ఎ = ఆతావునందు నే, సరస్వతియును = సరస్వతి యనఁ బ్రసిద్ధమగునదియును, అచ్చటన్ = ఆ పట్టుననే, భాగీరథియును = భగీరథుఁడను మహారాజుచేఁ దేఁబడిన గంగానదియును, యమునానదియున్ = యమున యను పుణ్యనదియును గలవు; మఱియును, అచ్చటన్ = ఆ స్థలమునందు, సమస్తతీర్థములు=నిఖిల పుణ్యతీర్థములును గలవు. అచ్చట ఎచ్చట అనుపట్ల "కృతహ్రస్వత్రికాచ్చోటోరత్వహ్రస్వావిభావయా" అనుటచేత ఆ ఈ ఏ అను సర్వనామపదములకు సమాసమునందు ద్విరుక్తంబగుహల్లు పరంబగునపుడు హ్రస్వమురాఁగా వానికిఁ బరముగ నున్న చోటుశబ్దమునందలి ఓకారమునకు వైకల్పికముగ నకారమును హ్రస్వమును గాఁగా అచ్చట ఎచ్చట మొదలగు రూపములు

నిష్పన్నము లయినవి. వీనికి అచ్చ్రోటు అచ్చోటు మొదలగు రూపభేదముల నూహించునది. మఱియును "ద్విర్భావోఽచిద్రుతస్యస్యాద్వాక్యపాదాన్త యోః క్వచిత్" అనుటచే నదియును అనుదాని ద్రుతమునకు అచ్చట అను దానియచ్చు పరం బగునపుడు వాక్యాంత మగుటచేతఁగాని పాదాంత మగుటచేతఁగాని ద్విత్వము రాఁగా నదియు న్నచ్చట యని సంధి.

తా. ఓ ప్రేయసీ పార్వతీ! శ్రీరామచంద్రుని నామమంత్ర మేచో టను నిరంతరము నుచ్చరింపఁబడుచునుండు నాస్థలమునందు గంగాయమునా సరస్వతులులోనుగాఁగల పుణ్యతీర్థములెల్ల నుండును గాన, రామనామమునం బోలినపుణ్యతీర్థ మొండు లేదు. ౬౫

తే. తవిలి శ్రీరామనామసుధారసంబు
నమృతులై గ్రోలుభక్తుల కమృత మేల
నమర నమృతాంధసులచేత నదియె మిగుల
గోరఁబడుచుండుఁ గావున వారిజాక్షి. ౬౬

టీ. వారిజాక్షీ = తామరలం బోలినకనులుగల యోముద్దియా, అదియ = ఆరామమంత్రసుధారసమే, సుధాంధసులచేతన్ = అమృతమే అన్నముగఁ గల వేల్పులచేతను, అమృతబుద్ధిన్ = అమృత మనుతలంపుతో, మోక్షము నందలి బుద్ధితో నని యర్థాంతరము, "పియూష మమృతం సుధా" అనియు, "శ్రేయో నిశ్రేయసామృతం" అనియు నమరము. కోరన్ పడు చున్ ఉండున్ = అపేక్షింపఁబడుచుండును, కావునన్ = అట్లు కోరఁ బడుటచేతను, తవిలి = ఆసక్తిగలిగి, శ్రీరామ...పూరము - శ్రీరామ = రామభద్రునియొక్క, నామ = నామమంత్ర మనియెడు, అమృతరస = సుధారసముయొక్క, పూరము = ప్రవాహమును, అమృతులు, ఐ = మిగుల యోగ్యులయి యని లక్షణార్థము, లేక, మృతి యన సంసారము, అవి లేని వారై, గ్రోలు = పానముచేసెడు, భక్తులకున్ = ఆశ్రితులకు, అమృతము =

సుధ, ఏల = ఎందుకు? - అవసరము లేదనుట. అమృతాంధసులు అనుపట్ల "మహద్వాచకసాంతానాం ద్వితీయాన్త సమానతా" అనుటచే ద్వితీయైక వచనాంత తుల్యత్వము.

తా. అమృత మన్నముగా గలవేల్పులు స్థూలశరీరబాధలను మాత్రము బోఁగొట్టెడు నాయమృతమును విడిచి, స్థూలసూక్ష్మశరీరముల రెండిటి యొక్క బాధలను నివారించుచు శాశ్వతమగు మోక్షసుఖము నిచ్చెడు శ్రీరామనామామృతమును గోరుచున్నారు. కనుక ఓ పార్వతీ! అత్యంతా సక్తితో నెప్పుడు నీ శ్రీరామనామమంత్ర సుధారసమునే పానము చేయుచు శాశ్వతమగు పరమపదసుఖమును గోరు మహాభక్తులకు క్షణికసుఖము నిచ్చు నాస్వర్గమునందలియమృత మెందుకు? అవసరము లేదని తాత్పర్యము. ౬౬

తే-గీ. కోరి మును గానని మనుష్యుఁ బేరుపెట్టి
చీరిన నతం డతనిచెంతఁ జేరునట్లు
త న్నెఱుంగక తనపేరుఁ దలఁచినంతఁ
గరుణచే రాముఁ డపుడె సాక్షాత్కరించు. ౬౭

టీ. మును = పూర్వమునందు, కానని = చూడనట్టి, మనుష్యున్ = మర్త్యుని, పేరుపెట్టి = వానినామము నుచ్చరించి, కోరి చీరినన్ = ఏదే నొకపనిమీఁదఁ బిలిచిన, అతండు=ఆమర్త్యుఁడు, అతనిచెంతన్=ఆపిలిచిన వానిసమీపమును, చేరునట్లు = ఏతెంచెడువడువున, రాముఁడు = శ్రీరామ చంద్రుఁడు, తన్నున్=తన్ను, ఎఱుంగక=పరమాత్మస్వరూపునిగఁ దెలిసి కొనలేకపోయినను, తనపేరున్ = తనదగు నామమంత్రమును, తలఁచి నంతన్=స్మరించినవెంటనే, కరుణన్ = కనికరముతో, అపుడు+ఎ = తలఁచినతఱినే, సాక్షాత్కరించున్ = ఎదుటఁ గన్పట్టును.

తా. అదివఱకుఁ దా నెన్నఁడునుఁ గని విని యెఱుంగని మనుజునిఁ గాకతాళన్యాయముగ సంబోధించి పిలువ నామనుజుఁడు పిలిచినవానికడకు

వచ్చెడువఱకువున శ్రీరామచంద్రుండు దన నిజస్వరూపమును దెలియకపోయి నను తన యభిధానమును మనమునఁ దలఁచినమాత్రముననే కనికరముతో నెదుటఁ బ్రత్యక్ష మగును.

సుగంధివృత్తము. రామరామరామరామ రామ రామయంచు శ్రీ
రామరామరామరామ రామరామ యంచు శ్రీ
రామరామరామరామ రామరామ యంచుఁ ద
న్నామకీర్తనంబుఁ జేసినం గలుంగు మోక్షముల్. ౬౮

టీ. "రామరామరామరామరామరామ" అను శ్రీరామద్వాదశాక్షరీ మహామంత్రము మూఁడుమాఱులు జపించినయెడలఁ గైవల్యము గలుగును. "యో జపే త్సతతం భక్త్యా శ్రీరామద్వాదశాక్షరీం । ప్రాతర్మధ్యం దినే సాయం త్రివారం మోక్ష మాప్నుయాత్" అనుటచేత ప్రాతఃకాలమునందును, మధ్యాహ్నకాలమునందును, సాయంకాలమునందును, శ్రీరామద్వాదశాక్షరీమంత్రపురశ్చర్యఁజేసినవాఁడు మోక్షము నొందు నని ఫలితార్థము. "రంబుజంబు రంబుజంబు రంబుఁ జెన్ను మీఱఁగాఁ దొమ్మిదింట విశ్రమంబుతో రమాసుగంధికిన్" అను లక్షణముచే రగణ జగణ రగణ జగణ రగణము లను నైదుగణములను దొమ్మిదవస్థానమున యతియునుఁ గలుగఁగా సుగంధివృత్తమగును. దీనికే శాలిని, చామరము, ప్రశాంతి యను నామాంతరములు గలవు. ౬౮

క. నిరతంబు రామనామ
స్మరణంబునకంటె మోక్షసాధన మితరం
బరయంగ లేదు ధరలోఁ
బరమసులభ మైన లసదుపాయం బబలా! ౬౯

టీ. అబలా=ఓవనితా! "స్త్రీ యోషి దబలా యోషా" అని యమరము. మోక్ష - సాధనము = సంసారబంధవిముక్తికిఁ దగినయుపకరణము,

నిరంతరంబుగ్ =సర్వకాలములయందును, రామనామస్మరణంబునకంటెన్. రామ = శ్రీరామచంద్రునియొక్క, నామ = నామమంత్రముయొక్క, స్మరణంబునకంటెన్ = సంకీర్తనమునకన్న, ఇతరంబు = వేఱయది, అరయంగన్ = పరిశీలింపఁగా, ధరలోన్ = పుడమియందు, లేదు = ఉండదు, (కావున నిదియె) పరమసులభము - ఐన = కడుసుకరమైనట్టి, లసత్ + ఉపాయంబు = ఒప్పిదమగు యుక్తి.

తా. ఓకాత్యాయనీ! సంతతమును శ్రీరామమంత్రసంకీర్తనముఁ జేయుటకన్న వేఱగుసాధనము ముక్తికిఁ బుడమిలో లేదు. కావున నిది యెల్లరకును మిగుల సుకరమైన మోక్షోపాయము. ౬౯

అవ. "తన్నెఱుంగక తనపేరు దలఁచినంతఁ గరుణచే రాముఁ డపుడ సాక్షాత్కరించు" అను పూర్వోక్తార్థమునే వివరించి చెప్పుచున్నాఁడు.

తే-గీ. రామ! రామ! యటంచును కాముకుండు
మోహమునఁ బ్రేయసిని బిల్వ మోక్ష మొసఁగు
రామనామంబు హిమశైలరాజతనయ!
గాన వర్ణింపఁగాఁజాల దానిమహిమ. ౭౦

టీ. హిమశైలరాజతనయ! = ఓపార్వతీ! రామనామంబు=శ్రీరామచంద్రునియొక్క నామమంత్రము, కాముకుండు = స్త్రీలోలుఁడగువాఁడు, మోహమునన్ =మక్కువతో, రామ! రామ! =ఓసుందరీ! ఓసుందరీ!, అటంచును=అని సంబోధింపుచు, "సుందరీ రమణీ రామా" అని యమరము. ప్రేయసిని=తనప్రియురాలిని, పిల్వన్ = పిలిచినంతనే, మోక్షము = ముక్తిని, ఒసఁగున్ = ఆకాముకున కిచ్చును; కానన్ = అదిగావున, దానిమహిమన్ = ఆరామనామముయొక్క మాహాత్మ్యమును, వర్ణింపన్ - కాన్ - చాలను = కొనియాడుటకు సమర్థుఁడను కాను.

తా. ఓపార్వతీ! పూవువిల్తునిబారికి లోఁబడిన కాముకుఁడు తన ప్రియురాలిని స్త్రీపర్యాయంబగు 'రామ'! యనుసంబోధనపదముతోఁ బిలువఁగా నాకాముకునికిఁగూడ కైవల్యమునొసఁగు శ్రీరామనామమంత్రము యొక్క మహిమ నేమని వర్ణించెదను.

వ. అని యిట్లు శ్రీరామమంత్రంబును దత్ప్రభావంబు నుపదేశించిన నాకర్ణించి పరమానందభరితస్వాంత యై యక్కాంతామణి యత్యంతభక్తిపూర్వకంబుగా ననేకదండప్రణామంబు లాచరించి వినుతించి స్వామీ! తన్మంత్రాధిష్ఠానదేవతా శ్రీరామ తత్త్వస్వరూపం బెట్టిది? యెఱింగింపుమనిన నొక్కింత విచారించి శ్రీరామహృదయం బను పరమేతిహాసంబు గల దందు శ్రీరామతత్త్వం బతివిస్పష్టంబుగా విలసిల్లునది యతిరహస్యంబు గావున నెవ్వరికి గోచరంబుగాకుండు. దాని నేఁ దెలియంజెప్పెద వినుమని శ్రీమహాదేవుం డప్పార్వతీదేవి కిట్లనియె. ౭౧

టీ. శ్రీమహాదేవుండు = అణిమాద్యష్టైశ్వర్య సంపన్నుఁ డగు సదాశివుఁడు, అప్పార్వతీదేవికిన్ = ఆ గౌరీదేవికి, ఇట్లు = మీఁదఁ జెప్పినవిధమున, శ్రీరామమంత్రంబును = శ్రీరామచంద్రునియొక్క మూలమంత్ర స్వరూపమును, తత్ ప్రభావంబున్ = ఆమంత్రముయొక్క మాహాత్మ్యమును, ఉపదేశించినన్ = బోధింపఁగా, ఆకర్ణించి = ఆలకించి, పరమ...ఐ - పరమ = లోకోత్తరమైన, ఆనంద = హర్షము చేత, భరిత = పరిపూర్ణమైన, స్వాంత-ఐ = చిత్తము గలదియై, ఆ కాంతామణి = ఆవనితాతిలకమగు కాత్యాయని, అత్యంత = తుదలేని, భక్తి = భజనరూపమగు ప్రేమ, పూర్వకంబుగన్ = మొదటఁ గలుగునట్లు, అనేక దండప్రణామంబులు = పెక్కువందనంబులు, ఆచరించి = చేసి, వినుతించి = కొనియాడి, స్వామీ=

జీవితేశ్వరా! తత్ ...రూపంబు- తత్ =తా ముపదేశించిన, మంత్ర=మహా మంత్రమునకు, అధిష్ఠానదేవతా=అధిదైవమగు, శ్రీరామ=శ్రీరామచంద్రుని యొక్క, తత్త్వ = వాస్తవమైన, స్వరూపంబు = నిజరూపము, ఎట్టిది = ఏలాటిది? ఎఱింగింపుము = బోధింపుము, అనినన్ = అని ప్రార్థింపఁగా, ఒక్కింత = కొండొకతడవు, విచారించి = తనలో నాలోచించి, శ్రీరామ హృదయంబు అను = శ్రీరామహృదయ మను పేరం బరఁగు, ఇతిహాసంబు = ఇతివృత్తము, కలదు = గోప్యముగనున్నది. అందున్ = శ్రీరామహృదయ మునందు, శ్రీరామ - తత్త్వంబు = శ్రీరామచంద్రునియొక్క యాథార్థ్యము, అతివిస్పష్టముగాన్ =కడుఁ దేటతెల్లముగ, విలసిల్లున్ =వెల్లడి యగును, అది = ఆ రామహృదయము, అతిరహస్యంబు = మిక్కిలినిగూఢార్థమైనది, కావునన్ = కనుక, ఎవ్వరికిన్ = ఎట్టివారలకును, గోచరంబు = బోధించునది, కాక-ఉండున్ = వలనుపడకయుండును; దానిన్ =ఆయితివృత్తమును, ఏన్ = సర్వజ్ఞుఁడనగు నేను, తెలియన్ =నీకు బోధపడునట్లు, చెప్పెదన్ = ఉపదేశించెదను, వినుము = ఆలకింపుము. అని ఈవడువునఁ బలికి, ఇట్లు అనియెన్ = ముందుఁ జెప్పఁబోవురీతిని వచియించెను.

తా. ఇత్తెఱంగున శ్రీరామభద్రుని నామమంత్రస్వరూపమును, నామంత్ర మాహాత్మ్యమును, వినిపించిన నాలకించి యమందానందకందళితహృదయారవింద యై యమ్మందయాన యత్యధికప్రేమపురస్సరంబుగఁ బెక్కులగు వందనముల నొనరించి కొనియాడి జీవితేశ్వరా! తా మిప్పుడు నాకు నుపదేశించిన మహామంత్రమునకుఁ బ్రధానదైవత మగు శ్రీరామచంద్రుని యొక్క పారమార్థికస్వరూపమును బోధింపు మని విన్నవించిన మిన్నువాఁక దాల్పు గొంతదడ వాలోచించి శ్రీరామహృదయ మను పేరం బరఁగు నొక యితివృత్తంబు విలసిల్లు. దానియందు శ్రీరామచంద్రుని యాథార్థ్యంబు తేటతెల్లముగ దెలుపంబడియున్నది; యయ్యది యత్యంత నిగూఢార్థ మైనది. కావున నెల్లరకు సాధారణముగ బోధపడదు. ఆ రామహృదయమును నీకు

సులభముగ బోధపడున ట్లుపదేశించెద. సావధానచిత్తవై యాలకింపుమని యాహైమవతితో ని ట్లనియె. ౭౧

సీ. ఆదినారాయణుం ॥ డార్తరక్షణపరా
యణుఁడు లోకోపకా ॥ రార్థముగను
శ్రీరామచంద్రుఁడై ॥ క్షితిలో నవతరించి
ప్రేమతో సీతను ॥ బెండ్లియాడి
సాకేతపురమున ॥ సంభ్రమించుచు నుండి
జగముల రక్షింప ॥ జననివరము
జనకునివాక్యంబు ॥ సమకూర్చి చెల్లింపఁ
దమ్ముఁడు భార్యయుఁ ॥ దానుఁ గూడి
తే-గీ. తాపసులవేషములు దాల్చి ॥ తాల్మి మీఱ
దండకారణ్యభూములఁ - దగఁ జరించి
సకలరాక్షసగణముల ॥ సంహరించి
యరిగి సీతానిమిత్తమై ॥ యంతమీఁద. ౭౨

టీ. ఆర్త+రక్షణ+పరాయణుఁడు = ఇడుమలం బడుమనుజులను గాపాడుటయందుఁ దత్పరుఁడగు, ఆది+నారాయణుఁడు = సర్వజగంబులకు నుపాదానభూతుఁడగు శ్రీమన్నారాయణుఁడు, లోక + ఉపకార + అర్థముగను = సమస్తప్రపంచమునకు మేలును గలుగఁజేయుటకొఱకు, శ్రీరామచంద్రుఁడు-ఐ = శ్రీరామభద్రస్వరూపుఁడగుచు, క్షితిలోన్ = పుడమియందు, అవతరించి=జన్మించి, సీతను = భూసుతను, ప్రేమతోన్=అనురాగముతోను, పెండ్లియాడి = వివాహము చేసుకొని, సాకేతపురమునన్= అయోధ్యయను వీటను, సంభ్రమించుచున్=విహరించుచు, ఉండి=నివసించి, జగములన్ = భువనములను, రక్షింపన్ = కాపాడుటకును, జనని = తన పినతల్లియగు కైకేయియొక్క, వరమున్ = (రాముఁడు పదునాలుగువత్సర

ము లు వనవాసము సేయవలయును నాకొడుకు భరతుఁడు రాజ్యము సేయవలయునను) కోరికను, జనకుని = తండ్రియగు దశరథునియొక్క, వాక్యంబున్ = సత్యవచనమును, సమకూర్చి = నెఱవేర్చి, చెల్లింపన్ = కొనసాగించుటకును, తమ్ముఁడు = సోదరుండగు లక్ష్మణస్వామియు, భార్యయున్ = తనయిల్లాలగు జానకీదేవియు, తానున్ = రాముఁడును, కూడి= కలసి, తాపసుల+వేషములు దాల్చి = జడదారులరూపములను బూని, తాల్మి = శాంతి, మీఱన్ = తనరుచుండఁగ, దండక+అరణ్య+భూములన్ = దండక మను నడవిపట్టులయందు, తగన్ = ఒప్పునట్లు, చరించి= తిరిగి, సకల+రాక్షసగణములన్ = ఖరుఁడు దూషణుఁడు లోనుగాఁ గల పెక్కండ్రు రక్కసులనెల్ల, సంహరించి = జక్కాడి, సీతా+నిమిత్తము+ఐ = జానకీదేవిని దోడ్తెచ్చుటకయి, పోయి = లంకకేగి, అంతమీఁదన్ = ఆటుతరువాతను.

తా. ఓ మానినీ ! దీనమానవావన పరాయణుండగు శ్రీమన్నారాయణుండు రావణాది దుష్టదానవసంహారంబుఁ గావించి, ప్రపంచ పరిపాలనంబు గావింప ధరణీతలంబున శ్రీరామచంద్రరూపమున నవతరించి, యతిప్రీతితో సీతనువరించి సాకేతనికేతనంబునఁ గొంతకాలము సంతసమున నివసించి, తనజనకుఁడు కైక కిడినవరమును నెఱవేర్చి పితృవాక్య పరిపాలనమును గావించి, భూలోకమును బాలించుటకుఁ దనసోదరుండగు లక్ష్మణుండును, ప్రేయసి యగుసీతయుఁ దానును గలసి జడదారుల వేసములఁ బూని దండకారణ్యప్రదేశములయందు నోర్మితో సంచరింపుచు నచ్చట దుష్టులగు ఖరదూషణాది రాక్షసుల నుక్కడంచి, పిమ్మట రావణునిచే నపహరింపఁబడిన తనదేవేరి యగుసీతను దోడ్కొని వచ్చుటకు లంకాపురంబునకు నేగి పిమ్మట.

మ. రణభూమిం దగ రావణాసురునిఁ బు
త్రభ్రాతృబంధూరువా

రణగంధర్వ శతాంగయుక్తముగ న
స్త్రశ్రేణిచేఁ ద్రుంచి ల
క్ష్మణ సుగ్రీవహనూమదాదియుతుఁడై
కాంక్షించు సీతావధూ
మణితో వచ్చె నయోధ్య కార్యులు నుతిం
పం బుష్పకారూఢుఁడై. 23

టీ. పుత్ర...యుక్తముగన్ - పుత్ర = ఇంద్రజిత్తు మొదలగు కొమరులతోను, భ్రాతృ = సోదరుఁడగు కుంభకర్ణునితోడను, బంధు = మాల్యవంతుఁడు మొదలగు చుట్టములతోను, ఉరు = గొప్పలగు, వారణ = భద్రగజములతోను, గంధర్వ = వారువములతోను, శతాంగ = తేరులతోను, యుక్తముగన్ = సమేతముగ, రణభూమిన్ = సంగర రంగమునందు, అస్త్ర=బ్రహ్మాస్త్రములయొక్క, శ్రేణిచేన్ = పరంపరచేత, తగన్ = ఒప్పునట్లు, త్రుంచి = సమయించి, లక్ష్మణ...యుతుఁడై - లక్ష్మణ=తమ్ముఁడగు లక్ష్మణస్వామి, సుగ్రీవ = సంగడీఁడగు సుగ్రీవుఁడు, హనుమత్ = భక్తుఁడగు పవనసుతుఁడు, ఆది = లోనుగాఁగల పరివారముతో, యుతుఁడు-ఐ = సమేతుఁడగుచు, కాంక్షించు = తనసమాగమము నపేక్షించెడు, సీతావధూమణితోన్ = పతివ్రతాశిరోరత్నమగు సీతాదేవితో, పుష్పక + ఆరూఢుఁడు - ఐ = పుష్పక మనియెడు దివ్యవిమానమునందు నధిష్ఠించినవాఁడై, ఆర్యులు = పూజ్యులగుమునులు, నుతింపన్ = పొగడుచుండఁగా, అయోధ్యకున్ = సాకేతనగరమునకు, వచ్చెన్ = మరల నేతెంచెను. ఈపద్యమున నాల్గవపాదమునందు మవర్ణమునకును పూర్ణబిందుపూర్వకపకారమునకును బిందుయతి. "పనిఁబూని నిలుచుఁ దమతమ । యనునాసికములకు బిందుయతులను వెనుకం। గనుపట్టు నాల్గు విపులను। బెనుసున్నలు వ్రాసి తమకుఁ బిఱుదఁ గదియుంచోన్" అని లక్షణము.

తా. రావణుం డనురాక్షసరాజును, కొడుకులు నన్నదమ్ములు బంధుగులు గొప్పలగు నేనుఁగులు గుఱ్ఱములు రథములు మొదలగువానితోఁ గూడ నట్లు యుద్ధరంగమునందు సమంత్రకములగు నారసములచాలుచే నిర్మూలముగ రూపుమాపి, లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు హనుమంతుఁడు లోనుగాఁ గలవారలతోఁ గలసి, తనయందు మక్కువగలదియుఁ, బతివ్రతాతిలకము నగు జానకీదేవినిం దోడ్కొని పుష్పకంబను దివ్యవిమానము నెక్కి సాకేతనగరమునకుఁ బెద్దలు గొనియాడుచుండ శ్రీరామచంద్రుఁడు మరల నేతెంచెను.

తే-గీ. ఇట్లరుగుదెంచి రాముఁడు హితపురోహి
తార్యబాంధవసచివభృత్యప్రభృతులు
ననుజులునుఁ గొల్వ సక్తుఁడై జనకజాభి
యుక్తుఁడై యంతఁ బట్టాభిషిక్తుఁ డయ్యె. ౨౮

టీ. ఇట్లు = ఇవ్విధమున, అరుగుదెంచి=అయోధ్యాపురమునకువచ్చి, హిత...ప్రభృతులు - హిత = సుగ్రీవుఁడు విభీషణుఁడు మొదలగు చెలికాండ్రును, పురోహిత = వసిష్ఠమహాముని మొదలగు పురోధసులును, ఆర్య = పూజ్యులగు విద్వాంసులును, బాంధవ = బంధువులును, సచివ = సుమంత్రుఁడు లోనగు నమాత్యులును, భృత్య = ఆంజనేయుఁడు మొదలగు సేవకులును, ప్రభృతులు = మొదలగు వారలును, అనుజులు = భరతుఁడు లక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు నను తమ్ములును, కొల్వన్ = కొలుచుచుండఁగా, సక్తుఁడై = తన యాశ్రితులయందు నాసక్తి గలవాఁడై, జనకజా = సీతాదేవితో, అభియుక్తుఁడై = కూడుకొని యున్నవాఁడై, అంతన్ = అప్పుడు, పట్టాభిషిక్తుఁడు = మూర్ధాభిషిక్తుఁడు, అయ్యెన్ = ఆయెను. అరుగుదెంచి అనుచో "అను ప్రయుజ్యతే తెంచు రరుగ్వా దేర్గలుప్చవా" అనుటచే నరుగుధాతువునకుఁ దెంచుధాతు వనుప్రయుక్తంబుగాఁగా నరుగుదెంచి యని క్త్వార్థకరూపము. గువర్ణము లోపించునపుడు నరుదెంచి యనియు రూపాంతరము.

**తా.** ఇత్తెఱంగున, శ్రీరామచంద్రుం డయోధ్యానగరంబున కేతెంచి స్నేహితులుం బురోహితులు పెద్దలును బంధువులును నమాత్యులును సేవకులును లోనుగాఁ గలవారలును, తమ తమ్ము లగు భరతలక్ష్మణశత్రుఘ్నులును బరివేష్టించి కొలువ సీతాదేవితోఁ గూడి సింహాసనాసీనుం డై యప్పుడు వసిష్ఠుఁడు మొదలగు పెద్దలచేఁ బట్టము గట్టఁబడిన వాఁ డయ్యెను. ౭౪

అవ. ఇట్లు సామాన్యముగ శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁ డయ్యెనని చెప్పి విశేషాకారముగ నభివర్ణింపు చున్నాఁడు.

సీ. శృంగార మేపార సీతాంగనామణి
        మును నిజవామాంకమున వసింపఁ
    దనపాదుకలు శిరంబున మోచి ముందర
        హనుమంతుఁ డతిభక్తి ననుసరింప
    ధవళాతపత్ర మాతతధనుర్బాణముల్
        దాల్చి లక్ష్మణుఁడు కైదండ నలర
    సరి నిరుగడల వింజామరంబులు పూని
        భరతశత్రుఘ్నులు పరిఢవింప
తే. ననుపమోజ్జ్వలరత్నసింహాసనమున
    నమరఁ గూర్చుండి కోటిసూర్యప్రకాశుఁ
    డై వసిష్ఠాదిమునిసమూహములచేతఁ
    జెలఁగి రాముండు పట్టాభిషిక్తుఁ డయ్యె. ౭౫

**టీ.** సీతా + అంగనా + మణి = తన భార్యయగు సీతాదేవి యను సతీరత్నము, శృంగారము - ఏపు - ఆరన్ = సహజసౌందర్యము ప్రబలుచుండఁగా, నిజ - వామ - అంకమునన్ = తన యెడమతొడమీఁద, మును = ముందుగ, వసింపన్ = ఉండఁగ, ముందరన్ = ఎదుటను

హనుమంతుఁడు = పవనతనయుండు, తన పాదుకలు = తనయొక్క పావజోడును, శిరంబునన్ = తలపైని, మోచి = ఇడుకొని, అతిభక్తిన్ = మిక్కుటమగు భక్తితో, అనుసరింపన్ = శుశ్రూషఁ జేయుచుండఁగా, కైదండన్ = వెనుకటి భాగమునందు, లక్ష్మణుఁడు = లక్ష్మణస్వామి, ధవళ + ఆతపత్రము = శ్వేతచ్ఛత్రమును, ఆతత + ధనుస్ - బాణముల్ = ఎక్కిడిన సింగిణిని నారసములను, తాల్చి = చేకొని, అలరన్ = ఒప్పుచుండఁగా, ఇరుగడలన్ = కుడియెడమ వైపులయందును, భరత శత్రుఘ్నులు = భరతుండును శత్రుఘ్నుండును, వింజామరంబులు = చమరవాలపు వీవనలను, పూని = పట్టుకొని, పరిఢవింపన్ = భాసిల్లుచుండఁగా, రాముండు = శ్రీరామభద్రుఁడు, అనుపమ...ఆసనమునన్ - అనుపమ = సాటిలేని, ఉజ్జ్వల = దేదీప్యమానములయిన, రత్న = మేలి మానికములచేఁ దాపడము చేయఁబడిన, సింహాసనమున్ = సింగపుగద్దియపైని, అమరన్ = ఠీవిగ, కూర్చుండి = సమాసీనుఁడై, కోటి - సూర్య - ప్రకాశుఁడు - ఐ = అనేకులగు భాస్కరులయొక్క వెలుఁగులం బోలిన వెలుఁగు గలవాఁడై, వసిష్ఠ + ఆది + ముని + సమూహములచేతన్ = వసిష్ఠమహర్షి మున్నగాఁగల మునీంద్రుల బృందముచేత, చెలఁగి = రంజిల్లి, పట్టాభిషిక్తుఁడు - అయ్యెన్ = సామ్రాజ్యమునకు నభిషేకము చేయఁబడియెను.

తా. సమస్త భూషణాలంకృతయై సహజసౌందర్యము చెన్నుమీఱుచుండఁ బతివ్రతాతిలకం బగు జనకరాజతనూజ తన యెడమతొడపై ముందుగఁ గూర్చుండియుండఁ, దనయొక్క మణిమయము లగుపాదుకలను దలపై నిడుకొని హనుమానుఁ డత్యధిక మగు భక్తితో సింగపుగద్దియచెంత నుండి పరిచర్యఁ జేయుచునుండఁగ, వెలిగొడుగును నెక్కిడిన విల్లు నమ్ములను జేఁబూని లక్ష్మణుఁడు వెనుకప్రక్క నిలిచియుండఁగ, రెండు వైపులను భరత శత్రుఘ్ను లిరువురును జమరవాలపు వీవనలను వేయుచు సమ

ముగ నిలుపఁబడి యుండఁగ, సాటిలేని దేదీప్యమానము లగు మగమానిక ములచేఁ దాపడము చేయఁబడిన భద్రసింహాసనమునందు నొప్పిదముగ సమాసీనుం డగుచు అనేకు లగు సూర్యులయొక్క ప్రకాశము గలవాఁ డగుచు, వసిష్ఠమహర్షి మొదలగుమునీంద్రులచేత నా శ్రీరాముఁడు సామ్రాజ్య పట్టాభిషేకము చేయఁబడెను. ౭౫

వ. ఇట్లు పట్టాభిషిక్తుండై శ్రీరామచంద్రుండు హితపురో హితామాత్య సుహృద్విద్వద్బ్రాహ్మణ దాసదాసీజనంబు లకును, నానాదేశాధీశ్వరులకును, విభీషణ సుగ్రీవ జాంబవ త్సుషేణ నల నీల గజ గవయ గవాక్ష గంధమాద నాదుల కును, వందిమాగధ పాఠకలోకంబునకును, దక్కినవారల కందఱకును, మనోరథంబులు దీరం దగిన రథ తురంగ వారణ గో భూ హిరణ్యాగ్రహార రత్న దివ్యవస్త్రాభరణ గంధమాల్యాదు లొసంగి సత్కరించి యంతటఁ దనపురో భాగవర్తియుఁ, బుణ్యకీర్తియు, నిటలతట ఘటితాంజ లియుఁ, గృతకార్యుండును, సకల విధైహిక కాముష్మిక భోగవిరక్తుండును, సమాధి షట్కసంపత్తి యుతుండును, ముముక్షుతా సమన్వితుండును, మహాబుద్ధిమంతుండు నైన హనుమంతుం గనుంగొని కరుణారసంబు పొంగార జనకజాంగనామణి నెమ్మొగంబుఁ జూచి మనకు నిత్య భక్తుండును మదీయ జ్ఞానాసక్తుండును, పరమభాగవత శిఖామణియు నైన యితనికి మద్దివ్యతత్త్వస్వరూపం బుప దేశింపు మనిన బంగారంబునకుఁ బరిమళంబు గలిగిన తెఱంగున నుప్పొంగి మందస్మిత ముఖారవింద యై విశ్వ

మోహిని యైన సీతామహాదేవి యాంజనేయున కభిముఖి
యై యి ట్లనియె. ౭౬

టీ. ఇట్లు = మీఁదఁ జెప్పినయట్లు, పట్టాభిషిక్తుండు - ఐ = ప్రాజ్యమగుసామ్రాజ్యమునకు మూర్ధాభిషేకము చేయఁబడినవాఁడై, శ్రీరామచంద్రుండు = సకల సామ్రాజ్యాది సంపద్యుక్తుఁడగు రామభద్రుండు, హిత...జనంబులకును - హిత = తన మేలును గోరెడు, పురోహిత = వసిష్ఠప్రముఖులగు గురువులకును, అమాత్య = ప్రెగ్గడలకును, సుహృత్ = అంతరంగ మిత్రులకును, విద్వత్ = జ్ఞానులయిన, బ్రాహ్మణ = పుడమివేల్పులకును, దాస = పరిచారకులకును, దాసీ - జనంబులకున్ = పనికత్తెలకును, నానా - దేశ - అధీశ్వరులకున్ = ఆయాదేశములకు నధిపతులగు సామంతరాజులకును, విభీషణ - సుగ్రీవ - జాంబవత్ - సుషేణ - నల - గజ - గవయ - గవాక్ష - గంధమాదన - ఆదులకును = పరమభక్తుఁడగు విభీషణుఁడు, పరమమిత్రుఁడగు సుగ్రీవుఁడు, బహువృద్ధుఁ డగు జాంబవంతుఁడు, సుషేణుఁడు, నలుఁడు, నీలుఁడు, గజుఁడు, గవయుఁడు, గవాక్షుఁడు, గంధమాదనుఁడు మొదలుగాఁగల మహోపకారులకును, వంది = మంగళపాఠకులు, మాగధ = స్తోత్రపాఠకులు, పాఠక = గాయకులు (లోనుగాఁగల), లోకంబునకున్ = జనమునకును, తక్కన - వార లకు - అందఱికిన్ = కొఱవడిన ఎల్లజనములకును, మనోరథంబులు = వాంఛితములు, తీరన్ = నెఱవేఱునట్లు, తగిన = తత్తదుచితములగు, రథ = అరదములు, తురంగ = గుఱ్ఱములు, వారణ = గొరులు (ఏనుఁగులు), గో = ఆవులు, భూ = పుడములు, హిరణ్య = బంగారు నాణెములు, అగ్రహారములు = బ్రాహ్మణశాసనములు, రత్న = మానికములు, దివ్యవస్త్ర = పట్టుపుట్టములు, ఆభరణ = నగలు, గంధ = కలపములు, మాల్య = పుష్పమాలలు, ఆదులు = లోనుగాఁగల వానిని, ఒసఁగి = ఇడి, సత్కరించి = గౌరవించి, అంతటన్ = అటుతరువాత, నిజ - పురోభాగ-

వర్తియున్ = తనముంగల నున్నవాఁడును, పుణ్య - కీర్తియున్ = పవిత్ర మగు యశము గలవాఁడును, నిటల...అంజలియున్ - నిటల = శిరము యొక్క, తట = భాగమునందు, ఘటిత = కూర్పఁబడిన, అంజలియున్ = కేలుమోడ్పు గలవాఁడును, కృత - కార్యుండును = నెఱవేర్పఁబడిన తన పనులన్నియును గలవాఁడును (తన పనులనెల్ల నెఱవేర్చినవాఁ డనుట), నిరాకాంక్షుండును = ఎట్టికోరికయు లేనివాఁడును, నిత్య - అనిత్య వస్తు వివేక - యుక్తుండును = పరమాత్మ నిత్యపదార్థము శరీరాదిక మనిత్య పదార్థము అను వివేచనతోఁ గూడినవాఁడును, శమ = శమము, దమ = దమము, ఆది = మొదలుగాఁ గల, షట్క = ఆఱుమోక్షసాధనముల యొక్క, సంపత్తి=సంపదలతో, యుతుండును = కూడినవాఁడును, సకల విధ = పలుతెఱంగులు గల, ఐహిక=ఈలోకసంబంధములును, ఆముష్మిక= పరలోకసంబంధములు నగు, భోగ = వైషయిక సుఖానుభవములయందు, విరక్తుండును = అనురాగము లేనివాఁడును, ముముక్షుతా - సమన్వితుండును = సంసారబంధ విముక్తియందలి తలఁపుతోఁ గూడియున్న వాఁడును, మహాబుద్ధిమంతుండును = సర్వోత్తమ మగు తెలివి గలవాఁడును, ఐన హనుమంతున్ = అగుహనుమానుని, కనుంగొని = వీక్షించి, కరుణా-రసంబు = కనికరపురసము, పొంగారన్ = అల్లకల్లోల మగుచుండఁగా, జనకజా - అంగనామణి - నెమ్మొగంబున్ = మహాపతివ్రత యగు సీతా దేవిమోమును, చూచి = పరికించి, మనకున్ = మన యిర్వురయెడలను, నిత్య - భక్తుండును = ఎడతెగని భక్తి గలవాఁడును, మదీయ - జ్ఞాన - ఆసక్తుండును = నా సంబంధమగు తత్త్వజ్ఞానమునందు నాసక్తి గల వాఁడును, పరమ - భాగవత - శిఖామణియును = యోగ్యులగు భగవ ద్భక్తులకు శిరోభూషణమును, ఐన - ఇతనికిన్ = అగు నీ యాంజనేయునికి, మత్ - దివ్య - తత్త్వ - స్వరూపంబున్ = నాయొక్క స్వయంప్రకాశ మానమగు వాస్తవ స్వరూపమును, ఉపదేశింపుము = తెలుపుము, అనినన్ =

అని యానతినియ్యఁగా, బంగారంబునకున్ = పసిఁడికి, పరిమళంబు = తావి, కలిగిన తెఱంగునన్ = పుట్టినయట్టులు, ఉప్పొంగి = ఎక్కువగ సంతసించి, మందస్మిత = ముసిముసినవ్వుచేత, సుందర = సొగసగు, వదన-అరవింద - ఐ = మోముదమ్మి గలదగుచు, విశ్వ - విమోహిని - ఐన = ఎల్లజగముల మోహింపఁజేయునట్టి, సీతామహాదేవి = పట్టపురాణియగు జానకీదేవి, ఆంజనేయునకున్ = హనుమంతునకు, అభిముఖియై = ఎదురు మోము గలదగుచు, ఇట్లనియెన్ = ఈవడువున నుడివెను.

**తా.** ఈప్రకారముగ భూలోకమున కంతకును జక్రవర్తిగాఁ బట్టాభిషేకము కాఁగా శ్రీరామచంద్రుఁడు స్నేహితులును, గురువులును, మంత్రులును, అంతరంగ మిత్రులును, మొదలగు తనయాశ్రితవర్గమునకు; పెక్కుదేశములకు నధిపతులై తనకు లోపడి యప్పనము లిచ్చుచుండెడు రాజులకును, విభీషణుఁడు, సుగ్రీవుఁడు మొదలగు పరమమిత్రులకును; మఱియును, నాటకములాడువారు, పిల్లనఁగ్రోవుల నూఁదువారు వీణలను మద్దెలలను వాయించువారు మొదలగు వారికిని, తక్కినసాధారణజనములకును, వారివారికిఁ దగునట్లుగ, రథములు, గుఱ్ఱములు, ఏనుఁగులు, నావులు, భూములు, బంగారునాణెములు, నగ్రహారములు, పట్టుబట్టలు, పెక్కుతొడవులు మొదలగువానిని తమతమ కోరికలకు, మీఱునట్లుగ తనివిదీర నిచ్చి వారివారికి తగినమన్ననలను జేసె తరువాత, తనకు ముంగల నున్నవాఁడును, ఆజన్మశుద్ధుండును, శిరస్సునఁ జేతులం జోడించుకొని యున్నవాఁడును, తనకార్యముల నెల్ల నెఱవేర్చినవాఁడును, కోరిక లెవ్వియు లేనివాఁడును, ఇదియెల్ల ననిత్యము ఆది నిత్య మనుజ్ఞానము గలవాఁడును, ఈ లోకభోగములయందుఁ గాని, స్వర్గాదిభోగములయందుఁగాని తలఁపు లేనివాఁడును, శమము దమము లోనుగాఁ గల మోక్షసాధన సామగ్రితోఁ గూడియున్నవాఁడును, సంసారబంధవిముక్తియందుఁ దలఁపు గలవాఁడును, పరమసూక్ష్మమగు తెలివి గలవాఁడును నగు కరుణలిశామరుఁ బరికించి కనికరంపురసం బుప్పొంగ బల

నాలలామ యగుజానకి ముద్దుమోమును గనుంగొనిన మనయెడ నెడతెగని భక్తి గలవాఁడును, నాయొక్క తత్త్వమును తెలిసికొనుటయందు మాత్ర మిచ్ఛగలవాఁడును, భగవద్భక్తులకుఁ దలమానికము నగువీనికి నాదగుస్వయం ప్రకాశమగు తత్త్వస్వరూపమును బోధింపు మని యానతిచ్చినఁ బసిఁడికిఁ దావియబ్బినయట్లు గడుసంతసించి చిఱునగవుచే సొబగగు మోముఁదమ్మి గలది యగుచు జగముల నెల్ల మోహపెట్టెడుపుడమిపట్టి యంజనానందను నకు నెమురుమో మిడి యివ్విధమున నుడివెను. ౭౬

ఇందుఁ దనపురోభాగవర్తియుఁ, బుణ్యకీర్తియు నను మొదలగువిశేషణములచే నాంజనేయుఁ డుత్తమాధికారియని తెలుపఁబడినది యెట్లనిన— పుణ్యకీర్తియు ననుటచే "ఇహజన్మని జన్మాంతరేవా విధివదధీత వేద వేదాంగత్వేనా పాతతోఽధిగదాఖిల వేదార్థః. కామ్యనిషిద్ధవర్జనపురస్సరం నిత్యనైమిత్తి కాదికర్మానుష్ఠానేన పరిపక్వ నిర్మలాంతఃకరణః" అను వాక్యార్థము బోధింపఁబడినది. ఈజన్మమునందుఁగాని జన్మాంతరమునందుఁ గాని యథావిధిగ ఋగ్యజుస్సామాధర్వణములను వేదములను, శిక్షాకల్ప వ్యాకరణచ్ఛందోజ్యోతి ర్నిరుక్తము లను వేదాంగములను గురుకులమునం దుండి యధ్యయనముఁజేసి యా వేదవేదాంగములయందుఁ బ్రతిపాదింపఁబడిన నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్తోపాసనారూపము లగు సత్కర్మలనెల్ల విధ్యుక్తముగ నాచరించుటచే మెఱుఁగుసున్నముచేఁ దోమఁబడిన యద్దము వడువున నతినిర్మలమగు చిత్తము గలవాఁడై యించుమించుగఁ దెలియఁబడిన వేదార్థము గలవాఁ డగుటచే దేహము మొదలుగ నహంకారముదనుకఁ గల జడపదార్థజాతమునకు విలక్షణమై స్వయంప్రకాశ స్వరూప మగుప్రత్యగాత్మయె బ్రహ్మానందమగునా? కాదా? యను విచికిత్స నొంది దానియాథార్థ్యమును దెలియఁగోరుచున్నవాఁడు గాన నల్పశ్రవణముచే మూలాజ్ఞాననివృత్తి కాఁగా, పరమానందావాప్తికిఁ బాత్రుఁడు నగువాఁ డధికారి యునియు, మఱియు, నిటలతటఘటితాంజలియు ననుటచే "తద్విజ్ఞా

నార్థం సగురు మేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, ఉప హారపాణిస్స్వక్ సద్గురు ముపగమ్య నమస్కృత్య విశ్వాస వినయాభ్యామ్ '' అను మొదలగు శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడిన గురూపసరణక్రమము దెలుపఁబడినది. కృతకార్యుండు ననుటచేఁ గృతకృత్యత్వమును, నిరాకాంక్షుఁడు ననుటచేత సర్వసంగపరిత్యాగిత్వమును జెప్పఁబడినవి. నిత్యానిత్య వస్తువివేకయుక్తుండు ననటచేత '' బ్రహ్మైవ నిత్యంవస్తుతతోన్య దఖిలమ నిత్యమితి వివేచనం '' అనులక్షణముగల పరమాత్ముఁడు నిత్యుఁడనియుఁ దద్వ్యతిరిక్తంబగునది యెల్ల ననిత్యమను విచారణ యను మోక్షసాధనములు నాల్గిటిలో మొదటిది యగు నిత్యానిత్యవస్తువివేకముయొక్క సంపన్నత్వము చెప్పఁబడినది. సకలవిధైహికాముష్మికభోగ విరక్తుండు ననుటచేత ''ఐహి కానాం స్రక్చందనాది విషయభోగానాం కర్మజన్యతయాఽనిత్యత్వాత్'' ఐహికానా మప్యమృతాది విషయభోగానా మనిత్యతయా తేభ్యోనితరాం రతిరిహాముత్ర ఫలభోగవిరాగః '' అని చెప్పఁబడినట్లు, ఈ లోకమునందుఁ బూలదండలు, మంచిగంధము మొదలగు వైషయికభోగములు కర్మలవలనఁ బుట్టినవగుటచే ననిత్యములగునట్లు స్వర్గాదిలోకములయందుఁ గల యమృత పానము మొదలగువిషయభోగములుగూడఁ గర్మజన్యము లగుటచే వినశ్వర ములుగాన వానియందు నించుకయుఁ గోరికలేకయుండుట యిహాముత్ర ఫల భోగ విరాగ మనఁబడు రెండవ సాధనముయొక్క సంపత్తి వచియింపఁ బడినది. శమాదిషట్క సంపత్తియుతుండును ననుటచేత శమదమోపరతి తితిక్షాశ్రద్ధాసమాధానములను నాఱును శమాదిషట్కము నాఁబడు మూఁడవ సాధనముయొక్క సంపన్నత్వము వక్కాణింపఁబడినది. శమాదుల లక్షణ ము లిదిగలఱకు వివరింపఁబడినవి యైనను జదువరులకు సుఖబోధముకొఱకు నాచే రచింపఁబడిన పద్యములనుఁ గొన్నిటిని వ్రాయుచున్నాను.

క. పరమేష్ఠి మొదలుగా స్థా
వరముదనుక విషయభోగశ్వైరస్యముతో

చిరజీవిరోఁతపై బలె
విరక్తివైరాగ్య మదియ | విమలం బగుఁగా. ౧

క. నిత్యము బ్రహ్మము దృశ్య మ
సత్యం బనునట్టినిరత | సంశయశూన్య
ప్రత్యయము పరఁగు నిత్యా
నిత్యార్థవిచార మనఁగ | నిక్కము గాఁగన్. ౨

తే-గీ. పూర్వసంస్కారముల నెల్ల | సర్వకాల
మందు విడుచుట యిది శమ | మనఁగఁదగును
శ్రోత్రవాగాదివృత్తుల | చొరవ నణఁచు
కొనుట దమశబ్దవాచ్య మై | తనరుచుండు. ౩

తే-గీ. విషయసుఖములనుండి నివృత్తిజ్ఞాన
కారణం బగునుపరతి | గాఁ దనర్చుఁ
జలువ వేఁడిమి మొదలగు | సర్వదుఃఖ
ములకు నోర్చుటయ తితిక్ష | పలుకఁబడును. ౪

క. గురుశాస్త్రవాక్యములయెడఁ
బరవిశ్వాసంబు శ్రద్ధ | పలుకంబడుమేల్
గురుతును జిత్తైకాగ్రత
మరవక యుండుటయ యగు స | మాధాన మనన్. ౫

క. ఏరీతి దైవమూ సం
సారం బనుబంధ మెడయుఁ | జయ్యన నాకుఁ
సారం బగునీబుద్ధియ
యారయ మోక్షేచ్ఛ యనఁగ | నవనిం బరఁగున్. ౬

తే-గీ. ఇట్టిసాధనసంపత్తి | నియ్యకొనుచుఁ
దనదుమేలును గోరెడు | ధన్యజనుఁడు

జిత్స్వరూపపరిజ్ఞానసిద్ధికొఱకు
సలుపఁగాఁ దగు నాత్మవిచార మెపుడు. ౭

తే-గీ. ఇతరసాధనములచేత నెన్నఁడైన
జ్ఞాన మలవడ దాత్మవిచార మెడయ
భానుచంద్రాది తేజము లేనిచోట
ఘటపటాదికభానము గలుగు నెట్లు? ౮

అను మొదలగునంశములను మత్కృతంబగు నాంధ్రాపరోక్షానుభవమునందుఁ బరికించునది.

మ. సుమతీ! రాముఁడు నిర్వికారము సదా
శుద్ధంబు బుద్ధం బచిం
త్య మవాచ్యం బతులం బతీంద్రియము స
త్తామాత్రము స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్ప మజమున్
సత్సంవిదానందరూ
ప మమూర్తం బజరంబుఁ గేవల పర
బ్రహ్మంబు చింతింపఁగన్. ౭౭

టీ. సుమతీ=పరమపవిత్రమైన బుద్ధిగల ఓహనుమానుఁడా, చింతింపఁగన్=బాగుగ విచారణఁ జేసినయెడల, రాముఁడు=ఈ శ్రీరామచంద్రుఁడు, నిర్వికారము "షడ్భావవికారశూన్యమేవ మాది విలక్షణం" అను శ్రుతిచే జననమరణాది వికృతులు లేనిదియు, సదాశుద్ధంబు="శుద్ధం సూక్ష్మం నిరాకారం నిర్వికారం నిరంజనం" అను శ్రుతిచే నిత్యపరిశుద్ధమును, బుద్ధంబు="శుద్ధోబుద్ధస్సత్యోముక్తః" అను మొదలగు శ్రుతులచే స్వస్వరూపానుభవమువలనఁ దెలియఁబడునదియు, అచింత్యము="అచిన్త్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం। యన్మనసానమనుతే" అను శ్రుతులచే

బహిర్ముఖమగు మనస్సుచేఁ జింతించుటకు వీలులేనిదియు, అవాచ్యంబు = "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ - యద్వాదానభ్యుదితం" అను మొదలగు శ్రుతులచే వాక్కులచే నిర్ణీదని చెప్పుటకు వలనుపడనిదియు, అతులంబు = తనకు వేఱొండుసాటి లేనిదియు, అతీంద్రియము "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథా రసం నిత్య మగంధవచ్చయత్" అను శ్రవణముచే శబ్దాది విలక్షణం బగుటచే శ్రోత్రాదీంద్రియములకు గోచరము కానిదియు, సత్తామాత్రము = "నిత్యశుద్ధ చిదానంద స్సత్తామాత్రో హామవ్యయః" అను శ్రుతిచేఁ గాలత్రయాబాధ్యమానము గాన సత్స్వరూపమును స్వప్రకాశము = "సత్తామాత్ర ప్రకాశైక ప్రకాశం భావనాతిగం । బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం" అను మొదలగుశ్రుతులచే నొకదానిచేఁ దాఁ బ్రకాశింపఁబడక యన్నిటిం బ్రకాశింపఁజేయుచుఁ దనకుఁదాఁ బ్రకాశింపుచున్నదియు, నిర్ద్వంద్వము = నిరుపాధికముగావున శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములు లేనిదియు, నిర్వికల్పము = "నిర్వికల్ప స్వరూపాత్మా" అను శ్రుతిచే సంకల్ప వికల్పాత్మకమగు మనస్సు మొదలగు నంతఃకరణచతుష్టయము లేనిది గాన నేవికల్పములును లేనిదియు, అజము — "శాశ్వతోఽజస్స్వతంత్రః" అను శ్రుతిచేతఁ బుట్టువునకుఁ గారణమగు కర్మ లేదు గాన జన్మింపనిదియు, సత్సంవిదానంద రూపము = "బ్రహ్మమాత్రం చిదాకాశం సచ్చిదానంద మద్వయం" అను మొదలగు శ్రుతులచేత భూతభవిష్యద్వర్తమాన కాలములయందు నశింపనిదిగాన సద్రూపమును, జడవిలక్షణం బగుటచే సంవిద్రూపమును, దుఃఖరహితముగాన నానందరూపము నైనదియు, అమూర్తము = "నిర్వికారం నిరాకారం" అను శ్రుతిచేఁ గరచరణాద్యవయవవిశిష్టంబగు మూర్తిలేనిదిగాన నమూర్తమును, అజరంబు=అమూర్తమగుటచే ముసలితనము లేనిదియు నగు, కేవల పరబ్రహ్మంబు = "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిచే స్వప్రధాన మగు పరమాత్మయే యగును.

తా. పరమపావనము, నతిసూక్ష్మము నగు బుద్ధి గల యో యాంజనేయుఁడా! ఈ శ్రీరామచంద్రుఁడు సరిగ పెరుఁగుట తగ్గుట చచ్చుట పుట్టుట మొదలగు భావవికారము లాఱును లేనట్టియు, నెప్పుడును బరిశుద్ధమైనదియు, బోధస్వరూపమును, మనస్సుచే నిట్టిదని చింతించుటకు వీలులేనిదియు, వాక్కుచే నిట్టిదని చెప్పఁబడనిదియు, నిరుపమానమును, చక్షురాదీంద్రియములకు గోచరము కానిదియు, సత్యస్వరూపమును, తనకుఁ దా వెలుఁగొందు చున్నదియు, నద్వితీయమును, నేవికల్పములు లేనిదియు, పుట్టువులేనిదియు, సత్తు చిత్తు ఆనందము రూపముగఁ గలదియు, నాకారము లేనిదియు, ముదిమిలేనిదియు, సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యము నగు పరబ్రహ్మమే యగును. ౭౭

క. అవికారుఁ డయ్యుఁ గనకము
వివిధాభరణంబు లైనవిధమున నితఁడే
దివి యై భువి యై రవి యై
కవి యై సర్వాత్ముఁ డై ప్రకాశించుఁ దగన్. ౭౮

టీ. ఇతఁడు - ఏ = ఈ శ్రీరామచంద్రుఁడే, అవికారుఁడు - అయ్యున్ = పైని జెప్పినయట్లు ఏ వికృతులును లేక ఏకరూపమగు బ్రహ్మమేయైనను, కనకము = సువర్ణము, వివిధ = పలువిధములైన, ఆభరణంబులు = కడియములు మొదలగు నలంకారములు, ఐనవిధమునన్ = అగుపడుపున, దివియై = అంతరిక్షమునగుచు, భువియై = పుడమియు నగుచు, రవియై = సూర్యుఁడునునగుచు, కవియై = సమస్తమును సృజియించు బ్రహ్మయు నగుచు, సర్వాత్ముఁడై = పెక్కేల నిఖిల ప్రపంచ స్వరూపుఁడును దానేయగుచు, తగన్ = బాగుగ, ప్రకాశించున్ = భాసిల్లుచుండును, "దివిభూమౌ తథాకాశే బహిరంతశ్చయోవిభుః। ప్రవిభాత్యవభాసాతా తస్మై సర్వాత్మనే నమః॥ స్వయంబ్రహ్మ స్వయంవిష్ణుః

న్వయమింద్ర స్స్వయంశివః । స్వయంవిశ్వ మిదం సర్వం స్వస్మాదన్య న్న విద్యతే॥ సర్వం ఖల్విదం బ్రహ్మ యథా సౌమ్యైకేన లోహమణినా సర్వ లోహమయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం లోహ మిత్యేవ సత్యం'' అను మొదలగు శ్రుతిస్మృతుల యర్థము నిందు నన్వ యించుకొనునది.

తా. ఓ వత్సా, ఆంజనేయ! ఈ శ్రీరాముఁడు ఏ మార్పును లేక ఏకరూపమున నున్నవాఁడయ్యుఁ జరాచరాత్మకం బగు సమస్తప్రపంచమున కును దాను నిమిత్తోపాదానకారణుఁ డగుటచేత నాకసమును, బుడ మియు, సూర్యుఁడు, సమస్తమును గల్పించు సృష్టికర్తయు, సర్వప్రపంచ స్వరూపుఁడును దానయై బంగారము పలువిధంబులగు కటకకుండలాద్య లంకారములై యొప్పుచందమునఁ బ్రకాశింపుచున్నవాఁడు. ౭౮

అవ. ఇట్లు శ్రీరామచంద్రుఁడు సాక్షాత్పరమాత్మ స్వరూపుఁ డని చెప్పి యిఁక నే నాపరమాత్మునిచిచ్ఛక్తి నని చెప్పుచున్నది.

క. త్రిగుణాత్మిక నై యనిశము
జగములఁ బుట్టింపఁ బెంప సమయింపంగాఁ
దగుమూలప్రకృతియె నే
నగుదుఁజుమీ సత్యముగ మహాగుణశాలీ! ౭౯

టీ. మహాగుణశాలీ! మహత్ = సర్వోత్కృష్టములగు, గుణ = దయాసత్యశౌచాదు లగు సమస్తసద్గుణములచేతను, శాలీ = ఒప్పుచుండెడు వాంజనేయా! త్రి - గుణ - ఆత్మిక - ఐ = మూఁడగు సత్త్వరజస్త మోగుణములే స్వరూపముగాఁ గలది యగుచు, అనిశము=నిత్యమును, జగ ములన్ = నిఖిల భువనములను, పుట్టింపన్ = రజోగుణముచేత నిర్మించు టకును, పెంపన్=సత్త్వగుణముచేతఁ బోషించుటకును, సమయింపంగాన్=

తమోగుణముచేత నుపసంహారించుటకును, తగు = సామర్థ్యముగల, మూల ప్రకృతియు = చిచ్ఛక్తియే, సత్యముగఁ = నిజముగ, నేను - అగుదుఁగ- చుమీ= నేనె యగుచునుంటిని సుమా! "రామం విద్ధి పరంబ్రహ్మ సచ్చిదా నంద మద్వయం । సర్వోపాధివినిర్ముక్తం సత్తామాత్ర మగోచరమ్॥ ఆనన్దం నిర్మలం శాన్తం నిర్వికారం నిరఞ్జనం । సర్వవ్యాపిన మాత్మానం స్వప్రకాశ మకల్మషం॥ మాంవిద్ధి మూలప్రకృతిం సర్గస్థిత్యంతకారిణీమ్'' అను నధ్యాత్మ రామాయణమునందలి సీతావాక్యార్థము నీ ఘట్టమున ననుసంధించునది.

తా. శమదమాది సకల సద్గుణములచే నొప్పుచున్న యాంజనేయా! "అజామేకాం లోహితశుక్ల కృష్ణాం బహ్వీః ప్రజాః జనయంతీం సరూపాః" అను మొదలగు శ్రుతులచేత సత్త్వరజస్తమోగుణము లనుమూఁడును స్వరూపముగఁ గలదియై నిరంతరమును సకలలోకములను సృజించుటకును, బాలించుటకును, నుపసంహరించుటకును, సామర్థ్యము గల యాచిచ్ఛక్తియే నే నయి యుంటి నిది నిజము. ౭౯

అవ. ఇట్లు మూలప్రకృతియే జగత్కారణ మయినచో బ్రహ్మమే జగత్కారణ మని యుద్ఘోషించుచున్న "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః వాయో రగ్నిః ... యతోవా ఇమాని భూతాని జాయన్తే యేనజాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశంతీతి- తద్బ్రహ్మేతి" అను మొదలగు శ్రుతులకు విరోధము గలుగునే యనినఁ జెప్పుచున్నది.

క. అమలుఁ డగునితని సాన్ని
ధ్యమువలన సృజింతు జగ మస్వతంత్రిత నై యి
ట్లమర జడులచే మత్సృ
ష్టము గల్పింపఁబడు నీయసంగునియందున్. ౮౦

టీ. **అమలుఁడు** = అజ్ఞానకల్పిత మగు సంసారకలుషము లేనివాఁడు, **అగు**, **ఇతని** = ఐనట్టి యీ రామునియొక్క, **సాన్నిధ్యమువలనన్** = ఏకదేశమునందుఁ **జెంత నుండుటవలన**, **అతంద్రితనై** = తత్ప్రతిబింబసామర్థ్యముచే జాగరూకతఁగలదాననై, **జగమున్** = మహదాది కార్యకారణ సంఘాతాత్మక మగు నీప్రపంచము నెల్ల, **సృజింతున్** = నిర్మించుచుందును; **ఇట్లు** = ఈ వడువున, **తగన్** = ఒప్పిదముగ, **మత్సృష్టము** - **మత్** = నాచేత, **సృష్టము** = రచింపఁబడిన ప్రపంచము, **ఈ యసంగునియందున్** = నిస్సంగుఁడగు నీ రామునియందు, **జడులచేన్** = అజ్ఞానులచేత, **కల్పింపఁబడున్** = ఆరోపింపఁబడుచున్నది. మరుమరీచికలయందు (ఎండమావులయందు) నుదకముపగిదిని, రజ్జువునందు సర్పమువడువున, నాకసమునందు మాలిన్యమురీతిని భ్రాంతిచే నారోపింపఁబడుచున్న దనుట. "తస్యసన్నిధిమాత్రేణసృజామీదమతంద్రితా। తత్సాన్నిధ్యా న్మయా సృష్టం తస్మిన్నారోప్యతేఽబుధైః" అను నధ్యాత్మరామాయణవాక్యార్థము నిందు గమనించునది.

తా. ఓ పవనతనయా! మాయాసంబంధమగు కలుషము లేక పరమపవిత్రుఁడగు నీ శ్రీరామశుద్ధబ్రహ్మయొక్క యేకదేశమునందున్న నాయందా బ్రహ్మము ప్రతిబింబింపఁగా నా ప్రతిబింబచైతన్యసామర్థ్యమువలన సూర్యచంద్రనక్షత్రాదిసహితం బగు నీప్రపంచము నెల్ల నాయా మర్యాదలు దప్పకుండ నతిజాగరూకనై నిర్మింపుచు నుందును. ఇట్లు నాచే సృజియింపఁబడిన ప్రపంచము మాయామాయాకార్యసంగములేని యీ శ్రీరామశుద్ధబ్రహ్మమునందు నజ్ఞానులచే నారోపింపఁబడుచున్నది. ౨౦

మఱియు నిచ్చట నీప్రక్రియ గమనింపఁ దగియున్నది. "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచయేత్" అను న్యాయమున నధ్యారోపాపవాదములచే బ్రహ్మతత్త్వమును నుపపన్నుఁ డగు శిష్యునకు నుపదేశింపవలయును గాన నీపద్యమునందుఁ దొలుత నధ్యారోపక్రమము సూక్ష్

ముగ సూచింపఁబడినది. తద్వివరణం బెట్లనిన—"అసర్పభూతాయాం రజ్జౌ సర్పారోపవద్వస్త్వన్యవస్త్వారోప అధ్యారోపః" అనుటచేత వ్యావహారిక పదార్థముగ నంగీకరింపఁబడిన త్రాటియందు మిథ్యాభూత మగు పాముయొక్క యారోపణముగా త్రాటియందుఁ జొరఁబడిన చైతన్యమునందుండు నజ్ఞానము సర్పజ్ఞానముయొక్క యాభాసరూపమునఁ బరిణమించినదై సర్పాకారముగ మాఱును. ఈ మాఱుట త్రాటియందలి చైతన్యమునం దున్న యజ్ఞానమే మూలముగఁగల దగుటచేత నిది త్రాడుగాని పాము గా దను విశేషజ్ఞానము గలిగినపిదపఁ బొడమెడునధిష్ఠానభూతమగు రజ్జువుయొక్క సాక్షాత్కారముచేత నా త్రాటియందలి యజ్ఞానము పోఁగా, పా మను భ్రాంతి పోవును గాన నీ దృష్టాంతానుసారముగ దార్ష్టాంతికము నన్వయించుకొనవలయు నెట్లనిన, సచ్చిదానందస్వరూపమగు నద్వితీయపరబ్రహ్మము ప్రపంచాధిష్ఠానభూత మగువస్తువు, తద్విలక్షణం బగునజ్ఞానము మొదలుగాఁగల జడజాతమెల్ల మిథ్యాభూతమును, దృశ్యమును, సావయవంబును, వికారియు, సాపేక్షసిద్ధమును గావున నవస్తువు. అజ్ఞాన మన్ననో వస్తువనిగాని యవస్తువనిగాని చెప్పుటకు వలనుపడదు. కుందేటికొమ్మువలె మిథ్యాభూత మగుటవలన వస్తువునుగాదు, ప్రపంచమునకు హేతుభూత మగుటవలన నవస్తువును గాదు. "దేవాత్మశక్తిం త్రిగుణై ర్నిగూఢాం" అను శ్రుతివలనను, నేనజ్ఞుఁడ ననుమొదలగు ననుభవమును బట్టియు గుణత్రయాత్మకమును జ్ఞానమునకు విరోధియు, భావరూపము నగుటచే నిట్టిదని నిర్దేశించుటకు శక్యము గాక యున్నది. అజ్ఞాన మిట్లు అఘటితఘటనాపటీయ మయ్యు "దైవీహ్యేషా గుణమయీ మమమాయాదురత్యయా మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అను భగవద్వాక్యముచేతఁ బరమాత్మసాక్షాత్కారముచేత నశించును-జ్ఞానముయొక్క యభావమే యజ్ఞానమని తార్కికులు సెప్పెదరుగాని యది పై నుదాహరింపఁబడిన శ్రుతిస్మృతులకు విరుద్ధము గావున పైనిజెప్పినవడువున ననిర్వచనీయానాదిభావరూప మగు జ్ఞానము

కలదనుటకు నేనజ్ఞుఁడను నన్ను నే నెఱుంగను అను నపరోక్షావభాసమే ప్రబలప్రమాణము - వాస్తవముగ నీ యజ్ఞాన మొకటి యయ్యు సమష్ట్యభిప్రాయముచే నేకముగను, వ్యష్ట్యభిప్రాయముచే ననేకముగను, వ్యవహరింపఁబడుచున్నది. ఎట్లనిన, చెట్లయొక్క సమష్ట్యభిప్రాయముచే వనమనియు, నీళ్లయొక్క సమష్ట్యభిప్రాయముచేఁ గొలననియు వ్యపదేశింపఁబడుచున్నట్లు పలు తెఱంగులఁ దోఁపట్టుచున్న జీవులయందలి యజ్ఞానములయన్నిటియొక్క సమష్ట్యభిప్రాయముచేత "అజా మేకాం" అను శ్రుతిని బట్టి యాయజ్ఞాన మొకటియే యని చెప్పఁబడును. ఈ సమష్టి (అజ్ఞానములన్నియు నొకటియగుట) పెక్కులగుజీవులయొక్కనికృష్ట్యాస్తకరణరూపములగు వ్యష్ట్యుపాధులకన్న రాగాదికలుషములు లేనిదియు, కార్యరూపమగు సమస్తప్రపంచమునకు హేతుభూతము నగు మూలాజ్ఞానము సమష్టిభూతమగు నుత్కృష్టోపాధి యగుటచేత శుద్ధసత్త్వప్రధానమైనది. దీనియందు బింబించిన బ్రహ్మచైతన్యము, చరాచరాత్మకప్రపంచమున కెల్ల సాక్షి యగుటచే సర్వజ్ఞమనియు, సకలజీవులకు స్వస్వకర్మానురూపఫలముల నిచ్చుచుండుటచే నీశ్వరుఁ డనియు, సకలజీవులకునుఁ బ్రేరణచేయుటచే నియంతయనియు, సమస్తజీవులయొక్క హృదయములయం దుండి బుద్ధుల నెల్ల నియమించుచుండుటచే నంతర్యామియనియు, స్థావరజంగమాత్మకమగు ప్రపంచమున కెల్ల వివర్తాధిష్ఠానమగుటచే జగత్కారణమనియు "యస్సర్వజ్ఞ స్సర్వవి" దిత్యాది శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడుచున్నది. ఆ పరమేశ్వరునకును మూలప్రకృతి యగుటవలనఁ గారణశరీరమనియు, ఆనందప్రచురమగుటచేతను గోశమువడువున నాత్మాచ్ఛాదక మగుటచేతను, ఆనందమయకోశమనియు, స్థూలములు సూక్ష్మములు నగు నిఖిలోపాధులును గారణోపాధులయందు లీనము లగుటచే సుషుప్తమనియుఁ, గావున నే పంచీకృతభూతకార్య మగు స్థూలప్రపంచమునకును, జాగ్రదవస్థావిశిష్టమును నపంచీకృతభూతకార్యమును పరమసూక్ష్మము నగు స్వప్నప్రపంచమునకును,

లయస్థానమనియు వ్యవహరింపఁబడుచున్నది. ఇఁక వ్యష్టిరూపమగు నజ్ఞాన స్వరూప మెట్లనిన.

అనేక జాతులవృక్షములయొక్క సమష్టికి వన మని యొకటిగా వాడుక యున్నను వేర్వేఱుచెట్లను జెప్పునపుడు మామిడి జామి పనస మొదలగు పెక్కుచె ట్లున్నవని చెప్పునట్లును, బావులు నూతులు చెఱువులు మొదలగువానిసమష్టిని జెప్పునపుడు జలాశయ మని యొకటిగా వాడుక యున్నను, వేఱువేఱుగ బావి-చెఱువు-నూయి అను మొదలుగఁ జెప్పునపుడు పెక్కుతెఱంగుల నీ ళ్లున్నవని చెప్పునట్లును, సకలప్రపంచమునకుఁ గారణ మగు నజ్ఞానము సమష్టిరూపమున నొకటిగా నున్నను నహంకారము మొద లగువానికిఁ గారణభూతము లగు జీవులయందలి యజ్ఞానములను వేఱువేఱుగఁ జెప్పునపుడు అజ్ఞానములు పెక్కు లని వ్యవహారము గలదు; ఇందులకు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అను మొదలగు శ్రుతి ప్రమా ణము. మఱియు నీ యజ్ఞానమును నజ్ఞానావచ్ఛిన్నమగు చైతన్యము నొక్క టియే యయ్యు మట్టికుండలు మట్టిపిడతలు మట్టిదాకలు మట్టిమూఁకుడులు నను నట్లు భేదమును జెప్పునపుడు వ్యష్టి యనియు, ఘటాదికమెల్లను మట్టియే యనునట్లు, అభేదమును జెప్పునపుడు సమష్టి యనియు, వ్యవహారము. జీవు లను బొందియున్న యీ వ్యష్టి నికృష్టమగు నుపాధికం బగుటచే మలిన సత్త్వప్రధాన మైనది; కావుననే మహాప్రళయకాలమునందు సమష్టిగా నున్నది. శుద్ధసత్త్వప్రధాన యగు మూలప్రకృతికిని దైనందినప్రళయకాలము నందు వ్యష్టిగా నున్న జీవప్రకృతికినిఁ బరస్పరభేదము ఈ వ్యష్ట్యుపలక్షిత మగు చైతన్యము కించిజ్జ్ఞత్వానీశ్వరత్వాదిగుణములు గలదియై ప్రాజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నది. ఈశ్వరునియందలి మూలాజ్ఞానము, జీవునియందలి యహంకారాది విక్షేప సంస్కారరూపాజ్ఞానమును, వాస్తవముగ నొక్క టియే యగుటచేత నా యజ్ఞానములకు నవభాసకములగు నీశ్వరజీవచైతన్య

ములుగూడ నొకటిచే యగును. వ్యష్ట్యుపహితమగు నీ జీవచైతన్యము పూర్వవాసనారూపమై యస్పష్టమగు నుపాధి (మలినసత్త్వప్రధానోపాధి) గలదగుటచేత మిగులఁ బ్రకాశముగాదుగానఁ బ్రాజ్ఞుఁ డనఁబడును. ప్రళయ కాలమునందు హిరణ్యగర్భుఁడు మొదలుగాఁగల ప్రపంచమునకు నుత్పాదక మగు నీశ్వరునియందలి మూలప్రకృతివలె సుషుప్తికాలమునందు నహంకా రము మొదలుగాఁగల శరీరమునకు నుత్పాదకమగు సంస్కారము మాత్రము మిగిలియున్న జీవునియందలి వ్యష్టిరూపమగు నజ్ఞానముకూడఁ గారణ శరీరమనియు, ఇంద్రియములనియు, నింద్రియార్థములనియు, భావము లేమిం జేసి యతివ్యాసంగము లేకుండుటచే నానందప్రాచుర్యమున నానందమయ మనియు, నాత్మస్వరూపాచ్ఛాదక మగుటచేతఁ గోశమనియుఁ జెప్పఁ బడుచున్నది. మఱియు నిది వ్యావహారిక మగు పంచీకృతస్థూలశరీరము, ప్రాతిభాసిక మగు నపంచీకృత సూక్ష్మశరీరమునందును, ప్రాతిభాసిక మగు నా స్వప్నప్రపంచముగూడ స్వకారణ మగు నజ్ఞానమునందును లీన యుండుటచేత సుషుప్తి యనఁబడుచున్నది. "లయే ఫేనస్య తద్ధర్మా ద్రవా ద్యాస్స్యుస్తరంగకే। తస్యాపి విలయే నీరే తిష్ఠం త్యేతే యథా పురా॥ వ్యావహారిక దేహస్య లయస్స్యా త్ప్రాతిభాసికే। తల్లయే సచ్చిదానందాః పర్యవస్యంతి సాక్షిణి" అని యిందులకు నుదాహరణము. "ఆనంద భుక్చేతోముఖః ప్రాజ్ఞః" అను శ్రుతివలనను "నేను సుఖముగ నిద్రించితి, నప్పుడు నేనేమియుఁ దెలియకయుంటిని" అని నిదుర లేచినవానికి సుషుప్తి కాలీన సుఖాజ్ఞానముల యనుభవ పరామర్శమును బట్టి స్వచ్ఛ మగుటచే నంతఃకరణమునకు వృత్తి నంగీకరించినట్లు చైతన్యముచేఁ బ్రకాశింపఁబడు నజ్ఞానమునకుఁగూడ వృత్తు లంగీకరింపఁబడుచున్నవి గాన, నీశ్వరుఁడు స్వకీయాజ్ఞానవృత్తులచే నా సుషుప్తియందు నిజానందము ననుభవించు చుండును. జీవుఁడుగూడ సంస్కారము మాత్రము మిగులుగాఁ గల యజ్ఞా నముయొక్క వృత్తులచేఁ దన యానందాతిశయమును సుషుప్తికాలము

బును,మాయాసీతాపహరణంబును, జటాయుకబంధమోక్ష లాభంబును, శబరీపూజనంబును, సుగ్రీవసమాగమంబును, వాలివధంబును, సీతాన్వేషణంబును, సముద్ర సేతు బంధనంబును, లంకానిరోధనంబును, భీమసంగ్రామంబున భ్రాతృపుత్త్రబాంధవ హితజనాది సహితంబుగా రావణహరణంబును, బుష్పకారోహణంబును, మత్సమేతంబుగా సాకేతపుర గమనంబును, రాజ్యాభిషేచనంబును మొదలుగాఁ గల కార్యంబులన్నియు నాచే నాచరితంబు లయ్యె; నట్లగుచుండ నిర్వికారుం డఖిలాత్మకుం డైన యీ రామునియందజ్ఞానులచే నారోపింపఁబడుఁ గావున. ౮౧

టీ. అది = నిత్యశుద్ధుఁడగు రామునియందు మూఢులు సంసారము నారోపించుట, ఎట్లనినన్ = ఏలాగున నంటివేని, ఆకర్ణింపుము = ఆలకింపుము. అయోధ్యా నగరంబునన్ = అయోధ్యా (శత్రుయోధులు ముట్టడించి యుద్ధము చేయుటకు శక్యముకానిది గాన) అయోధ్య యనఁబడు వీటియందు, అతినిర్మలంబు + ఐన = పరమపవిత్ర మగు, రఘువంశంబునందు = రఘు వను మహారాజుయొక్క కులమునందు, ఇతనిజన్మంబును = ఈ రామచంద్రునియొక్క యుత్పత్తియు, విశ్వామిత్ర సహాయత్వంబును = విశ్వామిత్రుఁ డను మహామునికి సహాయభూతుఁ డగుటయు, తత్ = ఆ కుశికనందనుని సంబంధమగు, మఖ = జన్నముయొక్క, రక్షణంబును = రాక్షసబాధ లేకుండఁ బాలించుటయు, అహల్యాశాప శమనంబును = అహల్య యను గౌతమమునిపత్నియొక్క పాషాణరూపముగ నుండుట యను శాపమును దనపాదధూళిచేఁ దీర్చుటయు, హర + ధనుః + భంగమును = ఈశ్వరుని కార్ముకమును ముక్కలు చేయుటయు, మత్ + పాణిగ్రహణంబును = నన్నుఁ బెండ్లాడుటయు, పరశురామ + పరా

క్రమ+భంజనంబును = భార్గవునియొక్క ప్రతాపమును గీటణంచుటయు, పురప్రవేశంబును = మరల నిజనగరమునకు నరుగుటయుం, దండక + అరణ్య + గమనంబును = దండక మను నడవికి జనకుని వచనమును పాలించుటకుఁ జనుటయు, విరాధ + నిధనంబును = విరాధుఁ డనువానిని రూపుమాపుటయు, శూర్ప...ఛేదనంబును - శూర్పణఖా = (చేఁటలఁ బోలినగోళ్లు గలది గాన) శూర్పణఖ యనఁబడు రావణుని చెలియలి యొక్క, కర్ణ = వీనులను, నాసికా = ఘ్రాణమును, ఛేదనంబును = తన తమ్మునిచేఁ గోయించుటయు, ఖర...ఖండనంబును - ఖర + దూషణ + త్రిశిరః + ప్రముఖ = ఖరుఁడు దూషణుఁడు త్రిశిరసుఁడు లోనుగాఁగల, రాక్షస = నక్తంచరులయొక్క, ఖండనంబును=పరిమార్చుటయు,మాయా+ మారీచ + హరణంబును = కపటపుజింకరూపున నేతెంచిన మారీచుఁ డను రక్కసుని వధించుటయు, మాయాసీతా + అపహరణంబును = కృత్రిమపు జానకిని రావణుఁడు దొంగిలించుటయు, జటాయు కబంధ మోక్ష లాభంబును = జటాయు వను గద్దలయేకిమీనికిని, కబంధుఁ డనువానికిని ముక్తి లభించుటయు, శబరీపూజనంబును = శబరి యను బోయత తను నారాధించుటయు, సుగ్రీవ + సమాగమంబును - సుగ్రీవుఁ డను వానరునితోఁ గలయుటయు, వాలివధంబును = సుగ్రీవునియన్న యగు వాలిని జంపుటయు, సీతా + అన్వేషణంబును = జానకిని జూచివచ్చుటకు వానర వీరులను బనుచుటయు, సముద్ర + సేతు + బంధనంబును = సముద్రమునందు మెట్టలచాలుచేఁ గట్టు గట్టించుటయును, లంకా + నిరోధనంబును = లంకాపట్టణమును ముట్టడించుటయు, భీమ+సంగ్రామంబునన్ = బెడిదపు టాలమునందు, భ్రాతృ...సహితంబుగాన్ - భ్రాతృ = సోదరులు, పుత్త్ర = కొమరులు, పౌత్త్ర = మనుమండ్రు, బాంధవ = బంధువులు, హిత + జన = సంగాతకాండ్రు, ఆది = లోనగువారితో, సహితంబుగాన్ = కూడుకొనునట్లు, రావణ + హరణంబును = దశవదనుని

దునుముటయు, విభీషణ = రావణునితమ్ముఁడగు విభీషణునికి, రాజ్య = రాక్షసాధిపత్యమును, ప్రదానంబును = ఒసఁగుటయు, పుష్పక + ఆరోహణంబును = కుబేరపుష్పకం బనియెడు దివ్యవ్యోమయానము నధిరోహించుటయు, మత్ + సమేతంబుగాన్ = నాతోఁ గూడునట్లుగ, సాకేత + పుర + గమనంబును = సాకేత మను నామాంతరము గల యయోధ్యా నగరమునకు నరుదెంచుటయు, రాజ్య + అభిషేచనంబును = భూలోక సామ్రాజ్యమునకు వసిష్ఠాది మునులు తనకు మూర్ధాభిషేకము సేయుటయు, మొదలుగాఁగల = తొల్లిగాఁగలయట్టి, కార్యంబులన్నియున్ = ఎల్ల కృత్యములును, నాచేతన్ = మూలప్రకృతిస్వరూపిణి నగు నావలననే, ఆచరితంబులు = నెఱవేర్పఁబడినవి, అయ్యెన్ = అయినవి. ఇట్లు - అగుచున్ - ఉండన్ = ఇవ్విధమున జరిగియున్నను, నిర్వికారుండు = ఉపచయాపచయాది వికృతులు లేనివాఁడును, అఖిలాత్మకుండు = సమస్త ప్రాణికోటికిని నాత్మభూతుండును, ఐన - ఈ - శ్రీరామునియందున్ = అగు నీ శ్రీరామమూర్తియందు, అజ్ఞానులచేతన్ = మూఢులచేత, ఆరోపింపఁబడున్ = రాముఁడే యాయాకార్యముల నన్నిటిని జేసెనని భ్రాంతిచేతఁ గల్పింపఁబడును. కావునన్ = ఇట్లగుటంజేసి, ఇచట "అయోధ్యానగరే జన్మ రఘువంశేఽతి నిర్మలే । విశ్వామిత్రసహాయత్వం మఖసంరక్షణం తతః । అహల్యాశాపశమనం చాపభంగో మహేశితుః । మత్పాణిగ్రహణం పశ్చాద్భార్గవస్య మదక్షయః॥ అయోధ్యానగరే వాసో మయా ద్వాదశవార్షికః । దండకారణ్యగమనం విరాధవధ ఏవచ । మాయామారీచమరణం మాయాసీతాహృతి స్తథా । జటాయుషో మోక్షలాభః కబంధస్య తథైవచ । శబర్యాఃపూజనం పశ్చాత్సుగ్రీవేణ సమాగమః । వాలినశ్చ వధః పశ్చాత్సీతాన్వేషణమేవచ । సేతుబంధశ్చ జలధౌ లంకాయాశ్చనిరోధనం । రావణస్యవధోయుద్ధే సపుత్రస్యదురాత్మనః । విభీషణే రాజ్యదానం పుష్పకేణ మయాసహ । అయోధ్యాగమనం పశ్చాద్రాజ్యే

రామాభిషేచనం । ఏవ మాదీని కర్మాణి మయైవాచరితాన్యపి । ఆరోప యన్తి రామేఽస్మి న్నిర్వికారేఽఖిలాత్మని॥'' అను రామహృదయము నందలి సీతావాక్యార్థము అనువదింపఁబడిన దని తెలియునది.

తా. పవననందనా ! ఆ యారోపణప్రకారంబుఁ జెప్పెద నాల కింపుము. సాకేతపురంబునఁ బరమపవిత్రం బగు మిత్రగోత్రంబున నీ రామ చంద్రుని జననంబును, కుశికనందనాగమనంబును, తదీయ సవనపరిపాల నంబును, నహల్యాశాప విమోచనంబును, నీశానశరాసన భంజనంబును, మదుద్వాహనంబును, భృగుతనయ ప్రతాప నమాపనంబును, నిజపుట భేదనమునకుఁ బునరాగమనంబును, దండకవనమునకుఁ జనుటయు, విరా ధుని యసువులం గొనుటయు, శూర్పణఖ యను రక్కసి వీనులను ముక్కును గోయుటయు, ఖరుఁడు లోనుగాఁ గల దానవులం బరి మార్చుటయుఁ, గపటపులేడియై వచ్చినమారీచుని జంపుటయు, సంన్యాసి వేషముతో వచ్చిన దశాననుఁడు కృత్రిమసీతను దొంగిలుటయు, జటా యువను గద్దలఱేనికిని, గబంధుఁ డనువానికిని ముక్తినొసఁగుటయు, శబరి యను బోయతచే నారాధింపఁబడుటయు, సుగ్రీవుఁ డను వానరేంద్రుఁడు తనతో మైత్రి సేయుటయు, వాలిని నేలం గూలుచుటయు, నన్ను వెదకుటకు నలుగడలకు వానరవీరులం బనుచుటయు, కడలిని మెట్టలచాలుచేఁ గట్టుకట్టు టయు, లంకాపట్టణమును ముట్టడించుటయు, బెడిదపుటాలమునఁ దమ్ములు కొమరులు మనుమలు బందుగులు చెలికాండ్రు మొదలగువారితోఁగూడ రావ ణాసురుని సంహరించుటయు, విభీషణునకు రాక్షసరాజ్యము నొసఁగు టయుఁ, బుష్పకమను దివ్యవిమానము నెక్కుటయు, నాతోఁ గూడి మరల తనరాజధానికి నేతెంచుటయు, చతుస్సముద్రముద్రిత మహీమండల సామ్రా జ్యాభిషిక్తుం డగుటయుఁ, దొల్లిఁగఁగల యెల్లపనులు నాచేఁ జేయింపఁబడిన వయ్యు నేవికృతులు లేనివాఁడును, సర్వప్రాణులకు నాత్మభూతుఁడునగు

నీ శ్రీరామభద్రునియందు మూఢులచే నవియెల్ల నారోపింపఁబడుచున్న విట్లగుటంజేసి. ౮౦

ఉ. రాముఁడు నిర్వికారుఁడు ని
రామయుఁ డవ్యయుఁ డక్షరుండు ని
ష్కాముఁ డతీంద్రియుం డజుఁ డ
కర్త యభోక్త యసంగుఁ డంతరా
రాముఁడు నిర్వికల్పుఁడు ని
రంజనుఁ డద్వయుఁ డైనయాపరం
ధాముఁడుగాని చారుగుణ
ధాముఁడు గాఁడు సమీరనందనా. ౮౨

టీ. సమీరనందనా = ఓపవనతనయా, రాముఁడు = ఈ శ్రీరామచంద్రుఁడు, నిర్వికారుఁడు = మాయాతీతుఁ డగుటచే మనోవికృతు లెవ్వియును లేనివాఁడును, నిరామయుఁడు = నిరుపాధికుం డగుటచే నాధివ్యాధులు లేనివాఁడును, అవ్యయుఁడు = ఎప్పుడు నేకరూపుఁడగుటచే క్షయము లేనివాఁడును, అక్షరుండు = "అక్షరం పరమంబ్రహ్మ స్వభావోఽధ్యాత్మ ముచ్యతే, యదక్షరం వేదవిదో వదంతి, యస్ససర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి, అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాంగతిమ్" అను భగవద్వచనములనుబట్టి సమస్తభూతగ్రామము నశించినను, దాను నశింపక యుండువాఁడును, నిష్కాముఁడు=అవాప్తసర్వకాముం డగుటచేఁ దన కేయభిలాషయు లేనివాఁడును, అతీంద్రియుండు = చక్షురాదీంద్రియములచే గ్రహింపఁబడనివాఁడును, అజుఁడు=జన్మమునకు హేతుభూతమగు కర్మలు లేమిఁజేసి పుట్టువులేనివాఁడును, అకర్త = కార్యసాధకములగు మనస్సు మొదలగు నుపకరణములు లేకుండుటచేఁ గర్తృత్వము లేనివాఁడును, అభోక్త = సుఖదుఃఖాద్యనుభవము లేనివాఁడును, అసంగుఁడు =

నిష్కాముండగుటచే దేనియందు నాసక్తిలేనివాఁడును, అంతరారాముఁడు= సర్వసాక్షి యగుటచే సకలజీవమనోవృత్తులయం దుండి రమించుచుండు వాఁడును, నిర్వికల్పుఁడు = అశేషకల్పనారహితుఁడును, నిరంజనుఁడు = "అద్వయం చేంద్రియాతీతం నిర్వికల్పం నిరంజనం" అని స్వరూపలక్షణ కథనముచే నవిద్యాసంపర్కము లేమింజేసి నిర్లేపుండును, అద్వయుఁడు= "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అను శ్రుత్యంతరముచే నద్వితీయుఁడును, ఐన- ఆ పరంధాముఁడు-కాని = అగునట్టి తత్పదలక్ష్యార్థభూతపరమాత్ముఁ డగు శ్రీమన్నారాయణుఁడుగాని, చారు = పైకి నాపాతరమ్యములుగనుండు, గుణ = మాయాగుణములకు, ధాముఁడు = స్థానమైనవాఁడు, కాఁడు = అయియుండలేదు.

తా. ఓకరువలిపట్టీ, శ్రీరామభద్రుఁడు, స్థూలసూక్ష్మకారణము లను నుపాధులు లేనివాఁడగుటచే నేవికృతులును లేనివాఁడును, గావున నేవిధమయిన జబ్బులును లేనివాఁడును, క్షీణింపనివాఁడును, నాశము లేని వాఁడును, నే యభిలాషయు లేనివాఁడును, చక్షురాదీంద్రియములకు గోచ రుఁడు కానివాఁడును, పుట్టువులేనివాఁడును, అజ్ఞానకార్యములగు కర్తృ త్వభోక్తృత్వములు లేనివాఁడును, మాయాసంగము లేనివాఁడును, సర్వాం తర్యామియు, నేవికల్పములును లేనివాఁడును, నిర్లేపుఁడును, స్వజాతీ యాది భేదములు లేనివాఁడును, నగు నా పరమాత్ముఁడుగాని యాపాత మధురము లగు నీ సాంసారికగుణములు గలవాఁడు గాఁడు. ౧౨

. . . విశేషార్థములు. ఇందు-అతీంద్రియుఁడనుపట్ల "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనోయ ద్వాచో హ వాచగ్ంస ఉ ప్రాణస్య ప్రాణశ్చక్షుషశ్చ క్షురతిముచ్యధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవంతి, నతత్రచక్షుర్గచ్ఛ నవాగ్గచ్ఛతి నో మనోనవిద్మో నవిజానీమోయథై తదనుశిష్యాదన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి, ఇతి శుశ్రుమపూర్వేషాం యేన స్తద్వ్యాచచక్షిరే

యద్వాచానభ్యుదితంయేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం య దిద ముపాసతే, యన్మన సానమనుతే యేనాహుర్మనోమతం, తదేవబ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే, యచ్చక్షుసా నపశ్యతి. యేనచక్షూంషి పశ్యతి తదేవబ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే, యచ్ఛ్రోత్రేణ నశృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతంతదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ము పాసతే, యత్ప్రాణేన నప్రాణితి యేనప్రాణః ప్రణీయతే తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదంయదిద ముపాసతే'' అను శ్రుత్యర్థము సావకాశముగ విచారణ చేయఁ దగియున్నది గాన నది యెట్లనిన, ఇందు "శ్రోత్రస్య శ్రోత్రం... భవన్తి'' అను వాక్యమునకు రంగరామానుజులవా రిట్లు వ్రాసిరి. మనస్సు ఎవ్వనిచేఁ బ్రేరేపింపఁబడుచుఁ దనకు గోచరమగు విషయమునందుఁ బ్రవర్తింపుచు న్నది? ప్రాణములలో ముఖ్యప్రాణ మెవనిచేఁ బ్రేరితమగుచు సంచరింపుచు న్నది? ఎవనిచేఁ బ్రేరేపింపఁబడినవాక్కు నవలంబించి లోకులు వ్యవహరిం పుచున్నారు? అచేతనములగు చక్షురింద్రియమునకు శ్రోత్రేంద్రియమునకుఁ బ్రేరకుం డెవఁడు? అని గురువును శిష్యుఁ డడుగఁగా గురుం డిట్లనియె. శ్రో త్రేంద్రియమునకు, నేత్రేంద్రియమునకు, మనస్సునకు, వాక్కునకుఁ, బ్రాణ మునకుఁ బ్రకాశకుఁ డగుచుఁ బ్రేరకుఁడైన దేవునిఁ దెలిసికొని జ్ఞాను లీలో కమునుండి యర్చిరాదిమార్గమునఁ బోయి ముక్తు లగుదురు. శంకరాచార్యు లీవాక్యమున కిట్లు వ్రాసిరి. పైని జెప్పినయ ట్లడిగిన శిష్యునకు గురువు, వత్సా! మనసు మొదలగు నింద్రియవర్గమునకు నేదేవుఁడు ప్రేరకుఁ డెట్లు ప్రేరేపించుచున్నాఁడని నీ వడిగినప్రశ్నములకు సమాధానమును వినుము. ధ్వనిని వినుటకు సాధనమగు శ్రోత్రేంద్రియమునకు శ్రోత్రమును, రూప మును గనుటకు నుపకరణమగు నేత్రేంద్రియమునకు నేత్రమును, "చక్షుశ్శ్రోత్రం తదేవోయునక్తి.'' అని నీవడిగినదేవుఁ డగుచున్నాఁడు. చక్షుశ్శ్రోత్ర ముల నెవఁడు తమతమ విషయములయందు నియోగించుచున్నాఁడని యడు గునపుడు - ఇట్టివాఁడు నియోగించుచున్నాఁ డని చెప్పక శ్రోత్రమునకు

శ్రోత్రము నేత్రమునకు నేత్రము నీ వడిగినదేవుఁ డగుచున్నాఁడని చెప్పుట ప్రశ్నానురూపంబగు ప్రతివచనంబు గాదనవలదు. శ్రోత్రేంద్రియము మొదలగు నింద్రియముల వ్యాపారమునకన్న వేఱగు వ్యాపారము గల శ్రోత్రాది ప్రేరకుఁడు దోపట్టనేని యీ ప్రతివచనము సరిపడక యుండును. ఇచట శ్రోత్రాదీంద్రియప్రేరకుఁడు నిజవ్యాపారము గలిగి దోఁచఁబడి యుండలేదు. గుమిగూడిన శ్రోత్రాదులయొక్క ఆలోచన సంకల్పము అధ్యవసాయము అను వ్యాపారముచేతనే ఇంద్రియప్రేరకుఁడు శ్రోత్రాదులకన్న భిన్నముగ నున్నాఁడని దోపట్టుచున్నాఁడు. కావున "శ్రోత్రస్య శ్రోత్రం" అను మొదలగు ప్రతివచనము సరిపడియున్నది. సరేకాని ప్రకాశమునకు వేఱొక ప్రకాశముతోఁ బని లేనట్లు శ్రోత్రమునకు నింకొకశ్రోత్రముతోఁ బ్రయోజనములేదుగాన "శ్రోత్రస్య శ్రోత్రం" అను మొదలగుపట్ల శబ్దార్థ మెట్లు సరిపడు ననిన, శ్రోత్రాదీంద్రియజాతము తమతమ శబ్దాదివిషయములను దెలుపుటకు సమర్థమయి యున్నది. శ్రోత్రాదుల కట్టిసామర్థ్యము, నిత్యమును, సర్వాంతర్యామియు, చైతన్యాత్మకము నగు నాత్మప్రకాశము లేనిచోఁ గలుగదుగాన "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనః" అను మొదలగు నది యుపపన్నమే యగును. ఈ యర్థమునకు నుపబలముగ "ఆత్మనైవాయం జ్యోతిషాస్తే...తస్యభాసా సర్వ మిదం విభాతి, యేన సూర్యస్తపతి తేజసేద్ధః" అను మొదలగు శ్రుతులును, "యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం । య చ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం । క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత" అను భగవద్వచనములు "నిత్యోనిత్యానాం చేతన శ్చేతనానాం" అను మొదలగు శ్రుత్యంతరములును గలవు. కనుక శ్రోత్రాదికమే సమస్తప్రాణికోటికి నాత్మభూతమయియున్నదను నింద్రియాత్మవాదులమత ముపేక్షింపఁదగినది. అట్లు చైతన్యప్రకాశము లేనిచో మనోబుద్ధ్యాద్యంతఃకరణమును స్వవిషయమగు సంకల్పాధ్యవసాయాదికమునకు సమర్థమైనది కాదుగాన మనస్సునకు మనస్సును,

క్కునకు వాక్కును, ప్రాణమునకు ప్రాణమును నీవడిగినవస్తు వగుచున్నది. “కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాద్యదేష ఆకాశ ఆనందో న స్యాత్ । ఊర్ధ్వం ప్రాణ మున్నయత్యపానం ప్రత్యగస్యతి । యేన ప్రాణః ప్రణీయతే తదేవ బ్రహ్మత్వం విద్ధి” అను మొదలగు శ్రుతులనుబట్టి సర్వాధిష్ఠానమగు పరమాత్మ లేనిచోఁ బ్రాణము మొదలగువానికిఁ బ్రాణము (బ్రదుకుట) మొదలగు వానియందు సమర్థత లేదు. రూపమునకుఁ బ్రకాశమగు చక్షురింద్రియమునకుఁ గల రూపమును గ్రహించెడు సామర్థ్యము ఆత్మచైతన్యాధారమును బట్టియే కలదు గాన, నా పరమాత్మచక్షువునకుఁ జక్షు వయియున్నది. అని యెఱింగిన జ్ఞానులు శ్రోత్రాదీంద్రియములయందు నాత్మబుద్ధిని మాని, గాత్రపుత్త్రమిత్రకళత్రాదులయందు నేను నాది యను నహంకార మమకారములను విడిచి ముక్తులగుదురు. “నకర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానసుః । పరాంచిఖాని వ్యతృణత్ । ఆవృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్ యదా సర్వే ప్రముచ్యంతే హృదయస్యేహ గ్రంథయః। అథముక్తో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే” అను మొదలగు శ్రుతులు పరమాత్ముఁ డతీంద్రియుఁడని తెలిసికొనిన ముక్తి గలదనుటకుఁ బ్రమాణము.

ఇఁక “నతత్ర చక్షుః...అనుశిష్యాత్” అను రెండవవాక్యము విచారణ యెట్లనిన బ్రహ్మము పైని జెప్పినయట్లు శ్రోత్రాదీంద్రియములకుఁ గూడ శ్రోత్రాద్యాత్మక మగుటచేత “నతత్రచక్షు ర్గచ్ఛతి” ఆ బ్రహ్మమును నేత్రేంద్రియము గనుఁగొనజాలదు. “నవాగ్గచ్ఛతి” వాక్కు చెప్పలేదు. అగ్ని యొకదానిని దహించునదియుఁ బ్రకాశింపఁ జేయునదియు నయ్యు దనుఁ దా దహించుటకుఁ బ్రకాశింపఁజేయుటకును జాలకుండునట్లు వాగింద్రియముచే నుచ్చరింపఁబడు శబ్దముఁ జెప్పఁదగినదానిని దెలుపునపుడా వాక్కు ప్రసరించునుగాని తనకును తనవలన వెలువడిన శబ్దమునకును నాత్మభూతమగు పరమాత్మయందుఁ బ్రసరింపఁజాలదు. “నో మనః” మనస్సు - వేఱొకదానిని సంకల్పింపఁగలదు, నిశ్చయింపఁగలదు. కాని

యాత్మ యిట్టిదని సంకల్పించుటకును నిశ్చయించుటకును జాలదు. వస్తు నిర్ణయము మనస్సుచేతను నింద్రియములచేతను జేయవలయును. బ్రహ్మ మా యింద్రియమనంబులకు గోచరము గాదు గాన, నాబ్రహ్మ మిట్టిదని "నవిద్మః" ఎఱుంగము గాన "నవిజానీమో యథైతదనుశిష్యాత్" ఏ ప్రకారముగ నీ బ్రహ్మమును శిష్యునకు నుపదేశింపవలెనో తెలియఁజాలము. ఇంద్రియములకు గోచరమగు వస్తువు నిట్టిదని, వీఁడు బ్రాహ్మణుఁడని జాతిని బట్టియు, వీఁడు నల్లనివాఁడని గుణమునుబట్టియు, వీఁడు వంటవాఁడని క్రియనుబట్టియు, వీఁడు రాజపురుషుఁడని సంబంధమునుబట్టియుఁ జెప్పుటకు వలనుపడునుగాని జాత్యాదివిశేషణములు లేని బ్రహ్మమును నిర్దేశించుటకు నలవికాదు గాన, బ్రహ్మ మతీంద్రియము.

ఇట్లు బ్రహ్మ మేవిధముననైనఁ దెలియఁబడదని చెప్పినచో నిఁక నెవరికి బ్రహ్మజ్ఞానమునందుఁ బ్రవృత్తి గలుగదను నాశంకకు "అన్యదేవ... వ్యాచచక్షిరే" అనువాక్యము సమాధానము - తద్వివరణం బెట్లనిన - ప్రత్యక్షము మొదలగు ప్రమాణములచే నాపరమాత్మ నిశ్చయింపఁబడదు గాని యాగమప్రమాణముచే నిశ్చయింపఁబడును. "అన్యదేవ తద్విదితాత్" శ్రోత్రాదీంద్రియములకు శ్రోత్రాదికమనియు నాశ్రోత్రాదులకు నవిషయమనియుఁ, జెప్పఁబడిన యాబ్రహ్మము చక్షురాదీంద్రియములచేఁ దెలియఁబడు వ్యాకృతప్రపంచమునకన్న భిన్నమైనది. "అథో అవిదితాదధి" విదితమునకు విలక్షణమై వ్యాకృతబీజమగు నవ్యాకృతముకంటెఁగూడ వేఱైనది. ఇట్లు విదితావిదితమునకు భిన్నమైనది తనయాత్మకన్న వేఱొండు లేదుగాన నాత్మయే బ్రహ్మమని వాక్యార్థము. "అయమాత్మా బ్రహ్మ య ఆత్మాపహతపాప్మా । య ఆత్మాసర్వాన్తరః" అను మొదలగు వేదవాదములచే నశేషవిశేషశూన్యంబగు చిన్మాత్రప్రకాశమే బ్రహ్మము - అని పూర్వాచార్యులవలన వింటిమి అని శ్రుత్యర్థము.

నరేగాని యిట్లాత్మయే బ్రహ్మమైనచో, ఆత్మ, తత్తద్వర్ణాశ్రమోచితకర్మలకును, నాయాయుపాసనలకును నధికారి యైన సంసారి గాన కర్మోపాసనలచేత నింద్రాది దేవతల నారాధించి స్వర్గాదిలోకములను బొందుటకు నిచ్ఛగించును, గాన విదితావిదితములకు వేఱగు బ్రహ్మము - శంకరుఁడు - చంద్రుఁడు మొదలగువారిలో నొకదైవముగాని, లోకప్రతీతికి విరోధమగుటవలన నాత్మయే దైవము కాదు. మఱియుఁ దార్కికులు ఈశ్వరునికన్న యాత్మవేఱని చెప్పునట్లు కర్మఠులును - నాత్మకుఁ వేఱుగు దేవతల నుపాసించెదరు, గాన విదిత మై యుపాసింపఁబడునదియే బ్రహ్మము. తద్వ్యతిరిక్తమగు నాత్మ యుపాసకము - అను నాశంకను గను పెట్టి "యద్వాచా నభ్యుదితం" అను మొదలగు నైదువాక్యములచే సమాధానము చెప్పఁబడుచున్నది. "యద్వాచా నభ్యుదితం" చైతన్యమాత్రసత్తాకమగు నేబ్రహ్మము వాగింద్రియముచేఁ జెప్పఁబడదో "యేన వాగభ్యుద్యతే" ఏ బ్రహ్మముచేత వాక్కు చిత్ప్రకాశమువలనఁ బ్రయోగింపఁబడుచున్నదో యా యాత్మను బ్రహ్మ మని తెలిసికొనుము. అజ్ఞానులచే నుపాసింపఁబడు తత్తద్దేవతాదికము బ్రహ్మము కాదు. ఇట్లు "యన్మనసా నమనుతే...। యచ్చక్షుషానపశ్యతి...యచ్ఛ్రోత్రేణ నశృణోతి...। యత్ప్రాణేన నప్రాణితి..." అను వాక్యములకు నర్థము నూహించునది. ఇట్లు మనోవాగాదీంద్రియములకు గోచరముగాక తత్తదింద్రియములకు నధిష్ఠానమై ప్రేరకమైనది గాన, బ్రహ్మము-అతీంద్రియమనుట యుపపన్నము - ఇట్లు, అజుఁడు అకర్త అభోక్త మొదలగు పదముల నెల్ల నీఘట్టముననే చర్చించినచోఁ జదువరులకు ముఖపిధాన మగునని - ముందు నచ్చటచ్చట నిట్టి విశేషాంశములను సమయోచితముగఁ దెలుపఁదలఁచి యింతటితో నీ పద్యార్థమును ముగించుచున్నాను.

క. మాయాగుణానుగతుఁ డై
    పాయక నానావిధప్రపంచం బితఁడే

చేయు నని తోఁచు నేమియుఁ
జేయఁ డసంగుం డకర్త సిద్ధము వత్సా. ౧౨

టీ. వత్సా = ఓ పవనతనయా ! మాయా = శుద్ధ సత్త్వప్రధానయగు మాయయొక్క, గుణ = సత్త్వాదిగుణములచేత, అనుగతుఁడై = అనుసరింపఁబడినవాఁడై, పాయక = తెంపు లేక, నానావిధప్రపంచంబున్ = పెక్కు తెఱంగుల నున్న సంసారమును, ఇతఁడే = ఈ రామచంద్రుఁడే, చేయున్ అని = కల్పించుచున్నవాఁడని, తోఁచును = తోపట్టును (గాని), అసంగుఁడు = గుణత్రయసంపర్కము లేనివాఁడును, అకర్త = నిరవయవుండును నిరింద్రియుండు నగుటచేఁ గర్త కానివాఁడు నగుటంజేసి, ఏమియున్ = ఏ పనినైన నించుకయును, చేయఁడు = ఒనరింపఁడు, సిద్ధము = ఇది నిశ్చయము. "రామో నగచ్ఛతి నతిష్ఠతి నానుశోచ త్యాకాంక్షతే త్యజతినో నకరోతి కించిత్ । ఆనందమూర్తి రచలః పరిణామహీనో మాయాగుణాననుగతోహి తథా విభాతి" అను వాక్యార్థ మిట్లు సందర్భింపఁబడినది.

తా. ఓపుత్త్రి ! ఆంజనేయ ! ఈ శ్రీరామచంద్రుఁడు వాస్తవముగఁ గర్తృత్వాదికములేని శుద్ధచిన్మాత్రుఁ డయ్యు, శుద్ధసత్త్వప్రధానయగు మాయయందుఁ బ్రతిబింబించి సర్వజ్ఞత్వాద్యష్టగుణవిశిష్టుం డై పలుతెఱంగులం బరఁగు లోకములనెల్లఁ దానే రచియించుచున్నట్లు స్థూలదృష్టిచేఁ గన్పట్టుచున్నను, సూక్ష్మమగు జ్ఞానదృష్టిచేఁ జూచినఁ బ్రతిబింబసూర్యునియందలి చాంచల్యాది జలధర్మములు సూర్యునియందు లేనట్లు నిస్సంగుం డగు నితనియందుఁ గర్తృత్వాదికము లేదుగాన నితఁడు దేనిని జేయువాఁడు కాఁడనుట నిశ్చయము. ౧౨

వ. అనిన విని హనుమంతుండు సీతాదేవి కిట్లనియె. ౧౩

టీ. అనినన్ = పైనిజెప్పినట్లు పలుకఁగా, విని = ఆలకించి, హను మంతుండు = హనుమానుఁడు, సీతాదేవికిన్ = జానకీదేవితో, ఇట్లు+అని యెన్ = చెప్పఁబోవురీతిని వచించెను.

తా. ఈయనువున జనకతనయ యనిన విని, పవననందనుఁ డవని నందనతో నివ్విధమువున నుడివెను. ౮౩

తే-గీ. రామచంద్రుఁడు దారకబ్రహ్మ మగుట
సత్య మగుఁగాని, యిమ్మహాసర్వమయుని
సులభముగఁ గాంచుపరమసుసూత్ర మెద్ది
నా కెఱింగింపవమ్మ! లోకైకజనని. ౮౪

టీ. లోక = సకలజనములకు "లోకస్తు భువనే జనే" అని అమ రము. ఏక = ఒక్కతెవగు, జననీ = అమ్మ, రామచంద్రుండు = ఈ శ్రీరామమూర్తి, తారక = తన్నుఁ గొలిచెడువారినెల్లఁ దరింపఁజేయు, బ్రహ్మము = పరమాత్ముఁడు, అగుట = నీవు వచియించినపగిది నై యుం డుట, సత్యము = నిక్కము, అగున్ = ఔను, కాని = అట్లయ్యు, ఈ+మహా+సర్వమయునిన్=మహాత్ముఁడగు నీ సర్వాత్మకుని, సులభము గాన్=సుకరమగునట్లు, కాంచు+పరమ+సు+సూత్రము = తెలిసికొనఁ దగిన యుత్తమమగు మంచిసాధనము, ఎద్ది=ఎయ్యది, నాకున్=నీశిష్యుఁడ నగు నాకు, ఎఱిఁగింపవు + అమ్మ = ఉపదేశింపవమ్మ. "అదాదయోఽను యుజ్యన్తే ప్రార్థనే ముమజోర్న్వా। ఎదాద్యనుప్రయుక్తౌతు తయోర్వుజే రుజే అపి॥" అను హరికారికనుబట్టి ప్రార్థనార్థమునందు ము డు అనుప్రత్య యములకు ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య-అను మొదలగునవి కలిపి పలుకఁ బడునపుడు వుజే, రుజే-అనునవి యాదేశములగును గాన 'ఎఱింగించు+ము + అమ్మ,అని యుండఁగా నిందలి మధ్యమపురుషప్రత్యయమునకు వుజే యను నది యాదేశముకాఁగా నెఱింగింపవమ్మ అనురూపము నిష్పన్నమయినది.

తా. ఎల్లజగములకుఁ దల్లివగు నో సతీమతల్లీ ! నీవు చెప్పినయట్లు శ్రీరామచంద్రుఁడు సంసారసాగరమును దరింపఁజేయు పరబ్రహ్మమేయగుట నిక్కమానుగాని, సర్వాత్మకుం డగు నిమ్మహాత్ముని సుకరముగ నెఱుఁగఁ దగిన యుత్తమమగు సులభోపాయ మెయ్యది ? దానిని నా కుపదేశింపుము.

వ. అనిన విని, నవ్వుచు సీతాదేవి హనుమంతున కిట్లనియె.

తా. ఈ చందమునఁ బలుక నాకర్ణించి జనకరాజనందిని మందస్మితసుందరవదనారవిందయగుచు గంధవహనందనునితో ముందుఁ జెప్పెదువడువున నుడివెను. ప్రతిపదార్థము స్పష్టము. ౨౫

తే-గీ. ప్రత్యగాత్మస్వరూపుఁ డై పరఁగుతనకు
రమణపరమాత్ముఁ డైన శ్రీరామునకును
సమరసైక్యానుసంధానసరణి యెద్ది ?
యదియ యోగంబు సదుపాయ మాంజనేయ. ౨౬

టీ. ఆంజనేయా = అంజనాదేవికొమారుఁడా ! ప్రత్యక్ = బుద్ధిమొదలగు కార్యకరణసంఘాతమునకుఁ బైఁగనున్న ఆత్మ=సాక్షిచైతన్యము, స్వరూపుఁడు = స్వరూపము గలవాఁడు, ఐపరఁగు=అగుచుఁ బ్రకాశించెడు, తనకున్ = త్వంపదలక్ష్యార్థభూతుఁ డగు నాత్మకును, రమణ = సర్వాధిష్ఠానభూతుఁడును, పరమ=సచ్చిదానందసాంద్రుఁ డగుటచే సర్వోత్కృష్టుఁడు నగు, ఆత్ముఁడు + ఐన = తత్పదవాచ్యుఁడును సాక్షాత్పరమాత్ముఁడే యగు, శ్రీరామునకును = ఈ శ్రీరామచంద్రునకును, సమ...సరణి - సమ = జీవాత్మపరమాత్మల కిరువురకు సమానము లయిన, రస = అవస్థాత్రయసాక్షిత్వ, సచ్చిదానందత్వ, నిత్యత్వములు మొదలగు ధర్మములచేనైన, ఐక్య = అన్యోన్యతాదాత్మ్యముయొక్క, అనుసంధాన = ఎడతెగని మననమనియెడు, సరణి=బాట, ఎద్ది = ఎయ్యది శ్రుతిస్మృతిసిద్ధమై యున్నదో, అదియ = ఆ యనుసంధానమార్గమే, యోగంబు = జ్ఞానయోగమనఁబడు,

సత్ + ఉపాయము = శ్రీరామచంద్రునిఁ దన్నుఁగా నెఱుంగుటకుఁ దగిన మేలుసూత్రము.

తా. ఓ యంజనానందనుఁడా! జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి - అను నవస్థాత్రయమునందును, దినములు, పక్షములు, మాసములు, సంవత్సరములు, యుగములు, కల్పములు మొదలగు భేదములతో భూతభవిష్యద్వర్తమానరూపముగ నున్న కాలమునందును, నుదయాస్తమయములు లేక యేకాకారముగ నుండి స్వయంప్రకాశమై బుద్ధ్యాదిసర్వసాక్షియై పరమప్రేమాస్పద మగుటచేఁ బరమానందరూపమై, చిద్రూపమై, త్వంపదలక్ష్యార్థమై పరఁగు స్వాత్మకును (తనకును), పైనిజెప్పినయట్లు సర్వకాలసర్వావస్థలయందు నేకాకారమై సర్వసాక్షియై స్వప్రకాశమై సచ్చిదానందఘనంబై తత్పదార్థంబగు పరబ్రహ్మమే యగు నీ శ్రీరామచంద్రునకును, తత్త్వమస్యాది మహావాక్యములచేత సామరస్యంబునఁ దనకును రామునకును భేదమించుకయు లేదు గాన, నతఁడే నేను నేనే యతఁ డని పరస్పరతాదాత్మ్యముతోఁ దైలధారావిచ్ఛిన్నముగఁ దెంపులేని యనుసంధానమే యేది కలదో యా యనుసంధానమే యోగమనఁబడు; నట్టియోగమే శ్రీరామచంద్రునిఁ దన్నుఁగఁ దెలిసికొనుటకుఁ దగిన సులభసూత్రము. ౮౬

జీవాత్మ పరమాత్మైకస్వరూప నిరూపణము - "శబ్దస్పర్శాదయోవేద్యావై-చిత్ర్యాజ్జాగరేపృథక్ । తతో విభక్తా తత్సంవి దైకరూపాన్నభిద్యతే॥" అనుటచేత జీవాత్మపరమాత్మలకు నైకరూప మగు ప్రధానవిషయమును మనము దెలిసికొనుటకుఁ దొలుత జీవాత్మ సత్యజ్ఞానానందస్వరూపమని యెఱుఁగఁ దగియున్నది; కావున, నందు జ్ఞానమునకు నభేదప్రతిపాదనముఖమున నిత్యత్వము సాధింపఁబడుచున్నది. ఎట్లనిన - విస్పష్టవ్యవహారవిశిష్టంబగు జాగ్రదవస్థయందు జ్ఞానమునకు గోచరము లగుచున్న యాకాశము మొదలగు పంచభూతములును, పంచభూతగుణములగు శబ్దము స్పర్శము

మొదలగునవియు, ఎద్దులు గుఱ్ఱములుంబోలెఁ బరస్పరవిలక్షణము లగుట వలన నొండొంటికి వేఱ్వేఱ యున్నవి. ఆశబ్దాదులను దెలిసికొనుజ్ఞానము ఆ శబ్దాదులనుండి బుద్ధిచేత వేఱుపఱుపఁబడిన దై యేకాకారముగ వెలుంగుచు నుండును. అనఁగా ఘటాద్యుపాధులు లేనపు డాకాశ మేకాకారముగ నుండునట్లు, శబ్దము మొదలగు నుపాధుల సంబంధము లేనపుడు జ్ఞానమునకు నేకరూపత్వము సిద్ధము.

"తథాస్వప్నేఽత్ర వేద్యంతు నస్థిరం జాగ్రేస్థిరం। తద్భేదోఽత స్తయోస్సంవి దేకరూపా నభిద్యతే" అనుటచేత జాగరితమునందు శబ్దాది విషయములకు నానాత్వము వలన భేదమును, జ్ఞానమునకు నేకాకారత్వముచే నభేదమును సిద్ధమగునట్లు స్వప్నమునందుఁగూడ విషయములే భిన్నములు గాని, జ్ఞానము భిన్నముకాదు. స్వప్నమునందుఁ దోఁపట్టు పదార్థజాతము ప్రతీతిమాత్రశరీరం బగుటచే స్థిరముకాదు. జాగరితమునందుఁ గన్పట్టు వస్తుజాతము కాలాంతరమునందుఁ జూడఁదగి యుండుటచే స్థిరము గాన, స్వప్నమనియు జాగరితమనియు భేదవ్యవహారము; ఇట్లు స్వప్నజాగరణములయందు జ్ఞానమునకుఁ గల యేకత్వము సుషుప్తియందును గలదు. "సుప్తోత్థితస్య సౌషుప్త తమోబోధోభవేత్స్మృతిః। సాచావబుద్ధ విషయాఽవబుద్ధంతు తదాతమః। సబోధో విషయాద్భిన్నో నబోధా త్స్వప్న బోధవత్" అనుటచేత నిదురపోయి లేచినవానికి నా గాఢనిద్రయందలి యజ్ఞానము యొక్క నే నేమియు నపు డెఱుఁగనను జ్ఞానము గలదు; ఆ జ్ఞానము స్మృతి యగునుగాని యనుభవము గాదు. ఆ స్మృతియుఁ దెలియఁబడిన విషయము గలది. ఆ సుషుప్తియందుఁ దెలియఁబడినవిషయ మన్ననో యజ్ఞానమే యయి యున్నది. సుషుప్త్యవస్థయందలి యా యజ్ఞానానుభవము అజ్ఞానమునకు భిన్నమైనదిగాని జ్ఞానమునకు భిన్నము గాదు గాన నిట్లు అవస్థాత్రయమునందును సంవిదాత్మక మగుజ్ఞాన మేకరూపమై యున్నది. ఇట్లొకదినమునందలి మూఁడవస్థలయందు జ్ఞాన మేకరూప మగునట్లు

ప్రతిదినమునందును, గడచినట్టియు రాఁబోవునట్టియు మాసములు సంవత్సరములు యుగములు కల్పములు మొదలగు సమస్తకాలములయందునుఁ జిద్రూపమగు జ్ఞాన మేకరూపముగ నున్నది. దీనికి నుత్పత్తివినాశములు లేవు గాన నిత్యమైనది. ఇది స్వయంప్రకాశము. ఈ చిద్రూపమగుజ్ఞానమే యాత్మ యనఁబడుచున్నది. ఇట్లు సంవిద్రూపమగు నాత్మ నిత్యమనియు స్వప్రకాశమనియు సాధించుటచేత సత్యమనియు సాధింపఁబడినది. "నిత్యత్వం సత్యత్వం తద్వస్యాస్తి తన్నిత్యం సత్యం" అని వేదాంతభామతియందు వాచస్పతిమిశ్రులు చెప్పిరి గాన, నిత్యత్వమునకు వేఱు సత్యత్వము గాదు. మఱియు నీయాత్మ నిరతిశయంబగు ప్రేమకుఁ బాత్ర మగుటచేత నిరతిశయసుఖస్వరూపమై యున్నది. ఆత్మ నిరతిశయప్రేమకుఁ బాత్రమగుటకు "మాన భూవం హి భూయాసం" అనఁగా నేను లే నన్నమాటలేక యెల్లప్పుడు నుండెదఁగాక యను ననుభవను ప్రమాణము గాన, నాత్మ (తన)యందలి యాప్రేమ నిరతిశయమైన దగుటచేత నాత్మకుఁ బరమానందత్వమును నిష్పన్నమై యున్నది. కావునఁ దత్త్వమస్యాది మహావాక్యములయందలి త్వంపదార్థమగు ప్రత్యగాత్మ ఇట్లు యుక్తిచేత సత్యమును, జిత్తును, నిరతిశయానందమును స్వరూపముగఁ గలదని సిద్ధించెను. ఇఁకను దత్పదార్థమగు నా పరబ్రహ్మము సచ్చిదానందరూపమని శ్రుతిశతములచే నుద్ఘోషింపఁబడినది. ఇట్లు సచ్చిదానందస్వరూపులును, దత్త్వంపదార్థములు నగు ప్రత్యగాత్మపరాత్మలకు నఖండైకరసత్వము తత్త్వమస్యాది మహావాక్యములయందు నుపదేశింపఁబడినది. తత్ప్రకారం బెట్లనిన - "పరాపరాత్మనోరేవం యుక్త్యా సంభావితైకతా । తత్త్వమస్యాది వాక్యైస్సా భాగత్యాగేన లక్ష్యతే" అనుటచేతఁ బరమాత్మజీవాత్మలకు సచ్చిదానందస్వరూపత్వసామ్యమును జూపుట యను నుపాయముచేత నేకత్వ మొప్పింపఁబడినది. ఆ యేకత్వము తత్త్వమస్యాది మహావాక్యములచేతఁ గూడ స్పష్టముగ విరుద్ధాంశపరిత్యాగముచే బోధింపఁబడుచున్నది. అందు "తత్త్వమసి"

అను మహావాక్యముయొక్క యర్థజ్ఞానము ఆవాక్యమునందలి తత్ అను మొదలగు పదములయొక్క యర్థము తొలుతఁ దెలియనిది కలుగదు గాన, తత్ అను పదముయొక్క యర్థ మెట్లనిన "జగతో యదుపాదానం మాయామాదాయతామసీం। నిమిత్తం శుద్ధసత్త్వాం తా ముచ్యతే బ్రహ్మ తద్గిరా" అనుటచేత సచ్చిదానందలక్షణమగు నే పరబ్రహ్మము తమోగుణప్రధాన యగు మహామాయ నుపాధిగాఁ జేకొని చరాచరాత్మకమగు కార్యజాతమునకు నుపాదానభూతము (అధ్యాసాధిష్ఠానము) అగుచున్నదో, విశుద్ధసత్త్వప్రధానయగు నామాయను నుపాధిగాఁ గైకొని నిమిత్తము (ఉపాదానకారణాదికము నెఱింగిన కర్త) అగుచున్నదో, ఇట్లు నిమిత్తోపాదానోభయాత్మకమగు నాబ్రహ్మము "తత్త్వమసి" అను మహావాక్యమునందలి తత్ అను పదముచేతఁ జెప్పఁబడుచున్నది.

ఇఁక త్వంపదార్థం బెట్లనిన.

"యదా మలిన సత్త్వాం తాం కామకర్మాదిదూషితాం। ఆదత్తే తత్పరం బ్రహ్మ త్వంపదేన తదోచ్యతే" అనుటచేత సచ్చిదానందలక్షణంబగు నాబ్రహ్మమే యే యవస్థయందు నించుక రజస్తమోగుణములకలయికచేత మలినసత్త్వప్రధానమై కామకర్మాదులచేఁ గలుషితమై యవిద్య నాఁబడు నామాయను నుపాధిగాఁ జేకొనునో యప్పుడు త్వం అనుపదముచేఁ బలుకఁబడును.

మహావాక్యార్థం బెట్లనిన.

"త్రితయీమపి తాం ముక్త్వా పరస్పర విరోధినీం। అఖండం సచ్చిదానందం మహావాక్యేన లక్ష్యతే" అనుటచేత తమఃప్రధానయు విశుద్ధసత్త్వప్రధానయు, మలినసత్త్వప్రధానయు నని ముత్తెఱంగులం బరఁగుటచే నొండొంటికి విరుద్ధములగు నామూలాజ్ఞానములను మూఁడిటిని విడిచి భేదవిహీనంబై సచ్చిదానందబ్రహ్మము మహావాక్యముచేఁ దోఁపట్టును. ఇట్లు విరుద్ధాంశపరిత్యాగరూపం బగు లక్షణావృత్తిచే వాక్యార్థబోధనము లోక

వ్యవహారమునందును గన్పట్టుచున్నది; ఎట్లనిన—"సోయ మిత్యాది వాక్యేషు విరోధా త్తదిదంతయోః। త్యాగేన భాగయో రేక ఆశ్రయో లక్ష్యతే యథా। మాయావిద్యే విహాయైవ ముపాధి పరజీవయోః। అఖండం సచ్చిదానందం పరబ్రహ్మైవ లక్ష్యతే" అనుటచేత "సోయం దేవదత్తః" అను మొదలగు లౌకికవాక్యములయందు వాఁడే యీ దేవదత్తుఁ డనునపుడు వాఁడు వీఁడు అను విరుద్ధాంశములను విడుచుటచేత నాశ్రయభూత మగు నొక్కదేవదత్తస్వరూపమే తోపట్టునట్లు పరమాత్మ జీవాత్మలకు నుపాధు లగు పూర్వోక్తమాయావిద్యలను రెండింటిని విడిచినచో నఖండైకరసం బగు చిదానందలక్షణపరబ్రహ్మము తత్త్వమస్యాది మహావాక్యములచే గోచరంబగును. మొదటఁ బరమాత్ముఁడు గలఁడను పరోక్షజ్ఞానము పుట్టియుండఁగా, తత్త్వమస్యాది మహావాక్యార్థపరిజ్ఞానముచేత నపరోక్షజ్ఞానము కరామలకన్యాయమున నతిసులభముగఁ గలుగును. పరోక్షజ్ఞానము బుద్ధిపూర్వకముగఁ జేసినపాపములనెల్లఁ దొలఁగఁద్రోసి చిత్తశుద్ధిని గలిగించును. పిదప నపరోక్షజ్ఞానము జననమరణాదిదుఃఖరూపసంసారమునకు మూలకారణంబగు మూలాజ్ఞానమును సమూలముగఁ దూలఁదోలును-అను నీయంశము "వాక్యమప్రతిబద్ధం సత్ప్రాక్పరోక్షావభాసతే। కరామలకవద్బోధ మపరోక్షం ప్రసూయతే। పరోక్షం బ్రహ్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం। బుద్ధిపూర్వకృతం పాపం కృత్స్నం దహతి వహ్నివత్। అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం। సంసారకారకాజ్ఞానతమస శ్చండభాస్కరః" అని విద్యారణ్యమునులచేఁ బ్రతిపాదింపఁబడినది.

వ. ఆ యోగం బభ్యాసయోగంబు జ్ఞానయోగం బన ద్వివిధం
బై యొప్పు నం దభ్యాసయోగంబు ప్రాణాయామం బన
విలసిల్లు; నదియుఁ బ్రాకృతంబు, వైకృతంబు, కేవల-

కుంభకంబు ననం ద్రివిధం బయ్యె నందుఁ బ్రాకృతంబ మంత్రయోగంబు, వైకృతంబు లయయోగంబు, కేవ కుంభకంబు హఠయోగం బీ త్రివిధప్రాణాయామయోగ లకు యమ నియ మాసన ప్రాణాయామంబులు పూర్వాఁ గంబులు, ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధు లుత్త రాంగంబులగు; నం దహింసా సత్యా స్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహంబులు యమంబులు; శౌచ తప స్సంతోష స్వాధ్యాయేశ్వర ప్రణిధానంబులు నియమంబులు, వీరా సన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబు లగు చతురుత్తరా శీత్యాసనంబుల నీమూఁడింటి నభ్యసించి యంతటఁ బ్రాణ నిరోధంబు సేయందగు; నందు స్వభావనియత రేచకపూ రకకుంభకక్రమంబులచేత, నేకవింశతి సహస్ర షట్ఛ తాధిక సంఖ్యాఽజపామంత్రానుష్ఠానంబు మంత్రయో గంబు, ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిల సంయ మన పూర్వకంబుగాఁ బ్రాణవృత్తియం దపానంబు, నపాన వృత్తియందుఁ బ్రాణంబును, లయంబు గావించుట లయ యోగంబు. మూలబం ధోడ్యాణబంధ జాలంధరబంధ పూర్వకంబుగా రేచక పూరకంబుల నుడిగించి ప్రాణా పానంబుల రెంటిని రేఁయింబగ లొక్కచందంబునఁ గుంభిం చుట హఠయోగం బివి త్రివిధప్రాణాయామంబులు. విష యంబులవలన నింద్రియంబుల మరలించుట ప్రత్యాహా రంబు. సగుణ నిర్గుణాత్మక వస్తుచింతనంబు ధ్యానంబు. మూలాధారాది దేశంబులఁ జిత్తంబు నరికట్టుట ధారణా

యోగంబు. నిర్మల నిశ్చల చిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్ప నిర్వికల్పాత్మక సమాధియోగం బిట్లష్టాంగంబులు గలిగి యాయభ్యాసయోగంబు ప్రకాశించు; నది యపరిపక్వ చిత్తులకు యోగ్యం బతిదుర్లభం బిది యణిమాద్యష్టైశ్వర్యంబుల నొసంగుచు నాత్మజ్ఞానంబుఁ బ్రకటంబుగాఁ జేయు. మఱియుఁ బ్రవిమల చిత్తులకు జీవబ్రహ్మైక్య జ్ఞానమాత్రంబు నిచ్చు నతిసులభం బైన జ్ఞానయోగంబు రాజయోగం బనంబడు; నీరెంటికి శ్రీరామచరణకమలభక్తి కారణంబు; దానికి వైరాగ్యంబు మూలంబు. వినుము. ౮౭

టీ. ఆంజనేయా! వినుము = ఆ యోగప్రకారంబుఁ జెప్పెద నాలకింపుము, ఆయోగంబు = ("ఐతదాత్మ్య మిదꣳం సర్వం" అను శ్రుతిచేతఁ జిదచిదాత్మకంబగు నీస్థూలసూక్ష్మప్రపంచం బెల్లఁ బరమాత్మునిచే వ్యాపింపఁ జేయఁబడియున్నదిగాన నాపరమాత్ముండు సర్వాంతర్యామి యని తెలిసికొనుటయే శ్రీరామచంద్రతత్త్వపరిజ్ఞానమునకు సులభోపాయ మగు) పూర్వోక్తయోగము. అభ్యాసయోగంబు = (మందాధికారులు మొదట నేర్చుకొనఁదగినది గాన) అభ్యాసయోగ మనియు, జ్ఞానయోగంబు = (ఉత్తమాధికారు లవలంబింపఁదగినది గాన) జ్ఞానయోగ మనియు, ద్వివిధంబు - ఐ = ఇరుతెఱంగులు గలదై, ఒప్పున్ = తగును. అందున్ = ఆ రెంటిలో, అభ్యాస యోగంబు = మొదటిది యగు నభ్యాసయోగము, ప్రాణాయామంబు - అనన్ = వాయుధారణరూప మగుచు, విలసిల్లున్ = ఒప్పును, అదియున్ = ప్రాణాయామరూపమగు నా యభ్యాసయోగము, ప్రాకృతంబు = సర్వసామాన్య మగుటచేఁ బ్రాకృతమనియు, వైకృతంబు= లయరూపంబగు మార్పు గలదగుటచేత వైకృత మనియు, కేవల కుంభ

కంబు = వాయునిరోధమే ప్రధానముగఁ గలదగుటచేతఁ గేవల కుంభకము, అనన్ = అనునట్లు, త్రివిధంబు = ముత్తెఱంగులు గలది, అయ్యెన్ = అగుచున్నది, అందున్ = ఆ ప్రాకృతము మొదలగు మూఁడింటిలో, ప్రాకృతంబు = మొదటిది యగు ప్రాకృతయోగము, మంత్రయోగంబు = తత్తన్మంత్ర పురశ్చరణరూప మగు మంత్రయోగము. (ఇది "అధమం మంత్రచింతా స్యాత్ । తత్తన్మంత్ర పురశ్చర్యా శ్చిత్తభ్రమణహేతవః" అనుటచేత మందాధికారులకు యోగ్య మయినది); వైకృతంబు = రెండవదియగు వైకృతమనునది, లయయోగంబు = ప్రాణాపానవృత్తుల పరస్పరవిలయము గలది గాన లయయోగ మనఁబడును; కేవల కుంభకంబు = మూఁడవదియగు కేవల కుంభకము, హఠయోగంబు=హఠాత్తుగ (ఉవ్వెత్తుగ) ప్రాణాపానవృత్తు లిందు నిలుపఁబడుఁ గాన హఠయోగ మనఁబడును; ఇట్లు, ఈ...ములకు - ఈ = చెప్పఁబడిన లక్షణములు గల, త్రివిధ = ముత్తెఱఁగులు గల, ప్రాణాయామయోగములకున్ = వాయుధారణము ప్రధానముగాఁగల యభ్యాసయోగములకు, యమ + నియమ + ఆసన + ప్రాణాయామంబులు = వక్ష్యమాణ లక్షణములు గల యమము, ఆసనములు, ప్రాణాయామము, అను నాల్గును, పూర్వ + అంగంబులు = తొలుత నభ్యసింపఁదగిన యవయవములు; ప్రత్యాహార + ధారణా + ధ్యాన + సమాధులు = ముందుఁ జెప్పఁబోవు స్వరూపములు గల ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి, అను నాల్గును, ఉత్తరాంగములు = యమాదులు స్థిరపడిన పిమ్మట నభ్యసింపఁదగిన యవయవములు, అందున్ = ఆ యమనియమాదు లగు నెనిమిది యంగములలో, అహిం...బులు - అహింసా = ఏ జంతువును బాధింపకుండుటయు, సత్య = నిక్కమును జెప్పుటయు, అస్తేయ = దేనిని దొంగిలింపమియు, బ్రహ్మచర్య = స్త్రీపరాఙ్ముఖత్వముతోఁ జేయఁబడు వ్రతవిశేషమును, అపరిగ్రహంబులు - దేనిని జేకొనకుండుటయు ననునివి యమము

లనఁబడును. శౌచ...ప్రణిధానంబులు - శౌచ = స్థూల సూక్ష్మ శరీర పారిశుద్ధ్యమును, తపః = విధ్యుక్త మగు చాంద్రాయణాదికమును, సంతోష = చిత్తస్వస్థతయు, స్వాధ్యాయ = "స్వాధ్యాయోఽధ్యేతవ్య" అను శ్రుతిచే ఫలవదర్థావబోధపర్యంతమగు వేదాధ్యయనమును, ఈశ్వర+ప్రణిధానంబును = భగవదనుసంధానమును, అనునివి నియమంబు లనఁబడును; వీరాసన + స్వస్తికాసన + పద్మాసన + యోగాసన + కూర్మాసన + భద్రాసన + సిద్ధాసన + సింహాసన + ఆదికంబులు = వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, యోగాసనము, కూర్మాసనము, భద్రాసనము, సిద్ధాసనము, సింహాసనము మొదలగునవి, అను = అనునట్టి, చతుః + ఉత్తర + అశీతి + ఆసనంబులు = ఎనుబదినాల్గును ఆసనము లనఁబడును; ఈ మూఁడింటిన్ = యమనియమాసనము లను నీ మూఁటిని, అభ్యసించి = పరిపాటి గావించి, అంతటన్ = తరువాత, ప్రాణనిరోధంబున్ = వాయుధారణను, చేయన్ + తగున్ = అభ్యసింప వలయును, అందున్ = మీఁద నుపక్రమింపఁబడిన యభ్యాస యోగభేదము లగు మంత్రలయహఠయోగముల మూఁడిటిలో, స్వ...చేతన్ - స్వభావ నియత = ప్రాణాయామమునకు స్వతస్సిద్ధముగ నియమింపఁబడిన, రేచక = గర్భకోశములో నున్న వాయువును బైకి విడుచుటయు, పూరక = పిమ్మట పై నున్న పరిశుద్ధవాయువును గర్భమునలోనికిం బీల్చి నింపుటయు, కుంభక = అట్లు పూరించిన వాయువును మరలఁ బైకి రాకుండ నిలుపుటయు, క్రమంబులన్ = అను నీ రీతులచేత, ఏక...అనుష్ఠానంబు - ఏకవింశతి = ఇరువదియొక, సహస్ర = వేలును, షట్ఛత = ఆఱువందలును, అధిక = పై పెచ్చుగాఁ గల, సంఖ్య = లెక్కపరిమితిగల, (ఇరువదియొకవేల యాఱు వందలు లెక్కగల) అజపామంత్ర = మంత్రవర్ణములను నోట జపింపకుండ రేచకాదులయందు భావించుచుండుట యజపామంత్ర మనఁబడును గాన, నట్టి యజపామంత్రముయొక్క, అనుష్ఠానంబు = పురశ్చర్య, మంత్ర

యోగంబు=ప్రాకృతమను పేరుగల మంత్రయోగ మగును; ప్రతి...కాఁ-ప్రతిదివస = దినదినమునందును, అభ్యస్త = పరిపాటి చేయఁబడుచుండు, రేచక = మీఁదఁజెప్పిన రేచకము, ఆది=మొదలగు, త్రివిధ = ముత్తెఱంగులగు, ప్రాణసంయమన = ప్రాణాయామములు, పూర్వకంబుగాఁ = తొలుతఁ గలుగునట్లుగ, ప్రాణవృత్తియందు = నాభిప్రదేశమునుండి మీఁదుగఁ బ్రసరించు ప్రాణవాయువుయొక్క వ్యాపారమునందు, అపానంబును, నాభిదగ్గఱనుండి క్రిందుగఁ బ్రసరించెడు నపానవాయువును, అపానవృత్తియందుఁ = ఆ యపాన వాయు వ్యాపారమునందు, ప్రాణంబును, పూర్వోక్త ప్రాణవాయువును, లయంబుఁ = లీనమగునట్లు, చేయుట = కావించుట, లయయోగంబు=వైకృతమనఁబడు లయయోగంబగును. మూల...కాఁ = మూలబంధ + ఉడ్యాణబంధ + జాలంధర బంధ + పూర్వకంబు - కాఁ = యోగశాస్త్రప్రసిద్ధములగు మూలబంధము, ఉడ్యాణబంధము, జాలంధర బంధము అనియెడు మూఁడుబంధములు మొదటఁ గలుగునట్లుగ, రేచక పూరకములఁ = పూర్వోక్త లక్షణములు గల రేచక పూరకము లను రెండింటిని, ఉడిగించి = చేయుటమాని, ప్రాణాపానంబులఁ = రేచకముఁ జేయుటచేత నాభిప్రదేశమునుండి మీఁదుగఁ బైకివచ్చెడు ప్రాణవాయువును, పూరకముచేతఁ గ్రిందుగఁబోవు నపానవాయువును, రెంటినిఁ = ఈ రెండు వాయువులను, రేయింబవళ్లు = రాత్రియందును బగటియందును, ఒక చందంబునఁ = ఏకరీతిగా, కుంభించుట = నిలుపుట, హఠయోగంబు = కేవల కుంభక మనియెడు హఠయోగ మగును, ఇవి = ఇట్టిలక్షణములు గల మంత్రలయహఠములు, త్రివిధ = ముత్తెఱంగులగు, ప్రాణాయామంబులు = వాయుధారణము లగును; విషయంబులవలనఁ = శబ్దాదివిషయములనుండి, ఇంద్రియంబులఁ = శ్రోత్రాదీంద్రియములను, మరలించుట = మళ్లించుట, ప్రత్యాహారంబు = ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లను నుత్తరాంగ

ములు నాల్గిటిలో మొదటిదియగు ప్రత్యాహార మగును. సగుణ...చింతనంబు - సగుణ = అపహతపాప్మత్వా ద్యనంత కల్యాణగుణ విశిష్టంబును, నిర్గుణ = హేయగుణ వర్జితమును, ఆత్మక = స్వరూపము గల, వస్తు = పరవస్తువుయొక్క, చింతనంబు = సంతతానుసంధానము, ధ్యానంబు = ధ్యాన మనంబడును; మూలాధార + ఆది + దేశంబులన్ = మూలాధారము మణిపూరము అనాహతము మొదలగు ప్రదేశములయందు, చిత్తంబున్ = మానసమును, అరికట్టుట = పూర్వోక్త వాయుధారణచే సంకల్పాదులు లేకుండునట్లు నిలుపుట, ధారణాయోగంబు = ఉత్తరాంగములలో మూఁడవదియగు ధారణ యనఁబడును. నిర్మల...వృత్తిన్-నిర్మల = కామక్రోధాద్యవిద్యామలములు లేనిదియు, నిశ్చల = పైని జెప్పినధారణచేఁ జలనము లేనిదియు నగు, చిత్త = అంతఃకరణముయొక్క, వృత్తిన్ = వ్యాపారముచేత, నిర్గుణ + బ్రహ్మాత్మ్యంబున్ = హేయగుణవర్జితం బగు పరవస్తువుయొక్క తాదాత్మ్యమును, సంపాదించుట = భ్రమరకీటకన్యాయమునఁ బడయుట, సవికల్ప...యోగంబు - సవికల్ప = భగవద్గుణానుసంధానరూప మగు సవికల్పము, నిర్వికల్ప = భగవత్తాదాత్మ్యరూప మగు నిర్వికల్పము, ఆత్మక = స్వరూపముగల, సమాధియోగంబు = నాల్గవదియగు సమాధియోగ మగును; ఇట్లు = ఈ రీతిని, అష్ట + అంగంబులు = యమనియమాదు లగు నెనిమిదియవయవములు, కలిగి = కలదగుచు, అభ్యాసయోగంబు = తొలుత నిర్దేశింపఁబడిన యభ్యాసయోగము, ప్రకాశించున్ = వెలయును; అది = ఆ యభ్యాసయోగము, అపరిపక్వచిత్తులకు = చిత్తశుద్ధి లేని మందాధికారులకు, యోగ్యంబు = ప్రధానముగ నభ్యసింపఁదగినదియు, అతి దుర్లభంబు = ఆసనబంధము వాయుధారణ మొదలగు కష్టతరాభ్యాసములు గలుగుటం జేసి గురుశుశ్రూషాదికము లేనిచో సాధారణముగ లభింపనిదియు నగును. ఇది = పట్టుదలతో నభ్యసింపఁబడిన యీ యోగము, అణిమ + ఆది + అష్ట + ఐశ్వర్యంబులన్ = అణిమ మహిమ

మొదలగు నెనిమిది యోగసిద్ధులును, ఒసంగుచున్ =కలుగఁజేయుచు, ఆత్మ జ్ఞానంబున్ = మోక్షమునకు ముఖ్యసాధన మగు బ్రహ్మజ్ఞానమును గూడ, ప్రకటంబుగాన్ - చేయున్ = పూర్ణాభ్యాసకులకుఁ బట్టుపడునట్లు కావించును; మఱియున్ = ఇఁకను, ప్రవిమల + చిత్తులకున్ = శమదమాదులచేఁ బరమపరిశుద్ధమగు బుద్ధి గలవారికి, జీవ + బ్రహ్మ + ఐక్య + జ్ఞానమాత్రంబున్ = ప్రత్యగాత్మ పరమాత్మకులకు నభేదజ్ఞానమును మాత్రము, ఇచ్చు = కలిగించెడు, అతి సులభంబు - ఐ = మిగుల ననాయాసముగ లభించునది యగు, విజ్ఞానయోగంబు = తొలుత నుపక్రమింపఁబడినవానిలో రెండవది యగు జ్ఞానయోగము, రాజయోగంబు + అనఁబడున్ = రాజయోగ మని చెప్పఁబడుచున్నది. ఈ రెంటికిన్ = అభ్యాసయోగ జ్ఞానయోగములు రెండింటికిని, శ్రీ... కారణంబు - శ్రీ రామ = శ్రీ రామచంద్రునియొక్క, చరణ కమల = అడుగుఁదమ్ములయందలి, భక్తి = నిరతిశయప్రేమయే, కారణంబు = మూలము; దానికిన్ = ఆ భగవద్భక్తికి, వైరాగ్యంబు = ఇహాముత్రఫలభోగ విరాగము, మూలంబు = నిదానము, అగును.

తా. శ్రీరామచంద్రతత్త్వపరిజ్ఞానమునకు నుపాయభూత మగు నా యోగము అభ్యాసరూపముగను జ్ఞానరూపముగను నిరుతెఱంగులం బరఁగు; నీ రెండింటిలో నభ్యాసయోగము ప్రాణాయామప్రధానం బై, ప్రాకృత వైకృత కేవలకుంభక భేదములచే మూఁడురీతులం దగు. ప్రాకృతము తత్తన్మంత్ర పురశ్చర్యాత్మకము, వైకృతంబు మనోలయాత్మకంబును, కేవల కుంభకంబు ప్రాణధారణాత్మక మై విలసిల్లు; నిట్లు మూఁడువిధములుగ నున్న యీ యభ్యాస యోగమునకు యమము, నియమము, ఆసనము, వాయునిరోధము నను నాల్గును, మొదట నేర్చుకొనఁ దగినవి. పిమ్మట ప్రత్యాహారము - ధ్యానము - ధారణ - సమాధి - అను నాల్గును నల వాటు సేయఁదగినవి. యోగమునకుఁ బూర్వోత్తరాంగము లగు నీ యెని

మిదిటిలో నే ప్రాణిని బాధింపమియు, దేనిని దొంగిలింపమియు, స్త్రీపరాఙ్ముఖత్వముతోఁ గూడిన బ్రహ్మనిష్ఠయు, దేనిం బుచ్చుకొన కుండుటయు, నను నీనాల్గును యమము లనఁబడును. దేహశుద్ధియుఁ జిత్తశుద్ధియుఁ గలుగుట త్రివిధం బగు తపస్సు, నిత్యసంతుష్టి, వేదాధ్యయనము, ఇష్టదైవతధ్యానము, అను నీ యైదును నియమము లనఁబడును. వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము మొదలగు నెనుబదినాల్గువిధములు గలవి యాసనము లనఁబడును. మొదట నీ యమనియమాసనములను బాగుగ నేర్చుకొని తరువాత వాయుధారణమును గావింప వలయును. ప్రాణాయామయోగమునకుఁ బ్రధానముగ నియమింపఁబడిన రేచకము పూరకము కుంభకము వీనిని గ్రమముగఁ జేయుచు నిరువదియొకవేయి యాఱునూఱుమాఱులు అజపాగాయత్రీమహామంత్రపురశ్చరణము, మంత్రయోగ మనఁబడుప్రాకృతయోగ మగును. మఱియుఁ బ్రతిదివసమునందు నభ్యసింపఁబడు రేచక పూరక కుంభకములచే వాయుధారణంబు గావించుచు మీఁదుగఁ బ్రసరించుచు, ముకుళ్కొనయుండెడు ప్రాణవాయువునందుఁ గ్రిందుగఁ బ్రసరించుచు పాయువు మొదలగుపట్ల నుండు నపానమును, నీయపానమునందుఁ బ్రాణమును నిట్లొకదానియందొకదానిని విలీనము గావించుట వైకృత మనఁబడు లయయోగం బగు. ఎడమకాలిమడమచేత గుదస్థానమును గట్టిగ నొక్కి యందలి యపానవాయువు నాకర్షించి ప్రాణవాయువునందుఁ జేర్చుట మూలబంధము. కుడికాలిమడమచేత నాభిస్థానమును నొక్కి ప్రాణవాయువునందుఁ గలసిన యపానమును గ్రిందుగ రాకుండ నిలుపుట ఉడ్యాణబంధ మనఁబడును. కుత్తుకను (కంఠమును) దగ్గఱగ ముడిచి గడ్డమును కదలకుండ హృదయదేశమున మోపి యొండొంటఁ గలసియున్న ప్రాణాపానవాయువులను జలింపకుండనిలుపుట జాలంధరబంధ మగు. ఈమూడుబంధములచేతను రేచకపూరకములను మాని, పైని జెప్పిన ప్రాణాపానవాయువులను రెండింటిని రాత్రింబవళ్లేకరీతినిఁ గుంభకముచే నిరోధించుట కేవలకుంభకమనఁబడు హఠయోగ

షగు; నిట్లు మూలబంధోడ్యాణబంధ జాలంధరబంధభేదములచే మూఁడు విధములుగఁ బ్రాణాయామము భాసిల్లును; ఇఁక శబ్దాదివిషయములయందు శ్రోత్రాదీంద్రియములఁ బ్రసరింపకుండఁజేయుట ప్రత్యాహారం బనఁబడును. శుద్ధసత్త్వప్రధానమాయోపాధికం బై సర్వజ్ఞత్వాది గుణవిశిష్టం బైన పరమేశ్వరచైతన్యంబును, త్రిగుణాతీతం బగు శుద్ధబ్రహ్మచైతన్యమును నిరంతరము మననము సేయుట ధ్యానంబనఁబడు. మూలాధారము మణిపూరము మొదలగుస్థానములయందు మనంబును జలింపకుండ నిలుపుట ధారణ యనఁబడును. రాగాదిదోషదూషితము గాక చాంచల్యములేని మనోవ్యాపారముచేత శుద్ధబ్రహ్మభావమును బడయుట సబీజనిర్బీజరూపంబగు సమాధి యనఁబడు. ఇవ్విధమున యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధు లను నెనిమిది యవయవములు గలదగుచు మొదటిదియగు నభ్యాసయోగము వెలుఁగొందు. ఈయోగంబు చిత్తశుద్ధిలేని మందాధికారులకు ముఖ్యముగ నాచరణీయంబు. మఱియు నిది సద్గురుశుశ్రూష లేనిచోఁ బట్టువడదు; దీనివలన యోగసిద్ధుఁడు తా నవసరమగునపుడు మిగుల సూక్ష్మస్వరూపుఁడగుట యణిమ, గడుఁ బెద్ద యగుట మహిమ, మిక్కిలి తేలికగ నుండుట లఘిమ, మిగుల బరువగుట గరిమ, ఎంతదవ్వయిన నిముసమునఁ జనఁగలుగుటయుఁ బడయరానిదానిని బడయుటయుఁ బ్రాప్తి, కోరిన కోరికలన్నిఁ బొందుట ప్రాకామ్యము, అన్నిటను అఘటనాఘటనసామర్థ్యము గలిగియుండుట ఈశత్వము, అన్నిటిని లోఁబఱచుకొనుట వశిత్వము - అను నెనిమిది విభూతులును లభించును. (బ్రహ్మజ్ఞానముగూడఁ బట్టువడును.) ఇఁక రెండవదియగు జ్ఞానయోగంబు పరమపవిత్రం బగుచిత్తము గలవారికిఁ బ్రత్యగాత్మపరమాత్మలకుఁ గల యభేదమును దెలుపుచు నత్యంతసుకరం బై రాజయోగము పేరం బరఁగు. ఈరెండుయోగములకును శ్రీరామచంద్రునిపాదారవిందములయందలి నిశ్చలభక్తియే హేతుభూతం బగు. ఆభక్తికి నతుల వైరాగ్యంబు ప్రధానం బగు.

**విశేషార్థములు.** "యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రావివేకఖ్యాతేః" అను పాతంజలదర్శనసూత్రముచేత **యమనియమాదులగు** నెనిమిదియోగాంగములను జ్ఞానపూర్వకముగ నభ్యసించుటవలనఁ **బాపాది** రూపమగు మలము క్షీణింపఁగా వివేకఖ్యాతికి (ఆత్మానాత్మవివేకము గలుగుటకు) **మూలకారణమగు** జ్ఞానప్రకాశము లభించును. అవి యోగాంగాభ్యాసమునకు ఫలము. ఇట్లు యోగాంగముల నభ్యసించుటవలనఁ గలుగుఫలమును జెప్పి తత్స్వరూపలక్షణములును విశేషఫలములునుగూడ నందు వివరింపఁబడినవి. ఎట్లనిన "**యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార** ధారణాధ్యాన సమాధయోఽష్టావాంగాని" అనుసూత్రముచేత స్వరూపకథనముమాత్రము చేయఁబడినది. వీనిలో ధారణ మొదలగునవి సమాధికి సాక్షాదుపకారకములు. **యమ**నియమాదులు యోగపరిపంథు లగు హింసాదులను సమూలముగఁ బెకలింపుచు సమాధికి నుపకరించుచున్నవి. వీనిలో నాసనము మొదలగునవి పైపైవానికి నుపకరింపుచున్నవి. ఎట్లనిన నాసనజయము గలుగఁగాఁ బ్రాణాయామము స్థిరపడును గాన నాసనము ప్రాణాయామమునకు నుపకారకము. ఇట్లు ప్రాణాయామము ప్రత్యాహారమునకును, ప్రత్యాహారము ధారణకును, ధారణ ధ్యానమునకును, ధ్యానము సమాధికిని నుపకరించుచున్న వని యెఱుంగునది.

### అందు యమములు.

"అహింసా సత్యాఽస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః" అను సూత్రముచేత నన్నివిధములచే నెల్లప్పుడు నేప్రాణికిని ద్రోహము (ప్రాణవియోగము) చేయకుండుట యహింసయగును. ప్రధానమగు నిది లేనిచో మూలభూతములగు యమనియమాదులు నిష్ఫలములగును. వాక్కుచేతను గాని మానసముచేతను గాని యనృతము నంటకుండుట సత్యమనఁబడును. పెరసొత్తును ముచ్చిలకుండుట యస్తేయము నాఁబడును. ఇంద్రియనిగ్రహ...

కముగ నుపస్థేంద్రియ నియమనము-బ్రహ్మచర్యము. భోగ్యసాధనములగు విష యములను "అర్థానా మార్జనే దుఃఖ మర్జితానాంచ రక్షణే, నాశేదుఃఖం వ్యయేదుఃఖం సర్వదుఃఖమయం ధనం" అని తలంచి యొరులవలన ధన మును జేకొనకుండుట యపరిగ్రహము-అనునీ యైదును యమము లనంబడును. "శౌచసంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః" శౌచము రెండు విధములు - బాహ్యమనియు నాభ్యంతరమనియు. ఇందు నీళ్లు మొద లగువానిచే నొడలు గడుగుకొనుట మొదలగునది బాహ్యశౌచ మనంబడును. మైత్రి మొదలగువానిచేత మనఃకాలుష్యమును బాపుట యాభ్యంతరశౌచ మనంబడును. ఇందులకు "సుఖదుఃఖ సుకృత దుష్కృతయుతమనుజే ష్వ నిశమేవ మైత్రీకృపయోః। హర్షస్యోపేక్షాయాభావనయాభవతి చిత్తనైర్మ ల్యం" అని నాచే రచియింపఁబడిన యోగచింతామణికారికార్థము నను సంధింపవలయును... ఎట్లన - పుణ్యాత్ములగు సాధువులు సుఖులైయుండు టంజూచి వారియెడ నీర్ష్యాబుద్ధిని మాని సౌమనస్యము గలిగియుండుటచేతను, దుఃఖపడుచుండు దీనులను జూచి యుపేక్షింపక వీరి కీదుఃఖ మెట్లు పోవు నని బుద్ధదేవునివలెఁ గనికరము గలిగియుండుటచేతను, మిక్కుటముగఁ బుణ్య ములను జేయువారిని జూచి ద్వేషబుద్ధిని మాని ప్రోత్సాహపఱచుచు సంత సించుచుండుటచేతను, పాతకకారులయెడ నుదాసీనబుద్ధితో ద్వేషము లేక యుండుటచేతను జిత్తము ప్రసన్నమగును. ఈ చిత్తప్రసాదనమే యాభ్య న్తరశుద్ధియగును. పైనిజెప్పిన యహింసాదులు సంతతాభ్యాసమువలన సుస్థిర ములు కాఁగాఁ గలిగెడు సిద్ధులుగూడ వివరింపఁబడినవి. ఎట్లనిన "అహిం సాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" అనుటచేత నహింసాపరుని చెంతను సహజవైరముగలపాము ముంగిస మొదలగునవిగూడ పరస్పరవిరోధ మును విడిచియుండును. "సత్యప్రతిష్ఠాయాంక్రియాఫలాశ్రయత్వం" అనుట చేత సత్యాభ్యాసశీలుండగుయోగి యెట్లు పలికిన నట్లు తప్పక కార్యములు వర్తిల్లును. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి" అని భవ

భూతి. "అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం" అనుటచేత నస్తేయ
మను యోగాంగము స్థిరపడినయోగికిఁ గోరనక్కఱలేకయే దివ్యములగు శ్రేష్ఠ
వస్తువు లెల్ల లభించును. "బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః" అనుటచేత
నస్ఖలితబ్రహ్మచర్యాభ్యాసశీలునకు శరీరేంద్రియమనోబలంబు లత్యధికంబు
లగును." "అపరిగ్రహస్థైర్యే జన్మకథంతాసంబోధః" అనుటచేత నప్రతి
గ్రహణతత్పరునకుఁ బూర్వజన్మజ్ఞానము గలుగును. భోగసాధనపరిగ్రహ
మాత్రమే పరిగ్రహ మనఁబడదు. శరీరము, భోగసాధనమగుటచేత నాత్మకు
శరీరపరిగ్రహము గూడఁ బరిగ్రహణ మనఁబడును గాన నది గలిగిన దేహమునం
దలి రాగానుబంధముచేత బహిర్ముఖప్రవృత్తి గలుగును గాన యథార్థ
జ్ఞానము గలుగదు. శరీరాదిపరిగ్రహమును విడిచి తాటస్థ్యము నవలంబించు
నపుడు బ్రహ్మజ్ఞానకారణం బగు పూర్వాపరజన్మజ్ఞానము గలుగును. ఇట్లు
యమసిద్ధులు; ఇఁక నియమసిద్ధులస్వరూప మెట్లనిన "శౌచాత్స్వాంగే జుగు
ప్సాపరై రసంసర్గః" నిత్యశుచిత్వమువలన రక్తమాంసాది భూయిష్ఠ
మగు శరీరముయొక్క కారణస్వరూప పర్యాలోచనచేతఁ దనశరీరమునందుఁ
గూడ నీశరీర మపవిత్రమైనది. దీనియందు నాస్థ చేయఁదగినది కాదని జుగుప్స
పొడమును. ఇట్లు తన శరీరమునందు జుగుప్సగలవానికి నితరములగు కాం
తాదిశరీరములయందు మిక్కుటముగ జుగుప్స గలుగు ననుమాట వేఱ చెప్ప
నేల? ఇంతియ కాక "సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మ
దర్శన యోగ్యతాశ్చ" అను సూత్రము చేత నీశౌచమువలన రజస్తమోగుణ
సంపర్కము లేక సత్త్వగుణము ప్రకాశసుఖాదిరూపమై పరిశుద్ధముగ నుండు
టయు, దుఃఖ మనునది లేక నిత్యము మనస్సు సంతోషముగ నుండుటయు,
చిత్తము మేలునందే నిలిచియుండుటయు, విషయపరాఙ్ముఖము లై ఇంద్రియ
ములు పరవస్తువునం దుండుటయు, వివేకఖ్యాతిరూప మగు పరమాత్మదర్శ
నమునందుఁ జిత్తము తగిలియుండుటయు, నను నివిగూడ సిద్ధించును; అనఁగా
నీశుచిత్వాభ్యాసకునకు సత్త్వశుద్ధియు, సత్త్వశుద్ధివలన సౌమనస్యము, సౌ

స్యముఁవలన నేకాగ్రత, ఏకాగ్రతవలన నింద్రియనిగ్రహము, నింద్రియజయము వలనఁ బరమాత్మదర్శనసమర్థతయుఁ గలుగు ననుట "సంతోషా దనుత్తమ సుఖలాభః" అనఁగా సంతోషాధిక్యము సిద్ధింపఁగా యోగికి బాహ్యమగు విషయసుఖముకన్న నూఱురెట్లెక్కుడునాంతరసుఖము సిద్ధించును. "కాయేంద్రియ సిద్ధి రశుద్ధిక్షయా త్తపసః" అనఁగాఁ జాంద్రాయణాది తపస్సులవలనఁ గ్లేశాదిరూపంబగు నపరిశుద్ధి క్షీణించుటచేత నింద్రియములకుఁ బరమసూక్ష్మములును, నగోచరములు, దవ్యగనున్నవియు నగు వస్తువులను దెలిసికొనుటకుఁ దగినసామర్థ్య మావిర్భవించును. మఱియును, శరీరము నకు నిచ్ఛను వచ్చినట్లు పరమాణుత్వము పరమమహత్త్వము మొదలగునవి సిద్ధించును. "స్వాధ్యాయా దిష్టదేవతా సంప్రయోగః" అనుటచేఁ దత్త ద్వేదమంత్రపురశ్చరణలక్షణం బగు స్వాధ్యాయమువలన యోగికి నాయా మంత్రముల యధిదేవతలు ప్రత్యక్షమగుదురు. "సమాధి సిద్ధిరీశ్వరప్రణిధానాత్" అనుటచేత భగవద్భక్తివిశేషరూపం బగు నీశ్వరప్రణిధానమువలన నాభగవంతుఁడు ప్రసన్నుఁడయి సమాధికి విఘ్నభూతములగు సకలక్లేశములను దూలఁ దోలుటచే నాసమాధి నిర్విఘ్నముగ సిద్ధించును. "తత్ర స్థిరసుఖమాసనం" అనుటచేత పద్మాసనము స్వస్తికాసనము మొదలగు నాసనము లోల నేదేనొకటి నిశ్చలముగను సుఖావహముగను నలవాటుపడునపు డది యోగాంగమగుచున్నది. "స్థితస్యైకతరః పాదో భూన్యస్తః ఏకతరశ్చాకుంచిత జానోరుపరిన్యస్తః, ఇత్యేతద్వీరాసనం" అను మొదలగు వీరాసనము మొదలగు నాసనముల లక్షణములు యోగశాస్త్రములవలనం దెలియందగును. "తతో ద్వంద్వానభిఘాతః" అనుటచే నాసనజయమువలన శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములచే యోగి బాధింపఁబడఁడు.

ఆసనజయమువలనఁ గలుగుప్రాణాయామలక్షణ మెట్లనిన.-"తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః" అనుటచే నాయాసనజయము సిద్ధింపఁగా శ్వాసప్రశ్వాసరూపము లగు ప్రాణాపానముల

ప్రసార నిరోధాత్మక మగు ప్రాణాయామమును రేచన స్తంభనపూరణము లచే నభ్యసింపవలయును—"తతః క్షీయతే ప్రకాశావరణం" అనుటచేత-నా ప్రాణాయామమువలనఁ జిత్తమునందలి సత్త్వగుణముయొక్క క్లేశాత్మక మగు నావరణము నశించును. ఇంతియకాక "ధారణాసుచ యోగ్యతా మనసః" అనుటచేతఁ బ్రాణాయామముచేత నిర్దోషమగు మనస్సు ముందుఁ జెప్పఁబడు ధారణలో విక్షేపములేక నిలుకడగ నుండును.

ఇఁకఁ బ్రత్యాహారలక్షణం బెట్లనిన—"స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకారే ఇంద్రియాణాం ప్రత్యాహారః" అనుటచేతఁ జక్షురాదులగు నింద్రియములు రూపాదులగు తమతమ విషయములతోఁ గలియక తేనెటీఁగలు తమ తేనిపగిది చిత్తమునుమాత్ర మనువర్తించునపుడు చిత్తవృత్తి నిరోధింపఁబడఁగా నా యింద్రియమును గూడఁ జిత్తముతోపాటుగ నిగ్రహింపఁబడుట ప్రత్యాహార మనఁబడును. "తతః పరమావశ్యతేంద్రియాణాం" అనుటచేత నట్టి ప్రత్యాహారమువలన నత్యంతముగ నింద్రియములయొక్క వశ్యత సిద్ధించును.

ఇఁక ధారణాస్వరూపం బెట్లనిన - దేశబంధశ్చిత్తస్యధారణా" అనుటచేత నాభిచక్రము, ముక్కుకొన మొదలగుప్రదేశములయందుఁ జిత్తమును స్థిరముగఁ గదలకుండ నిలుపుట ధారణ యనఁబడును. అనఁగా మైత్రిమొదలగువానితోఁ గూడిన యంతఃకరణము గలవాఁడును, యమనియమాదులును నాసనజయమును ధారణము నింద్రియనిగ్రహమును ద్వంద్వసహిష్ణుతయు గలవాఁడు నగు యోగి సంప్రజ్ఞాతసమాధి నభ్యసించుటకు నాసాగ్రము మొదలగు ప్రదేశములయందుఁ జిత్తమును జలింపకుండ నిలుపవలయు నని భావము.

ఇఁక ధ్యానలక్షణం బెట్లనిన - "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం" అనుటచేత చిత్తము నిలుపఁబడిన యా నాసాగ్రాదిప్రదేశమునందు జ్ఞానప్రవాహముయొక్క భగవదేకపరత్వము ధ్యాన మనఁబడును.

ఇఁక సమాధిస్వరూపం బెట్టనిన - తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః" అనుటచేత శ్రీమద్భగవదేకతానజ్ఞానరూపం బగు నాధ్యానమే తనరూపు మాసి భగవదాకారముగఁ బరిణమించుట సమాధి యనఁబడును. "సమ్యగాధీయతే భగవదేకాగ్రీక్రియతే ఇతి సమాధిః" అని వ్యుత్పత్త్యర్థము.

ఇఁక ధారణాధ్యానసమాధుల ఫలకథన మెట్లనిన- "తజ్జయాత్ప్రజ్ఞాలోకః" అనుటచేత నభ్యాసబలముచే నా ధారణా ధ్యాన సమాధులు వశము లగుటవలనఁ బ్రజ్ఞారూపమగు వివేకఖ్యాతిజ్ఞేయ మగు పరవస్తువును లెస్సగఁ దోఁపింపఁజేయును.

అవ. ఇట్లు తొలుత నుపక్రమింపఁబడిన క్రియాయోగమును సాంగముగఁ బ్రతిపాదించి సామాన్యముగ నిర్దేశింపఁబడిన భగవద్భక్తిప్రధానం బగు రాజయోగము విశేషాకారముగఁ దెలుపఁబడుచున్నది.

మ. ప్రత్యూహాపగమంబుఁ బావనము నభ్యాసంబు గావింపఁగా,
నత్యంతోరుసుఖంబు ధర్మ్య మతిగుహ్యంబుత్తమం బాద్య
మున్, సత్యంబాగమసిద్ధ మాదిమునిరాట్సంస్తుత్యము న్వే
ద్యమున్, నిత్యానందము రాజయోగము మహానిర్వాణ
మార్గం బగున్. ౧౧

టీ. రాజయోగము = యోగములలో నెల్ల నత్యుత్తమం బగు జ్ఞానయోగము, ప్రత్య...మంబు - ప్రత్యక్ష = క్షణికములగు నిహసౌఖ్యముల యందలి వాంఛను, అపగమంబు = పోఁగొట్టునదియు, పావనమున్ = రాగాదిదోషములను నశింపఁజేసి మనోవృత్తి నతినిర్మలముగఁ జేయునది, ...సంబునన్ = సాధనభూతములగు శ్రవణ మననాదులచే నలవాటును, ...గాన్ = చేయఁగా, అత్యంత...సుఖంబు - అత్యంత = మిగుల,

ఉరు = గొప్పదియగు, సుఖంబు = సౌఖ్యము నిచ్చునదియు, ధర్మ్యము = ఎల్లరచే నాచరింపఁదగినదగుటచే నత్యంత పుణ్యరూప మైనదియు, అతి గుహ్యంబు = అనధికారులకు నుపదేశింపఁదగనిదికాన నెంతయు దాఁపఁదగినదియు, ఉత్తమంబు = మోక్షము నొసఁగునదికాన నత్యంతశ్రేష్ఠ మైనదియు, ఆద్యమున్ = ఆచరింపఁదగిన ధర్మ్యములలో నెల్ల మొదటిదియు, సత్యంబు = వాస్తవమైనదియు, ఆగమసిద్ధము = నిఖిలోపనిషత్ప్రతిపాద్యమును, ఆదిమునిరాట్సంస్తుత్యమున్ = తొల్లింటి మహామునీశ్వరులచే నవలంబింపఁబడి కొనియాడఁబడఁ దగినదియు, వేద్యమున్ = సర్వజనులును దెలిసికొనఁదగినదియు, నిత్యానందము = శాశ్వతమగు మోక్షసుఖము నిచ్చునదియు, మహానిర్వాణమార్గంబు = సర్వోత్కృష్టమగు మోక్షమును బొందుటకు త్రోవయును, అగున్ = అయి యొప్పుచున్నది.

తా. ఓ వత్సా! ఆరాజయోగము,నశ్వరములగు నిహపరలోకసుఖముల యందు విరక్తిని బుట్టించి శ్రీమద్భగవదైకతానత్వమును గలిగించునదియు, రాగాది కలుషములను బాపి చిత్తవృత్తిని బరమపావనముగఁ జేయునదియు, తనకు నంగభూతములగు శ్రవణ మనన నిదిధ్యాసనముల నిరతము నభ్యసించుట చేత నిరతిశయసుఖము నిచ్చునదియు, నెల్లవారిచే నవలంబింపఁదగినదగుట చేఁ బరమధర్మోపేతమైనదియు, ననధికారులకు నుపదేశింపరానిదికాన నత్యంతము గోప్యమైనదియు, మోక్షమునకు నంతరంగభూతమైనది గాన సర్వోత్కృష్టమైనదియు, మనుష్యులచే నాచరింపఁదగిన ధర్మముల కెల్లఁ బ్రధానమైనదియు, యథార్థభూతమైనదియు, సర్వోపనిషత్ప్రతిపాదితమును, భగవద్భక్తాగ్రగణ్యు లగు తొల్లింటిమహామునీంద్రులచే నంగీకరించి కొనియాడఁబడినదియుఁ, గావుననే యెల్లరకును ముఖ్యముగఁ దెలిసికొనఁదగినదియు, శాశ్వతమగు మోక్షసుఖమును బొందుటకు రాచబాటవంటిదియునై యున్నది. ౮౮

ఆ-వె. రాజగుహ్య మైన ౕ రాజయోగంబును
శ్రద్ధధాను లగుచు ౕ జనము లెల్ల
సంశ్రయింపలేక ౕ సంసారవనధిలో
మునుఁగుచుండుదురు విమూఢు లగుచు. ౨౯

టీ. జనములు-ఎల్లన్ =నిఖిలమనుజులును, శ్రద్ధధానులు + అగుచున్ = శ్రద్ధాభక్తులతోఁ గూడికొనినవారలగుచు, రాజగుహ్యము=రహస్యములకెల్ల (శ్రేష్ఠము), ఐన = అగునట్టి, రాజయోగము = యోగములకెల్ల రాజు (శ్రేష్ఠమైనది) అగు పూర్వోక్త భక్తియోగమును, సంశ్రయింపలేక = అవలంబింపఁజాలక, విమూఢులు = మూలావిద్యావిమోహితులై, సంసార= దారేషణ పుత్రేషణ ధనేషణములచే దుస్తరంబగు సంసార మనియెడు, వనధిలోన్ = సముద్రమునందు, మునుఁగుచున్ = అడుగంటుచు, ఉండుదురు = ఉందురు.

తా. సాధారణముగ నెల్లవారును భగవత్ప్రాప్తికి మూలమయి పరమరహస్యమగు నీరాజయోగమును "శ్రద్ధాభక్తి ధ్యానయోగాదవేహి" అనుటచేత శ్రద్ధయు, భక్తియు, భగవద్ధ్యానమును గలవారగుచు, నభ్యసింపఁజాలక మాయామోహితులయి కాఁపురపుఁగడలిలోఁ బడి మునుఁగుచు నుందురు. ౨౯

విశేషార్థము. "ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే। జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమమ్। ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప। అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని" అను శ్రీభగవద్వాక్యము మీఁది పద్యమునకు నీపద్యమునకు నాధారముగానఁ దద్వివరణం బెట్లనినః - శ్రీపరబ్రహ్మస్వరూపుఁడగు భగవంతుఁడు దన సర్వేశ్వరతత్త్వము కేవల నిరతిశ

శయభక్తిచేతఁ యలవడుఁగాని వేఱొకదానిచే లభింపదని తెలుపఁ జెప్పి. ఇకఁను దనయొక్క సర్వైశ్వర్యత్వమును తనయందుగల భక్తియొక్క యసాధారణమాహాత్మ్యమును నుపదేశింపఁదలఁచి విజ్ఞానశబ్దవాచ్యమగు భగవదుపాసనతోఁ గూడుకొనిన భగవద్రూపుఁడనగు మద్విషయకమగు జ్ఞానమును నాకు మాఖ్యభక్తుఁడవగు నో యర్జునా నీ కుపదేశించెదను. అనుష్ఠానపర్యంతమగు దీనిని బాగుగ గుర్తెఱిఁగితివేని మత్ప్రాప్తికి విరోధమగు నిఖిలానర్థజాతములనుండి విడఁబడి నన్నుఁ బొందఁగలవు. ఇది గంభీరాంతఃకరణులగు మహాత్ములయొక్క విద్యయు నట్టి యగాధమానసులే పరమపవిత్రమగు దీనిని దాఁటుటకు నేర్పరులు. భక్తిరూపమగు నీయుపాసనచే నుపాసింపఁబడినవాఁడనై నేను వెంటనే యుపాసకునకుఁ బ్రత్యక్షమగుదును గాన, నిరతిశయ నిశ్శ్రేయసరూపమగు నాత్యంతిక మత్ప్రాప్తిసాధనము నతనికి బ్రియమైనదిగాన నుపాదేయమును మత్ప్రాప్తిని సాధించి కూడ నశింపదు. నా యుపాసనమును జేయువానికి నన్ను నే నొసఁగియు నేమియు వీనికిఁ జేయలేదని నాకుఁ దోఁచును. మఱియు నుపాసనారూపంబగు నీధర్మము భక్తులకు నిరతిశయప్రియుండ నగు నన్ను నుద్దేశించి చేయఁబడినదగుటచే నాకుఁ గూడ నిరతిశయప్రియమైనది. పరమనిశ్శ్రేయసరూపమును మత్ప్రాప్తిసాధనమును నగు నీధర్మమును నవలంబించుటకుఁ దగిన మనుష్యత్వాద్యనిర్హేతుక జాయమాన మత్కటాక్షమువలనఁ బడసియు దీని నాచరించుటకు విశ్వాసపూర్వకమగు తొందరలేని కృపణమానవులు నన్నుఁ బొందఁజాలరు. మృత్యురూపమగు సంసారమార్గమునందుఁ బడి భ్రమ్మరుచుందురు. మఱియు నిట్టి యుపాసనాయోగముచేతనే పొందఁదగిన నాయొక్క యచింత్యమహిమ నాలకింపుము. చిదచిదాత్మకం బగు నీ నిఖిలమును నంతర్యామి నగుటచేతనే వ్యాపింపఁబడియున్నది. "యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి । యస్యాత్మా శరీరం య ఆత్మాన మంతరో యమయతి" అను నంతర్యామి బ్రాహ్మణము

కలన సర్వాంతర్యామి నగు నాయందుఁ జేతనాచేతనాత్మకభూతజాతమెల్ల నున్నది. కాని, దానియందు నే నుండలేదు. ఘటాదులు జలాదులను మోయుచున్నట్లు భూతజాతమును నేను మోయుచు నుండలేదు. నా సంకల్పము చేతనే ప్రపంచస్థితినియమనములు జరుగుచున్నవి. ఇంకొకనియామకుం డెవఁడుండను లేని నాసర్వైశ్వర్యత్వమును గనుము. భూతజాతమునెల్ల భరింపుచున్నాను. భూతజాతముచే నా కించుకయు నుపకారములేదు. నా మనోమయమగు సత్యసంకల్పమే భూతములనెల్ల భరింపుచున్నది, నియమింపుచున్నది - అను మొదలగు నంశము లిచ్చటఁ బ్రసక్తానుప్రసక్తముగ గమనించునవి. "శ్రీరామచరణకమలభక్తి కారణంబని మూలమున నుండుటచే నిచట నీ రాజయోగప్రసంగము చేయఁబడినదిగానఁ బ్రకృతాసంగతమని యూహింపం జనదు.

క. ఈరాజయోగమార్గం
బీరేడుజగంబులందు నెవ్వ రెఱుంగ రా
త్మారామలసదపాంగా
పారకృపాయుక్తులైనభక్తులు దక్కన్. ౫౦

టీ. ఈ రాజయోగమార్గంబు = ఈ భగవద్భక్తియోగ మార్గమును, ఆత్మ...యుక్తులు - ఆత్మారామ = ప్రపంచరూపమగు నాటకమునకు సూత్రధారుఁడై తనలోఁ దా రమించుచుండు పరమపురుషునియొక్క, అమల=వైషమ్యనైర్ఘృణ్యాదులు లేకపోవుటచే నిర్మలమైనదియును, లసత్ = సుందరమై యొప్పుచున్నదియు, అపాంగ = కడకంటిచూపుతోఁ గూడినదియు, అపార = దరిలేనిదియునగు, కృపా = కనికరముతోఁ యుక్తులు= కూడుకొనినవారు, ఐన = అగునట్టి, భక్తులు = పరమభాగవతోత్తములు, తక్కన్ = తప్ప, ఈరు + ఏడు + జగంబులందున్ = [illegible]నిః - భువనములయందును, ఎవ్వరు = ఎవ్వారైనను, ఎఱుంగరు = [illegible]యు కేవలనిరతిశ

తా. మోక్షమునకుఁ బ్రధానసాధనమైన యీ రాజయోగ మను త్రోవను ఆత్మారాముం డగు పురుషోత్తమునియొక్క పూర్ణావతారమగు శ్రీరామచంద్రునియొక్క నిర్హేతుకజాయమానకరుణాకటాక్షవీక్షణము గల పరమభక్తులు తక్క నీపదునాల్గు భువనములలోఁ దదితరులగువా రెవ్వరు నెఱుంగరు. ౯౦

తే-గీ. రాజయోగంబు ముక్తికి రాజపథము
రాజగుహ్యంబు పరమంబు రాజవిద్య
యదియు మూఁడువిధంబుల నలరుచుండు
సాంఖ్యతారకసదమనస్కము లనంగ. ౯౧

టీ. రాజయోగంబు = ఈ భగవద్భక్తియోగము, ముక్తికిన్ = శ్రీమన్నారాయణసాయుజ్యరూపం బగు మోక్షమును బొందుటకు, రాజపథము = నిరుపద్రవం బగు రాజమార్గము, రాజగుహ్యంబు = మిక్కిలి గోపనీయము, పరమంబు = సర్వోత్కృష్టమైనదియు, రాజవిద్య = యోగములకెల్ల నుత్తమమైన యోగమునై యున్నది, అదియున్ = ఆ రాజయోగము గూడ, సాంఖ్య + తారక + సత్ + అమనస్కములు = సాంఖ్యము తారకము శ్రేష్ఠమగు నమనస్కమును, అనంగన్ = అని, మూఁడువిధంబులన్ = మూఁడురీతులుగ, అలరుచున్ + ఉండున్ = ఒప్పుచున్నది.

తా. ఈ భగవజ్జ్ఞానయోగము సంసారబంధమోక్షమునకు నిరపాయమగు రాచబాటయుఁ గుతర్కనిష్ఠు లగువారికి నుపదేశింపరానిదిగానఁ బరమరహస్యమైనదియు, సర్వోత్కృష్టమైనదియు, మోక్షమునకు ముఖ్యసాధనము గానఁ గర్మాదియోగములకెల్ల నుత్తమము నగును. మఱియు నీరాజయోగము, సాంఖ్యము తారకము అమనస్కము నను మూఁడు భేదములను నొప్పుచున్నది.

తే-గీ. తారకంబు మనశ్శుద్ధికారకంబు
సాంఖ్య మాత్మస్వరూపవిచారకంబ

అనుభవజ్ఞాన మమనస్క మట్లు గాన
నాద్య మెఱిఁగింతు మొదల నీ వవధరింపు. ౯౩

టీ. తారకంబు = రాజయోగాంతర్భూతములగు తారకసాంఖ్యామనస్కముల మూఁడిటిలోఁ దారకయోగము, మనశ్శుద్ధికారకంబు - మనః = చిత్తముయొక్క, శుద్ధి = నిర్మలత్వమునకు, కారకంబు = హేతుభూతమైన దని యర్థము. సాంఖ్యము = సాంఖ్యయోగము, ఆత్మ + స్వరూప + విచారకంబు = పరమాత్మస్వరూపమును జర్చించునది. "చర్చా సంఖ్యా విచారణా" అని అమరమునుబట్టి, సంఖ్య యన విచారణ. విచారణ గలది గాన సాంఖ్యమనఁబడునని వ్యుత్పత్త్యర్థము. అమనస్కము = కడపటిది యగు నమనస్కయోగము, అనుభవజ్ఞానము = "సర్వం ఖల్విదం బ్రహ్మ- సర్వం విష్ణుమయంజగత్ - వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అను మొదలగు శ్రుతిస్మృతులనుబట్టి చిదచిదాత్మకంబగు నిఖిలప్రపంచమును పరవాసుదేవునికార్య మగుటచేతను, అతఁడే యంతర్యామిగాఁగల దగుటచేతను, బరమపురుషునకు వ్యతిరిక్తమైనది కాదను ననుభవజ్ఞానమే యగును. అట్లుగానన్ = ఇట్లొకదానికొకటి కారణమగుటచేతను, మొదలన్ = తొలుత, ఆద్యమున్ = సాంఖ్యామనస్కములకు మొదటిదియగు తారకయోగమును, ఎఱిఁగింతున్ = ఉపదేశించెదను, ఈవు = నీవు, అవధరింపుము = సావధానచిత్తుఁడవై యాకర్ణింపుము.

తా. సాంఖ్యతారకామనస్కాత్మకం బగు నారాజయోగమునందలి తారకయోగము బుద్ధిశుద్ధిని గలుగఁజేయునది. సాంఖ్యయోగము చిత్తశుద్ధి కలుఁగగా పరమాత్మస్వరూపవిచారణయందలిజ్ఞానమును గలిగించును. నా పరమాత్మస్వరూపవిచారణవలనఁ గలుగు ననుభవజ్ఞానమే యమనస్కయోగమనఁబడును గావున మొదటిదియగు తారకయోగమును దొలుతఁ దెలిపెదను. సావధానముగ నాలకింపుము.

౯౩

ఉ. తారక ముద్భవాంబునిధికిఁ దారక మంబుజ సంభవాది బృం
దారక సన్నుతం బఘవిదారక మంచిత రాగరోష సం
హారకముం బ్రధానపరిహారక మాత్మ సుఖానుభూతి వి
స్తారక మాగమాంతసువిచారక మై తనరారు మారుతీ.

టీ. ఓ మారుతీ = ఓ వాయుపుత్రా! తారకము = "గర్భజన్మ జరామరణసంసారమహద్భయా త్సంతారయతి - తస్మా త్తారకమితి" అను శ్రుతిచేత - గర్భవాసక్లేశము జన్మదుఃఖము జరామరణయాతన మొదలగు క్లేశములకెల్ల నునికిపట్టగు సంసారమునందలి పెనుభీతినుండి దాఁటించునది గాన తారక మనఁబడుయోగము, ఉద్భవ = గొప్పసంసారమనియెడు, అంబునిధి=సముద్రమును, తారకము = దాఁటఁజేయునదియు, అంబుజ... సన్నుతంబు-అంబుజసంభవ = శ్రీవిష్ణు నాభీకమలమునుండి పుట్టిన బ్రహ్మ, ఆది = లోనుగాఁగల, బృందారక = వేల్పులచేత, సన్నుతంబు = కొని యాడఁబడుచున్నదియు, అఘవిదారకము = పెక్కుపుట్టువులలోఁ జేయఁ బడు పాపములనెల్లఁ దూలఁదోలునదియు, అంచిత-రాగ-రోష - సంహారక మున్ = గొప్పలగు కామక్రోధములను బరిమార్చునదియు, ప్రధాన - పరి హారకము = సంసారమునకు మూలమగు నజ్ఞానమును బోఁగొట్టునదియు, ఆత్మ...విస్తారకము - ఆత్మ = పరమాత్మసాక్షాత్కారముచే నైన, సుఖ= నిరతిశయానందముయొక్క, అనుభూతి = అనుభవమును, విస్తారకము = ప్రబలఁజేయునదియు, ఆగమ - అంత-సువిచారకము = ఉపనిషత్తులచేత విచారణ సేయఁదగినదియు, ఐ = అగుచు, తనరారున్ = ఒప్పును.

తా. ఓ పవనతనయా, తారకయోగము జననమరణము లను సుడులు గలదియు, రాగద్వేషాదు లను అలలు గలదియు, కామక్రోధాదులనియెడు జలజంతువులచే భయంకరమైనదియు, నగు సంసారమనియెడు సాగరమును దరింపఁజేయుటకుఁ దరణియు, నలువ మొదలగు వేల్పులచేఁ గొనియాడఁ

బడుచున్నదియు, ఘోరపాతకములనెల్లఁ బటాపంచలుగఁ జేయునదియు, ప్రబలుచుండెడు కామక్రోధాదులను రూపుమాపునదియు, సంసృతిబంధమునకు మూల మగు నవిద్యను దొలఁగించునదియు, పరమాత్మసాక్షాత్కారమువలనఁ గలుగు పరమానందముయొక్క యనుభవమును విస్తరింపఁజేయునదియు నుపనిషత్తులచేఁ దెలియఁదగినదియు నగుచు నొప్పుచున్నది. ౯౩

క. తారకయోగముఁ దెలియఁగ
నేరక వేదాంతవాక్యనికరంబులచే
నూరక వాదించుచుఁ జెడు
వారికి మోక్షంబు గలదె వాయుకుమారా! ౯౪

టీ. వాయుకుమారా = ఓ ఆంజనేయ! తారకయోగముక్ = పైని సామాన్యముగ నిర్దేశించి ముందు వివరింపఁబడు తారకయోగమును, తెలియఁగక్ = గుర్తెఱుఁగుటకు, నేరక = చాలక, వేదాంత - వాక్య - నికరంబులచేక్ = తత్త్వమస్యాద్యుపనిషద్వాక్యములయొక్క గుమిచేతను, ఊరక = నిష్ఫలముగ, వాదించుచుక్ = ఒండొరులం గెలుచుకొనుటకు వితండవాదములను గావించుచు, చెడువారికిక్ = మోక్షఫలము నొందలేక చెడిపోవు జనులకు, మోక్షంబు = సంసారబంధవిముక్తి, కలదు - ఎ = కలుగునా? ఎన్నఁటికిని గలుగదనుట. లోకమునఁ బెక్కండ్రు పెక్కువిధములుగఁ దమతమతానుగుణములగు యుక్తులతో నేదో యొక పురుషార్థమును గోరుచుఁ బరమాత్మనుగూర్చి యిట్లు వాదించుచున్నవారు. అందుఁ బరమాత్మ శుద్ధబుద్ధముక్తస్వభావ మని యౌపనిషదులును, నాదివిద్వాంసుఁడగు సిద్ధుఁ డని కాపిలులు, క్లేశకర్మవిపాకాశయముల సంబంధములేక నిర్మాణశరీరము నవలంబించి సంప్రదాయప్రవర్తకుఁడగుననుగ్రాహకుఁ డని పాతంజలులు, లోకవేదవిరుద్ధములగు ధర్మముల నంటియు సర్వస్వతంత్రుఁ డని పాశుపతులు, సదాశివుఁ డని శైవులును, పురుషోత్తముం డని వైష్ణవులును, హిరణ్యగర్భుఁ డని పౌరాణికులును, యజ్ఞపురుషుఁడని యాజ్ఞికులును

సర్వజ్ఞుఁ డని సౌగతులును, నిరావరణుఁ డని దిగంబరులును, దేశికుం డని మీమాంసకులును, లోకవ్యవహారసిద్ధుఁడే యని చార్వాకులును, యుక్త్యుపపన్నుఁడని నైయాయికులును, పెక్కండ్ర వడ్రంగులుగూడ విశ్వకర్మ యనియు వాదించుచున్నారు. కావున నిట్లు కేవలశుష్కవితర్కవాదముల చే లాభము లేదు. తారకయోగమువలననే పరవాసుదేవప్రాప్తిరూప మగు ముక్తి యబ్బవడు నని ఫలితార్థము.

తా. ఓ సమీరకుమారా! తారకయోగము నెఱుంగఁజాలక కొన్ని యుపనిషత్తులయందలి వచనములను బైకిఁ జెప్పుచు వితండవాదములను జేయువారికి సంసారబంధవిముక్తి యెన్నఁటికిని గలుగదు.　　౯౪

తే-గీ. రాజయోగంబుఁ బూని నిరంతరంబుఁ
బట్టుగా నభ్యసింపంగఁ బ్రాలుమాలి
కొన్ని వేదాంతయుక్తులఁ గూడఁబెట్టి
పలుక నేర్చిన బ్రహ్మానుభవము గలదె.　　౯౫

టీ. రాజయోగంబున్ = తారక సాంఖ్యామనస్కాత్మకం బగు రాజయోగమును, పూని = అవలంబించి, నిరంతరంబున్ = ఎడతెగకుండు నట్లు, పట్టుగాన్ = పట్టుదలగ, అభ్యసింపన్ - కన్ = నేర్చుటకు, ప్రాలుమాలి = తెలివిలేక, కొన్ని వేదాంతయుక్తులన్ = పైపైశుష్క వేదాంతపుయుక్త్యాభాసములను గొన్నిటిని, కూడఁబెట్టి = అచ్చటచ్చట విని సంపాదించి, పలుక నేర్చినన్ = శుకానువాదముగఁ జెప్పుటకుఁ దగి యున్నంతమాత్రముచేత, బ్రహ్మానుభవము = రాజయోగముఁ బొందఁ దగిన పరవస్తువుయొక్క యనుభూతి, కలదు - ఎ = కలుగునా? కలుగ దనుట.

తా. రాజయోగము నవలంబించి యెల్లప్పుడును మీఁదఁ జెప్పిన యట్లు పట్టు విడువక యభ్యాసముఁ జేయుటను మాని తెలివిలేని కొన్ని

**వేదాంతపుమాటలను** నేర్చుకొని **మాకుఁ** దెలియు నని **నుడివిన మాత్రము** చేత శ్రీభగవదనుభవజ్ఞానము లభింపదు.

అవ. "శాబ్దస్యహి బ్రహ్మణఏషపన్థా యన్నామభిర్ధ్యాయతిధీరపార్థాన్। పరిభ్రమస్తత్ర నవిన్దతే ర్థా న్మాయామయో వాసితయాశయానః" అని శ్రీభాగవతమునందుఁ జెప్పఁబడిన వడువున రాజయోగానుభవమును విడిచిన నిరర్థక మగుఁ గేవలశబ్దజన్యజ్ఞానమువలన ఫలము లేదని చెప్పఁబడుచున్నది.

సీ. దారుణగాఢాంధకారం బడంగునే
వసుధపైఁ గృతదీపవార్తవలన
నాఁకొన్నమనుజుని కాయాఁకలి దీఱునే
ఘనసరసాన్న వర్ణనమువలన
నెత్తిపేదవాని పేదఱికంబు వ్రాపునే
ద్రవ్యప్రభావకీర్తనమువలన
రోగపీడితుని బల్రోగంబు దీఱునే
కలితౌషధప్రసంగంబువలనఁ

తే-గీ. జండిపడి బుద్ధిలో వెలి నిండి మిగుల
దట్టమైనట్టియజ్ఞానతమము దెగునె
తర్కిత విచిత్రశబ్ద బోధంబువలన
ఫలితయోగానుభవదృష్టివలనఁ గాక. ౯౭

**టీ చండిపడి** = పెక్కు **పుట్టువులనుండి యుండుటచే** మొండిదేరి, బుద్ధిలోన్ = **మనస్సులోపలను**, వెలిన్ = పైని, **నిండి** = **ఆవరించి**, మిగులన్ = మిక్కిలి, దట్టమైనట్టి = సాంద్రమైన, అజ్ఞాన + తమము = **మోహామనియెడు** కటికిచీఁకటి, ఫలిత...వలనన్ - **ఫలిత** = సంతతాభ్యాసవశము చేత **ఫలించిన**, యోగ = రాజయోగముచేసైన, **అనుభవ** = **పరమా**

త్మానుభవముయొక్క, దృష్టివలనన్ = జ్ఞానమువలన, కాక = తప్ప, తర్కిత...వలనన్ - తర్కిత = చర్చింపఁబడెడు, విచిత్ర = వినువారికి నబ్బురము గొలుపు, శబ్ద + బోధంబువలనన్ = కేవల శబ్దజన్యజ్ఞానము వలన, తెగునె = తెగిపోవునా? తెగ దనుట. (ఇందులకు నిదర్శనము)- వసుధపైన్ = భూలోకమునందు, దారుణ + గాఢ + అంధకారంబు = అడలు గొలిపెడు బెడిదపుఁగటికిచీఁకటి, కృత + దీప + వార్తవలనన్ = నలుపఁబడిన దీపపు కథనముచేత, అడంగున్ + ఎ = తగ్గునా? తగ్గదు, ఆఁకొన్న + మనుజుని + ఆఁకలి = క్షుధార్తుఁడగు జనునియొక్క ఆఁకలి, ఘన...వలనన్ - ఘన = ఉత్కృష్టమగు, సరస = రుచులతోఁగూడిన, అన్న = పక్వాన్నములయొక్క వర్ణనమువలనన్ = పొగడికచేత, తీఱునే = పోవునా? పోదు, నెఱి + పేదవాని + పేదఱికంబు = మిగుల బీదవానియొక్క బీదతనము, ద్రవ్య + ప్రభావ + కీర్తనః వలనన్ = విత్తముయొక్క ఘనతను జెప్పుటచేత, పోవునే = కడ తేరునా, రోగ + పీడితుని + బల్ + రోగంబు = జబ్బుచే బాధింపఁ బడుచున్నవానియొక్క యా గొప్పజబ్బు, కలిత + ఔషధ + ప్రసం గంబువలనన్ = మంచి మందుయొక్క ప్రశంసచేత, తీఱునే = మానునా? మానదు.

తా. దీపముపేరుఁ జెప్పినంత మాత్రముచేత నడలుగొలుపు పెంజీఁకటి యడఁగని వడువునను, పక్వాన్నములనెల్లఁ బేర్కొనిన యంతన ఆఁకలిగొన్నవాని ఆఁకలి తీఱనట్లును, విత్తముయొక్క మాహాత్మ్యమును జెప్పిన మాత్రముచేత బీదవాని బీదతనము నశింపని తెఱంగునను, పెద్ద పెద్ద మందులను గొనియాడినంత మాత్రాన జబ్బుచే స్రుక్కుచున్నవాని జబ్బు నిమ్మళింపని రీతిని, శుష్కతర్క యుక్తులతోఁ గూడిన పైపై వేదాంతపు మాటలను జెప్పినంత మాత్రముచేతఁ జుట్టుఁ గట్టి పెక్కుపుట్టువులనుండి హృదయములోపలఁ బైని సాంద్రముగఁ జుట్టుకొనియున్న మోహాంధ

కారము నశింపదు. అభ్యాసబలమున సిద్ధించిన రాజయోగముచేత నా మూలాజ్ఞానము తప్పక నశించును. ౯౬

క. యోగాభ్యాసమువలన స
దాగతి చిత్తేంద్రియముల దర్పము లడఁగున్
రాగద్వేషాదులు చను
బాగుగ నాత్మకు సుఖానుభవముం గలుగున్. ౯౭

టీ. యోగ + అభ్యాసమువలనన్ = క్రియాయోగ మనఁబడు ప్రాణాయామ యోగముయొక్క యభ్యాసమువలనను, సదా...దర్పములు - సదాగతి = ప్రాణాది వాయువులయొక్కయు, చిత్త = అన్తఃకరణ చతుష్టయము యొక్కయు, ఇంద్రియముల = దశేంద్రియముల యొక్కయు, దర్పములు = బలములు, అడఁగున్ = క్షీణించును. యోగ+అభ్యాసమువలనన్ = రెండవదియగు రాజయోగముయొక్క యభ్యాసము వలన (అని యోగాభ్యాస మను పదమును మరల నుత్తరార్ధమునందు ననువర్తించి యన్వయించునది), రాగ + ద్వేష+ఆదులు = రాగము ద్వేషము మొదలగునవి, చనున్ = పోవును, ఆత్మకున్ = చిద్రూపుఁడగు జీవునకు, సుఖానుభవము = భగవత్ప్రాప్తిరూప మగు మోక్షసుఖముయొక్క యనుభూతి, బాగుగన్ = నిర్విఘ్నముగ, కలుగున్ = సంభవించును.

తా. క్రియాయోగము నభ్యాసము చేయుటచేత శరీరాంతర్గతంబులగు ప్రాణాపానవ్యానోదాన సమానములను నైదు వాయువుల యొక్కయు, మనోబుద్ధిచిత్తాహంకారాత్మక మగు నంతఃకరణ చతుష్టయము యొక్కయు, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణము లను జ్ఞానేంద్రియముల యొక్కయు, వాక్పాణి పాద పాయూపస్థ లనెడి కర్మేంద్రియముల యొక్కయు నౌద్ధత్యము నశించును. జ్ఞానయోగమనఁబడు రాజయోగము నభ్యసించుటచేతఁ గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు నొంద

లగు నజ్ఞానగుణములు పోయి వైరాగ్యాది సాధన సంపత్తివలన నాత్మకు భగవత్ప్రాప్తి రూపం బగు నిరతిశయసుఖానుభవము చేకూఱును. ౯౭

వ. అట్లు గావున యోగాభ్యాసంబు ముముక్షువున కవశ్య
కర్తవ్యం బగుటఁ దత్ప్రకారం బెఱింగించెద. సావధాన
చిత్తుండ వై వినుము. ౯౮

టీ. అట్లు గావునన్ = పైని జెప్పినయట్లు ద్వివిధ యోగాభ్యాసముచే బుద్ధిశుద్ధిపూర్వక మగు మోక్షసౌఖ్యము లభించుటంబట్టి, ముముక్షువునకున్ = సంసార బంధవిముక్తిని గోరువారికి, యోగ - అభ్యాసంబు = ద్వివిధయోగములయొక్క యభ్యాసము, అవశ్య కర్తవ్యంబు = తప్పక యాచరింపఁదగినది, అగుటన్ = అయి యుండుటచేత, తత్ + ప్రకారంబు = ఆ ద్వివిధయోగముల యభ్యాస క్రమమును, ఎఱింగించెదన్ = ఉపదేశించెదను. స + అవధాన + చిత్తుఁడవు + ఐ = ధారణాశక్తితోఁ గూడినమానసము గలవాఁడ వగుచు, వినుము = ఆలకింపుము.

తా. ద్వివిధయోగాభ్యాసములవలనఁ జిత్తశుద్ధిపూర్వకం బగు నిరతిశయానంద లాభము గలుగుటంజేసి మోక్షాపేక్ష గలవారిచే నా యోగాభ్యాసము నాచరణీయం బగుటచే నా యోగాభ్యాస క్రమంబు దేటపఱిచెద సమాహితాత్ముండవై యాకర్ణింపుము. ౯౮

చ. వనరుచు నేమియుం దిననివానికి మిక్కిలివెక్కసంబుగాఁ
దిని యెగఁబోయువానికినిరేయినిద్దుర నెల్లప్రొద్దుఁ బై
కొనఁబడియుండువానికినిఁ గ్రొంకక రేవగ లొక్కరీతి మే
ల్కొనివసియించువానికి నగోచరముల్వరయోగలక్ష్యముల్.

టీ. వనరుచున్ = శుష్కోపవాసాదులచేఁ గృశించుచు, ఏమియున్ = ఏ పదార్థమును, తినని + వానికిన్ = భక్షింపని నరునకును, మిక్కిలి + వెక్కసంబు + గాన్ = గుండెలు మొయ్యఁ గడుపు పట్ట

వట్లు, తిని = మెక్కి, ఎగఁబోయువానికిన్ = ఎగయూపిరి దీయు దిండి పోతునకును, తీరని + నిద్దురన్ = కడలేని నిద్రచేత, ఎల్లప్రొద్దున్ = ఎల్లప్పుడును, పైకొనన్ = మైమఱచునట్లు, పడియుండువానికిన్ = పడుకొనియుండు మనుష్యునకును, కొంకక = భీతిలేక, రేవగలు = రేయుంబవళ్లు, ఒకరీతిన్ = ఒక వరుసను, మేల్కొని + వసియించువానికిన్ = విదుర మానియుండు మర్త్యునకును, వర + యోగ + లక్ష్యముల్ = ఉత్తమమగు యోగముయొక్క గుఱుతులు, అగోచరముల్ = పట్టుపడవు. "నాత్యశ్నతస్తు యోగోస్తినచైకాన్త మనశ్నతః । నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున'' అను భగవద్వాక్య మిందులకు నిదానము.

తా. ఏమియు భుజింపక ఉపోషవాసాదులచేత నటించుచుండు జనునకును, కుక్షింభరియై యబ్బినదానినెల్లఁ గడుపునిండ మ్రింగి యెగయూపిరి పెట్టుచుండు మనుజునకును, తెంపులేని నిదుర యావేశింపఁగా రేయుంబవళ్లనక పడుకొనియుండు పురుషునకును, నిద్ర లేనిచో రోగము గలుగు నను భీతిలేక రాత్రియుఁ బగలును నొక చొప్పున మేలుకొనియుండు మానవునకును, నుత్తమములగు యోగమునకు ముందుఁ జెప్పఁబోవు లక్ష్యములు విషయములు కావు. ౯౯

క. యుక్తాహారవిహారుఁడు
యుక్తస్వప్నావబోధుఁ డురుకర్మములన్
యుక్తవిచేష్టుం డగు ఘను
యుక్తున కగుఁ బరమరాజయోగము సుఖమై. ౧౦౦

టీ. యుక్త + ఆహార + విహారుఁడు = సరియైన సాత్త్వికభోజనమును వ్యాయామమును గలవాఁడును, యుక్త + స్వప్న + అవబోధుఁడు = హెచ్చుతగ్గులులేని నిద్రయు మెలఁకువయుఁ గలవాఁడును, ఉరు + కర్మములన్ = పెద్దపనులయందు, యుక్త + విచేష్టుండు = నియతమగు వ్యాపా

రము గలవాఁడును, అగు = అయిన, ఘనయుక్తునకున్ = ఆహారవిహారాదులయందు సమమైన యభ్యాసము గలయోగికి, పరమ+రాజయోగము = ఉత్తమమగు రాజయోగము, సుఖము ఐ = సులభ మగుచు, అగున్ = సిద్ధించును. "యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు । యుక్తస్వప్నావబోధస్యయోగోభవతి దుఃఖహా" అను శ్రీభగవద్వచనార్థము నిందు ననుసంధింపఁదగును. మఱియు సాత్త్వికాహారస్వరూపముఁగూడ శ్రీభగవానులచే "ఆయుస్సత్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః । రస్యాస్స్నిగ్ధాస్థిరాహృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః" అని యానతియ్యఁబడినది.

తా. సరియగు సాత్త్వికభోజనమును నియతమైన వ్యాయామమును గలవాఁడును, సమమగు నిదురయు మేలుకొనుటయుఁ గలవాఁడును, నియతములయిన పనులయందు సరియైన శరీరపరిశ్రమముఁ గలవాఁడు నగు నభ్యాసయోగికి నుత్తమమగు రాజయోగము సుఖముగ సిద్ధించును. ౧౦౦

అవ. "యోగీయుఞ్జీతసతత మాత్మానం రహసిస్థితః॥ ఏకాకీయతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః । నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరం। ఉపవిశ్యాసనే యుఞ్జ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే। సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలంస్థిరః॥ సంప్రేక్ష్యనాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్। ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతేస్థితః॥ మనస్సంయమ్యమచ్చిత్తో యుక్తఆసీత మత్పరః । యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః॥ శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి" అను శ్రీభగవద్వచనార్థము రెండుపద్యములచే వివరింపఁబడుచున్నది.

సీ. వితతమై విజనమై వివిమలమై సుఖమై పొ
సంగు వివిక్తదేశంబునందు

సమభూమియందు నిశ్చలముగా మిఱ్ఱుప
ల్లములు గాకుండఁ బేలవముగాఁగ
వరుసఁ గుశాజినవస్త్రంబు లనువుగాఁ
బఱచి యొప్పుగ వానిపైఁ దిరముగఁ
బూని పద్మాసనాసీనుఁడై యామీఁదఁ
గాయమధ్యమమునుఁ గళము శిరముఁ
తే. జక్కఁగా నిక్కి దృక్కులు ముక్కుచక్కిఁ
జిక్కఁ దక్కించి తక్కినదిక్కుఁ గనక
మిక్కిలి దశేంద్రియంబుల స్రుక్కఁ జేసి
ఫలితముగ యోగ మభ్యసింపంగవలయు. ౧౦౮

టీ. వితతము-ఐ = చుట్టుపట్ల నితరులయిండ్లులేక యావరణ గలిగి విపులమైనదియు, విజనము-ఐ = మనుష్యుల సంగములేనిదియు, విమలము - ఐ = గ్రామమునకు దవ్వుగ నదీతీరమునందుండి పావనముగ నున్నదియు, సుఖము-ఐ = ఎట్టిబాధలును లేక సుఖకరమైనదియు నగుచు, పొసంగు + వివిక్త + దేశంబునందుఁ = ఒప్పుచుండెడి నేకాంతప్రదేశమునందు, సమభూమియందుఁ = సరియైన చౌకపు నేలమీఁదను, నిశ్చలముగాఁ = చిత్తచాంచల్యములేనట్లు, మిఱుపల్లమును = హెచ్చుతగ్గులు, కాకుండఁ = లేకుండునట్లు, పేలవముగాఁగఁ = మెత్తఁదనముగను, తిరముగఁ = నిలుకడగను, వరుసఁ = ఓలిని, కుశ + అజిన + వస్త్రంబులు = దర్భాసనమును, దానిపై "కృష్ణాజినే జ్ఞానసిద్ధిః" అనుటచేత జ్ఞానప్రదమగు కృష్ణాజినమును, దానిపై ధావళిని, అనువుగాఁ = సరిగ, పఱచి = వేసి, ఒప్పుగఁ = స్వస్థముగ, వానిపైఁ = ఆ కుశాసనాదులమీఁద, తిరముగఁ = నిలుకడగ, పూని = ప్రయత్నించి, పద్మాసన + ఆసీనుఁడై = "పద్మాసనమిదం ప్రోక్తం యోగినాం హృదయంగమం। జానూర్వోరన్తరే సమ్య

కృత్వా పాదతలే ఉభే॥ కించ॥ ఊరుమూలేవామపాదం పునస్తు దక్షిణం పదం। వామోరౌ స్థాపయిత్వాతు పద్మాసనమితిస్మృతం॥ అనియు॥ ఊర్వో రుపరివిన్యస్య సమ్యక్పాదతలే ఉభే। అంగుష్ఠౌచ నిబధ్నీయా ద్ధస్తాభ్యాం వ్యుత్క్రమా తతః" అనులక్షణముగల పద్మాసనమునుగూర్చి కూర్చుండినవాఁడై, ఆమీఁదన్ = అటుతరువాతను, కాయ+మధ్యమమున్ = దేహముయొక్క నడిమిపట్టగు నుదరమును, గళమున్=కుత్తుకను, శిరమున్= శిరస్సును, చక్కఁగాన్ = తిన్నగ, నిక్కి = మీఁదికి చాపి, దృక్కులు= చూడ్కులను, ముక్కుచక్కిన్ = ముక్కుకొనను, చిక్కన్ = అంటునట్లు, తక్కించి = నిలిపి, తక్కినదిక్కున్ = ఇంకొకవైపు, కనక = పరికింపక, దశేంద్రియంబులన్ = శ్రోత్రములు మొదలగు నింద్రియములఁ బడింటిని, మిక్కిలిన్ = మిక్కుటముగ, స్రుక్కన్ = క్షీణించునట్లు, చేసి = కావించి, ఫలితముగన్=సఫలమగునట్లు, యోగమును = పైని వివరింపఁబడినయోగమును, అభ్యసింపంగన్ = పరిపాటిచేయుటకు, వలయున్ = తగును.

తా. విస్తీర్ణమును, జనరహితమును, పవిత్రమును సుఖకరము నైయొప్పు నేకాంతప్రదేశమునందలి సరిచౌకపు నేలమీఁదఁ గదలకుండునట్లు హెచ్చుతగ్గులు లేకుండ మెత్తనగు దర్భలను, వానిపైఁ గృష్ణాజినమును, దానిమీఁద మృదువగుదావళియు నోలిని బాగుగఁ బఱచి, వానిమీఁదను నెమ్మదిగ నిలుకడతోఁ బ్రయత్నపూర్వకముగ పద్మాసన మను నాసనమును గూర్చుకొనినవాఁ డగుచు, దరువాత నడుమును, కంఠమును, శిరస్సును, దిన్నగమీఁదికి నిగిడించి,చూడ్కులను ముక్కుకొనను నిలుచునట్లు చేసి యింకొకవైపుఁ బరికింపక, శ్రోత్రాదీంద్రియములను శబ్దాదివిషయములయందుఁ దగులువడకుండ నిగ్రహించి, ఫలసిద్ధియగుదనుక యోగమును బరిపాటిఁజేయవలయును. ౧౧౧

మ. యతధీచిత్తమరుద్దశేంద్రియతను
వ్యాపారుఁడై మానియై
హతకామాదివికారుఁడై గతభయుం
డై బ్రహ్మచారివ్రత
స్థితుఁడై శాంతమనస్కుఁడై స్వగురుమూ
ర్తిప్రోక్తలక్ష్యార్థసం
గతియామద్వయ మభ్యసింపఁదగు యో
గం బంచితోద్యోగుఁడై. ౧౦౨

టీ. అభ్యాసయోగియను కర్తృపద మధ్యాహారము. యత...వ్యాపారుఁడు ఐ-యత = నిగ్రహింపఁబడిన, ధీ = అధ్యవసాయాత్మికయగు బుద్ధియొక్కయు, చిత్త = చిత్తాహంకార మనస్సులయొక్కయు, (ఇచ్చట చిత్తశబ్దముచేత నహంకారమనస్సు లుపలక్షింపఁబడుచున్నవి), మరుత్ = ప్రాణము మొదలగు నైదు గాలులయొక్కయు, దశ + ఇంద్రియ = త్వగాదులగు నైదుజ్ఞానేంద్రియములును, వాక్కు మొదలగు నైదుకర్మేంద్రియములు నను పదియింద్రియములయు, తను = కరచరణాద్యవయవములయొక్కయు, వ్యాపారుఁడు + ఐ = వ్యవహారము గలవాఁడగుచు, మానియై = వాఙ్నియమము గలవాఁడై, హత + కామ + ఆది + వికారుఁడు + ఐ = కొట్టఁబడిన కామక్రోధాదులయొక్క వికృతులు గలవాఁడగుచు, గత + భయుండు + ఐ = పోయిన శీతోష్ణ సుఖదుఃఖాదులవలనిభీతి గలవాఁడగుచు, బ్రహ్మచారి + వ్రత + స్థితుఁడు + ఐ = "బ్రహ్మచారివ్రతే స్థితః" అనుటచేత నస్ఖలితబ్రహ్మచర్యవ్రతనిష్ఠ గలవాఁడగుచు, శాంత + మనస్కుఁడు + ఐ = అడఁగిన చిత్తౌద్ధత్యము గలవాఁడగుచు, అంచిత + ఉద్యోగి + ఐ = తాను పూనినపని సాధించుటకు మిక్కుటమగు పట్టుదల కలవాఁడై, స్వ...సంగతిన్ - స్వ = తనయొక్క, గురుమూర్తి = గురుస్వాములచేత,

కేంద్రునియొక్క, ఉపదేశ + సరణిన్ = బోధించినరీతిని, విశేషముగన్ = కడముట్ట, ఎఱింగి = తెలిసికొని, అభ్యసింపన్ - వలయున్ = నేర్చుకొనవలయును; అటమీఁదన్ = ఆపైని, ప్రణవ = ఓంకారసంబంధము లగు, నాద = చెప్పఁబోవు దశవిధనాదములచేతను, బిందు = చిద్బిందువు యొక్క, కళలన్ = సూర్యచంద్రాగ్ను లధిదేవతలుగాఁ గల తాపనిమొద లగు ముప్పదియెనిమిది కళలచేతను, తారకంబు = తారకయోగమును, పొందున్ = అభ్యాసయోగి వడయును; ఖేచరి మొదలగు ముద్రలను బాగుగ నభ్యసించినయెడల నభ్యాసకునకుఁ దారకయోగసిద్ధి యగుననుట.

తా. ప్రశాంతచిత్తుఁడును బ్రహ్మనిష్ఠుండు నగు నాచార్యుని సద్బోధ వలనఁ బైని జెప్పిన ఖేచరి మొదలగు నైదుముద్రలయొక్క స్వరూపభేద ములను సరిగఁ దెలిసికొని, యాముద్రలను బాగుగ నేర్చుకొనిన పిమ్మట నోంకారముయొక్క గత్యమా దశవిధనాదములచేతను, చిద్బిందువుయొక్క తాపన్యాది సూర్యకళలచేతను, నమృతాది చంద్రకళలచేతను, జ్వాలిని మొదలగు నగ్నికళలచేతను, తారకయోగమును, అభ్యాసయోగి వడయును.

వ. అది యె ట్లంటేని. ౧౦౬

తా. ఆ ముద్రలయొక్క లక్షణ మె ట్లనిన. ౧౦౬

ఆ. కనులు మూసియైనఁ గను విచ్చియైన భ్రూ
మధ్యమమునఁ జూపు మలఁచి నిలిపి
యూర్ధ్వముఖముగాఁగ నొనరఁ జూచిన నది
ఖేచరి యనుముద్ర కీశవర్య. ౧౦౭

టీ. కీశవర్య = కపీంద్రా! కనులుమూసి + ఐనన్ + కనుఁగవను ముడుచుకొనియేని, కనువిచ్చి + ఐనన్ = బాగుగఁ గనులఁ దెఱచియేని చూపున్ = చూడ్కిని, మలఁచి = దృశ్యపదార్థములనుండి మరలించి, భ్రూ+మధ్యమునన్ = కనుబొమ్మలయొక్క మధ్యభాగమునందు, నిలిపి=

కూర్చి, ఊర్ధ్వముఖముగాఁగన్ = మీఁదుగ, ఒనరన్ = బాగుగ, చూచినన్ = పరికించినయెడ, అది = అట్లు చూచుట, ఖేచరి + అను + ముద్ర=ఖేచరియనఁబడు ముద్ర అగును. భ్రూమధ్య దృష్టిరస్యేషా ముద్రా భావతి ఖేచరీ । కపాలకుహరేజిహ్వా ప్రవిష్టావిపరీతగా॥ భ్రువోర్మధ్యగతా దృష్టి ర్ముద్రాభవతిఖేచరీ । పీడ్యతే నచరోగేణ లిప్యతే నచ కర్మభిః॥ బాధ్యతే నచకేనాపి యోముద్రాం వేత్తిఖేచరీం । చిత్తం చరతిఖేయస్మా జ్జిహ్వా చరతిఖేయతః॥ తేనేయం ఖేచరీముద్రా సర్వసిద్ధ నమస్కృతా । ఖేచర్యాముద్రితంయేన వివరం లంబికోర్ధ్వతః॥ నపీయూషాం పతత్యగ్నౌ నచ వాయుః ప్రధావతి" అను మొదలగు శ్రుతుల యర్థము నిందు ననుసంధించునది.

తా. ఓ వానరోత్తమా ! కనుఁగవను ముడుచుకొనినయైనను దెఱచినయైనను జూడ్కిని బాహ్యపదార్థములనుండి మరలించి కనుబొమ్మల మధ్యప్రదేశమునందుఁ గూర్చి మీఁదుగఁ బరికించుట ఖేచరీముద్ర యనఁబడును.

క. లోచనములఁ గదలింపక
యాచార్యోక్తస్వనాసికాగ్రం బెపుడున్
గోచరముగఁ జూచిన నది
భూచరి యను ముద్ర యగును శ్రీ బోధశరణ్యా. ౧౦౮

టీ. బోధ+శరణ్యా=నాచే నుపదేశింపఁబడు జ్ఞానమునకు నాశ్రయభూతుఁడవగువాఁడా, లోచనములను = కన్నులను, కదలింపక = దృశ్యవస్తువులయందుఁ బడనీయక, ఆచార్య...అగ్రంబు-ఆచార్య = సద్గురువుచే, ఉక్త = చెప్పఁబడినరీతిని, స్వ=తనయొక్క, నాసికా = ముక్కుయొక్క, అగ్రంబు = కొనను, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, గోచరముగన్ = విషయమగునట్లు, చూచినన్ = కనుఁగొనిన, అది = అట్లుచూచుట, భూచరి + అనుముద్ర + అగును = భూచరి యను పేరం బరగు ముద్రయై యున్నది.

"అర్ధసంమీలితాదృష్టి ర్నాసికాగ్రస్థితా యది। ప్రసన్నతారకాముద్రా భూచరీత్యుచ్యతే బుధైః" అనుటచే, కంటియొక్క మీఁదిరెప్పలను సగము ముడిఁచి ప్రసన్నములగు గనుపాపలు గలిగినచూడ్కి వేఱొకదానియందుఁ బ్రసరింపక పరవాసుదేవతత్త్వమునందే నిలిచియున్న మనస్సుతోఁ గలసి ముక్కుయొక్క కొనను నిలిచియున్నయెడల నది భూచరి యను ముద్ర యనఁబడు నని ఫలితము.

తా. సద్బోధకు నాశ్రయభూతుఁడ వగు నో యాంజనేయా! చూడ్కులను గదలనీక నిజగురూపదిష్టక్రమమునఁ దనముక్కుకొనను గనుఁగొనుచుండిన నది భూచరి యనుపేరం దగు ముద్ర యగును. ౧౦౮

ఆ. కనులు సగము మూసి ఘననాసికామధ్య
సీమయందుఁ జూపుఁ జెదరనీక
నిలిపి మీఁద నున్న నిటలంబుఁ గాంచిన
మధ్యలక్ష్య మగుఁ గుమారతిలక. ౧౦౯

టీ. కుమార + తిలక = తనయోత్తమా! (నామవాచకపదములకుఁ బరంబులగు తిలక - భూషణ - మణి - అవతంస - మొదలగు పదములు (శ్రేష్ఠవాచకములు), కనులు = నయనములను, (ఇచట ద్వితీయార్థమునందుఁ బ్రథమ), సగము మూసి = సగము ముడుఁచుకొని, ఘన...యందుఁ - ఘన = నిడుపగు, నాసికా = ఘ్రాణముయొక్క, మధ్యసీమయందుఁ = నడిభాగమున, చూపుఁ = చూడ్కిని, చెదరనీక = వేఱొకవస్తువునందుఁ బడకుండునట్లు, నిలిపి = ఉంచి, మీఁదఁ + ఉన్న = పైని గల, నిటలంబుఁ = లలాటప్రదేశమును, కాంచినఁ = కనుచునుండినయెడ, మధ్య + లక్ష్యము = మధ్య యనుపేరం బరఁగు ముద్ర, అగును = తగును.

తా. ఓ పుత్త్రోత్తమా! అరమోడ్పుకన్నులతోఁ జూడ్కిని తన ముక్కుయొక్క మధ్యప్రదేశమునందు నిశ్చలముగఁ గూర్చి మీఁదుగనున్న నుదుటిని గనుఁగొనుచు నుండుట మధ్య యనఁబడు ముద్ర యగును. ౧౦౯

తే. కర్ణలోచననాసాయుగంబు మూసి
మలఁచి భ్రూమధ్యమునను జూపులను మనము
నిలిపి వరనాదబిందుచిత్కళలఁ గనుట
షణ్ముఖీముద్ర యండ్రు సజ్జనులు వత్స. ౧౧౦

టీ. వత్స = ఓబాలకా ! కర్ణ + లోచన + నాసా = చెవులయొక్కయు, కన్నులయొక్కయు, ముక్కుచెలమలయొక్కయు, యుగంబుఁ = ద్వయమును, మలఁచి + మూసి = రెండుచేతులయొక్క బొట్టనవ్రేళ్లు మొదలగు వ్రేళ్లతో నొక్కి మూసికొని, చూపులను = లోఁజూడ్కులను, మనముఁ = డెందమును, భ్రూ + మధ్యముఁ = కనుబొమలయొక్క + నడిమిపట్టున, నిలిపి = నిలుకడగనుంచి, వర + నాద + బిందు + చిత్ + కళలఁ = ముందుఁ జెప్పఁబడు లక్షణములు గల ప్రణవనాదమును బ్రహ్మబిందువును చిత్స్వరూపముయొక్క కళావిశేషములను. కనుట = అంతర్లక్ష్యముచే వీక్షించుటను, సజ్జనులు = మహాయోగులు, షణ్ముఖీ + ముద్ర = షణ్ముఖి యను ముద్ర యని, అండ్రు = చెప్పెదరు, ముఖమునందలి యాఱురంధ్రములను మూయుటచే దీనికి షణ్ముఖి యని పేరు గలిగినది.

తా. అంగుష్ఠముల రెండిటితో రెండుశ్రోత్రబిలములను, రెండుచేతుల తర్జనీమధ్యమములతో రెండుకన్నులను, అనామికముల రెంటిడితో రెండు ముక్కుచెలమలను నొక్కుచు మూసికొని కనుబొమల నడిమిభాగమున నాంతరదృష్టిని మనస్సునుజేర్చి ప్రణవనాదమును ముందుఁజెప్పఁబడు బ్రహ్మబిందువును చైతన్యముయొక్క కళావిశేషములను బరికించుటయే మహాపురుషులు షణ్ముఖీముద్ర యని చెప్పెదరు. ౧౧౦

క. అంతర్లక్ష్యము బహిర
త్యంతవినిశ్చలసుదృష్టి యపగతపవన

స్వాంతవికారము గలయది
వింత యగుచు నొప్పు శాంభవీముద్ర యనన్. ౧౧౧

టీ. అంతర్లక్ష్యము = ధ్యానింపఁదగిన పరవస్తువునందు దృష్టి నుంచుటయు (అన్తర్ముఖత్వమును), బహిః...దృష్టి - బహిః = బాహ్యమునందు, అత్యన్త = ఇంచుకయును, వినిశ్చల = చలింపని, సు + దృష్టి = మేలగు చూడ్కియును, అప...మున్ - అపగత = పోయిన, పవన = ప్రాణము మొదలగు వాయువులయొక్కయు, స్వాంత = మనో బుద్ధి చిత్తాహంకారములయొక్కయు, వికారము = చలనరూపమగుమార్పు, కలయది = కలిగి యున్నది, శాంభవీ ముద్ర అనన్ = శాంభవి యనుముద్ర యనునట్లుగా, వింత - అగుచున్ = ఆశ్చర్యకరమయి, ఒప్పున్ = తగును.

తా. లోకవ్యవహారమునుమాని హృదయపుండరీకమునందు ధ్యానింపఁబడు పరమాత్మునియందు మనస్సును నిలిపి, పైకి నించుకయుఁ జలింపని చూపును గలిగి వాయుచలనమును మనోవికారమును లేకయుండుట శాంభవీ ముద్ర యనఁదగును; భగవద్భక్తాగ్రగణ్యుఁడగు శంభుఁ డీముద్రను బూని యెల్లప్పుడు భగవంతుని ధ్యానించుచుండును గాన, నీముద్ర శాంభవి యనఁబడును. ౧౧౧

అవ. ఇట్లు పంచముద్రలయొక్క స్వరూపమును జెప్పి యా ముద్రలచేఁ గనుఁగొనఁదగిన నాదబిందుకళా స్వరూపములును వివరింపఁబడుచున్నవి.

మ. అమరేంద్రార్చిత!పూర్వవర్ణితనితాంతాంతర్బహిర్లక్ష్యల
క్ష్యములుద్యద్వరమండలత్రయకళాసందర్శనాభ్యాసయో
గము లీరెండును నాదబిందురుచిసాక్షాత్కారసద్ధేతుభూ
తములై యొప్పునిరంతరంబలఘుతన్ ధ్యానంబుఁ గావించినన్.

టీ. అమర + ఇంద్ర + అర్చిత = దేవేంద్రునిచే నారాధింపఁదగిన హనుమంతుఁడా! పూర్వ...లక్ష్యములు - పూర్వ = లోఁగడ, వర్ణిత = వివరింపఁబడిన, నితాంత = పూనికగ నభ్యసింపఁదగిన, అంతః = అంతర్లక్ష్యమగు శాంభవీముద్రయు, బహిః = బహిర్లక్ష్యము లగు ఖేచరీభూచరీముద్రలును, మధ్యలక్ష్యములు = మధ్య యను ముద్రయు ననునీలక్ష్యత్రయమును, ఉద్యత్...యోగములు - ఉద్యత్ = ప్రకాశించుచున్న, పర = శ్రేష్ఠములైన, మండల = సూర్యాగ్నిచంద్రమండలములయొక్క, త్రయ= మూఁడిటిసంబంధములైన, కళా = కళావిశేషములయొక్క, సందర్శన = చూచుటయందలి, అభ్యాసయోగములు = క్రియాయోగములును, ఈ రెండును - లక్ష్యములు, క్రియాయోగములు, అని యర్థము. నాద...భూతములు - నాద = ఓంకారనినాదములయొక్కయు, బిందు = అమృతబిందువుయొక్కయు, రుచి = శుద్ధచైతన్య రసాస్వాదనముయొక్కయు, సాక్షాత్కార = అపరోక్షానుభవమునకు, సత్ = ప్రధాన మైన, హేతుభూతములు = కారణాత్మకములు, ఐ = అగుచు, నిరంతరంబు = ఎల్లప్పుడును, అలఘుతన్ = అధికముగ, ధ్యానంబున్ = అనుసంధానమును, కావించినన్ = ఒనర్చినయెడల, ఒప్పున్ = తగును.

తా. వేల్పులఱేనిచే నారాధింపఁబడు నోసమీరనందనా! పైని వివరింపఁబడిన యైదుముద్రలలో ఖేచరి భూచరి యనుముద్రలు రెండును బహిర్లక్ష్యము. మధ్య షణ్ముఖియనుముద్రలు రెండును మధ్యలక్ష్యము. శాంభవి యనునది అంతర్లక్ష్యము అనఁబడు; నిందు బహిర్లక్ష్యముచేత, ధూమ్రయు నర్చియు నుష్ణయు జ్వాలినియు విస్ఫులింగినియు సుశ్రియు స్వరూపయుఁ గపిలయు హవ్యవహయు కవ్యవహయు నను పది యగ్నిమండలకళలను, మధ్యలక్ష్యముచేత, అమృతయు మానదయు పూషయు తుష్టియు రతియు ధృతియు శశినియు చంద్రికయు కాంతియు జ్యోత్స్నయు శ్రీయు ప్రీతియు అంగదయు పూర్ణయు పూర్ణామృతయు కామదాయినియు నను

పదియాఱు చంద్రమండలకళలను అంతర్లక్ష్యముచేత, తపిని తాపిని ధూమ్ర మరీచి జ్వాలిని రుచిర సుషుమ్న భోగద విశ్వ బోధిని ధారిణి క్షయ అను నీ పండ్రెండుసూర్యమండలకళలను సందర్శింపవచ్చును; మూఁడులక్ష్యములును, అగ్ని చంద్ర సూర్యకళలను లక్ష్యములచేఁ గనఁదగు నభ్యాసయోగము నను నీ రెండును, దశవిధ ప్రణవనాదములను వినుటకును, బాగుగ ధ్యానించిన యెడల చిద్బిందువుయొక్కయు, చిత్కళలయొక్కయు సాక్షాత్కార మునకును, ప్రధానకారణము లై విలసిల్లును. ౧౧౨

ఆ. నాదబిందుకళల నయ మొప్పఁ జూచుచు
నింద్రియముల మనము నిగురఁజేసి
సత్కవీశ్వరుండు స్వప్రకాశాత్మచి
త్సుఖముఁ గాంచుఁ బరమసులభముగను. ౧౧౩

టీ. సత్ + కవి + ఈశ్వరుండు = యోగ్యుఁడగు యోగీంద్రుఁడు; ఇంద్రియములన్ = పదియింద్రియములను, మనమున్ = అంతఃకరణ చతుష్టయమును, ఇగురన్ = యోగాభ్యాసబలముచేత క్షీణించునట్లు, చేసి = కావించి, నాద + బిందు + కళలన్ = దశవిధ ప్రణవనాదములను, పర వాసుదేవాత్మకచిద్బిందువును, ఆ చిద్బిందువునుండి వెడలు సృష్టి స్థితి సంహారకారణము లగు సూర్యాదికళావిశేషములను, నయము + ఒప్పన్ = భగవన్నిష్ఠ వెలయుచుండ, చూచుచున్ = కాంచుచు, స్వ...సుఖమున్ - స్వ = తనయొక్క, ప్రకాశ = ఇతరాపేక్షలేక వెలుఁగు తేజస్సు, ఆత్మ= స్వరూపముగఁ గల, చిత్ =చిద్రూపుఁడగు శ్రీమన్నారాయణునియొక్క, సుఖమున్ = ప్రాప్తిరూపమగు మోక్షసౌఖ్యమును, పరమసులభముగను = మిగులసుకరముగ, కాంచున్ = పొందును.

తా. యోగనిష్ఠుఁ డగు జ్ఞాని చక్షురాదీంద్రియములయొక్కయు మనో బుద్ధి చిత్తాహంకారములయొక్కయు బాహ్యప్రవృత్తిని నిగ్రహించి

పైఁజెప్పినరీతిని బాహ్యమధ్యాంతర్లక్ష్యములచేతను నభ్యాసయోగముచేతను, ప్రణవనాదములను చిద్బిందువును సూర్యచంద్రాగ్నిమండలముల కళావిశేషములను నిరంతరమును గనుఁగొనుచుండెనేని మిగుల ననాయాసముగ స్వయంప్రకాశస్వరూపుఁడగు పరవాసుదేవుని ప్రాప్తిరూపమగు చిదానందమును బడయును. ౧౧౩

చ. లలితనినాదబిందుకళ
లన్ గుఱిఁజేసిన మానసేంద్రియం
బులు, వెలి లోపలన్ దిరుగఁ
బోవక వానినిఁ జూచుచుండ ని
శ్చల మగు దేహ మయ్యెడ వి
చారముచేఁ బరమాత్మతత్త్వమున్
సులభముగా నెఱుంగఁబడు
నమ్మిది చక్కనిత్రోవ యారయన్. ౧౧౪

టీ. లలిత+నినాద+బిందు+కళలన్ = మనస్సునకు నింపగు ప్రణవనాదమును, బ్రహ్మబిందువును, ఆబ్రహ్మముయొక్క యిచ్ఛారూపములగు కళావిశేషములను, గుఱిన్ - చేసినన్ = అభ్యాసయోగముచేత లక్ష్యముఁగాఁ జేసినయెడల, మానస+ఇంద్రియంబులు = చిత్తము చక్షురాదీంద్రియములును, వెలిన్ = పైనిగాని, లోపలన్ = హృదయాకాశమునందుఁగాని, తిరుగన్ - పోవక = సంచరించుటకు వెళ్లక, వానిని = ఆప్రణవనాదమును బ్రహ్మబిందువును చిత్కళలను, చూచుచున్+ఉండన్ = కనుఁగొనుచుండెనేని, అయ్యెడన్ = అప్పుడు, దేహము = స్థూలసూక్ష్మరూపమగు శరీరము, నిశ్చలము-అగున్ = ఆధివ్యాధులు లేక నిలుకడగ నుండును; విచారముచేన్ = ఇట్లు నాదబిందుకళాస్వరూపుఁడగు శ్రీమన్నారాయణుని నిరంతరానుసంధానముచేత, పరమాత్మ+తత్త్వమున్ = ఆ

భగవంతునియొక్క వాస్తవస్వరూపముగూడ, సులభముగాన్ = అనాయాసముగ, ఎఱుంగఁబడుసుమ్ము = గోచరమగునుసుమీ; ఇది = ఈ యోగమార్గము, ఆరయన్ = ఆలోచింపఁగా, చక్కని + త్రోవ = భగవత్ప్రాప్తికి తిన్ననిబాట.

తా. మీఁదఁ జెప్పినరీతిని ఖేచరి మొదలగుముద్రలచేతఁ బరమాత్మ ప్రతిపాదకమగు నోంకారముయొక్క నాదములనుఁ జిద్బిందుస్వరూపుఁడగు శ్రీమన్నారాయణుని అతని సత్యసంకల్పరూపము లగు కళావిశేషములను లక్ష్యముఁజేసినచోఁ జిత్తవృత్తులును నింద్రియములవ్యాపారములును బైనిగాని లోపలనుగాని లేక యా నాదబిందుకళలనే నిరంతరమును జూచుచు నుండినయెడ శరీరము గదలకయుండును. ఇట్లు శరీరము మనస్సు ఇంద్రియములును నిశ్చలములుగ నుండునపుడు భగవదనుసంధానమును జేయుటచే శ్రీ పరవాసుదేవుని వాస్తవస్వరూపము యోగికిఁ దప్పక గోచరమగును; గాన నోయంజనేయా! ఇది భగవత్ప్రాప్తికి మేలయినమార్గము.

ఆ. నాదబిందుకళల నాదరింపనియోగి
యింద్రియములు మనము నిట్టు నట్టుఁ
బరువు లిడఁగ వానిఁ బట్టఁజాలక కుందు
నిట్టివాఁడు పరము నెట్టు గాంచు. ౧౧౫

టీ. నాద + బిందు + కళలన్ = భగవత్స్వరూపములైన నాదమును బిందువును కళలను, ఆదరింపని + యోగి = లక్ష్యాభ్యాసవిశేషముచే గోచరములుగఁ జేయఁజాలని ముముక్షువు, ఇంద్రియములు = చక్షురాదీంద్రియములును, మనము = చిత్తమును, ఇట్టున్ + అట్టున్ = నలుగడలను, పరువులు + ఇడన్ + కన్ = రూపము మొదలగు విషయములయందుఁ ద్రిమ్మరుచునుండఁగా, వానిన్ = ఆ యింద్రియములనుఁ జిత్తమును, పట్టన్ + చాలక = నిగ్రహింపలేక, కుందున్ = ఖేదించుచుండును; ఇట్టివాఁడు = ఇట్లింద్రి

యాజయము లేనియోగి, పరముఁ = పరాత్పరుండగు శ్రీమన్నారాయణుని, ఎట్టు = ఏరీతిని, కాంచుఁ = పొందఁగలఁడు? పొందఁజాలఁ డనుట.

తా. శ్రీ భగవత్స్వరూపము లగు నాదబిందుకళల నభ్యాసయోగముచేఁ గనుఁగొనఁజాలనియోగి నేత్రము మొదలగు నింద్రియములు శబ్దాది విషయములయందును, మనస్సు కామము మొదలగు వృత్తులయందును స్వేచ్ఛగ సంచరించుచు నుండఁగా, నా యింద్రియములను మనస్సును నిగ్రహించుటకు సామర్థ్యము లేనివాఁడై దుఃఖించుచుండును. ఇట్లు మనోనిగ్రహము ఇంద్రియనిగ్రహము లేని యోగి భగవత్ప్రాప్తిరూప మగు మోక్షమును బడయఁజాలఁడు. ౧౧౫

సీ. గాలంబు లేనిచో జాలకాగ్రణిచేతఁ
బాఠీనజాలముల్ పట్టఁబడునె?
సరియురి లేనిచో శకునాంతకునిచేతఁ
జొక్కంపుఁబత్తులు చిక్కఁబడునె?
యోదంబు లేనిచో నోగి మావటీనిచే
గజరాజములు నరికట్టఁబడునె?
తగుకోల లేనిచో మృగయావినోదిచే
ఘోరమృగంబులు కొట్టఁబడునె?
తే. రాజితానందతారక రాజయోగ
పావనసమాధి లేనిచోఁ బరమశుష్క
తర్కవేదాంతవాదతత్పరుల చేత
నింద్రియమనంబులు వినిగ్రహింపఁబడునె? ౧౧౬

టీ. పాఠీన + జాలముల్ = వేయికోఱలుగల చేపలసముదాయములు, ("సహస్రదంష్ట్రః పాఠీనః" అని యమరము.) జాలక + అగ్రణిచేతఁ = మాలవాండ్రలో నేర్పరియగువానిచేత, గాలంబు + లేనిచోఁ = గాలాపు

రివ్వ చేతలేనపుడు, పట్టఁబడునె = గ్రహింపఁబడునా ? ఇది మిత్త్రకార బత్తులు = సొగసైనపిట్టలు, శకున+అంతకునిచేతన్ = పక్షుల పరిపూర్ణ రించువానిచేత, సరి+యురి+లేనిచోన్ = సమమైనయురిత్రాడు లేనపుడు, చిక్కఁబడునె = లభింపఁబడునా ? గజరాజములు = మదపుటేనుఁ గులు, మావటీనిచేన్ = గజరక్షకునిచేత, ఓదంబు లేనిచో = గోయి లేనిపట్ల, ఒగిన్ = సులభముగ, అరికట్టఁబడునె = నిరోధింపఁబడునా ? ఘోర+మృగంబులు = దుష్టము లగు నడవిజంతువులు, మృగయా+వినోది చేన్=వేఁటయందు వేడుకగలవానిచేత, తగుకోలలేనిచోన్ = వాఁడియైన నారసము లేనితఱిని, కొట్టఁబడునె = చంపఁబడునా ? పడ వని యంతట నర్థము, రాజిత...సమాధి - రాజిత = ప్రకాశమానమగు, ఆనంద = సం తోషముగల, తారక = తారకమనియెడు, రాజయోగ = జ్ఞానయోగము చేత, పావన = పవిత్రమగు, సమాధి = భగవదనుసంధానము, లేనిచోన్= లేనిపక్షమున, పరమ...పరులచేతన్ - పరమ = మిగుల, శుష్క = నిష్ఫ లములైన, తర్క = వితండముల చేత, వేదాంత = ఉపనిషత్తులయొక్క, వాద = విపరీతవాదమునందు, తత్పరులచేతన్ = తలంపు గలవారిచేతను, ఇంద్రియ+మనంబులు = చక్షురాదీంద్రియములును జిత్తమును, వినిగ్ర హింపఁబడునె = లోఁబఱచుకొనఁబడునా ? పడ వని యర్థము.

తా. ఓవత్సా ! నిష్ప్రయోజనములగు వితండవాదములచే నుపనిష ద్వాక్యములకు నపార్థములను జెప్పుచుఁ బండితమ్మన్యు లగువారిచేత మోక్ష సుఖము నొసఁగెడు శ్రీరామతారక మను రాజయోగము నవలంబించి పరమ పావనుఁ డగు శ్రీమన్నారాయణుని ధ్యాననిష్ఠ లేనియెడల నింద్రియజయ మును మనోనిగ్రహమును గలుగనేరవు. ఎట్లనిన - లోకమునందు జాలరి వానికిఁ జేత గాలములేనియెడ గండుమీలు దొరకవుగదా ! పిట్టలను బట్టు వానికి నురిత్రాళ్లు లేకుండఁ బత్తులు లభింపవుగదా ! మఱియు నేనుంగులను బట్టువానికిఁ బల్లము లేనిచోట నేనుఁగులు లొంగవుగదా ! వేఁట

యజయము లేనిచో విల్లునమ్ములు లేనియెడ దుష్టజంతువులు సంహరింపఁబడవు ఎట్టు = ఏరీతి యోగములేనిచో యోగికి నింద్రియజయము గలుగదు. ౧౧౬

క. జన మంజనంబుఁ గైకొని
ఘన మగుధనమును నెఱుంగుక్రైవడిని నిరం
జనతారకయోగముఁ జే
కొని పరతత్త్వమును దెలియఁ గ్రొత్తవడు నంతన్. ౧౧౭

టీ. జనము = మనుజుఁడు, అంజనంబున్ = సిద్ధాంజనమును, కైకొని = కన్నులకుఁ బెట్టుకొని యని యర్థము, ఘనము + అగు + ధనమును = గొప్పది యగు నిధిని, ఎఱుంగు + క్రైవడిని = గుఱుతుఁ బట్టునట్లు, నిరంజన = నిర్మలమగు, తారకయోగమున్ = తారకమనియెడు యోగమును, చేకొని = అవలంబించి, పరతత్త్వమును = పరవాసుదేవస్వరూపమును, తెలియన్ = ఎఱింగెనేని, అంతన్ = సకలమును, గుత్తివడును = గోచరమగును; ఇందు, ఒక పరవస్తువును దెలిసికొనిన సమస్తవస్తుపరిజ్ఞానము గలుగునను శ్రుతియొక్క యర్థమును సావకాశముగ నెఱుంగఁదగియున్నది. ఇందునుగూర్చి ఛాందోగ్యమునం దొక యాఖ్యాయిక గలదు. అది యెట్లనిన, ఉద్దాలకుఁ డను మహర్షికి శ్వేతకేతుఁ డను నొక కొమరుఁడు గలఁడు. ఉద్దాలకుఁడు, పండ్రెండేండ్లప్రాయము గల తనకొడుకును జూచి పుత్త్రకా! నీవు గురుకులమున నుండి బ్రహ్మచర్యమును బూని సాంగముగ వేదాధ్యయనమును జేయుము. మన వంశమునఁ బుట్టినవాఁ డెవ్వఁడు నధ్యయనమును జేయక బ్రహ్మబంధువువలె (నీచబ్రాహ్మణునివలె) నుండలేదు. అనిన, శ్వేతకేతుఁడు సద్గురునికడకుఁ బోయి పండ్రెండుసంవత్సరములు వేదముల నెల్ల సాంగముగఁ జదివి గొప్పపాండిత్యమును సంపాదించి తనకు సర్వము దెలియునను నభిమానముతోఁ దన జనకునికడకు వచ్చినఁ జూచి తండ్రి వీనికి వేదవేదాంగములు పఠించినను

ముఖ్యమగు బ్రహ్మజ్ఞానము లేదు. జగత్తునకు భిన్నముకాని నిమిత్తకారణము నుపాదానకారణము నగు బ్రహ్మమును దెలిసినవాఁడే పరిపూర్ణవిద్వాంసుఁడుగాని వేఱొకఁడు గాఁ డను సంగతిని దన కొమరునకుఁ దెలియఁబఱచి వానికింగల దురభిమానమును దొలఁగించి బ్రహ్మమును దెలిసికొనెడు తలంపుఁ గలుగఁ జేయఁదలఁచి యి ట్లనియె. ఓ పుత్త్రా! నీవు "నేను సర్వవిద్యాపరిపూర్ణుఁడను, నాకు సర్వమును దెలియు" నను నభిమానము గలవాఁడవువలెఁ గనఁబడుచున్నావు. ఏయొక వస్తువును వినిన యంతనే యదివఱకు విననిదిగూడ వినఁబడునో తెలియనిదిగూడఁ దెలియఁబడునో తలంపనిదిగూడఁ దలఁపఁబడునో ముఖ్యముగ నీవు దెలిసికొనఁదగిన యా యంశమును నీ యుపాధ్యాయుల నడిగి తెలిసికొంటివా? అనిన విని శ్వేతకేతుఁ డాశ్చర్యము నొంది యేమిది? యొకదానిని దెలిసికొనినంతనే ఇంకొకటి యెట్లు దెలియఁబడును? అని తనలో ననుకొనుచు నో భగవంతుఁడా! నీవు చెప్పినది యెట్లు సరిపడును? అనిన, జనకుం డి ట్లనియె. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" మట్టికుండలు దాకలు మొదలగువానికి నుపాదానకారణమగు (మూలకారణమగు) మట్టిముద్ద తెలియఁబడినతోడనే తదుపాదేయములగు (ఆ మట్టిముద్ద వలనఁ గలిగిన) కుండలు మూఁకుడులు మొదలగునవి యెల్ల మట్టికి వేఱు గావని తెలియఁబడును; కుండలు మొదలగువాని రూపమును, కుండలు, మూఁకుడులు, దాకలు మొదలగు పేళ్లును ఆ మట్టికి లోకవ్యవహారముకొఱకుఁ గలిగెను. కావున మట్టివలనఁ గలిగెడు కుండలు మొదలగునవి మట్టికంటె వేఱుకావు గాన, నుపాదానమునకు నుపాదేయమునకును (కార్యకారణములకు) భేదములేదు గాన నుపాదానము దెలియఁబడిన,నుపాదేయము నుపాదానమున కన్న వేఱుగాదని తెలియఁబడును. (ఇచట "వికారమెల్ల మాటమట్టునకే బహిరేకాని వికారమనునది వాస్తవముగ లేదు. మట్టిమాత్రము వస్తువు

అగునట్లు బ్రహ్మమునందు నజ్ఞానముచేఁ గల్పింపఁబడిన నామరూపాది ప్రపంచమెల్లఁ గల్ల. బ్రహ్మము మాత్రము వస్తువు" అను శంకరమతము సరిపడియుండలేదు. ఏలన, వాచారంభణ మనుశ్రుతియందలి పదమునకు వాగాలంబన మను నర్థముఁ జెప్పుటకుఁ బ్రమాణములేదు. మఱియు వాగాలంబన మను పదమునకును నామధేయ మను పదమునకును వేర్వేఱ యర్థము చెప్పక పోవుటచేతఁ బునరుక్తియుఁ గలుగును. ఇంకను మృత్తికయే సత్య మని చెప్పఁదలఁచినపుడు శ్రుతియందలి "ఇతి" అను పదమునకు వైయర్థ్యము సంభవించునను నీ యంశములను "వాగారంభణ మిత్యుక్తేర్మిథ్యేత్య శ్రుతకల్పనం । పునరుక్తి ర్నామధేయ మితీత్యస్య నిరర్థతా" అని పూర్వాచార్యులు చెప్పిరి. ఇంతియకాక శంకరమతమునందు "యేనాశ్రుతం శ్రుతం భవతి" అను శ్రుతియొక్క సందర్భముగూడ సరిపడియుండలేదు. ఎట్లన, ముత్తెపుఁజిప్పయొక్క స్వరూపము దెలియఁబడఁగా నా ముత్తెపుఁజిప్పయందు నారోపింపఁబడిన వెండి దోపట్టక యున్నను వెండి తెలియఁబడుట గనుపట్టక పోవుటచేత, బ్రహ్మము తెలియఁబడినతోడనే బ్రహ్మమునందు నజ్ఞానముచే నారోపింపఁబడిన ప్రపంచము పోయినను దెలియఁబడుట సంభవింపదుగాననే బ్రహ్మము దెలియఁబడినతోడ మఱి తెలియఁబడనిదిగూడఁ దెలియఁబడినది యగు నను మొదలగు శ్రుత్యర్థ మెట్లు సరిపడును? అను మొదలగు విశేషాంశములను శ్రీ రంగరామానుజభాష్యమునందుఁ బరికించునది. (ప్రకృతమునందు) శ్రీ పరమపురుష స్వరూపము దెలియఁబడినతోడనే తత్కార్య మగు ప్రపంచమెల్లఁ గాఢముకన్న భిన్నము గాదని తెలియఁబడు నను మొదలగు సంగతుల నుద్దాలఁకుడు తన కొమరుఁడగు శ్వేతకేతునకు నుపదేశించి కృతకృత్యుని జేసె నన్నవైదికోపాఖ్యానమును "పరతత్త్వమును దెలియ గుఱిపడు నంతన్" అని నీ పద్య భాగమునందు ననుసంధించునది.

తా. లోకమునందు మనుజుఁడు సిద్ధాంజనమును గండ్లకుఁ బెట్టుకొని పెన్నిధిని గనుఁగొనువిధమున నితరసాపేక్షలేని యొక్క తారకయోగము నవలంబించి పరమపురుషు నెఱింగినయెడల నన్నియుఁ దెలియఁబడును. ౧౧౭

తే. పలలమును జూపి డేగను బట్టురీతి
నమృతసమనాదబిందుకళానుభూతి
సుఖము నొందించి మరగించి చొక్కఁజేసి
యింద్రియమనంబుల వినిగ్రహింపవచ్చు. ౧౧౮

టీ. పలలమును = మాంసపుపెరను, చూపి = తొలుతఁ గనఁబఱచి, డేగను = అణుజును, పట్టురీతిన్ = వేటకాఁడు గ్రహించునట్లు, అమృత... సుఖమున్ - అమృత = అమృతముతో, సమ = సమానమగు, నాద = దశవిధ ప్రణవనాదములయొక్కయు, బిందు = బ్రహ్మబిందువుయొక్కయు, కళా = సూర్యచంద్రాగ్నికళలయొక్కయు, అనుభూతి = అనుభవించుటచే నగు, సుఖమున్ = పరమ సౌఖ్యమును, ఒందించి = మొదటఁ గలుగఁజేసి, మరగించి = అలవాటుపఱచి, చొక్కఁజేసి = ఆ సుఖమునందుఁ జొక్కి సోలునట్లు గావించి, ఇంద్రియమనంబులన్ = ఎల్ల యింద్రియములను మానసమును, వినిగ్రహింపన్ = దృశ్యపదార్థముల యందుఁ బడకుండ నిరోధించుటకు, వచ్చున్ = వీలగును.

తా. మాంసపుపెరను మొదటఁ గనఁబఱచి డేగను వేఁటకాఁడు మెలఁకువతో నెట్లుపట్టుకొనునో యట్లు యోగియు సుధారసమున కెనయగు ప్రణవనాదముయొక్కయు, బ్రహ్మబిందువుయొక్కయు, చిత్కళయొక్కయు, నిరంతరానుభవమువలనఁ గలిగెడు పరమసౌఖ్యమును దొలుతఁ గలుగఁ జేసి యభిరుచిని బుట్టించి యా సుఖానుభవముచేతఁ బరవశముగ నొనర్చి ఎల్ల యింద్రియములనుఁ జిత్తమును బాహ్యవిషయముల యందుఁ బడకుండ స్వాధీనముఁ జేసికొననగును. ౧౧౮

ఆ. వేద మట్లు గాన ♦ నాదబిందుకళాను
భవముఁ దెలిపె మొదలఁ ♦ బండితులకుఁ
దత్ప్రకార మెల్లఁ ♦ దగ నెఱింగించెద
విస్తరించి తెలియ ♦ వినుము వత్స! ౧౧౯

టీ. వత్స = ఓ బాలకా! వేదము = ఆమ్నాయము ("శ్రుతిస్త్రీ వేద ఆమ్నాయ" అని యమరము), పండితులకున్ = తెలివి గల యోగులకు, నాదబిందుకళానుభవమున్ = ముందుఁ జెప్పఁబడు లక్షణముగల ప్రణవనాదములయొక్కయు, చిద్బిందువుయొక్కయు సూర్యాదికళలయొక్కయు ననుభవమును, మొదలన్ = మొట్టమొదట నభ్యసింపవలయునని, తెలిపెన్ = చెప్పెను. అట్లుగానన్ = అలాగున వేదము చెప్పుటచేతను, తత్ = ఆ నాదబిందుకళానుభవముయొక్క, ప్రకారమున్ = క్రమమును, ఎల్లన్ = అంతయును, తగన్ = సరిగ, తెలియన్ = నీకు బోధపడునట్లు, విస్తరించి = వివరించి, ఎఱింగించెదన్ = వక్కాణించెదను, వినుము = ఆలకింపుము.

తా. అభ్యాసకు లగు యోగులు ప్రారంభమునందు నాదబిందుకళలయొక్క యనుభవము నలవాటు చేయవలయు నని ప్రాఁబలుకు పలికినది గావున నా నాదబిందుకళానుభవ మెట్లు గలుగునో యా క్రమము నెల్ల సవిస్తరముగ నీకు బోధపడునట్లు దెలియఁబఱచెద నాలకింపుము. ౧౧౯

తే. గీ. సద్గురుప్రోక్తముద్రచే ♦ శ్రవణయుగము
మూసి యాలింపఁ బ్రణవంబు ♦ మ్రోయు మొదలఁ
జిణి యనుచు నంతటం జిణి ♦ చిణి యటంచు
మించి రెండవమాఱు ఘో ♦ షించు ననఘ ౧౨౦

టీ. అనఘ = త్రివిధదురిత సంబంధము లేని యో హనుమంతుఁడా! సత్ = యోగ్యుఁడగు, గురు = దేశికేంద్రునిచే, ప్రోక్త = బాగుగఁ

దెలుపఁబడిన, ముద్రచేత్ = మును పు చెప్పిన లక్షణములు గల షణ్ముఖీముద్ర చేత, శ్రవణ + యుగమున్ = వీనులయొక్క రెండు బిలములను, మూసి = రెండుచేతుల బొటనవ్రేళ్లతో నొక్కి, ఆలింపన్ = ఆలకించె నేని, మొదలన్ = ముందుగ, ప్రణవంబు = ఓమ్ అను వర్ణము, చిణి + అనుచున్ = చిణి అనుధ్వనితో, మ్రోయున్ = వాఁగును, అంతటన్ = ఇట్లు కొంతసేపు మ్రోసినతరువాతను, చిణిచిణి అటంచున్ = చిణిచిణి అను చప్పుడుతో, మించి = మొదటికంటె కొంచెము బిగ్గరగ, రెండవ మాఱు = రెండవతూరి, ఘోషించున్ = ధ్వనిచేయును.

తా. నిష్కళంకుండ వగు నో హనుమానుఁడా! యోగానుభవము బాగుగఁ గల తన యాచార్యుఁడు చెప్పినయట్లు రెండుచేతుల బొటన వ్రేళ్లతోఁ జెవులరంధ్రములను రెంటింటిని వెనుకఁ జెప్పిన షణ్ముఖి యను ముద్రచేత మూసి, వినె నేనిఁ దొలుతఁ జిణి యనియు రెండవసారి చిణిచిణి యనియు లోపల నోంకారము చప్పుడుసేయును. ౧౨౦

శా. కంటిన్ నెమ్మదిఁగంటి సద్గురుని నింకేన్ మేనిలో పువ్వు లా
 టింటన్ బూజలొనర్తు నంచుఁ గర మర్థిన్ దేహి దా ము
 న్నుగా। ఘంటానాదముఁ జేసెనో యనఁగ నోంకారఁబు
 హృద్వీథి యన్। మింటన్ మ్రోయుఁదదారవంబుగతి యా
 మీఁదన్ విజృంభించుచున్. ౧౨౧

టీ. ఆమీఁదన్ = మొదటఁ జిణియనియు, రెండవమాఱు చిణిచిణి యనియు వాఁగిన తరువాతను, ఓంకారంబు = ప్రణవము, తత్ + ఆర వంబు + గతిన్ = చిణిచిణి యను నా శబ్దముయొక్క క్రమముచేత, విజృంభించుచున్ = క్రమక్రమముగ హెచ్చుచు, దేహి = జీవుఁడు, నెమ్మదిన్ = డెందముయొక్క స్వస్థతను, కంటిన్ = పొందితిని, సత్ + గురునిన్ "గురూణాం గురుః" అనుటచే బ్రహ్మ - సదాశివుఁడు మొద

లగు దేశికులకుఁగూడ నుపదేశికుండగు శ్రీమన్నారాయణుని, కంటిన్ = వీక్షించితిని, ఇంకన్ = ఈ మీఁదను, మేనిలో + పువ్వులు + ఆఱింటన్ = శరీరమధ్యమునందున్న మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరకము అనాహతము విశుద్ధము ఆజ్ఞాచక్రము అను షట్కమలముల చేతను, పూజలు = అర్చనలు, ఒనర్తున్ = చేసెదను, అంచున్ = అని తలఁచుచు, కరము - అర్థిన్ = కడువేడుకతో, మున్నుగాన్ = తొలుదొల్త, ఘంటా - నాదమున్ = జేగంటయొక్క ధ్వనిని, చేసెనో = కావించినాఁడో, అనన్ - కన్ = అనురీతిని, హృత్ - వీథి - అన్ = హృదయగుహ యనెడు, మింటన్ = ఆకసమునందు, మ్రోయున్ = మ్రోఁగును. ఉత్ప్రేక్షాలంకారము.

తా. నేను చిత్తవిశ్రాంతిని బొందితిని; గురువులకెల్లఁ బరమగురుండగు శ్రీమన్నారాయణుని సందర్శించితిని; ఇఁకను శరీరమధ్యమునం దున్న స్వాధిష్ఠానము మొదలగు షట్కమలములచేత నాపరమపురుషుని నర్చనఁ జేసెదనని జీవుఁడు దాను దొలుదొల్త మిక్కిలి వేడుకతో జేగంటను గొట్టుచున్నాఁడో యనునట్లు తరువాత నోంకారముమీఁదఁ జెప్పఁబడిన చిణిచిణి యను ధ్వనియొక్క క్రమముచేతఁ గ్రమక్రమముగ వృద్ధినొందుచు హృదయగుహ యనునాకసమునందు మిక్కుటముగ ధ్వనిచేయును. ౧౨౧

స్రగ్ధర. కామక్రోధాద్యసద్రాక్షసగణవిజయాకాంక్షినై
ప్రత్యగాత్మ, శ్రీమన్నారాయణుం డంచితవిమలమహా
చిత్తశంఖంబు నిండన్, నేమం బారంగఁ బూరించినగతి
మొరయున్ జిత్కళాదర్శకం బై, భూమానందప్రదం బై
స్ఫుటనిగమశిరోభూషణోంకార మంతన్. ౧౨౨

టీ. ప్రత్యక్ + ఆత్మ = అంతర్యామిస్వరూపుఁడగు, శ్రీమత్ + నారాయణుండు = శ్రీపురుషోత్తముఁడు, కామ...కాంక్షినై - కామ =

దారపుత్త్రాదులయందలి కోరికయు, క్రోధ = కోపము, ఆది=మొదలగు నరిషడ్వర్గము యొక్క (రూపకము), అసత్ = దుష్టులగు, రాక్షస=దానవుల యొక్క, గణ=సముదాయముయొక్క, విజయ = గెలుపును, ఆకాంక్షియై= అభిలషించినవాఁడై, అంచిత=శమదమాదిగుణములచే నొప్పుచున్నదియు, విమల = పరిశుద్ధ మయినదియు, మహాత్ = ఉదారమైనదియు నగు, చిత్త = స్వాశ్రితుఁడగు యోగియొక్క హృదయము యొక్క, శంఖంబున్ = పాంచజన్య మను తనశంఖమును ("శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్యః" అని యమరము), సేమంబు = లోకములకెల్ల యోగక్షేమము, ఆరంగన్ = ఒప్పునట్లు, నిండన్ = నింపుగ, పూరించినగతిన్ = ఒత్తినవాఁడో యను రీతిని, స్ఫుట...ఓంకారము - స్ఫుట = పరమపురుషస్వరూపమును స్పష్టముగ బోధించుచున్న, నిగమశిరః=వేదాంతములకు,భూషణ=అలంకారమైన, ఓంకారము = ప్రణవము, చిత్ + కళా + దర్శకంబు+ఐ=చిద్రూపము యొక్క కళావిశేషములను గనఁబఱచునది యగుచు, భూమ + ఆనంద+ ప్రదంబు + ఐ = భూమబ్రహ్మముయొక్క నిరతిశయానందమును గలుగఁ జేయునదియు నై, అంతన్ = అప్పుడు, మొరయున్ = మ్రోఁగును.

భూమానందప్రదంబు - అనుపట్ల భూమబ్రహ్మస్వరూపనిరూపణం బెట్లనిన: - "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా। అథ యత్రాన్యత్పశ్య త్యన్యచ్ఛృణో త్యన్యద్విజానాతి తదల్పం" అని ఛాందోగ్యమునందు భూమబ్రహ్మమునుగూర్చి చెప్పఁబడియున్నది. ఇందు భూమశబ్దముచేత నిరతిశయంబగు విపులత్వముతోఁ గూడుకొనిన పరమసుఖస్వరూపుఁడు జీవుఁడా? లేక శ్రీపరవాసుదేవుఁడా? ఏది నిర్దేశింపఁ బడెను ? అని సంశయము గలుగఁగా "తరతి శోకమాత్మవిత్" అని యుప క్రమమునందు నాత్మజ్ఞాని సంసారదుఃఖమును దాఁటఁగలఁడని భూమ విజ్ఞానము నుపదేశించి "అస్తి భగవో నామ్నో భూయః । అస్తి భగవో వాచో భూయః" అను మొదలగు ప్రశ్నలకు "వాగ్వావ నామ్నో భూయసీ-

మనోవావవాచో భూయః'' అను మొదలగు ప్రతివచనములలో నామము వాక్కు మొదలగు నొకదానికంటె నొకటి యెక్కుడని చెప్పుచు "అస్తి భగవః ప్రాణాద్భూయః'' అను కడపటిప్రశ్నకు ప్రాణముకన్న గొప్పది యిది యని ప్రతివచనము లేకపోవుటచేతఁ బ్రాణశబ్దవాచ్యుఁ డగు ప్రత్యగాత్మతోనే(జీవుఁతోనే)సమాప్తి గన్పట్టుచుండుటచేత నిందలిభూమశబ్దవాచ్యుఁడు జీవుఁడే యని నిశ్చయింపఁబడుచున్నది యని పూర్వపక్షము రాఁగా శ్రీభగవద్బాదరాయణాచార్యులు "భూమాసంప్రసాదా దధ్యుపదేశాత్॥ ౧-౩-౭॥ ధర్మోపపత్తేశ్చ॥ ౧-౩-౮॥ అనుసూత్రములచేనిరతిశయవైపుల్యగుణ విశిష్టసుఖస్వరూపుం డగు పరమపురుషుండే భూమశబ్దముచేఁ జెప్పఁబడునని సిద్ధాంతముచేసిరి; ఎట్లనిన-శ్రుతియందు నామము వాక్కు మొదలగువానియన్నిటికంటెఁ గడపటను బ్రాణమే గొప్పది యని ప్రశ్న ప్రతివచనములచేఁ బ్రతిపాదింపఁబడినను "సవా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజాన న్నతివాదీభవతి'' అని ప్రాణోపాసకునకు ప్రౌఢవాదిత్వరూపఫలమును జెప్పి "ఏషతువాన అతివదతి యస్సత్యేనాతివదతి'' అని ప్రాణోపాసకునకు సత్యోపాస్తివలననే ప్రౌఢవాదిత్వము సిద్ధించునని చెప్పుటచేతఁ బ్రాణోపాసకునకన్న సత్యోపాసకుఁ డధికుఁ డనుట. అర్థమునుబట్టి నిప్పన్నమైనదిగానఁ బ్రాణముకంటె సత్యశబ్దవాచ్యుఁ డగు పరమపురుషుఁ డెక్కువవాఁ డని చెప్పఁబడుటచేత భూమశబ్దముచేతఁ బరబ్రహ్మమే యిచట నిర్దేశింపఁబడినది. సూత్రార్థ మెట్లనిన - సంప్రసాదాత్ ప్రత్యగాత్మకంటె (జీవునికంటె), అధ్యుపదేశాత్ = పరమాత్మఁ డధికుఁడని శ్రుతియందుఁ జెప్పుటవలన, భూమా = భూమశబ్దవాచ్యుఁడు పరమపురుషుఁడుగాని జీవుఁడుగాఁడు. మఱియును "ధర్మ-ఉపపత్తే-చ'' ధర్మ= స్వాభావసిద్ధము లగు నమృతత్వము, సర్వాత్మకత్వము, సర్వకారణత్వము మొదలగు శ్రుత్యుక్తధర్మములు బ్రహ్మమునందే చెల్లుబడియగుటవలన భూమశబ్దవాచ్యుఁడు శ్రీమన్నారాయణుఁడు "సుఖంత్వేవ విజిజ్ఞాసి

తవ్యం । భూమైవ సుఖం" సుఖమనే తెలిసికొనవలయును. "భూమవే సుఖము" అనియు శ్రుతి. మఱియు భూమశబ్దము విపులత్వవాచియై ఇచట ధర్మపర మగుచున్నదిగాన వైపుల్యవిశిష్టమగు పరబ్రహ్మ మని యర్థము. ఇట్లు శ్రీభాష్యము వేదాంతదీపము మొదలగువాని నవలంబించి సామాన్యముగ వ్రాసితిని. విశేషాంశములను నింకను దెలియఁగోరువా రా గ్రంథములను విలోకించునది.

తా. కామము క్రోధము మొదలగు నరిషడ్వర్గమనియెడు దుష్టదైత్య సమూహముయొక్క గెలుపును గోరుచున్నవాఁడై యంతర్యామిస్వరూపుఁడగు శ్రీపురుషోత్తముండు తనయందలిభక్తిచే నొప్పుచుండెడు యోగియొక్క పరిశుద్ధ మగు గొప్పహృదయ మనియెడు పాంచజన్య మను శంఖమును దనచేఁ బరిపాలింపఁబడు లోకమునకెల్ల యోగక్షేమము గలుగునట్లు నిండుగఁ బూరించి యెత్తినాఁడో యనునట్టు పరమపురుషస్వరూపమును స్పష్టముగ దెలుపు వేదాంతములకెల్ల నలంకారభూత మగు ప్రణవము చిద్రూపము యొక్క కళలనెల్లఁ గనఁబఱచునదియు, నఖండబ్రహ్మానందమును గలుగఁ జేయునదియు నగుచు నయ్యెడ మ్రోఁగుచుండును. ౧౨౩

మ. నలువొప్పం దగు బ్రహ్మదండి నొకవీణాదండముం జేసి ష
ట్జలజాతంబుల మెట్లుగానిలిపి పంచప్రాణముల్ తంత్రులై
యలరంగాఁ గొని ముక్తికామిని సహస్రారంబునందుండి ని
చ్చలువాయించెననంగనొప్పుఁ బ్రణవస్వానంబు దానంతటన్.

టీ. నలువు ఒప్పన్ తగు=ఆసనబంధముచేఁ దిన్నగనున్న, బ్రహ్మదండిన్ = అభ్యాసకునియొక్క వీఁపునడిమియెముకను, ఒక + వీణా + దండమున్ = వీణియయొక్క దండముగ, చేసి = ఒనర్చి, షట్ + జలజాతంబులన్ = పద్మములంబోలిన మూలాధారము లోనుగాఁగల యాఱు చక్రములను, మెట్లు కాన్ = స్వరములకట్లుగను, నిలిపి = అమర్చి, పంచ+

ప్రాణముల్ = ప్రాణము మొదలుగాఁగల యైదువాయువులును, తంత్రులు ఐ = తీఁగలై, అలరన్, కాన్ = తగుచుండఁగా, కొని = పూని, సహస్రారంబునందున్=హృదయకమల మను గద్దియయందు, ఉండి=కూర్చుండి, ముక్తికామిని = మోక్షలక్ష్మి, నిచ్చలున్ = ఎడ లేకుండ, వాయించెన్ అనన్ కన్ = ఆవీణియను మ్రోయించుచున్నదో యనురీతిని, ప్రణవస్వానంబు = చిణిచిణి యను నోంకారనినాదము, అంతటన్ = అప్పుడు, ఒప్పున్ = మనోహరముగ వినగును.

తా. స్వస్తికాద్యాసనబంధముచేఁ దిన్నగ నొప్పుచుండెడు యోగియొక్క వీఁపునడిమియెముకను వీణియగను, మూలాధారము మొదలగు నాఱుచక్రములను స్వరముల మెట్లుగను ప్రాణము నపానము మొదలగు నైదువాయువులను వీణాతంత్రులుగను జేసి, ముక్తికాంత సహస్రార మను తమిన్నగద్దియపైఁ గూర్చుండి వీణ వాయించుచున్నదేమో యనునట్లు ప్రణవస్వనము వినబడును. ౧౨౩

తోటకవృత్తము. అమృతాంగన బోధమయాత్మని శు
ద్ధమనఃపవనంబులు తాళముగా
నమరం గొని పాడుచు నాడినయ
ట్లమలప్రణవారవ మంతఁ దగున్. ౧౨౪

టీ. బోధ...పవనంబులు - బోధమయ = భగవద్ధ్యానరూపంబగు జ్ఞానముచేఁ బూర్ణమగు, ఆత్మని = చిత్తముగల యోగియొక్క, శుద్ధ = పవిత్రములగు, మనఃపవనంబులు = చిత్తమును ప్రాణవాయువును, తాళముగాన్ =లయను దెలుపువాద్యభేదమునుగ, అమరన్ కొని = సరిగఁ జేకొని, పాడుచున్ =సంగీతమును గావించుచు, ఆడిన + అట్లు=నృత్యమాడుచున్నదో యనువిధమున, అమల + ప్రణవ + ఆరవము = పావనమగు నోంకారము యొక్క శబ్దము, తగున్ = వినఁబడును.

తా. పరమపురుషునిధ్యానము తెలుచుగఁ గల మనస్సు గల యోగి యొక్క నిర్మలమగు చిత్తమును ప్రాణాది వాయువులను లయను దెలుపు వాద్యభేదమునుగఁ జేకొని సంగీతముఁజేయుచు ముక్తికాంత నృత్యము గావించుచున్నదేమో యనునట్లు ప్రణవనాద మపుడు వినఁబడును. ౧౨౪

సీ. సలలితేంద్రియగోపికలు వరప్రీతిచేఁ
జనుదెంచి తనుఁ బొంది సంతసింప
బ్రహ్మదండిలతా విభాస్వదాధారాది
క పికావళి మహావికాస మొందఁ
బ్రస్ఫుటీకృత పటుస్ఫుట కుండలీంద్రుఁడ
త్యానందకరముగా నాడుచుండఁ
బొందుగా భ్రూమధ్యబృందావనమ్మునఁ
బ్రత్యక్షబోధ గోపాలమూర్తి

తే. విమలమానసపవనహస్తముల చేతఁ
దనసుషుమ్నామురళి లీలఁ దాల్చి మధుర
గాన మొనరించె ననఁగ నోంకార మలఘు
వేణునాదస్వరూపమై వెలయు నంత. ౧౨౫

టీ. సలలిత+ఇంద్రియ+గోపికలు = సోయగము గల చక్షురాదీంద్రియము లనియెడు వ్రేతలు, వర - ప్రీతిచేన్ = మిక్కుటమగు మక్కువతో, చనుదెంచి = ఏగుదెంచి, తనున్ - పొందిన = తనతోఁగలసి, సంతసింపన్ = సంతోషము నొందుచునుండఁగా, బ్రహ్మ...ఆవళి - బ్రహ్మదండి = యోగియొక్క వెన్నుపూసల చా లనియెడు, లతా = లతికల యందు, విభాస్వత్ = ఒప్పుచున్న, ఆధార = మూలాధారము, మణిపూరకము, ఆదిక = మొదలగు చక్రము లనియెడు, పిక - ఆవళి=కోయిలల చాలు, మహత్ + వికాసము = ఎక్కుడగు నెలమిని, ఒందన్ = పొందుచు

నుండఁగా, కుండలీ + ఇంద్రుఁడు = కుండలీశక్తి యను చిలువ ఱేఁడు, ప్ర...స్ఫుటన్ - ప్రస్ఫుటీకృత = బాగుగ విప్పఁబడిన, పటు = దిటమగు, స్ఫుటన్ = పడగతో, అతి + ఆనంద + కరము - కాన్ = అధికమగు ముదమును గలుగఁజేయునట్లు, ఆడుచుండఁన్ = ఇటునటు నూఁగుచు నుండఁగా, ప్ర...మూర్తి - ప్రత్యక్ష = పరమపురుషసాక్షాత్కారరూపమగు, బోధ = జ్ఞాన మనియెడు, గోపాలమూర్తి = శ్రీవేణుగోపాలస్వామి, భ్రూ...నన్-భ్రూ=కనుబొమలయొక్క, మధ్య=మధ్య ప్రదేశ మనియెడు, బృందావనమ్మునన్ = బృందయను విపినమునందు, పొందుగాన్=సుందరముగ, విమల...చేతన్ - విమల=పరిశుద్ధమగు, మానస = చిత్తము, పవన=ప్రాణానిలము లనియెడు, హస్తములచేతన్= రెండుకరములచేతను, తన + సుషుమ్నా + మురళిన్ = తనయొక్క బ్రహ్మనాడియనెడు పిల్లనగ్రోవిని, లీలన్ = ఒయ్యారముగ, పూని = పట్టుకొని, మధుర + గానమున్ = మనోహరమగుపాటను, ఒనరించెన్ - అనంగన్ = పాడుచుండెనో యనునట్లు, ఓంకారము = ప్రణవము, అలఘు...ఐ - అలఘు =నిరతిశయమగు, వేణునాద = పిల్లనగ్రోవియొక్క, స్వరూపమై = నాదమునుబోలిన నాదము గలదై యని యర్థము, అంతన్=అప్పుడు, వెలయున్=ఒప్పుచుండును.

తా. శబ్దాదివిషయలోలుపములగు శ్రోత్రాదులగు నింద్రియము లనియెడు గొల్లచేడియలు మిక్కుటంబగు మక్కువతోఁ దనప్రక్కఁ జేరి యానందింపుచునుండఁగా, మఱియు యోగియొక్క వెన్నుపూసల చాలనియెడు తీఁగలయందు నొప్పుచున్న మూలాధారము మొదలగు చక్రములనియెడు గుండుగోయిలలపంక్తి హెచ్చగు నెలమిని గొనియుండఁగా, బాగుగ విప్పఁబడిన దిటముగుపడగ గల కుండలీశక్తి యను చిలువఱేఁ డెక్కుడగు ముదముతో నాడుచుండఁగాఁ, గనుబొమలనడిమిపట్టనియెడు బృందావనమునందు భగవత్సాక్షాత్కారజ్ఞాన మనియెడు నందనందనుఁడు పరిశుద్ధమగు చిత్తమును,

స్వాయత్తమగు వాయువు ననెడు రెండు చేతులతో సుషుమ్నానాడియను తనమురళిని కీవిగఁ బట్టుకొని వినోదముగ వీనులకువిందగు పాటఁబాడుచున్న వాఁడో యనురీతిని ప్రణవ మయ్యెడ మురళీ నిస్స్వనమును బోలిననాదము గలదియై యొప్పును.

సుగంధివృత్తము. క్రూరరాగరోషవైరికోటినెల్లఁ ద్రుంపఁగా
గోరి యాత్మరాముఁ డుండ ఘోరసంగరార్థమై
భూరిభేరికారవంబు బోరుకొల్పినట్టు లోం
కారనాద మొప్పు వింతగాఁ గుమార యంతటన్. ౧౨౬

టీ. కుమార=పుత్రితుల్యుఁడ వగు నోయాంజనేయా! అంతటన్ = అప్పుడు, ఆత్మ + రాముఁడు = యోగిజీవాత్మ యనెడు శ్రీరామచంద్రుఁడు, క్రూర...కోటిన్ - క్రూర = దుష్టములగు, రాగ = కామము, రోష = క్రోధము (లోభమోహమదమాత్సర్యములు) అనియెడు, వైరి = పగతురగు రక్కసులయొక్క, కోటిన్ - ఎల్లన్ = గుంపునంతయును, త్రుంపన్ - కాన్ - కోరి = పరిమార్పఁదలంచి, ఘోర - సంగర - అర్థము - ఐ = భీషణమగు జగడమునిమిత్తము, ఉండన్ = సన్నద్ధుఁడై యుండఁగా, భూరి - భేరికా - ఆరవంబు = ఉత్కటమగుజయదుందుభియొక్క శబ్దము, బోరుకొల్పినట్లు = బోరుమని వెడలినరీతిని, ఓంకార - నాదము = ప్రణవ ధ్వానము, వింతగాన్ = అచ్చెరువుగ, ఒప్పున్ = అలంకింపనగును.

తా. ఓ వాయునందనా! కామక్రోధలోభమోహమదమాత్సర్యము లనియెడు నరిషడ్వర్గమును సంహరించుటకొఱకుఁ దలఁచి భయంకరమగుయుద్ధమునకు సన్నద్ధుఁడయి యాత్మారాముఁ డుండఁగా, గొప్పజయభేరి బోరుమని మ్రోసెనో యనుగతి నప్పుడు ప్రణవనాద మబ్బురముగ వినఁబడును.

మ. అమరేంద్రాదుల గెల్చి సొంపలరుమా
యాకాంత నాడింపఁగా

నమలాత్ముం డగు నారమాప్రభువరుం
డాత్మీయవిద్యామృదం
గము వాయించె ననంగ నొప్పులలితోం
కారస్వనం బంత హృ
ద్య మచింత్యం బతులం బవాచ్యమయి ని
త్యానంద మై మారుతీ. ౧౨౭

టీ.! మారుతీ = కరువలిపట్టీ ! అమల - ఆత్ముండును = వైషమ్య నైర్ఘృణ్యాదులు - లేక, యజాయమానకరుణారసతరంగిత మగు హృదయము గలవాఁడు, అగు = ఐన, ఆ = సుప్రసిద్ధుఁ డగు, రమా = లక్ష్మీదేవియొక్క, ప్రభు - వరుండు = కూర్మిమగండగు శ్రీమన్నారాయణుండు, "అల్లమాప్రభువరుండు" అనిగాని "ఇందిరాప్రభువరుండు" అనిగాని యిచట పాఠాంతరముల నెఱుంగునది. అమర - ఇంద్ర - ఆదులన్ = వేల్పులయెకిమీఁడు లోనుగాఁ గలవారిని, గెల్చి = లోఁబర్చుకొని, సొంపు అలరు = అతిశయించుచున్న, మాయా - కాంతన్ = మహామాయ యను నాట్యకత్తెను, ఆడింపన్ - కాన్ = నర్తింపించుటకు, ఆత్మీయ-విద్యా-మృదంగమున్ = తనసంబంధమగు పరిపూర్ణజ్ఞాన మనియెడు మద్దెలను, వాయించెన్ = మ్రోఁగఁజేసెను, అనంగన్ = అనుతీరున, లలిత + ఓంకార + స్వనంబు = విన నింపగు ప్రణవవర్ణముయొక్క-శబ్దము, అంతన్ = ఆసమయమునందు, హృద్యము = హృదయంగమమును, అచింత్యంబు = ఇట్టిదని తెలిసికొనుటకు శక్యము కానిదియు, అవాచ్యంబు = చెప్ప నలవి కానిదియు, అతులంబు = అసమాన మైనదియు, నిత్య + ఆనందము = అఖండ బ్రహ్మానందరూపమును, ఐ = అగుచు, ఒప్పున్ = విలసిల్లును. మాయాకాంత నాడింపఁగా ననుపట్లు "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే"

అనఁగా నిరతిశయానందస్వరూపుండును, శాశ్వతుండును, ఏవికృతులును లేక యెప్పుడు నొక్కతీరుననే యుండువాఁడును, సర్వోత్తముండు నగుతానుండఁగా,మిగుల నికృష్టంబులును,నస్థిరములు సత్త్వరజస్తమోగుణమయములు నగు ప్రాపంచికవిషయములయందు సమస్తభోక్తృవర్గమునకు (జీవకోటికి) భోగ్యత్వబుద్ధి (అనుభవింపఁదగినవను తలఁపు) ఏలకలుగవలయు ననిన సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థాస్వరూప యగు నీమహామాయా జగద్విరచనాదిరూపక్రీడయందు వేడుక గల నాచే నిర్మింపఁబడినవిగాన వీనిని మీఱుటకు బ్రహ్మాదులకుఁగూడ నలవిగాదు. ఇది విచిత్రతరములగు జగద్రచనలను జేయుచుండుటచే మాయ యనఁబడుచున్నది. కావుననే “తతో భగవతాచక్రం రక్షార్థం చక్ర ముత్తమం। అజగామ సమాజ్ఞప్తం జ్వాలామాలిసుదర్శనం॥ తేన మాయా సహస్రం తచ్ఛంబరస్యానుగామినా। బాలస్య రక్షతాదేహ మేకైకం హ్యానసూదితం” అను మొదలగుపట్ల మాయ యనునది సాశ్చర్యగపచ్ఛక్తియే యని చెప్పఁబడినది గాని, యద్వైతులు చెప్పునట్లు మిథ్యాభూతమైనదిగాదు. గారడీవాండ్రు మొదలగువారియందుఁ గూడ మాయావు లనఁబడుట యొండొక మణిమంత్రౌషధములు మొదలగువానిచే మిథ్యాభూతము లగుపదార్థములను వాస్తవము లనుబుద్ధియే కలుగఁజేయుచున్నందున సిద్ధించినదిగాన గుణమయమగు నీమాయ పారమార్థికమైనదిగాని మిథ్యాభూతము గాదు. “మాయాంతు ప్రకృతిం వింద్యాన్మాయినం తు మహేశ్వరమ్” అని చెప్పఁబడినది. భగవత్స్వరూపమును దెలియఁబడఁ జేయకుండుటయు, తనయొక్క స్వరూపమునందు భోగ్యత్వబుద్ధి గలిగించుటయు నీమాయాకార్యము గాన భగవన్మాయచే నిట్లు మోహింపఁజేయబడిన ప్రపంచ మెల్ల భగవంతుని నిరతిశయానందస్వరూపునిగఁ దెలియఁజాలకున్నది. సత్యసంకల్పుఁడునుఁ బరమకారుణికుండును వీరెక్కువవారు, వీరు తక్కువవా రను తలఁపులేక, ఎల్లరకును శరణు పొందఁదగినవాఁడును, నగుపురుషోత్తమదేవుని నెవ్వరు శరణుఁజొచ్చెదరో వారలు

గుణమయి యగు భగవన్మాయను మీఱి యా భగవంతుని జెందఁగలరను మొదలగు విశేషములను శ్రీభగవద్రామానుజభాష్యమునందుఁ జూడఁదగును.

తా. ఓ మారుతసుతా ! మాయాతీతుండు గావున, నజ్ఞానగుణములు లేమింజేసి పరిశుద్ధాంతరంగు నా శ్రియఃపతి, వేల్పుల ఱేఁడు మొదలగువారి నెల్లఁ దనకు లోఁబఱచుకొని యతిశయించుచున్న మహామాయ యను నటి నాడించుటకై తనదగు దివ్యజ్ఞానమనియెడు మద్దెలను వాయించుచుండెనో యనుతీరున వినవింపగు ప్రణవనాద మత్తటిని హృదయంగమంబును నిట్టిది యని తలఁచుటకును జెప్పుటకును వలనుపడనిదియు నీడులేనిదియు నఖండ బ్రహ్మానందస్వరూపము నై విలసిల్లును. ౧౨౭

సీ. నిఖిలేంద్రియము లను నీలకంఠంబు ల
 త్యంతసంతోషనృత్యములు సలుప
ధర్మామృతార్ద్రిత కృతమనోవనీస్థలి
 శమముఖసుగుణ సస్యము లిగుర్ప
సమరసానందజర్ఝరముచేఁ దాప దా
 వానలం బెల్లఁ జల్లార్పఁబడఁగ
భ్రూమధ్యదేశనభోవీథిఁ జిత్కళా
 విద్యుల్లతాతతుల్ వెలయుచుండఁ
తే-గీ. దతచిదాకాశమధ్యసంగతసమగ్ర
 రాజయోగసమాధి ధారాధరంబు
మోదవర్షంబుఁ గురియుచుఁ బ్రమోదసెననఁగఁ
 బ్రణవదశమనినాద మొప్పారు నంత. ౧౨౮

టీ. నిఖిల - ఇంద్రియములు = పదునాల్గువిధములగు చక్షురాదీంద్రియము లెల్ల, అను=అనియెడు, నీలకంఠంబులు = మయూరములు, అత్యంత= కడలేని, సంతోష=ఎలమితో, నృత్యంబులు = నాట్యములను, సలుపన్=

కావించుచుండఁగా, ధర్మ...స్థలిన్ - ధర్మ = పుణ్యకార్యములనియెడు, అమృత = నీళ్ల చేత, ఆర్ద్రీకృత = చెమ్మగిలిన, మనః = డెందమనియెడు, వనీ-స్థలిన్ = అడవినేలయందు, శమ...సస్యములు-శమ=బాహ్యేంద్రియ నిగ్రహము, ముఖ = మొదలుగాఁగల, సుగుణ = మేలిగొనము లనియెడు, సస్యములు = చేలు, ఇగుర్పన్ = చిగిరించుచుండఁగా, సమరస = సమస్తమును బరమపురుషమును మను సామరస్యముచేనైన, ఆనంద = సంతోషమనియెడు, నిర్ఝరముచేన్ = నీటివెల్లువచేత, తాప - దావ - అనలంబు= సంసారతాపత్రయ మనియెడు కార్చిచ్చు, ఎల్లన్ = అంతయును, చల్లార్పఁబడఁగన్ = ఉపశమింపఁబడఁగా, భ్రూ...వీథిన్ - భ్రూ = కనుబొమల యొక్క, మధ్య+దేశ=నడిమిపట్టనియెడు, నభోవీథిన్ = ఆకసమునందు, చిత్...తతుల్ - చిత్ = ప్రత్యగాత్మసంకల్పరూపము లగు, కళా = సూర్యాదికళ లనియెడు, విద్యుత్ + లతా = తీఁగియలం బోలు మించుల యొక్క, తతుల్ = గములు, వెలయుచున్ = మెఱయుచు, ఉండన్ = ఉండఁగా, తత...ధరంబు-తత = విరివియగు, చిత్ + ఆకాశ=చిద్రూపమనెడు బయలుయొక్క, మధ్య = నడుమను, సంగత = పొందియున్న, సమగ్ర = పరిపూర్ణమగు, రాజయోగ = నిరంతరభగవదనుసంధానరూపమగు, సమాధి = అసంప్రజ్ఞాతసమాధి యనెడు, ధారాధరంబు = మేఘము, మోద + వర్షంబున్ = భగవత్సాక్షాత్కారజన్యమగు సంతోషమనియెడు వానను, కురియుచున్ = వర్షించుచు, మ్రోసెన్ అనఁగన్ = ఉఱిమెనో యనురీతిని, అంతన్ = అప్పుడు, ప్రణవ = ఓమను నక్షరసంబంధమగు, దశమ = పదవదియగు, నినాదము=మ్రోఁత, ఒప్పు ఆరున్ = వినసిల్లును.

తా. పదునాల్గువిధములగు నింద్రియము లనియెడు నెమిళ్లు తుదలేని ముదమున నాడుచునుండఁగా, మఱియు సకలధర్మములనియెడు నుదకములచేఁ జెమ్మగిల్లిన యుల్లమనియెడు పల్లపునేలయందు నోరిమి లోనుగాఁగల మేలిగొనంబు లనియెడిపైరులు మొలచి మొలకలెత్తుచుండఁగా, "సర్వం

విష్ణుమయం జగత్'' అను సామరస్యముచేఁ బొడమెడి సమ్మోదమనియెడి వెల్లువలచే సాంసారికతాపత్రయమనియెడి కారగ్గియెల్లఁ జల్లార్పఁబడుచుండఁగాఁ, గనుబొమలనడిమిపట్టనియెడు సుష్పరపువీథి (నాకసపుఁద్రోవ) యందు విజ్ఞానకళలనియెడు మించుతీఁగియలగములు మెఱయుచునుండఁగా, విరివియగు తెలివి యను బయలునడిపట్టుననున్న పరిపూర్ణమగు భగవద్ధ్యానయోగమనియెడి క్రొక్కారుమొగులు నిరతిశయసంతోషమనియెడువానను గురియుచు నుఱిమెనో యనురీతిని నోంకారముయొక్క పదవది యగు మేఘనాదము విలసిల్లును. ౧_౭౭

వ. ఇట్లు చిణీనాదంబును, చిణిచిణీనాదంబు, ఘంటానాదంబు, శంఖనాదంబు, వీణానాదంబు, తాళనాదంబు, వేణునాదంబు, భేరీనాదంబు, మృదంగనాదంబు, మేఘనాదం బనం బరఁగు దశవిధప్రణవనాదంబుల శ్రీగురూపదేశపూర్వకంబుగా శ్రుతియుక్త్యనుభవంబులచేత నెఱుంగవలయు మఱియును. ౧_౭౮

టీ. ఇట్లు = పైని జెప్పఁబడినరీతిని, చిణీనాదంబు = లక్ష్యాభ్యాసముచేఁ దొలుత వినఁబడు చిణియనుశబ్దమును, చిణిచిణీనాదంబు = అట్లు కొన్నిదినము లభ్యసింపఁగాఁ జిణిచిణి యను ధ్వనియు, ఘంటానాదంబు= మఱికొన్నాళ్లకు జేగంటయొక్క ధ్వనిం బోలు నినదమును, శంఖనాదఁబు= శంఖనిస్వనమును బోలిన మ్రోఁతయు, వీణానాదంబు - వీణియయొక్క గానముంబోలిననాదమును, తాళనాదంబు = తాళములచప్పుడున కెనయగు శబ్దమును, వేణునాదంబును = పిల్లనగ్రోవిపాటకు సాటియగు రవంబును, భేరీనాదఁబు = నగారాయొక్క మ్రోఁతకు సరియగు నారావంబును, మృదంగనాదంబును = మర్దళధ్వని కీడగు ధ్వానంబును, మేఘనాదంబు= మేఘగర్జనకుఁ బురుడగు గంభీరధ్వనియు, అనన్ + పరఁగు "ఏవం హంస

వశా త్తస్మాన్మనోవిచార్యత్తస్యైవ జపకోట్యానాద మనుభవతి సచ దశవిధ ఉపజాయతే । చిణీతి ప్రథమః । చిణిచిణీతి ద్వితీయ । ఘంటానాద స్తృతీయః । శంఖనాదశ్చతుర్థః । పంచమ స్తంత్రీనాదః । షష్ఠస్తాళనాదః । సప్తమో వేణునాదః । అష్టమో భేరీనాదః । నవమో మృదంగనాదః । దశమో మేఘనాదః । నవమం పరిత్యజ్య దశమేనాఽభ్యసేత్ । ప్రథమే చించిణీగాత్రం ద్వితీయే గాత్రభంజనం । తృతీయే భేదనం యాతి చతుర్థే కంపతేశిరః । పంచమేస్రవతీతాలూ షష్ఠేఽమృతనిషేవణం । సప్తమేగూఢ విజ్ఞానం పరావాచా తథాష్టమే । అదృశ్యం నవమే దేహం దివ్యం చక్షుస్తథామలం । దశమంచ పరం బ్రహ్మ భవేద్బ్రహ్మాత్మసన్నిధౌ ॥ తస్మిన్మనోవిలీనే మనసి గతే సంకల్పవికల్పే దగ్ధే పుణ్యపాపే సదాశివశ్శక్త్యాత్మా సర్వత్రావస్థిత స్స్వయంజ్యోతి శ్శుద్ధో నిత్యో నిరంజన శ్శాంతః ప్రకాశయతీతి ఓం వేదానువచనం భవతీత్యుపనిషత్ ॥'' అని హంసోపనిషత్తునందుఁ జెప్పఁబడి ప్రసిద్ధములగు, దశ-విధ-ప్రణవ-నాదంబులన్ = పది విధములగు ప్రణవముయొక్క శబ్దభేదములను, శ్రీ-గురు-ఉపదేశ - పూర్వకంబు-గాన్ = యోగ్యుఁడగు దేశికేంద్రుని సదుపదేశము మొదటఁ గలుగునట్లుగ, శ్రుతి... చేతన్ - శ్రుతి = ఆమ్నాయవాక్యములచేతను, యుక్తి = ఉదాహరణములచేతను, అనుభవంబులచేతన్ = ఆత్మానుభవమునుబట్టియు, ఎఱుంగవలయును = తెలియందగును, మఱియున్ = ఇంతియకాక.

తా. ఇవ్విధమున చిణిమొదలుగఁ బది తెఱంగులం దగు నోంకారనాదభేదములను దొలుత సద్గురుపు నుపదేశమును బొంది వేదవాక్యములవలనను, తనయాలోచనవలనను, నిరంతరాభ్యాసముచేఁ గలిగిన నిజానుభవమువలనను, తెలిసికొనందగు నింతియకాక. ౧౨౯

అవ. ఇట్లు ప్రణవమునందలి దశవిధనాదములను బ్రతిపాదించి ప్రణవాంతర్భూతములగు అకార - ఉకార - మకార

ఇదగ్ం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద । అమాత్రశ్చ చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమశ్శివోఽద్వైతఏవ మోంకారఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం యఏవంవేద యఏవంవేద॥" అను వాక్యముల యర్థమును సావకాశముగ ననుసంధింపఁదగి యున్నది. కాన నీ వ్యాకములకుఁ గ్రమంబుగ రంగరామానుజభాష్యానుసారి యగునర్థ మెట్లనిన "సోఽయమాత్మాధ్యక్షరమోంకారోఽధిమాత్రం" ఓం మని యుచ్చరింపఁబడుచు నాత్మరూప మగు నదియు నన్నిటికి నెక్కుడగునదియు నక్షరం బ (నశింపనిద)గు నాయాత్మ అకారాది వర్ణమాత్రలతోఁ గూడినది యగును. "పాదమాత్రా మాత్రాశ్చ పాదాః" బ్రహ్మమునకుఁ బాదములగు ననిరుద్ధప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవవ్యూహములే అకారాదిప్రమాణమాత్రలచేఁ జెప్పఁదగినవి. "అకార ఉకారో మకారఇతి" అకార ఉకార మకారములు నాదము నను ప్రణవమాత్రలు నాల్గును బరవాసుదేవబ్రహ్మమునకు ననిరుద్ధాది యగు నాల్గుపాదములగుచున్నవి గాన సమస్తమగు ప్రణవమునందుఁ బరవాసుదేవ ధ్యానమును, వ్యస్తము లగు నకారాది మాత్రలయందు ననిరుద్ధాదిధ్యానమును జేయవలయునని ఫలితము. అందు ఆ వర్ణముచేఁ బ్రతిపాదింపఁదగిన రూపమును శ్రుతి వివేచించుచున్నది. "జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమామాత్రా" అనఁగాఁ బ్రణవమునందలి మొదటిమాత్ర యగు అకారమునందు జాగ్రదవస్థయే స్థానముగాఁగల వైశ్వానరుఁ డనఁబడు ననిరుద్ధుని ననుసంధానము చేయవలయునని యర్థము. అకారముచే వైశ్వానరుఁడు చెప్పఁబడుటకు హేతువును జెప్పుచున్నది. "ఆప్తేరాదిమత్త్వాద్వా" అనిరుద్ధుఁడు సర్వజగత్తులను వ్యాపించియున్నట్లు సమస్తశబ్దజాతమునకు ప్రకృతిభూత మగు నకారము సర్వశబ్దములను వ్యాపించి యుండుటచేతను, సకలశబ్దమునకు ప్రధానమగు నకారముచేఁ బ్రతిపాదింపఁబడుటచేతను వైశ్వానరుం డుకారాత్మకుం డని యర్థము. ఇట్లు అకారముచేఁ జెప్పఁబడు వైశ్వానరరూపానిరుద్ధుని నుపాసించువానికి ఫలమును జెప్పుచున్నది. "అప్నోతిహవై సర్వా

న్కామానాదిశ్చభవంతి యఏవంవేద'' యేయధికారి ప్రణవమునందలి అకారాత్మకుండగ వైశ్వానరాత్మకుండగు ననిరుద్ధుని నెఱుంగునో యా యుపాసకుఁడు కోరికలనెల్లఁ బడయును. ఎల్లవారికిని బ్రధానుండునునగును. "స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయామాత్రా'' ఓంకారమునందలి రెండవ వర్ణమాత్రయగు నుకారము స్వప్నావస్థయే స్థానముగల తైజసుం డగును. ఈ తైజసుఁడు ప్రద్యుమ్నవ్యూహాత్మకుండు. తైజసుఁడు కార్యస్వరూపుఁ డగుటకుఁ గారణమును జెప్పుచున్నది "ఉత్కర్షా దుభయత్వాద్వా'' విశ్వుని కంటె తైజసుఁ డుత్కృష్టుం డగుటచేతను విశ్వప్రాజ్ఞులకు నడుమనుండి యుభయాత్మకుం డగుటచేతను, అకార ఉకార మకారములకు మధ్య నున్న ఉకారముచేఁ దైజసుఁడు చెప్పఁబడుచున్నాఁ డని యర్థము. ఇట్లు తైజసుం డుత్కృష్టుండని యెఱుంగుటకు ఫలమును శ్రుతి చెప్పుచున్నది. "ఉత్కర్షతిహవై జ్ఞానసంతతిం। సమానశ్చభవతి । నాస్యాబ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద॥ ఏయధికారి ఇట్లు తైజసుని నుకారముచేఁ జెప్పఁ బడుచున్నవానిఁగ నెఱుంగునో యా యుపాసకుఁడు దేహాద్యభిమానమును విడిచి తన నుద్ధరించుకొనును, మఱియు ముక్తపురుషులతో సమానుండు నగును. వీని వంశమునందు భగవద్భక్తిలేనివాఁ డొకఁడును బుట్టఁడు. బ్రహ్మప్రణవమునందలి మూఁడవవర్ణమాత్ర యగు మకారము సుషుప్త్య వస్థయె స్థానముగల ప్రాజ్ఞుఁ డగును. ఈ ప్రాజ్ఞుఁడు సంకర్షణవ్యూహాత్మ కుఁడు. ఇట్లు ప్రాజ్ఞుఁడు మకారాత్మకుం డగుటచే హేతువు "మితేరాపీ తేర్వా'' సమస్తమును దనలోఁ దాదాత్మ్యముచే పొందించుకొనుటచేతను, సర్వజగత్తును దనయందు లయమగుటచేతను, మకారవాచ్యుఁడు ప్రాజ్ఞుఁ డగును. ఇట్లు తెలిసికొనిన ఫలమేమి యనిన "మినోతిహవా ఇదగ్ సర్వమపీతిశ్చ భవతి యఏవం వేద'' ఏయుపాసకుఁ డిట్లు మకారమును బ్రాజ్ఞస్వరూపమునుగ నెఱుంగునో యతఁడు ముక్తుం డయి నిఖిలజగ మును దనలోఁ బొందించుకొని యుండును. అణుపరిమాణం బగు ముక్త

జీవాత్మయందు విస్తీర్ణంబగు ప్రపంచ మెట్లిముడును? అనిన సూర్య తేజస్సునకువలె ముక్తజీవాత్మకును వ్యాపకశక్తి గలదు గాన ముక్తజీవుఁడు నిఖిలప్రపంచమును వ్యాపించి సకలమును దెలిసికొనఁగలఁ డని యర్థము. మఱియు నతఁడు పరవాసుదేవునియందు విలీనుండు నగును లేక సకల దుఃఖాద్యనిష్టమునకు లయకర్తయు నగునని యర్థము. ఇఁక తురీయపా దాత్మకమగు పరవాసుదేవతత్త్వము ప్రణవనాదముచేతఁ బ్రతిపాదింపఁబడు నని శ్రుతి చెప్పుచున్నది. "అమాత్రశ్చ చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోప శమ శ్శివోఽద్వైత ఏవ మోంకార ఆత్మైవ" అనఁగా దేశకాలవస్తుకృత పరిచ్ఛేదము లేనట్టియు, వాక్పాణిపాదపాయూపస్థ లనియెడు కర్మేంద్రి యములకు గోచరము కానట్టియు "ఏతన్నానావతారాణాం నిదానం బీజ మవ్యయం" మనుటచే సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధవ్యూహాత్మక మగు సమస్త ప్రపంచముయొక్క యుపసంహారము తనయందుఁగలయట్టియు, ఒకప్పుడు నుత్పత్తివినాశములు నావిర్భావ తిరోభావములు లేమింజేసి నిత్యమంగళ స్వరూప మగునట్టియు, తనకు సమానజాతి గల రెండవవస్తువు లేనట్టియు, వ్యూహవాసుదేవస్వరూపమే అకారోకారమకారాత్మకం బగు బ్రహ్మ ప్రణవముయొక్క యేకదేశమగు నాదము విశ్వతైజసప్రాజ్ఞులు ప్రణవము నందలి అకారోకార మకారములచేఁ జెప్పఁబడినయట్లు ప్రణవైకదేశమగు నాదముచేఁ దురీయంబగు వాసుదేవతత్త్వము ప్రతిపాదింపఁబడుచున్న దని యర్థము. ఇట్లు తురీయమగు వాసుదేవతత్త్వము ప్రణవనాదస్వరూప మని ధ్యానించునుపాసకునకు ఫలమును శ్రుతి చెప్పుచున్నది. "సంవిశ త్యాత్మ నాత్మానం యఏవం వేద" అనఁగా నిట్లు అనిరుద్ధాదివ్యూహరూపముచే వ్యస్తమును పరవాసుదేవవ్యూహరూపమున సమస్తము నగు బ్రహ్మప్రణవ ము నుపాసించువాఁడు పరమాత్మునిచే ననుగ్రహింపఁబడినవాఁడై యా యుపాయముచేఁ గ్రమంబుగ నాపరమాత్మనే పొందును. పరమాత్మునిలోఁ

ప్రవేశించి పైని వెలుపల నిచ్చకు వచ్చునట్లు తనకుఁ దగినభోగ్యజాతము నెల్ల ననుభవించుచు సుఖ ముండునని భావము.

తా. ఓ కరువలిపట్టీ ! ఓంకారమునందలి యనిరుద్ధవ్యూహాత్మకమైన తొలి అకారము పూర్వోక్త దశవిధనాదరూపము, రెండవది యగు ప్రద్యుమ్నవ్యూహాత్మకమైన ఉకారము బిందుస్వరూపము, మూఁడవదియగు సంకర్షణవ్యూహాత్మకమైన మకారము కళాత్మకము అగును. ఈ అకార ఉకార మకారము లను మూఁడింటిని నేకీభవింపఁజేసిన వాసుదేవవ్యూహాత్మక మగు బ్రహ్మప్రణవం బగును. ౧౩౦

వనమయూరవృత్తము.

గౌరవ ! యకారము నుకారము మకారం
బారయఁగఁ గూడి యొకయక్షర మనాద్యోం
కార మనఁగా నిఖిలకారణము నై ఘం
టారవమురీతి హృదయాబ్జమున మ్రోయున్. ౧౩౧

టీ. గౌరవ = బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడ వగు నాంజనేయా, (ఇచట గౌరవ అనుపదము ధర్మవాచకమయ్యు ధర్మిగాఁ బ్రయోగింపఁబడినది) లేక, గౌరవ = జగత్కారణమగుటచే ఘనమైన, అని అకారమునకు వ్యవస్థ విశేషణముగనైనఁ జెప్పి కిట్టించుకొనవలయును, అకారమును = భగవత్త్రిపాద్విభూతిలో ననిరుద్ధవ్యూహస్వరూప మగు ప్రథమపాదమైన అవర్ణమును, ఉకారము = ప్రద్యుమ్నవ్యూహరూపమగు ప్రణవద్వితీయపాద మగు ఉవర్ణమును, మకారంబు = సంకర్షణవ్యూహరూపం బగు తృతీయ పాదమైన మవర్ణమును, కూడి = "అద్గుణః" అను సూత్రముచే నవర్ణము కంటె నచ్చు పరం బగునపుడు పూర్వపరస్వరంబులకు సవర్ణంబగు నోకార మేకాదేశముకాఁగా సంధియగు, ఓంకారము అనఁగాన్ = ఓంకారమని, ఒకయక్షరము = ఒకవర్ణము, నిఖిల - కారణముక్ - ఐ = సమస్త

ప్రపంచమునకు నిమిత్తోపాదానరూపంబగు హేతు వగుచు, ఘంటారవము రీతిన్ = జేగంటయొక్క చప్పుడువలె, హృదయ + అబ్జమునన్ = హృదయ పుండరీకమునందు, అరయఁగన్ = లక్ష్యాభ్యాసముచేఁ బట్టిచూడఁగా, మ్రోయున్ = ధ్వనిచేయును. ఇచట నీవిశేషార్థము గమనింపఁదగియున్నది. "అనాహతంతు యచ్ఛబ్దం తస్యశబ్దస్య యత్పరం । తత్పరం విన్దతే యస్తు సయోగీచ్ఛిన్నసంశయః" అనుటచే వేనిచేతను వాయింపఁబడకయే స్వయముగ నేనాదము లక్ష్యాభ్యాసముచే గోచర మగునో యానాదము "శబ్దాచ్ఛాక్షరే క్షీణో నిశ్శబ్దం పరమంపదమ్" అనుటచేఁ గ్రమముగ నక్షరబ్రహ్మము నందు క్షీణింపఁగాఁ దోపట్టుపరబ్రహ్మము నెఱిఁగినయోగియొక్క, "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః । క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అనుటచే సకలసంశయములును విచ్ఛిన్నము లగును. మఱియు "ఓమిత్యక్షరం బ్రహ్మధ్యేయం సర్వముముక్షుభిః" అను శ్రుతిచే భగవచ్ఛతుష్పదాత్మక మగు నా యోంకారమును మోక్షేచ్ఛ గల యోగులు లక్ష్యాభ్యాసముచే భగవద్రూపముగ ధ్యానము చేయవలయును. ఇంతియకాక "ప్రణవోధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే । అప్రమత్తేనవేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్" అనుశ్రుతిచే నభ్యాసకుం డగు యోగి గడు మెలఁకువతోఁ బ్రణవమును విల్లుగాను తనయాత్మను బాణము గను పరవాసుదేవబ్రహ్మమును గుఱిగాను జేసి కొట్టెనేని బాణమువలెఁ దాను బ్రహ్మమును జేరి సాయుజ్యముక్తిని బడయును. ఓంకారము నిఖిలకారణ మగుటకు "ఓంకారప్రభవాదేవా ఓంకారప్రభవా స్స్వరాః । ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్" అను శ్రుతిప్రమాణము. "శ్రీకర ధరాధిధర = సేవ్యనుతపుణ్యా, శ్లోక భజనన్నగగ-లున్ ద్రుహిణసంఖ్యన్, సోఁకు విరమంబగును జూ వసమయూరా, ఖ్యాకమనువృత్తమిల - నంద మగుచుండున్" అనులక్షణముచే పదునాల్గవఛందస్సగు శక్వరియందుఁ బుట్టి,

భ, జ, స, న, గగ, లు అను నైదుగణములు గలిగి, తొమ్మిదవయక్షరము విశ్రమస్థానము గలయది వనమయూరవృత్త మగును.

తా. బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండవగు నో పవననందనా, మీఁదఁ జెప్పిన యట్లు వ్యస్తములగు అకార ఉకార మకారములు మూఁడును "అద్గుణః అదేఙ్గుణః" అను మొదలగు పాణిన్యాదిసంధిసూత్రములచేఁ గలసిన 'ఓం' అనియెడు నొకయక్షరము చతుష్పాద్విభూతి గలపరమపురుషునిఁ బ్రతిపాదించుచు నాపరమపురుషునివలె తన కింకొక కారణము లేనిదై యె అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణాత్మకం బగు భగవంతుని త్రిపాద్విభూతికి భగవంతునివలెఁ దానును మూలకారణమై పైని జెప్పినట్లును ఘంటానాదములతో లక్ష్యాభ్యాసకుని హృత్పుండరీకమునందు వాఁగుచు నుండును. ౧౩౧

క. హృదయసదనమునఁ బొదలెడి
సదమలనాదామృతంబుఁ జవిఁగొనకున్నన్
మది గదలుచుఁ గుదురదు గలు
గదు మొదలిటిపదము ముదము గదుర దుదయమై.

టీ. హృదయ + సదనమునన్ = డెందమనియెడు గృహమునందు (హృత్పుండరీకమునందు), పొదలెడి...అమృతమున్ - పొదలెడి = లక్ష్యాభ్యాసముచేఁ బొడమెడు, సత్ = సత్యస్వరూపమును, అమల = దోషరహితమును, నగు, నాద = ప్రణవనాదమనియెడు, అమృతంబున్ = సుధారసమును, చవిన్ కొనక = ఆస్వాదమును జేయక (సావధానముగ వినక), ఉన్నన్ = (యోగి) యుండినయెడల, మది = చిత్తము, కదలుచున్ = చలించుచు, కుదురదు = స్థిరపడదు, మొదలిటి + పదము = స్వర్గము మొదలగు పదవులకెల్లఁ బ్రధానమగు వైకుంఠపదవి, కలుగదు = ప్రాప్తింపదు, ముదము = నిరతిశయమోక్షసుఖముగూడ, ఉదయము - ఐ = ఉద్భవిల్లినదై, కదురదు = సంభవింపదు; ప్రణవనాద సుధారసాస్వాదము లేనిచో

మనస్సు నిలువదు. మనస్సు స్థిరపడకపోవుటవలన మోక్షసామ్రాజ్యము లభింపదు, మోక్షపదవి దొరకకపోవుటచే శాశ్వతసౌఖ్యము జనింపదని యిట్లు ఒకదాని కొకటి ముందుముందుగ హేతువులు చెప్పుటచేఁ గారణమాలాలంకారము.

తా. హృదయపుండరీకమునందు లక్ష్యాభ్యాసముచే వినఁబడు మిగులఁ బరిశుద్ధమగు ప్రణవనాద మనియెడు సుధారసము నాస్వాదింపకుండు నేనిఁ జిత్తము చలించుచు నిలువఁబడదు; భగవత్ప్రాప్తిరూపం బగుము క్తియు నలవడదు, శాశ్వతమగు సౌఖ్యమును జనింపదు. ౧౩౨

క. నాదం బంచితపరమా
హ్లాదము చిత్తప్రసాద కృ మపగతగురుసం
వాదము గతభేదం బని
వేదంబులు వలుకు వేదకవేదాంతజ్ఞా. ౧౩౩

టీ. వేద...జ్ఞా - వేద = ఋగ్యజుస్సామాధర్వణము లనియెడు నాల్గు వేదముల యొక్కయు, వేదాంత = ఈశాద్యష్టోత్తర శతోపనిషత్తుల యొక్కయు ఫలితార్థమును, జ్ఞా = తెలిసినయోమారుతీ, (ఈసంబోధనము చేత విధవ దధీత వేదవేదాంగస్స న్నాపాతతః పరిజ్ఞాత మహావాక్యార్థః'' అని చెప్పఁబడినయుత్తమాధికారిలక్షణము సూచింపఁబడినది), వేదంబులు = వేదములు, నాదంబు = మీఁదఁ బ్రతిపాదింపఁబడిన యోంకారముయొక్క నాదము, అంచిత = ఒప్పిద మైనదియు, పరమ = నిరతిశయమైనదియు నగు, ఆహ్లాదము = సంతోషమును గలుగఁజేయునదియు, చిత్త + ప్రసాదము = పరమపురుషస్వరూప మగుటచే భక్తుల యెడల హృదయముయొక్క ప్రసన్నత గలదియు, అపగత = పోయిన, గురు = అధికమైన, సంవాదము = ప్రసంగము గలదియు, గత + భేదంబు = పరమపురుషుండు సర్వసముఁడుగానఁ దత్ప్రతిపాదకంబగు నాదబ్రహ్మము

గూడ విగళితన్యూనాధికభేదము గలదని యర్థము - అని, పలుకున్ = వచి యించును.

తా. యథావిధిగ నధ్యయనము చేయఁబడిన వేదవేదాంగములు గల వాఁడవును నిఖిలోపనిషత్ప్రతిపాద్య మగు పరవాసుదేవతత్త్వము నెఱింగిన వాఁడవు నగు నోమారుతకుమార ! ఓంకార నినాదము=పూజ్యమై ప్రాజ్య మగు మోక్షసామ్రాజ్యానందరూప మనియు, బుద్ధిశుద్ధిని సిద్ధింపఁ జేయునది యనియు, వితండవాదములనెల్లఁ దొలఁగించునది యనియు, భేదబుద్ధిని బోఁగొట్టుననియు వేదవాక్యములు సెప్పుచున్నవి. ౧౩౩

తే. ప్రణవనాదరసామృతపానరతుని
విమలనయనము లనిమిషత్వము వహింప
మనసు దేవాలయంబున మనికి మరగి
సలలితకళావిభూతిచే వెలయుచుండు. ౧౩౪

టీ. ప్రణవ...నయనములు - ప్రణవ = ఓంకారముయొక్క, నాద= శబ్దబ్రహ్మసంబంధ మగు, రస = చవిఁగొనుట యనెడు, అమృత = సుధా రసముయొక్క, పాన = క్రోలుటయందు, రతుని = తాత్పర్యముగల యోగి యొక, విమల + నయనములు = యోగసిద్ధిచే దివ్యములగు కన్నులు, అనిమిషత్వమున్ = ఖేచరీముద్రచే ఱెప్పపాటు లేక పోవుటను (అమరత్వమునని యర్థాంతరము), వహింపన్ = పొందఁగా, మనసు = యోగియొక్క చిత్తము, దేవ = పరవాసుదేవునియొక్క, ఆలయంబునన్ = నివాసస్థానమగు హృత్పుండరీకమునందు (అమరావతి యను వేల్పులప్రోలు నందు నని యర్థాంతరము), మనికిన్ = ఉనికిని, మరగి = అలవాటుపడి, స...చేన్ - సలలిత = మనోహరములయిన, కళా = చిత్కళలయొక్క, విభూతి చేన్ =ఐశ్వర్యము చేత, (మహేంద్రవైభవము చేతననియర్థాంతరము), వెలయుచున్ - ఉండున్ = విలసిల్లుచుండును.

తా. ఓంకారసుయొక్క మనోహర నినాదశ్రవణమునఁ గలుగు సంతోష మనియెడు నమృతమును గ్రోలుటయందుఁ దత్పరుండగు యోగి యొక్క తెల్లని కనుంగవ రెప్పపాటులేమిని బూనఁగా నతనిదేహము వేల్పులవీట నునికి నభ్యసించి యింపగు చిక్కుళియొక్క మహైశ్వర్యమునఁ జెన్ను మీఱుచుండును. ౧౩౪

సీ. అనిమిషుం డజరుండు * నమృతుండుఁ బటుశక్తి
ధరుఁడు సిద్ధుండు వి*ద్యాధరుండు
యోగీశ్వరుండు సా*ధ్యుం డింద్రుఁడును శుచి
సమవర్తియునుఁ బుణ్య*జనుఁడు భువన
పతియును వరసదా*గతియును సుకృతార్థుఁ
డభవుఁ డనంతుఁడు * నఖిలమిత్రుఁ
డతికళాశాలి మ*హాబుధుండుఁ గవీశ్వ
రుండును సుమనో*గురుండు ఘనుఁడు

ఆ. హంసవాహనుండు * నచ్యుతుండు శివుండుఁ
బరమపురుషుఁ డగుచుఁ * బరఁగుచుండుఁ
బవనతనయ వినుము * ప్రణవనాదామృత
పానతృప్తుఁ డైన*పావనుండు. ౧౩౫

టీ. పవన + తనయ = మారుతకుమారా ! వినుము = (తారక రాజయోగ మాహాత్మ్యమును జెప్పెద) నాకర్ణింపుము, ప్రణవ...పావనుండు - ప్రణవ = బ్రహ్మప్రతిపాదక మైన యోంకారముయొక్క, నాద = పైని జెప్పఁబడిన ధ్వనివిశేషము లనియెడు, అమృత - పీయూషరసముయొక్క, పాన = త్రాగుటవలన, తృప్తుఁడు - ఐన = పరితృప్తి నొందిన, పావనుండు = పరమపవిత్రుఁ డగు యోగి, అనిమిషుండు = ("నిమేషోన్మేష రహితో జరామరణవర్జితః । మహాశక్తియుత స్సర్వకళావాన్ యోగసిద్ధి

యుక్'' అనుటవలన లక్ష్యమునందు నిలుపఁబడినదృష్టి గలవాఁడగుటచేత) రెప్పమాఁత లేనివాఁడును, "ఆదిత్యా ఋభవోఽస్వప్నా'' అనుటచేత దేవతలకు నిద్రలేదు గాన రెప్పపాటు లేనివేలుపు అని అర్థాంతరము. అజరుఁడు = ముదిమిలేనివాఁడును, నిర్జరుఁడనియు నర్థం॥ అమృతుండు= మృతి లేనివాఁడును; అమర్త్యుఁడనియు నర్థం॥ పటు + శక్తి+ధరుఁడు. పటు = దృఢమైన, శక్తి = సామర్థ్యమును, ధరుఁడు = ధరించినవాఁడును; షాణ్మాతుర శ్శక్తిధరః'' అనునిఘంటువుచేఁ గొమరుసామి యనియు నర్థం॥ సిద్ధుఁడు = అణిమాద్యష్టసిద్ధులు గలవాఁడును, "గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః'' అనుకోశముచే దేవయోనులలో సిద్ధుఁడనియు నర్థం॥ విద్యా + ధరుఁడు = శిక్షావ్యాకరణాద్యష్టాదశ విద్యా పరిజ్ఞానము గలవాఁడును, "విద్యాధ రోఽప్సరో యక్ష రక్షః" అనుటచే విద్యాధరుఁ డను దేవయోనియు నని యర్థం॥ యోగీశ్వరుఁడును నిఖిల యోగులకు నధీశుండును, "యత్ర యోగేశ్వరః కృష్ణః।'' అనుటచే నెల్ల యోగములకు నేలికయగు భగవంతుఁడును నని యర్థాంత॥ సాధ్యుండును = "సాధ్యతే ఆరాధ్యత ఇతి సాధ్యః'' అను వ్యుత్పత్తిచే నెల్లరచే నారాధింపఁబడువాఁడును, లేక "సాధ్యం సిద్ధిరస్యాస్తీతిసాధ్యః'' అనువ్యుత్పత్తిచే సాధింపఁదగినయోగసిద్ధి గలవాఁడును, "మహోమనాస్తథా ప్రాణో నరోఽపానశ్చ వీర్యవాన్। నిర్భయోనరకశ్చైవ దంశోనారాయణోవృషః ప్రభాశ్చేతి సమాఖ్యాతాస్సాధ్యా ద్వాదశదేవతాః।'' అనుటచే సాధ్యుఁ డను గణదేవతయు ననియర్థాంతరము, ఇంద్రుఁడును = ఇది పరమైశ్వర్య అను ధాతువువలన పరమైశ్వర్యసమేతుఁడగు పూర్వదిక్పతియగు దేవేంద్రుఁడు నని యర్థాంతరము, శుచి=పరిశుద్ధుఁడును, "విభావసుః। శుచిరప్పిత్తం'' అను కోశముచే నగ్నిదేవుఁడుననియు అర్థాన్త॥ సమవర్తియును "మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః'' అను భగవద్వచనముచేత నెల్లరయెడల సమబుద్ధి గలవాఁడును, "సమవర్తీ పరేతరాట్'' అనుటచే

యమధర్మరాజు నని యర్థాంత॥ పుణ్యజనుఁడు=పుణ్యాత్ముఁడును, "యాతుధానః పుణ్యజనో నైరృతో యాతురక్షసి" అనుటచేత నైరృతుండు నని యర్థా॥ భువనపతియును లోకములకు నధిపతియు, "ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః" అనుటచే జలాధిష్ఠానదేవత యగు వరుణుఁడు నని యర్థాన్త॥ వర + సదాగతియును = ప్రాప్తిరూపమగు యోగసిద్ధిచే నిచ్చకు వచ్చినయట్లు నిత్యమును సంచరించువాఁడును "శ్వసన స్స్పర్శనో వాయుర్మాతరిశ్వా సదాగతిః" అనుకోశముచే వాయుదేవుఁడును, నని యర్థాన్త॥ సుకృతార్థుఁడు = మిక్కిలి కృతకృత్యుఁడును, "సుష్ఠుకృతోఽర్థోధనం యస్యేతి సుకృతార్థః" అనువ్యుత్పత్తిచే బాగుగ సద్వినియోగము చేయఁబడిన ధనముగలధనదుఁడని యర్థాన్త॥ "ధనదో రాజరాజో ధనాధిపః" అని యమరము॥ అభవుఁడు = సంసారబంధములేనివాఁడు, ఈశానుఁడని యర్థము. అనంతుఁడు = యోగసిద్ధిచే భగవత్సాయుజ్యమును బొంది సర్వవ్యాపకుఁ డగుటచే నంతము లేనివాఁడును, శేషమూర్తియు నని యర్థాంత॥ అఖిల + మిత్రుఁడు = ఎల్లరకును హితుఁడును, "ద్యుమణి స్తరణిర్మిత్రః" అనుటచే నాదిత్యుఁడును నని యర్థము, అతి + కళా + శాలి = చతుష్షష్టికళలచే మిక్కిలి యొప్పుచున్నవాఁడును లేక ఉత్కృకళలచే నొప్పుచున్నవాఁడును, పదియారు కళలచే నొప్పుచున్నచంద్రుఁ డనియు నర్థము, మహాబుధుండు = సమస్తముఁ దెలిసిన విద్వాంసుఁడును, బుధుఁ డనుశుభగ్రహమనియు నర్థము. "జ్ఞాతృచాంద్రి సురాబుధాః" అని కోశము. కవీశ్వరుండును = వాల్మీకాదులవలె యోగసిద్ధిచే దివ్యజ్ఞానసంపన్నుఁ డగుటచే మహాకవియు, "ఉశనా భార్గవః కవిః" అనుటచే శుక్రాచార్యుఁడనియు నర్థము. సుమనోగురుండు = మంచిమనస్సు గలవారిలో గొప్పవాఁడును, దేవగురుం డగువాచస్పతియు నని యర్థము. ఘనుఁడు = అందఱికంటె నధికుడును "ఘనజీమూత ముదిరజలముగ్ధూమయోనయః" అనుటచేఁ బర్జన్యదేవుఁడు నని యర్థాంతరము. హంసవాహనుఁడు— "హంసో హంసేతి

ధ్యాయన్ సర్వదేహేషు వ్యాప్య వర్తతే" అను మొదలగు హంసోపనిషత్తు నందుఁ బ్రతిపాదింపఁబడిన హంసస్వరూపంబగు బ్రహ్మమును సదా వహించువాఁడును, రాయంచ వాహనముగఁ గల నలువయు నని యర్థము. అచ్యుతుండు = ముక్తుఁడగుటచేఁ బునరావృత్తి లేనివాఁడును, "పీతాంబరోఽచ్యుత శ్శార్ఙ్గీ" అనుటచే శ్రీమన్నారాయణుండు నని యర్థము. శివుండు "శామ్యతి పరమానందరూపత్వా న్నిర్వికారోభవతీతి శివః" అను వ్యుత్పత్తిచే నిరతిశయానందస్వరూపుఁ డగుటవలన మాయావికారములు లేనివాఁడు గాన శివుండును "శివ శ్శూలీ మహేశ్వరః." అనుకోశముచే నీశ్వరుండు అనియు నర్థము, పురుషోత్తముఁడు యోగసిద్ధుఁ డగుటచే నుత్తముఁ డగుమనుష్యుఁడును, "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అనుటచేఁ బరమాత్ముండు నని యర్థము, అగుచున్=అయినవాఁడై, పరఁగుచున్ + ఉండున్ = ఒప్పుచుండును.

తా. ఓ మారుతకుమారా! తారకయోగసిద్ధులను జెప్పెద నాలకింపుము; మీఁద వివరింపఁబడినయట్లు నిరంతరలక్ష్యధ్యానముచేతఁ బట్టుపడిన యోంకారనాదము నాలకించుటవలనఁ గలిగెడు బ్రహ్మానంద మనియెడు నమృతరసాస్వాదనముచేత నిత్యతృప్తి నొంది యోగసిద్ధిని గాంచిన పరమపవిత్రుండగుయోగి, పూర్వకాండమునందు విధింపఁబడిన జ్యోతిష్టోమాది ధర్మముల నెల్ల నాచరించుటచేఁ బొందఁదగిన స్వర్గాది పుణ్యలోకములకుఁ బోలుత నేగి యచట దేవతలవలె ననిమిషత్వమును, నిర్జరత్వమును (ముదిమిలేకపోవుటను) నమరత్వమును (చావు లేకపోవుటను) బొంది దేవసేనానాయకుం డగుకుమారస్వామియొక్క యాధిపత్యమును బడసి మఱియు సిద్ధ విద్యాధర గంధర్వసాధ్యులు మొదలగు దేవయోనుల దివ్యసిద్ధుల నన్నిటిని గాంచి పిమ్మట నింద్రుఁడు, నగ్నిదేవుఁడు, ధర్మదేవత, నిరృతి, వరుణుఁడు, వాయుదేవుఁడు, కుబేరుఁడు, ఈశానుఁడు, అను నష్టదిక్పతులు గూడఁ దానయై మఱియుఁ బరమపురుషునకుఁ బాన్పును భువనధారియు

నగు నాదిశేషమూర్తియు, భగవంతునకు నేత్రభూతులై జగంబుల వెలింగించుచున్న సూర్యుఁడును, చంద్రుఁడును, చంద్రపుత్త్రుం డగుబుధుఁడును, భగవచ్ఛాసనంబున నీతిశాస్త్రప్రవర్తకుం డగు శుక్రాచార్యుండును, సకలసురులకు నుపాధ్యాయుం డగు వాచస్పతియును, పర్జన్యదేవుఁడును, భగవదాజ్ఞానుసారముగఁ బ్రపంచసృష్టికర్త యగుపరమేష్ఠియు, భగవద్భక్తాగ్రగణ్యుం డగుశంభుండును దానయై ఇట్లు తత్తల్లోకములయందలి సౌఖ్యముల నెల్ల యథేష్టముగ ననుభవించి పరితృప్తుం డై కడపట జ్ఞానకాండమునందుఁ బ్రతిపాదింపఁబడిన భగవదుపాసనలవలనఁ బడయఁదగిన భగవత్ప్రాప్తిరూపం బగు మోక్షమును బొంది సాక్షాత్పరమపురుషుండే తానై సర్వాత్మకుండై యొప్పును. ౧౩౫

అవ. ఇట్లు బ్రహ్మప్రణవనాదభేదములను నాదలక్ష్యముల యొక్క ఫలమును సమగ్రముగ నిరూపించి ఇఁక లక్ష్యాభ్యాసముచే సిద్ధించెడు చిత్కళావిశేషములు ప్రతిపాదింపఁబడుచున్నవి.

ఆ. ఆంజనేయ ! యింక నీ కంతర్బహిర్మధ్య
దృగ్విలోకితప్రదీప్త చిత్క-
ళావిభూతి యెల్ల నీ భావించి చెప్పెద
నాదరించి చూడు మాత్మయందు. ౧౩౬

టీ. ఆంజనేయ ! = ఓ అంజనానందనా ! అంతః + విభూతి + అంతః + బహిః + మధ్య = తొల్లి చెప్పఁబడిన అంతర్లక్ష్యము - బాహ్యలక్ష్యము, మధ్యలక్ష్యము - అనియెడు, దృక్ =దృష్టులచేతను, విలోకిత = చూడఁబడెడు, ప్రదీప్త = భాసురములగు, చిత్కళా = చిద్రూపములగు కళలయొక్క, విభూతిన్ = అనుభవసంపత్తిని, ఎల్లన్ = సమగ్రముగ, భావించి = ఆలోచించి, చెప్పెదన్ = వచించెదను, ఆదరించి = చెప్పిన

దానియందు గౌరవము నుంచి, ఆత్మయందుఁ = హృత్పుండరీకమునందు, చూడుము = పరికింపుము.

తా. ఓయంజనానందనా! వెనుకఁ జెప్పఁబడిన యంతర్లక్ష్యమగు శాంభవీముద్రచేతను, బహిర్లక్ష్యము లగుభూచరీఖేచరీముద్రలచేతను, మధ్యలక్ష్య మగు మధ్యముద్రచేతను, జూడఁబడెడు దేదీప్యమానము లగు చిత్కళలయొక్క యనుభవసంపత్తిని నాలోచించి నీ కుపదేశించెదను, దత్ప్రకారముగ సావధానుఁడ వై నీలోఁ బరికింపుము. ౧౩౬

ఆ. కనులు రెండు గురునికనుమతి గొని మూసి
బొమలనడిమిద్విదళకమలమునను
విమలదృష్టి నిలిపి శమకలితాత్ముఁ డై
చూడవలయు లక్ష్యశోభనములు. ౧౩౭

టీ. గురుని + అనుమతిన్ = సద్గురువుయొక్క యుపదేశమును, కొని = పొంది, కనులు + రెండున్ = రెండుకన్నులను, మూసి = ముడుఁచుకొని, బొమల...నను - బొమల = కనుబొమ్మలయొక్క, నడిమి= మధ్యప్రదేశమునందలి, ద్వి = రెండగు, దళ = రేకులుగల, కమలమునను= పద్మమునందు (దళద్వయసమాయుక్త మాజ్ఞాచక్రం విరాజతే'' అనుటచే నాజ్ఞాచక్రమునం దని యర్థము), విమల + దృష్టిన్ = పరిశుద్ధమగు చూడ్కిని, నిలిపి = ఉంచి, శమ + కలిత + ఆత్ముఁడు + ఐ - శమ = ఉపశమముచేత, కలిత = ఒప్పుచున్న, ఆత్ముఁడై = చిత్తముగలవాఁడై లక్ష్య + శోభనములన్—లక్ష్య = చూడఁదగిన చిత్కళలయొక్క, శోభనములన్ = సంపదలను, చూడన్ + వలయున్ = పరికింపవగును.

తా. రెండుకన్నులను దేశికేంద్రుఁడు సెప్పినయట్లు ముడుఁచుకొని, కనుబొమ్మలకు మధ్యభాగమునం దున్న రెండురేకులుగల యాజ్ఞాచక్రమునందుఁ బరిశుద్ధమగు చూడ్కినిగూర్చి శమముచే నొప్పుచుండు డెందము

గలవాఁడై యోగి యప్పుడు గోచరములగు చిత్కళలయొక్క సంపదలను గాంచఁదగును. ౧౩౭

క. మునుపుగ హృదయాకాశము
గనుపట్టుం జూపు లగుచుఁ గన్నులవెంటన్
జనునది మన మగుఁ గావునఁ
గనఁదగు నాకాశపంచకం బందుఁ దగన్. ౧౩౮

టీ. హృదయ + ఆకాశము = మనోరూపమగు నాకాశము, మునుపుగన్ = మొట్టమొదటను, కనుపట్టున్ = తోఁచును, చూపులు = చూడ్కులు, అగుచున్ = అయి (దృగ్రూపమున), కన్నులవెంటన్ = నేత్రములనుండి, చనునది = పోవునది, మనము = చిత్తమే, అగున్-కావునన్ = అయియుండును గనుక, అందున్ = చిదాకాశమునందు, ఆకాశ + పంచకంబున్ = చెప్పఁబోవు గుణాకాశము మొదలగు నాకాశముల నైదిటిని, కనన్ - తగున్ = చూడవలయును. "శ్రోత్రస్య శ్రోత్రం మనసోమనోస ఉ ప్రాణస్య ప్రాణ శ్చక్షుష శ్చక్షుః" చెవికిఁ జెవియు మనస్సునకు మనస్సునుఁ బ్రాణమునకుఁ బ్రాణమునుఁ గన్నునకుఁ గన్నును నైయున్నది చిదాత్మయే" యను శ్రుత్యర్థము నిందుఁ గన్నులవెంటం జనునది మన మనుపట్ల గమనించునది.

తా. అట్లు చూచుచుండుతఱిని దొలుత మనోరూపం బగు మిన్ను దోపట్టును, దృష్టిరూపమున నయనములవెంబడిని బోవునది చిత్తమే గాన నా హృదయాకాశమునందు ముందుఁ జెప్పఁబడు గుణరహితాకాశము మొదలగు నైదుమిన్నులను జూడవలయును. ౧౩౮

వ. ఇట్లు తనలోచనంబులకుఁ గనుచూపుమేర గోచరం బైన
హృదయాకాశంబునందుఁ గేవలనిరాకారం బైన గుణ
రహితాకాశంబును, నిబిడనిష్ఠురనీరంధ్రగాఢాంధకారంబైన

పరాకాశంబును, ప్రళయకాలప్రజ్వలజ్జ్వాలాభీలదావానలాకారంబైన మహాకాశంబును, వివిధవిచిత్ర వితతాపరిమితద్యుతిభరితంబైన తత్త్వాకాశంబును, ప్రచండమార్తాండ మండలశతకోటి ప్రభాభాసురంబైన సూర్యాకాశంబుననుపంచాకాశంబుల నవలోకింపవలయు మఱియును.

టీ. ఇట్లు = ఈవడువున, కనుచూపుమేరన్ = చూడ్కులకు నగపడునంతదనుక, గోచరంబు - ఐన = కన్పట్టుచున్న, హృదయ + ఆకాశంబునందున్ = చిదంబరమునందు, కేవల + నిరాకారంబు ఐన=ఏమియు రూపములేని, గుణ + రహిత = నిర్గుణమైన ("శబ్దగుణక ఆకాశః" అనుటచే స్వగుణంబగుశబ్దము లేని), ఆకాశంబు = గగనమును, నిబిడ... ఐన - నిబిడ = చిక్కనైనదియు, నిష్ఠుర = బెడిదమైనదియు, నీరంధ్ర = ఎడలేనిదియు, గాఢ = దృఢమైనదియు నగు ("గాఢబాఢ దృఢానిచ" అని యమరము), అంధకారంబు = చీఁకటిగలది, ఐన = అగునట్టి, పరాకాశంబు = మొదటి నిశ్శబ్దాకాశమునకుఁ బైయగు నాకసమును, ప్రళయ... ఐన-ప్రళయకాల = మహాప్రళయసమయమునందు, ప్రజ్వలత్ = మండుచున్న, జ్వాల = శిఖలచేత, ఆభీల = బెడిదమగు, దావానల = కారగ్గియొక్క, ఆకారంబైన = స్వరూపమువంటి స్వరూపముగల, మహాకాశంబు = గొప్పదియగు నాకసమును, వివిధ... ఐన - వివిధ=పలుతెఱంగులు గలవియు, విచిత్ర = అద్భుతములును, వితత = అంతటఁ గ్రమ్మియున్నవియు, అపరిమిత = లెక్కలేనివియు నగు, ద్యుతి=కాంతులచేత, భరితంబు - ఐన = పరిపూర్ణమగు, తత్త్వాకాశంబు = మహదాదిచతుర్వింశతితత్త్వమయంబైనయాకసమును, ప్రచండ... ఐన - ప్రచండ = మిక్కిలి తీక్ష్ణములగు, మార్తాండమండల = సూర్యమండలములయొక్క, శతకోటి = నూఱుకోట్ల సంబంధమగు, ప్రభా = కాంతులచేత, భాసురంబు - ఐన =

దేదీప్యమానమగు, సూర్యాకాశంబును = ఆదిత్యమయమగు నాకాశమును, అను + పంచ + ఆకాశంబులన్ = అనఁబడు నాకాశముల నైదింటిని, అవలోకింపన్ - వలయున్=కనుఁగొననగును, మఱియును=ఇంతియకాక.

తా. ఇత్తెఱంగునం దనదుచూడ్కి పాఱునంతటిదవ్వుదనుకఁ గన్పట్టుచుండెడి చిదాకాశమునందు రూపవిహీనంబగు నిర్గుణాకాశంబును, చిక్కనిదియు నడలుగొలుపునదియు నెడలేనిదియు నగు పెంజీఁకటిగల పరాకాశంబును, మహాప్రళయం బగుతఱిని మండుచున్నమంటకొనలచే భీతినిచ్చుకారగ్నిపగిదినుండు మహాకాశమును, పలుతెఱంగుల నచ్చెరువు నిచ్చుచు తుదలేని వెలుంగులచేఁ బరిపూర్ణంబగు తత్త్వాకాశంబును, మిక్కిలి తీక్ష్ణములగు నూఱుకోటుల సూర్యబింబములకాంతులచే దేదీప్యమానమగు సూర్యాకాశంబును, ననియెడు నాకాశముల నైదిటిని జూడవలయు నింతియకాక.

ఆ. ఆంజనేయ ! విను; తదాకాశపంచక
మధ్యమమున వెలుఁగు మహితకళల
చంద మెల్ల నీకు ముందుగా వినిపింతు
సందియములు మాని పొందు వాని. ౧౪౦

టీ. ఆంజనేయ = అంజనానందనా, తత్ ... మునన్-తత్=మీఁదఁ జెప్పఁబడిన, ఆకాశ = నిర్గుణాకాశము మొదలగునాకసములయొక్క, పంచక = ఐదిటియొక్క, మధ్యమునన్ = నడుమను, వెలుఁగు + మహిత + కళల + చందము = ప్రకాశించెడు పూజ్యములగు చైతన్యకళావిశేషముల యొక్క రీతిని, ఎల్లన్ = సమగ్రముగ, ముందుగాన్ = తొలుత, నీకున్= భక్తుఁడవగునీకు, వినిపింతున్ = బోధించెదను, వినుము = ఆకర్ణింపుము, వానిన్ = ఆ చైతన్యకళావిశేషములను, సందియములు = ఇది యిట్లగునా కాదా ? యను మొదలగు ననుమానములను, మాని = వదలి, పొందుము = గురూక్తలక్ష్యాభ్యాసముచేఁ గనుఁగొనుము.

తా. ఓ కరుణలిపట్టీ! పైని జెప్పిన నిశ్శబ్దాకాశమును, పరాకాశము, మహాకాశము, తత్త్వాకాశము, సూర్యాకాశము నను నైదుమిన్నులయొక్క నడుమను దేదీప్యమానము లగు చిత్కళావిశేషములయొక్క క్రమమును సవిస్తరముగ నీకు నెఱింగించెద నాలింపుము. విని యాచైతన్యకళల నభ్యాసమునఁ గనుఁగొనుము. ౧౪౧

సీ. మందాకినీసుధా సందోహదుగ్ధాబ్ధి
సౌందర్యలహరుల చందమునను
మందారమల్లికా కుందారవిందోరు
చందనపుష్పరుక్చయముపగిది
నిందిరాసుందరీ మందిరాత్మకమక
రందనిర్ఝరరుచిప్రతతిరీతి
నిందుభృన్నందిసంక్రందనకరిమృగేం
ద్రఫణీంద్రదీప్తి బృందములభాతి

తే. హారనీహారడిండీర శారదాభ్ర
హీరకర్పూరతారకాకారకాంతి
కరణి నాకాశపంచకాంతరమునందు
మండితము లగుఁ జిత్కళా మండలములు. ౧౪౧

టీ. మందాకినీ...నను-మందాకినీ = మిన్నేటియొక్కయు, సుధా+సందోహ = అమృతంపుగుంపుయొక్కయు, దుగ్ధాబ్ధి = పాలసంద్రముయొక్కయు, సౌందర్య = సొగసుయొక్కయు, లహరుల = అలలయొక్క, చందమునను = పొలుపునను, మందార...పగిదిఁ - మందార = వేల్పుమ్రాఁకుయొక్కయు, మల్లికా = మల్లెతీవయొక్కయు, కుంద = మొల్లయొక్కయు, అరవింద = తెలిదమ్మిలయొక్కయు, ఉరు + చందన పెద్దమంచిగంధపుఁజెట్టుయొక్కయు, పుష్ప = పుష్పములయొక్క, రుక్

కాంతులయొక్క; చయము-పగిదిఁ = సమూహమువడువునను, ఇందిరా... రీతిఁ - ఇందిరా = శ్రీదేవి యను, సుందరీ = మగువకు, మందిర = ఉనికి పట్టగు తెల్లఁదామరపువ్వుయొక్క, అంతః = నడుమనున్న, మకరంద = పూదేనియలయొక్క, నిర్ఝర = వెల్లువలయొక్క, రుచి = రోచులయొక్క, ప్రతతి - రీతిఁ = గుంపుపగిదిని, ఇందు...భాతిఁ - ఇందు + భృత్ = చంద్రశేఖరునియొక్కయు, నంది = ఈశ్వరునివాహనమగు నందికేశ్వరుని యొక్కయు, సంక్రందన - కరి = చాదంతియొక్కయు, మృగ+ఇంద్ర= సింగముయొక్కయు, ఫణీ + ఇంద్ర = ఆదిశేషునియొక్కయు, దీప్తి = కాంతులయొక్క, బృందముల-భాతిఁ = సమూహములవలె, హార... కరణిఁ—హార = ముత్తెపుసరులయు, నీహార = మంచుయొక్కయు, డిండీర = నీటినురుఁగులయు, శారద + అభ్ర = శరత్కాలపుమేఘముల యొక్కయు, హీర=వజ్రములయు, కర్పూర=పచ్చకప్పురముయొక్కయు, తారకా = చుక్కలయు, ఆకార = స్వరూపము గల, కాంతి = వెలుఁగు యొక్క, కరణిఁ = తెఱఁగునను; చిత్ + కళా + మండలములు = చైతన్యకళలయొక్క సమూహములు, ఆకాశ + పంచక + అంతరము నందుఁ=గుణరహితాకాశము మొదలగు నాకసములయైదిటి నడిమిపట్టున, మండితములు - అగుఁ = ప్రకాశించుచుండును.

తా. "ఇట్లు తనలోచనములకుఁ గనుచూపుమేర గోచరమగు వ్యాద యాకాశంబునందుఁ గేవల నిరాకారంబైన గుణరహితాకాశంబు" అను మొదలుగ వెనుకఁ జెప్పఁబడిన నిర్గుణాకాశము, పరాకాశము, మహాకాశము, తత్త్వాకాశము, సూర్యాకాశము, అను నాకాశపంచకముయొక్క మధ్య భాగములయందు నిరంతరాభ్యాసమువలనఁ గనఁబడుచుండెడు చిద్రూపము లైనకళలు, ఆకాశగంగయొక్కయు, సుధాప్రవాహముయొక్కయు, పాల సముద్రముయొక్కయు, సుందరములైన తరంగములవలెను; కల్పవృక్షము, మల్లెలు, మొల్లలు, తెల్లఁదామరలు, మంచిగంధపు చెట్లులు, అను వీని తెల్లని

పువ్వులయొక్క కాంతులయట్లును; లక్ష్మీదేవికి నివాసమగు పుండరీకమునందలి మకరంద రసప్రవాహముయొక్క ప్రభలవడువునను, శివునకు వాహనమైన వృషభముయొక్కయు, ఐరావతముయొక్కయు, సింహముయొక్కయు, నాదిశేషునియొక్కయు,శరీరకాంతులచందమునను, ముత్యాలపేరులు, తెల్లనిమంచు నీటినురుఁగు శరత్కాలపుమేఘములు వజ్రములు తెల్లని కర్పూరము నక్షత్రములు - వీనియొక్క దీప్తులపగిదిని బ్రకాశించుచుండును.

సీ. సద్యస్తమోనాశ ఖద్యోతమాన స
 ద్విద్యుల్లతాప్రభా వీథిపగిది
హృద్యక్షపావేద్య ఖద్యోతసందోహ
 విద్యమానద్యుతి వితతికరణి
ఘోరాంధకారకృద్దుర్వారినీలసవారి
 వారివాహచ్ఛవివ్రజమురీతి
నీల వైడూర్య ప్రవాళాబ్జరాగ ము
 క్తాఫల గోమేధికములభాతి

తే. శుద్ధమాణిక్య మరకత శోణరత్న
 తప్తతపనీయరుచులచందమున హృదయ
మండితాకాశపంచక మధ్యసీమఁ
గానఁబడుచుండుఁ జిన్మయ కళలు వత్స. ౧౮౨

టీ. సద్యః...పగిదిన్ - సద్యః=వెంటనే, తమః=అంధకారముయొక్క, నాశ=కొట్టుటకు, ఖ=ఆకసమునందు, ద్యోతమాన = ప్రకాశించుచున్న, సత్ = యోగ్యములయిన, విద్యుత్ + లతా = లతలంబోలు మెఱపుయొక్క, ప్రభా = ద్యుతులయొక్క, వీథి = వరుసయొక్క, పగిదిన్ = తెఱంగునను, హృద్య...కరణిన్ - హృద్య = హృదయరంజకమగు, క్షపా = రాత్రియందు, వేద్య = తోపట్టెడు, ఖద్యోత = మెఱుఁగుడుఁ

బురువులయొక్క, సందోహ = గుంపునందు, విద్యమాన = కన్పట్టెడు, ద్యుతి = కాంతులయొక్క, వితతి = పుంజముయొక్క, కరణిన్ = వడువునను, ఘోర...రీతిన్ - ఘోర = అడలుఁ గొలిపెడు, అంధకార = దట్టమగు-చీఁకటిని, కృత్ = చేయుచున్న, భూరి = మిక్కుటమగు, నీల = నలుపు గల, సవారి = నీటితోఁ గూడిన, వారివాహ = మేఘముల యొక్క, ఛవి = ప్రభలయొక్క, వ్రజము + రీతిన్ = సమూహమువలెను, నీల...భాతిన్ - నీల = ఇంద్రనీలమాణిక్యములయు, వైడూర్య - "కృష్ణపీతప్రభాయుక్తం బిడాలనయనోపమం। విదూరపర్వతభవం వైడూర్యం రత్న ముచ్యతే" అనులక్షణము గలవైడూర్యమణులయు, ప్రవాళ = పగడాలయు, అబ్జరాగ = పద్మరాగమాణిక్యములయు, ముక్తాఫల = మంచిముత్తెములయు, గోమేధికములు = గోమేధికము లనెడి మణివిశేషములయొక్కయు, భాతిన్ = పోలుపునను, శుద్ధ...చందమునన్-శుద్ధ = తెల్లనైన, మాణిక్య = మానికములయు, మరకత = మరకతము లనుమణులయు, శోణ = ఎఱ్ఱనగు, రత్న= కెంపులయు, తప్త = పుటముపేయఁబడిన, తపనీయ = బంగారముయొక్కయు, రుచుల = దీప్తులయొక్క, చందమునన్ = పోలుపునను, హృదయ...సీమన్ - హృదయ = డెందమునందు, మండిత=వెలుఁగుచుండు, ఆకాశ = మింటియొక్క, పంచక= ఐదిటియొక్క, మధ్యసీమన్ = నడిపట్టున, వత్స = ఓకుమార, చిన్మయ + కళలు = చిద్రూపము లైన కళావిశేషములు, కానఁబడుచున్ - ఉండున్ = అగపడుచుండును.

తా. ఓకుమార! కటికిచీఁకటిని దూలఁదోలు మెఱపుఁదీవలతీరునను, రేలందు వెలుఁగొందుమెఱుఁగుడుఁబురుగుల వెలుఁగులచెలువునను, కటికిచీఁకటిని గలుగఁజేయు తొలకరిమొగుళ్లకాంతులపడువునను, మఱియుఁబలుతెఱంగులగు కాంతులు గల వజ్రవైడూర్యాది నవరత్నములయొక్క దీప్తులపగదిని, చైతన్యప్రధానములగు కళావిశేషములు పూర్వోక్తము లగు

నై దుగగనముల నడిమిప్రదేశమునందు యోగాభ్యాసబలమునఁ జూడఁబడు చుండును. ౧౪౨

శా. చండాంశుప్రభ లుట్టిపడ్డగతి భాస్వచ్చిత్కళాకోటు లు
ద్దండస్ఫూర్తుల ఖండఖండములునై తండోపతండంబులై
నిండారం గనుపట్టు వెండియును హృన్నీరేజమధ్యాంచితా
ఖండాకాశపరంపరాంతరమునన్ గమ్యంబులై యంతటన్.

టీ. చండ - అంశు + ప్రభలు = సూర్యునియొక్క వెలుఁగులు, ఉట్టిపడ్డగతిన్ = ఉవ్వెత్తుగఁ జూపట్టునట్లు, భాస్వత్ + చిత్ + కళా + కోటులు = దేదీప్యమానములగు చైతన్యకళలయొక్క సమూహములు, ఖండఖండములున్-ఐ = ముక్కముక్కలగుచు, తండ + ఉపతండములు - ఐ = ప్రోగుప్రోగులై, నిండారన్ = పరిపూర్ణముగ, ఉద్దండస్ఫూర్తులన్ = మిక్కుటములగు స్ఫురణలతో, వెండియును = మరల, హృత్...మునన్ - హృత్ + నీరేజ = హృదయపుండరీకముయొక్క, మధ్య = నడుమను, అంచిత = రంజిల్లుచున్న, అఖండ = తెంపులేని, ఆకాశపరంపరా = వెనుకం జెప్పినయాకసముల యైదిటియొక్క, అంతరమునన్ = లోపలను, గమ్యంబులై = తోఁపట్టుచున్నవై, అంతటన్ = ఎల్లయెడలను, కనుపట్టున్ = చూడఁబడును.

తా. సూర్యునియొక్క కాంతు లొక్క పెట్టుగఁ బడినవడువున మిక్కుటంబులగు దీప్తులతో నొప్పుచుండెడు చిన్మయములగు పెక్కుకళలు ముక్కముక్కలుగను గుంపుగుంపులుగ నగుచు హృదయపుండరీకమునడుమను దగు నఖండములైన గుణరహితాకాశము లోనగు నాకసములైదిటి నడిమిపట్టునందు నెల్లెడలఁ దోఁపట్టుచున్నవై పరిపూర్ణముగఁ జూడఁబడును. ౧౪౩

సీ. తరుణబోధారుణోదయదీప్తి నజ్ఞాన
గురుతమ మజ్ఞహృద్గుహల నడఁగ
ఫుల్లషడ్జలజాతములమీఁద నిక్కి హం
సము త్రివేణీసంగమమున మెలఁగ
విమతేంద్రియేందీవరము లెల్ల ముకుళింప
మన మనుశశి సుఖవనధి జాఱ
సలలితజ్ఞానవిజ్ఞానలోకంబు ల
న్యోన్యసంగతము లై యనఁగి పెనఁగ

తే. నాతతాజాండపిండాండజాతములను
బూని వెలిఁగించుఁ బటుతరస్ఫూర్తితోడ
ఘనతరాంతర్హృదాకాశమున వెలుంగు
మండితాఖండచిద్భానుమండలంబు. ౧౮౮

టీ. తరుణ...దీప్తిన్ - తరుణ = నూతనమైన, బోధ = మోక్షేచ్ఛ యనెడు, అరుణ = అనూరునియొక్క, ("సూరసూతోఽరుణోఽనూరుః" అని యమరము), ఉదయ = పొడుపుయొక్క, దీప్తిన్ = కాంతిచేత, అజ్ఞాన + గురు + తమము = మూలాజ్ఞానమనియెడి కటికి-చీఁకటి, అజ్ఞ + హృత్ + గుహలన్ = అజ్ఞానులయొక్క, హృదయములనియెడు కందరములయందు, అడఁగన్ = అణఁగి యుండఁగా, ఫుల్ల...మీఁదన్ —ఫుల్ల = జ్ఞానసూర్యోదయముచే విడఁబాఱిన, షట్ = ఆఱగు జలజాతముల = మూలాధారము లోనగు చక్రము లనియెడు పద్మములయొక్క, మీఁదన్ = మీఁదిపట్టుననుండి, నిక్కి = మెడ మీఁదికెత్తి, (సహస్రారచక్రమునంటియనియు నర్థము), హంసము = శుద్ధచిద్రూపపరమహంస యనియెడు రాజహంసము, త్రివేణీసంగమమునన్ = "ఇడాచ పింగళాచైవ సుషుమ్నా యత్ర నాడికాః। సంగతా స్సా త్రివేణీస్యా చ్చిన్మరాళసుఖప్రదా"

అనుటచే నిడా పింగళా సుషుమ్న లనియెడి గంగా యమునా సరస్వతుల సంగమక్షేత్రమునందు, మెలఁగక = "ఏషోऽసౌ పరమహంసో భాను కోటి ప్రతీకాశో యేనేదం సర్వంవాప్తం తస్యాష్టధావృత్తి ర్భవతి" అను మొదలగు శ్రుతిచే నాయా దళములయందు సంచరించుచుండఁగా; విమత+ఇంద్రియ+ఇందీవరములు = ప్రతికూలములగు నేత్రాదీంద్రియము లని యెడు నల్లగలువలు, ఎల్లక =అన్నియును, ముకుళింపక =ముడింగియుండఁగా; మనము + అను + శశి = చిత్త మనియెడు చందమామ, సుఖ + వనధిక =భగవదనుసంధానజన్యమగు పరమసౌఖ్య మనియెడు కడలియందు, జాఱక = క్రుంకఁగా; సలలిత + జ్ఞాన + విజ్ఞాన + శ్లోకంబులు = "ఇమం వివస్వతేయోగంప్రోక్తవా నహ మవ్యయం" అని యుపక్రమించి "వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః। బహవోజ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః" "ఓయర్జునా! నాసంబంధములగు జన్మకర్మములయొక్క వస్తుతత్త్వము నెఱుంగుట యను తపస్సుచేతఁ బవిత్రులగు పెక్కండ్రు బుద్ధిమదగ్రేసరులు నాయొక్క ప్రాప్తిరూపమగు భావమును బడసెదరు" అనియు "ఇతిమాం యోభిజానాతి కర్మభి ర్న సబధ్యతే"... "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః"... "గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః"... "స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః" "శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప"... "సర్వంకర్మాఖిలంపార్థ జ్ఞానే పరిసమాప్యతే"... "ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"... "సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి"... "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున। నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే... శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః। జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి"... "తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాऽత్మనః। ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠభారత" అని భగవంతునిచే

నుపదేశింపఁబడిన పరమపురుషతత్త్వజ్ఞానమును, "జ్ఞానం తే హంస విజ్ఞాన మిదంవక్ష్యా మ్యశేషతః" అను భగవద్వాక్యముచేతఁ బరమపురుషవ్యతిరిక్తం బగు సమస్త చిదచిద్వస్తుజాతముకంటెఁ బరమపురుషుఁడు సకల హేయప్రత్యనీకుం డగుటచేతను, నిరతిశయమును లెక్కకెక్కని దగు నవియు నగు కల్యాణగుణములు గల యపరిమితమహదైశ్వర్యము గలవాఁ డగుటచేత వేఱగునను వివిక్తవిషయజ్ఞానము ననియెడు జక్కవపిట్టలు, అన్యోన్య + సంగతములు + ఐ = ఒకదానితోనొకటి గలసినవై, అనఁగి పెనఁగన్ = కూడి క్రీడించుచుండఁగా; ఘన...మండలంబు - ఘనతర = మిగుల గొప్పదియగు, అంతర్హ్రుత్ = అంతరంగ మనియెడు, ఆకాశమునన్ = గగనమునందు (పూర్వోక్తహృదయాకాశమునందు), వెలుంగు = దేదీప్యమానమగుచు, మండిత = ఒప్పుచున్న, అఖండ = తెంపులేని, చిత్ = శుద్ధచైతన్య మనియెడు, భాను = సూర్యునియొక్క, మండలంబు = బింబము, పటుతర + స్ఫూర్తితోడన్ = మిక్కుటం బగు కాంతితో, ఆతత + అజాండ + పిండాండ + జాతములను = విస్తీర్ణ మగు బ్రహ్మాండముల యొక్కయుఁ దదంతర్భూతము లగు కార్యకరణసంఘాతములయొక్కయు సమూహములను, పూని-వెలిఁగించున్ = తప్పక భాసిల్లఁజేయును.

తా. నూతనమగు జ్ఞానమనియెడు సూరునియొక్క యుదయముచే నగు వెలుఁగుచేత మూలాజ్ఞాన మనియెడు కటికిచీఁకటి యజ్ఞానులదేహము లనియెడు గుహలయందు దాఁగియుండఁగా; వికసిల్లిన మూలాధారము లో నగు నాఱుచక్రములనియెడు కమలములమీఁదనుండి మెడమీఁదికెత్తి పరమ హంసయనియెడు రాయంచ యిడాపింగళాసుషుమ్నానాడులకలియిక యను త్రివేణీతీర్థమునందు సంచరించుచుండఁగా; బాహ్యవిషయాసక్తము లగుటం జేసి ప్రతికూలము లగు శ్రోత్రాదీంద్రియము లనియెడు నల్లగలువలు ముకుళించుచుండఁగా; చిత్త మను చంద్రబింబము పరమపురుషప్రాప్తిరూపమగు నిరతిశయసౌఖ్యమనియెడు కడలియందునస్తమించుచుండఁగా; భగవత్ప్రా

ష్టికి మూలములగు పరమపురుషతత్త్వజ్ఞానమును భగవంతుఁడు చిదచిద్వస్తుజాతమునకంటె వ్యతిరిక్తుం డను విజ్ఞానమునని యెడు జక్కవపిట్ట లొండొంటం గలసిమెలసియుండఁగా; మిగుల గొప్పదియగు పూర్వోక్తహృదయాకాశమునందు దేదీప్యమానమగుచుఁ దెంపులేనిసద్బోధ యను నాదిత్యమండలము మిక్కుటమగు దీప్తితో గొప్పబ్రహ్మాండములయుఁ దదంతర్గతములగు ప్రాణిశరీరరూపపిండాండములయు గుంపులను దేజరిల్లఁజేయుచుండును.

ఆ. సకలకర్మములకుఁ సాక్షియై స్వప్రకా
శతఁ దమోఘ్నుఁ డగుచుఁ జక్షురాది
కప్రవర్తకత్వగరిమ భాసిలుసత్స్వ
భావుఁ డగుచుఁ జిద్విభావసుండు. ౧౮౫

టీ. సకల + కర్మములకున్ = చక్షురాదీంద్రియవ్యాపారములకన్నిటికిని "కర్మసాక్షీ జగచ్చక్షుః" అనుటచేత సంధ్యావందనాది సమస్తక్రియాకలాపములకు ననియు నర్థము; సాక్షి - ఐ = సర్వాంతరుండగుటచేఁ గనుఁగొనుచుండువాఁడై, మఱియుఁ గర్మసాక్షి యగుటచేఁ జూచుచుండువాఁడై, స్వ + ప్రకాశతన్ = స్వయంప్రకాశమానుఁడగుటచేత, తన వెలుఁగుటచేతనని సూర్యపరమగు నర్థము; తమోఘ్నుఁడు - అగుచున్ = అజ్ఞానమును బోఁగొట్టువాఁడై, చీఁకటిని నశింపఁజేయువాఁడై యనియు, సత్ + స్వభావుఁడు, అగుచున్ = సత్యసంకల్పుఁ డనియు, జగన్మిత్రుఁ డగుటచే యోగ్యమయిన స్వభావము గలవాఁడనియు నర్థద్వయము, చిత్ + విభావసుండు = చిద్రూపుఁడగు పరమపురుషుఁ డనియెడు సూర్యుఁడు, చక్షుః ... గరిమన్ — చక్షుః = నేత్రేంద్రియము, ఆదిక = మొదలగువానికి, ప్రవర్తకత్వ = ప్రేరకత్వముయొక్క, గరిమన్ = మహత్త్వముచేత, భాసిలున్ = ప్రకాశించుచుండును.

తా. సమస్తజీవకోటులయొక్క వ్యాపారములకు సర్వాంతరుండగుటచే, సాక్షిభూతుండును, ఇతరసాపేక్షలేక తనకుఁదా వెలుఁగొందుటచే

మూఢుల యజ్ఞానమును దూలఁదోలువాఁడును, వైషమ్యనైర్ఘృణ్యాదులు లేక తనకు శేషభూతులగు నెల్లప్రాణులయందు సమబుద్ధిగలవాఁడునగుచుఁ బరిశుద్ధచిద్రూపుఁ డగు భగవంతుఁడు సర్వాంతర్యామి యగుటచే నేత్రాదులగు నింద్రియములకెల్లఁ బ్రేరకుం డగుటచే యోగియొక్క చిదాకాశము నందు వెలుఁగుచుండును. ౧౪౫

క. భ్రూమధ్యోదయశైలము
పై మొదలం దోఁచి యంతఁ బ్రవిమలహృదయ
వ్యోమారూఢుం డింద్రియ
తామరసానందకరుఁడు దా నై వెలుఁగున్. ౧౪౬

టీ. (ఆచిద్విభావసుఁడు) భ్రూ...పైన్ - భ్రూ = కనుబొమల యొక్క, మధ్య = నడిపట్టనియెడు, ఉదయ + శైలము = పొడుపు కొండయొక్క, పైన్ = శిఖరమునందు, మొదలన్ = తొలుత, తోఁచి = కనఁబడి, అంతన్ = తరువాత, ప్ర...డు = ప్రవిమల = పరిశుద్ధమగు, హృదయ = చిత్తమనియెడు, వ్యోమ = ఆకసమునకు, ఆరూఢుండు = అధిష్ఠించినవాఁడై, ఇంద్రియ...కరుఁడు - ఇంద్రియ = చక్షురాదులగు నింద్రియము లనియెడు, తామరస = కమలములకు, ఆనంద = సంతసమును (వికాసమును), కరుఁడు = కలుగఁజేయువాఁడు, తాను - ఐ = తానై యగుచు, వెలుఁగున్ = భాసిల్లును.

తా. పరమపురుషపరిజ్ఞాన మనియెడు ప్రభాకరుఁడు మొదటఁ గను బొమలనడిమిభాగమనియెడు నుదయాద్రికొనయం దుదయించి పిదప నిర్మల మగు యోగిహృదయ మనియెడు నంబరమునకుఁ గ్రమంబున నెక్కి చక్షువు మొదలగు నింద్రియము లనియెడు కమలములకు సంతోషంబు గొలుపుచు స్వయముగఁ బ్రకాశించును. ౧౪౬

సీ. అంతకుమున్న నీ కపరోక్షవిజ్ఞాన
చక్షువుల్ దెఱచి యజ్ఞానమోహ
నాంగితాదాత్మ్యరూపాలింగనము మాని
చయ్యనఁ దను వను శయ్య డిగ్గి
చారువైరాగ్యవిజ్ఞానోపరతులచే
మానసస్నానకర్మములఁ దీర్చి
యనిశంబు బుద్ధీంద్రియప్రేరకుం డెవ్వఁ
డా దేవసవితృమహాప్రకాశ

తే. మెలమి నే నంచు లోచనాంజలులచేత
ఘనతరానందబాష్పకార్ఘ్యముల నిచ్చి
మొదల సందేహమం దేహముఖపరప్ర
ణాశ మొనరించి యంత నానంద మలర. ౧౪౭

టీ. ఓ యాంజనేయా! నీవు = ఈవు, అంతకుమున్న + అ = చిన్మభావనుఁడు పొడచూపకమునుపే, అపరోక్ష + విజ్ఞాన = పరమపురుష ప్రత్యక్షజన్య మగువిశేషజ్ఞానమనియెడు, చక్షువుల్ = కన్నులను, తెఱచి = రెప్పలెత్తి (మేలుకాంచి), అజ్ఞాన... ఆలింగనమున్-అజ్ఞాన = మూలప్రకృతి యనియెడు, మోహనాంగి = మోహింపఁజేసెడువనితయొక్క, తాదాత్మ్యరూప = దేహాదికమే నే ననియెడు, ఆలింగనముఁ = పరిరంభణమును, మాని = విడిచి, చయ్యనఁ = బిరబిర, తనువు + అను = పాంచభౌతికమగు శరీరమనియెడు, శయ్యఁ = పాన్పును, డిగ్గి = దిగి, (దేహాదికమే నే నను భ్రాంతిని విడిచి), చారు...చేఁ—చారు = నిర్మలములగు, వైరాగ్య = విరక్తియు, విజ్ఞాన = భగవత్తత్త్వపరిజ్ఞప్తియు, ఉపరతులచేఁ = నిఖిలేంద్రియవ్యాపారములను బరమపురుషునియందే చేర్చుట యనులక్షణము గల యుపరతియు ననియెడు గంగాయమునాసరస్వతులచేత, (మానసికతీర్థ

రాజమునం దని యర్థము) మానస + స్నాన + కర్మములన్ - "య స్స్నాతి మానసేతీర్థే స యాతి పరమాంగతిమ్" అనుటచే మానసికస్నానమును జేసి సంధ్యావందనాదికర్మములనెల్ల, తీర్చి = నెఱవేర్చుకొని, అనిశంబున్ = నిత్యమును, ఎవ్వఁడు = ఏపరమపురుషుఁడు, బుద్ధి + ఇంద్రియ + ప్రేరకుఁడు = సర్వాంతర్యామియై నేత్రాదిజ్ఞానేంద్రియములకు నియామకుఁడో, ఆదేవు = అట్టి పరవాసుదేవునియొక్క, సవితృ = సమస్తప్రపంచసృష్టికి జనకమగు, మహత్ = జ్ఞానయోగులచేఁ గోరఁబడుచు నుత్తమమగు, ప్రకాశము = దివ్యతేజస్సును, నేను + అంచున్ = ఆతేజస్సునకు శేషభూతుఁడను నేనని, ("తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్" - తత్ = అవాఙ్మనసగోచరంబగు, సవితుః = ప్రపంచోత్పత్తిస్థితిలయములఁ జేయువాఁ డగు, దేవస్య = స్వయంప్రకాశమానుఁ డగు పరమపురుషునియొక్క, వరేణ్యం = ప్రపంచమునకు నాధారభూతమగుటచే నెల్లరచే నాశ్రయింపఁదగిన, భర్గః = తన సాక్షాత్కారమాత్రముచే మాయామాయాకార్యముల నెల్ల దహించెడుతేజస్సును, ధీమహి = ధ్యానించెదము; ఆపరమపురుషుం డెట్టివాఁ డనిన, యః = ఏభగవంతుఁడు, నః = మనయొక్క, ధియః = బుద్ధులను (అంతఃకరణవృత్తులను), ప్రచోదయాత్ = ప్రకాశింపఁ జేయుచున్నవాఁడో, ఏభగవంతుఁడు మన చిత్తవృత్తుల నంతర్యామియై ప్రేరణఁ జేయుచున్నవాఁడో జగజ్జనావననాశనకరుండగు నా పరవాసుదేవుని సకలాశ్రయణీయం బగు దివ్యతేజమును ధ్యానించెదమని మంత్రార్థము; మఱియు నీగాయత్రీమంత్రార్థమును విద్యారణ్యాము లిట్లు శ్లోకరూపమున నిర్వచించిరి - "తదిత్యవాఙ్మనోగమ్యం ధ్యేయం సవితృమండలే। సవితు స్సకలోత్పత్తిస్థితిసంహారకారిణః। వరేణ్య మాశ్రయణీయం యదాధారమిదంజగత్। భర్గస్స్వసాక్షాత్కారేణాఽవిద్యాతత్కార్యదాహకం। దేవస్య ద్యోతమానస్య స్వానందాత్క్రీడతోఽపివా। ధీమహ్యాహం స ఏవేతి తేనై

వాఽభేదసిద్ధయే । ధియోంతఃకరణవృత్తీశ్చ ప్రత్యక్ప్రవర చారిణీః । య ఇత్య లింగగర్భం య స్సత్యజ్ఞానాదిలక్షణం । నోఽస్మాకం బహుధాఽభ్యస్త భిన్నభేదదృశాం తథా । ప్రచోదయా త్ప్రేరయేచ్చ ప్రార్థనేయం విశిష్యతే'' అని యందలి "ధీమహ్యాహంస ఏవేతి తేనైవాభేదసిద్ధయే'' అను వాక్యార్థము నవలంబించి కవియు నెలమి నేనంచు నని చెప్పినాఁడు); లోచన + అంజలులచేతన్ = నేత్రములనియెడు దోసిళులచేత, ఘన...బులు - ఘనతర = అత్యధికములైన, ఆనంద = ప్రమోదముచేఁగలిగిన, బాష్ప = కన్నీళ్లనియెడు, అర్ఘ్యంబులు = సంధ్యాకాలములయందు విడువఁదగిన యర్ఘ్యములు, ఇచ్చి = ఒసఁగి (సూర్యున కర్ఘ్యప్రదానమును జేసి), మొదలన్ = తొలుత, సందేహ...నాశము - సందేహ = సకలసంశయము లనియెడు, మందేహ = మందేహులు, ముఖ = మొదలగు, పర = శత్రువులగు రక్కసులయొక్క, ప్రణాశము = పరిమార్చుటను, ఒనర్చి = కావించి ("మందేహదేహనాశార్థ ముదయాస్తమయే రవేః । సమాహారే ద్విజోత్సృష్ట మంత్రతోయాంజలిత్రయమ్'' అనుటచే, ప్రాతస్సాయంకాలములయందుఁ ద్రైవర్ణికులచే నియ్యఁబడిన యర్ఘ్యము సూర్యునిపై దండెత్తివచ్చిన మందేహాది రాక్షసులను గొట్టి యని యర్థము), అంతన్ = తరువాత, ఆనందము = సంతోషము, అలరన్ = వెలయుచుండఁగా, పైపద్యముతో నన్వయము.

తా. ఓ యాంజనేయా! ప్రబోధసూర్యోదయము కాకమునుపు నీవు భగవత్సాక్షాత్కారరూపము లగు కన్నులను దెఱచి బహువిధజన్మపరంపరనుండియు ననుసరించియున్న యవిద్య యను వనితయొక్క తాదాత్మ్యమనియెడు గాఢాలింగనమును బరిత్యజించి శీఘ్రముగ దేహాభిమానరూప మగు పాన్పునుండి దిగి, అతులవిరక్తి పరమపురుషపరిజ్ఞానము ఉపరతియు నను గంగా యమునా సరస్వతీ సంగమక్షేత్ర మగుతీర్థరాజమునందు భగవదనుసంధానరూపం బగు స్నాన మాచరించి పరమ

పురుషోపాసనాత్మకము లగు సమస్త క్రియాకలాపమును నెఱవేర్చుకొని, అంతఃకరణవృత్తుల నెల్ల నేపరవాసుదేవుఁడు సర్వాంతర్యామియై నియమించుచున్నవాఁడో సకలసృష్టిస్థితిసంహారకారకుం డగు నా భగవంతుని దివ్యతేజస్సును దన్నుఁగాఁ దలంచుకొనుచు (ఆ భగవంతునకు నేను శేషభూతుఁడనని భావించుచు) కన్నులనియెడు దోసిళులచేత నిరతిశయానందమువలనఁ బొడమ కన్నీటిచే నా ప్రబోధాదిత్యునకు నర్ఘ్యప్రదానమును గావించి సమూలముగ సకలసంశయము లనియెడు మందేహాదిదానవులను బరిమార్చి మఱియు హార్లోద్రేకంబున. ౧౭౭

క. మౌనజపంబు నివృత్తి
ధ్యానముఁ గావించి యక్రియాత్మార్చనముం
బూని యొనరించి చిదఖం
డానందం బనుభవింపుమయ్య మహాత్మా. ౧౭౮

టీ. మహాత్మా - మహత్ = భగవ దనుసంధాన తత్పరం బగుటచే నుదారంబగు, ఆత్మా = మనస్సు గల యాంజనేయుఁడా ! మౌన + జపముక్ = మౌన - "ఉచ్చారే మైథునేచైవ ప్రస్రావే దన్తధావనే । స్నానే భోజనకాలేచ షట్సు మౌనం సమాచరేత్" అని స్మృతిచేఁ జెప్పఁబడిన వాగ్వ్యాపారరాహిత్య మనియెడు జపమ్మున్ - "జప స్తద్భావనం ధ్యేయ సమ్ముఖీకరణం మనే" అని మంత్రశాస్త్రమునందుఁ జెప్పఁబడినయట్లు నారాయణ మహామంత్రముయొక్క పురశ్చరణమును, నివృత్తి + ధ్యానముక్ - నివృత్తి "నివృత్తిస్తు మహాఫలా" అను మనువచనముచేతను పరమమనియెడు, ధ్యానముక్ - "బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయాస్థితిః । ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ" అనియు "ధ్యై చింతాయాం స్మృతోధాతు శ్చింతా తత్త్వేన నిశ్చలా । ఏతద్ధ్యాన మిహప్రోక్తం" అనియుఁ జెప్పఁబడినలక్షణము గల

పరవాసుదేవ విషయక నిరంతరచింతనమును, కావించి = చేసి, అక్రియాత్మార్చనముఁ = అక్రియ - భగవదనుసంధానముఁ దప్ప ఇతర వ్యాపార రాహిత్య మనియెడు, ఆత్మ = పరమాత్మునియొక్క, అర్చనముఁ = పూజనమును, పూని = అవలంబించి, ఒనరించి = కావించి, చిత్ + అఖండ + ఆనందంబు - చిత్ = శుద్ధచిద్రూపుఁ డగు భగవంతుని యొక్క, అఖండ = నిరతిశయంబగు, ఆనందముఁ = సంతోషమును, అనుభవింపుము + అయ్యా = పడయుము. (ఇచట "స్నానం సంధ్యా జపో ధ్యానం దేవతారాధనం తథా। భగవత్కీర్తనం చేతి షట్కర్మాణి దినే దినే" అని చెప్పఁబడినట్లు భగవద్భక్తులు ప్రతిదినమునఁ గావింపఁ దగిన యాఱుకర్మలును వచింపఁబడినవి.)

తా. మహనీయుఁడవగు నాంజనేయా! మౌనముద్రతో నిరంతరమును భగవన్మంత్రపురశ్చర్యయును, బాహ్యావృత్తిరహితం బగు భగవ ద్ధ్యానమును, జేయుచు, సాంసారికవ్యాపారమును విడిచి పరమపురుషార్చనము నెల్లపుడు గావించుచు, నిత్యానందమును బొందుము. ౧౮౮

తే. అట్లఖండసుఖామృతావాప్తిఁ జెంది
చిత్తవిశ్రాంతి తాంబూలసిద్ధిఁ గాంచి
మురిసి యసమానమూర్తివై ముక్తికాంత
తో వినోదింపు మయ్య వాతూలతనయ. ౧౮౯

టీ. వాతూల + తనయ = ఓ పవమాననందనా! అట్లు = పైని చెప్పిన ప్రకారముగ, అఖండ...అవాప్తిఁ - అఖండ = శాశ్వతమైన, సుఖ=భగవదనుసంధానమువలనఁ గలిగిన సంతోషమనియెడు, అమృత - సుధారసముయొక్క, అవాప్తిఁ - లాభమును, చెంది - పడసి, చిత్త... సిద్ధిఁ - చిత్త = మనస్సుయొక్క, విశ్రాంతి = భగవంతునిఁ జేరు యనెడు, తాంబూల = తమ్ములముయొక్క, సిద్ధిఁ = ప్రాప్తిని, కార్యార్థ

పడసి, మురిసి = (భగవత్ప్రాప్తిరూపమగు నిత్యసుఖము నాకుం గలుగుటచేఁ గృతార్థుఁడ నైతినని) యానందించి, అసమాన + మూర్తివి + ఐ = (పరమపురుషసారూప్యమును బొందుటచే) సాటి లేని దివ్యమంగళ విగ్రహుఁడవై, ముక్తికాంతతోన్ = మోక్షలక్ష్మితోఁ గూడి, వినోదింపు మయ్యా = ఆనందింపుము.

తా. ఓ కరువలిపట్టి ! పూర్వోక్తరీతిని శాశ్వతానందమనియెడు సుధారసముయొక్క లాభము నొంది భగవంతునియందుఁ జిత్తము చేర్చుట యను తాంబూలమును వేసికొని యానందించుచు భగవత్సారూప్యము నొందుటచే దివ్యమంగళవిగ్రహుండ వై మోక్షలక్ష్మీసమాగమసౌఖ్యము ననుభవింపుము. ౧౪౯

అవ. ఇట్లు జ్ఞానసూర్యోదయానంతరమున భగవద్భక్తునకుఁ బగటికృత్యమును జెప్పి ప్రబోధచంద్రోదయానంతరమునందు రాత్రికృత్యము చెప్పఁబడుచున్నది.

సీ. కామాదిఖగములకగజిబిజు లడఁగ దే
హాభిమానాదిత్యుఁ డ డస్తమింప
సకలవిక్షేపకషాయరసాస్వాద
ధీంద్రియాబ్జములు నిద్రించుచుండ
విలసదాత్మాకారవృత్తికైరవజాత
మిం పొంది వికసింప నెఱుక మఱపు
లనుచక్రయుగమున కతివియోగము గల్గ
ఖండవిజ్ఞాననక్షత్రతతుల

తే. తెలివి వెల్వెలఁబోవ నిర్మలమనశ్చ
కోరతృష్ణానలంబు చల్లార నంత

ననితరముగ హృదాకాశమున వెలుంగు
మండితాఖండచిచ్చంద్రమండలంబు. ౧౫౦

టీ. కామ...బిజాలు - కామ = దార పుత్రాదులయందలి కోరిక, ఆది=మొదలగు క్రోధ లోభ మదమాత్సర్యాదు లనియెడు, ఖగముల - విహంగమములయొక్క, గజిబిజాలు = అఱపులసందడులు, అడఁగఁగ = తగ్గఁగా ; దేహ + అభిమాన + ఆదిత్యుఁడు = మేను మొదలగు వాని యందలి నేను నాది యను నభినివేశమనియెడు మార్తాండుఁడు, అస్త మింపఁగ - అస్తమయము నొందఁగా; సకల...అబ్జములు - సకల = సమగ్రమగు, విక్షేప = చిత్తవిక్షేపముయొక్క, కషాయ = పరిపాక మనియెడు, రస = రుచియొక్క, ఆస్వాద = అనుభవము గల, ధీ + ఇంద్రియ = త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియము లనియెడు, అబ్జములు = కమలములు, నిద్రించుచుఁ - ఉండఁగ = ముకుఁచుకొనుచుండఁగ; విలసత్...జాతము - విలసత్ = దేదీప్యమానుఁ డగు, ఆత్మ = పరమాత్మునియొక్క, ఆకాశ = సంతత ధ్యానముచేఁ దాద్రూప్యమునొందిన, వృత్తి = చిత్తవృత్తులనియెడు, కైరవ = కలువల యొక్క, జాతము = సముదాయము, ఇంపు + ఒంది=సొగసును గాంచి, వికసింపఁగ = పూచుచుండఁగా; ఎఱుక + మఱపులు = బాహ్యావిషయ ముల తెలివియు వాని విస్మృతియు, అను = అనియెడు, చక్ర + యుగ ఘనకుఁ - జక్కవపిట్టల జోడునకు, అతి + వియోగము = మిక్కుట పగు నెడఁబాపు, కల్గఁ = సంభవింపఁగా; ఖండ... తెలివి = ఖండ + జ్ఞాన = సకలము భగవన్మయమే యగునను తెలివికి వ్యతిరిక్తమగు భేద జ్ఞానమనియెడు, నక్షత్ర = చుక్కలయొక్క, తతుల = గుంపులయొక్క సిద్ధలివి = తేటదనము (ప్రకాశము), వెల్వెలఁబోవఁ = తగ్గిపోవుచుండ యు; నిర్మల...ఘనలంబు-నిర్మల=పరిశుద్ధమగు, మనః=యోగిహృదయ క్షే

యెడు, చకోర = చకోరపక్షులయొక్క, తృష్ణ = ఆశ యనియెడు, అనలంబు = అగ్ని, చల్లాఱన్ = ఆఱిపోవుచుండఁగా; మండిత ... మండలంబు - మండిత = ప్రకాశించుచున్న, అఖండ = తెంపులేని, చిత్ = భగవత్తత్త్వబోధ యను, చంద్ర + మండలంబు = చంద్రునియొక్క బింబము, అనితరముగన్ = వేఱొకవెలుఁగు పొడమాపకుండునట్లు, హృదాకాశమునన్ = (పూర్వోక్త) చిత్తాకాశమునందు, అంతన్ = అత్తఱిని, వెలుంగన్ = భాసిల్లున.

తా. పిమ్మట కామక్రోధలోభమోహమదమాత్సర్యాదు లనియెడు విహంగమములయొక్క రుతములయలుకుడు తగ్గఁగా, శరీరము మొదలగు వానియందు నేను నాది యను దురభిమానమనియెడు సూర్యుఁ డస్తమానము నొందఁగా; నిఖిలచిత్తవిక్షేపములయొక్క పరిపాకముయొక్క రుచి ననుభవించుచుండు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియము లనియెడు తామరలు ముడుఁచుకొనుచుండ; ప్రకాశమానుం డగు పరమాత్మునియొక్క తాద్రూప్యము గల చిత్తవృత్తు లనియెడు కాళియందియలు చాలు సొబగు మీఱి విడఁబారి పూచుచు నుండఁగ; బాష్పము గల చక్రజ్ఞానము వానిస్మృతియు నను జక్కవపిట్టలజోడునకు సెనిన, మేఖనెడఁబాపు గలుగఁగా; భేదజ్ఞాన మనియెడు తారకల సల్లాపము = యొక్క ప్రకాశము వెలవెలఁబోవుచునుండఁగా; పరిశుష్కమగు హృదయ = యెడు వెన్నెలపిట్టలయొక్క దాహ మనియెడు వహ్ని యా[illegible] చక్ర డఁగా; దేదీప్యమాన మగు తెంపులేని భగవద్విషయకబోధ నేయఁబడిన బింబ మపుడు చిత్తాకాశమునందు రెండవతేజస్సు పొడచూపక = ప్రకా భాసిల్లును.

= పుస్తెపోఁగు

అయ్యవసరంబున సుషుమ్నాంతఃపురంబున నప్రతిభతయ—
యశయ్యాతలంబున హంసయానయయ్యె, దుర్నిరీక్షణ = తేజ

సమానయు, మూలాధారమంజీరయు స్వాధిష్ఠానకింకిణీసమ న్వితమేఖలయు, మణిపూరకకాంచీకలాపయు, హృదయ కలితానాహతరత్నభూషితయుఁ, గంఠవిభ్రాజిత విశుద్ధ మంగళసూత్రాలంకృతయు, భ్రూమధ్య ప్రకాశమాన సదమల ద్విదళ లలాటికా శోభితయు, సూర్యచంద్ర మండల తాటంక యుగళ విరాజితయు ధగద్ధగాయమాన సౌదామినీలతా శరీరిణియు, శుద్ధసత్త్వదుకూలావృతయు, సచ్చిదానంద స్వరూపిణియు నైన ముక్తికాంతను, యోగ జ్ఞానకరంబుల గాఢాలింగనంబు సేసి నానావిధ ప్రణవ నాదంబు లను కంకణమేఖలా మంజీరశింజిత కలరవమణి తాద్యారవంబులు సెలంగ విచార జనితజ్ఞానానంద రస మధురాధరామృతం బనుభవించుచుం బరమ శమం బను చిఱుచెమట వొడమ నిర్నిద్రాక్షుద్రముద్రాలక్ష్య దృగ్వ డగు, ఆత్మ = భావనా జ్ఞానంబుల నేకరూపంబు గావించి దాద్రూప్యమునాఁ రిమితానుపమిత పరమోరతి సుఖరసికుండవు. యొక్క, జాతస్మరతుండవు, సంస్పృష్టాత్యంత మర్మస్థానుండవు, వికసింపఁ = తానంతకలామండలుండవు, ప్రగళితబిందుండవు నై ముల తెలివియుదింపుము. ౧౫౧

ఘనకుఁ - జ్ఞ + అవసరంబునఁ = అట్లు ప్రబోధ చంద్రోదయ మయిన సెగు సెడఁబా మ్నా + అంతఃపురంబునఁ = సుషుమ్న యను బ్రహ్మనాడి జ్ఞాన = సకల్యభాగ మనియెడు పడుకటింటియందు, అప్రమేయ...తలం నామనియెడు ప్రమేల్య = అఖండాకారం బగుటచేఁ బ్రమాదవిషయ సిద్ధిలివి = తేట్టు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు పైది యగు "శాంతం స యః నిర్మల. చతుర్థం మన్యన్తే" అను శ్రుత్యుక్తమైన తురీయావస్థ యనె

శయ్యాతలంబునఁ = హంసతూలికాతల్పమునందు, హంస + యానయు = హృదయకమలదళములయందు విహరించుచుఁ జిత్తవృత్తుల భేదమునకుఁ గారణమయిన చిద్రూపమగు హంసయొక్క సంచారము గలదియు "పూర్వ దళే పుణ్యే మతిరాగ్నేయే నిద్రాలస్యాదయోభవన్తి యామ్యే క్రౌర్యేమతి ర్నైరృతే పాపే మనీషా వారుణ్యాం క్రీడావాయవ్యాం గమనాదౌ బుద్ధి స్సౌమ్యే రతిప్రీతి రీశాన్యే ద్రవ్యాదానం మధ్యే వైరాగ్యం కేసరే జాగ్రదవస్థా కర్ణికాయాం స్వప్నో లింగే సుషుప్తిః పద్మత్యాగే తురీయం యదా హంసోనాదే విలీనోభవతి తత్తురీయాతీతం భవతి" అను శ్రుతి యిందులకుఁ బ్రమాణము. హంసయొక్క నడకఁ బోలిన నడక గలది యనియు నర్థము. దుర్...యు - దుర్నిరీక్ష్య = కనుఁగొనుటకు శక్యము గాని, కళా = పూర్వోక్త సూర్యచంద్రాగ్నిచిత్కళలచేత, భాసమానయు= వెలుఁగుచున్నదియు, నిరుపమాన లావణ్యముచే నొప్పుచున్నది యనియు నర్థము; మూలాధార + మంజీరయు = "పాదమూల మభివ్యాప్య మూలా ధారస్య సంస్థితిః" అనుటచే పాయుస్థానమునుండి పాదాగ్రమువరకు వ్యాపించి యుండెడు మూలాధారచక్ర మనియెడు కాలియందియలు గలదియు, స్వ...యు - స్వాధిష్ఠాన = స్వాధిష్ఠాన మను పేరు గల చక్ర మనియెడు, కింకిణీ = పిల్లగంటలతో, సమన్విత = కూడుకొనిన, మేఖ లయుఁ = ఒడ్డాణము గలదియు, మణిపూరక + కాంచీకలాపయు = మణిపూరక మను మొలత్రాడు గలదియు, హృద యు...యు—హృదయ = హృత్స్థానమునందు, కీలిత = ఉన్నట్టి, అనాహత = అనాహత చక్ర మనియెడు, రత్న = నాయకమణిచేత, భూషితయు = కైసేయఁబడిన యు, కంఠ...యు—కంఠ = కంఠస్థానమునందు, విభ్రాజిత = ప్రకా శించుచున్న, విశుద్ధ = విశుద్ధచక్ర మనెడు, మంగళసూత్ర = పుస్తెపోఁగు చేత, అలంకృతయు = అలంకరింపఁబడినదియు, భ్రూ...శోభితయు— భ్రూ = కనుబొమలయొక్క, మధ్య = నడిపట్టున, ప్రకాశమాన = తేజ

రిల్లుచున్న, సత్ + అమల = మిగులఁ బరిశుద్ధములగు, ద్వి + దళ = రెండురేకులు గల యాజ్ఞాచక్ర మనియెడు, లాలాటికా = పాపటబొట్టుచేత, శోభితయున్ = భాసిల్లుచున్నదియు, సూర్య...యు - సూర్య = సూర్యునియొక్క, చంద్ర = జాబిల్లియొక్క, మండల = బింబము లనియెడు, తాటంక = కర్ణపుష్పము లనెడి భూషణవిశేషములయొక్క, యుగళ = జోడుచేత, విరాజితయున్ = ఒప్పుచున్నదియు "తాటంకయుగళీభూత తపనోడుపమండలా" అని లలితాస్తోత్రము, ధగత్...శరీరిణియు = మెఱపుఁబోని దేహకాంతిగలదియు, "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" అని శ్రుతి, శుద్ధ...యు - శుద్ధ = రజస్తమోగుణ సంపర్కము లేని, సత్త్వ = సత్త్వగుణ మనియెడు, దుకూల = పీతాంబరముచేత, ఆవృతయు = చుట్టును గప్పఁబడినదియు, సత్...యున్ - సత్ = కాలత్రయాబాధ్యమాన మగుటచే సత్యమును, చిత్ = అఖండాకార భగవత్తత్త్వ పరిజ్ఞానమును, ఆనంద = నిరతిశయ సంతోషమును, స్వరూపిణియున్ = నిజాకారముగఁ గలదియు, ఐన = అగునట్టి, ముక్తికాంతన్ - ముక్తి = పరమపురుషప్రాప్తిరూప మగు ముక్తి యనెడు, కాంతన్ = మగువను, సు...లన్—సు = లెస్సయగు, యోగ = క్రియాయోగము, జ్ఞాన = రాజయోగము అనియెడు, కరంబులన్ = రెండు చేతులతోను, గాఢ + ఆలింగనంబున్ = బిగువగు కౌఁగిలిని, చేసి = కావించి, నానావిధ + ప్రణవ + నాదంబులు = చిణిప్రభృతు లగు పలుతెఱంగులం బరఁగు బ్రహ్మప్రణవముయొక్క పూర్వోక్త శబ్దములు, అను = అనియెడు, కంకణ...బులు - కంకణ = చేతి కడియములయు, మేఖలా = కటిసూత్రమునందలి చిఱుగంటలయు, మంజీర = కాలియందియలయు, శింజిత = తొడవుల మ్రోఁతలును, కలరవ = అవ్యక్తమధురధ్వని గల, మణిత = రతికూజితములును, ఆది = లోనుగాఁ గల, ఆరవంబులు = నిస్స్వనములు, చెలంగన్ = ఒప్పుచుండఁగా; విచార...అవృతంబు - విచారము,

పరమపురుషతత్త్వ నిరంతర చింతనముచేత, జనిత = కలిగిన, జ్ఞాన = భగవద్విషయక బోధచేనైన, ఆనందరస = నిరతిశయ సుఖాస్వాదమనియెడు, మధుర = రుచ్యమైన, అధర + అమృతంబుల్ = అధరపాన సుధారసమును, అనుభవించుచుల్ = త్రాగుచు, పరమ + శమంబు = ఉత్తమమగు చిత్తశాంతి, అను = అనియెడు, చిఱుచెమట = చిన్నచెమట, పొడమల్ = అంకురింపఁగా; నిర్...ల్ - నిర్నిద్ర = నిద్రాసక్తిలేమిచే, అక్షుద్ర = నీచముకాని, ముద్రా = ఖేచరి మొదలగు పూర్వోక్త ముద్రలచేత, లక్ష్య = పరికింపఁదగిన పరమపురుషునందలి, దృక్ = చక్షురాది జ్ఞానేంద్రియములయు, వచన = వాగాది కర్మేంద్రియములయు, మనః = మనోబుద్ధిచిత్తాహంకారము లను నంతరింద్రియములయు, భావనా + జ్ఞానంబులల్ = పదార్థములను గూర్చి తలంపు తెలివి అను రెండింటిని, ఏకరూపముల్ = ఒక తీరున నుండునట్లు, కావించి = ఒనరించి, వితత... రసికుండవు - వితత = విస్తారమైనదియు, అపరిమిత = పరిమితిలేనిదియు, అనుపమిత = తనకు వేఱొకటి యుపమింపఁ బడనిదియు, పరమ = ఉత్తమమైనదియు నగు, ఉపరతి - "విహితానాం కర్మణాం విధినా పరిత్యాగ ఉపరతిః" అనుటచే యథావిధిగా నాచరింపఁబడినకర్మల నెల్ల భగవదర్పణము చేయుట యుపరతి యనఁబడు లక్షణము గల చిత్తవిశ్రాంతిచేనైన, పురుషాయితముచేనైన అనియు నర్థము; సుఖ = సంతోషమునందు, రసికుఁడవు = అభిరుచి గలవాఁడవు, సమ + ఆత్మ + రతుండవు = "యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః" అనుటచే సర్వసమానమగు నాత్మప్రీతి గలవాఁడవు ననియు సమానమైన సురతము గలవాఁడవు అనియు నర్థము. సమ్...వు - సంస్పృష్ట = అంటఁబడిన, అత్యంత = మిక్కిలి, మర్మ = రహస్యములైన, స్థానుండవు = ప్రదేశములు గలవాఁడవును, గోప్యము లగు కుచ జఘన నితంబములు మొదలగువానిని స్పృశించినవాఁడవు ననియు నర్థము. సమ్...మండలుండవు - సందర్శిత = బాగుగఁ

బరికింపఁబడిన, అనంత = పెక్కులగు, కళా = చైతన్య కళలయొక్క, మండలుండవు = సమూహము గలవాఁడవును, సరిగఁ గనుఁగొనబడిన కళా శాస్త్రోక్తము లగు స్త్రీలయొక్క సురతకళావిశేషములు గలవాఁడవు నని యర్థము. ప్రగళిత + బిందుండవును = యోగాభ్యాసపరిపాకమువలన బ్రహ్మరంధ్రమునుండి జాఱ్పఁబడిన యమృతబిందువు గలవాఁడవును "బ్రహ్మరంధ్ర ప్రచ్యుతేన యోగాభ్యాస బలా న్మునిః । సుధారసేన సంతృప్తః క్షుద్బాధారహితో భవేత్" అని యోగచింతామణి; రత్యంత మున జాఱిన రేతస్సు గలవాఁడవు నని యర్థము. ఐ = అగుము, ఆనం దింపుము = సుఖింపుము.

తా. అట్లు ప్రబోధ చంద్రోదయ మైనతఱిని సుషుమ్నా నాడీమధ్య ప్రదేశ మనియెడు నంతిపురంబునఁ దురీయావస్థ యనియెడు పాన్పునందు, చిద్రూపమగు హంసయొక్క నడక గలదియు, చూచుటకు నలవికాని చిత్కళలయొక్క లావణ్యముచే నొప్పుచున్నదియు, మూలాధారచక్ర మనియెడు కాలియందెలు గలదియు, స్వాధిష్ఠానచక్ర మనియెడు చిఱుగంట లతోఁ గూడిన మొలపట్టెడ గలదియు, మణిపూరకచక్ర మనియెడు గోవు ట్రాడు గలదియు, డెందమున నెలకొన్న యనాహతచక్ర మనియెడు రత్నా లంకరణములచే నలంకరింపఁబడినదియు, గళమునందుఁ జెలువొందుచున్న విశుద్ధ చక్ర మనియెడు మంగళసూత్రముచే నొప్పుచున్నదియు, నెన్నొ దుటఁ గ్రాలుచున్న ముకుళాకారమగు నాజ్ఞాచక్రమనియెడు పాపటబొట్టు పొ బగు మీఱుచున్నదియు, వేవెలుంగు రేవెలుంగుల బింబములను గర్ణభూష ణములజతచేఁ జెన్ను మీఱు చున్నదియు, జిగజిగ మని మెఱయుమెఱుపుఁ దీవ కెన యగుమేనుఁ గలదియు, రజోగుణ తమోగుణ మిశ్రితముగాని కేవల సత్త్వగుణ మనియెడు హొంబట్టుపుట్టమును మేలిముసుఁగు వేసికొ నదియు, సత్యమును, పరిశుద్ధ చైతన్యమును, సంతోషమును నిజస్వరూప ముగఁ గలదియునైన ముక్తియనియెడు మగువను, (అభిగమనము, ఉప

దానము, ఇజ్య, స్వాధ్యాయము, యోగము, అనెడి యైదువిధము లగు భగవదుపాసనములలో) పరమపురుషానుసంధానరూప మగు యోగమును, పంచవిధోపాసనా సముచ్చిత మగు విజ్ఞానము ననియెడు చేయిదోయిచే బిగువుగఁ గౌఁగిలించుకొని, చిణీప్రభృతు లగు దశవిధప్రణవనాదము లనియెడు కడియములయు మొలపట్టెడ చిఱుమువ్వలయు, కాలియందెలయు మ్రోఁతలును, అవ్యక్తమధురమగు రతికూజితము లోనుగాఁ గల నినదములు వెలయుచుండ; "తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రభాషణం। ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదు ర్బుధాః" అనుటచే భగవత్తత్త్వచింతనము లోనుగాఁగల బ్రహ్మాభ్యాసమువలనఁ గలిగెడు ప్రబోధచే నైన నిరతిశయానంద మనియెడు జుంటిమోవి పానకము నానుచుఁ బురుషోత్తమునందలి చిత్తవిశ్రాంతి యనియెడు చిఱుచెమట యంకురింపఁగా; మెలఁకువచే నొప్పెడు ఖేచరి లోనగు ముద్రలచేఁ జూడఁదగిన పరబ్రహ్మవిషయకము లగు చతుర్దశేంద్రియ వ్యాపారములను, ఇంద్రియ జన్యజ్ఞానములను నొకటిగాఁ జేసి (ఏకతత్త్వానుసంధానరూపముగ నొనరించి) అట్లు గావించుటయే స్వరూపముగఁ బరమోపరతిసౌఖ్యము ననుభవించుచుఁ జిదచిదాత్మకంబగు సర్వమును వాసుదేవమయము గాన నన్నిటియందు సమానమగు నాత్మభావన గలవాఁడవై, పరమరహస్యభూత మగు పరవాసుదేవతత్త్వము నెఱింగి చిత్కళావిశేషముల నెల్లఁ గనుఁగొనుచు యోగబలంబున స్రవించెడు నమృతబిందువును గ్రోలుచు నఖండానందము ననుభవింపుము. ౧౫౧

ఆ. ఆత్మరతిని మరగి ‡ యంతంత కుపరతి
సుఖములను జెలంగి ‡ సురుచిరాత్మ
సమరతులను బొంగి ‡ సంపూర్ణ కామత
రాజభోగి వగుము ‡ రాజయోగి! ౧౫౨

టీ. రాజయోగీ! = విజ్ఞానయోగ నిరతుండ వగు మారుతతనయా! ఆత్మ = హేయప్రత్యనీకాసంఖ్యేయాపహత పాప్మత్వాది కళ్యాణగుణ విశిష్టుం డగు పరమాత్మునందు, రతిని = నిరతిశయ ప్రేమరూపం బగు భక్తిని, మరగి = నిరంతరాభ్యాస బలమున నలవాటుపడి, అంతకుఁ + అంతకుఁ = ఓలిని, ఉపరతి - సుఖములఁ = సకలేంద్రియ వ్యాపార ములను బురుషోత్తమునందుఁ జేర్చుటచేఁ గలిగెడు సౌఖ్యములచేత, చెలంగి = ఒప్పి, సు...లను - సురుచిర = ఒప్పిదములగు, ఆత్మ + సమ= తనయందలి ప్రేమతో నమానము లగు, రతులఁ = భగవంతునియందలి ప్రేమలచేత, పొంగి = తనివొంది, సంపూర్ణ + కామతఁ = పొందఁ బడిన కోరికలెల్లఁ గలుగుటచేత, రాజభోగివి = మహారాజభోగము గల వాఁడవు, అగుము = కమ్ము, సర్వస్వాతంత్ర్యము గలిగి దినదినాభివృద్ధిగ సమస్త వైభవయిశానందములచే నొప్పుచుఁ దనతోఁబాటుగఁ దన ప్రజల యందుఁ బ్రీతి గలిగి సమస్తమనోరథములను బడసిన మహారాజుయొక్క భోగము గలవాఁడ వనియు నర్థము.

తా. జ్ఞానయోగతత్పరుండ వగు పవనతనయా! లోకోత్తరములు నసంఖ్యేయములు సత్యసంకల్పత్వము మొదలైన సకల కళ్యాణగుణములు గల పురుషోత్తమునందలి నిరతిశయభక్తికి నలవాటుపడి క్రమక్రమముగ సక లేంద్రియ వ్యాపారములను భగవంతునియందుఁ జేర్చుటవలనఁ గలిగెడు పరమసుఖమును బడసి సర్వాత్మభావనచే నగు సంప్రీతిచే నుప్పొంగుచుఁ బొందఁబడిన సకలమనోరథములు గలుగుటచే మహారాజభోగివి కమ్ము.

ఆ. ఫాలమునను దృష్టిఁ బైఁ గుండలీంద్రుండు
మస్తకమునఁ జంద్రమండలంబు
నమర నమృతమయత హతధర్మకామార్థ
పరుఁడ వగుము త్రిపురహరుఁడ వగుచు.

టీ. ఫాలమునన్ = నుదుటియందు, దృష్టి = ఖేచరీముద్రచేతఁ గూర్పఁబడిన చూడ్కియును, "విరూపాక్ష స్త్రిలోచనః" అనుటచేఁ లలాటమునందు దృష్టియు నని శివపరమగు నర్థము; పైన్ = ఆ చూడ్కికి మీఁదుగ, కుండలీంద్రుండు = సర్పాకారముగ మూఁడుచుట్లు చుట్టుకొని యున్న కుండలిని యను శక్తివిశేషమును, శివుఁడు పన్నగభూషణుఁడు గనుక శిరస్సుపై నాగరాజు ననియు నర్థము. మస్తకమునన్ = బ్రహ్మరంధ్ర సమీపమున, చంద్రమండలంబు = శుద్ధసత్త్వగుణ మయ మైన యిందుబింబమును, "శంకర శ్చంద్రశేఖరః" అనుటచేతఁ దలపై జందమామయు నని శివపరమైన యర్థము. అమరన్ = తగియుండఁగా, త్రిపుర + హరుఁడవు = స్థూలసూక్ష్మకారణశరీరముల మూఁడిటిని మీఱినవాఁడవు, అగుచున్ = ఐ - త్రిపురాంతకుఁడగు శివుఁడవై యనియు నర్థము. అమృతమయతన్ = నిత్యముక్తుఁడ వగుటచేత, శివుఁడు విషపానమును జేసెనుగాన విషప్రాచుర్యముచేత ననియు నర్థము. హత...పరుఁడవు - హత = విడువఁబడిన, ధర్మకామార్థ = ధర్మము కామము అర్థము అను త్రివర్గమునందు, పరుఁడవు = తాత్పర్యము గలవాఁడవు, అగుదు = అయియుండుదు. భగవద్భక్తాగ్రగణ్యుఁ డగు నీశ్వరుఁ డతులవైరాగ్యసంపన్నుఁడు గావున ధర్మార్థకామములయందు ఆసక్తి లేనివాఁ డనియు నర్థము.

తా. ఖేచరీముద్రచే నుదుటియందు నిలుపఁబడిన చూడ్కియు, నా చూడ్కి మీఁదుగ బ్రహ్మనాళమునం గుండలిని యనుశక్తియు, సహస్రారమునందు నమృతమయమగు మండలమును వెలయుచుండఁగా స్థూలసూక్ష్మకారణశరీరాభిమానమును మాని నిత్యముక్తుఁడ వగుటచే ధర్మార్థకామములను విడిచినవాఁడవై ఫాలాక్షుండును, నాగభూషణుండును, చంద్రశేఖరుండును, కాలకూటభక్షకుండును, పరిత్యక్తధర్మార్థకామ ఫలాపేక్షుండును, పరమభాగవతుండు నగు సదాశివునివలె నుందువు. ౧౫౩

ఆత. తొలుత ననాదికాలకృతదుష్కృతపుణ్యవిమిశ్రకర్మకో
వి. టులనుసమిచ్చయంబులఁగడున్భసితంబుగఁజేయుచున్సము
జ్జ్వలసదఖండచిద్వర సువర్ణమయామలదివ్యవహ్నిమం
డలము వెలుంగు నంతట విడంబితహృద్గగనాంతరంబునన్.

టీ. సమ్...మండలము - సముజ్జ్వల = యోగాభ్యాసబలముచే మిక్కిలి ప్రజ్వరిల్లుచున్నదియు, సత్ = చిత్తమలములెల్లఁ బోవుటచేఁ బరిశుద్ధమైనదియు, అఖండ = భగవదాకారమును బొందుటచే దేశకాలవస్తుకృతపరిచ్ఛేదము లేనిదియు నగు, చిత్ = యోగిచైతన్యమనియెడు, వర = ఉత్తమమైన, సువర్ణమయ = కాంచనప్రచురమయిన, అమల = పరిశుద్ధమగు, దివ్య=దేదీప్యమానమగు, వహ్నిమండలము = వైశ్వానరమండలము, తొలుతన్ = మొట్టమొదట, అనాది...కోటులు-అనాది = మొదలులేని, కాల = తటినుండియు (పెక్కుపుట్టువులనుండియు), కృత = ఆచరింపఁబడిన, దుష్కృత = దురితరూపములును, పుణ్య = సుకృతరూపములును, మిశ్ర = పుణ్యపాపసముచ్చయరూపములును నగు, కర్మ = క్రియలయొక్క, కోటులు = గములు, అను = అనఁబడు, సమిత్ = కట్టెలయొక్క, చయంబులన్ = సమూహములను, కడున్ = నిశ్శేషముగ, భసితంబుగన్ = భస్మమగునట్లు, చేయుచున్ = ఒనరించుచు, విడంబిత - హృత్ - గగన - అంతరంబునన్ = పరవాసుదేవు ననుసరించిన చిత్తమనియెడు నాకసము నడిపట్టునందు, అంతటన్ = అప్పుడు, వెలుంగున్ = భాసిల్లును.

తా. అటుపిమ్మట పూర్వోక్తహృదయాకాశమునందు యోగాగ్నిచే దేదీప్యమానమును, కామక్రోధాది కలుషరహితమును, భగవత్ప్రాప్తిచే నఖండాకారము నగు యోగిచైతన్యరూపమగు సర్వోత్తమ మైనదియు, కరఁగిన బంగరువడువున తళతళమని వెలుఁగుచున్న యగ్నిమండలము, మొదటఁ బెక్కుపుట్టువులనుండియు నొనరింపఁబడిన పాపరూపములు

పుణ్యరూపములు పాపపుణ్యమిశ్రరూపములు నగు కర్మకోటు లనియెడు కట్టెలపోకను బూడిదయగునట్లు నిశ్శేషముగాఁ గాల్చి, భాసమాన మగుచుఁ గన్పట్టును. ౧౫౪

మ. ఉరురాగాదిగుణాజసంఘమునసనాద్యోంకారమంత్రంబుచే
త రయం బారవధించి యాత్మవిషయేధ్మశ్రేణితోఁ గూడఁ జె
చ్చెర నానావిధవాసనాజ్యములతోఁ జిద్వహ్నిమధ్యంబునన్
వరుస న్వ్రేలిచి సౌఖ్యసోమరసపానం బంతఁ గావింపవే.

టీ. ఉరు ..సంఘమున్ - ఉరు = పెక్కుపుట్టువులనుండియుఁ బెచ్చుపెరిఁగియున్న, రాగ = కామక్రోధలోభమోహమదమాత్సర్యములు, ఆది = మొదలగు, గుణ = అజ్ఞానగుణములనియెడు, అజ= మేఁకలయొక్క, సంఘమున్ = మందను, అనా... చేన్ - అనాది = పరమపురుషాత్మక మగుటచేఁ దనకు నాదికారణములేని, ఓంకార = ప్రణవ మనియెడు, మంత్రంబు చేతన్ = మూలమంత్రముచేత, రయంబు - ఆరన్ = కడువేగ ముగ, వధించి = సంహరించి, చిత్ - వహ్ని - మధ్యంబునన్ = చిద్రూప మగు పూర్వోక్తవైశ్వానరమండలమునడుమను, ఆత్మ...తోన్ - ఆత్మ = చిత్తవృత్తికి, విషయ = గోచరములగు పదార్థములనియెడు, ఇధ్మ=సమిధల యొక్క, శ్రేణితోన్ = సమూహముతో, కూడన్ = కలియునట్లుగ, చెచ్చెరన్ = మిగుల శీఘ్రముగ, నానా...తోన్-నానావిధ = పెక్కు తెఱంగులనున్న, వాసనా = "వాసనా ద్వివిధాప్రోక్తా శుద్ధాచ మలినా తథా" అనుటచేత శుద్ధములు మలినములు నగు చిత్తసంస్కారములనియెడు, ఆజ్యములతోన్ = నేతులతో, వరుసన్ = విధ్యుక్తక్రమముగ, వ్రేలిచి= హుతము గావించి, సౌఖ్య...పానంబు-సౌఖ్య=పరమపురుషప్రాప్తివలనఁ గలుగుసుఖ మనియెడు, సోమరస = సోమలతారసముయొక్క, పానంబు= త్రాగుటను, కావింపవు - ఏ = ఒనరింపుమీ.

తా. యోగాభ్యాసపాటవముచే నట్లు చిద్రూపమగు నగ్నిమండలము గోచరమయినపిమ్మట, పెక్కుపుట్టువులనుండియుఁ బెరిఁగియున్న కామము క్రోధము మొదలగు మలినవాసనాగుణము లనియెడుపెక్కుమేఁకలను, భగవద్రూప మగుటచే ననాదియగు ప్రణవరూపమైన మహామంత్రముచేత బిరబిర సంహరించి ఇంద్రియగోచరము లగు శబ్దాదివిషయము లనియెడు సమిధలతోఁగూడఁ బలువిధములగు చిత్తసంస్కారము లనియెడు ఘృతము లతో నాచిదగ్నిమండలకుండమధ్యమునందు కర్మకాండోక్తరీతి నాహుతిఁ జేసి నిరతిశయానంద మనియెడు సోమరసముయొక్క పానముఁ గావింపుము.

తే. అమ్మహోజ్జ్వలసూర్యసోమాగ్నిమధ్య
సీమయం దంతఁ గనుపట్టు శీతధామ
చండధామానలాత్మకాఖండధామ
మండలాదిహిరణ్మయమండలంబు. ౧౫౬

టీ. అంతక్ = తరువాత, ఆ...యందుక్ - ఆ = మీఁదఁ జెప్పఁబడినట్టి, మహత్ = మిక్కిలి, ఉజ్జ్వల = దేదీప్యమానమగు, సూర్య + సోమ + అగ్ని = సూర్యుఁడు చంద్రుఁడు వహ్నియు నను వీనియొక్క, మధ్యసీమయందుక్ = మధ్యప్రదేశమునందు, శీత...మండలంబు - శీత ధామ = చలివెలుఁగు, చండధామ = వేఁడివెలుఁగు, అనల - అగ్ని (చంద్ర సూర్యాగ్నులు), ఆత్మక = స్వరూపముగఁ గల, అఖండ = తెంపులేని, ధామ = తేజస్సుగల, మండల = బింబములకు, ఆది = మూలకారణమగు, హిరణ్మయ = సువర్ణమయమైన, మండలంబు = బింబము, కనుపట్టుక్ = గోచర మగును.

తా. పూర్వోక్తములగు ద్వాదశకళాత్మకమగు సూర్యమండలము యొక్కయు, షోడశకళాత్మకమగు చంద్రమండలముయొక్కయు, దశకళాత్మక మగు నగ్నిమండలముయొక్కయు, మధ్యప్రదేశమునందు స్వ

సూర్యచంద్రాగ్నిమండలములకు మూలకారణ మగు కనకమయమండలము గనఁబడును. ౧౫౬

సీ. మహనీయవైశాఖ మధ్యాహ్నకాల సం
కలితమార్తాండమండలముపగిదిఁ
జారునిర్మలశరజ్జ్యోత్స్నమయరాకాసము
జ్జ్వలపూర్ణచంద్రమండలముపగిదిఁ
దప్తహేమాభిదీప్తజ్వాలికాజాల
విలయకాలాగ్నిమండలమురీతి
నీలతోయదమధ్య నిర్గతకమనీయ
వితతసౌదామినీ లతికభాతి

గీ. బరఁగి నీవారశూకంబుకరణి సూక్ష్మ
మై విమలమై యవర్ణమై యప్రమేయ
మై యచింత్యప్రకాశమై యలరుచుండుఁ
జండరుచుల హిరణ్మయమండలంబు. ౧౫౭

టీ. మహనీయ...పగిదిన్ - మహనీయ=మిగులఁ దీక్ష్ణమైన, వైశాఖ=వైశాఖమాసముయొక్క, మధ్యాహ్న = పట్టపగటి, కాల = సమయము నందు, సంకలిత = మిక్కుటముగ వెలుఁగుచున్న, మార్తాండ = సూర్యుని యొక్క, మండలము = బింబముయొక్క, పగిదిన్ = రీతిని, చారు... పగిదిన్ - చారు = మనోహరమై, నిర్మలమేఘాడంబరము లేకపోవుటచేఁ దేటదేరిన, శరజ్జ్యోత్స్నమయ = శరదృతువునందలి, రాకా = నిండుపున్నమ యందు, సముజ్జ్వల = కడు వెలయుచున్న, పూర్ణ = పదియాఱుకళలతోఁ గూడిన, చంద్ర = చందురునియొక్క, మండలము = బింబముయొక్క, పగిదిన్ = పోలుపునను, తప్త...రీతిన్ - తప్త = పుటమువేయఁబడిన, హేమ = మేలిపసిండివడువున, అభిదీప్త = ప్రజ్వరిల్లుచున్న, జ్వాలికా=

మంటకొనలయొక్క, జాల = జగములుగల, విలయ + కాల = కల్పాంత సమయమునందలి, అగ్ని + మండలము = అగ్నిమండలముయొక్క, రీతిన్ = విధమునను, నీల...భాతిన్ - నీల = నీలవర్ణముగల, తోయద = మొగులుయొక్క, మధ్య = మధ్యభాగమునుండి, నిర్గత = వెడలిన, కమనీయ = ఇంపైన, వితత = అంతట నల్లుకొనిన, సౌదామినీ + లతిక = తీఁగెను బోలిన మెఱపుయొక్క, భాతిన్ = ఒప్పుచేతను, పరఁగి = తగి, "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" అను శ్రుత్యర్థము నిచట గమనించునది, నీవార + శూకంబు + కరణిన్ = వరిగింజకొన తెఱంగున, సూక్ష్మము - ఐ = కడుఁజిన్నదియై, "నీవారశూకవత్తన్వీ" అనువేదార్థమిచ్చో నను సంధించునది, విమలము - ఐ = స్వచ్ఛమై, అవర్ణము - ఐ = నలుపు తెలుపు మొదలగు రంగులు లేనిదై, అచింత్య + ప్రకాశము-ఐ=ఇట్టిది యని తెలిసికొనుటకు వీలులేనివెలుఁగు గలదై, చండ + రుచులన్ = తీక్ష్ణములగు దీప్తులచేత, హిరణ్మయ-మండలంబు = స్వర్ణమయమగు మండలము, అలరుచున్ - ఉండున్ = వెలుఁగొందుచుండును.

తా. మంచువేసవితటి పట్టపగలింటిభానుమండలము భాతిని, శరత్కాలమునందలి నిండుపున్నమనాఁటిచంద్రమండలము భంగిని, పుటము వేయఁబడిన పండ్రెండవన్నె బంగారుపగిదిని, మండుచున్న మంటలు గల కల్పాంత కాలానలముయొక్క మండలముచందమునను, క్రొక్కారు మొగుళ్ల నడుమ నుండి మిఱుమిట్లు గొలుపుచు వెలువడిన మెఱపుఁదీఁగ తెఱఁగునను, విలసిల్లుచు నివరిధాన్యపు మొలక పోలుపున మిగులఁ జిన్నదియు స్వచ్ఛమైనదియు, నలుపు తెలుపు మొదలగు రంగులు లేనిదియు, నింతంతయను నొకపరిమాణము లేనిదియు (మేర లేనిదియు), ఇట్టిది యని తెలియుటకు వీలులేని వెలుఁగు గలదియు నగుచు బంగారువికారమగు నొండొక మండలము ఉత్కటములగు ప్రభలతోఁ బ్రకాశించుచుండును.

క. అది యాపోజ్యోతి యనం
గదలక ద్విదళమునఁ దనరుఁ గళ యామీఁదన్
మొదలిటివెలుఁగు వెలుఁగు న
ల్లదె యాత్మారామతత్త్వ మగు ననిలసుతా. ౧౫౮

టీ. అనిల-సుతా = సమీరకుమార, అది = ఆ కనకమయమండలము, ద్విదళమునన్ = రెండురేకులు గల భ్రూమధ్యమునందలి పద్మమునందు, ఆపోజ్యోతి - అనన్ = ఆపోజ్యోతి యను పేరుతో, కళ = ఒండొక చిత్కళ య్యై, కదలక = నివాతప్రదేశమునందలిదీపమువలె చలింపక, తనరున్ = ప్రకాశించును; ఆ మీఁదన్ = ఆ కళకు పైని, ఆమొదలిటి వెలుఁగు = సమస్తమునకు నిమిత్తోపాదానహేతువైన పురుషోత్తమతేజస్సు, వెలుఁగున్ = తేజరిల్లును, అల్లది - ఏ = ఆ భగవత్తేజమే, ఆత్మ = తనకు శేష భూతమగు చిదచిద్వర్గమునందు, ఆత్మారామ = అంతర్యామిస్వరూపముచే విహరించెడు భగవంతునియొక్క, తత్త్వము = పారమార్థికరూపము, అగున్ = అయియుండెను. "తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" అను శ్రుత్యర్థము నిచ్చట సందర్శించుకొనవలయును.

తా. ఓ పవమాననందనా ! ఆ కాంచనమండలము భ్రూమధ్యము నందలి రెండురేకులు గల యాజ్ఞాచక్రమునందు ఆపోజ్యోతి యనఁబడుచుఁ జలనము లేని యొకచైతన్యకళావిశేషమై యొప్పును. దానికిఁ బైఁగా నిఖిలకారణం బగు భగవత్ప్రకాశము వెలంగును. ఆ ప్రకాశమే సర్వాంతర్యామి యగు పరమాత్ముని స్వరూపము. ౧౫౮

మత్తకోకిల.

కోటిసూర్యులు కోటిచంద్రులు గోటికోటితటిల్లతల్
సూటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చినరీతి న

మ్మేటివెల్గుఁ దగంద్రికూటముపైమీఁదఁజూడుము దృశ్యముల్
దాఁటిమాయను మాటిమాటికిఁ బాల్మిచే నటుమీటుచున్.

టీ. దృశ్యముల్ = కార్యకరణ సంఘాతాత్మకం బగు నీప్రాపంచికవిషయజాతము నంతయును, దాఁటి = ఇదియే సత మనుకొనక యతిక్రమించి, మాయను = మూలాజ్ఞానమును, అటు = దవ్వుగఁ బైకి, మీటుచున్ = తూలఁగొట్టుచు, కోటిసూర్యులు = కోటిసంఖ్యగల యాదిత్యులు, కోటిచంద్రులు = కోటిలెక్క గల చంద్రులును, కోటికోటి = పెక్కుకోట్లలెక్క గల, తటిత్ + లతల్ = మించుతివ్వలును, సూటిగాన్ = తిన్నగను, పరిపాటిగాన్ = వరుసగను, ఒకచోటన్ = ఒక్క స్థలమునందు, నిల్చిన - రీతిన్ = కలసియున్నయట్లు, ఆ మేటి - వెల్గున్ = పూర్వోక్తాత్మారామతత్త్వాత్మక మగు నఖండ తేజస్సును, త్రికూటము - మీఁదన్ = ఇళాపింగళాసుషుమ్నా నాడులు మూఁడును కలసినచోటగు సహస్రారమునందు, తగన్ - చూడుము = బాగుగఁ బరికింపుము.

తా. ఓ యాంజనేయా! నీవు పరిదృశ్యమానము లగు శబ్దాదివిషయములయందు సక్తతను విడిచి సంసారమునకు మూలకారణమగు నజ్ఞానమును ప్రతిపదమునందు నావరించుచున్నను దానిని పరమోపశాంతిచేఁ దూలఁదోలుచు పెక్కుసూర్యులు పెక్కుచంద్రులు లెక్క కెక్కుడగు మెఱుపులు నొకచోటఁ గలసి వెలుఁగుచున్నయట్లున్న సర్వకారణ మగు నా భగవత్ప్రకాశమును యోగదృష్టిచే సహస్రారకమలమునందుఁ గనుఁగొనుము. ౧౫౯

వ. ఇట్లు భ్రూమధ్యవీథియందలి హృదయాకాశంబునం గనిపించు వియన్మండల తమోమండల మేఘమండల విద్యున్మండల తారామండల జ్యోతిర్మండల సూర్యమండల చంద్రమండల వహ్నిమండల హిరణ్మయమండలంబు లను ద్వాద

విధమండలంబులును, బూర్వోక్త దశవిధనాదంబులును, వక్ష్యమాణబిందుకోశాత్మకహంసతత్త్వంబును, మహాకాశమధ్యంబునం గనిపించు జీమూతంబులచందంబున నెవ్వనియందుఁ దోఁచు ననిలాదిభూతచతుష్టయంబునుఁ దత్కార్యంబులను నంటని మింటిపగిది నిన్నింటి నెవ్వం డంటకుండు నాదిత్యుం డఖిలరూపంబులఁ బ్రకాశింపం జేయుకైవడి నెవ్వండు చిన్మాత్రుం డై యన్నింటి వేర్వేఱ విభజించి యెఱుంగు నతండ యీబిందునాదకళాతీత స్వప్రకాశ నిత్యశుద్ధ బుద్ధ ముక్త పరిపూర్ణ సచ్చిదానందస్వరూప ప్రత్యగభిన్న పరమాత్మారాముం డగు; విశుద్ధ సత్త్వప్రధానయుఁ, బరమవైరాగ్య బోధోపరతిస్వరూపిణిని, బిందునాద కళాత్మికయుఁ, గేవల బ్రహ్మాత్మైక్య విషయమయును నైన నన్నాశ్రయించి యద్వితీయాపరోక్ష బ్రహ్మచైతన్యస్వరూపకుం డైన యీ యాత్మారామునియం దాత్మాకారాకారితవృత్తిగతచిదాభాసకుండ వై నసీవు ప్రచండాతపమధ్య నిక్షిప్త దీపకలికవిధంబున జ్ఞానకర్మేంద్రియ పవన మనోవృత్తివిలయపూర్వకంబుగా నేకీభూతుండ వై నివాతదీపంబు భంగి, నిస్తరంగ సముద్రంబుపోలిక, విగతాశేష వర్ణపాదపంబు చాడ్పున, నీలపీతాదివర్ణ శూన్యగగనంబు కరణి, స్వప్నజ్ఞాన పునరుత్థానవిరహిత సుషుప్తిరీతి నిశ్చలుండవు నిశ్శేషుండవు నిశ్శబ్దుండవు నిర్వికల్పనిరాకార సుఖస్వరూపుండవు నై బాహ్యాభ్యంతరములు మఱచి నిరుపమరాజయోగ తురీయ సమాధిం బొందు మని యుపదేశించి వెండియు ని ట్లనియె. ౧౬౦

టీ. ఇట్లు = మీఁదఁ జెప్పినరీతిని, భ్రూ...నన్ - భ్రూమధ్య = కనుబొమలనడిప ట్టనియెడు, వీథియందలి = మార్గమునం దున్న, హృదయాకాశంబునన్ = హృదయాత్మకమగు నాకసమునందు, కనుపించు...లును-కనుపించు = లక్ష్యాభ్యాసబలముచేఁ దోఁపట్టెడు, వియన్మండల = గగనమండలము, తమోమండలము = అంధకారరూపమగు మండలము, మేఘమండలము = జీమూతమయమగు మండలము, విద్యున్మండల = మెఱపులమండలము, తారామండల = చుక్కలమండలము, జ్యోతిర్మండల = అఖండతేజోమయ మగు మండలము, సూర్యమండల = ఆదిత్యమండలము, చంద్రమండల = ఇందుమండలము, వహ్నిమండల = వైశ్వానరమండలము, హిరణ్మయమండలంబులు = బంగారువికార మయిన మండలమును, అను దశవిధ = అను పేరులతోఁ బదివిధములయిన, మండలంబులును = తత్తన్మయములగు ప్రదేశములును, పూర్వ-ఉక్త-దశ-విధ-నాదంబులును = మునుపు చెప్పఁబడిన చిణి మొదలగు పదితెఱంగులం దగు ప్రణవస్వనంబులును, వక్ష్య...బును = వక్ష్యమాణ = క్రిందఁ జెప్పఁబడు, బిందు = చిద్బిందువునకు, కోశాత్మక = కోశమువలె నావరించియున్న మనో బుద్ధి చిత్తాహంకారరూప మగు, హంస + తత్త్వంబున్ = జీవస్వరూపంబును, మహత్ + ఆకాశ + మధ్యంబునన్ = భూతాకాశము యొక్క నడుమను, కనిపించు = చూడఁబడెడు, జీమూతంబుల = మొగుళులయొక్క, చందంబునన్ = రీతిని, ఎవ్వనియందున్ = ఏ పరమ పురుషునియందు, తోఁచున్=తోఁపట్టునో, అనిల - ఆది - భూత - చతుష్టయంబున్ = వాయువు లోనుగాఁ గల నాల్గుభూతములును (పుడమి - నీరు - వెలుఁగు - గాలి), తత్ - కార్యంబులన్ = ఆ నాల్గుభూతముల గుణము లగు వాసన, రుచి, రూపము, స్పర్శము మొదలగువానిని, అంటనిమింటి - పగిదిన్ = తాఁకకయుండు నాకసముపోలువున, ఇన్నింటికిన్ = =మీఁదఁ జెప్పిన దశవిధమండలములను దశవిధనాదములను మనోబుద్ధి

చిత్తాహంకారాత్మక మగు జీవస్వరూపమును, ఎవ్వఁడు = ఏ పురుషోత్తముఁడు, అంటక - ఉండుక్ = తాదాత్మ్యమును బొందక సాక్షిభూతుఁడై యంతర్యామి రూపమున నుండునో; ఆదిత్యుండు = సూర్యుఁడు, అఖిల - రూపంబులక్ = సమస్త పదార్థములను, ప్రకాశింపఁజేయుంకై వడిక్ = కనఁబడునట్లు కావించెడువడువున, ఎవ్వఁడు = ఏ భగవంతుఁడు, కేవల చిద్రూపుఁడు - ఐ = శుద్ధ చిన్మాత్రాకారుఁ డగుచు, ఇన్నింటిక్ = పరిదృశ్యమానములగు నీవస్తువుల నెల్ల, వేర్వేఱక్=ఏర్పడునట్లు, విభజించి = పంచి, ఎఱుంగుక్ = గుర్తెఱుఁగునో అతండ = ఆ పరమాత్ముఁడే, ఈ...రాముండు - ఈ=రామచంద్రరూపమున మన కిట్లు ప్రత్యక్షముగఁ గన్పట్టుచున్న, బిందు - నాద - కళా - అతీత = చిద్బిందువు, దశవిధ ప్రణవనాదములు సూర్యచంద్రాగ్ని కళలు - వీనికంటెఁ బరుండును, స్వ + ప్రకాశ = ఇతరాపేక్షలేక తనకుఁ దా వెలుఁగుచున్న వాఁడును, నిత్య = కాలత్రయాఽబాధ్యుఁడును, శుద్ధ = హేయగుణవర్జితుఁ డగుటచేఁ బరిశుద్ధుఁడును, బుద్ధ = బోధస్వరూపుఁడును, ముక్త= మాయామాయాకార్యవిముక్తుండును, పరిపూర్ణ = సర్వాంతర్యామి యగుటచే నంతట నిండియున్నవాఁడును, సత్ = సత్యమును, చిత్ = శుద్ధచైతన్యమును, ఆనంద = అఖండానందమును, స్వరూప = నిజాకారము గలవాఁడును, ప్రత్యగభిన్న = తనకు శేషభూతమగు ప్రత్యగాత్మకు వేఱుకానివాఁడునైన, పరమ = సర్వోత్కృష్టమగు, ఆత్మ = స్వస్వరూపమునందు, ఆరాముండు = క్రీడించువాఁడు, అగుక్ = అగును; విశుద్ధ - సత్త్వ - ప్రధానను = తమోగుణ రజోగుణ సంబంధములేమి నిర్మలమగు కేవల సత్త్వగుణమే ప్రధానముగఁ గలదానను, పరమ...స్వరూపిణిని - పరమ = అతులమగు, వైరాగ్య = "క॥ పరమేష్ఠి మొదలుగా స్థావరముదనుక విషయభోగ - వైరస్యముతోఁ। జిరజీవి రోఁతపై బలె విరక్తివైరాగ్య మదియ - విమలం బగుఁగా" అను లక్షణము గల విర

_క్రియు, బోధ, పరమాత్మవిషయక మగుజ్ఞానము, ఉపరతి = "విషయ సుఖములనుండి నివృత్తిజ్ఞానకారణం బగు నుపరతిగాఁ దనర్చు" అను లక్షణము గల యుపరతియు, స్వరూపిణిని = నిజస్వరూపముగఁ గల దానను, బిందు - నాద - కళా - ఆత్మికను=పూర్వోక్తములైన చిద్బిం దువు - పదివిధము లగు ప్రణవనాదములును - సూర్యచంద్రాగ్నికళలును - ఆకారములుగఁ గలదానను, కేవల = ప్రధానమగు, బ్రహ్మ = పరమ పురుషునకును, ఆత్మ = జీవాత్మకును, గల, ఐక్య = శేషిశేషభావముచే నగు నేకత్వముయొక్క, విద్యా = జ్ఞానము, మయను = ప్రచురముగఁ గలదానను, ఐన = అగు, నన్ను = సీతారూపమున నిట్లున్న నన్ను, ఆశ్ర యించి = అవలంబించి, అద్వి...కుండు - అద్వితీయ = ఉపాదాన నిమిత్తరూపమున సర్వాత్మక మగుటచేఁ దనకు రెండవది వేఱొండు లేని దియు, అపరోక్ష = స్వానుభవైకసిద్ధమైనదియు నగు, బ్రహ్మచైతన్య = భగవచ్చైతన్యమే, స్వరూపకుండు = నిజాకారముగఁ గలవాఁడు, ఐన = అగు, ఈ + ఆత్మారామునియందున్ = ఈ శ్రీరామచంద్ర భగవానుని యందు, ఆత్మ...కుండవు - ఆత్మ = పరమాత్మునియొక్క, ఆకార = స్వరూపముగ, ఆకారిత = భ్రమరకీటన్యాయముచేఁ బూర్వోక్తయోగా భ్యాస బలమున నొనర్పఁబడిన, వృత్తి = చిత్తవ్యాపారమునందు, గత = పొందిన, చిదాభాసకుండవు = జీవస్వరూపము గలవాఁడవు, ఐన - నీవు = అగునీవు, ప్రచండ...విధంబునన్ - ప్రచండ = కడుఁ దీక్ష్ణమగు, ఆతప= ఎండయొక్క, మధ్య = నడిపట్టున, నిక్షిప్త = పెట్టఁబడిన, దీప+కళిక= ప్రదీపపు మొలకయొక్క, విధంబునన్ = రీతిని, జ్ఞాన...కాన్ = జ్ఞాన కర్మ - ఇంద్రియ = త్వగాది జ్ఞానేంద్రియములయు వాగాది కర్మేంద్రియ ములయు, పవన = ప్రాణాపానవ్యానోదానములయు, మనః=మనోబుద్ధి చిత్తాహంకారములయు, వృత్తి = శబ్దాది విషయజ్ఞానము యొక్కయు, విలయ = నాశము, పూర్వకంబుగాన్ = తోలుతఁ గలుగునట్లు, ప్రకి

భూతుండవు - ఐ = పరమపురుష తాదాత్మ్యముగ నుండినవాఁడ వై, నివాత + దీపంబు + భంగిన్ = గాలి లేనిచోట నున్న దివియపడువున, నిస్తరంగ + సముద్రంబు + పోలికన్ = కెరటములు లేని సంద్రము చందమునను, విగత...చాడ్పునన్ - విగత = రాలిన, అశేష = ఎల్ల, పర్ణ = పత్రములు గల, పాదపంబు = వృక్షముయొక్క, చాడ్పునన్ = వడువునను, నీల...కరణిన్ - నీల = నలుపు, పీత = పచ్చఁదనము, ఆది= లోనగు, వర్ణ = రంగులచే, శూన్య = విరహితమైన, గగనంబు = మింటి యొక్క, కరణిన్ = పోలుపునను, స్వప్న...రీతిన్ - స్వప్న + జ్ఞాన= కలయందుఁ దోపట్టుపదార్థముల తెలివిచేతను, పునరుత్థాన = ఆకలనుండి మేల్కాంచినపిదపఁ గలుగు జాగ్రదవస్థాజ్ఞానముచేతను, విరహిత=శూన్య మైన, సుషుప్తి = గాఢనిద్రయొక్క, రీతిన్ = తీరునను, (క్రమంబుగ) నిశ్చలుండవు = కదలుట లేనివాఁడవును, నిశ్శేషుండవు = నీకు భిన్నముగ వేఱొకటి లేనివాఁడవు, నిశ్శబ్దుండవు, (ఇచట శబ్దఅనుపదము స్పర్శరూప రసగంధములకు నుపలక్షకము గాన) ఇంద్రియాతీతుండ వగుటచే శబ్దాది విషయజ్ఞానము లేనివాఁడవును, నిర్వికల్ప = కల్పనారహితమైన, నిరాకార = రూపము లేని, సుఖ = మోక్షసుఖమే, స్వరూపుండవు = నిజ స్వరూపము గలవాఁడవును, ఐ = అగుచు, బాహ్య + అభ్యంతరములు = బాహ్యము లగు ప్రాపంచిక విషయములను, వాంతరము లగు మానసిక విషయములను, మఱచి = ఏమఱి, నిరుపమ...సమాధిన్ - నిరుపమ = ఈడులేని, రాజయోగ = జ్ఞానయోగమువలన సిద్ధించెడు, తురీయ = అవస్థాత్రయాతీత మగు భగవత్తత్త్వమునందలి, సమాధిన్ = అసంప్రజ్ఞాత సమాధిని, పొందుము = పడయుము; అని = ఈ రీతిని, ఉపదేశించి = తెలియఁజెప్పి, వెండియున్ = తిరుగ, ఇట్లు - అనియెన్ = చెప్పఁబోవు రీతిని పలికెను.

తా. ఇత్తెఱంగున భ్రూమధ్యదేశమునం దున్న చిదంబరంబునందుఁ జూపట్టునాకసము, కటికిచీఁకటి, మబ్బులు, మెఱపులు, చుక్కలు, వెలుఁగు, వేవెలుఁగు, రేవెలుఁగు, అగ్గి, పసిఁడి - అను నీ పదింటియొక్క మండలములును; లోఁగడఁ జెప్పఁబడిన పదితెఱంగులు గల ప్రణవనినాదములును; చెప్పఁబోయెడు చిద్బిందువునకు నావరణరూపమైన పరమహంస వస్తుతత్త్వమును, మహాకాశముయొక్క నడిపట్టునఁ గనుపట్టు మబ్బుల పగిది నే పరమపురుషునియందుఁ దోపట్టునో మఱియు గాలియు నగ్గియు నీరును పుడమియు నను నాల్గుభూతములయు తద్గుణంబు లగు స్పర్శాదులయు, సంపర్కము లేని యాకసమువడువున నే పురుషోత్తముండు దశవిధమండలములు దశవిధనాదములు మొద లగువాని సంబంధము లేక యుండునో; ఇంకను ప్రభాకరుండు పదార్థములనెల్ల వెలిఁగింపఁజేయు మాదిరి నేపరవాసుదేవుండు శుద్ధచైతన్యస్వరూపుఁడై సకలభువనములను భిన్నభిన్నముగఁ బంచి తెలిసికొనునో; ఆ భగవంతుఁడే పూర్వోక్త చిద్బిందువునకును, చిణిప్రభృతులగు నోంకార నినాదములకును, సూర్యాది కళలకునుఁ దైఁగఁ దనకుఁ దా వెలుంగుచుఁ గాలత్రయాబాధ్యంబునుఁ బరమపవిత్రంబును, బోధమయంబును, మాయామాయాకార్య విముక్తంబును, సర్వాంతర్యామియై యంతట నిండినదియు, అనృత జడదుఃఖ విలక్షణం బగు స్వరూపము గలదియు, సర్వసాక్షి చైతన్యమునకు వేఱుకానిదియు, సత్తమం బగు నాత్మతత్త్వమునందుఁ గ్రీడించు శ్రీమన్నారాయణుం డగును. రజస్తమోగుణముల సంబంధము లేని కేవల సత్త్వగుణమే ముఖ్యముగాఁ గలట్టియు, అతులవిరక్తియు, జ్ఞానము, పరమోపరమణము స్వరూపముగఁ గలట్టియు, పూర్వోక్త బిందునాద కళామయమును చిదచిదాత్మకం బగు సమస్తప్రపంచంబును పరవాసుదేవునకు వేఱు కాదను నేకత్వజ్ఞానమే స్వరూపముగఁ గల నన్ను (సీతను) అవలంబించి, తనకు రెండవది వేఱొండు లేనట్టియు, నిజానుభవైకసిద్ధమును నగు బ్రహ్మచైతన్యమే తన యాకార

ముగఁ గల యాత్మారాముం డగు నీ రామునియందు భ్రమరకీటన్యాయమున నిరంతర భావనచేఁ బరమాత్మస్వరూపముగ నొనర్పఁబడిన చిత్తవృత్తిని బొందిన చిత్ప్రకాశుండ వగు నీవు గడువేఁడిమి గల యెండలోనున్న చిన్నదీపము పగిదిని, పది యింద్రియములయు నైదు వాయువులయు మనస్సుయొక్కయు వ్యాపారరాహిత్యము కాఁగాఁ దాదాత్మ్యము నొంది, గాలి లేనిచోట నున్న దీపముచాడ్పున చలనము లేనివాఁడవును, కెరటములు లేని కడలివడువున సకల వ్యాపారవిరహితుండవును, రాలి పడిన యాకులెల్లఁ గల మ్రాఁకుపోలికను వాగాద్యాడంబరము లేనివాఁడవును, నలుపు తెలుపు మొదలగు రంగులు లేని చదలుచందమున నశేషకల్పనలును నాకారమును లేని నిరతిశయానందమయుఁడవును, జాగ్రత్స్వప్నములు లేని గాఢనిద్రయట్లు బాహ్యవృత్తులను నాంతరవృత్తిని మఱచి యీడులేని జ్ఞానయోగముచే సిద్ధించిన యవస్థాత్రయాతీతం బగు తురీయబ్రహ్మమునందలి యసంప్రజ్ఞాతసమాధిం బడయు మని బోధించి మఱియు నీ వడువున నుడివెను. ౧౬౦

తే. అట్టిపూర్ణసమాధిమనోఽనిలముల
చలన ముడుగక కాని గోచరము గాదు
అవియు బిందువుచాంచల్య మడఁగకున్న
నిశ్చలంబులు గావు వినిశ్చితాత్మ! ౧౬౧

టీ. వినిశ్చిత + ఆత్మా = ఓ దృఢచిత్తుఁడా!, అట్టి = పూర్వోక్తమగు, పూర్ణ = అసంప్రజ్ఞాతరూప మైన, సమాధి = తురీయబ్రహ్మనిష్ఠ; మనః = సంకల్పవికల్పాత్మక మగు చిత్తముయొక్కయు, అనిలముల = ప్రాణము మొదలగు గాలులయొక్కయు, చలనము = సంచారము, ఉడుగక కాని = నశింపక కాని, గోచరము కాదు = సిద్ధింపదు, అవియున్ = ఆ మనోవాయువులును, బిందువు - చాంచల్యము = చిద్బిందువుయొక్క

కదలిక, అడఁగకున్నన్ = నశింపకయున్నయెడల, నిశ్చలంబులు కావు= కదలక యుండవు.

తా. ఉపదేశించిన యంశమును దెలిసికొని యిది యిట్లని నిర్ణయించుటకుఁ దగినబుద్ధి గల పవనతనయా! మీఁదఁ జెప్పిన తురీయసమాధి మనోనిగ్రహమును వాయుధారణయుఁ గలుగకకాని సంభవింపదు. ఆ మనోవాయువులు, చిద్రూపమగు బిందువుయొక్క ప్రవృత్తి తగ్గకకాని చలనము లేకయుండవు; గాన, తొలుతఁ జిద్బిందువును వృత్తులయందుఁ బడకుండ నిలిపి క్రమంబున మనస్సును వాయువును నిగ్రహించి పరిపూర్ణసమాధిం బొందుము. ౧౬౧

అవ. ఇట్లు మనఃప్రాణనిరోధములకు బిందుచలననిగ్రహము కారణ మని చెప్పి బిందునిరోధమునకు నుపాయము నుపదేశించుచున్నది.

తే. అట్టిబిందువుచాంచల్య మడఁగ దెందు
హంసతత్త్వంబు నెఱుఁగక యట్లు గాన
దాని వివరింతు విను మది గానఁబడిన
గాలి బిందువు మనమునుఁ గదలకుండు. ౧౬౨

టీ. హంస-తత్త్వంబున్ = హంస—(హంసశబ్దమునందలి హకారము పురుషోత్తమవాచకము, సకారము మాయావాచకము, మధ్యనుండు బిందువు = మాయాప్రతిబింబితుఁ డగుజీవునిఁ దెలుపును గాన హంస యన మనోబుద్ధిచిత్తాహంకారములతోను ప్రాణము మొదలగు దశవిధవాయువులతోను గూడిన జీవుఁడు చెప్పఁబడును) జీవుని-యాథార్థ్యమును, ఎఱుఁగక= గుర్తెఱుఁగకయుండెనేని, అట్టి=మీఁదనుడివిన, బిందువు = మహత్తత్త్వము యొక్క, చాంచల్యము = కదలిక, ఎందున్ = ఎన్నఁడును, అడఁగదు= తగ్గదు, అట్లుకానన్ = అదిగనుక, దానిన్=జీవాత్మకమగు హంసయొక్క

తత్త్వమును, వివరింతుక్ = ఉపదేశించెదను, వినుము = ఆకర్ణింపుము, అది = ఆ జీవస్వరూపము (హంసతత్త్వము), కానఁబడినక్ = గోచరమయినయెడ, గాలి = వాయువును, బిందువు = చిద్బిందువును, మనము = సంకల్పవికల్పాత్మకమగు డెందమును, కదలక = చలింపక, ఉండుక్ = నిలుచును.

తా. హంసస్వరూపమును దెలియనేరకయుండెనేని నా చిద్బిందువు యొక్క చలనము పోదు గాన, నా హంసతత్త్వమును సమగ్రముగఁ దెలిపెద నాలకింపుము. ఆ హంసతత్త్వము గోచరమయినవెంటనే ప్రాణాది వాయువులు చిద్బిందువు డెందము అనునీమూఁడును నిశ్చలముగ నుండును.

అవ. హంసతత్త్వజ్ఞానమే వాయుబిందుమనంబుల నిశ్చలత్వమునకు మూల మని చెప్పి, యాహంసస్వరూపము నుపదేశించుటకుఁ బ్రారంభించుచున్నది.

తే. కంజపుంజానుగతసౌఖ్యకగతుల మెఱసి
యాతతబ్రహ్మసంస్థాన కై మగుచు లలిత
మానసానందకర మై సకమత్వ మమర
సత్యరతి నొప్పు నీహంసకచక్ర మనఘ. ౧౬౩

టీ. అనఘ=కామాదిచిత్తవికారములులేని హనుమంతుఁడా, కంజ... గతులక్ - కంజ = మూలాధారము లోనగు షట్చక్రము లనియెడు తామర పువ్వులయొక్క, పుంజ=గుంపును, అనుగత = అనుసరించియున్న, సౌఖ్య= ఆనందములయొక్క, గతులక్ = రీతులచేత, మెఱసి = తేజరిల్లి, మఱియుఁ గమలసమూహముల నెల్లపుడుఁ బొంది సంచరించుటవలనఁ గలుగు సుఖముచే సొంపుమీఱి యని హంసపక్షము, ఆతత = సర్వాంతర్యామి యై యంతట నిండియున్న, బ్రహ్మ = పరవాసుదేవస్వరూపమే, సంస్థానము = తనకు శేషి యగుటచే నాధారముగఁ గలది, అగుచుక్ = ఐ, అని జీవపరము;

చతుర్ముఖబ్రహ్మకు వాహన మగుటచే నివాసస్థానమైనదై యని రాయంచ పక్షము; లలిత...కరము - లలిత = కామాదివికృతులు లేమిచే సొబగు మీఱిన, మానస = హృదయమునకు, ఆనంద = ఎలమిని, కరము = చేయునది, ఐ = అగుచు, మనోహరమైన మానససరస్సునకు నలంకారభూత మగుటచే సంతోషము నిచ్చుచు ననియు నర్థము; సమత్వము = సర్వము విష్ణుమయమను సమభావము; గమనసామాన్యము అనియు నర్థము, అమరన్ = తగియుండఁగా, సత్య + రతిన్ = సత్యస్వరూప మగు బ్రహ్మమునందలి యాసక్తిచేత, సత్యలోకమునందలి ప్రీతిచేత ననియు నర్థము; ఈ హంస చక్రము = వక్ష్యమాణజీవాత్మక మగు హంసమండలము, ఒప్పున్ = విలసిల్లును, శ్లేషమూలకం బగు నర్థాంతరధ్వని యలంకారము.

తా. కలుషహీనుఁడ వగు నో మారుతీ! మాయాప్రతిబింబిత మగు బ్రహ్మచైతన్యము మాయాతాదాత్మ్యము నొంది హంస యనఁబడునట్టి జీవరూపమగు హంసమండలము మూలాధారాది షట్కమలములను బొందుటచే నగు నాయాయానందముల యనుభూతులచే విలసిల్లుచు, సర్వపరిపూర్ణ మగు బ్రహ్మము నాధారముగఁ గలది యై పరిశుద్ధమగు డెందమునకు నానందమును గలిగించుచు, సమరసత్వము వెలయ సత్యస్వరూప మగు పరతత్త్వమునందలి యాసక్తిచేతఁ దామరలగమియందుఁ దిరుగుటచే నగు నెలమి వెలయు నలువకు వాహనమై సొంపగు మానససరోవరమునకు సంతసమును గొలుపుచు సరియగునడక దనర సత్యలోకమునందలి ప్రీతిచేఁ దగురాయంచచందమున విలసిల్లుచుండును. ౧౬౩

ఆ. వినుము పాలు నీళ్లున్ విభజింప నేర్చిన
పరమహంసపగిదిన్ బ్రవిదితాద్య
పరమహంసుఁ డైనన్ పరమహంసుఁ డసార
సారములను బంపఁజాలు ననఘ. ౧౬౪

టీ. అనఘ = దురితరహితుఁడ వగు సమీరకుమారా, వినుము = ఆకర్ణింపుము, పాలు నీళ్లు = కలసియున్న పాలను నీళ్లను, విభజింపన్ = వేఱుపఱచుటకు, నేర్చిన = ఎఱింగిన, పరమ - హంస - పగిదిన్ = రాయంచ చందమున, ప్రవిదిత = బాగుగ నెఱుఁగఁబడిన, ఆద్య = కార్యకరణ సంఘాతమునకు నాదికారణుఁడైన, పరమ-హంసుఁడు = పరవాసుదేవుఁడు, ఐన = అగు (ఇచట హంసశబ్దము శ్రేష్ఠవాచకము), పరమహంసుఁడు = బ్రహ్మజ్ఞాని, అసారసారములన్ = మాయామయమగుటచే ననృతజడదుఃఖ భూయిష్ఠమగు ప్రపంచస్వరూపమును, సారభూత మగు సత్యజ్ఞానానంద స్వరూపమైన బ్రహ్మతత్త్వమును, పంపన్ - చాలున్ = వేఱుపఱచుటకు సమర్థుఁ డగును. ఉపమాలంకారము.

తా. ఓ హనుమంతుఁడా! కలసియున్న క్షీరనీరములను రాజహంసము విడఁదీసి నీళ్లను విడిచి పాలను పానముచేయునట్లు పరమపురుష తత్త్వము నెఱింగినరాజయోగి దుఃఖబహుళమగు సంసారమునందు నాస్థను మాని సత్యజ్ఞానానందమయుఁ డగుపరమపురుషునియందుఁ దగిలియుండును. అట్టిరాజయోగియే యీ ప్రక్రియయందు హంసశబ్దవాచ్యుఁ డగును. ౧౬౪

తే. చటులసంసారదుఃఖనాశనకరంబు
హంసతత్త్వార్థవిజ్ఞాన । మతిరహస్య
మట్లు గావునఁ జెప్పెద । నవధరింపు
పరమభాగవతోత్తమ । భక్తవరద. ౧౬౫

టీ. పరమ = యోగ్యు లగు, భాగవత = ప్రహ్లాద నారద పరాశర ప్రముఖులగు పరమపురుషభక్తులలో, ఉత్తమ = మేటివగువాఁడా! మఱియు, భక్తవరద = భగవద్భక్తు లగు నంతేవాసులకు నభీష్ట మగు పరవాసుదేవ తత్త్వము నుపదేశించువాఁడ వగు కరువలిపట్టి! హంస...విజ్ఞానము - హంస = హంసస్వరూపుఁ డగు జీవునియొక్క, తత్త్వ = నిజమగు.

అర్థ = తాత్పర్యముయొక్క, విజ్ఞానము = పరిజ్ఞానము, చటుల...కరంబు చటుల = దుఃఖబహుళ మగుటచే జెడిదమగు, సంసార = సంసార సంబంధమైన, దుఃఖ = కష్టములయొక్క నాశన = భంగమును, కరంబు = చేయునదియు, అతిరహస్యంబు = అత్యంతమును గుహ్యమయినదియు, అట్లుకావునన్ = అట్లగుటచేత, చెప్పెదన్ = ఉపదేశించెదను, అవధరింపు = సావధానముగ వినుము.

తా. యోగ్యులగు భగవద్భక్తులలో నగ్రగణ్యుండవును స్వాశ్రితుల యెడ వాత్సల్యము గలవాఁడవు నగువాయుపుత్త్రా! పరమహంస్వరూపుండగు జీవునియొక్క వాస్తవతాత్పర్యమును సరిగ నెఱుంగుట, ఘోర సంసారసాగరక్లేశములనెల్ల నశింపఁజేయునదియుఁ బరమగుహ్యమును గాన, నీకు దానిని సమగ్రముగ బోధించెదను సావధానమానసుఁడవై వినుము.

అవ. ఇట్లుపక్రమింపఁబడిన హంసతత్త్వముయొక్క పరిజ్ఞానమునకు సాధకం బగు నాడీవిభాగాదికమును జెప్పుచున్నది.

వ. మాతృపితృభుక్తాన్న సంభూత రక్తశుక్లబిందుజనితం బై త్వఙ్మాంసరుధిరమజ్జాస్థిస్నాయువు లను షట్ కోశంబులు గలిగి యొప్పు నీ స్థూలశరీరంబునందు డెబ్బదిరెండువేల నాడులు గల వందు గుదంబునకంటె రెండంగుళంబుల మీఁదట లింగంబునకంటె రెండంగుళంబుల క్రిందటఁ గన్యకాయోనిసన్నిభంబై యధోముఖాగ్రం బై మూఁడు కోణంబులు దనర దేహమధ్యస్థానంబున మూలాధార చక్రం బలరు నది మొదలుకొని సహస్రారంబు తుదగాఁ బృష్ఠభాగంబున వీణాదండంబుభంగి సమస్త నాడికా మూలకంద మై మూలోర్ధ్వచ్ఛిన్న వంశాభం బై షడా

ధారసమన్వితం బై యుండుదేర్లాస్తి బ్రహ్మదండి యనంబ
రఁగు నాబ్రహ్మదండి మూలాధారాగ్రకోణస్థ యై కుండలీ
నామపరాశక్తియుక్త యై ప్రాణాగ్ని బిందు నాదనిలయ
యై సావిత్రీ సరస్వతీనామిక యయి బ్రహ్మరంధ్రగతి యయి
సుషుమ్నానాడి ప్రవర్తిలు; తద్వామదక్షిణపార్శ్వంబుల
యం దాధారంబు మొదలుకొని నాసికాగ్రపర్యంతంబు
వ్యాపించి నాడీచక్రసంస్యూత లై పితృయాన దేవయాన
సంజ్ఞక లై చంద్ర సూర్య మండలంబులం బొంది యిడా
పింగళ లనునాడు లొప్పుచుండు; నాడీమండలంబు నాశ్ర
యించి కుక్కుటాండంబువిధంబున నాడీచక్రం బమరు, నా
నాడికలు నాడీచక్రసముదిత లట్లు గావున గాంధారి హస్తి
జిహ్వాయ ననునాడులు నేత్రాంతవ్యాపినులు పూషాలం
పూషానాడులు కర్ణద్వయానుగతులు శుక్లాశ్వనాడి భ్రూ
మధ్యంబు నొందు ఘ్రాణరంధ్రయుగ్మంబును శ్రోత్ర
రంధ్రయుగ్మంబును భ్రూమధ్యంబుదిగువఁ గలసియుండు,
నచ్చోటు శృంగాటకంబు చతుష్పథం బన విలసిల్లు; గంగా
యమునా సరస్వతు లనుపేళ్లు గల యిడా పింగళా సుషు
మ్నలు గూడిన భ్రూమధ్యస్థానంబు త్రికూటం బనఁ ద్రివేణీ
సంగమం బనందగు; వాక్ప్రసారిణి యైన సరస్వతీనాడి
జిహ్వాంతగామిని యగు; విశోదరీనాడి చతుర్విధాన్నంబుల
భక్షించుఁ గంఠస్థ యైన పయస్వినీనాడి క్షుత్తృష్ణల నొద
వించుచు జలపానం బాచరించు; మఱియు నాడీచక్రసము
ద్భూత లై నమూఁడునాడు లధోముఖ లై యుండు; నందు
రక్తాహ్వయనాడి శుక్లంబును సినీవాలీనాడి మూత్రంబును

గుహ్యానాడి మలంబును బహిర్గతంబుగఁ జేయు, శంఖినీ దామినీ నాడులు భక్షితాన్నరసంబుల గ్రహించి కపాల కుహరంబును బొంది శిరంబున నమృతంబుగాఁ గావించు; నదియునుం గాక, హృదయంబున నేకోత్తరశతనాడులు దనర్చు; నం దొక్కనాడి యూర్ధ్వగామిని యగు; నన్నాడీ మార్గంబు మోక్షమార్గం బని వేదాంతంబులు పలుకు; నిట్లు వివరించి చెప్పినవెల్ల ముఖ్యనాడులు. వీనిలో నిడా పింగళా సుషుమ్నలు శ్రేష్ఠనాడు లగు; నందు బ్రహ్మనాడి సకలనాడికా శిరోమణి యగు; ని త్తెఱంగునం దిర్యగూర్ధ్వాధఃప్రసృత లై పరమసుషిరప్రధాన లయిన ద్విసప్తతి సహస్రనాడులయందుఁ జలన ధావన కంపనా కుంచన శోషణధర్మకంబు లైన దశవిధప్రాణంబులు మెలఁగు నందు హృదయస్థానంబున నివసించి, ప్రాణుం డిడా పింగళాఖ్య నాడికా రంధ్రద్వయంబువలన నుచ్ఛ్వాస రూపంబుచే బాహ్యంబునకు నిర్గమించి ద్వాదశాంగుళ పర్యంతం బరఁగుదెంచి యచ్చట నడంగు; గుదస్థానంబునందుండి యపానుండు నిశ్శ్వాసరూపంబుచేతఁ బ్రాణునకు నధోముఖంబుగా, నెదురు నడుచుచు నధోముఖనాడీత్రితయంబు వలన మలమూత్రశుక్లంబుల వెడలించుచుండుఁ; గంఠదేశంబున వసియించియుఁ దా నుండు మనంబునందలి సంకల్ప వికల్పంబుల జిహ్వాద్యష్టస్థానంబులవలన శబ్దరూపంబుగాఁ బలికించుచు సుషుప్త్యవసరంబున సకలేంద్రియంబుల సంగ్రహించి యుపశమింపఁజేయుచుఁ బ్రబోధసమయంబున వానినెల్ల నెప్పటిచోట్ల నుంచుచు మఱియు

లోకాంతరగమనాగమనంబుల సమర్థుం డై యొప్పుచు నగ్నీషోమమయుం డై సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి బ్రహ్మరంధ్రంబున కుద్గమించుచుండు; సర్వశరీరంబున వ్యాపించి వ్యానుండు బాహ్యశీతోష్ణంబుల నభ్యంతరంబునకు నాంతరశీతోష్ణంబుల బాహ్యంబున కిచ్చుచు భక్షితాన్నరసంబు నంతటం బ్రసరింపం జేయుచుండు; నాభీస్థానస్థితుండగు సమానుండు జఠరానలంబుం బ్రజ్వలింపం జేసి ప్రాణ్యుపభుక్తచతుర్విధాన్నంబులం బచనంబు చేసి యెల్లనాడులకుం బంచిపెట్టు; నాగుం డుద్గారంబు, గూర్మాం డున్మీలనంబు, గృకరుండు క్షుతంబు; దేవదత్తుండు విజృంభణంబు; సర్వవ్యాపి యైన ధనంజయుండు మృతం బైనను విడువక దేహస్థౌల్యంబుం బుట్టించుచుండు; నిటులు దశవాయువులం గూడి దశేంద్రియాన్వితం బై కామ రాగ ద్వేషాదివికారసహితం బై విషయసుఖగ్రహణంబుకొఱకు నధోముఖం బై శ్రవణేంద్రియంబువలన ద్వివిధశబ్దంబులం, ద్వగింద్రియంబువలనం బంచవిధస్పర్శంబుల, నేత్రేంద్రియమువలన షడ్వర్ణంబుల, జిహ్వేంద్రియమువలన షడ్విధరసంబుల, ఘ్రాణేంద్రియమువలనం ద్వివిధగంధంబుల, ననుభవించు; వెండియు వాక్పాణిపాదపాయూపస్థలతోడంగూడి వచనాదానగమన విసర్గానంద కర్మంబుల నొనర్చుచు మనంబు ప్రవర్తించుచుండు; నమ్మనంబుం గరణంబుగాఁ గైకొని తత్పవనమనోగ్రస్థితయుఁ గర్తృత్వభోక్తృత్వాదిధర్మసమేతయు నై నబుద్ధి విలసిల్లు; నదియె బిందు వనం బరఁగు; నది సర్వకార్యకారణాశ్రయయు నిఖిలవాసనావాసితయు

నగుం గావున నమ్మానసమూరు తేంద్రియ శరీరంబులతోఁ గూడి విషయాభిముఖమై తచ్చాంచల్యంబువలనఁ దానుం జలించుచు బహిరంతర్విషయానుభావంబు చేయుచు సుషుప్తియం దజ్ఞానాకారంబగుచు జాగ్రత్స్వప్నంబులయందు బుద్ధ్యాద్యాకారం బై తోఁచుచు ననాదికాలంబుననుండి ముక్తిపర్యంతం బనంతకర్మఫలంబు లాచరించుచుఁ దత్ఫలంబు లగు సుఖదుఃఖంబుల భుజించుచు సవిచారరూపిణియై నిరంతరపర్యటనశీల యై యుండు; మఱియును. ౧౬౬

టీ. మాతృ...జనితంబై - మాతృపితృ = జననీజనకుల చేత, భుక్త = తినఁబడిన, అన్న = భోజ్యపదార్థములవలన, సంభూత = పుట్టిన, రక్త = నెత్తురుయొక్కయు, శుక్ల=వీర్యముయొక్కయు, బిందు = చినుకుల చేత, జనితంబు - ఐ = సంభవించినదియై, త్వక్...బులు - త్వక్ = తోలు, మాంస = పొలసు, రుధిర = నెత్తురు, మజ్జా = మెదడు, అస్థి = ఎముకలు, స్నాయువులు = ప్రేగులు, అను = అనియెడు, షట్ = ఆఱగు, కోశంబులు = ఒఱలు, కలిగి = కలదియై, ఒప్పు = తగు, ఈ = కనఁబడుచున్న, స్థూల - శరీరంబునందు = పంచీకరణము చేయఁబడిన పృథివ్యాది భూతములవలనఁ గలిగిన మేనునందు, డెబ్బదిరెండు వేలనాడులు, కలవు = ఉన్నవి; అందుక్ = ఆ నాడులలో, గుదంబునకంటెక్ = పాయుస్థానముకంటె, రెండంగుళంబులమీఁదటక్ = (పంద్రెండు ధాన్యపుగింజలు నిడుపుగా దగ్గఱఁ జేర్చిన నగు పరిమాణ మొకయంగుళము.) అట్టి అంగుళములు రెంటికిపైని, లింగంబునకంటెక్ = శిశ్నముకంటె, రెండంగుళముల క్రిందటక్ = అంగుళముల రెంటికి దిగువను, అధోముఖ - అగ్రంబు-ఐ= అధోముఖముగ నున్నకొన గలదియై, కన్యకాయోనిసన్నిభం బై =కన్నియ యొక్క భగమును బోలి, మూఁడు - కోణంబులు = ముక్కోణములు,

తనరన్ = కలిగియుండఁగా, దేహ - మధ్యమ - స్థానంబునన్ = మేనునకు నడిమిపట్టున, మూలాధారచక్రంబు = మూలాధారం బనుచక్రము, అలరున్ = ఒప్పును, అది = ఆ మూలాధారచక్రము, మొదలుకొని=ఆదిగఁ జేసి, సహస్రారంబు తుదగాన్ = సహస్రార మనుచక్రము కడదనుక, పృష్ఠభాగంబునన్ = వెన్నుపట్టున, వీణాదండంబుభంగిన్ = వీణియయొక్క ప్రకాండమువలె, సమస్త - నాడికా - మూలకందంబు - ఐ = అన్నినాడులకు నాధారభూతమై, మూల...బై - మూల = మొదలును, ఊర్ధ్వ = కొనయు, ఛిన్న = కోయఁబడిన, వంశ = వెదురుకఱ్ఱతో, ఆభంబై = సమానమైనదై, షట్ - ఆధార - సమన్వితంబు - ఐ= మూలాధారము మొదలగు నాఱు చక్రములతో ననుబంధించినదై, ఉండు = ఉన్నట్టి, దీర్ఘ - అస్థి = నిడుపగు వెన్నెముక, బ్రహ్మనండి - అనన్ = బ్రహ్మనండి యనుపేరుతో, పరఁగున్ =తగును; ఆ...స్థ + ఐ - ఆ = అట్టి, బ్రహ్మదండి=వెన్నెముకను సంబంధించియున్న, మూలాధార=పూర్వోక్త మూలాధారచక్రముయొక్క, అగ్ర - కోణ = కొసకొనయందు, స్థ - ఐ = అంటియున్నదై, కుండలీ - నామ - పరాశక్తి - యుక్త-ఐ=కుండలిని యను పేరు గల పరాశక్తితోఁ గలసియున్నదియు నై, ప్రాణ...నిలయ - ప్రాణ = ప్రాణవాయువునకు, అగ్ని = జాఠరానలమునకును, బిందు = చిద్బింబమునకును, నాద = దశవిధోంకారధ్వనులకును, నిలయమై = ఆధారభూతయు నై, సావిత్రీ - సరస్వతీ - నామిక యై = సావిత్రి యనియు సరస్వతి యనియుఁ బేరులు కలది యై, బ్రహ్మరంధ్ర - గత - ఐ = శిరస్స్థానమునం దున్న బ్రహ్మరంధ్రము నంటియున్నదియు నై, సుషుమ్నా - నాడీ - "సుషు ఇత్యవ్యక్తం శబ్దం మ్నాయతీతి సుషుమ్నా" అనువ్యుత్పత్తిచే సుషు - అను నవ్యక్త మధురమగు నాదమును జేయుచునుండును గాన సుషుమ్న యనఁబడు నొక సూక్ష్మనాడి (ఇది మేరుదండమునకుఁ జెడగను ఇడాపింగళానాడులకు నడుమను నుండును), ప్రవర్తిల్లున్ = తగియుండును, తత్ - వామ

దక్షిణ - పార్శ్వంబులయందుఀ = ఆ సుషుమ్నా నాడికి నెడమవై పునను కుడివై పునను, ఆధారంబు మొదలుకొని = మూలాధారచక్రము మొదలు పెట్టి, నాసికా - అగ్ర - పర్యంతంబుఀ = ముక్కుయొక్క కొనదనుక, వ్యాపించి = క్రమ్మి, నాడీ - చక్ర - సంస్యూతలు - ఐ = నాడులయొక్క సముదాయములతోఁ గలసియున్నవై, పితృయాన దేవయాన సంజ్ఞికలు - ఐ = పితృయాన మనియు దేవయాన మనియు గుఱుతులు గలవినై, చంద్ర - సూర్య - మండలంబులఀ = చంద్రమండలమును సూర్యమండలమును, పొంది = సంబంధించి, ఇడాపింగళలు - అను - నాడులు = ఇడయనియుఁ, బింగళయనియు రెండు నరములు, ఒప్పుచుఀ-ఉండుఀ = విలసిల్లును; నాభీమండలంబుఀ = బొడ్డుయొక్క ప్రదేశమును, ఆశ్రయించి = అవలంబించి, కుక్కుట - అండంబు - విధంబునఀ = కోడియొక్క గ్రుడ్డును బోలి, నాడీచక్రంబు = నాడులయొక్క గమి, అమరుఀ = తగియుండును, ఆ - నాడికలు = మీఁదఁ బలుకఁబడిన, ఇడా పింగళా సుషుమ్న లను మూఁడునరములు, ఆ - నాడి - చక్ర-సముదితలు= పూర్వోక్తమగు నాడీమండలమునుండి పుట్టినవి; కావునఀ =ఆరీతిని బుట్టుటం జేసి, గాంధారి - హస్తిజిహ్వ - అను - నాడులు = గాంధారి యనియు హస్తిజిహ్వ యనియు రెండునరములు, నేత్ర - అంత - వ్యాపినులు = కనుల కొనదనుకఁ గ్రమ్మియున్నవి; పూషా - అలంపూషా - నాడులు = పూష యనియు నలంపూషయనియు రెండునరములు, కర్ణ - ద్వయ - అనుగతలు= వీనుల రెంటిదనుక వ్యాపించియుండునవి; శుక్లా - ఆఖ్య - నాడి = శుక్ల యను పేరు గలద్రేగు, భ్రూ + మధ్యంబుఀ = కనుబొమ్మల నడిమి పట్టును, ఒందుఀ - వ్యాపించియున్నది ; ఘ్రాణ - రంధ్ర - యుగ్మంబు = ముక్కు చెలమలసందులు రెండును, శ్రోత్ర - రంధ్ర - యుగ్మంబును వీనులసందులు రెండును, భ్రూ - మధ్యంబు - దిగువఀ = కనుబొమల నడి పట్టునకు నధోభాగమునందు, కలసి ఉండుఀ = కూడుకొని యున్నవి;

ఆ + చోటు = ఆ నాల్గురంధ్రముల సంగమస్థలము, శృంగాటకంబు - చతుష్పథము - అనన్ = శృంగాటక మనియు, చతుష్పథ మనియు పేళ్లతో, విలసిల్లున్ = ఒప్పును; గంగా యమునా సరస్వతులు = గంగయు యమునయు సరస్వతియు, అను పేళ్లు = అను సంజ్ఞలు, కల - ఇడా - పింగళా - సుషుమ్నలు = వరుసగఁ గలిగిన ఇడయు పింగళయు సుషుమ్నయు నను నరములు, కూడిన - భ్రూ - మధ్య - స్థానంబు = కలసిన కనుబొమల నడిమిపట్టు, త్రికూటంబు - అనన్ = త్రికూట మనియు, త్రి + వేణీ - సంగమంబు - అనన్ = త్రివేణీసంగమస్థల మనియు, తగున్ = ఒప్పును; వాక్ + ప్రసారిణి - ఐన = మోమునుండి మాటలను పైకిఁ బ్రసరింపఁజేయునది యగు, సరస్వతీ - నాడి = సరస్వతి యనుపేరం బరఁగు ప్రేగు, జిహ్వా - అంత - గామిని - అగున్ = నాలుకయొక్క కొనదనుకఁ గ్రమ్మియున్నదయి యుండును, విశ్వోదరీ + నాడి = విశ్వోదరి యను పేరు గల నరము, చతుర్విధ + అన్నంబులన్ = భక్ష్య - భోజ్య - లేహ్య - చోష్యము లను నాల్గువిధము లగు తినఁదగిన పదార్థములను, భక్షించున్ = ఆరగించును, కంఠ + స్థ = కుత్తుకయం దున్నది, ఐన - పయస్వినీ - నాడి = అగు పయస్విని యనునరము, క్షుత్ + తృషలన్ = ఆఁకలిని నీరువట్టును, ఒదవించుచున్ = పుట్టించుచు, జలపానంబు = నీటిని ద్రాగుటను, ఆచరించున్ = చేయును, మఱియున్ = ఇంతియ కాక, నాడీచక్ర సముద్భూతలు = నరముల గుంపునుండి పుట్టినవి, ఐన మూఁడునాడులు = అయినట్టి మూఁడు నరములు, అధోముఖులు - ఐ - ఉండున్ = దిగువకు కొనలు కలవి యగుచు నుండును; అందున్ = ఆ మూఁడు నాడులలో, రక్త + ఆహ్వాయ + నాడి = రక్త యను పేరుగల ప్రేగు, శుక్లంబున్ = వీర్యమును, సినీవాలీనాడి = సినీవాలి యనునరము, మూత్రంబున్ = మూత్రమును, కుహూనాడి = కుహూసంజ్ఞగలనాడి, మలంబున్ = విరేచనమును, బహిర్గతంబున్ - కన్ = పైకి

వచ్చునట్లు, చేయుఁ = కావించును; శంఖినీ సౌదామినీ నాడులు = శంఖిని యనియు సౌదామిని యనియు పేరులు గల నరములు, భక్షిత + అన్నరసంబులఁ = ఆరగింపఁబడిన యోగిరములయొక్క సారాంశములను, గ్రహించి = సేకరించి, కపాల - కుహరంబుఁ = పుఱుకయొక్క బిల మును, ఒంది = వ్యాపించి, శిరంబునఁ - బ్రహ్మరంధ్ర ప్రదేశమునందు, అమృతంబుఁ = జీవించుటకు నాధారభూత మగు నమృతరసమునుగను, కావించుఁ = చేయును; అదియునుం గాక = అంతియ కాక, హృద యంబునఁ = హృత్పుండరీకస్థానమునందు, ఏక + ఉత్తరశత నాడులు = ఒకటి పైపెచ్చుగఁగలనూఱునరములు, తనర్చుఁ = ఉన్నవి; అందుఁ = నూఱు నొకటి గలయానాడులలో, ఒక్క నాడి = ఒకనరము, ఊర్ధ్వ గామిని = మీఁదికి వ్యాపించినది, అగుఁ = అయియున్నది, ఆ నాడీ మార్గంబు = అట్లు మీఁదుగ వ్యాపించి యున్నయానరముయొక్క త్రోవ, మోక్ష + మార్గంబు = ముక్తికిఁ బోవఁదగినబాట, అని = అనుచు, వేదాం తంబులు = ఉపనిషత్తులు, పలుకుఁ = చెప్పుచున్నవి; "శతం చైకాచ హృదయస్య నాడ్యః । తాసాం మూర్ధాన మభినిస్సృతైకా । తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి । విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి" అను నుపనిషద్వాక్యార్థ మిచటఁ బట్టింపఁదగియున్నది; యెట్లనిన, "విముక్తశ్చ విముచ్యతే" అని మొదటఁ జెప్పఁబడిన రెండవది యగు పరముక్తిని "శతంచైకాచ" అను మొదలగు మంత్రము చెప్పుచున్నది. హృదయ మునకు ముఖ్యము లగునాడులు నూఱునొకటి గలవు. వానిలో సుషుమ్న యనుపేరు గల యొకబ్రహ్మనాడి బ్రహ్మరంధ్రమును భేదించుకొని వెలు పలికి వెడలును; ఆ బ్రహ్మనాడీమార్గమునుబట్టి బ్రహ్మలోకమునుగూర్చి పోవుచు నాలోకమునం దున్నబ్రహ్మమును దొలుతఁ బొంది స్వస్వరూపా విర్భావరూప మగు మోక్షమును బొందును; కొఱవడిన నూఱునరములు మరణకాలమునందు పలుతెఱంగులం గల సంసారమార్గములను బట్టుటకు నౌ;

యోగించును; "విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" అనుపట్ల "విష్వక్ వితతాః నాడ్యః అన్యోత్క్రమణే ఉపయుజ్యంతే" అని శ్రీ వ్యాసార్యులు వ్రాసిరి. అనఁగా బ్రహ్మనాడి గాక తక్కిననాడు లన్నియు మీఁదుగఁ గాక నలుప్రక్కలకు వ్యాపించియున్నవై యజ్ఞానుల యుత్క్రమణమునకు నుపయోగించుచున్న వని యర్థము. మఱియు నీమంత్రార్థము శ్రీ బాదరాయణాచార్యులచే "తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతః శతాధికయా" అను సూత్రముచేఁ జర్చింపఁబడినది. ఎట్లనిన, ఇట్లు గతియొక్క యుపక్రమమునందునక జ్ఞానికి నజ్ఞానికిని నొకతీరుగ నుత్క్రమణప్రకారము చెప్పఁబడినది. ఇఁక జ్ఞానికిని నొకవిశేషము చెప్పఁబడుచున్నది. దానికై "శతం చైకా చ హృదయస్య నాడ్యః" అను మంత్రము వెడలినది. ఇందు నూటయొకటి నాడులలోఁ గడపటిది యగుబ్రహ్మనాడిని బట్టియే జ్ఞానియొక్క గతి యనియు, తక్కిన నాడులనుబట్టి యజ్ఞానియొక్క గతి యనియు నియమము న్యాయ్యమా కాదా? అని సందేహము కలుగఁగా నీనియమము యుక్తముకాదు; ఏల యనిన నాడులు లెక్క కెక్కుడుగ నుండుటచేతను పరమసూక్ష్మము లగుటచేతను నేర్పఱచుటకు వలనుపడక పోవుటవలన బురుషునిచేఁ దెలిసికొనుటకు శక్యము కాదు గాన నీ మంత్రము యదృచ్ఛాసిద్ధ మగు నుత్క్రమణము ననువదించుచున్న దనుట యుక్త మని పూర్వపక్షము గలుగఁగా సిద్ధాంత మెట్లనిన నూటొక్కటవదియగు మూర్ధన్యనాడి (బ్రహ్మనాడి - లేక సుషుమ్నానాడి) చేతనే జ్ఞాని యుత్క్రమించును; జ్ఞానికి పరమసూక్ష్మ మగునీనాడి గోచరము కాదనవలదు. భగవదారాధనరూప మయి యత్యంతప్రియమైన విద్యాబలమువలనను, విద్యాంగమగు గమనచింతనముచేతను బ్రసన్నుం డగు హృత్పుండరీకస్థితుఁడైనపరమపురుషునే ననుగ్రహింపఁబడినజ్ఞాని భగవత్ప్రసాదముచేత స్పష్టముగఁ దోపట్టిన బ్రహ్మనాడీమార్గము గలవాఁడై యానాడీమార్గముచేతనే యుత్క్రమిం

చేసు అను మొదలగు సంశములను శ్రీభాష్యమునందుఁ బరికించునది. ఇట్లు = పూర్వోక్త ప్రకారము, వివరించి = విశదపఱిచి, చెప్పినవి ఎల్లన్ = బోధింపఁబడిన వన్నియు, ముఖ్య + నాడులు = ప్రధానము లైననరములు, వీనిలోన్ = ఈ నరములన్నిటిలో, ఇడా - పింగళా - సుషుమ్నలు = ఇడయు పింగళయు సుషుమ్నయు ననునాడులు మూఁడును, శ్రేష్ఠనాడులు = అత్యుత్కృష్టము లైన నరములు, అందున్ = ఆ మూఁటిలో, బ్రహ్మనాడి = మూర్ధన్య యగు సుషుమ్న యనునాడి, సకల - నాడీ - శిరోమణి = అన్ని నరములకుఁ దలమానికము, అగున్ = అయినది; ("సుషుమ్నాంతర్గతం సర్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం" అను భగవద్వచనముచే సూర్యుఁడు చంద్రుఁడు నక్షత్రములు సముద్రములు చతుర్దశభువనములు నాల్గువేదములు షడ్దర్శనములు చతుష్షష్టికళలు అష్టాదశపురాణములు సమస్తమంత్రములు సత్త్వరజస్తమోగుణములు ఇవి యవి యన నేల సమస్తప్రపంచమును బ్రహ్మనాడియం దనుస్యూతమై యుండుటచే నది సర్వోత్తమ మైనదని యర్థము), ఇత్తెఱఁగునన్ = ఈవిధమున, తిర్యక్ = ఊర్ధ్వ + అధః + ప్రసృతలు+ఐ = అడ్డుగను మీఁదుగను దిగువగను క్రమ్మియున్నవై, పరమ + సుషిర + ప్రధానలు = అతిసూక్ష్మము లగు బిలములు తప్పక గలవి, ఐన = అగునట్టి, ద్విసప్తతిసహస్రనాడులయందున్ = డెబ్బదిరెండువేల నరములయందు, చలన...ధర్మకంబులు - చలన = సంచరించుటయు, ధావన = పరుగిడుటయు, కంపన = కంపించుటయు, అకుంచన = ముడుఁగుటయు, శోషణ = ఇగురుటయు, ననునివి, ధర్మకంబులు = గుణములుగాఁ గలవి, ఐన = అగునట్టి, దశవిధ ప్రాణంబులు = (ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము నాగము కూర్మము కృకరము దేవదత్తము ధనంజయము అని) పదివిధము లగు వాయువులు మెలఁగున్ = నడయాడుచుండును; అందున్ = ఆపదిగాలులలో, ప్రాణుఁడు = ప్రాణ మనుగాలి, హృదయ + స్థానంబునన్ = డెందమునందు,

యించి = నిలిచి, ఇడా...వలనన్ - ఇడా = ఇడ యనియు, పింగళా= పింగళ యనియు, ఆఖ్య=నామములు గల, నాడికా = నరములయొక్క, రంధ్ర = బిలములయొక్క, ద్వయంబువలనన్ = రెండింటినుండి, ఉచ్ఛ్వాస - రూపంబుచేతన్ = ఎగయూపిరిరూపుతో, బాహ్యంబు నకున్ = పైకి, నిర్గమించి = బయలుదేఱి, ద్వాదశ - అంగుళ - పర్యంతంబు = ఈరారంగుళములదనుక, అరుదెంచి = ఏగుదెంచి, అచ్చటన్= ఆ ప్రదేశమునందు, అడఁగున్ = బాహ్యవాయువులో లీనమగును, గుద స్థానమునం దుండి = పూర్వోక్తమూలాధారప్రదేశమునందు వసించి, అపానుండు = అపాన మను గాలి, నిశ్వాసరూపముచేతన్ = దిగయూపిరియాకృతితో, ప్రాణునకున్ = మొదటిప్రాణ మను గాలికి, అధోముఖంబుగాన్ = గుదస్థానమువైపుగ, ఎదురునడచుచున్= వ్యతిరేకముగఁ జనుచు; అధోముఖ + నాడీ + త్రయంబువలనన్ = తొల్లి చెప్పినయట్లు దిగువఁగ కొనలుగల కుహువు సినీవాలియు రక్తయు నను మూఁడునాడులనుండి, మలమూత్రశుక్లంబులన్ = క్రమముగ మలమును మూత్రమును వీర్యమును, వెడలించుచున్ - ఉండున్ = వెలుపలఁ బడునట్లు చేయుచుండును, ఉదానుండు = ఉదాన మనువాయువు, కంఠ - దేశంబునన్ = గళస్థానమునందు, వసియించి = నిలిచి, మనంబునందలి - సంకల్ప - వికల్పంబులన్ = డెందమునందుఁ గలుగునిది యిట్లు చేయఁదగినదను తలఁపును, భ్రాంతిమూలమగు కల్పనమును, జిహ్వా - ఆది - అష్ట - స్థానంబులవలనన్ = "అష్టౌ స్థానాని వర్ణానా మురఃకంఠశ్శిర స్తథా । జిహ్వామూలఞ్చ దంతాశ్చ నాసికోష్ఠౌ చ తాలు చ" అని పాణినీయశిక్షయందుఁ ప్రతిపాదింపఁబడిన జిహ్వామూలము మొదలగు నెనిమిదిస్థానములవలనను, శబ్ద + రూపంబుగాన్ = "అకుహవిసర్జనీయానాం కంఠః ఇచుయశానాం తాలు । ఋటురషాణాం మూర్ధా లృతులసానాం దంతాః । ఉపూపధ్మానీయానామోష్ఠౌ । ఞమఙణనానాం నాసికా చ । ఏదైతోః కంఠతాలు ।

ఓదౌతోః కంఠోష్ఠం । వకారస్య దంతోష్ఠం । జిహ్వామూలీయస్య జిహ్వామూలం । నాసికానుస్వారస్య'' అనుటచేఁ గంఠము లోనగుస్థానములనుండి నుచ్చరింపఁబడు నకారము మొదలగు నేఁబదియక్షరములయొండొంటి సంయోగమువలనఁ గలుగు వాఙ్మయస్వరూపముగ, పలికించుచున్ = నుడువఁ జేయుచు, సుషుప్తి + అవసరంబునన్ = మిక్కుటమగు నిదుర గలుగు నపుడు, సకల + ఇంద్రియంబులన్ = పదునాలుగింద్రియములను, సంగ్రహించి = ఒకచోఁ జేర్చి, ఉపశమింపన్ - చేయుచున్ = తమతమ విషయములయందుఁ జొరఁబడక యుండునట్లు గావించుచు, ప్రబోధసమయంబునన్ = మెలఁకువ గలిగినతఱిని, వానిన్ - ఎల్లన్ = మూలాజ్ఞానమునందు విలీనములగు నా యింద్రియముల నన్నిటిని, ఎప్పటిచోట్లన్ = తొంటియట్లు తమతమ విషయములయందు, ఉంచుచున్ = ప్రసరింపఁజేయుచు, మఱియున్ = ఇంతియకాక, లోక + అంతర + గమన + ఆగమనంబులన్ = పుణ్యపాపానుభవస్థానము లగు స్వర్గనరకాదిలోకములకుఁ బోవుటయందును మరలివచ్చుటయందును, సమర్థుండు-ఐ = సామర్థ్యము గలదియై, ఒప్పుచున్ = విలసిల్లుచు, అగ్నీషోమమయుండై = అగ్నిమండలమును సోమమండలమును స్వరూపముగఁ గలదియై ("ఈదగ్నే స్సోమవరుణయోః) అను పాణినివ్యాకరణసూత్రమునుబట్టి, అగ్నిశబ్దమునకు సోమవరుణశబ్దములు పరము లగునపుడు ఈకారం బాదేశం బగును; కాఁగా "అగ్నేస్తుత్ స్తోమసోమాః'' అను సూత్రముచే సకారమునకు షత్వము రాఁగా నగ్నీషోము లని ద్వంద్వసమాసరూపమునై మయట్ప్రత్యయము గలుగఁగా నగ్నీషోమమయుఁ డని రూపము నిష్పన్న మైనది); సుషుమ్నా + రంధ్రంబున్ = మూర్ధన్యనాడియొక్క బిలమును, ఆశ్రయించి = అవలంబించి, బ్రహ్మరంధ్రంబునకున్ = బ్రహ్మనాళమునకు, ఉద్గమించుచున్-ఉండున్ = మీఁదుగఁ బోవుచుండును, వ్యానుండు = వ్యాన మనువాయువు, సర్వశరీరమున్ = ఒడలెల్లను, వ్యాపించి = క్రమ్మి, బాహ్యశీతోష్ణంబులన్

చవిని దెలిసికొన శక్తి గలిగినరసనేంద్రియమువలన, షట్ - విధ - రసంబులన్ = తిక్త - ఆమ్ల - లవణ - క్షార - కార - మధురము లనునాఱు తెఱంగులు గల రసములను, ఘ్రాణ + ఇంద్రియమువలనన్ = ముక్కుకొననుండి దానికి విలక్షణమై వాసనను గ్రహింప శక్తి గలిగి యతిసూక్ష్మమైన ఘ్రాణేంద్రియముచేత, త్రి-విధ - గంధంబులన్ = మంచివాసన - చెడువాసన - ఉభయాత్మకము నని మూఁడువిధము లగు వాసనలను, అనుభవించుచున్=గ్రహించుచు, వెండియున్ = ఇంతియకాక, వాక్ ... తోడన్ - వాక్ = (కంఠము మొదలగు నెనిమిదిస్థానములందు వానికి వేఱుగ నతిసూక్ష్మరూపముననుండి వాఙ్మయము నుచ్చరించు) వాగింద్రియము, పాణి= (హస్తతలమునందు దానికి వేఱుగ సూక్ష్మాకారముననుండి దానప్రతిగ్రహాదికము చేయునది) పాణీంద్రియము, పాద = (చరణతలమునందు దానికి వేఱుగ సూక్ష్మరూపమున నుండి గమనాగమాదికమును జేయునది) చరణేంద్రియము, పాయు = (గుదస్థానమునందు దానికి వేఱుగఁ గడుసూక్ష్మరూపముననుండి మలమూత్రవిసర్జనాదికమును జేయునది) పాయ్వింద్రియము, ఉపస్థ = (యోనిలోను శిశ్నములోను వానికి వేఱుగ నతిసూక్ష్మముగ నుండి రక్తరేతస్సుల వెడలించునది) యుపస్థేంద్రియము అను నీయైదు కర్మేంద్రియములు, కూడి = కలసి, వచన...కర్మంబులన్ - వచన = (క్రమముగ) సంభాషణమును, ఆదాన = పుచ్చుకొనుట ఇచ్చుట మొదలగువానిని, గమన = నడకను, విసర్గ = మలమూత్ర విసర్జనమును, ఆనంద = సంభోగసుఖమును, అనెడు, కర్మంబులన్ = పనులను, ఒనర్చుచున్ = కావించుచు, మనంబు = చిత్తము, ప్రవర్తించుచున్ - ఉండున్ = సంకల్పవికల్పాదిరూపముగ సంచరించుచుండును; అమ్మనంబున్ = ఆచిత్తమును, ...రణంబు కాన్ = ఒక యుపకరణముగ, కైకొని = పరిగ్రహించి, ...స్థితయున్ - తత్ = మీఁదఁ జెప్పఁబడిన, పవన = దశవిధ...యువులయు, మనః = చిత్తముయొక్కయు, అగ్ర = మీఁదను,

స్థితయుఁ = ఉన్నదియు, కర్తృ...యున్ - కర్తృత్వ = ఆయా పనుల నన్నిటిని నేనే చేయువాఁడ ననుకొనుటయు, భోక్తృత్వ=తత్తత్క్రియా ఫలముల నేనే యనుభవించువాఁడ ననుకొనుటయు, ఆది = మొదలగు, ధర్మ = గుణములతో, సమేతయుఁ = కూడుకొని యున్నదియు, ఐన బుద్ధి = అగునట్టి నిశ్చయాత్మకజ్ఞానము, విలసిల్లుఁ = ఒప్పును, అదియె = ఆ నిశ్చయజ్ఞానమే, బిందువు - అనఁ - పరఁగుఁ = చిద్బిందు వన నొప్పును; అది = ఆ చిద్బిందువు, సర్వ...యుఁ - సర్వ=నిఖిలములైన, కార్య = కార్యభూతము లగునాకాశాదులకును, కారణ = తత్తత్కారణములగు మహదాదులకును, ఆశ్రయయుఁ = అవలంబనమైనదియు, నిఖిల + వాసనా + వాసితయుఁ = చిత్తసంస్కారము లన్నిటితో సంబంధించియున్నదియు, అగుఁ = అయియున్నది, కావునఁ = అట్లుండుటచే, ఆ...తోఁ - ఆ=పూర్వోక్తములైన, మానస = అంతఃకరణ చతుష్టయముతోను, మారుత = దశవిధవాయువులతోను, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములుపదింటితోను,శరీరంబులతోఁ=స్థూలసూక్ష్మకారణో పాధులతోను, కూడి = కలసి, విషయ + అభిముఖి - ఐ = శబ్దాదివిషయములకు నెదురుగఁ బ్రసరించినదగుచు, తత్ + చాంచల్యంబువలనఁ = ఆ విషయములయొక్క చలనమువలన, తాను = చిద్బిందువును, చలించుచుఁ = విలోలమగుచు, బహిః...అనుభవంబుఁ - బహిః = జాగ్రదవస్థయందు బాహ్యేంద్రియగోచరములైనట్టియు, అంతః = స్వప్నావస్థయందు నంతరింద్రియగోచరము లగునట్టియు, విషయ = వేద్యార్థముల యొక్క, అనుభవంబుఁ = అనుభవించుటను, చేయుచుఁ = కావించుచు, సుషుప్తియందుఁ = గాఢనిద్రయందు, అజ్ఞాన + ఆకారంబు - అగుచుఁ = తమోగుణముచేఁ గప్పఁబడినదియై, జాగ్రత్ + స్వప్నంబుయందుఁ = పైని జెప్పినయట్లు జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును, బుద్ధి + ఆది + ఆకారంబు - ఐ = బుద్ధి మొదలగు

స్వరూపము గలదియై, తోఁచుచున్ = తోఁపట్టుచు, అనాది - కాలంబున నుండి = లెక్కలేని పెక్కు పుట్టువులనుండియు, ముక్తి + పర్యంతంబున్ = పరమపురుషప్రాప్తిరూపమగు మోక్షము గలుగుదనుక, అనంత + కర్మంబులు = అనేకవిధము లగు పెక్కుపనులను, ఆచరించుచున్ = ఒనర్చుచు, తత్ + ఫలంబులు - అగు = ఆకర్మలకు ననురూపముగఁ గలిగెడు, సుఖదుఃఖములన్ = మేలును కీడును, భుజించుచున్ = అనుభవించుచు, అవిచార + రూపిణి - ఐ = అవివేకమే యాకారముగఁ గలదియగుచు, నిరంతర + పర్యటన + శీల - ఐన = నిత్యము నిటు నటు దిరుగుటయే ప్రకృతిగఁ గలదియగుచు, ఉండున్ = ఉన్నది, మఱియును = ఇంతియకాక.

తా. వాయుపుత్త్రీ! మఱియు న్వినుము. జననీజనకులచేఁ దినఁబడిన యోగిరమువలనఁ గలుగు శుక్లశోణితములచేఁ బుట్టినది యై, తోలు - నంజుడు - నెత్తురు - క్రొవ్వు - ఎమ్ములు - ప్రేవులు నను నాఱు ఒఱలు గల యీపాంచభౌతికం బగు మేనునం దున్న డెబ్బదిరెండువేల నరములలో నిడయు, పింగళయు, సుషుమ్నయు ననుమూఁడునరములు పరమశ్రేష్ఠములు. అందు బ్రహ్మనాడియగు సుషుమ్న యనునాడి నాడులకన్నిటి కిని గుణనాయకము. పాయుస్థానమునకు రెండంగుళములమీఁదను, శిశ్నమునకు రెండంగుళముల దిగువను నున్నమేను నడిమిపట్టైన గుదస్థానము వైపు క్రిందుగ మీఁదిభాగమును గలది యై మూఁడు మూలకోణములు గల మూలాధారచక్ర మొకటి గలదు. అది మొదలుకొని మీఁదుగ సహస్రార మను చక్రముదనుక మేనునకు వెనుకవైపున, వీణెయందుం గలమధ్యకాండమువలె నరములకెల్ల నుత్పత్తిస్థానమై కొనమొదలు ద్రెంచినవెదురు గొట్టమువడువున నుండి యాఱుచక్రములకు నాధారమై బ్రహ్మదండి యనఁ బ్రసిద్ధమగు నొక పెద్దయెముక గలదు. దీనికి నాధార మగు మూలాధారచక్రముయొక్క మీఁదికోణమున నుండి కుండలి యను నొకశక్తి

తోఁ గలసి దశవిధప్రాణములకును జఠరాగ్నికిని దశవిధప్రణవనాదముల కును నునికిపట్టయి సావిత్రియనియు సరస్వతియనియు పేళ్లు గలిగి బ్రహ్మ రంధ్రమునుక వ్యాపించి యీ సుషుమ్నానాడి యున్నది. దీనికిఁ గుడి యెడమప్రక్కలయందు మూలాధారచక్రము మొదలు ముక్కుకొనదనుకఁ బ్రసరించి నరములగమిచే నల్లుకొనఁబడియున్న పితృయాన యనియు దేవ యాన యనియుఁ గ్రమమునఁ బేరులు గల ఇడాపింగళ లనునాడులు రెండు ధూమాదిమార్గమున చంద్రమండలమును నర్చిరాదిమార్గమున సూర్యమండల మును బొందుటకుఁ దగియున్నవై యొప్పును; మఱియు, నీ రెండునాడులు నాభీప్రదేశమునందుఁ గోడిగ్రుడ్డుపడువున నున్న నాడీమండలమునుండి పుట్టి నవి; ఇంకను, గాంధారి యనియు, హస్తిజిహ్వాయనియు పేరులు గల రెండు నాడికలు రెండుకన్నులకొనలదనుకఁ బ్రాఁకియున్నవి. పూష యనియు, అలంబూష యనియు రెండునాడులు వీనుల రెంటి నంటియున్నవి; శుక్ల యను నొకనాడి కనుబొమలనడిమిపట్టున నున్నది. మఱియు ముక్కుయొక్క రెండు బిలములును, చెవులయొక్క రెండు బిలములును, కనుబొమల నడిమి పట్టునకు దిగువను గలసియుండు చోటునకు శృంగాటక మనియుఁ, జతుష్పథ మనియుఁ బేరు; గంగ యనఁబడు నిళయు, యమున యనుపేరు గల పింగ ళయు, సరస్వతి నాఁబడు సుషుమ్నయుఁ గలిసినచోటగు భ్రూమధ్యంబు త్రికూటం బనియుఁ ద్రివేణీసంగమం బనియుఁ బిలువంబడు; మఱియు నాలుక కొనదనుక వ్యాపించియున్న సరస్వతి యనునరము పలుకులను బలికించుచుం డును; విశ్వోదరి యనునరము భక్ష్యభోజ్యలేహ్యచోష్యము లను నాల్గువిధము లగు నన్నరసములఁ దినుచుండును; పయస్విని యనునాడి గళమునం దుండి యాఁకలినీరుపట్టులఁ గలిగించుచు నుదకము నానుచుండును; ఇంతియ కాక, నాభీప్రదేశమునందలినాడీమండలమువలన నుద్భవించిన రక్తయు సినీవాలియు, కుహువు ననుమూఁడునాడులు దిగువవైపు వ్యాపించియున్న వి; వానిలో రక్తయనునది రేతస్సును, సినీవాలి మూత్రమును, కుహూనా

రోతిని పైకిఁ జిమ్మును; శంఖినియు దామినియు నను రెండునాడులు తినిన యోగిరవుఁబస నెల్లఁ గైకొని సహస్రారమునకుఁ జేర్చి యందు నమృతరసముగ మార్చును; ఈ నరములు గాక యింకను నూటయొక్కటి లెక్కగల నరములు హృదయకమలము నాశ్రయించియున్నవి; వానిలో నొకనరము మీఁదుగ వ్యాపించియుండు; ఈనాడీమార్గమునకు ముక్తిమార్గ మని బ్రహ్మవాదులు పలుకుదురు; ఈపదువున నేర్పఱచి వచియించిన నరము లన్నియుఁ బ్రధాననాడులు. అందుఁ బూర్వోక్తము లగు నిడయుఁ బింగళయు సుషుమ్నయు నను నీ మూఁడునాడులునుఁ బ్రధానతమములు; ఈ మూఁడిటిలోఁ గూడ బ్రహ్మనాడి యనఁబడు సుషుమ్న నరముల కెల్లఁ దలమానికము; పైని జెప్పినయ ట్లడ్డుగను మీఁదుగను గ్రిందుగను వ్యాపించి మిగుల సూక్ష్మరంధ్రములు గల యిఱువదిరెండువేల నరములయందునుఁ గదలుటయు, పరుగిడుటయు, వణఁకుటయు, ముణుఁచుటయు, నెండించుటయు నను గుణంబులు గల ప్రాణము మొదలగు ప్రధానవాయువు లైదు, నాగము మొదలగు నుపవాయువు లైదునుఁ దిరుగుచు నుండును; ఆ దశవిధ వాయువులలోఁ బ్రాణవాయువు హృత్ప్రదేశమునందుండి యిడయుఁ బింగళయు నను రెండునాడుల బిలములనుండి యెగయూపిరియాకృతితోఁ బైకి వెలువడి పండ్రెండంగుళములవఱకు నేగి మహావాయువునందు విలీనమగును; అపానమను గాలి దిగయూపిరిరూపుతోఁ బ్రాణవాయువునకు నభిముఖముగ నేగుచు గుదప్రదేశమునందు నిలిచి క్రిందుగ వ్యాపించియున్న మూఁడునాడులవలన మలమూత్రాదివిసర్జనమును జేయుచుండును; ఉదానవాయువు కుత్తుకయం దుండి డెంపమునందుఁ గల సంకల్పవికల్పములచేత నాలుక దవుడలు మొదలగు నెనిమిదిస్థానములవలన వాఙ్మయము నెల్ల నుచ్చరింపఁజేయుచు దట్టమగు నిదుర వచ్చునపుడు ఇంద్రియములనెల్ల శబ్దాదివిషయములనుండి మరలించి మెలఁకువ వచ్చునపుడు మరల శబ్దాది విషయములయందు వ్యాపింపఁజేయుచు ...ఁ ద త్తత్కర్మానురూపంబు లగు పుణ్యపాపలోకంబులకు రాకపోకలఁ

జేయుచు నగ్నిరూపమునను జంద్రరూపమునను సుషుమ్నా నాడీబిలము నవలంబించి బ్రహ్మరంధ్రమునకు మీఁదుగ నేగును; వ్యాన మను పవమానము మేనెల్లఁ గ్రమ్మి పైనుండు చలువవేఁడుములలోనికి, లోనుండు జలువవేఁడుములఁ బైకినిఁ గలుగఁజేయుచుఁ దినినయోగిరపుఁబసల నంతటఁ బట్టించుచుండును; సమాన మను పవమానము బొడ్డుపట్టున నుండి కడుపుచిచ్చును మండునట్లు గావించి జంతువులచే భుజింపఁబడు భక్ష్యభోజ్యలేహ్యపానీయములను బాగుగఁ బచనముగావించి నరముల కన్నిటికిని విభజించి యిచ్చుచుండును; నాగమను నాశుగము తేనుపును, కూర్మ మను పవనముకను రెప్పలను దెఱచుటను, కృకర మను వాతము తుమ్మును, దేవదత్తమను మరుత్తు ఆవులింతను, అంతటను వ్యాపించియుండెడు ధనంజయ మనుననిలము చచ్చినప్పుడుగూడ మేనువిడువక యొడలునకుఁ బొంగును గలిగించుచు నుండును; ఇత్తెఱంగునఁ బదివిధంబు లగు గాలులతోఁ గలసి జ్ఞానేంద్రియములతోడను కర్మేంద్రియములతోడను గూడి కామక్రోధలోభ మోహమదమాత్సర్యములు మొదలగు వికృతులతో సమన్వితంబైన డెందంబు శబ్దాది విషయములవలనఁ గలుగుముదమును బడయుటకు శ్రోత్రాదీంద్రియగోళములకు నభిముఖ మగుచుఁ గర్ణేంద్రియముచేత వాగ్రూపమును వాద్యాదిరూపము నగు శబ్దజాతమును, చర్మేంద్రియముచేత మెత్తన - గట్టి - వేఁడి - చలి - మిశ్రము - అను నైదు విధములగు స్పర్శమును, నయనేంద్రియముచేత నెఱుపు తెలుపు నలుపు పసపు ఆకుపసపు - మిశ్రము - అను నాఱురంగులుగల రూపులను; రసనేంద్రియముచేత తీపి పులుసు చేదు ఉప్పు కారము ఒగరు అనునాఱురసములను, ఘ్రాణేంద్రియముచే మంచివాసన చెడువాసన మిశ్రవాసన అను ముత్తెఱంగులగు తావులను అనుభవించుచు, మఱియు వాగింద్రియముచేఁ బలుకులను, పాణీంద్రియముచేఁ బరిగ్రహణమును, చరణేంద్రియముచే గమనాగమనములను పాయ్వింద్రియముచే మలమూత్రాదివిసర్జనమును; ఉపస్థేంద్రియముచే సుఖమును, గావించుచుండును; ఆమనస్సును సాధనముగఁజేసికొని పూర్వో

క్త ప్రాణాదివాయువులయొక్కయుఁ జిత్తముయొక్కయుఁ జివర నుండు నదియు, కర్తృత్వము భోక్తృత్వము మొదలగు గుణములతోఁ గూడినదియు నగు బుద్ధి యొప్పుచుండు; నీ బుద్ధియే చిద్బిందు వనఁబడు; నిది సమస్తములైన కార్యవర్గమును దత్తత్కారణములను నవలంబించి సమస్తచిత్తసంస్కారములతో సంబంధించి యుండునుగాన మనస్సుతోను దశవిధవాయువులతోను దశేంద్రియములతోను స్థూలసూక్ష్మశరీరములతోను గలసి శబ్దాదివిషయములకు నెదురుసని యా మనోవాయు శరీరచలనములవలనఁ దాను గూడఁ గదలాడుచు బాహ్యవిషయములను నాంతరవిషయములను ననుభవించుచు గాఢనిద్రయందు నజ్ఞానస్వరూప మగుచు, మెలఁకువయందునుఁ గలయందును బుద్ధి మొదలగు రూపు గలదియై తోఁపట్టుచు మొదలులేనితటి నుండి మోక్షము గలుగుదనుక పెక్కుచెయువులం జేయుచు, నాకర్మలకు ఫలము లగు నెలమియిడుమలఁ గుడుచుచు నాత్మానాత్మవివేచనము లేక యెల్లపుడును దిమ్మరుచునుండు నెండియును. ౧౬౬

అవ. పూర్వము సాధారణముగ నిర్దేశింపఁబడిన చిద్బిందువుయొక్కయుఁ గళయొక్కయుఁ బ్రణవనాదముయొక్కయు స్వరూపమును విశేషాకారముగఁ జెప్పుచున్నది.

క. ప్రతనుప్రాణమనోగ
స్థితబుద్ధియె బిందువందుఁ దెలఁగెడునాత్మ
ప్రతిబింబమె కళ పవనో
న్నత ఘోషమె నుమ్ము ప్రణవనాదము వత్సా! ౧౬౭

టీ. వత్సా = పుత్త్రికా, బిందువు=తొల్లి చెప్పఁబడిన చిద్బిందువు, ప్ర...బుద్ధి - ప్రతను = అన్నమయకోశమగు స్థూలదేహమునకును, ప్రాణ=ప్రాణమయ కోశములోఁ జేరిన పూర్వోక్తదశవిధవాయువులకును, మనః = మనోమయకోశ మగు సంకల్ప వికల్పాత్మక మనస్సునకును, అగ్ర = మీఁ

దుగ, స్థిత = ఉన్న, బుద్ధియె = విజ్ఞానమయకోశాత్మక మగుమతియే, అగును = (పంచకోశములలో నాలుగవదియగు విజ్ఞానమయకోశమే బిందు వనఁబడును), అందున్ = బుద్ధిరూపమగు నాచిద్బిందువునందు, చెలఁగెడు + ఆత్మ + ప్రతిబింబము + ఎ = ఆనందస్వరూపుఁడగు పరమాత్ముని యొక్క యంతర్యామిరూపమునఁ బ్రతిఫలించుటయె, కళ = పూర్వోక్త చిత్కళావిశేషములు, (ఆనందమయకోశాత్మక మగు భగవదంతర్యామి రూపమే కళ యనఁబడును), పవన + ఉన్నత + ఘోషము - ఎ=ప్రాణాది వాయువులయొక్క గొప్పధ్వనియె, ప్రణవనాదము= తొలుతఁ జెప్పఁబడిన పదితెఱంగులు గల యోంకారనినాదము, సుమ్ము = సుమీ (గర్భగోళమునందుఁ బ్రాణాదివాయువు లుచ్ఛ్వసనిశ్వాసరూపమునఁ బ్రసరించునపుడు గలుగు నాంతరధ్వనియే పూర్వోక్తదశవిధప్రణవనాద మగును.)

తా. అన్నమయ ప్రాణమయ మనోమయ కోశములకు నతీతం బగు విజ్ఞానమయకోశమే చిద్బిందువు. ఆ చిద్బిందువునందుఁ బ్రతిఫలించి దానికిఁ బ్రకాశకం బై యానందమయకోశాత్మకం బగు భగవదంతర్యామి రూపమే చైతన్యకళ యగును. మఱియు గర్భగోళమునఁ బ్రాణాదివాయువులసంచారమువలనఁ గలుగు నాంతరశబ్దమే ప్రణవనాద మనఁబడును.

క. ఆ నాదబిందుకళలం
గానంబడుచుండువానిఁ గనుపురుషుఁడె ప్ర
జ్ఞానఘనుఁ డై నరాముఁడు
నానావిధ తత్త్వములకు నాథుఁడు పుత్త్రా. ౧౬౮

టీ. ఆ+నాద+బిందు+కళలన్ = పూర్వోక్తములైన ప్రణవనాదములయందును, జీవరూప మగు చిద్బిందువునందును, స్వాంశభూతము లగు చైతన్య కళలయందును, కానంబడుచుండువానిన్ =పరిదృశ్యమానము లగు సమస్తపదార్థములను, కను+పురుషుఁడు - ఎ = సర్వసాక్షియై యుప

కించుచున్న యానందమయుఁడగు పరమపురుషుఁడే, ప్రజ్ఞాన+ఘనుఁడు= సర్వజ్ఞుఁడగుటచేఁ బ్రకృష్టజ్ఞానసంపన్నుఁడు, ఇన + రాముఁడు = ఇనట్టి యీశ్రీరామచంద్రుఁడు, [మఱియు నితఁడు], నానా + విధ + తత్త్వములకున్ = చిదచిద్రూపములచేఁ బహువిధములగు భగవద్విభూతము లైనవస్తుజాతములకు, నాథుఁడు = ఈశ్వరుఁడు, అగును.

తా. పూర్వమునందు వివరింపఁబడిన దశవిధ ప్రణవనాదముల యందును, చిద్బిందువునందును, కళలయందును, దోఁచు నశేషవిశేషములకు సాక్షియై, జడచిదాత్మకము లగు చతుర్వింశతితత్త్వములకు నధీశ్వరుం డును, ప్రభూతజ్ఞానముచే సర్వాధికుండు నగు నా పరమపురుషుఁడే యీ రామచంద్రుఁడు. ౧౬౮

అ. ఇట్లు ప్రసక్తానుప్రసక్తంబుగ నాడీవిభాగంబును నాదబిందుకళాస్వరూపనిరూపణంబును గావించి, వాయుమనో నిగ్రహమునకు మూలకారణ మగు హంసతత్త్వానుభవమును "అట్టిబిందువు చాంచల్య మణఁగ డెందు హంసతత్త్వంబు నెఱుఁగక" అని యుపక్రమింపఁబడినదానిని నుపదేశించు చున్నది.

సీ. అట్టి శ్రీరామత । త్త్వాభాసకళతోడ
నెనసినయాబిందు । వెల్లప్రొద్దు
మార్తాండచంద్రాగ్ని । మండలాన్వితసూక్ష్మ
చక్షురగ్రమునకు । సరి నధోము
ఖంబుగా నున్నహృ । త్కమలంబులో బహి
ర్ముఖ మై స్వవిషయాను । భూతిఁ దగిలి
మానక పవమాన । మానసేంద్రియదేహ
సంగతి నూరక । సంచరించు

తే. నట్లు గావున దశనాడికాంతరస్థ
దశవిధేంద్రియపవనచిత్తముల నెల్ల
హంసతత్త్వానుభవమున నడఁచి నిలిపి
యచలముగఁ జేయు మంతట నాంజనేయ! ౧౬౯

టీ. ఆంజనేయ = ఓ అంజనానందనా! అట్టి...తోడన్. అట్టి = మీఁదఁ బలుకఁబడిన, శ్రీరామ = పరవాసుదేవుని పూర్ణవిభవ రూపుఁడైన శ్రీరామచంద్రునియొక్క, తత్త్వ = పరతత్త్వముయొక్క, ఆభాస - "తదనుప్రవిశ్య సంచ్చత్యచ్చాభవత్" అనుటచే నంతర్యామి రూపమునఁ బ్రవేశించిన, కళతోడన్ = ఆ చిత్కళతో, ఎనసిన + ఆ + బిందువు = కూడుకొనియున్న జీవరూపమగు పూర్వోక్తబిందువు, ఎల్ల + ప్రొద్దున్ = ఎల్లప్పుడును, మార్తాండ...అగ్రమునకున్ - మార్తాండ = ఆదిత్యునియొక్కయు, చంద్ర = చంద్రునియొక్కయు, అగ్ని = వైశ్వానరునియొక్కయు, మండల = మండలములతో, అన్విత = కలసియున్న, సూక్ష్మ = పరమసూక్ష్మమైన, చక్షుః = నయనేంద్రియముయొక్క, అగ్రమునకున్ = మీఁదిభాగమునకు, సరిన్ = తిన్నగ, అధోముఖంబుగాన్ = తలవంపుగ, ఉన్న + హృత్కమలంబుతోన్ = ఉండినట్టి హృదయారవిందముతోఁ గూడి, బహిర్ముఖము - ఐ = వెలుపలికి వ్యాపించినదై, స్వ + విషయ + అనుభూతిన్ = తనకు గోచరము లగురూపాదుల యనుభవమునందు, తగిలి = చిక్కి, మానక = ఆ విషయానుభవమును వదలక, పవమాన...సంగతిన్ - పవమాన = పూర్వోక్తము లగు ప్రాణము మొదలగు గాలులయు, మానస = మనో బుద్ధి చిత్తాహంకారములయు, ఇంద్రియ = చక్షురాదులగు నింద్రియములయు, దేహ = స్థూలశరీరముయొక్కయు, సంగతిన్ = కలయికచేత, ఊరక = తెంపులేక, సంచరించున్ = జననమరణాదిరూపమగు సంసారచక్రమునందుఁ బడి తిరుగుచునుండును ;

గావునన్ = ఆరీతిఁ దిరుగుచుండుటచేత, దశ...చిత్తములన్ - దశ + నాడికా = నరములకన్నిటికిని ముఖ్యములైన యిడాపింగళాసుషుమ్న లను మూఁడునాడులును, నాలుకకొనదనుక వ్యాపించియుండు సరస్వతీనాడియు, నన్నములను దిను విశ్వోదరియుఁ, గంఠదేశంబున నుండు పయస్వినియు, శుక్లంబును వెడలించురక్త యనునాడియు, మూత్రంబును బైకిఁద్రోయు సినీవాలియు, మలంబును దిగఁద్రోయు కుహూనాడియు, భక్షితాన్నరసముల నమృతరూపముగ మార్చు శంఖినియు (లేక సౌదామినియు) నను నీపదినరములయొక్క, అంతరస్థ = మధ్యప్రదేశమునం దుండెడు, దశవిధ + ఇంద్రియ = చక్షురాదులగు పదియింద్రియములను, పవన = పూర్వోక్తరీతిని బదితెఱంగులం గల ప్రాణాదివాయువులను, చిత్తములన్ = మనస్సును, ఎల్లన్ = వీనినన్నిటిని, హంస + తత్త్వ + అనుభవమునన్ = పూర్వోక్తరీతిని, జీవరూప మగు హంసయొక్క వస్తుతత్త్వము నెఱుంగుటచేత, అడఁచి = నిగ్రహించి, నిలిపి = విషయములయందుఁ బడకుండఁ జేసి, అచలముగన్ = చలియింపకుండునటులు, చేయుము = ఒనర్పుము, అంతటన్ = పిమ్మట, ముందున కన్వయము.

తా. ఓ యాంజనేయా! పరమపదనాథుఁ డగు శ్రీరామచంద్రుని యొక్క పరతత్త్వసంబంధ మగు ప్రతిబింబకళకు (అంతర్యామిరూపమునకు) శేషభూతమైన (పృథక్సిద్ధముకాని) పూర్వోక్త చిద్బిందువు నిరంతరమును తేజోమయము లగు సూర్యాదికాంతుల ననుసరించి యాయారూపంబుల గ్రహించు పరమసూక్ష్మమైన నయనేంద్రియస్థానమునకు తిన్నగ నున్నదై పైకిఁ బ్రసరించుటకుఁ దలవంపుగ నున్న యంతఃకరణపద్మముతోఁ గలసి ప్రపంచాభిముఖమై తనకు గోచరము లగు సకలపదార్థముల ననుభవమునందలి యాసక్తిని విడువక ప్రాణాదివాయువులను మనోబుద్ధిచిత్తాహంకారములయుం జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయు స్థూలోపాధియొక్కయు సంబంధము చే విరామములేక తిరుగుచునుండును గాన, వెనుకఁ జెప్పినయట్లు ప్రధానము

లైన పదితెఱంగులం గల వరములనడుమ నున్న యీ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను ప్రాణములోనుగాఁగల పదివాయువులను నంతఃకరణచతుష్టయమునుగూడ "వినుము పాలునీళ్లు - విభజింప నేర్చిన। పరమహంసపగిదిఁ బ్రబవిదితార్య। పరమహంసుఁడైన ♦ పరమహంసుఁ డసార। సారములను బంపఁ ♦ జాలు ననఘ!" అని వెనుకఁ జెప్పఁబడినలక్షణము గల పరమహంసస్వరూపముయొక్క వస్తుతత్త్వము ననుభవించుచుండుటచేతఁబట్టి నిగ్రహించి తొంటియట్లు తిరుగకుండ నొనరింపుము. ౧౬౯

అవ. పూర్వోక్త మగు హంసతత్త్వానుభవమును విశేషాకారముగఁ దెలుపుచున్నది.

ఆ. ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో
మానసమును గూర్చి వానితోడ
హంస యనఁగ నొప్పు నక్షరద్వయము యో
జించి సంతతము భజింపవలయు. ౧౭౦

టీ. ఇంద్రియములన్ = చక్షువు మొదలగువానిని, నిగ్రహించి = బాహ్యములగు రూపాదివిషయములయందుఁ బడకుండఁ జేసి, ప్రాణములతోన్ = ప్రాణము లోనుగఁ గల వాయువులతోడ, మానసమును = అంతఃకరణచతుష్టయమును, కూర్చి = కలిపి (వాయుధారణచే మనోనిగ్రహమును జేసి), వానితోడన్ = ఇట్లు నిగ్రహింపఁబడినయింద్రియములు ప్రాణములు నంతఃకరణము నను వీనితో, హంస+అనఁగన్ హంస యనఁబడు అక్షరద్వయమున్ = రెండువర్ణములను, యోజించి = కూర్చి (పరవాసుదేవుని మూర్తిపంచకములో సూక్ష్మరూప మగు పరమహంస తత్త్వమునందు యోగాభ్యాసబలముచే నిగ్రహింపఁబడిన యింద్రియానిలములతోఁ గూడిన చిత్తవృత్తిని శ్రీహరియందుఁ జేర్చి); సంతతము = నిరంతరమును, భజింపవలయున్ = ఆ శ్రీహరినే ధ్యానించుచు నుండవలయును.

తా. తొలుతఁ జతురాస్యు లగు నింద్రియముల వ్యాపారముల నెల్ల నుజ్జగించి రేచకపూరకకుంభకములచే నిగ్రహింపఁబడిన వాయువునందుఁ జిత్తవృత్తిని నిలిపి యా చిత్తవృత్తిని బరమహంసశబ్దవాచ్యుఁ డగు శ్రీహరి యందుఁ జేర్చి "హంసోహం నేతి సదాధ్యాయన్ సర్వేషు దేహేషు వ్యావర్తతే యథా హ్యగ్నిః కాష్ఠేషు తిలేషు తైలమివ తం విదిత్వా మృత్యుమత్యేతి" కట్టెలయందు నిప్పును నువ్వులయందు నూనెయు నపృథక్సిద్ధ సంబంధమున నున్నయట్లు తనకు శేషభూతము లగు సకలజీవకోటులయందు నంతర్యామిరూపమున వ్యాపించియున్న యాపరవాసుదేవుని దెలిసికొని నిరంతరమును ధ్యానింప సంసారరూపమగు మృత్యువును దాఁటనగును.

వ. అది యెట్లంటేని. ౧౭౧

టీ. ఆ పురుషోత్తమభజనప్రకారం బెట్లనిన.

సీ. అనిశంబుఁ బద్మాసనాసీనుఁ డై చూపు
లమరంగ నాసికాగ్రమున నిలిపి
యింద్రియంబుల నెల్ల నిట్టట్టు పోనీక
మదిచేతఁ దిరముగా గుదియఁబట్టి
ప్రాణాదిదశవిధపవనంబులను వికా
రము లంటకుండఁ జొక్కముగ నునిచి
కామరాగాదిసంకల్పవర్జనముగా
స్వాంతంబు నరసి నిశ్చలముఁ జేసి
తే. యనిలమానసములతోడ హంసమంత్ర
మమరఁ గూర్చి జపించుచు నంతమీఁద
హృదయనభమున బిందువు గదలకుండఁ
బెంపుగా నాదకళల వీక్షింపవలయు. ౧౭౨

టీ. పద్మాసన + ఆసీనుఁడు- ఐ "అస్య తేఽత్ర వాఽనేనేత్యాసనం
పద్మవదవయవసం నివేశస్యాసనం పద్మాసనం" వికసించిన తామరపువ్వు
వలె నవయవములకూర్పు కలది పద్మాసన మనఁబడు లక్షణములు గల
యాసనవిశేషమునందుఁ గూర్చుండినవాఁడై, చూపులు = చూడ్కులను,
నాసికా + అగ్రమునన్ = ముక్కుయొక్క కొనను, అమరన్ - కన్ =
చేరియుండునట్లు, అనిశంబున్ = సంతతము, నిలిపి = ఉనిచి, ఇంద్రి
యంబులన్ - ఎల్లన్ = జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను, ఇట్టు
అట్టు బోన్ ఈక = ఆయారూపము మొదలగు తమతమవిషయములయందుఁ
ప్రసరింపనీక, మదిచేతన్ = పరిశుద్ధ మగు చిత్తముచేత, తిరముగాన్ =
నిశ్చలములగునట్లు, కుదియన్ - పట్టి = బలిమి యడఁగ నిగ్రహించి,
ప్రాణ + ఆది + దశవిధ + పవనంబులన్ = ప్రాణము లోనగు పది
తెఱంగు లగు గాలులను, వికారములు = కదలుట మొదలగు తమతమ
పనులు, అంటకుండన్ = ముట్టకయుండునట్లు, చొక్కముగన్ = నిశ్చలముగ,
ఉనిచి = ధారణచేసి, కామ...కాన్ - కామ = కోరికయు, రాగ =
దారపుత్త్రాదులయందలి ప్రేమయు, ఆది = క్రోధ లోభ మోహ మద
మత్సరములు మొదలగువానియందు, సంకల్ప = ఆలోచన, వర్జనముగాన్ =
లేకయుండునట్లు, స్వాంతంబున్ = అంతఃకరణమును, అరసి = పరికించి,
నిశ్చలము చేసి = నిలుకడ గల దానినిగఁ గావించి, అనిల + మానస
ముల తోడన్ = రేచకాదులచే ధారణ చేయఁబడిన వాయువుతోను
వాయుధారణచే నిగ్రహింపఁబడిన హృదయముతోను, హంసమంత్రము -
సః = అశేష విశేషవిశిష్టుం డగు పరమపురుషుఁడు, అహం = అతనికి
శేషభూతుఁడ నగు నేను (ఆయితిని) అనునర్థము గల హంసమంత్రమును,
అమరన్ = సరిగ, కూర్చి = కలియఁజేసి, జపించుచున్ = పురశ్చరణ
గావించుచు, అంతమీఁదన్ = అటుతరువాతను, హృదయ + నభ
మునన్ = చిత్తాకాశమునందు, బిందువు = చైతన్యబిందువు, కదలకుండన్ =

చలింప కుండునట్లు, వెంపుగాఁ = ఏదేకనిష్ఠగ, నాద + కళలఁ = దశవిధప్రణవనాదములను పూర్వోక్తచిత్కళలను, వీక్షింపవలయుఁ = చూచుచుండవలయును.

తా. "తత్ర స్థిరసుఖ మాసనం" అను పతంజలిసూత్రమునందుఁ జెప్పఁబడినట్లు నిశ్చలంబును సుఖకరమునగు పద్మాసనమునందుఁ గూర్చుండి 'శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః। నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరం। తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియ క్రియః। ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మ విశుద్ధయే। సమంకాయ శిరోగ్రీవం ధారయన్నచలంస్థిరః। సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్। ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః। మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః। యుంజ న్నేవం సదా త్మానం యోగీ నియతమానసః। శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధి గచ్ఛతి" అని గీతాశాస్త్రమునందు శ్రీభగవంతునిచే నుపదేశింపఁబడిన యట్లు ముక్కుయొక్క చిట్టచివరను దృష్టిని నమకూర్చి "తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః" అనుటచేతఁ జక్షురాదులగు సమ స్తేంద్రియములను రూపాదివిషయములయందుఁ బోకుండునట్లు నిగ్రహింపఁ బడిన మనస్సుచే నడఁగఁద్రొక్కి ప్రాణము లోనుగాఁ గల యాభ్యంతర వాయువుల నన్నిటిని నుచ్ఛ్వాసనిశ్వాసరూపంబులగు తమతమకృత్యముల యందుఁ జిక్కకుండ నిశ్చలముగ ధారణచేసి దారేషణ పుత్త్రైషణ ధనే షణములు మొదలగువానియందలి సంకల్పవికల్పములు లేకుండునట్లు అంతః కరణవృత్తులను నిగ్రహించి, పూర్వోక్తరీతిని రేచకపూరకకుంభకాభ్యాస ముచే ధారణచేయఁబడిన వాయువును వాయుధారణావశమున నిశ్చలమగు చిత్తమును హంసమంత్రార్థ మర్థమగు పరవస్తువునందుఁ జేర్చి యాహంస మంత్రపురశ్చర్యం జేయుచుఁ బిమ్మటఁ జిత్తాకాశమందుఁ బూర్వోక్త

చిద్బిందువును నిశ్చలముగఁ జేసి చిణిచిణిప్రభృతులగు దశవిధప్రణవనాదములను సూర్యాగ్నిచంద్రకళావిశేషములను బరికింపవలెను. ౧౭౨

అవ. మీఁదఁ జెప్పినయట్లు "సోహం సోహం సోహం సో" అని యఖండాకారముగ జపియించుచుండ "హంసో" యని వినఁబడు హంసపదముయొక్క యుత్తరార్థమును వివరించుచున్నది.

ఆ. నాదబిందుకళల కాది యై ద్రష్ట యై
సర్వదృశ్యములకు సాక్షి యగుచుఁ
జిత్స్వరూప మైనశ్రీరామతత్త్వ మా
నమల మగు హకార మాంజనేయ! ౧౭౩

టీ. ఆంజనేయ! నాద + బిందు + కళలకున్ = దశవిధోంకార నాదములకు చిద్బిందువునకు చిత్కళలకును, ఆదియై=హేతుభూతమును, ద్రష్టయై = పరికించునదియును, సర్వ + దృశ్యములకున్ = చూడఁబడు పదార్థములకెల్ల, సాక్షి = కనుఁగొనునదియు, అగుచున్ = అయి, చిత్ + స్వరూపము = శుద్ధ చైతన్యమే యాకారముగఁ గలది, ఐన = అగు, శ్రీరామతత్త్వము = పరమపురుషుని విభవరూపుఁ డగు శ్రీ రామచంద్రుని యొక్క వస్తుతత్త్వము, అమలము + అగు + హకారము = సకార బిందు సంబంధము లేని కేవల హకారము, ఔన్ = అగును.

తా. ఓ యాంజనేయ! హంసశబ్దమునందలి హంకారము పూర్వోక్త నాదబిందుకళలకు మూలమును, వానిస్వరూపమును బరికించునదియుఁ బ్రపంచమునఁ జూడఁబడుపదార్థములకెల్ల సాక్షియు నగు తెలివియే రూపుగఁ గలది యగు శ్రీరామచంద్రుని వస్తుతత్త్వ మగును. ౧౭౩

అవ. ఇఁక హంసశబ్దమునందలి కడపటి సకారముయొక్క యర్థమును జెప్పుచున్నది.

తే. మహితదేహేంద్రియప్రాణమానసాది
దృశ్యరూపిణియును జడాత్మికయుఁ ద్రిగుణ
కలితయు, ననాదియు, మహావికారి యైన
ప్రకృతి యగును సకారంబు పరమపురుష ! ౧౭౮

టీ. పరమ + పురుష = సత్పురుషుఁడ వగు నో హనుమానుఁడా, సకారంబు = హంసపదమునందలి స యనునక్షరమును, మహిత... యును- మహిత = పైపైవన్నెలు గల, దేహ = స్థూల సూక్ష్మ కారణ శరీరములును, ఇంద్రియ = చక్షువు లోనగు పదియింద్రియములును, ప్రాణ = దశవిధవాయువులును, మానస = అంతఃకరణ చతుష్టయమును, ఆది = మొదలుగఁ గల, దృశ్య = పూర్వోక్తరీతిని సర్వసాక్షియు హకారవాచ్యుఁడు నగుపరమాత్మునకు గోచరము లగుపదార్థములే, రూపిణియు = స్వరూపముగఁ గలదియు, జడాత్మికయు = చేతనాచేతనములలో నచేతనమయయు, త్రి + గుణ + కలితయు = "సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః" అను కాపిలసూత్రమునుబట్టి సత్త్వరజస్తమోగుణాత్మికయు, అనాదియుఁ "మూలే మూలాభావా దమూలం మూలం = మూలప్రకృతికి మూలము (కారణము) లేదుగాన నామూలప్రకృతి యమూలము (అనాది)" అను సాంఖ్యసూత్రముచేఁ దనకు వేఱొండు కారణము లేనిదియు, మహావికారి "ప్రకృతే ర్మహా న్మహతో౽హంకారో౽హంకారా త్పంచతన్మాత్రాణి, ఉభయ మింద్రియం, తన్మాత్రేభ్య స్స్థూలభూతాని" అని సృష్టిక్రమమును బ్రతిపాదించు సాంఖ్యసూత్రముచే మహత్తత్త్వము మొదలగు ప్రకృతివికృతిసంఘాత మెల్ల మూలప్రకృతి యొక్క వికృతి గాన మహదాదిరూపమునఁ బరిణమించినదియు, ఐన + ప్రకృతి = అగునట్టి మూలప్రకృతి, అగును పూర్వోక్తసకార మగును.

తా. ఓ పురుషశ్రేష్ఠుఁడ వగు నాంజనేయా ! హంసశబ్దమునందలి సకారము పంచీకృతపంచమహాభూతములవలన నుత్పన్నమైన స్థూలశరీర

మును, నపంచీకృతభూతతన్మాత్రలకార్యము లగు జ్ఞానేంద్రియములును, మఱియు వాగాది కర్మేంద్రియములును, దశవిధవాయువులు మనోబుద్ధి చిత్తాహంకారములు మొదలుగాఁ గల పరిదృశ్యమానపదార్థములే స్వరూప ముగఁ గలదియుఁ, గేవలకార్యైకగమ్యయు నచిద్రూపిణియు, సత్త్వ రజస్తమోగుణములసామ్యావస్థచే నొప్పుచున్నదియు మహత్త్వము మొద లుగఁ గల పదియాఱువికృతులు గలదియు నగు మూలప్రకృతియే యగును. అనఁగా మూలప్రకృతి హంసశబ్దమునందలి సకారముచేఁ జెప్పఁబడుచున్న దని తాత్పర్యము. ౧౭౪

అవ. ఇట్లు చిదచిదీశ్వరులలో మొదట హంసపదము నందలి హకార మీశ్వరుం డనియు సకారము అచిత్తగుప్రకృతి యనియుఁ జెప్పి యిఁకఁ జిద్రూపుఁ డగు జీవుని స్వరూపముం దెలుపుచున్నది.

క. వినుమా పురుషప్రకృతుల
ఘనతాదాత్మ్యంబు మధ్యగతబిందువు గా
వున హంస యనఁగ జీవుం
డనిలమనోయుక్తుఁ డగుచు నతఁడు వెలుంగున్. ౧౭౫

టీ. ఓ యాంజనేయా, వినుమా = నేను జెప్పుసంగతిని సావధాన ముగ నాలకింపుమీ, పురుష - ప్రకృతుల = హంసశబ్దమునందలి హకార ముచేఁ జెప్పఁబడు పరమపురుషునియొక్కయు, సకారముచేఁ జెప్పఁబడు జడమగు ప్రకృతియొక్కయు, ఘన - తాదాత్మ్యంబు = మిక్కుటమగు శేషిశేషభావము, లేక శరీరిశరీరభావము, మధ్య - గత - బిందువు = హంసపదమునందు హకార సకారములకు నడుమనున్న పూర్ణానుస్వారము, కావునన్ = అగుటంజేసి, హంస - అనఁగన్ = హకార పూర్ణానుస్వార సకారసంఘాతరూప మగు హంసశబ్దవాచ్యుఁ డయి, జీవుండు = చిదాత్మ

కుఁ డగు ప్రత్యగాత్మ (అగును), అతఁడు = ఆజీవుఁడు, అనిల - మనః - యుక్తుఁడు = ప్రాణము లోనగు పదివాయువులతోను, అంతఃకరణచతుష్టయముతోనుఁ గూడుకొనినవాఁడు, అగుచున్ = అయి, వెలుంగున్ = ఒప్పును.

తా. ఓ హనుమానుఁడా! భగవత్తత్త్వమును గూర్చి నేను జెప్పు సంగతులను సావధానముగ నాకర్ణింపుము; హంసశబ్దమునందు నడుమనున్న నిండుసున్న పరమపురుషునకునుఁ దచ్ఛక్తి యగు ప్రకృతికిని గల యాత్మశరీరరూప మగు తాదాత్మ్యమును దెలుపుచున్నది. కనుక హంస యన జీవుఁడు; ఆ జీవుఁడు ప్రాణాదివాయువులతోను నంతఃకరణముతోను నిత్యము గలసియుండును. ౧౭౫

అవ. ఇట్లు పైమూఁడుపద్యములచేతఁ బరమాత్ముని యొక్కయుఁ, బ్రకృతియొక్కయుఁ, బ్రత్యగాత్మఁ డనఁబడు జీవునియొక్కయు స్వరూపమును హంసశబ్దనిర్వచనముచే వివరించి హృత్పుండరీకమున హంసశబ్దవాచ్యుఁ డగు జీవునియొక్క సంచారక్రమమును నుపదేశించుచున్నది.

వ. ఇట్లు నిర్వికారుండైన పురుషునకుఁ గేవలజడాత్మికయైన ప్రకృతికిం బ్రత్యేకంబుగాఁ గర్తృత్వభోక్తృత్వాదిరూప సర్వసంసారంబు ఘటింప దట్లుగావున హకారస్వరూపకుం డైన యాత్మం డాదిశక్తియైన సకారంబుతో నన్యోన్యతాదాత్మ్యాధ్యాసరూపంబునఁ గూడి హంసస్వరూపుం డై నజీవుం డై నవద్వారపురంబునం బ్రవేశించి వివిధేంద్రియప్రాణమనోయుక్తుం డై పంజరాంతరంబున మెలంగుపులుంగు తెఱంగునం జిక్కి వెడల నుపాయంబు గానక నానావిధ భోగంబుల ననుభవించుచుం గ్రీడించునట్టిహంసకు నగ్ని

హోమలు పక్షంబు లోంకారంబు శిరంబు త్రినేత్రంబు, ముఖంబు, రుద్రరుద్రాణులు చరణంబు లై యొరప్పా భానుకోటిప్రతీకాశం బై కాష్ఠంబులయందు వహ్నియుఁ, దిలలయందుఁ దైలంబును, క్షీరంబులయం దాజ్యంబును, వ్యాపించి యున్న చందంబున బ్రహ్మాది స్తంబపర్యంత సర్వ భూతంబులయందు హృదయకమలంబు నధిష్ఠించి యుండు; నందుఁ బూర్వదళంబునఁ బుణ్యమతియు, నాగ్నేయ దళంబున నిద్రాలస్యాదులును, యామ్య దళంబునఁ గ్రౌర్యశేముషియు, నైరృతిదళంబునఁ బాపబుద్ధియుఁ, బశ్చిమదళంబునఁ గ్రీడయు, వాయవ్యదళంబున గమనాది ధిషణయు, సౌమ్యదళంబున రతిప్రీతియు, నీశాన్యదళంబున ద్రవ్యాదానంబును, మధ్యంబున వైరాగ్యంబును, కేసరం బుల జాగ్రదవస్థయుఁ గర్ణికయందు స్వప్నంబును, లింగం బున సుషుప్తియుఁ, బొందుచుండు; మఱియు నెప్పుడు పద్మత్యాగి యగు నప్పుడు నాదంబున విలీనం బగు నది తురీయం బన్నాదం బాధారాది బ్రహ్మరంధ్రపర్యంతంబు శుద్ధస్ఫటికసంకాశం బై నిండియుండు నదియె పరమార్థ తత్త్వరహస్యం బని యోగీశ్వరులచేతఁ జెప్పంబడు నట్ల గుటం జేసి. ౧౭౬

టీ. ఇట్లు = పైని జెప్పినరీతిని, నిర్వికారుఁడు = ప్రకారాంశము నందుఁ దప్ప స్వరూపాంశమునందు నేవికృతులు లేనివాఁడును, ఐన-పురు షునకుఁ = అగు పరమపురుషునకు, కేవల - జడ - ఆత్మిక = ప్రధాన ముగ నచేతనస్వరూపిణి; ఐన - ప్రకృతికిఁ = అగునట్టి మూలప్రకృతికిని, ప్రత్యేకంబుగాఁ = పరమాత్మని విడిచి ప్రకృతికిని, బ్రకృతిని విడిచి పర

మాత్మునకు ననుట; కర్తృత్వ...సంసారంబు - కర్తృత్వ = దేనినైనఁ జేయుట, భోక్తృత్వ = అనుభవించుటయు, ఆది = మొదలగు, సర్వ = సమస్తమైనది, సంసారంబు = సంసారము, ఘటింపదు = సమకూరదు, అట్లు కావునన్ = ఆకీతిని కలుగకపోవుటచేత, హకార - స్వరూప కుండు = హంసశబ్దమునందలి హావర్ణముచేఁ జెప్పఁబడువాఁడు, ఐన - ఆత్ముండు = అగునట్టి పరమపురుషుఁడు, ఆత్మశక్తి = తనయొక్క శక్తి, ఐన - సకారంబులోన్ = అగు సకారవాచ్యయగు మూలప్రకృతితో, అన్యోన్య...రూపంబునన్ - అన్యోన్య = పరమాత్మప్రకృతుల కొంతొంటికిని, తాదాత్మ్య - "ఐతదాత్మ్య మిదం సర్వం" అను మొదలగు శ్రుతులచే ప్రకారప్రకారిత్వము గాని శరీరశరీరిత్వము గాని శేషశేషిత్వముగాని యగు నాత్మశరీరభావ మనియెడు, ఆ ధ్యానరూపంబునన్ = అభేదభావనచేత, కూడి = కలసి, హంస - స్వరూపుండు = పూర్వోక్తరీతిని హంసశబ్దవాచ్యుఁడు, ఐన - జీవుండు = అగునట్టి ప్రత్యగాత్ముఁడు, ఐ = అగుచు, నవ - ద్వార - పురంబునన్ = నేత్రద్వయము, కర్ణద్వయము, నాసికారంధ్రములు రెండు, నోరు, పాయూపస్థలు రెండును కలిపి తొమ్మిదిబిలము లనియెడు వ్యాపారములు గల మేనను పురమునందు ప్రవేశించి, "తత్సృష్ట్వా! తదనుప్రావిశత్" అను శ్రుతిచే నంతర్యామిరూపమునఁ జొరఁబడి, వివిధ...యుక్తుండు-వివిధ = శ్రోత్రము ఘ్రాణము మొదలుగ పలువిధములైన, ఇంద్రియ = ఇంద్రియములతోను, ప్రాణ = ప్రాణాది వాయువులతోను, మనః = అంతఃకరణ చతుష్టయముతోను, యుక్తుఁడు - ఐ = కూడుకొనినవాఁడై, పంజర - అంతరంబునన్ = పిట్టగూఁటిననుమను, మెలంగు - పులుంగు - తెఱంగునన్ = తిరిగెడు పక్షి వడువున, చిక్కి = పట్టుపడి, వెడలన్ = తప్పించుకొనుటకు, ఉపాయంబున్ = నేర్పును, కానక = ఎఱుఁగక, నానా-విధ-భోగంబులు = పలువిధము లగు స్రక్చందనాది విషయానుభవములను, అనుభవించుచున్ =

కొడుచుచు, క్రీడించు - అట్టి - హంసకున్ = హృదయపుండరీకమునఁ దిరుగాడుచుండెడి ప్రత్యగాత్మునకు, అగ్నిషోములు "హంసమాత్మానంధ్యాయే దగ్నిషోమాపక్షా వోంకార శ్శిర ఉకారో బిందు త్రిణేత్రం ముఖ్యముఖో ముఖం రుద్రో రుద్రాణీ చరణౌ" అను హంసోపనిషద్వాక్యముచే శ్రీరామచంద్రభక్తాగ్రగణ్యుండును భగవద్విభూత్యాత్మకుండు నగు శివుని యెనిమిది మూర్తులలో నగ్నియు చంద్రుండును, పక్షంబులు = రెక్కలు, ఓకారంబు = భగవంతుని సకలవిభూతులను దెలుపు ప్రణవము, శిరంబు = "సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్" అనుటచే నుత్తమాంగంబును, త్రినేత్రంబు = పూర్వోక్తశివుని మూఁడవకన్ను, ముఖంబు = చంచూపుటమును, రుద్రరుద్రాణులు = ఆశివుఁడు పార్వతియు, చరణంబులు = అడుగులు, ఐ = అగుచు, ఒప్పారన్ = విలసిల్లఁగా, భాను - కోటి - ప్రతీకాశంబు - ఐ = కాంతిచేత సూర్యులయొక్క కోట్లతోఁ దుల్యమగుచు, "యథాహ్యగ్నిః కాష్ఠేషు తిలేషు తైలమివ సర్వదేహేషు వ్యాప్యవర్తతే" అను శ్రుతిచే, కాష్ఠంబులయందున్ = కట్టెలయందు, వహ్నియు = నిప్పును, తిలలయందున్ = నువ్వులయందు, తైలంబు = నూనెయు, క్షీరంబులయందు = పాలయందు, ఆజ్యంబు = ఘృతమును, వ్యాపించి = క్రమ్మి, ఉన్న - చందంబునన్ = ఉన్నట్టిరీతిని, బ్రహ్మ...యందున్ - బ్రహ్మ = నలువ, ఆది = లోనుగాఁ గల, స్తంబ=ఔరుగడ్డి, పర్యంత = దనుకఁ గల, సర్వ = నిఖిలములగు, భూతంబులయందున్ = స్థావరజంగమములయందు, హృదయ - కమలంబులు = ఎనిమిదిరేకులుగల హృత్పుండరీకములను, అధిష్ఠించి = ఎక్కి, ఉండున్ = నివసించును, అందున్ = ఆ యష్టదళపద్మమునందు, పూర్వ - దళంబునన్ = తూర్పువైపున నుండు రేకునందు (హంస నిలుచునప్పుడు అనునీపదము నధ్యాహారము చేయునది) పుణ్య - మతియున్ = పుణ్యపుఁజింతను, ఆగ్నేయ - దళంబునన్ = ఆగ్నేయభాగమున నున్నతమ్మియందు, నిద్రా - ఆలస్య - ఆదులు=నిదుర,

అలసట మొదలగువానిని (పొందు నను పదముతో సంకేట నన్వయము), యామ్య - దళంబునన్ = దక్షిణపువైపున నున్న పత్రమునందు, క్రౌర్య - శేముషియున్=దుష్టమతియు, నైరృత - దళంబునన్ = నిరృతిభాగమున నున్న పలాశమునందు, పాప - బుద్ధియున్= పాపపుఁదలఁపును, పశ్చిమ-దళంబునన్ = వరుణునిదిక్కుగ నున్న పర్ణమునందు, క్రీడయున్ = వినోదమును, వాయవ్య - దళంబునన్ = వాయవ్యపువైపుననున్న పత్రమునందు, గమన - ఆది - మనీషయున్ = రాకపోకలు లోనగువానియందలి తలంపును, సౌమ్య - దళంబునన్ = ఉత్తరపువైపున నున్న రేకునందు, రతి - ప్రీతియున్ = స్త్రీసంభోగమునం దనురక్తియు, ఈశాన్య - దళంబునన్ = ఈశాన్యపువైపున నుండు పత్రమునందు, ద్రవ్య - ఆదానంబున్ = ధనము నార్జించు తలఁపును, మధ్యంబునన్=కమలము నడిపట్టునందు, వైరాగ్యంబున్ = సాంసారికభోగవిరక్తియు, కేసరంబులన్ = చిఱికాఁడలయందు ("కింజల్కః కేసరోఽస్త్రియాం" అని అమరము), జాగ్రత్ - అవస్థయు = మేలుకొను దశయు, కర్ణికయందున్ = తామర దుద్దునందు, స్వప్నంబున్ = స్వప్నావస్థను, లింగంబునన్ = తూఁడునందు, సుషుప్తియున్ = గాఢనిద్రను, పొందుచున్ - ఉండున్ = (జీవుఁడు) పడయుచుండును; ("తస్యాష్టధా వృత్తిర్భవతి; పూర్వదళే పుణ్యే మతి రాగ్నేయే నిద్రాలస్యాదయో భవన్తి; యామ్యే క్రౌర్యేమతి ర్నైరృతే పాపే మనీషా వారుణ్యాం క్రీడా వాయవ్యాం గమనాదౌ బుద్ధిస్సౌమ్యే రతిప్రీతి రీశాన్యాం ద్రవ్యాదానం మధ్యే వైరాగ్యం కేసరే జాగ్రదవస్థా కర్ణికాయాం స్వప్నో లింగే సుషుప్తిః పద్మత్యాగే తురీయం యదా హంసోనాదే విలీనో భవతి తత్తురీయాతీతం భవతి" అను హంసోపనిషద్వాక్యమునర్థము నిచట ననుసంధించునది). మఱియున్ = ఇంతియ కాక, ఎప్పుడు = ఏతటిని, పద్మ - త్యాగి = హృదయపుండరీకమును విడుచునది, అగున్ = హంస యగునో- అప్పుడు = ఆతటిని, నాదంబునన్ =

బ్రహ్మప్రణవనాదమునందు, విలీనంబు - అగుక్ - లీనమైనది యగును; అది = అట్లు లీనమగుటయె, తురీయంబు = తురీయావస్థ (అగును), అనాదంబు = ఆప్రణవనాదమే, ఆధార - ఆది - బ్రహ్మరంధ్ర - పర్యంతంబు = మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రముదనుక, శుద్ధ-స్ఫటిక-సంకాశంబు-ఐ = నిర్మలమైన స్ఫటికమణితోఁ దుల్యమైనది యై, నిండియుండుక్ = వ్యాపించి పూర్ణమైయుండును ; అది = అట్లు నిండియున్న నాదబ్రహ్మము, పరమార్థ - తత్త్వరహస్యంబు = పరమపురుషార్థమగు గోప్యమైన పరవాసుదేవుని తత్త్వము, అని = ఈవడువున, యోగీశ్వరుల చేతక్ = మహాయోగులచేత, చెప్పంబడుక్ = వచియింపఁబడును, అట్లు-అగుటక్ - చేసి = అట్లు అయియుండుటచేత ముందున కన్వయము. "అథో నాద ఆధారా ద్బ్రహ్మరంధ్రపర్యంతం శుద్ధస్ఫటికసంకాశం స వై బ్రహ్మపరమాత్మే త్యుచ్యతే" అను నుపనిషద్వాక్యార్థము నిచట గమనించునది.

తా. బ్రహ్మము స్వప్రకారభూతమగు ప్రకృత్యంశమునందు వికృతులు గలదయ్యు స్వస్వరూపాంశమునందు నేవికృతులును లేనిది గావునను, మూలప్రకృతి జడ మగుటచేతను, ప్రత్యేకముగ నీప్రకృతిపురుషులకుఁ గర్తృత్వము భోక్తృత్వము లోనగు స్వభావములు గల నిఖిలసంసారము సంభవింపదు గాన, పరమపురుషునకుఁ బ్రకృతితోను జీవునితోను నాత్మశరీరభావముగాని ప్రకారప్రకారభావముగాని, శేషశేషిభావముగాని నియమ్యనియామకభావముగాని లక్షణముగఁగల తాదాత్మ్యము నొందినపుడు జీవుఁడు స్వకర్మానురూపంబగుశరీరంబు నొంది, చక్షురాదులును వాగాదులు నగు పదియింద్రియములతోను, ప్రాణాదులతోను, మనోబుద్ధిచిత్తాహంకారములతోను గూడుకొని పంజరమునడుమనుండి పైకిఁబోఁజాలక కొట్టుకొనుచున్న చిలుకపోలికను తప్పించుకొనఁ దెఱవు నెఱుఁగక యందుండి స్వచ్ఛందనాదివిషయానుభవతృష్ణం దగిలి, జననమరణాదిరూపం బగు విషా

రంబుఁ జేయుచునుండును; పూర్వోక్తహంసకు భగవద్విభవస్వరూపుఁడగు శివుని యష్టమూర్తులలో నగ్నియు సూర్యుండును రెండు రెక్కలును, భగవద్వాచకం బగుప్రణవము, శిరస్సును, శివుని మూఁడవనేత్రము, ముక్కును, శివుఁడును పార్వతియుఁ బాదద్వయము నగుచు వెలసిల్లును; మఱియుఁ బెక్కండ్రు వేవెలుంగులపోలుపున వెలుఁగు నా హంసకళలయందు నగ్నియు, నువ్వులయందు నూనెయు, పాలయందు నెయ్యియు, క్రమ్మకొనియున్న యట్లు నలువమొదలు నవురుదుబ్బుదనుకఁ గల చేతనాచేతనముల నన్నిటి యందు హృదయపుండరీకముల నెక్కి నడయాడుచునుండును; ఆ హృదయ కమలమునకుఁ దూర్పు మొదలగు నెనిమిది దిక్కులయందు నున్న యెని మిది ఱేకులయందు నాయంచ తిరుగునపుడు క్రమంబుగ పుణ్యచింతయు నిద్రాలస్యములును, దుర్బుద్ధియు, పాపమతియు, వినోదపువేడుకయు, రాకపోకలును, సురతానురక్తియు, ధనార్జనాసక్తియు జీవునకుం గలుగును; మఱియుఁ బద్మమధ్యభాగమున నాహంస నిలుచునపుడు పరమవైరాగ్యంబును, కింజల్కములం దున్నపుడు మెలఁకువయు, బిమ్మయం దున్నపుడు కలయును, దుంపయం దున్నపుడు గాఢనిద్రయుఁ గలుగును; హంస పద్మమును విడుచునపుడు ప్రణవనినాదంబున జీవుఁడు విలీనుఁ డగును; ఇదియె తురీయావస్థ యగు ఆ ప్రణవవాదము. ఆమూలాధార చక్రము మొదలు బ్రహ్మరంధ్రమువనుక మిగులఁ దెల్లనిపటికమును బోలి పరిపూర్ణమై తనరు నినాదపూర్ణత్వమే పరవస్తువుయొక్క వాస్తవ స్వరూప మని మహాయోగీశ్వరులు వచించెద రది గావున.

అవ. "తథాత్మప్రకృతౌ సంగా దహం మానాది దూషితః । భజతే ప్రాకృతాన్ ధర్మాన్॥ పుమాన్న దేవో నరో నపశు ర్నచ పాదపః॥ శరీరాకృతిభేదాస్తు భూపైతే కర్మయోనయః । నిర్వాణమయ ఏవాయ మాత్మాజ్ఞానమ

యోఽమలః । దుఃఖాజ్ఞానమలాధర్మాః ప్రకృతే స్తేన చాత్మనః॥ (శ్రీవిష్ణు-పు. ౨-౧౩-౭౮)" అను మొదలగు స్మృతుల యందు శుద్ధజీవునకుఁ బ్రకృతిసంబంధమువలన నహంకారాదు లగు నాంతరధర్మములును దేవాదిశరీరసంగమువలనఁ బెక్కు రూపులు గలుగుటయుఁ జూపట్టు నను నర్థమునకు నుపోద్బల మగు "జీవాత్మస్వరూపం దేవమనుష్యాది ప్రకృతిపరిణామ విశేషరూప నానావిధ భేదరహితం, జ్ఞానానందైకగుణం, తస్యై తస్య కర్మకృత దేవాది భేదేఽపధ్వస్తే స్వరూపభేదో వాచా మగోచరః స్వసంవేద్యః జ్ఞానస్వరూపమ్" అను వేదార్థ సం గ్రహవాక్యార్థానుసారముగ నిట్లు జీవస్వరూపమును జెప్పి యా జీవునకుఁ గలుగు పరమపురుషైక్యము గేవలము గురూపదేశము వలనను స్వానుభవమువలనను దెలిసికొనఁదగినది యుపదే శించుచున్నది.

క. దేశికనాథుని లసదుప
దేశమువలనన్ వివేక దృష్టివలనఁ ద
న్నాశస్థలము సుషుమ్నా
దేశం బని దానికీలు దెలియఁగవలయున్. ౧౭౭

టీ. దేశిక...వలనన్ - దేశికనాథుని = ఆచార్యవర్యునియొక్క, లసత్ = ఒప్పినటువంటి, ఉపదేశమువలనన్ = సద్బోధనముచేత, వివేక + దృష్టివలనన్ = తనయొక్క యనుభవజ్ఞానముచేతను, తత్ + నాశ + స్థలము = హంస హృదయపుండరీకసంచారమును మాని ప్రణవనాదము నందు లీన మగునపుడు గలుగు నా తురీయావస్థ, సుషుమ్నా + దేశంబు = సుషుమ్నానాడిచేఁ బొందఁదగిన పరమపురుషపదవి, అని, దానికీలున్ = ఆ బ్రహ్మరహస్యమును, తెలియఁగవలయున్ = ఎఱుఁగవలయును.

తా. సద్గురువుయొక్క సద్బోధనమునుబట్టియు, బోధింపఁబడిన యంశముల నన్నిటిని పలుమఱు దనలో మననముఁ జేయుటవలనఁ గలిగెడు ననుభవజ్ఞానమునుబట్టియు, హంస ప్రణవనాదమునందు లీనమగుటనప్పటి తురీయావస్థయే బ్రహ్మపద మని యా పరమపదముయొక్క గుట్టును దెలిసికొనఁదగును. ౧౭౭

ఆ. సర్వభూతహృదయ జలజాతములయందు
సమతఁ బవనమానసములతోడ
హంస యనుచుఁ బలుకు నతఁడ నే నను కీలుఁ
దెలిసి తలఁప నదియుఁ బొలియు నంత. ౧౭౮

టీ. సర్వ...యందున్ - సర్వ = నిఖిలములగు, భూత = సురనర తిర్యక్స్థావరాత్మక చతుర్విధ శరీరములయొక్క, హృదయ + జలజాతములయందున్ = ఎనిమిది రేకులు గల హృత్పుండరీకములయందు, సమతన్ = "పుమా నేకోవ్యవస్థితః। తన్మనస్సమాలమ్బ్య కార్యం సామ్యం హి ముక్తయే। నిర్దోషం హి సమం బ్రహ్మ" అను మొదలగు శ్రుతిస్మృతులకు వ్యాఖ్యానరూపంబగు "జ్ఞానస్వరూప మిత్యేతావదేవ నిర్దేశ్యం, తచ్చ సర్వేషా మాత్మనాం సమానమ్" అను వేదార్థసంగ్రహవాక్యముచే దేవాదిదేహాకృతభేద మున్నను వస్తుతత్త్వముచే నేకాకార మగుటం జేసి, పవన + మానసములతోడన్ = ప్రాణాది పంచవాయువులతోను, మనోబుద్ధి చిత్తాహంకారములతోను జీవుఁడు గూడినపుడు, హంస - అనుచున్ = హంస యని, పలుకున్ = యోగిజనము వచించును; అతఁడు - ఎ = "దేవమనుష్యాదిప్రకృతి పరిణామ విశేషరూప నానావిధ భేదరహితం జ్ఞానానందైకగుణమ్" అను మొదలగు పూర్వోక్తలక్షణములు గల శుద్ధజీవుఁడె, నేను = ఇట్లు ప్రకృతి సంగవిశిష్టుఁడనై యున్న నేను, అను + కీలున్ = అను నీరహస్యమును, తెలిసి = ఎఱిఁగి, తలఁపన్ = నిజరూపము ననుసంధింపఁగా, అదియున్ =

ఆ ప్రకృతిసంగము, పాలియున్ = "ఏకస్వరూపభేదోహి బాహ్యకర్మ ప్రవృత్తిజః। దేవాదిభేదేఽపధ్వస్తే నాస్త్యేవావరణోహి సః (విష్ణు - పు- ౨-౧౪-౩౩) అనుటచేత జ్ఞానానందస్వరూపుం డగు శుద్ధజీవునకు బుద్ధిసుఖము మొదలుగాఁ గల యాంతరభేద మున్నను ప్రకృతిసంగమువలన సంసారమునకుఁ గారణభూతమగు కర్మమువలనఁ గలిగెడు దేహాద్యావరణమునకు మూలమయి యున్నది. దేవాదిశరీరభేదము నశింపఁగాఁ బ్రత్యగాత్మునకు నించుకయు భేదము లేదు; ఆదేవాదిశరీరభేద మనునది యావరణమాత్రముగాన నది నశించినతోడనే తత్కృత మగు భేదము ఆత్మయందుఁ దోఁపదని యర్థము.

తా. జ్ఞానము ఆనందము లోనగు గుణములు గల జీవుఁడు మొదటఁ బరిశుద్ధుం డయ్యుఁ బ్రకృతిసంగమువలన సురనరతిర్యక్స్థావరరూపములగు దేహములయొక్క హృదయపుండరీకములయందుఁ బ్రాణాదివాయువులతోను నంతఃకరణచతుష్టయముతోను గూడి సంచరించుచు హంస యని పిలువంబడును; పూర్వోక్తశుద్ధజీవుఁ డను నేను, నాకుఁ బ్రకృతిసంగమువలన నీసంసారము వచ్చినది అను నీరహస్యమును దెలిసికొని స్వస్వరూపానుసంధానమును జేయఁగా నాప్రకృతిసంబంధము నశించును.

అవ. ఇట్టి పరమరహస్యమును దెలిసికొని పరమపురుషునారాధించిన జీవునకుఁ బ్రకృతిసంబంధము నమయు నని జానకి మారుతికి నుపదేశించుచున్నది.

ఆ. ఈ రహస్య మెఱిఁగి యేకాగ్రచిత్తుఁ డై
సంతతము భజింపఁ జాలు నేని
యనిలమానసములు హంసంబుతోఁ గూడ
విలయ మొందు మొదటి వెలుఁగునందు. ౧౭౯

టీ. ఈ + రహస్యమున్ = ఇట్లు చెప్పఁబడిన మర్మమును, ఎఱిఁగి= సద్గురూపదేశముచేఁ దెలిసికొని, ఏకాగ్ర + చిత్తుఁడు - ఐ = శ్రీహరి దివ్య మంగళవిగ్రహమునందు నేకతానమానసుం డగుచు, సంతతము = నిరం తరమును, భజింపన్ = శ్రీహరినిఁ గొలుచుటకు; చాలున్ - ఏని = సమర్థు డగునేని, అనిల + మానసములు = ప్రాణాదివాయువులు నంతఃకరణచతుష్ట యమును, హంసముతోన్ కూడన్ = ప్రకృతిసంబంధసహిత మగు హంస తోఁ గలసి, మొదలి వెలుఁగునందున్ = ప్రకృతికిఁ గారణ మగు శ్రీహరి దివ్యతేజస్సునందు, విలయము = నాశమును, ఒందున్ = పొందును.

తా. పూర్వోక్తరీతిని నేను జ్ఞానానందస్వరూపుఁడనగు పరిశుద్ధజీవుఁ డను గాని ప్రకృతిసంబంధముతోఁ గూడిన మలినజీవుఁడను గా నను రహస్య మును దెలిసికొని శ్రీహరిని నిరంతరము నారాధించుచుండినయెడఁ బ్రాణ ముయొక్కయుఁ జిత్తముయొక్కయుఁ జాంచల్యము తగ్గి తనకుంగల మాలా జ్ఞానము నశించును. ౧౭౯

అవ. "హంసతత్త్వార్థవిజ్ఞాన మతిరహస్య మట్లు గావునఁ జెప్పెద నవధరింపుము" అనుచు నుపదేశించుటకుఁ బ్రతిజ్ఞ సేయఁబడిన హంసతత్త్వరహస్యమును బోధించి రేచక పూరక కుంభకములయందు నాహంసతత్త్వమును గూర్చెదుప్రక్రియం జెప్పఁదలఁచి రేచకాదులస్వరూపమును నిరూపించుచున్నది.

సీ. హృదయగతప్రాణుఁ డే దెంచునాసికా
వివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళపర్యంత మది రేచకం బగు
నరుదెంచునంతలో నర్ధసమయ
మచ్చోట లయ మగునది బహిఃకుంభకం
బారీతి లోపలి కరుగునదియె

పూరకం బన నొప్పుఁ బూరించునంతలో
నర్ధకాలంబు దా నణఁగు నచట
తే. నదియె యాంతరకుంభకం బనఁగఁ దనరుఁ
బొసఁగ నిబ్భంగి రేచకపూరకాది
గతులచే విహరించు నీగాలి వానిఁ
గలసి మదితోడ హంసము మెలఁగునపుడు. ౧౮౦

టీ. హృదయ - గత ప్రాణుఁడు = హృత్ప్రదేశమున నున్న ప్రాణ వాయువు, నాసికా + వివరంబువలనన్ = కుడిది యగు ఘ్రాణబిలమునుండి, వెలికిన్ - వెలుపలికి, ద్వాదశ + అంగుళ + పర్యంతము = పండ్రెండంగుళములదనుక, అరుదెంచున్ = వచ్చును; అది = అట్లు వచ్చుటయె, రేచకంబు - అగున్ = ఉచ్ఛ్వాసరూపమగు రేచక మనఁబడును; అరుదెంచు + అంతలోన్ = ఇట్లు ప్రాణము పండ్రెండంగుళములు పైకి వచ్చుతఱిలో, అర్ధ + సమయము = సగము కాలము, అచ్చోటన్ = ఆ స్థలమునందు, లయము - అగున్ = బాహ్యవాయువులో లీన మగును; అది = అట్లు లీన మగుట, బహిఃకుంభకంబు = బాహ్యకుంభకము (అగును), ఆరీతిన్ = లోపలినుండి వెలుపలికి వచ్చునట్లు, లోపలికిన్ = గర్భగోళములోనికి, అరుగున్ = పోవును; అదియె = అట్లు పోవుటయే, పూరకంబు = నిశ్శ్వాసరూప మగు పూరకము, అనన్ - ఒప్పున్ = అను పేరం బరఁగును; పూరించు + అంతలోన్ = అట్లు పూరకము చేయు కాలములో, అర్ధకాలంబు = సగపాలుకాలము, తాన్ = పూరింపఁబడిన యా వాయువు, అచటన్ = ఆ హృదయప్రదేశమునందు, అడఁగున్ = స్తంభించును; అదియె = అట్లు స్తంభించుటయె, అంతర + కుంభకంబు = అభ్యంతరకుంభకము, అనఁగన్ - తనరున్ = అను పేరం బరఁగును; పొసఁగన్ = ఒప్పునట్లు, ఇబ్భంగిన్ = ఈ రీతిని, రేచక + పూరక +

ఆది + గతులన్ = రేచకము పూరకము బహిఃకుంభకము అంతరకుంభకము అను నీ నాల్గుతెఱఁగులచేతను, ఈగాలి=గర్భగోళమునందలి యీప్రాణాదివాయువు, విహరించున్ = ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమున సంచరించును; అప్పుడు=అట్లు ప్రాణవాయువు సంచరించుతఱిని, హంసంబు=పూర్వోక్త హంస, వానిన్ = ఆప్రాణవాయువుసంచారములను, కలసి = కూడి, మదితోడన్ = మనస్సుతోఁ గూడ, మెలఁగున్ = ఆహృత్పుండరీకము యొక్క యెనిమిదిఱేకులయందుఁ దిరుగాడును.

తా. నాభిమండలమున నుండెడు ప్రాణవాయువు ముక్కుచెలమల నుండి పైకి పం డ్రెండంగుళములదనుక దిగయూపిరిగ వచ్చుట రేచక మనఁబడును; అట్లు వచ్చినకాలములో సగముకాలము ఆప్రదేశమునందు నిలుచుట బాహ్యకుంభక మనఁబడును. అట్లు పైకి వచ్చునట్లు ప్రాణవాయువు మరల నెగయూపిరిగ లోనికిఁ బోవుట పూరక మనఁబడును. ఆ పోయినకాలములో సగముకాలము హృదయప్రదేశమున స్తంభించియుండుట యాంతరకుంభక మనఁబడును; ఇట్లు రేచక పూరక బహిఃకుంభకాంతరకుంభకములచే నీ ప్రాణవాయువు సంచరించుచుండును; అట్లు సంచరించునపుడు పూర్వోక్త హంసరేచకము మొదలగు ప్రాణగమనములతోను మనస్సుతోను గూడి హృదయపుండరీకదళములయందుఁ బూర్వోక్తరీతిని సంచరించును.

తే. పూరకమున హకారంబుఁ ♣ బొందుపఱచి
కుంభకంబున బిందువుఁ ♣ గూర్చి యంత
రేచకమున సకారంబుఁ ♣ జూచి వానిఁ
దెలియు తెలివియె నే నని ♣ తెలియవలయు. ౧౮౧

టీ. పూరకమునన్=పైగాలిని లోనికిఁ దీల్చుట యనుపూరకమునందు, హకారంబున్ = హంసశబ్దమునందలి హకారముచేఁ జెప్పఁబడు పరిశుద్ధ జీవుని, పొందుపఱచి=కలియఁగూర్చి, కుంభకంబునన్ = బాహ్యాభ్యంతర

కుంభకములలో నొకదానియందు, బిందువుఁ=ప్రకృతిపురుష తాదాత్మ్యము, కూర్చి = కలిపి, అంతఁ = పిమ్మట, రేచకమునఁ = లోనిగాలిని వైకిఁ దీయుట యనురేచకమునందు, సకారంబుఁ = సకారముచేఁ జెప్పఁబడు ప్రకృతిని, చూచి = పరికించి, వానిఁ = పురుషుఁడు ప్రకృతి ప్రకృతిపురుషతాదాత్మ్యము అను నీమూఁడిటిని, తెలియు తెలివియె = తెలిసికొనుజ్ఞానమే, నేను = పరిశుద్ధజీవుఁడ నగు నేను, అని తెలియఁ వలయుఁ = అని యెఱుంగఁ దగును.

తా. రేచకపూరకకుంభకములలోఁ బూరకమునందు హంసపదమునందలి హాకారవాచ్య మగు శుద్ధజీవస్వరూపమును, రేచకమునందు సకారముచేఁ జెప్పఁబడుప్రకృతినిఁ గుంభకమునందు బిందుశబ్దవాచ్యమగు ప్రకృతి పురుషులతాదాత్మ్యమును ననుసంధించి, ప్రకృతిపురుషులయు తత్తాదాత్మ్యముయొక్కయు స్వరూపములను, నెఱుఁగఁదగినజ్ఞానమే నాయొక్క వాస్తవస్వరూప మని యోగి యెఱుఁగఁ దగును. ౧౫౧

తే. ఇట్లనిలమానసములతో నెనసి హంస
యాఱుకమలంబులందు నహర్నిశంబు
లీలచే నిరువదియొక్క వేలయాఱు
నూఱుమాఱులు విహరించు మేరతోడ. ౧౫౨

టీ. ఇట్లు = ఈవిధమున, హంస = శుద్ధజీవుఁడు, అనిలమానసములతోఁ = ప్రకృతిజన్యము లగు ప్రాణాదివాయువులు మనోబుద్ధిచిత్తాహంకారములు అను వీనితో, ఎనసి=తాదాత్మ్యము నొంది, అహర్నిశంబుఁ= రేయుంబవళ్లు, ఆఱుకమలంబులందుఁ = దిగువ వివరింపఁబడుమూలాధారము మొదలగు షట్పద్మములయందు, ఇరువది - యొక్క - వేల - ఆఱు-నూఱు-మాఱులు = ఇరువదియొకవేలును ఆఱువందలును సంఖ్య గలపర్యాయములు, మేరతోడఁ = ఒకపరిమాణముతో, లీలచేఁ = నడకసొగసుతో, విహరించుఁ = తిరుగాడును.

తా. ఇత్తెఱంగున హంసశబ్దవాచ్యుఁ డగు పరిశుద్ధజీవుఁడు ప్రాణాది వాయువులు మనోబుద్ధిచిత్తాహంకారములు నను ప్రకృతిజన్యగుణములతోఁ గూడి, మూలాధారము లోనుగాఁ గలయిరుమూఁడుదామరలయందు రేవగలు ఇరువదియొక్కవేలయాఱువందలపర్యాయములు నియమముతో సంచరించును.

అవ. సామాన్యముగఁ జెప్పఁబడిన హంసముయొక్క సంచారక్రమమును విశేషాకారముగ నుడువుచున్నది.

వ. అట్లు గావున గుదస్థానంబున వశషసవర్ణగం బై చతుర్దళయుక్తం బై తప్తకాంచనపుష్పసన్నిభం బై మహీనిలయం బై ఘ్రాణకారణం బై మూలాధారచక్రంబు విలసిల్లు; నందు వినాయకున కాఱునూఱులును, లింగస్థానంబున బభమయరలవర్ణగం బై షడ్దళసమన్వితం బై రక్తవర్ణం బై జలాలయం బై రసనాకారణం బై స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లు; నందుఁ జతుర్ముఖున కాఱువేలును; నాభిస్థానంబున డ ఢ ణ త థ ద ధ న ప ఫ వర్ణగం బై దశదళోపేతం బై తేజోనివాసం బై పీతవర్ణం బై నేత్రకారణం బై మణిపూరకచక్రంబు ప్రకాశించు; నందు శ్రీమహావిష్ణువున కాఱువేలును; హృదయస్థానంబున క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ వర్ణగం బై ద్వాదశదళోపేతం బై శ్వేతవర్ణం బై మరున్మందిరం బై త్వగింద్రియకారణం బై యనాహతచక్రంబు దనరు; నందు రుద్రున కాఱువేలును; కంఠస్థానంబునం దకారాది షోడశదళయుతం బై నీలవర్ణం బై గగనసదనం బై శ్రోత్రకారణం బై విశుద్ధచక్రం బలరు; నందు జీవాత్మునకు సహస్రంబును; భ్రూమధ్యస్థానంబున "హం క్షం" అను వర్ణంబులు గలిగి ద్విదళ

లలితం బై అంతఃకరణభవనం బై యాజ్ఞాచక్రం బొప్పు; నందుఁ బరమాత్మునకు సహస్రంబును; బ్రహ్మరంధ్రస్థానంబున నోంకారవర్ణకం బై సహస్రదళశోభితం బై కోటిసూర్యప్రకాశమానం బై ధీవిలయస్థలం బై సహస్రారచక్రం బలరారు; నందు శ్రీ గురుస్వామికి సహస్రంబును; శ్రీమద్దేశికోక్తాసన ముద్రాలక్ష్యమంత్రధ్యాన క్రమపూర్వకంబుగా సమర్పించు సద్గురుభక్తుండు జీవన్ముక్తుం డగుచు వర్ధిల్లుచుండు ననంగా నొప్పుచున్నది. ౧౮౩

టీ. అట్లుగావునన్ =ఆరీతిని హంస, షట్కమలములయందుఁ దిరుగును గాన, గుదస్థానంబునన్ = "మూలాధారం గుదస్థానం" అనుటచే పాయ్వింద్రియమునకు మీఁదుగ, వ శ ష స వర్ణకంబు-ఐ = "వాసాంతవర్ణాశ్రయః" అనుటచే వ శ ష స అను నాలుగక్షరములను బొందినదియై, చతుర్దళయుక్తంబు - ఐ "ఆధారస్తు చతుర్దళః" అనుటచే నాలుగువర్ణములతోఁ గూడినదియై, తప్త-కాంచన-పుష్ప-సన్నిభంబు-ఐ = పుటము వేయఁబడిన బంగారుపువ్వుతో సరియైనదియు నై, మహీనిలయంబు - ఐ = గంధవతి యగు పృథివికి నాధారభూతమైనదియు నై (కావున నే), ఘ్రాణకారణం బై=గంధగ్రహణసామర్థ్యము గల ఘ్రాణేంద్రియమునకు హేతుభూతమైనదియు నై, మూలాధారచక్రంబు = మూలాధార మను చక్రము, విలసిల్లున్ = ఒప్పును, అందున్ = ఆమూలాధారచక్రమునందు, వినాయకునకున్ = శ్రీహరివిభూతులలో నొకఁడగు గణపతికి, ఆఱునూఱులును = (ఇరువదియొకవేలయాఱువందలసంఖ్య గల హంససంచారములలో) ఆఱువందల గమనములును, లింగస్థానంబునన్ = ఉపస్థేంద్రియప్రదేశమునందు, బ భ మ య ర ల వర్ణకంబు - ఐ = "బాలాంతషట్పత్రకం" అనుటచేత బ భ మ య ర ల అను నాఱక్షరములను బొందినదై, షట్-దళ -

సమన్వితంబు - ఐ = ఆఱురేకులతోఁ గూడినదై, రక్తవర్ణంబు - ఐ = అరుణకాంతి గలదియై, జల + ఆలయంబు - ఐ = రసగుణప్రధానం బగు నీటికి నునికిపట్టయి, రసనా - కారణంబు = రసనేంద్రియమునకు హేతువయి, స్వాధిష్ఠానచక్రంబు=స్వాధిష్ఠాన మనుచక్రము, రంజిల్లున్ =ఒప్పును; అందున్ = ఆ స్వాధిష్ఠానచక్రమందు, చతుర్ముఖునకున్ =బ్రహ్మదేవునకు, ఆఱువేలును = ఆఱువేలులెక్కగల హంసగతులను, నాభిస్థానంబునన్ = బొడ్డుపట్టున, డ ఢ ణ త థ ద ధ న ప ఫ వర్ణగంబు - ఐ=టవర్గులోని కడపటి మూఁడువర్ణములును, తవర్గును, పవర్గులోని మొదటి రెండువర్ణములు నను పదియక్షరములు గలదియై, దశ-దళ-ఉపేతంబు-ఐ=పదిపత్రములతోఁ గూడినదై, తేజోనివాసంబై = వహ్నికి నునికియై, పీతవర్ణంబై = పచ్చనిరంగు గలదై, నేత్రకారణంబై = చక్షురింద్రియమునకు హేతువై, మణిపూరకచక్రంబు=మణిపూరక మను చక్రము, ప్రకాశించున్ =వెలుఁగును, అందున్ = ఆ మణిపూరకమునందు, శ్రీమహావిష్ణువునకు=సకలదేవాదిదేవుఁ డగుపురుషోత్తమునకు, ఆఱువేలును = షట్సహస్రహంసగతులను, హృదయస్థానంబున్ = హృత్ప్రదేశమునందు, క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ వర్ణగంబు - ఐ = అక్షర సమామ్నాయమునందలి కకారము మొదలు ఠకారముదనుకఁ గల పండ్రెండక్కరములను బొందినదై, ద్వాదశ-దళ-ఉపేతంబు-ఐ = పండ్రెండుదళములతోఁ గూడినదియై, శ్వేతవర్ణంబై = ధవళకాంతిగలదై, మరుత్ - మందిరంబై = స్పర్శగుణము గలగాలికి నాధారమై, త్వగింద్రియకారణంబై = త్వగింద్రియమునకు మూలమై, అనాహతచక్రంబు = అనాహత మను చక్రము, తనరున్ = ఒప్పును, అందున్ = ఆ యనాహతమునందు, రుద్రునకున్ = శివునకు, ఆఱువేలును = ఆఱువేలలెక్కగల హంసగతులను, కంఠస్థానమందున్ = గళప్రదేశమునందు, అకారాది షోడశస్వరగంబు - ఐ = అకారము మొదలు విసర్గము దనుకం గల పదియాఱుస్వరముల (అచ్చుల)ను బొందినదియై, నీలవర్ణంబు-ఐ =

కృష్ణకాంతిగలదై, గగనసదనంబై = శబ్దగుణక మగు నాకసమునకు నివాసమై, శ్రోత్ర - కారణంబై = శ్రోత్రేంద్రియమునకు హేతువై, విశుద్ధ చక్రంబు = విశుద్ధమను చక్రము, అలరుఁ = విలసిల్లును, అందుఁ = ఆ విశుద్ధమునందు, జీవాత్మునకుఁ = పరిశుద్ధుఁడగు ప్రత్యగాత్మునకు, సహస్రంబును = ఒకవేయి హంసగతులను, భ్రూమధ్యస్థానంబునఁ = కను బొమ్మలనడిమిపట్టున, హం క్షం అనువర్ణంబులు గలిగి - హం క్షం అనునీ రెండుబీజాక్షరములు రెండురేకులందును గలిగి, ద్వి-దళ - లలితంబు - ఐ= రెండుదళములచేత సొబగు మీఱినదై, మాణిక్య + వర్ణంబు - ఐ=మాణిక్యముయొక్కరంగును బోలినరంగుగలదై, అంతఃకరణ + భవనంబు - ఐ = మనోబుద్ధిచిత్తాహంకారరూప మగు నంతరింద్రియమునకు స్థానమై, ఆజ్ఞా చక్రంబు = ఆజ్ఞాచక్రమను కమలము, ఒప్పుఁ = విలసిల్లును; అందుఁ = ఆ యాజ్ఞాచక్రమునందు, పరమాత్మునకుఁ = పరవాసుదేవబ్రహ్మమునకు సహస్రంబును = ఒకవేయిని, బ్రహ్మ - రంధ్ర - స్థానంబునఁ = బ్రహ్మరంధ్ర ప్రదేశమునందు, ఓంకార వర్ణగంబు - ఐ = ఓం అను నీయొక యక్షరమును బొందినదియై, సహస్ర - దళ - శోభితంబు - ఐ = వెయ్యి రేకులచే శోభిల్లుచున్నదై, కోటిసూర్యప్రకాశమానం బై = ఒక కోటి సంఖ్య గల యాదిత్యులవలె దేదీప్యమాన మగుచు, - ధీవిలయ - స్థలంబై = "అవిలమానసములు హంసంబుతోఁ గూడ। విలయ మొందు మొదలి వెలుఁగునందు" అని వెనకఁ జెప్పినరీతిని చిద్బిందువు లీనమగుటకుఁ జోటయి, సహస్రారచక్రంబు = సహస్రార మను చక్రము, అలరారుఁ = ప్రకాశించుచు; అందుఁ = ఆ సహస్రారమందు, శ్రీగురుస్వామికిఁ = బ్రహ్మవిద్యాసంపద్విరాజితుఁ డగు నాచార్యునకు, సహస్రంబును = ఒక వెయ్యిని, శ్రీమత్ ... పూర్వకంబుగాఁ - శ్రీమత్ = జ్ఞానసంపత్తి గల, దేశిక = సద్గురువుచేత, ఉక్త = ఉపదేశింపఁబడిన, ఆసన = పద్మాసనము మొదలగు నాసనములును, ముద్రా = తొల్లి చెప్పఁబడిన ఖేచరి మొదలగు

ముద్రలును, లక్ష్య = ఆ ముద్రలచేఁ గనుఁగొనఁబడు నంతర్లక్ష్యము బహిర్లక్ష్యము మొదలగు లక్ష్యములును, మంత్ర = పరమపురుషప్రతిపాదకములగు గాయత్రి మొదలగు మంత్రములును, ధ్యాన = పురుషోత్తమ స్వరూపానుసంధానము—(అను వీనియొక్క) క్రమ = అనుష్ఠాన క్రమము, పూర్వకంబుగాన్ = తొలుతఁ గలుగునట్లుగ, సమర్పించు = (మీఁదఁ జెప్పినరీతిని హంసగతులను వినాయకాదులకు) సమర్పణము గావించెడు, సద్గురు - భక్తుండు = ఉత్తముఁడగు తన యాచార్యునియందు భక్తి గల యోగి, జీవన్ముక్తుండు = బ్రతికియుండఁగనే పరమపురుషప్రాప్తిరూపమగు మోక్షము నొందినవాఁడు, అగున్ = ఔను, అట్లు = మీఁదఁ జెప్పినరీతిని, ఒప్పించునప్పుడు = హంసగతి ననుసరించిన మంత్రపురశ్చర్య సంఖ్యలను సమర్పించెడు సమయమునందు, ముందున కన్వయము.

## షట్చక్రోద్ధారణక్రమము.

## అందు మూలాధారచక్రోద్ధారక్రమము.

వ శ ష స అను నాలుగు బీజవర్ణములు తూర్పు మొదలగు నాలుగు దిక్కులవైపున నున్న రేకులలోఁ గలిగి, పండ్రెండవ వన్నె పసిఁడిపువ్వు పగిదిం దగి, పంచమహాభూతములలో గంధవతి యగు పుడమికి నధిష్ఠానమై యాపుడమి యధిదేవతగాఁ గల ఘ్రాణేంద్రియమునకుఁ గారణం బగు మూలాధారచక్రము పాయుప్రదేశమునం దుండును; దీనియందుఁ బూర్వోక్తరీతిని హంసము అహోరాత్రాత్మక మగు నఱువదిగడియల పరిమితి గల దినములోని ఘ రి లలో నాఱువందలసారులు నాలుగుదళములమీఁదుగఁ బ్రదక్షిణము సేయును; ఈ ప్రదక్షిణములను గణపతికిఁ దొలుత నర్పింపవలయును.

## స్వాధిష్ఠానచక్రోద్ధారక్రమము.

బ భ మ య ర ల అను నీయాఱు బీజవర్ణములు నాఱుదళములయందునుఁ గలిగి, ఎఱ్ఱనిరంగు గలిగి, రసము (తీపి) ప్రధానగుణముగఁ గల

వీటికి నధిష్ఠానమై రసనేంద్రియమునకుఁ గారణం బగు స్వాధిష్ఠానచక్రము ఉపస్థభాగమునందుఁ గలదు; దీనియందు హంస ము ౬ లలో నాఱువేల సారులు ప్రదక్షిణములు సేయును. ఈ ప్రదక్షిణములను త్రిమూర్తులలో సృష్టికర్తయగు పరమేష్ఠికి సమర్పింపవలయును.

## మణిపూరకచక్రోద్ధారము.

డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను నీ పది బీజాక్షరములు పదిరేకుల యందును గలిగి, పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములలోఁ దేజస్సునకు నధిష్ఠానమై పసపురంగు గలిగి, చక్షురింద్రియమునకుఁ గారణమై మణిపూరక చక్రము నాభిమండలమునం దుండును; దీనియందు హంసము ౧౦ గడియ లలో నాఱువేలమాఱులు ప్రదక్షిణములు సేయును; వీనిని జగత్పరిపాలకుం డగు శ్రీమహావిష్ణువునకు సమర్పింపవలయును,

## అనాహతచక్రోద్ధారము.

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అను పన్నెండు బీజాక్షరములు పన్నెండు దళములయందుఁ గలిగి, తెలుపువర్ణముతో నొప్పి, స్పర్శ గుణము గల వాయువునకు నధిష్ఠానమై త్వగింద్రియమునకుఁ గారణమై యనాహత చక్రము హృదయప్రదేశమునందు విలసిల్లును. దీనియందు హంస ము ౧౨ లలో నాఱువేలప్రదక్షిణములను జేయును; వీనిని సంహారకర్త యగు రుద్రునకు సమర్పింపవలెను.

## విశుద్ధచక్రోద్ధారక్రమము.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః అను నీ పదియాఱుస్వరములును పదియాఱు రేకులందుఁ గలిగి, నలుపురంగు గలదియై శబ్దగుణక మగు నాకసమునకు నధిష్ఠానమై శ్రోత్రేంద్రియమునకుఁ గారణమై విశుద్ధచక్రము కంఠప్రదేశమునందుఁ గలదు; దీనియందు హంస

ఘ ౧౬ ల కాలములో వెయ్యి ప్రదక్షిణములు గావించును; దీనిని బ్రత్యగాత్మునకు (శుద్ధజీవునకు) సమర్పించునది.

ఆజ్ఞాచక్రోద్ధారక్రమము.

హాం క్షం అను నీ రెండు బీజవర్ణములు రెండు దళములయందుఁ గలిగి, మాణిక్యముయొక్క కాంతిచే నొప్పి, అంతరింద్రియమునకు నధిష్ఠానమై యాజ్ఞాచక్రంబు కనుబొమల నడిమిపట్టున రంజిల్లును; దీనియందు ఘ ౨ ల కాలములో వెయ్యి ప్రదక్షిణములను హంస చేయును; వీనిని బరమాత్మునకు (పరమపురుషునకు) సమర్పింపవలయును.

సహస్రారచక్రోద్ధారక్రమము.

బ్రహ్మప్రణవము నడిపట్టునఁ గలిగి, ఆ ప్రణవమునకుఁ జుట్టును వెయ్యి రేకులు గలిగి, నూఱులక్షలసూర్యులకాంతిని బోలు ప్రకాశముచే దేదీప్యమానమగుచుఁ జిద్బిందువుయొక్క లయమునకు నునికియై సహస్రారచక్రము భాసిల్లును; దీనియందు హంస ఘ ౧౦ ల కాలములో వెయ్యి ప్రదక్షిణములు గావించు నీ ప్రదక్షిణములను దన గురువర్యునకు సమర్పింపవలయును.

ఇట్లు శ్రీమదార్యులచే నుపదేశింపఁబడిన పద్మాసనము మొదలగు నాసనబంధములయు, ఖేచరి లోనగు ముద్రలయు, నాయాలక్ష్యములయు, తన్మంత్రములయు, భగవదనుసంధానముయొక్కయు నాచరణక్రమము మున్ను గలుగునట్లు పైని జెప్పినరీతిని వినాయకాదులకు హంసప్రదక్షిణములను సమర్పణఁజేసెడు పరమాచార్యభక్తుఁడు జీవన్ముక్తుఁ డగును. మఱియు నీ రీతిని సమర్పించెడుసమయమునందు. ౧౫౧

అవ. లోగడఁ జెప్పినవిధమున శుద్ధచిత్కళాస్వరూపమగు పరమపురుష తత్త్వము ననుసంధించుటకుఁ దెలుపఁ

దలఁచి తొలుత మనోవాయువుల సంచారప్రదేశములను దెలుపుచున్నది.

క. కుడియెడమనాడులందుఁ
నడుచు న్వాయువులు వానికినడువడి వెలి లోఁ
బొడగనుచు నెపుడు మెలఁగుఁ
నడిమినడక నంటి నెమ్మనంబు కుమారా! ౧౮౨

టీ. కుమారా! = పుత్త్రాధికుఁడ వగు నో మరున్నందనా, వాయువులు = ప్రాణము మొదలగు గాలులు, కుడియెడమ నాడులందుఁ = హృదయపుండరీకమునకు నిరుచక్కియల నున్ననరములయందు, నడుచుఁ = సంచరించుచుండును; వాని - నడువడిఁ = ఆ వాయువులయొక్క నడకను, వెలిఁ - లోన్ = పైని లోపలను, పొడగనుచుఁ = కనుఁగొనుచు, నడిమి - నడకఁ = ఆ వాయువులమధ్యను సంచారమును, అంటి = పొంది, నెమ్మనంబు = సంకల్పవికల్పాత్మక మగు మనస్సు, ఎపుడుఁ = నిరంతరమును, మెలఁగుఁ = తిరుగాడుచుండును.

తా. వాయువునకు నధిష్ఠాన మగు ననాహతచక్రమునకు నుభయపార్శ్వములయం దున్న యిడాపింగళా నాడులలోపలి సూక్ష్మరంధ్రములయందుఁ బ్రాణాపానవాయువులు సంచరించుచుండును; ఆ ప్రాణాపానముల బాహ్యాభ్యంతరసంచారములను బరికించుచు నా రెండింటికి మధ్యవర్తి యై మనస్సు సంతతము సంచరించుచుండును. ౧౮౨

అవ. ఇట్లు మనోవాయువుల సంచారస్థలములను జెప్పి శుద్ధజీవస్వరూప మగు హంసయొక్క నివాసస్థలమును దెలుపుచున్నది.

క. ఆ రెంటికిని విలక్షణ
మై రాజిల్లెడు సుషుమ్నకియం దమలాజ్ఞాం

భోరుహమున హంసుం డా
త్మారాముఁడు సర్వసాక్షి యై వెల్గు సుతా!   ౧౮౩

టీ. సుతా = ఓ ఆంజనేయా! ఆ రెంటికిని = పూర్వోక్తనాడులు రెండింటికిని, విలక్షణము—ఐ = వేఱయినది యై, రాజిల్లెడు - సుషుమ్న యందున్ = నడుమను బ్రకాశించుచున్న సుషుమ్న యనునరమునందు, అమల + ఆజ్ఞాంభోరుహమునన్ = పరిశుద్ధ మగు నాజ్ఞాచక్రమునందు, ఆత్మారాముఁడు = పరమాత్మునియందు నిరంతరమును రమించుచున్న, హం సుండు = శుద్ధజీవుఁడు, సర్వసాక్షి - ఐ = పరమపురుషప్రాప్తిమహిమ చేత సర్వప్రపంచమునకు ద్రష్ట యై, వెల్గున్ = తేజరిల్లును.

తా. "జగద్వ్యాపారవర్జం భగవతోఽనంతకల్యాణగుణయోగో ముక్తజీవస్య" అనుటచే ముక్తజీవునకు బ్రాపంచికవ్యవహారము తప్ప పరమపురుషుని హేయప్రత్యనీకసకలకల్యాణగుణప్రాప్తి గలదు గాన, నిరం తరము పరమాత్మప్రాప్తి నానందించుచున్న ముక్తజీవుఁడు భగవల్లీలా విభూతిరూప మగు నిఖిలప్రపంచమును వినోదముగఁ బరికించుచు సుషు మ్నాంతర్వర్తి యగు నాజ్ఞాచక్రమునందు భాసిల్లుచుండును.   ౧౮౩

అవ. ఇట్లు ముక్తజీవాత్మస్థితిని జెప్పి తదాశ్రయ మగు నాయాజ్ఞాచక్రమును గొనియాడుచున్నది.

ఆ. అచలహంసరూప యెచట సంభవ మగు
నెచట సంచరించు నెచట నణఁగు
నదియ సూ సుషుమ్న యదియపో ద్విదళాబ్జ
మదియ సూక్ష్మదృష్టి యరయు మనఘ!   ౧౮౪

టీ. అనఘ = పాపరహితుఁడ వగు నో హనుమానుఁడా! ఎచటన్ = ఏస్థానమునందు, అచల-హంస-రూపము=పరిశుద్ధుఁ డగుజీవునకు నుపాధిసం బంధము, సంభవము = పుట్టినది, అగున్ = అయినదో; ఎచటన్ = ఏ

ప్రదేశమునందు, సంచరించుచు = పుణ్యపాపకర్మానుగుణలము లగు సురనర తిర్యక్ స్థావర శరీరములతోఁ దిరుగాడుచుండునో; ఎచటన్ = ఏ స్థలము నందు, అడఁగున్ = స్వస్వరూపానందావిర్భావము కాఁగా నశించునో, అదియె = ఆపరమపదమే, సుషుమ్న = సుషుమ్న యనునుత్తమనాడియు, అదియపో = ఆపదమే సుమా, ద్విదళాబ్జము=పూర్వోక్తరీతిని రెండుదళ ములు గల యాజ్ఞాచక్రము; (కనుక), అదియ=ఆపదవినే, సూక్ష్మదృష్టిన్= పరమసూక్ష్మ మగుదివ్యదృష్టిచేత, అరయుము = పరికింపుము.

తా. దేహియందుఁ బరిశుద్ధుఁ డగు జీవునకు స్వమాయాసంబంధమువలన స్థూల సూక్ష్మాది శరీరరూప మగు కార్యకరణసంఘాతము సంభవించుచుఁ బ్రవర్తించుచు లీన మగుచున్నదో; ఇట్టి సర్వకారణం బగు నాపరతత్త్వమే సుషుమ్నయు నాజ్ఞాచక్రము నయి యున్నది గాన, యోగాభ్యాసబల మున స్థూల మగుబాహ్యదృష్టిని విడిచి, పరమసూక్ష్మ మగునాంతరదృష్టి చేత దానిని తెలిసికొనుము. ౧౬౪

చ. అది యతిసూక్ష్మదృష్టియు, దృగాద్యవసానపదంబు, ధీమన
స్సదనము,స్వప్రకాశము,నసంగము,నిర్విషయంబుఁగాన,న
ప్పదమునహంసనాదములభంగులఁగూర్పఁదదంతరంబునం
దుదయము నొంది చిత్కళ మహోన్నతి వాని నడంచు
[నెంతయున్.

టీ. అది = ఆ పరమపదము, అతిసూక్ష్మ - దృష్టియున్ = "సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం" అను శ్రుతిచేఁ బరమసూక్ష్మ మగు జ్ఞానిదృష్టి గల దియుఁ గేవలము నుపాసనారూప మగు జ్ఞానదృష్టిచేఁ దెలియఁదగినదియు, దృక్ ...పదంబు - దృక్ = బాహ్యజ్ఞానము, ఆది = మొదలగువాని యొక్క, అవసాన = సమాప్తికి, పదంబు = ప్రదేశమయినదియు (బాహ్య జ్ఞానము లాపదవియందు వ్యాపింపఁజాల వని యర్థము), ధీమనస్సదనము

"ఉపాసనంస్యా ద్ధ్రువానుస్మృతి ర్దర్శనా న్నిర్వచనాచ్చ" అను బోధాయనవచనమునుబట్టి ధ్రువానుస్మృతిరూప మగుస్థితప్రజ్ఞతోఁ గూడిన శుద్ధమానసమునకు నునికిపట్టయినదియు, స్వప్రకాశము=ఇతరాపేక్ష లేక తనకుఁ దా వెలుఁగొందు చున్నదియు, అనంగము = తనకు వశవర్తిని యగుమాయ యొక్క సంపర్కము లేనిదియు, నిర్విషయంబు = చక్షురాదులగు నింద్రియములకు గోచరము కానిదియు, కానన్ = కనుక, అప్పదమునన్ = పరవస్తురూప మగు నాస్థానమునందు, హంస - నాదముల - భంగులన్ = పూర్వోక్త జీవతత్త్వముయొక్కయుఁ బ్రణవనాదములయొక్కయు రీతుల నెల్ల, కూర్పన్=ఏకతత్త్వానుసంధానమునఁ జొనుపఁగా, తత్ - అంతరంబునన్ = అట్లు పరిశుద్ధ మగు నా చిత్తమును బరతత్త్వమునందుఁ జేర్చిన వెంటనే, చిత్ - కళ = భగవత్సాక్షాత్కారరూప మగు చైతన్యకళ, మహోన్నతిన్ = మిగుల హెచ్చుగ, ఉదయమున్ - ఒంది = ఆవిర్భవించి, వానిన్ = జీవతత్త్వముయొక్కయు దశవిధోంకారనాదముల యొక్కయు రీతుల నెల్ల, ఎంతయున్ - అడంచున్ = మరలఁ బొడ సూపకుండునట్లు రూపుమాపును.

తా. జగదుత్పత్తిస్థితిలయములకు మూలకారణ మగు నాపరతత్త్వము పరమసూక్ష్మ మగు జ్ఞానదృష్టికిమాత్రము గోచర మగునదియుఁ, బ్రాపంచికజ్ఞానమునకు గోచరము కానిదియు, స్థితప్రజ్ఞానసమన్వితమైన శుద్ధమానసమునకు నివాసమైనదియు, తనకుఁ దా వెలుఁగుచుండునదియు, మాయామాయాకార్యములసంబంధము లేనిదియు, చక్షురాదు లగునింద్రియములకు నగోచరమైనదియుఁ గాన నాపరవస్తువునందు హంసశబ్దవాచ్య మగు ప్రత్యగాత్మ యొక్క చిత్తవృత్తిని - పూర్వోక్తప్రణవనాదభేదములను - తదేకధ్యానముచేఁ జేర్పఁగా వెంటనే పరమపురుషసాక్షాత్కారరూప మగు చైతన్యకళ దేదీప్యమానమై యావిర్భవించి జీవాత్మయొక్క భంగుల (సంసారావస్థల) నెల్ల సమూలముగ నశింపఁజేయును.

ఆ. భూరిహంసనాదకపూర్వోత్తరారణి
జనితచిత్కళాగ్ని ఘనత మెఱసి
స్వాదివస్తువులను స్వస్వరూపంబుగాఁ
జేయకున్నె పైని జేరునపుడు. ౧౮౬

టీ. భూరి...అగ్ని - భూరి = పరిశుద్ధ మగుట నత్యుత్తమ మైన, హంస = ప్రత్యగాత్మయు, నాద=పరమాత్మప్రతిపాదక మగు ప్రణవము యొక్క నాదము, న నెడు, పూర్వ - ఉత్తర = మొదటిది రెండవదియు నగు, అరణి=నిప్పుకొఱకుఁ దరిచెడుకఱ్ఱలవలన, జనిత=పొడమిన, చిత్కళా = పరమపురుషసాక్షాత్కారరూప మగు చైతన్యకళ యనెడు, అగ్ని= వహ్ని, ఘనతన్ - మెఱసి = మిక్కుటముగ నుండి, (దేదీప్యమాన మై) స్వాదివస్తువులన్ - స్వ = తనకుఁ బరమపురుషసాక్షాత్కారరూప మగు నగ్నికి), ఆది = హేతుభూతము లగు, వస్తువులన్ = శుద్ధజీవుఁడు పరమ పురుషవాచక మగు ప్రణవనాదము న నెడు రెండరణులను, పైన్ = పరాత్పరుఁడగు పరమపురుషుని, చేరునపుడు = పొందుతఱిని, స్వ - స్వరూపంబుగాన్ = భగవత్సాక్షాత్కార మనియెడు నగ్నియొక్క యాకార ముగ, చేయక - ఉన్నె=కావింపక యుండునా ? కావించు నని యర్థము.

తా. “ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం । ధ్యాన నిర్మథనాభ్యాసా త్పాపం దహతి పూరుషః” అనఁగా జ్ఞానయోగి తన్ను (జీవాత్మను) క్రిందికఱ్ఱగను, భగవద్వాచక మగు ప్రణవమును మీఁదికఱ్ఱ గను జేసి పరమపురుషధ్యాన మనియెడు మథించుటయొక్క యభ్యాస మును జేయుటవలన నాపురుషోత్తముఁడు జీవాత్మకుఁ గల సంసారరూప మగు పాపమును సమూలముగ దహించును - అనుటచేఁ గ్రింద నొక కఱ్ఱను బెట్టి గట్టిగఁ దరుచుటచేఁ బుట్టిననిప్పు బాగుగ నుండి యా రెండు కట్టె లను గాల్చునట్లు యోగి తనయాత్మను బ్రణవముతోఁ జేర్చి భగవద్రూపమును

నిరంతరమును ధ్యానించుటవలన నాభగవంతుఁడు సాక్షాత్కరించి జీవునిఁ దనలో నైక్యముఁ జేయును. ౧౫౬

క. అంగము నిర్మలబిందువు
లింగము నాదంబు పరమశలింగాంగమహా
సంగమె మంగళకళ యని
లింగాంగులు దెలియుదురు చలింపనిభక్తిన్. ౧౫౭

టీ. అంగము = పురుషోత్తమునకు శరీర మగు చిద్వర్గము, నిర్మల బిందువు = పూర్వోక్త మగు స్వచ్ఛమైన చిద్బిందు వనియు, లింగము "లింగం చిహ్నే నుమానేచ సాంఖ్యోక్త ప్రకృతావపి" అను మేదినీ కోశముచేత నచిద్రూప మగు మూలప్రకృతి, లేక "క్షమతాచ లింగం" అని మీమాంసకులు చెప్పునట్లు అర్థప్రకాశనసామర్థ్యాత్మక మగుభగవత్తత్త్వము, నాదంబు=పురుషోత్తమప్రతిపాదక మగు పూర్వోక్తప్రణవనాద మనియు, పరమ...సంగము+ఎ - పరమ = పరమపురుషరూప మైన, లింగ = పర వస్తువునకును, అంగ = పరమపురుషశరీరమైన జీవాత్మకును గల, మహాసం గమె = నిరతిశయమగు నైక్యమే, మంగళ - కళ = అఖండానందరూప మైన చైతన్యకళ, అని = అనియు, లింగాంగులు = సకలజగత్కారణ భూతుఁడైన పరమపురుషునికి శరీరభూతులైన శుద్ధజీవులు, చలింపని - భక్తిన్=నిశ్చల మైన యుపాసనాత్మక మగు భక్తిచేత, తెలియుదురు = ఎఱుంగుదురు.

తా. "నామరూపవిభాగ విభక్త స్థూల చిదచిద్వస్తుశరీరం బ్రహ్మ కార్యావస్థం" అనువేదార్థసంగ్రహావచనముచేతను "యస్యాత్మా శరీరం" అను శ్రుతిచేతను, కార్యావస్థ మగు బ్రహ్మమునకు శరీరమగు జీవాత్మ పరి శుద్ధ మగు చిద్బిందువనియు, "నామరూపవిభాగా నర్హ సూక్ష్మదశాపన్న ప్రకృతి పురుషశరీరం బ్రహ్మకారణావస్థం" అను వేదార్థసంగ్రహావచన

మును బట్టి కారణావస్థ మగు బ్రహ్మము పూర్వోక్తప్రణవనాద మనియు, "తత్త్వమసి ఐతదాత్మ్య మిదం సర్వం అయమాత్మా బ్రహ్మ" అను మొదలగు ఘటకశ్రుతివచనములచే సిద్ధ మగు కార్యకారణములకు ననన్యత్వరూపమైన జీవేశ్వరులకుఁ గల యేకత్వమే సకలకల్యాణగుణాస్పద మైన చైతన్యకళ యనియుఁ, బరమపురుషశరీరభూతు లగు జ్ఞానులు నిశ్చల మగు భక్తిచే నెఱుంగుదురు. ౧౮౭

ఆ. అట్లు గావునఁ గళ హంసనాదంబుల
రూప మడఁచి తనదు రూపుఁ జేసి
తాను తాన యైన తత్త్వంబునం దైక్య
మొందు బయలు బయల నొందినట్లు. ౧౮౮

టీ. అట్లు కావునన్ = అది కాఁబట్టి, కళ = జీవకళ, హంస+నాదంబుల+రూపము - హంస = తనకు నవిద్యాసంగమువలనఁ గలిగిన లింగశరీరముయొక్కయు, నాదంబుల = పూర్వోక్తప్రణవనాదజన్య మైన ప్రకృతిపరిణామాత్మక మైన స్థూలశరీరముయొక్కయు, రూపము = దాని యందలి యభిమానమును, అడఁచి = భగవంతునియందలి భక్తివిశేషము చేత రూపుఁబాపి, తనదు - రూపున్ = తనయొక్క జ్ఞానైశ్వర్యాది సంపన్న మగు దివ్యస్వరూపమును, చేసి = తొంటియట్ల కావించి, తాను = జీవాత్ముఁడు, తాన = పరమాత్మయే, ఐన తత్త్వంబునందున్ = శరీర శరీరిభావముచే నగునట్టివస్తుతత్త్వస్వరూపమునందు, ఐక్యము=ఏకత్వమును (భగవత్సాయుజ్యమును), బయలు = ఘటాదులయం దుండు నాకసము, బయలన్ = భూతాకాశమునందు, ఒందునట్లు = ఘటాద్యుపాధినాశము కాఁగా పొందెడు రీతిని, ఒందున్ = పడయును.

తా. జ్ఞానులు జీవేశ్వరులకుఁ గల శరీరాత్మభావరూప మగు నైకత్వమే నిరతిశయానందాత్మక మగు మోక్షసామ్రాజ్య మని తెలియుటం

జేసి, శుద్ధజీవకళ తనకు నవిద్యాసంగమువలనఁ గలిగిన స్థూలసూక్ష్మశరీరాభిమానస్వరూపమును బూర్వోక్త పురుషోత్తమ శరీరాత్మభావజ్ఞానముచే రూపుమాపి తనయొక్క శుద్ధస్వరూపమును గావించుకొని తాను పరమపురుషునకు శరీరభూతుఁ డయిన వస్తుస్వరూపమునందు కుండలు మొదలగువానియందుండు నాకాశ మాకుండలు మొదలగునవి నశింపఁగా భూతాకాశమునందుఁ గలయునట్లు పురుషోత్తమసాయుజ్యము నొందును. ౧౮౮

అవ. పైని జెప్పినయర్థమునే సుఖబోధార్థము భంగ్యంతరమున వివరించి యుపదేశించుచున్నది.

మ. కలహంసాన్వితనాదబిందుకళ లైక్యం బెప్డు డౌ నప్డు డు
జ్జ్వలకర్పూరశిఖిప్రణాశముగతిన్ సర్వేంద్రియాళ్యన్వితా
నిలచిత్తంబులు శూన్యతం జనఁగఁ దానిర్వాతదీపోపమా
చలసచ్చిత్సుఖవిగ్రహాత్ముఁడలరున్ సంపూర్ణుఁడై యంతటన్.

టీ. ఎప్డుడు = ఏ యవస్థయందు, కల...కళలు = కలహంస - "సర్వభూతహృదయ" అను ఆ. ౧-౧౭౬ వ పద్యమునందుఁ జెప్పఁబడిన లక్షణము గల శుద్ధజీవహంసతో, అన్విత = కూడుకొనియున్న, నాదబిందు - కళలు = పూర్వోక్తము లైన ప్రణవనాదములు - చిద్బిందువు - వృత్తిరూపము లగు చైతన్యకళలు, ఐక్యంబు = ఏకత్వము నొందినవి, ఔన్ = అగునో, అప్డుడు = అత్తఱిని, సర్వ...చిత్తంబులు - సర్వ = సమస్తములైన, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములయొక్క, ఆళి = పంక్తితో, అన్విత = కలసియున్న, అనిల - చిత్తంబులు = ప్రాణాదివాయువులును మనస్సును, ఉజ్జ్వల - గతిన్ - ఉజ్జ్వల = మండెడు, కర్పూర = కప్పురమునందలి, శిఖి = అగ్నియొక్క, ప్రణాశము - గతిన్ = ఆఱిపోవు రీతిని, శూన్యతన్ = లేకపోవుటచేత, చనఁగన్ = నశింపఁగా, నిర్వాత...ఆత్ముఁడు - నిర్వాత = గాలి సోఁకని, దీప = ప్రదీపము

రొయొక్క, ఉపమా = సమాన మగుటచేత, అచల = చలనములేని, సత్ = పరిశుద్ధమైన, చిత్ = చైతన్యముయొక్క, సుఖ - విగ్రహా = ఆనంద స్వరూపము గల, ఆత్ముఁడు = శుద్ధజీవుఁడు, అంతటన్ = ఎల్లయెడలను, సంపూర్ణుఁడు = భగవంతునివలె నిండియున్నవాఁడు, ఐ = అగుచు, అలరున్ = ప్రకాశించును.

తా. ప్రకృతిపరిణామాత్మకము లగు మహదాది కార్యకరణ సంఘాతము లెల్ల మండుచుండెడు కర్పూరమునందలి యగ్నివలెఁ బురుషోత్తమోపాసనచే సమూలముగ నశింపఁగా ముక్తాత్మ "యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా" అనునట్లు గాలి లేనిచోట నున్న దీపమువలె సంసారచక్రమునందు జననమరణాదిరూప మగు పరిభ్రమణము లేక యఖండానందస్వరూప మై పరమాత్మునియట్లు - సర్వపరిపూర్ణ మై ప్రకాశించును. ౧౮౯

అవ. పైని సామాన్యముగ నుద్దేశింపఁబడిన విశేషార్థమును వెల్లడిచేయుచున్నది.

వ. ఇట్లు హంసనాద బిందుకళలతో సకలేంద్రియ సమన్విత మనఃప్రాణంబు లెప్పుడు విలయం బగునప్పు డయ్యవస్థ తురీయం బనియు, నున్మని యనియు, సహజామనస్కం బనియుఁ జెప్పనొప్పు; నట్టిపూర్ణ నిర్వికల్పసమాధియం దద్వితీయాపరోక్ష స్వయంప్రకాశమానాఖండ సచ్చిదానందస్వరూప పరమాత్మారామచైతన్యమాత్రుండం వై యుండుమని యుపదేశించి వెండియు నిట్లనియె. ౧౯౦

టీ. ఇట్లు = పైని చెప్పినరీతిని, హంస - నాద - బిందు - కళలతోన్ = హంసమంత్రభూతమగు బ్రహ్మప్రణవముయొక్క దశవిధనాదములతోను చిద్బిందువుతోను చైతన్యకళలతోను, సకల - ఇంద్రియ - సమ

స్వాత - మనః - ప్రాణంబులు = జ్ఞానకర్మేంద్రియములతోఁ గూడిన మనో వాయువులు రెండును, ఎప్పుడు = ఏ సమయంబునందు, విలయంబు - అగున్ = బ్రహ్మమునందు యోగాభ్యాసబలమున విలీనము లగునో, అప్పుడు = ఆ సమయమునందు, అయ్యవస్థ = సమూలముగఁ జిత్తప్రాణముల యీ విలీనావస్థ, తురీయం బనియు = జాగ్రత్స్వప్నములకుఁ జెలియది యగు భగవత్తాదాత్మ్యరూపమైన తురీయావస్థ యనియు, ఉన్మని యనియు = మనోవృత్తులకు గోచరముగాక పైఁగ నుండునది గాన నున్మని యనియు, సహజ - అమనస్కంబు - అనియు = ప్రకృతిసంసర్గముతోఁ గూడిన మనస్సుయొక్క సంబంధము లేనిది యమనస్కము. ఇది శుద్ధజీవునకు స్వాతస్సిద్ధమైనది గాన సహజామనస్క మనఁబడును, అనియున్ = అనుచు, చెప్పన్ - ఒప్పున్ = మహాయోగులచేఁ బలుకఁబడును; అట్టిపూ... అందున్ - అట్టి = తురీయాది నామములచేఁ జెప్పఁబడు, పూర్ణ = మీఁదఁ జెప్పినయట్లు అంతట నిండిన, నిర్వికల్ప = ప్రకృతిసంసర్గము లేకపోవుటచే నేవికల్పములు లేని, సమాధియందున్ = అసంప్రజ్ఞాతరూపమైన భగవన్నిష్ఠయందు, అద్వితీయ...మాత్రుండవు - అద్వితీయ = "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను మొదలగు శ్రుతులచేఁ జేతనాచేతనాత్మక మగు నిఖిలప్రపంచము దనకు శేషభూత మగుటచే విశిష్టాద్వైతంబును, అపరోక్ష = ముక్తాత్ములకు సాక్షాత్కారమైనదియు, స్వయంప్రకాశమాన = ఇతర సాపేక్ష లేక తనకుఁ దా వెలుఁగొందు చుండునదియు, అఖండ = సర్వవ్యాపకం బగుటచే నపరిచ్ఛిన్నమును, సత్ = సత్త్వగుణమును, చిత్ = సర్వజ్ఞమును, ఆనంద = నిరతిశయానందగుణకమును నగు, స్వరూప = దివ్యమంగళవిగ్రహము గలదియు నగు, పరమాత్మ = పరబ్రహ్మమునందు, ఆరామ = అత్యధిక ప్రపత్తిచేఁ బ్రేమించెడు, చైతన్యమాత్రుండవు = కేవల పరిశుద్ధచైతన్యము గలవాఁడవు, ఐ = అగుచు, ఉండుదు, అని,

ఉపదేశించి = బోధించి, వెండియున్ = మఱల, ఇట్లు - అనియెన్ = ఈ వడువునఁ బలికెను.

తా. పూర్వమునందు వివరింపఁబడినరీతి నుపాధివిశిష్టుండై హంసశబ్ద వాచ్యుఁడగు జీవుఁడును, దశవిధ ప్రణవనాదములును, చిద్బిందువును, చైతన్యకళలును, అను వీనితో జ్ఞానకర్మేంద్రియములతోఁ గూడినట్టి యంతఃకరణచతుష్టయమును ప్రాణాదు లగు దశవిధవాయువులును, భగవదుపాసనారూప మగు యోగాభ్యాసముయొక్క పాటవముచే నేతఱిని భగవంతునియందుఁ జేరియుండునో యప్పు డాయవస్థ జాగ్రత్స్వప్నసుషుప్తులకుఁ బైది యగు తురీయావస్థ యనియు, మనస్సు బాహ్యమును విడిచి పరాత్పరం బగు బ్రహ్మమును జేరుటచే నున్మన్యవస్థ యనియు జీవునకుఁ బ్రకృతిసంసర్గము లేక స్వతస్సిద్ధముగ నున్నపుడు పరిశుద్ధమైన మనస్సు గలిగియుండును గాన సహజామనస్కం బనియు యోగీంద్రులచేఁ జెప్పఁబడి యొప్పుచు నుండును; "పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే । పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే" అనుటచే సర్వపరిపూర్ణ మగు బ్రహ్మమునందు బాహ్యప్రపంచవికల్పములు లేని యసంప్రజ్ఞాత సమాధి యందు సర్వశేషి యగుటచే తనకంటె వేఱొండు లేనిదియు, ముక్తజీవులకు నిత్యసాక్షాత్కారరూపమును, ననన్యాపేక్షముగఁ దనకుఁ దా వెలుఁగొందుచుఁ, దెంపులేని సత్తును జైతన్యమును ఆనందమును స్వరూపముగఁ గల పరబ్రహ్మమునందు రమించుచుండెడి చైతన్యము మాత్రము గలవాఁడవై నీ వుండుము; అని యుపదేశము చేసి మఱియు నిట్లు పలికెను.

అవ. పూర్వోక్తము లయిన నాదబిందు లక్ష్యముల యభ్యాసబలమున రాజయోగము సిద్ధించు నని ఫలితార్థము చెప్పఁబడుచున్నది.

సీ. పరమహంసంబు రేయింబగలుఁ జింతింపంగ
బిందు వింగదందుఁ గంకేసింపకుండు

దశవిధప్రణవనాదము లాలకింపంగఁ
దుదను ఘంటానాద మొదవి మ్రోయు
బహులక్ష్మలక్ష్యముల్ పరికించి చూడంగ
సురుచిరం బై స్వయంజ్యోతి యొప్పు
యామద్వయంబు యోగారూఢుఁ డై వాని
ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు
తే. నట్టియున్మనియందు మనోఽనిలములు
వివిధవిషయేంద్రియములతో విలయ మొందు
నిదియ సూ సర్వవేదాంతవిదితపరమ
రాజయోగంబు దేవతారాజవినుత ! ౯౧

టీ. దేవతా = వేల్పులకు, రాజ = ప్రభువగు నింద్రునిచేత, వినుత = నుతింపఁబడెడి యో పవనతనయా! పరమహంసంబున్ = "నాదబిందుకళల కాదియై" అను మొదలుగఁ బ్రతిపాదింపఁబడిన జీవేశ్వరైక్యరూపం బగుపరబ్రహ్మతత్త్వమును, రేపగలున్ = అహోరాత్రములు (తెంపులేక), చింతింపంగన్ = "పూరకమున హకారంబుఁ బొందుపఱచి" అను మొదలుగఁ దొల్లిఁ జెప్పఁబడినరీతి ననుసంధించినయెడల, బిందువు = సంకల్పవికల్పాత్మక మగు జీవచైతన్యము, ఇంపున్ + అందున్ = ఆ యా విషయములందు, కంపింపక ఉండున్ = చలియింపక నిలుచును, దశ - విధ - ప్రణవ - నాదములు = "మొదలఁ జిణి యనుచు నంతటఁ జిణిచిణి యటంచు" అను తొల్లిగ వెనుకఁ జెప్పఁబడిన పదితెఱంగులంగల యోంకారధ్వనములను, ఆలకింపంగన్ = వినినయెడల, తుదన్ = కడపటను, ఘంటానాదము = ఘంట వాఁగునట్టి చప్పుడు, ఒదవి = పుట్టి, మ్రోయున్ = వాఁగును (ధ్వనిచేయును); బహు - లక్ష్మ - లక్ష్యముల్ = పెక్కు లక్షణములు గల చిత్కళాసాక్షాత్కారములను, పరికించి = నిదానించి,

చూడంగన్ = వీక్షించినచో, సురుచిరంబు - ఐ = మనోహర మగుచు, స్వయంజ్యోతి = తనకుఁ దా వెలుంగు పరమాత్మస్వరూపము, ఒప్పున్ = విలసిల్లును (సాక్షాత్కరించును), యామద్వయము = పదియాఱు గడియల కాలము, యోగ - ఆరూఢుఁడు - ఐ = పైని జెప్పిన రాజయోగమునందు నిష్ఠ గలవాఁడగుచు, వానిన్ = ఆ చిద్బిందువును ఘంటానాదమును స్వయంజ్యోతిని, ధ్యానింపన్ = అనుసంధించినయెడల, తన్మయత్వంబు = ఆ స్వయంజ్యోతియొక్క తాదాత్మ్యము, కలుగున్ = అలవడును, అట్టి యున్మనియందున్ = ఆ స్వయంజ్యోతియొక్క తాదాత్మ్యరూప మగు నున్మన్యవస్థయందు, మనస్ - అనిలము = చిత్తమును ముఖ్యప్రాణవాయువును, వివిధ - విషయ - ఇంద్రియములతోన్ = పలువిధములగు దృశ్య పదార్థములతోను శ్రోత్రాదులు వాగాదులు నగు నింద్రియములతోనుగూడ, విలయము - ఒందున్ = విలీనము లగును, సర్వ - వేదాంత - విదిత - పరమ - రాజయోగంబు = నిఖిలములైన యుపనిషత్తులయందును బ్రసిద్ధమై సర్వోత్తమ మగు రాజయోగ మనఁగా, ఇదియ సూ = ఇదియే యై యున్నది.

తా. "అహం బ్రహ్మాఽస్మి" త్యాద్యనేక శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడు జీవేశ్వరైక్యరూపం బగు పరబ్రహ్మతత్త్వమును నిరంతరముగ నహోరాత్రములయం దనుసంధానము చేయుటవలన నతిచంచల మగు మనస్సు విషయములయందుఁ బడక నిశ్చలమై యుండును; చిణి మొదలగు పదితెఱంగులం బరఁగు ప్రణవనాదముల నాలించుచుండుటవలనఁ దుదను ఘంటానాద ముద్భవించి వాఁగును; పెక్కు చిహ్నములతో నొప్పెడు లక్ష్యములనెల్లఁ బరిశీలించి చూచుటవలన నానందఘనం బగుటచే మనోహర మగు స్వయంప్రకాశమానబ్రహ్మతత్త్వము సాక్షాత్కరించును! పదియాఱు గడియ లా బ్రహ్మతత్త్వమును రాజయోగనిష్ఠుఁడైనయోగి "అదియే నేను నేనే యది" యని యఖండాకారముగ ధ్యాన మొనరించినచోఁ

దాదాత్మ్యము సిద్ధించును; తాదాత్మ్యరూపం బగు నాయున్మన్యవస్థయందు మనస్సును, ప్రాణవాయువులును జ్ఞానేంద్రియకర్మేంద్రియములతోఁ గూడ విలీనములగును; ఇట్లు జీవేశ్వరైక్యరూపం బగు నున్మన్యవస్థయందు మనో వాయువులు దశవిధేంద్రియవ్యాపారములతోఁ గూడ విలీనము లగుటయే సర్వోపనిషత్తులందును బ్రతిపాదింపఁబడినరాజయోగ మగును.

అవ. ఇఁక నుత్తమ మధ్యమాధమాధికారులకు నీరాజయోగము సిద్ధించుక్రమము నిర్ణయింపఁబడుచున్నది.

వ. ఇవ్విధంబునఁ బ్రతిదివసంబు యామద్వయనియమంబుఁ దప్పక యభ్యసించిన నిర్మలనిశ్చలచిత్తవృత్తి గల పురుషునకు షణ్మాసంబులకును, మందప్రజ్ఞునకు నొకసంవత్సరంబునకును, గేవలమూఢాత్మునకు, ద్వాదశవర్షంబులకునుఁ, బరమ సూక్ష్మతారక యోగసిద్ధి యగు నని యోగశాస్త్రంబుల వినంబడు; దివ్యజ్ఞాన విజ్ఞానసంపన్నుం డగు నాచార్యుని సాన్నిధ్యంబున వసియించి స్థానాంగభావాత్మ శుశ్రూషలు గావించుచు నిరంతరంబు సేవించుమహాను భావునకు నిరంతరాయంబుగా శీఘ్రకాలంబున నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారం బగు; సందేహింపవలదు. ౧౯౨

టీ. ఈవిధంబునన్ = పైని జెప్పినయట్లు, ప్రతిదివసంబున్ = ప్రతిదినమునందును, యామ - ద్వయ - నియమంబున్ = రెండు జాముల నిష్ఠను, తప్పక = మానక, అభ్యసించినన్ = అభ్యాసమును జేసినయెడల, నిర్మల = "రాగద్వేషక్రోధలోభమదాహంకారమత్సరాః ఈర్ష్యాసూయా దంభమోహాదర్పకామా మనోమలాః" అని చెప్పఁబడిన రాగము ద్వేషము మొదలగు పదుమూఁడు మనోమలములు లేనిదియు, నిశ్చల=శబ్దాదివిషయ

ములయందుఁ బడి చలింపనిదియు నగు, చిత్తవృత్తి = మనోవ్యాపారము, కల = కలిగిన, పురుషునకు = మనుష్యునకు, షట్ - మాసంబులకును = ఆఱునెలలకును, మంద - ప్రజ్ఞునకున్ = మందమైనబుద్ధి గలవానికి, సంవత్సరంబునకును, కేవల - మూఢ - ఆత్మునకున్ = ఇంచుకయుఁ దెలివితేటలులేని బుద్ధి గలవానికి (వివేకవిహీనునకు), ద్వాదశ - వర్షంబులకున్ = పదిరెండు సంవత్సరములకును, పరమ - సూక్ష్మ - తారక - యోగ - సిద్ధి - "సూక్ష్మాత్సూక్ష్మతరం జ్ఞేయం" అనుటచే మిగుల సూక్ష్మ మగు రామతారక పరబ్రహ్మముయొక్క, యోగసిద్ధి = తాదాత్మ్యప్రాప్తి, అగున్ - అని = సంభవించు నని, యోగశాస్త్రంబులన్ = రాజయోగమును బ్రతిపాదించెడు నుపనిషదాది గ్రంథములయందు, వినంబడున్ = ఆలకింపఁబడును, దివ్య...సంపన్నుండు - దివ్య = లోకోత్తరమైన, జ్ఞాన= అపరోక్షాత్మజ్ఞానముయొక్కయు, విజ్ఞాన = పరోక్షబ్రహ్మజ్ఞానముయొక్కయు, సంపన్నుండు=సంపత్తి గలవాఁడు, అగు = అయిన, ఆచార్యుని - సాన్నిధ్యంబునన్ = సద్గురువుయొక్క సామీప్యమునందు, వసియించి = నివసించి, స్థాన - అంగ - భావ - ఆత్మ - శుశ్రూషలు = స్థానశుశ్రూష, అంగశుశ్రూష, భావశుశ్రూష-ఆత్మశుశ్రూష- అను చతుర్విధ శుశ్రూషలను, కావించుచున్ = ఒనరించుచు, నిరంతరంబున్= సర్వకాలసర్వావస్థలయందును, సేవించు = కొలుచుచుండెడు, మహానుభావునకున్ = గొప్పది యగు ననుభావము గల ముముక్షువునకు, నిరంతరాయంబుగాన్ = ఏయాటంకములును లేకుండునట్లుగ, శీఘ్ర - కాలంబునన్ = కొలఁది తటిలోనే, నిర్గుణ - బ్రహ్మసాక్షాత్కారంబు = సత్త్వరజస్తమోగుణసంబంధము లేని పరమాత్మయొక్క యపరోక్షానుభవము, అగున్ = గలుగును, సందేహింపన్ - వలదు = ఇందులకు సందియము నొందఁ బనిలేదు.

తా. మీఁదను వివరించినయట్లు దినదినము నియమమును విడువక పగ లొకయామము రాత్రి యొకయామమును పరమహంసానుసంధానము

యొక్కయు, ప్రణవనాదశ్రవణము యొక్కయు, లక్ష్యదర్శనము యొక్కయు నభ్యాసమును జేయుచుండినయెడలఁ గామాదికలుషదూషితము గాక చలనములేని మనోవ్యాపారము గల యోగికి మిగుల సూక్ష్మమగు తారక యోగము, ఆఱుమాసములకే సిద్ధించును; కొంచెము కామక్రోధాదులకు లోఁబడి మందమగు బుద్ధి గల యభ్యాసకునకు నొక సంవత్సరమునకును, నత్యంతమును గామక్రోధాదులకు లోనయి బుద్ధిశుద్ధిలేక పరమమూఢుఁడగు నభ్యాసకునకుఁ బండ్రెండేండ్లకు సిద్ధించును.--అని యోగమును బ్రతిపాదించు శాస్త్రములయందు నాలకింపఁబడుచున్నది; అపరోక్షాత్మజ్ఞానము పరోక్షబ్రహ్మజ్ఞానము గల దేశికేంద్రునిచెంత నుండి యతనికిఁ బదముల నొత్తుట మొదలగు నాలుగువిధము లగు సేవలను జేయుచు నెల్లపుడు నారాధించు మహాత్మునకు నేయాటంకములు లేక కొంచెపుఁగాలములోనే గుణత్రయాతీత మగు పరబ్రహ్మము సాక్షాత్కరించు ననుటకు నించుకయు సంశయము లేదు. ౧౯౨

అవ. ఇట్లు పరమభాగవతోత్తముండు నుత్తమాధికారియు నగు నాంజనేయునకుఁ ద్రిజగజ్జననియుఁ బరదేవతయు నగు సీతాదేవి శ్రీరామతారకయోగము నుపదేశింప నతండు కృతార్థుం డయ్యె నని చెప్పి, ముందు శ్రీరామచంద్రుం డుపదేశింపఁబోవు సాంఖ్యయోగమును సూచించుచు నీయాశ్వాసము ముగింపఁబడుచున్నది.

మ. అనిబోధించిననాంజనేయుఁడు మరీశయానందముంబొందిచ
యున సీతాలలనాశిరోమణికి సాష్టాంగప్రణామంబుఁ జే
సె నటంచుం బరమేశ్వరుండు కృపచే శ్రీపార్వతీదేవికిన్
వినిపింప న్విని రాముఁ డేమనియె నా వృత్తాంతముం జెప్పవే.

టీ. అని = పైని జెప్పినయట్లు, బోధించినన్ = సీతాదేవి యుపదేశింపఁగా, ఆంజనేయుఁడు = అంజనాదేవికొడు కగు హనుమానుఁడు,

**తురీయ** - ఆనందముక్ = అవస్థాత్రయమునకు సాక్షిరూప మగు బ్రహ్మానందమును, పొంది = పడసి, చయ్యనక్ = వెంటనే, సీతా - లలనా - మణికిక్ = మహాపతివ్రత యగుటచే నన్నులమిన్న యగు సీతాదేవికి, స - అష్ట - అంగ - ప్రణామంబు = వక్షఃస్థలము మొదలగు నెనిమిది యంగములతోఁ గూడిన వందనము, చేసెక్ = కావించెను, అటంచుక్ = అనుచు, పరమేశ్వరుండు = మహాదేవుఁడు, శ్రీ - పార్వతీ - దేవికిక్ = పాతివ్రత్యాది సకలసంపదలతోఁ గూడిన గౌరీదేవికి, కృపచేక్ = దయతో, వినిపింపక్ = చెప్పఁగా, విని = ఆకర్ణించి, రాముఁడు = శ్రీరామచంద్రుఁడు, ఏమి - అనియెక్ = పిమ్మట నేమి యుపదేశించెను? ఆ - వృత్తాంతముక్ = ఆ విషయమును, చెప్పవు - ఏ = నా కుపదేశింపుమా.

వ. అని యడిగినన్. ౧౯౪

టీ. అని పార్వతీదేవి ప్రార్థింపఁగా.

తా. మీఁదఁ జెప్పినయట్లు సీతాదేవి సాంగముగ రాజయోగక్రమము నెల్ల నుపదేశించిన విని హనుమంతుఁడు బ్రహ్మానందభరితుఁడై యామెకుఁ గృతజ్ఞతాపూర్వకముగ సాష్టాంగదండప్రణామంబు లాచరించె నని మహేశ్వరుండు శ్రీభవానీదేవికి మిక్కుటమగు మక్కువతోఁ దెలిపిన, నాలించి యాగౌరీదేవి పిదప శ్రీరామచంద్రుఁ డేమి యుపదేశించె నాయర్థమును గూడ నుపదేశింపవలయు నని ప్రార్థించెను. ౧౯౪

అవ. ఇట్లు సీతామహాలక్ష్మి యాంజనేయునకు శ్రీమత్తారకయోగమును సాంగముగ నుపదేశించె నని చెప్పి కృతికర్త యాశ్వాసాంతసూచకముగఁ గృతిపతిసంబోధనమును మూఁడుపద్యములతోఁ జేయుచున్నాఁడు.

చ. పరమదయాసముద్ర గుణభద్ర కరాంచితబోధముద్ర భా
స్కరశతకోటిధామ జితకామ బుధాంబుధిసోమ విస్ఫుర

న్నిరతిశయప్రభావ ఘననిర్మలభావ మహార్ద్రభావ శం
కరహరిధాతృరూప చిదఖండకలాప జగత్ప్రదీపకా. ౧౯౫

టీ. పరమ = సర్వోత్కృష్ట మగు, దయా = కనికరపురసమునకు, సముద్ర = సంద్రమైనవాఁడా ! గుణ - భద్ర = శమము దమము లోనగు సకలసద్గుణముల చేతను శుభప్రదుఁడ వైనవాఁడా, కర - అంచిత - బోధ - ముద్ర = చేతి చేతఁ గూర్పఁబడిన చిన్ముద్ర గలవాఁడా, భాస్కర- శత - కోటి - ధామ = నూఱుకోట్ల యాదిత్యులయొక్క (విశేష్యపూర్వ పదకర్మధారయసమాసము) కాంతులను బోలినదివ్యకాంతి గలవాఁడా, జిత - కామ = జయింపఁబడిన విషయాభిలాష గలవాఁడా, బుధ - అం బుధి - సోమ = "జ్ఞాతృచాంద్రిసురాబుధాః" అనుట చేత బుధశబ్దము విద్వాంసులకును వేల్పులకును జెల్లుబడి యగుచున్నది గానఁ బండితులు దేవ తలు ననియెడు కడలికి నుల్లాసకరుఁ డగుచందురుఁడ వైనవాఁడా, విస్ఫు రత్ = ఎల్లయెడలఁ బ్రకాశించుచున్నట్టియు, నిరతిశయ = లోకోత్తర మైనట్టియు, ప్రభావ=మాహాత్మ్యము గలవాఁడా, ఘన = ఎక్కువైనదియు, నిర్మల=పరిశుద్ధమైనదియు నగు, భావ = ప్రవర్తన గలవాఁడా, మహత్= మిక్కిలిగ, ఆర్ద్ర = కరుణారసముచేఁ గరఁగిన, భావ = అభిప్రాయము గలవాఁడా, శంకర - హరి - ధాతృ - రూప = శివుఁడు కేశవుఁడు స్వయంభువుఁడును స్వరూపముగాఁ గలిగి ప్రపంచసృష్టిస్థితిలయములను జేయువాఁడా, చిత్ = అనంతకోటి జీవచైతన్యములకు, అఖండ = తెంపు లేని, కలాప = అలంకార మైనవాఁడా, జగత్ - ప్రదీపకా = "తమేవ భాంత మనుభాతి సర్వం" అను శ్రుతిచే సకలజగంబులను బ్రకాశకుఁడ వైనవాఁడా !

తా. లోకోత్తరమగు కరుణారసమునకు సముద్రుఁడవును, శమద మాద్యనంతసద్గుణములచే నాశ్రితజనులకు మంగళముల నొసఁగువాఁడవును

కరసంపుటముచేఁ గూర్పఁబడినబోధముద్ర గలవాఁడవును, లెక్కలేని సూర్యుల కాంతులను మీఱుచున్న దివ్యప్రకాశము గలవాఁడవును, పొందఁబడిన యెల్లకోరికలు గలవాఁడ వగుటచే సకలవిషయాభిలాషలను జయించినవాఁడవును, బ్రహ్మజ్ఞానసంపన్ను లనెడి మహాసముద్రములకు సముల్లాసకుఁడ వగుటచే నిండుచందురుంబోలినవాఁడవును, సమధికమాహాత్మ్యసంపన్నుఁడవును, అత్యంతపరిశుద్ధ మగు సత్ప్రవర్తన గలవాఁడవును, మిగుల రసవంతమైన స్వభావము గలవాఁడవును, త్రిమూర్త్యాత్మకుఁడవును, అనంతకోటిజీవరాసులకు నంతర్యామిరూపమున నలంకారభూతుఁడవును, అనంతకోటి బ్రహ్మాండములకుఁ బ్రకాశకుఁడవు నగు నోదేశికేంద్రా! యని కృతిపతి యగు స్వగురుమూర్తినిగూర్చి పరాత్పరునిగ సంబోధనములు. పైరెండు పద్యములయందు నిట్లే గమనించునది. ౧౯౫

క. జగదింద్రజాలకల్పక
సగుణాగుణరూపపరమసత్యాలాపా
నిగమాగమాంతవినుతా
త్రిగుణాతీతస్వభావ శ్రీధీనుతభావా. ౧౯౬

టీ. జగత్ - ఇంద్రజాల - కల్పక = నిఖిల ప్రపంచరూప మగు గొప్ప యింద్రజాలమును గల్పించినవాఁడా, సగుణ = అనంత కళ్యాణగుణ సమన్వితమును, అగుణ = హేయగుణ విహీనము నగు, రూప = దివ్య మంగళవిగ్రహము గలవాఁడా, పరమ - సత్య - ఆలాపా = మిగుల సత్యములగు వేదములే వాక్కులుగాఁ గలవాఁడా, నిగమ = ఋగ్యజుస్సామాధర్వణము లనియెడు చతుర్వేదములయు, ఆగమ = మహాపాంచరాత్ర రుద్రయామళాదు లగు నాగమములయు, అంత=పర్యవసానభూతము లగు నుపనిషత్తులచేతను తంత్రరహస్యములచేతను, వినుతా = కొనియాడఁబడుచున్నవాఁడా, త్రిగుణ - అతీత - స్వభావ = సత్త్వరజస్తమో గుణా

త్మిక యగు మూలప్రకృతికిఁ బైఁబడిన (లోఁబడని) అంతరంగము గల వాఁడా, ధీ - నుత - భావా = సుజ్ఞానముచేతఁ గొనియాడఁబడు నభిప్రాయము గలవాఁడా.

తా. విచిత్రజగజ్జాల మను నింద్రజాలమును జేయుచున్నవాఁడును, అమితకల్యాణగుణగణవిశిష్టంబును హేయగుణవిరహితంబు నగు స్వరూపము గలవాఁడును, అత్యంతసత్యంబు లగు చతుర్వేదములే ఉపదేశవాక్యములుగఁ గలవాఁడును, సకలోపనిషత్తులచేతను వేదాంగములచేతను గొనియాడఁబడుచున్నవాఁడును, త్రిగుణాత్మికయగు మహామాయను లోఁబర్చుకొనిన స్వభావము గలవాఁడును, బ్రహ్మజ్ఞానముచేఁ బొగడ్తను గనిన యంతరంగము గలవాఁడు నగు పరాత్పరుఁడే నీ వైనవాఁడా! ౧౯౬

మాలినీవృత్తము. కలుషచయవిరామా ! ఖండితాశేషకామా
సులభసుఖవిచారా ! సూరిచేతోవిహారా
విలయజననదూరా ! విశ్వరూపావికారా
సలలితశుభకీర్తీ ! సచ్చిదానందమూర్తీ. ౧౯౭

టీ. కలుష - చయ - విరామా = మహాపాతకములయం నుపపాతకములయు సముదాయమును ఖండించువాఁడా, ఖండిత - అశేష - కామా = పరిత్యజింపఁబడిన సమస్త విషయాభిలాషలు గలవాఁడా, సులభ - సుఖ - విచారా = సులభమైన బ్రహ్మానందానుసంధానము గల వాఁడా, సూరి - చేతః - విహారా = బ్రహ్మజ్ఞానులయొక్క చిత్తములయం దుండువాఁడా, విశ్వ = సమస్తమైన, రూప = ఆకారములచేత, అవికారా = వికృతి నొందనివాఁడా, సలలిత - శుభ - కీర్తీ = మనోహరమైనట్టియు, శుభప్రదమైనట్టియుఁ గీర్తి గలవాఁడా, సత్ - చిత్ - ఆనంద - మూర్తీ = సత్తును చిత్తును ఆనందమును స్వస్వరూపముగఁ గలవాఁడా.

తా. స్మరణమాత్రముచే సకలపాపములను దూలఁదోలువాఁడవును, కాంతాకనకాదులయందుఁ గోరికలు లేనివాఁడవును, సుకరముగ లభిం

చిన బ్రహ్మానందానుసంధానము గలవాఁడవును, మహాజ్ఞానులచేఁ దహ్ర హృదయమునందు నిలుపుకొనఁబడి ధ్యానింపఁబడుచున్న వాఁడవును, జనన మరణాదులు లేనివాఁడవును, గావుననే సకల రూపములయొక్క వికృతులు లేనివాఁడవును, మనోహరమై మంగళప్రదమైన శాశ్వతయశస్సు గల వాఁడవును, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను మొదలగు శ్రుతులచే సత్యజ్ఞానానందస్వరూపుఁడవును నగు నో దేశికేంద్రా! యని సంబోధనము లు. ౧౯౭

గద్య. ఇది శ్రీమన్నారాయణ మహాదేవగురు కరుణాకటాక్ష వీక్షణ విమలీకృత నిజహృదయకమల కర్ణికాంత స్సందర్శితాఖండ సచ్చిదానందైకరసస్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతం బైన శ్రీ సీతారామాంజనేయ సంవాదం బను యోగశాస్త్రంబునందుఁ దారకయోగానుభవవిచారం బను నది ప్రథమాశ్వాసము. ౧౯౮

టీ. ఇది = ఇట్లు చెప్పఁబడినది, శ్రీమత్ = మోక్షసామ్రాజ్య సంపద్విశిష్టులగు, నారాయణ - మహాదేవ - గురు = నారాయణతీర్థులవారును మహాదేవతీర్థులవారు నను స్వగురువర్యులయొక్క, కరుణా - కటాక్ష - వీక్షణ = కనికరముతోఁ గూడిన కడకంటి చూపులచేతను, విమలీకృత = నిర్దోషముగఁ జేయఁబడిన, నిజ = తనయొక్క, హృదయకమల = హృత్పుండరీకముయొక్క, కర్ణికా - అంతః = దుద్దులోపల, సందర్శిత = కనుఁగొనఁబడిన, అఖండ = వేఱుకానట్టి, సత్ - చిత్ - ఆనంద = సత్యస్వరూపము - బోధస్వరూపము - నిరతిశయసుఖస్వరూపము నగు పరబ్రహ్మముయొక్క, రస = ఆస్వాదముయొక్క, ఏక = ముఖ్యమైన, స్ఫూర్తి = స్ఫురణ గల, షట్ - చక్ర = మూలాధారము మొదలగునాఱు

చక్రములయందును, సీతా - రామమూర్తి = జానకీదేవితోఁ గూడిన శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహము గల, పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి = పరశురామపంతులవారను నింటిపేరు గల లింగమూర్తి గురుమూర్తి యను జ్ఞానిచేత, ప్రణీతంబైన = విరచింపఁబడిన, సీతారామాంజనేయ సంవాదంబు అను = ఉపనిషద్విద్యాస్వరూపిణి యగు సీతాదేవికిని ఉపనిషత్ప్రతిపాద్యుఁ డగు శ్రీరామచంద్రునకును బ్రహ్మవిద్యాధికారి యగు హనుమానునకును జరిగిన సంభాషణ మను పేరు గల, యోగశాస్త్రంబునందు = తారకసాంఖ్యామనస్కయోగములను బ్రతిపాదించు గ్రంథమునందు, తారకయోగ = రామతారక మంత్రయోగము యొక్కయు, అనుభవ = స్వానుభవముయొక్కయు, విచారంబు = చర్చ, అనునది - అనఁబడిన, ప్రథమాశ్వాసము = మొదటియాశ్వాసము - సమాప్తి నొందె నని యధ్యాహార్యము.

తా. సులభము.

మ. ఇది చింతామణిమంత్రచింతనసముద్దేద్ధాంధ్రగీర్వాణ వా
గ్వదితానూనకవిత్వయజ్వసుకులాంకవిఖ్యాతనారాయణా
ప్తదచింతామణిశాస్త్రిసంకలితభాష్యప్రోల్లసద్రామస
ద్ధృదయాశ్వాసము సాంతమయ్యె సరిగాఁ గనీరీతి నాద్యంబుగన్.

శ్రీ మచ్చింతామణిభాష్యసహిత శ్రీసీతారామాంజనేయ
సంవాదమునందుఁ బ్రథమాశ్వాసము

సమాప్తము.

ఓం తత్సత్.





శ్రీ ర స్తు
శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# సీ తా రా మాం జ నే య సం వా ద ము

## ద్వి తీ యా శ్వా స ము.

---




దత్తాత్రేయగురు
ప్రాదుర్భూతాపరోక్షపరమజ్ఞాన
శ్రీదయిత ! మహాదేవ ! మ
హాదేవాచార్య ! వినమితామరవర్యా ! ౧

టీ. శ్రీ...దయిత !—శ్రీ=పరవాసుదేవ జ్ఞానలక్ష్మీసమేతుఁ డయిన, దత్తాత్రేయ - గురు = దత్తాత్రేయస్వామివలన, ప్రాదుర్భూత = ఆవిర్భవించిన (ఉపదేశింపఁబడిన), అపరోక్ష = పరోక్షముకాని (భగవత్సాక్షాత్కారరూప మైన), పరమ = ఉత్కృష్టమైన, జ్ఞానశ్రీ = పరిజ్ఞానసంపత్తికి, దయిత = పెనిమిటివైనవాఁడా, మహాదేవ = పరమభాగవతాగ్రగణ్యుఁడైన యా శంకరుఁడే నీవైనవాఁడా, వినమిత - అమర - వర్యా = వినమ్రులైన ఇంద్రాదిదేవతలు కలవాఁడా, మహాదేవ - ఆచార్యా = మహాదేవుఁ డనుపేరు గల యో దేశికేంద్రా ! అని కృతిపతి యగు నిజగురువరునికి సంబోధనము.

తా. నిజగురుమూర్తి యగుదత్తాత్రేయమహర్షి యొక్క ప్రసాదమువలన లభించిన పరమపురుషసాక్షాత్కార జ్ఞానరూప మయిన సంపదకు నధి

పతియును, పరమభాగవతోత్తముఁ డగు నా సదాశివుఁడే నీవైనవాఁడవును, నిరంతరము మ్రొక్కులిడుచున్న దైవతశ్రేష్ఠులు గలవాఁడవు నగు నో మహాదేవగురువర్యా! అని తన గురువును "గురు స్సాక్షా న్మహావిష్ణుః" అనుట చేత సాక్షాచ్ఛ్రీహరిరూపునిగ భావించి తనచేఁ జెప్పంబడఁబోవు రెండవ యాశ్వాసమునకు నారంభమున నిట్లు సంబోధనచేసెను. ౧

వ. అవధరింపుము శ్రీమహాదేవుం డమ్మహాదేవికి ట్లనియె. ౨

టీ. అవధరింపుము = నాచే విన్నవింపఁబడు నుత్తరసందర్భమును జిత్తగింపుము, శ్రీ - మహాదేవుండు = అణిమాద్యష్టైశ్వర్యసంపత్తి గల పరమశివుఁడు, ఆ + మహాదేవికిన్ = తనదేవేరి యగు నాగౌరికి, ఇట్లు అనియెన్ = వక్ష్యమాణప్రకారమున వచియించెను.

తా. ఓ దేశికేంద్రా! నా చేయు విన్నపమును జిత్తగింపుము; భగవంతుఁడగు శంకరుండు తనప్రియురా లగు నాగౌరీదేవికి ముంముఁ జెప్పం బోవుచందమున నుడివెను. ౨

క. శ్రీరాముఁ డపుడు శ్రీసీ
తారామముఖంబుఁ జూచి తల యూఁచి మహా
కారుణ్యకటాక్షముచే
మారుతవరసుతునిఁ గాంచి మందస్మితుఁ డై. 3

టీ. శ్రీరాముఁడు = శ్రీరామచంద్రుఁడు, అపుడు = ఆత్తతిని, శ్రీ...ముఖంబున్—శ్రీ = ఆదిలక్ష్మి యైన, సీతారామ = సీత యను తన స్త్రీయొక్క - "సుందరీ రమణీ రామా" అని అమరము, ముఖంబున్ = మోమును, చూచి=కనుఁగొని, తల యూఁచి=ఆంజనేయునకు నామె చేసిన యుక్తియుక్త మగు సదుపదేశమువలనఁ గలిగిన సంతోషముచే శిరమును గదలించి, మహా...చేన్ - మహా కారుణ్య = గొప్పది యగు కనికరము

గల, కటాక్షముచేన్ = అపాంగవీక్షణముచేత, "కటం గండం అక్షతి వ్యాప్నోతీతి కటాక్షః" అను వ్యుత్పత్తిచేత చెక్కిళులను వ్యాపించునది గాన కడకంటిమాడ్కి కటాక్ష మనఁబడును; మారుత - వర - సుతునిన్ = వాయుదేవునియొక్క - యోగ్యుఁడైన - కుమారుఁ డగు హనుమానుని, "స ఏవ ధన్య స్స్వకులప్రదీపకో యో విష్ణుభక్తిప్రవణ స్తనూజః" ఏ పుత్త్రుఁడు శ్రీహరిభక్తియుక్తుఁడో ఆ కొడుకే తన కులమునకు ప్రకాశకుఁడును ధన్యుఁడు నగు ననుటచేత వర - సుతుఁడు అని చెప్పఁబడియెను, కాంచి = వీక్షించి, మందస్మితుఁడు - ఐ = చిన్న నగవు గలవాఁ డగుచు, ఇ ట్లనియె - అని ముందుపదముతో నన్వయము.

తా. శ్రీ భక్తవత్సలుం డగు శ్రీరామచంద్రుఁడు చేతులు జోడించుకొని, హనుమంతుఁడు భక్తియుక్తుఁడై నిలుచున్నయపుడు సీతాదేవిముఖపద్మమును జూచి యామె చేసిన సదుపదేశమునకు సంతసించి శిరస్సు నూఁచి దయారసముతోఁ గూడిన యపాంగవీక్షణముచే నయ్యాంజనేయుని విలోకించి చెప్పఁబోవురీతి ని ట్లనియె నని యన్వయము. ౩

తే. తెలిసెనయ్య సీతాదేవి తెలియఁ జెప్పఁ
గలితతారకయోగప్రకార మెల్ల
నింక నీపయిఁ గరుణచే నెఱుకపఱతు
సాంఖ్యయోగంబు విను మాప్రసంగ మనఘ. ౪

టీ. అనఘ ! = పాపరహితుఁడవగు నో యాంజనేయ, కలిత-తారక-యోగ-ప్రకారము ఎల్లన్ = ఒప్పుచుండెడు తారకమంత్రరాజము సంబంధమైన యోగముయొక్క క్రమ మంతయును, సీతాదేవి = ఈ జానకీదేవి, తెలియన్ - చెప్పన్ = బోధపడునట్లు స్పష్టముగ నుపదేశింపఁగా, తెలిసెన్ - అయ్య = నీకు బాగుగ బోధపడినదికదా, ఇంకన్ = ఇటమీఁదను, నీపయిన్ = నీమీఁదను, కరుణచేన్ = మిక్కుటం బగు నక్కటిముచేతను, సాంఖ్యయోగంబున్ = పరవాసుదేవుని ప్రతిపాదించెడు జ్ఞాన

యోగమును, ఎఱుకపఱతున్ = బోధించెదను, ఆ ప్రసంగము = ఆ సాంఖ్యయోగముయొక్క ప్రసక్తిని, వినుము = ఆలకింపుము.

తా. ఓ ఆంజనేయా ! సీతాదేవి నీ కుపదేశించినతారకమంత్రరాజ సంబంధమగు మంత్రజపము మంత్రార్థానుసంధానము మంత్రప్రతిపాద్య పరబ్రహ్మధ్యానము మొదలగు యోగముయొక్క ప్రకార మంతయును నీకు బోధపడినదిగదా? ఇఁక - పరవాసుదేవబ్రహ్మస్వరూపము యోగి తదైక్యము నొందుట మొదలగు సంగతులను దెలిపెడు సాంఖ్యయోగమును సాంగముగ నీకు నే నుపదేశించెదను. ౪

వ. సాంఖ్యామనస్కంబు లుపనిషదర్థప్రతిపాదకంబులయందుఁ
దొలుత సాంఖ్యంబు దేటపడ వివరించెద నిశ్చలచిత్తుండ
వై విను మని యిట్లనియె. ౫

టీ. సాంఖ్య - అమనస్కంబులు = పరవాసుదేవస్వరూపమును బ్రతిపాదించెడు సాంఖ్యయోగమును, బాహ్యములగు శబ్దాదివిషయములను మఱచి పరవాసుదేవస్వరూపమునందే మనస్సును జేర్చియుంచుట అమనస్కము - ఈ రెండును, ఉపనిషత్ - అర్థప్రతిపాదకంబులు = నిఖిలోప నిషత్తులయొక్క తాత్పర్యవేద్య మగు పరమపురుషతత్త్వమును ప్రతిపాదించునవి, అందున్ = ఆ సాంఖ్యామనస్కములు రెంటిలో, సాంఖ్యంబున్ = సాంఖ్యయోగమును, తొలుతన్ = ముందుగ, తేటపడన్ వివరించెదన్ = స్పష్టముగ బోధించెదను, నిశ్చల - చిత్తుండవు - ఐ = చలనములేని మనస్సు గలవాఁడవగుచు, వినుము = ఆలింపుము, అని - ఇట్లు - అనియెన్ = అని యీరీతిని పలికెను.

తా. వేదాంతవేద్యుఁ డగు పరమపురుషుని తత్త్వమును ప్రతిపాదించెడు సాంఖ్యయోగము అమనస్కయోగము అను నీ రెంటిలో ముందుగ

సాంఖ్యయోగమును సుబోధముగ నుపదేశించెదను; సావధానమానసుండ వై యాకర్ణింపు మని, చెప్పంబోవురీతి ని ట్లనియెను.

అవ. ఇట్లు తొలుత సాంఖ్యయోగమును బ్రతిపాదింపఁ బ్రతిజ్ఞఁ జేసి సాంఖ్యయోగాఖ్యానముచేఁ బొందఁదగిన శ్రీ పరవాసుదేవబ్రహ్మముయొక్క స్వరూపమును ముందుగ "ఏకమై పరమై" అను మొదలుగ నిరూపింపఁబడుచున్నది.

సీ. ఏక మై పర మై విశోక మై సత్య మ
లోక మై వ్యాపకాలోక మగుచు
జ్ఞాన మై జగదధిష్ఠాన మై ముక్తిని
దాన మై మాయావిహీన మగుచు
నంద మై కేవలానంద మై సంతతా
స్పంద మై శ్రుతిపద్మకంద మగుచు
సార మై చిదచిదాకార మై యతినిర్వి
కార మై విగతసంసార మగుచు

తే. జెలుగు మెలసులకలఁకలు గలుగుకొనుచు
మెలఁగుప్రకృతినిఁ దగులక మిగిలి వెలుఁగు
వెలుఁగు వెలుఁగంగఁ జేయుచుఁ గలయ వెలుఁగు
పరమపరిపూర్ణనిర్గుణబ్రహ్మ మనఘ. ౬

టీ. అనఘ = పాపరహితుఁడ వగు హనుమానుఁడా! పరమ - పరిపూర్ణ - నిర్గుణబ్రహ్మము= "అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా॥ తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్ - తదనుప్రవిశ్య - సచ్చత్యచ్చాఽభవత్॥ సత్యం చానృతంచ సత్య మభవత్" అను మొదలగు శ్రుతులు తదుపబృంహణములైన "జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలమ్" అను మొద

లగు స్మృతులును జెప్పునట్లు సర్వప్రపంచప్రకారత్వమున నంతటను నిండి యున్నట్టియు, హేయగుణవర్జితుఁడు నగు పరమపురుషుఁడు, (పరవాసుదేవబ్రహ్మము) ఏకము - ఐ = "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అను శ్రుతిచేతఁ బరమపురుషుఁడు కార్యకారణరూపముచేత సమస్తము తానే యై యున్నవాఁడుగాన నొక్కటియే అయి, పరము - ఐ = హేయప్రత్యనీకానేకకల్యాణవిశిష్ట మగుటచే సర్వోత్కృష్ట మైనదియు, విశోకము - ఐ = అఖండానందరూప మగుటచే దుఃఖరహితమైనదియు, సత్యము, త్రికాలాబాధ్య మగుటచే సద్రూపమును, అలోకము - ఐ = "యస్య కించి ద్బహిర్నాస్తి కించి దంతఃకియన్నచ । యస్యలింగం ప్రపంచంవా బ్రహ్మైవాత్మా న సంశయః" అను శ్రుతిచే ప్రపంచసంబంధమైన సుఖదుఃఖాదులు లేనిదియునై యని తాత్పర్యము, వ్యాపక - ఆలోకము - అగుచున్ = సర్వమును వ్యాపించియున్న దివ్యతేజస్సు గలది యయి, జ్ఞానము- ఐ = చిద్రూప మై, జగత్ - అధిష్ఠానము - ఐ = అనేకకోటిబ్రహ్మాండములకు ముఖ్యాధారము నై, ముక్తి - నిదానము - ఐ = తనభక్తుల సంసారబంధవిముక్తికి మూలకారణమైనదియు, మాయా - విహీనము - అగుచున్ = మాయ తనకు లోఁబడి యుండుటచేత మాయాసంబంధము లేనిదియు, అందము - ఐ = దివ్యమంగళవిగ్రహ మగుటచేత మిగుల సుందరమైనదియు, కేవల - ఆనందము - ఐ = "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ అన్యోంతర ఆత్మానందమయః" అను మొదలగు శ్రుతులవలన నిరతిశయానందస్వరూపములు, సంతత-అస్పందము - ఐ = "స్థైర్యేణ హిమవానివ" అనుటచే స్థైర్యగుణముచే నెన్ని యిడుములు వచ్చినను చలింపనిదియు, శ్రుతి - పద్మ-కందము - అగుచున్ - "యస్య నిశ్వసితం వేదాః=శాస్త్రయోనిత్వాత్" అను మొదలగు శ్రుతిస్మృతివాక్యములవలన వేదము లనియెడు తామరలకు దుంప (మూలకారణము) అయినదై, సారము - ఐ = "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అను భగవద్వచనమువలన సర్వోత్తమ

మైనదియు, చిత్ - అచిత్ - ఆకారము - ఐ = సర్వప్రాణికోటికి నంత ర్యామి యగుటచే చిద్రూపమును, సకలప్రపంచాకారమునఁ బరిణమించు టచే నచిద్రూపము నయినదియు, అతినిర్వికారము - ఐ = మాయాసంబంధ ము లగు వికృతు లేమియు లేనిదియు, విగత - సంసారము - అగుచున్ = జీవులవలె సంసారబంధము లేనిదియు నగుచు, జిలుగు-మెలసుల-కలఁకలు= ఆపాతమధురము లగు - విషయసుఖలేశములయొక్క దోషములు, కలుగు కొనచున్ = కలుగఁజేసికొని, మెఱుఁగు - ప్రకృతిని = ప్రవర్తించుచున్న తన మాయను, తగులక = తాఁకక, మిగిలి = ఆమాయను లోఁబఱ్చుకొని, వెలుఁగు-వెలుఁగు=స్వయంప్రకాశమానమైన దివ్యజ్యోతియునై, వెలుఁగొనఁ జేయుచున్=తేజోరూపములగు సూర్యాదిసమస్తపదార్థములనుగూడ ప్రకా శింపఁజేయుచు, కలయన్=అంతటను వెలుఁగున్ = దేదీప్యమాన మగును.

తా. దోషరహితుఁడ వగు నోపవననందనా! అన్నివస్తువులను ప్రకాశింపఁజేయుచున్న సూర్యచంద్రాదుల తేజస్సునకుఁగూడ ప్రకాశకమై తా నొకదానిచేఁ బ్రకాశింపఁబడక యెల్లయెడలఁ దనకుఁ దా వెలుఁగొందుచు నఖిలోత్కృష్టమును నంతట నిండియున్నదియు, హేయగుణవర్జితమును నగు శ్రీపరవాసుదేవబ్రహ్మము, తనకంటె వేఱొండు వస్తువు లేమి నొక్క టియు, పరాత్పర మైనదియు, త్రివిధదుఃఖములు లేనిదియు, కాలత్రయా బాధ్య మగుటచే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతివలన సత్య స్వరూపమును, ప్రళయకాలమున సమస్తలోకములును తనలో వ్యక్తరూప మున నుండక పోవుటచే నిష్ప్రపంచమును, అంతటను వ్యాపించిన దివ్య తేజస్సు గలదియును, దివ్యజ్ఞానస్వరూపమును, "యతోవా ఇమాని భూ తాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసంవిశంతీతి" అను మొదలగు శ్రుతులచే సమస్తప్రపంచోత్పత్తిస్థితిలయములకు మూల కారణమైనదియు, నిజభక్తులయొక్క బంధవిముక్తికి హేతుభూతమైనదియు, మాయ తనకు వశమై యుండుటచే నామాయయొక్క సంబంధము లేని

దియు, దివ్యమంగళవిగ్రహం బగుటచే మిగుల సొగ సయినదియు, తెంపు లేని యానందమే స్వరూపముగఁ గలదియు, మహైశ్వర్యసంపన్న మగుటచే నెప్పుడును చలింపనిదియు, వేదములనియెడు కమలములకు మూలమైనదియు, సమస్తప్రపంచమునకు సారభూత మైనదియు, చేతనాచేతనస్వరూపమును, హేయగుణవర్జిత మగుటచేఁ గామక్రోధాదివికారములు లేనిదియు, కావున నే సంసారసంబంధము లేనిదియు, తనకు లోఁబడిన మూలప్రకృతిని (మాయను) మీఱి ప్రకాశించుచున్నది. ౬

క. నిష్కారణము నిరీహము
నిష్కంపము నిష్క్రియంబు నిష్కల్మషముల్
నిష్కళము నిష్కళంకము
నైష్కర్మ్యప్రాప్యనిర్గుణబ్రహ్మ మగున్. ౭

టీ. నైష్కర్మ్య - ప్రాప్య - నిర్గుణ - బ్రహ్మము = సంసారసుఖములను కోరి చేయు కర్మలను విడుచుటచేత - పొందఁదగిన-హేయగుణవిహీన మగు పరబ్రహ్మము, నిష్కారణము = సకలజగత్కారణ మగు తనకు వేఱొక కారణము లేనిదియు, నిరీహము = పొందఁబడిన సర్వకామములు గలుగుటవలన నేవాంఛలును లేనిదియు, నిష్కంపము="భీషాస్మాద్వాతఃపవతే భీషోదేతిసూర్యః భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ" అను శ్రుతిచే సర్వనియంతయు సర్వప్రకాశకము నగుటచేఁ దనకు వేఱొకదానివలన వణఁకు లేనిదియు, నిష్క్రియంబు = జీవులవలె కర్మపాశబద్ధము కానిదియు, నిష్కల్మషముల్ = దోషరహిత మైనదియును, నిష్కళము = "ఏక మద్వైతం నిష్కళం నిష్క్రియం శాంతం" అను శ్రుతిచేత మాయాసంబంధమగు కపటము లేకపోవుటచే నిష్కళము - "కళాస్యాత్కపటేపి చ" అను నిఘంటువుచే, కళాశబ్ద మిచట కపటవాచకము; నిష్కళంకము = మాయాకళంకము లేనిదియు, అగుర్ = ఔను.

తా. శబ్దాదివిషయములయందు చక్షురాదు లగు నింద్రియముల యొక్క వ్యాపారము కర్మ యనఁబడును. అట్టివ్యాపారమును విడిచి చిత్తమును భగవదేకాయత్తమును జేయుట నైష్కర్మ్యము. ఇట్టి నైష్కర్మ్యమువలనఁ బొందఁదగిన పరబ్రహ్మము - మాయాగుణసంబంధము లేనిది, పరాత్పరం బగుటచేఁ దనకు గారణాంతరము లేనిదియు, ప్రాపంచికభోగవాంఛలు లేనిదియు, నిర్భయమును కర్మములకు లోఁబడనిదియును, గావున నే పాపరహిత మైనదియు, నవ్యాజకరుణారసభరితమును, చిత్తకళంకము లేవియు లేనిదియు నై యున్నది. ౭

క. హానాదానవిహీన
జ్ఞానాజ్ఞానాతిరిక్తసత్యానంద
జ్ఞానప్రధానతజ్జని
దానాధిష్ఠాన మా నిధాన మదీనా. ౮

టీ. అదీనా! = సంసారసంబంధ మైన దీనత్వము లేని ఓ యాంజనేయుఁడా! ఆ నిధానము = ఆశ్రితకోటికి పెన్నిధి యగు నా బ్రహ్మము, హాన...అధిష్ఠానము - హాన - ఆదాన విహీన = హేయోపాదేయములు లేని (సర్వము విష్ణుమయ మగుట చేత నిది విడువఁదగినది, యిది విడువ రానిది యను భేదము లేని), జ్ఞాన = బోధకును, అజ్ఞాన - అతిరిక్త = బ్రహ్మజ్ఞానము లేకపోవుటకు వ్యతిరిక్తమయిన, సత్య - ఆనంద - జ్ఞాన = "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - ఆనందో - బ్రహ్మేతి వ్యజానాత్" అను మొదలగు శ్రుతులచేత సత్యస్వరూపము నానందస్వరూపము నగు పరబ్రహ్మముయొక్క జ్ఞానమునకును, ప్రధాన - తజ్జ - నిదాన = మూలప్రకృతికిని మూలప్రకృతివలనఁ గలిగిన మహదాదికార్యకరణ సంఘాతమునకును, మూలకారణమైన చైతన్యశక్తికిని, అధిష్ఠానము = నియామకమును ప్రకాశకము నగుటచేత మూలాధార మైనది.

తా. ఉదారుఁడ వగు నో హనుమంతుఁడా! పరవాసుదేవబ్రహ్మ మనియెడు పెన్నిధి, హేయోపాదేయములు లేని పరమపురుషపరిజ్ఞానము నకును, అజ్ఞానమునకు భిన్న మైన సద్రూపము నఖండానందస్వరూపము నగు బ్రహ్మజ్ఞానమునకును, మాయామాయాకార్యములకు హేతుభూత మైన చిచ్ఛక్తికిని నధిష్ఠానమై యున్నది. ౮

క. ప్రస్థానత్రయవేద్యుఁడ
వస్థాత్రయసాక్షి సర్వవస్తుస్తోమాం
తస్థుం డస్థిరవిశ్వభ
వస్థిత్యంతాదిమూర్తి వాయుకుమారా! ౯

టీ. వాయుకుమారా = పవననందనా, (మఱియు నాపరమపురుషుఁడు) ప్రస్థాన - త్రయ - వేద్యుఁడు = వేదములు వేదార్థనిశ్చాయకము లైన షడ్దర్శనములు వేదార్థోపబృంహణము లైన శ్రీమద్రామాయణభారత భాగవతాదులు అనునివి ప్రస్థానత్రయ మనఁబడును; ఈ ప్రస్థానత్రయము చేతఁ దెలియఁదగినవాఁడును, అవస్థా - త్రయ - సాక్షి = జీవులయొక్క జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడవస్థలకు సర్వజ్ఞుఁ డగుటచే సాక్షి యైన వాఁడును, సర్వ - వస్తు - స్తోమ - అంతస్థుండు = స్వశరీరము లగు సమస్త పదార్థముల సముదాయముయొక్క లోపల నుండువాఁడును, అస్థిర - విశ్వ-భవ - స్థితి - అంత - ఆదిమూర్తి = అశాశ్వతమైన ప్రపంచముయొక్క సృష్టిస్థితివినాశములకు మూలకారణ మైనస్వరూపము గలవాఁడును, (అగును).

తా. ఆ పరవాసుదేవుఁడు వేదవేదాంగములచేఁ దెలియఁబడువాఁడును, సమస్తచేతనులయొక్క జాగ్రత్స్వప్నసుషుప్తు లనియెడు మూఁడవస్థలకు సాక్షిభూతుఁడును, చిదచిద్వర్గముయొక్క లోపల నున్నవాఁడును, అస్థిరమైన జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు మూలకారణ మైనస్వరూపము గలవాఁడు నయి యున్నాఁడు. ౯

అవ. మఱియు నాభగవంతుఁడు తనకు శరీరభూతము లయిన పుడమి మొదలగు నెనిమిదిమూర్తులయందుఁ బరిశుద్ధచిద్రూపుఁడై ప్రకాశించుచున్నవాఁడని ప్రతిపాదించుచున్నారు.

పంచచామరవృత్తము.

ఇలాజలానలానిలాంబరేందుభానుమండలో
జ్జ్వలాఖిలావిలామలాత్మజాలకాంతరస్థచం
చలాచలావిలాసశూన్యసంతతాపరోక్షచి
త్కళాకలాపలాలితప్రకాశకుం డతం డగున్. ౧౦

టీ. అతండు = ఆ జగదీశ్వరుఁడు, ఇలా...ప్రకాశకుండు - ఇలా= పుడమి, జల = నీరు, అనల = నిప్పు, అనిల = వాయువు, అంబర = ఆకసము, ఇందు = చందురునియొక్కయు, భాను = భాస్కరునియొక్కయు, మండల = బింబములును, అను నీ యేడిటియందును, ఉజ్జ్వల=దేదీప్యమానుఁడును, అఖిల = సమస్తములైన, ఆవిల = పాపులును, అమల = పరిశుద్ధులు నగు, ఆత్మ = జీవులసంబంధము లయిన, జాలక = సోరణగండ్లవలె నుండు నింద్రియములయొక్క, అంతర - స్థ = సర్వాంతర్యామి యగుటచే నియామకుఁడై లోపల నుండువాఁడును, చంచల = జంగమముల యొక్కయు, అచల = స్థావరములయొక్కయు, విలాస = క్రీడలచేత, శూన్య = విహీనమైన (స్థావరజంగమములక్రీడలు లేని), సంతత = సర్వవ్యాపక మగుటచే తెంపులేని, అపరోక్ష = ఉపాసకులకు యోగబలముచే గోచరములైన, చిత్కళా = పూర్వోక్తచైతన్యకళలయొక్క, కలాప = సమూహముచేత, లాలిత = మనోహరమైన, ప్రకాశకుఁడు = తేజస్సు కల వాఁడు (స్వార్థమునందు కప్రత్యయము), అగున్ = ఔను.

తా. ఆ పరమాత్ముఁడు పృథివ్యాపస్తేజోవాయ్వాకాశము లనఁబడు పంచమహాభూతములయందును సూర్యచంద్రమండలములయందును, వెలుఁ

గొందుచున్న వాఁడును, పశుపక్ష్యాదిపాపయోనిసంభవులును, మనుష్యాది పుణ్యాపాపమిశ్రయోని సంభవులును, దేవాదిపుణ్యయోనిసంభవులు నగు సకలజీవకోటులయొక్క శ్రోత్రాదు లగు నింద్రియములకెల్లఁ బ్రేరకుండై లో నున్నవాఁడును, మఱియు స్థావరజంగమాత్మకము లగు ప్రాణివర్గము యొక్క విలసితములు లేని సర్వవ్యాపక మగు మహాయోగులకు గోచర మయిన పరిశుద్ధచైతన్యముయొక్క కళావిశేషములచే మనోహరమగు దీప్తి గలవాఁ డని ఫలితార్థము. ౧౦

క. ఆద్యుం డపరిచ్ఛేద్యుఁ డ
విద్యాధ్వాంతద్యుమణిసువిద్యాసద్యో
వేద్యుఁడు గర్కశతర్కా
భేద్యుం డనవద్యుఁ డగు నభేదాత్ముఁ డజా! ౧౧

టీ. అజా = నాయుపదేశబలమున నికముందు జన్మములేనట్టివాఁడా, (ఆ పరమాత్ముఁడు) ఆద్యుఁడు = సమస్తప్రపంచముయొక్క యుత్పత్తి మొదలగువానికిఁ బరమకారణుండును దనకు వేఱొకకారణము లేనివాఁడును గాన మొదటివాఁడును, అపరిచ్ఛేద్యుఁడు దేశముచేతఁగాని కాలముచేతఁ గాని వస్తువులచేతఁగాని పరిచ్ఛేదము (తెంపు) చేయఁబడనివాఁడును, అవిద్యా - ధ్వాంత - ద్యుమణి - అజ్ఞాన మనియెడుకటికిచీఁకటిని తాః దూలఁద్రోలుటకు సూర్యుఁడును, సువిద్యా - సద్యః - వేద్యుఁడు = శ్రేష్ఠ మగు బ్రహ్మవిద్యచేత వెంటనే తెలియఁబడువాఁడును, కర్కశ - తర్క - అభేద్యుఁడు = నాస్తికులు మొదలగువారియొక్క శుష్కములైన దురుక్తు లచే ఖండింపఁబడరానివాఁడును, అనవద్యుఁడు = వైషమ్యనైర్ఘృణ్యాది దోషములు లేనివాఁడును, అభేద - ఆత్ముఁడు = సకలజీవులందు సమాన వాత్సల్యము గలవాఁ డగుటచే భేదబుద్ధి లేనివాఁడును, అగుక్ = ఔను.

తా. మఱియు నా పరమేశ్వరుఁడు దనకు వేఱొండుకారణము లేక తా సర్వమునకుఁ గారణుఁ డగుటచే "సదేవసౌమ్యేద మగ్ర ఆసీ" త్తను

శ్రుతినిబట్టి యన్నింటికిం దొలివాఁడును, ఒకతావున నుండి వేఱొకతావున లేకపోవుటయు, నొకతటి నుండి యింకొకతటి నుండమియు, నొకవస్తువు నందుండి మఱియొకవస్తువునం దుండకపోవుటయు లేక సర్వవ్యాపకుఁడును, సూర్యుఁడు గాఢాంధకారమును పోఁగొట్టునట్లు తను నుపాసించు భక్తుల యజ్ఞానమును నశింపఁజేయువాఁడును, తన్ను విధ్యుక్తముగ నారాధించు టచే వెంటనే తెలియఁబడువాఁడును, దేవుఁడు లేఁడని వాదించు నాస్తికులకుయుక్తులచే ఖేదింపఁబడనివాఁడును, వైషమ్యము కనికరము లేక పోవుటయు మొదలగు దోషములు లేనివాఁడును, సకలజీవులయెడ సమ బుద్ధియే గాని భేదబుద్ధి లేనివాఁడును నగును. ౧౧

క. భూతానుభూతమిథ్యా
భూతద్వైతమయపంచభూతోత్థజగ
జ్జాతానుస్యూతాజా
ద్వైతాత్ముఁ డతండు వాయుతనయ! మహాత్మా! ౧౨

టీ. మహాత్-ఆత్మా=గ్రహణధారణసమర్థ మగు బుద్ధి గల, వాయు తనయ = కరుసలిపట్టి, అతండు = ఆ పరమాత్ముఁడు, భూత ... ఆత్ముఁడు-భూత = ప్రాణివర్గము చేత, అనుభూత = అనుభవింపఁబడుచున్నట్టియు, మిథ్యాభూత = వినశ్వర మగుటచేతను బరమార్థము కాకపోవుటచేతను గల్లలైనట్టియు, ద్వైతమయ = భేదరూప మయినట్టియు, పంచభూత= పృథివ్యాదిభూతపంచకమువలన, ఉత్థ = జనించిన, జగత్ = చతుర్దశ భువనములయొక్క, జాత = సమూహమునందు, అనుస్యూత = అంతర్యామి రూపముచే వ్యాపించియున్నవాఁడును, అజ = పుట్టువు లేనివాఁడును, అద్వైత - ఆత్ముఁడు = స్వజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమైన స్వరూ పము గలవాఁడును (అగుక్ = అయినవాఁడు).

తా. సకలజీవులకు నుపాధు లగుటచేత భోగ్యములైనట్టియు, నట్టి యుపాధులకుం గల జనన మరణాది వికృతులనుబట్టి యనృతప్రాయము

లయినట్టియుఁ, బరస్పరభిన్నను లయినట్టియు, నాకాశాది పంచమహాభూతములవలనఁ బొడమిన సమస్తప్రపంచమునందును నంతర్యామిరూపమున వ్యాపించియున్నవాఁడును, జన్మాదులు లేనివాఁడును, తనజాతినిబట్టిగాని వెరజాతినిబట్టిగాని తనయం దున్నట్టిగాని భేదములేని స్వరూపము గల వాఁడును నాపరమేశ్వరుం డగు నని యభిప్రాయము. ౧౨

క. భావాభావమయావి
ర్భావతిరోభావరహితశ్రీభావుం డన్యా
భావస్వభావుఁ డతులవి
భావసుపావకసుధాంశుశ్రీప్రదుఁ డరయన్. ౧౩

**టీ.** భావ...భావుండు - భావ = ఉనికియు, అభావ = లేకపోవుట యును, మయ = స్వరూపము గల, ఆవిర్భావ = ఆవిర్భవించుటయు, తిరోభావ = అంతరించుటయు నను కార్యసంబంధము లయిన ధర్మములు, రహిత = లేనట్టి, భావుండు = పరవస్తువయినవాఁడును, అన్య - అభావ-స్వభావుఁడు = ఇతరులకు లేనిస్వభావము గలవాఁడును; అతుల-విభావసు - పావక - సుధాంశు-శ్రీ-ప్రదుఁడు = సాటిలేని సూర్యునకు నగ్నికిఁ జంద్రునకును వెలుఁగుల నిచ్చువాఁడును, అరయన్ = ఆలోచింపఁగా, అగున్ = ఆ పరమాత్ముఁ డగును.

**తా.** ఒకప్పు డునికియు వేఱొకప్పుడు లేకపోవుటయు ననెడు నావిర్భావతిరోభావములు లేని మహాపదార్థ మయినట్టియు, తనకంటెఁ బయివారికి సంభవింపని సత్యసంకల్పము గలవాఁడును, సూర్యచంద్రాగ్నులకు నిరుపమానకాంతి నిచ్చినవాఁడును నా పరమాత్ముం డగును. ౧౩

క. ఆప్తసుషుప్త్యవిలుప్తా
లిప్తవ్యాప్తప్రదీప్తశ్రీలింగరహితసం

ప్రాప్తాప్రాప్తవిహీన
జ్ఞప్తియె సర్వప్రపంచసాక్షి మహాత్మా ! ౧౮

టీ. మహత్ - ఆత్మా = గ్రహణధారణశక్తి గలుగుటచే గొప్పది యగు బుద్ధి గల యాంజనేయా, ఆప్త...ఎ - ఆప్త = పొందఁబడిన, సుషుప్తి= సుషుప్త్యవస్థయందుఁగూడ, అవిలుప్త=లోపింపనిదియుఁ, అలిప్త= నిర్లిప్తమైనదియు, వ్యాప్త = సర్వవ్యాపకమైనదియు, ప్రదీప్త=స్వప్రకాశమగుటచే దేదీప్యమానమయినదియు, లింగ - రహిత = జీవులయట్లు అజ్ఞానావచ్ఛిన్నలింగశరీరము లేనిదియు (కారణదేహోపాధికం బగుటచే సూక్ష్మశరీరవిహీన మయినదియు), సంప్రాప్త - అప్రాప్త - విహీన = (పొందఁబడినకోరిక లెల్లఁ గలుగుటచే అవాప్తసర్వకామం బగుటచేత) పొందఁబడినవియు పొందఁబడనివియు నగు వస్తువులు లేనిదియు నగు, జ్ఞప్తి+ఎ=శుద్ధచైతన్యమే, సర్వ-ప్రపంచ-సాక్షి = నిఖిల జగద్వ్యాపారమునకు సాక్షి యైనది.

తా. మిక్కుటమగు తెలివి గల యో హనుమానుఁడా ! సాధారణముగ జీవులకు జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును దెలివిగలుగుటయు సుషుప్త్యవస్థలో నేమియుఁ దెలివి లేనట్లును దోపట్టుటయుఁ గలదు; కాని, సుషుప్త్యవస్థయందు సాక్షి చైతన్యము లేకపోవుటలేదు; "నేను సుఖముగ నిద్రించితిని. అప్పుడు నేనేమియు నెఱుఁగను" అని గాఢనిద్రనుండి లేచినవాఁ డనుకొనును. కావున, సుషుప్తికాలీనమగు "నే నేమియు నెఱుఁగను" (అనునజ్ఞానమునకును, సుఖమునకును సాక్షి యగు చైతన్యము అప్పుడున్నది లేనిచో నప్పటియజ్ఞానసుఖములు స్మరణకురావు. అనుభూతముగాని దాని స్మృతి యెన్నఁడును గలుగదు; కనుక సుషుప్తియందు అనుభవింపఁబడిన యజ్ఞానము సుఖమును మెలఁకువ వచ్చినపిదప స్మృతికివచ్చినవి. కనుక, సుషుప్త్యవస్థయందు సాక్షిచైతన్యమునకు లోపము లేదు. ఇట్లు సమస్తాంశ

ములకు సాక్షి యగు నీశ్వరచైతన్యము సంసారదోషసంపర్కము లేని దియు, దేశకాలవస్తుకృతపరిచ్ఛేదము లేక సర్వవ్యాపక మైనదియు, "కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" అనుటచేఁ గారణశరీర ముపాధిగఁ గలుగుటంజేసి లింగశరీరసంబంధము లేనిదియు, తనకుఁ దా వెలుఁగొందుచున్నదియు, తనకుఁ బడయఁదగినదిగాని పడయరానిది గాని లేనిదియు నగును. ౧౪

అవ. ఇట్లు ప్రతిపాదింపఁబడిన సర్వసాక్షియే పరమేశ్వరుఁ డని చెప్పుచున్నాఁడు.

క. వ్యక్తం బవ్యక్తాది
 వ్యక్తావ్యక్తాతిరిక్త మగుబ్రహ్మము దాఁ
 బ్రాక్తనుకృతభాక్తనుయుత
 భోక్తను సతతంబు సాక్షిపోలికఁ జూచున్. ౧౫

టీ. అవ్యక్త...అతిరిక్తము—అవ్యక్త = మూలప్రకృతి, ఆది = మొదలుగఁగల, వ్యక్త = పంచీకృతములై స్థూలము లగుపృథివ్యాదుల కంటెను, అవ్యక్త = అపంచీకృతములై సూక్ష్మము లైన తన్మాత్రలు మొదలగువానికంటెను, అతిరిక్తము - అగు = పరం బైన, బ్రహ్మము = పరబ్రహ్మము, ప్రాక్...భోక్తను - ప్రాక్ + తను = మునుపటి పుట్టు కలయందలి శరీరములచేత, కృత = చేయఁబడిన సుకృత దుష్కృత ములను, భాక్ = పొందిన, తను=ఇప్పటి మేనుతో, యుత = కూడుకొని యున్న, భోక్తను = తాను జేసికొనిన పుణ్యపాపకర్మఫలము ననుభ వించుచున్న చిదాభాసుని (జీవుని), సతతంబున్ = ఎల్లప్పుడును, సాక్షి పోలికన్ = సాక్షివడువున, చూచున్ = పరికించుచుండును. వ్యక్తంబు = ఇది నిశ్చయము.

తా. మీఁదఁ జెప్పినయట్లు సర్వసాక్షి యగుజగదీశ్వరుఁడు చక్షురా దీంద్రియగోచరము లగు పదార్థములకంటెను, అతీంద్రియము లగు సూక్ష్మ

పదార్థములకంటెను (అనఁగా తనమాయచేఁ గల్పింపఁబడిన స్థూలసూక్ష్మరూపములగు వస్తువు లన్నిటికంటె) విలక్షణుఁ డై భోగ్యములగు సమస్తపదార్థములను తాను పూర్వజన్మమునందుఁ జేసియున్న కర్మల కనురూపముగ సంప్రాప్తమైన శరీరము నొంది యనుభవించుచున్న జీవుని నిరంతరమును లోకమునందుఁ దటస్థుఁ డొకఁడు ఇతరులవ్యవహారమునకు సాక్షి యగునట్లు విలోకించుచుండును.

తే. జాగ్రదాదివినిగ్రహానుగ్రహప్ర
తిగ్రహాసమగ్రజాగరూకాగ్రహోగ్ర
విగ్రహాత్యగ్రసాభాసవిశ్వహేతు
ధీప్రకాశకుఁ డతఁడె సందేహ మేల? ౧౬

టీ. జాగ్రత్...ప్రకాశకుఁడు—జాగ్రత్ - ఆది = మూలకారణుఁడును, వినిగ్రహ = దుష్టులను శిక్షించుటయందును, అనుగ్రహ = శిష్టజనముల ననుగ్రహించుటయందును, ప్రతిగ్రహ= భక్తు లొనరించు పూజాదికమును గైకొనుటయందును, సమగ్ర = పరిపూర్ణముగ, జాగరూక = మెలఁకువ గలవాఁడును, ఆగ్రహ = కోపముచేత, ఉగ్ర = భయంకర మైన, విగ్రహ = దుష్టరాక్షససంహారకాలమునందు నారసింహాద్యవతారరూపమైన యుగ్రస్వరూపము గలవాఁడును, అత్యగ్ర - సాభాస - విశ్వ - హేతు = అంతయు నాభాసమాత్ర మగు ప్రపంచమునకుఁ గారణమైనవాఁడును, ధీ - ప్రకాశకుఁడు = బుద్ధికి వికాసమును జేయువాఁడును, అతఁడు - ఎ = ఆ జగదీశ్వరుఁడే అయియున్నవాఁడు, సందేహము - ఏల = ఇందులకు సందేహము లే దని యర్థము.

తా. జాగ్రత్స్వప్నసుషుప్తు లనియెడు మూఁడవస్థలకు మూలకారణమయిన తురీయావస్థయే స్వరూపముగఁ గలవాఁడును, దుష్టశిక్షణమును శిష్టరక్షణమును ఆశ్రితజనప్రతిగ్రహణమును జేయుటయందుఁ దత్పరుఁడును,

జగత్కంటకు లగు హిరణ్యాక్షహిరణ్యకశిపులు లోనగురక్కసులను సంహరించునపుడు కోపముచే భయంకరమగు నాకారము గలవాఁడును, అత్యంతమును నాభాసమాత్ర మగు ప్రపంచమునకుఁ బ్రధానకారణ మైన వాఁడును ఘటాదిబాహ్యపదార్థములను నాయా యింద్రియములద్వారా ప్రకాశింపఁజేయు బుద్ధికి వికాసమును జేయువాఁడును నా పరమేశ్వరుఁడే యగును. ఇందులకు సందేహము లేదు.

ఆ. ఇదియు నదియు నట్టి \ దిట్టి దింతం తని
పలుకరాని దెద్ది \ బ్రహ్మ మదియె
ఇదియు నదియు నట్టి \ దిట్టి దింతం తని
యరయు తెలివి యదియె \ యవియు నదియె. ౧౭

టీ. ఎద్ది = ఏ పరవస్తువు, ఇదియు = ఈవస్తు వనియు, అదియు = ఆ వస్తు వనియు, ఇట్టిది = ఎదుటఁ గనుపట్టెడు నీవస్తువును బోలినదనియు, అట్టిది = తొల్లి చూచిన యావస్తువును బోలినదనియు, ఇంత = ఈపాటిపరిమితి గల దనియు, అంత = ఆపాటిపరిమాణము గలది యనియు, అని = ఈలాగున, పలుకరానిది = చెప్ప శక్యముకానిదో, అదియె = వాక్కులకు మనస్సునకు గోచరముకాని యా వస్తువే, బ్రహ్మము = పరబ్రహ్మము, అగు నని యధ్యాహారము; ఇట్లగోచర మగు వస్తువు నెట్లు తెలిసికొని యారాధింప వలనుపడును? అంటివేని, ఇదియు = ఈ వస్తువిది యనియు, అదియు = ఆ వస్తు వది యనియు, అట్టిది = అది యా వస్తువును బోలియున్న దనియు, ఇట్టిది = ఇది యీవస్తువును బోలియున్న దనియు, ఇంత = ఈ వస్తు వీపాటిపరిమితి గలది యనియు, అంత = ఆ వస్తు వాపాటిపరిమితి గలది యనియు, అని = ఈరీతిని, అరయు = ప్రపంచమునందుఁ గల సకలవస్తువులను దెలిసికొనియెడు, తెలివి = పరిజ్ఞానము, అదియె = ఆ పరబ్రహ్మమే యగును, అవియు = తనకు శేష

భూతము లయిన ప్రపంచమునందలి యీ పదార్థము లన్నియు, అదియె = ఆ బ్రహ్మమే యగును.

తా. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని శ్రుతివలన నవాఙ్మానసగోచర మగు నా బ్రహ్మము అనవధికాపరిమిత వైభవోజ్జ్వల మగుటచే నీ వస్తువనిగాని యీ వస్తువనిగాని దీనిం బోలి యుండు ననిగాని దానిం బోలియుండుననిగాని ఇంతపరిమితి గలది యని గాని, యంతపరిమితి గలది యనిగాని చెప్పుటకు వీలు లేదు; ఇట్లు "నతత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో నవిద్మో నవిజానీమః। యస్త్వవిజ్ఞాన వాన్ భవత్యమనస్కస్సదా౽శుచిః। నసతత్పద మాప్నోతి" అను మొదలగు శ్రుతులనుబట్టి యజ్ఞానోపహిత మగు నాత్మను బ్రహ్మస్వరూపము గోచరము కాకపోయినను "యస్తు విజ్ఞానవా। న్భవతి యుక్తేన మనసా సదా। తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వాఇవసారథేః యస్తువిజ్ఞానవా న్భవతి సమనస్కస్సదాశుచిః। సతు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో నజాయతే। బ్రహ్మవిదాప్నోతి పరం। బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అను మొదలగు శ్రుతులవలన శమదమాదిసాధనసంపత్తి గలిగి ఇంద్రియనిగ్రహము గలవాఁడై శ్రవణమనన నిదిధ్యాసనతత్పరుం డగు జ్ఞాని భ్రమరకీటన్యాయమున నిరంతరాభ్యాసవశమునఁ బరమాత్మతాదాత్మ్యము నొంది "య స్సర్వజ్ఞ స్సర్వవిత్" అను మొదలగు వాక్యములను బట్టి సర్వజ్ఞత్వాదికము లగు పరమేశ్వరగుణముల యోగమున సర్వము నెఱుంగుచుండును. అట్టి సర్వసాక్షిచైతన్యమే పరబ్రహ్మము. "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అను మొదలగు శ్రుతులచే, "సర్వం విష్ణుమయం జగత్" అను మొదలగుస్మృతులవలనను "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అను భగవద్వచనముఁబట్టియుఁ బరమాత్ముఁడే శరీరశరీరిభావమున జగద్రూపుఁడై యున్నాఁ డనియుఁ దాత్పర్యము.

తే. అట్టిపరిపూర్ణతత్త్వ మైనట్టినేను
పూర్వకల్పాంతమున నీ యపూర్వవిశ్వ
జననమునకంటె మును నిరంజనుఁడ నగుచు
నద్వయుండ నై వెలుంగుదు నాంజనేయ! ౧౮

టీ. ఆంజనేయ = ఓ హనుమంతుఁడా, అట్టి... నేను - అట్టి = ఏకమై అను మొదలుగ మీఁదఁ జెప్పఁబడిన స్వరూపము గల, పరిపూర్ణ = అంతటను వ్యాపించియుండెడు, తత్త్వము = పరతత్త్వము, ఐనట్టి నేను = అయియున్న నేను, పూర్వ - కల్ప - అంతమునన్ = తొల్లిటి సృష్టి యొక్క యవసానమునందు, ఈ...కంటెన్ - ఈ = ఇట్లు పరిదృశ్యమాన మగుచున్న, అపూర్వ = క్రొత్తదియగు, విశ్వ=జగత్తుయొక్క, జననమునకంటెన్ = పుట్టువుకంటెను, మును = పూర్వమునందు, నిరంజనుఁడను = నిర్లిప్తుఁడను, అగుచున్ = అయి, అద్వయుఁడను = రెండవ వస్తువు లేనివాఁడను, ఐ = అగుచు, వెలుంగుదును = ప్రకాశించుచు నుంటిని.

తా. సర్వవ్యాపక మగుటచే నెల్లయెడల నిండియున్న యా పరబ్రహ్మము, గతించిన కల్పముయొక్క యవసానమునందును, ప్రస్తుతము నడచుచున్న కల్పము పుట్టకమునుందును మాయయొక్కయు మాయాకార్య మగు ప్రపంచముయొక్క సంబంధము లేకపోవుటచేత నిర్లిప్త మైనదియుం దనకంటె వేఱొండు వస్తువు లేనిదియు నై తనకుఁ దాఁ బ్రకాశించుచు నుండును. ఆ బ్రహ్మమే నేను జుమీ యో యాంజనేయా! అని ఫలితార్థము. ౧౮

తే. అట్టినాయందు ననాదిగా నాత్మశక్తి
యలరు నవ్యక్త మయి జగదాది యగుచుఁ
గలితమృత్తికయందున్నసకలశక్తి
యేర్పడక కుంభహేతు వై యొనసినట్లు. ౧౯

టీ. కలిత - మృత్తికయందుఁ = మెత్తని మంటియందు, ఉన్న = కల, కలశ - శక్తి = కడవరూపు నొందఁదగిన సామర్థ్యము, ఏర్పడక = వ్యక్తము గాక, కుంభ-హేతువు - ఐ = ఆ కడవకుఁ గారణమై, ఎనసినట్లు = ఆ మట్టియం దంతర్భూతమైనట్లు, అట్టి - నాయందుఁ = పరబ్రహ్మ స్వరూపుఁడనైన నాయందు, ఆత్మ - శక్తి = నాసంబంధ మయినమాయ, అవ్యక్తము = సృష్టికి పూర్వమునందు వ్యక్తముకానిది, అయి = అగుచు, జగత్ - ఆది = ప్రపంచమునకు మూలము, అగుచుఁ = అయినదై, అనాదిగాఁ = మొదలు లేనిదిగా, అలరుఁ = ఒప్పును.

తా. వెనుకఁ జెప్పినట్లు సాక్షాత్పరబ్రహ్మమనే అయిన నాయందుఁ గారణకార్యభావముచేఁ బ్రపంచమునకు మూలమయి, సృష్టికి పూర్వమునందు జగద్రూపమగు నేర్పాటు లేక నా సంబంధమయిన మాయ, స్నిగ్ధ మృత్తికయందు ఘటసృష్టికిఁ గారణమైన ఘటశక్తి యేర్పడక యంతర్భూతమై యున్నవిధమున ననాదిగా నున్నది. ౧౯

అవ. ఇట్లు సామాన్యముగఁ జెప్పఁబడిన మాయాస్వరూపమును విశేషాకారముగఁ బెక్కుదృష్టాంతములతో వివరించుచున్నారు.

సీ. వటబీజమున మహావటమహీరుహశక్తి
యుజ్జ్వలవహ్నియం దుష్ణశక్తి
యింద్రజాలకునియం దెపుడు మాయాశక్తి
కలితోపలమునందుఁ గఠినశక్తి
సలిలజాతమునందు సలలితద్రవశక్తి
పవనంబునం దతిస్పందశక్తి
పొరి శుక్లశోణితంబులయందుఁ దనుశక్తి
తగుశరీరములఁ జైతన్యశక్తి

తే. తనరి యవ్యక్త మగుచుఁ దత్తన్నిధాన
మై యధిష్ఠానమునకంటెఁ ననితరంబు
నగుపగిది నొప్పునాయందు నాత్మశక్తి
యేర్పడక నన్యమై విశ్వహేతు వగుచు. ౨౦

టీ. నాయందున్ = పరమాత్ముండ నగు నాలోపలను, ఆత్మ-శక్తి = నాసంబంధ మయిన మాయాశక్తి, ఏర్పడక = సృష్టికి పూర్వము నందు వ్యక్తము గాక, అనన్యము-ఐ = నాకు శేషభూత మగుటచే నాకంటె వేఱు గాక, విశ్వ-హేతువు-అగుచున్ = ప్రపంచమునకు మూలమయినదయి, వటబీజమునన్ = చిన్నది యగు మఱ్ఱిగింజయందు, మహత్-వటమహీరుహ-శక్తి = పెద్దదియగు మఱ్ఱిచెట్టును బుట్టించెడు సమర్థతయును, ఉజ్జ్వల-వహ్నియందున్ = మండుచున్న యగ్గిలోపలను, ఉష్ణశక్తి = వేఁడిమియును, ఇంద్రజాలికునియందున్ = మాయావియందు, ఎపుడు = నిరంతరమును, మాయాశక్తి = గారిడీ చేయు నేర్పును, కలిత-ఉపలమునందున్ = చిక్కనిఱాతియందు, కఠినశక్తి = కాఠిన్యగుణమును, సలిల-జాతమునందున్ = నీళ్ల సముదాయమునందు, సలలిత-ద్రవశక్తి = మెఱుగఁ జెమర్చుచుండెడు సామర్థ్యమును, పవనంబునందున్ = వాయువునందు, అతిస్పందశక్తి = మిక్కుటముగఁ జలించెడు సత్త్వమయు, పారిన్ = తప్పక, శుక్లశోణితంబులయందున్ = స్త్రీపురుషుల వీర్యములయందు, తనుశక్తి = మేనును బుట్టించెడు బలమును, తగు శరీరములన్ = తగినట్టి మేనులయందు, చైతన్యశక్తి = చైతన్యరూప మగుశక్తియును, తనరి = కలిగి, అవ్యక్తము-అగుచున్ = పైకిఁ గన్పట్టు చున్నదియై, తత్-తత్-నిధానము-ఐ = మఱ్ఱిచెట్టు మొదలగు నాయా భావములవ్యక్తికి మూలమై, అధిష్ఠానమునకంటెన్ = వటబీజము మొదలగు తనకు నాధారమైన దానికంటె, అనితరంబు = వేఱుకానిది, అగుపగిదిన్ = అయినవిధమున, ఒప్పున్ = విలసిల్లును.

తా. మిగులఁ జిన్నది యగు మఱ్ఱివిత్తనమునందుఁ గడుఁబెద్దదియగు మఱ్ఱిచెట్టును బుట్టింపఁదగిన సామర్థ్యమును, మండుచున్న యగ్నియందు దాహకత్వశక్తియు, మాయగానియందు మాయలను జేయు నేర్పును, చట్రాతి యందు గట్టితనమును, నీటియందు ద్రవించెడు శక్తియు, వాయువునందుఁ జలనశక్తియు, పురుషులయు స్త్రీలయు శుక్లశోణితములయందు (రేతస్సునందు రజస్సునందు) దేహరూపముగఁ బరిణమించుశక్తియు, దేహమునందుఁ జైతన్యశక్తియు, నుండి పైకిఁ గన్పట్టక కార్యమునుఁబట్టి దోపట్టుచు నాయా కార్యములకు మూల మయి వటబీజము మొదలగు నాధారమునకు వేఱు గాకయుండునట్లు, సర్వాధిష్ఠానభూతుఁడ నగు నాయందు నాసంబంధ మయినమాయాశక్తి ఇది యిట్టి దని నిర్ధారణచేయుటకు వీలు లేక తనకు నాధారభూతుఁడ నగు నాకంటె వేఱుగాక సమస్తప్రపంచమునకుఁ గారణ మయి విలసిల్లుచున్నది. ౨౦

అవ. మాయాశక్తి కలదనిగాని లేనిదనిగాని నిర్ధారణ చేయుటకు శక్యముగాదను నర్థమునే సోపపత్తికముగ వివరించుచున్నారు.

సీ. సత్తు గా దాత్మవిజ్ఞానంబుచే నెంద
భావ మై బాధింపఁబడుటవలన
నెలమి నసత్తు గా దే నజ్ఞుఁడ నటంచు
నజ్ఞానరూప మై యలరుచునికి
సదసత్తు గాదు విచారింప లే దట్టి
ద్రవ్యంబు గడువిరుద్ధంబు గాన
నిరవయవము గాదు నిఖిలజగత్స్వరూ
పముచేత మిగుల నేర్పడుటవలన

తే. సావయవమును గాదు దృశ్యము సుషుప్తి
యం దడంగినఁ దాను శూన్యంబు గామి
నొనర నుభయాత్మకము గా దయుక్త మగుట
నాంజనేయ మదీయమాయాతమంబు. ౨౧

టీ. ఆంజనేయ = అంజనానందనా, మదీయ-మాయా-తమంబు= నాసంబంధ మగు మాయయనెడు కటికిచీఁకటి, ఎందుక్ = ఎప్పుడును, ఆత్మవిజ్ఞానంబుచేత్ = పరమాత్మపరిజ్ఞానముచేత, అభావము-ఐ = లేనిది యై, బాధింపఁబడుటవలన = నశింపఁజేయఁబడుటవలన, సత్తుకాదు = సద్రూపము (నిత్యమైనది) కాదు, ఎలమిక్ = సంతోషముతో, ఏను= నేను, అజ్ఞుఁడక్ = తెలియనివాఁడను, అటంచుక్ = అని పలుకునపుడు, అజ్ఞాన-రూపము - ఐ = అజ్ఞానస్వరూపమై, అలరుచుక్ - ఉనికిక్ = తోపట్టుచునుండుటచేత, అసత్తు-కాదు=లేనిదియును కాదు; విచారింపక్= ఆలోచించిచూడఁగా, అట్టిద్రవ్యంబు = సద్రూపము నసద్రూపము నగు వస్తువు, కడుక్ = మిక్కిలి, విరుద్ధంబు కానక్ = సంభవింపదు గనుక, సదసత్తు కాదు = సదసదాత్మక మైనదియును గాదు; నిఖిల - జగత్ - స్వరూపముచేత = సమస్తప్రపంచాకారమున, మిగులక్ = మిక్కిలి, ఏర్పడుటవలనక్ = స్పష్టపడుటవలన, నిరవయవము కాదు = అంగములు లేనిదియును గాదు, దృశ్యము = గోచరమగుచుండెడు సమస్తప్రపంచము, సుషుప్తియందుక్ = గాఢనిద్రయందు (సుషుప్తి యను నవస్థయందు), అడంగినక్ = తనలో లీనమైనను, తాను = మాయ, శూన్యంబు-కామిక్ = లేకుండునది కాకపోవుటవలన, సావయవమును కాదు = అవయవములతోఁ గూడుకొనినదియును గాదు; అయుక్తము-అగుటక్ = ఒక వస్తువే నిరవయవము సావయవము నగుట యసందర్భముగాన, ఉభయాత్మకముకాదు = అవయవవిశిష్టము అవయవరహితము నగుస్వరూపము గలదియును కాదు.

తా. ఓ హనుమానుఁడా! 'తమ ఆసీ' త్తని శ్రుతియందు తమశ్శబ్దముచేఁ బ్రతిపాదింపఁబడిన నా సంబంధ మయిన మాయ, పరబ్రహ్మము తెలియఁబడినతోడనే నిర్మూలముగ స్వరూపనాశన మై పోవుటవలనఁ గల దనుటకు (నిత్య మనుటకు) వీలు లేదు; "నేను తెలివిమాలినవాఁడను" అను లోకవ్యవహారమునందు నజ్ఞానరూపమునఁ దోఁపఁబడుచుండుటవలన నసత్తు (లేనిది) అనుటకును వలనుపడదు; సదసదాత్మక మైన పదార్థంబు ఎచ్చోటైన నంభవింపకపోవుటంజేసి సత్తును అసత్తును కావచ్చుననుట సరిపడదు; సమస్తప్రపంచాకారముగ నిట్లు స్పష్టముగఁ గనఁబడుచుండుటవలన నిరవయవ మని పలుకుటకును వీలు లేదు; జగత్తెల్లను సుషుప్త్యవస్థయందు విలీన మైనను మాకాశూన్యముకాకయుండుటచేత సావయవ మనఁదగదు. ఒక వస్తువే సావయవము నిరవయవము నగుట సరిపడదు కాన, ద్వివిధాత్మకమును కాదు.

తే. అరయ నాయున్కికంటె వేరైనయున్కి
లేదు గాన మద్భిన్నంబు కాఁ దవిద్య
ప్రకృతి యజ్ఞాన మని పల్కఁబడుటవలనఁ
గాదు మదభిన్నమును నా యనాదిమాయ. ౨౨

టీ. అరయన్ = ఆలోచింపఁగా, నా-యున్కికంటెన్-నాయొక్క కలిమి (సత్త్వము) కంటె, వేరైన-ఉన్కి = భిన్నముగా నుండుట, (పృథక్సత్త్వము) లేదుగానన్=తనకు లేకపోవుటవలన, అవిద్య = విద్య యన జ్ఞానము తద్వ్యతిరిక్త మైనది యవిద్య అజ్ఞాన మనఁబడు మాయ, మద్భిన్నంబుగాదు = నాకు వేరైనదికాదు. "ప్రకర్షేణ మహదాదికార్యకారణసంఘాతం కరోతీతి ప్రకృతిః = మహత్తత్త్వము మొదలగు కార్యకరణసంఘాతమును జేయునది గాన, ప్రకృతి యనఁబడు" నను వ్యుత్పత్తిచేతఁ బ్రకృతిశబ్దవాచ్య మగు మాయ, అజ్ఞానము = జ్ఞానమునకు విలక్షణ

మయినది, అని పల్కఁబడుటవలనన్ = అని శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁ బడుటచేత, ఆ-అనాది-మాయ = మొదలు లేని యా మాయాశక్తి, మత్-అభిన్నమును = నాకంటె వేఱులేనిదియును, కాదు = జ్ఞానస్వరూపుఁడ నగు నాకంటె నజ్ఞానస్వరూప యగుమాయ వేఱైనదే యని యర్థము.

తా. దేశకాలవస్తుకృతపరిచ్ఛేదము లేక సర్వవ్యాపకుఁడనై యున్న నాయొక్క సత్త్వముకంటె వ్యతిరిక్తముగ నీమాయకు సత్త్వము (ఉనికి) లేకపోవుటంజేసి యది నాకు భిన్నమైనది కాదు. అనాదిగా నాయం దట్లున్న యామాయ, యవిద్య యనియుఁ బ్రకృతియనియు నజ్ఞానమనియు వ్యవహరింపఁబడుచుండుటవలన సద్రూపుఁడను చిద్రూపుఁడను నానంద ఘనుఁడను నగు నాకంటె భిన్నము గానిదియును గాదు. ౨౨

క. భిన్నాభిన్నము గా దని
యెన్నంగా నేల ప్రకృతి యిట్లగు సుసం
పన్ను లనిర్వాచ్యం బని
మున్ను గణించిరి సమస్తముం దెలిసి సుతా! ౨౩

టీ. సుతా = పుత్త్రికా, ప్రకృతి = మాయ, భిన్న-అభిన్నము-కాదు = నాకంటె వేఱైనదియు వేఱుకానిదియు కాదు, అని-ఎన్నన్-కాన్-ఏల? = అనుచు నెంచనేటికి? (ఎంచ నవసరములేదు); ఇట్లు-అగుటన్ = ఈరీతి నయియుండుటవలన, సుసంపన్నులు = బ్రహ్మజ్ఞాన సంపదగలమహాత్ములు, సమస్తమును = సర్వవస్తుస్వరూపమును, తెలిసి = విచారణాపూర్వకముగ నెఱింగి, అనిర్వాచ్యంబు = మాయాస్వరూపము బ్రహ్మమునకంటె భిన్నమైనదనికాని భిన్నము కానిదనికాని చెప్పుటకు శక్యముకానిది, అని = అనుచు, మున్ను = తొల్లి, గణించిరి = ఎన్నిరి.

తా. మాయ పరమాత్మకంటె వేఱైనది వేఱుకానిదియు నని, పైని చెప్పినరీతిని మన మేల యెంచవలయును? ఇదివఱకే సర్వజ్ఞులైనమహర్షులు

పరమాత్మవిచారణ చేయుచు మాయాస్వరూపము పరమాత్మకంటె వేఱయదియని కాని, వేఱుకానిదనికాని నిర్ణయించుటకు శక్యముకాదని చెప్పిరి.

తే. అనుభవజ్ఞానదృష్టిచే ♦ నరయఁ దుచ్ఛ
మొగి ననిర్వచనీయ మా♦యు_క్తిదృష్టి
చేత లౌకికమయదృష్టి♦చే ననంత
మగుఁ దలంప మదీయమా♦యాతమంబు. ౨౮

టీ. మదీయ - మాయాతమంబు = నా సంబంధమైన మాయారూపమగు తమస్సు, అనుభవ-జ్ఞాన-దృష్టిచేఁ = అపరోక్షజ్ఞానరూపమగు చూపుచేత, అరయన్ = చూడఁగా, తుచ్ఛము = హేయమైనది, అగున్ = అగును; యుక్తిదృష్టిచేతన్ = పరోక్షజ్ఞానలక్షణ మగు యుక్తిదృష్టిచేత, ఒగిన్ = బాగుగ, అరయన్ = చర్చింపఁగా, అనిర్వచనీయము - ఔను = ఇది యిట్టిదని చెప్పుటకు శక్యము కానిది యగును; లౌకికమయదృష్టిచేన్ = ప్రపంచవికృతినిబట్టి చూచుటచేత, తలంపన్ = ఆలోచింపఁగా, అనంతము - అగును = తుది లేనిది యగును.

తా. నా సంబంధమయిన మాయారూప మగు తమస్సు, స్వస్వరూపానుభవజ్ఞానలక్షణ మగుచూడ్కిచేఁ జూచిన జననమరణాది బహుళదుఃఖభూయిష్ఠం బగుటచేఁ గడుఁదుచ్ఛమై విడంనాడం దగియున్నది; పెక్కుయుక్తులఁబట్టి చూచినచో నిది యిట్టిదని నిశ్చయించుటకు వీలు లేనిదియు, లోకవ్యవహారమును బట్టి చూచినఁ దుది లేనిదియు నై యున్నది. కాన బ్రహ్మాదుల కైనను నీమాయాస్వరూప మగమ్యము. కావుననే "మమ మాయా దురత్యయా" అని భగవద్వచనము.

సీ. త్రాడు భుజంగ మై ♦ స్థాణువు పురుషుఁ డై
రాజిల్లుశుక్తిక ♦ రజత మగుచు
మరుమరీచికలు ని♦ర్మలసలిలంబు లై
తోడరి మిన్నసిత మై ♦ తోఁచుపగిది

నద్వయామలసచ్చిదానందమయుఁడ నై
తగు నేను మిగుల నెయ్యద్దానివలనఁ
దొలుత నసజ్జడదుఃఖాత్మకము లైన
జగము లై కనిపింతు జనుల కెల్ల
తే. దృఢతరాద్వైతవిజ్ఞానదృష్టిచేతఁ
బండితులు పూర్ణనిర్గుణబ్రహ్మమయుఁడ
నై ననుఁ గాంచినంత నెయ్యది యభావ
మగు నదియనూ మదీయమాయాతమంబు. ౨౫

టీ. త్రాడు = రజ్జువు, భుజంగము - ఐ = పాము యి, స్థాణువు= మొరడు, పురుషుఁడు - ఐ = నరుఁ డగుచు, రాజిల్లు - శుక్తిక=తళతళ మని మెఱయుచున్న ముత్తెపుఁజిప్ప, రజతము - అగుచున్ = వెండి యై, మరు - మరీచికలు = నిర్జలప్రదేశమునందలి యెండమావులు, నిర్మల - సలి లంబులు - ఐ = పరిశుద్ధము లైనజలము లగుచు, మిన్ను = ఆకసము, అసితము - ఐ=నల్లనిది యగుచు, తోఁడరి = భ్రమ గలిగి, తోఁచుపగిదిన్ = తోఁపట్టురీతిని, అ...ఐ...అద్వయ = సజాతీయ విజాతీయ స్వగతభేద రహితుఁడను, అమల = అజ్ఞానరూపమగు కలుషము లేనివాఁడను, సత్ - చిత్ - ఆనందమయుఁడను=సత్యస్వరూపుఁడను - శుద్ధచిత్స్వరూపుఁడను ఆనందఘనుఁడను, ఐ = అగుచు, తగు - నేను = వెలుఁగుచుండెడు నేను, ఎద్దానివలనన్ = ఏ మాయయొక్క సంబంధమువలన, మిగులన్ = అత్యంతము, అసత్ - జడ - దుఃఖ - ఆత్మకములు = మిథ్యాభూతములును అచేతనములును, దుఃఖబహుళములును, ఐన - జగములు - ఐ = అగు ప్రపంచములరూపమున, తొలుతన్ = ఆత్మజ్ఞానము గలుగక ముందు, జను లకు - ఎల్లన్ = ఎల్లవారికిని, కనిపింతున్ = కనంబడుచుందునో, పండి తులు = మహాజ్ఞానులు, దృఢతర - అద్వైత - విజ్ఞాన - దృష్టిచేతన్ =

అసంభావన విపరీతభావన మొదలగునవి లేక మిగుల బలపడిన భేదములేని యపరోక్షజ్ఞానరూప మగు చూపుచేత, పూర్ణ - నిర్గుణ - బ్రహ్మమయుండను = అంతటను వ్యాపించి నిండియున్న హేయగుణవర్జితమైన పరబ్రహ్మ స్వరూపుఁడను, ఐన - ననుక్ = ఐనట్టినన్ను, కాంచిన - అంతక్ = చూచినవెంటనే, ఎయ్యది = ఏమాయ, అభావము = లేనిది, అగుక్ = అగునో, అది - అ - సూ = అదేసుమీ, మదీయ - మాయాతమంబు = నాసంబంధ మగు నజ్ఞానరూపమైన మాయ, అగును.

తా. సంజచీఁకటిలోని రజ్జువు పామువడువునను, చీఁకటిలో నున్న మొరడు మానిసిపగిదిని, మిలమిల మని వెలుఁగుచున్న ముత్తెపుఁజిప్ప వెండి చందమునను, ఎడారులయందలి యెండమావులు మంచినీళ్లవలెను, అంత రిక్షము నల్లగ నున్నట్లును, భ్రాంతిచేఁ గన్పట్టువిధమున, నద్వితీయుఁడను శుద్ధచిద్రూపుఁడను, నిత్య సత్య స్వరూపుఁడను - అఖండానందాత్ముఁడను నై యొప్పుచున్న నేను, ఏ మాయయొక్క యోగముచేత సచ్చిదానంద ములకు విలక్షణము లైన అసజ్జడదుఃఖములే స్వరూపముగఁ గల ప్రపంచము యొక్క యాకారముచే నెల్లవారికి సామాన్యముగఁ గన్పట్టుచునుండునో, మఱియు మహాజ్ఞానులు విక్షేపశక్తిని మీఱి అసంభావన విపరీతభావన లేక మిక్కిలి బలపడి భేదము లేని స్వస్వరూపానుభవజ్ఞాన విలోకనముచేత "పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే" అను శ్రుతివలన నంతటను నిండియున్నట్టియు, గుణత్రయాతీత మయినట్టియుఁ బరబ్రహ్మమ నైన నన్ను పరికించినతోడనే యేమాయ నశించునో నా సంబంధమగు నజ్ఞానరూపమగు మహామాయ యదియే సుమీ.

వ. అది మఱియు సర్వభూత సుషుప్తి సమష్టిరూపంబు, సమస్త ప్రపంచ వాసనా మయంబు, సత్త్వరజస్తమోగు

గాత్మకంబు, స్వాంతర్గుప్తానంతకోటిజీవ సంఘాతంబు, కేవలజడంబు, మోహాత్మకంబు, సకల జగదుపాదానకారణంబు, నవిద్యాఽవ్యక్తతమ స్సుషుప్తి ప్రకృతిప్రళయ ప్రధానమాయాఽజ్ఞానాది శబ్దవాచ్యంబు నై యొప్పుచుండు నని వెండియు. ౩౬

టీ. మఱియుఁన్ = అంతియకాక, అది = నా సంబంధ మయిన యామహామాయ, సర్వ...బు - సర్వ = సమస్తము లయిన, భూత = శరీరులయొక్క, సుషుప్తి = సుషుప్త్యవస్థలయొక్క, సమష్టి = సంఘాతమే, రూపంబు = స్వరూపముగఁ గలదియును, సమస్త = నిఖిలమైన, ప్రపంచ = లోకములయొక్క, వాసనామయంబు = ఆయా జీవుల కర్మవాసనలే స్వరూపముగఁ గలదియు, సత్త్వ - రజస్ - తమస్ = సత్త్వము రజస్సు తమస్సు అనియెడు, గుణ = మూఁడుగుణములు, ఆత్మకంబు = స్వరూపముగఁ గలదియు, స్వ...బు - స్వ = తనయొక్క, అంతః = లోపలను, గుప్త = మహాప్రళయ సుషుప్తి మూర్ఛాదులయందు దాఁపఁబడిన, అనంత = అపరిమితములైన, జీవకోటి = ప్రాణికోటులయొక్క, సంఘాతంబు = సమూహముఁ గలదియును, కేవల - జడంబు = నుతరాము నచేతన మయినదియు, మోహ - ఆత్మకంబు = భ్రాంతియే యాకృతిగఁ గలదియు, సకల - జగత్ - ఉపాదాన - కారణంబు = ఎల్లలోకములకును మూలకారణ మైనదియు, అ...వాచ్యంబున్ - అవిద్యా - అవ్యక్త - తమస్ - సుషుప్తి - ప్రకృతి - ప్రళయ - ప్రధాన - మాయా - అజ్ఞాన - ఆది - శబ్ద - వాచ్యంబున్ - ఐ = విద్య యన జ్ఞానము - దీనికి వ్యతిరిక్త మైనది గాన నవిద్యయనియు, ఇట్టిదని యేర్పఱుపరానిదిగాన నవ్యక్త మనియు - మోహాత్మక మైనది గాన తమస్సనియు - గాఢనిద్రయే స్వరూపముగఁ గలది గాన సుషుప్తి యనియు, మహత్తత్త్వము మొదలగు తత్త్వములు ప్రకర్షముగఁ

శేయునదిగానఁ బ్రకృతియనియు- సమస్తము దీనియందు విలీనమగును గానఁ బ్రళయ మనియు - మహత్తత్త్వము మొదలగువానికి ముఖ్యమైనది గానఁ బ్రధాన మనియు-జ్ఞానదృష్టిచే విచారించిచూచిన మిథ్యాభూతమైనది గాన మాయ యనియు-జ్ఞానమునకు వ్యతిరిక్తమైనది గాన నజ్ఞానమనియును మొద లగు శబ్దములచే వ్యవహరింపఁబడుచున్నదియు నగుచు, ఒప్పుచుక్ - ఉండుక్ = విలసిల్లుచు నున్నది, అని = ఇట్లు పలికి, వెండియుక్ = మఱియును.

తా. ఇంతియ కాక యీ మాయ "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం" అను మొదలగు శ్రుతులనుబట్టి యనేక వృక్షముల సమూహము వన మనియు, నీళ్లయొక్క సమూహము కొల ననియుఁ బలుకఁబడునట్లు పెక్కువిధములుగఁ బొడముచున్న జీవులయందలి యజ్ఞానము లన్నియుఁ గల సిన నది సమష్టిరూపం బగు నీ సమష్టి శుద్ధసత్త్వప్రధాన మగుటచే నిందుఁ బ్రతిఫలించిన బ్రహ్మచైతన్యము సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁడును సర్వనియం తయు సర్వాంతర్యామియు సకలజగత్కారణుఁడు నగు పరమపురుషుఁ డనఁబడును. మహాప్రళయమునందు సకలజీవులయొక్క యా యా కర్మ వాసన లెల్ల నీసమష్టియందు నడఁగియుండును; సత్త్వగుణముయొక్కయుఁ రజోగుణముయొక్కయు, తమోగుణముయొక్కయు సామ్యావస్థయే యీ మాయయొక్క స్వరూపము; మఱియును మహాప్రళయకాలమునందుఁ దన లోపలను దాఁచఁబడిన లెక్కకెక్కుడగు కోట్లసంఖ్య గల జీవుల సమూ హము గలదియై యున్నది. ఇది యత్యంతమును జడము మోహమే స్వరూ పముగఁ గలది. సమస్తప్రపంచమునకును మూలకారణము. అవిద్య యనియు నవ్యక్త మనియు తమస్సనియు సుషుప్తి యనియు ప్రకృతి యనియు ప్రధాన మనియు మాయ యనియు నజ్ఞాన మనియు మొదలగు శబ్దములచేఁ బలుకఁ బడుచున్న దని చెప్పి మఱియు ని ట్లనియె:— ౨౭౮

తే. ఆదిమధ్యాంతశూన్య మైనట్టి ప్రకృతి
యాదిమధ్యాంతములు గల్గినట్లు తోఁచి
యాదిమధ్యాంతరహితాద్వయాత్మునకును
నాదిమధ్యాంతములు గల్గఁ గ నావరించె. ౨౭

టీ. ఆది - మధ్య - అంత - శూన్యము = మొదలును నడిమిదశయు తుదయును లేనిది, ఐన - అట్టి - ప్రకృతి = అగు నామాయ, ఆది - మధ్య - అంతములు = మొదలు నడుము తుదలు, కల్గిన - అట్లు - అ = కలదివలెనే, తోఁచి = కనఁబడి, ఆది...కును—ఆది = మొదలును మధ్య = నడిమిదశయు, అంత=అవసానమును, రహిత=లేని, అద్వయ= అద్వితీయమైన, ఆత్మునకును = పరమాత్మునకు, ఆది - మధ్య - అంతములు = ఉత్పత్తిస్థితిలయములు, కల్గన్ = ఉండునట్లు, ఆవరించెన్ = చుట్టుకొనెను.

తా. "అజా మేకా" మను మొదలగు శ్రుతిచే నుత్పత్తిస్థితిలయములు లేని మహామాయ, ప్రపంచమునకు వ్యక్తావస్థ గలిగినపు డుత్పత్తిస్థితినాశములు గలదియుంబోలెఁ జూపట్టుచు జననమరణాది షడ్భావవికారములు లేక యద్వితీయ మగు పరబ్రహ్మమునకు నావికృతులు సంభవించునట్లుగాఁ గ్రమ్మెను. ౨౭

క. కవియ న్మూలప్రకృతియు
ద్వివిధ యగును మాయ యన నవిద్య యనంగ నా
ద్యవిమలసత్త్వాత్మక యగు
నవిమలసత్త్వప్రధాన యగు నన్య తగన్. ౨౮

టీ. కవియన్ = ఈ వడువున నావరింపఁగా, మూలప్రకృతియున్ = ఆ మహామాయయును, మాయ - అనన్ = మాయ యనియును, అవిద్య - అనన్ - కన్ = అవిద్య యనియును, ద్వివిధ = రెండుతెఱంగులు గలది,

అగును=అయియున్నది; ఆద్య=అందుఁ దొలిదియగుమాయ, విమల-సత్త్వ-ఆత్మక = రజస్తమోగుణముల సంపర్కము లేని సత్త్వగుణము స్వరూపముగఁ గలది, అగుక్ = అయియున్నది; అన్య = తరువాతఁ జెప్పఁబడిన యవిద్య, అవిమల-సత్త్వ-ప్రధాన = రజస్తమోగుణముల సంబంధముచేతఁ గలుషితమయిన సత్త్వగుణము ప్రధానముగఁ గలది, తగక్ అగును = తగనట్లుగ నయియున్నది.

తా. మీఁదఁ జెప్పినయట్లు పరబ్రహ్మము నాక్రమించుకొనియున్న మూలాజ్ఞానము రజోగుణతమోగుణములసంబంధము లేమింజేసి పరిశుద్ధ యగు కేవలసత్త్వగుణము ప్రధానముగఁ గలదియై మాయ యనియు, రజస్తమోగుణముల కలయికచే మలినమైన సత్త్వగుణము ముఖ్యముగఁ గలదియై యవిద్య యనియు రెండు విధములుగ నున్నది. ఈ విభాగమునకుఁ బ్రబల ప్రమాణము లేదని చెప్పి విశిష్టాద్వైతు లంగీకరింపరు. ౨౦

తే. అమలసత్త్వప్రధాన యైనట్టిమాయ
యందు దాని కధిష్ఠాన నై మెననేను
బ్రతిఫలించితి మేఘసంగతజలముల
మించి యాకస మమర బింబించినట్లు. ౨౧

టీ. అమల...యందుక్—అమల = రజస్తమోగుణముల సంబంధము లేకపోవుటచే నిర్మల మగు, సత్త్వ = సత్త్వగుణము, ప్రధాన = ముఖ్యముగాఁ గలది, ఐన అట్టి = అగునట్టి, మాయయందుక్ = తొలుత నుపక్రమింపఁబడిన మాయయందు, దానికిక్ = శుద్ధసత్త్వాత్మక యగు నా మాయను, అధిష్ఠానము = అవలంబనము, ఐన నేను = అగునట్టి నేను, మేఘ సంగత + జలములక్ = మేఘములయందుఁ బొందియున్న యుదకముల యందు, మించి = హెచ్చి, అమరక్ = ఒప్పునట్లు, ఆకాశము = చదలు, బింబించినట్లు = తోఁపట్టినపగిదిని, ప్రతిఫలించితిక్ = ప్రతిబింబించితిని.

తా. మేఘములయందుఁ బొందియున్న నీళ్లయందు నాకసము ప్రతిబింబించినపగిదిని రజస్తమోగుణములసంపర్కము లేని కేవలసత్త్వగుణము ముఖ్యముగఁ గలమాయయందు నామాయకు నాలంబనుఁడ నగు నేను దోపట్టితిని.

క. మాయాప్రతిబింబంబును
మాయాధిష్ఠానపరము మాయయుఁ గూడన్
మాయావి యైన నీశుఁ డ
మాయికుఁ డగునతఁడు బ్రహ్మమయుఁ డై యుంటన్.

టీ. మాయా + ప్రతిబింబంబును = మీఁదఁ జెప్పఁబడినయట్లు శుద్ధసత్త్వప్రధాన యగుమాయయందుఁ బ్రతిఫలించిన బ్రహ్మచైతన్యమును, మాయా+అధిష్ఠాన - పరము = ఆమాయకు నాధారభూత మగు పరబ్రహ్మమును, మాయయున్ - కూడన్ = విమలసత్త్వాత్మిక యగు మూలప్రకృతియును గలయఁగా, (అందు శుద్ధచైతన్యము) మాయావి - ఐనన్ = పూర్వోక్తరీతిని మాయయందుఁ బ్రతిఫలించినదై కాఁగా, ఈశుఁడు అగును= ఈశ్వరుఁ డనఁబడును; అతఁడు = ఆ ఈశ్వరుఁడు, బ్రహ్మమయుఁడు = పరబ్రహ్మస్వరూపుఁడు, ఐ ఉంటన్ = అయియుండుటచేత, అమాయికుఁడు = మాయయొక్క సంపర్కము లేనివాఁడు, అగున్ = ఔను.

తా. మాయయు, మాయకు నాలంబనం బగు బ్రహ్మమును మాయాప్రతిఫలితచైతన్యమును గలయఁగా, నందు మాయయందుఁ బ్రతిబింబించిన బ్రహ్మచైతన్యము ఈశ్వరుఁడు అగును; ఆ యీశ్వరుఁడు కేవలబ్రహ్మస్వరూపుఁడై యుండునపుడు మాయాసంబంధము లేనివాఁ డగును. 30

క. ఆ యీశ్వరుండ నే నా
మాయయ సీతావధూటి మది దలఁప మహా

మాయుఁడ నయ్యు వశీకృత
మాయుఁడ నై యవతరింతు ర్మహి ని ట్లనఘా ! ౩౧

టీ. అనఘా = మాయావికృతులు లేని యో హనుమానుఁడా! అ ఈశ్వరుఁడు - అ = మీఁదఁ జెప్పినయట్లు మాయయే యుపాధిగఁ గల ఈశ్వరుఁడే, నేను = శ్రీరామబ్రహ్మమును, ఆమాయ - అ = శుద్ధ సత్త్వాత్మిక యగు మూలప్రకృతియే, సీతావధూటి = ఈజానకీదేవి, (అగును) మదిన్ = మనస్సునందు, తలంపన్ = ఆలోచింపఁగా, మహామాయుఁడన్ అయ్యున్ = గొప్పదియగు మాయ గలవాఁడనైనను, వశీకృత - మాయుఁడను ఐ = లోఁబఱచుకొనఁబడినమాయ గలవాఁడ నగుచు, మహిన్ = పుడమియందు, ఇట్లు = ఈవడువున, అవతరింతును = శ్రీరామాద్యవతార రూపములతో నావిర్భవించుచుందును.

తా. ముందుఁ జెప్పఁబడిన యీశ్వరుఁడే నేను, సీతాదేవియే మూల ప్రకృతి. ఆకసమునందు మబ్బువలె నాయందే కదేశమున నున్న పెనుమాయ గలవాఁడనై తొలుత నే నుండియు సృష్టికాలమునందు నే నామాయను లోఁబఱచుకొని జగద్రక్షణార్థమై రామాదిరూపముల నిట్లు ప్రపంచమునం దవతరించెదను. ౩౧

వ. ఇట్లు శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుండను, సర్వేశ్వరుండను నైననేను వశీకృతమాయుండ నగుటం జేసి జగంబులు సృజియించి, తద్రక్షణంబుకొఱకుఁ దొల్లి మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామావతారంబులు ధరియించి, దుష్టనిగ్రహ శిష్టానుగ్రహంబులం గావించితి, నిప్పుడు శ్రీరామరూపంబుచే నవతరించి, రావణ కుంభకర్ణాది రాక్షసుల సంహరించి, భూభారంబు నివారించితి; నింక నిటమీఁదట బలరామ కృష్ణ బుద్ధ కల్కి

రూపంబుల నే నవతరింపఁ గలవాఁడ; నా చరిత్రంబులు లోకత్రయపవిత్రంబులు భవలతాలవిత్రంబు లై యొప్పు నని చెప్పి వెండియు.     ౩౭

టీ. ఇట్లు=పైని జెప్పినరీతిని, శుద్ధ...ను—శుద్ధ=స్వచ్ఛమగు, సత్త్వ=సత్త్వగుణమే, ప్రధాన = ముఖ్యముగఁ గల, మాయ = మూలప్రకృతి, ఉపాధికుండను = ఉపాధిగఁ గలవాఁడను, సర్వ - ఈశ్వరుండను=నిఖిలభూతజాతమునకు నియామకుఁడను, ఐన నేను = అగు నేను, వశీకృత - మాయుఁడను = స్వాధీనముగఁ జేసికొనఁబడిన మూలప్రకృతి గలవాఁడను, అగుటన్ - చేసి = అయియుండుటచేతను, జగంబులు = లోకములను, సృజియించి = విరచించి, తత్ - రక్షణంబుకొఱకున్ = సృజించిన భువనములయొక్క సంరక్షణనిమిత్తము, తొల్లి = మున్ను, మత్స్య-కూర్మ-వరాహ - నారసింహ - వామన - పరశురామ-అవతారంబులు = మత్స్యరూపము - కూర్మరూపము - వరాహరూపము - నారసింహరూపము - వామనరూపము-పరశురామరూపము నను నాఅవతారములను, ధరియించి=పూని, దుష్ట-నిగ్రహ - శిష్ట-అనుగ్రహంబులన్ = దురాత్ములను పరిహరించుటయు మహాత్ములను గాపాడుటయును, కావించితిన్ = ఒనరించినాఁడను; ఇప్పుడు = ఈ సమయమునందు, శ్రీరామరూపంబుచేన్ = శ్రీరామాకారముచేతను, అవతరించి = ఆవిర్భవించి, రావణ - కుంభకర్ణ - ఆది - రాక్షసులన్ = రావణుఁడుకుంభకర్ణుఁడు మొదలగు రక్కసులను, సంహరించి = వధించి, భూ-భారంబున్ = పుడమియొక్క బరువును, నివారించితిని = పాపితిని, ఇంకన్-ఇటమీఁదటన్ = ముందు ఈపైని, బలరామ-కృష్ణ - బుద్ధ - కల్కి-రూపంబులన్ = బలదేవునియొక్కయు - శ్రీకృష్ణునియొక్కయు - బుద్ధదేవునియొక్కయు - కల్కియొక్కయు నాకారములతో, ఏను = నేను, అవతరింపఁగలవాఁడను = ఆవిర్భవింపఁగలను;

నా - చరిత్రంబులు = నాకథలు, లోక - త్రయ - పవిత్రంబులు = దేవలోకము భూలోకము నాగలోకము ననుముజ్జగములకుఁ బావనములైనవియు, భవ - లతా - లవిత్రంబులు = సంసార మనియెడు తీఁగెలను దెగఁగోయుటకు కొడవండ్లు, ఐ - ఒప్పు౯ = అగుచుఁ దనరును; అని = ఇట్లు, చెప్పి = పలికి, వెండియును = మఱియును.

తా. ఇవ్విధంబున నేను రజస్తమోగుణములకలయిక లేమిని వినిర్మలమగు సత్త్వగుణము ముఖ్యముగఁగల మూలప్రకృతి యుపాధిగఁ గలవాఁడనై సత్యసంకల్పత్వ సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వనియంతృత్వా ద్యనంతకల్యాణగుణగణవిరాజమానుండనై మహామాయను స్వాధీనపఱచుకొని సకలప్రపంచమును నిర్మించి, అట్లు రచియింపఁబడినలోకముల నెల్లఁ బరిపాలించుటకై తొల్లి మత్స్యరూపము, కూర్మరూపము, వరాహరూపము, నృసింహరూపము, వామనరూపము, పరశురామరూపమును బూని,దుర్మార్గులను బరిమార్చుటయు. సత్పురుషులను బ్రోచుటయు నొనరించితిని; ఈ శ్రీరామరూపమున నవతరించి దశకంఠుఁడు వానితమ్ముఁ డగు కుంభకర్ణుడు లోనుగాఁ గలరక్కసుల నెల్ల రూపుమాపి పుడమికిం గలభారము నెల్లఁ దీసితిని; ఈపైని బలదేవుఁడు, శ్రీకృష్ణుఁడు, బుద్ధదేవుఁడు, కల్కి అను నాలుగురూపములతో నవతరింపఁగలను; నాసంబంధము లగు పుణ్యకథలు ముజ్జగములను బావనముగఁ జేయును; సంసార మను పెనుఁదీవియలం దెగఁగోయుటకుఁ గొడవండులవంటివి.-అని వచియించి శ్రీరామచంద్రుఁడు మారుతికి మరల ని ట్లనియెను.

చ. గురుఁడు హిరణ్యగర్భుఁడని కొందఱుఁ గొంద ఱిల న్మహా [విరా
ట్పురుషుఁ డటంచుఁ గొందఱు బుభుక్ప్రభుఁ డంచు ము [కుందుఁ డంచుఁ గొం

దఱు శివుఁడంచుఁ గొందఱు విఘ్ననాయకుఁ డంచునుఁ గొం
[దఱుం బరా
పరవరు నన్నెఱుంగక యుక్తిహీనులైనరుద్రజ్ఞులై తగన్.

టీ. పరాపరవరుఁ = "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే - అపరా ఋగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వవేద శ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి" అను శ్రుతిచే బ్రహ్మకాండ పరావిద్యయనియు, కర్మకాండ అపరావిద్యయనియుఁ జెప్పఁబడుచున్నది గాన, నీరెండువిద్యలకును, వరుఁడు=అధిపతియగు పరమాత్మనుగా, నన్ను=శ్రీరామబ్రహ్మమును, ఎఱుంగక = తెలిసికొనఁజాలక, అజ్ఞులై = అజ్ఞానావృతులై, కొందఱు = కొందఱుమనుజులు, గురుఁడు = 'గురుర్బ్రహ్మ గురుశ్శంభు గురుర్దేవో జనార్దనః' అనుటచే విద్యాగురుఁడు, అని = అనుకొని, కొందఱు = మఱికొందఱు హైరణ్యగర్భులు, హిరణ్యగర్భుఁడు = "హిరణ్యం స్వర్ణమయాండం గర్భ ఉత్పత్తిస్థాన మస్య" అను వ్యుత్పత్త్యర్థమునుబట్టి బంగారువికారమగు నండము పుట్టువు పట్టుగాఁ గలవాఁడుగానఁ జతుర్ముఖబ్రహ్మ హిరణ్యగర్భుఁడనఁబడును; ఇందులకు "తదండ మభవద్ధైమం సహస్రాంశుసమప్రభం తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః" అని మనువు; మఱియు "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" అను శ్రుతిచే హిరణ్యగర్భుఁడే = ఆదిదేవుఁడే, అని = అనియును, కొందఱు = వైరాజులు, మహావిరాట్పురుషుఁడు = "భూః పాదౌ యస్య నాభి ర్వియత్" అను మొదలగు స్మృతివలనను "సహస్రశీర్షా పురుషస్సహస్రాక్ష స్సహస్రపాత్" అను మొదలగు శ్రుతులవలనను, సమస్తప్రపంచస్వరూపుఁడగు విరాట్పురుషుఁడే పరదైవము, అంచుఁ = అనుకొనుచు, కొందఱు = ఇంద్రదైవతోపాసకులు, ఋభుప్రభుఁడు = "ఇంద్రో మాయాభిః పురురూప ఈయత" అను మొదలగు శ్రుతులనుబట్టి, సురపతియే పరమపురుషుఁడు, అంచుఁ = అని చెప్పుచు, కొందఱు = వైష్ణవులు, ముకుం

డుఁడు="ముకుం ముక్తిం దదాతీతి ముకుందః" అను వ్యుత్పత్త్యర్థముచే మోక్షము నిచ్చు శ్రీహరియే పరదైవతము, అంచుక్ = అని సాధించుచు, కొందఱు = శైవులు, శివుఁడు = మంగళప్రదుఁ డగుట, మహేశ్వరుఁడే= మహాదేవుఁడే, అంచుక్ = అనేక శ్రుతిస్మృతిసంవాదములచే సాధించుచు, కొందఱు = గాణాపత్యులు, వినాయకుఁడు = "గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా" మను మొదలగు శ్రుతులనుబట్టి గణపతియే పరదైవము, అంచును = అని చెప్పుచును, తగక్ = ఒప్పునట్లు, ఉపాస్తి = ఆయా యితరదేవతల యుపాసనను, ఒనర్పుదురు = ఆచరించుచుందురు.

తా. పరాత్పరుండ వగు నన్నుఁ బరమపురుషునిగాఁ దెలిసికొనఁ జాలక కొందఱు మూఢులు, పరబ్రహ్మము ఉపాధ్యాయుఁడే యనియు, మఱికొందఱు హిరణ్యగర్భుఁ డనియు, ఇంక కొందఱు విరాట్పురుషుఁ డనియు, వేఱొకకొందఱు ఇంద్రుఁ డనియును, మఱికొందఱు విష్ణువే యనియు, కొందఱు ఈశ్వరుఁడే యనియు, ఇంకఁ గొందఱు గణపతి యనియు, నమ్మి కొలిచెదరు. కాని, నేనే పరబ్రహ్మ మని తెలిసికొనఁ జాలరు. 33

ఆ. వినుము నేను విశ్వనికమునకు నుపాదాన
కారణము నిమిత్తకారణంబు
నగుచు నూర్ణనాభిక్రగిది నొప్పుదు నింకఁ
గార్యములును నేనక కపివరేణ్య! 3౪

టీ. కపివరేణ్య= వానరోత్తముఁడ వగు నో ఆంజనేయా, వినుము= నేను చెప్పుసంగతిని ఆలింపుము, విశ్వమునకుక్ = ప్రపంచమునకు, ఉపాదాన కారణము = కార్యమును గలిగించుటకుఁ జేకొనఁబడి యాకార్యములోఁ గూడినట్టి కారణ ముపాదానం బనఁబడును. ఘటాదికార్యమునకు మట్టి మొదలగునదియును బుట్టించుటకుఁ గైకొనఁబడును. మట్టి బంగారు

మొదలగునది కార్యములయం దెప్పుడు ననుగతమై యుండును. ఇట్టి మూలకారణమును, నిమిత్తకారణంబుఁ = ఘటాదికమునకు మట్టి మొదలగునది. సమవాయికారణము; ఆ కడవయొక్క కపాలముల రెండిటి సంయోగము అసమవాయికారణము. ఈ సమవాయికారణమునకు నసమవాయికారణమునకును వే ఱగు కుమ్మరివాఁడు మొదలగునది నిమిత్తకారణము; ఇట్టి నిమిత్తకారణమునకును, నేను = సాక్షాత్పరమేశ్వరుఁడ నగు నేను, అగుచుఁ = అయి, ఊర్ణనాభి - పగిదిఁ = "ఊర్ణనాభి ర్యథా స్వాంగా త్తంతూన్ సృజతి తై తథా। నిమిత్తోపాదానహేతు ర్జగతః పరమేశ్వరః" అనుటచే సాలెపురుగు తన యవయవములనుండి నన్నని దారములను సృజించుచు నా దారములకు నిమిత్తకారణము నుపాదానకారణమును దానే యగునట్లు, ఒప్పుదుఁ = ద్వివిధకారణములు నగుచుఁ దనరుచుందును; ఇంకఁ = ఇంతియకాక, కార్యములును = మహత్తత్త్వము మొదలు దేహమునకుఁ గల కార్యకరణసంఘాత మెల్లను, నేను - అ = నేనే అయితిని.

తా. సాలెపురుగు తనలోనుండి వచ్చెడుతంతువులకుఁ దా నుపాదానకారణము నిమిత్తకారణము నైనట్లు నేను సమస్తప్రపంచమునకు నుపాదానకారణము నిమిత్తకారణము నై యున్నాను; మఱియు నీకార్యకరణసంఘాత మెల్ల నేనే అయియున్నాను. ౩౪

వ. ఇట్లు సర్వేశ్వరుండ నైన నాకు నవ్యాకృతంబు మహానందమయకోశంబు నగు సమస్తభూత సమష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు; మహాసుషుప్తి యవస్థ; బ్రహ్మాదిస్తంబపర్యంతంబు లైనసకలభూతంబుల యవయవంబులు; జగదుత్పత్తిలయంబులు వ్యాపారంబులు; వేదశాస్త్రంబులు నిశ్వాసంబులై యొప్పు నని చెప్పి వెండియు నిట్లనియె. ౩౫

టీ. ఇట్లు = పైని జెప్పినయట్లు, సర్వేశ్వరుఁడను = నిఖిల ప్రపంచమునకు నీశుఁడను, ఐన - నాకున్ = అగునాకు, అవ్యాకృతంబు = వ్యక్తము కానట్టియు, మహత్ - ఆనందమయ - కోశంబును = బ్రహ్మ మొదలు తృణముదనుకఁగల సకల జీవరాసులయొక్క సుషుప్తి కాలము నందలి యానందము లెల్లఁ గలసి యుండుటచే గొప్పది యగు నానందమునకుఁ గోశమువంటిది గావున సమష్ట్యానందము మహానందమయకోశ మనంబడును, అగు = ఐన, సమస్త - భూత - సమష్టి - అజ్ఞానంబు = సకల ప్రాణులయొక్క ఏకీభవించిన మూలాజ్ఞానము, కారణ శరీరంబు = వ్యక్త ప్రపంచమున కెల్లం గారణ మైనమేను, (అగును) మఱియు నాకు, మహాసుషుప్తి = నిఖిల జీవులయొక్క దట్టమగు నిదురయే, అవస్థ = సుషుప్త్యవస్థ, (ఇంకను నాకు) బ్రహ్మ - ఆది - స్తంబ - పర్యంతంబులు = నలువ మొదలు తృణముదనుకం గలవి, ఐన = అగు, సకల భూతంబులు = నిఖిల జీవులు, అవయవంబులు = శరీరాంతర్భాగములు, జగత్ - ఉత్పత్తి - స్థితి - లయంబులు = సర్వలోకములయొక్క సృష్టియు పాలనమును నాశనమును, వ్యాపారంబులు = నాయొక్క పనులు, వేద - శాస్త్రంబులు = నాలుగు వేదములును - వేదాంగము లగు షాదిశాస్త్రములును, నిశ్వాసంబులు = నాయొక్క యూపిరులు, ఐ = అగుచు, ఒప్పున్ = వెలయును, అని = ఈ రీతిని, చెప్పి = వచించి, వెండియున్ = మఱియును, ఇట్లు = చెప్పఁబోవురీతిని, అనియెన్ = పలికెను.

తా. మీఁదఁ జెప్పినయట్లు సమస్తమునకు నధిపతి నగునాకు వ్యక్తము గాక సకలజీవులయొక్క సుషుప్తికాలమునందలి యానందము లెల్లఁ గలయుటచేఁ గొప్పది యగు నానందమునకుం గోశమువలె నున్న నిఖిలజీవకోటులయొక్క యేకీభూత మైన మూలాజ్ఞానము కారణశరీరమును; ఎల్ల జీవుల సమష్టిసుషుప్తియే నాకు సుషుప్త్యవస్థయు, నలువ మొదలు చిన్న

పురుగుదనుకం గల సమస్తప్రాణులు నాకుఁ గరచరణాద్యంగములును; ప్రపంచమురొక్క సృష్టియు స్థితియుం ప్రళయమును నాయొక్క పనులును; వేదములు శాస్త్రములు నాకు నిశ్వాసములును అయినవి అని యుపదేశించి, మఱల నిట్లు చెప్పుటకు దొరకొనెను.

తే. మలినసత్త్వప్రధాన యాకోనలయవిద్య
దానియందు నధిష్ఠాన కై మైననేను
బ్రతిఫలించితిఁ గలశసంగతజలముల
సాభ్ర నక్షత్ర ఖ చ్ఛాయకచందముననను.  ౩౬

టీ. అల - అవిద్య = "కవి యన్మూలప్రకృతియు ద్వివిధయగు మాయ యన నవిద్యయనఁగ" అని వెనుక విభజింపఁబడినట్లు మూలప్రకృతి యొక్క రెండవభాగమగు నవిద్య, మలిన - సత్త్వప్రధాన = రజస్తమోగుణసంపర్కముచేఁ గలుషితమైన సత్త్వగుణము స్వరూపముగాఁ గలది, ఔన్ = అగును; అధిష్ఠానము = పూర్వోక్తరీతిని మూలప్రకృతికి నాధారభూతుఁడను, ఐన - నేను = అయియున్న నేను, దానియందున్ = ఆ యవిద్యయందు, కలశ - సంగత - జలములన్ = కుండలలో నున్న యుదకములయందు, స - అభ్ర - నక్షత్ర - ఖ - చ్ఛాయ - చందమునను = మబ్బులతోను జుక్కలతోను గూడుకొనిన యాకసమురొక్క ప్రతిబింబము వడువున, ప్రతిఫలించితిని = ప్రతిబింబించితిని.

తా. కుండలో నున్న నీళ్లయందు మేఘములతోను పెక్కునక్షత్రములతోను గూడియున్న మిన్ను ప్రతిబింబించిన రీతిని తొల్లి చెప్పఁబడిన రజస్తమోగుణమిశ్రమైన యవిద్య యను మూలప్రకృతియొక్క భాగమునందు సర్వాధిష్ఠానభూతుఁడ నగు నేను ప్రతిబింబించితిని.  ౩౬

క. జీవుం డగునాతఁ డవి
ద్యావశుఁ డై స్థూల సూక్ష్మ కతను వాసనలన్

భావించుచు సేవించుచుఁ
గేవలమూఢప్రవృత్తిఁ గ్రీడించు మెయిన్. 32

టీ. జీవుఁడు - అగు-ఆతఁడు = "ప్రాణాన్ క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ జీవ ఉచ్యతే" అనుటచే క్షేత్రశబ్దవాచ్య మగుదేహాదికమునందు నభిమానము గల జీవుఁ డనఁబడెడు నా యవిద్యయందుఁ బ్రతిఫలించిన యాత్మ, అవిద్యావశుఁడు - ఐ = పూర్వోక్తలక్షణము గల యవిద్యకు లోఁబడినవాఁ డగుచు, స్థూల - సూక్ష్మ - తను - వాసనలన్ = పంచీకృతభూతసంభవమై రక్తమాంసమేదోమజ్జాస్థిభూయిష్ఠ మయిన స్థూలశరీరము యొక్కయు, అపంచీకృతభూతసంభవమై కర్మపాశబద్ధ మగు సూక్ష్మశరీరముయొక్కయు సంస్కారములచేత, భావించుచున్ = మితిమీఱిన చిత్తవృత్తులలో నాయా పదార్థములను దలపోయుచు, సేవించుచున్ = ఆయా కర్మఫలముల ననుభవించుచు, కేవల - మూఢ - ప్రవృత్తిన్ = మిక్కిలి మోహాత్మక మగు వ్యాపారముతో, మెయిన్ = అనవరతమును, క్రీడించున్ = సంసారమునందు నడయాడుచుండును.

తా. అట్లవిద్యయందుఁ బ్రతిబింబించిన యీశ్వర చైతన్యమునకు జీవుఁ డని పేరు; ఆ జీవుఁడు - అవిద్యకు లోఁబడి స్థూలశరీరసంబంధము లైన "నేను బ్రాహ్మణుఁడను నేను క్షత్రియుఁడను నేను కృశించితిని నేను బలిసితిని" అను మొదలగు వాసనలచేతను, మఱియు సూక్ష్మశరీరసంబంధము లగు "నేను బుద్ధిమంతుఁడను నేను మూఢుఁడను" అను మొదలగు వాసనలచేతను, ఆయా స్థూలసూక్ష్మపదార్థములను దలపోయుచు నాయా కర్మలయొక్క సుఖదుఃఖరూపము లగుఫలము లనుభవించుచు నిరంతరము నత్యంతము మోహావిష్టమగు వ్యాపారముతో నీసంసారచక్రమునం బడి కడతేఱలేక భ్రమించుచుండును, 32

ఆ. అతఁడు ప్రాజ్ఞుఁ డనఁగ నానందమయుఁ డనఁ
బారమార్థికుఁ డనఁ బరఁగుచుండు
వ్యష్టికారణాంగవశుఁడై సుషుప్తిను
ఖానుభూతి మరగి యనిలతనయ ! ౩౮

టీ. అనిలతనయ = పవననందనా, అతఁడు = అవిద్యా ప్రతిబింబస్వరూపుఁడగు నా జీవాత్ముఁడు, వ్యష్టి - కారణ - అంగ - వశుఁడు = సమష్టిలో నొకటి యగు కారణశరీరమునం దభిమానము గలవాఁడు, ఐ = అగుచు, సుషుప్తి - సుఖ - అనుభూతిన్ = గాఢనిద్రయందలి సౌఖ్యముయొక్క యనుభవమును, మరగి = అలవాటుపడి, ప్రాజ్ఞుఁడు - అనఁగన్ = ప్రకర్షముగ సుషుప్తియందలిసుఖము నెఱుఁగువాఁడు గానఁ బ్రాజ్ఞుఁ డనియు, ఆనందమయుఁడు - అనన్ = సుషుప్తికాలమునందలి సుఖానుభవము ప్రచురముగఁ గలవాఁడు గాన నానందమయుఁ డనియు, పారమార్థికుఁడు - అనన్ = సుషుప్తియందుఁ దనకు దుఃఖబహుళ మగు నీసంసారసంబంధము లేమింజేసి నిజస్వరూపముతో నుండును గాన వాస్తవాత్ముఁడనియు, పరఁగుచున్ - ఉండున్ = తనరారుచునుండును.

తా. ఓ ఆంజనేయా! పైని జెప్పఁబడినయట్లు అవిద్యాప్రతిబింబస్వరూపుఁడగు నాజీవుఁడు "ఇంద్రో మాయాభిః" "పురురూప ఈయత" అను శ్రుతియందు "మాయాభిః" అని బహువచన ముండుటచేత పెక్కు తెఱంగులం బరఁగు కారణశరీరంబనఁబడు నాయవిద్యకు లోఁబడి సుషుప్త్యవస్థయందలియానందముయొక్క యనుభవమును మరగి ప్రాజ్ఞుఁ డనియు, నానందమయుఁ డనియు, పారమార్థికుఁ డనియు నాయాధర్మవిశేషములను బట్టి పలుకంబడుచున్నాఁడు. ౩౮

వ. ఇట్లవిద్యయు, నవిద్యాప్రతిబింబంబుఁ దదధిష్ఠానచైతన్యంబుం గూడి జీవుం డనం బరఁగు నాజీవున కానందమయ

కోశసంజ్ఞికం బైన వ్యష్ట్యజ్ఞానంబు కారణశరీరము సుషు
ప్త్యవస్థ యగునా రెంటియందు నభిమానంబు గలయతంఁడు
ప్రాజ్ఞుం డన నొప్పు నతని కింతమాత్రంబుచేత జీవత్వంబు
పర్యాప్తంబు గామింజేసి తదీయాదృష్టసహాయపూర్వక
సూక్ష్మశరీరసృష్టిప్రకారంబుఁ జెప్పెద విను మని యి
ట్లనియె. ౩౯

టీ. ఇట్లు = మీఁద వివరింపఁబడిన రీతిని, అవిద్యయుక్ = మూల ప్రకృతియొక్క యంతర్భాగ మగునవిద్యయును, అవిద్యాప్రతిబింబంబును= అవిద్యయందుఁ బ్రతిఫలించిన పరమాత్మచైతన్యంబును, తత్ - అధిష్ఠాన - చైతన్యంబును=ఆ యవిద్యాప్రతిబింబచైతన్యమునకు నాధారమగు బ్రహ్మ చైతన్యంబును, కూడి=కలసి, జీవుండు - అనన్ - పరఁగున్ = జీవాత్మ యనుపేరుతో నొప్పును; ఆ జీవునకున్ = ఆ జీవాత్మునకు, ఆనందమయ కోశసంజ్ఞికంబు - ఐన = ఆనందమయకోశ మనుపేరు గలదియగు, వ్యష్టి అజ్ఞానంబు = భిన్నమగు జ్ఞానము, కారణశరీరంబు = కారణదేహమును, సుషుప్త్యవస్థ = గాఢనిద్రారూపమగు నవస్థయు, అగున్ = అగును; ఆ రెంటియందుక్ = అట్టి కారణశరీరమునందును సుషుప్త్యవస్థయందును, అభిమానంబు గలయతండు = అదియే నేను అను తాదాత్మ్యబుద్ధి గల యా జీవుఁడు, ప్రాజ్ఞుఁడు - అనక్ - ఒప్పుక్ = ప్రాజ్ఞుఁ డనుపేరు గలవాఁ డగును; అతనికిక్ = ఆ ప్రాజ్ఞునకు, ఇంతమాత్రంబుచేతక్ = కారణశరీరమునందును సుషుప్త్యవస్థయందును నభిమానము గలిగి ప్రాజ్ఞుఁ డని చెప్పఁబడినంతమాత్రముచేత, జీవత్వంబు = జీవభావము, పర్యాప్తంబు = పూర్తియైనది, కామింజేసి = కాకపోవుటచేత, తదీయ - అదృష్ట - పూర్వక - సూక్ష్మశరీర - సృష్టి - ప్రకారంబు = ఆజీవునిసంబంధ మగు పూర్వ జన్మకృతకర్మఫలము ప్రధానాలంబనముగఁ గల సూక్ష్మదేహముయొక్క

ప్పుట్టినట్టి క్రమమును, చెప్పెదను = వచించెదను, వినుము = ఆలింపుము, అని = పలికి, ఇట్లు - అని యెన్ = చెప్పఁబోయెడికీతిని పలికెను.

తా. పైనఁ జెప్పఁబడినరీతి నవిద్యయు నయ్యవిద్యయందుఁ బ్రతిఫలించిన చైతన్యమును రెంటికి నాధారభూతమైన బ్రహ్మచైతన్యంబును గలసి జీవుఁ డనబడును. అట్టి జీవునకు నానందమయకోశ మను పేరు గల భిన్నమైన యజ్ఞానము కారణశరీరము సుషుప్తి యను నవస్థయు నగును. ఈ కారణశరీరమునందును సుషుప్త్యవస్థయందును తాదాత్మ్యరూప మగు నభిమానము గల యాజీవుఁడు ప్రాజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. ఈ ప్రాజ్ఞునకుఁ గారణశరీరమునందును సుషుప్త్యవస్థయందు నభిమానము గలిగినంతమాత్రముచేత జీవభావము సిద్ధింపక పోవుటవలన నా జీవుని పూర్వజన్మమునందుఁ జేసిన కర్మఫలము సహాయముగఁ గల లింగశరీరముయొక్క యుత్పత్తిక్రమమును వక్కాణించెద నాకర్ణింపు మని శ్రీరామచంద్రుఁడు మఱియు నీరీతి నుపన్యసించెను. 3

తే. అమలసత్త్వప్రధానమాయాసమన్వి
తేశ్వరుఁడ నగునేను సృష్టీచ్ఛచేతఁ
బూని వీక్షించితిని దమఃప్రధానమాయ
నఖిలచేతనకర్మసహాయముగను. ౪౦

టీ. అ...డను—అమల = రజస్తమోగుణములచేఁ గలుషితముగాని, సత్త్వ = సత్త్వగుణము, ప్రధాన = ముఖ్యముగఁ గల, మాయా = మాయ యను మూలప్రకృతియొక్క యంతర్భాగముతో, సమన్విత = కూడియున్న, ఈశ్వరుఁడను = సర్వేశ్వరుఁడను, అగు - నేను = అయినట్టి నేను, అఖిల చేతన - కర్మ - సహాయముగను = సమస్తప్రాణులయొక్క యాయాకర్మల సాపేక్ష గలుగునట్లుగ, సృష్టి - ఇచ్ఛచేతన్ = ప్రపంచమునెల్ల సృజించెడు తలఁపుతో, తమస్ - ప్రధానమాయన్ = తమోగుణము ముఖ్యముగఁ గల మాయను, పూని వీక్షించితిని = పట్టి చూచితిని.

శా. స్వచ్ఛమగు సత్త్వగుణము ముఖ్యముగఁ గల మాయయందుఁ
ప్రతిఫలించి సర్వేశ్వరుఁడ నైన నేను నిఖిలజీవులసంబంధ మగు నాయా
పుణ్యపాపమిశ్రకర్మల సాపేక్ష గలిగి ప్రపంచమునెల్ల నిర్మించుతలఁపుతోఁ
గేవలతమోగుణాత్మక యగుమాయను బట్టి చూచితిని. ౪౦

వ. ఇట్లు చూచిన నా తమఃప్రధాన సమష్ట్యజ్ఞానావచ్ఛిన్నచైతన్యంబువలన శబ్దగుణకాకాశంబు, నయ్యాకాశావచ్ఛిన్నచైతన్యంబువలన స్పర్శగుణకానిలంబు నయ్యనిలావచ్ఛిన్నచైతన్యంబువలన రూపగుణకానలంబు, నయ్యనలావచ్ఛిన్న చైతన్యంబువలన రసగుణకజలంబు, నజ్జలావచ్ఛిన్నచైతన్యంబువలన గంధగుణకపృథివియుం బుట్టె; నివి యపంచీకృతసూక్ష్మభూతంబు లనియుఁ, బంచతన్మాత్ర లనియుం జెప్పంబడు; నీభూతపంచక ప్రత్యేక సత్త్వగుణార్ధంబులవలనఁ గ్రమంబున దిగ్వాతార్క ప్రచేతోఽశ్వినీదేవతా సమన్విత శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణంబులు జనియించె; మిగిలిన సత్త్వార్ధసమష్టివలనఁ జంద్ర వాచస్పతి రుద్రక్షేత్రజ్ఞదేవతాయుక్త మనోబుద్ధ్యహంకార చిత్తంబులును సంభవించె; నవ్వియదాది పంచక రజోగుణార్ధంబువలన వరుసం దోడన వహ్నీంద్రోపేంద్ర మృత్యుప్రజాపతి దేవతాసమేత వాక్పాణిపాదపాయూపస్థలు జన్మించెఁ; దక్కినరజోగుణార్ధసమష్టివలన విశిష్ట విశ్వకర్తృవిశ్వయోన్యజ జయ దేవతాకప్రాణాపాన వ్యానోదానంబు లుద్భవించె; నివ్విధంబున నుత్పన్నంబు లైన జ్ఞానేంద్రియపంచకంబు, నంతఃకరణచతుష్టయంబుఁ గర్మేంద్రియపంచకంబుఁ, బ్రాణాదిపంచకంబుం గూడి

ఏకోనవింశత్యవయవంబుల లింగశరీరంబుఁ గలిగె; నీ సూక్ష్మదేహంబు వృక్షవనంబులభంగి నొక్కటి వ్యష్టి యనియు, సర్వంబు సమష్టి యనియుం జెప్పనొప్పు; వీనికి వ్యష్టిసమష్టిస్వప్నంబు లవస్థ లగు; నీవ్యష్టిసూక్ష్మాంగ స్వప్నంబులయందుఁ బ్రాజ్ఞుం డభిమాని యై ప్రాతిభాసికుండు స్వప్నకల్పితుండు తైజసుండు ననం బ్రవర్తిల్లు; నాసమష్టి సూక్ష్మకాయ స్వప్నవిశిష్టుండ నై యీశ్వరుండ నయిననేను హిరణ్యగర్భుండు సూత్రాత్మకుండుఁ బ్రాణుండు నన సర్వజీవోపాస్యుండ నై యుండుదు. ఇది సూక్ష్మసృష్టి తెఱంగు; ఇఁక స్థూలప్రపంచప్రకారంబు వినిపించెద విను మని యిట్లనియె. ౮౧

టీ. ఇట్లు = ఈరీతిని, చూచినన్ = తమోగుణ ప్రధానమాయమ నేను పరికించినతోడనే, ఆ...వలనన్ - ఆ=తొల్లి చెప్పిన, తమఃప్రధాన= తమోగుణమయమైన, సమష్టి - అజ్ఞాన = ఏకీభవించియున్న మాయయందు, అవచ్ఛిన్న = వ్యాపించిన, చైతన్యంబువలనన్ = నాయొక్క చిచ్ఛక్తి వలన, శబ్ద - గుణక - ఆకాశంబును = చప్పుడు గుణముగఁగల మిన్నును, ఆ - ఆకాశ - అవచ్ఛిన్న - చైతన్యంబువలనన్ = అట్టి యంతరిక్షమునందు వ్యాపించిన చిచ్ఛక్తివలన, స్పర్శ - గుణక - అనిలంబు = స్పృశించుట గుణముగఁ గలగాలియును, ఆ-అనిల- అవచ్ఛిన్న - చైతన్యంబువలనన్= అట్టిగాలియందుఁ బ్రసరించిన చిచ్ఛక్తివలన, రూప - గుణక - అనలంబు = రూపము గుణముగఁ గల యగ్నియును, ఆ - అనల - అవచ్ఛిన్న - చైతన్యంబువలనన్=అట్టి యగ్గియందు వ్యాపించిన చిచ్ఛక్తివలన, రస - గుణక జలంబును = చవియే ధర్మముగఁ గలనీరును, ఆ - జల - అవచ్ఛిన్న చైతన్యంబువలనన్ = అట్టినీటియందుఁ గ్రమ్మియున్న చిచ్ఛక్తివలన, గంధ

గుణక - పృథివ్యాదయః = వాసనయే గుణముగఁగల పుడమియును, ప్రస్టైక్ = జనించెను; ఇవి=ఆకసము మొదలగు నీభూతము లైదును, అపంచీకృత - సూక్ష్మ - భూతంబులు = ముందుఁ జెప్పఁబడురీతిని పంచీకరణము చేయఁబడని పరమసూక్ష్మము లయిన భూతములు, అనియు = అనుచును, పంచతన్మాత్రలు = ఐదువిధములగు తన్మాత్రలు, అనియును = అనుచును, చెప్పంబడును = వచింపఁబడుచున్నవి ; ఈ - భూత - పంచక - ప్రత్యేక - సత్త్వగుణ - అర్ధంబులవలనన్ = ఈ సూక్ష్మభూతముల యైదింటియొక్క వేర్వేఱగు సత్త్వగుణములయొక్క సగపాలులవలన, క్రమంబునన్ = వరుసగా, దిక్ ... బులు — దిక్ = దిక్కులును, వాత = వాయువు, అర్క = సూర్యుఁడు, ప్రచేతస్ = వరుణదేవుఁడు, అశ్వినీదేవతలు అను, దేవతా - సమేత = వేల్పులతోఁ గూడిన (అధిదేవతలుగఁగల), శ్రోత్ర=శ్రవణేంద్రియము, త్వక్ = చర్మేంద్రియము, చక్షుః = నేత్రేంద్రియము, జిహ్వా = రసనేంద్రియము, ఘ్రాణంబులు = ఘ్రాణేంద్రియము నను నైదుజ్ఞానేంద్రియములును, జనియించెన్ = ఉద్భవించెను; మిగిలిన - సత్త్వ - అర్ధ - సమష్టివలనన్ = మీఁదఁ జెప్పఁబడిన సూక్ష్మభూతముల సంబంధ మగు కలుపడిన సత్త్వగుణములయొక్క యైదుసగపాళ్లకలియికవలన, చంద్ర... బులును - చంద్ర = చందురుఁడు, వాచస్పతి = దేవగురువు, రుద్ర = శంభువు, క్షేత్రజ్ఞ = జీవాత్ముఁడు, దేవతా - యుక్త = అనువేల్పులతోఁ గూడిన (ఈవేల్పు లధిష్ఠానదేవతలుగఁ గల), మనస్ = సందేహరూపమైన మనస్సును, బుద్ధి = నిర్ధారణరూప మగు బుద్ధియు, అహంకార = కర్తృత్వరూప మైన యహంకారమును, చిత్తంబులును=చలనధర్మము గల చిత్తమును అను నీ యంతరింద్రియ విశేషములు నాల్గును, సంభవించెను = కలిగెను; ఆ - వియత్ - ఆది - పంచక - రజస్ - గుణ - అర్ధంబులవలనన్ = మీఁదఁ జెప్పఁబడిన ఆకసము మొదలగు సూక్ష్మపంచభూతముల యైదిటి సంబంధ మగు రజోగుణములయొక్క సగపాళులవలన, వరు

సన్ - తోడన = క్రమము తప్పకుండునట్లు, వహ్ని...లు - వహ్ని = జ్వలనుఁడు, ఇంద్ర = వేల్పులఱేఁడు, ఉపేంద్ర = వెన్నుఁడు, మృత్యు = మృత్యుదేవత, ప్రజాపతి = నలువయు నను, దేవతా - యుక్త = వేల్పులధిష్ఠాతలుగఁ గల, వాక్ = వచనము, పాణి=చేతులు, పాద = చరణములు, పాయు = మలవిసర్జనస్థానము, ఉపస్థలు = మూత్రవిసర్జనస్థానము, అను నైదు కర్మేంద్రియములు, జన్మించెన్ = కలిగెను; తక్కిన - రజోగుణ - అర్ధ - సమష్టివలనన్ = పూర్వోక్త సూక్ష్మపంచభూతముల సంబంధ మైన రజోగుణముయొక్క సగపాళుల కలయికవలన, విశిష్ట - విశ్వకర్తృ - విశ్వయోని - అజ - జయ - దేవతాక - ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన - సమానంబులు = విశిష్టుఁడు - విశ్వకర్త - విశ్వయోని - అజుఁడు - జయుఁడు నను నధిదేవతలు గల ప్రాణుఁడు, అపానుఁడు, వ్యానుఁడు, ఉదానుఁడు, సమానుఁడు నను నైదుగాలులు, ఉద్భవించెన్ = సంభవించెను. ఈ - విధంబునన్ = ఇట్లు చెప్పఁబడినరీతిని, ఉత్పన్నంబులు = జనించినవి, ఐన = అగు, జ్ఞానేంద్రియ - పంచకంబు = శ్రవణేంద్రియము లోనగు నైదుజ్ఞానేంద్రియములును, అంతఃకరణ చతుష్టయంబు = మనస్సు మొదలగు నాలు గంతరింద్రియములును, కర్మేంద్రియ పంచకంబు=వాక్కు మొదలుగఁ గల కర్మేంద్రియము లైదును, ప్రాణాది పంచకంబును = ప్రాణము మొదలగు నైదువాయువులును, కూడి = కలిసి, ఏకోన - వింశతి - అవయవంబులన్ = ఒక్కటి తక్కువ గల ఇరువది యంగములతో (పందొమ్మిది యంగములతో), లింగశరీరంబు = సూక్ష్మదేహము, కలిగెను = జనించెను; ఈసూక్ష్మదేహంబు = ఇట్టి లింగశరీరము, వృక్షవనంబుల భంగిన్ = పనస మామిడి మొదలగు వేఱువేఱు చెట్లయట్లును- ఆచెట్లన్నియుఁ గూడి వనమగునట్లును, ఒక్కొకటి = ఒక్కొక లింగశరీరము, వ్యష్టి - అనియును = వ్యస్తమనియు, సర్వంబు = లింగశరీరము లెల్లను గలిసి, సమష్టి అనియు, చెప్పన్ - ఒప్పున్ = పలుకఁ

బడును; వీనికిన్ = ఈలింగశరీరములకు, వ్యష్టి - సమష్టి - స్వప్నములు = వ్యష్టిసంబంధములు సమష్టిసంబంధములు నగు కలలు, అవస్థలు - అగున్ = దశలు అగును; ఈ - వ్యష్టి - సూక్ష్మాంగ - స్వప్నంబులయందున్ = ఇట్లు వ్యస్తము లగు లింగశరీరములయొక్క స్వప్నావస్థలయందు, ప్రాజ్ఞుండు = "అతఁడు ప్రాజ్ఞుఁ డనఁగ నానందమయుఁ డన" అను మొదలుగఁ దొల్లి చెప్పఁబడినస్వరూపము గలప్రాజ్ఞుఁ డను పేరంబరఁగు జీవుఁడు, అభిమాని - ఐ = నేను నాది యను నభిమానము గలవాఁ డగుచు, ప్రాతిభాసికుండు = ప్రతిభాసామాత్రస్వరూపుండు గావున ప్రాతిభాసికుఁడును, స్వప్న - కల్పితుండు = స్వప్నావస్థచేత కల్పింపఁబడినవాఁడు గాన స్వప్నకల్పితుఁడును, తైజసుండు = ప్రకాశమాత్ర మగు రజోవృత్తియే స్వరూపముగఁ గలవాఁడుగాన తైజసుఁడును, అయి, ప్రవర్తిల్లున్ = కనఁబడుచున్నవాఁడు; ఆ - సమష్టి - సూక్ష్మకాయ - స్వప్న - విశిష్టుండను - ఐ = తొల్లి చెప్పఁబడినట్టి సమష్టిరూపమైన లింగశరీరముయొక్క సంబంధమగుస్వప్నావస్థయం దభిమానము గలవాఁడనగుచు, ఈశ్వరుండను = సర్వేశ్వరుఁడను, ఐన నేను = అగునట్టి నేను, హిరణ్యగర్భుండు = బంగారువలె పరిశుద్ధమగు సృష్టిపరిజ్ఞానము గర్భమునందుఁ గలవాఁడుగాన హిరణ్యగర్భుఁడు, సూత్రాత్మకుఁడు = పరిశుద్ధులగు జీవు లనియెడు మణులు తనయందు గ్రుచ్చఁబడియుండుటచే సూత్రాత్మకుఁడును, ప్రాణుఁడు = సకలజీవులకుఁ బ్రాణభూతుఁ డై యంతర్యామిగ నుండువాఁడు గానఁ బ్రాణుఁడును, అనన్ = జ్ఞానులు చెప్పుచుండఁగా, సర్వ - జీవ - ఉపాస్యుఁడను = ఎల్లజీవులచే నారాధింపఁబడుచున్నవాఁడను, ఐ = అగుచు, ఉండుదున్ = ఉన్నవాఁడను; ఇది = ఇట్లు వివరింపఁబడిన యర్థము, సూక్ష్మ - సృష్టి - తెఱంగు = జీవేశ్వరుల లింగశరీర సృష్టిక్రమము, ఇంకన్ = ఈపైని, స్థూల - ప్రపంచ - ప్రకారము = స్థూలదేహసృష్టి

క్రమము, వినిపించెదన్ = వివరించుచున్నాను, వినుము - అని = ఆలకింపుమని, ఇట్లు - అనియెన్ = ఈరీతిని నుడివెను.

తా. కేవల తమోగుణమయం బగు మూలప్రకృతి నారాయణుఁడు పరికించినతోడనే తమోగుణప్రచురంబై సమష్టిరూపముగ నున్న యామూలప్రకృతియందుఁ బ్రతిఫలించినపరమేశ్వరుని చిచ్ఛక్తివలన ధ్వని గుణముగఁ గల మిన్నును, ఆ మింట వ్యాపించిన చిత్తువలన స్పర్శము గుణముగఁ గల గాలియు, నాగాలియందుఁ బ్రసరించిన చిచ్ఛక్తివలన రూపము ధర్మముగఁ గల వహ్నియు, నా వహ్నియందు నిండియున్న చిత్తువలన రసము గుణముగఁ గలజలమును, నా జలమునందలి చైతన్యశక్తివలన గంధము గుణముగఁ గల పుడమియు జనియించెను. ఈ యాకసము మొదలగువానిని నైదిటిగాఁ గూర్పఁబడనివానికి (పంచీకరణము చేయనివానికి) సూక్ష్మభూతములనియు, పంచతన్మాత్ర లనియుఁ బేరు. ఈ యైదు సూక్ష్మభూతములయందలి వేర్వేఱగు సత్త్వగుణముయొక్క సగపాళ్లవలన వరుసగ దిక్కు లధిదేవతలుగఁ గల శ్రవణేంద్రియమును, వాయుదేవతాకమయిన త్వగింద్రియమును, సూర్యుఁ డధిష్ఠాతగఁ గల చక్షురింద్రియమును, వరుణుఁ డధిష్ఠానదైవముగఁ గల రసనేంద్రియమును, నశ్వినీదేవత లధిదేవతలుగఁ గల ఘ్రాణేంద్రియమును నను నైదుజ్ఞానేంద్రియములు పుట్టినవి. కొఱవడిన సూక్ష్మభూతముల సంబంధ మగు సత్త్వగుణముల యైదు సగపాళుల కలయికవలనఁ జంద్రదేవతాక మగు మనస్సును, బృహస్పతిదేవతాక మగు బుద్ధియును, రుద్రదేవతాకమగు నహంకారమును, జీవదేవతాకమగు చిత్తమును నను నంతరింద్రియములు నాలుగు పొడమినవి; మఱియు సూక్ష్మరూపములగు (అవ్యక్తరూపము లగు) నాకసము లోనగు నాయైదుమహాభూతముల సంబంధమగు రజోగుణముయొక్క సగపాళుల సమష్టివలన, విశిష్టుఁ డధిదేవతగఁ గల ప్రాణము, విశ్వకర్తృదేవతాకమగు నపానమును, విశ్వయోనిదేవతాకమగు వ్యానమును, అజుఁ డనుదేవత యధిష్ఠాతగఁ గల ఉదానము, జయదేవతాక

మగు సమానము, నను నైదువాయువిశేషము లుద్భవించినవి; ఈరీతిని జనించిన శ్రవణము మొదలగు నైదుజ్ఞానేంద్రియములును, మనస్సు మొదలగు నంతరింద్రియములు నాల్గును, వాక్కు తొల్లిగాఁ గల కర్మేంద్రియము లైదును, ప్రాణము మొదలగు వాయువిశేషము లైదును గలిసి పందొమ్మిది యంగములు గల లింగదేహ మయ్యెను. ఈ సూక్ష్మశరీరము మహావనమునందలి పనస మామిడి మొదలగు వేలువేలు చెట్లులపగిది నొక్కొకటి వ్యష్టి యనియును, అన్ని చెట్టులును గలసి వనం బగునట్లు నంతయు సమష్టి యనియును, వ్యవహరింపఁబడును; వ్యష్టిగను సమష్టిగ నున్న యీ సూక్ష్మశరీరములకు వ్యష్టిస్వప్నంబును క్రమంబుగ నవస్థ లగుచున్నవి. ఇట్లు వ్యష్టిగనుండు సూక్ష్మశరీరములయొక్క స్వప్నావస్థలయందు నభిమానము గలిగిన ప్రాజ్ఞునకుఁ బ్రాతిభాసికుఁడు స్వప్నకల్పితుఁడుఁ దైజసుఁడు నన సంజ్ఞలు గలవు; సమష్టిసూక్ష్మశరీరముయొక్క స్వప్నావస్థతోఁ గూడిన వాఁడనై ఈశ్వరుఁడనగు నేను హిరణ్యగర్భుఁడు సూత్రాత్మకుఁడుఁ బ్రాణుఁడు ననఁబడు నెల్లజీవులచే నారాధింపఁబడుచు నుండుదును; ఇంతయును సూక్ష్మసృష్టియొక్క క్రమము. ఈపైని స్థూలదేహసృష్టి క్రమము వివరించుచున్నాను. దాని నాలకింపు మని పలికెను. ౮౧

సీ. తత తమోగుణక భూతముల నైదింటినిఁ
క్రమమున రెండు భాగములు సేసి
తొలుతఁ బంచార్ధాంశములఁ బూని వేర్వేఱ
తునియలు నాల్గుగా నమవుపఱచి
ముఖ్యార్థముల శేషభూత ఖండ చతుష్ట
యముల నొండొంటి నెయ్యమునఁ గూర్పఁ
బంచీకృతంబు లై పటుతరస్థూలంబు
లై యభివ్యక్తంబు లయ్యె నొకట

తే. వాయునందన ! విను మింక ♦ వానివలన
నఖిలజగములు నానాచరాచరములు
బహువిధాన్నంబులును ఘటపటగృహాది
సకలదృశ్యపదార్థముల్ ♦ సంభవించె. ౨౩

టీ. వాయునందన= కరువలిపట్టి, ఇంకన్ = మఱియును, వినుము = ఆలింపుము; తత - తమోగుణక - భూతములన్ - ఐదింటిని = అంతటను వ్యాపించినవియుఁ దామసగుణము ప్రధానముగఁ గలవియు నగుటచే స్థూలములగు నాకసము మొదలగు భూతపంచకమును, క్రమముగన్ = వరుసగా, రెండుభాగములు = రెండుపాళ్లు, చేసి = ఒనర్చి, (ఒక్కొక భూతమునుఁ బ్రత్యేకము రెండేసి తునియలుగఁ గావించి), తొలుతన్ = మొదటను, పంచ - అర్ధ - అంశములన్ = అట్లు విభజింపఁబడిన యా భూతములయొక్క యైదు సగపాళ్లను, పూని = తీసికొని, వేర్వేఱ = ఒక్కొక యర్ధభాగమును, తునియలు నాల్గు- కాన్ = నాలుగేసి భాగములుగ, అనువుపఱచి=సరిగ నొనరించి, ముఖ్య - అర్ధములన్ = నాలుగేసిగ పంచక వేఱుగ నుంచిన యైదు సగపాళ్లను, శేష - భూత - ఖండ చతుష్టయములన్ = తక్కిన పంచభూతములయొక్క నాలుగుపాళ్లను, ఒండొంటికిన్ = ఒకదానితో నొకదానిని, నెయ్యమునన్ = వేడుకతో, కూర్పన్ = కలుపుటవలన, పంచీకృతంబులై = పంచీకరణము చేయఁబడినవై, ఒకటన్ = ఒకసారిగనే, పటుతర స్థూలంబులు - ఐ = గట్టిపడి వ్యక్తము లగుచు గొప్పవియై, అభివ్యక్తంబులు - అయ్యెన్ = దృశ్యములైనవి; ఇంకన్ = ఇట్లు దృశ్యములు కాఁగా, వానివలనన్ = పంచీకరణము చేయుటచే స్థూలములై యభివ్యక్తములైన యా పంచమహాభూతములవలన, అఖిల - జగములు = సమస్తములైన లోకములును, నానా చరాచరములును = పలువిధములైన జంగమములు స్థావరములును, బహు విధ - అన్నంబులు = అనేకవిధములైన భుజింపఁదగిన ధాన్యము మొదలగునవియును, ఘట - పట - గృహ - ఆది - సకల - దృశ్య - పదార్థ

ములు = కడవలు వలువలు ఇండ్లు మొదలగు నెల్లదృశ్యములైన వస్తువులును, సంభవించెను = కలిగినవి.

తా. ఓ వాయుకుమారా! భూతపంచక పంచీకరణ ప్రకారంబు వివరించెద నాలకింపుము. "ద్విధావిధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః స్వస్వేతర ద్వితీయాంశై ర్యోజనా త్పంచపంచతే" అనుటచేతఁ గేవల తామసగుణమయంబులైన యాకాశాది పంచమహాభూతముల నొక్కొక్క దానిని మొదట రెండేసి భాగములుగఁ జేసి ఆభాగములలో మొదటి యైదు భాగములను వేఱుగ నుంచి, కొఱవడిన యైదుభాగములలో నొక్కొక్క దానిని ప్రత్యేకముగ నాలుగేసి భాగములుగ నొనరించి యీ తునియలను నాలుగేసి చొప్పున మొదటి యొక్కొక్క సగపాలులో వేర్వేఱ కలుపఁగాఁ బంచీకరణ మగును. ఇట్లు పంచీకరణము చేయుటవలనఁ బంచమహాభూతములు స్థూలరూపము నొంది వ్యక్తములై దృశ్యములయినవి. ఈదృశ్యములైన భూతములవలననే చతుర్దశ భువనములును వానియందలి చేతనములు నచేతనములు నగుపదార్థములును పలుతెఱంగుల నుండు భోజనపదార్థములును నిండుకుండలు బట్టలు మొదలుగఁ గన్పట్టుచున్న వస్తుజాతమును జనించెను. ఈ స్థూలభూత పంచీకరణమునకు నుదాహరణము పుడమిని దొలుత రెండుగ విభజించి యం దొకపాలును వేఱుగనుంచి రెండవభాగమును నాలుగుగ విభజింపవలయును. ఇట్లు ఆకాశమును, నుదకమును, తేజస్సును, వాయువును విభజింపవలయును. పిమ్మట నొక్కొక్క భూతముయొక్క సగపాళ్ల యైదింటిలోఁ దమకు బెరలగు నాలుగు భూతములయొక్క నాలుగవ భాగములను వేఱువేఱ కూర్పవలయును. ఇట్లు గూర్చుటవలన తామస భూతస్థూలసృష్టి యగును. తత్క్రమం బెట్లనిన? దేనితోఁ గలియని యాకాశముయొక్క సగపాలువలన క్షేత్రజ్ఞుఁడును, ఈసగపాలుతోఁ బృథివీ జలాగ్నివాయువుల సగపాళ్లలోని చతుర్థాంశములు వేర్వేఱ కలియుటచేఁ గ్రమముగ నహంకారమును జిత్తమును బుద్ధియు మనస్సును గలిగెను. ఇది వ్యోమపంచక మనఁబడును. వాయువుయొక్క యఱపాలువలన వ్యానవాయువును, ఈ యఱపాలుతోఁ బృథ్వీజలాగ్న్యాకాశముల సగపాళ్ల

లోనిచతుర్థాంశములు ప్రత్యేకముగఁ జేరుటచేత నపాన ప్రాణోదాన సమాన వాయువులు జనించెను; ఇది వాయుపంచకము. దేనితోఁ గలియని తేజస్సు యొక్క యఱపాలునుండి చక్షురింద్రియము జనించెను. దీనిలోఁ బృథ్వీ జల వా య్వా కాశభాగములు ప్రత్యేకముగఁ గూడుటవలన ఘ్రాణ జిహ్వా త్వక్ఛ్రోత్రములు కలిగెను; ఇది అగ్నిపంచకము. దేనితోఁ గలియని జలము యొక్క యర్థాంశమువలన రసమును, దానితో భూ తేజో వా య్వాకాశ ముల యరపాళ్లలోని నాలుగవపాళ్లు వేర్వేఱ చేరుటవలనఁ గ్రమముగ గంధ రూప స్పర్శ శబ్ద రసములును సంభవించెను; వీనికి జలపంచక మని పేరు. దేనితోఁ గలియని పుడమియొక్క సగపాలువలన, పాయువును, ఈ సగ పాలుతో జల తేజో వా య్వాకాశముల యర్థాంశములలోని నాలుగవ భాగములు ప్రత్యేకముగఁ గలియుటవలన నోలిని ఉపస్థయు,పాదము, పాణి వాక్కును బొడమెను. ఇది భూపంచకము; కొందఱమతమునఁ బంచభూత ములను తొలుత నొక్కొకదానిని రెండేసిభాగములుగఁ జేసి అం దొక్కొక భాగమును వేర్వేఱ యునిచి - తక్కినభాగముల నైదింటిని నొక్కొకదాని నాలుగేసి భాగములు చేసి, ఈ చతుర్థాంశములనే వేర్వేఱ కలుపవలయు ననియు నిట్లు కలుపుటవలననే పంచవింశతితత్త్వములు జనించిన వనియుఁ జెప్పెదరు. ౪౨

| సూక్ష్మ పంచభూత సృష్టిమండలము | | | | | |
|---|---|---|---|---|---|
| సూక్ష్మపంచ భూతోత్ప త్తి కారణ ములు. | తమోగుణ మయ సమ ష్ట్యజ్ఞాననిష్ఠ చైతన్యము. | సూక్ష్మాకాశ నిష్ఠ చైతన్యము. | సూక్ష్మవా యునిష్ఠ చైతన్యము. | సూక్ష్మ వహ్నినిష్ఠ చైతన్యము | సూక్ష్మజల నిష్ఠచైత న్యము |
| సూక్ష్మపంచ భూతములు | ఆకాశము | వాయువు | వహ్ని | జలము | పుడమి |
| పంచభూత గుణములు | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |

## జ్ఞానేంద్రియ పంచకోత్పత్తి మండలము

| జ్ఞానేంద్రియ పంచకోత్పత్తి కారణములు | సూక్ష్మాకాశనిష్ఠ సత్త్వగుణ పూర్వార్థము | సూక్ష్మవాయునిష్ఠ సత్త్వగుణ పూర్వార్థము | సూక్ష్మవహ్నినిష్ఠ సత్త్వగుణ పూర్వార్థము | సూక్ష్మజలనిష్ఠ సత్త్వగుణ పూర్వార్థము | సూక్ష్మభూనిష్ఠ సత్త్వగుణ పూర్వార్థము. |
|---|---|---|---|---|---|
| జ్ఞానేంద్రియ పంచకము | శ్రోత్రము | చర్మము | చక్షుస్సు | జిహ్వ | ఘ్రాణము |
| జ్ఞానేంద్రియాధిదేవతలు | దిక్కులు | స్పర్శనుడు | సూర్యుఁడు | వరుణుఁడు | అశ్వినేయులు |
| జ్ఞానేంద్రియ గుణములు | వినుట | తాఁకుట | చూచుట | చవిగొనుట | ఆఘాచుట |

## అంతఃకరణ చతుష్టయోత్పత్తి మండలము

సూక్ష్మభూత పంచక సమష్టి సత్త్వగుణోత్తరార్థము - అంతఃకరణ చతుష్టయోత్పత్తి కారణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అంతఃకరణ చతుష్టయము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | |
| అంతఃకరణాధిదేవతలు | చంద్రుఁడు | వాచస్పతి | రుద్రుఁడు | జీవుఁడు | |
| అంతఃకరణ ధర్మములు | సంశయము | నిశ్చయము | చాంచల్యము | కర్తృత్వము | |

## కర్మేంద్రియ పంచకోత్పత్తి మండలము

| కర్మేంద్రియోత్పత్తి కారణములు | సూక్ష్మాకాశనిష్ఠరజోగుణ పూర్వార్థము | సూక్ష్మవాయునిష్ఠరజఃపూర్వా | సూక్ష్మవహ్నినిష్ఠరజఃపూర్వా. | సూక్ష్మజలనిష్ఠరజః పూర్వా. | సూక్ష్మభూనిష్ఠరజః పూర్వా. |
|---|---|---|---|---|---|

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్మేంద్రియ పంచకము | వాక్కు | పాణి | పాదము | పాయువు | ఉపస్థ |
| కర్మేంద్రియ పంచకాధిదేవతలు | అగ్నిదేవుఁడు | ఇంద్రుఁడు | ఉపేంద్రుఁడు | మృత్యువు | ప్రజాపతి |
| కర్మేంద్రియ పంచక ధర్మములు | వచనము | ఆదానము | గమనము | విసర్జనము | ఆనందము |

## ప్రాణాది పంచకోత్పత్తి మండలము

వియదాది సూక్ష్మభూతపంచక నిష్ఠ రజోగుణోత్తరార్ధ సమష్టి ప్రాణాది పంచకోత్పత్తికిఁ గారణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రాణాదిపంచకము | ప్రాణము | అపానము | వ్యానము | ఉదానము | సమానము |
| తదధిదేవతలు | విశిష్టుఁడు | విశ్వకర్త | విశ్వయోని | అజుఁడు | జయుఁడు |
| తత్స్థానములు | హృదయము | గుదము | సర్వశరీరము | కంఠము | నాభి |

| సూక్ష్మ శరీర మండలము | | | ప్రాజ్ఞనామములు | ఈశ్వరనామములు |
|---|---|---|---|---|
| లింగశరీరభేదము | వ్యష్టిసూక్ష్మశరీరము | సమష్టిసూక్ష్మశరీరము | ప్రాతిభాసికుఁడు | హిరణ్యగర్భుఁడు |
| లింగశరీరావస్థలు | వ్యష్టిస్వప్నము | సమష్టిస్వప్నము | స్వప్నకల్పితుఁడు | సూత్రాత్మకుఁడు |
| తదవస్థాభిమానులు | ప్రాజ్ఞజీవుఁడు | ఈశ్వరుఁడు | తైజసుఁడు | ప్రాణుఁడు |

## తామస స్థూలభూత పంచీకరణ మండలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచీకృతాకాశ పంచకము | అంతఃకరణము | సమానవాయువు | శ్రోత్రము | శబ్దము | వాక్కు |
| పంచీకృతవాయు పంచకము | మనస్సు | వ్యానవాయువు | త్వగింద్రియము | స్పర్శము | పాణి |
| పంచీకృతాగ్ని పంచకము | బుద్ధి | ఉదానవాయువు | చక్షురింద్రియము | రూపము | పాదము |
| పంచీకృతజల పంచకము | చిత్తము | ప్రాణవాయువు | రసనేంద్రియము. | రసము | ఉపస్థ |
| పంచీకృత భూపంచకము | అహంకారము | అపాన వాయువు | ఘ్రాణేంద్రియము | గంధము | పాయువు |

## తామస స్థూల భూత పంచీకరణ మండలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశ పంచకము | ఆకాశములోని క్షేత్రజ్ఞుడు $\frac{1}{2}$ | ఆకాశము $\frac{1}{2}$ పృథివి $\frac{1}{8}$ కలసి అహంకారము | ఆకాశము $\frac{1}{2}$ జలము $\frac{1}{8}$ చిత్తము | ఆకాశము $\frac{1}{2}$ అగ్ని $\frac{1}{8}$ బుద్ధి | ఆకాశము $\frac{1}{2}$ వాయువు $\frac{1}{8}$ మనస్సు |
| వాయుపంచకము | వాయువు $\frac{1}{2}$ వ్యానము | వాయువు $\frac{1}{2}$ పృథివి $\frac{1}{8}$ అపానము | వాయువు $\frac{1}{2}$ జలము $\frac{1}{8}$ ప్రాణము | వాయువు $\frac{1}{2}$ అగ్ని $\frac{1}{8}$ ఉదానము | వాయువు $\frac{1}{2}$ ఆకాశము $\frac{1}{8}$ సమానము |
| అగ్ని పంచకము | తేజస్సు $\frac{1}{2}$ చక్షుస్సు | తేజస్సు $\frac{1}{2}$ పృథివి $\frac{1}{8}$ ఘ్రాణము | తేజస్సు $\frac{1}{2}$ జలము $\frac{1}{8}$ జిహ్వ | తేజస్సు $\frac{1}{2}$ వాయువు $\frac{1}{8}$ త్వక్కు | తేజస్సు $\frac{1}{2}$ ఆకాశము $\frac{1}{8}$ శ్రోత్రము |
| జలపంచకము | జలము $\frac{1}{2}$ రసము | జలము $\frac{1}{2}$ పృథివి $\frac{1}{8}$ గంధము | జలము $\frac{1}{2}$ తేజస్సు $\frac{1}{8}$ రూపము | జలము $\frac{1}{2}$ వాయువు $\frac{1}{8}$ స్పర్శము | జలము $\frac{1}{2}$ ఆకాశము $\frac{1}{8}$ శబ్దము |

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమిపంచకము | భూమి $\frac{1}{2}$ | భూమి $\frac{1}{2}$ | భూమి $\frac{1}{2}$ | భూమి $\frac{1}{2}$ | భూమి $\frac{1}{2}$ |
| | పాయువు | జలము $\frac{1}{8}$ | తేజస్సు $\frac{1}{8}$ | వాయువు $\frac{1}{8}$ | ఆకాశము $\frac{1}{8}$ |
| | | ఉపస్థ | పానము | పాణి | వాక్కు |

వ. ఇట్లు గగనార్ధంబున వాయు తేజో జలభూభాగంబుల, ననిలార్ధంబున నాకాశానిల సలిలేలాంశంబులఁ, బావకార్ధంబున నభ స్సమీర తోయ ధరణీఖండంబుల, నీరార్ధంబున వియన్మరుత్కృశాను ధాత్రీ శకలంబుల, ధరార్ధంబున వ్యోమపవనాగ్న్యుదకంబుల తునియల, జీవాదృష్ట సహాయంబునం గూర్చిన క్రమంబుచేత శబ్దగుణకం బైన యాకాశంబు, శబ్దస్పర్శగుణకం బైన పవమానంబు శబ్దస్పర్శరూపగుణకం బైన దహనంబు, శబ్దస్పర్శరూపరసగుణకంబైన ధరణియుఁ, బంచీకృతంబు లై మహాస్థూలంబు లై యభివ్యక్తంబు లయ్యె; నిమ్మహాభూతంబులవలన నతల వితల సుతల రసాతల తలాతల పాతాళ భూలోక భువర్లోక స్వర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబు లను చతుర్దశభువనంబులుఁ ద త్తల్లోకోచిత జరాయుజాండజ స్వేదజోద్భిజ్జరూప చతుర్విధభూతగ్రామంబులుఁ, ద త్తత్ప్రాణి యోగ్యాన్నపానాదికంబులు, ఘటపటాది సర్వపదార్థములు సంభవించె, నంతవట్టునుం గూడి స్థూలప్రపంచం బగు; దీనికి వ్యష్టిసమష్ట్యాత్మకంబైన జాగరం బవస్థ యగు నం దొక్క వ్యష్టిస్థూల శరీర జాగరంబులయం దా లింగదేహోపాధికుం డైన తైజసుం డభిమానంబుచేసి చిదాభాసుం డన వ్యావహారికుం డన విశ్వుం డన నొప్పు; హిరణ్యగర్భుం డ నయిననేను సమష్టిస్థూల

నిగ్రహా జాగ్రద్విశిష్టుండ నయి వైరాజసుం డన వైశ్వా
నరుం డన విరాట్పురుషుం డన సకలజగదారాధ్యుండ నయి
ప్రకాశించుచుండు మఱియును. ౪౩

టీ. ఇట్లు = మీఁద వివరింపఁబడినరీతిని, గగన అర్ధంబునన్ = తొలుత రెండు పాళులుగా విభజించిన మింటియొక్క సగపాలునందు, వాయు - తేజస్ - జల - భూ - భాగంబులు = గాలి - నిప్పు - నీరు - పుడమి - అను నీ నాలుగు భూతములయొక్క యర్ధాంశముల సంబంధ మయిన చతుర్థభాగములను, అనిల - అర్ధంబునన్ = మొదట రెండుగాఁ జేయఁబడిన గాలియొక్క సగపాలునందు, ఆకాశ - అనల - సలిల ఇలా అంశంబులన్ = మిన్ను - అగ్గి - నీరు - పుడమి - అను నీ భూతచతుష్టయముయొక్క సగపాళులలోని నాలుగవపాళులను, పావక - అర్ధంబునన్ = అగ్నియొక్క సగపాలునందు, నభస్ - సమీర - తోయ - ధరణీ - ఖండంబులన్ = ఆకాశము - గాలి - నీరు - పుడమి - అను వీని యర్ధభాగముల సంబంధ మయిన చతుర్థాంశములను, నీర - అర్ధంబునన్ = నీటియొక్క సగపాలునందు, వియత్ - మరుత్ - కృశాను - ధాత్రీ - శకలంబులన్ = ఆకాశము - గాలి - అగ్గి - పుడమి - అను వీని మొదటి యర్ధాంశములసంబంధ మయిన చతుర్థభాగములను, ధరా - అర్ధంబునన్ = భూమియొక్క మొదటి సగపాలునందు, వ్యోమ - పవన - అగ్ని - ఉదకంబుల - తునియలన్ = మిన్ను - గాలి - అగ్గి - నీరు - అను వీనియొక్క నాలుగవపాళులను, జీవ - అదృష్ట - సహాయంబునన్ = ఆయా జీవుల ప్రాక్తనకర్మరూపం బగు నదృష్టముయొక్క తోడ్పాటునుబట్టి, కూర్చిన క్రమంబుచేతన్ = ఒండొంటం గలిపిన ప్రక్రియచేతను, శబ్దగుణకంబు - ఐన - ఆకాశంబును = ధ్వనియే ధర్మముగఁ గల మిన్నును, శబ్ద, స్పర్శ - గుణకంబు - ఐన - పవమానంబును = చప్పుడును దాఁకుటయు

ధర్మములుగఁ గల గాలియు, శబ్ద - స్పర్శ - రూప - గుణకంబు - ఐన - దహనంబును = ధ్వని - స్పర్శించుట - రూపును - ధర్మములుగఁ గలది యగు నిప్పును, శబ్ద - స్పర్శ - రూప - రస - గుణకంబు - ఐన - యంబువును = శబ్దము - స్పర్శము - రూపము - చవియు - గుణములుగఁ గల నీరును, శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ - సమేతంబు - ఐన - ధరణియు = శబ్దము - స్పర్శము - రూపము - రసము - వాసనయు ననుగుణములతోఁ గూడుకొనినది యగు పుడమియును, పంచీకృతంబులు - ఐ = మీఁదఁ జెప్పినట్లు - ఐదేసి భాగములతోఁ గూర్పఁబడినవై, మహత్ స్థూలంబులు - ఐ = మిక్కిలి గొప్పవి యై, అభివ్యక్తంబులు = వెల్లడిగ నేర్పడినవి, అయ్యెక్ = ఐనవి; ఈ - మహత్ - భూతంబులవలనన్ = ఆకసము మొదలగు నీ గొప్ప పంచభూతముల వలనను, అతల...లు—అతల - వితల - సుతల - రసాతల - తలాతల - మహాతల - పాతాళ - భూలోక- భువర్లోక - స్వర్లోక - మహర్లోక - జనలోక - తపోలోక - సత్యలోకంబులును = అతలము, వితలము, సుతలము - రసాతలము - తలాతలము - మహాతలము - పాతాళము - అను క్రిందుగనుండు నేడులోకములును; భూలోకము - భువర్లోకము - స్వర్లోకము - మహర్లోకము - జనలోకము- తపోలోకము - సత్యలోకము - అను పేరులు గలిగి మీఁదుగనుండు నేడు లోకములును, అను - చతుర్దశ - లోకంబులును = అనియెడు పదునాలుగు జగములును, తత్...గ్రామంబులును - తత్ - తత్ - లోక - ఉచిత జరాయుజ - అండజ - స్వేదజ - ఉద్భిజ్జ - రూప - చతుర్విధ - భూత - గ్రామంబులును = ఆ యా జగంబులయం దుండఁదగిన జరాయుజములు - అండజములు - స్వేదజములు-ఉద్భిజ్జములునని నలుతెఱంగులంబరఁగు ప్రాణికోటులును, (జరాయు వనఁగా మావి యనఁబడు పలుచనితోలుపొర; ఇది గర్భములో శిశువును, నావరించుకొని యుండును. దీనిలోనుండి పుట్టెడు మనుజులును పశువులు మొదలగు చతుష్పాదజంతువులును జరాయుజము లనఁ

బడును. (గుడ్డులోనుండి జనించెడు పిట్టలు పాములు మొదలగునవి యండజములు నాఁబడును; చెమటవలన జనించెడు నల్లులు మొదలగునవి స్వేదజములు అని చెప్పఁబడుచున్నవి ; పుడమిలోనుండి తొలుత మోటులుగ మీఁదికిఁ బొడుచుకొని జన్మించెడు ప్రూఁకులు మొదలగునవి యుద్భిజ్జములనంబడును.) తత్ - తత్ - ప్రాణి - యోగ్య - అన్న - పాన - ఆదికంబులును = ఆయా జీవుల జీవనమునకు నుపయుక్తము లగు నోగిరము పానీయము మొదలగునవియును, ఘట - పట - ఆది - సర్వ - పదార్థంబులును = కుండలు బట్టలు మొదలగు నుపకరణము లెల్లను, సంభవించెన్ = జనించినవి ; ఇంతవట్టునుం గూడి = మీఁదఁ జెప్పిన వన్నియును గలసి, స్థూల - ప్రపంచంబు - అగును = గొప్పదియై వ్యక్తమగు ప్రపంచ మయ్యెను; దీనికిన్ = ఈ స్థూలసృష్టికి, వ్యష్టి - సమష్టి - ఆత్మకంబు = వేర్వేఱయుండెడు జీవుల సంబంధమయినదియు నొకటిగా నుండెడు నీశ్వరుని సంబంధమైనదియు, ఐన - జాగరంబు = ఐనట్టి మెలఁకువ, అవస్థ - అగును = ఒకయవస్థ యై యున్నది; అందున్ = ఆ యవస్థయందు, ఒకొక్క స్థూలశరీరజాగరంబులయందున్ = ఒండొండుగ వేర్వేఱయున్న స్థూలదేహముల సంబంధము లైన జాగరణావస్థలయందు, ఆ - లింగదేహ - ఉపాధికుండు = తొల్లి పలుకఁబడిన సూక్ష్మదేహము ఉపాధిగాఁ గలవాఁడు, ఐన - తైజసుండు = అగునట్టి తైజసుఁ డనఁబడు జీవుఁడు, అభిమానంబు చేసి = ఆ స్థూలదేహమే నేనను నభిమానమును వహించి, చిదాభాసుండు - అనన్ = చిత్తుయొక్క ప్రతిబింబభూతుఁ డగుటచేతఁ జిదాభాసుఁడనియు, వ్యావహారికుఁ డనియు, విశ్వుండు - అనన్ = పుత్త్రమిత్రకళత్రాదు లగు న్నిటియందు నభిమానము గలుగుటచేత విశ్వుఁ డనియును, ఒప్పున్ = ఈ మూఁడుపేళ్లచే వాడఁబడుచున్నాఁడు; హిరణ్యగర్భుఁడను - ఐన - నేను = "సమష్టిసూక్ష్మకాయస్వప్నవిశిష్టుండ నై ఈశ్వరుండ నయిన నేను హిరణ్యగర్భుండన్" అని తొల్లి చెప్పఁబడినయట్లు హిరణగర్భుఁ

డనఁబడు నేను, సమష్టి - స్థూల - విగ్రహ - జాగ్రత్ - విశిష్టుండను - ఐ = ఎల్లప్రాణులగు మీరూపమైన స్థూలశరీరము లన్నిటియొక్క జాగ్రద వస్థయం దభిమానము గలవాఁడనై, వైరాజసుండు - అనక్ = సర్వాంత ర్యామినై విశేషముగఁ బ్రకాశించువాఁడను గాన వైరాజసుఁడ ననియు, వైశ్వానరుండు అనక్ = ఎల్లప్రాణుల సమష్టియందు నభిమానము గల వాఁడ నగుటచే వైశ్వానరుఁడనియు, విరాట్పురుషుఁడు - అనక్ = మిక్కిలి ప్రపంచాకారమున విరాజమానుఁడనైన పురుషుఁడ నగుటచేత విరాట్పురుషుఁడనియును, (నామములచేఁ బిలువఁబడుచు) సకల - జగత్ - ఆరాధ్యుఁడను - ఐ = పదునాల్గు భువనములయం దున్నవారిచే నారా ధింపఁబడుచున్నవాఁడనై, ప్రకాశించుచుక్ - ఉందుక్ = దేదీప్యమానుఁ డనై యున్నాను, మఱియును = ఇంతియకాక.

తా. మీఁదఁ జెప్పినరీతిని నాకసముయొక్క సగపాలునందు వాయు జలాగ్నిభూముల యుత్తరార్ధ చతుర్థాంశములను గూర్చుటచేత శబ్దగుణ కంబగు నాకసమును, వాయువుయొక్క పూర్వార్ధమునందు నాకాశాగ్ని జలభూముల యుత్తరార్ధ చతుర్థాంశములను జేర్చుట శబ్దస్పర్శములు ధర్మ ములుగఁ గలవాయువు, అగ్నియొక్క పూర్వార్ధమునందు ఆకాశవాయు జలభూములయొక్క యుత్తరార్ధ చతుర్థభాగములను గలుపుటవలన శబ్ద స్పర్శరూపములు ధర్మములుగఁ గల అగ్నియు, జలములయొక్క పూర్వార్ధ మునందు ఆకాశ వా య్వగ్ని భూముల యుత్తరార్ధ చతుర్థాంశములను జేర్చుటచేత శబ్ద స్పర్శ రూప రసములు గుణములుగఁ గలజలమును, భూమి యొక్క యవిభక్త పూర్వార్ధమునందు నాకాశ వా య్వగ్ని జలముల యుత్తరార్ధచతుర్థాంశములను బొందించుటచేత శబ్ద స్పర్శ రూపరస గంధ ములు గుణములుగఁ గల పుడమియును ప్రాణికోటులయొక్క పురాతనకర్మ రూప మగు నదృష్టము తోడ్పడుటవలన నైవైదముగాఁ జేర్పఁబడి నాభి వ్య క్తంబులై మిగుల గొప్పయాకారములతో నుత్పన్నములైనవి; అనఁగా

"ఆత్మన ఆకాశః సమ్భూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ" అను శ్రుతివలనఁ దొలుతఁ శబ్దగుణకమగు నాకాశము పుట్టఁగా దానివలన "కారణగుణాః కార్యే సంక్రమన్తి" అనున్యాయమువలనఁ దనకుఁ గారణమగు నాకసముయొక్క శబ్దరూపమైన గుణముతోను తనకు సహజగుణమైన స్పర్శముతోను గూడి గాలిపుట్టెను. శబ్దస్పర్శగుణకంబైన యావాయువువలన శబ్దస్పర్శరూపగుణకంబైన యగ్నియు నాయగ్నివలన శబ్దస్పర్శ రూపరస గుణకంబైన జలములును, నాజలమువలన శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమైన భూమియును సమస్తప్రాణికోటులు తమతమ పూర్వకర్మానురూపములగు పాంచభౌతికశరీరములను బడయుటకై యట్లు పంచీకృతంబులై స్థూలాకారంబుల నొందునని భావము. ఇట్లభివ్యక్తములైన యాపంచమహాభూతములవలననే యతలము మొదలగు పదునాల్గు లోకములును, నాలోకములయందుండఁదగిన జరాయుజములు నండజములు స్వేదజములు నుద్భిజ్జములు నని నాలుగువిధంబులం బరఁగు ప్రాణికోటులును, నాప్రాణులు జీవించుటకు నుపయుక్తము లగు నన్నము పానీయము మొదలగు భోజనపదార్థములును, కుండలు బట్టలు లోనగు నుపకరణములును గలిగినవి; ఇవి యన్నియుం గలసి స్థూలప్రపంచ మనఁబడుచున్నది. ఈ స్థూలసృష్టికి భిన్నాభిన్నము లైనశరీరములయందు నభిమానము గలజీవరాసులయొక్క యాశరీరము లన్నిటియందు నభిమానము గల పరమేశ్వరునియొక్కయు జాగరణరూపమగు నవస్థయే యొకయవస్థయై యున్నది. ఈజాగ్రదవస్థలో వేర్వేఱగు శరీరములయం దొక్కొక్క శరీరమునందలి జాగ్రదవస్థయం దభిమానము గలవాఁడై లింగశరీరాభిమానియై తొల్లి చెప్పినయట్లు తైజసుం డనఁబడుజీవునకుఁ జిదాభాసుఁడు, వ్యావహారికుఁడు, విశ్వుఁడు అని మూఁడు నామములు గలవు; తొల్లి చెప్పినరీతిని హిరణ్యగర్భుఁడ నగునేను స్థూలశరీరము లన్నిటియొక్క జాగ్రదవస్థయందు నభిమానము గలవాఁడనై వైరాజుఁడు, వైశ్వానరుఁడు, విరాట్పురుషుఁడు, అను మూఁడు నామ

ములు గలిగి యెల్లవారిచేఁ బూజింపఁబడుచు వెలుఁగొందుచున్న వాఁడను. ఇంతియ కాక. ౪౩

అవ. ఇట్లు సాధారణముగఁ బరమేశ్వరుని నామరూప ములను జెప్పి విశేషాకారముగ నయ్యీశ్వరుని విరాట్స్వ రూపము నిరూపింపఁబడుచున్నది.

చ. ధరణిపదంబులున్ దివితతంబగు మస్తక మంతరిక్షమున్
సురుచిరనాభి చండకరసోములు లోచనముల్ దిశల్ శ్రు [తుల్
వరదహనుండు నెమ్మొగము వాయువు ప్రాణములున్మహావిరా
ట్పురుషుఁడ నైననాకుఁ గపిపుంగవ విశ్వశరీరి నాటచేన్.

టీ. కపిపుంగవ = కోఁతులకెల్ల శ్రేష్ఠుఁడవగు నో హనుమానుఁడా! (నేను) విశ్వ - శరీరిని = చతుర్దశభువనములే యాకారముగఁ గలవాఁ డను, నాటచేన్ = అగునట్టివాఁడను గాన, మహాత్ విరాట్ పురుషుఁ డను = మిక్కిలి గొప్పయాకారముతో వెలుఁగొందుచున్న మహాపురుషుఁ డను, ఐన నాకున్ = అగునట్టి నాకు, ధరణి = పుడమియే, పదంబు లున్ = చరణములు, దివి = దేవలోకము, తతంబు అగు మస్తకము = వ్యాప్తమైన తలయును, అంతరిక్షము = ఆకాశము, సురుచిరనాభి = ఒప్పిద మైనబొడ్డు, చండకర సోములు = సూర్యుఁడును చందురుఁడును, లోచనములు = నేత్రములు, దిశలు = దిక్కులు, శ్రుతులు = వీనులు, వర ద హనుండు = పవిత్రుఁ డగునగ్నిహోత్రుఁడు, నెమ్మొగము = వెడఁదయైన ముఖము, వాయువు = గాలి, ప్రాణములును=అసువులును (ఐయున్నవి.)

తా. వానరశ్రేష్ఠుఁడ వగు నో యాంజనేయా! గొప్పవిరాట్పురు షుండనగు నాకు పుడమి చరణములు, సురలోకము విపుల మగుశిరస్సును, మిన్ను నాభిప్రదేశమును, దివాకర నిశాకరు లిరువురును నేత్రద్వయము,

నలుగడలు వీనులు, పరమపావనుం డగుపావకుఁడు ముఖము, వాయువు ప్రాణమును నై యున్నవి.

సుగంధివృత్తము.

ధారుణీసురుల్ ముఖంబు క్ష్మాత్రిపుల్ భుజంబు లో
సూరి! వైశ్యు లూరువుల్ సుశూద్రు లంఘ్రులు న్మహా
భూరుహౌషధీలతాళి భూరిరోమము ల్విరా
ట్పూరుషుండ నైననాకు బోధశుద్ధమానసా. ౭౨

టీ. బోధ శుద్ధ మానసా = స్వస్వరూప పరిజ్ఞానముచేఁ బరిశుద్ధ మగుడెందము గలవాఁడవును, సూరి = ప్రపంచము అనిత్యము ఆత్మ నిత్యము అను తెలివి గలవాఁడవు నగు నోయాంజనేయుఁడా, విరాట్పూరుషుండను ఐన నాకున్ = పూర్వోక్తరీతిని విరాట్పూరుషుండ నగునాకు, ధారుణీసురుల్ = పుడమివేల్పులు, ముఖంబు = వదనము, క్ష్మాత్రిపుల్ = రాజన్యులు, భుజంబులు = బాహువులు, వైశ్యులు = కోమటులు, ఊరువుల్ = తొడలు, సుశూద్రులు = యోగ్యులైన నాలవజాతివారు, అంఘ్రులు = చరణములు, మహాత్ - భూరుహ - ఓషధీ - లతా - ఆళీ = ఉత్తమములైన రావి - మారెడు - మఱ్ఱి మొదలగు వృక్షములును, వరి నెవతి గోదుమ మొదలగు సస్యములును, మల్లి, మాలతి మొదలగు తీవలును మొదలగువాని యొక్క వరుసలు, భూరిరోమముల్ = పెక్కులగు వెండ్రుకలు, (ఐయున్నవి).

తా. బ్రహ్మజ్ఞానసంపత్తిచేఁ బరిశుద్ధ మగు చిత్తము గలవాఁడవును, సదసద్వివేచన గలవాఁడవును నగు నో హనుమంతా! విరాట్పూరుషుండ నగు నాకు బ్రాహ్మణులు ముఖము, క్షత్రియులు భుజములు, బేహారులు తొడలు, మంచిశూద్రులు పాదములు, మఱియు - రావి - మారేడు లోనగుచెట్లును, వరి మొదలగు సస్యములును, మల్లె మాలతి మొదలగులతలును శరీరమునందలి రోమములు నై యున్నవి. ౭౨

వనమయూరవృత్తము.

శైలములు శల్యములు సన్నదులు నాడీ
జాలములు వార్ధులు పిచండము త్రిసంధ్యా
కాలములు చేలములు కాలజలదాళుల్
వాలములు విశ్వతనువర్తి నగునాకున్. ౮౬

టీ. విశ్వ - తనువర్తిని - అగు - నాకున్ = ప్రపంచరూప మగు శరీరముతోఁ బ్రవర్తిల్లుచున్న నాకు (అని యర్థము), శైలములు = కొండలు, శల్యములు = ఎముకలు, సత్ - నదులు = పవిత్రము లైన గంగ మొదలగు నేళ్లు, నాడీజాలములు = నరముల సమూహములు, వార్ధులు = సాగరములు, పిచండము = కడుపు; త్రి - సంధ్యా - కాలములు = ఉదయము నడిప్రొద్దు సాయంతనము నను మూఁడైనసంధ్యాసమయములు, చేలములు = వలువలు; - కాల - జలద - ఆళుల్ = నల్లనగు మబ్బులవరుసలు, వాలములు = కొప్పు, అయియున్నవి.

తా. నిఖిలప్రపంచాత్మక మగు మేనితోఁ బ్రవర్తించుచు విశ్వరూపుఁడ నయిన నాకు మంచుకొండ మొదలగు గొప్పకొండలే యెముకలు, గంగ మొదలగు మహానదులే నరములు, సముద్రములే కడుపు. మూఁడగు సంధ్యాకాలములు బట్టలు, నల్లని మేఘపంక్తులు కొప్పయి యున్నవి. ౮౬

శా. ఆధారం బిలయై జలంబుమణిపూరాంభోజమై వహ్నియై
స్వాధిష్ఠాన మనాహతం బనిలమై చంచద్విశుద్ధంబు ఖం
బై ధీమానసరూపకప్రకృతి యాజ్ఞాబ్జాతమై యొప్పు స
ర్వాధారోన్నతవిశ్వమూర్తి నగునాకాదిత్యసంపూజకా.

టీ. ఆదిత్య - సంపూజకా! = నిజగురువైన సూర్యుని లెస్సగఁ జతుర్విధశుశ్రూషలచేఁ బూజించినవాఁడ వగు నో యాంజనేయా, సర్వ-ఆధార - ఉన్నత-విశ్వమూర్తిని - అగు - నాకున్ = జరాయుజాండజస్వే

దజోద్భిజ్జరూప మగు చతుర్విధప్రాణికోటికిని నాశ్రయ మై గొప్పది యగు ప్రపంచమే స్వరూపముగఁ గల నాకు, ఆధారంబు = మూలాధారచక్రము, ఇల - ఐ = పుడమి యై, జలంబు = నీరు, మణిపూర - అంభోజము - ఐ = మణిపూర మనుచక్ర మై; స్వాధిష్ఠానము = స్వాధిష్ఠాన మనుచక్రము, వహ్ని - ఐ = జ్వలనమై, అనాహతము = అనాహతమను చక్రము, అనిలమై = గాలియై, చంచత్ - విశుద్ధంబు = ఒప్పుచుండెడు విశుద్ధ మను చక్రము, ఖంబు - ఐ = ఆకాశ మై, ధీ - మానస - రూపక - ప్రకృతి = మనోబుద్ధిచిత్తాహంకారాత్మక మైనమూలప్రకృతి, ఆజ్ఞాబ్జాతము - ఐ = ఆజ్ఞాచక్ర మయి, ఒప్పుక్ = వెలుఁగొందుచున్నవి.

తా. తొల్లి హనుమంతుఁడు పొడుపుకొండపై నొకకాలును గ్రుంకుమెట్టుపయి నొక యంజను బెట్టి సూర్యునియొద్ద వ్యాకరణశాస్త్రమును బూర్తిగఁ జదువుకొనియె నని పురాణగాథ గలదు గాన నప్పు డతఁడు సూర్యుని శుశ్రూషఁ జేయుటంజేసి యాదిత్యసంపూజకా! యను సంబోధనము సేయఁబడినది. ఓ యాదిత్యసంపూజకా! చరాచరాత్మకమగుసృష్టికి నెల్లఁ దానకమై మిగుల గొప్పది యగుప్రపంచమే స్వరూపముగఁ గలనాకు భూమియే యాధారచక్రము, నీరమే మణిపూరము, కృశానుఁడే స్వాధిష్ఠానచక్రము, మారుతమే యనాహతము, అంతరిక్షమే విశుద్ధచక్రము, అంతఃకరణరూపమగు మూలప్రకృతియే యాజ్ఞాచక్రము నై విలసిల్లును. ౪౭

క. మేరు వగు బ్రహ్మదండియె
యూరయఁగా దక్షిణోత్తరాయణములు సొం
పార నిడాపింగళ లో
సూరి! పరమపదము వరసుషుమ్నకుమారా! ౪౮

టీ. సూరి! = మహావిద్వాంసుండ వగు ఓ కుమారా! మాకు ప్రియశిష్యుఁడ వగుటచేఁ బుత్త్రప్రాయుండ వయిన యో హనుమంతుఁడా!

(విరాట్పురుషుఁడ వగునాకు), మేరువు = బంగారుకొండ, బ్రహ్మదండి - ఎ - అగుక్ = బ్రహ్మదండి యను పేరు గల వెన్నెముక యైయున్నది; పొంపు ఆరక్ = లెస్సగా, అరయక్ - కాక్ = ఆలోచింపఁగా, దక్షిణోత్తరాయణములు = దక్షిణాయనము ఉత్తరాయణము నను నీ రెండయనములు, ఇడాపింగళలు=ఇడయు పింగళయు నను ప్రధాననాడులు, పరమపదము = మోక్షస్థానమే, వరసుషుమ్న = శ్రేష్ఠమగు సుషుమ్న యను నరము, అగుక్ = అయియున్నవి.

తా. బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడ వగు నో వాయుపుత్త్రా! విశ్వరూపుఁడనగు నాకు, మేరుపర్వతము వెన్నెముకగను, దక్షిణాయనము నుత్తరాయణము నను నీ రెండయనములు ఇడ పింగళ యను ప్రధాననాడులుగను, మోక్షస్థానమే సుషుమ్నానాడిగ నున్న వని ఫలితార్థము. ౪౮

సీ. అతలంబు పదములు, వితలంబు గుల్ఫముల్,
సుతలంబు జంఘికల్, సుజననివహ
నుత! రసాతలము జానువులు, దారుణ మహా
తల మూరువులు, తలాతలముఁ గటియు,
నాగలోకము మహానాభ్యధోభాగంబు,
భూర్భువస్స్వర్లోకములును నాభి
జఠరవక్షంబులు, సరిమహర్లోకంబు,
కంఠంబు, సుజనలోకంబు ముఖము

తే. మఱి తపోలోక మరయ భ్రూమధ్యమంబు
సత్యలోకంబు విపులమస్తకము సుమ్ము
విశ్వరూపధరుండ నై వెలయునాకు
జలనిధిగభీర! వీర! కేసరికుమార! ౪౯

టీ. సుజన + నివహ + వినుత = సజ్జన సమూహముచే గొని యాడఁబడువాఁడవును, జలనిధి + గభీర = సంద్రమువడువున లోఁతైన హృదయధర్మము గలవాఁడవును, వీర = మహావీరుఁడవును నగు, కేసరి కుమార = కేసరి యను వానరుని పుత్త్రుఁడ వయిన ఓ హనుమంతుఁడా! విశ్వరూప + ధరుండను + ఐ + వెలయు + నాకున్ = సర్వప్రపంచమును నాకారముగఁ బూని యొప్పుచుండెడి నాకు, అతలంబు = అతల మను భువనము, పదములు = చరణములు, వితలంబు = వితల మను లోకము, గుల్ఫముల్ = పదములమీఁదిభాగములు, సుతలంబు = సుతల మను లోకము, జంఘికల్ = జంఘలు, రసాతలము = రసాతలం బను లోకము, జానువులు = ముడుకులు, దారుణ - మహాతలము = అతిఘోరమైన మహాతల మను లోకము, ఊరువులు = తొడలు, తలాతలము = తలాతలం బనియెడి భువనము, కటియున్ = నితంబప్రదేశమును, నాగలోకము = పాతాళ లోకము, మహత్ - నాభి - అధోభాగంబు = మిగుల లోఁతగు బొడ్డునకు దిగువభాగము (పొత్తికడుపు), భూః - భువర్ - స్వర్ - లోకములును = భూలోకము భువర్లోకమును స్వర్గలోకమును, నాభి - జఠర - వక్షంబులు = పొక్కిలియు కడుపును వక్షఃస్థలమును, సరి - మహర్లోకంబు = సమమయిన మహర్లోకము, కంఠంబు = గళము, సు + జనలోకము = యోగ్యమగు జనలోకము, ముఖము = వదనము, మఱి = ఇంకను, అరయన్ = ఆలోచింపఁగా, తపోలోకము = తపోలోకంబు, భ్రూమధ్యంబు= కనుబొమల నడిపట్టు, సత్యలోకంబు = చతురాననభువనము, విపుల మస్తకము సుమ్ము = వెడఁదయైన తల సుమీ; పదునాల్గులోకములుగూడ నతని యవయవములు.

తా. మఱియు నో యాంజనేయా! విరాట్పురుషుండ నగు నాయొక్క పాదములే యతలలోకము, పాదముల మీఁదిభాగములు వితల లోకము, పిక్కలు సుతలలోకము, కాలిపొట్టలు రసాతలలోకము, తొడలు

మహాతలము, కటిప్రదేశము తలాతలము, పొత్తికడుపు పాతాళలోకము, బొడ్డు భూలోకము, కడుపు భువర్లోకము, ఉరస్స్థలము స్వర్గలోకము, మెడ మహర్లోకము, మోము సుజనలోకము, కనుబొమల నడిపట్టు తపోలోకము, శిరస్సు సత్యలోకము నై యున్నవి. ౪౯

వ. ఇట్లు సర్వాధిష్ఠానంబు సర్వపరిపూర్ణంబు నామ రూప గుణ ధర్మ కర్మ వికార రహితాఖండ సచ్చిదానంద పరబ్రహ్మంబ నైన నేను సమష్టికారణ సూక్ష్మ స్థూల శక్త్యోపాధివిశిష్టత్వంబువలన, నవ్యాకృతుం డన, హిరణ్యగర్భుం డన, విరాట్పురుషుం డన సకలజీవోపాస్యుండ నై ప్రకాశింపుదు; మఱియు వ్యష్టికారణ సూక్ష్మ స్థూలదేహోపాధి తాదాత్మ్యాభిమానంబువలనఁ బ్రాజ్ఞుం డనఁ, దైజసుం డన, విశ్వుం డన, సుషుప్తిస్వప్నజాగ్రదవస్థల ననుభవించుచు నజ్ఞానవశుండనై జీవుం డన నీశ్వరోపాసకుండనై ప్రవర్తించినచందంబునం దోఁపుదు; నీ జీవేశ్వర తత్త్వంబుల విద్యాకల్పితంబు లయ్యవిద్య, శశవిషాణ వంధ్యాపుత్త్ర గగనారవిందంబుల భంగి నాయందు నన్నెఱింగిన నభావం బగు; నట్లు గావున నింక జీవేశ్వరైక్యంబుపదేశించెద; సావధానచిత్తుండ వై యాకర్ణింపు మని యాత్మారాముం డాంజనేయున కిట్లనియె. ౫౦

టీ. ఇట్లు = ఈ ప్రకారముగ, సర్వ + అధిష్ఠానంబును = ఎల్ల జగములకు నాధార మైనదియును, సర్వ + పరిపూర్ణంబును = సమస్తభువనములయందు వ్యాపించి యున్నదియును, నామ...బ్రహ్మంబు - నామ = పేరును, రూప=ఆకారమును, గుణ = సత్త్వ రజస్త మోగుణములును లేక కామక్రోధాదులు శమదమాదులు నగు గుణములును, ధర్మ = దానము

మొదలగు ధర్మములును, కర్మ=మానసిక వాచిక కాయికము లగు కర్మలును, వికార = జనన మరణాదు లగు నానాభావవికారములును, విరహిత = లేని, అఖండ = తెంపులేని, సత్ = కాలత్రయాబాధ్యమై నిత్య మైనట్టియు, చిత్ = జ్ఞానస్వరూప మైనట్టియు, ఆనంద = సుఖాత్మక మైనట్టియు, పరబ్రహ్మంబును = పరమాత్ముఁడను, ఐన + నేను = అగు నేను, సమష్టి... వలనన్—సమష్టి = అన్నియుఁ గలసి యొకటిగా నున్న, కారణ + సూక్ష్మ + స్థూల + శరీర = కారణదేహము లింగదేహము స్థూలదేహము నను, ఉపాధి = మూఁడువిధములయిన యుపాధులతో, విశిష్టత్వంబు వలనన్ = కూడుకొని యుండుటవలన, (క్రమముగ) అవ్యాకృతుండు - అనన్ = అవ్యాకృతుఁడు (అవ్యక్తుఁడు) అనియు, హిరణ్యగర్భుఁడు అనన్ = హిరణ్యగర్భుఁడనియు, విరాట్పురుషుండు అనన్ = విరాట్పురుషుఁ డనియు, సకల + జీవ + ఉపాస్యుఁడను ఐ = ఎల్ల చేతనులచే సేవింపఁబడుచున్నవాఁడ నగుచు, ప్రకాశింపుదున్ = తేజరిలుచుందును; మఱియున్=ఇంతియకాక, వ్యష్టి...వలనన్ - వ్యష్టి = వేర్వేఱ యుండు నొండొండు జీవునియొక్క, కారణ + సూక్ష్మ + స్థూల + దేహ = కారణశరీరము లింగశరీరము స్థూలశరీరము ననియెడు, ఉపాధి = త్రివిధోపాధులయందును, తాదాత్మ్య + అభిమానంబువలనన్ = అవియే నేనను నభిమానముచేత, ప్రాజ్ఞుండు అనన్ = ప్రాజ్ఞుఁడనియు, తైజసుండు అనన్ = తైజసుఁడనియు, మను, ఎఱింగినన్ = తెలిసికొనె నేని, అభావంబు = లేనిది, అగున్ = ఔను; అట్లు కావునన్ = అట్లగుటంజేసి, ఇంకన్ = ఈ పైని, జీవ + ఈశ్వర + ఐక్యంబు = మలినసత్త్వప్రధాన మగు నవిద్యయుపాధిగఁ గలజీవునకును, శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుఁ డగు నీశ్వరునకును నేకత్వమును, ఉపదేశించెదను = తెలిపెదను, సావధాన + చిత్తుండవు = ఏకాగ్రమైన మనస్సు గలవాఁడవు, ఐ = అగుచు, ఆకర్ణింపుము = ఆలింపుము, అని = ఇట్లు పలికి, ఆత్మారాముఁడు = తనలోఁ దా నానందిం

చుచు రమించెడు శ్రీరాముఁడు, ఆంజనేయునకున్ = హనుమానునకు, ఇట్లు అనియెన్ = ఈ రీతిని వచియించెను.

తా. నిఖిలప్రపంచమునకు నేకకారణం బగుటచే నాధారభూత మై, ఎల్లయెడల నిండియున్నది యై, వేఱు, ఆకారము, గుణములు, వర్ణాశ్రమాది ధర్మములు మానసికవాచికకాయికము లైన కర్మలు మొదలగు ప్రకృతి యొక్క వికృతు లెవ్వియును లేక యపరిచ్ఛిన్న మై నిత్యంబును జిద్రూపంబు నానందాత్మకంబు నగు పరబ్రహ్మము నైన నేను నిఖిలజీవ సమూహము యొక్క కారణదేహరూప మగు నుపాధితోఁ గూడుటవలన నవ్యాకృతుఁడ ననియు, సమష్టిలింగదేహాత్మక మగు నుపాధితోఁ గూడియుండుటవలన హిరణ్యగర్భుఁడ ననియు, సమష్టిస్థూలదేహరూపమగు నుపాధితోఁ గూడుట వలన విరాట్పురుషుఁడననియుఁ జెప్పఁబడుచు నెల్లజీవులచే నారాధింపఁ బడుచున్నవాఁడ నై తేజరిల్లుచుంటిని; ఇంతియకాక వేర్వేఱు జీవులయొక్క యొక్కొక్క కారణశరీరరూప మగు నుపాధియందు నదియే నేనను నభి మానము నుంచుటచే (వ్యష్టికారణశరీరోపాధికుండ నగుటచే) ప్రాజ్ఞుఁడ ననియు, వ్యష్టిసూక్ష్మదేహమునందుఁ దాదాత్మ్యరూపమగు నభిమానమును వహించుటవలనఁ దైజసుండ ననియు, వ్యష్టిస్థూలదేహమునందుఁ దాదా త్మ్యము నొంది యభిమానమును బూనుటచే విశ్వుఁడననియుఁ బలుకఁబడుచు నిందు వ్యష్టికారణశరీరాభిమాని నైనప్పుడు గాఢనిద్రను, వ్యష్టిలింగ దేహాభిమాని నైనప్పుడు స్వప్నావస్థను, వ్యష్టిస్థూలదేహాభిమాని నైనప్పుడు జాగ్రదవస్థను ననుభవించుచు మలినసత్త్వప్రధాన మగు నవిద్యకు లోఁబడి జీవుఁ డను పేరుతో శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుం డైన పరమేశ్వరుఁ నారాధించుచున్నవాఁడ నై యున్నయట్లు గన్పట్టుచుంటిని. ఇట్లు వివ రింపఁబడిన జీవునియొక్కయు నీశ్వరునియొక్కయు స్వరూపములు మూలా జ్ఞానముచేఁ గల్పింపఁబడినవి; ఆ మహామాయ కుందేటికొమ్ము వడువునను, గొడ్రాలికొమరుని తీరునను, మింటితామరచందమున మిథ్యాభూతం బగు

టచే నన్నుఁ దెలిసికొనినంతన నాయందు విలీనంబై శూన్యంబగును; గావున నీమీఁద నాజీవునకు నీశ్వరునకు నేకత్వమును బోధించెదను. వేఱుతలంపు మాని యాలింపు మని శ్రీరామచంద్రుం డంజనానందనునకు వక్ష్యమాణ ప్రకారంబున వచించెను. ౪౦

అవ. సమష్ట్యుపాధివిశిష్టత్వమువలన నీశ్వరుఁ డనియు వ్యష్ట్యుపాధి తాదాత్మ్యాభిమానముచేత జీవుఁ డనియుఁ నొక్క పరమాత్ముఁడే చెప్పఁబడుచున్నవాఁడు గాన, నా జీవే శ్వరులకు భేదము వాస్తవముగ లేదని ప్రతిపాదించుచున్నారు.

క. కలశాంబుదములఁ దద్గత
జలములఁ గడఁద్రోయ నాకసము ప్రతిబింబం
బులు లేమి నొకటి యై యి
మ్ములనుండు నఖండమై యమూర్తం బగుటన్. ౫౧

టీ. కలశ + అంబుదములన్ = కడవను మబ్బును, తత్ + గత + జలములన్ = ఆ కుండయందును మొగులునందును నున్న నీళ్లను, కడన్ + త్రోయన్ = తీసివేయుచుఁగా, ప్రతిబింబంబులు = ఆ కుండయందలి నీటి యందును మేఘమునందలి నీటియందును ప్రతిఫలించిన మింటియొక్క నీడలు, లేమిన్ = లేకపోవుటచేత, ఆకసము = మిన్ను, అమూర్తంబు = రూపము లేనిది, అగుటన్ = అయియుండుటచేత, అఖండము - ఐ = భిన్నము కానిదై, ఒకటి - ఐ = అద్వితీయమై, ఇమ్ములన్ - ఉండును = అంతటను వ్యాపించియుండును.

తా. కుండను మొగులును నీరెంటియందున్న నీళ్లను తీసివేయఁగా కుండయందును మేఘమునందును గల యుదకములయందుఁ బ్రతిఫలించిన యాకసముయొక్క ప్రతిబింబములు లేకపోవుటచేత మిన్ను రూపము

లేనిది గాన నపరిచ్ఛిన్నమైనదియు నద్వితీయమైనదియు నగుచు నెల్లయెడల వ్యాపించి యుండును. ౫౧

క. ఆవిధమునఁ దనువుల మా
యావిద్యలఁ దొలఁగఁద్రోయ నంతటిలోనన్
జీవేశ్వరులు వెలుంగమిఁ
గేవలతత్త్వంబు వెలుఁగుఁ గీశాధీశా! ౫౨

టీ. కీశ + అధీశా=ఓ ప్లవంగపుంగవా, ఆ విధమునన్ = మీఁదఁ జెప్పఁబడిన దృష్టాంతములరీతిని, తనువులన్=జీవునకు నీశ్వరునకు నుపాధులై వేఱువేఱుగను నన్నియుఁ గలసి యొకటిగను నున్న (వ్యష్టిగను సమష్టిగను నున్న) స్థూలసూక్ష్మకారణదేహములను, మాయా + అవిద్యలన్ = శుద్ధసత్త్వప్రధానమై ఈశ్వరునకుఁ గారణోపాధియైన మాయను, మలినసత్త్వప్రధానమై జీవునకుఁ గార్యోపాధియైనయవిద్యను, తొలఁగన్ + త్రోయన్ = విడిచివేయఁగా, అంతటిలోనన్ = విడిచినవెంటనే, జీవేశ్వరులు=జీవుఁడును ఈశ్వరుఁడును, వెలుంగమిన్=మాయా విద్యలయందుఁ బ్రతిఫలింపక పోవుటవలన, కేవలతత్త్వంబు=అపరిచ్ఛిన్నమై యేకమైన పరబ్రహ్మము, వెలుఁగున్ = ప్రకాశించుచుండును.

తా. ఓ ప్లవగోత్తమా! మీఁదఁ జెప్పిన దృష్టాంతమురీతి నీశ్వరుని సంబంధమయి సమష్టిగ నున్న స్థూలసూక్ష్మకారణశరీరములను, జీవుని సంబంధములై వ్యష్టిగ నున్న స్థూలసూక్ష్మకారణశరీరములను, నీశ్వరునకు నుపాధియైన మాయను, జీవునకు నుపాధియైన యవిద్యను, వివేచనాపూర్వ మగుజ్ఞానముచే నివి యజ్ఞానకల్పితములు గాని వాస్తవములు గావని తెలిసికొని విడిచినతోడనే యాజీవుఁడును నీశ్వరుఁడును బ్రతిబింబింపక పోవుటవలన నద్వితీయమైనపరబ్రహ్మ మొక్కటియే ప్రకాశించుచు నుండును.

వ. అది యెట్లంటేని.

టీ. ఆపరబ్రహ్మము ప్రకాశించుట యేతీరున ననిన.

క. కలశజలప్రతిబింబం
బులకు విలక్షణ మసంగమును నమూర్తం బై
యలరు ఘటాకాశము తద్
జ్ఞులకు మహాకాశ మదియెసుమీ వివరింపన్. ౫౩

టీ. కలశ + జలప్రతిబింబంబులకున్ = కుండకును నాకుండయందలి నీటికిని, నా నీటియందుఁ బ్రతిఫలించిన మింటికిని, విలక్షణ = భిన్న మయి నదియు, అసంగము = దేనితోను గలియనిదియు, అమూర్తంబు = రూపము లేనిదియు, ఐ = అగుచు, ఘటాకాశము = కుండయందుండు మిన్ను, అలరున్ = ఒప్పును, వివరింపన్ = వివేచన చేయఁగా, తద్జ్ఞులకున్ = వస్తుతత్త్వము నెఱింగిన విద్వాంసులకు, అదియె = ఆ కుండయందలి యాకసమే, మహాత్ + ఆకాశము సుమి = అపరిచ్ఛిన్న మగు మిన్ను సుమీ.

తా. కుండకును గుండయందుఁ గల నీటికిని నా నీటియందుఁ బ్రతిఫలించిన మిన్నునకును భిన్నమైనదియు, నేపదార్థముతోను గలయిక లేనిదియు, రూపవిహీనమును నగుచుఁ గుండయందుండు మిన్ను వెలుఁగొందును. పరిశీలింపఁగా వస్తుతత్త్వము నెఱింగిన విద్వాంసులకుఁ గుండయందలి యాకసమే యపరిచ్ఛిన్నమగు మిన్నగును. ఘటాకాశమే మహాకాశము.

తే. క్రమముతో స్థూలసూక్ష్మకారణములకును
సుకరజాగరణస్వప్నసుషుప్తులకును
ప్రభువు లగు విశ్వతైజసప్రాజ్ఞులకు వి
లక్షణుం డగు నాత్ముండు సాక్షి యగుచు. ౫౪

టీ. స్థూల + సూక్ష్మ + కారణములకున్ = తొల్లి వివరింపఁబడిన స్వరూపము గల స్థూలశరీరములకును లింగశరీరములకును గారణశరీరములకును, సుకర + జాగరణ + స్వప్న + సుషుప్తులకును - సుకర = అశరీర

త్రయముచే సులభముగాఁ జేయఁదగిన (సులభముగఁ బొందఁదగిన), జాగరణ = స్థూలశరీరముయొక్క యవస్థయగు మెలఁకువకును, స్వప్న = లింగశరీరావస్థ యగు కలకును, సుప్తులకును=కారణదేహావస్థ యగు సుషుప్తికిని, ప్రభువులు = అభిమానులగుటచేత నధిపతులు, అగు = ఐన, విశ్వ + తైజస + ప్రాజ్ఞులకున్ = జాగ్రదవస్థాభిమాని యగు విశ్వునకును, స్వప్నావస్థాభిమాని యగు తైజసునకును, సుషుప్త్యవస్థాభిమాని యగుప్రాజ్ఞునకును, సాక్షి - అగుచున్ = కనుఁగొనుచున్నవాఁడై, ఆత్ముండు = పరమాత్ముఁడు, విలక్షణుండు = భిన్నుఁడు, అగున్ = ఔను.

తా. తొలుతఁ జెప్పఁబడినరీతిని పంచీకరణము చేయఁబడి వ్యక్తంబగు స్థూలశరీరమునకును, పంచీకరణము చేయఁబడక యవ్యక్తంబైన లింగదేహమునకును, నజ్ఞానావచ్ఛిన్నచైతన్యరూపం బగు కారణశరీరమునకును, నీమూఁడుశరీరములయొక్క యవస్థలగు మెలఁకువ-కల-సుషుప్తియను నీమూఁడు దశలకును సక్రమముగ నీ మూఁడవస్థలకును నభిమానులగు విశ్వతైజసప్రాజ్ఞులనఁబడు జీవులకును సాక్షిభూతుఁడైనపరమాత్ముఁడు భిన్నుఁడై యొప్పును.

తే-గీ. అతఁడు కూటస్థుఁ డనఁ బ్రత్యగాత్ముఁ డనఁగ
నక్షరుం డనఁ బురుషుఁ డనంగ సాక్షి
యనఁగ విలసిల్లుఁ దాఁ బరమాత్ముఁ డగుచుఁ
బ్రకృతిపురుషుల నంటక పరమపురుష. ౫౫

టీ. పరమ + పురుష = "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అనుటచే పురుషోత్తముఁడు హృదయమునందుఁ గలవాఁడా! ఓ హనుమానుఁడా! అతఁడు = పరమాత్ముఁడు, కూటస్థుఁడు అనన్ = మహత్తత్త్వము మొదలు శరీరముదనుకఁ గల సంఘాతరూపమగుకూటమునందు నంతర్యామి రూపమున నుండువాఁడు గావునఁ గూటస్థుఁ డనియు, ప్రత్యగాత్ముఁడు + అనన్ + కన్ = మహదాదికార్యకారణ

సంఘాతమునకు విలక్షణమైన స్వరూపము గలవాఁడుగానఁ బ్రత్యగాత్ముఁ డనియు, అక్షరుండు + అనక్ = 'న క్షరతీ త్యక్షరః' అను వ్యుత్పత్తిచే నాశము లేనివాఁడుగాన నక్షరుఁ డనియు, పురుషుండు + అనన్ + కన్ = పురి శేరత ఇతి పురుషః'' అను వ్యుత్పత్తిచే హృదయగుహారూప మగుపురమునందు నంతర్యామి యై యున్నవాఁడు గాన పురుషుఁ డనియు, సాక్షి + అనక్ + కక్ = మనోబుద్ధిచిత్తాఽహంకారములయొక్కయు సర్వేంద్రియములయొక్కయు వ్యాపారముల నెల్లఁ దటస్థుఁడై కనుఁగొను చుండువాఁడు గాన సాక్షి యనియు, తాక్ = తాను, ప్రకృతిపురుషలక్ = మూలప్రకృతిని జీవునిని, అంటక = ముట్టక (ప్రకృతిపురుషులకు విలక్షణుఁడై), పరమాత్ముఁడు అగుచున్ = పరిశుద్ధాత్ముఁడై, విలసిల్లున్ = తనకుఁ దా వెలుఁగొందును.

తా. కార్యకారణసంఘాతవిలక్షణుఁడైన యా యాత్ముఁడు మహత్తత్త్వము మొదలు శరీరముదనుకం గల ప్రకృతివికృతిసమూహరూపమైనకూటమునం దుండువాఁడుగానఁ గూటస్థుఁ డనియు; నాప్రకృతివికృతిసమూహమునకు వేఱుగ నుండువాఁడు గానఁ బ్రత్యగాత్ముఁ డనియు, నాశము లేనివాఁడు గాన నక్షరుఁ డనియు, జీవులహృదయపుండరీకరూప మగు పురమునం దుండువాఁడు గానఁ బురుషుఁ డనియు, ప్రాణికోటుల మనోబుద్ధిచిత్తాఽహంకారములయొక్కయు సర్వేంద్రియములయొక్కయు వ్యాపారములను దటస్థుఁడై చూచువాఁడుగాన సాక్షి యనియుఁ జెప్పఁబడుచుఁ దాను కేవల నిత్యనిరంజనశుద్ధబుద్ధాఖండాత్ముఁడై ప్రకృతిపురుషులసంబంధము లేక స్వయంప్రకాశమానుఁడై యొప్పును. ౫౫

క. జలదజలప్రతిబింబం
బులకు విలక్షణ మసంగ మమూర్తం బై
యలరు మహాకాశము కే
వల మై వల మై కవిప్రవరభావజ్ఞా! ౫౬

టీ. కవి + ప్రవర + భావ + జ్ఞ = సదసద్వివేకము గల విద్వాంసులయభిప్రాయము నెఱింగినవాఁడా, మహాకాశము = అపరిచ్ఛిన్నమైన మిన్ను, జలద + జల + ప్రతిబింబంబులకున్ = మొగులునకు మొగులునందలి నీటికి - నా నీటియందుఁ బ్రతిఫలించిన తన నీడకును, విలక్షణము = భిన్నమైనదియు, అసంగము = తనలో నుండు పదార్థముల సంపర్కము లేనిదియు, అమూర్తంబు - ఐ = రూపము లేనిదియు నగుచు, కేవలము-ఐ= ఏకమగుచు, వలను-ఐ = శ్రేష్ఠదియు నగుచు, అలరున్ = ఒప్పును.

తా. మహావిద్వాంసుల తాత్పర్యమును దెలిసికొనువాఁడ వగు నో యాంజనేయా! అపరిచ్ఛిన్నమైన యాకసము, మేఘమునకు మేఘముల యందలి యుదకమునకు నాయుదకమునందలి తన ప్రతిబింబమునకు భిన్నమును, స్వాంతస్థితము లగుపదార్థములసంపర్కము లేనిదియు, నిరాకారమును నద్వితీయమును ననంతము నగుచు నొప్పును. ౫౭

క. జీవసమష్టితనుత్రితి
యావస్థాత్రితయములకు నఖిలాత్మకమా
యావిప్రాణవిరాట్పురు
షావళికిన్ సాక్షి యై పరాత్ముం డొప్పున్. ౫౮

టీ. జీవ + సమష్టి + తను + త్రితయ + అవస్థా + త్రితయములకున్ - జీవసమష్టి = అన్నియుఁ గలసి యొకటిగా నుండు సకలజీవుల యొక్క, తనుత్రితయ = స్థూలసూక్ష్మకారణశరీరములకును, అవస్థాత్రితయములకున్ = జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడవస్థలకును, అఖిల... ఆవళికిన్ - అఖిలాత్మక = సమష్టిజీవస్వరూపుఁడైన, మాయావి = కారణదేహోపాధికుఁడైనయవ్యాకృతుఁడు, ప్రాణ = లింగదేహోపాధికుఁ డగు హిరణ్యగర్భుఁడు, విరాట్పురుష = స్థూలదేహోపాధికుఁడైన, విరాట్పురు

షుఁడు, ఆళికిన్ = అను నీ ఈశ్వరాంశలకును, సాక్షియై = ద్రష్ట యగుచు, పరాత్మండు = పరమాత్ముఁడు, ఒప్పున్ = ప్రకాశించును.

తా. ఇదివఱకు వివరింపఁబడినలక్షణములు గల వ్యష్టిరూపము లగు స్థూలసూక్ష్మకారణ శరీరములకును, నీశరీరముల సంబంధ మైన జాగ్రత్స్వప్న సుషుప్తులకును, నీశరీరములయందును నవస్థలయందును తాదాత్మ్యము పొంది యభిమానము గల విశ్వతైజసప్రాజ్ఞు లను జీవులకును, సమష్టికారణ శరీరోపాధికుఁ డైన వ్యాకృతునకును, సమష్టిసూక్ష్మశరీరాభిమాని యైన హిరణ్యగర్భునకును, సమష్టిస్థూలశరీరాభిమాని యైన విరాట్పురుషునకును అనఁగా వ్యక్తరూపమున వ్యక్తాత్మకము నగు సమస్తప్రపంచ సృష్టికిని నాయావృత్తులకును సాక్షి యగుచు పరమాత్ముఁ డొప్పును. ౫౪

తే. అతఁడు పరమాత్ముఁ డనఁగ బ్రహ్మం బనంగ
నలఘుపరిపూర్ణచైతన్య మనఁగ నొప్పు
నిర్వికల్పుఁ డసంగుండు నిర్వికారుఁ
డద్వితీయుఁ డనంతుఁ డై యాంజనేయ ! ౫౫

టీ. ఆంజనేయ = ఓ అంజనానందనా ! అతఁడు = పైని జెప్పిన రీతిని సమస్తప్రపంచసృష్టికి ద్రష్ట యగు నా యాదిదేవుఁడు, పరమాత్ముఁడు అనన్ - కన్ = జీవుఁడు ఈశ్వరుఁడు అగు నీ యాత్మలకు నాశ్రయ మైన వాఁడు గాన పరమాత్ముఁ డనియు, బ్రహ్మంబు - అనన్ - కన్ = సర్వ వ్యాపక మగుటచేత బ్రహ్మ మనియు, అలఘు + పరిపూర్ణ + చైతన్యము - అనన్ - కన్ = అఖండమై యంతటను నిండియున్న శుద్ధచైతన్య మనియు, (శ్రుతులయందుఁ జెప్పఁబడుచు) నిర్వికల్పుఁడు = ఏడు వికల్పములు లేని వాఁడును, అసంగుండు = ప్రకృతివికృతుల సంపర్కము లేనివాఁడును, లేక (అనంగుండు = ఆకారము లేనివాఁడును, అనియు పాఠాంతరము), నిర్వికారుఁడు = జననమరణాదు లగు భావవికృతులు లేనివాఁడును, అద్వి

**తీయుఁడు** = తనకంటె రెండవది లేనివాఁడును, **అనంతుఁడు** = నాశము లేనివాఁడును, ఐ = అగుచు, ఒప్పును.

**తా.** సర్వద్రష్ట యగు నాపరమాత్ముఁడు, "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః" అను శ్రుతివలన నెట్టి వికల్పములును లేనివాఁడును, ప్రకృతివికృతిరూపము లగు సకలపదార్థములయొక్క సంపర్కము లేనివాఁడును, జననమరణాదికము లైన భావవికారములు లేనివాఁడును, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుఁడును, నపరిచ్ఛిన్నుఁడు నగుచు, తురీయస్వరూపుఁ డనుటచేఁ బరమాత్ముం డనియు, సర్వవ్యాపకుఁ డగుటచే బ్రహ్మ మనియు, నఖండమై యంతటను నిండియున్న శుద్ధచైతన్య మనియు, నుపనిషత్తులయందుఁ జెప్పఁబడుచుఁ బ్రకాశించుచున్న వాఁడు.

వ. అట్లు గావునన్.

**టీ.** పరమాత్ముఁడు జీవేశ్వరాదిభేదశూన్యుఁడై యద్వితీయుఁడై **స్వయంప్రకాశమానుఁ డగుటవలన.**

సీ. కలశమేఘములఁ దక్షద్గతజలంబులఁ దదీ
యప్రతిబింబద్వయంబు నొకటఁ
గడకుఁ ద్రోచిన ఘటాకాశ మహాకాశ
ములకు నేకత్వంబు గలిగినట్లు
వ్యష్టిసమష్టి దేహములను ధీమాయ
లను జీవపరమేశులను విచార
దృష్టిచేఁ గని నిషేధించినయెడఁ బ్రత్య
గాత్మన కప్పరమాత్మనకును
తే. సమరసైక్యంబు ఘటియించు సత్యమనుచు
నిఖిలవేదాంతశాస్త్రముల్ నిశ్చయించు

గురువు లి ట్లుపదేశింపుచుందురు బుధులకు
ననఘ ! యదియె మదీయదిక్వ్యాఖ్యయంబు. ౫౯

టీ. కలశ + మేఘములన్ = కుండను మొగిలును, తద్గతజలంబులన్ = ఆ కుండయందును మొగులునందు నుండు నీళ్లను, తదీయ + ప్రతిబింబ + ద్వయంబుఁ = ఆ నీళ్లయందుఁ బ్రతిఫలించిన మింటియొక్క నీడల రెంటిని, ఒకటఁ = ఏకకాలమునందు, కడకుఁ = ఒక దిక్కునకు, త్రోచినఁ = వైచినయెడ, ఖిలాకాశ + మహాకాశములకుఁ = కుండయందును నాకసమునందలి మేఘమునందునుఁ బ్రతిఫలించిన మిన్నుల రెండిటికిని, అపరిచ్ఛిన్నమగు నాకసమునకును, ఏకత్వంబు=అభిన్నత్వము (భేదము లేకపోవుట), కలుగునట్లు = సంభవించుపగిదిని, వ్యష్టి + సమష్టి + దేహములను = జీవులయొక్క వేఱువేఱుగ నుండు స్థూలసూక్ష్మకారణశరీరములను, ఈశ్వరునియొక్క అన్నియుఁ గలసి యొకటిగా నుండు స్థూలసూక్ష్మకారణశరీరములను, ధీ + మాయలను = జీవునకు నుపాధి యగు నవిద్యను, నీశ్వరునకు నుపాధి యగు మాయను, జీవ + పరమేశులను= అవిద్యయందుఁ బ్రతిఫలించినజీవుని మాయయందుఁ దోచెడు నీశ్వరునిని, విచార + దృష్టి చేఁ = వేదాంతవాక్యములయర్థమును లెస్సగ నాలోచించుటవలనఁ గలిగిన వాస్తవజ్ఞానము చేత, కని = పరికించి, నిషేధించినయెడఁ = "నేతి నేతి" అను మొదలగు వాక్యములనుబట్టి, ఇవి యన్నియు నజ్ఞానకల్పితము లని విడిచినచో, ప్రత్యగాత్మునకున్ = జీవేశ్వరరూప మగు ప్రతిబింబచైతన్యమునకును, ఆ + పరమాత్మునకును = బింబభూత మగు బ్రహ్మచైతన్యమునకును, సమరస + ఐక్యంబు = అఖండైకరసం బగు నభేదము, ఘటియించును = సమకూడును; సత్యము - అనుచు = ఇది నిజ మని, నిఖిలవేదాంతశాస్త్రములు = సమస్తములైన యుపనిషత్తులును దదర్థప్రతిపాదకము లైన స్మృతులును, నిశ్చయించున్= సిద్ధాంతము చేయుచున్నవి; గురువులు = పెద్దలు, ఇట్లు = మీఁదఁ జెప్పిన

రీతిని, బుధులకున్ = జ్ఞానులకు, ఉపదేశింపుదురు = ఉపదేశ మొనరించు చున్నారు, ఇదియె = ఇట్లు చెప్పఁబడిన యర్థమే, మదీయ + దివ్య + ఆశయంబు = నాసంబంధ మగు నుత్తమమైన తాత్పర్యము.

తా. కడవను మబ్బును, నీ రెంటియందున్న నీళ్లను, నీ నీళ్లయందుఁ దోపట్టిన మింటియొక్క నీడలను రెంటిని విడిచినయెడల ప్రతిబింబాకాశములు ప్రతిబింబాధారమగు భూతాకాశము నొక్కటియే యైనట్లు వ్యష్టిగను సమష్టిగ నుండు శరీరత్రయమును, వ్యష్టికిఁ గారణ మైనయవిద్యను, సమష్టికిఁ గారణమైన మాయను, నవిద్యోపాధికుఁ డయిన జీవుని, మాయోపాధికుఁ డయిన ఈశ్వరుని నుపనిషద్వాక్యార్థపర్యాలోచనచే లెస్సగఁ బరికించి యీభేదము లెల్ల నజ్ఞానకల్పితములుగాని వాస్తవములు గావని నిశ్చయించి యాభేదదృష్టిని విడనాడినచో, జీవుఁడు ఈశ్వరుఁడు నను భేద మిసుమంతయు లేక సర్వనిషేధావధిభూతుఁ డొక్కపరమాత్ముఁడే గాని వేఱొండు లేదను సర్వాత్మభావన యలవడును; ఇది నిక్కవం బని యుపనిషత్తులును దదర్థోపబృంహణము లగు స్మృతులును సిద్ధాంతము సేయుచున్నవి. మహాఋషులుగూడఁ దమ శిష్యులకు నిట్లే బోధించిరి. నాయొక్క ముఖ్యతాత్పర్యముగూడ నిదియేసుమీ ఓ యాంజనేయా! యని ఫలితము. ౫౯

సీ. పరఁగ శరావకుంభక నామరూపముల్
త్రోచి మ న్నొకటిగాఁ జూచుపగిది
ఘటతటాకముల నొక్కటి నిషేధించి త
ద్గతజల మొకటిగాఁ గాంచుకరణి
దీపప్రదీపవర్తియుగ మ్మపహరించి త
త్తేజంబు నొకటిగాఁ దెలియుభాతిఁ
గలశగృహంబులఁ గడనుంచి దానిలోఁ
గలమింటి నొకటిగాఁ దలఁచుకీతి

తే. బాధ్యజీవేశ్వరత్రయోపాధియుగముఁ
ప్రాకటవివేకదృష్టి నిరాకరించి
తనరుపరిపూర్ణశుద్ధచైతన్య మొకటి
గా విలోకింపవలయు మేధావి యనఘ. ౬౦

టీ. అనఘ = కామాదిదోషములు లేనివాఁడా ! శరావ + కుంభక + నామరూపముల్ = మూఁకుడు కడవ అనియెడు పేరులను - వీని యాకారములను, త్రోచి = విడిచి, పరఁగన్ = వాస్తవముగ, మన్ను = మట్టి, ఒకటి కాన్ = ఒకటియే యని, చూచుపగిదిన్ = కనుంగొనురీతిని, ఘట + తటాకములన్ = కడవను చెఱువును, ఒక్కటన్ = ఒక్కతఱిని, నిషేధించి = పరిత్యజించి, తత్ + గత + జలము = ఆకడవయందును చెఱువునందు నున్న నీటిని, ఒకటి + కాన్ = ఒక్కటియే యని, కాంచుకరణిన్ = పరికించువిధమునను, దీప + ప్రదీప + వర్తి + యుగము = చిన్నదివ్వెయొక్కయు పెద్దదీపముయొక్కయు వత్తులను రెండిటిని, అడంచి = విడిచి, తత్ + తేజంబును = ఆరెంటియొక్క కాంతిని, ఒకటి గాన్ = ఏకమైనదిగ, తెలియుభాతిన్ = ఎఱుంగునట్లును, కలశ + గృహంబులన్ = కడవను ఇంటిని, కడనుంచి = వదలిపెట్టి, దానిలోన్ = ఆ కడవయందును గేహమునందును, కలమింటిన్ = వ్యాపించియున్న యాకసమును, ఒకటి కాన్ = ఏకముగ, తలఁచురీతిన్ = భావించుపగిదిని, బాధ్య...మున్ - బాధ్య = మాయాకల్పితము లగుటచే నశ్వరము లగు, జీవ = జీవునియొక్కయు, ఈశ్వర = ఈశ్వరునియొక్కయు, త్రయ = స్థూలసూక్ష్మకారణరూపములైన, ఉపాధి = ఉపాధులయొక్క, యుగమున్ = రెంటిని, ప్రాకట + వివేక + దృష్టిన్ = స్పష్టమగు సదసద్వివేచనాత్మకమైన చూడ్కిచేత, నిరాకరించి = పరిత్యజించి, తనరు + పరిపూర్ణ + శుద్ధ + చైతన్యము = స్వయంప్రకాశమును నంతట నిండియు

న్నదియు - మాయాసంబంధము లేనిదియు నగుచిదాత్మను, మేధావి=జ్ఞాని, ఒకటిగాన్ = ఏకముగా, విలోకింపవలయున్ = వీక్షింపఁదగును.

తా. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అను మొదలగు శ్రుతిచేత మూఁకుఁడు, కడవ అను మొదలగు మృణ్మయ పాత్రవిశేషముల యాయాపేరులను నాకృతులను విడిచినచో మట్టి ఒక్కటియే కాఁబడినట్లును, కడవ చెఱువు మొదలగువానిని మాని వానియందలి నీర మేక మని యెంచినట్లును, చిన్నదీపము పెద్దదీపములయొక్క వత్తుల రెంటిని విడనాడినచో నావత్తులనుబట్టి వెలుఁగుచున్నదీప్తి యొక్కటి యగునట్లును కడవ యిల్లు మొదలగువాని నెన్నక వానియందలియాకస మొక్కటియే యని తలఁచువిధమునను, అవిద్యాప్రతిబింబిత మగు జీవ చైతన్యముయొక్కయు, మాయాప్రతిఫలిత మగు నీశ్వరచైతన్యముయొక్క యు, స్థూలసూక్ష్మకారణశరీరరూపము లగు నుపాధులను బరిగణింపక సదసద్వివేచనాపూర్వక మగు జ్ఞానదృష్టిచే విచారించినచో స్వయంప్రకాశ మై, సర్వవ్యాపక మై, మాయాసంబంధము లేని చిదాత్మ యొక్కటిగా మహాజ్ఞానికిఁ గన్పట్టును. ౬౦

తే. "బాధ్యజీవేశ్వరత్రయోపాధియుగము
ప్రాకటవివేకదృష్టి నిరాకరించి
తనరుపరిపూర్ణశుద్ధచైతన్య మొకటి
గా విలోకింపవలయు మేధావి యనఘ."

అని యిట్లు చెప్పఁబడిన యర్థమునకుఁ బ్రమాణభూత మగు "తత్త్వమసి" యను ఛాందోగ్యోపనిషత్తునందలి మహావాక్యార్థమును సోపపత్తికముగా వివరించుచున్నారు.

వ. ఇట్లు సమష్టివ్యష్టిశరీరావస్థాత్రితయంబు విశ్వతైజసప్రాజ్ఞ నామకంబు నైనజీవచైతన్యంబుఁ గించిజ్జ్ఞత్వకర్తృత్వ

భోక్తృత్వాదిగుణంబులుం గూడి త్వంపదవాచ్యార్థంబు, దేహత్రయవిలక్షణంబు నవస్థాత్రయ సాక్షియుఁ, బంచకోశవ్యతిరిక్తంబు, సచ్చిదానందస్వరూపంబు నైనకూటస్థచైతన్యమాత్రంబు, త్వంపదలక్ష్యార్థంబు, సమష్టిశరీరావస్థాత్రయాత్మక మైన మాయయు, వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకం బైనమాయాప్రతిబింబేశ్వరచైతన్యంబు, సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వాదిగుణంబులుం గూడి తత్పదవాచ్యార్థంబు, దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేద శూన్యంబు స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహితంబు, సత్యజ్ఞానానందస్వరూపంబు నైన పరిపూర్ణాద్వితీయబ్రహ్మచైతన్యమాత్రంబు తత్పదలక్ష్యార్థంబు, విరుద్ధధర్మంబు లైన వాచ్యార్థంబులతో లక్ష్యార్థంబుల కైక్యంబు సంభవింపదు గావున, నొక్క దేశంబున నొక్క కాలంబున నొక్క రూపంబున నున్నపురుషుని వేఱొక్క దేశంబున మఱియొక కాలంబున నొండొక రూపంబుచే నుండం గనుంగొని, తద్దేశ తత్కాల తదవస్థావిశేషంబుల నేతద్దేశైతత్కాలైతదవస్థావస్థా విశేషంబుల గణించి లక్షింపక లక్ష్యభూతుం డైనయతం డితం డని యొక్కనిఁగా నెఱింగిన తెఱంగున జహదజహల్లక్షణచేత మాయికంబు లైన యుభయవాచ్యార్థంబుల నిషేధించి, ద్వివిధలక్ష్యార్థచైతన్యంబుల కైక్యంబు దెలియు టిదియ యసిపదార్థం బిదియె జీవేశ్వరైక్యజ్ఞానం బిదియె మహావాక్యార్థం బింక జీవబ్రహ్మైక్యం బుపదేశించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె.

టీ. ఇట్లు = పైని జెప్పఁబడిన విధమున, వ్యష్టి = అవిద్యోపాధికము లగుటచే వేఱువేఱుగ నున్న, శరీర = స్థూలములు సూక్ష్మములుఁ గారణములు నను మేనులయొక్కయు, అవస్థా = జాగ్రత్తు స్వప్నము సుషుప్తి యను నవస్థలయొక్కయు త్రితయంబు = మూఁడును, విశ్వ + తైజస + ప్రాజ్ఞ + నామకంబు = వ్యష్టిస్థూలశరీరమునందును వ్యష్టిజాగ్రదవస్థయందును నభిమాని యైన విశ్వుఁడు, వ్యష్టిసూక్ష్మశరీరమునందును వ్యష్టిస్వప్నావస్థయందును నభిమానియైన తైజసుఁడు, వ్యష్టికారణశరీరమునందును వ్యష్టిసుషుప్తియందును నభిమాని యైన ప్రాజ్ఞుఁడు అను పేరు గలది, ఐన + జీవచైతన్యంబును = అగుజీవాత్మయు, కించిజ్జ్ఞత్వ + కర్తృత్వ + భోక్తృత్వ + ఆది + గుణంబులును = ఇంచుక తెలిసికొనుట- నేను కర్తననుకొనుట - నేను భుజించువాఁడ నను తలఁపు లోనుగాఁ గల ధర్మములును, కూడి = కలసి, త్వం + పద + వాచ్య + అర్థంబు = తత్త్వమసి యను మహావాక్యమునందలి త్వం అను పదముచేఁ జెప్పఁదగిన యర్థము; దేహత్రయ + విలక్షణంబు = పైని జెప్పఁబడిన స్థూలము మొద లగు మూఁడు మేనులకును సాక్షిభూతములు, పంచ + కోశ + వ్యతిరిక్తంబు = అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము - అనుకోశము లైదిటికంటె భిన్న మైనదియు, సత్ + చిత్ + ఆనంద + స్వరూపంబు = ఎన్నఁటికిని నశింపనిది గాన సద్రూపమును, జడత్వములేనిదిగాన చిద్రూపమును, దుఃఖరహిత మైనది గాన నానందస్వరూపమును, ఐన + కూటస్థ + చైతన్యమాత్రంబు = అగు కేవల పరమాత్మయు, త్వంపద + లక్ష్య + అర్థంబు = త్వం అను పదమునకు లక్ష్యభూత మగు అర్థము (అగును); సమష్టి + శరీర + అవస్థా + త్రయ + ఆత్మక = అన్నియుఁ గలసి యొకటిగా నున్న స్థూలసూక్ష్మకారణశరీరములును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను స్వరూపముగఁ గలది, ఐన + మాయయు = అగు మూలప్రకృతియు, వైశ్వానర + హిరణ్యగర్భ +

అవ్యాకృత + నామకంబు = సమష్టి స్థూలోపాధికిని సమష్టి జాగరిత మునకు నభిమాని యైన వైశ్వానరుఁడు, సమష్టి సూక్ష్మోపాధికి సమష్టి స్వప్నమునకు నభిమాని యైన హిరణ్యగర్భుఁడు సమష్టి కారణోపాధికిని సమష్టిసుషుప్తికి నభిమాని యైన యవ్యాకృతుఁడు అను పేరు గలది, ఐన + మాయా ప్రతిబింబ + ఈశ్వరచైతన్యంబు = అగు శుద్ధసత్త్వప్రధాన యగు మాయయందుఁ బ్రతిఫలించిన ఈశ్వరునియొక్క చిద్రూపమును, సర్వజ్ఞత్వ + సర్వేశ్వరత్వ + సర్వాంతర్యామిత్వ + ఆది + గుణంబులును = సమస్తము నెఱుంగుట - సకలమునకు నధిపతి యగుట - ఎల్లభూతములలో నుండి నియామకుండగుట లోనగుఁగల యసాధారణధర్మములును, కూడి = కలసి, తత్ + పద + వాచ్య + అర్థంబు = తత్ అను పదమునకుఁ జెప్పఁదగిన యర్థము (అగును), దేశకృత + కాలకృత + వస్తుకృత + పరిచ్ఛేద + శూన్యంబు = దేశముచేతను కాలముచేతను పదార్థములచేతను జేయఁబడెడు తెంపులేనిదియు, అనఁగా నొకచోటనుండి వేఱొకచో లేక పోవుట, ఒకతటి నుండి వేఱొకతటిని లేకుండుట, యొకవస్తువునం దుండి వేఱొకవస్తువునం దుండకపోవుట యను నేర్పాటు లేనిది యని యర్థము. స్వజాతీయ + విజాతీయ + స్వగత + భేద + రహితంబు = మనుష్య జాతిలో బ్రాహ్మణులు క్షత్రియులు నను భేదము స్వజాతీయము; మనుష్యులు పశువులు పక్షులు నని వేఱు వేఱు జాతులకుం గల భేదము విజాతీయము; ఒక శరీరమునందు కాళ్లు చెవులు కన్నులు మొదలగునదియు, నొక చెట్టునందు కొమ్మలు ఆకులు పువ్వులు పండ్లు మొదలగునదియు స్వగతభేదము; ఇట్టి భేదత్రయము లేనిదియు, సత్య + జ్ఞాన + ఆనంద + స్వరూపంబు = కాలత్రయ బాధ్యమాన మగుటచే సత్యస్వరూపమును, జడభిన్నం బగుటచేఁ గేవల జ్ఞానస్వరూపమును, దుఃఖవిరహితం బగుటచే నానందస్వరూపమును, ఐన = అగునట్టి, పరిపూర్ణ + అద్వితీయ + బ్రహ్మచైతన్యమాత్రంబు = సర్వవ్యాపకం బగుటచే నెల్లయెడల నిండియున్న

యదియు సర్వము దానె యగుటచేఁ దనకంటె వేఱొండు లేనిదియు, నగు చిద్రూపంబైన పరతత్త్వమే, తత్ + పదలక్ష్య + అర్థంబు - అగున్ = తత్ అను పదమునకు లక్ష్యభూతమైన యర్థము అగును; విరుద్ధ + ధర్మకంబులు = కించిజ్జ్ఞత్వము సర్వజ్ఞత్వము అను మొదలుగాఁ బరస్పరవిరుద్ధములైన గుణములు గలవి, ఐన = అగునట్టి, వాచ్యార్థములతోన్ = తత్ త్వం అను పదములకుఁ జైని జెప్పఁబడిన వాచ్యార్థములతో, లక్ష్యార్థములకున్ = లక్ష్యభూతము లగునర్థములకు, ఐక్యంబు = ఏకత్వము, సంభవింపదు = ఉపపన్నము కాదు; కావునన్ = అట్లు సరిపడకపోవుటవలన, ఒక్క దేశంబునన్ = ఒకతావున, ఒక్క కాలంబునన్ = ఒకతఱిని, ఒక్కరూపంబునన్ = ఒండొక స్వరూపముతో, ఉన్న పురుషునిన్ = ఉండిన మనుజుని, వేఱొక్కదేశంబునన్ = ఇంకొక స్థలమునందు, మఱియొక్క కాలంబునన్ = వేఱొండు సమయమునందు, కొండొక రూపంబుచేన్ = ఇంకొక యాకారముతో, ఉండన్ = నివసించుటను, కనుంగొని = పరికించి, తత్ + దేశ = ఆ స్థలమును, తత్ - కాల = ఆ సమయమును, తత్ + అవస్థా + విశేషంబులన్ = ఆ యాకారము మొదలగు భేదములను, ఏతత్ - దేశ = ఈ స్థలమును, ఏతత్ + కాల = ఇప్పటి సమయమును, ఏతత్ + అవస్థా = ఇప్పటి యవస్థయందుఁ గల, విశేషంబులన్ = భేదములను, గణించి = ఎన్ని, లక్షింపక = దేశకాలాకారాదులను బరికింపక, లక్ష్యభూతుం డయిన = తోఁపట్టుచున్న, అతండు ఇతండు అని = ఆ మనుజుఁడే వీఁ డని, ఒకనిన్ కాన్ = ఒక్క పురుషునిఁగా, ఎఱింగిన + తెఱంగునన్ = గుఱుతుపట్టిన రీతిని, జహదజహల్లక్షణచేన్ = వాక్యార్థమునందు దేశకాలాదులనుబట్టి వచ్చిన విరుద్ధాంశములను విడిచి స్వతస్సిద్ధాంశములను విడువక వాస్తవార్థమును దోఁపట్టఁజేయునది జహదజహల్లక్షణ యనఁబడును; ఇట్టి లక్షణావృత్తిచేత, మాయికంబులు = మాయాకల్పితములు, ఐన + ఉభయ + వాచ్యార్థంబులన్ =

అగునట్టి పైని జెప్పినతీరున రెండువిధము లైన తత్పదమునకు త్వంపదమునకుఁ గల వాచ్యార్థములను (కార్యకారణసంఘాతాత్మకము లైన జీవేశ్వర చైతన్యములను), నిషేధించి = విడిచి, ద్వివిధ = ఇరుతెఱంగుల నున్న, లక్ష్యార్థ = తత్పద త్వంపదములకు లక్ష్యభూతము లైనయర్థములకు (కూటస్థ చైతన్యమునకున్ = పరమాత్మచైతన్యమునకు), ఐక్యంబు = ఏకత్వమును, తెలియుము = తెలిసికొనుము, అదియ = ఆ ఏకత్వమే, అసిపద + అర్థంబు = తత్త్వమసి యను మహావాక్యమునందలి అసి యను పదమునకు నర్థము. "త్వం = నీవు, తత్ = ఆ బ్రహ్మమవు, అసి = అయితివి" అని మహావాక్యమునకుఁ బ్రతిపదార్థము. ఇదియే = ఈ చెప్పఁబడినదియే, జీవ + ఈశ్వర + ఐక్య + జ్ఞానంబు = జీవుఁడు నీశ్వరుఁడు నొకటియే యను తెలివి, ఇదియె = ఇట్లు నీ కుపదేశింపఁబడిన యర్థమే, మహావాక్య + అర్థంబు = తత్త్వమసి యను మహావాక్యమునకు ఫలితార్థము. ఇంకన్ = ఈ పైని, జీవ బ్రహ్మైక్యంబు = జీవునకును పరబ్రహ్మమునకు నేకత్వమును, ఉపదేశించెదన్ = బోధించెదను, ఆకర్ణింపుము = ఆలింపుము. అని = ఇట్లు చెప్పి, మఱియున్ = ఇంకను, ఇట్లు = ముందుఁ జెప్పఁబోవురీతిని, అనియెన్ = పలికెను.

తా. ఓ ఆంజనేయా! ఈ పగిది నుపాధిభేదమునుబట్టి వేర్వేఱ యున్న స్థూలసూక్ష్మకారణము లను మూఁడుశరీరములును జాగ్రత్స్వప్న సుషుప్తు లను మూఁడవస్థలును, క్రమముగ నీ శరీరములయందు నీ యవస్థల యందు నభిమానము గలుగుటంబట్టి విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు నను పేరులు గలజీవాత్మయు, కొంచెపుఁదెలివియు నేను కర్తను నేను భుజించు వాఁడను అను తలఁపును లోనుగాఁగల యజ్ఞానధర్మములునుఁ గలసి "తత్త్వమసి" అను వాక్యమునందలి త్వం అను పదమునకు యథాశ్రుతమైన యర్థమగును; స్థూలసూక్ష్మకారణశరీరములకు వేఱుగ నుండి జాగ్రత్స్వప్న సుషుప్తు లను మూఁడవస్థలకు నుపద్రష్టయు, అన్నమయ ప్రాణమయ మనో

మయ విజ్ఞానమయానందమయము లను కోశపంచకమునకంటె వేఱయదియు, నెన్నఁడును నాశములేక యుండునదిగాన సత్యరూపమును, అచేతనము కాదు గాన చిద్రూపము, త్రివిధదుఃఖవిహీన మైనది గాన నానందస్వరూపము నగు మాయాకల్పితమైన కార్యకరణసంఘాతరూప మగు కూటమునందు సాక్షిభూతమై యుండునది గావున కూటస్థ మనఁబడు కేవలచిదాత్మత్వం అను పదమునకు లక్ష్యభూతమైన, గుర్తింపఁదగిన లేక సదసద్విచారణచేఁ దోపట్టెడి యర్థ మగును; సమష్టిగా (అన్నియుఁ గలసి యొకటిగా) నున్న మూఁడుశరీరములు మూఁడవస్థలు స్వరూపముగఁ గల శుద్ధసత్త్వప్రధాన నగు మాయయు, సమష్టిశరీరత్రయమునందును సమష్ట్యవస్థాత్రయమునందును క్రమముగ నభిమానము గలుగుటచే వైశ్వానరుఁడు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు నను పేరులు గలిగి మాయయందు ప్రతిఫలించిన పరమేశ్వరుని చైతన్యంబును, సర్వము నెఱుంగుట, సకలమునకు నధీశ్వరుం డగుట, నిఖిల భూతములను లోనుండి నియమించుట మొదలుగాఁ గల పరమేశ్వరుని ధర్మములును గలసి, మహావాక్యమునందలి తత్ అనుపదమునకు వాచ్యార్థము (యథాశ్రుతార్థము) అగును; ఒకచో నుండి యొకచో లేకపోవుటయు, నొకప్పు డుండి యొకప్పుడు లేకపోవుటయు, నొకవస్తువునం దుండి వేఱొండు వస్తువునందు లేకపోవుటయు నను త్రివిధపరిచ్ఛేదములు లేనిదియు, మానవజాతిలో బ్రాహ్మణులు క్షత్రియులు అను మొదలగు భేదము స్వజాతీయము, మనుష్యజాతి పక్షిజాతి వృక్షజాతి పాషాణజాతి అను మొదలగునది విజాతీయభేదము. ఒక శరీరమునందుఁ గాళ్లు ముక్కు నోరు కన్నులు చెవులు మొదలగు భేదమును, ఒక చెట్టునందు కొమ్మలు ఆకులు పువ్వులు పండ్లు అను మొదలగు భేదమును స్వగతభేద మనఁబడును. ఇట్టి భేదత్రయము లేనిదియు, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అను మొదలగు ప్రమాణవచనములనుబట్టి సత్యస్వరూపము జ్ఞానస్వరూపము ఆనందస్వరూపము నగు. సర్వవ్యాపకముగా

నంతట నిండి యున్నదియు "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అను శ్రుతిచే సర్వాత్మక మైనది గాన, తనకంటె భిన్నమైన రెండవ వస్తువు లేనిదియు, నగు కేవల పరబ్రహ్మచైతన్యము తత్ అను పదమునకు లక్ష్యభూత మైన యర్థము. ఇట్లు తత్ త్వం అను పదముల వాచ్యార్థములకును గల సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వాదు లగు ధర్మములును పరస్పరవిరుద్ధంబు లగుటంజేసి యా రెండర్థములకు (జీవేశ్వరులకు నీశ్వరపరబ్రహ్మలకు) నేకత్వంబు సరిపడదు గాని, తొల్లి యొకతావున నొకతఱిని యొక యాకారములో నుండిన యొక మనుజుని నింకొకపట్టున వేఱొక సమయమున మఱియొక యాకారముతో నుండుటం బరికించి తొల్లింటి యాస్థలము నాకాలము నా యాకారము మొదలగు భేదములను ఇప్పటి ఈ స్థలము ఈ సమయము ఈ వేషము మొదలగు భేదములను ఎంచి చూడక విడనాడఁగా వాఁడే వీఁడు అని తోఁపట్టుచున్న మనుజుని నొకనిగాఁ దెలిసికొనినపగిదిని, కల్పితము లై యాగంతుకము లయిన విరుద్ధాంశములను విడనాడి, స్వతస్సిద్ధము లైన ధర్మములను విమర్శ వాక్యార్థమునందలి వాస్తవార్థమును దెలుపునది జహదజహల్లక్షణ యనఁబడును; ఈ లక్షణావృత్తిచేత మాయాకల్పితము లైన పూర్వోక్తవాచ్యార్థముల రెండిటిని దిగనాడి, తత్పదమునకును త్వంపదమునకు లక్ష్యభూతము లైన యర్థములగు చైతన్యముల రెండిటికి నేకత్వంబు దెలిసికొనుము. ఈ యేకత్వమే తత్త్వ మసి యను మహావాక్యమునందలి అసి యను పదమునకు నర్థ మగును. ఈ యర్థమే జీవునకు నీశ్వరునకు నేకత్వమును దెలుపుచున్నది. ఇదియే మహావాక్యమునకు ఫలితార్థము. ఈమీఁదను జీవునకు పరబ్రహ్మమునకును నేకత్వమును బోధించెదను వినుము - అని చెప్పి రాజుల శివపూజన పలికెను.

౨౭౪. ఇట్లు ఛాందోగ్యమునందలి తత్త్వ మసి యను మహావాక్యమునకుఁ దాత్పర్యార్థ మగు జీవేశ్వరైక్యంబును

నీశ్వరబ్రహ్మైక్యంబును దెలిపి జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నారు.

సీ. గగనరజ్జుస్థాణుమృగతృష్ణికాశుక్తి
తతు లాదిమధ్యమాంతములయందు
స్వస్వభావములచే వసియించి యన్నియు
వరుసతో నజ్ఞానవశమువలన
నీలతాహిమనుష్యనీరరౌప్యంబు లై
కనుపట్టి వివరించి కాంచునెడలఁ
గల్పితరూపముల్ గడుమిథ్య లై పోవఁ
దత్త్వంబు లైనచందమున నాత్మఁ

తే. దయ్యు నతఁడు ననాద్యవిద్యాత్మశక్తి
వలన జీవుఁ డై తోఁచి కేవల నిజస్వ
రూపము నెఱుంగుచోఁ బూర్వరూప ముడిగి
యద్వయానందమూర్తి యై యలరు ననఘ. ౬౨

టీ. గగన...తతులు—గగన = ఆకసము, రజ్జు = త్రాడు, స్థాణు = మొరడు, మృగతృష్ణికా = మరుమరీచికలు, శుక్తి = ముత్తెపుఁ జిప్పలు అను వీనియొక్క, తతులు = సమూహములు, ఆది + మధ్యమ + అంతములయందు = మొదటను నడుమను తుదను, స్వ + స్వ + భావములచేన్ = తమతమ యాకారములచేత, వసియించి = ఒకతీరున నుండియు, అన్నియున్ = ఆకసము లోనుగాఁ గల యైదును, వరుసతోన్ = యథాసంఖ్యగ, అజ్ఞానవశమువలన = భ్రాంతికి లోఁబడుటచేత, నీలతా...ఐ - నీలతా = నైల్యము, అహి = పాము, మనుష్య = మనుజుఁడు, నీర = నీరు, రౌప్యంబు ఐ = వెండియు నగుచు, కనుపట్టి = కానఁబడి, వివరించి = పరిశీలించి, కాంచునెడలన్ = పరికించిన తఱిని, కల్పిత + రూపంబులు =

ఆకావేకమువలనఁ దోఁపబడిన నలుపు మొదలగు నాకారములు, కడు మిథ్యలు - ఐ = అత్యంతమును కల్ల లగుచు, పోవఁగ = నశింపఁగా, తత్త్వం బులు-ఐన - చందమునఁ = వాస్తవము లైనపగిదిని, అతఁడు = పరమాత్మ, ఆత్ముఁడు అయ్యుఁ = పరమాత్ముఁడే యయియున్నను, అనాది + అవిద్యా + ఆత్మశక్తివలనఁ = తుది మొదలు లేని మాయారూప మగు నిజసామర్థ్యమువలన, జీవుఁడు - ఐ - తోఁచి = కార్యకరణ సంఘాత ముతోఁ గూడిన జీవాత్మని పడువునఁ గనుపట్టి, కేవల = కార్యకరణ సంఘాతమునకు విలక్షణ మగుటచేఁ బరిశుద్ధమగు, నిజస్వరూపముఁ = తన యొక్క వస్తుతత్త్వమును, ఎఱుంగుచోఁ = వివేకమువలనఁ దెలిసికొను తఱిని, పూర్వరూపము = అజ్ఞానముచే నారోపితమైన తొల్లిటి జీవభావము, ఉడిగి = పోయి, అద్వయ = రెండవది లేకపోవుటచేఁ గేవల మయిన, ఆనందమూర్తి ఐ = ఆనందస్వరూపుఁ డగు పరమాత్ముఁడే యగుచు, అలరుఁ = ఎప్పటియట్ల ప్రకాశించును, అనఘ = అజ్ఞానదోషము లేని వాఁడా! యని యాంజనేయునికి సంబోధనము.

తా. ఆకసము త్రాడు మొరడు ఎండమావులు ముత్తెపుఁజిప్ప యనునివి మొదటఁగాని నడుమఁగాని తుదనుగాని యేమార్పును లేక యథార్థముగ నున్నను వీనిని బరికించువారి భ్రాంతిదోషమునుబట్టి మిన్ను నల్లగను, త్రాడు పాముపడువునను, మొరడు మనుష్యుఁడుగను ఎండ మావులు నీళ్లవలెను ముత్తెపుఁజిప్ప వెండిపగిదిని దోఁచుటఁ దోఁపఁబడి వివేక పూర్వకముగఁ బరిశీలించి చూచినతరువాత భ్రాంతిచేత నారోపింపఁబడిన నలుపు మొదలగు నాకారములు మిథ్యాభూతము లై నశించినతోడనే యాకాశము మొదలగు నివియెల్ల వాస్తవస్వరూపము లై కానఁబడునట్లు పరమాత్మ యెప్పుడును నిజస్వరూపముతోఁ బ్రకాశించు చున్నను, తుది మొదలులేక యనాదిగ నున్న మహామాయయనెడునిజశక్తిచేత జీవాత్మవడు వునఁ గానఁబడి వివేకదృష్టిచేత మాయాసంబంధము లేని స్వస్వరూపములను

తెలిసికొనినతోడనే యారోపిత మగు నా జీవభావమును విడిచి యెప్పటి యట్లఖండానందస్వరూపుఁడై తేజరిల్లుచుండును. ౬౨

అవ. పైని జెప్పిన యర్థముననే బాలావబోధమునకై వివరించి చెప్పుచున్నారు.

వ. ఇవ్విధంబున రజ్జ్వజ్ఞానంబువలన రజ్జువునందు భుజంగంబారోపితంబై యాప్తవాక్యములచేతఁ దత్సర్పభ్రాంతి వినాశంబగుచుండ, రజ్జువు రజ్జువయిన తెఱంగున, నఖండ సచ్చిదానందస్వరూపుం డాత్మాజ్ఞానంబువలనఁ దనకుఁ దాన జీవుండయి తోఁచి యనంతరంబున శ్రీగురువాక్యంబుచేత నీవు జీవుండవు గావు పరిపూర్ణ చైతన్యమాత్రుండ వని యెప్పుడు బోధితుం డగు నప్పు డాతండు దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధి చిత్తాహంకారాత్మభ్రాంతి నివర్తించుచుండఁ బ్రత్యగభిన్నాద్వితీయ బ్రహ్మ చైతన్యమాత్రుం డగు నిది జీవబ్రహ్మైక్యం బింక నోంకారస్వరూపం బెఱింగించెద విను మని యిట్లనియె. ౬౩

టీ. ఈ + విధంబునన్ = మీఁదఁ జెప్పినయట్లు, రజ్జు+అజ్ఞానంబువలనన్ = ఇది త్రాడని తెలియక పోవుటవలన, రజ్జువునందున్ = త్రాటియందు, భుజంగంబు = సర్పము, ఆరోపితంబు ఐ = ఆరోపణము చేయఁబడిన దై, ఆప్తవాక్యంబులచేన్ = నిజముఁ దెలిసినవారి వచనములనుబట్టి, తత్ + సర్ప + భ్రాంతి = రజ్జువు చిలువ యను నా భ్రమ, వినాశంబు అగుచున్ ఉండన్ = మరలిపోయినది కాఁగా, రజ్జువు ఐన తెఱఁగునన్ = దారము దారముగానే కన్పట్టురీతిని, అఖం...డు - అఖండ = దేశకాల వస్తు పరిచ్ఛేద విరహితుం డై, సత్ + చిత్ + ఆనంద + స్వరూపుండు = సత్యమును బోధయు సుఖమును స్వరూపముగఁ గల పర

మాత్ముఁడు, ఆత్మ + అజ్ఞానంబువలనన్ = తన్నుఁ దాఁ దెలిసికొనక పోవుటచేత, తనకున్ = పరమాత్మునకు, తాన్ - అ = ఆ పరమాత్మయే, జీవుండు ఐ తోఁచి = జీవాత్మస్వరూపుఁ డగుచుఁ గన్పట్టి, అనంత రంబునన్ = జీవభ్రాంతి గలిగిన పిమ్మట, శ్రీగురువాక్యంబుచేతన్ = దేశికేంద్రుల సదుపదేశ వచనమువలన, నీవు = పరమాత్ముఁడ వగు నీవు, జీవుఁడవు = దేహేంద్రియాదులతోఁ గూడిన జీవాత్ముఁడవు, కావు = అయి యుండలేదు, పరిపూర్ణ చైతన్య మాత్రుండవు = అంతటను నిండి యున్న పరిశుద్ధ చిద్రూపుఁడవు, అని = చెప్పి, ఎప్పుడు = ఏ సమయము నందు, బోధితుండు అగున్ = బోధింపఁబడినవాఁ డగునో, అప్పుడు = ఆకాలమునందే, అతండు = అట్లుపదేశింపఁబడిన శిష్యుఁడు, దేహ... భ్రాంతి - దేహ = స్థూల సూక్ష్మ కారణ శరీరములయందును, ఇంద్రియ= జ్ఞాన కర్మేంద్రియములయందును, ప్రాణ = పంచ ప్రాణములయందును, మనస్ బుద్ధి చిత్తఅహంకార = మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను నంతఃకరణ చతుష్టయమునందును, ఆత్మ + భ్రాంతి = నేననియెడు భ్రమ, నివర్తించుచున్-ఉండన్ = మరలిపోవుచుండఁగా, ప్రత్య...డు=ప్రత్యక్ జీవసాక్షిచైతన్యముకంటె, అభిన్న = వేఱుయదికాని, అద్వితీయ = తనకు రెండవది లేని, బ్రహ్మ చైతన్యమాత్రుండు = చిద్రూప మగు కేవల పర బ్రహ్మమే, అగున్ = అవును. ఇది = ఇట్లుపదేశింపఁబడిన యర్థము, జీవ బ్రహ్మ + ఐక్యము = పైని జెప్పినయట్లు అవిద్యావశమున వేఱుగఁ గన్పట్టు చున్న జీవునకును పరబ్రహ్మమునకును ఏకత్వము, ఇంకన్ = ఈమీఁదను, ఓంకార స్వరూపంబు = ప్రణవముయొక్క స్వరూపమును, ఎఱింగిం చెదన్ = బోధించెదను, వినుము=ఆకర్ణింపుము, అని=అని చెప్పి, ఇట్లు= చెప్పఁబోవురీతిని అనియెన్ = నుడివెను.

తా. మీఁదఁ జెప్పఁబడినవిధమువున ఇది దార మను జ్ఞానము లేక పోవుటవలన నాదారమునందు నారోపింపఁబడిన పా మనుతలఁపు యథార్థ

జ్ఞానము గల యాప్తుని వచనమువలన నివర్తింపఁగా, నాధారము దారము గానే గనఁబడునట్టువలె నద్వితీయమును సద్రూపము చిద్రూపము సుఖస్వరూపము నగు బ్రహ్మము మహామాయావరణవలన స్వస్వరూపము నెఱుంగక జీవాత్మవలెఁ గనఁబడి, పిమ్మట దేశికేంద్రుని సదుపదేశవచనమువలన "నీవు కేవల పరమాత్మస్వరూపుఁడవు గాని, జీవాత్మవు గావు సుమీ" యని బోధింపఁబడిన వెంటనే యిట్లుపదేశింపఁబడిన శిష్యుఁడు లేనినవిద్యావరణవలన "శరీరమే నేను, ఇంద్రియములు నేను, ప్రాణములు నేను, మనస్సు నేను, అంతఃకరణ చతుష్టయము నేను - అను భ్రమ మరలిపోఁగా నన్నమయాదికోశపంచకవ్యతిరిక్తుండనై కేవల శుద్ధ చిద్రూపుఁడే యగును" అను నీ యర్థమే జీవునకును పరబ్రహ్మమునకును నేకత్వము. ఈమీఁదఁ బ్రణవస్వరూపమును వివరించెద నాకర్ణింపు మని మరల నిట్లనియె.

అవ. ఇట్లు తత్త్వమసి యను మహావాక్యార్థమును వివరించి, తద్ద్వారా జీవబ్రహ్మైక్యము నుపదేశించి ఇఁకఁ బ్రణవస్వరూపమును నిరూపించి, తద్ద్వారా జీవబ్రహ్మాద్వైతము బోధించుచున్నారు.

సీ. ఘనతరదేహజాగ్రద్విశ్వవై రాజ
    సు లకారమాత్ర మకారనుగుణధుర్య
తనువిగ్రహస్వప్నతైజససూత్రాత్మ
    కులు నుకారార్థ మకారలలితచరిత
పృథులకారణసుషుప్తిప్రాజ్ఞసర్వేశ్వ
    రు లమకారార్థ మకారరుచిరవర్ణ
సంతతపరిపూర్ణసచ్చిదానందాత్మ
    తత్త్వమోంకార మకారసత్త్వమూర్తి

తే. యట్లు గావున వర్ణత్రయాత్మకం బ
నాత్మరూపక మైన వాక్యార్థ మాటఁ
గాను బ్రణవస్వరూపుఁడ నే నటంచు
వెలసి భావింపవలయు నిర్మలవిచార. ౬౪

టీ. సుగుణధుర్య = శమము దమము లోనుగాఁగల సద్గుణముల సంపత్తి గల హనుమానుఁడా, ఘన...లు = ఘనతర దేహ - వ్యష్టిరూపముగను సమష్టిరూపముగనున్న స్థూలశరీరములును, జాగ్రత్ = వ్యష్టిగను సమష్టిగను నున్న జాగరణావస్థలును, విశ్వ + వైరాజసులు = వ్యష్టిస్థూలశరీరాభిమానియు వ్యష్టిజాగ్రదవస్థాభిమానియు నగు విశ్వుఁడును, సమష్టిస్థూల దేహాభిమానియు సమష్టిజాగ్రదవస్థాభిమానియు నగు వైరాజసుఁడును గలసి, అకారమాత్రము = "జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమామాత్రా" అను శ్రుతినిబట్టి ఆకారరూప మగు ప్రథమమాత్ర యగును - అనఁగా "జాగరితస్థానో బహిఃప్రజ్ఞ స్సప్తాంగ ఏకోనవింశతిముఖః స్థూలభు గ్వైశ్వానరః ప్రథమః పాదః" అను మాండూక్యోపనిషద్వాక్యమువలన నోంకారమునందలి అకారరూప మగు మొదటి పాదము వ్యష్టిసమష్ట్యాత్మక మగు స్థూలసృష్టికి నెల్ల నభిమాని యగు వైశ్వానరుఁ డని ఫలితము. తను...ను - తనువిగ్రహ = వ్యష్టిగను సమష్టిగను నున్న సూక్ష్మశరీరములు రెండును, స్వప్న = ఆ వ్యష్టి సమష్టి సూక్ష్మదేహములయొక్క స్వప్నావస్థలు రెండును, తైజస + సూత్రాత్మకులు = వ్యష్టి సూక్ష్మాంగములయందును తదవస్థ లగు స్వప్నములయందును నభిమాని యగు తైజసుఁడును, సమష్టిసూక్ష్మాంగములయందును దదవస్థ లగు స్వరూపముల యందును నభిమాని యగు సూత్రాత్మకుఁడును గలసి, ఉకార - అర్థము కాఁగ = ఓంకారమునందలి ఉకారముయొక్క యర్థము అగుచున్నది. లలిత చరిత = మనోజ్ఞమైన ప్రవర్తన గలవాఁడా, అని సంబోధనము.

అనఁగా "సప్నస్థానోంతఃప్రజ్ఞ స్సప్తాంగ ఏకోనవింశతి ముఖః ప్రవివిక్తభు క్తైజసో ద్వితీయః పాదః" అనియును "స్వప్నస్థాన స్తైజస ఉకారో ద్వితీయామాత్రా" అనియును శ్రుతినిబట్టి ఓంకారమునందలి ఉకారాత్మక మగు రెండవపాదము, వ్యష్టిసమష్ట్యాత్మకము లగు సూక్ష్మసృష్టికిని తదవస్థ లగు స్వప్నములకును క్రమముగ నభిమాను లగు తైజససూత్రాత్మకు లగుచున్నారని యర్థము; రుచిర - వర్ణ = మనోహరమైన బ్రహ్మతేజస్సు గల యాంజనేయా, పృథుల...రుక్ - పృథుల = గొప్పవియగు, కారణ = వ్యష్టిగను సమష్టిగను నున్న కారణశరీరములు రెండును, సుషుప్తి = ఈ రెండు కారణముల యవస్థలగు గాఢనిద్రలును, ప్రాజ్ఞసర్వేశ్వరుల్ = ఆకారణశరీరముల రెంటియందును, వాని యవస్థలయందును క్రమముగ నభిమానము గల ప్రాజ్ఞుఁడును నీశ్వరుఁడును గలరు, మకార - అర్థము, ఔక్ = ఓంకారమునందలి మకారరూప మగు తృతీయపాదముయొక్క యర్థ మగుచున్నది: అనఁగా "సుషుప్తిస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయా మాత్రా" అనియు "యత్ర సుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభు క్చేతో ముఖః ప్రాజ్ఞ స్తృతీయః పాదః" అను శ్రుతినిబట్టి వ్యష్టిసమష్టిరూప మగు కారణశరీరములందును దదవస్థలగు గాఢనిద్రలయందును క్రమముగ నభిమానముగల ప్రాజ్ఞుఁడును నీశ్వరుఁడును నోంకారమునందలి తృతీయమాత్రాత్మక మగు మకార మగుచున్నారని యర్థము. సంతత...ము - సంతత - అఖండమై, పరిపూర్ణ = సర్వవ్యాపకమైన, సత్ చిత్ ఆనంద ఆత్మ = సత్యస్వరూపమును, శుద్ధచైతన్యస్వరూపమును, సుఖస్వరూపము నగు, తత్త్వము = పరబ్రహ్మము, ఓంకారము ఔక్ = బ్రహ్మప్రణవము అగుచున్నది. సత్త్వమూర్తి = కేవలసాత్త్వికగుణమే స్వరూపముగఁ గలవాఁడా! యని సంబోధనము; అనఁగా "అమాత్ర శ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమ శ్శివోఽద్వైత ఏవ మోంకార ఆత్మైవ

సంవిశ త్యాత్మనాత్మానం య ఏవం వేద య ఏవంవేద'' అనియు ''నాంతః ప్రజ్ఞంనబహిః ప్రజ్ఞ నోభయతః ప్రజ్ఞం నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం। అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః'' అనియు శ్రుతినిబట్టి బ్రహ్మప్రణవము యొక్క నాల్గవపాదము అఖండమును సర్వవ్యాపకమును సత్యస్వరూపము శుద్ధచైతన్యస్వరూపము కేవల సుఖస్వరూపము నగు పరబ్రహ్మము అగుచున్నది అని యర్థము. అట్లు గావునన్ = బ్రహ్మము తురీయపాదాత్మక మగు ప్రణవస్వరూప మగుటవలన, వర్ణత్రయ + ఆత్మకంబు = అకార - ఉకార - మకారములు మూఁడును, అనాత్మరూపకము - ఐన = పరమాత్మకు భిన్నమగుస్వరూపము గల, వాచ్యార్థము = చెప్పఁదగిన యథాశ్రుతార్థము, అగుటన్ = అయియుండుటచేత, కాను = నేనీ వాచ్యార్థస్వరూపుండ నగుటలేదు, ప్రణవస్వరూపుఁడను = కేవల మగు నోంకారము స్వరూపముగఁ గలవాఁడను, నేను - అటంచున్ = నేనైతినని, తెలిసి = తోపట్టెడునర్థము (లక్ష్యార్థమును) ఎఱింగి, భావింపవలయును = స్వస్వరూపానుసంధానమును జేయవలయును, నిర్మల + విచార =పరమపావన మగుతలఁపు గలయాంజనేయా, యని సంబోధనము.

తా. ఓ యాంజనేయా ! విడివిడిగను మొత్తముగను నున్న స్థూలశరీరములును వీనిజాగ్రదవస్థలును, వీనియందుఁ గ్రమముగ నభిమానము గల విశ్వుఁడును, విరాట్పురుషుఁడును బ్రహ్మప్రణవమునందలి ప్రథమపాదరూప మగు అకారమునకు చెప్పఁదగిన యర్థము. అట్లు ద్వివిధసూక్ష్మశరీరములును వీని స్వప్నావస్థలును వీనియందు నోలిని నభిమానులగు తైజసుఁడును, సూత్రాత్మకుఁడును, ఓంకారముయొక్క ద్వితీయపాదాత్మక మగు ఉకారమునకుఁ జెప్పఁదగినయర్థము. ఇరుతెఱంగుల నున్న కారణశరీరములు, వీని సుషుప్త్యవస్థలును, వరుసగ వీనియందు నభిమానము గలప్రాజ్ఞుఁడును నీశ్వ

రుండును, ప్రణవముయొక్క తృతీయపాదాత్మకమగు మకారమునకుఁ జెప్పఁదగిన యర్థము. అంతటను వ్యాపించి సత్తును జిత్తును నానందమును స్వరూపముగఁ గల పరమాత్మయే బ్రహ్మప్రణవముయొక్క ముఖ్యార్థము. కనుక మొదటి అకార, ఉకార, మకారములు మూఁడును నాత్మస్వరూపము గాని, తత్తచ్ఛరీర తదవస్థా తదభిమానులు క్రమముగఁ జెప్పఁదగినయర్థమగుటంజేసి నేను గాను, నేను కేవల ప్రణవస్వరూపుఁడ నని యెఱింగి, స్వరూపానుసంధానమును జేయవలయును.

అవ. ఇట్లు సామాన్యముగ నోంకారస్వరూపమును నిరూపించి, విశేషాకారముగ నిరూపించుచు నకారాదివాచ్యార్థ ప్రవిలాపక్రమంబును పరిశుద్ధ బ్రహ్మప్రణవ లక్ష్యార్థనిర్ణయంబును నుపన్యసించుచున్నారు.

వ. ఇట్లు దేహత్రయావస్థాత్రయ తాపత్రయ సుఖత్రయ కర్మత్రయ కర్తృత్రయ బుద్ధిత్రయ శ్రద్ధాత్రయ ధృతిత్రయ గుణత్రయ శక్తిత్రయ కాలత్రయ లోకత్రయ దేవత్రయ మూర్తిత్రయ వృత్తిత్రయ స్థానత్రయ జీవత్రయేశ్వరత్రయ విరక్తిత్రయ భక్తిత్రయ దీక్షాత్రయ నేత్రత్రయ లక్ష్యత్రయ జ్ఞానత్రయ మండలత్రయ ముక్తిత్రయాత్మకం బయిన వర్ణత్రయం బారోపితం బైన వాచ్యార్థంబు గావుననే తత్సర్వంబుం గ్రమంబున నకారంబున నకారంబు నుకారంబున నుకారంబు మకారంబున మకారంబు నోంకారంబునం బ్రవిలాపంబు నొందించి యంతటఁ దత్ప్రవిలాపంబును విశ్వాధిష్ఠానంబుఁ బరిపూర్ణంబుఁ దురీయంబు నక్షరంబు లక్ష్యార్థంబు నయిన శుద్ధోంకారముమాత్రం

బుగా నవలోకించి నిరంతరంబుఁ దత్స్వరూపమాత్రుండ
వై ప్రకాశింపుము. ౬౫

టీ. ఇట్లు = మీఁద వివరింపఁబడిన తెఱంగున, దేహత్రయ = స్థూల సూక్ష్మకారణము లనెడు మూఁడుశరీరములును, అవస్థాత్రయ = జాగ్రత్ స్వప్నసుషుప్తు లను మూఁడవస్థలును, తాపత్రయ = ఆధిభౌతికము ఆధిదైవికము ఆధ్యాత్మికము నను మూఁడు సంతాపములును, సుఖత్రయ=వైషయికము, వాసనాప్రాప్తము, బ్రహ్మసంబంధము ననుమూఁడుసుఖములును, కర్మత్రయ = పుణ్యకర్మ పాపకర్మ పుణ్యపాపమిశ్రకర్మ అను కర్మలు మూఁడును, కర్తృత్రయ = జీవుఁడు ఈశ్వరుఁడు ప్రత్యగాత్మ యను కర్తలు మువ్వురును, బుద్ధిత్రయ = సత్త్వగుణప్రధాన రజోగుణప్రధాన తమోగుణప్రధాన యనుమూఁడుబుద్ధులును, శ్రద్ధాత్రయ=సాత్త్వికరాజసతామసశ్రద్ధలు మూఁడును, శక్తిత్రయ = ఇచ్ఛాశక్తి - జ్ఞానశక్తి - క్రియాశక్తియు నను శక్తులు మూఁడును, కాలత్రయ = గడచినదియు నడుచుచున్నదియు రాఁబోవునదియు ననుకాలములు మూఁడును, లోకత్రయ = దేవలోకము భూలోకము పాతాళలోకము అను మూఁడు లోకములును, దేవత్రయ = వసువులు - రుద్రులు - ఆదిత్యులు అను దేవతాజాతులు మూఁడును (వసురుద్రాదిత్యరూపులగు విశ్వేదేవులు మువ్వురును), మూర్తిత్రయ = బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనుమూఁడుమూర్తులును, వృత్తిత్రయ = శాంతము ఘోరము మూఢము నను వృత్తులు మూఁడును, స్థానత్రయ = నాభిప్రదేశము హృదయకమలము భ్రూమధ్యము అనుస్థానములు మూఁడును, జీవత్రయ = వ్యష్టిగనున్న స్థూలసూక్ష్మకారణ శరీరములయందును ఈ శరీరముల యవస్థ లగు జాగ్రత్స్వప్నసుషుప్తుల యందునుఁ గ్రమముగ నభిమానము గల విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు నను జీవులు మువ్వురును, ఈశ్వరత్రయ = సమష్టిగ నున్న స్థూలసూక్ష్మ

కారణదేహములయందును నీదేహములయవస్థ లగు జాగ్రత్స్వప్నసుషుప్తుల యందును వరుసగ నభిమానముగల వైరాజసుఁడు సూత్రాత్మకుఁడు నవ్యాకృతుఁడు నను పేళ్వరులు ముగ్గురును, విరక్తిత్రయ = ఇహలోకసుఖమునం దును-పరలోకసుఖమునందును - ఇహపరలోకసుఖముల రెండింటియందునుం గల విరక్తులు మూఁడును, భక్తిత్రయ = బాహ్యము ఆంతరము ఐకాంతికము అను భక్తులు మూఁడును, దీక్షాత్రయ = వేదోక్తము స్మృత్యుక్తము ఆగమోక్తము అను దీక్షలు మూఁడును, నేత్రత్రయ = బాహ్యదృష్టి అంతరదృష్టి దివ్యదృష్టి అను మూఁడు దృష్టులును (ఇచ్చట నేత్రశబ్దము దృష్టిపరము), లక్ష్యత్రయ = బహిర్లక్ష్యము మధ్యలక్ష్యము అంతర్లక్ష్యము అను లక్ష్యములు మూఁడును, జ్ఞానత్రయ = లోకజ్ఞానము శాస్త్రజన్యజ్ఞానము బ్రహ్మజ్ఞానము - అను జ్ఞానములు మూఁడును, మండలత్రయ = సూర్యమండలము చంద్రమండలము అగ్నిమండలము అను మూఁడుమండలములును, ముక్తిత్రయ = క్రమముక్తి జీవన్ముక్తి విదేహముక్తి - అను ముక్తులు మూఁడును, ఆత్మకంబు ఐన = స్వరూపముగఁ గలది యగు, వర్ణత్రయంబు = ఓంకారమునందలి అకార ఉకార మకారము లనెడు మూఁడక్షరములును, ఆరోపితంబు ఐన=మూలావిద్యచేతఁ గల్పింపఁబడినది యగు, వాచ్యార్థంబు కావునన్ = చెప్పఁదగినయర్థ మగుటవలన, ఏతత్త్రయంబున్ = ఆరోపితంబయిన ఈ సమస్తమును, క్రమంబునన్=వరుసగా, అకారంబునన్=అకారమునకుఁ జెప్పఁదగినయర్థమునందు, అకారంబున్ = అకార వాచ్యార్థమును, ఉకారంబునన్ = ఉకారముచేఁ జెప్పఁదగిన యర్థమునందు, ఉకారంబున్ = ఉకారవాచ్యార్థమును, మకారంబునన్ = మకారముచేఁ బలుకఁదగిన యర్థమునందు, మకారంబున్ = మకార వాచ్యార్థమును, ప్రవిలాపంబున్ = లయమును, ఒందించి = చేసి, అంతటన్ = పిమ్మట, తత్ప్రవిలాపంబును = అట్లు దేనిలో దానిని లయ మొనర్చుటను, విశ్వాధిష్ఠానంబును, ప్రపంచమున కెల్ల నాధారభూత మయి

నదియు, పరిపూర్ణంబును = ఎల్లయెడల నిండియున్నదియును, తురీయంబును = అకారము మొదలుగ నోంకారమునందుఁ బైని జెప్పఁబడిన మూఁడుపాదములకంటె నాల్గవది యగుటంజేసి తుర్యమును, అక్షరంబును = ఏనాశము లేనిదియు, లక్ష్యార్థంబును = లక్షణావృత్తిచేఁ దోఁపఁదగిన యర్థమును, అయిన = అగు, శుద్ధ + ఓంకారమాత్రంబు కాన్ = పైని జెప్పినయట్లు అకార ఉకార మకారముల వాచ్యార్థములు తమలోఁ దాము లయము నొందుటచేఁ బరిశుద్ధ మగు కేవలప్రణవస్వరూపమునుగ, అవలోకించి = తెలిసికొని, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, తత్స్వరూపమాత్రుండవు = అట్టి ఓంకారమునకు లక్ష్యార్థ మగు కేవల పరబ్రహ్మస్వరూపుఁడవే యగుచు, ప్రకాశింపుము = ఒప్పుము. ౭౧

తా. సమష్టిగను వ్యష్టిగ నున్న స్థూలసూక్ష్మకారణశరీరములును వీని యవస్థలగు జాగ్రత్స్వప్న సుషుప్తులును క్రమముగ వీనియం దభిమానము గల విశ్వ తైజస ప్రాజ్ఞులు వైరాజస సూత్రాత్మ కావ్యాకృతులును, సత్త్వరజస్తమోగుణములును, ఈ గుణముల సంబంధము లైన వృత్తులును ధృతులును బుద్ధులు విజ్ఞానములును, భక్తులును దీక్షలును జ్ఞానములును విరక్తులును శక్తులును దృష్టులును, మూర్తులును మొదలగునవి యెల్ల బ్రహ్మప్రణవమునందలి అకార ఉకార మకారము లను మూఁడక్షరములచేఁ జెప్పఁబడుచు మహామాయచే బ్రహ్మస్వరూప మగు నోంకార లక్ష్యార్థమునం దారోపింపఁబడినవి గాన, నీ సమస్తంబును వరుసగ అకారవాచ్యార్థమునం దకారవాచ్యార్థము, నుకారవాచ్యార్థమునం దుకారవాచ్యార్థమును, మకారవాచ్యార్థమునందు మకారవాచ్యార్థమును లయముఁజేయఁగాఁ బరిశుద్ధమగు నోంకారముయొక్క లక్ష్యార్థభూతమైన ప్రపంచమునకెల్ల నధిష్ఠాన మై సర్వవ్యాపక మై నశింపనిది యై తురీయ మైన పరబ్రహ్మమే స్వరూపము గలవాఁడ వై వెలుఁగొందుచుండుము. ౭౨

మ. అని బోధించిన నాంజనేయుఁ డపు డాత్మారాముని౦
జూచి యో! యనఘా! యేవరయుక్తిచే నొకట వాచ్యా
ర్థంబుఁ బోఁద్రోచినం। తనె లక్ష్యార్థము చూడఁగావలయు
నందం బొప్ప నాయుక్తి హెచ్చినకూర్మి న్విన్పింపు భక్త
వరదా! శ్రీరామ! సీతాపతీ! ౬౬

టీ. అని = మీఁదఁ జెప్పినయట్లు, బోధించినన్ = ఉపదేశింపఁగా, ఆంజనేయుఁడు = అంజనానందనుఁడు, అపుడు = ఆ సమయమునందు, ఆత్మ + ఆరామునిన్ = స్వస్వరూపమునందు నిరంతరమును రమించు శ్రీరామచంద్రునిని, చూచి = పరికించి, ఓ - అనఘా = సంసారసంబంధ మగుదోషము నంటనివాఁడా! ఏవరయుక్తిచేన్ = ఉత్తమ మగు నేవెరవు చేతను, ఒకటన్ = వెంటనే, వాచ్యార్థంబున్ = యథాశ్రుతార్థమును, పోన్ - ద్రోచిన - అంతన్ - ఎ = విడిచిపెట్టిన తత్క్షణమునందే, లక్ష్య = అర్థము = ఉపలక్షింపఁదగిన వాస్తవార్థమును (పరమాత్మస్వరూపమును), చూడన్ - కాన్ - వలయున్ = అవలోకింపవచ్చునో, అందంబు - ఒప్పన్ = విశదమగునట్లు, ఆయుక్తిన్ = అట్టి వెరవును, హెచ్చిన + కూర్మిన్ = అత్యధికమగు మక్కువతో, భక్త + వర + దా, = ఆశ్రితుల యభీష్టముల నిచ్చువాఁడవును, సీతాపతీ = లోకమాత యగు సీసీతాదేవికిఁ బెనిమిటివియు నగు, శ్రీరామా = శ్రీమద్రామచంద్రుఁడా, విన్పింపు = బోధింపుము.

తా. పైని జెప్పఁబడిన తీరున బోధనసేయఁగా విని హనుమానుఁడు శ్రీరామచంద్రుని నవలోకించి ప్రకృతిసంపర్కరూప మగు దోషము లేని మహాత్ముఁడా! 'తత్త్వమ'స్యాది మహావాక్యములయొక్క వాచ్యార్థమును విడనాడి, లక్ష్యార్థమును (గుఱియగు నర్థమును), నేను గ్రహింపఁదగిన మంచి సాధనమును నాయందు మిక్కుటమగు నక్కటికము నుంచి, తేటతెల్లముగ

నాకు బోధింపుము. నీభక్తులు నిన్ను దేనిని గోరిన, దానినెల్ల నొసంగుట నీకు బిరుదు గదా? ౬౬

క. అని తనపదపద్మములకు
ఘనభక్తిని వందనములు గావించు మహా
త్ముని హనుమంతునిఁ గని యి
ట్లనియెన్ శ్రీరామచంద్రుఁ డానందమునన్. ౬౭

టీ. అని = ఈరీతిని పలికి, తన + పద + పద్మములకున్ = తన యొక్క యడుగుఁదమ్ములకు, ఘన భక్తిన్ = మిక్కుటమగు భక్తితో, వందనములు = మ్రొక్కులు, కావించు + మహాత్మునిన్ = ఒనరించుచున్న మహానీయుఁడగు నాంజనేయునిని, కని = పరికించి, శ్రీరామచంద్రుఁడు = జానకీపతి, ఆనందమునన్ = సంతోషముతో, ఇట్లు = చెప్పఁబోవురీతిని, చెప్పన్ + తొడఁగెన్ = పలుకుటకు పూనుకొనియెను.

తా. పైని జెప్పినయట్లు విన్నవించుకొని తనయొక్క పాదారవిందములకు జోహారులు గావించుచున్న హనుమంతుని దయతో నవలోకించి శ్రీరామచంద్రుఁడు సంతోషముతో నీ తెఱంగున నుపదేశింప మొదలుపెట్టెను. ౬౭

సీ. అన్నజసంభూత మన్నవర్ధిత మగు
తను వన్నమయకోశ మనఁగ నొప్పుఁ
బ్రాణకర్మేంద్రియపంచకంబులు గూడి
విను ప్రాణమయకోశ మనఁగఁ దనరు
జ్ఞానేంద్రియోపేత మానసచిత్తంబు
లును మనోమయకోశ మనఁగఁ జెల్లు
శబ్దాదివిషయపంచకసమన్వితబుద్ధి
విజ్ఞానమయ మన వెలయుచుండు

తే. మోహజప్రియమోదప్రమోదవృత్తి
సంయుతోరుసమస్తదృశ్యప్రపంచ
కారణానాద్యవిద్యాంధకారపటల
మంచితానందమయకోశ మనఁగఁ దనరు. ౬౮

టీ. అన్నజ + సంఘాతము = అన్నమువలన జనించెడు శుక్లశోణితములవలనఁ బుట్టినదియు, అన్న + వర్ధితము = అన్నముచేతనే పెరుఁగునదియు, అగు + తనువు = అయిన స్థూలదేహము, అన్నమయకోశము = అన్నవికారమగు కోశము (పరవస్తువును గప్పునది గానఁ గోశ మనఁ బడును), అనన్ - కన్ - ఒప్పును = అను పేరుతోఁ దనరును; ప్రాణ + కర్మేంద్రియ + పంచకంబులు = ప్రాణాపాన వ్యానోదాన సమానము లను నైదు వాయువులును, వాక్పాణిపాదపాయూపస్థ లను నైదు కర్మేంద్రియములును, కూడి = కలసి, ప్రాణమయకోశము = ప్రాణప్రచుర మగు కోశము, అనన్ - కన్ - తనరున్ = అను పేరుతో నొప్పును. జ్ఞానేంద్రియ + ఉపేత + మానస + చిత్తంబులు = త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియము లైదింటితోను, ఉపేత = కూడుకొనిన, మానసచిత్తంబులు = సంకల్ప వికల్పాత్మక మగు మనస్సు, చలనధర్మాత్మక మగు చిత్తము నను నంతఃకరణవృత్తులు, మనోమయకోశము = మనోవికారమగు కోశము, అనన్ - కన్ - చెల్లున్ = అను నామముతో విలసిల్లుచున్నది; శబ్ద + ఆది + విషయ + పంచక + సమన్విత + బుద్ధి = శబ్దస్పర్శరూపరసగంధము లనియెడు విషయము లైదింటితోఁ గూడుకొని నిశ్చయాత్మికయగు బుద్ధి యను నంతఃకరణభాగము, విజ్ఞానమయము=విజ్ఞానమయకోశము, అనన్ వెలయుచున్ ఉండున్ = అను పేరుతోఁ బ్రసిద్ధమగుచున్నది; మోహ...పటలము - మోహ + జ = పుత్త్రాద్యామోహమువలనఁ గలిగెడు ప్రియ + మోద + ప్రమోద = తాను కోరియున్న వస్తువు కనఁ

బడినతోడనే పుట్టినహర్షము ప్రియము, అట్టి వస్తువు దొరకుటవలనఁ గలుగు నానందము మోదము, అట్లు దొరకిన వస్తువు ననుభవించుటచేత జనించిన ప్రీతి ప్రమోదము, అనునట్టి, వృత్తి = మానసిక వ్యాపారములతో, సంయుత = కలసిన, ఉరు = విస్తారమగు, సమస్త + దృశ్య + ప్రపంచ= చూడఁబడుచున్న ప్రపంచమునకెల్ల, కారణ = మూలమైనదియు, అనాది= తనకు మొదలు లేనిదియు నగు, అవిద్య = మూలాజ్ఞానమనియెడు, అంధకార + పటలము = కటికిచీఁకటిపిండు, అంచిత + ఆనందమయకోశము = అట్టివ్యామోహమునందు చిత్తవృత్తు లేవియు లేమిఁజేసి సుఖమయ మగుటచే నొప్పుచున్న ఆనందప్రచుర మగు కోశము, అనక్ - కన్ - తనరుక్ = అను నామముతో విలసిల్లును.

తా. ప్రతిజంతువును భుజించెడి యాహారపదార్థముయొక్క సారము శుక్లశోణితములుగా మాఱును; అట్టి శుక్లశోణితముల సంయోగమువలనఁ బుట్టి అన్నరసముచేతనే పెరిఁగెడు మేను అన్నమయకోశ మనియు, ప్రాణాపాన వ్యానోదాన సమానము లను నైదు ప్రాణవాయువులును వాక్పాణిపాదపాయూపస్థ లను నైదుకర్మేంద్రియములును గలసి ప్రాణమయకోశ మనియు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను నైదుజ్ఞానేంద్రియములతోఁ గూడిన సంకల్ప వికల్పాత్మక మగు మనస్సును జలరూప మగు చిత్తము నను నంతఃకరణభాగములు రెంటును మనోమయకోశ మనియు, శబ్దస్పర్శరూపరసగంధము లను నైదు విషయములతోఁ గూడిన నిశ్చయాత్మక యగు బుద్ధి యను నంతఃకరణభాగము విజ్ఞానమయకోశ మనియు, చిత్తవ్యామోహమువలనఁ గలిగెడు నభీష్టపదార్థసందర్శన జనిత సంతోషరూప మగు ప్రియము, కామితార్థలాభజన్యహర్షరూప మగు మోదము, ఇష్టకామ్యార్థానుభవజనితప్రీతిరూప మగు ప్రమోదము - నను చిత్తవృత్తులతోఁ గూడుకొని విపులముగఁ గన్పట్టుచున్నప్రపంచమున కెల్ల

హేతుభూతమై తుది మొదలు లేని మూలాజ్ఞానరూపమగు కటికిచీఁకటి పిండు ఆనందమయకోశ మనఁబడుచున్నది. ౬౮

సీ. మహనీయకలితాన్న ♦మయకోశ మగు నాత్మఁ
డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు
మహితేంద్రియప్రాణ♦మయకోశ మగు నాత్మఁ
డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు
మంజులతరమనో♦మయకోశ మగు నాత్మఁ
డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు
మానితవిజ్ఞాన♦మయకోశ మగు నాత్మఁ
డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు
తే. సుప్తియం దేమి దోఁపని ♦ శూన్యతత్త్వ
మాత్మఁ డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు
రూఢి నానందమయకోశ♦రూపుఁ డగు మ
హాత్మఁ డని పల్కుదురు కొంద ♦ ఱజ్ఞు లగుచు. ౬౯

టీ. కొందఱు = దేహాత్మవాదు లగునాస్తికులు, అజ్ఞులు అగుచున్ = ఆత్మస్వరూపనిర్ణయజ్ఞానము లేనివారై, మహనీయ = స్థూలరూపమున, కలిత = ఒప్పుచున్న, అన్నమయకోశము = అన్నవికారమైన కోశమగు, ఆత్ముఁడు = పరమాత్మ, అగున్ = ఔను, అని పల్కుదురు = అని నుడువుచున్నారు, కొందఱు = ముఖ్యప్రాణాత్మవాదు లగు మఱికొందఱు, మహిత = కొనియాడఁదగిన, ఇంద్రియ = కర్మేంద్రియప్రచుర మగు, ప్రాణమయకోశము = ప్రాణమయ మగు కోశము, ఆత్ముఁడు = పరమాత్మ, అగున్ = అగును, అని పల్కుదురు = అనుచు వచియించుచున్నారు; కొందఱు = ఇంకఁ గొందఱు, ఆత్ముఁడు = పరమాత్మ, మంజులతర = మిగుల మనోహరమగు, మనోమయకోశము = మనస్సు ప్రధాన

ముగఁ గల కోశము, అగును = అగుచున్నాఁడు, అని పల్కుదురు = అఁ
చెప్పుచున్నారు, కొందఱు = విజ్ఞానాత్మవాదులు, మానిత + విజ్ఞాన
మయకోశము = పొగడ్తగనిన విజ్ఞానాత్మక మగు కోశమే, ఆత్ముఁడు =
పరమాత్ముఁడు, అని పల్కుదురు = అని వక్కాణించుచున్నారు; కొం
దఱు = శూన్యవాదులు, సుషుప్తియందు = గాఢనిద్రయందు, ఏమిదోఁపని =
ఏమియును పొడకట్టనట్టి, శూన్యతత్త్వము = శుద్ధశూన్యమగు స్వరూపమే,
ఆత్ముఁడు = వస్తుతత్త్వము, అని పల్కుదురు = అని వచించుచున్నారు,
కొందఱు = మఱియుంగొందఱు, మహాత్ముఁడు = పరమాత్ముఁడు, ఆ
నందమయకోశ రూపుఁడు = ఆనందమయకోశమే స్వరూపముగఁ గల
వాఁడు, రూఢిన్ = నిశ్చయముగా, అగును = ఔను, అని పల్కుదురు=
అని నుడువుచున్నారు; అజ్ఞులగుచున్ = ఆత్మానాత్మవివేకజ్ఞానశూన్యులు
అను నర్థ మంతటను సమానము.

తా. "అన్నంబ్రహ్మేతి వ్యజనా దన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని
జాయన్తే అన్నేన జాతాని జీవంతి అన్నంప్రయం త్యభిసంవిశంతీతి తస్మా
దన్నంతదుచ్యత ఇతి" అన్నమువలననే భూతజాతములు జనించుచున్నవి;
అన్నమువలననే జీవించుచున్నవి; తుద కన్నములేక నశించుచున్నవి గాన
నన్నమే పరమాత్మ యనుకొనుచున్నారు; (కొందఱు =) మఱియుంగొం
దఱు, "ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్" అను మొదలగు శ్రుతినిబట్టి
ప్రాణమే బ్రహ్మ మనుకొనుచున్నారు. ఇంకఁ గొందఱు "మనో బ్రహ్మేతి
వ్యజానాత్" అను మొదలగు శ్రుతిని బట్టి మనస్సే బ్రహ్మ మనుకొను
చున్నారు. వేఱొకకొందఱు "విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్" అను
మొదలగు శ్రుతినిబట్టి విజ్ఞానమే బ్రహ్మ మని చెప్పుచున్నారు; మఱియుం
గొందఱు "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అను మొదలగు శ్రుతులను
బట్టి సమస్తప్రపంచమునకుఁ గారణ మగు మూలావిద్య యను గాఢాంధ
కారరూప మగు నానందమయకోశమే పరమాత్ముఁ డని వచించుచున్నారు;

మఱియుం గొందఱు సుషుప్త్యవస్థయుం జేమియుం దోపట్టదు గాన సర్వశూన్య మాత్మస్వరూప మని వక్కాణించుచున్నారు. ఇందఱు నిన్నివిధముల ననుకొనుటకు మూలాజ్ఞానమే కారణము. ౯౯

క. పరమాణు వనుచు మధ్యమ
పరిమాణుం డనుచు విభుఁడు పరుఁ డనుచును ని
ద్ధరఁ గొందఱు వాదింతురు
పరిపూర్ణాత్ముఁ డని యెఱుఁగుప్రాజ్ఞత లేమిన్. ౨౦

టీ. ఈ + ధరన్ = ఈపుడమియందు, కొందఱు = కొందఱు నరులు, పరిపూర్ణ + ఆత్ముఁడు = పరమాత్ముఁడు అంతటను నిండియున్న స్వరూపము గలవాఁడు, అని = అనుచు, ఎఱుఁగు + ప్రాజ్ఞత = తెలిసికొనఁదగిన వివేకము, లేమిన్ = లేకపోవుటచేతను, పరమాణువు అనుచున్ = "అణో రణీయాన్" అను శ్రుతినిఁబట్టి ఇంద్రియములకు గోచరము గాక యనుమానైకవిషయమై పరమసూక్ష్మ మగు నణువు స్వరూపముగఁ గలవాఁ డనియు, మధ్యమ పరిమాణుండు = పరమాణువునకును త్రసరేణువునకును మధ్య నుండు ద్వ్యణుకము స్వరూపముగఁ గలవాఁ డనియుం, పరుఁడు = పరమాత్మ, విభుఁడు అనుచును = వ్యాపకస్వరూపుఁ డనియును, వాదింతురు = తమతమ తర్కములకు ననుగుణముగ వాదనఁ జేయుచున్నారు.

తా. కొందఱు నైయాయికులు కేవలానుమానప్రమాణమునుబట్టి పరమాత్మ పరమాణుస్వరూపుఁ డనియు, ద్వ్యణుకస్వరూపుఁ డనియు, విభు వనియుఁ జెప్పుచున్నారు. ఇట్లు చెప్పుటకు పరమాత్మ సర్వపరిపూర్ణస్వరూపుఁ డని తెలిసికొనఁదగిన వివేకము లేకపోవుటయే కారణము. ఇంటియందలి చిన్న కన్నములలో సూర్యరశ్మి వ్యాపించి యున్నపుడు చూడఁబడు కడుసూక్ష్మ మగు రేణువులో నాఱవపాలు గాని యెనిమిదవ

పాలు గాని మధ్యమపరమాణు వగును. దీనికే ద్వ్యణుక మని పేరు; ఈ ద్వ్యణుకములో నాఱవపాలు గాని యెనిమిదవపాలు గాని పరమాణు వనఁబడును. ఇదియే యాత్మస్వరూప మని తార్కికమతము. అసంయుక్త పదార్థ మాత్మ కాదనియు పరమాణుద్వయసంయోగరూపమగు ద్వ్యణుకమే యాత్మస్వరూప మనియుఁ దార్కికమతభేదము. ౭౦

తే. మఱియుఁ జిద్రూపుఁ డనుచుఁ గొందఱు గణింతు
రలఘుచిదచిత్స్వరూపకుం డండ్రు కొంద
ఱరసి సద్రూపుఁ డనుచుఁ గొందఱు వచింతు
రాత్మ నెఱుఁగక నిజవిమోహాంధు లగుచు. ౭౧

టీ. మఱియున్ = ఇంకను, నిజ + విమోహ + అంధులు = తమ్ముఁ జుట్టుకొనియున్న యజ్ఞానాంధకారముచేత గ్రుడ్డివాండ్రు, అగుచున్ = ఐనవారై, కొందఱు = కొందఱు నరులు, ఎఱుఁగక = ఆత్మానాత్మ వివేకజ్ఞానము లేక, ఆత్మన్ = పరమాత్మను, చిద్రూపుఁడు = కేవలచైతన్యమే స్వరూపముగఁ గలవాఁడు, అనుచున్ = అని, గణింతురు = ఎన్నుదురు; కొందఱు = ఇంకఁగొందఱు, చిదచిత్స్వరూపకుండు = చైతన్యము జడమును రెండును స్వరూపముగఁ గలవాఁడు, అండ్రు = అనుచున్నారు; కొందఱు = మఱియుం గొందఱు, అరసి = యోచించి, సద్రూపుఁడు = కాలత్రయమునందును నశింపని యాకారము గలవాఁడు, అనుచున్ వచింతురు = అని చెప్పుచున్నారు.

తా. పరమాత్ముఁడు సచ్చిదానందస్వరూపుఁ డని తెలిసికొనఁజాలక కొందఱు స్వకీయమగు మూలాజ్ఞానముచేఁ గప్పఁబడి గ్రుడ్డివాండ్రయి కేవలచైతన్యమే స్వరూపముగఁ గలవాఁ డనియు, మఱియుఁ గొందఱు చిదచిత్తులు రెండును నాకారముగఁ గలవాఁ డనియు, ఇంకం గొందఱు కేవల సద్రూపుఁ డనియుఁ బలుకుచున్నారు. ౭౧

క. కావున సచ్చిత్సుఖమయ
భావాతీతాద్వయాత్మకపరతత్త్వము సం
భావించి తెలియఁజెప్పెదఁ
గేవలమతిచే గ్రహింపు కీశాధీశా. ౬౨

టీ. కావునన్ = పలువురు పలుతెఱంగుల నాత్మవిషయమయి చెప్పుచుండుటచేత, సత్...ము - సత్ = కాలత్రయాబాధ్య మగు సత్యత్వమును, చిత్ = జడవిలక్షణ మగు పరిశుద్ధచైతన్యమును, సుఖ = దుఃఖవిరహిత మగు నఖండానందమును, మయ = ప్రచురముగఁ గల (స్వరూపముగఁ గల), భావ + అతీత = పరిదృశ్యమానవస్తువులకంటె విలక్షణమైన, అద్వయ + ఆత్మ = అద్వైతస్వరూప మగు, పరతత్త్వముక్ = పరబ్రహ్మమును, సంభావించి = ఆలోచించి, తెలియన్ చెప్పెదన్ = బోధించున ట్లుపదేశించెదను, కీశాధీశా = వానరవర్యా, కేవల మతిచేన్ = ఏకాగ్రబుద్ధితో, గ్రహింపుము = తెలిసికొనుము.

తా. ఓవానరోత్తమా! ఆంజనేయుఁడా! పైని జెప్పినయట్లు పరతత్త్వమునుగూర్చి పెక్కండ్రు పెక్కురీతుల నుడువుచుండుటంజేసి సత్యస్వరూపము జ్ఞానస్వరూపము నానందస్వరూపము కనఁబడుచుండెడు పదార్థములకంటె విలక్షణ మయినదియు "నన్యోఽతోఽస్తి కశ్చన" అను మొదలగు శ్రుతులవలనఁ దనకంటె వేఱొండు లేనిదియు నగు పరమాత్మయొక్క వాస్తవరూపము నాలోచించి నీకు బోధపడున ట్లుపదేశించెదను. తదేకాయత్తచిత్తముతో విని తెలిసికొనుము. ౬౨

మహాస్రగ్ధర.

ఘటము న్వీక్షించువాఁ డెట్లగతిని ఘటము దాఁగాక
వేఱైన భంగిన్, బటుదేహద్రష్ట నై చిత్స్వరమ సుఖమయః
శ్రీబ్రహ్మమైనట్టినే నె, న్నఁటికిన్ దృశ్యంబు మాయాకనగర

సమ మసన్నామరూపాత్మకంబున్, గుటిలావిద్యాకృత
బాకులద మగు దన్మాకోశముం గాను వత్సా! ౭

టీ. వత్సా= పుత్త్రాధికుఁడ వగు నో యాంజనేయా, ఘటమున్ = కడవను, వీక్షించువాఁడు = చూచుచున్న మనుజుఁడు, ఘటము = ఆకడవ, తాన్ = తాను, కాక = కాక, ఏగతిన్ = ఏరీతిని, వేఱు - ఐన - భంగిన్ = కడవకంటె వెఱవాఁ డగుపగిదిని, పటు + దేహ + ద్రష్టను-ఐ = స్థూలమగు మేనునకు సాక్షి నగుచు, చిత్...ము-చిత్ + పరమ + సుఖ + మయ + బ్రహ్మము = జ్ఞానము సత్యము ఆనందము స్వరూపముగఁ గల పరబ్రహ్మము, ఐనట్టి + నేను = అయియున్న నేను, ఎన్నఁటికిన్ = ఏనాఁటికిని, దృశ్యంబును = ద్రష్టకు ఘటాదికమువలెనువున గోచరమగునదియు, మాయానగరసమము = గంధర్వనగరమున కెన దైన దియు, అసత్ + నామ+రూప + ఆత్మకంబున్ = కల్పితములైన నామధేయములు నాకారములు స్వరూపముగఁ గలదియు, కుటిల + అవిద్యా+కృతంబు = వంకరగనున్న యవిద్యచేఁ జేయఁబడినదియు, ఆకులదము = చిత్తవైకల్యము నొసఁగునదియునగు; తన్మాకోశను = అన్నమయమగు స్థూలశరీరము, కాను = అయియుండను.

తా. శ్రవణధారణసమర్థత గల యో యాంజనేయా! కుండను జూచెడు మనుష్యుఁ డాకుండకంటె వెఱవాఁడై యుండునట్లు స్థూలశరీరము మొదలగు నుపాధులకు నెల్ల సాక్షినై సచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మమునకు నేను పరిదృశ్యమానమును మిథ్యాభూతమును మాయాకల్పితమును వినశ్వరము లగు నామరూపములే స్వరూపముగఁ గలదియు దుఃఖభూయిష్ఠ మగుటచే మనోవైకల్యము నిచ్చునదియు నగు నీస్థూలశరీరరూప మగు నన్నమయకోశము నెప్పుడును గానుసుమీ. ౭౩

మ. సమతన్ మేను నెఱుంగుచందమున నీకన ర్వేంద్రియప్రాణ
చి, త్తమనోహంకృతులం గనుంగొనుచుఁ జైతన్యంబు నై
యొప్పు నే, ను మరుత్ప్రవృత్తి తదింద్రియాదికము నెందుం
గాను నా కిం కి లక్ష్యము లౌ వానిజనిప్రణాశములు జా
గ్రత్సుప్తులం దారయన్. ౭౪

టీ. మరుత్ + ప్రవృత్తి, = కరువలిపట్టి, సమతన్ = సరిగా, మేనున్ = స్థూలశరీరమును, ఎఱుంగు + చందమునన్ = వెనుకఁ జెప్పిన యట్లు సాక్షినై నాకంటె వేఱనుది యని తెలిసికొను పగిదిని, ఈ...లన్ = ఈ = ఇట్లు కనఁబడుచున్న, సర్వ = సమస్తములైన, ఇంద్రియ = జ్ఞానేంద్రియములనైనటిని కర్మేంద్రియములనైనటిని, ప్రాణ = ప్రాణము మొదలగు వాయుపంచకమును, చిత్త+మనస్+ అహంకృతులన్ = మనోబుద్ధిచిత్తాహంకారము లను నంతఃకరణచతుష్టయ మును, కనుంగొనుచున్ = సాక్షినై విలోకించుచు, చైతన్యంబున్ + ఐ ఒప్పు+ నేను = చిద్రూపుఁడ నగుచుఁ బ్రకాశించుచున్న నేను, తత్ + ఇంద్రియ + ఆదికము = ఆ యింద్రియములు మొదలగు ప్రాణమయ మనో మయ విజ్ఞానమయకోశములు, ఎందున్ = ఎప్పుడును, కాను = అయి యుండను; వాని + జని + ప్రణాశములు = ఆ ఇంద్రియములు మొదలగువాని యొక్క పుట్టుకయును వినాశమును, జాగ్రత్ + సుప్తులందున్ = జాగ్ర దవస్థయందును సుషుప్త్యవస్థయందును, ఆరయన్ = పరుపగఁ జూడఁగా, లక్ష్యములు ఔను = చూడఁబడునవి యగును.

తా. పైని జెప్పినయట్లు స్థూలశరీరము నాకు వేఱుగాఁ దోఁచుటచే దానికి నేను విలక్షణుండనై సాక్షినగుచుఁ దెలిసికొనురీతిని నా కిట్లు గోచ రము లగుచున్న పదితెఱంగులం గల ఇంద్రియములును, ప్రాణము మొద లగు వాయువు లైదును, మనోబుద్ధిచిత్తాహంకారము లను నంతఃకరణ

చతుష్టయమును సాక్షినై చూచుచున్న చిద్రూపుఁడ నగుచు వెలుఁగుచున్న నేను, ఓవాయునందనా! ఆ ఇంద్రియములు మొదలగునవి యెన్నఁడుఁ గాను గావున నా యింద్రియములు మొదలగు వానియొక్క పుట్టువు జాగ్రద వస్థయందును, వినాశము సుషుప్త్యవస్థయందును నాకు గోచరము లగు చున్నవి. ౭౪

అవ. "ఘటము వీక్షించువాఁడు" అను మొదలగు వాక్యముతో సామాన్యాకారముగ మహదాదికార్యకారణ సంఘాతమునకంటె సాక్షిచైతన్యము విలక్షణమైనదని చెప్పి, "సమతగా నేను" అను మొదలగు పైవాక్యార్థముచేత సూక్ష్మశరీరమునకంటె సాక్షిచైతన్యము భిన్నమైన దని వక్కాణించి, ఇప్పుడు విశేషాకారముగ బాలబోధార్థము గృహ క్షేత్రారామాదికమునందలి స్వత్వాభిమాన నిరసనపూర్వక ముగ సాక్షిస్వరూపమును వివరించుచున్నారు.

సీ. నామందిరం బిది ♦ నానువర్ణం బిది
 నాతల్ప మిది యని ♦ నరుఁడు దాను
దన్మందిర సువర్ణ ♦ తల్పంబులకు విల
 క్షణసాక్షి యై యవి ♦ గానిపగిది
నాశరీరం బిది ♦ నాయింద్రియము లివి
 నాప్రాణ మిది, యిది ♦ నామనంబు
నాయహంకృతి యిది ♦ నాబుద్ధి యిది యని
 బహువిధదృశ్యరూపముల నెల్ల

తే. నాయవి యటంచుఁ దెలిసి నిర్ణయముసేయు
నేను దత్తచ్ఛరీరాదినిఖిలవస్తు

సంఘమునకు విలక్షణసాక్షి నగుదుఁ
గాని యిం దద్వైతమును గాను నే వానరేంద్ర. ౨౮

టీ. ఇది = ఈ కనఁబడుచున్నది, నా మందిరంబు = నాసంబంధమైన గృహము, ఇది నాసువర్ణంబు = ఇయ్యది నాయొక్క బంగారు, ఇది నాతల్పము = ఇద్ది నాయొక్క పాన్పు, (తల్పం శయ్యాట్టదారేషు అను నిఘంటువుచే లక్షణావృత్తిం బట్టి భార్య యనియు నర్థము) అను, + నరుఁడు = అనేకాను మనుష్యుఁడు, తత్ + మందిర + సువర్ణ + తల్పములకు = తనకు శేషభూతము లై జడము లైన యాయిల్లు బంగారు పాన్పు మొదలగువానికి, విలక్షణ + సాక్షి ఐ = అన్యత జడత్వాదు లగు దృశ్యధర్మములకు వ్యతిరిక్తము లైన సర్వజ్ఞానాదినానాసకలగుణములు గల సాక్షిస్వరూపుఁ డైన, తాను = పురుషుఁడు, అవి కానిపగిదిన్ = ఆ యిల్లు మొదలగునవి కాకుం డునట్లు, ఇది నాశరీరంబు = ఇయ్యది నా మేను, ఇవి నా యింద్రియములు = చక్షుస్సు మొదలగు నీయవి నాసంబంధము లైన కరణములు, ఇది నా ప్రాణము = ఇది నాయొక్క ప్రాణమయకోశము, ఇది నామనంబు = ఇది నాయొక్క డెందము, ఇది నా అహంకృతి = ఇయ్యది నాయొక్క అహంకారము లై ఇది నాబుద్ధి = నిశ్చయాత్మిక యగు నాబుద్ధి యిద్ది, అని = ఇట్లనుకొని, బహువిధ + వృత్తి + రూపములన్ ఎల్లన్ = పలు తెఱంగులం గన్పట్టుచుండెడు నన్ని యాకృతులను, నాయవి యటంచున్ = అజ్ఞానవశమునందు నాకు సంబంధించియున్న వనుకొనుచు, తెలిసి = సద్గురూపదేశములవలనను శాస్త్రపరిశీలనమువలనను గలిగిన సదసద్వివేకముచే నాయాదృశ్యవస్తువుల స్వరూపము నెఱింగి, నిర్ణయము చేయన్ = మననముచేత నిది సత్తు ఇయ్యది యసత్తు అని స్వస్వరూపమును నిశ్చయింపఁగా, నేను = కేవల పరవస్తుస్వరూపుఁడ నగునేను, తత్ + తత్ + శరీర + ఆది + నిఖిల + వస్తు + సంఘమునకున్ = స్థూలసూక్ష్మకారణశరీరములు

మొదలగు సమస్తములైన దృశ్యములగు పదార్థములయొక్క సముదాయమ
నకును, విలక్షణ+సాక్షిని = భిన్నమగు సాక్షిస్వరూపుఁడను, అగుదును
కాని = ఐయుంటిని కాని, అందున్ = ఆశరీరాదులగు దృశ్యవస్తువులలో
ఎద్దియును గాను = ఏయొక్కటియు నే నైయుండలేదు, వానరేంద్ర =
వానరోత్తముఁడగు నో హనుమానుఁడా యని సంబోధనము.

తా. సాధారణముగ లోకమునందు ఈ యిల్లు, ఈ బంగారము మొదలగు సొత్తులు, ఈభార్య మొదలగునవియెల్ల నాసంబంధములై యున్నవని యనుకొనెడు మనుష్యుఁడు తనకు శేషభూతములైన యాగృహక్షేత్రారామదారపుత్త్రాదులకు వేఱుగ నుండి, ద్రష్టయై, యాగృహాదులు గాకయుండునట్లు ఈదేహము - ఈ యింద్రియములు - ఈ ప్రాణము - ఈ డెందము - ఈ యహంకారము - ఈ బుద్ధి మొదలగునవి యెల్లఁ దన సంబంధములై యున్నవని శరీరము మొదలుగాఁగలవాని నన్నిటిని తనవిగా నజ్ఞానావస్థయం దనుకొనుచు, బ్రహ్మజ్ఞానసంపత్తి గలిగినతోడనే సదసద్వస్తువిచారణను గావింపఁగా నేను శరీరము మొదలుగాఁ గల ఆయా పరిదృశ్యమానములగు పదార్థములకెల్ల ద్రష్టనై, వేఱుగ నుంటినిగాని యీ పదార్థములలో నేదియునుగాను సరేకదా, యనృతజడాత్మకములైన యీ శరీరాదులు సచ్చిదానందాత్మకుఁడ నైననన్ను సంబంధించి యుండలేదు.

అవ. ఇట్లు సాక్షిస్వరూపమును నిరూపించి చిద్రూపమును బోధించుచున్నారు.

తే. బుద్ధ్యహంకారములతోడి పొందుఁ గలిగి
నేను నే ననువాఁడను నేనునుమ్మ
నేను నే ననువాఁడను నే నటంచుఁ
దెలియఁబడువృత్తి నెఱిఁగెడి తెలివి నేను.

టీ. బుద్ధి + అహంకారముల + తోడి + పొందున్ = నిశ్చయాత్మిక యగు బుద్ధితోను దేహాదులయందలి యభిమానరూప మగు నహంభావముల తోను తాదాత్మ్యమును, కలిగి = పొంది, నేను నేను అనువాఁడను = అజ్ఞానముచేత (స్వస్వరూపమును దెలియలేక) శరీరము నేను - ఇంద్రియములు నేను - నేను పోయితిని నేను చూచితిని అనుకొనుచుండెడు జీవాత్మను, నేనసుమ్మీ = నేనే నేసుమీ, మఱియు, నేను నేను అనువాఁడను = పైని చెప్పినయట్లు నేను నేను అనుకొనుచుండెడు జీవాత్ముఁడనే, నేను అటంచున్ = పరమాత్ముఁడనైన నేను అని, తెలియఁబడువృత్తిన్ = గోచరమగుచున్న సాక్షివ్యాపారమును, ఎఱిఁగెడు తెలివి = తెలిసికొనెడు చిద్రూపము, నేను = సచ్చిదానందాత్మకుఁడనైన నేను అయితిని.

తా. మనోబుద్ధిచిత్తాహంకారము లనియెడి యంతఃకరణచతుష్టయములతోఁ దాదాత్మ్యము నొంది, నేను తలంచితిని - నేను నిశ్చయించితిని - నే నీకార్యమును జేసితిని అను మొదలుగ నంతఃకరణవృత్తులతోఁ దాదాత్మ్యము నొందినజీవాత్ముఁడనే నేనసుమీ. అట్లు నేను నేను అనుకొనుచుండెడు జీవాత్ముఁడనే నేను అని తనచేఁ దెలిసికొనఁబడుచున్నబుద్ధివృత్తికి సాక్షి యై తెలిసికొనుచున్న శుద్ధబోధయే నేను. అనఁగా వృత్తిని వ్యాపించియున్న చైతన్యము నే నని యర్థము. ౨౬

అవ. పైని జెప్పిన యర్థమునే వివరించుచున్నారు.

సీ. శ్రవణేంద్రియంబుచేన్ వివిధశబ్దంబుల
  నేర్పరించి యెఱుంగునెఱుక నేను
స్పర్శేంద్రియంబుచేన్ స్పర్శగుణంబుల
  నేర్పరించి యెఱుంగునెఱుక నేను
నేత్రేంద్రియంబుచేన్ నిఖిలరూపంబుల
  నేర్పరించి యెఱుంగునెఱుక నేను

రసనేంద్రియంబుచే రసముల నన్నింటి
నేర్పరించి యెఱుంగు నెఱుక నేను
తే. ఘ్రాణకరణంబుచే సర్వగంధములను
నేర్పరించి యెఱింగెడి యెఱుక నేను
ఘనమనముచేత నఖిలసంకల్పములను
నేర్పరించి యెఱింగెడి యెఱుక నేను. ౨౨

టీ. శ్రవణేంద్రియంబుచేన్ = కర్ణేంద్రియమువలన, వివిధశబ్దంబులన్ = వాఙ్మయరూపముగను ధ్వనిరూపముగను నున్న సకల శబ్దజాలమును, ఏర్పరించి = ఇది యిట్టిది ఇది యిట్టిది యని వేఱుపఱిచి, ఎఱుంగు + ఎఱుక = తెలిసికొనుచున్న జ్ఞానము, నేను = "అహం బ్రహ్మాఽస్మి" అను మొదలగు మహావాక్యములయందలి యహంశబ్దవాచ్యుఁడను నేనయి యున్నాను. ఇట్లే ముందు ముందు చరణములలోని "ఏర్పఱించి యెఱుంగు నెఱుక నేను" అను వాక్యభాగమునకు నర్థము నూహించుకొనవలెను. స్పర్శేంద్రియంబుచేన్ = చర్మేంద్రియముచేతను, స్పర్శగుణంబులన్ = మెత్తన బిరుసు చలువ వేఁడి మొదలగు స్పర్శావిశేషములను, ఏర్పఱించి ఎఱుంగు నెఱుక నేను, నేత్రేంద్రియంబుచేన్ = నయనేంద్రియముచేత, నిఖిల + రూపంబులన్ = ఎఱుపు తెలుపు నలుపు మొదలుగ పలుతెఱంగులం గల యాకార విశేషములను, ఏర్పఱించి యెఱుంగు నెఱుక నేను, రసనేంద్రియంబుచేన్ = జిహ్వేంద్రియముచేతను, రసములన్ అన్నిటిన్ = పులుసు తీపి వెగటు ఉప్పఁదనము చేఁదు మొదలగు చవులనెల్ల ఏర్పఱించి ఎఱుంగు నెఱుక నేను, ఘ్రాణకరణంబుచేన్ = ఘ్రాణేంద్రియముచేత, సర్వగంధములను = సువాసన దుర్వాసన మొదలగు సమస్తవాసనలను, ఏర్పఱించి యెఱింగెడి యెఱుక నేను, ఘనమనముచేతన్ = విపులమగు డెందముచేత, అఖిలసంకల్పములను = తలఁపుల నన్నిటిని, ఏర్పఱించి యెఱింగెడి యెఱుక నేను, "ప్రజ్ఞానం బ్రహ్మ" అను నైతరేయారణ్యమునందలి

మగు వాక్యార్థము ఇట్లు వివరింపఁబడినది. కావున "యేనవాపశ్యతి" అను మొదలు "సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని" అను తుదగఁగల యవాంతరవాక్యసందర్భము ఇట్లు తెలిఁగింపఁబడినది.

తా. "యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ। స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం" అనుటచే శ్రోత్రేంద్రియము నుండి వెలువడిన యంతఃకరణవృత్తియొక్క తాదాత్మ్యము నొందిన యే చైతన్యముచేత వాగ్రూపముగను ధ్వనిరూపముగను నున్న శబ్దజాలము వేర్వేఱ తెలియఁబడుచున్నదో యా చైతన్యమే నేను. మఱియు త్వగింద్రియమునుండి పైకి వెడలిన యంతఃకరణవృత్తితోఁ గూడిన యే తెలివిచేత శీతోష్ణాదు లగు స్పర్శాదివిశేషములు తెలియఁబడుచున్నవో యా ప్రజ్ఞానము నేను. ఇటు చక్షురింద్రియముద్వారా పైకి నిర్గమించిన యంతఃకరణవృత్తి యుపాధిగఁ గల దేనిచేత తెలుపు నలుపు మొదలగు రూపభేదములును, జిహ్వేంద్రియముద్వారా పైకి వచ్చిన యంతఃకరణవృత్తియం దున్న దేనిచేతఁ దియ్యఁదనము పుల్లదనము మొదలగు చవు లన్నియును, ఘ్రాణేంద్రియముద్వారా వెలువడిన యంతఃకరణవృత్తితోఁ గలసిన దేనిచేత సువాసన దుర్వాసన మొదలగు వాసనలును దెలియఁబడుచున్నవో, యా ప్రజ్ఞానమే నే నయితిని. ఇంతియు కాక యాయంతఃకరణవృత్తు లుపాధిగాఁ గల దేనిచేత సమస్తములైనసంకల్పవికల్పములు ఎఱుంగఁబడుచున్నవో యా ప్రజ్ఞానమే నే నయితి నని ఫలితము.　　౭౭

అవ ఇట్లు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణాము లను జ్ఞానేంద్రియములయొక్క వ్యాపారములకు సాక్షిత్వమును జెప్పి యిఁక వాక్పాణిపాదపాయూపస్థ లను కర్మేంద్రియ వ్యాపారములకు సాక్షిత్వమును ప్రతిపాదించుచున్నారు.

పక. లుకుల దానాదానం

బులగమనాగమనములను శ్రీ మూత్రపురీషం

బులరాకడపోకడలను
దెలియు తెలివి నేను సర్వదృక్కు నగుటచేన్. ౭౮

టీ. పలుకులన్ = వాక్కులను, దాన + ఆదానంబులన్ = పాణీంద్రియముయొక్క పను లగు దాతృత్వమునుఁ బ్రతిగ్రహణమును, గమన + ఆగమనములను = చరణేంద్రియముయొక్క వ్యాపారము లయిన పోవుటను వచ్చుటను, మూత్రపురీషంబుల + రాకడపోకడలను = ఉపస్థేంద్రియవ్యాపార మగు మూత్రస్రావమును పాయ్వింద్రియ వ్యాపార మగు మలవిసర్జనమును, తెలియు = తెలిసికొనుచున్నట్టి, తెలివి = జ్ఞానము, నేను = నేనేసుమీ ; ఏల యన, సర్వదృక్కును = సమస్తవ్యాపారముల కును ద్రష్టను, అగుటచేన్ = అయియుండుటచేతను.

తా. నేను సర్వాంతర్యామినై సర్వసాక్షి నగుటచేతను, వాగింద్రియ వ్యాపారము లగు వచనములను, పాణీంద్రియ వ్యాపారము లగు దానప్రతిగ్రహణములను, చరణేంద్రియ వ్యాపారము లగు రాకపోకలను, పాయ్వింద్రియక్రియ యగు మలవిసర్జనమును, ఉపస్థేంద్రియక్రియ లగు మూత్రస్రావానందములను దెలిసికొనుచున్న యేతెలివి గలదో యా చైతన్యమే నే నయితిని సుమీ. ౭౮

అవ. ఇట్లు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యము నందలి ప్రజ్ఞానశబ్దమునకు నర్థమైన సాక్షిత్వమును బ్రతిపాదించి బ్రహ్మశబ్దార్థ మగు స్వస్వరూపమును నిరూపించుచున్నారు.

క. సర్వోపాధిస్థుఁడ నై
సర్వవ్యాపారముల వెలసం జేయుచు ద
త్సర్వము నంటక వెలిఁగెడు
సర్వాత్ముఁడ నేననుము శ్రీ సజ్జనతిలకా ! ౭౯

టీ. సత్ + జన + తిలకా = యోగ్యులయిన మనుజులలో నుత్తముఁడ వగు నో యాంజనేయా, సర్వ + ఉపాధి + స్థుఁడను - ఐ = స్థూలసూక్ష్మకారణశరీరము లనియెడు నుపాధు లన్నిటియందు నున్నవాఁడనై, సర్వ + వ్యాపార ములు = ఆ యుపాధుల సంబంధము లయిన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందలి సమస్త క్రియలను, వెసన్ = త్వరితముగ, చేయుచున్ = కావించుచు, తత్ - సర్వమున్ = అట్లు చేసిన వ్యాపారములవలనఁ గలిగెడు లాభాలాభసుఖదుఃఖాదుల నెల్ల, అంటక = సక్తత లేమిచేత ముట్టక, వెలిఁగెడు = ఒప్పుచున్నట్టి, సర్వాత్ముఁడను = సర్వస్వరూపుఁడను, ఏను - అ - నున్న = నేనే సుమీ.

తా. ఓ సత్పురుషవర్యా! దేవతలు మనుష్యులు పశువులు పక్షులు మొదలగు ప్రాణికోటులయొక్క శరీరరూపము లగు నుపాధులయందుండి యా యా యుపాధులకు ననురూపము లయిన సమస్త వ్యాపారములను జేయుచు నా ప్రాణికోటులయొక్క యా యా వ్యాపారములవలనఁ గలిగెడు సుఖదుఃఖాదులయొక్క సంపర్కము నించుకయును లేక నిర్లిప్తుఁడను నిస్సంగుఁడను నిర్వికారుఁడను నై వెలుఁగొందుచున్న సర్వపరిపూర్ణ పరబ్రహ్మము నేనేసుమీ. ౬౯

క. అపరిచ్ఛిన్నావ్యయని
త్యపరంజ్యోతిర్మయుండ నై శశిహుతభు
క్తపనాదుల వెలిఁగించుచు
నెపు డంతట నొక్కరీతి నేను వెలుఁగుదున్. ౭౦

టీ. అప...ఐ—అపరిచ్ఛిన్న = పరిచ్ఛేదము (తెంపు) లేనట్టియు, అవ్యయ = నాశములేనట్టియు, నిత్యమైనట్టియు, పరంజ్యోతిర్మయుండను - ఐ = స్వయంప్రకాశమాన తేజస్స్వరూపుఁడ నగుచు, శశి + హుతభుక్ +

తపన + అముల్ = చంద్రుండు అగ్ని సూర్యుఁడు మొదలగు ప్రకృతి సంబంధములైన తేజస్సులను, వెలిఁగించుచున్ = చిద్రూపుఁడనై చంద్రుఁడిట్టివాఁడు సూర్యుఁ డిట్టివాఁడు అను మొదలగు సూర్యచంద్రాదుల వెలుఁగులఁ దెలియఁజేయుచు, నేను = సచ్చిదానందఘనుఁడ నగు నేను, ఎప్డు = నిరంతరమును, అంతటన్ = ఎల్లయెడలను, ఒక్కరీతిన్ = ఒకతీరున, వెలుఁగుదున్ = ప్రకాశింపుదును.

తా. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం । నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః । తమేవభాంతమనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి" అను శ్రుతినిబట్టి సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని నక్షత్రములు మెఱుపులు మొదలగు ప్రకృతిసంబంధములైన తేజస్సు లన్నియు నేస్వయంజ్యోతిస్స్వరూపమును వెలిఁగింపఁజాలక యా పరంజ్యోతిరూపముచేతఁ బ్రకాశింపఁజేయఁబడుచున్నవో యట్టి స్వప్రకాశాత్మరూపుఁడనైన నేను నిరంతరము నెల్లయెడల నొక్కతీరునఁ బ్రకాశించుచున్నాను. ౨౦

క. ఔపాధికనామంబులు
రూపంబులు లేవు నాకు రూఢిగ సకల
వ్యాపారముఁ గను సర్వ
వ్యాపకచిన్మయుఁడ నేను వాయుతనూజా. ౨౧

టీ. వాయుతనూజా = ఓ కరువలిపట్టి, నాకున్ = నిర్వికారుఁడ నగు నాకు, ఔపాధిక + నామంబులు = ఉపాధు లనఁగా మూలప్రకృతి సంబంధములైన మహత్తత్త్వము మొదలగునవి, అట్టి యుపాధులను పురస్కరించుకొని వచ్చిన నామధేయములును, రూపంబులు = ఆకారవిశేషములును, లేవు = ఉండవు; రూఢిగన్ = నిశ్చయముగ, నేను, సకల+ వ్యాపారమున్ = ప్రాణికోటు లన్నిటియొక్క సమస్త కృత్యమును, కను...జన్ - కను = సాక్షినగుచుఁ జూచుచున్న, సర్వవ్యాపక =

అన్నిటియందును వ్యాపించియున్న, చిన్మయుఁడను = చైతన్యస్వరూపుఁడను (అయితిని).

తా. నిర్వికారుఁడ నైన నాకు మూలప్రకృతిభేదము లగు మాయావిద్యలచేఁ గల్పితము లయిన శరీరత్రయము మొదలగు నుపాధులనుబట్టి వచ్చిన నామరూపములు లేవు. నేను సర్వసాక్షి నై యీ యుపాధు లన్నిటియందును నిరంతరము వ్యాపించియున్న చిత్స్వరూపుఁడ నై యా యుపాధు లన్నిటియొక్క కృత్యములను కనుఁగొనుచుందును.

అవ. తనకు నవిద్యారూపోపాధికల్పితము లయిన నామరూపాదులు లేకుండుటకుఁ గారణమును వివరించి చెప్పుచున్నారు.

సీ. ఏను శరీరంబు గా నింద్రియంబులు
గాను ప్రాణంబులు గాను మనము
గాను చిత్తంబును గా నహంకారంబు
గాను శూన్యంబును గాను బుద్ధి
గాను దీర్ఘంబును గాను గుబ్జంబును
గాను స్థూలమును సూక్ష్మమును గాను
గా నతికృష్ణరక్తశ్వేతపీతవ
ర్ణములును పంచభూతములు గాను

తే. గాను గా ననువాఁడను గాను వినుము
కాను గాననువానిని గాంచువాఁడఁ
గాంచువానిని సతతంబుఁ గాంచువాఁడ
నేను గా నను వికృతులు లేనివాఁడ. ౮౨

టీ. వినుము = ఓ ఆంజనేయా! ఆలకింపుము, ఏను = పైని చెప్పినయట్లు నామరూపవిహీనుఁడను సర్వసాక్షిని సకలవ్యాపక చిద్రూపుఁడ

నైన నేను, శరీరంబు గాను = అన్నమయకోశరూప మగు స్థూలదేహమును గాను, ఇంద్రియంబులు గాను = విజ్ఞానమయ కోశాంతర్భూతము లగు జ్ఞానేంద్రియములును గాను, ప్రాణంబులుగాను=ప్రాణమయకోశమగు పంచ ప్రాణములును గాను, మనము గాను = సంకల్పవికల్పరూపమగు మనస్సును గాను, చిత్తంబునుగాను = చాంచల్యప్రధానమగుచిత్తము గాను, అహంకారంబు గాను = అభిమానాత్మకమగు నహంకృతియును గాను, శూన్యంబు గాను = శూన్యవాదులు చెప్పినట్లు సర్వశూన్యుండను గాను, బుద్ధి గాను= నిశ్చయరూపమగు బుద్ధియును గాను, మనోబుద్ధిచిత్తాహంకారాత్మకమగు నంతఃకరణచతుష్టయము నేను గానని యర్థము. దీర్ఘంబును గాను = నిడుపు గాను, కుబ్జంబును గాను = కుఱచయుం గాను, స్థూలమును సూక్ష్మమును గాను = వలముగాని సన్నముగాని కాను, అతికృష్ణ+రక్త+శ్వేత+పీత+వర్ణములును = మిగుల నలుపు ఎఱుపు- తెలుపు-పసపు మొదలగురంగులు, కాను= నే నయియుండలేదు, పంచభూతములున్ = పుడమి మొదలగు పంచమహాభూతములును, కాను = నేనగుటలేదు, కానుకాను - అనువాఁడను=ఇట్లు నేను శరీరము గాను, ఇంద్రియములు మొదలగునవి కాను అనుకొనుచున్నవాఁడను, కాను = అగుటలేదు, కానుకాను అనువానిని = పైఁ జెప్పినట్లు నేనేవియును గానుకాను అనుకొనుచున్న విమర్శశీలుఁ డగు శుద్ధజీవునిని, కాంచువాఁడను = సాక్షిరూపమునఁ బరికించుచున్నవాఁడను, కాంచువానినిన్ = అట్లు సాక్షియైన కూటస్థుని, సతతంబున్ = నిరంతరమును, కాంచువాఁడను = కూటస్థునకుఁగూడ సాక్షినగుటచేతఁ గనుఁగొనుచున్నవాఁడను, ఔను కాను అను వికృతులు = అన్నియు నేనగుదును ఏవియు నేను గాను అను మొదలగు వికారములు లేనట్టివాఁడను సుమీ.

తా. “అస్థూల మనణు అహ్రస్వ మదీర్ఘం” అను మొదలగు శ్రుతివచనములబట్టి నేను ప్రకృతిధర్మము లగు షడ్భావవికారములు లేనివాఁడనగుటంజేసి యన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానంద

మయము లను పంచకోశములకంటె విలక్షణుండనై కేవలసచ్చిదానందశుద్ధబుద్ధ ముక్తస్వభావుండను గాన ప్రకృతిధర్మము లగుశరీరత్రయమును దశేంద్రియములును, పంచప్రాణములును, మనోబుద్ధిచిత్తాహంకారములును, నేను గాను; ఇవి యేవియును నీవు గానిచో శూన్యమై యుండవలయు నని నిత్యసత్యస్వరూపుండ నగుటచే నేను శూన్యముగాను. మఱియు నాకు నిడుపు కుఱుచ వలను సన్నము నలుపు ఎఱుపు తెలుపు పసపు మొదలగు స్థూలోపాధిగుణములు లేవు. ఏలన నట్టిగుణములకు నాస్పదములగు పంచమహాభూతములు నేనయియుండలేదు. ఇవి యేవియు నేను గాను సరేకదా ఇట్లు నే నేవియును గాను కాను అనుకొనుచున్నవాఁడను గూడ నేను కాను; ఇట్లేని నీవెట్టివాఁడవనిన, అట్లు నే నేవియునుగాను అని విమర్శించుచున్న శుద్ధజీవుని సాక్షిరూపినై నేను చూచుచున్నవాఁడను; అట్టి కూటస్థచైతన్యమునకుఁగూడ సాక్షినై యున్నవాఁడను. తుదకు నేనిట్టివాఁడను అగుదును ఇవేవియు నేను గాను అను వికారములు లేని వృత్తిరహితశుద్ధబోధస్వరూపుఁడను సుమీ. ౮౨

అవ. ఇట్లు "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యార్థమును సామాన్యముగఁ బ్రతిపాదించి బాలావబోధమునకై విశేషాకారముగ దృష్టాంతపూర్వకముగ వివరించుచున్నాఁడు.

చ. అచలచరేంద్ర! దీపము ఘటాదిపదార్థముల న్వెలుంగఁ జే
యుచును వెలుంగుకైవడి సకముజ్జ్వలమానసచక్షురాది దృ
శ్యచయము నెల్ల నాత్మవిషయంబులయందుఁ జరించునట్లు చూ
చుచు మఱియేను సాక్షినగుచు న్విలసిల్లుదు నిర్వికారతన్.

టీ. అచల...చర + ఇంద్ర = పర్వతములపైఁ దిరుగువానరములలో నుత్తముఁడవు, లేక చలనరహితమగు పరమాత్మయందుఁ జరించెడు యోగులలో శ్రేష్ఠుఁడవు, అగు నో యాంజనేయా! దీపము = దివ్వె, ఘట + ఆది +

పదార్థములన్ = కడవ మొదలగు వస్తువులను, వెలుంగన్ - చేయుచున్ = కనంబడునట్లు లొనరించుచు, వెలుంగురీతిని = తాఁగూడ వెలుఁగొందు చుండు పగిదిని, ఏను = పరమాత్ముఁడనగు నేను (శ్రీరామబ్రహ్మము), సము...చయము—సముజ్జ్వల = బ్రహ్మతేజస్సుచేఁ బ్రకాశించుచున్న, మానస = మనోచిత్తాహంకారాత్మక మగు నంతఃకరణ చతుష్టయము, చక్షుస్ - ఆది = చక్షురింద్రియము మొదలగు జ్ఞానేంద్రియ పంచకము, ఆది పదముచే కర్మేంద్రియపంచకము మొదలగు, దృశ్య = ఆత్మకును ఇంద్రియ ములకును గోచరములగు శబ్దాదివిషయములయొక్క, చయముఖ్ = సము దాయమును, ఎల్లన్ = సమస్తమును, ఆత్మ + విషయంబులయందుఖ్ = తమతమకు గోచరములగు పదార్థములందు, చరించునట్లు = ప్రసరించుచుం డెడులాగున, చూచుచున్ = వీక్షించుచు, సాక్షిని = కేవలసాక్షిస్వరూ పుండను, అగుచున్ = అయి, నిర్వికారతన్ = ప్రకృతివికృతుల సంబం ధములేకునికిచే, విలసిల్లుదున్ = స్వయంప్రకాశస్వరూపుఁడనై యున్నాను.

తా. స్థిరమగు బ్రహ్మమునందు నిరంతరము నిష్ఠ గల యోవానరోత్త మా! ఘటపటాదివస్తుజాలము నెల్లఁ బ్రకాశింపఁజేయుచు దీపము తనకుఁ దా వెలుఁగొందు చున్నట్లు, నా చైతన్యవ్యాప్తిచేఁ జిత్ప్రకాశత గల మనస్సు మొదలగు నంతఃకరణ చతుష్టయమును, చక్షురింద్రియము మొద లగు జ్ఞానేంద్రియపంచకమును లోనుగాఁ గలయాత్మకు లక్ష్యభూతము లగు పదార్థజాతమును దమ తమ శబ్దాదివిషయములయందుఁ బ్రసరించుచున్నట్లు వీక్షించుచు (చేయుచు), నాయంతఃకరణాదులకు నేను ద్రష్టనై వాని వికృతుల నంటక స్వయంప్రకాశమానుఁడ నగుదును. ౮-3

అవ. పైని జెప్పఁబడినయర్థమునే బాలావబోధార్థముగ వేఱొకదృష్టాంతమును జూపుచు విశదపఱచుచున్నారు.

మత్త. భానుతేజము నాశ్రయించి స్వస్వభావకర్మములందు నీ
మానవుల్ విహరించుకైవడి మత్ప్రకాశము నంటి ధీ
మానసేంద్రియముల్ స్వకీయసమస్తకార్యములం దొగిన్
మానకే చరియించు నెం దభిమానపూర్వకవృత్తులన్.

టీ. భాను + తేజమున్ = సూర్యునియొక్క కాంతిని, ఆశ్రయించి = అవలంబించుకొని, స్వభావ + కర్మములందున్ = వారివారికి నియామము లగు వ్యాపారములయందు, ఈమానవులు = ఈ లోకమునందుఁ గల జనులు, విహరించు + కైవడిన్ = మెలఁగుచున్న విధమున, ధీ + మానస + ఇంద్రియములు = మనోబుద్ధిచిత్తాహంకారము లను నంతరింద్రియములును, చక్షురాది జ్ఞానేంద్రియములును, వాగాది కర్మేంద్రియములును, మత్ + ప్రకాశమున్ = చిద్రూప మగు నాసంబంధమైన దివ్య తేజస్సును, అంటి = ఆశ్రయించుకొని, స్వకీయ + సమస్త + కార్యములందున్ = తమతమ సంబంధము లగు. సంకల్పాదులును శబ్దాదులును వచనాదులును నగు వ్యాపారములయందు, ఒగిన్ = వరుసగా, మానకన్ = విడువక, ఎందున్ = ఎల్లెడలను, అభిమాన + పూర్వక + వృత్తులన్ = (నేఁ దలఁచుచున్నాను నేనే వినుచున్నాను నేనే పలుకుచున్నాను అను మొదలగు) నభిమానము తోడ్తోడఁ గల ప్రవర్తనలతో, చరియించున్ = తమతమ విషయముల యందుఁ బ్రవర్తించును. ఇందు వ్యతిరేకార్థకరూప మగు మానక యనుపదము కలగాని ప్రకృతోపకృతికము గాదు. కావునఁ మానకన్ అనుట కంటె మానుగన్ అను పాఠము మేలు.

తా. భాస్కరుని వెలుఁగు ననుసరించి,మనుష్యులు దమతమ వ్యాపారములయందుఁ బ్రవర్తించుచున్నట్లు, శుద్ధచైతన్యస్వరూపుఁడ నగు నాసంబంధమైన చైతన్యాంశముయొక్క వ్యాప్తి నొంది యంతఃకరణచతుష్టయము, జ్ఞానేంద్రియము, కర్మేంద్రియములు, సంకల్పము మొదలగునవియు,

వినుట మొదలగునవియు, పలుకుట మొదలగునవియు నగు తమతమ సమస్త వ్యాపారములయందు నిచ్చలు మేమే యాయాపనులను జేయుచున్నా మను నహంకారరూప మగు నభిమానముతో శబ్దాదివిషయములందుఁ బ్రవర్తించుచున్నది అని తాత్పర్యము. ౨-౪

తే. ఎఱుకమఱపుల నెఱుఁగెడి యెఱుక నేను
విధినిషేధములను గాంచు విభుఁడ నేను
దర్క్యముల నెల్లఁ దర్కించు తత్త్వ మేను
నేను నేనని వివరించు నేత నేను. ౨-౫

టీ. ఎఱుకమఱపులన్ = ప్రత్యభిజ్ఞానమును విస్మృతిని, ఎఱిఁగెడి= తెలిసికొనుచున్న, ఎఱుక = ఏ తెలివి గలదో, నేను = అదియే నే నైతిని, విధినిషేధములను= వేదములయందు విధింపఁబడిన యజ్ఞాదిక్రియలను, "నకలంజం భక్షయేత్" అను మొదలగు నిషేధములను, కాంచు + విభుఁడను = పరికించుచున్న వ్యాపకుఁడను, నేను = నేనే యైతిని, తర్క్యములన్ - ఎల్లన్ = ఊహింపఁదగినవాని నన్నిటిని, తర్కించు + తత్త్వము= ఊహించెడు వాస్తవస్వరూపము, ఏను= నేనె యైతిని, నేను - నేను - అని "జ్యోతి రహ మస్మి అహ మస్మి బ్రహ్మాహమస్మి" అను మొదలగువాక్యములచే నన్నియు నేనే యైతినని, వివరించు+ నేతను = స్పష్టపఱచుచున్న యధిపతిని, నేను = నేన యైతిని సుమా.

తా. అట్లు శబ్దాది విషయములను దెలిసికొనుచున్న జ్ఞానము మఱల వానిని మఱచుట, వేదవిధులను నిషిద్ధకర్మలను దెలియుచున్న వ్యాపకుఁడను అనుమేయింపఁదగిన యంశముల నెల్ల నూహించెడు వాస్తవస్వరూపమును, పెక్కేల యన్నియు నేనే యని యుపనిషత్తులచేఁ బ్రతిపాదింపఁబడుచున్న యధిపతిని నేనే యైతినిసుమా యని ఫలితార్థము. ౨-౫

అవ. "నాహం దేహో నేంద్రియాణి" అను మొదలగు సభియుక్తుల వచనములనుబట్టియు "అస్థూలోఽహ మనణు" అను తొల్లి గల యుపనిషద్వాక్యములను బట్టియు సర్వనిషేధావధిభూత మగు స్వస్వరూపమును సవిశేషముగఁ బ్రతిపాదించి యిఁకఁ "అత్ర చత్వారిభూతాని" అను మొదలగు బృహస్పతివచనముల ననుసరించు చార్వాకమతావలంబి యగు లోకాయతికుని యభిప్రాయము నెత్తికొనుచు దేహాత్మవాదమును ఖండించుచున్నారు.

క. నే ననిన నన్ను మూర్ఖుఁడు
మే నని వీక్షించుఁ గాన మేల్కని సత్యా
జ్ఞానానందమయునిఁగా
జ్ఞానముచే నెఱుఁగవలయు సద్గుణశాలీ. ౮౬

టీ. సత్ + గుణ + శాలీ = శమదమాదు లగు యోగ్యగుణముల చేత విలసిల్లుచున్న యో హనుమానుఁడా, మూర్ఖుఁడు = ఆత్మానాత్మవివేకము లేని మూఢుఁడు, నేను అనినన్ = నేను అని పలికినతోడనే, నన్నున్ = స్వప్రకాశపూర్ణాఖండ కేవలచిద్రూపుఁడ నగు నన్నును, మేను- అని - వీక్షించున్ = అనృతజడాత్మక మగు స్థూలశరీర మనిగాని, చక్షురాదీంద్రియము లనిగాని, అంతఃకరణచతుష్టయాత్మక మగు సూక్ష్మశరీర మనిగాని తలఁచుకొనును; కానన్ = అదిగావున, మేల్కని = జ్ఞాని యగువాఁడు ఆత్మానాత్మవివేచనఁ జేసి, సత్య+జ్ఞాన+ఆనంద + మయునిన్ + కాన్ = "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ; ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అను మొదలగు నుపనిషద్వచనములచేఁ గాలత్రయాబాధ్యంబు గాన సత్యమును, అనృతజడాత్మకము గామింజేసి చిద్రూపమును, దుఃఖసంభిన్నము కాక పోవుటచే నఖండానందమును, ప్రచురముగఁ గలవానినిఁగ, జ్ఞానముచేన్ =

నదసద్వివేకజ్ఞానముచేతను, ఎఱుఁగవలయున్ = నన్నుఁ దెలిసికొనవల యును.

**తా.** శమము దమము మొదలగు నుత్తమగుణములచే నొప్పుచున్నయో మరున్నందనా! సదసద్వివేకము లేని మూఢుఁడు, నేను అనుశబ్దప్రతిపా ద్యుఁడ నగునన్నను, అనృతజడదుఃఖరూపము లగు స్థూలశరీరాదులనుగాను జూచుచుండును గావున, జ్ఞానియగువాఁడు ఆత్మానాత్మవిచారణను గురు శాస్త్రోక్తులచేతను యుక్తిచేతను స్వానుభవముచేతను లెస్సగఁ జేసి, యజ్ఞాననిద్రనుండి తెలివిఁ దెచ్చుకొని, సత్యము జ్ఞానము ఆనందము ప్రచు రముగఁ గలవానినిగ నన్ను జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనవలయును. స్థూల సూక్ష్మ కారణ శరీరములకు విలక్షణాఖండానంద చిద్రూపునిగ నన్ను నెఱుఁగవలయు నని ఫలితము. ౮౬

అవ. నాస్తికులు మొదలగు మూఢులు దేహమే యాత్మ యనుకొనుటకు హేతువును జెప్పుచు నిజస్వరూపమును బ్రతి పాదించుచున్నారు.

క. నే ననినఁ దనువునకు నభి
మానమునకు నర్థ మగుఁ బ్రమాదమువలనన్
గాన నివి రెండనర్థము
లౌ నేనన నేన కేవలాత్ముఁడ ననఘా! ౮౭

**టీ.** అనఘా = సంసారసంబంధమగు రాగాదిదోషములు లేనియో యాంజనేయా, నేను అనినన్ = నేను అనుపదమును బలికినతోడనే, తనువునకున్ = స్థూలశరీరమునకును, అభిమానమునకున్ = అహంకారము నకును, అర్థము = వాచ్యార్థము, ప్రమాదమువలనన్ = అజ్ఞానజన్యమగు భ్రాంతిచేత, అగున్ = అజ్ఞానికిఁ దోఁచును; కానన్ = ఇట్లు భ్రాంతిచే నపార్థములు గలుగుటచేత, ఇవి రెండున్ = ఈ అపార్థములు రెండును,

అనర్థములు = సంసారరూప మగు ననర్థమును జేయునవి, లేక నే నను శబ్దము నకు ముఖ్యార్థములు కానివి, కౌను = అగును, (కాఁబట్టి), ఏను అనఁగా = నేను అనఁగా, కేవల + అర్థుఁడను = స్థూలశరీరాదులసంబంధము లేని కేవలచిద్రూపుఁడ నగు, నేను-అ = నేనే సుమీ.

తా. సాధారణముగ లోకమునందు నేను అని పలికినపోడనే స్థూలశరీరమునకును అహంకారమునకు నని పామరులకు నజ్ఞానమువలన నర్థము గలుగును. ఈ రెండర్థములు నపార్థములే యగుటచేత నీ సంసారరూప మగు ననర్థము సామాన్యముగ నెల్లరకును గలుగుచున్నది. కాబట్టి నజ్ఞానరూపప్రమాదము లేని యో రామాంజనేయా! నేను అనుపదమునకుఁ గేవలచిద్రూపుఁడ నగు నేనే యను నర్థమును జేకొనుము. ౮౭

అవ. ఇట్లు అహంప్రత్యయాలంబన మగు నిజస్వరూపమును బ్రతిపాదించి, యిట్టి ప్రత్యగాత్మకును జీవాత్మకును నభేదమును జెప్పుచున్నాఁడు.

క. నానానూనుని నని న
న్నే నేనన నిన్ను నన్ను నే నేనన ననినఁ
నేనని నే నన్నా నా
నే నను నన్నెన్ని నన్ను నే నిను నే నననా! ౮౮

టీ. నన్ను + ఏ = శుద్ధసత్త్వప్రధాన మాయోపాధికుఁ డగుటచే సర్వజ్ఞత్వాదిగుణములు గల యీశ్వరుఁడ ననునభిమానముతో నీ కిట్లుపదేశమును జేయుచున్న శ్రీరామాకాంతుఁడ నగు నన్నే, నానా + అనూనిన్ = నిరవధికానంతకల్యాణగుణములచేఁ గొదువ లేని పరమపురుషునిగ, అని = నిశ్చయించి, నేను - అనను = నేను చెప్పను; నిన్నున్ = మలిన సత్త్వప్రధానావిద్యోపాధికుఁడ వగుటచేతఁ గించిజ్జ్ఞత్వాది గుణములు గల జీవుఁడ నను నభిమానముతో శిష్యరూపమున నున్న నిన్నును,

నన్నున్ = దేశికరూపమున నిట్లున్న నన్నును, నేను = అస్మత్ప్ర త్యయగోచర మగు పరమాత్మ యని, అనను = చెప్పను, అనినన్ = అనుచున్నప్పుడు, నేను అని = దేహాదులయందు నే నను నభిమానము గల కేవలాజ్ఞానోపహితజీవాత్మ యని, నేను - అన్నానా ? = నేను చెప్పితినా ? అట్లు చెప్పుటలేదు. (కనుక) నేను అను నన్నున్ = సర్వనిషేధావధిభూతుం డయి యస్మ త్ప్రత్యయైకగోచర పరమపురుషుం డనంబడునన్నును, ఎన్ని = ఇది కా దదికాదని దేహాదుల నిరసించుట చేత నిర్ధారణంజేసి, నన్నున్ నిన్నున్ = మాయాఽవిద్యారూపోపాధి ద్వయవిరహితుల మగు మనల నిరువురను, నేను = అస్మత్ప్రత్యయైక గోచరమగు పరమాత్మ, అనను + ఆ = అని చెప్పలేదా ? అనఁగా నిరు పాధికుల మగు మన మిరువురము పరమాత్మయే యని చెప్పియుంటి నని యర్థము.

తా. లోకరక్షణార్థ మిట్లు శ్రీరామరూపముగ నవతరించిన నన్నే, అవాప్తసమస్తకాముఁ డగుటచే నన్నిటిచేతను గొదవలేని పరమపురు షునిగా, నిశ్చయించి నేను చెప్పుటలేదు. మఱియును గురుశిష్యరూపుల మగుమనల నిరువురను గూడ నా పరబ్రహ్మమునుగా నేను పలుకలేదు. ఇట్లని యా బ్రహ్మము మఱియొద్దియనిన, నాస్తికులు చెప్పునట్లు దేహమే నేనని నేను చెప్పుటలేదు గాన నే నను పదముచేతఁ బ్రతిపాదింపఁ బడుచున్న పరమాత్మస్వరూపుఁడ నగు నన్ను నుపనిషద్వాక్యవిచా రణచేతను యుక్తిచేతను ననుభవముచేతను నిర్ధారణంజేసి నన్ను నిన్నుఁ గూడ నే ననుశబ్దముచేతఁ జెప్పఁబడుచున్న పరమాత్మ యనుచున్నా నని ఫలితార్థము.

ఈ పద్యమునకు నింకొకతీరునఁ బ్రతిపదార్థతాత్పర్యములు.

టీ. నానా + అనూనునిన్ = అన్నిటిచేతను గొదవ లేని పర మాత్మునిగ, (ఒక్కనన్ను) అని = నిర్ణయించి, నేను అనను = నేను

చెప్పను, నిన్నున్ నన్నున్ ఏను అనను = అవిద్యామాయోపాధికుల మగు మనల నిరువురను గూడ నా పరమాత్మునిగ నేను పలుకను; అనినన్ = ఇట్లని యాపరమాత్మునిగ నెవరిఁ జెప్పెద ననిన, నేను అని నేను అన్నానా = ఆ పరమాత్మ నేనే యని నేననినయెడల, నేను - అనన + న్నా = "నేతి నేతి" అను మొదలగు నుపనిషద్వాక్యముల చేతను యుక్త్యనుభవములచేతను దేహాదినిరసనమును జేసి అస్మత్ప్రత్యయగోచర మగు స్వస్వరూపమును, ఎన్ని = మహదాదికార్యకరణసంఘాతముకంటె విలక్షణ మైనదానిఁ ఎంచి, నన్నున్ నిన్నున్ = మాయావిద్యాత్మకోపాధిద్వయవినిర్ముక్తుల మగు మనల నిరువురను, నేను అనను ఆ = ఆ పరమాత్మునిగ నేను చెప్పనా? - పరమాత్మకును మనకును భేదము లేదని తప్పక చెప్పెద నని యర్థము.

తా. సాక్షాత్పరమాత్మాంశావతారునిగ నన్ను లోకు లనుకొనునట్లు ఒక్కనన్నే యాపరమాత్మునిగ నేను నుపదేశింపను. మఱియు నిట్లు మాయావిద్యోపాధికుల మై గురుశిష్యరూపమున నున్న మనల నిరువురనుగూడ నిరుపాధికమగు నా పరబ్రహ్మమునుగ నేను పరిగణింపను; ఆ పరమాత్మయే నేనని చెప్పితి. నా యుపాధిద్వయవినిర్ముక్తుల మగు నపుడు మన మిరువురమును నిరుపాధికమై యస్మత్ప్రత్యయైకగోచర మగు నాపరబ్రహ్మమే యని తప్పక చెప్పుచున్నాను. (అస్మత్ప్రత్యయైకగోచరము అనఁగా నేను అను ప్రతీతికి మాత్రము విషయ మైనది బ్రహ్మ మని యర్థము.) ౮౮

అవ. ఇట్లు సూచింపఁబడిన "నేతి నేతి" యను వాక్యార్థమును వివరించుచు నఖండైకరసపరమాత్మస్వరూపమును నిరూపించుచున్నారు.

క. మేను మనము మానము మును
నే ననుమానమ్ము మాని నేనెమ్మున న
న్నే నే నని నమ్మిన నీ
మౌన మనూనానుమాన మై మను నెమ్మిన్. ౮౯

టీ. మేను = స్థూలశరీరమును, మనము = అంతఃకరణరూప మగు సూక్ష్మశరీరమును, మానము = ఈ శరీరద్వయమునందలి యభిమానమును, నేను అను మనమ్మున్ = నేననియెడితలంపును, మును = తొలుత, మాని = విడిచి, నేమమ్మునన్ = నియమముతో, నన్నే = అస్మత్ప్రత్యయైకగోచర బ్రహ్మస్వరూపుఁడ నగు నన్నునే, నేను అని = అవిద్యోపాధివినిర్ముక్తుఁడ నైన నే నని, నమ్మినన్ = విశ్వాసము గలిగిన యెడల, ఈ మానము = ఈ విశ్వాసము, అనూన + అనుమానము - ఐ = కొదవ లేనట్టియు యుక్త్యనుభవముల ననుసరించునట్టియు నుపనిషత్ప్రమాణము గలదియై, నెమ్మిన్ = నెమ్మదిగా, మనున్ = అఖండైకరసమై ప్రబలును.

తా. స్థూలశరీరమును సూక్ష్మశరీరమును శరీరద్వయాభిమానరూప మగు కారణశరీరమును నేను అను నహంకారము గల తలఁపును విడిచి బ్రహ్మజ్ఞానైకనిష్ఠతో నస్మత్ప్రత్యయైకగోచరుఁడ నగు నన్నునే, యవిద్యోపాధివినిర్ముక్తుఁ డగు తన్నుఁగా నమ్మినయెడల నీ నమ్మకము కొదవలేని తన యుక్త్యనుభవముల ననుసరించిన యుపనిషత్ప్రమాణము గలదై యఖండైకరసముగఁ బ్రబలును. ౮౯

అవ. కార్యకరణసంఘాతవిలక్షణ మైన పరబ్రహ్మమే మనమైనచో నింద్రియాదులయు మనస్సుయొక్కయు వ్యాపారములు మనమే చేయుచున్న ట్లనుకొనుటకుఁ గారణ మేమి యనిన నిదియెల్ల నజ్ఞానకల్పిత మని చెప్పుచున్నారు.

క. మన మేపనిఁ జేసిన నది
మనమే చేసితి మటంచు మదిఁ దోఁచు సనా
తన మై ద్యోతన మై చే
తన మై తగుమనకుఁ గల్పితం బిది యనఘా. ౯౦

టీ. మనము = సంకల్పవికల్పాత్మక మగు మానసము, ఏపనిన్ చేసి నను = పుణ్యరూపముగాని పాపరూపముగాని యగు నేకర్మ నాచరించి నను, అది = ఆకర్మను, మనమే = అజ్ఞానోపహితులగు జనులు తామే, చేసితిమి అటంచున్ = నెఱవేర్చితిమని, మదిన్ = వారివారి మనస్సునందు, తోఁచున్ = స్ఫురించును; అనఘా = అజ్ఞానరూప మగుదోషము లేని యోహనుమానుఁడా, ఇది = మనస్సు చేయుచున్నవ్యాపారము నెల్ల తామే చేయుచున్నట్లనుకొనుట, సనాతనము - ఐ = సత్యస్వరూప మగుటచే కాలత్రయాబాధ్యమాన మైనదియు, ద్యోతనము ఐ = ఆనందఘనం బగుటచే స్వయంప్రకాశమాన మైనదియు, చేతనము = చిద్రూప మైనదియు నైన పరబ్రహ్మము, ఐ తగు = అగుచు నొప్పుచున్న, మనకున్ = సోపాధికులమగు నస్మదాదులకు, కల్పితంబు = అజ్ఞానముచే నారోపింపఁబడినది.

తా. "మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః" అను [illegible] మనస్సు, పుణ్యకర్మగాని పాపకర్మగాని యేది గావించినను, ఆయాపనుల నెల్ల తామే యొనరించుచున్నార మను భ్రాంతిచే, సాధారణముగఁ బామరులందఱు ననుకొనుచున్నారు. ఇట్లు మనఃకృత్యమును దాము చేయుచుంటి మనుకొనుట సచ్చిదానందసాంద్రపరమాత్మస్వరూపుల మగుచు నొప్పుచున్న మనకు నజ్ఞానకల్పితము గాని వాస్తవము గాదుసుమీ! యని తాత్పర్యము. ౯౦

అవ. జననమరణాదివికృతులు లేక సచ్చిదానందఘన స్వప్రకాశ మగు బ్రహ్మము నేనే సుమీ యని [illegible]

చున్న నా వచనమునందు విశ్వాసము నుంచు మని యుపదే శించుచున్నారు.

చ. నమ్ము మనమ్ములో ననుదినమ్ము వెలుంగుచిదాత్మసత్ప్రభా
వమ్ము నిజమ్ము నేను నిధనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములు కర్తృకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లే వను ఘనమ్మగు నావచనమ్ము నెమ్మదిన్.

టీ. నేను = అస్మత్ప్రత్యయైకగోచరము (నే ననియెడు ననుభవమునకుమాత్రము విషయము) అగుబ్రహ్మము, వెలుంగు = ప్రకాశించుచున్న, చిదాత్మ = చిత్స్వరూపముయొక్క, సత్ = త్రికాలాబాధ్య మగు, ప్రభావమ్ము = ప్రకర్షమగుభావము గలది, నిజమ్మున్ = సత్యస్వరూపమును, మఱియు, నాకున్ = నే నను ప్రతీతికి గోచరమగు పరబ్రహ్మమునకు (అహంప్రత్యయాలంబన మగు పరమాత్మకు), నిధనమ్మును = చావును, సంజననమ్మును = ఉత్పత్తియు, రూప + వర్ణమ్ములు = వలము సన్నన నిడుపు కుఱుచ మొదలగు నాకారములును తెలుపు నలుపు పసపు మొదలగు రంగులును, కర్తృ + కార్య + కరణమ్ములు = స్రష్టయు కృత్యములు ఉపకరణములు, వర్ణ + గుణ + ఆశ్రమ + అభిమానమ్ములు = బ్రాహ్మణ్యము క్షాత్రము మొదలగు వర్ణములు, సత్త్వము రజస్సు మొదలగు గుణములు, బ్రహ్మచర్యము మొదలగు నాశ్రమములు, దీనియందు నహంభావమును, లేవు = కలుగవు; అను + ఘనమ్ము + అగు + నా + వచనమ్మున్ = ఇట్లని యెడు నుత్తమ మగు నాయొక్క పలుకును, నెమ్మదిన్ = శాంతముగ, అనుదినమ్మున్ = నిరంతరమును (ఎల్లప్పుడును), మనమ్ములోన్ = డెందమునందు, నమ్ము = విశ్వసింపుము.

తా. నే ననియెడు ననుభవమునకు మాత్రము విషయమగు (స్వానుభవైకవేద్యమగు) బ్రహ్మము స్వయంప్రకాశము చిద్రూపము త్రికాలాబా

ధ్యము సర్వావభాసకము సత్యము అనియు, చావు పుట్టువు రూపు రంగు మొదలగు వికృతులును, కారణము కార్యము ఉపకరణము మొదలగు సృష్టి పరికరములును, జాతి గుణములు ఆశ్రమములు అహంకారము మొదలగు ప్రకృతిగుణములును, ఆబ్రహ్మానుకకు లేవనియు నొక్కినొక్కి వక్కాణించుచున్న నాయొక్క హితోపదేశవాక్యమును, నెమ్మదిగాఁ జిత్తము నందు నిరంతరమును నమ్ముము. ౯౧

అవ. ప్రపంచము మనోభ్రాంతికల్పిత మని తలంచి ప్రాపంచికసుఖములయందుఁ దలఁపును విడిచి బ్రహ్మమే నే నను నఖండానుభవైకరసికుండవు గమ్మని యుపదేశించుచున్నాఁడు.

చ. అరుచి జనింప నింపగు మహావిషయేచ్ఛలు మాని,మానిత
స్ఫురదభిమానమానసవశీకరణాయత నివాసవాసనం
బౌరయుకు మేను నే ననెడిబుద్ధిని దోఁచుటచేతఁ జేతనే
తరమును గానుగానఁ బరతత్త్వమె విశ్వమభావభావనన్.

టీ. ఇంపగు = ఆపాతమధురములును, మహత్ = అపరిమితములును నగు, విషయ - ఇచ్ఛలు = స్రక్చందనాది విషయములయందలి కోరికలను, అరుచి = విరక్తి, జనింపన్ = పుట్టినతోడనే, మాని = విడిచి, విశ్వము = ప్రపంచము, అభావ + భావనన్ = భ్రాంతికల్పిత మగుటచేఁ గల్ల యను తలఁపుతో, నేను = చైతన్యస్వరూపుఁడ నగు నేను, చేతన + ఇతరమును = చైతన్యవ్యతిరిక్త మగు దేహాదిజడమును, కాను = అగుట లేదు; కానన్ = అదిగావున, పరతత్త్వము + ఎ = నిరుపాధికమగు పరమాత్మయె, ఏను నేను + అనెడి + బుద్ధినిన్ = అఖండాకారముగ నేను నే ననుస్థితప్రజ్ఞయందు, తోఁచుటచేతన్ = స్ఫురించుచుండుటవలన, మాని త... వాసనన్ - మానిత = ఇవియే నేనని యాదరింపఁబడుచున్నట్టియు, స్ఫురత్ = అట్లు మన్నించుచుండుటచే స్ఫుటముగ నభివ్యక్తము లైనట్టియు

అభిమాన = అహంభావము, మానన = డెందము, వచస్ = వాక్కు, ఘన కాయ = స్థూలశరీరము, (అనునివి) నివాస = స్థానములుగఁ గల, వాసనల్ = సంస్కారమును, (ఇవియే నే ననుతలంపును) పొరయకుము = వహింపకుము.

తా. ఆత్మానాత్మవివేకము లేకపోవుటవలనఁ బ్రియముగఁ దోఁపట్టుచుఁ బరిణామవిరసము లగు స్రక్చందనాది విషయభోగములయందు, "యదహరేవ విరజ్యే త్తదహరేవ ప్రవ్రజేత్" అను మొదలగు నుపనిషద్వచనములనుబట్టి వైరాగ్యము పొడమినతోడనే "యథేఽహ కర్మచితో లోకః క్షీయతే, ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" అను మొదలగు శ్రుతులచే నైహికాముష్మికరూప మగు ప్రపంచమెల్ల నజ్ఞానకల్పిత మగుటచే వినశ్వరమైన దను తలంపుతో నావైషయికభోగములయందుఁ గక్కిన కూటియందుఁ బోలె నఖిలావను వదలి జడములగు దేహాదులు చైతన్యస్వరూపుఁడ నగునేను గాను గాన, సర్వావస్థలయందు నేను నే ననియెడు స్థితప్రజ్ఞయందు స్ఫురించుచున్న యఖండైకరసచిన్మాత్రపరబ్రహ్మమే నే నని యెంచి మనోవాక్కాయకర్మాదులయందు నహంకారమమకారరూప మగుసంస్కారమును బొందకుము, అని నిష్కర్షితార్థము.

అవ. అజ్ఞానము మిథ్యాభూత మని యెఱిఁగి యాత్మానాత్మవివేకదృష్టిచే బ్రహ్మజ్ఞానసంపత్తి గలిగి దేహాదికముఁ దాను గానని యెంచినమహాధీరునకు మోక్షము కరతలామలక మని బోధించుచున్నారు.

చ. ఇరవుగనెన్న నెన్నఁడొక్కయించుక లేకయ యున్న యున్నతిన్
బొరలువికారకారణము లే బోధము దీని తెఱంగు రంగుగా
నెఱిఁగి శమించిమించి పరమేశ్వరభావముఁ బొంది బొందిఁ దా
మఱచిన ధీరధీరుచిరమార్గుఁడు మోక్షముఁ జేరుఁ జేరువన్.

టీ. ఇరవుగన్ - ఎన్నన్ = సదసద్వివేకపూర్వకమగు జ్ఞానముచేత బాగుగఁ బరిశీలించినచో, ఎన్నఁడున్ = ఒకప్పుడైనను, ఒక ఇంచుక = లేశమాత్రమును, లేకయ = ఉండకయే, ఉన్న + ఉన్నతిన్ = ఉన్న దానివలెనే, పొరలు = తోఁపట్టుచున్నట్టి, వికారకారణము = మహదాది కార్యకరణసంఘాతమునకెల్ల హేతుభూతమైనది, అబోధము - అ = అజ్ఞానమే సుమీ; దీని తెఱంగున్ = ఈయవిద్యయొక్క చక్కటిని, రంగుగాన్ = చక్కఁగా, ఎఱిఁగి = గుర్తించి, శమించి = బ్రహ్మజ్ఞానముచే నశింపఁజేసి, పరమేశ్వరభావమున్ = శుద్ధసత్త్వప్రధానమాయోపాధికేశ్వరత్వమును, పొంది = తోఁతెఁ బడసి, బొందిన్ = అవిద్యోపాధికశరీరత్రయమును, తాన్ మఱచిన = స్వయముగ విస్మృతిని జేసినట్టి, ధీర + ధీ + రుచిర + మార్గుఁడు = గంభీరమగు స్థిరప్రజ్ఞచే సొగసైన నడవడిక గల జ్ఞాని, చేరువన్ = దాపుగనే, మోక్షమున్ = ముక్తిని, చేరున్ = పొందును.

తా. మహదాదికార్యకరణసమష్టికెల్ల ముఖ్యకారణమగు నవిద్య, సదసద్వివేకదృష్టిచేఁ బరిశీలించినయెడల నొకప్పుడును లేశమాత్రమైన నుండకయే యున్నదానివలెనే తోఁపట్టును. దీని వైఖరిని లెస్సగా గుర్తెఱింగి బ్రహ్మజ్ఞానముచే సమూలముగఁ బెకలించి తొలఁత సర్వజ్ఞత్వాదిగుణములు గలపరమేశ్వరైక్యమునొంది యా యవిద్యారూపమగు నుపాధిని మఱచినట్టి గంభీరమయినస్థిరప్రజ్ఞచే నొప్పిదమగు నడవడిక గల మహాజ్ఞానివైశము పరబ్రహ్మైక్యరూపమగు ముక్తి నొందు నని ఫలితము. ౯౩

వ. అని యుపదేశించి వెండియు నాత్మస్వరూపం బతిస్పష్టంబుగా నెఱుంగుకొఱకు నింకొక్క పరమరహస్యంబుఁ జెప్పెద సావధానచిత్తుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. ౯౪

టీ. అని = మీఁదఁజెప్పినయట్లు, ఉపదేశించి = సదుపదేశము నొనరించి, వెండియున్ = మరల, ఆత్మస్వరూపంబు = నిజస్వరూపము, అతి

స్పష్టంబుగాన్ = మిక్కిలి సులభముగ, ఎఱుంగుకొఱకున్ = తెలిసికొనుటకొఱకుగాను, ఇంకొక్క + పరమ + రహస్యంబున్ = వేఱొకమహారహస్యాగమును, చెప్పెదన్ = ఉపదేశించెదను, సావధాన + చిత్తుండవు ఐ = చెప్పెడి రహస్యార్థమునందు నేకాగ్రమగుడెందము గలవాఁడవై, ఆకర్ణింపుము = ఆలింపుము, అని ఇట్లు అనియెన్ = అనుచు చెప్పఁబోవురీతిని పలికెను.

తాత్పర్యము సులభము. ౯౪

అవ. "చక్షుషోద్రష్టా శ్రోత్రస్యద్రష్టా మనసోద్రష్టా వాచోద్రష్టా బుద్ధేర్ద్రష్టా ప్రాణస్యద్రష్టా తమసోద్రష్టా సర్వస్యద్రష్టా తత్సర్వస్మాదన్యో మహా నాత్మా" అను మొదలగు శ్రుత్యర్థములను వివరించుచుఁ దొలుత దృశ్యముయొక్కయు దృక్కుయొక్కయు వివేచనమును జేయుచున్నాఁడు.

సీ. కలితశబ్దశ్రోత్రకఘనమనోఽహంకృతుల్
దృశ్యముల్ వీనికి కి దృక్కు నేను
స్పర్శత్వగింద్రియాంకిచన్మనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి కి దృక్కు నేను
సలలితరూపలోకచనమనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి కి దృక్కు నేను
కమనీయరసరసకజ్ఞామనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి కి దృక్కు నేను.

తే. అతిసురభినాసికామకనోఽహంకృతులును
దృశ్యములు గాన వీనికి కి దృక్కు నేను
బహువిధాంతర్బహిస్థప్రకపంచ మెల్ల
దృశ్య మట్లాటఁ బరిపూర్ణకదృక్కు నేను. ౯౫

టీ. కలిత...కృతుల్—కలిత = ధ్వనిరూపమున స్ఫుటమగుచున్న, శబ్ద = శబ్దగుణమును, శ్రోత్ర = శబ్దగుణగ్రాహక శ్రవణేంద్రియమును, మహః + మనస్ = వ్యాపకమగుటచే గొప్పదియగు మనస్సును, అహంకృతుల్ = శబ్దాదులకు నభిమానియగు నహంకారమును, దృశ్యముల్ = ద్రష్ట యగు నాత్మకు గోచరములగుచున్నవి (గావున); వీనికిన్ = పైని జెప్పఁబడిన దృశ్యములగు శబ్దాదులకు - నేను = అహంప్రత్యయాలంబన మగు నాత్మ, దృక్కు = సాక్షి యగుటచేఁ గనిపెట్టునది యగును; స్పర్శ... కృతుల్—స్పర్శ = స్పృశింపఁదగు గుణమును, త్వక్ + ఇంద్రియ = స్పర్శగుణగ్రాహకమగు చర్మేంద్రియమును, అంచత్ + మనస్ = జడములగు స్పర్శగుణత్వగింద్రియములయందు వ్యాపించి యొప్పుచున్న మనస్సును, అహంకృతుల్ = స్పర్శగుణాదులయందు నభిమానమైన యహంకారమును, దృశ్యముల్ = సాక్షియగు నాత్మకు విషయములగుచున్నవి (గావున), దానికిన్ = ఈస్పర్శగుణము మొదలగువానికి, నేను = నేనను ప్రతీతికి నాలంబనమగు నాత్మ, దృక్కు = ద్రష్ట యగుటచేఁ జూచునదియగును; సలలిత...కృతుల్—సలలిత = సొగసైన, రూప = ఆకృతిగుణమును, లోచన = రూపగుణమును గ్రహించెడు నేత్రేంద్రియమును, మనస్ = నేత్రేంద్రియప్రేరక మగు మనస్సు, అహంకృతుల్ = ఈ చక్షురింద్రియాదులయందు నభిమానము గల యహంకారమును, దృశ్యముల్ మొదలగు వాక్యశేషము గతార్థము. కమనీయ...కృతుల్ - కమనీయ = ఇంపగు, రస = చవిరూపమగు గుణమును, రసజ్ఞా = ఆ చవిని గ్రహించెడు రసనేంద్రియమును, మనస్ = రసనేంద్రియమును ప్రేరేపించుమనస్సును, అహంకృతుల్ = ఈ రసనేంద్రియమనస్సులయందు నభిమానము గల యహంకారమును, దృశ్యముల్ మొదలగునవి గతార్థము. అతి - కృతులును - అతిసురభి = మంచి వాసనారూప మగు గంధగుణమును, నాసికా = గంధగుణగ్రాహకఘ్రాణేంద్రియమును, మనస్ = ఘ్రాణేంద్రియప్రేరక మగు మనస్సును, అహం

కృతుల్ = తదభిమానరూప మగు నహంకారమును, దృశ్యముల్ మొద లగునవి గతార్థము. బహు...ఎల్లన్ - బహువిధ = పెక్కు తెఱంగులను, అంతః = లోపలను, బహిః = వెలుపలను, స్థ = ఉన్నట్టి, ప్రపంచము ఎల్లన్ = సకలజగత్తును, దృశ్యము = ద్రష్టయగు నాత్మకు జ్ఞేయము, అట్లు ఔటన్ = అట్లు సాక్షికి గోచరమగుటచేత, నేను = నే నను ప్రతీతికి మాత్రము గోచరమగు నాత్మ యనుట, పరిపూర్ణ+దృక్కు = సంపూర్ణముగఁ గనిపెట్టునది యగును.

తా. శబ్దస్పర్శరూప రసగంధము లనునైదువిషయములును, నీ యైదు గుణములను గ్రహించెడు శ్రోత్ర త్వక్ చక్షు ర్జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియపంచకమును, వీని నెల్ల వ్యాపించి ప్రేరణఁజేయు మనస్సును, వీని యన్నిటియందు నభిమానరూపమగు నహంకారమును, మఱియుఁ బలుతెఱంగులం బరఁగు లోను పైనిఁ గల సమస్తప్రపంచమును ద్రష్ట యగునాత్మకు గోచరమగుటచే జ్ఞేయమైయున్నదిగాన నేనను ప్రతీతికి మాత్ర మనుభవైకవేద్యమగు నాత్మసాక్షియై యున్న దని ఫలితార్థము.

వ. అది యెట్లంటేని.

టీ. ఆత్మ సాక్షి యగుట యెట్లనియడిగితివేని చెప్పెద నాలకింపుము.

సీ. శబ్దాదివిషయపంచకము దృశ్యం బగు
 శ్రవణాదికరణపంచకమునకును
శ్రవణాదికరణపంచకము దృశ్యం బగు
 తతమనోబుద్ధ్యహంకృతుల కరయఁ
దతమనోబుద్ధ్యహంకృతులు దృశ్యం బగుఁ
 బరిపూర్ణదృక్స్వయంబ్రహ్మమునకుఁ
బరిపూర్ణదృక్స్వయంబ్రహ్మంబు నగునాకు
 దృశ్యత్వ మెందుఁ జింతింప లేదు

తే. గాన నిరతిశయస్వప్రకాశ నిర్వి
కార నిర్విష యావ్య యాకాశకల్ప
కల్పనాతీత సచ్చిత్సుఖస్వరూప
సురుచిరాఖండశుద్ధవస్తువును నేను. ౯౬

టీ. శ్రవణ + ఆది + కరణ + పంచకమునకున్ = శ్రోత్రము మొదలగు నింద్రియములు నైదింటికిని, శబ్ద + ఆది + విషయ + పంచకము = చప్పుడు మొదలగువిషయము లైదును, దృశ్యంబు అగున్ = తెలియఁబడునవి యగును, తత + మనస్ + బుద్ధి + అహంకృతులకున్ = అట్లు శబ్దాదులకు జ్ఞాతలగు మనస్సు బుద్ధి యహంకారము నను నంతఃకరణ చతుష్టయమునకు (ఇందు మనస్సులోఁ జిత్త మంతర్భూతము గాన నుపలక్షణము) శ్రవణ + ఆది + కరణ + పంచకము = శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియము లైదును, దృశ్యంబు అగున్ = గోచరము లగును; అరయన్ = పరిశీలింపఁగా, పరిపూర్ణ + దృక్ + మయ + బ్రహ్మమునకున్ = ఎల్లయెడల వ్యాపించినదియు ద్రష్టయు నగు పరమాత్మకు, తత + మనస్ + బుద్ధి + అహంకృతులు = అన్నిటియందుఁ బ్రసరించెడు మనస్సును బుద్ధియు నహంకారము నను నంతఃకరణచతుష్టయము, దృశ్యంబు - అగున్ = గోచరము అగును; పరిపూర్ణ + దృఙ్మయ + బ్రహ్మంబును + అగు + నాకున్ = అన్నిటియందు నిండియున్న ద్రష్ట యగు పరమాత్మయే యగు నేనను ప్రతీతికి మాత్రము గోచరమైన (స్వానుభవైకవేద్యమయిన) యాత్మకు, చింతింపన్ = ఆలోచింపఁగా, ఎంతును = ఎప్పుడును, దృశ్యత్వము = వేఱొకదానికి గోచరమగుట, లేదు = సంభవింపదు, సర్వసాక్షి యగుపరమాత్మకు వేఱొకసాక్షి నంగీకరించినచో నాయాత్మకు మఱియొకయాత్మయు దానికింకొకయాత్మయు నని సాక్షిత్వమున కనవస్థాపాతము నసైకాంత్యము సంభవించును గాన పరమాత్మ

స్వప్రకాశ మగుటచే. దేనికిని గోచరము కాదు, అనునీయర్థమునందు "న తత్రసూర్యోభాతి నచంద్రతారకం నేమావిద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః" అను మొదలగు ననేకశ్రుతులు ప్రమాణము; కానన్ = ఇట్లాత్మకు వేఱొకద్రష్ట కాకపోవుట యాత్మసర్వసాక్షియు నగుట చేతను, నిర...శ్రను - నిరతిశయ = తనకంటె వేఱొకయుత్తమవస్తువు లేనిదియు, స్వప్రకాశ = తనకుఁ దా వెలుఁగొందు చున్నదియు, నిర్వికార = ప్రకృతికి నతీత మగుటచే జననమరణాదివికృతులు లేనిదియు నిర్విషయ = స్వానుభవైకసంవేద్య మగుటచే నొకదానికి గోచరము కానిదియు, అవ్యయ = సద్రూప మగుటచే నాశము లేనిదియు, ఆకాశకల్ప = పైని చెప్పినలక్షణములు గొన్ని యాకసమునందుఁ బట్టుటచే మింటికి నెనయైనదియు, లేక చిదంబరస్వరూపమును, "ఆకాశోహవై నామరూపయో ర్నిర్వహితా" అను శ్రుతిమూలమునఁ గల యాకాశాధికరణార్థము నిచ్చోట గమనించునది. కల్పనాతీత = ప్రకృతిరూప మగు ప్రపంచరచనకు విలక్షణ మైనదియు, సత్ + చిత్ + సుఖ + స్వరూప = 'సచ్చిదానందఘనం పరంబ్రహ్మ' అను మొదలగు నుపనిషద్వచనప్రమాణముచేతను, యుక్త్యనుభవములచేతను, సత్యస్వరూపమును జడభిన్న మగుటచే శుద్ధచైతన్యస్వరూపమును దుఃఖసంభిన్నము కాకపోవుటచే నానందఘనమ్మును; సురుచిర = మహాజ్ఞానులకు మిగుల రమణీయమును, అఖండ = సర్వపరిపూర్ణ మగుటచే నపరిచ్ఛిన్నమును, శుద్ధ = ప్రకృతి సంబంధము లేకపోవుటచేత నతిపరిశుద్ధమును, నగు, వస్తువును = పర వస్తువును, నేను = నే నను ననుభవైకవేద్య మగు నాత్మయే స్వరూపుఁడ నగు నే నైతిని.

తా. ఆకాశాది పంచమహాభూతములయొక్క గుణము లగు శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదుగుణములును వరుసను శ్రోత్ర త్వ

క్చక్షుర్జిహ్వా ఘ్రాణము లను జ్ఞానేంద్రియము లైదింటికిని విషయము లయి జ్ఞేయము లగును; ఈ జ్ఞానేంద్రియపంచకము మనోబుద్ధ్యహంకారములకు గోచర మగుచున్నది. మనస్సు మొదలగు నీ యంతఃకరణచతుష్టయమునకు సర్వవ్యాపక మయి సర్వసాక్షి యగు పరమాత్మకు జ్ఞేయ మగుచున్నది. అజ్ఞానావరణవిరహితుఁడ నగుటచే నా పరమాత్మస్వరూపుఁడ నయి సర్వద్రష్ట నగుదు; నాకు నాలోచించి చూచినయెడల నొకదానికి గోచరమగుట యెన్నఁడును గలుగదు. ఇట్లగుటం జేసి నేను పరబ్రహ్మము, తన్ను మించినవేఱొకవస్తువు లేనిదియు, స్వసంవేద్య మగుటచే స్వయంప్రకాశమానమును, ప్రకృత్యతీత మగుటచే షడ్భావవికారములు లేనిదియు, మనసునకుఁ దా గోచరమగుటచే నొకనికిని దెలియఁ దగినది కానిదియు, నిత్యస్వరూప మగుటచే నాశము లేనిదియు, ఆకాశమునం దీ లక్షణములు కొన్ని గలిగియుండుటచేత మింటిని బోలినదియు, ప్రకృతివికృతిరూప మగు ప్రపంచకల్పనకు విలక్షణ మైనదియు, సద్రూపమును చిత్స్వరూపమును ఆనందఘనము నగుటచే మనోజ్ఞమును నపరిచ్ఛిన్నమును పరిశుద్ధము నగుపరవస్తువును సుమీ యని తా. ౯౭

అవ. బ్రహ్మము అన్యప్రకాశ్యము కా దనుటను సహేతుకముగఁ బ్రతిపాదించుచున్నారు.

వ. అట్టి దృగ్వస్తువు నైననాకు దృశ్యత్వంబు గలుగ దెట్లనిన వినుము. దృక్కును, సంవిత్తును, జిత్తును, జ్ఞప్తియు, జ్ఞానంబును, బోధంబును, జైతన్యంబును నగునివి ఘటకుంభకలశశబ్దంబులభంగిఁ బర్యాయనామంబు లట్లగుట దృక్కునైన నన్నవలోకించునది దృగన్యంబనిన దీపభాస్యంబులై జడంబులైన ఘటాదులు, భాసకం బైనదీపంబుం బ్రకాశింపం జేయనేరనివగిది, నాచేతఁ బ్రకాశ్యం

బులై యచేతనంబు లైన యహంకార మనోనేత్ర రూపా దికంబులు ప్రకాశకం బైన మత్స్వరూపంబుం దెలియ నోపవు; దృగంతరం బనిన నాదృగంతరంబు స్వల్పప్రభా రూపం బైనప్రదీపం బనల్ప తేజోవంతుం డగు భాను మంతుని వెలిఁగింపలేనిచందంబున నికృష్టంబై యెఱుంగ సమర్థంబు గాదు, సమానం బై తేజరిల్లం జేయు ననిన రత్నంబు స్వసదృశ రత్నాంతరంబును భాసిల్లం జేయ క్షమంబు గానిపోలిక, మత్సమం బై విలసిల్లం జేయ శక్తంబు గా దదియునుం గాక వేదాంతంబులయందుఁ జైతన్యద్వయం బను క్తంబు, అది య ట్లుండనిమ్ము; సము త్కృష్టంబై కాంచు ననిన నదియు మఱియొకదృగంతరం బునకు దృశ్యంబు గావలయు, నట్లయిన దానిం గనుంగొ నుదృగంతరాంతరం బింకొక్కటి యనిన ని త్తెఱంగున నసంఖ్యాతదృగంతరాంగీకారంబు దోఁచు; నందునలన నవస్థాదోషంబు ప్రాప్తంబగు; నట్లుగాక కొన్నిదృగంతరం బుల నూహించి యొక్కటి నిలిపి యిటమీఁద దీనికి ద్రష్ట లేదనిన నన్నింటికిం గలుగ నితని కెట్లు లేకుండుఁ, గలండ నిన వానికి వ్యభిచారంబు వచ్చు; నివ్విధంబుగాక మొదటి దృగంతరంబు నిరతిశయం బనిన నెయ్యది సర్వకారణంబై నిష్కారణంబై తనకంటె నితరంబైన సర్వంబును సాధ నంబు లేకయ తాన వీక్షించు నదియె నేను గావున స్వప్ర కాశపరిపూర్ణ దృష్టియబ్రహ్మంబు నగుదు నని యుపదే శించి మఱియు ని ట్లనియె.

టీ. అట్టి + దృక్ + వస్తువును + ఐన + నాకున్ = మీఁదఁ జెప్పినలక్షణములు గల ద్రష్టృరూపమగు నుత్తమవస్తువు నగు నేనను ప్రతీతికి మాత్రము పాత్రమగు బ్రహ్మమునకు, దృశ్యత్వంబు = ఒకనిదానికి విషయ మగుట, కలుగదు = సంభవింపదు; ఎట్లుఅనినన్ = అది ఏతీరున నని యడిగితివేని, వినుము = చెప్పెద నాలకింపుము; దృక్కును - సంవిత్తును - చిత్తును - జ్ఞప్తియు - జ్ఞానంబును - చైతన్యంబును, అను + ఇవి = అనియెడు శబ్దములు, ఘట - కుంభ - కలశ - శబ్దంబుల - భంగిన్ = కడవ - బాన - కుండ యను పదములవలెనే, పర్యాయ - నామంబులు = ఒకటియేయర్థము గల మాఱుపదములు, అట్లు అగుటన్ = అట్లు దృక్కు సంవిత్తు మొదలగునవి పర్యాయపదము లగుటచేత, దృక్కును + ఐన + నన్నున్ = సర్వావభాసకమగు పరమాత్మను, అవలోకించునది = పరికించునది (వెలుఁగొందఁ జేయునది), దృక్ + అన్యంబు = వేఱొకద్రష్ట, అనినన్ = అని చెప్పినయెడల, దీప + భాస్యంబులు - ఐ = ప్రదీపముచేతఁ దేజరిల్లఁజేయఁబడునవియై, జడంబులు ఐన = తెలివిలేనివి యగు, ఘట + ఆదులు = కడవలు వలువలు మొదలగునవి భాసకంబు + ఐన + దీపంబున్ = తమ్ముఁ బ్రకాశింపఁ జేయు దివ్వెను, ప్రకాశింపన్ - చేయన్ - నేరని + పగిదిన్ = వెలుఁగొందఁజేయ సమర్థములు గానియట్లు, నా చేతన్ = పరమాత్మునివలన, ప్రకాశ్యంబులు - ఐ = భాసిల్లఁజేయబడుచున్నవై, అచేతనంబులు - ఐన = జ్ఞానశూన్యము లగు, అహంకార + మనస్ + నేత్ర + రూప + ఆదికంబులు = అంతఃకరణచతుష్టయము జ్ఞానేంద్రియపంచకము, ఆకాశాది పంచమహాభూతములు శబ్దాదిగుణములు మొదలగు సకలప్రపంచము, ప్రకాశకంబు - ఐన + మత్ + స్వరూపంబున్ = ద్రష్ట నగు నాయొక్క స్వరూపమును, తెలియన్ - ఓపవు = ఎఱుంగుటకు సమర్థములు గావు; దృక్ + అంతరంబు - అనినన్ = వేఱొకద్రష్ట నీస్వరూపము నెఱుంగవచ్చు నని యంటివేని,

ఆ + దృక్ + అంతరంబు = అట్టివేఱొకద్రష్ట, స్వల్పప్రభారూపంబు ఐన - ప్రదీపంబు = కొంచెపువెలుఁగు గలదివ్వె, అనల్ప + తేజోవంతుఁడు + అగు + భానుమంతునిన్ = హెచ్చైనవెలుఁగు గల వేఁడివెలుఁగును, వెలిఁగింపన్ - లేని చందంబునన్ = భాసిల్లఁజేయఁ జాలనివిధంబున, నికృష్టంబు - ఐ = స్వల్పమైనదై, ఎటులంగన్ = "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను మొదలగుశ్రుతులచేత నపరిచ్ఛిన్న మగు నాస్వరూపమును దెలిసికొనుటకు, సమర్థంబు కాదు = సామర్థ్యము గలది కానేరదు; సమానంబు - ఐ = ఆదృగంతరము నీకుఁ దుల్యమగు స్వరూపముగలదియై, తేజరిల్లన్ చేయుటన్ = నిన్ను ప్రకాశింపఁ జేయవచ్చును, అనినన్ = అని యంటివేని, రత్నంబు = మానికము, స్వ+సదృశ+రత్న+అంతరంబునన్=తనతో సమానమగు వేఱొకమానికమును, భాసిల్లన్ - చేయన్ = ప్రకాశింపఁజేయుటకు, క్షమంబు - కాని - పోలికన్ = సామర్థ్యము గలది గానిపగిదిని, మత్ + సమంబు = నాకుఁ దుల్య మగు స్వరూపము గలదియై, విలసిల్లన్ - చేయన్ = నన్నుఁ ప్రకాశింపఁజేయుటకు, శక్తంబుకాదు=సమర్థతగలది కానేరదు; అదియునుంగాక=అంతియకాక, వేదాంతంబులయందున్ = ఉపనిషత్తులయందు, చైతన్యద్వయంబు=దృక్కునకు వేఱొకదృక్కు గలదని రెండుదృక్కులు, అనుక్తంబు = చెప్పఁబడియుండలేదు; అది - అట్లు - ఉండనిమ్ము = దృగ్ద్వయమున కుపనిషత్ప్రమాణము లేకపోవుట యటులుండనిమ్ము, సముత్కృష్టంబు - ఐ = ఆదృగంతరము నీకంటె గొప్పది యై, కాంచున్ = నిన్నుఁ జూడఁగలదు; అనినన్ = అంటివేని, అదియున్ = ఆ గొప్పదృక్కును, మఱియొక దృగంతరంబునకున్=తనకంటె గొప్పదియగు వేఱొకద్రష్టృ చైతన్యమునకు, దృశ్యంబు-కావలయున్ = గోచరముకాఁదగియుండును. అట్లు అయినన్= మొదటిద్రష్టకు వేఱొక పెద్దద్రష్ట, ఆ ద్రష్టకు మఱియుం బెద్దద్రష్టయుఁ గలిగినచో, దానిన్= ఆ దృక్కును, కనుంగొను = పరికించునట్టి, దృక్ +

అంతర+అంతరంబు = మఱియు వేఱొకప్రబలమైన ద్రష్టృచైతన్యము, ఇంకొక్కటి = వేఱొక్కటి గలుగవలయును, అనినన్ = అని పలికిన యెడల, ఈ-తెఱంగునన్ = ఇట్లు చెప్పినతీరున, అసంఖ్యాత = లెక్కకెక్కుడగు, దృగంతర = వేఱు ద్రష్టలయొక్క, అంగీకారంబు = ఒప్పుదల, తోఁచున్ = తోఁపట్టును, అందువలనన్ = అట్లంగీకరించుటచేత, అనవస్థాదోషంబు = తెంపు లేకపోవుట యనుతప్పు, ప్రాప్తంబు అగున్ = తటస్థించును, అట్లుకాక = పోనిమ్మాయనువున ననవస్థాదోషము ప్రాప్తింపకుండ, రెండు+దృక్+అంతరంబులన్ = లెక్కకు లోఁబడిన ఇరువురను గాని ముప్పురను గాని నలువురను గాని వేఱుద్రష్టలను, ఊహించి = ఆలోచించి, ఒక్క-టిన్-నిలిపి = అందుఁ గడపటి యొకద్రష్టను స్థిరపఱచి, ఇట మీఁదన్ = ఈపైని, దానికిన్ = ఈకడపటిద్రష్టకు, ద్రష్ట-లేఁడు-అనినన్ = మఱియొకప్రకాశకుఁ డుండఁడని స్థిరపఱచినయెడల, అన్నింటికిన్ = వెనుకటి ద్రష్టలందఱికిని, కలుగన్ = పైపై ద్రష్ట యుండునపుడు, దీనికిన్ = ఈ కడపటిద్రష్టకు, ఎట్లు-లేక-ఉండున్ = ఏయుక్తిచేఁ గలుగకయుండవలెను ?—కలుగక తీరదు; కలఁడు - అనినన్ = కడపటిద్రష్టకుఁ గూడ వేఱొకద్రష్టయున్నాఁ డని చెప్పఁబోయినయెడల, దానికిన్ = ఆ ద్రష్టకుఁ గూడ, వ్యభిచారము = నిలుకడలేకపోవుట, వచ్చున్ = సంభవించును, ఈ-విధంబు-కాక = ఈ ప్రక్రియను విడిచి, మొదటి + దృక్ + అంతరంబు = తొలుత నంగీకరించినద్రష్ట, నిరతిశయంబు = తనకు వేఱొకద్రష్ట లేనిదగును; అనినన్ = అని చెప్పఁబోయినయెడల, ఏ-ఎది = సాక్షిస్వరూపమగు నేపరవస్తువు, సర్వ+కారణంబు - ఐ = కార్యకరణసంఘాతమునకెల్ల హేతుభూత మగుచు, నిష్కారణంబు-ఐ = తనకు నింకొకకారణభూతమగు వస్తువు లేనిదైయుండి, తనకంటెన్-ఇతరంబు - ఐన+సర్వంబును = తనకు శేషభూత మగుసమస్తప్రపంచమును, సాధనంబు లేక = ఉపకరణమొద్దియును లేకుండ, తాను-ఆ = స్వయముగనే, వీక్షించున్ = పరికిం

చునో (ప్రకాశింపఁజేయునో), అది-ఎ = ఆ సకలసాక్షియె, నేను = నేను నేను ప్రతీతికిమాత్రము పాత్రమగు పరవస్తు వని యర్థము, కావునన్ = ఇట్లగుటంబట్టి, స్వ...బున్ = స్వప్రకాశ = తనకుఁ దా వెలుఁగుచున్నట్టియు, పరిపూర్ణ = అంతట నిండియున్నట్టియు, దృఙ్మయ = సర్వప్రపంచప్రకాశ మయినట్టియు, బ్రహ్మంబున్ = పరవస్తువును, అగుదున్ = ఐయున్నాను- అని, ఉపదేశించి = ఈరీతిని హితోపదేశము నేసి, మఱియున్ - ఇట్లు - అనియెన్ = ఇంక నీరీతిని పలికెను.

తా. మీఁదఁ జెప్పఁబడిన సాక్షిరూప మగు పరబ్రహ్మమునే యైన నాకు నితరప్రకాశత్వము సంభవింపదు. ఏల సంభవింపదని యంటివేని చెప్పెద నాలకింపుము. ద్రష్ట, సాక్షి, సంవిత్తు, ప్రతిపత్తు, చిత్తు, జ్ఞప్తి, జ్ఞానము, బోధ, చైతన్యము, అనుపదము లన్నియు, కడవ, కుండ, బాన, గూన, ఘటము, కలశము, కుంభము అను నుడులవడువున నొకటియే యర్థముగల మాఱుపదములుగాని భిన్నార్థకములు కావు గావున సర్వసాక్షి నగు నన్నుం గనుంగొనుపరవస్తువు వేఱొండుండఁబోలు నని యంటివేని, "నాన్యతోఽస్తి ద్రష్టా నాన్యతోఽస్తి మంతా నాన్యతోఽస్తి విజ్ఞాతా" అను మొదలగు నుపనిషత్ప్రమాణములను బట్టి ప్రదీపముచే వెలిఁగింపఁబడుచున్నవి యై చైతన్యరహితములైన కడవలు వలువలు మొదలగునవి యెట్లుఁ దమ్ము వెలిఁగించెడు నా దివ్వెను వెలిఁగింప సమర్థంబులు గానితీరున, నావలన వెలిఁగింపఁబడుచున్నవియై జడములగు మనోబుద్ధ్యహంకారములు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు శబ్దస్పర్శరూప రసగంధములు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు మొదలగునవి తమ్మఁ బ్రకాశింపఁజేయుచున్నానాయొక్క చిద్రూపము నెఱుంగుటకు సామర్థ్యము గలవి గానేరవు. పోనిమ్మని నిన్నుఁ దెలిసికొనఁజాలక పోయినఁ బోవుఁ గాక, వేఱొకద్రష్ట నిన్నుఁ దెలిసికొనవచ్చు నని యంటి వేని వేఱొకయాద్రష్ట నాకంటెం జిన్నదియా? నాతో సమానమైనదియా? నాకంటెం బెద్దదియా?

నాకంటెం జిన్నది యైనచోఁ గొంచెపువెలుఁగు గలదీపము తనకంటె మిక్కుటమగు కాంతి గల సూర్యునిం బ్రకాశింపఁ జేయఁజాలనిపోలికఁ దనకంటె నెక్కుడగునన్నుఁ బ్రకాశింపఁజేయఁజాలదు. ఆద్రష్ట నాతో సమాన మైనదని యంటివా? మానికము తన కెన యగు వేఱొక రతనమును వెలిఁగింపలేనియట్లు తనతో సమానముగ నన్ను భాసిలంజేయఁ జాలదు. ఇంతియకాక యుపనిషత్తులలో నెచ్చటను చైతన్యమునకు ద్వైవిధ్యముఁ జెప్పియుండలేదు. ఇట్లు శ్రుతిప్రమాణము లేకపోవుటయటుండనిమ్ము! అన్యగంతరము నాకంటె గొప్పదియై నన్నుఁ గనుంగొనవచ్చునని యంటివేని, దానిని దనకంటెఁ బెద్దది యగు మఱి వేఱొకద్రష్ట, పరికింపవలసివచ్చును. ఈప్రక్రియ నొప్పుకొనినయెడల దానినిఁ దనకంటెఁ బెద్దయగు వేఱొక ద్రష్టయు, దాని నింకొక గొప్పద్రష్టయుఁ బ్రకాశింపఁజేయుచు నుండవలయు. ఈ రీతిగ లెక్కలేని పైపైద్రష్టలను పెక్కండ్ర నంగీకరింపవలసివచ్చును. ఇట్లొప్పుకొనినయెడల ననవస్థయను దోషము (హద్దు లేక పోవుట యను గొప్ప తప్పిదము) మీఁదఁబడును. పోని మీప్రక్రియం బట్టి యనవస్థాదోషము ప్రాప్తించినయెడల దీనిన్విడిచి, ఇరువురనుగాని ముగ్గురనుగాని నల్వురనుగాని పైపైద్రష్టల నంగీకరించి యందుఁ గడపటిద్రష్టను స్థిరపఱచి యాద్రష్టకుమీఁద నిఁక ద్రష్టయుండఁడని చెప్పినయెడల వెనుకటిద్రష్టలకుఁ బైపైనిద్రష్టలుండునపు డాకడపటిద్రష్ట కేల యుండఁగూడదనినచో నుండవచ్చునని యొప్పుకొనినయెడల నాకడపటిద్రష్టకు నిలుకడలేమి సంభవించును గాన నీప్రక్రియ నెల్లమాని తొలుతఁ జెప్పినద్రష్టకంటె వేఱొక యుత్తమద్రష్ట లేఁడని యొప్పుకొనినచో నేద్రష్ట సమస్తమునకుం గారణమైనదియుఁ దనకు వేఱొండు కారణము లేనిదియుఁ దనకుఁ బెఱయగు సమస్తమును నేయుపకరణములును లేకయె స్వయముగ నే ప్రకాశింపఁజేయునో యాద్రష్టయే నేనై యుంటినిగనుక తనకుఁ దా వెలుంగుచు నంతటను నిండియుండి సర్వసాక్షిస్వరూప మగు పరబ్రహ్మము నే నైతిని సుమీ యని బోధించి మరల శ్రీరామచంద్రుం డాంజనేయున కిట్లనియె.

అవ. ఇట్లు బాలావబోధముకొఱకు నతివివరముగ నాత్మస్వరూపమును బ్రతిపాదించి ఫలితార్థమును సంగ్రహించి యుపదేశించుచున్నారు.

తే. తెలియఁబడుచున్నవిశ్వంబు దృశ్య మంచుఁ
దెలివి నై సర్వమును గాంచుదృక్కు నేను
మిగుల నాకంటె నన్య మేమియును లేదు
సత్య మిది సర్వవేదాంతసంగ్రహంబు. ౯౮

టీ. తెలియన్ - పడుచున్ - ఉన్న+విశ్వంబు = తనకు గోచరమై యుండునట్టి సమస్తప్రపంచమును, దృశ్యము = తనచేఁ గనిపట్టఁదగినదియైయున్నది. అంచున్ = అనియెడు, తెలివిని+ఐ=జ్ఞానస్వరూపుఁడ నగుచు, సర్వమును = జ్ఞానమును అజ్ఞానజన్యము లగు మనోబుద్ధిచిత్తాహంకారములును శమదమాది సాత్త్వికగుణములు, కామక్రోధాదు లగురాజసగుణములు నిద్రాలస్యాదు లగు తామసగుణములు మొదలగు నాంతరప్రపంచమును శబ్దస్పర్శరూపరసగంధములు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు మొదలగు బాహ్యప్రపంచమును నను సమస్తమును, కాంచు = వీక్షించుచున్న, దృక్కును = సాక్షిస్వరూపుఁడను, నేను = నే నైతిని; నాకంటెన్ మిగులన్ = సర్వద్రష్ట నగు నాకంటెను పైఁగా, అన్యము= వేఱొకదృక్కు, ఏమియును = ఎద్దియును, లేదు = కలుగదు. సత్యము ఇది = ఇట్లు చెప్పఁబడినయర్థము వాస్తవము. సర్వ + వేదాంత + సంగ్రహంబు = ఉపనిషత్తులన్నిటియొక్క ఫలితము.

తా. తనకు గోచరించుచున్న బాహ్యాభ్యంతరరూప మగు ప్రపంచమంతయుఁ దనచేఁ బరికింపఁదగియున్నది అనియెడు జ్ఞానమే స్వరూపముగఁ గలవాఁడనై యంతఃకరణవృత్తులకు గోచర మగు మానసికప్రపంచమును శ్రోత్రాదులగు నింద్రియములకు గోచరమగు బాహ్యప్రపంచము నను సమస్త

ప్రపంచమును గనుఁగొనియెడుసాక్షి నేనైతిని. ఇట్లు సర్వసాక్షినగు నా కంటె పైపెచ్చుగ వేఱొకద్రష్ట యెవ్వఁడును లేఁడు; ఈచెప్పినయర్థము యథార్థము. ఇది యుపనిషత్తులన్నిటియొక్క ఫలితము. ౯౮

అవ. సర్వాతీతుఁడు సర్వసాక్షి సర్వజ్ఞుఁడు శుద్ధచైతన్య స్వరూపుఁడు నగుపరమాత్ముఁడే నేనుప్రతీతికి పాత్రుఁ డని యేకత్వము నుపదేశించుచున్నారు.

క. జీవత్రితయతనుత్రిత
యావస్థాత్రితయములకు నతిరిక్తుఁడు త
ద్భావాభావజ్ఞుఁడు నగు
కేవలచిన్మయుఁడ నేను కీశాధీశా. ౯౯

టీ. కీశ-అధీశ = వానరులలో శ్రేష్ఠుఁడ, నేను = నే నను నస్మదర్థకపదమునకు లక్ష్యార్థభూతుఁ డగుపరమాత్ముఁడు, జీవ...ములకున్ = జీవ + త్రితయ = విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు నను ముగ్గురుజీవులకును, తను + త్రితయ = స్థూలము సూక్ష్మము కారణము అను మూఁడు మేనులకును, అవస్థా + త్రితయ = మెలఁకువ - కల-నిదుర-అనుమూఁడవస్థలకును, అతిరిక్తుఁడు = వెలి యగువాఁడు తత్ + భావ + అభావ + జ్ఞుఁడు = ముగ్గురు జీవులయు మూఁడుమేనులయు మూఁడవస్థలయొక్కయు ఉనికిని లేమినిఁ దెలిసినవాఁడును, అగు = అయినట్టి, కేవలచిన్మయుఁడను = పరిశుద్ధమగుచైతన్యము స్వరూపముగాఁ గలవాఁడను.

తా. ఓ వానరోత్తమా! విశ్వతైజస ప్రాజ్ఞు లను జీవత్రయమునకును, స్థూలసూక్ష్మకారణము లను శరీరత్రయమునకును, జాగ్రత్స్వప్నసుషుప్తు లను నవస్థాత్రయమునకును, భిన్నుఁడనై ఈ జీవత్రయముయొక్కయు, దేహత్రయముయొక్కయు నవస్థాత్రయముయొక్కయుఁ గలిమి

కేములు దెలియంగువాఁ డగు శుద్ధచైతన్యస్వరూపపరమాత్ముఁడను నేను సుమీ యని తాత్పర్యము. ౯౯

అవ. పర యనియు, నపర యనియు నిరుతెఱంగులం బరఁగు ప్రకృతియొక్కయుఁ బురుషునియొక్కయుఁ బ్రకృతి పురుషుల సాక్షి యగు పురుషోత్తమునియొక్కయు స్వరూపమును నిరూపించుచున్నారు.

సీ. భూతపంచకమును బుద్ధ్యహంకారంబు
లవ్యక్తమును నింద్రియములు పదియు
నొక్కటి విషయపంచకమునుఁ జేతనే
చ్ఛాద్వేష సుఖదుఃఖ సంఘధృతులు
తఱము క్షేత్రం బనఁ గడు నొప్పు నిది యప
రాప్రకృతి యనఁగఁ బ్రకృతి యనఁగఁ
నలరు నీ ప్రకృతితోఁ గలసి వర్తించుఁ జి
దాభాసుఁ డక్షరుం డాత్ముఁ డనఁగఁ
తే. బరఁగుక్షేత్రజ్ఞుఁ డనఁ బరాప్రకృతి నాఁగఁ
బురుషుఁ డనఁగ నీరెంటికిఁ బొందు గలుగ
నొనరఁ గనుఁగొను నేఁ బురుషోత్తముఁ డనఁ
బరుఁ డనఁగ వెల్గుచుండుదుఁ బవనతనయ. ౧౦౦

టీ. పవనతనయ ! = ఓకరువలిపట్టి ! భూతపంచకమును = పుడమి మొదలగు నైదుమహాభూతములును, బుద్ధి + అహంకారంబులు = నిశ్చయాత్మక యగు మతియు నేనను నభిమానము గలయహంకృతియును, అవ్యక్తమును = మూలప్రకృతియును, ఇంద్రియములు = శ్రోత్రాదు లగు నైదుజ్ఞానేంద్రియములును, వాక్కు మొదలగు నైదుకర్మేంద్రియములును గలసి యీపదింటికిని మూల మగుమనస్సును అను, పదియునొక్కటి=పదు

నొక టెక్క గలయింద్రియములును, విషయపంచకమును = శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదువిషయములును, చేతన . ఈ-చేతన = చిత్తవ్యాపారము, ఇచ్ఛా = అభిలాషయు, ద్వేష = పగయు, సుఖ = సౌఖ్యము, దుఃఖ=కష్టమును, సంఘ=మహదాదికార్యకరణసంఘాతమును, ధృతుల= ధీరత్వమును, క్షరము = క్షరమును, క్షేత్రంబు = క్షేత్రమును, అనన్ - కముల్ - ఒప్పు-ఇది = అని మిగులవెల్లడియగు నదియొప్పును, పరాకృతి - అనన్-కన్=పరాప్రకృతి యనియు, ప్రకృతి-అనన్-కన్= ప్రకృతి యనియు, అలరున్=ఒప్పును; ఈప్రకృతితోన్ = ఈపరాప్రకృతితోడ, కలసి=కూడి, వర్తించు చిత్ - భాసుఁడు = సంసారమునందు సంచరించుచున్న చైతన్య ప్రతిబింబభూతుఁ డగుజీవాత్ముఁడు, అక్షరుఁడు ఆత్ముఁడు అనన్ కన్ = అక్షరుఁడనియు ఆత్ముఁడనియు, క్షేత్రజ్ఞుఁడు అనన్ = క్షేత్రజ్ఞుఁడనియు, పరాప్రకృతి నాన్ కన్ = పరాప్రకృతి యనియు, పురుషుఁడు అనన్ కన్ = పురుషుఁడనియు, పరగున్ = ఒప్పును, ఈరెంటికిన్ = అపరాప్రకృతి యగుమూలప్రకృతికిని, అపరాకృతిరూపుఁడగు పురుషునకును, పొందు కలుగన్ = సంయోగము ప్రాప్తింపఁగా, ఒనరన్ = తగునట్లు, కనుఁగొను + నేను = సాక్షినై పరికించెడు నేను, పురుషోత్తముఁడు అనన్ = పరమపురుషుఁడ ననియు, పరుఁడు అనన్ కన్ = పరాత్పరుఁడ ననియు (చెప్పఁబడుచు), వెల్గుచున్ ఉండుదున్ = ప్రకాశించుచున్నాను.

తా. పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనియెడుపంచమహాభూతములును, నిశ్చయాత్మకమగు బుద్ధియు నభిమానరూప మగు నహంకారమును, మూలప్రకృతియు, చర్మము మొదలగు జ్ఞానేంద్రియము లైదును, వాక్కు మొదలగు కర్మేంద్రియము లైదును గలసి యీ పదియింద్రియములను ప్రేరణచేయుమనస్సును గూడి పదునొకండింద్రియములును, శబ్ద స్పర్శ రూప రస గంధము లను నైదు విషయములును, నంతఃకరణవ్యాపారమును,

కామ క్రోధములును, సుఖదుఃఖములును, మహత్తత్త్వము మొదలగు కార్య కరణ సంఘాతమును, ధృతియు ననునవి యెల్ల "కార్యకారణరూప స్తు నశ్వరం క్షర ముచ్యతే" అను వచనమువలన వినశ్వర మగు సమస్తజడ పదార్థజాతమును, "క్షర స్సర్వాణి భూతాని" అని గీత గావున క్షరశబ్ద వాచ్యమును, "ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః, ఇచ్ఛా ద్వేషం సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః, ఏతత్ క్షేత్రం" అను గీతావచనముచుబట్టి క్షేత్రశబ్దవాచ్యమును నగుచు నత్యంత వ్యక్తమై తోఁచు నీబాహ్యప్రపంచము, అపరాప్రకృతి యనునట్లుగను, ప్రకృతి యనునట్లు గను, విలసిల్లుచున్నది. అపరాప్రకృతి యనఁబడు నీ మూలప్రకృతితోఁ దాదాత్మ్యము నొంది సంసారయాత్రను జేయుచున్నట్టియు, బింబభూత మగు శుద్ధచైతన్యముయొక్క ప్రతిబింబస్వరూపుఁడైన జీవుఁడు అక్షరుఁడు (కూటస్థుఁడు) ఆత్ముఁడు క్షేత్రజ్ఞుఁడు పురుషుఁడు అను పేరులతోఁ దగుచుఁ బరాప్రకృతిశబ్దవాచ్యుఁ డగుచున్నాఁడు. అపరాప్రకృతి యనఁబడు మూలప్రకృతికిని, పరాప్రకృతి యనఁబడు పురుషునకును మూలవిద్యవలనఁ గలిగిన సంబంధమును సాక్షినై చూచుచున్న నేను, పురుషోత్తముఁడను పరాత్పరుఁడను ననఁబడుచుఁ బ్రకాశించుచున్నాను. ౧౦౦

అవ. పరాత్పరుఁడు మూలావిద్యచేత దేహాదికమే నే ననుకొనునట్లు తనకు నతనికి భేదము లేకపోవుటంబట్టి జ్ఞానముచేత జీవాత్ముఁడు తన్నుఁ బరాత్మునిగఁ దెలిసికొనవలయు నని తత్త్వమస్యాదిమహావాక్యార్థము నుపదేశించుచున్నారు,

క. నే ననుచు నక్షరుం డ
జ్ఞానముచే క్షరము నెఱుఁగుకచందంబున వి
జ్ఞానముచే నప్పురుషుని
నే నని వీక్షింతు వేఱు కనిజముగ లేమిన్. ౧౦౧

టీ. అక్షరుండు = కాలత్రయాబాధ్యుం డగుటచే నాశము లేని పరాత్ముండు, అజ్ఞానముచేన్ = ఆత్మానాత్మజ్ఞానము లేకపోవుటవలన, క్షరమున్ = వినశ్వరమగు శరీరాదికమును, నేను అనుచున్ = తానే యని తలంచుకొనియెడు, పంచమునన్ = పదువున, విజ్ఞానముచేన్ = బ్రహ్మజ్ఞానముచేత, ఆ+పురుషునిన్ = ఆపరమపురుషునిని, నిజముగన్ = వాస్తవముగ, వేఱు = నాకు నతనికిని భేదము, లేమిన్ = శేషశేషిభావమునుబట్టి లేకపోవుటవలన, నేను అని శిక్షింతున్ = ఆ పురుషోత్తముఁడు నేనే యని విలోకించెదను.

తా. "అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ" మను మొదలగు భగవద్వచన ప్రమాణములనుబట్టి, నాశరహితుం డగు జీవాత్ముండు తన్ను భగవన్మాయ యావరింపఁగా సదసద్వివేచనావిహీనుండై వినశ్వర మగు నీశరీరాదికమే తా నని తలంచుకొనుచున్నాఁడు. కాని, నిక్కముగ నీదేహాదికము తానుగాఁడు; తా నెవ్వఁ డనిన, తనకుఁ బరాత్పరునకును గల శేషశేషిభావమునుబట్టి భేద మించుకయు లేకపోవుటవలన బ్రహ్మజ్ఞానముచే మూలాజ్ఞానమును భేదించి యాపురుషోత్తముఁడే తా నని తెలిసికొనవలయును. ౧౦౧

అవ. జీవాత్మపరమాత్మలకు భేదము లే దని పైని జెప్పినయర్థమునే దృష్టాంతపూర్వకముగ వివరించుచున్నారు.

తే-గీ. పరుఁ డగు నాకు నక్షరపురుషునకును
భేద మేమియు లేదు కన్నెట్టిచూడఁ
గలదె వేఱించుకయిన లోకమున ముఖ్య
బింబమునకును దత్ప్రతిబింబమునకు. ౧౦౨

టీ. కన్నెట్టి చూడన్ = జ్ఞానదృష్టితోఁ బరికింపఁగా, పరుఁడను అగు నాకున్ = పరమపురుషాత్మకుఁడ నైననాకును, అక్షర పురుషున

తను = "క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే" అనుటచేత సకలేంద్రియకూటమునకు నధిష్ఠాతగ నున్న జీవచైతన్యమునకును, భేదము = వేఱు, ఏమియును లేదు = ఇంచుకయును లేదు, ఇందులకు నిదర్శన మెట్లనిన, ముఖ్యబింబమునకును = ప్రతిబింబమునకు మూలమయిన సూర్యచంద్రాదుల మండలమునకును, తత్ + ప్రతిబింబమునకును = అద్దము నీరు మొదలగువానియందుఁ బ్రతిఫలించిన యా సూర్యచంద్రాదుల సంబంధ మగు ప్రతిబింబమునకును, వేఱు = భిన్నత్వము, ఇంచుకయినన్ = స్వల్పమయినను, లోకమునన్ కలదు + ఎ = జగత్తునం దున్నదా? భేద మేమియు లేదు.

తా. అద్దము మొదలగువానియందు ప్రతిఫలించిన సూర్యచంద్రాదులయొక్క ప్రతిబింబమునకును నా సూర్యచంద్రాదుల మండలమునకును నాయద్దము మొదలగు నుపాధులనుబట్టి భేదము కనఁబడుచున్నను, నాయా యుపాధులు (అద్దము మొదలగునవి) లేనియప్పుడు ప్రధానము లగు సూర్యచంద్రాదుల బింబములు మాత్రము కన్పట్టుచున్నట్లు పరాత్పరునకు నజ్ఞానముచే దేహాదులయందు నభిమానమునుబట్టి జీవాత్మ యను భేదవ్యవహారము గలిగెనుగాని, జ్ఞానముచే నాదేహాద్యుపాధులయందు నభిమానము పోఁగాఁ గేవలపరమాత్ముఁడ నగు నే నొక్కరుఁడనే నిలుతు నని ఫలితము. ౧౦౨.

అవ. సదసద్వివేకముచేత స్థూలసూక్ష్మరూప మగు నీ కార్యకరణసంఘాతమును నేను గా నని నిరసించినచో జీవాత్ముఁడు పురుషోత్తముఁడ నగునన్నుఁ జేరి మఱల నీ సంసారమునఁ బడక నిత్యనిరతిశయానందస్వరూపుఁ డగు నని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు.

తే-గీ. ఘటము పొలిసినఁ దద్ఘటాకాశ మాక
సమును జెందినకరణి విశజ్ఞానదృష్టి

క్షరము నెడఁబాసి నిర్మలాక్షరుఁడు నన్నుఁ
బొందె క్రమ్మఱఁ బొరయఁడు పూర్వసంజ్ఞ. ౧౦౩

టీ. ఘటము = కడవ, పొలిసినన్ = నశింపఁగా, తత్ + ఘట + ఆకాశము = ఆకుండయందు వ్యాపించిన మిన్ను, ఒకసముననన్ = మహాకాశమునందు, చెందిన + కరణిన్ = కలిసినరీతిని, విజ్ఞాన + దృష్టిన్ = సదసద్వివేకము చేత, క్షరమున్ = వినశ్వరమగు ప్రకృతికృతిసంఘాతము నెల్ల, ఎడన్ పాసి = నేను గానని నిరసించి, నిర్మల + అక్షరుఁడు = ప్రకృతి సంబంధమును విడుచుటచేఁ బరిశుద్ధుఁ డగు క్షేత్రజ్ఞుఁడు, నమన్ = పరమ పురుషుఁడ నగునన్నును, పొందె = చేరి, క్రమ్మఱన్ = తిరుగ, పూర్వ + సంజ్ఞన్ = మునుపటిజీవుఁ డను వ్యవహారమును, పొరయఁడు = పడయఁడు. పురుషోత్తమునందు నైక్యమునొంది మరల నీసంసృతిలోఁ బడఁడని యర్థము.

తా. కడవయందు వ్యాపించియున్న మిన్ను, ఆకడవ నశించిన తోడనే మహాకాశమునందుఁ గలిసి, ఘటాకాశ మను వ్యవహారము పోయిన విధమున, నిది సత్తు ఇది యసత్తు అను విచారణను ప్రమాణయుక్త్యనుభవ పూర్వకముగఁ జేసి వినశ్వరమగు దేహాదికమునందు నభిమానమును మాని, పరిశుద్ధుఁడగు జీవుఁడు పరాత్పరుండ నగు నన్నుఁ జెంది, మరలఁ దుచ్ఛమగు దేహాదికమునందు నభిమానము నుంపక పునరావృత్తిరహిత మగు శాశ్వత పరమపదము నొందును.

అవ. "భూతపంచకమును బుద్ధ్యహంకారంబు" లను మొదలగు వెనుకఁ బ్రతిపాదింపఁబడిన యపరాప్రకృతియొక్కయు స్వరూపమును విశేషాకారముగఁ బ్రతిపాదించుచుఁ బురుషోత్తమతత్త్వము నుపదేశించుచున్నారు.

వ. ఇట్లు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును, మనోబుద్ధ్యహంకారములును, వీనికిఁ గారణం బైన యవ్యక్తంబును,

శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ వాక్పాణిపాదపాయూపస్థలనుద శేంద్రియములును, శబ్ద స్పర్శ రూప రస గంధంబులనుపంచవిషయంబులుం గూడి యిరువదినాలుగు తత్త్వంబులగుఁ గొందఱు వాగాదికర్మేంద్రియపంచకంబును, శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకంబును, శబ్దాదివిషయ పంచకంబును, ప్రాణాదివాయుపంచకంబును, మానసాద్యంతఃకరణ చతుష్టయంబునుం గూడి యిరువదినాలుగు తత్త్వంబులని చెప్పుదురు. ఈచతుర్వింశతితత్త్వంబులను శరీరత్రయంబనియుఁ బంచకోశంబు లనియుఁ బండితులు గణింతురు. ఇది మదీయాపరాప్రకృతి; ఇది క్షేత్రంబు క్షరంబు ప్రకృతి యనాత్మదృశ్యంబు అసత్తు జడంబు దుఃఖాత్మకంబు సంసారంబు అన నొప్పు; తప్తాయఃపిండంబుతోఁ గూడి ప్రకాశించు కృశానునిచందంబున మిథ్యాతాదాత్మ్యధ్యానంబుచేత, దీనితో నెనసి ప్రవర్తించు మదంశభూతుం డైన జీవుండు పంచవింశకుం డితం డస్మదీయపరాప్రకృతి క్షేత్రజ్ఞుం డక్షరుఁడు పురుషుం డాత్ముఁడు ద్రష్ట సద్రూపకుఁడు చేతనుం డానందమయుండు సంసారి యనం దేజరిల్లుచుండు; నిది యెట్లనినఁ బూర్వోక్తతత్త్వంబులలోఁ బ్రధానావయవంబు సర్వకారణాశ్రయంబు సకలవాసనామయం బనాద్యనిర్వచనీయాజ్ఞానకల్పితంబు లైన బుద్ధ్యహంకారాత్మకాంతఃకరణ వృత్తివిశేషంబునందు జలఘటంబునం దాదిత్యప్రతిబింబంబును, దర్పణంబునందు ముఖాభాసంబుం దోఁచినవిధంబున సన్మచ్ఛాయ ప్రతిఫలించి తదుపాధికుం డై కరణభోగ్య జ్ఞానప్రమాణశబ్దవాచ్యం బైన స్థూలగోళకోష

హితజ్ఞానకర్మేంద్రియ ప్రాణపంచక సమన్విత మనశ్చిత్తాత్మకాంతఃకరణ వృత్తి విశేషసాధనంబుచేతఁ గార్యభోగక్షేత్రప్రమేయ శబ్దవాచ్యంబు లైన శబ్దాదివిషయంబుల ననుభవించుచుఁ గర్తయు భోక్తయు జ్ఞాతయుఁ బ్రమాతయు శ్రోతయు స్ప్రష్టయు ద్రష్టయు రసయితయు ఘ్రాతయు వక్తయు దాతయు గంతయు విసర్జితయు నానందయితయుఁ బ్రాణియు మంతయు దేహియు జీవుండు నన బ్రసిద్ధుం డై సమధికశరీరజాగ్రదవస్థాభిమాని యై విశ్వుం డన సూక్ష్మదేహ స్వప్నావస్థాభిమాని యై తైజసుం డనఁ గారణాంగసుషుప్త్యవస్థాభిమాని యై ప్రాజ్ఞుఁ డన విలసిల్లి నిఖిలవాసనాసమేతుం డై యయస్కాంత సాన్నిధ్యంబువలన నయస్సు చలించెడు తెఱంగున సూర్యాలోకంబు నాశ్రయించి, స్వస్వవ్యాపారంబులఁ బ్రవర్తించు జనంబుభంగి సర్వాధిష్ఠానభూతుండుఁ బ్రధానపురుషేశ్వరుండుఁ బురాణపురుషోత్తమాఖ్యుండుఁ దనకు ముఖ్యబింబభూతుండు షడ్వింశకుండుఁ బరుండుఁ బరమాత్ముండు నైన నాసన్నిధానంబువలన నస్మదీయతేజంబు నంశ్రయించియు నన్నెఱుంగక తన్ను నానుహాత్మకునింగాఁ దలంచి, సంసృతిచక్రంబునం బరిభ్రమించుచుండు; నిట్లనాద్యనంతకాలంబు ప్రవర్తించుచుండి యెట్టకేలకు ననేకజన్మార్జితపుణ్యపుంజపరిపాకవిశేషంబువలనను మదనుగ్రహంబువలననుఁ బరిశుద్ధహృదయుండును సాధనచతుష్టయసంపద్విశిష్టుండు నై సద్గురుచరణంబు శరణంబు నొంది, తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవివేకజ్ఞానసహితుం డై యతురుండు గాయాద్యహం

కృత్యంతం బైనతుఱరం బంతయుఁ దాను గానని నిరాక రించి కలశజల నాశానంతరంబున నుపసూర్యకంబు మా ర్తాండునిం జెందినకైవడి ముకురవియోగం బగు చుండ వదనాభాసంబు ప్రధానాననంబునఁ గలసినరీతి మఠఘట కుడ్యకు స్థూల స్తంభపటాద్యఖిలమూర్తద్రవ్యంబుల వే ర్వేఱ విభజించిన నశేషవస్తు నిషేధావధి భూతంబున మూర్తంబునగు తదవచ్ఛిన్నాకాశంబు మహాకాశం బైన పగిదిఁ దనుత్రయ విలక్షణుండు నవస్థాత్రయ సాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తుండు నై యఖండాద్వితీయ సచ్చిదా నంద స్వరూపపరిపూర్ణ పరబ్రహ్మ తత్త్వమాత్రుం డగు క్షరాక్షరాతీతపురుషోత్తమ తత్త్వం బేనని చెప్పి, మఱియు నిట్లనియె. ౧౦౪

టీ. ఇట్లు = ఈరీతిని, పృథివీ + అప్ + తేజస్ + వాయు + ఆ కాశంబులును = పుడిమియు - నీరు - అగ్గి - గాలి - మిన్నును, మనస్ + బుద్ధి + అహంకారంబులును = డెందము - తెలివియు - నే నను కర్తృత్వ మును, వీనికిన్ = ఈపుడమి మొదలగువానికి, కారణంబు - ఐన = మూల మగు, అవ్యక్తంబును = మూలప్రకృతియు, శ్రోత్ర + త్వక్ + చక్షుస్ + జిహ్వా + ఘ్రాణ + వాక్ + పాణి + పాద + పాయు + ఉపస్థలు అను, దశ + ఇంద్రియములును = చెవి - తోలు - కన్ను - నాలుక - నాసిక - అను జ్ఞానేంద్రియము లైదును, నోరు - చేయి - కాలు - ముడ్డి - గుహ్యప్రదే శము - అనియెడు కర్మేంద్రియము లైదుఁ గూడి పదియింద్రియములును, శబ్ద + స్పర్శ + రూప + రస + గంధంబులు + అను + పంచ + విషయంబులును = చప్పుడు - తాఁకుడు - రూపు - చేవి - తావి - అనఁబడు నైదు విషయములును, కూడి = కలసి, ఇరువది + నాలుగు + తత్త్వం

ములు - అగును = చతుర్వింశతిసంఖ్యగలతత్త్వము లైనవి ; కొందఱు = మఱికొందఱు, వాక్ + ఆది + కర్మేంద్రియ + పంచకంబును = నోరు మొదలగు కర్మేంద్రియము లైదును, శ్రోత్ర + ఆది + జ్ఞానేంద్రియ + పంచకంబును = చెవి లోనగు నైదు జ్ఞానేంద్రియములును, శబ్ద + ఆది + విషయ + పంచకంబును = చప్పుడు మొదలగు జ్ఞానేంద్రియగోచరార్థము లైదును, ప్రాణ - ఆది - వాయు - పంచకంబును = ప్రాణము - అపానము - సమానము - వ్యానము - ఉదానము - అను ప్రాణవాయువు లైదును, మానస - ఆది - అంతఃకరణ చతుష్టయంబును = మనస్సు - బుద్ధి - చిత్తము - అహంకారము - అను నంతరింద్రియములు నాలుగును, కూడి = కలసి, ఇరువది - నాలుగు - తత్త్వంబులు = చతుర్వింశతి పదార్థములు, అని - చెప్పుదురు = అని పలుకుచున్నారు ; ఈ - చతుః - వింశతి - తత్త్వంబులను = ఇట్లు చెప్పఁబడిన యిరువది నాలుగు తత్త్వములను, శరీర - త్రయంబు - అనియు = స్థూలము - సూక్ష్మము - కారణము - అను మూఁడుమేను లనుచును, పంచ - కోశంబులు - అనియును = అన్నమయము - ప్రాణమయము - మనోమయము - విజ్ఞానమయము, ఆనందమయము - అను నైదు కోశము లనుచును, పండితులు = విద్వాంసులు, గణింతురు = ఎన్నుదురు; ఇది = చతుర్వింశతితత్త్వాత్మక మగు నియ్యదియే, మదీయ - అపరా - ప్రకృతి = నాసంబంధ మగు - నపరయని తొల్లి చెప్పఁబడినప్రకృతి (అగును); ఇది = ఈయపరాప్రకృతి, క్షేత్రంబు - క్షరంబు - ప్రకృతి - అనాత్మ - దృశ్యంబు - అసత్తు - జడంబు - దుఃఖాత్మకంబు - సంసారంబు, అనన్ - ఒప్పుక్ = క్షి క్షయే అని క్షయార్థకమగు క్షిధాతువుపైనిష్ట్రిన్ ప్రత్యయముఁ జేర్పఁగా క్షేత్ర మనురూపము నిష్పన్న మయినది గాన, క్షయతీతి క్షేత్రం, అను వ్యుత్పత్త్యర్థముచేత క్షయించునది క్షేత్ర మనఁబడును; "ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః। ఇచ్ఛాద్వేషః స్సుఖం దుఃఖం సంఘా

త శ్చేతనాధృతిః। ఏతత్ క్షేత్ర మితిజ్ఞేయం'' అని తొల్లి యుదా హరింపఁబడిన గీతావాక్యమువలన నింద్రియములు పదునొకండును నింద్రియార్థము లైదును మొదలగునవి క్షేత్రశబ్దవాచ్యములు గాన, క్షేత్రమనియుం, క్షరంబు = క్షరతీతి క్షరః అను వ్యుత్పత్తిచే నశించునది గాన క్షరమనియుఁ, బ్రకర్షముగ మహదాదిరూపమునఁ జేయునదిగాన ప్రకృతియనియుం, అనాత్మ = ఆత్మకు విలక్షణమైనదిగాన ననాత్మయనియుం, దృశ్యంబు = ఆత్మకు నంతఃకరణచతుష్టయము, అంతఃకరణవృత్తులకు నింద్రియములు ఇంద్రియములకు శబ్దాదివిషయయులు మొదలగునవియు గోచరము లగుటంజేసి దృశ్యంబు (చూడఁబడునది) అనియును, అసత్తు = సత్తు అనఁగాఁ గాలత్రయాబాధ్యమానమగు వస్తువు, అట్టిది కానిదిగాన నసత్తనియుం, జడంబు = చైతన్యము లేనిదిగాన జడమనియుం, దుఃఖ - ఆత్మకంబు = ఆధ్యాత్మికము ఆధిదైవికము ఆధిభౌతికము నను దుఃఖత్రయము స్వరూపముగఁ గలదిగాన దుఃఖాత్మకమనియు, సంసారంబు అనన్ = సంసారమనియుఁ బలుకంబడుచు, ఒప్పున్ = తగియున్నది; తప్త - అయస్ - పిండంబుతోన్ = ఎఱ్ఱగఁ గాల్చిన యినుపముక్కతో, కూడి = కలసి, ప్రకాశించు = వెలిఁగెడు, కృశానుని = అగ్నిహోత్రునియొక్క, చందంబునన్ = వడువున, మిథ్యా - తాదాత్మ్య - ధ్యానంబుచేతన్ = అసత్యస్వరూప మగు నాప్రకృతియ తా నను భావనచేత, దీనితోన్ = ఈయపరాప్రకృతితో, ఎనసి = కలసి (ఏకీభవించి), ప్రవర్తించు = సంసారయాత్రను జేయుచున్నట్టి, మత్ - అంశ- సంభూతుండు = నాసంబంధమగు చైతన్యాంశమువలనఁ గలిగినవాఁడు, ఐన - జీవుండు = అగునట్టి జీవాత్ముఁడు, పంచవింశకుండు = పైని జెప్పఁబడిన చతుర్వింశతితత్త్వములకు నిరుపదియైదవవాఁడు (అగును); ఇతఁడు = చిత్ప్రతిబింబభూతుఁ డయిన ఈజీవుఁడు, అస్మదీయ + పరా + ప్రకృతి = నాసంబంధ మగు పరయనఁబడు ప్రకృతి (అగును);

క్షేత్రజ్ఞుండు = పూర్వోక్త క్షేత్రస్వరూప మగు నపరాప్రకృతిని దెలిసి కొనుచుండువాఁడుగాన క్షేత్రజ్ఞుఁ డనియు, అక్షరుఁడు = "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః నచైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః" అను మొదలగు భగవద్వచనమును బట్టి "నక్షరతీ త్యక్షరః" అను వ్యుత్పత్తిచేత నాశము లేనివాఁడు గాన నక్షరుఁ డనియు, పురుషుండు "పురిశేరత ఇతిపురుషః" అను వ్యుత్పత్తిచేత శరీరత్రయ మను పురమునం దుండువాఁడు గానఁ బురుషుం డనియు, ఆత్ముండు = అతతి తత్తచ్ఛరీరాదిషు వ్యాప్నోతీత్యాత్మా" అను వ్యుత్పత్తిచే నానాశరీరాదులయందు వ్యాపించియుండువాఁడు గాన నాత్ముఁడనియు, ద్రష్ట మనోబుద్ధ్యాదివ్యాపారములను సాక్షియై కనువాఁడుగాన ద్రష్టయనియు, సత్ + రూపకుఁడు = నిత్యమగు స్వరూపము గలవాఁడు గాన, సద్రూపకుఁ డనియు, చేతనుండు = తెలివియ రూపముగాఁ గలవాఁడుగానఁ జేతనుఁడనియు, ఆనందమయుండు = ఆనంద మయకోశస్వరూపుఁడు గాన నానందమయుఁ డనియు, సంసారి = పుత్త్రమిత్రకళత్రాదిరూప మగుసంసారముఁ గలవాఁడు గాన సంసారి యనియు, అనన్ = అని పిలువఁబడుచు, తేజరిల్లుచున్ - ఉండున్ = విలసిల్లుచునుండును; అది = అట్లు జీవుఁడు దేజరిల్లుచుండుట, ఎట్లు అనినన్ = ఏతీరున నని యడిగిన (చెప్పెద నాలకింపుము), పూర్వ + ఉక్త + తత్త్వంబులలోన్ = తొల్లి వక్కాణింపఁబడిన చతుర్వింశతి తత్త్వములలోను, ప్రధాన + అవయవంబును = మూలప్రకృతికి ముఖ్య మగు నంగమును, సర్వ + కార్య + కారణ + ఆశ్రయంబు = "మహదాద్యాః ప్రకృతయ స్సప్త" అనుటంజేసి "ప్రకృతులును వికృతు లు నగు మహత్తత్త్వము మొదలగువానికి నాధారభూత మయినదియు, సకల + వాసనామయుంబు = "వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మ లినా తథా" అనుటచేత శుద్ధవాసనలు మలినవాసనలు నను సమస్త

వాసనలుఁ బ్రచురముగఁ గలదియు, అనాది + అనిర్వచనీయ + అజ్ఞాన + కల్పితంబును - అనాది = మొదలులేనిదియు, అనిర్వచనీయ = ఉన్నదనిగాని లేదనిగాని చెప్పుటకు వీలు లేనిదియు నగు, అజ్ఞాన = మూలావిద్యచేత, కల్పితంబు = కూర్పఁబడినదియు, ఐన = అగు, బుద్ధి... అందుఁ - బుద్ధి = బుద్ధియు, అహంకార = అహంకారమును, ఆత్మక = స్వరూపముగఁ గల, అంతఃకరణ = అంతరంగముయొక్క, వృత్తి + విశేషంబునందుఁ = పరిశుద్ధమగు నొండొకవృత్తియందు, జల + ఘటంబునందుఁ = నీటితోఁ గూడిన కడవయందు, ఆదిత్య + ప్రతిబింబంబును = సూర్యునియొక్క ప్రతిఫలనమును, దర్పణంబునందుఁ = అద్దమునందు, ముఖ + ఆభాసంబును = మోము తోఁపుటయును, తోఁచిన విధంబునన్ = అగపడెడు వడువున, అస్మత్ + ఛాయ = మాసంబంధమగు శుద్ధచైతన్యముయొక్క నీడ, ప్రతిఫలించినన్ = ప్రతిబింబింపఁగా, తత్ + ఉపాధికుండు ఐ = ఆ యంతరంగముయొక్క వృత్తివిశేషమే యుపాధిగఁ గలవాఁడగుచు, కరణ + భోగ్య + జ్ఞాన + శబ్ద + వాచ్యంబు - ఐన = కార్యవర్గమునకు సాధకతమం బగుటచేఁ గరణమును, భుజింపఁదగిన వస్తువుల యనుభవరూపముగాన భోగము, తెలియఁదగినవాని తెలివి యగుటచేత జ్ఞానము, నిశ్చయింపఁదగినవాని నిశ్చయించుఁ గానఁ బ్రమాణము, అను నీశబ్దములచేఁ జెప్పఁదగినది యగు, స్థూల...సాధనంబుచేత—స్థూలగోళక = చర్మాస్థిమయము లగుటచేత స్థూలము లగు తోలు నేత్రయుగము కర్ణరంధ్రములు నాలుక ముక్కుచెలములు నను స్థానములయందు, ఉపహిత = కూడియున్న, జ్ఞాన = త్వగింద్రియము లోనగు జ్ఞానేంద్రియపంచకముతోను, కర్మేంద్రియ = నోరు మొదలగు స్థానములయం దున్న వాగాది కర్మేంద్రియ పంచకముతోను, ప్రాణపంచక = "హృది ప్రాణో గుదేఽపానః" అను మొదలుగఁ జెప్పఁబడిన హృదయము మొదలగు స్థానములయందున్న ప్రాణము మొదలగు వాయుపంచకముతోను,

సమ్మిళితే = కూడుకొనియున్న, మనసా = సంకల్పవికల్పాత్మక మగు మనస్సుచే, చిత్తే = అనుసంధానరూప మగు వృత్తివిశేషమును, ఆత్మక = స్వరూపముఁ గల, అంతఃకరణ = అంతరంగముయొక్క, వృత్తివిశేష= ఒకానొకవృత్తి యనెడు, సాధనంబుచేత = ఉపకరణముచేత, కార్య + భోగ్య + జ్ఞేయ + ప్రమేయ + శబ్ద + వాచ్యంబులు = మీఁదఁ జెప్పిన కరణ - భోగ - జ్ఞాన - ప్రమాణములచేఁ గ్రమముగ నెఱవేర్పఁదగిన కార్యములు భోగ్యములు జ్ఞేయములు ప్రమేయములు (చేయఁదగినవి, అనుభవింపఁదగినవి, తెలియఁదగినవి, నిర్ణయింపఁదగినవి) అను శబ్దములచేతఁ బలుకఁబడినవి, రస + శబ్ద + ఆది + విషయంబులను = అగు శబ్దము స్పర్శము మొదలగు నింద్రియగోచర భావములను, అనుభవించుచుండె = సేవించుచు, కర్తయు = కరణములచేతఁ గార్యములను జేయువాఁడు గాన కర్త యనియు, భోక్తయు = భోగ్యవస్తువులచేత భోగముల ననుభవించువాఁడు గాన భోక్త యనియు, జ్ఞాతయు = జ్ఞానముచేతఁ దెలిసికొనఁదగిన వానిని దెలిసికొనును గాన జ్ఞాత యనియు, ప్రమాతయు = ప్రమాణమును బట్టి ప్రమేయజాతమును నిశ్చయించువాఁడు గాన ప్రమాత యనియు, శ్రోతయు = కర్ణేంద్రియముచేత వినఁదగినవాని నాలకించువాఁడు గాన శ్రోత యనియు, స్ప్రష్టయు = చర్మేంద్రియముచేత శీతోష్ణాదులను గ్రహించువాఁడు గాన స్ప్రష్ట యనియు, ద్రష్టయు = చక్షురింద్రియముచేఁ జూడఁదగినవానినిఁ జూచును గాన ద్రష్ట యనియు, రసయితయు = జిహ్వేంద్రియముచేత మధురసముల నెఱుఁగువాఁడు గాన రసయిత యనియు, ఘ్రాతయు = ఘ్రాణేంద్రియముచేత నానావాసనలఁ దెలిసికొనువాఁడు గాన ఘ్రాత యనియు, వక్తయు = వాగింద్రియముచేత వాఙ్మయము నుచ్చరించువాఁడుగాన వక్త యనియు, దాతయు = పాణీంద్రియముచేత నిచ్చుటను బుచ్చుకొనుటను జేయువాఁడుగాన దాత యనియు, గంతయు= చరణేంద్రియముచేత గమనాగమనములను జేయువాఁడు గాన గంత

యనియు, విసర్జయితయు = పాయ్వింద్రియము చేత మలమూత్రములను విడుచువాఁడు గాన విసర్జయిత యనియు, ఆనందయితయు = ఉపస్థేంద్రియము చేత సంభోగము చేసి సంతసించువాఁడు గాన నానందయిత యనియు, ప్రాణియు = ప్రాణాదివాయుపంచకము చే జీవించువాఁడుగానఁ బ్రాణియనియు, మంతయు = అంతరంగము చే మననమును జేయువాఁడు గాన మంత యనియు, దేహియు = శరీరత్రయమునందు నభిమానము గల వాఁడుగాన దేహి యనియు, జీవుఁడు = "ప్రాణాన్ క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ జీవ ఉచ్యతే" అనుటచేతఁ బూర్వోక్త క్షేత్రజ్ఞస్వరూపముతోఁ బ్రాణములను బూనువాఁడుగాన జీవుఁడనియు, అనన్ = అనఁబడుచు, ప్రసిద్ధుండు = ప్రఖ్యాతి నొందినవాఁడు, ఐ = అగుచు, అనమధిక + శరీర + జాగ్రదవస్థా + అభిమాని - ఐ = పాంచభౌతికశరీరమునందును దీనియవస్థ యగు జాగరణమునందును నభిమానము గలవాఁడై, విశ్వుండు - అనన్ = విశ్వుఁడను పేరుతోను, సూక్ష్మదేహ + స్వప్నావస్థా + అభిమాని-ఐ = లింగశరీరమునందును దీనియవస్థ యగు స్వప్నమునందును నే నను నభిమానమును గలవాఁడగుచు, తైజసుఁడు = ప్రాతిభాసికుఁడు, అనన్ = అను పేరుతోను, కారణ + అంగ + సుషుప్తి+ అవస్థా + అభిమాని ఐ = కారణశరీరమునందును దీనియవస్థ యగు సుషుప్తియందును నభిమానముగలవాఁడయి, ప్రాజ్ఞుఁడు అనన్ = ప్రాజ్ఞుండను పేరుతోను, విలసిల్లి = ప్రసిద్ధి కెక్కి, నిఖిల + వాసనా + సమేతుండు - ఐ = పెక్కు లగు పుట్టువులలోఁ జేయఁబడిన చెయ్వులయొక్క సంస్కారములతోఁ గూడుకొనినవాఁడయి, అయస్కాంత + సాన్నిధ్యంబువలనన్ = సూదంటురాతిచెంత నుండుటవలన, అయస్సు=ఇనుము+ చలించెడు + తెఱంగునన్ = కదలాడెడుపగిదిని, సూర్య + ఆలోకంబును = సూర్యునియొక్క వెలుఁగును, ఆశ్రయించి = అవలంబించి, స్వ - స్వ + వ్యాపారంబులన్ = తమతమ పనులయందు, ప్రవర్తించు = నడచు

కానెపు, జనంబు + భంగిన్ = మనుజులయట్లు, సర్వ + అధిష్ఠాన + భూతుండవు = ఎల్లలోకములకు నాధారమయినవాఁడును, ప్రధాన + పురుష + ఈశ్వరుండును = సాంఖ్యులు చెప్పెడి మూలప్రకృతిని బురుషునకు నియామకుఁడును, పురాణ + పురుషోత్తమ + ఆఖ్యుండును = "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అనుటచే సనాతనుఁడగు పురుషోత్తముఁ డనెడుపేరు గలవాఁడును, తనకున్ = జీవునకు, ముఖ్యబింబభూతుఁడు = మూలమగుబింబ మయినవాఁడును (మూలావిద్యయందలి జీవప్రతిఫలమునకు నిదాన మగుబింబ మయినవాఁడును), షడ్వింశకుండును = ఇరువదియాఱవతత్త్వ మయినవాఁడును, పరుండును = మీఁదఁ జెప్పఁబడినజీవుఁడు తుదకుఁ గల యిరువదియైదుతత్త్వములకు నధిష్ఠానభూతుండై పరమయినవాఁడును బరమాత్ముఁడును, సర్వాధిభూతుఁడగుటచేతఁ బరమాత్ముఁడును, ఇన = అగు, నా + సన్నిధానంబువలనన్ = నాయొక్క సాన్నిధ్యముచేత - అస్మదీయ + తేజంబున్ = నాసంబంధమగు చిత్ప్రకాశమును, సంశ్రయించియును = ఆశ్రయించుకొనియున్నవాఁడయ్యు, నన్నున్ + ఎఱుంగక = తనకు నధిష్ఠానభూతుఁడనై యున్న నన్నుఁ దెలిసికొనలేక, తన్నున్ = తన్ను (జీవుని), నామ + రూప + ఆత్మకునిన్ - కాన్ = పేరు నాకారమును స్వరూపముగఁ గలవానినిగ, తలంచి = భావించి, సంసృతిచక్రంబునన్ = సంసారరూపమగు చక్రమునందు, పరిభ్రమించుచున్ - ఉండున్ = సంచరించుచు నున్నవాఁడు, ఇట్లు = ఈలాగున, అనాద్యంతకాలంబు = మొదలు తుదియు లేనికాలము, సంచరించుచున్ - ఉండి = తిరుగాడుచు నున్నవాఁడై, ఎట్టకేలకున్ = కొంతకాలమునకు, అనేక...వలనన్ - అనేక = పెక్కులగు, జన్మ = పుట్టువులయందు, ఆర్జిత = సేకరింపఁబడిన, పుణ్య = పుణ్యములయొక్క, పుంజ = గుంపుయొక్క, పరిపాక = ఫలించుటయొక్క, విశేషంబువలనన్ = ఆధిక్యమువలనను, మత్ + అనుగ్రహంబువలనను = నాయొక్క కటాక్షము

వలనను, పరిశుద్ధ+హృదయుండును=నిర్మలమగుడెందము గలవాఁడును, సాధన + చతుష్టయ + సంపత్ + విశిష్టుండును ఐ = "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" బ్రహ్మము సత్యము జగత్తు కల్ల యనువివేచనయు, ఐహిక సుఖములయందును స్వర్గాది పరలోకభోగములయందును, యథైవకర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" అను శ్రుతిచే విరక్తియును, శమము దమము తితిక్ష మొదలగు నాల్గింటియొక్క సంపదయు, బంధవిముక్తియందుఁ దలఁపును, అను నీ మోక్షసాధనసామగ్రియొక్క నాల్గింటి సంపత్తితోఁ గూడుకొనియున్నవాఁడును నగుచు, సద్గురు + చరణంబు = యోగ్యుఁడైన దేశికేంద్రుని యడుగుఁదమ్ములను, శరణంబుగా = ఆశ్రయముగా, ఒంది = పడసి, తత్...సహితుండు - తత్ = ఆ దేశికేంద్రునియొక్క, ప్రసాద = అక్కటికమువలన, లబ్ధ = పడయఁబడిన, ఆత్మ = పరమాత్మయొక్కయు, అనాత్మ = పరమాత్మవ్యతిరిక్తమగు ప్రపంచముయొక్కయు, వివేక = నిత్యము అనిత్యము నను వివేచనతోఁ గూడిన, జ్ఞాన=అనుభవజ్ఞానముతో, సహితుండు ఐ=కూడుకొనినవాఁడగుచు, అక్షరుండు = నాశము లేనివాఁడుగాన వెనుకఁ జెప్పినయట్లు అక్షరుఁ డనఁబడెడు జీవాత్ముఁడు, కాయ + ఆది + అహంకృతి + అంతంబు ఐన=పాంచభౌతికశరీరము మొదలుకొని యహంకారమువఱకుఁ గల, క్షరంబు - అంతయున్ = వినశ్వరమగు భూతజాత మెల్లను, తాను=నేను (జీవుఁడు), కాను అని = అయియుండలేదని, నిరాకరించి = దేహాదులయందు నహంకార మమకారములను విడిచి, కలశ + జల + నాశ + అనంతరంబునన్ = బానలోనినీరు పోయినతరువాత, ఉపసూర్యకంబు = సూర్యునియొక్క ప్రతిబింబము, మార్తాండునిన్ = బింబభూతుఁ డగు సూర్యుని, చెందిన + కైవడిన్ = చేరినతీరున, ముకుర + వియోగంబు = అద్ద మెడఁబడుట, అగుచున్ + ఉండన్ = సంభవించియుండునపుడు, వదన+ ఆభాసంబు=మోముయొక్క ప్రతిచ్ఛాయ, ప్రధాన+ఆననంబునన్ =ప్రతి

బింబమునకు నాధార మగు మోహనంబు, కలసిన+రీతిన్=ప్రవేశించినపగిదిని, మత...ద్రవ్యంబుల్ + మత = అలయును, ఘట = కడవ, కుడ్య = గోడ, కుశూల = కొటారము, స్తంభ = స్తంభము, పట = బట్ట, ఆది=లోనుగాఁ గల, అఖిల = సమస్తము లైన, మూర్త = ఆకారముగల, ద్రవ్యంబులన్ = పదార్థములను, వేర్వేఱ = ఒకటొకటిగ, విభజించినన్ = ఏర్పఱుపఁగా, అశేష + వస్తు + నిషేధ + అవధిభూతంబును = నిఖిలము లైన ఘటపటాది ద్రవ్యములయొక్క నిరసనమునకుఁ గడపటిదియును, అమూర్తంబును= రూపు లేనిదియు, అగు = అయినట్టి, తత్ + అవచ్ఛిన్న + ఆకాశంబు = ఆ కడవ మొదలగువానిలో వ్యాపించియున్న, మహాకాశంబు = తెంపు లేనిమిన్ను, వను + పగిదిన్ = అగువిధమున, తను + త్రయ + విలక్షణుండును = స్థూలము లోనగుమేనులు మూఁడిటికిని వేఱైనవాఁడును, అవస్థా + త్రయ + సాక్షియుం = మేలుకువ మొదలగునవస్థల మూఁటిని గనుఁగొను వాఁడును, పంచ+ కోశ + వ్యతిరిక్తుండు=అన్నమయము ప్రాణమయము మొదలగు నైదుకోశములకును భిన్నుఁడును, ఐ = అగుచు, అఖండ...మాత్రుండు-అఖండ = పరిచ్ఛిన్నము కానిదియు, అద్వితీయ=సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనట్టియు, సత్+చిత్ + ఆనంద + స్వరూప = సత్యము చిత్తము ఆనందము స్వరూపముగఁ గలదియు, పరిపూర్ణ = ఎల్లయెడల నిండియున్నట్టియు, పరబ్రహ్మ = పరమాత్మయొక్క, తత్త్వమాత్రుండు = తత్త్వమే స్వరూపముగఁ గలవాఁడు, అగున్ = అవును; అట్టి = అటువంటి, క్షర = సకలభూతజాతముకంటెను, అక్షర = కూటస్థుఁ డగు జీవుని కంటెను, అతీత = మీఱినయున్న, పురుషోత్తమ + తత్త్వంబు = పరమ పురుషునియొక్క వాస్తవస్వరూపము, ఏను = ఈనేనేసుమా, అని చెప్పి = అని యిట్లుపదేశించి, మఱియున్ = ఇంకను, ఇట్లు = చెప్పఁబోవు తీరున, అనియెన్ = పలికెను.

తా. ఈతీరునఁ బుడమియు నీరును నిప్పును గాలియు నాకసము

నను భూతము లైదును, దెందమును మఱియు నహంకృతియును నీ పుడమి మొదలగువానికి మూలమగు నవ్యక్తము (ప్రధానమును) శ్రవణము చర్మము నయనము రసన నాస యనుజ్ఞానేంద్రియము లయిదును, వీనికి విషయములగు చప్పుడు - తాకుడు-రూపు- చవి-తావి యను నైదును, కలసి యివి చతుర్వింశతితత్త్వము లగును. మఱియు నింకొకరి మతమున వాక్పాణిపాదపాయూపస్థ లను కర్మేంద్రియము లైదును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియము లైదును, వీనికి విషయము లగు శబ్దస్పర్శరూపరసగంధము లైదును, ప్రాణాపానవ్యానోదానసమానము లగు వాయువు లైదును, మనోబుద్ధిచిత్తాహంకారము లను నంతఃకరణభాగములు నాల్గును జేరి యిరువదినాలుగుతత్త్వములయ్యెనని పలుకుచున్నారు. ఈయిరువదినాలుగుతత్త్వములనే విద్వాంసులు స్థూలసూక్ష్మకారణము లను మూఁడుమేనులుగను, అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లను నైదుకోశములుగను విభజించుచున్నారు. ఈచతుర్వింశతితత్త్వసమష్టియే నా సంబంధమగు నపరాప్రకృతి యనఁబడుచున్నది. ఈ యపరాప్రకృతికే క్షేత్రమనియుఁ, క్షర మనియుఁ, ప్రకృతి యనియుఁ, ననాత్మ యనియుఁ, దృశ్యమనియుఁ, నస త్తనియుఁ, జడ మనియుఁ, దుఃఖమయ మనియుఁ, సంసారమనియుఁ, ప్రపంచ మనియుఁ, నన్వర్థములగు నామాంతరములు గలవు. ఎట్టుఁగఁ గాల్పఁబడిన యినుపముద్దతో నేకీభవించి ప్రజ్వరిల్లెడు నగ్నిహోత్రునివడువున నీపరాకృతిలో నిదియే నేనను మిథ్యాభూతమగు (దబ్బఱయగు) భావనచేత నేకీభవించి నాయొక్క యంశమువలనఁ బొడమిన (నాప్రతిబింబభూతుఁ డయిన) జీవుఁడు సంసారచక్రంబునం బడి తిరుగాడుచుమండును. ఇతఁడే యిరువదియైదవతత్త్వ మనఁబడెడు నాసంబంధ మగు పరాప్రకృతి నాఁబడుచు క్షేత్రజ్ఞుఁడనియుఁ, నక్షరుఁడనియుఁ, బురుషుఁడనియుఁ, నాత్మయనియుఁ, ద్రష్ట యనియుఁ, సద్రూపకుం డనియుఁ, జేతనుండనియుఁ, నానందమయుఁడనియుఁ, సంసారియనియుఁ సార్థకములగు పేరులతోఁ

చెప్పఁబడుచున్నాఁడు. ఈవిభాగమెట్లన్నయెడల యంటివేని యీఁడఁ జెప్పంబడిన యిరువదినాలుగు తత్త్వములలోను నపరాప్రకృతికి ముఖ్యముగ నంగమైనదియు, మహత్తత్త్వము మొదలగునవి ప్రకృతివికృతులకు నాధారభూతమగునదియును, జన్మాంతరములలోఁ జేయఁబడిన పుణ్యపాపకర్మలయొక్క సంస్కారరూపమగునదియుఁ, మొదలు లేనట్టిదియు నిట్టిదని చెప్పుటకు వీలు లేనట్టియు నగు నవిద్యచేతఁ గల్పింపఁబడినదియు నగు బుద్ధియు నహంకారమును స్వరూపముగాఁ గల యంతరంగముయొక్క యొండొకవృత్తి యందు స్ఫటికమునందు సూర్యునియొక్క ప్రతిబింబమువలెను నద్దమునందు మోమునీడయు నగపడుచున్నట్లు నానందఘనమగు చిత్ప్రకాశము ప్రతిబింబింపఁగా నా యంతఃకరణముయొక్క వృత్తివిశేషమే యుపాధిగాఁ గలవాఁడగుచు, కరణము (ఉపకరణము), భోజ్యము (అనుభవింపఁదగినది), జ్ఞానము (తెలివి), ప్రమాణము (నిర్ణయించునది) అను నామములచేఁ జెప్పఁదగినదియగు కర్ణరంధ్రములు మొదలగు తమతమ యునికిపట్టులయం దుండెడు శ్రోత్రేంద్రియము లోనగు జ్ఞానేంద్రియములైదింటిలోను, నోరు మొదలగు తమతమ తావులయందు నివసించెడు వాక్కు మొదలగు కర్మేంద్రియములైదింటిలోను, దేహము మొదలగు నివాసస్థానములయం దుండు ప్రాణాదులైదింటిలోనుఁ గూడియున్న మనస్సును చిత్తము నను నంతఃకరణభాగములయొక్క వృత్తు లనుపకరణములచేఁ గార్యము (చేయఁదగినది) భోగము (అనుభవము) జ్ఞేయము (తెలియఁదగినది) ప్రమేయము (ప్రమాణముచే నిర్ణయింపఁదగినది) అనుమాటలచే వ్యవహరింపఁదగిన శబ్దము స్పర్శము మొదలగు విషయజాతము ననుభవించుచున్నవాఁడై కర్త (కరణముచేఁ గార్యమును జేయువాఁడు) అనియు, భోక్త (భోజ్యముచే భోగము ననుభవించువాఁడు) అనియు, జ్ఞాత (జ్ఞానముచే జ్ఞేయమును దెలిసికొనువాఁడు) అనియు, ప్రమాత (ప్రమాణముచేఁ బ్రమేయమును నిర్ణయించువాఁడు)అనియు, శ్రోత (శ్రవణేంద్రియముచే వినఁదగినవానిని వినువాఁ

డు) అనియు, స్ప్రష్ట (త్వగింద్రియముచే ముట్టఁదగినవానిని ముట్టువాఁడు) అనియు, ద్రష్ట (నయనేంద్రియముచే దృశ్యమును జూచువాఁడు) అనియు, రసయిత (రసనేంద్రియముచే రుచులనెల్ల నాస్వాదించువాఁడు) అనియు, ఘ్రాత (ఘ్రాణేంద్రియముచే వాసనలను చూచువాఁడు) అనియు, వక్త (వాగింద్రియముచేఁ బలుకులం బలుకువాఁడు) అనియు, దాత (పాణీంద్రియముచే హానోపాదానములఁ జేయువాఁడు) అనియు, గంత (చరణేంద్రియముచే గమనాగమనములఁ జేయువాఁడు) అనియు, విసర్జయిత (పాయ్వింద్రియముచేత మలమును విడుచువాఁడు) అనియు, ఆనందయిత (ఉపస్థేంద్రియముచేత సంభోగసుఖము ననుభవించువాఁడు) అనియు, ప్రాణి (ప్రాణము మొదలగు నైదువాయువులచే జీవించువాఁడు) అనియు, మంత (అంతఃకరణముచే మననమును జేయువాఁడు) అనియు, దేహి (స్థూలసూక్ష్మకారణశరీరములయందు నభిమానము గలవాఁడు) అనియు, జీవుఁడు (ఆయా యుపాధులనుబట్టి జీవించువాఁడు) అనియుఁ బ్రఖ్యాతి నొందినవాఁడై, స్థూలశరీరసంబంధ మగు జాగరణావస్థయందు నభిమానమును బూని విశ్వుఁడనియు, సూక్ష్మశరీరసంబంధ మగు స్వప్నావస్థయందు నభిమానమును వహించి తైజసుఁడనియుఁ, గారణశరీరసంబంధమగు సుషుప్త్యవస్థయందు నభిమానమును దాల్చి ప్రాజ్ఞుఁ డనియు వ్యవహరింపఁబడుచు, ననేకజన్మార్జితకర్మవాసనలతోఁ గూడుకొని నూదంటురాయి చెంత నుండుటవలన నినుము కదలాడెడువడువునను, వేవెలుఁగు వెలుఁగు నవలంబించి తమతమ పనులయందుఁ బాటుపడెడు మానవసమూహమువిధమునను, సకలప్రపంచమునకుఁ బ్రధానకారణ మైనవాఁడను, ప్రకృతిపురుషులకు నధిపతియు, సనాతనుఁడైన పురుషోత్తముఁ డనుపేరు గలవాఁడను, తనయొక్క (జీవుని యొక్క) ప్రతిఫలనమునకు మూలమగు బింబమైనవాఁడను, పంచవింశకుండగు తనకుఁ బైవాఁడుగాన నిరువదియాఱవతత్త్వ మైనవాఁడను, గావున నే నన్నిటికిని బరమైనవాఁడను, మాయాసంబంధము లేమింజేసి పరిశుద్ధమగు

నాత్మయే స్వరూపముగఁ గలవాఁడను, నగు నాయొక్క సాన్నిధ్యమువలన నాసంబంధ మగు చిత్ప్రకాశము నాశ్రయించుకొని తా నుండియు నట్టి నన్నుఁ దెలిసికొనలేక తన్ను నామరూపాత్మక మను ప్రపంచమయునిగ నజ్ఞానముచే భావించుకొని కాఁపురంపుఁగవలిం బడి కడతేఱఁజాలక కొట్టుకొనుచు నున్నవాఁడు, ఈతీరునఁ దుదిమొదలులేనితఱిం దిరుగాడుచు రాఁగా రాఁగా నెంతోకాలమునకుఁ బెక్కుపుట్టువులనుండియు సేకరింపఁబడిన పున్నెపుగని పండుటవలనఁ గలిగిన నాయొక్క మిక్కుటపుటక్కటికము వలన నిర్మలమగు మానసము గలవాఁడును, నిత్యానిత్యవస్తువివేకము మొదలగు మోక్షసాధనసామగ్రి గలవాఁడై శాంతియు దాంతియు మొదలగు సద్గుణములు గల యోగ్యుఁ డగు దేశికేంద్రుని యడుగుఁదమ్ముల నండఁగాఁ గొని యా సద్గురుని కరుణారసతరంగిత కటాక్షవీక్షణము వలన నలవడిన సదసద్వివేచనాపూర్వక మగు నాత్మజ్ఞానముతోఁ గూడినవాఁడై జీవాత్ముఁడు స్థూలదేహము మొదలు మహత్తత్త్వము దనుకం గల కార్యకరణసంఘాతము నేను గానని యాశరీరమునందు నభిమానాదికమును విడిచి కుండలోనినీరు పోయినతరువాత సూర్యప్రతిబింబము సూర్యునిఁ గలసినయటుల, అద్ద పడవడినతోడనే మోముయొక్క నీడ మోమునఁ జేరినకరణిని, ఆలయము కుండ కొటారము కంబము వలువ మొదలగు నాశ్రితములలోఁ గూడినవస్తువులలో నంతర్వ్యాప్త మయియున్న మిన్ను ఆయావస్తువులన్ని వేఱుపఱచి నిరసింపఁగా తుదకు నిలిచియున్నమహాకాశమే యైనట్లు స్థూలసూక్ష్మకారణశరీరములకుం వెలివాఁడును, నీమూఁడుమేనులకుం గ్రమముగ నవస్థలగు జాగ్రత్స్వప్నసుషుప్తులకు సాక్షియై యున్నవాఁడును, అన్నమయము ప్రాణమయము మొదలగు నైదుకోశములకు భిన్నుఁడైనవాఁడును, దెంపు లేనిదియు, స్వజాతీయ విజాతీయ స్వగత భేదము లేనిదియును, సత్తు చిత్తు ఆనందము స్వరూపముగఁ గలదియు, నెల్లయెడల నిండియున్నదియు, నగు కేవలపరమాత్మతత్త్వమే దా నగును.

పరాపరాప్రకృతులకుఁ బరమగు పరబ్రహ్మతత్త్వమే నేనుసుమీ—యని శ్రీరామచంద్రుం డాంజనేయునకు నుపదేశించి వెండియు నీ వడువున నుడివెను. ౧౦౪

అవ. ఇట్లు ముముక్షువు ఆత్మజ్ఞానముచేఁ బరబ్రహ్మతత్త్వమే తా నగునని యుపదేశించి దేహాదులయందుఁ దాదాత్మ్యము నొందియున్నయాత్మను వానివలన వేఱుపఱచువిధము నుపదేశించుచున్నారు.

ఆ—వె॥ పంచవిషయములను ꠰ బంచేంద్రియములచేఁ
గాంచుతెలివి నేను ꠰ గపివరేణ్య!
పంచకోశములను ꠰ బంచభూతంబుల
నెంచిచూచునట్టి ꠰ యెఱుక నేను. ౧౦౫

టీ. కపివరేణ్యా = ఓ వానరోత్తమా! పంచ+ఇంద్రియములచేఁ = శ్రవణేంద్రియము మొదలగు నైదుజ్ఞానేంద్రియములచేతను, పంచ+విషయములను = తమకు గోచరములగు శబ్దము మొదలగు నైదింటిని, కాంచు = గ్రహించెడు, తెలివి = జ్ఞానము, నేను = అప్రత్యక్షప్రత్యయగోచరుఁడ నగు విషయి నైతినిసుమీ, పంచ+కోశములను =అన్నమయము ప్రాణమయము మొదలగు నైదుకోశములను, పంచభూతములను = పుడమి మొదలగు నైదుభూతములను, ఎంచి = ఎన్ని, చూచునట్టి + ఎఱుక = పరికించునట్టి తెలివియే, నేను = నేనయియుంటిని.

తా. ఓ యాంజనేయా! శ్రోత్రము మొదలగు నైదుజ్ఞానేంద్రియములచేతను దమతమకు గోచరములగు శబ్దము మొదలగు విషయముల నైదింటిని గ్రమముగ గ్రహించెడుజ్ఞానమే నేనయియుంటిని; మఱియు పుడమి మొదలగు పంచమహాభూతములను నన్నమయము ప్రాణమయము లోనగుకోశముల నైదింటిని వేఱువేఱుగఁ గనుఁగొనుచుండెడుజ్ఞానమే నేనయి

యుక్తిసిద్ధము. ఇందులకు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మొదలగుమహా వాక్యములు ప్రమాణము.

అవ. ఇట్లు పరమాత్మ జ్ఞానస్వరూపము (చిద్రూపము) అని చెప్పి యది యన్నింటిని దెలియఁజేయునది గానఁ దేజోమయ మని యుపదేశించుచున్నారు.

లయవిభాతివృత్తము.

తెలిసి యిది నాకిపుడు ✽ దెలియ దది తెన్నుగను
దెలియ వివరింపుమను ✽ దెలిసెద నటంచున్
బలికితిని బలుక నికఁ ✽ బలికెద నటంచు మదిఁ
దలఁపను దలంచితిని ✽ దలఁచెద నటంచున్
వెలుపలను లోపలను ✽ దెలియఁబడు వృత్తులను
దెలియుచు వెలుంగులను ✽ వెలుఁగు లగుచుండన్
గలయ వెలిఁగించుతొలి ✽ వెలుఁగు సుమి నేను ననుఁ
దెలియుమా వివేకదశ ✽ గలమనము చేసెన్. ౧౨౬

టీ. ఇది = ఈ విషయము, ఇపుడు = ఈవేళను, నాకున్ = అహంపదవాచ్యుఁడవగునాకు, తెలిసెన్ = తెలిసినది, అది = ఆసంగతి, తెన్నుగను = సరిగా, తెలియదు = జ్ఞానగోచరము కాదు; తెలియన్ = నాకుఁ దెలిసినసంగతి నీకు బోధపడునట్లు, వివరింపుమున్ = వివరపఱచెదను; తెలిసెదను = తెలిసికొనఁదగిన యంశమును దెలిసికొనియెదను; అటంచున్ = అనియును, పలికితిని = ఒకమాటను నుడివితిని, ఇఁకన్ = ఈమీఁదను, పలుకను = నుడువను; పలికెదను = ఒకవాక్యమును జెప్పెదను, అటంచున్ = అనియును, మదిన్ = డెందమునందు, తలఁపను = ఆలోచింపను; తలంచితిని = ఒక యంశము నూహించితిని; తలఁచెదను = మఱియొకసంగతి నాలోచించెదను; అటంచున్ = అనియును; (ఈలాగున) వెలుపలను = పైని, లోప

లను = అంతరంగమునందును, తెలియన్ - పడు - వృత్తులను = తనకు విషయము లగుచుండెడు మనోవ్యాపారములను, తెలియుచున్ = తెలిసికొనుచు, వెలుఁగులన్ = సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని నక్షత్రములు మెఱపులు నవరత్నములు మొదలగువానికాంతులు, వెలుఁగులు = ప్రకాశించునవి, అగుచుండన్ = అగునట్లు, కలయన్ = ఎల్లయెడలను, వెలిఁగించు + తొలివెలుఁగు = భాసిలఁజేసెడు మొదటిడాలు (తేజస్సులన్నిటికి నాధారభూత మగు చిత్ప్రకాశము), నేనసుమి = అహంప్రత్యయాలంబన మగు నాత్మనేసుమీ. నన్ = అట్టి చిత్ప్రకాశుఁడ నగునన్ను, వివేకదశ గల మనముచేతన్ = సదసత్తుల నెన్నఁదగిన సుజ్ఞానముచేత, తెలియుము = తెలిసికొనుము.

తా. నీకీ యంశము తెలిసినది; అది నా కేమియుం దెలియదు; నాకుఁ దెలిసిన మట్టునకు స్పష్టపఱిచెదను; తెలియఁబడని విషయమును దెలిసికొనియెదను; ఈ మాట నుడివితిని. ఆ సంగతిని నేను జెప్పను; చెప్పఁదగినదానిని చెప్పెదను. నే నాసంగతిని మనస్సులోఁ దలఁపను; ఈసంగతి నాలోచించితిని; దానిని గూర్చి యూహించెదను; అను మొదలుగ నింద్రియములకును లోపలను పైకి నంతరంగమునకును గోచరము లగుచుండెడు చిత్తవృత్తులనెల్ల నెఱుంగుచు మఱియు సూర్యునికాంతి యిట్టిది చంద్రుని కాంతి యిట్టిది అనుమొదలుగ సమస్తతేజస్సులను నెఱుంగుటంజేసి మాయాకాంతుల ప్రకాశమునకు మూల మయిన చిజ్జ్యోతిస్సు నేనేసుమీ! ఇట్టి నన్ను నిత్యానిత్యవివేచనతోఁ గూడినమానసముచేతఁ దెలిసికొనుము. ౧౦౬

అవ. మఱియు నాత్మ యన్నిటిలో నుండి యన్నిటినిం బ్రకాశింపఁజేయుచున్న దని దృష్టాంతసహితముగ నుపదేశించుచున్నారు.

మును, లీలన్ = అవలీలగా, అనిశమున్ = నిరంతరమును, వెలింగిం పుదున్ = చిత్ప్రకాశముచేఁ జక్షురాదులకును గోచరము లగునట్లు చేయుదును.

తా. సమస్తదేవతాస్వరూప మగు పరబ్రహ్మను నిరంతరమును వందనాద్యుపచారములచే నుపాసించెదు నో యాంజనేయా! పెక్కులు చిన్నచిన్నకన్నములు గల కడవలో నునుపంబడినదీపము, ఆ రంధ్రముల నుండి వచ్చెడు తనవెలుఁగులచేఁ బైనుండెడు వస్తువులను, ఆ కడవలోపల నున్నవస్తువులను గనఁబఱచునట్లు సర్వాంతరుండ నై నేను నేనను ప్రతీతి స్వరూపుఁడ నగునేను మానసము బుద్ధి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియ ములు మొదలగువానితోఁ గూడినస్థూలసూక్ష్మకారణశరీరములయం దున్న వాఁడ నై అకారణముగ మూలావిద్యచేతఁ గల్పింపఁబడినట్టియు పైని లోపల నున్నట్టియు నామరూపాత్మకమగు పదార్థజాతమును జిత్ప్రకాశ ముచే నింద్రియాదులకు గోచర మగునట్లు చేయుదును. ౧౦౭

అవ. మహదాదిప్రకృతివికృతిసంఘాతము జడ మగుట చేతఁ దన్నుఁగాని తనకుఁ బెఱ యగుదానిని గాని తెలిసికొనఁ జాల దనియుఁ, జిద్రూప మగు నాత్మ యీ మహత్తత్త్వము మొదలగు కార్యకారణసంఘాతము నెల్లఁ దెలిసికొనుచున్న దనియు ని ట్లగుటచేతఁ బ్రకాశ్యము (దృశ్యము), మిథ్యా భూతము, ప్రకాశకము సత్త్వరూప మని చెప్పఁబడుచున్నది.

ఉ. తమ్ము నెఱుంగలేవు విహితమ్ముగ దేహము ప్రాణపంక్తిచి
త్తమ్ము దశేంద్రియమ్ము లుచితమ్ముగ నన్యము గానలేమి స
త్యమ్మగు నోకపీంద్రసతతమ్మును వాని దదీయకార్యజా
తమ్మును నేను గాంతు ననృతమ్ముగనన్ను ఋతమ్ముగాఁ దగన్.

టీ. ఓ కపీంద్ర = ఓ వానరోత్తమా! దేహము = మేనును, ప్రాణ + పంక్తి = దశవిధప్రాణములును, చిత్తమ్ము - చిత్తశబ్దముచే మనోబుద్ధిచిత్తాహంకారములకు నుపలక్షణము గాన నంతఃకరణచతుష్టయమును, దశ + ఇంద్రియమ్ములు = జ్ఞానేంద్రియము లైదునుఁ గర్మేంద్రియము లైదును గలఁ పదియింద్రియములును, విహితమ్ముగన్ = యథార్థముగ, తమ్మున్ = తమలో నొండొంటిని, ఎఱుంగన్ - లేవు = జడము లగుటచేఁ దెలిసికొనుటకుఁ దగినవి కావు; ఇట్లు తమ్ముఁ దామే తెలిసికొనఁ జాలనప్పుడు, అన్యమున్ = తమకుఁ గేఱ యగుదానిని, ఉచితమ్ముగన్ = వాస్తవముగ, కానన్ - లేమి = తెలిసికొనుటకు సమర్థములు గాకపోవుట, సత్యమ్ము = నిక్కము, అగున్ = ఔను, నేను = చిద్రూపమగు పరమాత్మ యనుట, వానిన్ = ఆ దేహము మొదలగువానిని, తదీయ + కార్య + జాతమ్మును = ఆ దేహము లోనగువాని సంబంధము లగు సమస్తకృత్యములను, అనృతమ్ముగన్ = మాయాకల్పితము లగుటచేఁ గల్లయనియు, నన్నున్ = అహంప్రత్యయాలంబన మగు పరమాత్మ నని యర్థము - ఋతమ్ముగాన్ = సద్వస్తువనగను, సతతమ్మును = నిరంతరమును, తగన్ = తగునట్లు, కాంతును = సాక్షినై పరికించుచుందును.

తా. మూఁడు మేనులును, ప్రాణాపానాదు లగు పదివాయువులును, మనోబుద్ధిచిత్తాహంకారములును నంతఃకరణచతుష్టయమును, శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములును, వాక్కు మొదలగు కర్మేంద్రియము లైదును, జడము లగుటచేత యథార్థముగఁ దమ్ముఁ దామెఱుంగఁజాల వను నపుడు తమకంటె నితరములైనవానిం దెలిసికొన లేవనుట నిక్కమే కదా? చిద్రూపుఁడను సర్వప్రకాశకుఁడను సర్వసాక్షిని నగు నేను ఆ దేహము లోనగువానిని నాయొక్క చైతన్యావలంబనమునఁ గలుగు నాదేహాదుల సంబంధములైన సమస్తకృత్యములను నవిద్యాకల్పితము లగుటంజేసి మిథ్యాభూతములనుగాను, సర్వాధిష్ఠానభూతుఁడ నగునన్నును సత్యస్వరూపునిగను నిత్యముఁ జూచుచుందును. ౧౦౮

అవ పరమాత్మ్యుఁడు నిజమాయకును మాయాకార్యములకును సాక్షి యై వ్యక్తము నవ్యక్తము నగు ప్రపంచమునకు విలక్షణుం డై తనకుఁ దా వెలుఁగొందుచున్నాఁ డని ప్రతిపాదించుచున్నారు.

శా. ధీచేతోవిషయాత్మకంబు లగు జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయముల్
సూచించుం దగఁదల్లయోదయములన్ సుప్తిప్రబోధంబులే
నాచిత్రంబులవానిఁ జేయునిజమాయన్ సాక్షినై చూచుచున్
రోచిష్ణుత్వముచే వసింతు సదసద్రూపాతిరిక్తంబుగన్.

టీ. జ్ఞాతృ + జ్ఞాన + విజ్ఞేయముల్ = ప్రమాతయుఁ బ్రమాణమును బ్రమేయము ననుమూఁడును (తెలిసికొనువాఁడు తెలివి తెలియఁదగినదియు ననుత్రిపుటి) వరుసగా, ధీ + చేతస్ + విషయ + ఆత్మకంబులు = నిశ్చయాత్మక యగు బుద్ధియుం, సంకల్పవికల్పాత్మక మగుచిత్తమును, శబ్దాదివిషయజాతమును స్వరూపముగఁ గలవి, అగున్ = అయియున్నవి, సుప్తి+ప్రబోధంబులు = సుషుప్త్యవస్థయుం జాగ్రదవస్థయును, వరుసగా, తత్ - లయ - ఉదయములన్ = వానియొక్క (బుద్ధిచిత్తవిషయము లను మూఁడింటియొక్క) మూలాజ్ఞానమునందు నణఁగియుండుటను మరలఁ బొడసూపుటను, సూచించున్ = సూచనసేయును, ఏను = చిద్రూపుఁడ నగునేను, ఆచిత్రంబులన్ = జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయము మొదలగు త్రిపుటు లనియెడు ప్రపంచమునందలియబ్బురముల నెల్లను ఈ యాశ్చర్యములను జూపుచు మాటుచునుండెడు జాగ్రత్సుషుప్త్యవస్థలను, వానిన్ = ఆజాగ్రత్సుషుప్త్యవస్థలను ప్రపంచవైచిత్ర్యమును, చేయు - నిజ - మాయన్ = కల్పించుచుండెడునాసంబంధమగు మూలప్రకృతిని, సాక్షిని ఐ = వీనికన్నింటికినిఁ గూటస్థుఁడ నయి, చూచుచున్ = కనుంగొనుచు, రోచిష్ణుత్వముచేతన్ = చిత్ప్రకాశస్వరూపముచేత, సత్ - అసత్ - రూప -

అతిరిక్తుంబుగాఁ = జాగ్రదవస్థయందు వ్యక్తముగను సుషుప్త్యవస్థయందు నవ్యక్తముగను నుండెడు నామరూపాత్మక ప్రపంచవైచిత్ర్యమునకంటె వేఱుఁగ, వఱలెడుఁ = తేజరిల్లుచు నుండెడును.

తా. ఘ్రాత ఘ్రాణము ఘ్రేయము, ద్రష్ట దర్శనము దృశ్యము, శ్రోత శ్రవణము శ్రావ్యము, భోక్త భోగము భోజ్యము, ననుమొదలుగఁ ద్రిపుటీరూపమగు నీ ప్రపంచవైచిత్ర్య మంతయును గ్రమముగ నిశ్చయాత్మిక యగు బుద్ధియొక్క రూపముగను, సంకల్పవికల్పాత్మక మగు చేతోరూపముగనుఁ గ్రాహ్యాత్మక మగు శబ్దాదివిషయరూపముగను నున్నవి. ఇట్టి ప్రపంచవైచిత్ర్యమెల్ల జాగ్రదవస్థలో వ్యక్తముగను స్వప్నావస్థలోఁ బ్రతిభాసామాత్రముగను పొడకట్టుచున్నది. సుషుప్త్యవస్థలో నన్నియు మూలాజ్ఞానమునందు లీనమగుటచే నవ్యక్తమై యున్నవి. ఈ యవస్థాత్రయసాక్షియై కూటస్థుఁడగు పరమాత్ముఁడు ఆ ప్రపంచవైచిత్ర్యమును, ఈ వైచిత్ర్యము నెల్లఁ గల్పించు మహామాయను బరికించుచు వ్యక్తావ్యక్తరూపమగు ప్రపంచమునకును, నీప్రపంచమును దన సత్తనాశ్రయించుకొని కల్పించెడు మహామాయకును విలక్షణముగఁ దనకుఁ దా వెలుఁగొందుచు నుండును. ౧౦౯

అవ. అచేతనము లయ్యు నంతఃకరణము మొదలగు నవి చిద్రూప మగు పరమాత్మ తమలోఁ బ్రవేశించుటవలన సచేతనములవలెఁ బొడకట్టుచున్న వని దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నారు.

క. మత్సాన్నిధ్యమువలన న
చిత్సాహంకారపవనకచిత్తేంద్రియముల్
వత్సా! చలియించుచు రం
గత్సదయస్కాంతసూచికలచందమునన్. ౧౧౦

టీ. వత్సా = ఓ కుమారా, అచిత్...ముల్-అచిత్ = అచేతనము లైన, స - అహంకార = నేనను నహంకృతితోఁ గూడుకొనిన, పవన = ప్రాణము లోనగు పదివాయువులును, చిత్త = అంతఃకరణచతుష్టయమును, ఇంద్రియముల్ = త్వక్కు మొదలగు జ్ఞానేంద్రియములును, వాక్కు మొదలగు కర్మేంద్రియములును, మత్ - సాన్నిధ్యమువలనను = నాయొక్క ప్రకృతియందుఁ బ్రతిఫలనరూపమగు సామీప్యమువలన,రంగత్...మునకా-రంగత్ = వెలుఁగొందుచున్న, సత్ = యోగ్యమగు, అయస్కాంత = సూదంటురాతి(చెంత నున్న), సూచికల=సూదులయొక్క, చందమునకా= రీతిని, చలియించును = కదలాడుచు (చేతనముతోఁ గూడినవివలె) నుండును.

తా. ఓవత్సా! శరీరాదులయందలి తాదాత్మ్యమువలని యహంభావ మమత్వములతోడనుఁ బ్రాణము లోనగు పదివాయువులతోనుఁ గూడి యున్న యంతఃకరణమును, చర్మము మొదలగు జ్ఞానేంద్రియము లైదును, వాక్కు మొదలగు కర్మేంద్రియము లైదును, ననునీప్రకృతిపకృతిసముదాయము సహజముగ జడ మయ్యును, సూదంటురాతిచెంత నుండుటవలన నినుపసూదులు గదలాడుచున్నట్లు చిద్రూపుఁడ నగు నేను తమయందుఁ బ్రతిఫలనరూపముగ సన్నిధి నుండుటంజేసి సచేతనములవలె మెదలు చుండును. ౧౧౦

అవ. పైని జెప్పిన యర్థమునకు హేతువుగఁ బరమాత్మని సర్వాంతరత్వమును బ్రతిపాదించుచున్నారు.

క. తప్తాయఃపిండాంత
ర్వ్యాప్తానలమండలంబుకైవడువున మాయా
గుప్తబ్రహ్మాండసము
ద్దీప్తచిదాత్మకుఁడ నేను ధీరవరేణ్యా! ౧౧౧

టీ. ఉప్త...వహ్ని - ఉప్త = ఎట్టిగాఁ గాల్పఁబడిన, అయఃపిండ = ఇనుపగుండుయొక్క, అంతః = లోపల, వ్యాప్త = గ్రమ్మియున్న, అనల = అగ్నియొక్క, మండలంబు = సమూహముయొక్క, వసువ్రహ్ని = మాదిరిని, నేను = సర్వాంతరుండ నగు నేను, మాయా...ఆత్మకుఁడను— మాయా = మూలాజ్ఞానముచేత, గుప్త = ఆక్రమింపఁబడిన, బ్రహ్మాండ = చతుర్దశభువనాత్మక మగు జగత్ప్రపంచమంతటను, సమ్ ఉత్ దీప్త = చైతన్యస్ఫురణచే లెస్సగా వ్యాపించి ప్రకాశించుచున్న, చిత్ - ఆత్మకుఁడను = చిత్స్వరూపుఁడను (అయితిని). ధీర - వరేణ్య = ధీరశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడా - అని యాంజనేయులకు సంబోధన.

తా. "మానావమానయో స్తుల్య, స్తుల్యో మిత్రారిపక్షయోః, సమ దుఃఖసుఖో ధీర స్సమలోష్టాశ్మ కాంచనః" అనఁగాఁ దన్ను నొరులు గౌరవించునప్పుడు మోదమును, దిరస్కరించునపుడు ఖేదమును లేక, యందు డెందములో నొకతీరుగ నుండువాఁడును, పగతునియందు ద్వేషమునుఁ జెలికానియందుఁ గూర్మియు లేక సమముగ నుండువాఁడును, వేదన నిడుమ వచ్చినపుడు కలఁతఁ జెందుటయు, సౌఖ్యము గలుగునప్పుడు ఉబ్బుటయును లేక, సమభావమున నుండువాఁడును, మఱియు నతుల వైరాగ్య సంపత్తి గలవాఁడగుటచేతఁ జిల్లిపెంకును రాతిని బంగారును సమానముగఁ దలఁచు వాఁడును ధీరుఁ డనఁబడును.-అని చెప్పఁబడిన ధీరలక్షణములు గలవారిలో శ్రేష్ఠుఁడా! నేను చూచితిని, నేను వింటిని, నేను పలికితిని, నేను మేల్కొంటిని, నేను గల గంటిని, నేను సుఖముగ నిదురించితిని అను మొదలుగ నేను నేను నే నని సర్వావస్థలయందును సర్వకాలములయందును సమస్తవ్యాపారములయందును, సకల వృత్తులయందును, ననుస్యూతుఁడ నై సర్వాంతరుఁడ నగు నేను, ఎట్టిగాఁ గాల్పఁబడిన యినుపముక్కయందు లోను పైని గ్రమ్మియున్న యగ్నివడువున మూలావిద్యచేఁ గల్పింపఁబడి జడ మగు ప్రకృతివికృతిసంఘాతమునం దంతటను చిత్ప్రకాశముచేత వ్యాపించి

స్వయముగ వెలుఁగుచు నాసంఘాతమునుగూడ వెలిఁగించుచు నున్న పరిశుద్ధ చిద్రూపుండ నయి వెలుఁగొందు చున్నాను. ౧౧౧

అవ. సచ్చిదానందైకస్వరూప మగు నఖండ పర బ్రహ్మమునందు నేకదేశమున ననాదియగుమహామాయ గలదు. ఇది సత్త్వరజస్తమోగుణసామ్యావస్థారూప మైనది. ఇది శుద్ధ సత్త్వప్రధాన మైనచో మాయ యనియు, మలినసత్త్వ ప్రధాన మైనచో నవిద్య యనియుఁ జెప్పఁబడును. కాఁగా, నా బ్రహ్మచైతన్యము మాయోపాధిక మైనచో సర్వజ్ఞత్వాద్య నంతకళ్యాణగుణగణ పరిపూర్ణుఁ డగు నీశ్వరుం డనియు, నవి ద్యోపాధిక మైనచోఁ గించిద్జ్ఞత్వాది స్వల్పగుణవిశిష్టుఁ డగు జీవుఁ డనియు వేదాంతిమతము. జీవభావమును నిరసించి, మూ లావిద్యనుండి కేటించి, యహంప్రత్యయాలంబన మగు పర బ్రహ్మముపై ని సాధింపఁబడినది. ఇఁకను శుద్ధమాయోపాధికుం డగు నీశ్వరస్వరూపమును జెప్పుచు బ్రహ్మమును స్థిరపఱచు చున్నారు.

సీ. ధరణీజలానలమరుదంబరాంతరా
విష్టాఖిలాధారద్రష్ట నేను,
ఆదిత్య చంద్రగ్రహర్క్ష తారాతటి
త్సంవ్యాప్తదివ్యతేజంబు నేను,
అమరమానవతిర్యగాదిచేతనదీప్ర
కాశమానజ్ఞానఘనుఁడ నేను
బ్రహ్మాది దేవతాప్రార్థనీయానంత
కల్యాణగుణక విగ్రహుఁడ నేను

తే. కార్యరూపంబు లైనజగంబులకును
స్ఫురదుపాదానకారణంబును నిమిత్త
కారణము నైన నిర్మలాకార సత్త్వ
పరమమాయాసమన్వితేశ్వరుఁడ నేను. ౧౧౨

టీ. ఏను = అహంప్రత్యయాలంబన మగు చిద్రూపము నగు నేను, ధరణీ...ద్రష్టను—ధరణి = భూమి, జల = నీరు, అనల = నిప్పు, మరుత్ = గాలి, అంబర=ఆకసము (అను నీ పంచభూతములయొక్క), అంతః = లోపలను, ఆవిష్ట = క్రమ్మి ప్రవేశించియున్న, అఖిల - ఆధార= ఆ భూతజాతమునకు నధిష్ఠాన మగు, ద్రష్టను = కనుఁగొనువాఁడను, ("ఐతిని") అను నీపద మిఁకముందు నంతటను దెచ్చిపెట్టుకొనఁబడినది. నేను = గతార్థము, ఆదిత్య...తేజంబు—ఆదిత్య = వేవెలుఁగు, చంద్ర = రేవెలుఁగు, గ్రహ = కుజుఁడు మొదలగు దక్కిన గ్రహములు, ఋక్ష = గ్రహములకంటె వెలుఁగు చుక్కలు, తారా = అశ్విని భరణి మొదలగు ముఖ్యనక్షత్రములు, తటిత్ = మెఱుపులు (అను వీనియందు), సంవ్యాప్త = లెస్సగఁ గ్రమ్మియున్న, దివ్య = లోకోత్తరమైన, తేజంబు = వెలుఁగును, ఐతిని; అమర...ఘఁడను—అమర = దేవతలు, మానవ= మనుష్యులు, తిర్యక్ = పసులు పిట్టలు మెకములు, ఆది = లోనుగాఁ గల, చేతన = శరీరులయొక్క, ధీ = బుద్ధులయందు, ప్రకాశమాన = ప్రతిఫలన రూపముచేత వెలుఁగుచున్న, జ్ఞానఘనుఁడను = చైతన్య సాంద్రుఁడను, నేను = నే నయితిని; బ్రహ్మ...హుఁడను—బ్రహ్మ = చతుర్ముఖుఁడు, ఆది = మొదలుగఁ గల, దేవతా = సురలచేత, ప్రార్థనీయ = కోరఁదగిన, అనంత = పెక్కులగు, కల్యాణ = శుభప్రదములగు, గుణక= సద్గుణములు గల, విగ్రహుఁడను = మూర్తిగలవాఁడను, నేను = నేనయితిని; కార్యరూపంబులు = మాయాకల్పితము లైన యాకృతులు గలవి, ఐన జగంబులకును = అగునట్టి పదునాలుగు లోకములకును, స్ఫురత్ ఉపా

దానకారణంబును = కుండలు మొదలగు వానికి మట్టిపడువున నొప్పుచుం డెడు మూలకారణమును, నిమిత్తకారణమును = ఆ ఘటాదులకుఁ గుమ్మరి కఱ్ఱ చీర మొదలగు వానివలెఁ బరికరరూప మగు కారణమును, ఐన = అగు, నిర్మల...ఈశ్వరుఁడను - నిర్మల = రజోగుణ తమోగుణ సంప ర్కము లేమిని పరిశుద్ధ మగు, ఆకార=స్వరూపము గల, సత్త్వ = సత్త్వ గుణము, పరమ = ప్రధానముగఁగల, మాయా = మూలప్రకృతితో, సమ న్విత = కూడియున్న, ఈశ్వరుఁడను = కారణోపాధికుఁడను, నేను = నే నయితిని.

తా. సుగమము.

అవ. పరబ్రహ్మము వేదాంత మహావాక్యప్రమాణైక గమ్య మనియు, మహాజ్ఞానులచే నిరంతరము నుపాసింపఁ దగిన దనియు నుపదేశించుచున్నారు.

తే. వేదశాస్త్రాగమములచే వేదితవ్య
మైనవస్తువు నేను మహాత్ములకును
జపతపోదానయజ్ఞసంచయముచేత
పరసమారాధనీయదైవంబు నేను. ౧౧౩

టీ. వేద...వేదితవ్యము—వేద = ఋగ్వేదము యజుర్వేదము సామ వేదము అథర్వణవేదము అను నాలుగు వేదములచేతను, శాస్త్ర = పూర్వ మీమాంస యుత్తరమీమాంస సాంఖ్యము యోగపాతంజలము మొదలగు వేదైక మూలము లగు దర్శనములచేతను, ఆగమ = శ్రుతి స్మృత్యర్థోప బృంహణరూపము లగు చతుష్షష్టి తంత్రములచేతను, వేదితవ్యము = తెలిసి కొనఁదగినది, ఐన + వస్తువును = అగునట్టి పరవస్తువును, నేను = నే నైతిని; మహాత్ములకును = శమదమాది సాధన సంపత్తి గల జ్ఞానులకు, జప...చేతన్ - జప = గాయత్రి మొదలగు మహామంత్రముల పురశ్చర ణములయు, తపస్ - "సతపో తప్యత" ఆత్మవిచారణయొక్కయు, దాన=

బ్రహ్మోపదేశ ముపదేశించుటయొక్కయు, యజ్ఞ = బ్రహ్మోపాసనా విశేషములయొక్కయు, సామగ్రులచేతన్ = సామగ్రిచేత, పర + సమారాధన + నైపుణ్య = సర్వోత్కృష్టమైన యారాధింపఁదగిన పరదేవత, నేను = స్వప్రకాశస్వరూపుఁడ నగు యథార్థప్రత్యగాలంబన మగు బ్రహ్మ మై యున్నాను (అయితిని).

తా. ఋగ్వేదాదులు మొదలగు చతుర్వేదములచేతను, కర్మమీమాంస బ్రహ్మమీమాంస మొదలగు వేదార్థప్రతిపాదకములగు శాస్త్రములచేతను, పరమేశ్వరునిచేతఁ బార్వతికి నుపదేశింపఁబడిన యాగమాది నానాతంత్రములచేతను, గ్రహింపఁదగిన పరవస్తువు నేను నేనని సర్వసాక్షియైన ప్రత్యగాత్మ యయియున్నది. మఱియు, మహాత్ములగు యోగులకు గాయత్రి మొదలుగఁ గల సప్తకోటి మహామంత్రముల పురశ్చర్యలయొక్కయు, 'సత్యేన తపసా' అను మొదలగు శ్రుతివచనములనుబట్టి యన్నమయాది మొదలగు పంచకోశముల వివేచనము జేసి, పంచకోశాతీత మగు పరమాత్మను దెలిసికొనుట యను బ్రహ్మవిచారణరూప మగు తపస్సులయొక్కయు, కర్మమీమాంసచేతఁ బ్రతిపాదింపఁబడిన యజ్ఞములయొక్కయు, సమూహములచేత నిరంతరమును లెస్సగ నుపాసింపఁదగిన వేల్పును నేనే నైతి నని తాత్పర్యము. ౧౧౩

అవ. ఆత్మ, మహదాది కార్యకరణ సంఘాతమునందు నభిమానము లేనిది గాన, నిరాకార మనియు, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను మొదలగుశ్రుతులనుబట్టి సర్వాత్మకము గాన సాకారవిశిష్ట మయిన దనియు నుపదేశించుచున్నారు.

తే. అనఘ సాకారుఁడను గాను ♦ విను సమష్టి
ఘనతనుద్వయ తాదాత్మ్య♦కమునకుఁ జొరమి
నరి నిరాకారుఁడను గాను ♦ సాక్షి నగుచుఁ
గారణశరీర మే నను ♦ కలఁక లేమి. ౧౧౪

టీ. అనఘ = అవిద్యారూప మగు దోషము లేని యాంజనేయా, వినుము = ఆత్మ స్వరూపము నుపదేశించెద నాలకింపుము. సమష్టి... కున్ - సమష్టి = సమష్టి రూపమునను వ్యష్టిరూపమునను, ఘన = స్థూల రూపముగను సూక్ష్మరూపముగను నున్న, తను = శరీరములయొక్క, ద్వయ = రెండిటియందును, ఇచ్చట తనుద్వయపద సామర్థ్యమువలన సమష్టి ఘనశబ్దములచేతఁ గ్రమముగా వ్యష్టిసూక్ష్మములకును నుపలక్షణము, తాదాత్మ్యమునకున్ = ఇవియే నే నను నభిమానమునకు, చొరమిన్ = లోఁబడక పోవుటచేత, సాకారుఁడను = ఆకృతితోఁ గూడుకొనినవాఁడను, కాను = అయి యుండలేదు. సరిన్ = సర్వసమత్వముతో, సాక్షిని = మహదాదులకు ద్రష్టను, అగుచున్ = అయినవాఁడనై, కారణశరీరము = అవిద్యారూప మగు కారణదేహము, ఏను అను + కళంక = నేనే యనెడు దాదాత్మ్యరూప మగు కళంకము, లేమిన్ = లేకపోవుటచేతను, నిరాకారుఁడను = ఆకృతి లేనివాఁడను, కాను = నే నయి యుండలేదు.

తా. ఓ హనుమానుఁడా! పరమాత్మస్వరూపము నుపదేశించెద, నాకర్ణింపుము. పరమాత్మ ఈశ్వరోపాధి యగు సమష్టియు, జీవోపాధి యగు వ్యష్టియు, నీ సమష్టివ్యష్టుల స్థూలసూక్ష్మములును స్వరూపముగఁ గల రెండు మేనులయందును నభిమానమును వహింపక నిర్వికల్ప మగుటచేత, నిరాకారమును ఇచట నాకార మనఁగా వృత్తి యని తాత్పర్యముగాన వృత్తిరహితమైన దని యర్థము. సర్వసమత్వమున సకలమునకు సాక్షి యయియుండి యవిద్యారూప మగు కారణశరీరమునందుఁ దాదాత్మ్యరూప మగు కళంకము లేకపోవుటచేత సాకారమును (సాక్షిత్వరూప మగు వృత్తితోఁ గూడుకొని యున్నదియు) నగును. ౧౧౪

అవ. ఇఁకఁ బరమాత్మకుం గల నిర్లిప్తత్వమును బ్రతిపాదించుచున్నారు.

తే. అఖిలభూతములందు నే నఖిలభూత
ములును నాయందుఁ గలుఁగంగఁ బొరయ నెందు
వాని, నవియు నన్నంటవు వానరేంద్ర!
సమతఁ బొల్పారు గగనంబు చందమునను. ౧౧౫

టీ. వానర + ఇంద్ర! = వానరులలో శ్రేష్ఠుఁడవగు నో యాంజనేయా, సమతన్ = సకల పదార్థములకును సాధారణమగుచు, ఒప్పు + ఆరు = ప్రకాశించుచున్న, గగనంబు + చందమునను = మిన్నువలెనున్నను, అఖిల + భూతములందున్ = వ్యక్తావ్యక్తరూపము లగు సకలభూతములయందును, నేను = నేను అను స్వసంవేద్యమగు నాత్మయు, నాయందున్ = అట్టి పరమాత్ముఁడ నగు నాలోపలను, అఖిలభూతములును, కలుగన్ + కన్ = నివసించియుండఁగా, ఎందున్ = ఎన్నఁడును, వానిన్ = ఆ భూతకోటులను, పొరయను = నిస్సంగుఁడ నగుటచేత నంటను; అవియును = ఆ భూతజాతములును, నన్నున్ = పరమాత్ముఁడ నగు నన్నును, అంటవు = తాఁకవు. 'యః పృథివ్యాం తిష్ఠన్' అను మొదలగు నంతర్యామి బ్రాహ్మణశ్రుతిచే నన్తర్యామి యను పరమాత్మయందుఁ బృథివ్యాదిభూతజాతములును నా భూతకోటులయందుఁ బరమాత్మయు నున్నను నిస్సంగుఁడగుటచేఁ బరమాత్ముని నాభూతములును, నాభూతములను బరమాత్మయును స్పృశింపక యుండును- అని ఫలితము.

తా. ఓ కపివర్యా! ఎల్లపదార్థములును దనయందుండుటచే వానికన్నిటికిని సాధారణమగు నాకసమువడువున నేను పుడమిమొదలగు నిఖిల భూతములయందును నాయందా భూతము లన్నియును నాశ్రయాశ్రయి భావముచే, లేక వ్యాప్యవ్యాపకభావముచే నున్నను వానిని నేనును, నన్నవియును గలియుటలేదు. ఇందులకు నేను [ఆత్మ] నిర్లిప్తుఁడను నిస్సంగుఁడను నయియుండుట కారణము. మఱియు నీయర్థమునందు "యః పృథివ్యాం

తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ నవేద, యస్య పృథివీశరీరం యః పృథివీమంతరోయమయత్యేషత ఆత్మాంతర్యామ్యమృతః। యోఽప్సుతిష్ఠన్ - తః । యోఽగ్నౌ తిష్ఠన్ - తః । యోంతరిక్షే తిష్ఠన్-తః । యో వాయౌ తిష్ఠన్-తః। యోదివితిష్ఠన్-తః। య ఆదిత్యే తిష్ఠన్-తః। యోదిక్షు తిష్ఠన్తః యశ్చంద్రతారకే తిష్ఠన్ - తః । య ఆకాశే తిష్ఠన్ - తః । య స్తమసి తిష్ఠన్-తం । యస్తేజసి తిష్ఠన్—తః । ఇత్యధిదైవతం । అథాధిభూతం । యస్సర్వేషు భూతేషు తిష్ఠన్-తః । ఇత్యధిభూతం అథాధ్యాత్మం । యః ప్రాణే తిష్ఠన్—తః । యోవాచితిష్ఠన్—తః । యశ్చక్షుషి తిష్ఠన్ - తః। యశ్శ్రోత్రే తిష్ఠన్-తః । యో మనసి తిష్ఠన్—తః । య స్త్వచి తిష్ఠన్-తః । యో విజ్ఞానే తిష్ఠన్-తః । యో రేతసి తిష్ఠన్-తః । అదృష్టోద్రష్టాఽశ్రుతః శ్రోతాఽమతో మంతాఽవిజ్ఞాతో విజ్ఞాతా, నాన్యతోఽస్తి ద్రష్టా నాన్యతోఽస్తి శ్రోతా నాన్యతోస్తి మంతా నాన్యతోఽస్తి, విజ్ఞాతైషత ఆత్మాంతర్యామ్యమృతోఽతోఽన్యదార్తమ్।'' అను బృహదారణ్యక శ్రుతిప్రమాణము. దీని యర్థము ప్రథమాశ్వాసమునందు వివరింపఁబడినది.

అవ. వస్తుతత్త్వము నెఱింగినతోడనే భ్రాంతికల్పితము కల్లయగు నని యుపదేశించుచున్నారు.

క. మృగతృష్ణికల నెఱింగినఁ
దగ జలముల భావ మగువిశధమునఁ దెలివిచే
నగుఁగాఁ డగునన్నుఁ దెలిసిన,
జగములు నాయందు లేవు కి సత్యం బనఘా! ౧౧౬

టీ. అనఘా = సంసారరూపమగుదోషము లేని యో యాంజనేయా, మృగతృష్ణికలఁ = మరీచిక లనఁబడెడు నీళ్లులేని యెడారుల యందుఁ దరంగములవలెఁ దళతళ మను సూర్యకిరణములను మండువేసవిలో దగఁ గొని, లేళ్లు చూచి, నీళ్లనుకొని పరువులిడుటచే నెండమావుల

కీ పేరు వచ్చినది. ఈ భ్రమ యొకస్థానము ముముక్షులకుఁగూడఁ గలుగును గాన, నా రెండవమాటలను, తాన్ - ఏతేనినన్ = ఇవి సిద్ధ కావని నిశ్చయముగఁ దెలిసికొనినయెడల, జలంబులు = తరంగములు, అభావము+అగు+విభ్రమనన్ = కల్పనయగు పోవిని, తెలివిచేన్ = పరమాత్మస్వరూప పరిజ్ఞానముచేత, అగుణము = గుణత్రయాత్మకమగు ప్రకృతి సంబంధము లేనివాఁడు, అగు = ఐనట్టి, నన్నున్ = పరమాత్మ నని యథార్థముగ, తెలిసినన్ = తెలిసికొనినతోడనే, జగములు = ప్రపంచములు, నాయందున్ = పరమాత్మయందు, లేవు = కలుగవు, సత్యంబు = ఇది నిజము.

తా. ఇవి రెండవమాటలుగాని సిద్ధ కా వని తెలిసినతరువాత జలభ్రాంతి పోయినరీతిని గుణత్రయాత్మకమగు ప్రపంచము పరమాత్మయందు నజ్ఞానముచేఁ గల్పింపఁబడినది గాని, వాస్తవము కాదనియుఁ బరమాత్మ ప్రపంచాతీత మనియు సదసద్వివేకనాపూర్వక మగు సుజ్ఞానముచేఁ దెలిసికొనినతరువాత, నా పరమాత్మయందు నీ ప్రపంచభ్రాంతి నశించును. ఇది నిక్క మని తాత్పర్యము. ౧౧౭

అవ. ఇట్లు ప్రత్యక్షముగఁ బ్రపంచము మానవతిర్యగాదిచేతనవిశిష్టమై, స్రక్చందన వనితా సంభోగాది సుఖబహుళంబై సత్యముగఁ గనబ్బటుట యధిష్ఠానసత్తవలనఁ గాని వేఱొండువిధమునఁ గా దని ప్రతిపాదించుచున్నారు.

చ. అనృత మచేతనం బసుఖకమైనజగంబు ఋతంబుఁ జేతనం
బును సుఖమై విమూఢులకు భోగ్యముగాఁ గనుపట్టు టెల్ల స
న్మైనయుటచేతఁజుమ్మిది కపీంద్ర ఘృతాన్వితదుగ్ధపూర
ముల్, ఘనమధురంబులై వెలయుకైవడి భక్తజనాను
[రంజనా.

టీ. భక్తజన + అనురంజనా = మహాభక్తులగు మనుజుల ననుసరించి యానందింపఁ జేయువాఁడ వగు, కపీంద్ర=ఓ వానరోత్తమా! అనృ

తము = అజ్ఞానవిజృంభిత మగుటచేత మిథ్యాభూతమును, అచేతనంబు = కేవల జడమును, అసుఖము = దుఃఖబహుళమును, ఐన + జగంబు = అగు నట్టి ప్రపంచము, విమూఢులకున్ = ఆత్మానాత్మ వివేకము లేని మూర్ఖులకు, ఋతంబున్ = వాస్తవముగను, చేతనంబును = దేవ మానవ తిర్యగాది చేతన విశిష్టముగను, సుఖము = సంతోష భరితముగను, ఐ = అగుచు, భోగ్యము - కాన్ = అనుభవింపఁ దగినదిగా, కనుపట్టుట - ఎల్లన్ = తోఁపఁబడుట యంతయును, ఘృత + అన్విత + దుగ్ధ + పూరముల్ = నేతితోఁ గూడుకొనిన పాలసముదాయములు, ఘన + మధురంబులు = మిక్కిలి స్వాదు గలవి, ఐ + వెలయు + కైవడిన్ = అగుచుఁ దగియుండు తీరున, నన్నున్ = పరమాత్మను, ఎనయుటచేతన్ = అధిష్ఠానముగఁ బొందియుండుటవలనను, చుమ్మీ = సుమీ.

తా. సచ్చిదానందఘనం బగుపరమాత్మ నధిష్ఠానముగఁ బడయుటంబట్టి యనృతజడదుఃఖమయ మగు నీ సంసారము, నేతిలోఁ గూడుకొనియున్న పాలు మిగుల స్వాదుగ నున్నట్లు నిత్యానిత్యవస్తువివేకశూన్యులకు వాస్తవముగను చిద్రూపముగను సంతోషభరితముగను దోఁపట్టుచుండును. ౧౧౭

అవ. అనృత జడ దుఃఖమయ మగు నీ సంసార మజ్ఞానులకు భ్రాంతిచే సత్యజ్ఞానానందరూప మై మదాశ్రయబలంబునఁ దోఁపట్టు నని చెప్పి జ్ఞానుల కట్టిభ్రాంతి లేమిం జేసి స్వస్వరూపమునఁ బరమాత్మయే సాక్షాత్కరించునని యుపదేశించుచున్నారు.

క. జ్ఞానుల కఖండసత్య
జ్ఞానానందస్వరూపకసాక్షి నగుచు వి

జ్ఞానముచేఁ దెలియఁబడి
నేనై సాక్షాత్కరింతు నే నిక్కం బనఘా! ౧౧౮

టీ. అనఘా = అజ్ఞానరూప మగు దోషము లేని హే యాంజనేయుఁడా, జ్ఞానులకే = భ్రాంతిశూన్యత మగు సాంప్రదాయక జ్ఞానము కల్గి యను తెలివి గలవారలకు, విజ్ఞానముచేకే "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అను విశేషజ్ఞానముచేత, అ...సాక్షి—అఖండ = సర్వవ్యాపక మగుటచేఁ బరిచ్ఛిన్నము గాని, సత్య = కాలత్రయాబాధ్య మగుటచే సత్తును, జ్ఞాన = చిత్తును, ఆనంద = పరమప్రేమాస్పద మగుటచే సౌఖ్యమును, స్వరూప = నిజరూపముగాఁ గల, సాక్షిని = మహదాది కార్యకరణ సంఘాతమునకుఁ బరుఁడనై, వాని నెల్లఁ బరికించువాఁడను, అగుచుకే = అయి, తెలియఁబడి = స్వానుభవైకవేద్యత్వము నొంది, నేను - ఐ = అహంప్రత్యయాలంబనుఁడ నయి, సాక్షాత్కరింతుకే = పరమాత్మస్వరూపమున గోచరుఁడ నగుదును, నిక్కంబు = ఇది వాస్తవము.

తా. అజ్ఞానరూప మగుదోషము లేని హే యాంజనేయా! అజ్ఞానభ్రమచేఁ బొడమిన సంసార మసారమని యెఱుంగువారికి బ్రహ్మము సత్యము, జగత్తు కల్ల యను నిశ్చయజ్ఞానముచేత నపరిచ్ఛిన్నమును సత్తును చిత్తును ఆనందమును స్వరూపముగాఁగల ద్రష్టనై యెఱుంగంబడి నేనను ప్రతీతిమాత్ర విషయ మగు బ్రహ్మము స్వానుభవైకవేద్య మగు ననుట వాస్తవము సుమీ.

అవ. జ్ఞానులు సర్వసాక్షి యగు పరమాత్మను నిరంతరమును మననముఁ జేయుచుండవలయు నని యుపదేశించుచున్నారు.

తే. అట్లు గావున ననఘ! మహాత్ము లెల్ల
సచ్చిదానందమయునిఁగా నే సర్వకర్త్ర

కరణకార్యములకు సాక్షిఁగాఁగ నన్ను
దెలిసి యనవరతంబుఁ జింతింపవలయు. ౧౧౯

టీ. అనఘ = అసంభావన విపరీతభావన మొదలగు తప్పిదములు (దోసఁగులు) లేని యో యస్ఖలిత బ్రహ్మచారీ, అట్లు - కావునన్ = పైని జెప్పినతీరున నేను స్వానుభవైకసిద్ధుఁడ నగుటచేత, మహాత్ములు - ఎల్లన్ = మహనీయులగు బ్రహ్మవేత్త లెల్లరును, నన్నున్ = నే నను ప్రతీతికి గోచరమగు పరమాత్మను, సత్ + చిత్ + ఆనంద + మయునిన్ - కాన్ = కాలత్రయాబాధ్యత్వము, జడవిలక్షణత్వము అఖండసుఖత్వముఁ బ్రచురముగఁ గలదానినిగను, సర్వ + కర్తృ + కరణ + కార్యములకున్ = వ్యష్టిగ నున్న సకలజీవు లనియెడు కర్తలకును, (ప్రమాతలకును) శబ్దాదివిషయములను గ్రహించుటకు నుపకరణములు (సాధనములు) అగు శ్రోత్రాదీంద్రియములకును, ప్రమేయరూపములగు శబ్దాది విషయజాతమునకును, సాక్షిన్-కాన్-కన్ = ద్రష్టృచైతన్యరూపునిఁగను, తెలిసి = ఎఱింగి, అనవరతంబున్ =నిరంతరమును, చింతింపన్ - వలయు=మననముఁ జేయుచుండునది.

తా. అసంభావన విపరీతభావన మొదలగు నజ్ఞానకార్యములు లేని యో యాంజనేయా! మీఁదఁ జెప్పంబడిన తీరున నేను స్వానుభవైకసిద్ధపరమాత్ముఁడ నగుటచేత, నా పరమాత్మ, అఖండైక రస సచ్చిదానంద విగ్రహం బనియు, సకలము లగు కర్తృరూప జీవచైతన్యములకును, తత్ప్రమేయజాతమును గ్రహించుటకు సాధనభూతము లగు చక్షురాదీంద్రియవర్గమునకును, నీ యింద్రియములకు గోచరము లగు ఘటపటాది కార్యనికరమునకును, నుపద్రష్ట యనియును బ్రహ్మవేత్త లగుమహనీయు లెఱింగి యా పరమాత్మను సర్వకాలములయందును ననుసంధించుచుండునది. ౧౧౯

అవ. "నన్నుఁ దెలిసి యనవరతంబుఁ జింతింపవలయు" అని శ్రీరామచంద్రు లుపదేశింపఁగా హనుమానుఁడు పరబ్రహ్మ

చింతనమునకు నేమి నియమనిష్ఠ లుండవలయునో యీయు పాసనాక్రమం బెట్లో అను మొదలగు విశేషములను దెలుప వలయు నని, ప్రార్థించుచు దన ప్రపన్నత్వమును జూపుచు వచించెను.

క. అన విని హనుమంతుఁడు రా
   ముని దివ్యపదారవిందములకున్ ఘనవం
   దన మాచరించి పలికెన్
   వినయము భక్తియును దృఢవివేకము మెఱయన్. ౧౨౨

టీ. అనన్ = శ్రీరాములవారి ట్లుపదేశింపఁగా, విని = ఆలించి, హనుమంతుఁడు = హనుమానుఁడు, రాముని + దివ్య + పద + అరవింద ములకున్ = శ్రీరామమూర్తియొక్క దేదీప్యమానము లగు పదపద్మములకు, వందనము = నమస్కారము, ఆచరించి = ఒనర్చి, వినయమున్ = నమ్రతయు, భక్తియు = ప్రేమయును, దృఢ + వివేకమున్ = నిశ్చల మగు సద సద్వివేచనయును, మెఱయన్ = వెల్లడియగుచుండఁగా, పలికెన్ = నుడివెను.

తా. శ్రీరామచంద్రులు పైని చెప్పినయట్లు పలుకఁగా నాకర్ణించి యాంజనేయుఁడు నిజగురుస్వాములగు సీతాపతియొక్క పరమపవిత్రము లగు పాదపద్మములకు పెక్కులు మ్రొక్కు లొనరించి, వినీతతయుఁ బ్రేమయు నసమానమగు నాత్మానాత్మవివేకమును బ్రకట మగుచుండఁగా నీతీరున నుడివెను.

అవ. ఆంజనేయుని వేఁడుకోలు (ప్రార్థన) వివరింపఁబడు చున్నది.

ఉ. ఏనియమంబులుం గలిగి యేసమయంబున నెవ్విధంబు
   నన్, మౌనముఁ బూనియో యదియుఁ గానియొ మంత్ర

ము తంత్ర మెద్దియో, నీనయరూప మారయఁగ నిర్గు
ణమో సగుణంబో నెమ్మదిన్, ధ్యానము సేయఁగావలయు
న న్నియుఁ బ్రేమ నెఱుంగఁ దెల్పవే. ౧౨౧

టీ. ఏ + నియమంబులున్ = ఎట్టి నిష్ఠలు, కలిగి = ఉండి, ఏ + సమయంబునన్ = ఎట్టి తఱిని, ఏ + విధంబునన్ = ఎట్టి తీరున, మౌనమున్ = వాఙ్నియమము ఇంద్రియనిగ్రహము వృత్తిరాహిత్యము ననఁబడు త్రివిధ మౌనములలోనే మౌనమును, పూనియో = వహించియో, అదియున్ = అట్టి మౌనమును, మానియో = పరిత్యజించియో, మంత్రము = బీజాక్షర సంపుటిత మగు మంత్రము, తంత్రము = కల్పము, ఎద్దియో = ఏదిమై యుండునో, నీ + నయ + రూపము = నీ సంబంధ మగు వాస్తవస్వరూప మును, ఆరయన్ - కన్ = పరికించుటకు, నిర్గుణమో = సత్త్వరజస్తమో గుణాతీత మైనదియో, సగుణమో = లేక యపరిమితకల్యాణగుణవిశిష్ట మైనదియో, నెఱ + మదిన్ = పరిపూర్ణ హృదయమునందు, ధ్యానమున్ = చింతనమును, చేయన్ - కాన్ - వలయున్ = ఒనర్పవలసి యున్నది; అన్నియున్ = నీ యారాధనసామగ్రి నంతయును, ప్రేమన్ = అను గ్రహముతో, ఎఱుంగన్ = నాకు బోధయగునట్లు, తెల్పవు - ఏ = ఉప దేశింపుమా.

తా. ఓ శ్రీరామచంద్రా! సాక్షాత్పరమాత్ముండ వగు నీయొక్క సమర్చనమును జేయుటకు నియమనిష్ఠ లెయ్యవి యుండవలయును? ఎట్టి కాలములందు నాచరింపవలయును? వాఙ్నియమము ఇంద్రియనిగ్రహము మనోవ్యాపారరాహిత్యము నను మౌనముఁ బూనియా నీసపర్య నొనరింప వలెను? లేక మౌనమును విడిచియే చేయవలెనా? నీ సమారాధనము నకు మంత్ర మెయ్యది? కల్ప మెట్టిది? నీయొక్క నిర్గుణ స్వరూపమును డెందమునందు ధ్యానింపవలయునా? లేక సగుణరూపమును ధ్యానింప వల

ఉ. వానరనాథ! దేహముసు వాయువులింద్రియపఙ్క్తి చిత్తమున్
మానసబుద్ధు లేననుచు మానముఁబూనినమానవాళికిన్
మానము దేశకాలనియమంబులు మంత్రము తంత్రము ల్విధుల్
వానినిఁ జూచు సాక్షి నను వానికిఁ గల్గునె తద్వికారముల్.

టీ. వానర + నాథ = నరులను బోలినవా రగు వానరులకు నేలిక వగు నాంజనేయా! దేహమును = మేనును, వాయువులు = ప్రాణము మొదలగు వసిలు, ఇంద్రియపఙ్క్తి = జ్ఞానకర్మేంద్రియముల గణమును, చిత్తమున్ = హృదయమును, మానసబుద్ధులు = మనస్సును బుద్ధియును (అంతఃకరణ చతుష్టయము), ఏను అనుచున్ = నేనే యను తలంపు (ఆత్మనేయను), మానము = తాదాత్మ్యమును, పూనిన + మానవ + ఆళికిన్ = వహించిన మనుష్యుల గుంపునకు, మానము = పూర్వోక్త మానత్రయమును, దేశ + కాల + నియమంబులు - స్థలము తతి నిష్ఠ అనువిధు, మంత్రము = బీజవర్ణకూటరూప మగు మనువును, తంత్రముల్ = కల్పసూత్రను, విధుల్ = వేదశాస్త్ర విధానములును (చెప్పఁబడినవి), వానినిన్ = దేహము మొదలగువాని వికృతులను, చూచు + సాక్షిని = తనకంటె విలక్షణములనుగాఁ బరికించెడు ద్రష్టను నైతిని, అను + వానికిన్ = అని తలఁచుకొనియెడుజ్ఞానికి, తత్ + వికారముల్ = శరీరాదులయందుఁ దాదాత్మ్యము మొదలగు నాయా వికృతులు, కల్గును + ఎ = ఉండునా? ఉండవు.

తా. స్థూలశరీరమే యాత్మ యని భావించెడు శుద్ధమూఢులకును, 'ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్' అని ప్రాణాదివాయువులే యాత్మ యను వానివారికిని, జ్ఞానకర్మేంద్రియములే యాత్మ యని తలంచు మనుజులకును, 'మనో బ్రహ్మేతి వ్యజానాత్' అని మనోమయకోశమే యాత్మగా నెన్ను

గాను మనుష్యులకును ‘విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్’ అని విజ్ఞానమయ కోశమే యాత్మగా నెంచుకొనెడు మర్త్యులకును ‘ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్’ అని వైషయికానందమే యాత్మ యని నమ్మికొను మానవులకును, ఇట్లు మహదాది ప్రకృతి వికృతి సంఘాతమంతయు నాత్మస్వరూప మగు నభిమానమును వహించిన యజ్ఞానులకే యా యజ్ఞానరూప మగు కలుషము దొలఁగుటకొఱకు నానావిధ దేశకాలపాత్రానుసారము లగు మంత్ర పురస్సరములు, ప్రకృతులు కల్పములు మొదలగు వేదశాస్త్రోక్త విహిత కర్మలు గాని, యా మహదాది కార్యకరణ సంఘాతమునకు సాక్షి యగు నాత్మస్వరూపమును సమ్యగ్జ్ఞానముచేఁ దెలిసికొనిన పరిపూర్ణజ్ఞానులకు నా విధులతోఁ బనిలేదు. ఏమియుఁ బ్రయోజనము లేదు. ౧౨౩

అవ. “నేనను” సహజప్రత్యగాలంబన మగునది యాత్మ యనియు, ఇది యను నిదంప్రతీతి విషయ మగునది యనాత్మ యనియు నెల్లరకును గోచరమగుచు యున్నవి. ఈ రెండిటిలో నాత్మ, సద్వస్తువు; అనాత్మ, యవిద్యాకల్పిత మగుటచే నవస్తువు అని తెలిసికొనవలయు నని యుద్దేశించుచున్నారు.

శా. ఆత్మానాత్మలు రెండు వస్తువులు లక్ష్యంబుల్గదా? యుండనా
త్మాత్మభ్రాంతి యనాదినుండి సహజంబై యుండఁగా నిప్పుడీ
వాత్మజ్ఞప్తి వటించుఁ జెప్పితిక నన్యంబేమియు న్లేదు శు
ద్ధాత్మప్రత్యగభిన్నపూర్ణపరమాత్మారాముని దక్కఁగన్

టీ. ఆత్మ + అనాత్మలు = ఇవి శబ్దాది విషయములు, ఇవి కర్మేంద్రియములు, ఇవి జ్ఞానేంద్రియములు, ఇట్టిది యంతఃకరణ చతుష్టయము, ఇయ్యవి వానివాని వ్యాపారములు, ఇట్టివి వృత్తులు, ఇట్టివి జాగ్రదాద్యవస్థలు అను మొదలుగ నన్నిటిని దెలిసికొనుచు సర్వసాక్షి యగునది యాత్మ. ఈ యాత్మకు వ్యతిరిక్తమై తద్గోచరమగు కార్యకరణసంఘాత మెల్ల ననా

త్మయు నను, రెండు వస్తువులు=ఇరుతెఱంగు లగు పదార్థములు, లక్ష్యం బుల్ కదా = ఎల్లరకును గోచరము లయ్యె యున్నవి కదా; అందుఁ = ఈ రెండిటిలోను, అనాత్మ + ఆత్మ + భ్రాంతి = పూర్వోక్త మహదాది కార్యకరణ సంఘాతమునందుఁ దా ననియెడు తాదాత్మ్యమును, అనాది నుండి = మూలావిద్య యనాది గాన, దానితోపాటు, సహజంబు ఐ = స్వతస్సిద్ధమగుచు, ఉండఁ గాఁ = నిలుకడ చెందఁగా, ఇప్పుడు = ఈ సమయమునందు, ఈవు = "తత్త్వమసి" యను మహావాక్యమునం దలి త్వంపదవాచ్యుఁడ వగు నీవు, ఆత్మజ్ఞప్తివి = తత్పదవాచ్య మగు మ జ్ఞప్తిరూపమైన పరబ్రహ్మమవు, అటంచుఁ = నా నుపదేశముచే మూలా జ్ఞానము నశింపఁగా నయితివని, చెప్పితిఁ = అని యను పదార్థ మగు నైక్యము నుపదేశించితిని. ఇఁకను = ఈపైని, శుద్ధ . నిఁ = శుద్ధ = అజ్ఞానకాలుష్యము లేని, ఆత్మ = ముక్తాత్మయొక్క, ప్రత్యక్ = ప్రత్య గ్రూపముతో, అభిన్న=ఏక మగు, పూర్ణ = అనవచ్ఛిన్నమయి, పరమ= సర్వోత్తమ మగు, ఆత్మ = స్వస్వరూపమునందు, ఆరామునిఁ = అఖం డానందముతో రమించెడు పరాత్మునిని, తక్కఁ - కఁ = తప్ప, అన్యం బు = ఇంకొక్కటి, ఏమియుఁ = ఇంచుకయు, లేదు = ఉండదు.

తా. శబ్దాది విషయవర్గము, జ్ఞానకర్మేంద్రియములను వీని వ్యాపారమును, అంతఃకరణ చతుష్టయమును, దద్వృత్తులను, జాగ్రదాద్యవస్థలను మహదాది కార్యకరణ సంఘాతమును నిరంతరమును దెలిసికొనుచు సర్వసాక్షి యగునది యాత్మ. ఈ యాత్మకు విలక్షణమై గోచరమగునది యెల్ల ననాత్మ యనఁబడునవి రెండు పదార్థములని యెల్లరకుఁ దెలిసిన యంశమే కదా ? ఈ రెండిటి విషయమై యనాత్మస్వరూప మగు దేహాదికమునందు నేను నాదియను నహంకార మమకారరూప మగు తాదాత్మ్యము మొదలు లేని మూలావిద్యతోపాటుగఁ జిరకాలమునుండియు స్వతస్సిద్ధమై జీవునకుం గలిగియుండఁగా, నియ్యెడ నేను నీకు దేహాదికము నీవు గావు, కేవలము

ధారణ చేయుట మొదలగువాని నభ్యసించుటయందలి పట్టుదలను మాని, "గచ్ఛన్ తిష్ఠన్ స్పృశన్ నాసి భుంజానన్నా గుణాన్వితః। గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే" అను భగవద్వచనమునుబట్టి, సర్వాత్మభావనగలమనస్సు గలవాఁడవై అతులమయి సర్వపరిపూర్ణమయి జాగ్రదాద్యవస్థలకు పైది యగు తురీయావస్థాత్మక మగు నసంప్రజ్ఞాతసమాధి యందు నిష్ఠుఁడవు గమ్ము. అనఁగా "నాంతః ప్రజ్ఞం నబహిఃప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మైకాత్మ్య ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః" అను నుపనిషద్వచన తాత్పర్యము నిచ్చో ననుసంధించునది; ఈ యుపనిషద్వాక్యార్థము మద్విరచితమయిన మాండూక్యోపనిషదాంధ్ర వివరణమునందు సవిశేషముగ వ్రాయఁబడినది గాన,దానిం జూచునది.౧౨౪.

అవ. మఱియు, సర్వసంగపరిత్యాగరూప మగునుపాయముచేతనే తురీయసమాధి సిద్ధి యగు నని యుపదేశించుచున్నారు.

క. మాయామయజాయాసుత
కాయేంద్రియమానసాదికపరిత్యాగో
పాయజ్ఞేయామేయ
ధ్యేయాత్ముఁడ వీవు గురువిధేయాత్మవరా! ౧౨౫

టీ. గురు + విధేయ + ఆత్మ + వరా = పెద్దలయెడల నడయువగల డెందము గలవారలలో నుత్తముఁడవగు నోయాంజనేయా! ఈవు = 'తత్త్వమసి' యను మహావాక్యమునందలి త్వంపదవాచ్యుఁడవగు నీవు, మాయా...ఆత్ముఁడవు - మాయామయ = మూలాజ్ఞాన వికల్పితము లైన, జాయా + సుత = ఆలుబిడ్డలును, కాయ = దేహత్రయమును,

ఇంద్రియ = దశవిధేంద్రియములును, మానస = మనస్సు లోనగు నంతఃకరణ చతుష్టయమును, ఆదిక = మొదలగువానిని, పరిత్యాగ = వదలుట యనెడు (వానియందు నహంకార మమకారములను మానుట యనెడు) ఉపాయ = వెరవుచేతను, జ్ఞేయ = తెలిసికొనఁ దగినదియు, అమేయ = అప్రత్యక్షాది ప్రమాణములకు నగోచర మైనదియు, ధ్యేయ = స్వానుభవైక విషయ మైనదియు నగు, ఆత్ముఁడవు = తత్పదవాచ్య మగు బ్రహ్మమవు (ఐతివి).

తా. గురుశాస్త్రవాక్యప్రామాణ్యబుద్ధి గల యో హనుమానుఁడా! మూలావిద్యాత్మకము లగు ఆలుబిడ్డలు స్థూలాది దేహత్రయము శ్రోత్రాదులగు జ్ఞానేంద్రియములు వాగాది కర్మేంద్రియములు మనోబుద్ధిచిత్తాహంకారములు మొదలగువానియందు నేను నాది యను నభిమానమును మానుట యనెడు వెరవునఁ దెలిసికొనఁ దగినదియు, ననుమానాది ప్రమాణములకు నగోచరమును స్వానుభవైకవేద్యము నగు పరమాత్మయే నేనైతి నను నిరంతరభావనాత్మక మగు తురీయావస్థ నొందుము. ౧౨౬

అవ. సర్వాత్మభావన గలవానికి మంత్రతంత్రాదులతోఁ బనిలేదని వివరించుచున్నారు.

సీ. ఏదేశమున నైన • నేకాలమున నైన
నేమి సేయుచు నైన • నెట్టు లైన
నఖిలవికారంబు • లావిద్యకంబులు
నే నవికారుండ • నిష్ప్రపంచ
నిర్వికల్పాఖండ • నిశ్చల నిర్మలా
వ్యయ సచ్చిదానంద • మయ నిరీహ
పరిపూర్ణ నిర్గుణ • ప్రత్యగాత్మాభిన్న
పరమాత్ముఁడ నటంచు • భవ్యనిష్ఠ

తే. సంతతంబును దనుఁ గాంచు సజ్జనునకు
మంత్రతంత్రంబు లేల కర్మంబు లేల
జపతపోవ్రత దానయజ్ఞంబు లేల
నామవర్ణాశ్రమాభిమానంబు లేల. ౧౨౭

టీ. ఏదేశమునన్ - ఐనన్ = ఎచ్చోటనైనను, ఏకాలమునన్ - ఐనన్ = ఏతటినైనను, ఏమి సేయుచున్ - ఐనన్ = ఎట్టి కార్యము నొనరించుచున్నను, ఎట్టులు ఐనన్ = ఆయా కార్యములు నెఱవేఱినను నెఱవేఱక పోయినను (మోదఖేదములు లేక), అఖిల + వికారంబులు = మహదాది ప్రకృతి వికృతిరూపము లగు నన్నియును, అవిద్యకంబులు = కేవల మాయామయములు, నేను = అస్మత్ప్రత్యయైక గోచర సర్వసాక్షి వగు నేను, అవికారుండను = అవిద్యకము లగు జననమరణాది షడ్భావ వికారములు లేనివాఁడను, నిష్ప్రపంచ...పరమాత్ముఁడను—నిష్ప్రపంచ = సంసార సంబంధము లేనట్టియు, నిర్వికల్ప = ఉపనిషత్ప్రమాణ నిశ్చిత మగుటచే నశేషవికల్పశూన్య మైనదియు, అఖండ = సర్వవ్యాపక మగుటచే నపరిచ్ఛిన్న మైనదియు, నిశ్చల = సర్వసంపూర్ణ మగుటచేఁ జల నాదికము లేనిదియు, నిర్మల = పరమపావన మగుటచే నే మలములును లేనిదియు, అవ్యయ = నిర్వికార మగుటచే నాశవిరహితమును, సత్ + చిత్ + ఆనందమయ = కాలత్రయాబాధ్య మగుటచే సత్యస్వరూపమును, జడవిలక్షణం బగుటచేఁ జిద్రూపమును, దుఃఖసంబంధ మించుకయుం లేమిం జేసి యానందఘనంబును, నిరీహ = అవాప్తసర్వకామం బగుటచే వ్యాద య(?)గంధులు లేనిదియు, పరిపూర్ణ = 'పూర్ణమదః పూర్ణ మిదం' అను మొద లగు శ్రుతినిబట్టి యెల్లయెడలఁ గ్రమ్మియున్నదియు, నిర్గుణ = గుణత్రయ సంబంధ శూన్యమును నగు, ప్రత్యగాత్మ = సాక్షి చైతన్యమునకంటె, అభిన్న = ఇతరము గాని, పరమాత్ముఁడను = పరబ్రహ్మస్వరూపుఁడను,

(ఇతని) అటంచుక్ = అని చింతించుచు, భవ్య - నిష్ఠక్ = యోగ్య మగు పరమార్థమందలి నిలుకడతో, సతతంబును = నిరంతరమును, తనుక్ = ఆ స్వస్వరూపమును, కాంచు - సజ్జనసకుక్ = అనుసంధాన మొనర్చుచుండు మహాజ్ఞానికి, మంత్ర - తంత్రంబులు = గాయత్రి లోనుగాఁ గల సప్తకోటి మహామంత్రములును - తత్ప్రతిపాదకంబు లగు చతుష్షష్టి తంత్రములును, ఏల = ఎందునిమిత్తము ? - వీనితో జ్ఞానికిఁ బ్రయోజనము లేదని యర్థము; మఱియు, కర్మంబులు - ఏల = నిత్యనైమిత్తికాదులగు క్రియాకలాపములతో నేమి ప్రయోజనము, జప - తపస్ - దాన - యజ్ఞంబులు-ఏల = మంత్రపురశ్చరణాది చర్యలు, కృచ్ఛ్ర చాంద్రాయణాదు లగు తపస్సులు ఆయా కల్పములయందుఁ జెప్పఁబడిన వ్రతములు, షోడశమహాదానములు, జ్యోతిష్టోమాది క్రతువులు మొదలగునవి యెందులకు, నామ - వర్ణ - ఆశ్రమ - అభిమానంబులు, ఏల = తన నామరూపాదులయందును, తన బ్రాహ్మణ్యాది వర్ణములయందును, తన బ్రహ్మచర్యాదులగు నాశ్రమములయందును పట్టుదల యెందులకు ? పరిపూర్ణబ్రహ్మజ్ఞానికి మానమంత్రతంత్రాదులతో నవసరము లేదని యర్థము.

తా. ఏప్రదేశమునందుఁ గాని భూతభవిష్యద్వర్తమానములలో నే కాలమునందుఁగాని, తా నేకర్మంబుల నొనర్చుచుండినఁగాని, ఏవిధముచేత నైనను మహత్తత్త్వము మొదలగు సమస్త వికృతులును నజ్ఞానభ్రాంతి కల్పితములు గాని, వాస్తవములు గావు. అస్మత్ప్రత్యయైకగోచరమగు నాత్మ యన్ననో ఎట్టి వికృతులును లేనిదియు, సంసార సంబంధము లేనిదియు, నెట్టి వికల్పములును లేనిదియు, నపరిచ్ఛిన్నమును, చలనరహితమును, నజ్ఞాన కళంకరహితమును, నాశవిహీనమును, సచ్చిదానంద ఘనంబును, తృష్ణా విరహితంబును, సర్వవ్యాపకమును, సత్త్వరజస్తమోగుణ శూన్యమును, నగు సాక్షిచైతన్యమునకు నన్యముగాని పరబ్రహ్మమే యని ఎడ తెగకుండఁ దదేకనిష్ఠతో స్వస్వరూపానుసంధానము సేయుచుండెడు పరిపూర్ణజ్ఞానికి

మంత్రములతోను దంత్రములతోను గర్మములతోను మంత్రపురశ్చరణల తోను దపస్సులతోను వ్రతములతోను జన్మములతోను తత్తన్నియమనిష్ఠలతోను బనిలేదు. మఱియు నతనికి నామధేయములతోను జాతులతోను నాశ్రమములతోను నవసరము లేదు. కేవల జ్ఞాన స్వరూపుఁ డగు నతనికి నజ్ఞానకార్యము లగు వేదశాస్త్రాగమాదులయందు విధింపఁబడినవిధులతోఁగాని నిషేధములతోఁగాని ప్రయోజనము లేదని తాత్పర్యము.

అవ. పోనిమ్ము బహువిధకారకసాధ్య మగుటచే నాయాస బహుళ మయి స్థూలశరీరాభిమాన పూర్వక మగు బహిర్యాగముతో జ్ఞానికిఁ బని లేకపోయినను 'అంతర్యాగ సమారాధ్యా బహిర్యాగసుదుర్లభా' అనునట్లు సూక్ష్మశరీరాభిమాన పురస్సర మగు నంతర్యజన మావశ్యక మగుఁగాక యనినం జెప్పుచున్నారు.

తే. వాయుసుత ! సర్వవాసనావాసితంబు
సూక్ష్మదేహంబు జడ మగు నమ్మ దాని
నంటక వెలుంగుచుండుఁ జిదాత్ముఁ డచ్చి
దాత్ముఁ డగువాని వికృతు లెట్లంటు ననఘ. ౧౨౮

టీ. అనఘ = స్థూలసూక్ష్మదేహాభిమానరూప మగు దోసఁగు లేని, వాయుసుత = కరువలిపట్టీ, సర్వ - వాసనా - వాసితంబు = పెక్కు లగు పుట్టువులనుండి అనుసరించి వచ్చుచున్న కర్మసంస్కారములకు నునికిపట్టగు, సూక్ష్మదేహంబు = 'అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగం, భోగసాధనం' అను మొదలుగఁ జెప్పఁబడిన లక్షణము గల సూక్ష్మశరీరము, జడము = ఆత్మప్రతిఫలనముచేఁ జేతనమువలెఁ దోఁచుచున్నను మాయామయమై ప్రకృతివికృతికోటిలోఁ బడుటచే స్వతస్సిద్ధముగ నచేతనము, అగున్ - సుమ్ము = అయి యున్నది సుమీ, చిత్ - ఆత్ముఁడు = కేవల చిత్స్వ

రూపుఁ డగు పరమాత్ముఁడు, దానిన్ = జడమగు నా సూక్ష్మశరీరమును, అంటక = తాదాత్మ్యరూప మగు సంస్పర్శము లేక, వెలుంగుచున్ ఉండున్ = స్వప్రకాశరూపమునఁ దేజరిల్లు చున్నవాఁడు, ఆ - చిత్ - ఆత్ముఁడు - ఐన - వానిన్ = 'అహం బ్రహ్మాస్మి' అను మొదలగు మహావాక్యార్థానుసంధానబలముచేత నట్టి శుద్ధచిత్స్వరూప పరమాత్ముఁడు తానే యై నిరవధికానందఘనుఁ డగు బ్రహ్మవేత్తను, వికృతులు = మానసికము లైన అజ్ఞానవికారములు, ఎట్లు = ఏ విధమువున, అంటున్ = తాఁకును? జ్ఞానికి స్థూలశరీరపురస్కృతము లగు బాహ్యవికారములు సంబంధింపనియట్లు సూక్ష్మశరీరాభిమాన పూర్వకము లగు నాభ్యంతర వికారములుగూడ సంబంధింప వని యర్థము.

తా. అనేక జన్మార్జిత కర్మసంస్కార పూరిత మయిన సూక్ష్మశరీరము స్థూలశరీరమువలెనే యచేతనమేకాని సచేతనము గాదు. ఇట్టి సూక్ష్మశరీరాభిమానములేక స్వయంప్రకాశమాన మై పరబ్రహ్మ మున్నది. అట్టిబ్రహ్మమే తానై వెలుఁగొందుచున్న జ్ఞానికి బాహ్యార్చనతోఁ బని లేనట్లు అంతరార్చనతోఁగూడ నవసరము లేదు. అర్చనాదులుగూడ మాయామయములుగాని వాస్తవములు గావు. ౧౨౮

అవ. నైష్కర్మ్యసిద్ధి నొందిన బ్రహ్మజ్ఞానికి నావిద్యకము లగు కర్మాచరణాదులతోఁ బని లేదను నర్థమును దృష్టాంతపూర్వకముగను సహేతుకముగను బ్రతిపాదించుచున్నారు.

సీ. ఘటగతనానావి॥కారముల్ దత్ప్రకా
శకసూర్యు నంటని ॥ చందమునను,
దేహేంద్రియ ప్రాణ॥ధీమనోహంకార
తద్ధర్మతతులు ద॥ద్భాసకుండు,
సాక్షి యై యొప్పారు ॥ సచ్చిదానందమ
యాత్ముని౦ బొరయ న॥య్యాత్ముఁ డగుచు,

వెలుఁగు పండితున కెవ్విధమునఁ గల్గు వ
ర్ణాశ్రమాచారాదు లరసి చూడఁ
ఆ. కర్త గాఁడు గానఁ గరణకార్యములును
భోక్త గాఁడు గాన భోజ్యభోగ
ములును లేవు సర్వక్రమును గల్గ దతనికి
సర్వరూపుఁ డగుట సాధువర్య. ౧౨౯

టీ. సాధువర్య = సజ్జనులకెల్ల నుత్తముఁడవగు నోహనుమానుఁడా, ఘట + గత + నానా + వికారముల్ = కడవయందలి నీటిలోని ప్రతిబింబముయొక్క నలుపు తెలుపు కదలిక లోనగు మార్పులు, తత్ - ప్రకాశక - సూర్యక్ = ఆ ప్రతిబింబమునకు బింబభూతుఁడై వెలుఁగొందఁజేయు భాస్కరుని, అంటని చందమునను = ముట్టక యుండునట్లు, దేహ... తతులు - దేహ = మూఁడు మేనులును, ఇంద్రియ = శ్రోత్రాదులు వాగాదులు నగుపదియింద్రియములును, ప్రాణ = ప్రాణాఽపాన వ్యానోఽదాన సమానములును నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములు నను దశవిధ వాయువులును, ధీ = నిశ్చయాత్మిక యగు బుద్ధియు, మనస్ = సంకల్ప వికల్పాత్మక మగు మనస్సును, అహంకార = దేహాదులయందలి యభిమానమును, తత్ = ఆ శరీరత్రయాదులయొక్క, ధర్మ = మెలఁకువ కల నిదుర మొదలగు స్వభావముయొక్క, తతులు = సమూహములు, తత్ - భాసకుండు = ఆ శరీరాదులకును వానిధర్మములకును నధిష్ఠానభూతుఁడైన ప్రకాశకుండును, సాక్షి = కనుఁగొనువాఁడును, ఐ - ఒప్పారు = అగుచు భాసిల్లుచున్న, సత్ - చిత్ - ఆనంద - మయ - ఆత్మక్ = సత్తయు చిత్తును నిరతిశయ సుఖమును ప్రచురముగఁ గల ప్రత్యగాత్మను, పారయవు = అంటవు, ఆ - ఆత్ముఁడు - అగుచుక్ - వెలుఁగు - పండితునకున్ = అట్లు సర్వావభాసకుండును సర్వసాక్షియు నై స్వయంప్రకాశమానప్రత్య

గాత్మ స్వరూపుఁ డగు జ్ఞానికి, వర్ణ - ఆశ్రమ - ఆచార - ఆదులు = బ్రాహ్మణాద్యాది జాతులును బ్రహ్మచర్యాద్యాశ్రమములును వారివారికి నియమింపఁబడిన నిష్ఠలును మొదలగునవి, ఏ - విధమునన్ = ఏరీతిని, కలుగున్ = ఉండును - కలుగ వని యర్థము; ఏల అనిన, అరసిచూడన్ = జ్ఞానదృష్టిచే నాలోచింపఁగా, కర్త - కాఁడు - కానన్ = శరీరాదుల యందు నభిమానపూర్వకముగ నాయా పనులఁ జేయువాఁడు కాఁడు గనుక, కరణ + కార్యములును = శబ్దస్పర్శాది విషయానుభవమునకు సాధనములగు నింద్రియములయొక్క వ్యాపారములును, భోక్త - కాఁడు - కానన్ = అనుభవించునతఁడు గానేరఁడు గనుక, భోజ్య + భోగములును = అనుభవింపఁదగినవాని యనుభవములు, లేవు = ఉండవు, సర్వరూపుఁడు = సర్వాత్మకుఁడు, అగుటన్ = అయి యుండుటచేత, సర్వమును = సమస్తమును, అతనికిన్ = అట్టి బ్రహ్మజ్ఞానికి, కల్గదు = సంబంధింపదు.

తా. నీటికడవలోఁ బ్రతిఫలించిన సూర్యప్రతిబింబముయొక్క నీటియందలి రంగులు కదలిక మొదలగు వికృతులు, ఆ ప్రతిబింబమునకు నధిష్ఠానభూతుఁడగు సూర్యుని నంటనివిధమున, శరీరములు నింద్రియములు నంతఃకరణము మొదలగునవియు వీనియొక్క జననమరణ జాగ్రత్స్వప్న సుషుప్తులు మొదలగు ధర్మములును వీని కన్నిటికి నధిష్ఠానభూతుఁడై సర్వసాక్షి యగుచు వెలుఁగొందుచున్న సచ్చిదానంద స్వరూపుఁ డగు పరమాత్ముని నంటవు. మఱియు నట్టి పరమాత్ముఁడే తా నయి యొప్పుచున్న బ్రహ్మజ్ఞానికి శరీరాదులను సంబంధించి వచ్చిన బ్రాహ్మణాద్యాది జాతులు బ్రహ్మచర్యాద్యాశ్రమములు ఆయా వర్ణాశ్రమాదులకు విధింపఁబడిన నియమములు మొదలగునవి లేవు; ఏల యనిన నట్టిబ్రహ్మజ్ఞాని జ్ఞానదృష్టిచేఁ బరికింపఁగా, శరీరాదులయందలి యభిమానముతో నా యా పనులను జేయువాఁడు కాఁడు; గనుక, నింద్రియాదుల వ్యాపారములును, స్రక్చందనాదులను నభిమానపూర్వకముగ ననుభవించువాఁడు కాఁడు గాన, భుజింపఁదగిన

పదార్థములయొక్క యనుభవములును జ్ఞానికి లేవు; మఱియు, సర్వాత్మకుం డగుటచే నతనికి పైని జెప్పఁబడిన దెద్దియును వేఱుగ లేదు. ఈపద్యమునందు "సాక్షి యై యొప్పారు" ననుపట్ల నీచర్చ సేయఁదగియున్నది. సాక్షిత్వము శుద్ధచైతన్యమునకా లేక మాయోపాధికచైతన్యమునకా అను సంశయము కలుగఁగా, నిరుపాధికమగు బ్రహ్మచైతన్యమునకు ద్రష్టృత్వము మొదలగునవి సంభవింపవు గాన సోపాధికమగు చైతన్యమునకే సాక్షిత్వ ముపపన్నమై యున్నది అనినచో - "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతి యద్వితీయ మగు నిర్గుణబ్రహ్మచైతన్యమునకే సాక్షిత్వమును స్పష్టముగఁ బ్రతిపాదించుచున్నదిగాన, గుణరహితుఁ డగు పరమాత్మనకే సాక్షిత్వము విద్వాంసులచే నంగీకరింపఁబడియున్నది. అనినయెడల నాపండితమ్మన్యులమత మించుకయు నుపపన్నము గాదు. ఏల యనిన గుణత్రయసంబంధము లేనట్టియు, మాయకు నధిష్ఠానభూత మయినట్టియుఁ జిద్రూపమునుఁ గేవలము నగు నిర్విశేషపరబ్రహ్మము మాయాతత్కార్యరూపమగు నేయుపాధియును లేనిదిగాన, నది యుపాధులకు ద్రష్ట యెట్లగును అంటిరేని "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అని పైని జూపఁబడిన శ్రుతినిబట్టియే బ్రహ్మము నిష్ప్రపంచ మయ్యును సాక్షి గావచ్చు ననిన, ఘటసంబంధము గల పురుషుఁడే ఘటమును జూచునుగాని ఘటసంబంధము లేనివాఁడు కడవను గనుఁగొనఁజాలనియట్లు సోపాధికుఁడే సాక్షిగాన నిరుపాధికుం డెప్పుడును గాఁజాలఁడు - అనిన, నఘటితఘటనాపటీయసియు నచింత్యశక్తిసంపన్నయు నగు మాయచేతనే నిర్విశేష మగు పరబ్రహ్మమునకు సాక్షిత్వము సమకూరవచ్చు ననినచో మాయామాయాకార్యములకు నిత్యముక్తుఁ డగు పరమాత్ముఁడు సాక్షి యగునపుడు సత్త్వ రజ స్తమోగుణములసంబంధము గలుగకతీరదు గాన సగుణుఁడే యగును. సరే! యిట్లైనచో "అసంగో హ్యయం పురుషః" అను శ్రుతినిబట్టి యసంగుఁడగు పరమాత్మునకు గుణత్రయముతో సంబంధము సంభవింపదు గాన "ఏకమే

వాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిచే సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యుఁడు నగు పరమాత్ముఁ డసంగుఁ డగుటం జేసి, సాక్షియుం గాఁగూడదు. ఇ ట్లైనచో "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అని నిర్గుణబ్రహ్మము సర్వ సాక్షి యని వక్కాణించుచున్న శ్రుతియొక్క తాత్పర్య మేమనిన, బర మాత్ముఁడు అద్వితీయుఁడును సర్వాధిష్ఠాన బింబచైతన్యస్వరూపుఁడును, గుణత్రయసంబంధరహితుఁడును నయ్యుఁ బ్రతిబింబస్వరూపముచే సాక్షి యగుచున్నాఁ డని "సాక్షీ చేతా" అను మొదలగు శ్రుతియొక్క యభి ప్రాయము. సరే కాని, కేవలచిద్రూపుఁ డగు పరమాత్మునకుఁ జిదాభాసుని ద్వారా ద్రష్టృత్వము గల దని ఏల ఈస్వకపోలకల్పన యనిన నిరుపాధికు నకు కేవల చిద్రూపునకు సాక్షిత్వము సరిపడక పోవుటచేతను, సోపాధికుం డగు చిదాభాసునకు సాక్షిత్వము సరిపడక యుండుటచేతను, బింబచైతన్యము ప్రతిబింబచైతన్యముద్వారా సాక్షి యగుచున్న దని యొప్పుకొనక తీరదు - అను మొదలగు నీ సాక్షివిచారణ, అస్మద్విరచిత మగు సాక్షిస్వరూపనిరూ పణ మను ప్రకరణమునందు "సాక్షిత్వం సత్యకర్తృత్వే సాక్షాద్ద్రష్టృత్వ మాత్మనః । ఔదాసీన్యేన సోపాధే ర్నిరుపాధే ర్న తత్త్వతః । చిదాత్మ నోఽఖిలేశస్య ప్రతీచః కేవలస్యవై నిర్గుణస్య శ్రుతిర్బ్రూతే సాక్షిత్వ మవి వాదత। నిర్గుణః పరమాత్మాస్స్యా త్సాక్షీ సర్వస్య కేవలః । బింబచిద్రూప ఏవేతి సర్వేషాం విదుషాం మతమ్ । నిరుపాధిత్వ మేతస్య కేవలస్య చిదా త్మనః । నిర్గుణస్యైవ బింబస్య బ్రహ్మణస్సాక్షితా కథం । నిర్ఘటః పురు షః కశ్చిద్ఘటం సాక్షా న్నపశ్యతి ! కదాపీతి ఘటం సాక్షా త్సఘటోహ్యా త్రపశ్యతి । సర్వోపాధిరత స్సాక్షీ సర్వ స్యేతీహ యుజ్యతే । ఏవంచేత్స గుణస్యైవ సాక్షితా నిర్గుణస్య న । మాయాతత్కార్యసాక్షీ యః పరమా త్మాఽఖిలేశ్వరః । సగుణోవై త్రిభిస్సంగా ద్గుణైస్సత్త్వాదిభి స్సహి । అ సంగస్యాత్మనస్సంగో గుణైర్నైవేహ చే త్తదా । సాక్షిత్వమప్యసంగత్వా న్నతస్యస్యాత్కదాచన । అసంగస్యైవశుద్ధస్య బ్రహ్మణః కేవలస్యవై ।

సాక్షిత్వం శ్రుతిసిద్ధంచేచ్ఛ్రుతేస్తాత్పర్య ముచ్యతే। కేవల స్యైవ చిద్రూప స్యాత్మనో నిర్గుణస్యవై । చిదాభాసాత్మనా సాక్షిత్వమితీహ శ్రుతేర్మతం । సాక్ష్యా పేక్ష్యంహి సాక్షిత్వం నిరుపాధే ర్నచాత్మనః । కేవలస్యాద్వితీయత్వా । త్సద్వితీయస్య తద్భవేత్ ।" అను మొదలుగ విపులముగ మాచేఁ బ్రతిపాదింపఁబడినది గాన నిందునుగూర్చి యందలి మా పరిశ్రమమును విద్వాంసులు చూచి యభినందింతురుగాత. ౧౨౯

అవ. "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అని చిదాభాసుని ద్వారా సర్వసాక్షి యగుటచె బ్రహ్మమునకును నా చిదాభాసమాత్రుఁ డగు జ్ఞానికిని భేదము లేదని ప్రతిపాదించుచున్నారు.

క. జ్ఞాని యనఁగ వేఱొక్కఁడె?
నేన సుమీ తెలియు నాతనికి నాకును సు
జ్ఞానముచేఁ బరికించినఁ
గానఁబడదు భేద మెందుఁ గవినుతచరితా. ౧౩౦

టీ. కవి + నుత + చరితా = "కవిం కవీనా ముపవ స్తవశ్రమం" "కవయో వదంతి" అను మొదలగు శ్రుతులచేత నిచట కవిశబ్దము జ్ఞానివాచకము గాన మహాజ్ఞానులచేఁ గొనియాడఁదగినప్రవర్తన గలవాఁడా, యని యాంజనేయుని సంబోధనము; జ్ఞాని అనఁగన్ = అపరోక్షానుభవజ్ఞానము గలవాఁ డనఁగా, వేఱు ఒక్కఁడు + ఎ = ఇంకొరుఁడు గలఁడా, తెలియన్ = గుర్తెఱిఁగ నేని, నేను + అ + సుమీ = సాక్షాత్పరబ్రహ్మము నగు నేనే సుమా, సుజ్ఞానముచేన్ = లెస్స యగు బ్రహ్మజ్ఞానముచేత, పరికించినన్ = చూచినయెడల, ఆతనికిన్ = ఆ జ్ఞానికిని, నాకును = కేవలపరమాత్ముఁడ నగు నాకును, ఎందున్ = ఏవిధముచేత నయినను, భేదము = వేఱు, కానఁబడదు = అగపడదు ; అనఁగా

"అహం బ్రహ్మాస్మి - తత్త్వమసి - బ్రహ్మైవ బ్రహ్మవిద్భవతి" అను మొదలగు నుపనిషన్మహావాక్యములనుబట్టి బింబప్రతిబింబములకు భేద మించుకయును లేదని యర్థము.

తా. "నేతి నేతి" అను మొదలగు నుపనిషద్వచనముల చే నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయము లను పంచకోశములును మాయామయములు గాన నివి నేను కాననియు, వీనికెల్ల సాక్షీనగు చిదూపుడను నే ననియు నాత్మానాత్మవివేచన గల బ్రహ్మజ్ఞానికిని, గురుశాస్త్ర వచనోపదేశములచేతను స్వానుభవముచేతను విచారణచేసి చూడగా నట్టి మహాజ్ఞానికిని సాక్షాత్పరబ్రహ్మమ నగు నాకును భేద మేమియును లేదు. ఉపాధినిబట్టి భేద మున్నట్లు దోచును గాని వాస్తవముగ జీవబ్రహ్మములకు భేదము లేదు. ౧౩౦

అవ. జీవబ్రహ్మములకు భేదము లేదను సంగతి జ్ఞానికిఁ దెలియు దని వక్కాణించుచున్నారు.

క. జ్ఞానికి నేను బరోక్షుఁడఁ
గాను బరోక్షుండు నాకుఁ దాఁ గాఁ డతఁ డిది సు
జ్ఞానం బజ్ఞున కిది మదిఁ
గానఁబడదు తన్ను నన్నుఁ దాఁ గానమి ననఘా! ౧౩౧

టీ. అనఘా = సంసారరూప మగు దోషము లేని యాంజనేయా, నేను = శుద్ధబ్రహ్మమ నగు నేను, జ్ఞానికిన్ = చిదాభాసుఁడై సర్వసాక్షి యగుబ్రహ్మవేత్తకు, పరోక్షుండన్ కాను = వెలివాఁడను గాను, అతఁడు = ఆ బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, నాకున్ = కేవల చిన్మాత్రుఁడ నగు నాకు, పరోక్షుండు = భిన్నుఁడు, కాఁడు = అయియుండలేడు, ఇది = అనివేదము నీ తెలివి, సుజ్ఞానంబు = లెస్సయగు నెఱుక, ఇది = ఇట్టి వాస్తవజ్ఞానము, అజ్ఞునకున్ = అజ్ఞానికి, తన్నున్ = తనయొక్క నిజస్థితిని, నన్నున్ =

నాస్వరూపమును, కానమిన్ = సదసద్వివేక దృష్టిచేఁ జూడలేకపోవుట వలన, మదిన్ = మనస్సునందు, కానఁబడదు = చూడఁబడదు.

తా. బ్రహ్మము వేఱు తాను వేఱు అను తెలివి పరోక్షజ్ఞానము, గురుశాస్త్రోపదేశమువలనఁ గలిగినస్వానుభవజ్ఞానముచే బ్రహ్మమే నే నను తెలివి యపరోక్షజ్ఞాన మనఁబడును. ఇట్టి యపరోక్షజ్ఞానము గలవానికి బ్రహ్మము భిన్నము గాదు. బ్రహ్మమునకు నాజ్ఞానియు వేఱు గాఁడు. అనునీ యనుభవజ్ఞానమే యథార్థజ్ఞాన మనఁబడును. అజ్ఞాని యగు కేవలసంసారి తన స్వరూపమును బ్రహ్మస్వరూపమును వివేకదృష్టిచేఁ గనుఁగొనఁజాలఁడు గాన, నతని కట్టివాస్తవజ్ఞానము గోచరము కాదు. ౧౩౧

అవ. నాకు మూలప్రకృతిసంబంధము నుత్ప్రేక్షించి సగుణుఁడ ననియు, వివేచనచే నా కాసంబంధము లేదని తలఁచి నిర్గుణుఁడ ననియు నన్నును వ్యవహరింతురు గాని వాస్తవముగ నా కాసంబంధము లేదుగాన నేను సగుణుఁడను గాని నిర్గుణుఁడను గాని కా నని చెప్పుచున్నారు.

క. త్రిగుణాత్మిక యగు ప్రకృతిం
దగిలినచో సగుణుఁ డండ్రు దాని విడుచుచో
నగుణుఁ డని యండ్రు న న్నతి
సుగుణులు నీరెండుఁ గాను ఋజు వ్మమవి లేమిన్. ౧౩౨

టీ. త్రి + గుణ + ఆత్మిక = సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థయే స్వరూపముగఁ గలది, అగు + ప్రకృతిన్ = ఇనట్టి మూల ప్రకృతియందు, తగిలినచోన్ = ప్రాతిభాసారూపమున (ప్రతిబింబస్వరూపమున) ప్రతిఫలించినప్పుడు, నన్నున్ = బింబభూత మగు పరబ్రహ్మమ వగు నన్నును, అతిసుగుణులు = మిగుల సత్త్వగుణప్రధాను లగువారు, సగుణుఁడు = గుణములతోఁ గూడినవాఁడు, అండ్రు = అని చెప్పెదరు.

దాఁక౯ = ఆ మూలప్రకృతిని, విడుచుచోఁ౯ = పరిత్యజించినప్పుడు, అగు ణుఁడు = నిర్గుణుఁడు, అని అంద్రు = అని పలికెదరు; అవి = ఆ సగుణ నిర్గుణరూపములు, లేమిన్ = వాస్తవముగా నాకు లేకపోవుటచేత, ఈ రెండు౯ = ఈరెండురూపములును, కాను = నేనయి యుండలేదు.

తా. గుణత్రయస్వరూపిణి యగు మూలప్రకృతి, శుద్ధసత్త్వప్రధాన యయి మాయ యనియు, మలినసత్త్వప్రధాన యయి యవిద్య యనియుఁ జెప్పఁబడుచున్నది. అందు మాయయందుఁ బరబ్రహ్మము దోఁపట్టినప్పుడు సర్వజ్ఞత్వాదిసద్గుణములు గల పరమేశ్వరుఁ డనియు, నవిద్యయందుఁ బ్రతిఫలించినప్పుడు కించిజ్ఞత్వాదిగుణములు గల జీవుఁ డనియు వ్యవహరింపఁబడుచున్నది. ఈ మాయాఽవిద్యలలోఁ దోఁపట్టక యున్నట్టి శుద్ధబ్రహ్మము నిర్గుణమని వాడఁబడుచున్నది. ఈ సగుణత్వ నిర్గుణత్వములు బ్రహ్మమునం దారోపింపఁబడినవిగాని, వాస్తవములు గావు. ౧౩౨

అవ. జరాయుజాండజ స్వేద జోద్భిజ్జము లను చతుర్విధప్రాణికోటులకును, దేవతిర్యఙ్మనుష్యాదులకును స్థావర జంగమాత్మక మగు సమస్తప్రపంచమునకును నంతర్యామియై ప్రకాశించుచున్న పరమాత్మయే నేనని తెలిసికొనవలయు నని యుపదేశించుచున్నారు.

లయగ్రాహివృత్తము.

భృంగములయందును బశీతంగములయందును విశీహంగ
ములయందును గుశీరంగములయందు౯, సింగములయందు
ను బ్లశీవంగములయందును దుశీరంగములయందును భుశీ
జంగములయందే, కాంగులగు దేవమునిశీపుంగవనరాదిఘనశీ
జంగమములందును నశీజంగమములందు౯, సంగమును భం

గము గకలుంగ కొకభంగిని వెలుంగుననునే నని కనుం
గొనుము వత్సా. ౧౩౩

టీ. వత్సా = పుత్త్రాధికుఁడవగు నోయాంజనేయా, భృంగముల యందున్ = ఇందిందిరములయందును (తుమ్మెదలయందును), పతంగముల యందును = గేతులయందును (మిడుతలకు మాదేశమునందు గేతు లనియుం బేరు గలదు), విహంగములయందున్ = పిట్టలయందును, కురంగములయందున్ = జింకలయందును, సింగములయందున్ = మృగేంద్రములయందును, ప్లవంగములయందున్ = వానరములయందును, తురంగములయందున్ = అశ్వములయందును, భుజంగములయందున్ = చిలువలయందును, ఏకాంగులు = ఒకతీరుగనున్న కరచరణాద్యవయవములు గలవారు, అగు = ఐనట్టి, దేవ = దేవతలు, మునిపుంగవ = మునీశ్వరులు, నర = మనుష్యులు, ఆది = లోనుగాఁ గల, ఘన = ఉత్తమములైన, జంగమములందున్ = చరములగు ప్రాణులయందును, అజంగమములయందున్ = స్థావరములగు కొండలు చెట్లు మొదలగువానియందును, సంగమున్ = సక్తియును, భంగమున్ = సక్తతలేమియు, కలుంగక = ఉండక, ఒక భంగిన్ = అన్నిటియందును సమానముగ, వెలుంగు + ననున్ = ప్రకాశించుచున్నట్టి పరమాత్ముఁడనగు నన్నును, నేను - అని = నేన యైతినని, కనుంగొనుము = జ్ఞానదృష్టిచే పరికింపుము. ఇది లయగ్రాహి యను వృత్తము. దీనిలక్షణము మద్విరచిత మగు శబ్దలక్షణచింతామణియందుఁ గనుఁడు.

తా. జరాయుజములు మొదలగువాని స్వరూపము తొల్లి వివరింపఁబడియున్నది. జరాయుజములు నండజములు స్వేదజములు నుద్భిజ్జములు నను నాలుగువిధము లగు ప్రాణికోటులలోఁ జేరిన తుమ్మెదలు మిడుతలు పిట్టలు జింకలు సింగములు వానరములు గుఱ్ఱములు పాములు మొదలగు తిర్యగ్జాతులయందును, వేల్పులు జడదారులు మానవులు మొదలగు నుత్తమజాతుల

యందును, గొండలు మ్రాఁకులు మొదలగు స్థావరములయందును, భేదము లేక యొకతీరుగనే తేజరిల్లుచున్న పరమాత్ముఁడే తా నని భావింప వలయును. ౧౩౩

అవ. శరీరాదికమే నే ననుకొనువాని మనస్సు దుర్విషయములయందుఁ బడి చెడు నని చెప్పుచున్నారు.

తే-గీ. తనువు తా ననుదృష్టి యా ధనువు కర్త
కనిశము గుణత్రయమ్ముతోఁ బెనసియున్న
యమ్మనమె యమ్ము దాని కాయమ్ము లతిన
యమ్ములై తోఁచు దుర్విషయమ్ము లనఘ! ౧౩౪

టీ. అనఘ = విషయాసక్తి యను మహాపాతకము లేని వాను మంతుఁడా, కర్తకున్ = కర్తృత్వాద్యభిమానము గల జీవాత్మునకు, తనువు = మేను, తాను అనుదృష్టి = నేనే యనియెడు నభిమానరూపమగు చూపు, ధనువు = విల్లు (అగుచు), అనిశమున్ = నిత్యమును, గుణత్రయమ్ముతోన్ = సత్త్వరజస్తమోగుణములు మూఁడిటితోను, ఎనసి ఉన్న = తగిలియున్న, ఆ - మనము - ఎ = అట్టి మానసమే, అమ్ము = కోల (అగును), దానికిన్ = ఆ బాణమునకు, అతి + నయమ్ములు - ఐ = మిక్కిలియోగ్యము లగుచు, తోఁచు + దుర్విషయమ్ములు = నాటిగ నగపడెడు దుష్టము లగు స్రక్చందనవనితాది విషయములు, ఆయమ్ములు = నాటుటకుఁ దగిన లక్ష్యస్థానములు (గుఱిపట్లు) అయియున్నవి.

తా. అస్ఖలితబ్రహ్మచారి వగుటచే విషయలౌల్యములేని యోగాంజనేయుఁడా! విలుకానియొక్క యెక్కిడినవింటియందుఁ గూర్పఁబడిన నారసమునకుఁ గొట్టఁదగినవస్తువు గుఱియగునట్లు కర్తృత్వాద్యభిమానము గల జీవునకు దేహమే నే ననియెడు నభిమానరూపమగు వలపువలన, సత్త్వరజస్తమోగుణములతోఁ బెనసికొనియున్న మనస్సు స్రక్చందనాదివిషయములయందుఁ దగులుకొనును. ౧౩౪

అవ. మహామాయయే ఈ సంసారమునకు మూలము గాన నది నశింపకగాని సంసారబంధమోక్షము గాదని యుప దేశించుచున్నారు.

క. మానస మఖిలంబునకుఁ బ్ర
ధానంబు ప్రధానమే ప్రధానము మదికిన్
దాని విడిచి నన్నుఁ గను మది
తానవముం బొంది యంతఁ దా నవిసి చెడున్. ౧౩౪

టీ. అఖిలంబునకున్ = సంసారమునకెల్లను, మానసము = హృదయము (డెందము), ప్రధానంబు = మూలమయినది, మదికిన్ = ఆ డెందమునకు, ప్రధానము + ఏ=మూలప్రకృతియే, ప్రధానము = మూలమయినది; దానిన్ = ఆ ప్రధానమును, విడిచి=వదలి, నన్నున్=ఆ ప్రకృతికి నధిష్ఠానభూతుఁడ నగు నన్నును, కనుము = పరికింపుము, అంతన్ = న న్నవలోకించిన తరువాతను, అది = ఆ ప్రకృతి, తానవమున్ = క్షీణదశను, పొంది = పడసి, తాను = స్వయముగనే, అవిసి - చెడున్ = నశించి పోవును.

తా. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనుట చేత బంధము మొదలు మోక్షముదనుకఁ గల యీ సంసారమున కంతకును మనస్సే మూలమయియున్నది. ఇట్టిమనస్సునకు మూలప్రకృతి మూలమయియున్నది. అట్టిమూలప్రకృతి నొకమూలఁ బెట్టి స్వస్వరూపమును దెలిసికొనవలయును. స్వస్వరూపావలోకన మయినతోడనే యామూలప్రకృతి క్షీణదశ నొంది తనకుఁ దా నశించిపోవును.

అవ. బ్రహ్మజ్ఞానముచేఁ బ్రధానమును వినాశ మొనరింప కుండినయెడల నది సంసారరూప మగు నపకారమును జేయకమాన దని చెప్పుచున్నారు.

ఆ-వె. ప్రకృతి వికృతి దానిప్రకృతి నెఱింగి యో
సుకృతి ! నన్నుఁ గనుము ప్రకృతమునను
నాత్మ నెఱుఁగనప్పు డాప్రకృతియె యప
కృతి నొనర్చుచుండు నెపుడుఁ గడఁగి. ౧౩౬

టీ. ప్రకృతి = మూలప్రకృతి, వికృతి = మహదాదివికారస్వరూపిణి యైయున్నది; దాని + ప్రకృతిన్ = ఆ ప్రధానముయొక్క మహదాదిపరిణామరూప మగు స్వభావమును, ఎఱింగి = తెలిసికొని, ఓ సుకృతి = కృతకృత్యుఁడవగు నో హనుమానుఁడా, నన్నున్ = ప్రకృతికి నతీతుఁడనై వెలుఁగొందుచున్న నన్నును, ప్రకృతమునను = ప్రస్తుతమునందు, కనుము = అవలోకింపుము, ఆత్మను = తనయొక్క నిజస్థితిని (ప్రధానము మహత్తత్త్వము మొదలగువాని పరిణామమే స్వభావముగఁ గలదియను సంగతిని), ఎఱుఁగనప్పుడు = తెలిసికొనక యుండునంత దనుక, ఆ ప్రకృతి = ఆ మహామాయయే, ఎపుడున్ = ఎల్లకాలమును, కడఁగి = పూని, అపకృతిన్ = సంసారరూపమగు నపకారమును, ఒనర్చుచున్ - ఉండున్ = కలుగఁజేయుచు నుండును; "కృతి యొనర్చుచుండు నెపుడుఁ గడఁగి" అను పట్లు బువడి యని తెలియునది.

తా. "మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త" అనుటచేత స్వయముగ మూలప్రకృతి దేనికిని వికృతి కాక పోయినను దాను మహత్తత్త్వము లోనుగాఁగల వికృతులకుఁ బ్రకృతిగాననిదియు వికృతియగును. ఇట్లు మూలప్రకృతి, మహదాదులకుఁ బ్రకృతి యని తెలిసికొని, ఈ ప్రకృతికి నతీతమగు పరమాత్మస్వరూప మెఱుఁగవలయును. మూలప్రకృతియొక్క మహదాదిపరిణామరూప మగు స్వభావము నెఱుంగక యున్నంతదనుక ఆ ప్రకృతి సంసారరూపమగు ననర్థమును జేయుచుండక మానదు. ఈ సందర్భమున సాంఖ్యమతసిద్ధాంతము కొంతమట్టునకు

ప్రతిపాదింపవలసిన యవసరమే గాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. నాచే రచింపఁబడిన సాంఖ్యతత్త్వచింతామణిని బరికింపుఁడు. ౧౩౯

అవ. మనస్సునకు మూలమగు ప్రధానమువలని యనర్థమును జెప్పి, ఇఁక మనస్సుచే నగు నిడుమలను ప్రతిపాదించుచున్నారు.

క. ఖంబునుమీ మది విషయసు
ఖంబునుమీ త్రిజగదభిముఖంబునుమీ దుః
ఖంబునుమీ యది తద్విము
ఖంబునుమీ నిరతిశయసుఖంబు కపీంద్రా! ౧౩౮

టీ. కపీంద్రా = వానరోత్తమా! మది = మానసము, ఖంబు-సుమీ = సున్నయేసుమా - అనఁగా మాయామయము గాన మిథ్యాభూతమయినదని యర్థము. అది = ఆ యుల్లము, విషయ + సుఖంబు సుమీ = స్రక్చందనాదివిషయభోగలంపటము గాన తద్రూపమై యున్నది, త్రి + జగత్ + అభిముఖంబు సుమీ = మూఁడు జగములకు నభిముఖమై యుండునది - అనఁగా నెప్పుడును బ్రపంచమునకు సున్ముఖమయియే యుండునని యర్థము; దుఃఖంబుసుమీ = "పుంస్యాధి ర్మానసీ వ్యథా" అనుటచే నిరంతరమును నాధిరూపమయినది; (కావున) నిరతిశయ + సుఖంబు = తనకంటె నుత్తమమైనది లేనట్టి (సర్వోత్తమమగు) బ్రహ్మానందము, తత్ + విముఖంబుసుమీ = జడమును నిత్యము దుఃఖమయము నగు నా మనస్సునకు గోచరమయినదికాదు గాన, పరాఙ్ముఖము (వెలియది) సుమా.

తా. మనస్సు మిథ్యాభూత యగు మహామాయకు ముద్దుబిడ్డ గానఁ దల్లివలె నీయుల్లమును గల్లయే యగును. ఇది నిరంతరమును స్రక్చందనాది విషయములయందుఁ బడి తాదాత్మ్యము నొందియుండును. మఱియు నెల్లప్పుడును ముల్లోకములయందుఁ బ్రసరించెడు వృత్తులు గలది; ఇంతియ కాక

ఈ దేహము సుఖప్రదము లను దురాశచేఁ బ్రాపంచికవిషయములయందుఁ బడి దుఃఖమునే పడయును. కావున, నిట్లు అనృతజడదుఃఖాత్మక మగు నీ మనస్సునకు వ్యతిరిక్తమై బ్రహ్మము సచ్చిదానందమయ మై తేజరిల్లును. ౧౩౭

అవ. పైని జెప్పినటు లనృతజడదుఃఖమయము లగు కార్యకరణ సంఘాతమునకు వ్యతిరిక్త మగు కేవల చిన్మయ బ్రహ్మమునుగాఁ దన్నుఁ జూచుకొనువాఁడే జీవన్ముక్తుఁ డని ప్రతిపాదించుచున్నారు.

క. విను వినువీది తెఱంగున
ఘనఘన మై విభువు సర్వగత మై తగుచే
తనుఁ దనుఁ దనుతనువునఁ గని
మను మనుజుని బ్రతుకు బ్రతుకు మారుతతనయా. ౧౩౮

టీ. మారుత + తనయా = కరువలిపట్టి! వినుము = ఆలింపుము, తనున్ = తన్ను, విను + వీది + తెఱంగునన్ = అంతరిక్షపు మార్గము వలెనె, ఘనఘనము - ఐ = మిగులగొప్పది యగుచు, విభువు = వ్యాపకము, సర్వ + గతము = అంతటను బొందినదియు, ఐ = అగుచు, తగు చేతనున్ = వెలుఁగుచున్న చిద్రూపునిగ, తనుతనువున్ = సూక్ష్మశరీరము చేతను, కని = చూచి, మను మనుజుని బ్రతుకు = జీవించుచుండెడు మనుష్యునియొక్క జీవనము, బ్రతుకు = జీవితము (అనిపించుకొనును).

తా. ఆకసమువలెనె అనంతత్వమును వ్యాపకత్వమును సర్వగతత్వమునుగల చిన్మయ మగు పరమాత్మునిగాఁ దన్ను విజ్ఞానదృష్టిచేఁ దెలిసికొని జీవించెడు జీవన్ముక్తునియొక్క జీవితమే జీవితముగాని తక్కినవారి బ్రదుకొక బ్రదుకు కాదు. "తనుతనువునన్ కని" అనుపట్ల సూక్ష్మదేహాంతర్భూతమగు పరిశుద్ధాంతఃకరణవృత్తిచే నవలోకించి యని యర్థము. యన్మనసా న మనుతేయే నాహుర్మనోమతం" అను శ్రుతిచేఁ బరమాత్మ మాయామ

యమగు మనస్సునకు గోచరము కాకున్నను "యస్తు విజ్ఞానవాన్ భవతి యు క్తేన మనసా సదా, తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః—విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః । సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం—ఏషసర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే, దృశ్యతేత్వగ్రియా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః—మనసైవేద మాప్తవ్యం నేహనానాఽస్తి కశ్చన - అను మొదలగు నుపనిషద్వచనముల వలనఁ బరిమృదితకషాయ మైన పరిశుద్ధాంతఃకరణవృత్తివిశేషముచేఁ బర మాత్మని గనుఁగొనవచ్చును. ౧౩౦

అవ. ఆత్మానాత్మవివేకము గల బ్రహ్మజ్ఞాని జననమరణాదివికారములకు లోను గాక నిర్మలాకాశమువడువునఁ దేజరిల్లుచుండు నని ప్రతిపాదించుచున్నారు.

క. సారాసారవిచారవి
శారదుఁ డగు సుకృతి వికృతిజనికృతితతికిన్
శారదనీరదవారవి
దూరవియత్తలముభంగిఁ దొలఁగి వెలుంగున్. ౧౩౧

టీ. సార...దుఁడు-సార = సద్రూప మగు పరమాత్మయొక్కయు, అసార = అనాత్మభూత మగు ప్రపంచముయొక్కయు, విచార = పరిశీలనమునందు, విశారదుఁడు = నిపుణుఁడు, అగు + సుకృతి = ఐనట్టి జ్ఞాని, వికృతి + జని + కృతి + తతికిన్ = మూలప్రకృతియొక్క - మహదాది వికృతులవలనఁ బుట్టిన కార్యరూప మగు ప్రపంచవిస్తారమునకు, తొలఁగి = పరాఙ్ముఖుఁ డయి, శారద...భంగిన్ - శారద = శరదృతువునందలి, నీరద = మొగిళులయొక్క, వార = గుంపునకు, విదూర = ఎడఁబడిన, వియత్ + తలము + భంగిన్=మింటిపట్లు వడువున, వెలుంగున్ = తేజరిల్లుచుండును.

తా. పంచకోశవ్యతిరిక్త మై నిత్యమును చిన్మయము నఖండానంద ఘనము సర్వాధిష్ఠానభూతము నగునది పరమాత్మ యనియు, మాయామయము ననిత్యము జడము దుఃఖాత్మకము నగు నీప్రపంచ మనాత్మ యనియు గురుశాస్త్రవచన ప్రామాణ్యానుసరించి స్వానుభవమువలన నిశ్చయించుటకు నేర్పు గల బ్రహ్మజ్ఞాని జననమరణాది షడ్భావవికారములు గల కార్యకరణసంఘాతరూప మగు నీ జగద్విస్తారమునకు నభిముఖుఁడు గాక, శరదృతువునందు మేఘాడంబరము లేక యత్యంతనిర్మల మగు నంతరిక్షప్రదేశముపగిదిని బ్రకాశించుచుండును. ౧౩౯

అవ. ఆత్మానాత్మవివేకము లేకుండునంతదనుక స్రక్చందనవనితాది విషయసుఖము శాశ్వతముగను సర్వోత్తమముగను బరమపురుషార్థభూతముగను దోఁపట్టును. స్వస్వరూపానుభవానందము లభించినతోడనే యది విపరీత మై విరస మగు నని చెప్పుచున్నారు.

క. పర మై సురుచిర మై సుఖ
కర మై తగు మానసాదికరణావళి స
త్పరమా? పరమాదరమా?
స్థిరమోదాకర సదాత్మధీరతి గలుగన్. ౧౪౦

టీ. (ఆత్మానాత్మ వివేచన లేని యజ్ఞానావస్థలో) పరము - ఐ = ఉత్తమమైన దగుచు, సురుచిరము - ఐ = మిగుల మనోహర మైనదియు నగుచు, సుఖకరము - ఐ = సంతోషము నిచ్చునదియు నగుచు, తగు = తోఁపఁబడుచుండెడు, మానస + ఆది + కరణ + ఆవళి = మనస్సు మొదలుగాఁ గలవియగు వైషయికసుఖానుభవమునకు సాధనభూతములైన యింద్రియములయొక్క పంక్తి, స్థిర...రతి - స్థిర = అఖండ మగుటచే నిత్యమగు, మోద = ఆనందమునకు, ఆకర = గని యగు, సత్ + ఆత్మ =

స్వరూపమగు పరమాత్మయందు, ధీ = నిశ్చయాత్మికయు పరిశుద్ధయు నగు నంతఃకరణవృత్తివిశేషముయొక్క, రతి = ఆసక్తి, కలుగన్ = ఆత్మా నాత్మ వివేకజ్ఞానముచే లభింపఁగా, సత్ + పరము - ఆ = శాశ్వత మైనదియు శ్రేష్ఠ మైనదియు నగునా ? పరమ + ఆదరము - ఆ = మును పటివలెనే ఎక్కువగు నాదరణము (గౌరవము) గలదియు నగునా ? కా దని యర్థము.

తా. అఖండానందసాంద్ర మగు పరమాత్మయందు ననుభవజ్ఞానము చే నాసక్తి గలిగిన తరువాత, ఆత్మానాత్మవివేకము గలుగకుండునంత దనుక నజ్ఞానముచేతను సర్వోత్తమ మైనదిగను మనోహరముగను సంతోష దాయకముగను భ్రాంతివలనఁ దోఁపట్టుచుండెడు మనస్సు లోనుగాఁ గలవి యగు స్రక్చందనాది విషయభోగములకు సాధనము లైన యింద్రియముల యొక్క గణము స్థిరమైనదియును, ఉత్కృష్టమైనదియును, మునుపటివలె మిక్కుట మగు గౌరవమునకుఁ బాత్ర మైనదియును గానేరదు. అనఁగా బ్రహ్మానందానుభవము గలిగినపిమ్మట నస్థిర మగు విషయసుఖమునందు జ్ఞానికి నాసక్తి గలుగ దని తాత్పర్యము. ౧౮౦

అవ. ప్రపంచము బ్రహ్మముకంటె వ్యతిరిక్తమైనదని జ్ఞానికే తెలియునుగాని, యజ్ఞానికిఁ దెలియదని వక్కాణించు చున్నారు.

క. తరమా ? పరమానందే
తరమా ? జగ మనుచుఁ దెలియ ? ధర మూఢున కా
పరమార్థముఁ దెలియుట దు
ష్కరమా ? గురుకరుణఁ బడయు ? సర్వజ్ఞునకున్. ౧౮౧

టీ. ధరన్ = పుడమియందు, జగము = భువనము, పరమ + ఆనంద + ఇతరము - ఆ = అఖండానంద స్వరూప మగు పరమాత్మకు

వ్యతిరిక్త మైనదియే (ఇచట ఆ యను పదము నిశ్చయార్థకము), అనుచున్ = అని, తెలియన్ = ఎఱుంగుటకు, మూఢునకున్ = మోహావిష్టునకు, తరమా = శక్యమగునా - అలవికాదని యర్థము. గురు + కరుణన్ = దేశికేంద్రునియొక్క యనుగ్రహమును, పడయు + సర్వజ్ఞునకున్ = కాంచినట్టి సకలమును దెలిసిన జ్ఞానికి, ఆ పరమ + అర్థమున్ = అనృత జడ దుఃఖమయ మగు ప్రపంచము సచ్చిదానందఘన మగు బ్రహ్మమున కంటె భిన్నమైనదనియెడు వాస్తవార్థమును, తెలియుట = తెలిసికొనుట, దుష్కరము - ఆ = అసాధ్య మగునా? సులభమే యని యర్థము. ౧౪౧

ఈ పద్యమునకు నింకొకతీరున నర్థము చెప్పవచ్చు - నెట్లనిన, ధరన్ = ధరణియందు, మూఢునకున్ = సర్వాత్మభావన లేని యజ్ఞానికి, జగము = లౌకికానందము, పరమానంద + ఇతరము - ఆ = బ్రహ్మానందమునకు భిన్న మైనదియా? (కాదు), అనుచున్ = అని, తెలియన్ = ఎఱుంగుటకు, తరమా=వీలగునా? (కాదు), గురుకరుణ వడయు సర్వజ్ఞునకున్ = సద్గురువుయొక్క యనుగ్రహమును సంపాదించిన జ్ఞానికి, ఆ చరమార్థము = "యథాగ్నే ర్విస్ఫులింగా భవంతి ఏవమేతస్యై వానందస్యాన్యాని మాత్రా ముపజీవంతి" అను శ్రుతిచేత వైషయికానందములన్నియు బ్రహ్మానందముయొక్క లేశములే కాని, వేఱుకావనియెడు కడపటిఫలితార్థమును, తెలియుట = ఎఱుంగుట, దుష్కరమా = కష్టతరమా? (కాదు; సులభమే).

తా. అనృతజడ దుఃఖభూయిష్ఠ మగు ప్రపంచము తద్వ్యతిరిక్త మగు బ్రహ్మము కానేర దని జ్ఞానికిఁ దెలియునుగాని యజ్ఞానికిఁ దెలియఁబడదు. లేక, ప్రాపంచికసుఖలేశము లన్నియును బ్రహ్మానందముయొక్క లవములే కాని వేఱుగాదను నీ ఫలితార్థము సర్వాత్మభావన గల మహాజ్ఞానికి గోచరమగునుగాని పామరునకుఁ దెలియఁబడ దనియును తాత్పర్యము.

వ. అని యివ్విధంబున నుపదేశించి హనుమంతునితో శ్రీ
రామచంద్రుండు మఱియును. ౧౮౨

టీ. శ్రీరామచంద్రుండు = శ్రీరామ పరబ్రహ్మము, అని - ఈ + విధంబునన్ = అని పైని జెప్పినతీరున, ఉపదేశించి = ఆత్మస్వరూపమును బోధించి, హనుమంతునితోన్ = ఆంజనేయునితో, మఱియును = ఇంకను, (ఇట్లనియె).

ఉ. మాయను మిథ్యగాఁ దెలియుమా యనుఁ దత్కృత మెల్లఁ
గల్లసుమ్మా యను మేను నే ననకుమా యను సాక్షివి
నీవు చూచుకో, మ్మా యనుఁ జూడఁగా నితరమా యను
నే నని నిశ్చయించుకో, మ్మా యనుఁ గాక పో నితరమా
యనుమానము మానుమా యనున్. ౧౮౩

టీ. మాయను=మూలాజ్ఞానమును, మిథ్యగాన్ = కల్ల యని, తెలియుము - ఆ = తెలిసికొనుమీ, అనున్ = పలికెను (ఇందు శ్రీరామచంద్రుఁ డను కర్తృపదము అంతటను అధ్యాహార్యము - (వెనుకటి వచనమునుండి తెచ్చిపెట్టుకొనఁ దగినది), తత్ + కృతను = ఆ మూలాజ్ఞానముచేఁ జేయఁబడునది, ఎల్లన్ = అంతయును, కల్లసుమ్మా = దబ్బఱ సుమీ, అనున్ = అని చెప్పెను, మేను - నేను - అనకుమా = స్థూల సూక్ష్మకారణదేహములు మూఁడును నేనే యను నభిమానముతో మాటలాడకుమా, అనున్ = అని నుడివెను, నీవు = త్వంపదవాచ్యుఁడ వగు నీవు, సాక్షివి తత్పదవాచ్యుఁ డగు ద్రష్టవు (ఐతివి), చూచుకొమ్మా = సాక్షిని నేనైతినా కానా యని నీవే పరికింపుమీ, అనున్ = అని వాక్రుచ్చెను, చూడన్ - కాన్ = అట్లు పరికింపఁగా, ఇతరమా = నీ స్వరూప మా సాక్షికంటె భిన్నమైనదియా? కాదు, అనున్ = అని వక్కాణించెను, నేను - అని - నిశ్చయించుకొమ్మా = సాక్షిని నేనే యని స్థిరపఱుచు

ణానుమా ? అనుక్ = అని పలికెను, కాకపోక్ = సాక్షివి నీవు కాకుండుటకు, ఇతరమా = సాక్షిస్వరూపము నీకంటె భిన్న మైనది యా ? (కాదు), అనుమానమున్ = సర్వసాక్షిని నే నగుదునా కానా యను సందియమును, మానుమా = విడుచుకొనుమీ, అనున్ = అని యుపదేశించెను.

తా. మాయ యనఁగా మూలాజ్ఞానముగాన, నజ్ఞాన మెన్నఁడును వాస్తవముగాదు. అదియే నిజమైనచో నింద్రజాలముగూడ సత్యమే యగును గావున, మాయ మృషాభూతము; అట్టి మిథ్యాభూత మగు మూలాజ్ఞానము వలనఁ గల్పిత మగు సమస్తప్రపంచముగూడ నసత్యమే యగును; ఇట్టి యసత్యమగు ప్రపంచాంతర్భూతమైన దేహాదికము నే నని యనుకొనవలదు. నీవు నేను - అనుపదములకు వాస్తవార్థము సర్వసాక్షి యగు పరమాత్మ గాని దేహాదికము గాదు. అను నీ యంశమును గురుశాస్త్రవచనముల యందలి నమ్మకముతో స్వానుభవమువలన నాలోచించుకొనవలయును; అట్లు విచారణచేయఁగాఁ దాను సాక్షిస్వరూపముకంటె భిన్నుఁడు కాఁడు గాన, నేనే సర్వసాక్షి నైతినని నిర్ధారణ చేసికొనవలయును; సాక్షిస్వరూపము తనకంటె వేఱైనది కాదనుటకు నించుకయు సందియము లేదు.

వ. అని వెండియు నిట్లనియె సిది యారూఢుని ప్రకారం, బింక నారురుక్షుని మార్గంబు వివరించెద. ౧౭౭

టీ. అని = ఈ తీరున నుపదేశించి, వెండియున్ = మరల, ఇట్లు - అనియెన్ = శ్రీరామచంద్రుఁ డీ రీతిని వచించెను, ఇది = మీఁద నాచే నుపదేశింపఁబడినది, ఆరూఢుని + ప్రకారంబు = మోక్షరూప మగు ప్రాసాదము నెక్కినవానియొక్క లక్షణము, ఇంకన్ = ఈ పిమ్మటను, ఆరురుక్షుని + మార్గంబున్ = సోపానన్యాయమున మోక్షపదవి పొందఁ దలంపు గలవానిత్రోవను, వివరించెదను = ఉపదేశించెదను. ౧౭౭

సీ. అస్తోకసద్గురూపాస్తిచే సతతవి
ధ్వస్తకాముండు నిరస్తమోహుఁ
డస్తంగతాశుం డపాస్తలోభుండు స
న్న్యస్తరోషుండు విస్రస్తమదుఁడు
గ్రస్తనిస్తత్యేంద్రియస్తోముఁ డశ్రాంత
విస్తారితవిధిప్రశస్తుఁ డగుచు
స్వస్తిస్వమస్తకన్యస్తనిజాచార్య
హస్తాబ్జవిదితచిద్వస్తుతత్త్వుఁ

తే. జనితశమదమముఖగుణసముదయయుత
సుముఖసమరసవిమలహృత్కముఁ డఖిల
విషమవిషసమసకలుషవిషయవిముఖుఁ
డైన మేధావి తత్త్వబోధార్హుఁ డనఘ. ౧౮౫

టీ. అనఘ = విషయాసక్తి లోనగు దోషములు లేని మారుతీ! అస్తోక + చిత్ + గురు + ఉపాస్తిచేన్ = కొలఁతలేని యోగ్యుఁ డగు దేశికేంద్రుని శుశ్రూషచేత, సతత + విధ్వస్త + కాముండు = నిరంతరమును నశింపఁజేయఁబడిన పుత్త్రమిత్రకళత్రాదులయందలి యభిలాష గలవాఁడును, నిరస్త + మోహుఁడు = నిరసింపఁబడిన మూఢత్వము గలవాఁడును, అస్తంగత + ఆశుండు = నాశమునొందిన యాశ గలవాఁడును, అపాస్త + లోభుండు = తొలఁగింపఁబడిన లోభత్వము గలవాఁడును, సంన్యస్త + రోషుండు = విడువఁబడినయలుక గలవాఁడును, విస్రస్త+ మదుఁడు = జారిన గర్వము గలవాఁడును, గ్రస్త+నిస్తత్య + ఇంద్రియ + స్తోముఁడు = గ్రహింపఁబడిన (స్వాధీనపఱచుకొనఁబడిన) దుష్టములయిన శ్రోత్రాదులగు నింద్రియగణము గలవాఁడును, అశ్రాంత + విస్తారిత + విధి + ప్రశస్తుఁడు = నిత్యమును విశేషముగ నాచరింపఁబడిన వేదవిధు

లచే యోగ్యుఁడును, అగుచున్ = అయి, స్వస్తి...తత్త్వుఁడు - స్వస్తి = మేలుగ, స్వ = తనయొక్క, మస్తక = తలపైని, న్యస్త = ఇడిన, నిజ + ఆచార్య = తన సద్గురునియొక్క, హస్త + అబ్జ = కేలుదమ్మిచేత, విదిత = బోధింపఁబడిన, చిత్ + వస్తు = శుద్ధచైతన్య స్వరూపమగు పరవస్తువుయొక్క, తత్త్వుఁడు = నిజస్వరూపము గలవాఁడును, అమిత...కమలుఁడు - అమిత = లెక్కకెక్కుడగు, శమ = బాహ్యేంద్రియ నిగ్రహమును, దమ = అంతరింద్రియ నిగ్రహమును, ముఖ = లోనుగాఁ గల, గుణ = మోక్షసాధనము లగు సద్గుణములయొక్క, సముదయ = సమూహముతో, యుత = కలసిన, సుముఖ = సుప్రసన్నమగు, సమరస = సామరస్యముచేత, విమల = పరిశుద్ధమగు, హృత్ + కమలుఁడు = మనస్సనియెడు పద్మము గలవాఁడును, అఖిల...విముఖుఁడు - అఖిల = అన్నియును, విషమ = విరుద్ధములును, విష + సమ = విసమునకు సెనయైనవియు, కలుష = దురితరూపములును, , అగు, విషయ = శబ్దాదివిషయములయందు, విముఖుఁడు = పరాఙ్ముఖుఁడును, నగు, మేధావి "ధీర్ధారణావతీ మేధా" అనుటచే ధారణాశక్తి గల బుద్ధిమంతుఁడు, తత్త్వ + బోధ + అర్హుఁడు = పరతత్త్వమును దెలిసికొనుటకుఁ దగిన వాఁడు (అగును).

తా॥ అత్యధికమగు నాచార్యునియొక్క పరిచర్యచేత నిరంతరమును నశింపఁజేయఁబడిన పుత్త్ర మిత్ర కళత్రాదులయందలి యభిలాష గల వాఁడును, నిరసింపఁబడిన మోహము గలవాఁడును, వినాశము నొందిన యాశాపాశము గలవాఁడును, దొలఁగింపఁబడిన లోభత్వము గలవాఁడును, విడువఁబడిన కోపము గలవాఁడును, సడలిన గర్వము గలవాఁడును, జ్ఞాన కర్మేంద్రియ గణములను జయించినవాఁడును, నిత్యమును యథావిధిగ నాచరింపఁబడిన నిత్య నైమిత్తికాది కర్మములు గలవాఁడును, మేలు కలుగుఁగాక యని సద్గురువుయొక్క కరకమలము తన శిరముపై నునిచినంతనే

తెలియఁబడిన శుద్ధచైతన్యస్వరూపమగు పరవస్తువుయొక్క యాథార్థ్యము గలవాఁడును, పెక్కులగు శమము దమము తితిక్ష శాంతి దయ సత్యము శౌచము మొదలుగాఁగల మోక్షసాధనములగు సద్గుణముల సమూహముతోఁ గూడుకొనిన సుప్రసన్నమగు సామరస్యముచేఁ బరిశుద్ధమగు డెందము గలవాఁడును, సమస్తము లైనట్టియుఁ బరస్పరవిరుద్ధము లయినట్టియు, కాలకూటవిషమును బోలి పరిణామకటువు లయినట్టియు, పాపభూయిష్ఠము లైనట్టియు, నింద్రియార్థములయందుఁ బరాఙ్ముఖుఁడైన ధారణాశక్తి గల బుద్ధిమంతుఁడు పరతత్త్వస్వరూపము నెఱుంగుటకుఁ దగినవాఁడు. ౧౭౫

సీ. మేధావి మొదలఁ దా సాధూక్తశాస్త్రాది
సాధనాసాధితబోధుఁ డైన
దా ధీంద్రియముల నిరోధించి మనములో
శోధించి కామసుక్రోధముఖవి
రోధియూథంబును వేధించి బాధించి
బాధయోగ్యాఖిలోపాధులను ని
షేధించి సర్వనిషేధావధీభూత
సాధిభూతాధిదైవాధియజ్ఞ
తే. బోధమయ నిరుపాధికాగాధలసద
బాధకానందవిమలపాథోధి యగుచు
వ్యాధుల మహాధుల జయించునట్టి ఘనస
మాధిసుఖలోలుఁ డగువాఁడె సాధకుండు. ౧౭౬

టీ. మేధావి = ఆరురుక్షుఁ డగు నామేధావి, మొదలన్ = ముందుగా, సాధు... ఐ—సాధు = పరమసాధువగు సద్గురువుచేత, ఉక్త = ఉపదేశింపఁబడిన, శాస్త్ర + ఆది = వేదాంతశాస్త్రము లోనుగాఁగల, సాధన = మోక్షసాధనసామగ్రిచేత, ఆసాధిత = లెస్సగ సాధింపఁబడిన,

బోధుఁడు ఐ = స్వస్వరూపజ్ఞానము గలవాఁడగుచు, సదా = నిత్యమును, ధీంద్రియములన్ = శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను, నిరోధించి = నిగ్రహించి, మనములోన్ = డెందమునందు, శోధించి = విచారణచేసి, కామ + సుక్రోధ + ముఖ + విరోధి + యూథంబును = కామక్రోధలోభమోహమదమాత్సర్యము లను నరిషడ్వర్గమును, వేధించి = క్రొత్తి, బాధించి = ఆ యరిషడ్వర్గము మరలఁ దనపై మార్కొనకుండ నడఁగఁ ద్రొక్కి, బాధ + యోగ్య + అఖిల + ఉపాధులను = నిగ్రహింపఁదగిన సమస్తములగు నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయము లను పంచకోశములు మొదలగు నవిద్యోపాధులనెల్ల, నిషేధించి = తాను గానని వానియందలి యభిమానమును మాని, సర్వ...పాధోధి - సర్వ = సమస్తములగు నుపాధులయొక్క, నిషేధ = "నేతినేతి" అను మొదలగు నుపనిషద్వచనములవలన నాత్మ కావను నిరసనమునకు, అవధి భూత = తుట్టతుదిది యగు, స + అధిభూత + అధిదైవ + అధియజ్ఞ = ఆధిభౌతికము లగు శబ్దాదివిషయములతోను, పదునాలుగింద్రియములకు నధిష్ఠానదేవత లగు దిక్కులు వాయువు సూర్యుఁడు మొదలగువానితోను, "యజ్ఞోవై పురుషః" అను శ్రుతిచేత యజ్ఞశబ్దవాచ్యమగు నాత్మకు నుపకరణము లగుటచే నాధ్యాత్మికము లయిన శ్రోత్రాదీంద్రియములతోను గూడుకొనియున్న, బోధమయ = చైతన్యస్వరూప మయినట్టియు, నిరుపాధిక = అట్లు అధిభూతాదులయందు వ్యాపించి యున్నను స్వతస్సిద్ధముగ నేయుపాధియు లేనట్టియు, అగాధ = "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అను శ్రుతిచే మనోవాగగోచర మయినదియు, లసత్ = స్వయంప్రకాశ మయినదియు, అబాధక = కాలత్రయాబాధ్యమును నగు, ఆనంద = బ్రహ్మానందరసమునకు, విమల + పాథోధి = పరిశుద్ధమగు సముద్రమైనవాఁడు, అగుచున్ = అయి, వ్యాధులన్ = స్థూలశరీరధర్మము లైన జబ్బులను, మహోగ్రులన్ = సూక్ష్మశరీర సంబంధము

లగు వ్యథలను, జయించునట్టి = గెలిచిన, ఘన + సమాధి + సుఖ + లోలుఁడు = సర్వోత్తమ మగు నసంప్రజ్ఞాత సమాధియందలి యానందము నందు నాసక్తి గలవాఁడు, అగువాఁడు ఎ = ఏనట్టివాఁడే, సాధకుండు = బ్రహ్మాత్మైక్యమును సాధించువాఁడు.

## అధ్యాత్మాధిభూతాధిదైవత మండలము.

| | అధ్యాత్మము. | అధిభూతము. | అధిదైవతము. |
|---|---|---|---|
| ౧ | శ్రోత్రము | శబ్దము | దిక్కులు |
| ౨ | చర్మము | స్పర్శము | వాయువు |
| ౩ | నేత్రము | రూపము | సూర్యుఁడు |
| ౪ | జిహ్వ | రసము | వరుణుఁడు |
| ౫ | ఘ్రాణము | గంధము | అశ్వినేయులు |
| ౬ | వాక్కు | వచనము | అగ్నిదేవుఁడు |
| ౭ | పాణి | దానము | ఇంద్రుఁడు |
| ౮ | పాదము | గమనము | ఉపేంద్రుఁడు |
| ౯ | పాయువు | విసర్గము | మృత్యువు |
| ౧౦ | ఉపస్థము | ఆనందము | ప్రజాపతి |
| ౧౧ | మనసు | సంకల్పము | చంద్రుఁడు |
| ౧౨ | బుద్ధి | నిశ్చయము | బ్రహ్మదేవుఁడు |
| ౧౩ | చిత్తము | స్మరణము | క్షేత్రజ్ఞుఁడు |
| ౧౪ | అహంకారము | అభిమానము | రుద్రుఁడు |
| ౧౫ | తమస్సు | గుణత్రయము | ఈశ్వరుఁడు |
| ౧౬ | జ్ఞాత | జ్ఞానము | జ్ఞేయము |

జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అనునవి మూఁడవస్థలు. వీని కన్నిటికిని ద్రష్ట కూటస్థ చైతన్యము. కూటస్థచైతన్యము పైయుపాధులను విడిచి నప్పుడు శుద్ధచిద్రూపపరబ్రహ్మము.

తా. మీఁదఁ జెప్పఁబడిన యారురుతుఁ డగు మేధావి తొలుత దేశి కేంద్రునిచే నుపదేశింపఁబడిన యుపనిషద్విద్యయొక్క శ్రవణమనన నిదిధ్యాస

ములు శమదమాదులు లోనుగాఁ గల మోక్షసాధనసామగ్రిచేత నేకరింపఁ బడిన పరమాత్మజ్ఞానము గలవాఁ డగుచు, నంతఃకరణము మొదలగు జ్ఞానేంద్రియముల నాఱింటిని నరికట్టి మనస్సును శుద్ధపఱుచుకొని, కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యము లను నరిషడ్వర్గమును నిగ్రహించి, వానిని మరల పైకొనకుండ నణఁచి, ఆత్మస్వరూపము గానట్టి యన్నమయాదికోశ పంచకము మొదలగు నుపాధుల నెల్ల నేను గానని వానియందు నభిమానమును మాని, ఇట్లు దృశ్యవర్గమెల్ల నేను గానను నిరాసమునకుఁ గడపటిదియు శ్రోత్రాదులగు నాధ్యాత్మికములకును శబ్దాదులగు నాధిభౌతికములకును దిక్కులు మొదలగు నాధిదైవికములకును సాక్షియు, స్వతస్సిద్ధముగ తన కొకయుపాధి లేనిదియు, నవాఙ్మానసగోచరమును, స్వయంప్రకాశమును, గాలత్రయాబాధ్యమును, బ్రహ్మానంద రసమునకుఁ దెల్లని పాల కడలివంటివాఁ డగుచు స్థూలశరీరసంబంధము లగు జ్వరాదులను సూక్ష్మ శరీరసంబంధము లగు మనఃపరితాపాదులను గెలిచినట్టి సర్వోత్తమ మగు నసంప్రజ్ఞాత సమాధియందలి పరమసుఖమును మరగినవాఁడే మోక్షపదవిని సాధించువాఁ డగును. ౧౨౬

సీ. శ్రీసదాచార్యసుశ్శాసనాభిజ్ఞుఁ డ
జ్ఞాననాసీనుఁ డశ్ఞాననాది
వాసనారాయణోశ్పాసనామ్నాయాంత
వాసనావాసితోశ్లాసహృదయుఁ
డై సనాతననిరాశ్భాసనానార్థావ
భాసకానందసశ్త్త్వానమాన
ధీసాక్షిపరచిదాశ్భాసైక్యసంతతా
భ్యాసవివర్జితాశ్యానుఁ డగుచుఁ

తే. గానువీసంబుపై సుదతీసుతార్థ
దాసదాసీజనములపైఁ నాసఁ జేసి
మోసపోవక దోసముఁ లోన్నసికొనక
వాసుదేవాత్ముఁడై చిద్విలాసుఁ డగుచు. ౧౮౭

టీ. శ్రీ + సత్ + ఆచార్య + సు + శాసన + అభిజ్ఞుఁడు = దేశికునకుఁ జెప్పఁబడిన శుభలక్షణముల సంపత్తి గల యోగ్యుఁడగు గురువు యొక్క మంచి యాజ్ఞల నెల్ల నెఱింగినవాఁడును, అబ్జాసన + ఆసీనుఁడు = "తత్రస్థిర సుఖ మాసనం" అను పాతంజలసూత్రముచే నాసనములలో నెల్ల నిలుకడ గలదియు సుఖకర మైనదియు నగు కమలాసనబంధముతోఁ గూర్చున్నవాఁడును, అబ్జ...హృదయుఁడు—అబ్జాసన = చతుర్ముఖుఁడు, ఆది = లోనుగాఁగల దేవతలకెల్ల, వాస = ఆధారభూతుఁ డగు, నారాయణ = శ్రీహరియొక్క, ఉపాసనా = సమారాధనవలనఁ గలిగిన ఆమ్నాయాంత = వేదాంతార్థముయొక్క, వాసనా = సంస్కారముచేత, అవాసిత = అనుసరించివచ్చిన, ఉల్లాస = తనివిగల, హృదయుఁడు = ఉల్లము గలవాఁడు, ఐ = అగుచు, సనా...అనూయుఁడు - సనాతన = శాశ్వతము (నిత్యము) అయినట్టియు, నిరాభాస = ప్రాపంచికాభాసము లేనట్టియు, నానా + అర్థ + అవభాసక = సమస్తవస్తువులను బ్రకాశింపఁ జేయుచున్నట్టియు, ఆనంద = అఖండానందమయ మైనట్టియు, సత్త్వ + అసమాన = సత్యత్వముచే సాటిలేనట్టియు, ధీసాక్షి = నిశ్చయాత్మిక యగు బుద్ధికి సాక్షాద్ద్రష్టయు నగు, పర = పరబ్రహ్మముతో, చిదాభాస = చిద్రూపమగు బ్రహ్మముయొక్క ప్రతిబింబభూతుఁ డగు జీవాత్మునకుం గల, ఐక్య = అభిన్నత్వము (వేఱులేమి) యొక్క, సంతత = తెంపులేని, అభ్యాస = అలవాటుచేత, వివర్జిత = తొలఁగింపఁ బడిన, ఆయాసుఁడు = సంసారక్లేశము గలవాఁడు, అగుచున్ = అయి,

కాసు + వీనంబుపైన్ = కడపటి రాగినాణెముయొక్క మూఁడవపాలు నంమును, సుదతీ + సుత + అర్థ + దాస + దాసీ + జనములపైన్ = ఆలుబిడ్డలు సొత్తులు పనివాండ్రు పనికత్తెలు అను వీనిమీఁదను, ఆసన్ - చేసి = అభిలాష నుంచి, మోసపోవక = భంగమునొందక, దోసములు = దొసఁగులను, మోసికొనక = పైఁబెట్టుకొనక, వాసుదేవ + ఆత్ముఁడు = "వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః" అనునట్లు సమస్తము పరవాసుదేవుఁడే యను భావన గలవాఁడు, ఐ = అగుచును, చిద్విలాసుఁడు = చిత్స్వరూపమగు బ్రహ్మమునందే విలసనము (ఆనందపూర్వకమగు చిత్తవృత్తి) గలవాఁడు, అగుచున్ = అయి, అభీష్టఫలసిద్ధి నొందునని ముందుపద్యమునందలి క్రియాపదముతో నన్వయము. ౧౮౭

సీ. శిష్టవరేణ్యనిర్దిష్టోపదిష్టార్థ
దిష్టవిశిష్టసంతుష్టుఁ డగుచుఁ
గష్టమై మూఢసంజుష్టమై త్రిగుణసం
శ్లిష్టమై పరమ నికృష్ట మగుచు
దుష్టమై పరఁగు నీవ్యష్టి సమష్టిరూ
పాష్టప్రకృతిమయాదృష్టజగము
భ్రష్టంబుగాఁ గడు నష్టంబుగా నాత్మ
దృష్టిచేఁ గని యవశిష్టుఁ డగుచు
తే. విష్టపస్రష్టయై తదస్పృష్టుఁ డగుచు
ద్రష్టయై నిత్యనిర్మలోత్కృష్టుఁ డై వి
చేష్టుఁ డగు తన్నుఁ గాంచి విస్పష్టముగ న
భీష్టఫలసిద్ధి నొందు సంతుష్టుఁ డగుచు. ౧౮౮

టీ. శిష్ట...సంతుష్టుఁడు - శిష్ట + వరేణ్య = ఆత్మ వేత్తలలో నుత్తములగువారిచేత, నిర్దిష్ట = నిర్ణయింపఁబడినట్టి, ఉపదిష్ట = బోధింపఁ

బడినట్టి, అర్థ = పరమ పురుషార్థ మనియెడు, దిష్ట = మహాభాగ్యముతో, "దైవం దిష్టం భాగధేయం భాగ్యం" అని కోశము- విశిష్ట = కూడు కొనుటచేత, సంతుష్టుఁడు = ఆనందించినవాఁడు, అగుచున్ = అయి, కష్టము - ఐ = క్లేశకరమయి, మూఢ + సంజుష్టము - ఐ = మోహావిష్టులచే సేవింపఁదగినదయి, త్రి + గుణ + సంశ్లిష్టము - ఐ = గుణత్రయముతోఁ గూడుకొనినదయి, పరమనికృష్టము = మిక్కిలి తుచ్ఛము, అగుచున్ =అయినదై, దుష్టము-ఐ=దోషదూషితమునగుచు, పరఁగు=ప్రసిద్ధమగు, వ్యష్టి...జగము - వ్యష్టి = మలినసత్త్వప్రధాన యగు నవిద్యయందుఁ దోఁపట్టుటచే వేఱువేఱుగ నున్నట్టియు, సమష్టి = శుద్ధసత్త్వప్రధానయగు మాయయందుఁ దోఁపట్టుటచేఁ గలిసియున్నట్టియు, రూప = ఆకృతిగల, అష్టప్రకృతిమయ = పృథివ్యప్తేజో వాయ్వాకాశము లైదును, మనస్సు బుద్ధియు నహంకారము నను మూఁడును గలిసి, యెనిమిదియు నష్టప్రకృతు లనఁబడును. వీనియొక్క వికృతి యగు, దృష్ట = గోచరమగుచున్న, జగము = భువనజాతము, భ్రష్టంబున్ - కాన్ = నశించుదానిఁగను, కడున్ = మిక్కిలి, నష్టంబున్ - కాన్ = అనర్థకరమైన దానిఁగను, ఆత్మ + దృష్టిచేన్ = తనయొక్క విచారణారూపమగు చూపుచేత, కని = పరికించి, అవశిష్టుఁడు = ప్రపంచాతీతుఁడగుటచే దానికిఁ గొఱ వడినవాఁడు, అగుచున్ = అయి, విష్టప + స్రష్ట - ఐ = చతుర్దశ భువనములను సృజించువాఁడగుచు, తత్ + అస్పృష్టుఁడు - అగుచున్ = ఆ భువనములయొక్క సంబంధము లేనివాఁడయి, ద్రష్ట - ఐ = ఆ భువనములకెల్లఁ దటస్థుఁడగుచు విలోకించువాఁడై, నిత్య + నిర్మల + ఉత్కృష్టుఁడు - ఐ = సద్రూపుఁ డగుటచే నిత్యుఁడును, ప్రకృతిసంబంధము లేమింజేసి పరిశుద్ధుఁడును, పరాత్పరుం డగుటచే సర్వోత్తముఁడును నగుచు, విచేష్టుఁడు = స్థూలసూక్ష్మకారణము లను నుపాధిత్రయము లేనివాఁ డగుటచే నేవిధ మయిన చర్యలును లేనివాఁడు, అగు + తన్నున్ = ఐనట్టి

తన్మును, విస్పష్టముగన్ = అసంభావనా విపరీతభావనలు లేక సరిగా, కాంచి = పరికించి (తెలిసికొని), సంతుష్టుఁడు అగుచున్ = ప్రమోదము నొందినవాఁడై, అభీష్ట + ఫల + సిద్ధిన్ తన చేఁ=గోరఁబడిన మోక్షపదవి యను మహాలాభమును, పొందున్ = పడయును. ౧౪౫

తా. మఱియు నా యారురుక్షుఁడగు సాధకుఁడు శ్రేష్ఠుఁడగు సద్గురువునకు నాగమాదులయందుఁ జెప్పఁబడిన యుత్తమలక్షణములు గల దేశికేంద్రునియొక్క యుపనిషద్విధిరూపము లగు నాజ్ఞలను దెలిసికొనినవాఁడును, యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడిన యాసనబంధముల కన్నిటికంటె స్థైర్యమును సౌఖ్యమును నిచ్చెడు పద్మాసనబంధమును గూర్చుకొని కూర్చున్నవాఁడును, నలువ మొదలగు వేల్పులకెల్ల నాశ్రయభూతుఁడగు శ్రీమన్నారాయణమూర్తియొక్క సమారాధనచేత నగు వేదాంతార్థముయొక్క సంస్కారము చేతఁ బరిశుద్ధమగు తనివి గలడెందము గలవాఁడును, నిత్యమును దుఃఖరహితమును సకల పదార్థములను బ్రకాశింపఁ జేయునదియు నఖండానందప్రచురమును శుద్ధసత్త్వప్రధానమును బుద్ధికి సాక్షియు నగు పరబ్రహ్మమునకును చిత్ప్రతిబింబభూతుఁ డగు జీవునకును గల యేకత్వమును నిరంతరమును మననము చేయుటచేతఁ దొలఁగింపఁబడిన సంసారక్లేశము గలవాఁడును, కాసులో ముప్పదవ పాలునందుఁగాని పుత్త్రమిత్రకళత్ర భృత్యవర్గమునందుఁగాని కాంక్షను బూని మోసమునొందక పాపములను మూటగట్టుకొనక పరవాసుదేవుఁడే తన యాత్మగా నమ్మి, చిదానందభరితుఁడు నయి, మఱియును మహాజ్ఞానులచే నిశ్చయపూర్వకముగ నుపదేశింపఁబడిన పరమపురుషార్థ మనియెడు మహాభాగ్యముచేత నత్యధికమగు నానందము గలవాఁడును, దుఃఖభూయిష్ఠమును నజ్ఞానులచే సేవింపఁదగినదియు సత్త్వరజస్తమోగుణములతోఁ గూడినదియు మిగులఁ దుచ్ఛమగు పెక్కు దోషములు గలదియు, వేలువేలుగను మొత్తముగను నున్నట్టియు పంచభూతములును మనోబుద్ధ్యహంకారములు నను నెనిమిది విధ

ముల ప్రకృతులయొక్క వికృతియునై యిట్లు గన్పట్టుచున్న ప్రపంచమును క్షణభంగుర మయి నశించుదానిఁగఁ దన లోచూపుచే నాలోచించి తన్నును దానికంటె వ్యతిరిక్తునిగఁ దలఁచి, సకల భువనములను సృజించు వాఁడై, వానిసంపర్క మించుకయు లేక సర్వసాక్షియు నిత్యుఁడును నిర్మలుఁడును సర్వోత్తముఁడును ప్రకృతికి నతీతుఁ డగుటచే నిర్వ్యాపారుఁడును నగు తన్నును గని, తప్పక తాను గోరియున్న మోక్షపదవిని బడసి యపరిమితానందము నొందును. ౧౪౦

సీ. దాంతుఁ డై సకలవేదాంతతాత్పర్యప
ర్యాలోచనైకాశయంబుచేతఁ
జేతనాచేతనవ్రాతసంయుతపంచ
భూతాత్మకద్వైతజాత మెల్ల
మెల్లన తనయందె మిథ్యగా భావించి
నిరుపమానందాంబునిధి మునింగి
నింగిభంగి నెసంగి నిరవయవాత్ముఁ డై
కారణ కార్య వికారరహిత

తే. హిత నిరీహ నిరామయ నిర్వికల్ప
కల్పనాతీత సచ్చిత్సుఖస్వభావ
భావనాభావ్య శూన్య చిద్బ్రహ్మ మగుచు
సంతసించుచు నుండు సజ్జనవరుండు. ౧౪౧

టీ. సజ్జనవరుండు = ఉత్తమ మానవుల కెల్ల నుత్తముఁ డగు నా సాధకుఁడు, దాంతుఁడు - ఐ = అంతరింద్రియనిగ్రహము గలవాఁ డగుచు, సకల... చేతన్—సకల = సమస్తమైన, వేదాంత = శ్రుతిశిర స్సులయొక్క, తాత్పర్య = ఫలితార్థమును, పర్యాలోచన = విచారణ చేయుటయందు, ఏక = తత్పరమగు, ఆశయంబుచేతన్ = హృదయముు

చేత, చేతన...జాతము—చేతన = జీవజంతువులతోను, అచేతన + వ్రాత = జడవర్గముతోను, సంయుత = కలిసియున్న, పంచభూత + ఆత్మక = పుడమిమొదలగు నైదుభూతములే స్వరూపముగఁగల, ద్వైత + జాతము = వేఱువేఱు వస్తువులగుంపు, ఎల్లన్ = అంతయును, మెల్లన = క్రమముగా, తనయందు - అ = తన మనమునందే, మిథ్య కాన్ = కల్లయని, భావించి = ఆలోచించి, నిరుపమాన + ఆనంద + అంబునిధిన్ = ఈడు లేని బ్రహ్మానందరసమయ మగుకడలియందు, మునింగి = చొరఁబడి, నింగి + భంగిన్ = ఆకసము వడువున, నిరవయవ + ఆకృతిన్ - ఐ = ఆకారము లేమింజేసి యొట్టి యంగములుగాని లేని స్వరూపము గలవాఁడగుచు, ఎసంగి = తేజరిల్లి, కారణ...బ్రహ్మము—కారణ + కార్య + వికార + రహిత = తన కొక కారణముకాని కార్యముగాని మార్పుగాని లేనట్టియు, హిత = పరప్రేమాస్పదమును, నిరీహ = అభిలాషలు లేనిదియు, నిరామయ = అమూర్తమగుటచే నేవ్యాధులును లేనిదియు, నిర్వికల్ప = అమనస్కమగుటచే సంశయములు లేనిదియు, కల్పనా + అతీత = ప్రపంచరచనకుఁ బైఁబడినదియు, సత్ + చిత్ + సుఖ + స్వభావ = సత్యత్వము శుద్ధచైతన్యము నానందమును స్వరూపముగఁ గలదియు, భావనా + భావ్య + శూన్య = తలఁపును దలంపఁదగినదియు లేనిదియు నగు, చిత్ + బ్రహ్మము అగుచున్ = బోధస్వరూపమగు పరబ్రహ్మమే తానై, సంతసించుచున్ ఉండున్ = ప్రమోదము నొందుచు నుండును.

తా. మఱియు మహనీయులకెల్ల నుత్తముఁడగు నాసాధకుఁడు, అంతరింద్రియనిగ్రహము గలవాఁడగుచు నుపనిషత్తులలోని తత్త్వమస్యాది మహావాక్యములయొక్క ఫలితార్థమును మననము చేయుటయందుఁ దత్పరమగు మానసముచేత జడాజడవస్తుసమూహముతోఁ గూడిన పాంచభౌతికమగు ప్రపంచవిస్తారమంతయుఁ గల్లయని తనలోఁదలఁచి యీడులేని యఖండానందరసమయమగు సంద్రమునందు నోలలాడుచు నాకసమువడువున న

యవరహితమగు స్వరూపము గలవాఁడై తన కొక కారణముగాని కార్యముగాని వికృతిగాని లేనట్టియు, పరప్రేమకుఁ దారకమైనట్టియు, నెట్టియఖిలాపలును లేనట్టియు, నెట్టి వ్యాధులును లేనట్టియుఁ, దన విషయమయి యెట్టి సందియమును లేనట్టియు, సృష్టికి లోఁబడకయున్నట్టియు సచ్చిదానందస్వరూపమై తలంపును దలంపఁదగినదియు లేని బోధస్వరూపమగు పరబ్రహ్మమే తా నయి నిరంతరమును నానందించుచుండును. ౧౪౯

సీ. డెందంబు నింద్రియసంబృందంబు నొకటి ని
ష్పందంబు గావించి క్రిందుపఱచి
యందంబుగ మనోరవిందంబునకు మూల
కందంబు నౌ చిదానందజలధి
యం దంబుబిందు వసమందంబుగా నొందు
చందంబునం బొంద సందు లెల్ల
నిందించినను నభినందించినను మేలు
చెందించినను గీడు చెందునప్పు

తే. డెందుఁ దగులక విందుగా నందుకొనుచు
సందియంబులసందడి డిందఁజేసి
కందు లేని మనీషి సనందనాది
వందనీయుండనైన నాయందుఁ గలియు. ౧౫౦

టీ. కందు + లేని + మనీషి = అజ్ఞానరూపమగు దోషము లేని మహాజ్ఞాని, డెందంబున్ = హృదయమును, ఇంద్రియ + బృందంబున్ = చక్షురాదు లగు నింద్రియముల గమిని, ఒకటిన్ = ఒకసారిగనే, నిష్పందంబున్ = కదలికలేనిదానిఁగ, కావించి = ఒనరించి, క్రిందుపఱచి = వీని యుద్రేకము నణఁగఁద్రొక్కి, అందంబుగన్ = సొగసుగ, మనస్ + అరవిందంబునకున్ = హృదయకమలమునకు, మూలకందంబున్ ఔ =

ప్రధానమగు దుంప యగు (ముఖ్యహేతువగు), చిత్ + ఆనంద + జలధి యందున్ = బోధస్వరూపమగు బ్రహ్మానందరస మనియెడు కడలియందు, అంబుబిందువు = నీటిబొట్టును (జలకణమును), అమందంబుగాన్ = బుద్ధి మాంద్యము లేకుండునట్లు, ఒందుచందంబునన్=కలిసినపగిదిని, పొందన్= బిందుశబ్ద మాగమశాస్త్రపరిభాషచేత ప్రమాతయందును వర్తించుచున్నది. "వేదితవ్యేచ బిందుస్స్యా త్త్రిషు జ్ఞాతరి దాతరి" అనునిఘంటువున బిందు వనఁగా జ్ఞాతయని చెప్పుచున్నది. కాన, ప్రమాతృజ్ఞాతృశబ్దములచేఁ జెప్పఁ బడుచున్న బుద్ధి పరమాత్మయందు నేకీభవించుచుండఁగా నను నీయర్థమును సూక్ష్మబుద్ధితోఁ గనిపట్టవలయును. మందులు - ఎల్లన్ = అజ్ఞానులెల్ల రును, నిందించినన్ = తిట్టినను, అభినందించినన్ = కొనియాడినను, మేలు - చెందినన్ = శుభమును బడసినను, కీడు - చెందినన్ = ఇడుమ నొందినను, అప్పుడు = అట్లు మానావమాన సుఖదుఃఖాదులు గలుగుతతిని, ఎందున్ - తగులక = దేనియందును జిక్కక (ఖేదమోదాదుల నొందక), బిందుగాన్ = ఆ సుఖదుఃఖాదుల నెల్ల నొకమేలుగ, అందుకొనుచున్ = కైకొనుచు, సందియంబుల+సందడిన్ = సకలసందేహములయొక్క యలు కుడును, డిందన్ - చేసి = సమయునట్లొనరించి, సనందన + ఆది + వందనీయుండన్ = సనకుఁడు సనందనుఁడు సనత్కుమారుఁడు సనత్సుజా తుఁడు లోనుగాఁ గల మహాత్ములచేత మ్రొక్కఁదగినవాఁడను, ఐన + నాయందున్ = సాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తి నగు నాలోపలను, కలియున్ = ఏకీభవించును- ముక్తుఁ డగునని యర్థము.

తా. అజ్ఞానమనియెడు మచ్చ లేనిబ్రహ్మజ్ఞాని, తన యింద్రియముల నన్నిటిని నొక్కసారిగ శబ్దాదివిషయములయందుఁ బడకుండ నిరోధించి, ఆపాతరమణీయమగు హృత్పుండరీకమునకుఁ బ్రధానమగు దుంపవంటిది యగు శుద్ధచిత్స్వరూప బ్రహ్మానందరస మనియెడు సముద్రమునందు, నొక నీటిచినుకు గడలిలోఁ బడి యేకీభవించునట్లు, ప్రమాత యనఁబడు బుద్ధి

త్మాజాత్మ్యము నొందఁగా మూఢు లగువారు దన్నుఁ దిట్టినను బొగ డినను దాను శుభమునుగాని యిడుమలనుగాని బడయునప్పుడు ఖేద మోదములఁ నొందక యా శుభాశుభాదులు తనకు లాభకరములే యని యెంచుకొనుచుఁ దన కిదివఱకుఁగల సందేహములనెల్ల రూపుమాపి సనక సనందనాదులగు మహాయోగులచే నిత్యము నమస్కరింపఁబడుచుండెడు సాక్షాచ్ఛ్రీమన్నారాయణస్వరూపుఁడ నగు నాయందు నైక్యము నొందును. ౧౯౦

క. కావున నీవును బావన
   భావనచే నింద్రియముల ఁ భంజించి మనీ
   షావిల మడంచి యనిశము
   భావింపుము నన్ను విజనపదగుఁడ వగుచున్. ౧౫౧

టీ. కావునన్ = మీఁదఁ బలుకఁబడిన విధమున నారురుక్షుఁడగు సాధకుఁడు పరమాత్మైక్యరూపమగు మోక్షము నొందును గనుక, నీవునన్ = నీవుఁగూడ, పావన + భావనచేన్ = పరిశుద్ధమగు బ్రహ్మాత్మానుసంధానముచేత, ఇంద్రియములన్ = జ్ఞానేంద్రియపంచకము కర్మేంద్రియపంచకము నంతఃకరణచతుష్టయము నను పదునాలుగింద్రియములను, భంజించి= నిగ్రహించి, మనీషా + ఆవిలము = అంతఃకరణముయొక్క యజ్ఞాన మని యెడు మలినమును, అడంచి = తుడిచి, అనిశమున్ = నిరంతరమును, విజన + పదగుఁడవు = మనుజులు లేని స్థానమునం దున్నవాఁడవు, అగుచున్ = అయి, నన్నున్ = నేనను ప్రతీతికి గోచరమగు పర మాత్మను, భావింపుము = ఐక్యానుసంధానము చేయుము.

తా. పూర్వోక్తరీతిని నారురుక్షుఁడు సంతతమననముచే బ్రహ్మైక్యమును బొందునట్లు నీవుగూడఁ బరిశుద్ధమగు తలఁపుచే నింద్రియగణము లను జయించి, బుద్ధిదోషమును దూలించి, నిత్యమును "అరతి ర్జనసంసది"

అనఁటచే సంగదోషముకకు బ్రీతివినిర్జనస్థలమునం దుండి నేనను ప్రతీతికి మాత్రము విషయ మగు నాత్మస్వరూపమును దలఁచుకొనుచుండుము. ౧౫౧

వ. ఇట్లు సాధకుఁ డగు నారురుక్షుని మార్గము నుప దేశించి పరమాత్మైక్యానుసంధాన లక్షణమును వివరించు చున్నారు.

ఆ. ఆంజనేయ! సచ్చిదానందమయునిఁగా
నన్నుఁ గాంచు తెఱఁగు నే విన్నవింతు
నమలమనముచేత నవధరింపుము నీదు
సకలసంశయములు సమసిపోవు. ౧౫౨

టీ. ఆంజనేయ = ఓహనుమంతుఁడా, నన్నున్ = త్వంపద వాచ్యుఁ డగు జీవాత్మను, సత్ + చిత్ + ఆనందమయునిన్ - కాన్ = తత్పదవాచ్యమగు సత్యజ్ఞానానందస్వరూప మగు పరమాత్మునిఁగ, కాంచు + తెఱఁగున్ = పరికింపఁదగినట్టి త్రోవను, విన్నవింతున్ = బోధించెదను, అమల + మనముచేతన్ = పరిశుద్ధ మగు డెందముతో, అవధరింపుము = ఆలకింపుము, నీదు + సకల + సంశయములు = నీ కిదివఱకుఁ గల సంది యము లెల్లను, సమసిపోవున్ = రూపుమాయును.

తా. ఓమారుతీ! సోపాధికమగు జీవాత్మని నిరుపాధికమగు పర మాత్మస్వరూపునిగఁ దెలిసికొనఁదగిన యుపాయమును నీ కుపదేశించెదను. సావధానమానసుఁడ వై యాకర్ణింపుము. ఆ యుపదేశమును వినినతోడ నే నీకుం గల సందియము లెల్లఁ దీఱును. ౧౫౨

అవ. అందుఁ దొలుత సత్స్వరూపమును బ్రతిపా దించుచున్నారు.

పంచచామర వృత్తము.

అనాదికాల మాదిగా నఽనంత దేహవర్ణ గో
త్రనామరూప సౌఖ్యదుఃఖఽధర్మపాపకోటులున్
వినాశ మొందుచుండఁ బూనిఽ వీనిఁ జూచుచుందు నే
ననాది నౌట సత్స్వరూపుఁ ఽ డంద్రు నన్ను మారుతీ!

టీ. మారుతీ = ఓ కరువలిపట్టీ, అనాది + కాలము - ఆదిగాన్ = మొదలులేని కాలము దొరఁకొని, అనంత...కోటులున్ - అనంత = అపరిమితములైన, దేహ = మేనులును, వర్ణ = బ్రాహ్మణ్యము మొదలగు వర్ణములును, గోత్ర = ఆయా ఋషివంశములును, నామ = పేళ్లును, రూప = ఆకారములును, సౌఖ్య + దుఃఖ = సుఖదుఃఖములును, ధర్మ = వేదవిహిత ధర్మములును, పాప + కోటులున్ = పెక్కులగు దురితములును, వినాశము ఒందుచున్ - ఉండన్ = సమసిపోవుచు నుండఁగా, నేన్ = సద్రూపుఁడనగు నేను, అనాదిని - ఔటన్ = నాకొక మూలకారణము లేనివాఁడ నగుటచేత, వీనిన్ = శరీరములు మొదలగు వానిని, పూని - చూచుచున్ - ఉందున్ = లెస్సగాఁ బరికించుచుందును, నన్నున్ = ఇట్లు సర్వసాక్షినగు నన్ను, సత్ + స్వరూపుఁడు = కాలత్రయాబాధ్యమగుటచే నిత్యమగు స్వరూపము గలవాఁడు, అంద్రు = జ్ఞానులు వచియించెదరు.

తా. ఇది మొదలను నేర్పాటులేని కాలమునుండియు పెక్కులగు మేనులు జాతులు ఋషివంశములు నామధేయములు ఆకృతులు సుఖములు దుఃఖములు పుణ్యకర్మములు నను వీనియిక్కట్లు నశించుచునుండఁగా సర్వసాక్షినగు నేను లెస్సగ వానినెల్లఁ బరికించుచు నుందును. నాకొకమూలకారణము లేకపోవుటచేత నన్ను సత్యస్వరూపుఁ డని మహాజ్ఞానులు వచియించుచున్నారు. ౧౪౩

పంచచామరము.

ఖగంబులుం దురంగపన్నగంబులున్ వనంబులున్
మృగంబులు న్నగంబులున్ మహీధరాదికంబులున్
జగంబులున్ లయంబు నొంద సాక్షి నై సమస్తమున్
దగంగఁ జూచుచుందుదున్ సదా సదాత్మకుం డనన్.

టీ. ఖగంబులున్ = పిట్టలును, తురంగ + పన్నగంబులున్ = వారువములు పాములును, వనంబులున్ = కాననములును, మృగంబులున్ = అడవిజంతువులును, నగంబులున్ = చెట్లును, మహీధర + ఆదికంబులున్ = కొండలు మొదలగునవియు, జగంబులున్ = పెక్కేల పదునాలుగు భువనములును, లయంబున్ - ఒందన్ = వినాశము నొందుచుండఁగా, సదా + సత్ + ఆత్మకుండు - అనన్ = ఎల్లప్పుడును భూత భవిష్య ద్వర్తమాన కాలములయందు నశింపకుండునట్టి స్వరూపము గలవాఁడని మహాయోగులు చెప్పుచుండఁగా, సాక్షిని - ఐ = సాక్షాత్తుగ ద్రష్ట నగుచు, తగన్ - కన్ = తెన్నుగా, చూచుచున్ = పరికించుచు, ఉందుదున్ = ఉన్నవాఁడను.

తా. పిట్టలు అశ్వములు పాములు అరణ్యములు మెకములు చెట్లు కొండలు మొదలగునవియు వెయ్యేల సమస్తలోకములును వినశ్వరము లగుటచే నశించుచుండఁగా వీని నెల్ల నేను సాక్షాద్ద్రష్ట నగుచు సరిగఁ బరికించుచుందును. కావున నన్ను మహాయోగులు నిరంతరమును గాలత్రయాబాధ్యమగు స్వరూపము గలవానిఁగ నెన్నుదురు. ౧౫౪

అవ. ఇట్లు బాహ్యసృష్టి కెల్ల సాక్షి యగుటచేఁ బరమాత్మకు సద్రూపత్వమును స్థిరపఱుచుచున్నారు.

సీ. దేహేంద్రియప్రాణధీమనోహంకార
 చిత్తముల్ దమతమచేష్ట లుడిగి
యలఘుసుషుప్తియం దజ్ఞానమున లయ
 మొందినవేళ నే నుంటఁ జేసి
యేమియు లే దని యెఱుఁగుదు వానియ
 భావ మంతయును స్వభావమునను
గావున విను తద్భావానుభవమును
 స్మరియింతు మేల్కాన్నసమయమునను
తే. వరుసతో నిట్లు జాగరస్వప్నసుప్తు
 లనుదినం బేఁగుదెంచుచు నరుగుచుండ
నేకరూపుఁడనై వాని నెపుడుఁ గనుచు
 మనికివలనను సద్రూపుఁడను గపీంద్ర ! ౧౫౫

టీ. కపీంద్ర ! = ఓవానరోత్తముఁడా ! వినుము. ఆంతరప్రపంచ సాక్షిత్వమువలన నాకుఁ గల సత్స్వరూపత్వమును బ్రతిపాదించెద నాలకింపుము. దేహ + ఇంద్రియ + ప్రాణ + ధీ + మనస్ + అహంకార + చిత్తముల్ = మూఁడు మేనులు జ్ఞానేంద్రియ పంచకము కర్మేంద్రియ పంచకము ప్రాణవాయువు లైదును నంతఃకరణ చతుష్టయమును ననునివి యన్నియును, తమతమ చేష్టలు = తమకు నియతములయిన తనులను, ఉడిగి = మాని, అలఘు + సుషుప్తియందున్ = గాఢనిద్రయందు, అజ్ఞానమునన్ = మూలావిద్యయందు, లయము - ఒందిన + వేళన్ = అణఁగియుండుతఱిని, సద్రూపుఁడ నగుటచే నే నప్పుడు వానితోపాటుగ లయము నొందక కాఁపడియుండుటంబట్టి, స్వ + భావమునన్ = స్వీయమగు బోధస్వరూపముచేత, ఏమియున్ - లేదు - అని = పైని జెప్పఁబడిన దేదియు నపుడుండలేదని, వాని - అభావము - అంతయును = ఆ

దేహేంద్రియాదుల యొక్క లేమంట నెల్లను, ఎఱుంగుముః = తెలిసినవాఁడనగుమును, కావునః = సుషుప్తియందు నింద్రియాదుల లయరూపమగు నభావమునకు సాక్షినైయుంటిని గనుక, మేల్కాంచి - ఆసుషుప్తు లనః = ఆసుషుప్త్యవస్థనుండి మేల్కాంచిన పిమ్మట, తత్ - అభావ - అనుభవమునః = సుషుప్త్యవస్థయందు - నజ్ఞానములో నాయింద్రియాదులెల్ల నడఁగియుండుటను నే నెఱింగి యుంటుటను, స్మరియింతున్ = జ్ఞప్తికిఁ దెచ్చుకొందును. వరుసతోన్ = ఓలిని, ఇట్లు = ఈరీతిన, జాగర - స్వప్న - సుప్తులు = జాగ్రదవస్థయు స్వప్నావస్థయు సుషుప్త్యవస్థయును నను నవస్థాత్రయమును, అనుదినంబుః = ప్రతిదినమునందును, ఏఁగుదెంచుచుః = అరుగుదెంచుచు, అరుగుముః ఉండఁగ = గతించుచు నుండఁగా, ఏకరూపుఁడను - ఐ = ఆయవస్థలయొక్క రాకపోకడలసంబంధము లేక యొకతీరున వానికన్నిటికిని సాక్షి నగుచు నున్నవాఁడనై, వానిః = ఆమూఁడవస్థలను, ఎపుడుః = ఎల్లప్పుడును, కనుచుః = పరికించుచు, ఉనికివలనః = ఉన్నవాఁడ నగుటచేత, సత్ - రూపుఁడః = సత్యస్వరూపుఁడను (ఐ యుంటిని).

తా. సుషుప్త్యవస్థయందు మేను నింద్రియగణము నంతఃకరణచతుష్టయము పంచప్రాణములును తమతమ వ్యాపారముల నన్నిటిని విడిచి యజ్ఞానమునందు విలయము నొందియున్నప్పుడు నిత్యమగు నాత్మ మాత్రము వానితోపాటుగ విలయము నొందక యుండుటనుగాన నా యాత్మకు నింద్రియాదులయొక్క విలయరూపమగు నభావము గోచరమయి యుండును. కనుక నే గాఢనిద్రనుండి లేచిన తరువాత నాత్మ నాయింద్రియాదులయొక్క యభావమును దా నప్పు డనుభవించి యుండుటచే నది స్మరణకువచ్చును. ఇట్లు ప్రతిదినమునందును జాగ్రదవస్థ స్వప్నావస్థ సుషుప్త్యవస్థయునను నీ మూఁడును వచ్చుచుఁ బోవుచు నున్నను ఆత్మమాత్రము నొకతీరుగ నే

యుండి యా యవస్థాత్రయమునకు సాక్షియై యుండుటవలన సత్యస్వరూప మగును. ౧౫౫

అవ. జాగ్రదాద్యవస్థలలో నొక్కదానియందే మూఁడవస్థలును గలుగ వానికి నాత్మ సాక్షి యగుచున్న దని చెప్పుచున్నారు.

ఆ-వె. జాగరంబునందు స్వప్నసుషుప్తులు
స్వప్నమున సుషుప్తిజాగరములు
సమసుషుప్తియందు స్వప్నజాగరములు
గలుగ నేను వీనిఁ గాంతు నెపుడు. ౧౫౬

టీ. జాగరంబునందున్ = "ఇంద్రియై రర్థోపలబ్ధి ర్జాగరితం" అను లక్షణము గల జాగరణావస్థయందు, స్వప్నసుషుప్తులు = కలయు గాఢనిద్రయును, స్వప్నమునన్ = "జాగరిత సంస్కారజన్యః ప్రత్యయః స్వప్నః" అను లక్షణము గల స్వప్నావస్థయందు, సుషుప్తి - జాగరములు = సుషుప్త్యవస్థయు జాగ్రదవస్థయును, సమ సుషుప్తియందున్ = సరియగు సుషుప్త్యవస్థయందు, స్వప్న - జాగరములు = స్వప్నావస్థయు జాగ్రదవస్థయును, కలుగన్ = సంభవింపఁగా, వీనిన్ = ఇట్టి మార్పులు గల యవస్థాభేదములను, నేను = సర్వసాక్షి నగు నేను, ఎపుడున్ = నిత్యమును, కాంతున్ = వీక్షించుచుందును.

తా. రజ్జువునందు సర్పము, స్థాణువునందు పురుషుఁడు, ముత్తెపుఁజిప్పయందు వెండియు నను మొదలగు భ్రమయే జాగ్రత్తునందలి స్వప్నమనఁబడును. ఏదే నొకయర్థము నెంతవిశదముగ బోధించినను గొందఱకుఁ దెలియఁబడ కుండుటయే జాగ్రత్తునందలి సుషుప్తి యనఁబడును. లేదా, కడు మిక్కుటము లగు భయ దుఃఖాపదలు సంభవించునప్పుడు మతి పోయి యించుకసేపు నిశ్చేష్టత్వమున నుండుటయు జాగ్రత్సు

షుప్తి యనవచ్చును- అనుభూతపదార్థములు వెంటనే మరలఁ గనఁబడకపోవుటతప్ప స్వప్నమునకు జాగ్రత్తునకు భేదము లేదు గాన స్వప్నమునందుఁ గూడను స్వప్నసుషుప్తిని స్వప్న జాగరితమును జాగత్తునందుఁబోలె తెలియునది. సుషుప్తి జాగ్రత్స్వప్నములకుఁ గారణావస్థ గాన సుషుప్తియందు లీనములగు మనోవృత్తులు సుషుప్తినుండియే మరలఁ బొడముచుగాన సుషుప్తియందు స్వప్నజాగరణములు గలిగియుండుట యుక్తమే యగును, గాన, నిట్టి యవస్థాభేదములకుఁ గూడ నేను సాక్షినై యుండుటచేత నాత్ముఁడు సత్స్వరూపుఁ డన నొప్పుచున్నాఁడు. ఈ యర్థమునే శ్రీరామచంద్రునకుఁ దొల్లి వసిష్ఠమహర్షి భంగ్యంతరమున నుపదేశించెను. ఎట్లనిన "బీజజాగ్ర త్తథా జాగ్ర న్మహాజాగ్ర త్తథైవచ, జాగ్రత్స్వప్న స్తథా స్వప్న స్స్వప్నజాగ్రత్సుషుప్తకమ్॥ ఇతి సప్తవిధో మోహః పునరేవ పరస్పరమ్। శ్లిష్టో భవత్యనేకాఖ్యః శృణుత్వస్య చ లక్షణమ్। ప్రథమం చేతనం యత్స్యా దనాఖ్యం నిర్మలంచితః। భవిష్యచ్చిత్తిజీవాదినామశబ్దార్థభాజనమ్। బీజరూపం స్థితం జాగ్రద్బీజజాగ్ర త్తదుచ్యతే। ఏషాజ్ఞప్తేర్నవావస్థాత్వం జాగ్రత్సంస్థితం శృణు। నవప్రసూతస్య పరాదయంచాహ మిదం మమ। ఇతి యః ప్రత్యయ స్స్వచ్ఛస్త జ్జాగ్రత్ప్రాగభావనాత్। అయంసోఽహమిదం తన్మ ఇతి జన్మాంతరోదితః। పీవరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్ర దితిస్ఫురన్। అరూఢ మథవారూఢం సర్వథా తన్మయాత్మకమ్। యజ్జాగ్రతో మనోరాజ్యం జాగ్రత్స్వప్న స్స ఉచ్యతే। ద్విచంద్రశుక్తికారూప్య మృగతృష్ణాదిభేదతః। అభ్యాసం జాగ్రతః ప్రాప్య స్స్వప్నోఽనేకవిధో భవేత్। అల్పకాలం మయాదృష్ట మేతన్నోవేతి యత్రహి। పరామర్శః ప్రబుద్ధస్య స స్వప్నఇతి కథ్యతే। చిరసందర్శనాభావా దప్రఫుల్ల బృహద్వపుః। చిరకాలానువృత్తశ్చ స్వప్నోజాగ్ర దివోదితః। స్వప్న జాగ్ర దితిప్రోక్తో జాగ్రత్యపి పరిస్ఫురన్। షడవస్థాపరిత్యాగే జడజీవస్య యా స్థితిః। భవిష్య ద్దుఃఖబోధాఢ్యా

సాఽపుష్టిః సోచ్యతే గతిః । జగత్త్రస్యామవస్థాయాం మగ్నే తమసి లీయతే ।
స్వపాన్నవస్థా ఇతి ప్రోక్తా మయా జ్ఞానస్య రాఘవ। ఏకైకా శతసంఖ్యాత్ర
నానావిభవరూపిణీ'' అని యుద్దేశించి "ఇమాం సప్తపదాం జ్ఞానభూమి
మాకర్ణయానఘ । నానయా జ్ఞాతయా భూయో మోహపంకే నిమజ్జతి''
అను మొదలుగ జ్ఞానభూమికల స్వరూపములను విపులముగ వివరించెను.
పైని జెప్పినవాక్యముల యర్థమును గ్రంథపల్లవితసాధ్వసమున వివరింప
లేదు. బుద్ధిమంతులు గ్రహింపవచ్చును—లేదా, నాచే తెలిఁగింపఁబడిన
మహారామాయణమును జూచునది.

అవ. మఱియు నాత్మకుం గల సత్యత్వము సవిశేష
ముగఁ దెలుపుచున్నారు.

సీ. భువి నవస్థాత్రయంబున నేకరూపత
నొకదివసంబునం దున్నయట్లు
విను మతీతాగామిదినవారపక్షమా
సాబ్దయుగప్రకల్పాంతములను
నొక్కచందంబున నుండుదుఁ గావున
సద్రూపుఁడను వినిశ్చయము నమ్ము
అది గాక బాధయోగ్యము లైనదేహేంద్రి
యప్రాణధీమనోహంకృతులును

తే. నేను గానని భావింప నిఖిలదృశ్య
చయనిషేధావధీభూతసర్వబాధ
వర్జితాశేషసాక్షి నై వఱలు చునికి
వలన సత్యస్వరూపుఁడ నలఘుచరిత. ౧౨౭

**టీ. అలఘు + చరిత = ఘనమైన నడవడిక గలవాఁడా, వినుము = ఆలింపుము, భువిన్ = పుడమియందు, అవస్థా + త్రయంబునన్ = జాగ**

రణము (మెలఁకువ) కల సుషుప్తియు నను మూఁడవస్థలయందును, సాక్షిత్వ మనియెడు నొక స్వరూపముతో, ఒక దివసంబునందుఁ = ఒక రోజునందు, ఉన్నయట్లు = ఉండెడు తీరున, అతీత...సు—అతీత = అతిక్రమించినట్టియు, ఆగామి = ముందు రాఁబోవునట్టియు, దిన = దివసములు, వార = ఆదిత్యవారము మొదలగు వారములు, పక్ష = శుక్లకృష్ణ పక్షములు, మాస = చైత్రాదిమాసములు, అబ్ద = ప్రభవాదిసంవత్సరములు, యుగ = కృతాదియుగములు, ప్రకల్పాంతములను = మహాప్రళయములు అను మొదలగు కాలవిశేషములయందు, ఒక్కచందంబునన్ = సాక్షిత్వ రూప మగు నొక్కతీరున, ఉండుదున్ = నివసింతును; కావునన్ = అట్లుండుటచేత, సత్+రూపుఁడన్ = నిత్యమగు స్వరూపము గలవాఁడను (ఐతిని), అదిగాక = అంతియకాక, బాధ + యోగ్యములు = వినాశనమునకుఁ దగినవి; ఐన = ఐనట్టి, దేహ + ఇంద్రియ + ప్రాణ + ధీ + మనస్ + అహంకృతులును = మూఁడుమేనులు ఇంద్రియగణము ప్రాణాదివాయుపంచకము - బుద్ధి - మనస్సు - అహంకారము నను కోశ పంచకమును, నేను కాను - అని - భావింపన్ = నేనై (ఆత్మనై) యుండలేదని తలఁపఁగా, నిఖిల...సాక్షిని - నిఖిల = పలువిధము లైన, దృశ్య + చయ = పరిదృశ్యమాన పదార్థజాతముయొక్క, నిషేధ = నిరసనమునకు, అవధీభూత = హద్దయియున్నట్టియు, సర్వ + బాధ + వర్జిత = సమస్త బాధలచేతను విడువఁబడినట్టియు, అశేషసాక్షిని = సర్వమునకు ద్రష్టను, ఐ - వఱలుచున్ - ఉనికివలనన్ = అగుచు నొప్పుచుండుట వలన, సత్య + స్వరూపుఁడన్ = నిత్యమగు స్వరూపము గలవాఁడను (ఐతిని), వినిశ్చయము సుమ్ము = ఇది నిక్కము సుమీ.

తా. పైని జెప్పఁబడిన తీరున జాగ్రదాదు లగు నవస్థావిశేషముల యందు నాత్మసాక్షిత్వ మనియెడు నొక్క స్వరూపముతో నొక రోజున నున్న విధమునఁ గడచినట్టియు రాఁబోవునట్టియు దివసములు వారములు

పక్షములు నెలలు సంవత్సరములు యుగములు మహాప్రళయములు నను కాలభేదములయందుఁగూడ నట్లు సర్వసాక్షియై యేకస్వరూపముతో నుందును. మఱియును వినాశమే ధర్మముగఁ గల మేను నింద్రియములు పంచ వాయువులు మనోబుద్ధ్యహంకారములు మొదలగునవియెల్ల నాత్మ గావు అని తలంచుచు సాక్షి యగు నాత్మకు గోచరములగు సమస్తప్రపంచాంత ర్గతపదార్థముల నెల్ల నివి యాత్మ గానేరవని నిషేధింపఁగాఁ దుదకుఁ గొఱ వడినట్టియు నెట్టి బాధలకును బాత్రముకానట్టియు సర్వసాక్షియు నైన యాత్మ ప్రకాశించుచుండుటంజేసి నిత్యమగు స్వరూపము గలది యగును. ఈ యర్థమే వేదాంత పంచదశియందు నిట్లు ప్రతిపాదింపఁబడినది. "శబ్ద స్పర్శాదయో వేద్యా వైచిత్ర్యా జ్జాగరే పృథక్ । తతో విభక్తా తత్సం విదైకరూప్యాన్నభిద్యతే। తథాస్వప్నేఽత్రవేద్యంతు నస్థిరంజాగరేస్థిరమ్। తద్భేదోఽతస్తయో స్సంవిదేకరూపానభిద్యతే । సుప్తోత్థితస్య సౌషుప్త తమో బోధో భవేత్ స్మృతిః । సాచావబుద్ధ విషయాఽవబుద్ధం తత్తదా తతః । సబోధోవిషయాద్భిన్నో నబోధా త్స్వప్నబోధవత్ । ఏవం స్థాన త్రయేప్యేకా సంవిత్తద్వద్దినాంతరే । మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యే ష్వనేకధా । నోదేతి నాస్తమేత్యేకా సంవిదేషా స్వయంప్రభా । ఇయ మాత్మా పరానందః పరప్రేమా స్పదం యతః । మానభూవంహి భూయాస మితిప్రేమాత్మ వీక్ష్యతే। తత్ప్రేమాత్మార్థమన్యత్ర నైవ మన్యార్థ మాత్మని। అతస్తత్పరమం తేన పరమానందతాత్మనః । ఇత్థం సచ్చి త్పరానంద ఆత్మా యుక్త్యా తథావిధమ్। పరబ్రహ్మతయోశ్చైక్యం శ్రుత్యంతేషూపదిశ్యతే." అని అనఁగా "ఇంద్రియై రర్థోపలబ్ధి ర్జాగరితం" చక్షురాదీంద్రియములచే రూపము లోనగుపదార్థములను దెలిసికొనుట జాగ్రత్తు అగునను లక్షణము గల యవస్థావిశేషమునందు సంవిత్తునకు (జ్ఞానమునకు గోచరములగు శబ్దము స్పర్శము మొదలగునవి యాకసము మొదలగువానిగుణము లని ప్రసిద్ధికెక్కిన విషయములును, వీనికి నాధారభూతము లైన యాకసము మొదలగునవి

యును, గోవులు గుఱ్ఱములు మొదలగునవియుం బోలి యొండొంటికి విలక్షణము లగుటంజేసి వేర్వేఱ భిన్నములై యున్నవి. ఈ దృశ్యపదార్థముల నుండి బుద్ధిచే వేఱుచేయఁబడిన యా పదార్థముల సంవిత్తు (జ్ఞానము) జ్ఞానము జ్ఞానము అని యొక్కరూపుతో భాసిలుచుండుటవలన నాకసముం బోలె భిన్నము కాదు. శబ్దాదులగు నుపాధులను దాఁకకుండునపుడు స్వతస్సిద్ధముగ జ్ఞానము భేదముగలదిగా నుండక మిన్నువలెనే యేకరూపముగ నుండును గాన, శబ్దాదివిషయములకే భేదముగాని యా విషయముల సంబంధ మగు జ్ఞానమునకు స్వగతభేదము లేదని ఫలితము. ఇట్లు స్వప్నావస్థయందును విషయములకే భేదముగాని, వానియొక్క జ్ఞానమునకు భేదము లేదు. కలయందుఁ గన్పట్టెడు పదార్థజాతము ప్రతీతిమాత్రము (ప్రాతిభాసికము) అగుటచే నిలుకడఁ గలదిగాదు. జాగ్రదవస్థయం దన్ననో పరిదృశ్యమానమగు పదార్థజాతము మఱియొకప్పుడు చూడఁదగి యుండుటచే నిలుకడ గలదియగును గాన, నీభేదమునుబట్టి కల యని మెలఁకువ యని వ్యవహారము. ఇట్లు స్వప్నజాగరములకు వ్యావహారికభేద మున్నను వీనియందలి జ్ఞానముమాత్ర మేకరూప మగుటంజేసి భిన్నము కాదు. ఇఁకను గాఢనిద్ర నుండి లేచినవానికి నా సుషుప్తి సమయమునందలి యజ్ఞానముయొక్క 'నే నప్పు డేమియుం దెలియకుంటి' ననుజ్ఞానము ఎద్ది గలదో యది స్మృతియే యగునుగాని యనుభవము గాదు. ఆ స్మరణము అనుభవింపఁబడినవిషయము గలదియై యుండును. 'యా స్మృతి స్సానుభవపూర్వికా' అను వ్యాప్తినిబట్టి ముం దేదే నొక విషయము ననుభవింపకగాని, స్మృతి గలుగదుగాన, నా సుషుప్తిసమయమునందు జ్ఞానమునకు నజ్ఞానముమాత్రము గోచరమయి యుండును. సుషుప్తిసమయమునందలి యా యజ్ఞానానుభవము తనకు నప్పుడు గోచరమయిన యజ్ఞానమునకంటె వేఱయది గాని కలలోని తెలివివలె జ్ఞానముకంటె వేఱయది కాదు.

ఇట్లొకదినమునందు జరిగెడు జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁడవస్థలయందును సంవిత్తు (జ్ఞానము) ఒకటియే యగునట్లు తక్కిన దినముల యందుఁగూడ నొకటియే యగును. ఇట్లే యింకను గడచినట్టియు రాఁగలట్టియు నెలలు సంవత్సరములు యుగములు కల్పములు మొదలగు కాలమానములయందు జ్ఞానమునకు భేదము లేదు. దీనికి నుదయాస్తమయములు లేవు. ఇది తనకుఁదా వెలుఁగొందుచున్నది. ఈ సంవిత్తే యాత్మ యనఁబడుచున్నది. ఆత్మ సర్వాధికమగు ప్రేమకు నునికిపట్టైయుండుటంజేసి నిరతిశయ సుఖస్వరూప మైనది. ఓయి, చీ! నన్నుఁ గాల్పనా యని యొకప్పు డాత్మవిషయ మయి ద్వేషము దోఁపట్టుచున్నది గదా. ఆత్మ పరమప్రేమాస్పద మెట్లగునని నా ద్వేషము దుఃఖాద్యనిష్టసంబంధ మైనది కాని, యాత్మవిషయకము గాదు. ఆత్మయందలి ప్రేమ యనుభవసిద్ధమైయున్నది. ఎట్లనిన నే నెన్నఁడును లేకుందునన్నమాట లేక, నిత్యముగ నుందుఁగాక (నాకు నభావము లేకయుండికియే సతతముగ నుండవలయు) అని తనయందు (ఆత్మయందు) ప్రేమ యెల్లరకుం దోఁపట్టుచున్నది. తనకంటె వేఱుగ నున్న ఆలుబిడ్డలు మొదలగువారిం గూర్చి యేకూర్మి కలదో యది తన (ఆత్మ) సంబంధమునుబట్టియే గలిగినది గాని, స్వభావసిద్ధము గాదు. మఱియు నిట్లు తనయందలి ప్రేమ పెఱులవిషయమయి కాదు. తన నిమిత్తమే యగును. ఆత్మ వేఱొకదానికి శేషభూతమయినది కాదు. కాన, తద్విషయకమగు ప్రేమ నిరతిశయ మయినది. ఇట్లాత్మ నిరతిశయమగు కూర్మికి నునికిపట్టగుట వలన సమధికానందస్వరూప మయిన దని సిద్ధము. ఇట్లనుభవమునుబట్టి యాత్మ సత్యస్వరూపమును శుద్ధచిద్రూపమును నఖండానందస్వరూపము నయి యున్నది. పరబ్రహ్మముగూడ నుపనిషత్తులయందు సచ్చిదానంద స్వరూప మని ప్రతిపాదింపఁబడె "తత్త్వమసి శ్వేతకేతో అయమాత్మా బ్రహ్మ అహం బ్రహ్మాస్మి" అను మొదలగు మహావాక్యములచేత జీవాత్మ పరమాత్మలకు నఖండైకరసత్వము స్పష్టముగ నుపదేశింపఁబడినది.

అవ. "నిఖిలదృశ్యచయ నిషేధావధీభూత సర్వబాధావర్జితాశేషసాక్షి" నని సామాన్యముగఁ జెప్పఁబడిన యర్థమునే విశేషాకారముగఁ బ్రతిపాదించుచు, నాత్మ సత్యస్వరూప మని స్థిరపఱచి యుపదేశించుచున్నారు.

వ. మఱియు లఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు నిమేషంబు; అట్టి నిమేషంబులు పదునెనిమిది యైనఁ గాష్ఠ; అవి ముప్పదియైనం గళ; అవి యన్నియైనఁ గ్షణంబు; అవి పండ్రెండు ముహూర్తంబు; అమ్ముహూర్తంబులు ముప్పదియైన నహోరాత్రంబులు గడచు; నయ్యహోరాత్రంబులందు, శరీరేంద్రియప్రాణాంతఃకరణంబులు స్వస్వవ్యాపారంబులం జాలించి, తమకుఁ గారణంబైన సుషుప్తిరూపావిద్యాంధకారంబునందు లయంబు నొందు; నప్పుడు జాగ్రత్స్వప్నాత్మకం బగు నఖిలప్రపంచంబు వాసనారూపమాత్రంబై పల్లవ పత్ర పుష్ప శలాటు ఫల మూల శాఖోపశాఖాత్మకం బయిన వటంబు, తదీయబీజంబునందు నానావిధవర్ణరక్తం బయిన మయూరంబు; తదీయాండాంతర్జలంబునందు నున్నచందంబున నుండు; నిది నిత్యప్రళయం బన నొప్పు; నయ్యహోరాత్రపంచదశకంబు పక్షం బయ్యె; శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు మాసంబు; ఇది పితృదేవతల కొక్కదినం బగు; నమ్మాసద్వయంబు ఋతువు; ఋతుత్రయం బయనంబు; దక్షిణోత్తర సంజ్ఞకాయనద్వయంబు హాయనంబు; అది వేల్పుల కొక్కదినం బగు; తద్దివస వార పక్ష మాస క్రమంబుచేత ద్వాదశసహస్ర వత్సరంబు లైన కృత త్రేతా ద్వాపర కలియుగంబులు

నాలుగుం జను; నయ్యుగచతుష్టయంబును మహాయుగం బని చెప్పుదురు. అవి డెబ్బదియొక్కటి యైన మన్వంతరంబు చెల్లు; నమ్మన్వంతరంబులు పదునాలుగు చనిన నలువ కొక్క పగ లగు; నది చతుర్యుగసహస్రపరిమితంబు; ఆ పగటిలోఁ జతుర్దశమనుప్రళయంబులు ననేకయుగాంతప్రళయంబులు ప్రవర్తించు;నవియు నైమిత్తికప్రళయంబులు నవాంతరప్రళయంబులు ననం బ్రసిద్ధంబులగు; నం దనంతభూతజాలంబులు నశించు; నయ్యహరవసానంబున ద్రుహిణుండు నిద్రించు; నతనినిద్ర యవ్యక్తం బనందగు; నందు బ్రహ్మాండంబునంగల సర్వప్రాణికోటివ్యవహారం బుపరతం బగు; నత్తఱి మహాభూతంబులుమాత్రంబు శేషించు; నది దైనందినప్రళయం బన విలసిల్లు; నయ్యజున కహఃపరిమాణం బంతియ రేయి యగు; నట్టి దినసంఖ్యాక్రమంబుచేత శతాబ్దంబులు చనిన శతానందుండు నాశంబు నొందు; నయ్యెడ మృత్యుదేవత సమస్తజీవుల నొక్కపెట్టునం బరిమార్చు; రుద్రుండు చిచ్చుకన్ను దెఱచిచూచు; నాదిత్యుండు పంద్రెండుమూర్తులు గైకొని ప్రకాశించునవ్వేళఁ బ్రజ్వలజ్జ్వాలాభీలం బగుమహానలంబు జనియించి విశ్వవిశ్వంబు భస్మీభూతంబుగాఁ జేయు; సప్తమారుతంబు లొక్కపెట్ట విసరు. నవమేఘంబు లుప్పతిల్లి యమోఘంబులై నూఱు దివ్యవర్షంబులు మహావర్షంబు వర్షించు; నందువలన సమస్త సముద్రంబులుం గలిసి యేకార్ణవంబై మహామహీమండలంబు నాక్రమించు; నంతట ధరణీచక్రం బమ్మహాసలిలమధ్యంబున మహోద

కంబుల స్వల్పలోష్టపిండంబు విధంబున విరిసెడుఁ, దప్త యఃపిండం బొకతోయకణంబుం బీల్చినక్రైవడి బడబాగ్ని విజృంభించి యమ్మహాంభోరాశిం బానంబుసేయు; దీపంబును గాలి యార్పినభంగి నమ్మహాతేజోమండలంబును మహావాయువు దెగటార్చు; నమ్మహాఝంఝూసమీరంబు నిరాధేయం బగుటంజేసి యంతరిక్షంబునఁ గలయం దిరిగి యందు సుషుప్తియందుఁ బ్రాణులపోలిక గ్రుగ్గు; శబ్దరూపం బయిన నింగి, శ్రోత్రరూపం బయినసంకల్పంబు మ్రింగిన తెఱంగున నయ్యాకాశంబు మహామనంబు గ్రసించుఁ; బంచతన్మాత్రసహితం బైన యమ్మహామానసంబు నిద్రాసమయంబు గబళించుచాడ్పున నహంకారంబు గబళించు; నయ్యహంకృతి మహాబుద్ధి మెసంగు; నమ్మహాబుద్ధియే మహత్తత్త్వం బని చెప్పనొప్పు; నమ్మహత్తత్త్వంబు నవ్యక్తంబు తనయందు విలీనంబు గావించి యడంచుకొను; నది మాయాఽవిద్యాఽవ్యక్త తమస్సుషుప్తిప్రకృత్యానందాదిశబ్దవాచ్యం బయిన ప్రధానంబు; అదియే బ్రహ్మప్రళయం బగు; నయ్యనాద్యనిర్వచనీయాజ్ఞానంబు సద్గురూక్తజీవేశ్వరైక్యజ్ఞానానుభవ సమయంబున నభావం బగు; నదియే మహాప్రళయం బగు; నిట్టి నిత్య నైమిత్తిక ద్వైనందిన కల్పాంతమహాప్రళయంబులయం దే నొక్కటిచేత బాధింపఁబడక సాక్షి నై, వాని నన్నిటింజూచుచు భూతభవిష్యద్వర్తమానకాలంబులయం దేకరూపంబుగా నుండుటంజేసి సద్రూపకుండ నగుదు నని యుపదేశించి వెండియు నిట్లనియె. ౧౫౮

టీ. మఱియుఁ = ఇంతియు కాక, లఘు - అక్షర - ఉచ్చారణ మాత్ర - కాలంబు = "ఏకమాత్రో భవే ద్ధ్రస్వః" అనుటచేత లేఁత తామరకు సన్నపాటి సూదిమొనతోఁ దెగునంతటి పరమసూక్ష్మకాలము మాత్ర యనఁబడును. అట్టి మాత్రకాలములో నుచ్చరింపఁబడు వర్ణమునకు హ్రస్వ మని పేరు. ఇదియే లఘువర్ణము. ఇట్టి యక్కరము నుచ్చరించునంతటికాలము నిమేష మనఁబడు - ననఁగాఁ గనురెప్ప పడునంతటి కాలమునకు నిమిష మని పేరు. అట్టి నిమేషంబులు = ఆ నిముసములు, పదునెనిమిది ఐనన్ = పదియు నెనిమిదియు జరుగఁగా, కాష్ఠ = ఒక కాష్ఠ యనఁబడును; అవి = అట్టి కాష్ఠలు, ముప్పది - ఐనన్ = మూఁడుపదులు కాఁగా, కళ = ఒక కళ యనఁబడును; అవి=అట్టికళలు, అన్ని ఐనన్= మూఁడుపదులు జరుగఁగా, క్షణంబు = ఒకక్షణ మగును; అవి = అట్టి క్షణములు, పండ్రెండు = పదియును రెండయ్యెనేని, ముహూర్తంబు = ఒక ముహూర్త మనఁబడును; ఆ ముహూర్తంబులు = రెండుగడియల కాల పరిమితి గల యట్టి ముహూర్తములు, ముప్పది ఐనన్ = మూఁడుపదులు జరుగఁగా, అహోరాత్రంబులు గడచున్ = రేయుంబవ ళ్లగును; ఆ - అహోరాత్రంబులందున్ = దివారాత్రాత్మక మగు నాదిపసముసంను, శరీర - ఇంద్రియ - ప్రాణ - అంతఃకరణంబులు = స్థూలదేహమును, జ్ఞాన కర్మేంద్రియములును, ప్రాణాది వాయువు లైదును, మనోబుద్ధ్యహంకార ములును, స్వ - స్వ - వ్యాపారంబులన్ = తమ తమ చేష్టితములను (పనులను), చాలించి = మాని, తమకున్ = మేను మొదలగు వానికి, కారణంబు - ఐన = మూల మగు, సుషుప్తిరూప - అవిద్యా అంధకారంబునన్ = గాఢనిద్రాత్మక మయిన మూలాజ్ఞాన మనియెడు కటిక చీఁకటి యందు, లయంబున్ - ఒందున్ = అడఁగియుండునవి యగును; అప్పుడు= అట్లు విలీనము లగు తటిని, జాగ్రత్ - స్వప్న- ఆత్మకంబు - అగు=జాగ్రదవస్థామయమును స్వప్నావస్థా మయము నైన, అఖిల - ప్రపంచంబు =

సమస్తలోక వ్యవహారమును, వాసనా - రూప - మాత్రంబు - ఐ = సంస్కారము మాత్రమునకు స్వరూపము గలదియై, పల్లవ...వటంబు—పల్లవ = చిగుళ్లును, పత్ర = పర్ణములు, పుష్ప = అలరులు, శలాటు = కసుగాయలు, ఫల = పండ్లు, మూల = వేళ్లు, శాఖ = పెద్దకొమ్మలు, ఉపశాఖ= చిన్నకొమ్మలు, ఆత్మకంబు = ఆకారముగఁ గలది, ఐన + వటంబు = అగు మఱ్ఱిచెట్టు, తదీయ +బీజంబునందున్ = ఆ మఱ్ఱివిత్తనమునందును; నానావిధ + వర్ణ + రక్తంబు - ఐన + మయూరంబు = పెక్కువిధములు గల రంగులతోఁ గూడిన నెమ్మి, తదీయ + అండ + అంతర్జలంబునందున్ = ఆ నెమిలియొక్క గ్రుడ్డులోని రసమునందు, ఉన్న + చందంబునన్ = ఉండిన తీరున, ఉండున్ = మూలాజ్ఞానములో నడఁగి యవ్యక్తమై యుండును; ఇది = సుషుప్తియందలి గాఢతమస్సులో నట్లు ప్రపంచ వ్యవహార మడఁగియుండుట, నిత్యప్రళయంబు = ప్రతిదినమును జరుగునది గాన నిత్యప్రళయము, అనన్ - ఒప్పున్ =అని పలుకఁబడుచున్నది; ఆ+ అహస్+రాత్ర + పంచదశకంబు = పూర్వోక్తములైన దివససంజ్ఞ గల రేయుంబవళ్లయొక్క పదునైదు, పక్షంబు-అయ్యెన్ =ఒకపక్ష మనఁబడును; శుక్ల-కృష్ణ - ఆఖ్య -పక్ష - ద్వయంబు = శుక్లపక్షమనియుఁ గృష్ణపక్షమనియుం బేళ్లు గల రెండు పక్షములు, మాసంబు=ఒక నెల యగును; ఇది= ఈ నెల, పితృదేవతలకున్=పితరులగు వేల్పులకు, ఒక్క-దినంబు-అగున్= ఒకరోజు అగును; ఆ - మాస-ద్వయంబు=మీఁదఁ జెప్పఁబడిన కాలపరిమితి గల నెలలు రెండు, ఋతువు=ఒక ఋతు వనఁబడును; ఋతు -త్రయంబు= ఇట్టి ఋతువులయొక్క మూఁడు, అయనంబు=అయన మనఁబడును, దక్షిణ -ఉత్తర - సంజ్ఞక - అయనద్వయంబు=దక్షిణాయనము ఉత్తరాయణము అను పేళ్లు గల యయనములజంట, హాయనంబు = ఒకయేఁ డనఁబడును; అది = అట్టియేఁడు, వేల్పులకున్ = అమరులకు, ఒక్క - దినంబు - అగున్ = ఒకరో జగును; తత్-దివస - వార - పక్ష - మాస - క్రమం

బు చేతన్ = దేవమానమునుబట్టి పూర్వోక్తపరిమితి గల యహోరాత్రాత్మకములగు రోజులయు, నాదిత్యాదివారములయు, శుక్లకృష్ణపక్షములయు నెలలయుఁ బరిమితివలన, ద్వాదశ - సహస్ర - వత్సరంబులు ఐ = ఈ రాఱువేల సంవత్సరములు జరుగఁగా, కృత - త్రేతా - ద్వాపర - కలి - యుగంబులు = కృతయుగము త్రేతాయుగము ద్వాపరయుగము కలియుగము ననఁబడు యుగములు, నాలుగున్ = నాల్గును, చనున్ = నడచును, ఆయుగ - చతుష్టయంబును = అట్టియుగముల నాల్గిటిని, మహాయుగంబు - అని - చెప్పుదురు = ఒకమహాయుగ మని పిలుతురు; అవి = అట్టి మహాయుగములు, డెబ్బదియొకటి ఐనన్ = ఏడుపదుఁ బై నొకటియుఁ గాఁగా, మన్వంతరంబు - చెల్లున్ = ఒక మన్వంతరము జరుగును; ఆ మన్వంతరంబులు = అట్టి మన్వంతరములు, పదునాల్గు - చనినన్ = ఒక పదియును నాలుగును కాఁగా, నలువకున్ = చతురాననునకు, ఒక్క - పగలు - అగున్ = ఒకదివస మగును; అది = ఆపగలు, చతుర్ - యుగ-సహస్ర - పరిమితంబు = పూర్వోక్తము లగు నాలుగు యుగములయొక్క రొుక వేయి పరిమితిగఁ గలది. ఆ పగటిలోన్=నలువయొక్క యాదివసమునందు, చతుర్దశ + మను + ప్రళయంబులు = పదునలువురగు స్వాయంభువుఁడు మొదలగు మనువులయొక్క విలయములు, అనేక + యుగ + అంతర + ప్రళయంబులును = లెక్కలేని యుగములయొక్క నడిపట్టులయందు జరిగెడు విలయములును, ప్రవర్తించున్ = సంభవించును; అవి = అట్టి ప్రళయములు, నైమిత్తిక + ప్రళయంబులు = ఒక్కొక్క మనువు గతించుట యను నిమిత్తమునుబట్టి జరుగుటంజేసి నైమిత్తికప్రళయము లనియు, అవాంతర + ప్రళయములు = ఆయా యుగములయొక్క యంతరములయందు (సంధులయందు) జరుగునవి గాన, అవాంతర ప్రళయము లనియు, ప్రసిద్ధంబులు - అగున్ = క్రమముగఁ బ్రఖ్యాతము లైనవి; అనఁగా మనుప్రళయములకు నైమిత్తికము లనియు, యుగాంతరప్రళయ

ములకు నవాంతరప్రళయము లనియుం బ్రసిద్ధి కలదనుట; అందున్ = అట్టి ప్రళయముల రెంటియందును, అనంత + భూత + జాతములు = పెక్కులగు జంతువులయొక్క సమూహములు, నశించున్ = సమయును; ఆ + అహస్ + అవసానంబునన్ = అట్టి పగటి కడపటను, ద్రుహిణుండు = నలువ, నిద్రించున్ = పరుండును; అతని+నిద్ర = ఆ నలువయొక్క నిదుర, అవ్యక్తంబు-అనన్-తగున్ = సమస్తజీవకోటులును తమతమ కర్మవాసనలతోఁగూడి మూలాజ్ఞానమునం దుండునప్పుడు విలీనములై వ్యక్తములు గాక యుండునుగాన నవ్యక్తావస్థ యన నొప్పును; అందున్ = అట్టి యవ్యక్తదశయందు, బ్రహ్మాండంబునం గల = బ్రహ్మాండములో నంతట నున్న, సర్వ + ప్రాణికోటి + వ్యవహారంబులు = సమస్త జీవకోటుల యొక్క వ్యాపారములు, ఉపరతంబులు - అగున్ = విరమింపఁబడినవి యగును, ఆ + తఱిన్ = అట్టికాలమునందు, మహాభూతంబులు మాత్రంబు = పుడమి మొదలగు నైదుభూతములు మాత్రము, శేషించున్ = కొలఁది యుండును; అది = నలువయొక్క యా నిదుర, నైనందిన + ప్రళయంబు = బ్రహ్మయొక్క ప్రతిదినమును జరుగునది గాన నైనందినప్రళయము, అనన్ - విలసిల్లున్ = అనఁబడుచుండును; ఆ + అజునకున్ = ఆ నలువకు, అహస్ + పరిమాణంబు - అంతి - అ = పగటియొక్క పరిమితి యెంత గలదో యంతియు, రేయి - అగున్ = రాత్రియొక్క పరిమితియునై యున్నది; అట్టి - దిన - సంఖ్యా - క్రమంబుచేతన్ = దివారాత్రాత్మకమగు నా దినములయొక్క లెక్కనుబట్టి, శత - అబ్దంబులు = నూఱుసంవత్సరములు, చనినన్ = అతిక్రమింపఁగా, శతానందుండు = నలువ, నాశంబు = అంతమును, ఒందున్ = గాంచును; ఆ - ఎడన్ = అట్టి సమయమునందు, మృత్యువు = మృత్యుదేవత, సమస్త - జీవులన్ = చేతనుల నెల్ల, ఒక్క పెట్టునన్ = ఒకసారిగనే, పరిమార్చున్ = సంహరించును; రుద్రుఁడు = వినాపాక్షుఁడు, చిచ్చు

కన్నున్ = అగ్నిరూపమగు మూఁడవనయనమును, తెఱచి = ఎత్తి, చూచున్ = పరికించును; ఆదిత్యులు = వేవెలుఁగు, పండ్రెండు - మూర్తులు = వివస్వంతుఁడు, అర్యముఁడు, పూషుఁడు, త్వష్ట, సవిత, భగుఁడు, ధాత, విధాత, వరుణుఁడు, మిత్రుఁడు, శక్రుఁడు, ఉరుక్రముఁడు నను ద్వాదశసంఖ్యగల రూపములను, కైకొని = పూని, ప్రకాశించున్ = దేదీప్యమానుఁ డగును; ఆ - వేళన్ = ఆ సమయమునందు, ప్రజ్వలత్ - జ్వాలా - ఆఖిలంబు = మిగుల మండుచున్న మంటలచేత నడలుగొలుపు చున్నది, అగు - మహానలంబు = ఐనట్టి పెద్దవహ్ని, జనియించి = పొడమి, విశ్వ - విశ్వంబున్ = సమస్త ప్రపంచమును, భస్మీభూతంబు - కాన్ చేయును = బూడిద యగునట్లు కావించును, సప్త - మారుతంబులు = ప్రవహము - ఆవహము - ఉద్వహము - సంవహము - నివహము - ప్రతి వహము - పరావహము - అను ప్రసిద్ధంబు లగు నేడు పెనుగాలులు, ఒక్క - పెట్టునన్ = ఉద్వేత్తుగ; విసరున్ = రువ్వును; నవ - మేఘం బులు = ఆవర్తము - సంవర్తము - పుష్కరము - ద్రోణము - కాలము - నీలము - అరుణము - తమస్సు - వారుణము - అను పేళ్లు గల తొమ్మిది మహామేఘములును, ఉప్పతిల్లి = పెచ్చురేఁగి, అమోఘంబులు - ఐ = రిత్తవోనివియై, నూఱు - దివ్య - వర్షంబులు = దేవమానముచే నగు నూఱేండ్లు, మహావర్షంబున్ = పెనువానను, వర్షించున్ = కురియును, అందువలనన్ = ఆ పెనువర్షముచేత, సప్త - సముద్రంబులును = ఏడు కడలులును, కలసి = కూడి, ఏక - అర్ణవంబు - ఐ = ఒక్కటియగు పెను సంద్రమయి, మహత్ - మహీమండలంబు = విపులమగు భూగోళము నంతను, ఆక్రమించున్ = క్రమ్ముకొనును; అంతటన్ = తరువాతను, ధరణీ - చక్రంబు = ధరాతలము, ఆ - మహత్ - సలిల - మధ్యంబు నన్ = ఏకార్ణవరూప మగు నా గొప్పనీటియొక్క నడిపట్టున, మహత్ - ఉదకంబులన్ = లావునీళ్లయందు, స్వల్ప - లోష్ట - పిండంబు - విధం

బునన్ = చిన్న మట్టియుండవడువున, విరిసి - చెడున్ = విచ్చి నశించును; తప్త అయస్ - పిండంబు = ఎఱ్ఱఁగఁ గాలిన యినుపకెఱడు, ఒక - తోయ - కణంబున్ = ఒక్క చిన్న నీటిచుక్కను, పీల్చిన - కైవడిన్ = ఇంకించు పగిదిని, బడబ - అగ్ని = బడబానలము, విజృంభించి = ప్రజ్వరిల్లి, ఆ - మహత్ - అంభోరాశిన్ = అట్టి ఏకార్ణవమును, పానంబు చేయున్ = త్రాగును; దీపంబున్ = దివ్వెను, గాలి = వాయువు, ఆర్పిన - భంగిన్ = ఆఱుపురీతిని, ఆ - మహత్ - తేజస్ - మండలంబున్ = బడబానలరూప మగు నా గొప్ప వహ్నిమండలమును, మహా వాయువు = గొప్పవాయువు, తెగటార్చున్ = హతముచేయును; ఆ - మహత్ - ఝంఝాసమీరంబు = అట్టి గొప్ప ఝంఝామారుతమును, నిరాధేయంబు - అగుటం జేసి = పట్టు చాలనిది యగుటచేత, అంతరిక్షంబునన్ = నింగియందు, కలయన్ - తిరిగి = అంతటను భ్రమించి, అందున్ = ఆ మింటియందు, సుషుప్తియందున్ = గాఢనిద్రలో, ప్రాణుల - పోలికన్ = చేతనులపగిదిని, మ్రగ్గున్ = విలీనమగును; శబ్ద రూపంబు - ఐన - నింగిన్ = చప్పుడు గుణముగఁ గల యాకసమును, శ్రోత్రరూపంబు - ఐన - సంకల్పంబు = శ్రవణేంద్రియాత్మక మగు చిత్తవృత్తివిశేషము, మ్రింగిన - తెఱంగునన్ = గ్రసించిన రీతిని, ఆ - ఆకాశంబున్ = అట్టి గొప్పమింటిని, మహామనంబు = సమష్టిరూపమగు గొప్ప మనస్సు, గ్రసించున్ = కబళించును, పంచ - తన్మాత్ర - సహితంబు = శబ్దము స్పర్శము రూపము రసము గంధము ననఁబడు నాకాశాది పంచ భూతములకు గుణములును, శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకమునకు విషయములును నగు తన్మాత్రలైదింటితోఁ గలిసినట్టి, ఆ - మహత్ - మానసంబునన్ = సమష్ట్యాత్మక మగు నా గొప్ప డెందమును, నిద్రాసమయంబు = సుషుప్త్యవస్థ, కబళించు - చాడ్పునన్ = గ్రసించెడు విధమున, అహంకారంబు = సమష్ట్యభిమానరూప మగు నహంకారము, కబ

శించుక్ = ఆరగించును, ఆ - అహంకృతిక్ = అట్టి యహంకారమును, మహాబుద్ధి = సమష్టిమనీష, మెసంగుక్ = తినును, ఆ - మహత్ - బుద్ధి - ఏ = ఆ సమష్టిబుద్ధియే, మహత్తత్త్వంబు - అని = మహత్తత్త్వ మనుచు, చెప్పక్ - ఒప్పక్ = పలుకఁబడుచున్నది; ఆ - మహత్తత్త్వం బుక్ =అట్టి సమష్టిబుద్ధిని, అవ్యక్తంబు = మూలప్రకృతి, తనయందుక్ = తనలోపలను, విలీనంబుక్ = లీన మైనదానినిగ, కావించి = చేసి, అడఁచి కొనుక్ = అణఁగఁద్రొక్కి కొనును; అది = మూలప్రకృతి, మాయా - అవిద్యా - అవ్యక్త - తమస్ - సుషుప్తి - ప్రకృతి - ఆనంద - ఆది - శబ్ద - వాచ్యంబు = మాయయు నవిద్యయు నవ్యక్తము తమస్సు సుషుప్తి ప్రకృతి ఆనందమయకోశము అను మొదలగు పదములచేతఁ జెప్పఁదగినది, ఐన - ప్రధానంబు = అగునట్టి ప్రధానము, అది - ఏ = ఆ ప్రధానమే, బ్రహ్మప్రళయంబు - అగుక్ = నలువయొక్క ప్రళయ మనఁబడును. ఆ - అనాది - అనిర్వచనీయ - అజ్ఞానంబు = తన కొక కారణము లేనిదియు నిట్టిదని నుడువుటకు వలనుపడనిదియు నగు మూలాజ్ఞాన మనఁబడు నామహా మాయ, సత్...సమయంబునక్ - సత్ - గురు = ఉత్తముఁడగు దేశి కేంద్రునిచేత, ఉక్త = బోధింపఁబడిన, జీవ = అవిద్యోపాధికుఁ డగు జీవాత్మునకును, ఈశ్వరమాయోపాధికుఁడగు నీశ్వరునకును, ఐక్య = ఆ యుపాధుల విలయమువలనఁ గలుగు నేకత్వము యొక్క, జ్ఞాన = తెలివియొక్క, అనుభవ - సమయంబునక్ = అపరోక్షముగ గోచర మగు తతిని, అభావంబు - అగుక్ = లేనిది యగును (సమయమున). అది - ఎ = అట్టి మూలాజ్ఞానము నశించుటయు, మహాప్రళయంబు - అగుచు = మహా ప్రళయ మనఁబడును; ఇట్టి - నిత్య - నైమిత్తిక - దైనందిన - కల్పాంత - మహా ప్రళయములయందుక్ = ఇట్లు చెప్పఁ బడిన లక్షణములు గల నిత్యప్రళయము నైమిత్తిక ప్రళయము దైనందిన ప్రళయము కల్పాంత ప్రళయము మహా ప్రళయము నను నైదు విధము

లగు ప్రళయములయందుఁగూడ, ఏను = అస్మత్ప్రత్యయైకవేద్యుఁడ నగు నేను, ఒక్కటిచేతన్ = ఆ ప్రళయములలోనే యొక్కదానిచేతను, బాధింపక - పడక = బాధ్యమానుఁడను గాక, సాక్షిని - ఐ = సర్వసాక్షి నగుచు, నానిన్ - అన్నింటిన్ - చూచుచున్ = ఆ ప్రళయముల నైదింటిని గనుఁగొనుచు, భూత - భవిష్యత్ - వర్తమాన - కాలంబుల యందున్ = కడచినట్టియు రాఁగలట్టియు నడచుచున్నట్టియు కాలవిశేషములయందు, ఏకరూపంబుగాన్ = ఏమార్పును లేక యేకస్వరూపములో, ఉండుటంజేసి = ఉన్నవాఁడ నగుటచేత, సత్ - రూపకుఁడను - అగుదున్ = సత్యమగు స్వరూపము గలవాఁడను ఐతిని, అని = ఈరీతిని, ఉపదేశించి = ఆత్మకుం గల సత్యత్వమును బోధించి, వెండియున్ = ఇంకను, ఇట్లు - అనియెన్ = ఈ తీరునఁ బలికెను.

తా. "అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా త్రింశత్తు తాః కలా। తాస్తు త్రింశత్క్షణ స్తేతు ముహూర్తో ద్వాదశాస్త్రియాం। తేతు త్రింశ దహోరాత్రః పక్షస్తే దశ పంచచ" అనుటచేత నొకలఘువర్ణము నుచ్చరించుటకు నంతటికాల మొక నిముస మనఁబడు; నట్టి నిముసములు పదునెనిమిది కాఁగా నొకకాష్ఠ యనబడును. అట్టికాష్ఠలు ముప్పది కాఁగా నొకకళ యనఁబడును. ఆ కళలు ముప్పది కాఁగా నొకక్షణ మగును. అట్టి క్షణములు ఈరాఱైన నొకముహూర్త మగును. ఆ ముహూర్తములు ముప్పదియైన రేయుంబవళ్లు రెండునుం జెల్లును. దివారాత్రాత్మక మగు నీ దివసములోఁ బ్రతిప్రాణియుఁ బగలు నాలుగు యామములును వ్యాపారమును చేసిచేసి యలయఁగా వేలను ప్రాణులయొక్క శరీరము ఇంద్రియములు నంతఃకరణము మొదలగునవి తమతమ పనులను విడిచి తమకు మూలకారణ మగు సుషుప్త్యవస్థ యనఁబడెడు నజ్ఞానమునందు విశ్రమించును. అట్టి యవస్థలో మెలఁకువ కల, యను నీ రెండవస్థలలో నందుఁ బ్రవర్తింపబడు చిత్తవృత్తులు మాత్రము తమతమ పూర్వసంస్కారములతో మఱ్ఱివిత్తనము

నందు వెన్నముద్దచెట్లు అణఁగియున్నట్లును పెక్కురంగులు గల నెమిలి గ్రుడ్డులోని రసమునందు నున్నట్లు నిమిడీ యడఁగి మడఁగి యుండును. ఇట్లు ప్రతిదినమునందును శరీరాదులు సుషుప్తియందు చలనము లేక యుండుట నిత్యప్రళయ మనఁబడును.

## నైమిత్తికప్రళయస్వరూపము.

శుక్లపక్షము కృష్ణపక్షము నను పక్షములు రెండైన నొకనెల యగు ఈనెల పితృదేవతల కొక దిన మగును. ఆ నెలలు రెండైన నొకఋతు వగు; నట్టిఋతువులు మూఁడైన నొకయయన మనఁబడును; దక్షిణాయనము నుత్తరాయణము నను రెండయనములు కాఁగా నొక యేఁడగును. ఈ సంవత్సరము దేవతలకు నొకదివసం బగును. దేవమానముచే నగు నా దివసములు వారములు పక్షములు మాసములు నను కాలక్రమమునుబట్టి ఈరాఱువేల యేండ్లు కాఁగాఁ గృతయుగము త్రేతాయుగము ద్వాపరయుగము కలియుగము నను నాలుగుయుగము లగును. ఈ నాలుగుయుగములుం గలసి యొక మహాయుగ మనఁబడును. ఈ మహాయుగములు ఏడుపదులపై నొకటి (ఏకసప్తతి కాఁగా) నొక మన్వంతరము గతించును. ఇట్టి మన్వంతరములు చతుర్దశ సంఖ్యాకములు జరుగఁగాఁ జతుర్ముఖునకు నొకయహం బగును. ఆ పగలు వేయి మహాయుగముల పరిమాణము గలది; నలువయొక్క ఈ పగటియందుఁ బదునలువురు మనువులయొక్క ప్రళయంబులును యుగముల యొక్క నడిపట్టునం జరిగెడు పెక్కులగు ప్రళయములును సంభవించును. ఈ ప్రళయములకుఁ గ్రమముగ నైమిత్తిక ప్రళయము లనియు నవాంతర ప్రళయము లనియుం బ్రసిద్ధి గలదు. ఈప్రళయములందు నపరిమితముగఁ బ్రాణికోట్లు నమయుచుండును; అట్టి పగటి కడపటను జతుర్ముఖుండు నిదురవోవును; ఆ నిదురకు నవ్యక్త మని పేరు. అట్టి యతని నిదురలో బ్రహ్మాండమునం దున్న సకలజీవరాసులయొక్క వ్యాపారము లన్నియు నిలిచి

పోవును. ఆ సమయమునందుఁ బుడమి మొదలగు మహాభూతము లైదు మాత్రము గాఁబడియుండును. బ్రహ్మయొక్క యీ సుషుప్తియే దైనందిన ప్రళయ మనఁబడును; బ్రహ్మయొక్క యీ పగ లెంతపరిమితి గలదో రాత్రియు నంతియ పరిమాణము గలదై యుండును; నలువయొక్క యీ దివసముల లెక్కనుబట్టి నూఱేండ్లు కాఁగా నాచతుర్ముఖుఁడు మృతినొందును. అప్పుడు మృత్యుదేవత ప్రాణికోటుల నెల్ల నొకసారిగనే మ్రింగివేయును (సంహరించును). మహారుద్రుఁడు వహ్నిమయమగు తనమూఁడవకన్నును తెఱచి పరికించును. సూర్యుఁడు తన యీరాఱు రూపములం బూని యుద్దీప్తుఁడగును. ఆ సమయమునందు మిక్కుటముగ మండుచున్న మంటలచే నడలు పుట్టించుచున్న గొప్పయగ్గి పుట్టి సమస్తప్రపంచమును బూడిద యగునట్లు చేయును. పెనుగాలులు లేచును; ఉవ్వెత్తుగ వీచును; తొమ్మిది మేఘములు పెచ్చురేఁగి యెడలేక దేవమానముచే నూఱేండ్లు గొప్పవానం గురియును; ఆ వర్షముచేత నేడు కడలులుం గూడి యొక పెనుఁగడలి యగుచుఁ బుడమిపట్టు నెల్లం గ్రమ్ముకొనును. పిమ్మట భూమండలంబా పెను నీటినడుమను పెద్ద నీళ్లలో చిన్నమట్టియుండవడువున విచ్చిపోవును; ఎఱ్ఱగఁ గాల్పఁబడిన యినుపకఱడు తనమీఁద పడిన చిన్ననీటిచినుకు నార్చెడు పగిదిని జాజ్వల్యమాన మగు బడబానలము ప్రజ్వరిల్లి యా యేకార్ణవమును త్రాగివైచును. పెనుగాలి దివ్వె నార్పు రీతి నా గొప్ప బడబాగ్నిహోత్రమును ప్రళయవాయువు లేచి నశింపఁ జేయును. కల్పాంతమందలి యా ఝంఝామారుతము పట్టు చాలని దగుట చేత నాకసమందంతటను గ్రిమ్మరి సుషుప్త్యవస్థయందు జీవరాసు లడఁగునట్లు మహాకాశమునందు విలీనమగును. చప్పుడు నిజధర్మముగఁ గలయాకసమును శ్రవణేంద్రియాత్మక మగు చిత్తవృత్తివిశేషము తనలోఁ గొనునట్లు సమష్టిమానస మహాకాశమును గబళించును. శబ్దము మొదలగు భూతతన్మాత్ర లైదింటితోఁ గూడిన యీ సమష్టి మనస్సును సుషుప్త్యవస్థల

లోఁగొనినట్లు అహంకార మా మనస్సును దనలోఁ విలీనముఁ జేసికొనును. ఆ యహంకారమును మహత్తత్త్వములోనగును; సమష్టిబుద్ధియే మహత్తత్త్వంబనఁబడును. ఆ మహత్తత్త్వమును నవ్యక్తంబు తనలోఁగొని యడఁచికొనును. ఆ సమష్టిబుద్ధి, మాయయు నవిద్యయు నవ్యక్తము తమస్సుసుషుప్తి ప్రకృతి యానందమయకోశము మూలాజ్ఞానము నను మొదలగు పదములచేఁ బలుకఁబడు ప్రధాన మగును. ఈప్రధానమే బ్రహ్మప్రళయ మనఁబడును; అట్టి మొదలులేనిదియు నిట్టిదట్టిదని చెప్పుటకు వీలులేనిదియు నగు మూలాజ్ఞానము, యోగ్యుఁడగు దేశికేంద్రునిచే నుపదేశింపఁబడిన జీవాత్మకును బరమాత్మకును గల యేకత్వమును జ్ఞానముచే ననుభవించెడు తఱిని నశించును. అపరోక్షజ్ఞానానుభవముచే నట్లు మూలాజ్ఞానము నశించుటయే మహాప్రళయ మనఁబడును. ఇట్లు చెప్పఁబడిన లక్షణములు గల నిత్యప్రళయమునందుఁ గాని నైమిత్తికప్రళయమునందుఁ గాని దైనందినప్రళయమునందుఁగాని బ్రహ్మప్రళయమునందుఁ గాని యాత్యంతికప్రళయమునందుఁగాని నేను ఈ యైదు ప్రళయములలో నే యొకదానిచేత నైనను బాధింపఁబడువాఁడను గాక ద్రష్టనగుచు, నాప్రళయముల నన్నింటిని బరికించుచు గతించినట్టియు రాఁబోవునట్టియు నడచుచున్నట్టియు కాలవిశేషములయందు నొక్కస్వరూపము గలవాఁడనై యున్నవాఁడ నగుటచేత, నేను సత్యస్వరూపుఁడనైతిని - అని బోధించి శ్రీరామచంద్రుండు హనుమంతునితో మరల నీరీతిని వచియించెను. ౧౫౮

అవ. ఇట్లు ఆత్మకుం గల త్రికాలాబాధ్యసత్యస్వరూపత్వమును బ్రతిపాదించి, యిఁకఁ జిన్మయత్వము నుపదేశించుచున్నారు రెండు సీసపద్యములచేతను:—

సీ. ఇది ఘటం బిది పటం బిది గృహం బిది కుడ్య
మిది యరణ్యము శైల మిది యటంచు

నిది భూమి యిది జలం బితఁడు వైశ్వానరుం
డిది గాలి యాకసం బిది యటంచు
నితఁడు దివాకరుం డితఁడు నిశాకరుం
డివి తారలు గ్రహంబు లివి యటంచు
నివి యచేతనములు నివి చేతనము లంచు
నితఁ డాతఁ డతఁ డితఁ డేనె నటంచు

తే. నరయ నాకంటె భిన్నంబులై జడంబు
లైన బాహ్యపదార్థసంహతుల నెల్ల
సాధనము లేక యెఱిఁగెడి సాక్షి నగుట
నేను చిద్రూపకుఁడ సుమ్ము వానరేంద్ర! ౧౫౯

టీ. వానర - ఇంద్ర = ఓ మర్కటోత్తమా, ఇది ఘటంబు = ఈ కనఁబడునది కడవ, ఇది పటంబు = ఇయ్యది వలువ, ఇది గృహంబు = ఈయది యిల్లు, ఇది కుడ్యము = ఇది గోడ, ఇది అరణ్యము = ఇయ్యది యడవి, శైలము ఇది = ఇది పర్వతము, అటంచున్ = అనియును, ఇది భూమి = ఇయ్యది పుడమి, ఇది జలంబు = ఇది యుదకము, ఇతఁడు వైశ్వానరుండు = ఈతం డగ్నిహోత్రుఁడు, ఇది గాలి = ఇది మారుతము, ఇది ఆకసంబు = ఇయ్యది మిన్ను, అటంచున్ = అనియును, ఇతఁడు దివాకరుండు = ఈతండు భాస్కరుఁడు, ఇతఁడు నిశాకరుండు - ఇతండు కలువలఱేఁడు, ఇవి తారలు = ఇవి చుక్కలు, గ్రహంబులు ఇవి= ఇయ్యవి గ్రహములు, అటంచున్ = అనియును, ఇవి అచేతనములు = ఇయ్యవి ప్రాణములేని వస్తువులు, ఇవి చేతనములు = ఈయవి చైతన్యము గలవి, అంచున్ = అనియును, ఇతఁడు ఆతఁడు = వీఁడు వాఁడు, అతఁడు ఇతఁడు = వాఁడు వీఁడు, ఏను = నేను, అటంచున్ = అనియును, అరయన్ = సదసద్వివేకముచే నాలోచింపఁగా, నాకంటెన్ =

పరమాత్ముఁడ నగు నాకంటె, భిన్నంబులు ఐ = వెలిలగుచు, జడంబులు ఐన = నిర్జీవము లగు, బాహ్య - పదార్థ - సంహతులన్ - ఎల్లన్ = ఆత్మకు శేషభూతము లయి గోచరము లగు మహదాది కార్యకరణముల సంఘాత మంతయును, సాధనములేక = తాను వానిని గ్రహించుటకుఁ దగిన యుపకరణ మేదియును లేకయె, ఎఱిఁగెడి - సాక్షిన్ = తెలిసి కొనుచుండు ద్రష్టను, అగుటన్ = అయి యుండుటచేత, నేను = పర మాత్ముఁడ నగు నేను, చిత్ + రూపకుఁడన్ సుమ్మీ = బోధస్వరూపుఁడ నైతిని సుమీ.

తా. కడవ పలువ యిల్లు గోడ యడవి కొండలు మొదలగునవియు, పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములును, పంచమహాభూతములును, సూర్య చంద్రులు నక్షత్రములు గ్రహములును, పెక్కేల, స్థావరజంగమాత్మకము లైన సకలపదార్థములును, వీఁడు వాఁడు నేను తాను అను వ్యవహారమునకు విషయములయిన యా యా యుపాధులును లోనుగాఁ గలయట్టి యాత్మకు వేఱయి నిర్జీవములై యాత్మకు శేషభూతము లై గోచరములగు కార్య కరణవర్గము నంతయు నే యుపకరణమును లేక, స్వతంత్రమై తెలిసి కొనుచున్న సర్వసాక్షి యగుటచేత నాత్మజ్ఞానస్వరూప మగుట సిద్ధము.

సీ. ఇది శరీరం బిది కి యింద్రియదశకంబు
లివి పంచవిషయంబు కి లిదియ ప్రాణ
మిది మనం బిది చిత్త కి మిది యహంకారంబు
నిది బుద్ధి యిది విద్య కి యిది యవిద్య
యిది కామ మిది క్రోధ కి మిదు లోభ మిది మోహ
మిది మహామత్సర కి మిది మదంబు
నిది జాగరము స్వప్న కి మిది సుషుప్తి తురీయ
మిది యిది యనుచు నా కియెదురఁ దోఁచు

తే. నాంతరపదార్థముల నెల్ల ♦ ననవరతము
సాధనం బేమియును లేక ♦ సాక్షి నగుచు
నే నెఱుంగుదుఁ గావున ♦ నిత్యవిమల
చిత్స్వరూపుఁడ నగుదు రాజితవిచార. ౧౬౦

టీ. రాజిత + విచార = ఒప్పిద మగు సదసద్వివేచన గల మారుతీ, ఇది - శరీరంబు = ఇది మేను, ఇది - యింద్రియదశకంబు = శ్రవణాదులగు జ్ఞానేంద్రియము లైదును వాగాదులగు కర్మేంద్రియము లైదునుం గలసి యింద్రియములపది యిది, ఇవి పంచవిషయంబులు = ఇయ్యవి శబ్దము మొదలగు నైదువిషయములు, ఇది - అ - ప్రాణము = ప్రాణశబ్ద మపానాదులకు నుపలక్షకము గాన నియ్యది ప్రాణాదివాయు పంచకము, మనంబు = డెందము, ఇది = సంశయాత్మక మగు నిట్టిది, చిత్తము = చిత్త మను నంతఃకరణభాగము, ఇది = చలనరూపమగు నిట్టిది, ఇది అహంకారంబు = అహంకృతి యనునది, ఇది = ఇట్లు దేహాదుల యందు నభిమానరూప మైనది, బుద్ధి = మతి, ఇది = ఇట్లు నిశ్చయాత్మక మైనది, విద్య = విద్య యనునది, ఇది = ఇట్లు సదసత్తులయొక్క యెఱుక యై యున్నది, అవిద్య = అవిద్య యనునది, ఇది = ఇట్లు భ్రాంతిరూప మగు నజ్ఞానమై యున్నది. కామము = కామమనునది, ఇది = ఇట్టిది (పుత్త్రమిత్రకళత్రాదులపై కోరిక), క్రోధము = కోపము, ఇది = ఇట్టి లక్షణము గలది, లోభము = లౌభ్యము, ఇది = ఇట్టిది, మోహము = మూఢత్వము, ఇది = ఇట్టిది, మహామత్సరము = గొప్ప మాత్సర్యము, ఇది = ఈవిధమైనది, మదంబు = దర్పము, ఇది = గర్వరూపమయినది, జాగరము = మెలఁకువ, ఇది = ఏతాదృశమయినది, స్వప్నము = కల, ఇది = ఈతీరున నుండునది, సుషుప్తి = మిక్కుటంపు నిదుర, ఇది = ఇట్టిది, తురీయము = తుర్యావస్థ, ఇది = ఏతాదృశము, అనుచున్ = అని,

నా - ఎదుర్ = నాయొక్క (ఆత్మయొక్క) మ్రుంగటను, తోఁచున్ - అంతర - పదార్థములన్ = తోఁపట్టుచున్న యాభ్యంతరములగు వస్తువులను, ఎల్లన్ = అన్నింటిని, అనవరతమున్ = నిత్యమును, సాధనంబు - ఏమియున్ లేక = ఉపకరణ మెద్దియు నక్కఱలేక, సాక్షిని - అగుచున్ = కనుఁగొనువాఁడ నై, ఏను - ఎఱుంగుదున్ = పరమాత్ముఁడ నగు నేను దెలిసికొనుచున్నాను. కావునన్ = ఇట్లు సర్వసాక్షి నగుటచేత, నిత్య - విమల - చిత్ - స్వరూపుఁడను = సత్యమును బరిశుద్ధము నగు జ్ఞానము స్వరూపముగఁ గలవాఁడను, అగుదున్ = అయియున్నాను.

తా. శరీరత్రయ మిట్టిని; పది తెఱంగులం గల జ్ఞానకర్మేంద్రియము లిట్టివి; ఇంద్రియార్థము లగు శబ్దాదు లిట్టివి; ప్రాణాఽపాన వ్యానోదాన సమానము లను వాయువు లైదు నిట్టివి; సంశయాత్మకమగు మనస్సుయొక్క స్వరూప మీవిధ మయినది; చలనాత్మకమగు చిత్తముయొక్క లక్షణ మిత్తెఱంగున నుండును; దేహాదులయందు నభిమానరూప మగు నహంకృతి యిట్టిదై యున్నది; నిశ్చయాత్మికయగు బుద్ధియొక్క స్వరూప మిట్టిది; జ్ఞానముయొక్కయు నజ్ఞానముయొక్కయు స్వరూపము లివి యై యున్నవి; కామక్రోధలోభమోహమదమాత్సర్యము లను నరిషడ్వర్గ మిట్టి స్వరూపము గలది; మెలఁకువ కల గాఢనిద్ర తుర్యము నను నవస్థలు నాలుగు నిట్టివి; అని యిట్లు సర్వవ్యాపకమగు నాత్మకు నభిముఖముగ నుండి చూపట్టెడు నాంతరధర్మరూపము లగు గుణగణములను నిరంతరమును వేఱొక సాధనము నపేక్షింపక, వాని కన్నిటికిని సాక్షియై యాత్మ తెలిసికొనుచుండును గావున "నిత్యత్వం తద్యస్యాస్తి తన్నిత్యం సత్యమ్" అను నభియుక్తవచనమువలన నిత్యత్వమునకు వెఱయది యై సత్యత్వము లేదుగాన సత్యమునుఁ బరిశుద్ధమునగు జ్ఞానము స్వరూపముగఁ గలదియై యాత్మ తనకుఁదా వెలుఁగొందుచున్నది. ౧౬౦

అవ. ఇట్లాత్మకుం గల నిత్యసత్యత్వమును జిన్మయత్వమునుఁ బ్రతిపాదించి ఆనందమయత్వమును నుడువుచున్నారు.

శా. వరుసంప్రాప్తములైనదుఃఖములఁ బోఁగాంచుచు న్భూ
రి ను, స్థిరసౌఖ్యోన్నతిఁ జెందియుండుటకు నై చింతింపు
దుం గాన నేఁ, బరమప్రేమరసాస్పదుండనగు నట్లై భాసింప
నట్లౌటచేఁ, బరమానందమయాత్ముఁడం జుమి జగత్ప్రా
ణాత్మజా! నిత్యమున్. ౧౬౧

టీ. జగత్ప్రాణ - ఆత్మజా = "సమీర మారుత మరు జ్జగత్ప్రాణ స్సమీరణః" అను నిఘంటువుచే జగత్ప్రాణుం డన వాయుదేవుఁడు గాన, వాని కొమరుఁడ వగు ఓ హనుమంతుఁడా, భాసింపన్ = ఆలోచింపఁగా, నిత్యమున్ = నిరంతరమును, వరుసన్ = ఓరిమి "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖ" మ్మను (క్రమముచేత), ప్రాప్తములు = సంభవించినవి, ఐన - దుఃఖములన్ = అగు నిడుమలను, పోవన్ = నశించుటకు, చూచుచున్ = కనుపెట్టుచు, భూరి - స్థిర - సౌఖ్య - ఉన్నతిన్ = విపులమును శాశ్వతమును నగు సుఖముయొక్క హెచ్చును, చెంది = పడసి, ఉండుటకున్ - ఐ = నివసించుటకొఱకై, చింతింపుదున్ = ఆలోచింపుచుందును, గానన్ = కనుక, నేను = జీవుఁడ నగు నేను, పరమ - ప్రేమరస - ఆస్పదుఁడన్ = సమస్తమగు ప్రీతిమునకు (కూర్మికి) నునికిపట్టగువాఁడను, అగుచున్ = అయి యుంటిని, అట్లు - ఔటచేన్ = ఈ విధముగ పరమప్రేమాస్పదుఁడ నగుటచేతను, పరమ - ఆనందమయ - ఆత్ముఁడన్ - చుమీ = నిరతిశయ మగుసుఖము స్వరూపముగఁ గలవాఁడ నైతిని సుమా.

తా. "సుఖం మే భూయాత్ దుఃఖం మాభూత్" అనఁగా సుఖమే నాకుఁ గలుగుఁగాత, దుఃఖ మెప్పుడును కలుగకపోవుఁగాక యని ప్రతి ప్రాణికిని దలంపు గలిగియుండుట యెల్లరకును ననుభవసిద్ధమే గాన, జీవాత్మ తాను జేసికొనిన కర్మ ననుసరించి తమకుఁ గలిగిన యిడుములు నశించిపోవలయు నని కనుపెట్టుచు నిలుకడ గల మిక్కుటపుసంతోషము నొందుటకయి తలపోయుచుండును. కావున, నాత్మ సర్వాధికమగు ప్రియమునకు నాశ్రయభూత మయి యుండుటచేత నిరతిశయమగు సుఖము స్వరూపముగఁ గలది యని యనుభవసిద్ధము. ౧౬౧

అవ. ఇంతియకాక, దుఃఖకరమగు విషయానుభవము గూడ సౌఖ్యప్రదముగఁ దోఁచుట "ఏతస్యైవానందస్యాన్యాని మాత్రా ముపజీవంతి" అను శ్రుతిచేత నఖండానందఘనమగు నాత్మసుఖమునుబట్టియే యని వివరించుచున్నారు.

తే. వివిధదుఃఖాత్మకము లైన విషయతతులు
తొడరి యత్యంతసుఖము లై తోఁచు టెల్ల
నతులితానందమయుఁడ నై నట్టినాదు
నలలితాభాసమాత్రంబువలనఁ జువ్వె. ౧౬౨

టీ. వివిధ - దుఃఖ - ఆత్మకములు = పలు తెఱంగులం గల యిడుమలు స్వరూపముగఁ గలవి, ఐన - విషయ - తతులు = అగునట్టి స్రక్చందన వనితాది భోగ్యపదార్థముల సమూహములు, తొడరి = అలవడి, అత్యంత - సుఖములు ఐ = అధిక సౌఖ్యప్రదము లగుచు, తోఁచుట ఎల్లన్ = తోపట్టుచుండుట యంతయు, అతులిత - ఆనందమయుఁడను = అసమానమగు సంతోషముయొక్క ప్రాచుర్యము గలవాఁడను, ఐనట్టి - నాదు - నలలిత - ఆభాసమాత్రంబువలనన్ - చువ్వె = అగు నా సంబంధమయిన దేదీప్యమానమగు ఛాయామాత్రముచేతనే సుమీ.

తా. పెక్కు తెఱంగులం గల బాధలు తఱుచుగఁ గల స్రక్చందన వనితాదు లగు భోగ్యపదార్థజాతములచే కుంది పరమసౌఖ్యప్రదముల యట్లు గోచరించుచుండుట యంతయును నఖండానందఘనుఁ డగు పరమాత్మునియొక్క ప్రకాశమాన మగు ప్రతిఫలనమాత్రముచేతనే గాని, వేఱొండుతీరునఁ గాదు. ౧౬౨

అవ. ఆత్మ కానందము స్వభావసిద్ధ మైనది. దుఃఖమన్ననో యజ్ఞానముచే నడుమ వచ్చిన దని చెప్పుచున్నారు.

తే. దుఃఖ మాగంతుకం బయి తోఁచుచుండు
సుఖము స్వాభావికము నాకు సూరివర్య
యట్లు గావున నిరతిశయాప్రమేయ
నిరుపమానందమయుఁడను నేను బుత్త్ర! ౧౬౩

టీ. సూరి - వర్య = సదసద్వివేచనానిపుణులలో నుత్తముఁడ వగు, పుత్త్ర = కడుపునఁ బుట్టిన కొమరునికంటె నధికుఁడవగు వాయుతనయా, నాకున్ = అస్మత్ప్రత్యయాలంబన మగు నాత్మకు, దుఃఖము = వ్యథ, ఆగంతుకంబు - ఐ = నడుమను వచ్చినదియై, తోఁచుచున్ = కనబట్టుచు నున్నది; సుఖము = సంతోషము, స్వాభావికము = స్వతస్సిద్ధమయినది, అట్లు గావునన్ = ఆనందము స్వభావసిద్ధ మగుటచేతను, నేను = ఆత్మ, నిరతిశయ - అప్రమేయ - నిరుపమ - ఆనంద - మయుఁడను = సర్వాధిక మయినట్టియు తార్కికప్రమాణములకు గోచరము కానట్టియు సాటి లేనట్టియు నఖండానందము స్వరూపముగఁ గలవాఁడను.

తా. ఆత్మకు దుఃఖ మనునది యజ్ఞానావరణమువలన వచ్చినదిగాని, యాత్మధర్మము కాదు. ఎట్లనిన, తేజోరాశియగు సూర్యుని మేఘములు గప్పినప్పుడు సూర్యునికాంతి గోచరము కానట్లు సమధికానందసాంద్ర మగు నాత్మ నజ్ఞాన మావరింపఁగా స్వస్వరూపమును మఱచి, శరీరమే నేననియు,

నింద్రియములే నేననియు, నంతఃకరణమే నేననియు, భ్రమ కలుగును. అప్పుడు శరీరేంద్రియాంతఃకరణాదులకు సంయోగ వియోగాదులవలనఁ గలుగు దుఃఖమును నా శరీరాదులయందలి యభిమానమువలనఁ దనయం దారోపించుకొనుటచే నిట్లాత్మకు దుఃఖము నాగంతుకముగా వచ్చుచున్నది గాని, స్వాభావికము గాదు. సుఖ మన్ననో సూర్యునకుఁ గాంతి యట్లు స్వతస్సిద్ధ మయినది; కాన, నాత్మకు నఖండానందత్వ మిట్లుపపన్నమై యున్నది. ౧౬౩

అవ. ఇట్లాత్మ సచ్చిదానందస్వరూప మని యుక్త్యనుభవములచే స్థిరపఱచి యపరిచ్ఛిన్న మనియుం బ్రతిపాదించుచున్నారు.

వ. ఇట్లు కాలత్రయాబాధ్యత్వంబువలనను, స్వారోపితాశేష పదార్థభాసకత్వంబు వలనను, బరమ ప్రేమ రసాస్పదత్వంబువలనను, సచ్చిదానంద స్వరూపకుండ నైన నేను మణి కనక రజత తామ్ర లోహ కాంస్య మృణ్మయఘటంబుల లోపల వెలుపల నంటక, నాకాశంబు వ్యాపించి యున్న చందంబున వియత్పవన తేజో జల భూ దేవ మానవ తిర్యక్ స్థావరాది చరాచరంబులయందు బాహ్యాభ్యంతరంబుల నసంగుండ నై నిండియుండుటం జేసి, నాకు దేశకృత పరిచ్ఛేదంబు లేదు; అనాద్యనిర్వచనీయ మాయాకల్పిత భూత వర్తమాన భవిష్యత్సమయముల యందు నేకరూపత్వంబుచేత సాక్షి నై యుండియు, వానినెల్ల నెల్లప్పుడును దృశ్యంబుగా నెఱుంగుటవలనఁ గాలకృతపరిచ్ఛేదంబు గలుగదు; మఱియు, వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయం బై శిలాదికంబు విజాతీయంబై

పత్ర పుష్ప ఫలాదికంబులు స్వగతంబు లయి యొప్పిన
కైవడి నీ యనాత్మప్రపంచంబు అసద్రూపం బగుటవలన
నిరవయవంబు వ్యాపకంబు నసంగంబు నైన గగనంబు
నకు నభావరూపంబ స్వభావం బగుటవలనను శశవిషాణం
బెద్దియుం గానిపగిది, స్వజాతీయ విజాతీయ స్వగతంబులు
గానేర వట్లగుటవలన వస్తుకృత పరిచ్ఛేదంబు శూన్యం
బగు; నివ్విధంబునఁ ద్రివిధ పరిచ్ఛేద రహితత్వంబువలన
నద్వితీయ పరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైతన్యం
బగుదు నని వెండియు నిట్లనియె. ౧౬౮

టీ. ఇట్లు = పైని జెప్పినతీరున, కాల - త్రయ - అబాధ్యత్వంబువలనను = గతించినట్టియు రాఁబోవునట్టియు నడచుచున్నట్టియు మూఁడు కాలములచేతను బాధింపఁబడక పోవుటచేతను, స్వ - ఆరోపిత - అశేష-పదార్థ - భాసకత్వంబువలనను = అజ్ఞానముచేఁ దనయందుఁ గల్పింపఁబడిన మహదాది కార్యకరణ సంఘాతము నెల్ల భాసిల్లఁజేయుచుండుటచేతను, పరమ - ప్రేమరస - ఆస్పదత్వంబువలనను = సమధిక మగు మక్కువ యను రసమునకు నునికిప ట్టగుటచేతను, సత్ - చిత్ - ఆనంద-స్వరూపకుండను - ఐన - నేను = క్రమముగ సత్య నిత్య స్వరూపుఁడను జిన్మయుఁడను సుఖస్వరూపుఁడను నగు నస్మత్ప్రత్యయాలంబనాత్ముఁడనైన నేను, మణి...వెలుపలన్—మణి = మానికము, కనక = పసిఁడి, రజత = వెండి, తామ్ర = రాగి, లోహ = ఉక్కు, కాంస్య = కంచు, మృత్ = మట్టి, అను వీనియొక్క, మయ = వికారము లగు (వీనిచేఁ జేయఁబడిన), ఘటంబుల = కడవలయొక్క, లోపలన్ = లోను, వెలుపలన్ = పైనిని, అంటక = ముట్టకుండ, ఆకాశంబు = నింగి, వ్యాపించి = క్రమ్మికొని, ఉన్న + చందంబునన్ = ఉండెడు తీరున, వియత్...

యందున్—వియత్ = ఆకసము, పవన = వాయువు, తేజస్ = నిప్పు, జల = నీరు, భూ = పుడమి, దేవ = సురలు, మానవ = మనుజులు, తిర్యక్ = పసువులు పిట్టలు మొదలగునవియు నగు, స్థావర + ఆది = కొండలు లోనుగాఁగల, చర + అచరంబులయందున్ = సంచరించు నవియుఁ జలింపక యుండునవియు నగు వానియందు, బాహ్య + అభ్యంత రంబులన్ = లోను వెలుపలను, అసంగుండను - ఐ = సంసర్గము లేని వాఁడనై, నిండి = వ్యాపించి, ఉండుటంజేసి = నివసించుటవలన, నాకున్ = ఆత్మకు, దేశ + కృత + పరిచ్ఛేదంబు = ఒక్కొక్క తావు వలనఁ గలుగు విచ్ఛిత్తి (ఒకచో నుండి వేఱొకచోట నుండకుండ), లేదు= సంభవింపదు; అనాది...యందున్—అనాది = మొదలు లేనట్టియు (పుట్టువు లేనట్టియు), అనిర్వచనీయ=ఇట్టి దని చెప్పుటకు వీలు లేనట్టియు, మాయా = మూలాజ్ఞానముచేత, కల్పిత = కూర్పఁబడిన, గత = గతించి నట్టి, భవిష్యత్ = రాఁబోయెడి, వర్తమాన = నడచుచున్న, సమయం బులయందున్ = కాలములయందు, ఏక + రూపత్వంబు చేతన్ = ఏ మార్పును లేక యొకతీరున నుండుటవలన, సాక్షిని - ఐ - ఉండియున్ = ద్రష్ట నగుచు నుండినవాఁడయ్యు, వానిన్ - ఎల్లన్ = కాలత్రయమున లోను గాఁ గలవాని నన్నిటిని, ఎల్లపుడున్ = నిత్యమును, దృశ్యంబు - కాన్ = గోచర మగునట్లు, ఎఱుంగుటవలనన్ = తెలిసికొనుచుండుటవలన, కాల + కృత + పరిచ్ఛేదంబు = కాలమునుబట్టి కలిగెడు విచ్ఛిత్తి (ఒకతఱి నుండి వేఱొకతఱి నుండకపోవుట), కలుగదు = సంభవింపదు; మఱియున్ = ఇంతియకాక, వృక్షంబునకున్ = మ్రాఁకునకు, వృక్ష + అంతరంబు = వేఱొక మ్రాఁకు, స్వజాతీయంబు + ఐ = తన వృక్షజాతిలోనిది యగుచు, శిల + ఆదికంబు = పాషాణము మొదలగునది, విజాతీయంబు - ఐ = తనకుఁ బెఱజాతిలోనిది యగుచు, పత్ర + పుష్ప + ఫల + ఆదికంబులు= పత్రములు ప్రసూనములు పండ్లు లోనగునవి, స్వ + గతంబులు - ఐ =

తనలోఁ జేరినవిద్యై, ఒప్పిన + కైవడిన్ = ప్రసిద్ధము లగునట్లు, ఈ + అనాత్మ + ప్రపంచంబు = ఆత్మకాని ఈ జగత్తు, అసత్ + రూపంబు అగుటవలనన్ = మిథ్యాభూత మగుటచేత, నిరవయవంబును = ("అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అనుటచేత, నాత్మకు నామరూపాదికములు లేమింజేసి) కాలుసేతులు లోనగునంగములు లేనిదియు, వ్యాపకంబును = ("పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదీర్యతే" అను మొదలగు శ్రుతిచేత) నంతటను నిండియుండునదియు, అసంగంబును = ("అసంగో హ్యయం పురుషః" అను శ్రుతిచేత) నెట్టి సంసర్గమును లేనిదియును (ఆత్మ యగును), ఇట్లు నిరవయవత్వాదిధర్మములు గలది, ఐన + గగనంబునకున్ = అగు నాకసమునకు, అభావ + రూపంబు + అ = అప్రత్యక్ష మగుటచే భావనస్వరూపమే, స్వభావం బగుటవలనను = నిజ ధర్మ మగుటచేతను, శశ + విషాణంబు = చెవులపిల్లికొమ్ము, ఎద్దియున్ = భావపదార్థములలో నేదియును, కానిపగిదిన్ = కాకుండు తీరునను, స్వజాతీయ + విజాతీయ + స్వగతములు = ప్రపంచాంతర్గతము లగు వస్తువులు నాత్మకు సజాతీయములుగాని విజాతీయములుగాని స్వగతములుగాని, కానేరవు = కాఁజాలవు, అట్లగుటవలనన్ = స్వజాతీయాదులగు వస్తువులు ఆత్మకు లేమింజేసి, వస్తు + కృత + పరిచ్ఛేదంబు = వస్తువులను బట్టి కలిగెడు విచ్ఛిత్తి (ఈ వస్తువాత్మ యీ వస్తువాత్మ కాదనియెడు భేదము), శూన్యంబు - అగున్ = లేకయున్నది, ఈ + విధంబునన్ = ఈ రీతిని, త్రి + విధ + పరిచ్ఛేద + రహితత్వంబువలనన్ = మువ్విధములగు (దేశకృత కాలకృత వస్తుకృతములు) భేదములు లేమింపజేసి, అద్వితీయ... చైతన్యంబు—అద్వితీయ = త్రివిధభేదము లేని, ప్రత్యక్ + అభిన్న = సాక్షిచైతన్యముకంటె వేఱుగాని, పరిపూర్ణ = సర్వవ్యాపకమగు, బ్రహ్మ చైతన్యంబు = శుద్ధచిన్మయ మగు పరమాత్మ, అగుదున్ = నేనైతిని,

అని = ఇట్లు చెప్పి, వెండియున్ = మఱియును, ఇట్లు అనియెన్ = ఈ తీరున వచియించెను.

తా. ఆత్మ భూతభవిష్యద్వర్తమానకాలములందు బాధింపఁబడక నిత్యముగ నుండుటవలన సత్యస్వరూపమును, తనయందు నజ్ఞానముచే నారోపింపఁబడిన మహదాదికార్యకరణసంఘాతమును బ్రకాశింపఁజేయుచుండుటవలనఁ జిత్స్వరూపమును, సమధికమగు ప్రియమునకు నునికిపట్టగుట వలన, నానందస్వరూపమునై, మానికములచేతను బంగారుచేతను వెండి రాగి కంచు మొదలగు లోహములచేతను మట్టిచేతను జేయఁబడిన కడవ యొక్క నడుమను బైని నాకసమా కడవను స్పృశింపక క్రమ్ముకొని యున్నతెఱంగునఁ బృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు సురలు మనుజులు పశుపక్ష్యాదులు మొదలగు స్థావరజంగమములందు లోపలను వెలుపలను వ్యాపించి వానిసంపర్కము లేక సర్వపరిపూర్ణమై యుండుటవలన, నాత్మకు నొకచో నుండి యింకొకచో నుండలేదను మాట లేదు. మఱియుఁ దుది మొదలు లేని మూలాజ్ఞానముచేతఁ గల్పింపఁబడిన భూతభవిష్యద్వర్తమానకాలములందు, నేమార్పును లేక, యొకతీరున నుండుటచేత ద్రష్టయై యున్నను నాకాలములు మొదలగువాని నన్నిటిని నిత్యమునుఁ దనకు గోచరములనుగాఁ దెలిసికొనుచు నుండుటవలనఁ గాలముచే నగుభేదమును లేదు; ఇంతియకాక మ్రాఁకునకు వేఱొక మ్రాను సరిజాతిలోనిదియుఁ బాషాణములు మొదలగునవి తనకు నితరజాతిలోనివియు నాకులు పువ్వులు పండ్లు మొదలగునవి తనలోఁ జేరినవియు నగుచు నున్నవిధమున నాత్మకు వ్యతిరిక్తమగు నీజగత్తు మిథ్యాభూత మగుటవలనను గాలుసేతులు లోనగు నంగములు లేనిదియుం, నెల్లయెడల నిండియున్నదియు వేనిని నంటకయున్నదియు నగు నాకసమునకు సదృశ్యత్వమే నైజ మగుటవలననుఁ జెవులపిల్లికొమ్ము కల్ల యగునట్లు ప్రపంచాకాశములు రెండును నాత్మకు, సజాతీయములుగాని విజాతీయములుగాని స్వగతములుగాని కాఁజాలవు. కావున వస్తువులనుబట్టి

కలుగు భేదము లేదు. ఈ రీతిని దేశకృత కాలకృత వస్తుకృతము లగు పరిచ్ఛేదములు (భేదములు) లేకపోవుటవలన సజాతీయాది భేదత్రయము లేనిదియు సంకటనిండియున్నదియుఁగూటస్థచైతన్యమునకు భిన్నము గానిదియు నగుచిన్మయబ్రహ్మము ఆత్మ యగును- అని చెప్పి మఱియు నీరీతి నుడివెను.

ఆ-వె. ఏ నఖండసచ్చిదానందమయుఁడ నై
యిట్లు వెలుఁగుచునికి నెఱిఁగి నన్ను
నే నటంచుఁ దెలియునిపుణులు మత్స్వరూ
పాత్ము లగుచు ముక్తు లగుదు రనఘ. ౧౬౫

టీ. అనఘ=అజ్ఞానదోషము లేని మారుతీ, ఏను = నేను, అఖండ+సత్ + చిత్ + ఆనందమయుఁడను = సర్వవ్యాపకుఁడను - స్వరూపుఁడను - బోధాత్మకుఁడను - నిరతిశయసుఖస్వరూపుఁడను; ఇట్లు పైని జెప్పినరీతిని, ఐ = అగుచు, వెలుఁగుచునికిన్ = తేజరిల్లుచుండుటను, ఎఱిఁగి = తెలిసికొని, నన్నున్ = అఖండానందస్వరూపుఁడ నైన నన్నును, నేను - అటంచున్ = నేన యని, తెలియు + నిపుణులు = యుక్త్యనుభవప్రమాణములచే నెఱింగెడు నేర్పరులగు జ్ఞానులు, మత్ + స్వరూప + ఆత్ములు = నాయొక్క యఖండ సచ్చిదానందస్వరూపమే తమయొక్క స్వరూపముగఁ గలవారు, అగుచున్ = అయి, ముక్తులు - అగుదురు = అజ్ఞానరూపమగు బంధమునుండి విముక్తులు కాఁగలరు.

తా. పైని జెప్పఁబడిన తీరునఁ బరమాత్మ యఖండ సచ్చిదానందస్వరూపమగుచుఁ దేజరిల్లుచుండుటను దెలిసికొని, ప్రత్యగాత్మయు నట్టిదే యని యుక్త్యనుభవములవలన నెఱింగి, ప్రత్యక్పరమాత్మైక్యజ్ఞానము గలవారు ముక్తు లగుదురు. ౧౬౫

సీ. అని యిట్లు బోధించి యానందమయుఁ డగు
శ్రీరాఘవుఁడు నిజశ్రీపదార

విందంబులకు భక్తి వందనంబులు సేయు
హనుమంతుఁ గనుఁగొని యప్పు డతని
శిర మను పూర్వాద్రిశిఖరంబుపై స్వక
రార్కమండలము డాయఁగఁ జేర్చి
తనరు నీహస్తమస్తకయోగ మిప్పు డే
తెలివి యెఱుంగు నాతెలివి నీవు

తే. తెలివి నీ వని తెలుపఁగాఁ దెలియు నద్ది
యదియ నీ వను వెలుఁగుచే ననిలసుతుని
ధీగతానాద్యవిద్యాంధతిమిర మెల్లఁ
బాపి కేవల తత్త్వరూపంబుఁ జూపె. ౧౬౬

టీ. అని = బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలవారు మోక్షము నొందుదురని, ఇట్లు = మీఁదఁ జెప్పినట్లు, బోధించి = ఉపదేశ మొనరించి, ఆనందమయుఁడు = నిరతిశయ సుఖస్వరూపుఁడు, అగు + శ్రీరాఘవుఁడు= ఐనట్టి శ్రీరామచంద్రుఁడు, నిజ + శ్రీపద + అరవిందంబులకున్ = తనయొక్క శుభలక్షణములు గల యడుఁగుదమ్ములకు, భక్తిన్ = భక్తితో, వందనంబులు = నమస్కారములు, చేయు + హనుమంతున్ = కావించెడు హనుమానుని, కనుఁగొని=పరికించి, అప్పుడు = ఆ తఱిని, అతని + శిరము + అను + పూర్వాద్రి + శిఖరంబు + పైన్ = ఆ హనుమంతునియొక్క మస్తక మనియెడు పొడుపుకొండయొక్క కొమ్మమీఁదను, స్వ+కర+ అర్క+మండలమున్ = తన కే లనియెడు భానుమండలమును, డాయన్-కన్ - చేర్చి = కూడునట్లునిచి, తనరు + ఈ + హస్త + మస్తక+ యోగము = విలసిల్లెడు నిట్టి నా కేలునకును నీశిరమునకును గల సమావేశమును, ఏ + తెలివి = ఏజ్ఞానము, ఎఱుంగున్ = తెలిసికొనుచున్నదో, ఆ + తెలివి = అట్టి జ్ఞానము, నీవు = నీవైతివి, తెలివి - నీవు - అని=అట్టి

జ్ఞానము నీవైతివని, తెలుపన్ - కాన్ = నేను నీకు బోధింపఁగా, ఎద్ది= ఏతెలివి, తెలియున్ = తెలిసికొనుచున్నదో, అది - ఎ - నీవు - అను + వెలుఁగుచేన్ = ఆ యెఱుకయను నీవనియెడు స్వప్రకాశముచేత, అనిల... ఎల్లన్—అనిలసుతుని = కరువలిపట్టియొక్క, ధీ + గత = అంతః కరణమునం దున్న, అనాది = మొదలులేని, అవిద్య = మూలాజ్ఞాన మనియెడు, అంధతిమిరము - ఎల్లన్ = గాఢాంధకారము నంతను, పాపి = తూలఁగొట్టి, కేవల + తత్త్వరూపంబున్ = పరిశుద్ధమగు పరవస్తుస్వరూపమును, చూపెన్ = అపరోక్షముగ గోచరమగున ట్లొనరించెను.

తా. మీఁదఁ జెప్పిన తీరున బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలవానికి మోక్షము గలదని యుపదేశించి నిరతిశయసుఖస్వరూపుఁడగు శ్రీరామచంద్రుఁడు తనయొక్క శుభలక్షణము గల యడుగుఁదమ్ములకు శ్రద్ధాభక్తులతో మ్రొక్కుచున్న కరువలిపట్టిం బరికించి యత్తరి నాహనుమంతునియొక్క శిరస్సనియెడు పొడుపుకొండశిఖరముమీఁదఁ దన పాణితలం బనియెడు భానుమండలము నెలకొల్పి యీ నా కరమునకు నీ శిరమునకుం గల సమావేశము నియ్యెడ నేవిజ్ఞానము తెలిసికొనుచున్నదో యా విజ్ఞానమే నీవైతివి. అట్టి విజ్ఞానము నీ వైతివని నే నిట్లు బోధింపఁగా నేయెఱుక యెఱుంగుచున్నదో యా యెఱుకయు నీవైతివను స్వప్రకాశము చేత, నాకరువలిపట్టియొక్క యంతఃకరణమునం దున్న మొదలులేని మూలాజ్ఞాన మనియెడు కటికిచీఁకటిగుంపును దూలఁదోలి, యద్వితీయమగు పరతత్త్వస్వరూపము నపరోక్ష మగునట్లు గావించెను. ౧౬౬

చ. అటుఁ బొడగాంచె మారుతిహృదంబురుహాంతరబిమ్బితస్ఫుర
చ్చటుల పునఃపునశ్చలదసద్విషయస్పృశదింద్రియాన్వితో
త్కటపటుధీప్రవృత్తినిహితజ్ఞకళాగ్రనివేశమున్ విశం
కటనిజభాప్రకాశితజగద్వ్రజకోశము స్వప్రకాశమున్.

టీ. అటఁ=తరువాతను, మారుతి = పవనాత్మజుఁడు, హృత్... నివేశముఙ్—హృత్ - అంబురుహ = హృదయపుండరీకముయొక్క, అంతర = నడిపట్టున, బింబిత = ప్రతిఫలించినట్టియు, స్ఫురత్=చూపట్టుచున్నట్టియు, చటుల = వికటముగ, పునఃపునః = సారెసారెకును, చలత్ = చంచలములైన, అసత్ = అవిద్యాకల్పితము లగుటచే మిథ్యాభూతములైన, విషయ = ఇంద్రియార్థములను, స్పృశత్ = తాఁకుచున్న, ఇంద్రియ = పదితెఱంగులం గల శ్రోత్రాదులును వాగాదులు నగు కరణములతో, అన్విత = కలసిన, ఉత్కట = పట్టఁజాలని, పటు=ప్రబలమైన, ధీ - ప్రవృత్తి = బుద్ధిప్రవృత్తియందు, నిహిత = కూర్పఁబడిన, (ప్రతిబింబించిన) జ్ఞ-కళా = జ్ఞానకళయొక్క, అగ్ర = చివరయే, నివేశముఙ్ = ఉనికిపట్టుగఁ గలదియు, విశంకట...కోశము - విశంకట = దేదీప్యమానమగు (సముజ్జ్వలమగు), నిజ = ఆత్మసంబంధమైన, భా = వెలుఁగుచేత, ప్రకాశిత = భాసిలఁ జేయఁబడుచున్న, జగత్ - వ్రజ = పదునాలుగులోకముల గుంపునకు, కోశముఙ్ = ఆశ్రయభూతమైన, స్వప్రకాశముఙ్ = స్వాత్మభూతమగు బ్రహ్మతేజస్సును, పొడగాంచెఙ్ = అపరోక్షముగఁ గనుఁగొనెను.

తా. ఆ వెనుక హనుమంతుఁడు తన డెందమునందుఁ జూపట్టుచు నత్యుత్కటముగఁ జలించుచున్నట్టియు, అవిద్యాకల్పితము లగు ప్రాపంచికవిషయములపైఁ బ్రసరించుచున్నట్టియు శ్రోత్రము మొదలగుననియు, వాక్కు మొదలగునవియు నగు నింద్రియగణములయందు వ్యాపించిన ప్రబలమగు నంతఃకరణవ్యాపారమునందుఁ బ్రతిఫలించినచిత్కళయొక్క కొనయే యునికిగఁ గలదియు, నవిచ్ఛిన్నమగు నాత్మయొక్క వెలుఁగుచేఁ దెలుపఁబడుచున్న సకలజగములసంబంధము లగు నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లనఁబడు పంచకోశములును గలదియు నగు స్వయంజ్యోతి నపరోక్షముగఁ గనుఁగొనెను. ౧౬౭

ఆ. అట్టితన్నుఁ గాంచి యానందమూర్తియై
చిత్రరూప మట్లు చేష్ట లుడిగి
తనువు మఱచి కొంతతడవూరకుండె నా
యాంజనేయుఁడో హిమాద్రితనయ! ౧౬౮

టీ. ఓ హిమాద్రితనయ = ఓ మంచుకొండ కొమరితా, ఆంజనేయుఁడు = అంజనాదేవికొమరుఁడు, అట్టి + తన్నున్ = స్వప్రకాశాత్మకుం డగు తనయొక్క స్వరూపమును, కాంచి = అపరోక్షముగ వీక్షించి, ఆనందమూర్తి - ఐ = సంతోషమయమగు విగ్రహము గలవాఁడై (బ్రహ్మానందమయస్వరూపుఁ డగుచు), చిత్రరూపము - అట్లు = చిత్రపటమున వ్రాయఁబడినవిగ్రహము వడువున, చేష్టలు ఉడిగి=వ్యాపారము లెవ్వియు లేక, తనువున్-మఱచి = మేనిపై జ్ఞప్తిలేక, కొంత తడవు = ఇంచుకతఱి, ఊరక - ఉండెన్ = మిన్నక యుండెను.

తా. అప్పు డట్లు హనుమానుఁడు స్వస్వరూపము నపరోక్షముగఁ దెలిసికొని యఖండానందమయ విగ్రహం డగుచు శరీరేంద్రియాదుల వ్యాపార మేమియును లేక, స్థూల సూక్ష్మ కారణ శరీరములయందలి యభిమానమును మఱచి యించుకసేపేమియును లేక యసంప్రజ్ఞాతసమాధిలో నుండె నని ఈశ్వరుఁడు పార్వతితోఁ బలికెను. ౧౬౮

అవ. క్షణకాలమైన బ్రహ్మాత్మైక్యానుసంధానము గలవాఁడు సర్వోత్తముఁ డగు నని ఫలస్తుతిఁ జేయుచున్నారు.

తే. లిప్తమాత్రం బవిద్యావిలిప్తమాత్ర
మైన ఘను నెన్న లేరు బ్రహ్మాదు లనఁగ
క్షణము సర్వజగద్విలక్షణముఁ బొందు
వాని నుతియింపఁ దరమె యేవారికైన. ౧౬౯

టీ. అవిద్యా + అవిలిప్త + మాత్రంబు = మూలాజ్ఞానముచేతఁ గ్రమ్మఁబడనట్టి యింద్రియార్థములు గల, "మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః" అను భగవద్వచనముచేత మాత్రాశబ్ద మిచట శబ్దాది విషయపర మని తెలియునది. లిప్తమాత్రంబు = నిమిషమాత్రము, ఐన + ఘనుక్ = కడచిన మహాత్ముని, బ్రహ్మాదులు = నలువ మొదలగు వారును, ఎన్నలేరు = కొనియాడఁ జాలరు, అనన్ - కన్ = అనునపుడు, క్షణము = "తాస్తు త్రింశత్క్షణః" అనుటచేత త్రింశత్కళాత్మక మగు క్షణమాత్రము, సర్వ + జగత్ + విలక్షణమున్ = అనృత జడదుఃఖాత్మకమగు ప్రపంచమునకంటె సచ్చిదానందమయ మగుటచే వ్యతిరిక్తమగు బ్రహ్మమును, పొందు + వానిన్ = కలసిన మహాజ్ఞానిని, ఏవారికిన్ - ఐనన్ = ఎట్టి మహాత్ములకేనియుం, నుతియింపన్ = పొగడుటకు, తరము-ఎ = వశ మగునా? వశము కాదని యర్థము.

తా. ఒక నిముసమైన నజ్ఞానముచే నావరింపఁబడకయున్న మనుజునిఁ గొనియాడుటకు బ్రహ్మాదులకయిన శక్యము కాదనునపుడు క్షణమాత్రము బ్రహ్మైక్యానుసంధానము గల జీవన్ముక్తునిఁ బొగడుటకు నేమనుష్యులకు వశ మగును? కాదు గాన, నా యాంజనేయునిఁ గొనియాడఁ దరముగాదు సుమా! ఓ పార్వతీ యని ఈశ్వరుఁడు పలికెను.

తే. అట్టి విజ్ఞానయోగసమాధి నొంది
యనుపమానందమూర్తియై యాంజనేయుఁ
డెట్టకేలకు మేల్కాంచి యెదుట నున్న
రామచంద్రునిఁ జూచి సంభ్రమముతోడ. ౧౭౮

టీ. ఆంజనేయుఁడు = హనుమంతుఁడు, అట్టి + విజ్ఞానయోగ + సమాధిన్ = అట్లు లోకోత్తరమగు విశేషమయిన జ్ఞానయోగముచేత పరబ్రహ్మనిష్ఠను, ఒంది = పడసి, అనుపమ + ఆనంద + మూర్తి - ఐ =

పాటిలేని సంతోషము ప్రచురముగఁ గల స్వరూపము గలవాఁడగుచు, ఎట్టకేలకున్ = కొంత తడవునకు, మేల్కని = ఆ యసంప్రజ్ఞాతసమాధినుండి జాగరణావస్థకు వచ్చి, ఎదుటన్ - ఉన్న + రామచంద్రునిన్ = ముంగల నున్న శ్రీరామచంద్రుని, చూచి = కనుఁగొని, సంభ్రమముతోడన్ = కలవరపాటుతో, ముందటిపద్యముతో నన్వయము.

తా. హనుమంతుఁ డప్పు డట్లు జ్ఞానయోగముచే బ్రహ్మాత్మైక్యరూప మగు నసంప్రజ్ఞాతసమాధిని గాంచి, సమధికమగు బ్రహ్మానందము నొంది, కొంత తడవునకు మరలఁ బ్రాపంచికజ్ఞానము నొంది, తనముంగట నున్న శ్రీమద్రామచంద్రునిఁ బరికించి, సంబరముతో నతనికి మ్రొక్కె నని ముందరి కన్వయము. ౧౭౦

క. మూఢత్వ ముడిగి యోగా
రూఢుం డై భక్తి పొదల నై మ్రొక్కిన నపు డా
ప్రౌఢమతిఁ జూచి రాముఁడు
గాఢాలింగనముఁ జేసె నై గౌరవ మలరన్. ౧౭౧

టీ. మూఢత్వము = అసంభావనా విపరీతభావనాత్మక మగు నజ్ఞానమును, ఉడిగి = వదలి, యోగ + ఆరూఢుండు - ఐ = జ్ఞానయోగ మను ప్రాసాదము నెక్కినవాఁడగుచు, భక్తి = పూజనీయులయందలి ప్రేమ, పొదలన్ = ఒప్పుచుండఁగా, మ్రొక్కినన్ = వందనము చేయఁగా, అపుడు = అత్తఱిని, రాముఁడు = శ్రీ రామచంద్రుఁడు, ఆ + ప్రౌఢ + మతిన్ = పరిపక్వమగు జ్ఞానసంపత్తి గల యా హనుమంతునిని, చూచి = కనుఁగొని, గౌరవము - అలరన్ = సన్మానము హెచ్చునట్లుగా, గాఢ + ఆలింగనము - చేసెన్ = బిగికౌఁగిటం జేర్చుకొనెను.

తా. అసంభావనా విపరీతభావనారూప మగు మోహమును సడలించి, జ్ఞానయోగ మనియెడు సమున్నతపదవి నధిష్ఠించి, పూజనీయుల యెడల ప్రేమరూప మగు భక్తి హెచ్చుచుండఁగాఁ దనకు వందన మొన

రించిన మహాజ్ఞాని యగు నా హనుమానుని గనుఁగొని శ్రీరామచంద్రుఁడు సన్మానపూర్వకముగఁ గౌఁగిలించుకొనెను. ౧౭౧

వ. అట్లు గారవంబుఁ జేసిన నయ్యాంజనేయుండు నప్పరమే శ్వరున కనేకవిధ పూజా నమస్కారస్తోత్రంబులు గావించె ననిన విని, పార్వతీదేవి యటమీఁద శ్రీరామస్వామి యేమి యుపదేశించె నని శ్రీమహాదేవు నడుగుటయును. ౧౭౨

టీ. అట్లు = ఆ తీరున, గారవంబుఁ = మర్యాదను, చేసినన్ = శ్రీరామచంద్రుఁ డొనరింపఁగా, ఆ + ఆంజనేయుండు = ఆ హనుమంతుఁడు, ఆ + పరమ + ఈశ్వరునకున్ = సర్వేశ్వరుండగు నా శ్రీరామచంద్రునకు, అనేక + విధ + పూజా + నమస్కార + స్తోత్రంబులు = పలు తెఱంగులం గల షోడశోపచారాది పూర్వక పూజనములు వందనములు స్తుతులును, కావించెను = చేసెను; అనినన్ = ఇట్లు పలుకఁగా, విని = ఆలకించి, పార్వతీదేవి = సర్వమంగళ, అటమీఁదన్ = ఆ పిమ్మట, శ్రీరామస్వామి = శ్రీ రామచంద్రుఁడు, ఏమి - ఉపదేశించెన్ = ఆంజనేయున కేమి బోధించెను, అని = అనుచు, శ్రీ మహాదేవున్ = సమస్తైశ్వర్యసంపన్నుఁడగు మహేశ్వరుని, అడుగుటయున్ = కోరఁగా.

చ. కలుషవిదూర! నిర్గతవికార! సురాంబుజసూర! సూరిహృ
జ్జలజవిహార! చారుసుఖసాగర! విశ్వశరీర! భూరిని
ర్మలగుణవార! వారిధిసమానగభీర! సుమేరుధీర! స
న్నలినభవాభవాచ్యుత మనఃకలితాత్మవిచారకారణా!

టీ. కలుష + విదూర = దోసఁగులకు దవ్వైనవాఁడా, నిర్గత + వికార = తొలంగిన షడ్భావవికారములు గలవాఁడా, సుర + అంబుజ + సూర = వేల్పు లనియెడు తామరలకు వేవెలుంగా, సూరి + హృత్ + జలజ + విహార = మహాజ్ఞాను లనియెడు తామరలయందుఁ

గ్రీడ గలవాఁడా, చారు + సుఖ + సాగర = బ్రహ్మానందరసమునకు సముద్ర మయినవాఁడా, విశ్వ + శరీర = విరాడ్రూపమునఁ బ్రపంచమే మేనుగఁ గలవాఁడా, భూరి + నిర్మల + గుణ + వార = పెక్కులగు హేయములుగాని కళ్యాణగుణములగుంపు గలవాఁడా, వారిధి + సమాన + గభీర = కడలికి సెనయగు గాంభీర్యము గలవాఁడా, సుమేరు + ధీర = పసిఁడికొండవడువున ధీరుఁడ వైనవాఁడా, స... కారణా - సత్ = యోగ్య లయిన, నలినభవ + అభవ + అచ్యుత = నలువ శంకరుఁడు వెన్నుఁడు నను వీరియొక్క, మనస్ = హృదయములయందు, కలిత = ఒప్పుచున్న, ఆత్మవిచార = పరబ్రహ్మవిషయక మగు చర్చకు, కారణా = మూల మైనవాఁడా!

తా. జ్ఞానాజ్ఞానకృతములగు దురితములు లేనివాఁడవును, అజ్ఞాన కల్పితము లగు షడ్భావవికారము లేనివాఁడవును, వేల్పుల డెందములకు నిరంతరము నుల్లాసమును జేయువాఁడవును, మహాయోగులయొక్క మన స్సులయందు నెలకొని యున్నవాఁడవును, నిరతిశయానంద స్వరూపుఁ డవును, త్రాటియందు దోఁచెడు పాము త్రాటికి వేఱుగను, ముత్తెపుఁజిప్ప యందుఁ దోఁచు వెండి యా ముత్తెపుఁజిప్పకు వ్యతిరిక్తముగను, మొరడునందు చూపట్టెడు పురుషుఁ డా మొరడునకు భిన్నుఁడుగను నుండినయట్లు, తన యందు నజ్ఞానమునఁ గల్పితమగు బ్రపంచము తనకంటె వేఱుగాదు గాన, "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను శ్రుతిచే బ్రపంచమే స్వరూపముగఁ గల వాఁడవును, పెక్కు లగు కల్యాణగుణములు గలవాఁడవును "సముద్ర ఇవ గాంభీర్యే" అనుటచే గాంభీర్యమున సముద్రమున కెన యగువాఁడవును "ధైర్యేణ హిమవానివ" అనుటచే ధీరత్వమున హిమాలయమును బోలినవాఁ డవును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులయొక్క డెందముల యం:దలి పరతత్త్వ విచారణకు మూలమైనవాఁడవు నగు నో మహాదేవా! దేశికేంద్రా! యని

యాశ్వాసాంతమునఁ గృతిపతి యగు తన గురువునకు సంబోధనము. ముందు పద్యములయందుఁ గూడ నిట్లే తెలియునది. ౧౭౩

క. సర్వేశ్వర! సర్వోత్తమ !
సర్వవ్యాపారసాక్షి ! ★ సర్వాధారా !
సర్వజ్ఞ ! సర్వతోముఖ !
సర్వాధిష్ఠానభూత ! ★ సర్వాకారా ! ౧౭౪

టీ. సర్వ + ఈశ్వర = నిఖిలలోకములకును నేలికయైనవాఁడా, సర్వ + ఉత్తమ = "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అనుటచే నెల్లవారికంటె శ్రేష్ఠుఁడైనవాఁడా, సర్వ - వ్యాపార - సాక్షి = ఎల్లవారిచేఁతలను గనిపెట్టువాఁడా, సర్వ - ఆధారా = సమస్తప్రపంచమునకు నాశ్రయమైనవాఁడా, సర్వజ్ఞ = అన్నియుం దెలిసినవాఁడా, సర్వతోముఖ = "సహస్రశీర్షా పురుషః" అను మొదలగు శ్రుతిచే విరాడ్రూపమున నెల్లయెడలను మోములు గలవాఁడా, సర్వ - అధిష్ఠానభూత = సమస్తమునకును మూలకారణమైనవాఁడా, సర్వ - ఆకారా = సకలమును నిజస్వరూపముగఁ గలవాఁడా.

తా. సర్వాంతర్యామి వగుట సకలలోకములను నియమించువాఁడవును, పురుషోత్తముండ వగుటచే నెల్లవారికంటె శ్రేష్ఠుఁడవును, సకలప్రాణికోటులయొక్క నడవడికలను సాక్షిస్వరూపుఁడవై కనుంగొనువాఁడవును, సమస్తమునకు నాశ్రయభూతుఁడవును, సమస్తమును దెలిసికొనువాఁడవును, విరాడ్రూపమునఁ బెక్కుమోములు గలవాఁడవును, మహదాదికార్యకారణసంఘాతమునకు మూలకారణుఁడవును, పెక్కు లగు నాకారవిశేషములు గలవాఁడవు నగు గురువర్యా! యని తన యాచార్యుని సాక్షాత్పరమేశ్వరస్వరూపునిగ సంబోధనము. ౧౭౪

మాలినీవృత్తము.

ప్రణమితమునిజాలా! భాసురానంతలీలా!
ప్రణవజపనిధానా! బ్రహ్మవిద్యానిదానా!
ప్రణుతనిఖిలదేవా! భవ్యదివ్యప్రభావా!
గుణనిధి! జగదీశా! కోటిసూర్యప్రకాశా! ౧౭౫

టీ. ప్రణమిత - ముని - జాలా = మిక్కిలి మ్రొక్కఁబడెడు జడదారుల గమి గలవాఁడా, భాసుర + అనంత + లీలా = శోభిల్లుచున్న పెక్కులగు వినోదములు గలవాఁడా, ప్రణవ + జప + నిధానా = వేదమంత్రముల కెల్ల నాదిభూతమగు నోంకారముయొక్క పురశ్చర్యకుఁ బెన్నిధి యైనవాఁడా, బ్రహ్మవిద్యా + నిదానా = ఉపనిషద్విద్యకు మూలకారణ మైనవాఁడా, ప్రణుత - నిఖిల - దేవా = నీ మహిమను బొగడుచున్న యెల్ల వేల్పులను గలవాఁడా, భవ్య - దివ్య - ప్రభావా = మంగళప్రదమును దేదీప్యమానమునగు మాహాత్మ్యము గలవాఁడా, గుణ-నిధి = అపరిమితకళ్యాణగుణమణిగణములకు నాకర మైనవాఁడా, జగత్ - ఈశా = ఎల్లలోకములకును శాసకుఁడవైనవాఁడా, కోటి - సూర్య - ప్రకాశా = పెక్కండ్రు సూర్యులను బ్రకాశింపఁ జేయువాఁడా.

తా. నిరంతరమును మ్రొక్కఁబడుచున్న జడదారుల గమి గలవాఁడవును, శోభిల్లుచున్న పెక్కువినోదములు గలవాఁడవును, సకలవేదమంత్రములకు మొదటిమంత్ర మగు నోంకారముయొక్క పురశ్చరణకు గని యైనవాఁడవును, ఉపనిషద్విద్యకు మూలకారణ మైనవాఁడవును, ఎల్ల వేల్పులచేఁ గొనియాడఁబడుచున్నవాఁడవును, శ్రవణమాత్రమున మంగళప్రదమును సముజ్జ్వలము నగు మాహాత్మ్యము గలవాఁడవును, సకలసద్గుణమణిగణములకు గని వైనవాఁడవును, ఎల్లలోకములకును శాసకుఁడవును, "న తత్ర సూర్యోభాతి" అను మొదలగు శ్రుతిచే ననేకబ్రహ్మాండకోటుల

యందుఁ గల పెక్కుచంద్రుల వేవెలుంగులను వెలిఁగించుచున్న వాఁడవు నగు నో గురువర్యా! యని మునుపటివలె సంబోధనము. ౧౭౫

గద్య.

ఇది శ్రీమన్నారాయణ మహాదేవ గురుకరుణాకటాక్ష వీక్షణ విమలీకృత నిజహృదయ కమల కర్ణికాంత స్సందర్శితా ఖండ సచ్చిదానంద రసైకస్ఫూర్తి షట్చక్ర సీతారామ మూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతం బైన శ్రీ సీతారామాంజనేయసంవాదం బను యోగశాస్త్రంబునందు సాంఖ్యయోగానుభవ విచారం బనునది ద్వితీయాశ్వాసము సంపూర్ణము. ౧౭౬

ఈ యాశ్వాసాంతగద్యము ప్రథమాశ్వాసాంతమున గతార్థము.

మ. ఇది శ్రీవత్ససగోత్ర యజ్వకులవార్ధిం దాంధ్ర గీర్వాణవా
గ్విదితానూన కవిత్వతత్త్వవిలసద్వేదాంత సారస్వతా
స్పదచింతామణి మంత్రచింతన మిళత్తద్దర్శినీనాథ స
త్పదచింతామణి భాష్యసంవళిత సీతారామసామీరి సం
వదనంబందు ద్వితీయమయ్యె నిటులాశ్వాసంబువిశ్వాసమై.

ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర దుర్గాశాస్త్రి పౌత్త్రి నన్నయభట్టారక పుత్త్రి న్నమాంబాగర్భ కలశవారాశి కుముదినీమిత్ర శ్రీమన్మహామహో పాధ్యాయ గురు వేంకటార్యచ్ఛాత్ర శ్రీచింతామణి మంత్రో పాసనాసమాసాదిత సరస సారస్వత సుధారసపాత్ర షడ్దర్శినీపతి సుకవితా శతవధాని శ్రీ నారా యణచింతామణి కవిమిత్ర కృతం బగు శ్రీ సీతారామాంజనేయ సంవాద భాష్యమునందు ద్వితీయా శ్వాసము సమాప్తము.



శ్రీ రామచన్ద్ర పరబ్రహ్మణే నమః

ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ విరాజిత

# శ్రీ సీతారామాంజనేయసంవాదము

## తృతీయాశ్వాసము.




యోగీశ్వరదత్తా
త్రేయపదాంబుజవిధేయ ధీరనికాయ
ధ్యేయా! ఘనసచ్చిత్సుఖ
కాయ! మహాదేవ దేశికప్రభురాయా! ౧

టీ. శ్రీ...విధేయ - శ్రీ = బ్రహ్మజ్ఞాన సంపత్తి గల, యోగి - ఈశ్వర = మహాయోగులకు యోగమార్గమును శాసించెడు, దత్తాత్రేయ = దత్తాత్రేయు లను మహర్షియొక్క, పదాంబుజ = అడుగుఁదమ్ములకు, విధేయ = సంవాహనాది శుశ్రూషలచే లోఁబడియున్నవాఁడా, ధీర - నికాయ - ధ్యేయా = "మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః సమదుఃఖసుఖ శ్చైవ" అను లక్షణములు గల మహాధీరుల సమూహముచేత ధ్యానింపఁదగినవాఁడా, ఘన - సత్ - చిత్ - సుఖ - కాయ = దేశకాల వస్తుకృత పరిచ్ఛేదశూన్యమును నిత్యత్రికాలాబాధ్య

మును బోధమయమును నానందమును స్వరూపముగఁ గలవాఁడా, మహా దేవ + దేశిక + ప్రభురాయా = మహాదేవుఁ డను పేరు గల సద్గురువర్యా.

తా. బ్రహ్మజ్ఞానసంపన్ను లగు మహాయోగులకెల్ల నేలిక యగు దత్తాత్రేయ మహామునియొక్క చరణసరసిజములను నిరంతరమును సేవించు వాఁడవును, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వ సహిష్ణుత్వము గల మహాధీరులచే నిరంతరమును ధ్యానింపఁబడు చున్నవాఁడవును, సచ్చిదానందాఖండ స్వరూపుఁడవును నగు మహాదేవు లను పేరు గల యో సదాచార్యవర్యా, అని "మంగళాదీని మంగళమధ్యాని మంగళాన్తాని శాస్త్రాణి ప్రథంతే" అను నభియుక్తోక్తివలన నమనస్కయోగానుభవవిచారాత్మక మగు నీ యాశ్వాసమునకు మొదట నిజగురుసంబోధనరూప మగు మంగళమును గ్రంథకర్త యొనరించెను. ౧

వ. అవధరింపుము శ్రీ మహాదేవుం డమ్మహాదేవి కిట్లనియె, అట్లాంజనేయుండు పరమసాంఖ్య రాజయోగ సమాధి వలన మేల్కని, బ్రహ్మానంద భరితాంతఃకరణుం డై, తన ముందట నున్న శ్రీ సీతారామ గురునిం గనుంగొని, యనేక సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నిటల తటఘటితాంజలిపుటుం డై యి ట్లని వినుతించె. ౨

టీ. అవధరింపుము = ఓ మహాదేవాచార్యవర్యా, తొలుత నాకు నీ వుపదేశించిన రహస్యార్థము నాకు బోధించినదో లేదో నీవు విశదముగ కాఁ ఆకు గ్రంథరూపముగ నీ కిట్లు నేను జేయు కృతిని వినుము. శ్రీ మహా దేవుఁడు = అణిమా ద్యష్టైశ్వర్యములతోఁ గూడిన శంకరుఁడు, ఆ + మహాదేవికిన్ = చిద్రూపిణి యగు నా గౌరీదేవికి, ఇట్లు అనియెన్ = ముందుఁ జెప్పఁబోవు రీతిని నుడివెను; అట్లు = మీఁదఁ బలికిన విధమున, ఆంజనేయుండు = అంజనానందనుఁడు, పరమ + సాంఖ్య + రాజ

యోగ + సమాధివలనన్ = "చర్చాసంఖ్యా విచారణా" అను కోశముచే సంఖ్య యనఁగా నిచట నాత్మానాత్మవిచారణ గావున, సర్వోత్తమ మగు సదసద్విచారణాత్మక మైన "రాజవిద్యా రాజగుహ్యం" అనునట్లు రాజ విద్యవలనఁ గలిగిన యసంప్రజ్ఞాతసమాధినుండి, మేల్కాని = ప్రాపంచిక జ్ఞానములోనికి దిగి, బ్రహ్మానంద + భరిత + అంతఃకరణుండు - ఐ = స్వస్వరూపావలోకనమువలనఁ గలిగిన పరమసుఖముచేఁ బరిపూర్ణ మగు డెందము గలవాఁడగుచు, తన + ముందఱన్ = తనయొక్క యెదుటను, ఉన్న + శ్రీ సీతారామ + గురునిన్ = చిద్రూపిణి యగు వైదేహితోఁ గలసియున్న శ్రీ రామచంద్ర దేశికేంద్రుని, కనుంగొని = అవలోకించి, అనేక సాష్టాంగ దండ - ప్రణామంబులు = కఱ్ఱ నేలపైఁ బడవేయుఁగాఁ బుడమిని సరిగ నంటుకొని యున్నట్లు భూమిపై సాఁగిలఁబడిన వక్షః స్థలము నుదురు చూడ్కి డెందము వాక్కు పాదములు చేతులు చెవులు నను నీ యెనిమిది యవయవములతోను వందనములు, ఆచరించి = ఒనరించి, నిటల - తట - ఘటిత - అంజలి - పుటుండు - ఐ = నుదుటిపట్టునఁ గూర్పఁబడిన కేలుమోడ్పు గలవాఁ డగుచు, ఇట్లు - అని - వినుతించెన్ = ముందుఁ జెప్పఁబోయెడు విధమున స్తోత్రము చేసెను.

తా. ఓ మహాదేవ దేశికేంద్రా ! నీవు నే నంకితముగఁ జెప్పుకృతిని వినుము. శ్రీ శంకరమూర్తి గారీదేవితో ముందుఁ జెప్పఁబోవు రీతిని వచి యించెను. ఆ రీతిని హనుమంతుఁడు శ్రీ రామచంద్రుని యుపదేశబలమునఁ దన కలవడిన సదసద్విచారణాత్మక మగు శ్రీ రాజవిద్యయొక్క యను సంధానమువలనఁ గలిగిన యసంప్రజ్ఞాత సమాధినుండి మరలఁ బ్రాపంచిక జ్ఞానములోఁ బడి యాసమాధినిష్ఠలోఁ దన కనుభూతమై స్మరణకు వచ్చిన నిరతిశయసుఖముచే నిండినడెందము గలవాఁడై, తనయొక్క యెదుటను చిద్రూపిణి యగు పరదేవతలోఁ గలసియున్న శ్రీ రామచంద్ర దేశికేంద్రుని

నవలోకించి పెక్కు లగు సాష్టాంగ నమస్కారములను గావించి, నుదుటి పట్టునఁ జేర్పఁబడిన కేలుమోడ్పుతో నీ పగిదిం గొనియాడెను. ౩

శ్రీరామ స్తవరూప దండకము.

శ్రీరామరామా! త్రిలోకాభిరామా! పరంధామ! నిష్కామ! సంపూర్ణ కామా! బుధేం ద్రాంతరంగాబ్ధి సోమా! లసద్దివ్యనామా! విరాజద్గుణస్తోమ! యుష్మత్స్వ కాశ స్వరూపం బవాచ్యం బచింత్యం బనంతం బసంగం బఖండం బబాధ్యం బబోధ్యం బసాధ్యం బభేద్యం బవిచ్ఛేద్య మాద్యంతశూన్యం బజం బప్రమేయం బవిజ్ఞేయ మధ్యేయ మద్వంద్వ మవ్యక్త మగ్రాహ్య మధ్యాత్మ మేకం బరూపం బనాఖ్యం బరక్తం బశుక్లం బకృష్ణం బపీతం బపీనం బసూక్ష్మం బదీర్ఘం బహ్రస్వం బబాహ్యాంతరం బక్షరం బవ్యయం బింద్రియాగోచరం బప్రతర్క్యం బనిర్దేశ్య మాద్యం బదృశ్యం బకంపం బలక్ష్యం బలిప్తం బశబ్దం బసంస్పర్శభూతం బరూపం బనుస్వాదుగంధం బవాఙ్మానసప్రాప్యమై పూర్ణమై నిత్యమై సత్యమై శుద్ధమై బుద్ధమై ముక్తమై శాంతమై కేవలంబై నిరాకారమై సచ్చిదానందరూపాత్మచైతన్యమై సర్వభూతోరుదేహేంద్రియప్రాణహృద్బుద్ధ్యహంకార చిత్తాది దృశ్యప్రపంచంబు నాదిత్యుఁ డీవిశ్వ మెల్లన్ వెలింగింపఁగాఁ జేయురీతిన్ బ్రకాశింపఁగాఁ జేయఁగా సాక్షివై యాకసం బేకమై సర్వభాండంబులం దంతటన్ లోపలన్ వెల్పల న్నిండి యున్నట్టు లాకాశ వాయ్వగ్ని వార్భూమి నానావిధాశేష భూతంబులం దంతటన్ నిర్లిప్తుండవై యుండి కర్తృత్వ భోక్తృత్వ మంతృత్వ భర్తృత్వ హర్తృత్వముల్ నామరూప

క్రియోపాధివర్ణాశ్రమంబుల్ గుణంబుల్ వివేకావివేకంబులుఁ శోకమోహంబులుఁ లేక యీస్థూలసూక్ష్మాదులఁ జాగర స్వప్న సుషుప్త్యాదులఁ బంచభూతంబులఁ బంచకోశంబులం జూచుచుఁ నిర్వికారుండవై నిర్వికల్పుండవై నిర్విచేష్టుండవై నిష్ప్రపంచుండవై నిర్విశేషుండవై నిర్గుణబ్రహ్మమాత్రుండవై యొప్పు నీదివ్యతత్త్వంబు నీసత్కృపాసంభృతాంచత్కటాక్షంబుచేతం గనుంగొంటి దేవా! నమస్తే నమస్తే నమస్తే నమః

టీ. శ్రీరామరామా = "అత్యాదరా ద్ద్విరుక్తిః" అనుటచేత నిచ్చట మిగుల నాదరణతో నాంజనేయుఁడు ఓ శ్రీరామ, రామా, యని రెండు సారులు శ్రీ రామమహామంత్రముతో నిజగురుమూర్తి యగు శ్రీరామచంద్రుని సంబోధించెను. త్రి + లోక + అభిరామా = దివ్య సుందర మంగళ విగ్రహుం డగుటచే స్వర్గమర్త్యపాతాళము లను మూఁడులోకములవారికిని మనోహరుఁ డైనవాఁడా, పరంధామ=సూర్యాది తేజస్సుల కన్నిటికిం బరమై స్వయంప్రకాశమానమగు వెలుఁగు గలవాఁడా, ధామశబ్ద మిచట తేజోవాచకము; నిష్కామ = అవాప్త సర్వకాముఁడ వగుటచే నేకోరికయు లేనివాఁడా, సంపూర్ణ+కామా=సత్యసంకల్పుఁడ వగుటచే నీడేఱిన సకలమనోరథములు గలవాఁడా, యని నిష్కామత్వ మునకు సంపూర్ణకామత్వము హేతువు; బుధ + ఇంద్ర + అంతరంగ + అబ్ధి + సోమా = మహాజ్ఞానులయొక్క డెంద మనియెడు సముద్రమునకుఁ బున్నమచందమామ యైనవాఁడా, లసత్ + దివ్య + నామా = అంత టను ప్రసిద్ధమై విలసిల్లుచున్న నిజనామమంత్రము గలవాఁడా!, విరాజత్ + గుణ + స్తోమ = శ్రేష్ఠములై యొప్పుచున్న సర్వేశ్వరత్వ సర్వజ్ఞత్వాది కల్యాణగుణములయొక్క గణము గలవాఁడా, యుష్మత్ + ప్రకాశ + స్వరూపంబు = తమయొక్క (దేవరవారియొక్క) సర్వమును

ప్రకాశింపఁజేయు (తెలియఁజేయు) చిత్స్వరూపము, అవాచ్యంబు = ఇట్టిది యని నుడువుటకు వలనుపడనిది; అచింత్యంబు="అప్రాప్య మనసా సహ" అను శ్రుతిచేత చిత్తముచేఁ జింతించుటకు శక్యముగానిది, అనంతంబు = తుదిలేనిది, అసంగంబు = దేని నంటనిది, అఖండంబు = అపరిచ్ఛిన్న మయినది (తెంపులేనిది), అబాధ్యంబు = దేనిచేనైన బాధింపఁబడనిది, అబోధ్యంబు = ఎవ్వరికినిఁ దెలియఁబడనిది, అసాధ్యంబు = కర్మములచేఁగాని విత్తముచేఁగాని సంతతిచేఁగాని సాధింపఁబడనిది "న కర్మణా న ప్రజయాధ నేన త్యాగేనై కేన అమృతత్వమానశుః" అనియిందులకు శ్రుతి ప్రమాణము, అభేద్యంబు = "ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతినిబట్టి సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిదిగాన భేదించుటకు శక్యముగానిది, అవిచ్ఛేద్యము = "అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయం" అను మొదలగు భగవద్గీతవలన ఖండించుటకు వశముకానిది, ఆది+అంత + శూన్యంబు = మొదలు తుది లేనిది, అజంబు = "అజా మేకాం లోహిత శుక్లకృష్ణామ్" అను మొదలగు శ్రుతిచేఁ ద్రిగుణాత్మికయు జగజ్జన్మాదికారణభూతయు నగు సాక్షాత్పరాశక్తి తన స్వరూపముగఁ గలది; అప్రమేయంబు = అనుమానాది ప్రమాణములచే సాధింపఁదగనిది, అవిజ్ఞేయము = తెలియఁబడనిది, అధ్యేయము = ధ్యానింప వీలులేనిది, అద్వంద్వము=అవస్థాత్రయాతీత మగుటంజేసి శీతోష్ణసుఖదుఃఖాదులు లేనిదియు, అవ్యక్తము = "అణో రణీయాన్" అను శ్రుతిచేఁ బరమసూక్ష్మ మైనదిగాన వ్యక్తము కానిదియు, అగ్రాహ్యము = "యన్మనసా నమనుతే - యచ్చక్షుషా నపశ్యతి - యచ్ఛోత్రేణ నశృణోతి" అను మొదలగు శ్రుతివచనములచే సమస్తములగు నింద్రియములకును బట్టువడనిదియు, అధ్యాత్మము = "స్వభావోఽధ్యాత్మ ముచ్యతే" అను గీతావచనమునుబట్టి "స్వస్యాత్మనో భావ స్స్వాత్వం" అను వ్యుత్పత్తిచే నాత్మతత్త్వస్వరూపమును, ఏకంబు = "ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిచే నద్వి

తీయమును, అరూపంబు = "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం" అను శ్రుతిచేఁ జక్షురింద్రియవిషయము కానిదియు, అనాఖ్యంబు = "రూపం నాహం నామనాహం నకర్మ బ్రహ్మైవాహం సచ్చిదానందరూపం అనాఖ్య మనభివ్యక్తం సత్కించి దవశిష్యతే" అను శ్రుతిచే నామరూపములు లేనిదియు, అరక్తంబు - అశుక్లంబు - అకృష్ణంబు - అపీతంబు = ఎఱ్ఱనిదియు - తెల్లనిదియు - నల్లనిదియు - పచ్చనిదియును - గానిదియును; అపీనంబు అసూక్ష్మంబు - అదీర్ఘంబు - అహ్రస్వంబు = బలసినదియు-సన్ననిదియు - చిన్నదియు - నిడుపైనదియు-కుఱుచయైనదియుఁ గానిదియు, అబాహ్యాంతరంబు = వెలుపలిదియు లోపలిదియుఁ గానిదియు, అక్షరంబు = వినశ్వరము గానిదియు, అవ్యయంబు = తఱుఁగనిదియు, ఇంద్రియ + అగోచరంబు = పదునాఱగు ఇంద్రియములకును విషయము కానిదియు, అప్రతర్క్యంబు = తర్కించుటకు శక్యము గానిదియు, అనిర్దేశ్యము = ఇట్టిదని నిర్దేశించుటకు నలవిగానిదియు, ఆద్యంబు = అన్నిటికిని మొదటిదియు, అదృశ్యంబు = దృశ్యమగు ప్రపంచమునకు విలక్షణమైనదియు, అకంపంబు = చలనము లేనిదియు, అలక్ష్యంబు = "లక్షణావృత్తిబోధ్యేఽర్థే శరవ్యోద్దేశ్యయోరపి । జ్ఞేయేఽనుమేయే లక్ష్యం స్యాత్" అను నిఘంటువుచే నుద్దేశింపఁదగినది గాని తెలియఁదగినదిగాని యనుమేయింపఁదగినది గాని కానిదియు, అలిప్తము = అజ్ఞానముచేఁ బూయఁబడనిదియు, అశబ్దంబు = "అశబ్ద మస్పర్శ" మను శ్రుతిచేతను ఆకాశము యొక్క గుణమును శ్రవణేంద్రియమునకు విషయమునగు శబ్దము కానిదియు, అసంస్పర్శభూతంబు = గాలికి గుణమును త్వగింద్రియమునకు విషయము నగు స్పర్శము కానిదియు, అరూపంబు = అగ్నికి గుణమును నేత్రేంద్రియమునకు విషయము నగు రూపము కానిదియు, అసుస్వాదు+గంధంబు = జలమునకు గుణమును రసనేంద్రియమునకు విషయము నగు చవియును బుడమికి గుణమును ఘ్రాణేంద్రియమునకు విషయమునగు గంధమును కానిదియు,

అవాఙ్మానసప్రాప్యమై = "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను శ్రుతిచేత మాటలకును డెందమునకును గోచరము కానిదియు, పూర్ణము-ఐ = "పూర్ణమదః పూర్ణ మిదం" అను మొదలగుశ్రుతిచేత నెల్లయెడల నెడ లేకయున్నదియు, నిత్యము-ఐ=స్థిరమైనదియును, సత్యము-ఐ=సద్రూపమైనదియు, శాంతము - ఐ=తరఁగలులేని కడలివడువునను గాలిలో లేని దీపముచందమునను వృత్తిరహితం బైనదియును, ముక్తము - ఐ= సంసారబంధమునుండి వదలఁబడినదియును, కేవలంబు - ఐ = తనకంటె వేఱొండు లేనిదియును, నిరాకారము - ఐ = దృశ్యమగు రూపము లేనిదియును, సత్ + చిత్ + ఆనంద + రూప + ఆత్మ + చైతన్యము-ఐ = సత్తును చిత్తును - ఆనందమును స్వరూపముగఁ గల తన చైతన్యము గలదియై, సర్వ...ప్రపంచంబున్—సర్వ + భూత = సమస్తప్రాణులయొక్క, ఉరు + దేహ = పాంచభౌతికము లగు మేనులును, ఇంద్రియ = త్వగాదులును వాగాదులు నగు పది యింద్రియములును, ప్రాణ = ప్రాణాపానవ్యానోదానసమానము లను వాయువులును, హృత్ = డెందము, బుద్ధి= తెలివి, అహంకార = అభిమానము, చిత్త = స్వాంతము, ఆది = లోనగు, దృశ్య = కనఁబడుచున్న, ప్రపంచంబున్ = జగద్విస్తారమును, ఆదిత్యుండు=భాస్కరుండు, ఈ+విశ్వము - ఎల్లన్ = ఈప్రపంచము నంతను, వెలింగింపన్-కాన్ - చేయు-రీతిన్ = భాసిలఁజేయుచున్న తీరున, ప్రకాశింపన్-కాన్ - చేయన్ - కాన్ = వెలుఁగొందునట్లొనరించు చుండఁగా, సాక్షివి - ఐ = తటస్థముగఁ జూచుచున్నవాఁడ వగుచు, ఆకసంబు - ఏకము - ఐ = అంతరిక్షము ఒకటియే యగుచు, సర్వ+భాండంబులందు- అంతటన్ = ఘటము లన్నింటియందును, లోపలన్ = అంతర్భాగమునందును, వెల్పలన్ = బహిర్భాగమునందును, నిండియున్నట్టులు = వ్యాపించియున్న విధమున, ఆకాశ...అందున్ - ఆకాశ + వాయు + అగ్ని + వార్ + భూమి = మిన్ను - గాలి - నిప్పు - నీరు - పుడమి యను మహా

భూతము లైదింటియందును, నానావిధ = పలుతెఱంగులంగల, అశేష = సమస్తములగు, భూతంబులందున్ = జంతుజాలములయందును, అంతట్ = లోను వెలుపలను, నిర్లిప్తుండవు = వానియొక్క గుణదోషముల నంటనివాఁడవు, ఐ - ఉండి = అగుచున్నవాఁడవై - కర్తృత్వ + భోక్తృత్వ + మంతృత్వ + భర్తృత్వ + హర్తృత్వములు = చేయువాఁడవు - భుజించువాఁడవు - తెలియువాఁడవు - భరించువాఁడవు - హరించువాఁడవు నగుటలును, నామ + రూప + క్రియా + ఉపాధి + వర్ణ + ఆశ్రమంబులు = రామకృష్ణాదు లగు పేళ్లును - నాకారములు - పనులు - గృహక్షేత్రారామాద్యుపాధులు- బ్రాహ్మణాది వర్ణములు - బ్రహ్మచర్యాద్యాశ్రమములును, గుణంబుల్ = శౌర్యధైర్యాది గుణములును, వివేక + అవివేకంబులు = వివేచనయు వివేచనలేమియు, శోక + మోహంబులు = దుఃఖము మోహమును, లేక = సంభవింపక, ఈ + స్థూల + సూక్ష్మ + ఆదులక్ = పైని జెప్పిన నామరూపాదులగు స్థూలధర్మములును, శౌర్యధైర్యాదులగు నాంతరధర్మములును మొదలగువానిని, జాగర + స్వప్న + సుషుప్తి + ఆదులక్ = మేలుకువ - కల- నిదుర- మొదలగు నవస్థలను, పంచ - భూతంబులక్ = పృథివ్యాదిపంచమహాభూతములను, పంచకోశంబులక్ = అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లనుకోశముల నైదింటిని, చూచుచుక్ = కనుఁగొనుచు, నిర్వికారుండవు - ఐ = అట్లు చూచుటవలనఁ గలిగెడు వికారములు లేనివాఁడవై, నిర్వికల్పుండవు - ఐ = ఎట్టి సందియములును లేనివాఁడ వగుచు, నిర్విచేష్టుండవు - ఐ = ఏ వ్యాపారములును లేనివాఁడవయి, నిష్ప్రపంచుండవు - ఐ = ప్రపంచసంబంధము లేనివాఁడవై, నిర్విశేషుండవు - ఐ = ఎట్టి విశేషములును లేనివాఁ డగుచు, నిర్గుణ + బ్రహ్మ + మాత్రుండవు - ఐ = గుణత్రయాతీత మగు కేవలపరబ్రహ్మస్వరూపుండ వగుచు, ఒప్పు + నీ + దివ్య + తత్త్వంబుక్ = ప్రకా

శించు నీ సంబంధమగు లోకోత్తరమైన వాస్తవస్వరూపమును, నీ... చేతన్-నీ = నీయొక్క, సత్ = యోగ్యమగు, కృపా = కనికరముచేత, సంభృత = పరిపూర్ణమయిన, అంచత్ = విలసిల్లుచున్న, కటాక్షంబుచేతన్ = "కటం గండం అక్షతి వ్యాప్నోతీతి కటాక్షః" అను వ్యుత్పత్తిచేత కటమును (గండస్థలమును) వ్యాపించునదిగాన కటాక్షమునఁ బఱునట్టి యపాంగావలోకనముచేత, కనుఁగొంటిన్ = అపరోక్షముగఁ దెలిసికొంటిని, దేవా = ఓ దేవరా, తే = నీకొఱకు, నమః = వందనము, నమస్తే నమస్తే నమః - అను నీ యభ్యాసము భక్త్యతిశయమును సూచించుచున్నది.

తా. మోక్ష సంపద్యుక్తుఁడ వగు నో రామచంద్రా! కందర్పకోటి సౌందర్యముచే ముజ్జగములం గల స్త్రీపురుషాదులకు మనోహరుఁ డయిన వాఁడవును, వేవెలుఁగు రేవెలుఁగు మొదలగు వెలుఁగులకెల్లఁ బరమగు చైతన్యదీప్తి గలవాఁడవును, ఎట్టి కోరికలు లేనివాఁడవు గావుననే యవాప్త సర్వకాముఁడ వగుటచేఁ బూర్తిగ నెఱవేఱిన సకలవాంఛలు గల వాఁడవును, మహాయోగులయొక్క యంతఃకరణ మనియెడు పాలకడలి నుప్పొంగఁజేయు పున్నమచందమామవును, పఠనమాత్రముచే సకలలోకములను బవిత్రములుగఁ జేయుచున్న పెక్కులగు నామమంత్రములు గల వాఁడవును, విశేషముగ రాజిలుచున్న యనంతములగు కల్యాణ గుణములకు గని యైనవాఁడవును, నగు నీయొక్క స్వప్రకాశమగు పరమాత్మ స్వరూపము ఇట్టిదని వాక్రుచ్చుటకు నలవికానిదియు, మనస్సుచే నిట్టిదని తెలిసికొనుటకు శక్యము కానిదియు, తుది లేనిదియు, దేనియొక్క సంసర్గమును లేనిదియు, దేశకాల వస్తుకృత పరిచ్ఛేదము లేనిదియు, కాలత్రయాబాధితమును, నిట్టిదని బోధించుటకు నలవి గానిదియు, ఎట్టియుక్తులచే నైన సాధింపఁబడనిదియు, ప్రత్యగభిన్నం బగుటచే భేదముచేయ నలవి గానిదియు ("మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి"

అని శ్రుతి భేదము చేయువానిం దిట్టుచున్నది. "అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ" అనుటచే ఖండింప నలవి గానిదియు తుదియు మొదలును లేనిదియుఁ, బుట్టువులేనిదియు, నెట్టిప్రమాణములకును గోచరము కానిదియు, విజ్ఞానమునకు నగోచరమయినదియు, ధ్యానించుటకు నలవిగానిదియు, శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములు లేనిదియు, నగును. సాంఖ్యసమ్మత మగు ప్రధానముగూడ నిట్టిదియే గాన, నాప్రధానమే యాత్మతత్త్వము గావలయు ననిన, నది జడమగుటచేతఁ గా నేరదు) మఱియు నింద్రియాదులచే గ్రహింప నలవిగానిదియుఁ, బరమాత్మస్వరూప మైనదియు, "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిచే సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనిదియు, కరచరణాద్యవయవవిశిష్ట మగు నాకారము లేనిదియు, పేరు లేనిదియు, నెఱుపు తెలుపు నలుపు పసపు మొదలగు రంగులు లేనిదియు, బలుపు సన్నన నిడుపు కుఱుచలు లేనిదియు, వెలుపలిది లోనిది కానిదియు, వినశ్వరము కానిదియు, తఱుఁగనిదియు, నింద్రియములకు విషయము కానిదియు, తర్కములచేఁ దర్కింపఁబడనిదియు, నిర్దేశింపరానిదియు, సకలకారణ మైనదియు, దృశ్యజాతమునకు విలక్షణమును, జననము లేనిదియు, గుర్తింపరానిదియు, నజ్ఞానముచేఁ బూయఁబడనిదియు, శబ్దస్పర్శరూప రసగంధములకు విలక్షణంబును, మాటలకును డెందమునకు నందనిదియు, నంతట నిండియున్నదియు నగు నిత్య సత్య శుద్ధ బుద్ధ ముక్త శాంత కేవల నిరాకార సచ్చిదానంద స్వరూప మగు నిజచైతన్యము పంచమహాభూతములును, భౌతికము లగు స్థూలోపాధులును, దశవిధేంద్రియంబులును, పంచప్రాణములును, మనోబుద్ధిచిత్తాహంకారాత్మక మగు నంతఃకరణచతుష్టయమును, లోనగు జడమై సాక్షి యగు నాత్మకు గోచర మగు నీ నిఖిల ప్రపంచమును దివాకరుఁడు లోకములను బ్రకాశింపఁ జేయుచున్నట్లు భాసిలఁ జేయుచుండఁగా నంతకును ద్రష్టయగుచు నొక్కయంతరిక్షము కడవలన్నిటియొక్క లోనుం బైని వ్యాపించియున్నవిధ

మున మిన్ను మన్ను మొదలగు సమస్త భూతజాతములయందును వ్యాపించి వాని నంటకయున్నవాఁడవయి, పనులం జేయుట యనుభవించుట లయించుట పూనుకొనుట సంహరించుట మొదలగునవియు పేరు రూపు యిల్లు వాకిలి జాతి నీతి మంచి చెడ్డ తెలివి తేట కష్టము సుఖము ఆఁకలి దప్పి నియమము నిష్ఠ మొదలగునవియును లేక, పైని జెప్పంబడినట్టి చక్షురాదీంద్రియములకు గోచరములును కేవల మనోబుద్ధ్యాదులకు గోచరములును నగు పదార్థములును మెలఁకువ కల నిదుర మొదలగు నవస్థలను, బుడమి మొదలగు పంచభూతములను నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లను పంచకోశములను సాక్షివై పరికించుచు నట్లు వానిం జూచుటవలన వికృతి నొందక యెట్టివికల్పములును లేక, యే వ్యాపారములును లేక, ప్రపంచసంబంధ మించుకయును లేక, యెట్టివిశేషములును లేక, గుణత్రయాతీత మగు కేవలపరబ్రహ్మస్వరూపుఁడ వగుచుఁ బ్రకాశించుచున్న నీయొక్క వాస్తవస్వరూపమును నీయొక్క జాయమాన కరుణారసపరిపూర్ణమగు నపాంగావలోకనముచేత నపరోక్షముగఁ గాంచి తెలిసికొంటిని. దేవరా! నీకు మున్నూటికిని మ్రొక్కుచున్నాను.

అవ. పరమపురుషుని విశ్వమయునిఁగ నుతించుచున్నాఁడు.

ఇంద్రవజ్రావృత్తము.

విశ్వాంతరావాసక! శ్రీ విశ్వమూర్తీ!
విశ్వజ్ఞ! విశ్వోదర! శ్రీ విశ్వవంద్యా!
విశ్వాత్మ! విశ్వాతిగ! శ్రీ విశ్వసాక్షీ!
విశ్వాది! విశ్వేశ్వర! శ్రీ విశ్వరూపా! ౪

టీ. విశ్వ + అంతర్ + ఆవాసక = "విశ్వం జగతి సంసారే జీవే తదభిమానిని। శ్రాద్ధదేవవిశేషేచ పుంసిస్యా త్సకలే త్రిషు" అను నిఘం

టువు చేఁ బ్రపంచముయొక్క లోపల నంతర్యామిరూపమున నున్నవాఁడా, విశ్వ+మూర్తి = "భూః పాదౌ యస్య నాభి ర్వియత్" అను మొదలుగఁ జెప్పఁబడిన విరాడ్రూపము చేత సకలలోకములే శరీరముగఁ గలవాఁడా, విశ్వ + జ్ఞ = సర్వమును దెలిసినవాఁడా, విశ్వ + ఉదర = అనేక కోటి బ్రహ్మాండములు కడుపునందుఁ గలవాఁడా, విశ్వ + వంద్యా = ఎల్లవారిచేతను మ్రొక్కఁబడుచున్నవాఁడా, విశ్వ + అక్ష = "సహస్ర శీర్షాపురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్" అను శ్రుతిచేత సకలప్రాణి స్వరూపుఁడ వగుటవలనఁ బెక్కులు కన్నులు గలవాఁడా, విశ్వ - అతిగ= ప్రపంచమునకు నతీతుఁడ వైనవాఁడా, విశ్వ+సాక్షీ = సమస్తమునకును ద్రష్టవైనవాఁడా, విశ్వ + ఆది = ప్రపంచమునకు మూలకారణమైన వాఁడా, విశ్వ+ఈశ్వర = సకలలోకములకును శాసకుఁడ వైనవాఁడా, విశ్వ + రూపా = ప్రపంచము స్వరూపముగఁ గలవాఁడా.

తా. ఓ దేవా ! నీవు సకలభూతములయందు నంతర్యామి యై నివసించి యున్నావు. పుడమి మొదలగులోకములను పాదములు మొదలగు నవయవములుగఁ గల విరాట్స్వరూపుఁడవు; నీకుఁ దెలియని సంగతు లెవ్వియును లేవు; అనేక కోటిబ్రహ్మాండములు గర్భమునందుఁ గలవాఁడవు; ఎల్లవారిచే నిరంతరమును మ్రొక్కఁబడుచున్నావు. పెక్కులు గన్నులు గలవాఁడవు; ప్రపంచము నతిక్రమించి యున్నావు. సమస్తమునకును సాక్షివై యున్నావు; సకలభువనముల యుత్పత్తిస్థితిలయములకు మూల కారణభూతుఁడవు; ఎల్లలోకములను శాసించుచున్నావు నీవు సర్వస్వరూపుఁడ వైతివి. ౪

అవ. ఇట్లు ప్రపంచ స్థితికాలమునందలి భగవద్రూపమును గొనియాడి, భగవంతుఁడు యోగనిద్రలో నున్నతఱి స్వరూపమును నుతించుచున్నాఁడు.

ఉపేంద్రవజ్రావృత్తము.

నిరీశ ! నిష్కారణ ! నిర్వికల్పా !
నిరీహ ! నిర్వాణద ! నిర్వికారా !
నిరామయా ! నిర్గుణ ! నిర్విశేషా !
నిరంతరానంద ! వినిశ్చితాత్మా! ౫౫

టీ. నిరీశ = నీ కొకశాసకుఁడు లేనివాఁడా, నిష్కారణ=నీకంటె వేఱగు నొక కారణము లేనివాఁడా, నిర్వికల్పా = ఎట్టి సందియములును లేనివాఁడా, నిరీహ = ఏ తలంపులును లేనివాఁడా, నిర్వాణద=స్వాశ్రితులకు సంసారబంధవిముక్తి నిచ్చువాఁడా, నిర్వికారా = జనన మరణాది వికృతులు లేనివాఁడా, నిరామయా = ఏరోగములు లేనివాఁడా, నిర్గుణ = హేయగుణములు లేనివాఁడా, నిర్విశేషా = నీ కన్నియు విశేషములుగాని నీవు దేనికిని విశేషమవు గానివాఁడా, నిరంతర + ఆనంద = తెంపులేని యానందము స్వరూపముగాఁ గలవాఁడా, వినిశ్చిత + ఆత్మా = శ్రుతి స్మృత్యాదిప్రమాణములచే నిశ్చయింపఁబడిన స్వరూపము గలవాఁడా.

తా. ఓ పరమపురుషా! నీ కొకశాసకుఁడుగాని నీయుత్పత్త్యాదుల కొకకారణముగాని సందియముగాని కోరికలుగాని పుట్టువు చావు ముదిమొదలగు మార్పులుగాని రోగములుగాని విశేషములుగాని హేయగుణములుగాని లేవు. నీవు స్వాశ్రితులకు సంసారబంధమునుండి విడుదల నొసంగుదువు. నిరతిశయమగు పరమసుఖము స్వరూపముగాఁ గలవాఁడవు. శ్రుతి స్మృతి పురాణేతిహాసములచే నిశ్చయింపఁబడినది. ౫౬

పృథ్వీవృత్తము.

చరాచరకృతప్రపంచమయ - సర్వసంసారభృత్
క్షరాక్షరవిలక్షణా! గతవి-కార! చిల్లక్షణా!

పరాపర! సనాతనా! ౕ పరమ-పావనోద్ద్యోతనా!
పురాణపురుషో_త్తమా! ౕపురుష-పూర్ణ! విద్వ_త్తమా!

టీ. చర...విలక్షణా - చర = జంగమాత్మకము లగు దేవ మానవ తిర్యగాదులచేతను, అచర = స్థావరములైన కొండలు చెట్లు మొదలగు వానిచేతను, కృత = సృజింపఁబడిన, ప్రపంచమయ = చతుర్దశభువనాత్మక మగు, సర్వ + సంసార = ఆజవంజవము నెల్లను, భృత్ = వహించిన, క్షర + అక్షర + విలక్షణా = "క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే" అనుటచేత క్షరము లనఁబడెడు సకలభూతముల కంటెను అక్షరుం డనఁబడెడు కూటస్థుకంటెను వ్యతిరిక్త మయినవాఁడా, గతవికార = పోయిన షడ్భావవికారములు గలవాఁడా, చిత్ + లక్షణా= పరిశుద్ధచైతన్యమే లక్షణముగ (స్వరూపముగఁ) గలవాఁడా, పరా + పర = "అపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వవేద శ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి। అథపరాయయా తద క్షర మధిగమ్యతే" అను శ్రుతి చేతఁ జెప్పఁబడిన పరాప్రకృతియు నపరాప్రకృతియు నీవే యైనవాఁడా, సనాతనా = అనాదికాలమునుండి యున్నవాఁడా, పరమ+పావన + ఉద్ద్యోతనా = అజ్ఞానసంబంధము లేమింజేసి మిగులఁ బవిత్రమగుచైతన్యదీప్తి కలవాఁడా, పురాణ+పురుష+ ఉత్తమా = సృష్టిస్థితిలయకర్త లగుటచే నెల్లరకుం బూజ్యు లగు బ్రహ్మవిష్ణురుద్రాదులకుఁ బ్రధానుఁడా, పురుష + పూర్ణ = పురుషశబ్దవాచ్యులగు జీవులందఱిలోను వ్యాపించి నిండియున్నవాఁడా, విద్వ_త్తమా = బ్రహ్మవిద్వరిష్ఠుఁడా.

తా. స్థావరములు జంగమములు నగు స్థూలోపాధులచేత రచియింపఁబడిన నిఖిలప్రపంచరూప మగు నీసంసారమునెల్లఁ బూనుకొనియున్న పృథివ్యాదిపంచమహాభూతములకంటెను నవిద్యోపహితు లగు జీవులకంటెను

వ్యతిరిక్తుఁడవును, చావు పుట్టువు ముదిమి మొదలగు మార్పులు లేనివాఁడవును, శుద్ధబోధస్వరూపుఁడవు నై పరాప్రకృతి యపరాప్రకృతి యను రెండుప్రకృతులు నీవయై యుంటివి. అనాదియగు కాలమునకుఁ గూడ ముందున్నవాఁడవు; మిగులఁ బరిశుద్ధమగు చైతన్యదీప్తి కలవాఁడవు; బ్రహ్మ విష్ణు రుద్రాదు లగు నాదిపురుషులకుఁ గూడ నుత్తముండవు. నిఖిల జీవులందు నంతర్యామివై వ్యాపించియున్నవాఁడవు. బ్రహ్మవిద్వరిష్ఠుఁడవు దేవా నీ వగుదువు.

"జసల్ జసయవంబుల్గకరసంఖ్య విశ్రాంతులున్" అని యీ పృథ్వీవృత్తమునకు లక్షణవేత్తలు పండ్రెండవ యక్షరమును విశ్రమస్థానముగఁ జెప్పిరి. ఐనను సంస్కృత ఛందశ్శాస్త్రములయందు నీవృత్తమునకు విరామము ఎనిమిది యక్షరములపైని బ్రతిచరణమునకుఁ జెప్పఁబడి యున్నది. సాధారణముగ వృత్తములకు సంస్కృతములోఁ జెప్పఁబడిన విరామస్థలము నందే తెలుఁగులోఁ గూడ నాయా వృత్తములకు విశ్రమస్థాన మేర్పఱుపఁ బడుచున్నది. ఇట్లుండఁగా నీవృత్తమునకుఁ బండ్రెండవ యక్షరముకంటె తొమ్మిదవయక్షరము విశ్రమ మగుటయే చదువుటకు సౌకుమార్యముగ నుండును. కావుననే యీ మహాకవి యాంధ్రలక్షణవేత్తలశాసనమును శిరసున వహించుచుఁ బండ్రెండవయింటను సంస్కృత ఛందశ్శాస్త్ర సంప్రదాయానుసారముగఁ దొమ్మిదవయింటనుగూడ బ్రతిపాదమునకును యతులం జూపెను. ఆస్థానములయందే యంత్యానుప్రాసనుగూడ నిలిపెను.

భుజంగప్రయాతవృత్తము.

పరంధామ ! దివ్యప్రభాభావాభిరామా !
పరాకాశ ! సంపూర్ణ శోభవ్యప్రకాశా !
పరానంద ! దేవాధిపా! విశ్వతుందా !
పరానంద ! సచ్చిత్స్వభావాత్మరూపా !

టీ. పరంధామ=“యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ” అను భగవద్వచనమువలన నేపదమును బొందిన మహాయోగులు మరల నీ సంసారచక్రమునఁ బడరో యట్టి సర్వోత్తమస్థానము గలవాఁడా, దివ్య + ప్రభావ + అభిరామా = లోకోత్తరమగు మాహాత్మ్యముచే రమణీయుఁడైనవాఁడా, పరాకాశ = భూతాకాశమునకు వ్యతిరిక్తమగు చిన్మయాకాశ స్వరూపుఁడా, సంపూర్ణ + దివ్యప్రకాశా = ఎల్లయెడలను వ్యాపించినట్టియు సకలలోకములకు క్షేమకర మయినట్టియు దివ్యతేజస్సు కలవాఁడా, పర + ఆనంద = “సైషానందస్య మీమాꣳసా భవతి” అని మొదలుకొని “స ఏకో బ్రహ్మ ఆనందః” అను దనుక శ్రుతియందుఁ జెప్పంబడిన మానుషానందాద్యానందములకంటె నతీతమగు నిరతిశయానందము గలవాఁడా, దేవ + అధిపా = నలువ మొదలగు వేల్పులకు నేలికా, విశ్వ + తుందా = అనేకకోటిబ్రహ్మాండము లుదరమునఁ గలవాఁడా, పర + ఆనంద + సత్ + చిత్ + స్వభావ + ఆత్మ + రూపా = నిరతిశయమగు నానందమును సత్తును చిత్తును స్వభావముగఁ గల నిజస్వరూపము గలవాఁడా!

తా. మహాయోగులు యోగమార్గమునుబట్టి యే తావునకుఁ జేరి, మరల నీ సంసారగర్తమునఁ బడక యఖండసుఖము ననుభవించుచుందురో యట్టి సర్వోత్తమమయిన స్థానము గలవాఁడవును, పెక్కులగు నవతారవిశేషములయందు లోకోత్తరములగు ప్రభావములను జూపి, దుష్టశిక్షణశిష్టరక్షణములం జేసి లోకములకు నెమ్మది నిచ్చినవాఁడవును “ఆకాశో హవై నామరూపయో ర్నిర్వహితా” అను మొదలగు శ్రుతిచేతఁ జిదంబరస్వరూపుఁడవును, ఎల్లయెడల నిండి యెల్లరకును క్షేమము నిచ్చెడు దివ్యజ్యోతిస్స్వరూపుఁడవును, మానుషానందము మొదలు బ్రహ్మానందము దనుకం గల లౌకికానందములకు నతీతమగు నఖండానందము స్వరూపముగఁ గలవాఁడవును, నలువ మొదలగు వేల్పులకు నేలికవును, పెక్కులగు బ్రహ్మాండ

కోటు లుదరమునఁ గలవాఁడవును, అఖండసచ్చిదానందస్వరూపుఁడవును నీవై యొప్పుచుంటివి. ౭

క. మాయాప్రతిబింబేశ్వర !
మాయామయదివ్యదేహ ! మాయాతీతా !
మాయావి ! మాయమాయా !
మాయారహితాత్మతత్త్వమయ జయరామా ! ౮

టీ. మాయా + ప్రతిబింబ + ఈశ్వర = శుద్ధసత్త్వప్రధాన మగు మూలప్రకృతి భాగమునఁ బ్రతిఫలించిన యీశ్వరాత్మకచైతన్యము గలవాఁడా, మాయామయ + దివ్య + దేహ = శుద్ధసత్త్వప్రధాన యగు మాయ స్వరూపముగఁ గల లోకోత్తరమగు దివ్యమంగళవిగ్రహము కలవాఁడా, మాయా + అతీతా = అట్టిమాయను వశపఱచుకొని దానిని మీఱియున్నవాఁడా, మాయావి = ప్రపంచముయొక్క జన్మస్థితిభంగముల నొనర్చుటకు నా మాయను గైకొనియున్నవాఁడా, మాయ + మాయా = మాయారూపిణి యగు మూలప్రకృతికిఁ గూడ మూలప్రకృతియైనవాఁడా, సాంఖ్యులు "నప్రకృతి రవికృతిశ్చ పురుషః" అని చెప్పినను నౌపనిషదులు మూలప్రకృతికి మూలభూతుఁడు పరమేశ్వరుఁడని స్థిరపఱిచిరి; మాయా + రహిత + ఆత్మ+తత్త్వమయ = మూలావిద్యచే విరహితమగు పరమాత్మస్వరూపుఁడ వగు, రామా = ఓ శ్రీరామచంద్రా, జయ = సర్వోత్కృష్టుఁడవు గమ్ము.

తా. శుద్ధసత్త్వప్రధాన యగు మాయయందుఁ బ్రతిఫలించిన యీశ్వరచైతన్య మయినవాఁడవును, అట్టి సత్త్వగుణప్రధాన యగు మాయ స్వరూపముగఁ గల యనేకము లగు నవతారరూపము లయిన లోకోత్తరశరీరములు గలవాఁడవును, మాయను లోఁబఱచుకొని దానిని మీఱియున్నవాఁడవును, సమస్తమయిన ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములం జేయుటకు

మాయ నవలంచించియున్నవాఁడవును, నట్టిమాయకుఁ గూడ నీవు మాయ గైనవాఁడవును (ఆ సకలప్రపంచమునకును మాయ మూల మయియున్నది. అట్టి మాయకు భగవంతుఁ డధిష్ఠానభూతుఁ డని ఫలితార్థము. భగవంతుని పారమార్థికస్వరూపము మాయచే విరహిత మయ్యే యున్నది) అయినట్టి రామచంద్రా, నీవు సర్వోత్కర్షముగా నుండువుగాక ! ౮

క. భూతకర ! భూతభావన !
భూతభరణ ! భూతహారణ ! ॥ భూతావాసా !
భూతేశ్వర ! భూతాశ్రయ !
భూతాత్మక ! భూతసాక్షి ! ॥ భూతాత్మ ! హరీ ! ౯

టీ. భూత + కర = "ధరాదావుచితేసత్యే యథార్థన్యాయయో -రపి। పిశాచాదౌచ యోగీంద్రే సదృశప్రాప్తయోరపి" అని 'జంతౌ తత్త్వ నుసంధానే చాతీతే భూత ఇష్యతే" అను నభిధానముచేత జంతుజాలము లను సృజియించువాఁడా, (ఇందులకు నాచే రచియింపఁబడిన శ్రీ విష్ణుసహ స్రనామ వికృతియందు "రజోగుణం సమాశ్రిత్య పరమేష్ఠ్యాత్మనా సదా। కరోతి సర్వభూతాని భూతకృత్కథ్యతే హరిః" అని భూతకృన్నామనిర్వ చనమును జూడుఁడు.) భూత + భావన = సత్య మగు సంకల్పము గల వాఁడా, లేక పుడమిమొదలగు పంచమహాభూతములను బుట్టించినవాఁడా, ఇందులకు "పృథివ్యాదీని భూతాని స్వయం జనయతీతివా । సత్యావా భావనా యస్య సహరి ర్భూతభావనః" అని మత్కృతభూతభావననామ నిర్వచనము; భూతభరణ=శ్రీ మహావిష్ణుస్వరూపమున సత్త్వగుణము నవ లంబించి సకలభూతకోటులను భరించువాఁడా, ఇందులకు "విష్ణ్వాత్మనా సత్త్వగుణ మధిష్ఠాయ నిరంతరం । బిభర్తి సర్వభూతాని భూతభృత్క థ్యతే హరిః" అని మత్కృతభూతభృన్నామనిర్వచనము; భూత + హరణ = మహాప్రళయకాలమునందు రుద్రరూపమునఁ దమోగుణము నవ

లంబించి భూతములనెల్ల సమయించువాఁడా, భూత + ఆవాసా = సర్వ భూతములయందు నంతర్యామిరూపమున నున్నవాఁడా, భూత + ఈశ్వర= ఎల్లభూతములను దమతమ మర్యాదలను మీఱకుండునట్లు నిలిపి శాసించు వాఁడా, భూత + ఆశ్రయ = సకలభూతములకు నాధారభూతుఁడా, భూత + ఆత్మక = "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతిచే నానావిధ భూతజాలము స్వరూపముగఁ గలవాఁడా, భూత + సాక్షి = "భూత భవ్య భవత్ప్రభుః" అనుటచే భూతభవిష్యద్వర్తమానకాలములయందు జరుగు నిఖిలవ్యాపారాదులకును ద్రష్ట యైనవాఁడా, భూతశబ్దము భవిష్య ద్వర్తమానములకు నుపలక్షకము, భూత + ఆత్మ = సత్యమే స్వరూపము గఁ గలవాఁడా, హరీ = "హరి ర్హరతి పాపాని స్మర్యమాణ స్సకృన్నృణాం" అనుటచేత సకలపాపసంహారకా, యని శ్రీనారాయణనామస్మరణ రూప మగు స్తవము.

తా. సృష్టికర్తయగు పరమేష్ఠిస్వరూపుఁడ వయి రజోగుణము నవ లంబించి సమస్తభూతములను దొలుత సృజించినవాఁడవు. తరువాత సత్య సంకల్పుఁడవగు నీ వాభూతకోటులనెల్ల శ్రీమహావిష్ణుస్వరూపమున సత్త్వ గుణమును బూని పరిపాలించుచుంటివి. తుదను "రుద్రరూపుఁడవై తమో గుణమును దాల్చి యాభూతకోటుల నెల్ల నుపసంహరించుచుందువు. ఇట్లు బాలుఁడు ఇసుకబొమ్మలను జేసి యించుకసేపు వానితో నాడుకొని కడ పట వానినెల్లఁ దుడిచివేయునట్లు నీవు నీప్రపంచముతో వినోదించుచు న్నావు. ఇట్టి భూతజాతరూపమగు ప్రపంచమునకు నీ వీశ్వరుండవును నాధారభూతుఁడవును నైతివి. మఱియును, నీవు సకలభూతములయందు నంతర్యామిరూపమున నివసించి యున్నావు. విరాడ్రూపమున సకలభూత ములు స్వరూపముగఁ గలవాఁడవు. భూతభవిష్యద్వర్తమానకాలములయందు జరుగుసమస్తమునకు నీవు సాక్షివి. సత్యస్వరూపుఁడ వైతివి ఓహరీ!

## స్రగ్విణీవృత్తము.

యోగయోగాంగసంయుక్త! యోగప్రియా!
యోగముద్రాన్వితా! యోగనిద్రాంచితా!
యోగలక్ష్యావనా! యోగసిద్ధిప్రదా!
యోగమాయాశ్రయా! యోగయోగీశ్వరా! ౧౦

టీ. యోగ + యోగాంగ + సంయుక్త = యంత్రయోగము లయయోగము హఠయోగము రాజయోగము భక్తియోగము మొదలగు యోగవిశేషములతోను, అట్టియోగములకు నంగభూతము లగు యమనియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులును, శమ దమాదులును, మొదలగువానితోఁ గూడియున్నవాఁడా (పరమేశ్వరుఁడు యోగయోగాంగములతోఁ గూడియుండుట యనఁగా నిట్టిసాధనములచేఁ బొందఁదగినవాఁడనుట), యోగ + ప్రియా = "యోగః కర్మసుకౌశలం" అని చెప్పఁబడినతీరున యథావస్థిత మగు వస్తువును వేఱొక విధమునఁ బ్రతిపాదించుట, ఎట్లనిన సంసారబంధమునకు మూలమైనదయ్యుఁ జిత్తశుద్ధిద్వారా బంధరహితమగు మోక్షమునకుఁ బరంపరచే హేతువగుచుండుట యిట్టి యోగమునందుఁ బ్రీతిగలవాఁడా, యోగముద్రా + అన్వితా = "సంయోగ మేళనోపాయధ్యానయుక్తిష్వపి" అను నభిధానముచేత యోగశబ్దమునకు ధ్యానమనియు నర్థము గలదు గాన, ధ్యానముద్రతో (చిన్ముద్రతో) కూడియున్నవాఁడా - చిన్ముద్రచే ధ్యానింపదగినవాఁడా యని యర్థము. యోగనిద్రా + అంచితా = తురీయావస్థాత్మకమగు యోగనిద్రచేఁ దనరుచున్నవాఁడా, యోగ + లక్ష్య + అవనా = "స యోగం యోగమిత్యాహుర్జీవాత్మ పరమాత్మనోః" అనుటచే జీవాత్మపరమాత్మైక్యరూపమగు యోగమునందు లక్ష్యము (గుఱి) గలవారినిఁ గాపాడువాఁడా, యోగ సిద్ధి + ప్రదా = "అణిమా మహిమాచైవ గరిమా లఘిమా తథా । ప్రాప్తి

ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టభూతయః'' అను నెనిమిది యోగ సిద్ధుల నొసంగువాఁడా, యోగమాయా + ఆశ్రయా = "యోగమాయా ముపాశ్రితః'' అను శ్రీ భాగవతవచనముచే చిచ్ఛక్తి యగు యోగమాయకు (మూలప్రకృతికి) నధిష్ఠానమైనవాఁడా, యోగ + యోగి + ఈశ్వరా = పూర్వోక్తములగు యోగయోగాంగములతోఁ గలయిక గలవారలకు నేలిక యగువాఁడా.

**తా.** పెక్కులగు నుపాయములతోను యమనియమాదులగు యోగాంగములతోను గూడుకొనిన మంత్రయోగము లయయోగము హఠయోగము రాజయోగము మొదలుగాఁ గల యోగములయందుఁ బ్రీతి గలవాఁడవును, ధ్యానరూప మగు చిన్ముద్రతోఁ గూడియున్నవాఁడవును, తురీయావస్థారూపమగు యోగనిద్రలోనుండి యానందించువాఁడవును, ఆయోగయోగాంగములయందు లక్ష్యముగలవారిని సంరక్షించువాఁడవును, అణిమాదులగు యోగసిద్ధుల నిచ్చువాఁడవును, పరాశక్తికి నధిష్ఠానభూతుఁడవును, జీవాత్మ పరమాత్మల కైక్యరూపమగు యోగముతోఁ గలయిక గలవారికెల్ల నధిపతివియు నగువాఁడా! ౧౦

వసంతతిలకవృత్తము.

వేదాగమావిషయవిగ్రహ! వేదవేద్యా!
వేదాంగ! వేదనుత! వేదవివేకశీలా!
వేదాది! వేదమయ! వేదగ! వేదజిహ్వా!
వేదాంతతత్త్వసువివేచనవేదితవ్యా! ౧౧

టీ. వేద + ఆగమ + అవిషయ + విగ్రహా = ఋగ్యజుస్సామాథర్వణము లను నాలుగువేదములకును దదుపబృంహణములగు సమస్తపాంచరాత్రాద్యాగమములకును నగోచరమగు స్వరూపము గలవాఁడా, వేద + వేద్యా = "వేదాన వేదాయది సంతు కేతు'' అని నైషధమునందు వేద

మన సత్యమని చెప్పుటచేత సత్యముచేఁ దెలియఁదగినవాఁడా "సత్యం పరం పరగ్ం సత్యగ్ం సత్యేనన సువర్గాల్లోకాచ్చ్యవంతేకదాచన నతాగ్ం హి సత్యంతస్మాత్సత్యే రమంతే" అనుశ్రుతి యిందులకుఁ బ్రమాణము. వేద + అంగ = వేదములే యవయవములుగఁ గలవాఁడా, వేద + మత = సకల వేదములచే నొప్పుకొనఁబడిన వాఁడా, వేద + వివేక + శీలా = వేదములయొక్క వివేచనయే స్వభావముగఁ గలవాఁడా, వేదాది = "యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః । తస్య ప్రకృతిలీనస్య యః పర స్సమహేశ్వరః" అను మొదలగు శ్రుతివచనములచే వేదమంత్రములకు మొదటిస్వర మగు ప్రణవము స్వరూపముగఁ గలవాఁడా, వేదమయ = నాలుగు వేదములు స్వరూపముగఁ గలవాఁడా, వేద + గ = "ఆమ్నాయ జ్ఞానయో ర్వేదః" అను నభిధానముచే వేద మన జ్ఞానముగాన జ్ఞానమును పొందినవాఁడా, లేక జ్ఞానముచేఁ బొందఁదగినవాఁడా, వేద + జిహ్వా = శ్రుతులు నాలుకగ (పలుకులుగఁ) గలవాఁడా, వేదాంత + తత్త్వ + సువివేచన + వేదితవ్యా = ఉపనిషత్తులయొక్క వాస్తవార్థమును బరిశీలించుటచేఁ దెలియఁదగినవాఁడా.

తా. నిఖిలవేదములకును వేదోపబృంహణము లగు సమస్తాగమముల కును స్మృతిసూత్ర పురాణేతిహాసాదులకుఁ గూడ నిట్టి దని ప్రతిపాదించుటకు నలవిగాని దివ్యసుందరమంగళమూర్తి గలవాఁడవు; కేవల బ్రహ్మానుభవజ్ఞానముచేఁ దెలియఁదగినవాఁడవు; నాలుగు వేదములే యవయవములుగఁ గలవాఁడవు; సకలవేదసమ్మతుఁడవు; వేదములయొక్క వివేచనాజ్ఞానమే స్వభావముగఁ గలవాఁడవు; సకల వేదమంత్రములకుఁ దొలి వర్ణమగు ప్రణవము స్వరూపముగఁ గలవాఁడవు. వేదము లాత్మస్వరూపముగఁ గలవాఁడవు. నీవు వేదములను బొందియున్నావు; వేదములే నీకు నాలుక; ఉపనిషత్తులయొక్క వాస్తవార్థమును లెస్సగఁ బరిశీలించుటచే నీ స్వరూపము తెలియఁబడును. ౧౧

క. శాస్త్రాగమపరికల్పక !
శాస్త్రాచార్యోపదిష్టసారార్థజ్ఞా !
శాస్త్రాగమార్థతత్పర !
శాస్త్రార్థవిచారగమ్య ! శ్రీ శాస్త్రప్రవరా ! ౧౨

టీ. శాస్త్ర + ఆగమ + పరికల్పక = కపిల పతంజలి గౌతమ జైమిని వ్యాసాద్యవతారములచే సాంఖ్యయోగ న్యాయ మీమాంసాది శాస్త్రములను మఱియు నీశ్వరావతారమునఁ జతుష్షష్టితంత్రములను రచియించినవాఁడా, శాస్త్ర + ఆచార్య + ఉపదిష్ట + సార + అర్థ + జ్ఞా = ఆయా శాస్త్రములచేతను సద్గురువులచేతను నుపదేశింపఁబడిన వాస్తవార్థము నెఱింగినవాఁడా, శాస్త్ర + ఆగమ + అర్థ + తత్పర = పూర్వోక్తము లైన (మీఁదఁ జెప్పఁబడిన) శాస్త్రములయొక్కయు నాగమముల యొక్కయు వాస్తవార్థమునందుఁ దాత్పర్యము గలవాఁడా, శాస్త్ర + అర్థ + విచార + గమ్య = శాస్త్రములయొక్క ఫలితార్థమును జర్చించుటవలనఁ దోఁపఁబడుచున్నవాఁడా, శాస్త్ర + ప్రవరా= సకలశాస్త్రములకునుఁ బ్రధానమయినవాఁడా.

తా. కపిల పతంజలి గౌతమ కణాద జైమిని బాదరాయణాద్యవతారముల నెత్తి, వేదార్థోపబృంహణము లగు సాంఖ్యయోగ న్యాయ మీమాంసాది శాస్త్రములను నిఖిలస్మృతిపురాణేతిహాసాదులను నీవే విరచించితివి. ఆయా శాస్త్రములు మొదలగువానిచేతను మహాఋషులగు సద్గురువులచేతను బోధింపఁబడిన తత్త్వజ్ఞానరూప మగు ఫలితార్థము నీకే తెలియును. ఆయా శాస్త్రములయు నాగమములయు ముఖ్యార్థమునందు నెక్కలి మక్కువ గలవాఁడవు. ఉపనిషద్రూపము లగు శాస్త్రముల యొక్క తాత్పర్యమును బర్యాలోచించుటచే నీవు తెలియఁబడుదువు. సకలశాస్త్రములకుం బ్రధానభూతుఁడవు నీవే. ౧౨

క. విద్యానిధి ! విద్యాప్రద !
విద్యావిద్యాతిరిక్త ! శ్రీవిద్యావేద్యా !
విద్యాపతి ! విద్యామయ !
విద్యాసంధానితాత్మవిద్యాసారా ! ౧౩

టీ. విద్యా + నిధి = నాలుగువేదములు శిక్ష మొదలగు నాఱు వేదాంగములు మీమాంసయు న్యాయవిస్తృతియుఁ బురాణములు ధర్మశాస్త్రములు నను పదునాలుగు విద్యలకును గని యైనవాఁడా, విద్యా + ప్రద = అపరోక్షజ్ఞానము నొసంగువాఁడా, విద్యా + అవిద్యా + అతిరిక్త = లౌకికవిద్యలకును నజ్ఞానమునకును నగోచరుఁడ వగుటచే వేఱైనవాఁడా, విద్యా+వేద్యా = కేవలబ్రహ్మజ్ఞానముచేఁ దెలియఁదగినవాఁడా, విద్యా + పతి = పూర్వోక్త చతుర్దశవిద్యలకును బరిపాలకుఁడా, విద్యామయ = ఆ చతుర్దశ విద్యలే స్వరూపముగఁ గలవాఁడా, విద్యా...సారా- విద్యా = చతుర్దశ విద్యలయందు, సంధానిత = ఇమిడ్చి కూర్పఁబడిన, ఆత్మవిద్యాసారా = బ్రహ్మజ్ఞానముయొక్క నిగ్గు గలవాఁడా.

తా. నాలుగువేదములు, శిక్ష మొదలగు వేదాంగము లాఱు, పూర్వోత్తర మీమాంసలు రెండు, పురాణసముదాయము మన్వాది ధర్మశాస్త్రసముదాయము గలవి యైన పదునాలుగువిద్యలకుం గని యైతివి. అనఁగా నీలోనుండియే యీ విద్యామణులు వెడలినవి. ఈ చతుర్దశవిద్యలను సద్గురురూపమున నుత్తమాధికారులకు నీవే యుపదేశించుచున్నావు. కేవలశబ్దమయము లగు లౌకికవిద్యలకును నజ్ఞానమునకు వ్యతిరిక్త మగు బ్రహ్మజ్ఞానముచేఁ దెలియఁబడుచున్నావు. బ్రహ్మజ్ఞానమును సద్గురుసంప్రదాయము నుండి విచ్ఛిన్నము గాకుండఁ బరిపాలించుచున్నావు. కేవల జ్ఞానస్వరూపుఁడవు. పైని జెప్పఁబడిన పదునాలుగువిద్యలలోను ఇమిడ్చి గ్రుచ్చఁబడి యున్న బ్రహ్మజ్ఞానమునకు నీవే నిగ్గై యున్నావు. ౧౩

అవ. "యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః, యజ్ఞభృ ద్యజ్ఞకృ ద్యజ్ఞీ యజ్ఞభు గ్యజ్ఞసాధనః, యజ్ఞాంతకృ ద్యజ్ఞగుహ్యామ్" అను శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రార్థమును బ్రతిపాదించుచున్నాఁడు.

మానినివృత్తము.

యజ్ఞవిధాయక! యజ్ఞనియామక! యజ్ఞఫలాశ్రయ! యజ్ఞకరా!
యజ్ఞఫలావన! యజ్ఞఫలాశన! యజ్ఞఫలప్రద! యజ్ఞధరా!
యజ్ఞవిధిప్రియ! యజ్ఞసమర్చిత! యజ్ఞసుసాధన! యజ్ఞపతీ!
యజ్ఞశరీరక! యజ్ఞరహస్యక! యజ్ఞపరాయణ! యజ్ఞమయా!

టీ. యజ్ఞ + విధాయక = యాగవిధులనెల్ల విధించువాఁడా, యజ్ఞ + నియామక = క్రతుసంబంధము లగు క్రియాకలాపములను నియమించువాఁడా, యజ్ఞ + ఫల + ఆశ్రయ = క్రతువులయొక్క ఫలితమునకు నాధారభూతుఁడా, యజ్ఞ + కరా = సకల యాగములను జేయువాఁడా, యజ్ఞ + ఫల + అవన = క్రతువులయొక్క ఫలితమును బాలించువాఁడా, యజ్ఞ + ఫల + అశన = యాగములయొక్క ఫలము ననుభవించువాఁడా, యజ్ఞ + ఫల + ప్రద = క్రతుఫలము నొసంగువాఁడా, యజ్ఞ + ధరా = యాగములను భరించువాఁడా, యజ్ఞ + విధి + ప్రియ = యజ్ఞముల నొనరించుటయందుఁ బ్రీతి గలవాఁడా, యజ్ఞ + సమర్చిత = క్రతువులచేఁ బూజింప (ఆరాధింపఁ) బడువాఁడా, యజ్ఞసుసాధన = స్వస్థానప్రాప్తికి యజ్ఞములే మేలగు సాధనములుగఁ గలవాఁడా, యజ్ఞ + పతీ = క్రతువులకు పాలకుఁడా, యజ్ఞ + శరీరక = జన్నములే శరీరముగఁ గలవాఁడా, యజ్ఞ + రహస్యక = యాగములకు రహస్యభూతమైనవాఁడా, యజ్ఞ + పరాయణ = క్రతువుల

యందు మిక్కిలి ఆసక్తి గలవాఁడా, యజ్ఞమయా = క్రతుస్వరూపుఁడా, ఇందులకు నస్మత్కృత శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర వివృతి "యజ్ఞోవై విష్ణు రిత్యుక్తే ర్యజ్ఞోయజ్ఞాత్మనాపివా । అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ । ఇత్యుక్తే ర్భగవాన్ యజ్ఞపతి రిత్యభిధీయతే। యజమానాత్మనాతిష్ఠ న్యజ్వాస్యాద్భగవాన్ హరిః । వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః । అగ్నిజిహ్వోదర్భరోమా బ్రహ్మశీర్షో మహాతపాః । అహోరాత్రేక్షణో దివ్యో వేదాంగ శ్రుతిభూషణః । అజ్యనాసస్స్రువస్తుండ స్సామఘోషస్వనో మహాన్ । ధర్మసత్యమయ శ్శ్రీమాన్ కర్మవిక్రమసత్క్రియః । ప్రాయశ్చిత్తనఖోఘోరః పశుజాను ర్మహాభుజః । ఉద్గాత్రాంత్రో హోమలింగ ఫలబీజ మహౌషధిః। వాగంతరాత్మా మంత్రస్ఫిగ్వికృతస్సోమశోణితః । వేది స్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్ । ప్రాగ్వంశకాయో ద్యుతిమాన్ నానాదీక్షాభి రర్చితః। దక్షిణాహృదయో యోగీ మహాసత్రమయోమహాన్ । ఉపాకర్మోష్ఠ రుచకః ప్రవర్గ్యా వ ర్తభూషణః । నానాఛందోగతపథో గుహ్యోపనిషదాసనః । ఛాయాపత్నీ సహాయోవై మేరుశృంగ మివోచ్ఛ్రితః । ఇత్యుక్తే ర్భగవాన్ విష్ణు ర్యజ్ఞాంగ స్స్త్రిరూపధృక్॥ ఫలహేతుక యజ్ఞాద్యోవాహాయత్యజ్ఞ వాహనః । యాజ్ఞంసాతీతి వా యజ్ఞభృద్భి భర్తీతివా హరిః। ఆదావంతేచ జగతః క్రమాద్యజ్ఞం కరోతివా। కృతంతీతి హరిర్యజ్ఞకృ దిత్యత్రాభిధీయతే । యజ్ఞానాం తత్సమారాధ నాత్మనాంతు ప్రధానతః । శేషీ తత్సమవాయానాం యజ్ఞస్స్యా ద్భగవాన్ హరిః । యజ్ఞం భుఙ్క్తే భున క్తీతి యజ్ఞభుక్స్యా జ్జనార్దనః । తత్ప్రాప్తి సాధనం యజ్ఞ ఇతిస్యా ద్యజ్ఞసాధనః । వైష్ణవ్య ఋక్సంసనేన పూర్ణాహుత్యా సమాపనం । యజ్ఞస్య యః కరోతీతి స యజ్ఞాంతకృదుచ్యతే। యజ్ఞగుహ్యం యజ్ఞజ్ఞాన స్తదభేదోపచారతః" అని యీ నామమంత్ర వివృతికారికలకు నర్థమును నాపుస్తకముం జూచి తెలిసికొనునది. కావేని, ప్రేక్షావంతులకు

సులభముగఁ దెలియునని యిందు తెలుఁగున వివరింపలేదు. మూలమునందలి "యజ్ఞవిధాయక' అను మొదలగు సంబోధనాంతపదములకును యజ్ఞాది నామములకును బుద్ధిమంతులగువా నరర్థములను సరిచూచుకొనునది. గ్రంథ వైపుల్య మగు నని యిందు సరిపెట్టి వేర్వేఱ చూపలేదు.

తా. యజ్ఞమును విధించువాఁడును నియమించువాఁడును, యజ్ఞ ఫలముల కాధారమైనవాఁడు, ఆ ఫలములను జెడకుండ రక్షించువాఁడును అనుభవించువాఁడును, ఒసంగువాఁడును, యజ్ఞము చేయువాఁడును, నిర్వి ఘ్నముగ నిర్వహించువాఁడును, యజ్ఞవిధియందుఁ బ్రీతి గలవాఁడును, యజ్ఞముచేత అర్చింపఁబడువాఁడును, యజ్ఞమందలి స్రుక్స్రువాది సాధన ములు స్వరూపముగాఁ గలవాఁడును, యజ్ఞమునకు ప్రభువును, యజ్ఞమే శరీరముగాఁ గలవాఁడును, యజ్ఞమంత్రములకుఁ బ్రతిపాద్యవస్తు వైన వాఁడును, యజ్ఞమే ముఖ్యముగాఁ గలవాఁడును, యజ్ఞమే తా నయిన వాఁడు నగురామా ! ౧౪

క. మంత్రప్రభావదర్శక !
మంత్రప్రియ ! సకలమంత్రకమంత్రార్థజ్ఞా !
మంత్రార్థగమ్య ! మంత్రీ !
మంత్రాధిష్ఠానదేవకమయ ! మంత్రాత్మా ! ౧౫

టీ. ఇందు సకలమంత్రతత్సంబంధిస్వరూపముగా వర్ణించుచున్నారు. మంత్ర-ప్రభావ-దర్శక = గాయత్రి మొదలగు మహామంత్రములయొక్క- మహత్త్వమును చూపువాఁడా, వానిప్రభావమునకు నీవే నిదర్శన మనుట, మంత్రప్రియ = మంత్రములయందు ప్రీతి గలవాఁడా, సకలమంత్ర - మంత్రార్థ-జ్ఞా = ఎల్లమంత్రములను - ఆ మంత్రతాత్పర్యములను - తెలిసిన వాఁడా, మంత్రార్థగమ్య = మంత్రతాత్పర్యములచేత పొందఁదగిన వాఁడా, మంత్రములతాత్పర్యములకు విషయ మైనవాఁ డనుట, మంత్రీ =

మంత్రములు గలవాఁడా, మంత్రాధిష్ఠాన దేవమయ = మంత్రమున కభిమానియైనదేవత స్వరూపముగాఁ గలవాఁడా, మంత్రాత్మా = మంత్రమే స్వరూపముగాఁ గలవాఁడా,

తా. మంత్రప్రభావములకు నిదర్శనమైనవాఁడును, మంత్రములందు ప్రీతి గలవాఁడును, సకలమంత్రములను మంత్రతాత్పర్యములను దెలిసినవాఁడును, మంత్రములకెల్లఁ బ్రతిపాద్యమైనవస్తువును, మంత్రయుక్తుఁడును, ఆయా మంత్రముల కభిమానదేవతలును దానే యైనవాఁడును, మంత్రమే తా నయినవాఁడు నగురామచంద్రా! ౧౫

క. జపకల్పక ! జపతల్పక !
జపకోట్యారాధనీయ ! శ్రీ జపతత్త్వజ్ఞా !
జపజప్యజాపకాత్మక !
జపయజ్ఞఫలస్వరూప ! శ్రీ జపలక్ష్యాత్మా! ౧౬

టీ. ఇందు జపమును దానిని సంబంధిచినవియును నీవే యని చెప్పుచున్నారు. జపకల్పక - జప = మంత్రావృత్తిని, కల్పక = కల్పించినవాఁడా, జపతల్పక = జపమే శయ్యగాఁ గలవాఁడా, - జపమే సుఖవిశ్రాంతిస్థానముగాఁ గలవాఁ డనుట; జపకోటి + ఆరాధనీయ = జపసమూహముచేత - ఆరాధింపఁదగినవాఁడా, జపతత్త్వజ్ఞా = జపముయొక్క యథార్థస్వరూపమును (కలరూపు) ఎఱిఁగినవాఁడా, జప-జప్య-జాపక - ఆత్మక = జపించువ్యాపారముయొక్కయు - జపింపఁదగిన మంత్రముయొక్కయు - జపించువానియొక్కయు - స్వరూపమైనవాఁడా - జపించుటయును జపింపఁబడు మంత్రమును జపించువాఁడును నీవే యైనవాఁడా, యనుట, జప - యజ్ఞ - ఫల - స్వరూప = జపమనెడు - యజించుటయొక్క (ఆరాధించుటయొక్క) - ఫలమే-స్వరూపముగాఁ గలవాఁడా, జప-లక్ష్య-ఆత్మా=జపముచేత-కనుఁగొనఁదగిన - స్వరూపము గలవాఁడా,

తా. ప్రణవమంత్రావృత్తిరూప మగు జపమును బుట్టించినవాఁడవు. జపమునందు సుఖముగా వసించి యుండువాఁడవు. జపసమూహములచేత నెల్ల ఆరాధింపఁదగినవాఁడవు. జపస్వరూపమును దెలిసినవాఁడవు. జపవ్యాపారమును జపమంత్రమును జపించువాఁడును నీవే యగుదువు. జపయజ్ఞమునకు నీవే ఫలము. నీవే జపదేవతవు. ౧౬

క. పూజావిధానదర్శక!
పూజాతద్వస్తుపూజ్యపూజకరూపా!
పూజాఫలప్రదాయక!
పూజాప్రియ! పూజనీయ! పూజావిషయా! ౧౭

టీ. పూజా-విధాన-దర్శక = పూజసేయు విధిని తెలుపువాఁడా, (గురురూపముచేతఁ దెలుపువాఁ డనుట), పూజా...రూపా - పూజా = పూజించుటయు, ఆ వ్యాపారము ననుట-తద్ వస్తు = దాని వస్తువులును. అనఁగా పూజకు సాధనములయిన పత్రపుష్పఫలజలాదులు ననుట, పూజ్య= పూజింపఁదగిన దేవతయు, పూజక=పూజించువాఁడును (అనెడి యివియె), రూప = స్వరూపముగాఁ గలవాఁడా, పూజాఫలప్రదాయక = పూజకయినఫలమును ఇచ్చువాఁడా, పూజాప్రియ = పూజయందు ప్రీతి గలవాఁడా, పూజనీయ = పూజించుటకుఁ దగినవాఁడా, పూజావిషయా = పూజకు విషయభూతుఁడైనవాఁడా, పూజకుఁ బ్రతిపాద్యమగువస్తువైనవాఁడా యనుట, 'పూజ్య' అనుచో పూజకు విషయమైన యేదేవతగాని నీవే యనియు 'పూజావిషయా' అనుచో పూజకు సర్వవిధముల విషయము నీవే యనియు భేదము గ్రహించునది. 'పూజా + అవిషయా' అని భేదము చేసినచో - పూజకు గోచరము కానివాఁడా యనుట.

తా. మనువ్యాసాదిరూపమున పూజించు విధులను దెలుపువాఁడవు. పూజావ్యాపారమును పూజాసాధనము లయిన పత్రపుష్పాదులును పూజకు

విషయమైన దేవతయు పూజించువాఁడును అన్నియు నీవే యగుదువు. పూజకు ఫల మిచ్చువాఁడును నీవే. పూజకుఁ బ్రీతి నొందువాఁడును, అర్హుఁడైనవాఁడును, పూజకుఁ బ్రతిపాద్య మగువస్తువును నీవే. ౧౭

క. నామప్రియ ! నారాయణ
నామక ! విశ్వాద్యనంతనామార్థజ్ఞా !
నామప్రభావదర్శక !
నామాదివికారరహిత ! నతవిబుధహితా! ౧౮

టీ. నామప్రియ=నామములయందు బ్రీతిగలవాఁడా, (నామములు విధిరూపములును నిషేధరూపములు నని రెండు విధములు), నారాయణ నామక = నారాయణుఁ డనుపేరు గలవాఁడా ('ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః...తస్యాయనం తతో నారాయణః స్మృతః'), జలములు నారములు, దానిని స్థానముగాఁ గలవాఁడు నారాయణుఁడు - లేక నార మనఁగా విజ్ఞానము - దానిని అయనముగా - ఆశ్రయముగాఁ గల వాఁడు - లేక 'రిష్ క్షయే' అను ధాత్వర్థమునుబట్టి నరుఁ డనఁగా రిష్యతే క్షీయతే ఇతి రః - అనఁగా నశించునది - 'రః' కానిది 'నరః' అనఁగా నాశములేనివస్తువు పరబ్రహ్మము. పరబ్రహ్మస్వరూపుఁడా యనుట. విశ్వ...జ్ఞా - విశ్వ ఆది = విశ్వము మొదలైన, అనంతనామ = మితిలేని నామములయొక్క, అర్థజ్ఞా = తాత్పర్యములను దెలిసినవాఁడా, విశ్వ శబ్దము మొదలుగాఁ గల యనంతశబ్దములు నీకు నామములు; కాఁబట్టి, యానామములచే వాచ్యములగు వస్తువులు నీవే కావున, ఆనామములయర్థము నీ వెఱింగినవాఁడవే యనుట. నామ-ప్రభావ-దర్శక = విశ్వ మొదలయిన నామములమాహాత్మ్యములను దెలుపువాఁడా, నామ ఆది వికారరహిత = 'విశ్వ' మొదలయిన నామము లనెడు వికారము - అనఁగా నామప్రతిపాద్యవస్తురూపము లగు వికారములు లేనివాఁడా, నత - విబుధ-హితా=

ద్రొక్కిన పండితులకు మేలు గలిగించువాఁడా. బ్రహ్మవిద్యాకుశలు లయ్యును గర్వింపక నీయందు భక్తివినయములు సేయువారికి శ్రేయమును గావించువాఁడా యనుట.

తా. అజ, అచ్యుత, అవ్యయ, అక్షర, అనంతాది నిషేధనామ ములకును ఈశ్వర శ్రేష్ఠాది విధినామములకును సంతోషించువాఁడవును, నారాయణశబ్దార్థ మగు పరబ్రహ్మంబవును, విశ్వుఁడు మొదలుగాఁ గల యపరిమితనామముల తాత్పర్యమును దెలిసినవాఁడవును, వాని మాహాత్మ్య ములను (తత్తదనుగుణఫలప్రదానమును జపించువారల కొసంగుటచే) తెలుపువాఁడవును, నామము రూపము మొదలయినవికారములు లేనివాఁ డవును, భక్తిచే నిన్నాశ్రయించినపండితులకు హితము సేయువాఁడవు నగురామా! ౧౭

క. గురుశిష్యభావకల్పక !
గురుశిష్యాచారధర్మగుణపరిపాలా !
గురుశిష్యరూపధారీ !
గురుశిష్యైక్యావబోధగుణ ! గురుమూర్తీ ! ౧౮

టీ. గురుశిష్యభావ కల్పక = గురుభావమును శిష్యభావమును కల్పించువాఁడా! జ్ఞానప్రచారమునకు ఉపదేష్ట యగు గురువును ఉపదిష్టుఁ డగు శిష్యునిని ఏర్పఱచువాఁడా యనుట. గురు...పాలా-గురుశిష్య=గురువు యొక్కయు శిష్యునియొక్కయు, ఆచార = ఆచారములును, ధర్మ = న్యాయములును, గుణ = సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది గుణములును, పరి పాలా = రక్షించువాఁడా, గురుశిష్యరూపధారీ = గురుశిష్యుల రూపము లను ధరించినవాఁడా, గురుశిష్య = గురుశిష్యులయొక్క, ఐక్య అవ బోధ = ఐక్యజ్ఞానము, గుణ = స్వభావధర్మముగాఁ గల, గురుమూర్తీ= గొప్పమూర్తి గలవాఁడా-గురువును శిష్యుఁడును స్వరూపమం దొక్కటియే యని సహజముగా నీ మేలిమూర్తియే తెలుపుచున్న దనుట.

తా. గురువులను శిష్యులను బుట్టించి, యుపదేశమూలమున జ్ఞానమును బ్రసరింపఁజేయువాఁడవు. గురువులకును శిష్యులకును వేఱువేఱ కలిగియున్న యాయాప్రవర్తనములను ధర్మములను గుణములను జెడకుండ రక్షించువాఁడవు. గురురూపమునను శిష్యరూపమునను నీవే వర్తించుచుండువాఁడవు. గురువును శిష్యుఁడును స్వరూపముం దొక్కటియే యని నిర్విశేష చిన్మాత్రం బయిననీస్వరూపముచేతనే తెలుపుచుండువాఁడవు. ౧౯

## విద్యున్మాలావృత్తము.

ధర్మారాధ్యా! శ్రీ ధర్మాధ్యక్షా! ధర్మీ ధర్మాత్మా ధర్మజ్ఞా!
ధర్మాధారా! శ్రీ ధర్మాకారా! ధర్మాధర్మాత్యంతాభావా! ౨౦

టీ. ధర్మ + ఆరాధ్యా = వర్ణాశ్రమాచారధర్మములచేత ఆరాధింపఁబడువాఁడా! ('ధర్మే పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ। ఉపమాయా మహింసాయాం శార్ఙ్గకేచ నిగద్యతే' విశ్వము.) ధర్మ అధ్యక్షా = ధర్మములకు అధిపతీ, ధర్మీ = ధర్మములు గలవాఁడా, ధర్మ ఆత్మా = ధర్మమందు బుద్ధిగలవాఁడా, ధర్మజ్ఞా = ధర్మములను ఎఱిఁగిన వాఁడా, ధర్మ + ఆధారా = ధర్మములకు ఆశ్రయమైనవాఁడా, ధర్మ ఆకారా = ధర్మమే ఆకృతిగాఁ గలవాఁడా, ధర్మ+అధర్మ + అత్యంత +అభావా = ధర్మమును అధర్మమును బొత్తిగా లేనివాఁడా—ఇట ధర్మాధర్మము లనఁగా పుణ్యపాపము లని తెలియునది. ఇది విద్యున్మాలావృత్తము. దీనికి 'శ్రీదేవీ ధాత్రీ ప్రాణేశా, యాదిత్యజ్యేష్ఠాది స్తుత్యా, వేదోద్ధర్తా విద్యున్మాలం, బాద్యైమాగా ప్రాప్తిం బొల్చున్' అనఁగా రెండుమగణములును రెండుగురువులును ఐదవయింట యతియును లక్షణములు.

తా. వర్ణాశ్రమధర్మము లెల్ల నీయారాధనరూపములే యగుటవలన, వాని ననుష్ఠించుటచేత నీ వారాధింపఁబడుదువు. ధర్మములకెల్ల నీవే యధిపతివి. ధర్మములెల్ల నీయందున్నవి. ధర్మమందే నీబుద్ధి వర్తించును. ధర్మ

ములెల్ల నీకుఁ దెలియును. ధర్మములకు ఆశ్రయ మైనవాఁడవు. ధర్మమే నీ యాకారము. పుణ్యపాపములు రెండును గొంచెమైనను నిన్నంటఁజాలవు.

సుకాంతివృత్తము.

ధనార్జనా ! శ్రీ ధనప్రియా !
ధనాధిపా ! శ్రీ ధనంజయా ! ౨౧

టీ. ధన ఆర్జనా = ధనములను సంపాదించువాఁడా, ఇచట ధన శబ్దమునకు తపోవిజ్ఞానకీర్తిప్రముఖము లయిన ధనములుగాఁ గాని కేవలధనముగాఁగాని గ్రహింపవచ్చును. ధనప్రియా = ధనమందు ప్రీతిగలవాఁడా, ధన అధిపా = ధనమునకు అధిపతీ - కుబేరుఁడా యనియు, ధనంజయా = ధనమును గెలుచువాఁడా, లేక 'ధనఞ్జయోఽర్జునే శక్రే దహనే దేహమరుతే' అను రత్నమాలచొప్పున అగ్నిహోత్రుఁడా యనియు నర్థము (ధనమునకు 'ధినోతి ప్రీణయతీతి ధనమ్' అని వ్యుత్పత్తి.) ఈ వృత్తమునకు 'జకారముల్ గకారముల్ సుకాంతికిన్ శుకస్తుతా' యని లక్షణము.

తా. తపోవిద్యాదిధనముల నార్జించువాఁడవు. ధనమందు ప్రీతి గలవాఁడవు. ధనముల కధిపతివి. అగ్నిహోత్రుఁడవు. ౨౧

ఉపజాతివృత్తము.

కామాది ! కామాదివికారశూన్యా !
సమస్తకామప్రదశ్రీసత్యకామా !
కామఘ్న ! కామప్రియశ్రీకామకామీ !
కుమారమాకాముక శ్రీ కామరూపీ ! ౨౨

టీ. కామ + ఆది = కామమునకు మొదలయినవాఁడా, కోరిక పుట్టుటకు మూలమైనవాఁడా యనుట. ('స్మరాభిలాషయోః కామానుజ్ఞాయాం కామ మవ్యయం' రత్నమాల) సంకల్పమునకు మీఁదినవాఁ డనుట.

కామ ఆది వికారశూన్య = కామము మొదలయిన - అనఁగా కామ క్రోధ లోభ మోహ మద మత్సరాది వికారములు లేనివాఁడా, సమస్త కామప్రద = అన్నికోరికలను ఇచ్చువాఁడా, సత్యకామా = సత్యసంకల్పుఁడా, లేక కాముఁడనఁగా 'కామ్యతే యోగిభి రితి కామః' అను వ్యుత్పత్తిచేత సత్యులైన యోగులచేతఁ గామింపఁబడువాఁడా, కామఘ్నా = కామమును నశింపఁజేయువాఁడా - సంకల్పశూన్యుఁడా యనుట. కామప్రియ = కామమునందు ప్రీతి గలవాఁడా - లేక శివునకు ప్రియుఁడా యనియు, కామకామీ = కామములను కోరువాఁడా - లేక, కామ = సంకల్పస్వరూపా, కామీ = కామము గలవాఁడా యని భేదముచేసి యర్థమును గ్రహింపవచ్చును. క్షమారమాకాముక = భూదేవియందును లక్ష్మీదేవియందును గామము గలవాఁడా - లేక, క్షమారమా = సహనసంపత్తియందు కోరిక గలవాఁడా యనుట. కామరూపీ = కోరిన రూపమును ధరించువాఁడా, సమస్తరూపములను దాల్చువాఁ డని యర్థము. ఇది ఉపజాతివృత్తము—ఇంద్రవ్రజ యొకపాదమును ఉపేంద్రవ్రజ యొకపాదమును గూర్పఁగా ఉపజాతివృత్త మగును.

తా. సంకల్పమును మీఱినవాఁడవును, కామక్రోధాది వికారములు లేనివాఁడవును, సకలకామితముల నొసఁగువాఁడవును, సత్యసంకల్పుఁడవును, సంకల్పమును హరించువాఁడవును, కామమునందు ప్రీతి గలవాఁడవును, సంకల్పములను గోరువాఁడవును, ఓర్పు పెంపును మిక్కిలి కోరువాఁడవును, కోరినరూపము నెత్తువాఁడవును నగు రామచంద్రా. ౨౨

విభూతివృత్తము.

మోక్షలక్షణేక్షణా! మోక్షధర్మరక్షణా!
మోక్షసౌఖ్యదాయకా! మోక్షరాజ్యనాయకా! ౨౩

టీ. మోక్షలక్షణ-ఈక్షణా = ముక్తికి చిహ్నమైన జ్ఞానమే చూపుగాఁ గలవాఁడా - లోపలను వెలుపలను కనఁబడునవి యెల్లను నేను గాదని

స్వరూపపటమే మోక్షము. అట్లు వానిని వదలుటకు సాధనము అపరోక్ష జ్ఞానమే - అట్టి జ్ఞానమే దృష్టిగాఁ గలవాఁడనుట, మోక్షధర్మరక్షకా = మోక్షధర్మ = ముక్తియొక్క ధర్మములైన - వైరాగ్యబోధోపకరణములను, రక్షకా = కాపాడువాఁడా, మోక్ష - సౌఖ్య - దాయకా = అపవర్గ సుఖమును (ఆనందమును) - ఇచ్చువాఁడా, మోక్ష - రాజ్య - నాయకా = ముక్తి అనెడు - సామ్రాజ్యమునకు - అధిపతీ, ముక్తియొక్క సర్వాధిపత్యము గలవాఁడా, అనఁగా ముక్తి నీవుదప్ప మఱియొకఁ డిచ్చుటకు అర్హుఁడు గాఁ డనియు, నీయందుఁ దప్ప మఱియెచ్చటను గలుగ దనియు భావము. ఈ విభూతివృత్తమునకు 'ఇమ్మహిప్రజమ్ము లం, తమ్మునకె గకారముకె, గ్రమ్మియుండునట్టి వృత్తమ్ము దా విభూతి సా' అనఁగా ర,జ,గ, గణములు గలది యని లక్షణము.

తా. ముక్తిసాధనమైన అపరోక్షజ్ఞానదృష్టి గలవాఁడవును, ముక్తి ధర్మములగు వైరాగ్యాదులను రక్షించువాఁడవును, మోక్షానందమును నిచ్చువాఁడవును, మోక్షపదవికి సర్వాధిపతియు నగు రామా. ౨౩

లక్ష్మీకర! లక్ష్మీధర!
లక్ష్మీముఖకుముదచంద్ర! శ్రీ లక్ష్మీనాథా!
లక్ష్మీనివాస! విద్యా
లక్ష్మీప్రదసత్కటాక్షలవ! లక్ష్మీశా! ౨౪

టీ. లక్ష్మీకర = సంపదను కలిగించువాఁడా, లేక లక్ష్మీదేవిని సృష్టించినవాఁడా! లక్ష్మీధర = లక్ష్మీదేవిని (వక్షమందు) ధరించినవాఁడా, లక్ష్మీ...చంద్ర—లక్ష్మీముఖ = లక్ష్మీదేవి మొగ మనెడి, కుముద = కలువ పూవునకు, చంద్ర = చంద్రుఁడైనవాఁడా, లక్ష్మీనాథా = లక్ష్మీదేవికి దిక్కయినవాఁడా, లక్ష్మీనివాస = లక్ష్మికి ఉనికిపట్టయినవాఁడా, విద్యా...లవ—విద్యా = బ్రహ్మవిద్య అనెడు, లక్ష్మీ = సంపదను, ప్రద = ఇచ్చు

నట్టి, సత్ = శ్రేష్ఠమైన—కరుణాప్రయుక్త మైన, కటాక్షలవ = కడగంటిచూపుయొక్క లేశము గలవాఁడా, నీవు రవ్వంత కడగంట మాచిన మాత్రమున బ్రహ్మజ్ఞానము పెంపు సొంపారుచుండు ననుట. లక్ష్మీ+ఈశా = లక్ష్మికి పెనిమిటి యైనవాఁడా, 'లవో రామసుతే లేశే విలాసే ఛేద నేచనా । లవం మేషాది లోమ్ని స్యాత్' - నానార్థ రత్నమాల.

తా. లక్ష్మిని గలిగించువాఁడవును, లక్ష్మిని వక్షఃస్థలమందు ధరించినవాఁడవును, లక్ష్మికి సుఖవికాసము గూర్చువాఁడవును, లక్ష్మికి దిక్కయినవాఁడును, లక్ష్మికి ఉనికిపట్టయినవాఁడును, బ్రహ్మవిద్యను గడకంట రవ్వంత చూచినమాత్రనే యొసంగునట్టివాఁడును, లక్ష్మీదేవికిఁ బెనిమిటి యైనవాఁడవు నగు రామా. ౨౪

మందాక్రాంతవృత్తము.

సర్వాధారా! సగుణవిగుణా! శ్రీ సర్వభూతాధివాసా
సర్వాధ్యక్షా! సకలవరదా! శ్రీ సర్వవాగీశ్వరేశా!
సర్వవ్యాపీ! సదయహృదయా! శ్రీ సర్వసర్వాంతరాత్మా!
సర్వాతీతా! సమరసమయా! శ్రీ సచ్చిదానందరూపా! ౨౫

టీ. సర్వ + ఆధారా = సమస్తమునకు ఆశ్రయమైనవాఁడా - లేక ప్రణవరూపమగు ప్రపంచమునకు ఆధారమైనవాఁడా, సగుణవిగుణా = సగుణనిర్గుణ బ్రహ్మస్వరూపా, సర్వభూత అధివాసా = సమస్తభూతములకు ఉనికిపట్టయినవాఁడా! లేక సమస్తభూతములును ఉనికిపట్టుగాఁ గలవాఁడా, సర్వ అధ్యక్షా = సమస్త జగత్తునకు ప్రభువా, సకల వరదా = సమస్తములయిన కోరికలను ఇచ్చువాఁడా, సర్వవాక్ + ఈశ్వర + ఈశా - సర్వవాక్ = సమస్తవాక్స్వరూప మైన ప్రణవమంత్రి, ఈశ్వర = జగన్నియామకు లైన బ్రహ్మవిష్ణు రుద్రేశ్వర సదాశివులకు, ఈశా =

నియామకుఁడా * లేక పరాపశ్యన్తి మధ్యమా వైఖరీవాక్కులకు ఈశ్వరుఁడయిన అగ్నికి ప్రభువా, సర్వవ్యాపీ = అన్నిటను వ్యాపించి యుండువాఁడా, సదయహృదయా = దయతోఁగూడినహృదయము గలవాఁడా! సర్వసర్వ అంతరాత్మ - సర్వ = సమస్తమునకు, సర్వ = అన్నియునయిన - వస్తుపరిచ్ఛేదరహిత మైన, అంతరాత్మ = అంతరాత్మఁ డయినవాఁడా, పురుషప్రకృత్యాత్మక మగు సమస్తమునకు వస్తుపరిచ్ఛేదరహితమై యఖండమయిన అంతరాత్మరూపమున నున్న బ్రహ్మస్వరూపుఁడా యనుట. సర్వ అతీతా = సమస్తప్రపంచమును కడచినవాఁడా, సమరస

---

* పరాదివాక్కు లెవ్వి యనఁగా - 'పరావృక్షేషు సంజాతా పశ్యన్తీ భుజగేషుచ। మధ్యమావై పశుష్వేవ వైఖరీ వర్ణరూపిణీ' ఆకులు పువ్వులు కాయలు పండెలు చిగుళ్లు మొదలగునవి పుట్టుశక్తికిఁ దాను హేతువైయుండియు దానిని దెలియకుండు వృక్షమువలె బ్రహ్మాకారితవృత్తి రూపిణి యగుటంజేసి సర్వజగత్కారణ యయ్యు, దా నట్లగుట తెలియక బ్రహ్మప్రణవమందలి అర్ధమాత్ర తురీయ పాదాత్మక యగు ప్రకృతియె పరావాక్కు. సర్పములకు వినుటకును చూచుటకును కన్నె కారణ మయినట్లు, సకలపదార్థగ్రాహకయోగ్య మై మహత్తత్త్వసంజ్ఞ గల బ్రహ్మప్రణవమందలి మకారార్థానంద పాదాత్మక ప్రథమస్ఫురణయే పశ్యంతీవాక్కు పురుషప్రకృత్యాత్మక మగునట్టి అకార మకారములతోఁ గూడిన 'అమ్మ' యనెడి శబ్దమును బశువు పలుకుచుండియు ఆశబ్దార్థములను దా నెఱుఁగకుండునట్లు బ్రహ్మప్రణవమందలి ఉకారవిద్యాపాదాత్మక మహదహంకారరూపవృత్తి యై మధ్యమవాక్కు; మాటలు వినఁబడినను వాని యభిప్రాయ మెఱుంగఁబడక యుండు దశయే మధ్యమవాక్కనుట. బ్రహ్మప్రణవమందలి అకారవిద్యాపాదరూప మై పంచాశద్వర్ణ రూపముగఁ దాఁ బలికెడు సర్వశబ్దములును వాని యర్థములు దెలియునట్లు సంపూర్ణముగ బహిర్ముఖ మగువృత్తియే వైఖరీవాక్కనఁబడును.

మయా = సమానమైన (అనఁగా అన్నిటను అఖండమైన) రసమే స్వరూపముగాఁ గలవాఁడా, సత్ చిత్ ఆనందరూపా—సత్ = త్రికాలముల చేత బాధింపఁబడకునికియు, చిత్ = విజ్ఞానమును, ఆనంద = దుఃఖనివృత్తిపూర్వకమైన ఆనందమును, రూపా = స్వరూపముగాఁ గలవాఁడా!

మందాక్రాంత వృత్తమునకు 'మందాక్రాంతన్ గిరిశవిరతుల్, మభ్నతాగా గణంబుల్ । పొందెన్ సొంపేపనివలన, సంపూర్ణ విద్యాచయంబుల్ । క్రందించెన్ దారుణరణమునం, బౌండ్రసాళ్వాదులంతే । యందెం జేరెం డనుపలకు నం, దాత్మజుం డంచుఁ జెప్పన్' అనఁగా మ, భ, న, త, గ, గణములును పదునొకొండవయింట యతియును లక్షణము.

తా. సమస్తప్రపంచమున కాధారమైనవాఁడును, సగుణ నిర్గుణ స్వరూపుఁడును, సమస్తభూతములయందు నెలకొని యుండువాఁడును, సమస్తమున కధిపతియు, సర్వకామితముల నిచ్చువాఁడును, ప్రణవమంచుఁ బ్రతిపాదితు లగు బ్రహ్మాదులకును నీశ్వరుండును, పరాదివాక్కులకు నీశ్వరుం డయినయగ్నికిని బ్రభుండును, సర్వత్ర వ్యాపించినవాఁడును, దయగల హృదయముతోఁ గూడినవాఁడును, సమస్తమునం దంతరాత్మ యగువాఁడును, సమస్తమును నతిక్రమించినవాఁడును, అఖండ స్వరూపుఁడును, సచ్చిదానందరూపుండు నగు రామచంద్రా! ౨౫

వ. అని వెండియు ని ట్లనియె. ౨౬

తా. సుగమము.

సీ. ప్రకటపరాపరప్రకృతిమంతుండవు
 మఱియు వశీకృతమాయుఁడవును
సర్వజ్ఞుఁడవు సర్వశక్తియుక్తుండవు
 సర్వకర్తవు సర్వజనకుఁడవును

సర్వరక్షకుఁడవు ॥ సర్వసంహర్తవు
సర్వేశ్వరుండవు ॥ సర్వగుఁడవు
సర్వగురుండవు ॥ సర్వతోముఖుఁడవు
సర్వసాక్షివి సర్వ॥సముఁడ వగుచు

తే. నిర్వికల్ప నిరంజన ॥ నిర్వికార
నిర్గుణబ్రహ్మ మై యొప్పు॥నిను భజింతు
సంతతం బాత్మమయత సా॥క్షాత్కరింపు
రామ రాఘవ శ్రీరామ ॥ రామ రామ. ౨౭

టీ. ఇది మొదలుకొని పదిపీసములచేతను రాముని స్తుతించుచున్నారు. ప్రక...మంతుండవు-ప్రకట=ప్రసిద్ధమైన, పర అపరప్రకృతిమంతుండవు= పర అపర అనెడు మూలప్రకృతి గలవాఁడవు, మఱియుఁ, వశీకృత-మాయుఁడవును = లోపఱచుకొన్న (సత్వగుణస్వరూప మైన) - మాయ గలవాఁడవును, సర్వజ్ఞుఁడవు = సకలమును దెలిసినవాఁడవు, సర్వశక్తియుక్తుండవు = సమస్తము లైన (అనంత)శక్తులతోఁ గూడినవాఁడవు, సర్వకర్తవు = సమస్తమును చేయువాఁడవు, సర్వజనకుఁడవును = సమస్త జంతువులకును తండ్రివి, సర్వరక్షకుఁడవు = సకలప్రాణులను రక్షించువాఁడవు, సర్వసంహర్తవు = సమస్తజగత్తును నాశము సేయువాఁడవు - సృష్టి స్థితి సంహారములు మూఁటిచేత బ్రహ్మ విష్ణు రుద్రాత్మకుఁడ వని చెప్పుట తెలియనది. సర్వ + ఈశ్వరుండవు = సమస్త మైనవానికి ఈశ్వరుండవు - అణిమాదిసిద్ధులు గలవాఁడ వనుట— దీనిచే ఈశ్వర స్వరూపము చెప్పఁబడెను. సర్వగుఁడవు = సర్వత్ర వ్యాపించియుండు వాఁడవు - దీనిచే సదాశివస్వరూపము ప్రతిపాదితము. సర్వగురుండవు = సర్వప్రపంచమునకు జ్ఞానోపదేష్టవు, సర్వతోముఖుఁడవు = ఎల్లయెడలను ముఖములు గలవాఁడవు - అన్నిట నుండువాఁడ వనుట. సర్వసాక్షివి =

సమస్తమును చూచువాఁడవు, సర్వసముఁడవు = సమస్త జంతువులందును సమముగా వర్తించువాఁడవు, అగుచున్, నిర్వి...బ్రహ్మమై - నిర్వికల్ప = మనస్సు లేనివాఁడవు గాన, తత్ప్రయుక్తము లయిన వికల్పములు లేనివాఁడును, నిరంజన = ఇతర లేపములకుఁ బాలుపడనివాఁడును, నిర్వికార = షడ్భావవికారములు లేనివాఁడును, నిర్గుణ = ప్రకృతిరహితుఁడు గాన ప్రకృతిప్రయుక్తములగు సత్త్వాదిగుణములు లేనివాఁడును, అగు బ్రహ్మమై, ఒప్పు, నినున్, భజింతున్ = కొలుచుచున్నాను. సంతతంబు=ఎల్లప్పుడును, ఆత్మమయతన్ = ప్రత్యగాత్మస్వరూపముచేత, సాక్షాత్కరింపుము = దర్శన మొసంగుము, రామ=('రమన్తే యోగినోఽనన్తే సత్యానన్దే చిదాత్మని। ఇతి రామపదే నాసౌ పరబ్రహ్మాభిధీయతే॥' అని శ్రీరామపూర్వ పూర్వతాపనీయోపనిషత్తునందుఁ జెప్పఁబడినట్లు సకలయోగులు నీయందును) రమించునట్టివాఁడా, రాఘవ - ('అఘం = పాపం, రాతి = వినాశయతీతి రాఘః, రాఘం=తత్కృత్యం, వహతీతి రాఘవః' అను వ్యుత్పత్తిచేత) పాపములను నశింపఁజేయువాఁడా - రఘురాజకులమువాఁడా యని సామాన్యముగా నర్థము తెలియునది. శ్రీరామ = శ్రీదేవీరూపిణి యగు సీతతో రమించువాఁడా, రామ రామా, యని సంబోధనము.

తా. రామా! రాఘవా! పరాపరాత్మక యగు మూలప్రకృతిని గలవాఁడవు, కాని, తత్ప్రయుక్తమయిన మాయకు లోనుగాక దానిని లోపఱుచుకొన్నవాఁడవు; సమస్తమును నీకుఁ దెలియును, సర్వశక్తులును నీకుఁ గలవు; సమస్తమునకుఁ గర్తవు, బ్రహ్మవై సకలమును సృజించుచును, విష్ణుఁడవై సర్వమును రక్షించుచును, రుద్రుఁడవై సర్వమును సంహరించుచును నుందువు. మఱి, యణిమాదు లగు నైశ్వర్యములతోఁ గూడియుండు నీశ్వరస్వరూపుఁడవు. సర్వత్ర వ్యాపించియుండు సదాశివమూర్తివి. సకల ప్రపంచమునకు జ్ఞాన ముపదేశించు గురుఁడవు. సర్వత్ర వర్తించువాఁడవు. సమస్తమును జూచుచుండువాఁడవు. ఇట్టివాఁడవు కావుననే నీవు మానస

శూన్యత్వంబునుబట్టి వికల్పములు లేకయు, అవ్యయం బగుటంబట్టి యేలోపములకును బాలుపడకయు, శరీరరహితం బగుటంబట్టి పుట్టుట పెరుఁగుట మొదలగు షడ్వికారములను బొందకయుఁ, బ్రకృతిరహితం బగుటంబట్టి వానిగుణములు సత్త్వాదులును మాలియు నుండి సచ్చిదానందరూప మగు పరబ్రహ్మవై ప్రకాశించుచుందువు. ఇట్టి నిన్నుఁ గొలుచున్నాను. నాకెప్పుడును బ్రత్యగాత్మరూపమున దర్శన మొసంగుచుండుమా. ౨౭

సీ. విశ్వంబునం దేను వెలుఁగుచు నుండుదు
విశ్వంబు నాయందు వెలయు ననుచు
నరసి యట్లౌటయు వ్యతిరేకముగఁ జూచు
యుక్తియే భవదీయయోగమాయ
యీయోగదృష్టిచే నెప్పుడు నిను నీవ
కనుఁగొంచు సంతతాఖండసచ్చి
దానందమయుఁడ వై యలరారు నీయున్కి
గంటి భవత్కటాక్షంబుచేత
తే. నైన నిఁక నొకవర మిపు డడుగవలసె
గరిమ నీస్థితి నాస్థితిగా భజింపు
నలలితాభేదదృష్టి నొసంగుమయ్య
రామ రాఘవ శ్రీరామ రామ రామ. ౨౮

టీ. ఏను = నేను - పరబ్రహ్మమైన నేననుట, విశ్వంబునందుఁ = సమస్త జగత్తునందును, వెలుఁగుచుఁ ఉండుదుఁ = ప్రకాశించుచుందును, విశ్వంబు = ఆ ప్రపంచము, నాయందుఁ, వెలయును = ప్రకాశించును, అనుచుఁ, అరసి = విచారించి, అట్లు ఔటయు = అట్లు అగుట - అనఁగా తాను ప్రపంచమందును ప్రపంచము తనయందును వెలుంగుచుండుటనే, వ్యతిరేకముగఁ = భిన్నముగా - అనఁగా తన్ను జగమందును

జగము తనయందును లేనట్లుగా, చూచు యుక్తియే=కనుఁగొనెడి యోజ
నయే, భవదీయ యోగమాయ=నీదయిన విద్యావిద్యాత్మక మూలప్రకృతి
-అనఁగా ప్రపంచము నీవుతప్ప మఱియొకటి గానేర దనుట. ఈయోగ
దృష్టిచేఁ = నీవును జగమును అభిన్న మని కనుఁగొనెడి చూపుచేత,
ఎప్పుడుఁ = మూఁడవస్థలయందును, నినుఁ = నిన్ను, నీవ = నీవే,
కనుఁగొంచుఁ = చూచుచు, సంతత...మయుఁడవై - సంతత = ఎడ
తెగనిదయి, అఖండ = విభజింపఁగూడక యేకతానమై యుండునదియు
నగు, సత్ = సత్తును - త్రికాలములచే బాధింపఁబడకుండు నునికిని,
చిత్ = విజ్ఞానమును, ఆనంద = సంసారదుఃఖలేశాసంభిన్నమైన ఆనం
దమును, మయుఁడవై = స్వరూపముగాఁ గలవాఁడవై, అలరారు =
ప్రకాశించుచున్న, నీయునికి = నీస్థితిని - నీ అద్వయత్వము ననుట,
భవత్ కటాక్షంబుచేతఁ=నీ కడకంటిచూపుచేత, కంటిఁ = తెలిసికొం
టిని, ఐనను, ఇఁక, ఒకవరము, ఇపుడు, అడుగవలసెఁ = వేఁడవలసి
యున్నది; (ఆ వర మేమనఁగా), గరిమఁ - గురుత్వముతోడ - అల్పము
గాఁ గాక మిక్కిలియు గొప్పగా ననుట, నీస్థితిఁ = నీయునికిని, నాస్థితి
గాఁ = నాయునికిగా, భజించు...దృష్టిఁ - భజించు = ఉపాసించు
నట్టి, సలలిత = మిక్కిలి యొప్పిదమైన, అభేదదృష్టిఁ = అభిన్నముగాఁ
జూచునట్టి చూపును - నీ యునికియే నాయునికిగాని వేఱుగాదని యభేద
ముతోఁ గనుఁగొనెడిచూపు ననుట, ఒసంగుమయ్య = దయచేయుమా.

తా. రామా, రాఘవా, ప్రణవస్వరూప మయిన ప్రపంచమునందు
నీవును నీయందు ప్రపంచమును బ్రకాశించుచుందువు. నీ వా ప్రపంచమం
దును బ్రపంచము నీయందును లేనట్లుగా భావించుటయే నీప్రకృతిగాని
మఱియొకటిగాదు. దీనినిబట్టి ప్రపంచమనఁగా నీవేకాని వేఱుగాదని యభే
దదృష్టిచేత నిన్ను నీవే యవస్థాత్రయమందు చూచుచుందువు. ఇట్లఖండ
సచ్చిదానందరూపుఁడ వయి యుండుటంబట్టి నీ వద్వయుండవని నీతత్త్వ

మును నీకటాక్షలేశముచేతఁ దెలిసికొంటిని. ఇది తెలిసియుఁ దృప్తినొందక మఱియొకవరముగూడ నే నడుగవలసియున్నది. అ దేమియుఁ గాదు, నీ యునికియే నాయునికి యని యూరక తెలిసికొనుట మాత్రము కాక యట్లే యభేదముగాఁ జూచునట్టి చూపుకూడ నాకు దయసేయవలయును. ౨౮

సీ. నారాయణియును వైష్ణవియును దేవియుఁ
త్రిగుణాత్మికయుఁ బ్రకృతియు ననంగ
నలరు భవచ్ఛక్తి యపరాప్రకృతి పరా
ప్రకృతి నా ద్వివిధ యై పరఁగు నందుఁ
దతచతుర్వింశతితత్త్వరూపిణి యైన
యపరయే దైవియు నాసురియును
నన రెండుదెఱఁగుల నమరు నాదైవియె
విద్యయు మాయ యా విమల గాన
తే. నాసురి యవిద్య యారెంటి నంటి యీవ
యీశ జీవాత్మసంజ్ఞల నెసఁగు దంత
గలిగి యవికారుఁడవు వీనిఁ గాంచుకతన
రామ రాఘవ శ్రీరామ రామ రామ. ౨౯

టీ. నారా...శక్తి = నారాయణి, వైష్ణవి, దేవి, త్రిగుణాత్మిక, ప్రకృతి యని (యీపేళ్లచేత) ఒప్పుచుండెడి నీదుశక్తి, అపరాప్రకృతి, పరాప్రకృతి, నాఁ = అనఁగా, ద్వివిధయై = రెండువిధములు గలది యై, పరఁగుఁ = ఒప్పును, అందుఁ = ఆ రెండువిధము లయిన ప్రకృతు లందు, తత...రూపిణి - తత = విస్తరించినదైన, చతుర్వింశతి తత్త్వ = (పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, అవ్యక్తము = ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రలనెడి) ఇరువదినాలుగుతత్త్వములే, రూపిణి = స్వరూపముగాఁ గలది, ఐన, అపరయే = అపరాప్రకృతియే

దైవియుఁ, ఆసురియుఁ, అనఁ = అనునట్లు, రెండు + తెఱఁగులఁ = రెండువిధములుగా, అమరుఁ = ఒప్పును; ఆ దైవియే=ఆ దైవప్రకృతియే, విమల గాన = నిర్మలమైనది - అనఁగా శుద్ధసత్త్వప్రధానమైనది కాఁబట్టి, విద్యయు మాయయుఁ జొను = విద్య మాయ అనెడిపేళ్లు గలదియు నగును - అనఁగా చతుర్వింశతితత్త్వాత్మకమైన అపరాప్రకృతి, దైవి, ఆసురి అని రెండువిధముల నుండును, ఆ రెంటియందు దైవి, శుద్ధసత్త్వప్రధానమైనది గనుక విద్య మాయ అని రెండువిధము లగునని యర్థము. ఆసురి = మలినసత్త్వప్రధానమైన ఆసురి యనెడు ప్రకృతి, అవిద్య = అజ్ఞానమే యగును. ఆ రెంటిఁ =ఆ దైవిని ఆసురినిని- అనఁగా ఆ మాయను అవిద్యను అనుట, అంటి = పొంది, ఈవ = నీవే, ఈశ జీవాత్మసంజ్ఞలఁ = (మాయాసంబంధముచేత) ఈశ్వరుఁడు (అవిద్యాసంసర్గముచేత) జీవుఁడు అనెడు, పేళ్లచేత, ఎనఁగుదువు = ఒప్పుచుందువు; అంత కలిగి = ఈ యన్నియును గలవాఁడవై -అనఁగా విద్యావిద్యల సంబంధముచేత ఈశ్వర జీవసంజ్ఞలును సమష్టి వ్యష్టిరూపములును జాగ్రత్స్వప్న సుషుప్తులును, సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వాదులును గలవాఁడవై యనుట. వీనిఁ = వీనిని అన్నిటిని - అనఁగా ఈ విద్యావిద్యారూపములైన ప్రకృతులను ఈ జీవేశ్వరులను, కాంచుకతనఁ = సాక్షివై చూచుచుండుటవలన, అవికారుఁడవు = వికారమును లేనివాఁడవు, ఇవన్నియు నీవు గలిగియున్నను వీనితో నీకు వట్టిసాక్షిత్వసంబంధమే కాన, వీనివలన వికారము లేవియును నీకుఁ గలుగ వని భావము.

తా. నీశక్తి, నారాయణి యనియును వైష్ణవి యనియును దేవి యని యును త్రిగుణాత్మిక యనియును ప్రకృతి యనియును జెప్పఁబడుచున్నది గదా! ఆ నీ శక్తియే పరాప్రకృతి అపరాప్రకృతి యని రెండు విధములు. ఆ రెంటిలో అపరాప్రకృతి యిరువదినాలుగుతత్త్వముల స్వరూపమై దైవి

ఆసురి అను రెండువిధములుగా నుండును. అందు దైవి శుద్ధసత్త్వప్రధానమై విద్య మాయ యనఁబడుచుండును. ఆసురియే అవిద్య నాఁబడును. నీవు విద్యను సంబంధించి యీశ్వరుఁ డనియు అవిద్యను సంబంధించి జీవుఁ డనియుఁ బేళ్లు గలిగియుందువు. ఈ విద్యావిద్యలను జీవేశ్వరులను మఱియు వీనివలనఁ గలుగు సమష్టివ్యష్టిజాగ్రత్స్వప్నసుషుప్తులు మొదలగువాని నెల్లఁ గలిగియున్నవాఁడవయ్యు వీనిని కేవలము సాక్షివై చూచుచు మాత్రమే యుండువాఁడవు గావున, వీనివలన నీకు వికారము లేవియుఁ గలుగవు. ౨౯

సీ. అపరాప్రకృత్యవిద్యాక్షరక్షేత్రప
  దాదిశబ్దైకవాచ్యాత్మశక్తి
సన్నిధానజ పరస్వరపరచ్ఛాయాప్ర
  సక్తిచే మిథ్యాభియుక్తిచేత
నది పరాప్రకృతి విద్యాక్షరక్షేత్రజ
  సత్పురుషాదికసంజ్ఞ నొప్పు
నేన తద్ద్రష్టవై నిర్వికారాసంగ
  సాక్షివై విలసిల్లుచంద మెఱిఁగి
తే. రమణ ద్రష్టృత్వ నిర్వికారత్వసాక్షి
  తాది విద్యోక్త ధర్మజాతమును దాఁటి
పగిదిఁ గడఁద్రోచి నీస్వరూపము భజింతు
  రామ రాఘవ శ్రీరామ రామరామ. 30

టీ. పూర్వపద్యమందు అపరాప్రకృతిని నిర్వచించి యిందు పరాప్రకృతిని నిర్దేశించుచున్నారు. అపరా...ప్రసక్తిచేతఁ-అపరా...శక్తి-అపరాప్రకృతి, అవిద్య, అక్షరము, క్షేత్రము, పదము, మొదలయిన శబ్దములచేత ముఖ్యముగా చెప్పఁదగిన నీదుశక్తి యైనప్రకృతియొక్క, సన్ని

ధానజ = సమీపమున నుండుటవలనఁ బుట్టిన, పరస్పర = ఒకటొకటి యొక్క - బ్రహ్మప్రకృతులయొక్క, పర = శ్రేష్ఠములైన, ఛాయా = ప్రతిబింబములయొక్క, ప్రసక్తిచేతన్ =కూడికొనటచేత - నీవు బ్రహ్మము; నీశక్తి ప్రకృతి ఈరెండును ఒకటొకటి సమీపమున నుండుటవలన నొక దాని ఛాయ మఱియొకదానియందుఁ దగిలియుండు ననుట, దీనిచేత, మిథ్యాభియుక్తిచేతన్ = పొల్లయిన కూడికచేత - అనఁగా ఒకదాని ఛాయ మఱొకదానియందు సంక్రమించుటవలని ఒకటియె మఱియొకటిగా పట్టిభ్రాంతిచేతఁ దోఁచుటచేత నని భావము. అది= నీశక్తియైన మాప్రకృతియె, పరా...సంజ్ఞ = పరాప్రకృతి, విద్య, అక్షరము, క్షేత్రజ్ఞుఁడు, సత్త్వ, పురుషుఁడు, మొదలయిన పేళ్లచేత, ఒప్పును. ఏన = నేనే, తత్-ద్రష్టనై = దానిని చూచువాఁడనై - దృశ్యద్రష్టృభావముచేత దానికి వ్యతిరిక్తుఁడనై యనుట, నిర్వికార అసంగసాక్షినై - నిర్వికార = ఆప్రకృతివికారములు లేనట్టియు, అసంగ = ఆప్రకృతులయందు లేనట్టియు, సాక్షినై = మధ్యస్థుఁడనై, విలసిల్లుచందమున్ = ప్రకాశించు విధమును, ఎఱిఁగి=తెలిసి - మొదట అవిద్యవలన జీవుఁడనై శరీరాదులు నేనే యని తలఁచియుంటిని. పిదప నీయుపదేశమువలన జ్ఞానముఁ బడసి శరీరేంద్రియాదులు నేను గానని యును వీనికి నేను పట్టి సాక్షిమాత్రమనియుఁ దెలిసికొంటి ననుట. రమణన్ = ఒప్పునట్లు, ద్రష్టృ = అధిష్ఠాన మైయుండుట, నిర్వికారత్వ = షడ్భావవికారములు లేకుండుట, సాక్షితా = సాక్షిత్వము, ఆది = మొదలయిన, విద్యా = వేదాంతవిద్యయందు, ఉక్త = చెప్పఁబడిన, ధర్మ = ధర్మములయొక్క, జాతమున్ = సమూహమును, తొంటి పగిదిన్ = పూర్వమువలెనే-తొల్లి అవిద్యాజన్యము లగు కించిద్జ్ఞత్వాదులను విడిచినట్లుగానే యనుట, కడఁద్రోచి = దిగఁడిచి - అనఁగా అపరోక్షజ్ఞానముచేత అవిద్యోపాధిజన్యము లగు కించిద్జ్ఞత్వాదిగుణములను విడిచినట్లు, విద్యోపాధిజన్యము లైన సాక్షిత్వ సర్వజ్ఞత్వాది ధర్మములను నిషే

ధించి, నీస్వరూపముఁ = సచ్చిదానందమయ మైన నీ స్వరూపమును, భజింతుఁ = సేవింతును - అదియే నే నని యుపాసింతు ననుట.

తా. రామా, రాఘవా, నీశక్తి యగు ప్రకృతి, అపరాప్రకృతి, అవిద్య, అక్షరము, క్షేత్రము, పదము మొదలగు శబ్దములచేతఁ జెప్పఁబడు చున్నది. అట్టి శక్తి యగు ప్రకృతియును బ్రహ్మమును ఒకటికొకటి సమీప ముగా నుండుటంబట్టి యొకరిఛాయ మఱియొకరియందుఁ దగిలియుండును· దానినిబట్టి యొకటియే మఱియొకటిగా భ్రాంతికిఁ దోఁచుచుండును. అట్లు బ్రహ్మము తానుగాఁ దోఁచుచున్న యాప్రకృతియే పరాప్రకృతి, విద్య, అక్షరము, క్షేత్రజ్ఞుఁడు, సత్తు, పురుషుఁడు నను పేళ్ల చేత నొప్పుచుండును. నేనో మొదట అవిద్యవలన జీవుఁడనై శరీరేంద్రియాదులు నేనే యని భ్రమించి యుంటినిగాని, పిదప నీయుపదేశముచేత జ్ఞానమును బడసి శరీ రాదులు నేనుగా ననియు వీనికెల్లను ద్రష్ట నగుటచే వ్యతిరిక్తుఁడనై వీని వికారములకు లోను గానివాఁడనై వీని యంటు లేకుండు వట్టిసాక్షి మాత్రమే యగుదు ననియు తెలిసికొంటిని. అట్లు తెలియుటవలన మునుపు అపరోక్షజ్ఞానముచేత అవిద్యోపాధిజన్యము లగు జీవత్వ కించిజ్జ్ఞత్వాదులను ద్యజించినట్లె యిపుడు విద్యోపాధిజన్యము లైన సాక్షిత్వ సర్వజ్ఞత్వాదు లనను నిరసించి సచ్చిదానందమయ మగు నీస్వరూపమును నీవే నేనని యుపాసింతును. 30

సీ. పరమవైరాగ్యంబు భాసురాత్మజ్ఞాన
మతులితైశ్వర్య మనంతవీర్య
మమితయశంబు సమగ్రలక్ష్మియుఁ గల్గి
సంపూర్ణకారుణ్యశమదమములు
మహనీయతేజంబు మహిత తపస్సత్య
శౌచధైర్యక్షమార్జవగుణంబు

లొప్పార నిజదివ్య యోగమాయామహా
శక్తి సర్వప్రపంచంబుఁ దీర్చు
తే. సచ్చిదానంద లక్షణ సగుణ నిర్గు
ణాత్మకబ్రహ్మ మైన నీ వాత్మ మయత
సంతత మతిస్ఫుటముగ సాక్షాత్కరింపు
రామ రాఘవ శ్రీరామ రామ రామ. ౩౧

టీ. రామ, రాఘవ, శ్రీరామా, రామరామా, పరమవైరాగ్యంబు - పరమ= బ్రహ్మజ్ఞానవిషయ మైన, వైరాగ్యంబు = విరక్తియును, భాసుర+ఆత్మజ్ఞానము = ప్రకాశించుచున్న - బ్రహ్మజ్ఞానమును, అతులితము = సాటిలేని, ఐశ్వర్యము (సద్రూప చిద్రూప ఆనంద నిత్య పరిపూర్ణము లనెడి పంచలక్షణములు గల) ఐశ్వర్యమును, అనంతవీర్యము = (మహాకర్తృత్వము మహాభోక్తృత్వము మహాత్యాగిత్వము మొదలుగా) అపరిమిత మైన ప్రభావమును, అమిత యశంబు = మితి లేని కీర్తియు, సమగ్రలక్ష్మియు = నిండయిన సంపదయును - లేక మోక్షసంపత్తియును, కలిగి = ఉండి, సం...దములు - సంపూర్ణ = సమగ్రమైన, కారుణ్య= కృపయును, శమ = అంతరింద్రియ నిగ్రహమును, దమములు = బహిరింద్రియ నిగ్రహమును, మహనీయతేజంబుల్ - మహనీయ=మిక్కిలి ఒప్పిద మైన, తేజంబుల్ = సూర్యచంద్రాగ్ని కాంతులను మీరిన తేజస్సును, మహిత...గుణంబులు - మహిత=గొప్పవి యైన, తపః = మూఁడువిధము లగు తపస్సును, సత్య = సత్యమును, శౌచ = బాహ్యాంతర పరిశుద్ధియు, ధైర్య=ధీరత్వమును-నిర్వికారత్వ మనుట, క్షమా = (ద్వంద్వములయందు) ఓర్పును, ఆర్జవ = ఋజుభావమును - కుటిలత్వము లేకుండుటయు-చక్కటి యనుట, ఇవియనెడు, గుణములు, ఒప్పారఁ = ఒప్పుచుండఁగా, నిజ... శక్తి - నిజ = తనయొక్క, దివ్య=అప్రాకృతమైన, యోగమాయా=(ఇందే

'విశ్వంబునం దేను వెలుఁగుచునుండుదు, విశ్వంబు నాయందు వెలయుననుచు నరసి యట్లొటయ వ్యతిరేకముగఁ జూచు యుక్తియే భవదీయ యోగమాయ') అనెడు (యోగశబ్దముచేత బ్రహ్మజీవుల యైక్యమునకుఁ గారణ మయినదియు మాయాశబ్దముచేత జగత్తునకు కారణోపాధి యైనదియు నని వ్యుత్పత్తి), మహాశక్తి = చిచ్ఛక్తి, సర్వప్రపంచంబున్ = చతుర్వింశతి తత్త్వరూప మైన జగత్తునెల్ల, తీర్పన్ = సృజింపఁగా - లేక, పాలింపఁగా, సచ్చి... బ్రహ్మము - సత్ = సత్తును, చిత్ = చిత్తును, ఆనంద = ఆనందము ననెడి, లక్షణ = ఈలక్షణములచేత, సగుణ = త్రిగుణాత్మక మగు ప్రకృతితోఁ గూడిన, నిర్గుణ=ప్రకృతితోఁ గూడని, ఆత్మక = స్వరూపము గల, బ్రహ్మము, ఐన, నీవు, సంతతము = ఎల్లప్పుడు, ఆత్మమయతన్ = ప్రత్యగాత్మరూపముచేత, అతిస్ఫుటముగన్ = మిక్కిలి స్పష్టముగా, సాక్షాత్కరింపుము = దర్శన మొసంగుము-అపరోక్షానుభూతి కలుగఁజేయు మనుట.

తా. రామా, రాఘవా, మిక్కిలి వైరాగ్యమును బ్రహ్మజ్ఞానమును సద్రూపాదిలక్షణములు గల గొప్ప యైశ్వర్యమును మహాకర్తృత్వము మొదలయిన యపరిమితప్రభావములును మితి లేని కీర్తియును సంపూర్ణమయిన సంపత్తియుఁ గలిగియుందువు. పరిపూర్ణమగు కరుణయు శమమును దమమును తేజమును తపమును సత్యమును శౌచమును ధైర్యమును క్షమయును ఆర్జవమును మొదలగు గుణములతోఁ గూడియుందువు. యోగమాయ యనెడి నీదుచిచ్ఛక్తి చతుర్వింశతితత్త్వస్వరూప మైన యీప్రపంచమును రచించుచున్నది. ఇట్లు సచ్చిదానందలక్షణమై సగుణమును నిర్గుణము నయిన బ్రహ్మమగు నీవు నా కెప్పుడును బ్రత్యగాత్మరూపముగ సాక్షాత్కరింపుము. 31

సీ. ఘనఘటాకాశ మాకాశాంశ మగుచు నా
కాశంబునకు వేఱు గానిపగిది
క్షరముతోఁ గూడి యక్షరుఁడ నై విలసిల్లు

నేను నీయంశంబు కా నిశ్చయంబ
యైన ననాద్యవిద్యాశక్తి గుణరాశి
నాయందు నారోపణంబుగఁ జేసి
జీవుఁడ నంచు సంసృతిఁ జెంది యుండితి
నిందాఁక నది యిపు డెఱిఁగికొంటిఁ

తే. గాన వివరింప భేద మింకనైనఁ గలుగ
దిట్టివిజ్ఞానసంపద నెల్లప్రొద్దు
చిత్తమునను బ్రకాశింపఁ జేయుమయ్య
రామ రాఘవ శ్రీరామ రామ రామ. ౩౨

టీ. ఘన - ఘట - ఆకాశము = మేఘమండలి - కుండలోపలి - ఆకాశము, ఆకాశ + అంశము = మహదాకాశముయొక్క భాగము, అగుచున్, ఆకాశంబునకున్ = మహాకాశమునకు, వేఱు = అన్యము, కాని పగిదిన్ = కానియట్లు, సరముతోన్ = (జీవేశ్వర) దేహముతోడ, కూడి, అక్షరుఁడవై = కూటస్థుఁడవై, విలసిల్లు = ప్రకాశించుచున్న, నేను, నీయంశంబు = నీకళయే, అగుదును; నిశ్చయంబ = ఇది సత్యమే, ఐనన్ = అయినప్పటికిని—నేను నీయంశమే యైననుగాని యనుట, అనా...రాశి - అనాది = ఆదిలేనట్టి, అవిద్యా = అవిద్య యనెడు, శక్తి = శక్తియొక్క, గుణరాశి = (నేను జడుఁడ, నేను మూర్ఖుఁడ నని మొదలుగాఁ గల) గుణములయొక్క సమూహమును, నాయందున్ = ప్రత్యగాత్మ యైననాయందు, ఆరోపణముగఁ జేసి = ఆరోపించుకొని - లేని దానిని ఉన్నట్లు కల్పించుకొని యనుట, జీవుఁడ నంచున్ = క్షేత్రజ్ఞుఁడ నని, ఇందాఁకన్ = ఇంతకాలమువఱకును, సంసృతిన్ = సంసారమును— జన్మవాసన ననుట, చెందియుండితిన్ = పొందియుంటిని, అది = ఆసంసారము, ఇపుడు, ఎఱిఁగికొంటిన్ = ఆరోపిత మైనదేకాని యథార్థము

కాదని తెలిసికొంటిని. కాన = కనుక, వివరింపఁగ = పరామర్శింపఁగా, భేదము = వేఱుపాటు - ద్వైతప్రపంచ మనుట, ఇంత యినఁ = కొంచె మైనను, కలుగదు; ఇట్టి విజ్ఞానసంపదఁ-ఇట్టి=ద్వైతభ్రమము లేకుండునట్టి, విజ్ఞాన = బ్రహ్మజ్ఞానముయొక్క, సంపదఁ = కలిమిని, ఎల్లప్రొద్దు = ఏకాలమును, చిత్తమునఁ = అంతరంగమందు, ప్రకాశింపఁ జేయు మయ్య = వెలిఁగింపుమా.

తా. మట్టినందును కుండయందును గల యల్పాకాశము మహదా కాశములో నొకభాగ మగుటయె కాక, దానికి వేఱుగాకయు నుండును. ఇట్లే, క్షరమైన జీవదేహమందును ఈశ్వరదేహమందును గూటస్థుఁడ నై యున్న నేను నీయంశమె కాని నీకు వే ఱంతమాత్రము గా నేరను. అయినను అనాదిగా నున్న యవిద్యాశక్తివలన నేను జడుఁడను మూర్ఖుఁడ నను నిత్యాదిగుణములను నాయందు లేకున్నను గల్పించుకొని జీవుఁడ ననుకొని యింతకాలము సంసారము పాలై యుంటిని. ఇపుడు నీ యనుగ్రహము వలన ఆ సంసారము వట్టికల్పితమే కాని వాస్తవము కాదని తెలిసికొంటిని. కాఁబట్టి విచారించిచూడఁగా నంతయు బ్రహ్మ మొక్కటియె కాని, మన కంటె వేఱుగాఁ గనఁబడుచున్న యీభేద (ద్వైతభ్రమ) మొక్కటియు నిజము గాదు. ఇట్లు ద్వైతభ్రాంతి లేని బ్రహ్మజ్ఞానము పెంపు నా యంత రంగమం దెల్లకాలమును బ్రకాశించుచుండునట్లు చేయుమా. 3౨

సీ. నీకంటె నన్యంబు ♦ నే నెన్నఁ డేఱుఁగ నె
ట్లనిన నాయనుభవ ♦ మవధరింపు
వివిధేంద్రియములకు ♦ విషయ మీవిశ్వ మా
విశ్వరూపుఁడ వీవు ♦ వెదక నేల
గావున నీవు సాక్షాత్కరించితివి యీ
విశ్వంబు నీ కగు ♦ వే ఱటంచుఁ

దలఁచు నజ్ఞాన మంతయుఁ బోయె నీదయా
మయదృష్టి నానందమయుఁడ నైతి
తే. సంశయము లేదుగాని యీవిశ్వరూప
సమరసజ్ఞానభావన సంతతంబు
గలుగ వరము ప్రసాదింప వలయు దేవ
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 33

టీ. రామా! రాఘవా! దేవా! నీకంటెన్, అన్యంబు = ఇతరము, నేను = జ్ఞాతనగు నేను, ఎన్నఁడును, ఎఱుఁగను, ఎట్లు అనినన్ = నీకంటె వేఱు నే నెఱుఁగకుండుట యేవిధమున నని యడుగఁగా, నా అనుభవము = నా ఎఱుకను, అవధరింపుము = వినుము - నే నెఱిఁగినవిధము విను మనుట. వివిధ ఇంద్రియములకున్ = నానావిధములు లయిన పదునాలు గింద్రియములకును, ఈ విశ్వము = ఈ జగత్తు, విషయము = దృశ్యము - గోచరమైనది; మూఁడువిధము లయినజగత్తును ఇంద్రియజన్యమే కాని వాస్తవము కాదని ఆశయము; ఈవు = నీవు, ఆ విశ్వరూపుఁడవు = ఇంద్రియజన్యమైన ఆ త్రివిధ జగత్తే స్వరూపముగఁ గలవాఁడవు - ఆ జగత్తు నీవే కాని మఱి యొకటి గా దనుట, వెదక నేల = విచారించుట యెందులకు - నీ వెవ్వఁడవో యేస్వరూపము గలవాఁడవో, యెక్కడ నున్నాఁడవో యని విచారము సేయుట యక్కఱలేదు; నీవే యీజగత్తని భావము; కావునన్, ఈవు = నీవు, సాక్షాత్కరించితివి = విశ్వరూపమున నాకుఁ బ్రత్యక్ష మైతివి. కాఁబట్టి నిన్ను వెదక నేల యనుట, ఈ విశ్వంబు = కన్నుల కగపడుచున్న యీ జగత్తు, నీకున్, వేఱు, అగును, అటంచున్, తలంచు = ఎంచెడి, అజ్ఞానము అంతయును, నీదయామయదృష్టిన్ = నీకృపతోఁ గూడినచూపు చేత, పోయెన్ = నశించెను; ఆనందమయుఁడను = బ్రహ్మానందస్వరూపుఁడను, ఐతిని, సంశయము లేదు గాని = ఈ విషయమై సందేహము

కలుగవుగాక, ఈ సర్వ...భావన - ఈ సర్వరూప = ఈ సమస్తరూప ములయొక్క - సమస్తరూపమైన జగత్తుయొక్క, సమరస = అన్నియు నొకటియే యను, జ్ఞాన = జ్ఞానముచేత - ఈ జగత్తునం గల రూపము లన్నియు నొక్క బ్రహ్మ మనెడి జ్ఞానముచేత, భావన= తలంచుట - పర బ్రహ్మము తప్ప మతియొక్కటి కాదని భావించుట, సంతతంబుగ = ఎల్లప్పుడు, కలుగగ = కలుగునట్లు, వరము, ప్రసాదింపవలయును = అనుగ్రహింపవలయును.

తా. రామా! రాఘవా! నీకంటె మఱియొకటి యున్నదని నే నెఱుంగను. ఇది నా కెట్లు తెలిసెనో యావిధమును జెప్పెదను వినుము. ఈ కనఁబడుచున్న జగత్తు పదునాలుగింద్రియములకు గోచరించుచున్నది. ఆ యింద్రియములవలననే యిది పుట్టినదికాని నిజము కాదు. ఈ జగత్తో నీ రూపమే; కాన, నీవే యగుదువు. కాఁబట్టి యీ జగత్తు కనఁబడుట యనఁగా జగద్రూపుఁడ వయిన నీవు సాక్షాత్కరించుటయే యైనది. ఇట్లు జగ మంతయు నీవే యని యెఱిఁగినందువలన నీకంటె వేఱొక్కటి లేదని నేను దెలిసికొంటిని. ఇట్టి యెఱుకవలన, నింతవఱకు జగత్తిది నీకంటె వేఱయినదని తలంచుచుండిన యజ్ఞాన మంతయు నశించినది. నీకృపాకటాక్షము చేత బ్రహ్మానందస్వరూపుఁడ నయితి. ఇందుల కెంతమాత్రము సందేహము లేదు. అయినను జగత్తునందుఁ గనఁబడుచున్న యీ సమస్తరూపములు బ్రహ్మ మొక్కటియే యనుజ్ఞానము గలిగి యన్నిటిని బ్రహ్మముగానే తలంచుచుండుట నా యంతరంగమందు నెల్లప్పుడును గలిగియుండునట్లుగా నీ వనుగ్రహింపవలయును. 22

సీ. తతచతుర్వింశతితత్త్వనాయకుఁడవు
పంచవింశకుఁడవు ప్రకృతికంటెఁ
బరుఁడవు గురుఁడవు పరమేశ్వరుండవు

పురుషోత్తముఁడవు నెప్పుడుఁ బ్రధాన
పురుషేశ్వరుండవు పూర్ణుఁడ వనుచు ని
న్నెఱిఁగితిఁ గాని యీ యెఱుక దృఢము
గా నిల్వ దజ్ఞానకార్యదేహాదికా
త్మధ్యానసంతతాభ్యాసవశత
తే. నట్లు గావునఁ గేవలాత్మయోగ
దృష్టి మనమున నేప్రొద్దుఁ దేజరిల్ల
భూరికృపచే ననుగ్రహింపుము పొసంగ
రామ రాఘవ శ్రీరామ రామచంద్ర. ౩౮

టీ. రామ, రాఘవా, తతచతుర్వింశతితత్త్వనాయకుఁడవు = గొప్పవి యగు ఇరువదినాలుగు తత్త్వములకు నియామకుఁడవు, పంచవింశకుఁడవు = ఇరువదియైదవతత్త్వ మైనవాఁడవు - ఆ యిరువదినాలుగింటికిని, జ్ఞాతయైన వాఁడవనుట, ప్రకృతికంటెన్ = పర అపర అను రెండు విధములైన ప్రకృతికంటెను, పరుఁడవు = అన్యుఁడవు-లేక ఉత్కృష్టుఁడవు, గురుఁడవు = గొప్ప వాఁడవు-లేక బ్రహ్మమవు, పరమేశ్వరుండవు = నిరతిశయములయిన అణిమాది సకలైశ్వర్యములు గలవాఁడవు, పురుష + ఉత్తముఁడవు = పురుషశబ్ద వాచ్యు లగుజీవులలోపల శ్రేష్ఠుఁడవు-అనఁగా విష్ణుఁడ వనుట, ఎప్పుడున్ = త్రికాలములందును, ప్రధానపురుష + ఈశ్వరుఁడవు = ప్రకృతికిని పురుషుఁడగు జీవునకు నియామకుఁడవు-పరబ్రహ్మమ వనుట, పూర్ణుండవు = అఖండ సచ్చిదానందమయుఁడవు, అనుచున్, నిన్నున్, ఎఱింగితిని, కాని, ఈ యెఱుక = ఇట్లు నిన్నెఱుఁగుట, అజ్ఞాన...వశతన్ - అజ్ఞాన = అజ్ఞానముయొక్క, కార్య = కార్యము లయిన, దేహ ఆదిక = దేహము మొదలయినవానిని, ఆత్మ = నేను అనెడు, ధ్యాన = చింతనమందు, సంతత = ఎడతెగని, అభ్యాసవశతన్ = అలవాటునకు లోపడియుండుట

చేత - అవిద్యాజన్యము లైన యీ దేహేంద్రియాదులే నేనని చిరకాలము నుండి యెడతెగక తలంచుచు వచ్చినవాడుకనుబట్టి యనుట, దృఢము గాన్ = నిలుకడగా, నిల్వదు; అట్లు కావునన్ = అట్లు గట్టిగా నిల్చి యుండదు గాఁబట్టి, కేవలాత్మ = శుద్ధాత్మస్వరూపం బగు పరబ్రహ్మము యొక్కయు, ఆత్మ = ప్రత్యగాత్మయొక్కయు, యోగదృష్టి = ఒక్క టియే అనెడు ఐక్యజ్ఞానము, మనమునన్ = అంతరంగమందు, ఏప్రొద్దున్ = సర్వకాలము, తేజరిల్లన్ = మఱుఁగుపడక ప్రకాశించునట్లు, భూరి కృపచేన్ = మిక్కిలియైన కరుణచేత, పొసంగన్ = ఒనగూడునట్లు, అనుగ్రహింపుము = దయసేయుము - ఉపదేశింపు మనుట.

తా. నీ విరువదినాలుగు తత్త్వములను నియమించుచు, దాని కవ్వల జ్ఞాతయై యుండు నిరువదియేనవవాఁడ వనియు, ప్రకృతికంటెఁ బరుండ వనియును, గొప్పవాఁడ వనియు, నిరతిశయమైన యణిమాది సకలైశ్వర్య ములు గలవాఁడ వనియు, జీవులందెల్ల నుత్తముండ వనియు, ప్రకృతిపురు షుల కెప్పుడు నియామకుఁడ వనియును, సచ్చిదానందపరిపూర్ణుఁడ వనియును దెలిసికొంటిని - తెలిసికొన్న నేమి? అవిద్యాకార్యము లగు దేహాదుల నే నేను నేనని యెప్పుడును తలంచుచుండినవాఁడను గదా! ఆ యలవాటు వలన నాకుఁ గలిగిన యీ యెఱుక మనస్సునందు దృఢముగా నిలువఁ జాలదు. కాఁబట్టి, పరబ్రహ్మమును ప్రత్యగాత్మయు స్వరూపమం దొక్క టియే యనెడి యీ జ్ఞానము నా యంతరంగమం దెప్పుడును గలిగియుండు నట్లు మిక్కిలి కృపచేత ననుగ్రహింపుమా. 38

సీ. అజుఁడ వవ్యయుఁడ వీ వాదినారాయణ
స్వామివి సాక్షివి సర్వమయుఁడ
వై యొప్పునిన్ను మాకయానూనుపశరీర
దరుఁడుఁ గించిజ్జుండు నరుఁ డటంచు

నజ్ఞానవశత మోహంబుచేఁ దలఁచితి
నిందాఁక నది క్షమియించుకొఱకు
సర్వజ్ఞ సర్వేశ సర్వభూతావాస
సర్వభూతాత్మక సర్వమూర్తి
తే. సర్వకర్మఫలాధ్యక్ష సర్వరూప
యని నుతించుచు మ్రొక్కెద ననవరతము
నెఱయ నామది నీయందు నిల్వఁజేయు
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 3౫

టీ. ఈవు = నీవు, అజుఁడవు = పుట్టుక లేనివాఁడవు, అవ్యయుఁడవు = నాశము లేనివాఁడవు, ఆదినారాయణస్వామివి = ఆదియందు (అనఁగా ప్రకృతికి పూర్వమందు) ఉన్న నారాయణమూర్తివి - పరబ్రహ్మము వనుట, సాక్షివి = మధ్యస్థుండవు, సర్వమయుఁడవై = విశ్వరూపుఁడవై, ఒప్పు నిన్నుఁ, మాయా...డును - మాయా = మాయచేతఁ గల్పింపఁబడిన, మానుషశరీర = మనుష్యదేహమును, ధరుఁడును = ధరించినవాఁడును, కించిజ్జ్ఞుఁడును = అల్పజ్ఞానము గలవాఁడును, నరుఁడును = మనుష్యుఁడును, అటంచున్ = అని, అజ్ఞానవశతన్ = అజ్ఞానమునకు లోనై యుండుటవలన, మోహంబుచేన్ = భ్రాంతిచేత, ఇందాఁకన్ = ఇంతవఱకు - ఈ యపరోక్షజ్ఞానము గలుగువఱకు, తలఁచితిన్ = ఎంచితిని, అది = ఆతలఁచుట, క్షమియించుకొఱకున్ = సహించుటకై, సర్వజ్ఞ = సమస్తమును ఎఱిఁగినవాఁడా, సర్వేశ = సమస్తమునకు ఈశుఁడా, సర్వభూత ఆవాస = చరాచరము లగు సకలభూతములు నీయందును నీవు సకల భూతములయందును వసించునట్టివాఁడా, సర్వభూత ఆత్మక = ఆకాశాది సమస్త భూత స్వరూపుఁడా, సర్వమూర్తి = బ్రహ్మ విష్ణు రుద్రాదిమూర్తు లన్నియు నీవే యైనవాఁడా, సర్వకర్మఫల అధ్యక్ష =

సమస్తమైన (అగ్నిష్టోమము అతిరాత్ర్యము మొదలుగాఁ గల విధినిషేధ కామ్యప్రాయశ్చిత్తాది) కర్మములయొక్క, ఫల = ఫలములకు - ఫలానుభవముల కనుట, అధ్యక్ష = ప్రభువా, సర్వరూప = సమస్త రూపములు నీవే యైనవాఁడా, అని, అనవరతము = ఎల్లప్పుడును, నుతించుచున్ = పొగడుచు, మ్రొక్కెదన్ = నమస్కరించెదను, నా మది = నా మనస్సు, నెఱయన్ = నిండుగా, నీయందున్, నిల్వఁజేయు = నిలువఁజేయుము.

తా. రామా! రాఘవా! నీకుఁ బుట్టుక లేదు, నాశము లేదు, ప్రకృతికంటె మునుపటివాఁడవు, నారాయణుఁడవు, అన్నిటికి సాక్షివి, సర్వమయుఁడవు. ఇట్టి నిన్ను, మాయచే మనుష్యదేహమును దాల్చినవాఁడనియు, అల్పజ్ఞానము గలవాఁడనియు, మనుష్యుఁడనియు నే నజ్ఞానవశమునను భ్రాంతిచేతను నింతకాలము తలఁచుచునుంటిని. ఇట్లు తలఁచుచువచ్చిన దానిని మన్నించుకొనుటకు నిన్ను సర్వజ్ఞా, సర్వేశా, సర్వభూతావాసా, యనెడి యిత్యాది పరబ్రహ్మత్వ ప్రతిపాదకము లగు నామములచేత నెల్లప్పుడును బొగడుచు మ్రొక్కెదను. నా మనస్సును నీయందుఁ బరిపూర్ణముగా నెలకొనియుండున ట్లనుగ్రహింపుము. 38

సీ. తతచతుర్వింశతితత్త్వాత్మకం బగు
క్షరము నేఁ గాను నిక్కముగ నరయఁ
దత్కృతంబులు మత్కృతంబులు గావు కా
వున సర్వధర్మములును ద్యజించి
యక్షరపురుషుండ నై క్షరాక్షరతత్త్వ
ముల మీఱి పురుషోత్తముండు నాప్పుఁ
డన నొప్పునొకనిని నాశ్రయించెద శర
ణముగ నే నొగి ననన్యత్వ మలర

తే. నట్లగుట నింక నేసంశయములు నన్నుఁ
బొరయకుండంగఁ జేసి యీపూర్ణబోధ
మతిదృఢంబుగ వర మిమ్ము సతత మాత్మ
రామ రాఘవ శ్రీరామ రామ రామ.    ౩౬

టీ. తత...త్మకంబు - తత = అతిశయమైన, చతుర్వింశతి తత్త్వ ఆత్మకంబు = ఇరువదినాలుగు తత్త్వములు స్వరూపముగాఁ గలది, అగు, క్షరము = దేహము, నిక్కముగన్ = సత్యముగా, నేను గాను, అరయన్ = యోజింపఁగా, తత్కృతంబులు = ఆదేహము చేయునట్టివి- దాని వ్యాపారము లనుట, మత్ కృతంబులు గావు = నాచేత చేయంబడినవి గావు, కావునన్, సర్వధర్మములును = సమస్తము లయిన దేహధర్మములును - పదునాలుగింద్రియముల వ్యాపారములును, త్యజించి = వదలి, అక్షర పురుషుఁడనై = అక్షరుఁడనగు పురుషుఁడ నయి - జ్ఞాతనై యనుట, ఆర అక్షరతత్త్వములన్ = క్షరతత్త్వ మగు దేహమును అక్షరతత్త్వ మగు దేహినిని, మీఱి = అతిక్రమించి, పురుషోత్తముండును = పురుషులయందు (అనఁగా జీవులయందు), ఉత్కృష్టుఁడును = ఉత్కృష్టం బగు పరబ్రహ్మము అనుట, ఆత్ముఁడు = ప్రత్యగాత్ముఁడును, అనన్ = అనునట్లు, ఒప్పు = ఒప్పుచున్న, ఒకనిన్ నిన్నున్ = అద్వితీయుఁడ వైననిన్ను, నేను, ఒగిన్ = క్రమముగా, శరణముగన్ = రక్షకునిఁగాఁగ, అనన్యత్వము = వేఱుపాటులేమి, అలరన్ = ఒప్పునట్లుగా, నీకును నాకును భేదము లేమిని అనుసంధించు ననుట, ఆశ్రయించెదను. అట్లు అగుటన్ = అట్లు ఆశ్రయించుటవలన, ఇఁకన్, ఏసంశయములున్ = ఏసందేహములును, నన్నున్, పొరయక ఉండంగన్ చేసి = పొందకుండునట్లు కావించి, సంతతము = ఎల్లప్పుడు, ఆత్మన్ = మనస్సునందు, ఈ పూర్ణబోధము =

ఈ నిండయినయొుుక-ఈ యఖండజ్ఞానము, అతిదృఢంబుగాన్ = మిక్కిలి గట్టిగా, ఉండునట్లు, వరము ఇమ్ము.

తా. రామా, రాఘవా, ఇరువది నాలుగు తత్త్వముల మయమైన ప్రకృతివికారంబగు దేహము నేను గాను, మఱి యాదేహము కావించు వ్యాపారములు నేను జేసినవిగావు. కాఁబట్టి క్షరమైన యా దేహముయొక్క సర్వవ్యాపారములను విడిచి యక్షరుఁడనై యా వ్యాపారములకు జ్ఞాతగా నుండి, యాక్షరమును అక్షరమును రెంటిని నతిశయించి, పురుషోత్తముఁడును ప్రత్యగాత్ముఁడునై యద్వితీయుఁడునై యున్ననిన్ను నభేద బుద్ధితో శరణుఁ జొచ్చుచున్నాను. కాఁబట్టి నా కేసందేహములును గలుగకుండునట్లుగా అఖండజ్ఞానము నా మనస్సునం దెప్పుడును దృఢముగా నుండునట్లు వర మిమ్ము. 31

వ. అని యి ట్లఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించు హనుమంతుని సాదరంబుగాఁ గరుణాకటాక్షవీక్షణంబుచేతఁ గనుంగొని భూరిప్రేమధాముండుఁ బరంధాముండు నైనయాత్మారాముం డి ట్లనియె. 32

టీ. అని యిట్లు, అఖండ పాండిత్యంబుచేతన్ = తక్కువకాని పాండిత్యముచేత (ఇట పాండిత్య మనఁగా 'పణ్డితాః సమదర్శినః' అన్నట్లు సమదర్శనరూపతత్త్వజ్ఞాన మని తెలియునది), పెక్కుభంగులన్=అనేక విధములుగ, వినుతించు హనుమంతునిన్ = పొగడుచున్న ఆంజనేయుని, సాదరంబుగాన్ = ఆదరణతోడ, కరుణాకటాక్షవీక్షణంబుచేతన్ = దయతోఁ గూడిన కడగంటిచూపుచేత, కనుంగొని = చూచి, భూరిప్రేమధాముండును = మిక్కిలి యైనప్రీతికి ఉనికిపట్టగువాఁడును, పరంధాముఁడును = ఉత్కృష్టమైనకాంతి గలవాఁడును - (లేక ధామశబ్దము స్థానవాచకము గనుక ఉత్కృష్టమైనపదవి నుండు పరబ్రహ్మమును) ఐన,

ఆత్మారాముండు = సర్వాత్ములయందు రమించువాఁడగురామమూర్తి, ఇట్లనియెను. తా. సుగమము. ౩౭

తే. సంతసము మీఱఁ జిత్తవిశ్రాంతికొఱకు
సతత మాత్మసమాధిఁ గోరితివి గాన
కడఁగి యమనస్కరాజయోగంబు నీకుఁ
దెలియఁజెప్పెద వినుము సందేహ ముడిఁగి. ౩౮

టీ. నీవు, సంతసము మీఱన్ = సంతోషము మించునట్లుగా, చిత్తవిశ్రాంతికొఱకు = మనస్సుయొక్క కుదురుపాటుకొఱకు, సతతము = ఎల్లప్పుడును, ఆత్మసమాధిన్ = ఆత్మనియందలి మనోలయమును - బ్రహ్మనిష్ఠ యనుట, కోరితివి, కాన, కడఁగి = పూని, నీకున్, అమనస్కరాజయోగంబు = అమనస్కము అను పేరు గల రాజయోగమును, తెలియన్, చెప్పెదను, సందేహము, ఉడిగి = విడిచి, వినుము, నిస్సందేహముగా వినుమనుట.

తా. నీవు మనస్సు నిమ్మళపాటు నొందుకొఱకై యెప్పుడును బ్రహ్మనిష్ఠ కోరుచున్నావు గనుక, 'అమనస్క' మనెడి రాజయోగమును సందేహము లెల్లఁ దీఱునట్లుగాఁ జెప్పుచున్నాను వినుము. ౩౮

చ. అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగాఁ
గలయఁగ నీఁదవచ్చును నగంబుల నచ్చనగండ్లుగాఁ గరం
బులఁగొనియాడవచ్చు నభమున్ గబళింపఁగవచ్చుఁగాని యి
య్యలనమనస్కయోగము గ్రహింపఁగరాదు దలంప నేరికిన్.

టీ. అలయక = కష్టములేక, సప్తవారిధులన్ = ఏడు సముద్రములను, ఆవలికిన్ ఈవలికిన్ = ఆగట్టునుండి యీగట్టునకును ఈగట్టునుండి యాగట్టునకును, ఒక్కరీతిగాన్ = ఒక్కతీరున, కలయఁగన్ = అంతటను

ఈఁదవచ్చును; నగంబులన్ = పర్వతములను, అచ్చనగండ్లుగాన్ = అచ్చనగాయలుగా, కరంబులన్ = చేతులచేత, కొని = పట్టుకొని, ఆడవచ్చును = ఆటలాడవచ్చును, నభమున్ = ఆకాశమును, కబళింపఁగన్ వచ్చున్ = మ్రింగవచ్చును; కాని, ఇయ్యిలన్ = ఈ భూమియందు, అమనస్కయోగమును, తలంపన్ = విచారింపఁగా, ఏరికిన్ = ఎవ్వరికిఁ గాని, గ్రహింపఁగరాదు = తెలిసికొనఁగూడదు, అంత మహాకష్టమైనదనుట.

తా. సప్తసముద్రముల నొకగట్టునుండి మఱియొక గట్టునకు నవలీలగా నీఁదినను నీఁదవచ్చును. కొండలను అచ్చనగాయలుగాఁ జేతఁ బట్టుకొని యాటలాడవచ్చును. ఆకాశమును మ్రింగవచ్చును. ఇవి యన్నియును జేసినను జేయవచ్చునుగాని, అమనస్కయోగమును గ్రహించుట మాత్రము శక్యము గాదు. ౩౯

భూతిలకవృత్తము.

కావున నయ్యమనస్కయోగము గాఢదుర్లభ మారయన్
కేవలతత్త్వవిచారముం బరికింప నేరనివారికిన్
భావమునందు ననాత్మ నాత్మని బాగుగా విభజించుమే
ధావికి నిత్యసుఖంబుగా విశదంబుగా సులభం బగున్. ౪౦

టీ. కావునన్ = అట్లు గ్రహించుట మిక్కిలికష్టము గనుక, ఆ అమనస్కయోగము = ఆ మనోన్మనీయోగము, అరయన్ = విచారింపఁగా, కేవలతత్త్వవిచారమున్ = శుద్ధమైన బ్రహ్మవిచారమును, పరికింప నేరనివారికిన్ = పరామర్శించి తెలిసికొన శక్తులు గానివారికి, గాఢదుర్లభము = పొందుటకు మిక్కిలియుఁ గష్టమైనది; భావమునందున్ = మనస్సునందు, అనాత్మన్ = ఆత్మకాని ప్రకృతిని, ఆత్మనిన్ = పరమాత్మని - బ్రహ్మమును, బాగుగాన్, విభజించు మేధావికిన్ = వేఱుపఱచి

తెలియు జ్ఞానవంతునకు, అది, నిత్యసుఖంబుగాన్ = శాశ్వతమైన సౌఖ్యము నిచ్చునదిగాను, విశదంబుగాన్ = తేటతెల్లముగాను, సులభం బగున్ = సులువుగాఁ బొందఁగూడిన దగుచున్నది.

తా. ఆ యమనస్కయోగ మిట్లు గ్రహించుటకు మిక్కిలి కష్టమైనది గావున, శుద్ధబ్రహ్మవిచారము సేయుటకు శక్తులు గానివారికి నది మిక్కిలి దుర్లభముగా నుండును. మనస్సనం దెవఁడు ప్రకృతిని బ్రహ్మమును వేఱు వేఱుగాఁ దెలియునో యట్టి జ్ఞానవంతుని కాయోగము మిక్కిలి స్పష్టముగా సులభమై నిరంతరమును సుఖము గూర్చుచుండును. భూతిలకవృత్తము— 'భారనజాగగణంబులుం బఱవంగ భాను విరామ విస్ఫారత భూతిలకంబు పాండవపక్ష దైవత వృక్షమిం । పార ధరిత్రికిఁ దెచ్చినట్టి మహాత్మ యంచుఁ గవీశ్వరుల్ । చారుపదంబులు గూర్చి చెప్పిన శ్రావ్యమా విను వారికిన్' అనఁగా భ, భ, ర, న, జ, జ, గ, గణములును పంద్రెండవ యింట యతియును గలిగియుండు నని తెలియునది.   ౮౦

తోదకవృత్తము.

చెలువుగఁ బువ్వులు చీరుటకంటెన్
బొలుపుగఁ గన్గవ మూయుటకంటెన్
నలు వగు నీయమనస్కపథంబే
సులభము సౌఖ్యము సూక్ష్మము వత్సా.   ౮౧

టీ. వత్సా = బిడ్డా - హనుమంతుఁడా, చెలువుగన్ = పొంకముగా, పువ్వులు చీరుటకంటెన్ = పూలను గోయుటకంటెను, పొలుపుగన్ = చక్కఁగా, కన్గవన్ మూయుటకంటెన్ = కన్నులను రెంటిని మొగుడ్చుటకంటెను, నలువు అగు = ఒప్పిదమైన, ఈయమనస్కపథంబే = ఈ రాజయోగమార్గమే, సులభము = సుఖముగా పొందఁదగినది, సౌఖ్య

ము = సుకరమైనది, సూక్ష్మము = మిక్కిలి చులుకనయినది - ఆత్మ యిది అనాత్మ యది అని వివేచించి యెఱింగినవారికి అమనస్కయోగము మిక్కిలియుం సులభమయిన దనుట - అది తెలియనివారికే మహాకష్ట మని భావము. తోదకవృత్తమునకు - 'సలలిత తోదక సామజవిక్రాం । తులను నజాయలఁ • దోదకవృత్తం । బలవదుఁ గేతవరాసుర కాష్ఠో। జ్జ్వలనవకోశ ర•సాస్థలవాసా ॥ అనఁగా - న, జ, జ, య, గణములును ఎనిమిదవ యింట యతియు నని తెలియునది. తా. సుగమము. ౮౧

తోటకవృత్తము.

అమృతంబు సుఖంబుగ • నానినయ
ట్లమనస్కముఁ బూని యశేహర్నిశముఁ
సమతం దనుఁ గన్గొను • సజ్జను న
య్యమృతాంగన చేకొను • నందముగాన్. ౮౨

టీ. అమృతంబు = సుధను, సుఖంబుగన్, ఆనినయట్లు = త్రాగిన యట్లు, అమనస్కముఁ = రాజయోగమును, పూని = ధరించి, అహర్నిశముఁ = రేయింబవలును, సమతన్ = అభేదముగా, తన్నున్ = కేవలాత్మ యగు తన్ను, కన్గొను సజ్జనుఁ = చూచునట్టి సత్పురుషుని-బ్రహ్మవిదుం డయినవానిననుట, ఆ + అమృతాంగన = ఆ ముక్తికాంత, అందముగాన్, చేకొనుఁ = పరిగ్రహించును - ముక్తి ప్రయత్నము లేకయె కలుగు ననుట.

తా. అమృతమును ద్రావినట్లు రేయింబవలును అమనస్కయోగమును బూని, తన్ను నభేదబుద్ధితోఁ గనుఁగొనుచుండు బ్రహ్మవిదునికి ముక్తి తనంతటనే సుఖముగాఁ గలుగుచున్నది.

సీ. పాలు చోలఁగఁ గ్రోలఁ • జాలునే తగ నాల
పొదుఁగులఁ బిణుదులు • పొదలుచున్న

లోపలి రస మాన నోపునే యిలఁ గోఁతి
నారికేళఫలంబుఁ జేరి కన్న
సాంసార రతులచే సుఖియింప నేర్చునే
షండుండు మఱి రంభ సరస నున్నఁ
దనమోముసొగసు గన్గొనునె పుట్టంధుండు
మించుటద్దంబు చే నుంచుకొన్నఁ

తే. గలుగునే నిత్యనిర్మలాఖండసుఖము
నలఘుతారకసాంఖ్యయోగాశ్రితులకుఁ
దత్తదుచితోరుధర్మలబ్ధతలపగిది
విలసదమనస్కయోగాప్తివలనఁ గాక. ౭౩

టీ. ఆలపాదుఁగులన్ = ఆవులయొక్క పొదుఁగులయందు, పిణుదులు = గోమారులు, పొదలుచున్నన్ = మెండుకొనియున్నను, తగన్ = తెన్నగా, పాలు = క్షీరమును, చాలఁగన్ = మిక్కిలి, క్రోలన్ చాలునే = త్రాగఁ గలుగునా, ఇలన్ = భూమియందు, కోఁతి, నారికేళఫలంబున్ = టెంకాయను, చేరి = దగ్గఱి, కన్నన్ = చూచినను, లోపలి రసము = ఆకాయలోపల నుండెడి నీళ్లను, ఆనన్ ఓపునే = త్రాగఁ గలుగునా, మఱి = వెండియు, షండుండు = పేఁడి, రంభ, సరస నున్నన్ = పొంతనే యుండినను, సాంసారన్ = సంతోషము నిండు నట్లుగా, రతులచేన్ = రతిక్రీడలచేత, సుఖియింప నేర్చునే = సౌఖ్యము పొందఁ జాలునా, పుట్టంధుండు = పుట్టుగ్రుడ్డివాఁడు, మించుటద్దంబున్ = మెఱుఁగుటద్దమును, చేన్ = చేతియందు - ఉంచుకొన్నను, తన మోము సొగసున్ = తన ముఖముయొక్క చక్కఁదనమును, కన్గొనునే = చూడఁ గలఁడా, తత్త...గిదిన్ - తత్తత్ = ఆయా యోగములకు - తారక సాంఖ్యయోగముల కనుట, ఉచిత = తగిన, ఉరు = గొప్పలగు, ధర్మ =

ధర్మములయొక్క, లబ్ధతలపగిదిన్ = పొందుటలవలెనే, అలఘు... లకున్ - అలఘు = గొప్పదియైన, తారక = తారకయోగమును, సాంఖ్య యోగ = సాంఖ్యయోగమును, ఆశ్రితులకున్ = ఆశ్రయించినవారికి - అనఁగా ఆయోగముల నుపాసించువారికి, నిత్య...సుఖము - నిత్య = ఎల్లప్పుడును గలదై, నిర్మల = మలినములేనిదై, అఖండ = సంపూర్ణమైన, సుఖము = బ్రహ్మానందము, విలసత్...గాక - విలసత్ = ప్రకాశించు చున్న, అమనస్క-యోగ = రాజయోగముయొక్క, ఆప్తివలనన్ గాక = పొందుటచేతనే తప్ప, కలుగునే = కలుగునా - కలుగదనుట. తారక సాంఖ్యయోగముల నుపాసించువారికి మనశ్శుద్ధియుఁ బరబ్రహ్మస్వరూప నిర్ణయమును గలుగునట్లు అమనస్క-యోగము గలవారికి, నిరవధిక బ్రహ్మా నందము కలుగు నని భావము.

తా. ఆవుల పొదుఁగులందు తియ్యనిపా లున్నను వానియందు గో మారు లున్నయెడల వానిపాలను దూడలు త్రాగలేనట్లును, కోఁతి టెం కాయను దగ్గఱినను దాని లోపలినీటిని త్రాగలేనట్లును, నపుంసకుఁడు రంభ తనదగ్గఱ నున్నను దానితో రతిసుఖము ననుభవింప లేనట్లును, పుట్టుగ్రుడ్డి వాఁడు తనచేత మెఱుఁగు పెట్టిన యద్దమును బట్టుకొన్నను వాని మొగము సొగసు తెలియనట్లును, తారకయోగమును సాంఖ్యయోగమును నుపాసించు వారికి వానివాని ఫలము లగు మనశ్శుద్ధి మొదలగునవి మాత్రమే కలుగును గాని, నిరతిశయ బ్రహ్మానంద సుఖము గలుగదు. అది వారికి అమనస్క-యోగముచేతనే కలుగవలయును. ౪౩

తరల.

స్ఫురితతారకసాంఖ్యముల్ వినుమీ పూర్వపక్షము లుత్తమం
బరయఁగానమనస్క-యోగమె నాద్యముంగడుహృద్యముం
బరమగుహ్యము రాజయోగము బ్రహ్మవిద్యసుహృన్మనో
హరము కేవలనిర్వికల్పసమాధి సు మ్మిది మారుతీ. ౪౪

టీ. మారుతీ = ఆంజనేయా, వినుము, స్ఫురిత తారకసాంఖ్యముల్ = ప్రకాశించుచున్న తారకసాంఖ్యయోగములు, పూర్వపక్షములు = పూర్వపక్షములవలె త్రోసిపుచ్చఁదగినవి; అరయఁగాక్ = విచారింపఁగా, అమనస్కయోగము = రాజయోగము, ఉత్తమంబు = శ్రేష్ఠమైనది - సిద్ధాంతమువలె అంగీకరింపఁ దగినదనుట; ఇది = ఈ అమనస్కయోగము, అనాద్యము = పురాతనమైనది, కడుక్ = మిక్కిలి, హృద్యము = ఇంపయినది, పరమగుహ్యము = మిక్కిలి రహస్యమైనది, రాజయోగము = తారకసాంఖ్యయోగములకంటె ఎక్కుడయినది; బ్రహ్మవిద్య = బ్రహ్మజ్ఞానమయినది; సుహృత్ మనోహరము = మంచిహృదయము గలవారికి - అనఁగా బ్రహ్మవిదు లగువారికి ఇంపయినది; కేవల నిర్వికల్పసమాధిసుముద్ర - కేవల = పరిశుద్ధమైన, నిర్వికల్ప = చలనరహితమైన, సమాధిసుముద్ర = బ్రహ్మనిష్ఠచుమీ. తరలకు-'ప్రవరముద్ర విరామయుక్తి నభంబులుక్ రసజాగముల్, కవిజనాశ్రయ పొంది యందముగా మహిం దరలం బగున్' - అనఁగా న, భ, ర, స, జ, జ, గ, గణములు పంద్రెండవయింట యతి యును లక్షణములు.

తా. ఆంజనేయా, తారకయోగమును సాంఖ్యయోగమును వంతగాఁ బరిగ్రహింపఁదగినవి గావు. అమనస్కయోగమే యుత్తమమయినది గానఁ బరిగ్రహింపఁదగినది. ఏలనఁగా నిది పురాతనమై పరమగోప్యమై మిక్కిలి యింపుగాను నుండునది. ఇది బ్రహ్మజ్ఞానమే యగును గనుక బ్రహ్మవిదులకును రమణీయమైనది. ఇది శుద్ధంబగు నిర్వికల్పసమాధి యగును జుమీ.౭౭

క్రౌంచపదవృత్తము.

సారపదార్థంబారయుచుందాఁసకలనిగమములుఁ జదివిననైనన్
జారువిశిష్టాచారఘనుండై జపములు తపములుఁసలిపిననైనన్

స్ఫారసమస్తోదార సుతీర్థా♦చరణము లనిశము ♦ జరిపిననైనన్
గారవముం జేకూఱఁగనీయో♦గజపరమసుఖము♦గలుగదు వత్సా

టీ. వత్సా=నాయనా, సారపదార్థంబు = స్థిరాంశమైన పదములం దలి అర్థమును- ముఖ్యసారమైన యభిప్రాయము ననుట, అరయుచున్ = విచారించుచు, తాను, సకలనిగమములు=అన్నివేదములను, చదివిననైనన్ = చదివినప్పటికిని, చారు...డై—చారు = ఒప్పిదములును, విశిష్ట = శ్రేష్ఠములును, అగు, ఆచార = ఆచారములచేత - నియతములైన నడవళ్లచేత ననుట, ఘనుఁడై = గొప్పవాఁడై, జపములు = (గాయత్రి మొదలగు మంత్రముల) జపములను, తపములు = కృచ్ఛ్రి చాంద్రాయణాది తపస్సులను, సలిపిననైనన్ = చేసినప్పటికిని, స్ఫార...రణములు - స్ఫార = విశేషించినవైన, సమస్త ఉదారతీర్థ ఆచరణములు = అన్ని గొప్పతీర్థయాత్రలను, అనిశమున్ = ఎల్లప్పుడును, జరిపిననైనన్ = చేసినప్పటికిని, గారవమున్ = గొప్పతనము, చేకూఱఁగన్ = ఒనగూడునట్లుగా, ఈ యోగజపరమసుఖము = ఈ అమనస్కయోగమువలన పుట్టు నిరతిశయమైన బ్రహ్మానందము, కలుగదు = ఈ యోగమువలని సుఖమె యా వేదాధ్యయనాదు లన్నిటికంటెను గొప్పది యని భావము. క్రౌంచపదవృత్తమునకు 'ప్రాంచితలీలన్ శంకరనందిప్రకటితవిరతులు ♦ భమసభనాన్యల్ ! క్రౌంచపదీవృత్తమునఁ జెన్నారఁగఁ బలుకుదు రిలఁ ♦ గవివరు లెల్లన్' అనఁగా, భ, మ, స, భ, న, న, న, య, గణములును ప్రతిపాదంబున పదునొకండవ యింటను అవల తొమ్మిదవయింటను రెండేసియతులును నుండవలయును.

తా. సమస్తవేదములను, ఊరక కాక, ముఖ్యతాత్పర్యవిచారము చేయుచునే చదివినను, మిక్కిలి మేలయిన యాచారములతో జపతపము లాచరించినను, సమస్తము లయిన గొప్పతీర్థయాత్రలను నిరంతరము చేసినను

ఈ యమనస్కయోగము ననుష్ఠించుటవలనఁ గలుగునట్టి పరమానందము గలుగదు. దీనివలనిబ్రహ్మానందమే మిక్కిలి గొప్పది.

తే. అట్లు గావునఁ బరమరహస్య మైన
విలసదమనస్కయోగంబు వి స్తరించి
నీ కెఱింగింతు విమలవివేకయుక్త
సూక్ష్మదృష్టిని గను మతిసుకరముగను. ౪౭

టీ. అట్లు గావునన్ = అట్లు బ్రహ్మానందము అమనస్కయోగముచే తనేతప్ప లభింపదు గనుక, పరమరహస్యమైన = మిక్కిలియు గోప్యమైన, విలసత్ అమనస్కయోగంబున్ = ప్రకాశించుచున్న రాజయోగమును, విస్తరించి, నీకున్, ఎఱిఁగింతును, విమల...దృష్టిన్ - విమల = నిర్మలమైన, వివేకయుక్త = జ్ఞానముతోఁ గూడిన, సూక్ష్మదృష్టిన్ = సూక్ష్మమైన (లోపలి) చూపుచేత, అతి సుకరముగను = మిక్కిలి సులువుగా, కనుము = తెలిసికొనుము.

తా. అమనస్కయోగముచేతనే కాక, తక్కిన విధముల బ్రహ్మానందము లభింపదు గనుక, పరమగోప్యమైన యీ రాజయోగమును నీకు సవిస్తరముగాఁ దెలుపుచున్నాను. దానిని నిర్మలమై సూక్ష్మమయిన జ్ఞానదృష్టిచేత మిక్కిలి సులభముగాఁ దెలిసికొనుము. ౪౭

పంచచామరము.

మనంబె స్థూలసూక్ష్మముల్ ప్రమాతృమానమేయముల్
మనంబె కామరాగరోషమత్సరాదివృత్తులున్
మనంబె సర్వధర్మముల్ మనంబె బంధమోక్షముల్
మనంబె దృశ్య మంతయుం గ్రమంబుచే నెఱింగినన్. ౪౮

టీ. స్థూలసూక్ష్మముల్ = పృథివి మొదలయిన స్థూలద్రవ్యములును పరమాణువు మొదలయిన సూక్ష్మద్రవ్యములు నన్నియును, ప్రమాతృమాన

మేయములే - ప్రమాతృ = ప్రమాణములచేత వస్తునిర్ణయము చేయువాఁడును, మాన = ప్రమాణమును - వస్తునిర్ణయమున కయిన సాధన మనుట - దర్శనమని భావమును - మేయములే = ప్రమేయములే - నిర్ణయింపఁదగిన వస్తువులును - అనఁగా ఘటపటాది దృశ్యములును, మనంబె = మనస్సే యగును, కామ...వృత్తులున్ - కామ = కోరికయును, రాగ = (ఇంద్రియములకు అనుకూల వస్తు లాభమువలనఁ గలుగునట్టి) ప్రీతియు, రోష = (ప్రతికూల పదార్థ లాభమువలనఁ గలుగు) ద్వేషమును, మత్సర (పరులసంపదలకు) చూపోపకుండుటయును, ఆది = మొదలగు వృత్తులును, మనంబే = మనస్సే యగును, సర్వధర్మములే = (వర్ణాశ్రమములకుఁ దగినవికాని మఱియు నానా యోగాద్యనుష్ఠానములకుఁ దగినవికాని యగు ఆయా) ధర్మములు అన్నియును, మనంబే=మనస్సే, బంధమోక్షములే = ప్రారబ్ధరూపబంధములును, ఆ బంధముయొక్క విముక్తియును, మనంబె, దృశ్య మంతయున్ = నానా నామరూపములచేతఁ గనఁబడుచున్న యీ ప్రపంచ మంతయును, క్రమంబుచేన్ = పరామర్శించు క్రమముచేత - క్రమముగా పరిశీలించి యనుట, ఎఱింగినన్ = తెలిసికొన్నచో, మనంబె= మనస్సే యగును - అనఁగా స్థూలసూక్ష్మాది ద్రవ్యములును, కామరాగాది వృత్తులును, ధర్మములును, బంధమును, మోక్షమును, దృశ్యంబగు జగత్తంతయును, దగిన క్రమమునఁ బరిశీలించిచూడఁగా మనస్సే యగును గాని మఱియొక్కటి గాదనుట - ఇవన్నియును మనఃకల్పితమే కాని పరమార్థము గావని భావము. ౪౭

తే. సర్వసంసారమును మానసమున నొదవు
సర్వసంసారమును మానసమున నుండు
సర్వసంసారమును మానసమున నడఁగు
సర్వసంసారమును మానసంబె యగును. ౪౮

టీ. సర్వసంసారమును = సమస్తవిధము లయిన పుత్రకళత్రాది రూపమగు సంసారము, మానసమునన్ = మనస్సునందే, ఒదవున్ = పుట్టును; సర్వసంసారమును, మానసమునన్ = మనస్సునందే, ఉండును = ప్రవర్తించుచుండును; సర్వసంసారమును, మానసమునన్ = మనస్సునందె, అడఁగున్ := లయించును - నశించు ననుట, కాఁబట్టి సర్వసంసారమును, జననమరణ పుత్రమిత్రాదిరూప మైన సకలవిధ సంసారమును, మానసంబె = మనస్సే, అగును; సంసారమును బుట్టించునదియు పెంచునదియు అడఁగించునదియు మనస్సే. సంసారమే మనస్సు అని తాత్పర్యము. ౪౮

వ. అది యెట్లంటేని. ౪౯

టీ. మనస్సే సమస్తమునకుఁ గారణ మగుట యెట్లనఁగా.

చ. మనసు సుషుప్తియం దెనసి మ్రగ్గిన నేమియుఁ దోఁపకుండు న
మ్మన మటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గి తోఁచు నీ
ఘనతరబంధమోక్షమయకారణకార్యము లెల్లఁ దానయై
యనిశము లో వెలిం దిరుగు నారయ నెమ్మన మట్లుగావునన్.

టీ. ఆరయన్ = పరిశీలింపఁగా, మనస్సు, సుషుప్తియందున్ = గాఢనిద్రయందు, ఎనసి = పొంది, మ్రగ్గినన్ = నశింపఁగానే - లయింపఁగాననుట; ఏమియున్ = ఏవిషయమును, తోఁపకుండును, అమ్మనము = అట్లు లయించిన యా మనస్సు, అటు మేలుకొన్నన్ = పిదప మేలుకొనఁగానే, సమస్తజగంబులు = ఎల్లలోకములును, కల్గి = పుట్టి, తోఁచును = కనఁబడును, అట్లు గావునన్ = అట్లు కాఁబట్టి, మనస్సు మేలుకొన్ననే సమస్తవిషయములును, లేకున్న నొక్కటియు లేకుండుటను బట్టి యనుట, ఈ... లెల్లన్ - ఈ = ఈ చెప్పఁబడిన, ఘనతర = మిక్కిలి గొప్పవి యైన, బంధ = ఆరోపముయొక్కయు, మోక్ష = అపవాదముయొక్కయు, మయ = స్వరూపమైన, కారణ = కారణభూతమగు సుషుప్తియు,

కార్యములు = కార్యభూతములయిన జాగ్రత్తును స్వప్నమును, ఎల్లన్ = అన్నియును, తానేయై = తానెయయి, అనిశమున్ = ఎప్పుడును, నెమ్మనము = మనస్సు, లోన్ = అంతర్ముఖమందు - అనఁగా మహాకారణాతీతావస్థయందు- ప్రజ్ఞారూపమై, వెలిన్ = వెలుపల - బహిర్ముఖము లైన జాగ్రత్స్వప్నములందు మనోరూపమై, తిరుగున్ = సంచరించును.

తా. మనస్సే సమస్తమని చెప్పితినిగదా! అది యెట్లనిన గాఢనిద్రను జెందినపుడు, జగత్తంతయుఁ దోఁపక నశించినదగును. ఆ మనస్సె తటాలున మేలుకొనెనా యన్నిజగములు పుట్టి కనఁబడుచుండును. ఇట్లు మనస్సుచేతనే యన్నియుఁ గనఁబడుటవలనను, అది మఱఁగినపు డన్నియు మాయమగుటవలనను, బంధరూపములుగను మోక్షరూపములుగను నున్న కారణములును గార్యములు నన్నియుఁ దానే యై యామనస్సు, లోపల అంతర్ముఖమై ప్రజ్ఞారూపముగను, వెలుపల బహిర్ముఖమై మనోరూపముగను గ్రుమ్మరుచున్నది. ౫౦

వ. మఱియు నమ్మనంబు కార్యాకారం బై సంకల్పంబు సంసారంబు సర్వవాసనామయంబు బంధమోక్షకంబు నన నొప్పుఁ గారణాకారం బై యవిద్య ప్రకృతి యజ్ఞానంబు మాయ యనం దనరు నట్టిమానసంబు లేమియ యమనస్కం బ ట్లగుటం జేసి. ౫౧

టీ. మఱియున్ = వెండియు, అమ్మనంబు = ఆ మనస్సు, కార్య ఆకారంబై = కార్యభూతమగు ప్రపంచము రూపమై, సంకల్పంబు = సంకల్పమనియు, సంసారంబు = సంసారమనియు, సకల వాసనామయంబు= సకలవాసనారూప మైన దనియు, బంధమోక్షకంబును = బంధమోక్ష స్వరూపమైనదనియు, అనన్ = అనునట్లు, ఒప్పును, కారణ ఆకారంబై = సుషుప్తిరూపమై, అవిద్య = అవిద్య యనియు, ప్రకృతి = ప్రకృతి

యనియు, అజ్ఞానంబు = అజ్ఞాన మనియు, మాయ = మాయ యనియు, అనం దనరుక్ = అనుటకు ఒప్పియుండును; అట్టి మానసంబు = కార్య కారణరూపమైన యామనస్సు, లేమియు = లేకపోవుటయె, అమనస్కం బు = అమనస్కయోగము; అట్లగుటంజేసి = మనస్సు లేక పోవుటయె అమనస్కయోగ మగుటవలన.

తా. ఆ మనస్సు కార్యంబగు ప్రపంచమురూపమై సంకల్పము సంసారము సర్వవాసనామయము బంధమోక్షక మని చెప్పఁబడుచుండును. అదియే కారణంబగు సుషుప్తిరూపమై అవిద్య ప్రకృతి అజ్ఞానము మాయ యని చెప్పంబడుచుండును. కార్యకారణరూప మైన యా మనస్సు లేక పోవుటయే అమనస్కయోగ మగును. ౫౧

సీ. ఆరోపితభుజంగ కి మమరఁ గన్పట్టునే
స్ఫురదధిష్ఠానరజ్జువును గనిన
నారోపితమనుష్యుఁ డలరఁ జూపట్టునే
భువి నధిష్ఠానదారువును గనిన
నారోపితోదకం బరయంగఁ దోఁచునే
కనదధిష్ఠానార్కకరముఁ గనిన
నారోపితాచ్ఛరౌప్యము లక్ష్య మగునె య
ధిష్ఠాన మైనశుక్తికను గనినఁ

తే. దలఁప నారోపితాసితత్వంబు మరలఁ
గాననగునె యధిష్ఠానఖంబు గనినఁ
దెలియ నారోపితమనంబు దృశ్య మగునె
తగ నధిష్ఠానపూర్ణతత్త్వమును గనిన. ౫౨

టీ. స్ఫుర...వుక్ - స్ఫురత్ = కదలుచున్న, అధిష్ఠాన = (సర్ప భ్రాంతికి) నివాసమైన, రజ్జువుక్ = త్రాటిని, కనినక్ = చూచెనేని -

ఇది త్రాడని తెలిసికొనెనేని, ఆరోపిత భుజంగము = (అత్రాటియందు భ్రాంతిచేత) కల్పింపఁబడిన సర్పము, అమరన్ = పొందుపడునట్లు, కన్పట్టునే = అగపడునా - అగపడదనుట, భువిన్ = భూమియందు, అధిష్ఠాన = (పురుషభ్రాంతికి) పట్టయిన, దారువున్ = స్థాణువును - త్రోదునసుట, కనినన్ = చూచినయెడల - ఇది మ్రా డని తెలిసినపు డనుట, ఆరోపితమనుష్యుఁడు = (దానియందు) మోపఁబడిన పురుషుఁడు, అలరన్ = లెస్సగా, చూపట్టునే = చూపట్టఁ డనుట - కనత్...కర మున్ - కనత్ = ప్రకాశించుచున్న, అధిష్ఠాన = (జలభ్రాంతికి) ఆధార మైన, అర్కకరమున్ = సూర్యకిరణమును, కనినన్ = చూచినయెడల, ఆరోపిత ఉదకంబు = దానియందు భ్రమించిన జలము - అనఁగా ఎండ మావులు, అరయంగన్ = పరిశీలింపఁగా, తోఁచునే = తోఁపదనుట; అధిష్ఠానమైన = (రజతభ్రమమునకు) పట్టయిన, శుక్తికన్ = ముత్తెపుఁ జిప్పను, కనినన్ = చూచినయెడల, ఆరోపిత = దానియందు కల్పింపఁ బడిన, అచ్ఛ = స్వచ్ఛమైన, రౌప్యము=వెండి, లక్ష్య మగునే = చూడఁ బడునా - చూడఁబడదనుట; అధిష్ఠానఖంబు గనినన్ = ముఖ్యమైన ఆకా శమును జూచినపుడు, తలఁపన్ = ఊహింపఁగా, ఆరోపిత అసితత్వంబు= ఆ ధ్యానింపఁబడిన నీలవర్ణమును, మరలన్ = తిరుగ, కాననగునే = చూడఁగలుగునా, తగన్ = ఒప్పునట్లు, అధిష్ఠాన పూర్ణతత్త్వమున్ = సమస్తభ్రాంతిజనిత ప్రపంచమునకు ముఖ్యాధారమై అఖండమై యున్న పర బ్రహ్మమును, తెలియన్=ఎఱుఁగఁబడునట్లు, కనినన్=చూచినయెడల, ఆ రోపితమనంబు = దానియందు తోఁచుచున్న మనస్సు, దృశ్యమగునే = కనఁబడునా! కనఁబడ దనుట.

తా. చీఁకటియందు సర్ప మని భ్రమించి యది త్రా డని తెలిసిన పిదప నా సర్పము కనఁబడకపోవును. దొంగ యని భ్రమించి యది వట్టి

ప్రోడని యేర్పడఁగానే మనుష్యుఁడు కనఁబడకపోవును. సూర్యకిరణములను జల మని భ్రమించి యది యెండమావు లని తెలియఁగానే యాజలము మాయమగును. ముత్తెపుఁజిప్పను జూచి వెండి యని తలంచి యది చిప్పయని కనుఁగొనఁగానే యావెండి లేకపోవును. ఆకాశమును నల్లనిరంగుగా భ్రమించి యది నిర్మల మైనదని తెలిసినపిదప నారంగు తోఁపకపోవును. ఇట్లే సమస్తప్రపంచమునకును అధిష్ఠానమై యఖండమై యున్న పరబ్రహ్మము దర్శింపఁగలిగినపుడు కల్పితమైన మనస్సు తోఁపక లయింపఁగా నప్పుడంతటను పరబ్రహ్మమే చూపట్టుచుండును. ౫౨

వ. అది యెట్లనిన వినుము సాధనచతుష్టయసంపత్తిపూర్వకంబుగాఁ బూర్ణాధికారి వై యున్నసమయంబున స్వాధిష్ఠానచిదాభాసుండ వైననీకు నావరణంబు లైనచతుర్వింశతి తత్త్వాత్మక పంచకోశంబుల వేర్వేఱ విభజించి నేతి నేతి యనుమహావాక్యంబు చెప్పినవిధంబున నేను గా నని నిషేధించి కేవలకూటస్థచైతన్యమాత్రుండ నైతి నని తెలిసి యంతట నీప్రకారంబున దేవ తిర్యఙ్మనుష్యాది సర్వభూతంబులఁ బంచకోశంబులఁ బంచమహాభూతంబుల నొక్కపెట్ట నిరాకరించి యచ్చటఁ బరబ్రహ్మచైతన్యంబుండ భావించి, యామీఁదటఁ ద్వంపదాహంపదాత్మపద ప్రజ్ఞానపద లక్ష్యార్థభూతప్రత్యగాత్ముండ నైననేన తత్పద బ్రహ్మపద లక్ష్యార్థభూతపరమాత్ముండ ననియుఁ, దత్సత్యజ్ఞానానంద స్వరూప పరమాత్ముండ సచ్చిదానంద లక్షణ ప్రత్యగాత్ముండ నైన నే ననియు నిట్లన్యోన్యాఖండసమరసైక్యం బనుభవించి నిరావరణాధిష్ఠాన పరిపూర్ణాద్వితీయ శుద్ధచైతన్యప్రకాశమాత్రుండ వై ప్రకాశించు నీకుఁ

ప్రచండమార్తాండున కంధకారంబు గనుపట్టనితెఱంగున సర్వకారణకార్యాత్మకం బైన మనంబు గలుగదు. రజ్జ్వారోపితసర్పంబు గని యిది సర్పంబు గాదని తన్నిరసనంబు గావించి మఱి యిది రజ్జువని విధించి యియ్యధిష్ఠానంబు నెఱింగిన పిమ్మటఁ గల్పితభుజంగం బభావంబై రజ్జుమాత్రంబు శేషించుతెఱంగున శరీరత్రయం బాత్మ గాదని కడఁద్రోచి యాత్మమాత్రుండ వైననీకు మనంబు లేదు; మఱియును. ౫౩

టీ. అది = ఆమనస్సు కనఁబడకపోవుట, ఎట్లనినన్, వినుము, సాధ...బుగాన్ - సాధనచతుష్టయ = (నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వము అను) నాలుగు విధము లైన సాధనములయొక్క, సంపత్తి పూర్వకంబుగాన్ = పెంపును మున్నిడుకొని - ఈ నాలుగు సాధనములను సంపూర్ణముగా ముందు సంతరించుకొని యనుట, పూర్ణ + అధికారివి = జ్ఞానమునకుఁ బరిపూర్ణమైన యధికారము గలవాఁడవు - జ్ఞానోపదేశమునకు వలయు లక్షణము లన్నియును గలవాఁడవనుట, ఐ, ఉన్నసమయంబునన్, స్వ... భాసుఁడవు—స్వ అధిష్ఠాన = తనకు తానే ఆధారమైన, చిత్ = బ్రహ్మజ్ఞానముయొక్క, ఆభాసుఁడవు = ప్రతిబింబమాత్రుఁడవు - అనఁగా అట్టి జీవుఁడవు, ఐననీకున్, ఆవరణంబులైన = చుట్టు క్రమ్మియుండునవియగు, చతుర్వింశతి తత్త్వాత్మక = ఇరువదినాలుగు తత్త్వములే రూపముగాఁ గల, పంచకోశంబులన్ =అన్నమయము మొదలైనపంచకోశములను, వేర్వేఱన్ = ప్రత్యేకముగా, విభజించి = విభాగించి, నేతి నేతి అను మహావాక్యంబు = (ఇరువది నాలుగు తత్త్వములమయ మైన పంచకోశాదులు), నీవు కాదు కా దనెడు వేదాంతమహావాక్యము, చెప్పిన విధం

బునన్ = ప్రతిపాదించిన ప్రకారమున, ఏను కాను అని = పంచకోశాదులు నేను గానని, నిషేధించి, కేవల...మాత్రుండను - కేవల = శుద్ధమైన, కూటస్థ = ప్రత్యగాత్మయొక్క, చైతన్య మాత్రుఁడన్ = చేతన స్వరూపుఁడను - నిర్విశేషచిన్మాత్రుఁడ ననుట, ఇతిని, అని, తెలిసి, అంతటన్ = పిదప, ఈప్రకారంబునన్, దేవతిర్యఙ్మనుష్యాది సర్వభూతంబులన్ = దేవతలు పశుపక్ష్యాదులు మనుష్యులు మొదలయిన సకలజీవులను, పంచకోశంబులన్ = ఐదు కోశములను, పంచ మహాభూతంబులన్ = పృథివి మొదలైన యైదు మహాభూతములను, ఒక్కపెట్టన్ = ఒకసారిగా, నిరాకరించి = త్రోసి, అచ్చటన్ = ఆ దేవతాది శరీరములయందు, పరబ్రహ్మచైతన్యంబు = పరమాత్మస్వరూపము, ఉండన్ = ఉండునట్లు, భావించి, ఆ మీఁదటన్, త్వం...త్మ్నండను - త్వంపద = నీవను శబ్దము, అహంపద = నేనను శబ్దము, ఆత్మపద = తా నను శబ్దము, ప్రజ్ఞానపద = చిచ్ఛబ్దము, లక్ష్యార్థభూత = ఈశబ్దములకు వాచ్యార్థమును బరిత్యజిపఁగాఁ గలిగిన లక్ష్యార్థమైనట్టి, ప్రత్యగాత్మ్నండను = కూటస్థుఁడను, ఐన, నేను = నేనే, తత్ప...మాత్మ్నఁడన్ - తత్పద = 'తత్ త్వ మసి' అను వాక్యమందలి 'తత్' అనుపదమునకు, బ్రహ్మపద = బ్రహ్మశబ్దమునకును, లక్ష్యార్థభూత = లక్ష్యార్థమయిన, పరమాత్మ్నఁడన్ = పరబ్రహ్మమును, అనియుం, తత్...మాత్మ్నండ - తత్ = అట్టి, సత్య = సద్రూపము, జ్ఞాన = చిద్రూపము, ఆనందస్వరూప = సుఖస్వరూపము, గల, పరమాత్మ్నండ = పరబ్రహ్మమే, సచ్చిదానంద లక్షణ ప్రత్యగాత్మ్నండన్ = సద్రూపమును చిద్రూపమును, సుఖస్వరూపమును లక్షణములుగాఁ గల కూటస్థుఁడను, ఐన, నేను అనియున్, ఇట్లు, అన్యో...క్యంబు—అన్యోన్య = (రెండు చైతన్యములును) పరస్పరము (అనులోమ విలోమములు) గా, అఖండ = సమగ్రమైన, సమరస = భేదములేని, ఐక్యంబు = ఏకత్వమును - ఒక్కటిగాఁ గూడికను, అనుభవించి = పరమాత్మయే ప్రత్యగాత్మగను ప్రత్యగాత్మయే

పరమాత్మగను ఐక్యమును అనుభవించి యనుట; నిరా...మాత్రుండవై - నిరావరణ = పూర్వోక్తములైన ఆవరణములు లేనిదియు, అధిష్ఠాన = సమస్తమునకు ముఖ్యాధారమైనదియు, పరిపూర్ణ = అంతటను నిండినదియు, అద్వితీయ = తనకంటె రెండవది లేనిదియు, శుద్ధ = నిర్మల మైనదియు, అగు, చైతన్యప్రకాశమాత్రుండ వై = ప్రజ్ఞానరూపుండగు పరమాత్మవై, ప్రకాశించు నీకున్ = వెలుఁగుచున్నట్టి నీకు, ప్రచండమార్తాండునకున్ = మిక్కిలి తీక్ష్ణముగా నున్న సూర్యునకు, అంధకారము = చీఁకటి, కను పట్టని తెఱంగునన్ = అగపడని విధమున, సర్వకారణ కార్యాత్మకంబు - సర్వ = సమస్తములైన, కారణ = జ్ఞాన కర్మేంద్రియములును, కార్య = వాని వ్యాపారములును, ఆత్మకంబు = స్వరూపముగాఁ గల, మనంబు = మనస్సు, కలుగదు = ఉండదు, రజ్జు + ఆరోపిత సర్పంబున్ = త్రాటి యందుఁ గల్పింపఁబడినపామును, కని = చూచి, ఇది సర్పంబు కాదు అని, తన్నిరసనంబు = దానిని (అది సర్ప మనుటను) నిరాకరించుటను - వదలుటను, కావించి = చేసి, మఱి = పిమ్మట, ఇది, రజ్జువు = త్రాడు, అని, విధించి = నిశ్చయించి, ఆ యధిష్ఠానంబున్ = ఆ సర్పభ్రాంతికి ఆధార మయిన యా త్రాటిని, ఎఱింగిన పిమ్మటన్ = తెలిసినపిదప, కల్పిత భుజంగంబు = ఆరోపితమైన సర్పము, అభావంబై = కనఁబడనిదై, రజ్జు మాత్రంబు = త్రాడుమాత్రమె, శేషించు తెఱఁగునన్ = మిగిలినట్లు, శరీర త్రయంబు = స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూఁడును, ఆత్మ = బ్రహ్మము కాదని, కడఁద్రోచి = తొలఁగించి, ఆత్మమాత్రుండవు=బ్రహ్మ స్వరూపివి, ఐన, నీకున్, మనంబు = సంశయాత్మకమైన మనస్సు, లేదు. మఱియును.

తా. ఆ మనస్సు లేకపోవువిధమును చెప్పుచున్నాను వినుము. మొదట నీవు సాధనచతుష్టయము ననుష్ఠింపవలయును. దానివలన నీకు జ్ఞానోపదేశమునకుఁ బూర్ణ మైన యధికారము గలుగుచున్నది. సమస్తమునందు

అధిష్ఠానము బ్రహ్మముగదా! ఆ బ్రహ్మాజ్ఞానమునకుఁ బ్రతిబింబముగాఁ దోఁచు జీవుండ వని కదా నీ వున్నావు - జ్ఞానమునకుఁ బూర్ణాధికారి వైనసమయమందు, ఇట్టిజీవుఁడ వైన నిన్నుఁ గ్రమ్మియున్న యావరణము లన్నియుఁ దొలఁగఁగా నప్పుడు 'నేతి నేతి' అను వేదాంతవాక్యముచొప్పునఁ జతుర్వింశతితత్త్వరూపము లయిన అన్నమయాది పంచకోశములను వేఱుపఱచికొని, యవి నీవుగా దని నిషేధించి 'నేను నిర్విశేష కూటస్థచిన్మాత్రుఁడ నయితి' నని తెలిసికొందువు. అప్పుడు నీకు గోచరించుచున్న దేవతిర్యఙ్మనుష్యాదు లగు జీవులును పంచకోశములును పంచమహాభూతములును మిథ్యలని యొక్కతూరిగా నిరాకరించి,వానియందంతటను పరబ్రహ్మమే యున్నదని భావింతువు. పిమ్మట 'నీవు' 'నేను' 'తాను' 'చిత్తు' అను పదములకు వాచ్యార్థమును విడిచి, లక్ష్యార్థమైయున్నప్రత్యగాత్మ యగు నీవే 'తత్' 'బ్రహ్మ' మను శబ్దములకు లక్ష్యార్థమగు పరమాత్ముఁడవనియు, సత్యజ్ఞానానందరూపుఁడైన యా పరమాత్ముఁడే సచ్చిదానందరూపుఁ డగు ప్రత్యగాత్ముఁడ నైన నేననియును దెలియుదువు. ఇట్లు ప్రత్యగాత్మయే పరమాత్ముఁడుగాను, పరమాత్ముఁడే ప్రత్యగాత్మగాను, నిద్దఱకుఁ గల యైక్యమును తెలియుటే కాక యనుభవింతువు. అప్పుడు నీవు ఆవరణములన్నియుఁ దొలఁగి, సర్వాధారమై పరిపూర్ణమై యఖండమైన జ్ఞానస్వరూపమైన శుద్ధపరబ్రహ్మముగా వెలుంగుచుందువు. మిడిమిడి గాయుచున్న సూర్యునకుఁ జీఁకటి కనఁబడని విధమున, అట్లు శుద్ధబ్రహ్మం బై ప్రకాశించుచున్న నీకు కారణకార్యాత్మకం బగు మనస్సు గలుగనేరదు. త్రాటియందు సర్ప మున్నదని చూచి, యది సర్పము గాదని నిషేధించి, త్రాడేయని నిశ్చయించి, యాత్రాటిని దెలిసికొన్నపిదప అందుఁ గల్పితమై యుండిన సర్పము లేకపోయి త్రాడుమాత్రమే మిగిలియుండును గదా! అట్లే శరీరత్రయమే యాత్మయని భ్రమించి, పిదప నాత్మ గావని నిరసించి, పిదప దాని కధిష్ఠానమైన

బ్రహ్మమను నెఱింగినపుడు బ్రహ్మమాత్రుఁడ వయి నీవు మిగులుదువు, గావున నీకు మనస్సు కలుగనేరదు. ఇదియే మనస్సు లేకపోవువిధము. ౫౩

క. లోభితస్వాధిష్ఠానచి
దాభాసుఁడ వైననీకు నఖిలముఁ దోఁచున్
శోభిత కేవల నిత్య ని
రాభాసుఁడ వైన దృశ్యమంతయు నడఁగున్. ౫౪

టీ. లోభి...భాసుఁడవు—లోభిత = మిక్కిలి యాశింపఁబడిన, స్వ = తనకు - ప్రత్యక్కునకు భిన్నుఁడుగాని పరమాత్మున కనుట, అధిష్ఠాన = ఆశ్రయమైన, చిత్ = జ్ఞానముయొక్క, ఆభాసుఁడవు = ప్రతిబింబభూతుఁడవు, ఐనన్ = అయితివేని, నీకున్, అఖిలమున్ = సమస్తమును - లోపలి వెలుపలి ప్రపంచమంతయును, తోఁచున్ = కనఁబడును-. అనఁగా నీవు జీవభావము గలవాఁడ వయితివేని నీకుఁ బ్రపంచమంతయుఁ దోఁచుచుండు నని భావము. శోభిత...భాసుఁడవు- శోభిత = ఒప్పుచున్నదియు, కేవల = ముఖ్యమైనదియు, నిత్య = నిత్యమైనదియు, అగు, నిరాభాసుఁడవు = ప్రతిబింబముగాని కూటస్థుఁడవు, ఐనన్ = అయితివేని, దృశ్యమంతయున్ = లోపలను వెలుపలను గోచరించుచుండు ప్రపంచమంతయును, అడంగున్ = నశించును - కనఁబడక పోవును.

తా. నీవు పరమాత్ముఁడవు. నీ కధిష్ఠానమైన జ్ఞానమునకుఁ బ్రతిబింబము జీవుఁడు. అట్టి జీవభావమును నీవు గోరితివా యీప్రపంచ మంతయు నీకుఁ గనఁబడుచుండును. అట్టిప్రతిబింబ మగు జీవుఁడవు గాక నిత్యమై కేవలమై యొప్పు కూటస్థుఁడ వైతివా యీప్రపంచ మంతయుఁ గనఁబడకపోవును.

క. కను మూసినఁ గనుఁ దెఱచిన
ఘనసచ్చిత్సుఖమయాత్ముఁ గనుఁగొనకున్నం

గను మూసినఁ గనుఁ దెఱచినఁ
గనఁబడు వెలిలో మనోవికారమె వత్సా. ౫౫

టీ. వత్సా = కుమారా, కను మూసినన్ = సుషుప్త్యవస్థయం దనుట, కను తెఱచినన్ = జాగ్రదవస్థయందు, ఘన సత్ చిత్ సుఖమగు ఆత్మన్ = గొప్ప సచ్చిదానందస్వరూపం బగు పరబ్రహ్మమును, కనుఁ గొనకున్నన్=చూడకున్నచో, కనుమూసినను, కనుఁ దెఱచినను, వెలిన్ = వెలుపలను, లోన్ = లోపలను, మనోవికారమె = మనస్సుయొక్క వికల్పమే, కనఁబడును.

తా. కన్ను మూసి సుషుప్తియం దున్నపుడుగాని, కన్ను దెఱచి మేలుకొని యున్నపుడు గాని, సచ్చిదానందస్వరూపుఁడగు బ్రహ్మము నే చూడవలయు. అట్లు చూడ నేరనియెడలకనుమూసినను తెఱచినను లోపలను వెలుపలను మనస్సుయొక్క వికల్పమే - నానా నామరూపాత్మక మైన జగత్తే - కనఁబడుచుండును. ౫౫

మ. ఘనతం దారకసాంఖ్యయోగములచేఁ గష్టింపఁగా నేల నె
మ్మనముంబట్టఁగనేలయింద్రియములన్మర్దింపఁగా నేల చ
క్కనగా ముందటఁగానిపించుఘటముంగన్నట్లుబ్రహ్మాంబుగాఁ
దనుఁదాఁగాంచినయంతలోనిఖిలముందానై వెలుంగుందగన్.

టీ. ఘనతన్ = గొప్పగా - మిక్కిలిగా ననుట, తారక సాంఖ్య యోగములచేన్ = తారక సాంఖ్యయోగ నిష్ఠలచేత, కష్టింపఁగా నేల = కష్టపడుట యెందులకు, నెమ్మనమున్ = మనస్సును, పట్టఁగ నేల = నిగ్రహింప నేల, ఇంద్రియములన్, మర్దింపఁగా నేల = వలంది లోపఱచుకొన నేల, చక్కనగాన్ = బాగుగా, ముందటన్ = ఎదుట, కానిపించు ఘటమున్ = కనఁబడుచున్న కుండను, కన్నట్లు = చూచిన విధమున, తనున్ = తన్ను, బ్రహ్మంబుగాన్ = పరమాత్మగా, తాను, కాంచిన

యంతలోన్ = చూచినమాత్రముననే, నిఖిలమున్ = సమస్త జగత్తును - నానా నామరూపాత్మకము లగునవి యన్నియు ననుట, తగన్, తానై = తానగు పరబ్రహ్మమై, వెలుంగున్ = ప్రకాశించును.

తా. తనయెదుట నున్న కుండను జూచినట్లె, తన్ను బ్రహ్మముగాఁ జూచినంతమాత్రమునఁ బ్రపంచ మంతయు బ్రహ్మంబగు తానే యై ప్రకాశించుచుండును. ఉపాయ మింతసూక్ష్మమై యుండఁగా దీనికిఁగాను తారక సాంఖ్యయోగములు చేకొని కష్టపడుటగాని మనస్సును జక్కఁబట్టుటగాని యింద్రియముల నడంచి నలంచుటగాని యెందులకు ? ౫౬

క. తనుఁ దాఁ గానని మనుజుని
మనము నిరోధింపఁబడక మసలుచుఁ దిరుగున్
దనుఁ దాఁ గను సత్పురుషుని
మన మానందాబ్ధియందు మగ్నత నొందున్. ౫౭

టీ. తనున్ = కూటస్థుఁడగు తన్ను, తాను = తానే, కానని మనుజుని = చూడ నేరని మనుష్యునియొక్క, మనము = మనస్సు, నిరోధింపఁబడక = అడ్డగింపఁబడక, మసలుచున్ = విడిచిపోక, తిరుగున్ = తిరుగుచుండును, తనున్ = ప్రత్యగాత్మస్వరూపుఁ డగు తన్ను, తాను, కను సత్పురుషుని మనము = అపరోక్షదృష్టిచేత చూచెడు బ్రహ్మవిదుని మనస్సు, ఆనంద + అబ్ధియందున్ = బ్రహ్మానంద సముద్రమునందు, మగ్నతన్ ఒందున్ = మునిఁగిన దగును.

తా. కూటస్థుఁడగు తన్నుఁ దానే యపరోక్షదృష్టిచేతఁ జూడ నేరని వానికి మనస్సు ఉడిగిపోక నానా నామరూపాత్మక మగు ప్రపంచము దన్మూలకమయిన సంసారదుఃఖమును గలిగించుచునే యుండును. ఆ దృష్టిచేతఁ దనస్వరూపమును దానే కనుఁగొన నేర్చినవానికి మనస్సు బ్రహ్మానందమునందు లయించి యా యానందమే యుల్లసిల్లుచుండును. ౫౭

మ. వనితానందనచందనాది విషయవ్రాతంబులం బొంది చ
య్యనవంతంతకుఁ జొక్కు నెమ్మనము బ్రహ్మానందవారాశివా
సనయొక్కించుక సోఁకెనేనిఁ బ్రవినాశంబొందు నానాద్రుపు
ష్పనటద్భృంగము చంపకప్రసవసంస్పర్శాప్తిఁ గూలుంగతిన్.

టీ. వని...లన్-వనితా = స్త్రీలు, నందన = బిడ్డలు, చందన = గంధము (మొదలయిన పరిమళద్రవ్యములు), ఆది = మొదలగు, విషయ = ఇంద్రియార్థములయొక్క, వ్రాతంబులన్ = సంఘములను, పొంది, చయ్యనన్ = తోడనే, అంతంతకున్ = ఆయా దానికి, చొక్కు = పరవశత్వము నొందునట్టి, నెమ్మనము = మనస్సు, బ్రహ్మానంద వారాశివాసన = ఆత్మసుఖమనెడి సముద్రముయొక్క సంస్కారము (దానితోఁపిక యనుట), ఒక్కించుక = కొంచెము, సోఁకెనేనిన్ = తగిలెనా, నానా...గము - నానా = అనేకములయిన, ద్రు = వృక్షములయొక్క, పుష్ప = పువ్వులయందు, నటత్ = తిరుగుచున్న, భృంగము = తుమ్మెద, చంప...ర్శాప్తిన్—చంపకప్రసవ = సంపెంగపూవుయొక్క, సంస్పర్శాప్తిన్ = స్పర్శము గలుగుటచేత, కూలుంగతిన్ = చచ్చినట్లు, ప్రవినాశంబు ఒందున్ = నశించును - బ్రహ్మానందమందు లయించి యడఁగును.

తా. తుమ్మెద యాయాపువ్వులం దేనియ త్రావి చొక్కుచునుండునుగాని, సంపెంగపువ్వు తాఁకుపడెనా తోడనే చచ్చుచున్నది. అట్లే మనస్సుకూడ, స్త్రీ చందనాది భోగవిషయములందుఁ జొక్కి సోలుచునుండి యట్లె బ్రహ్మానందమును బొందెనా తోడనే యందు లయించి యడఁగి పోవుచున్నది. ౫౮

క. చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందుఁ గరఁగినరీతిన్

మిక్కిలి తనుఁ గను ఘనుమది
చొక్కుచు నానందజలధి సుడిసి నశించున్. ౫౯

టీ. చక్కెరయున్, లవణంబును = ఉప్పును, గ్రక్కునన్ = తోడనే, ఉదకములందున్ = నీళ్లయందు, కరఁగినరీతిన్ = కరఁగిపోయినట్లు, కలసి = తెలియ రాకుండునట్లు, మిక్కిలి = మిగుల, తనున్ = బ్రహ్మంబగు తన్ను, కనుఘనుమది = చూచెడి గొప్పవాని (బ్రహ్మవిదుని) మనస్సు, ఆనందజలధిన్ = బ్రహ్మానంద సముద్రమునందు, సుడిసి = సుడివడి, చొక్కుచున్ = పరవశ మగుచు, నశించున్ = లయ మొందు ననుట.

తా. ఉప్పును జక్కెరను నీటియందుఁ గలుపఁగానే కరఁగి రూపుమాయునట్లు, తన్ను బ్రహ్మముగాఁ గనుఁగొనునట్టి బ్రహ్మవిదునికి మనస్సు ఆ బ్రహ్మానందమునందు మునిఁగి లయించును. ౫౯

తే. ఇతరసంకల్పములు లేక యెపుడుఁ దాను
సచ్చిదాత్మ్నుఁడ నని సుప్రసన్నవృత్తిఁ
దన్నుఁ గనువానిచిత్తంబు దనకుఁ దాన
పొలియుఁ దనయం దనింధనానలముపగిది. ౬౦

టీ. తాను = శుద్ధబ్రహ్మమగు తాను, ఇతర సంకల్పములు లేక = వేఱుచింతలు లేక - సత్త్వ రజ స్తమోగుణ వికారములవలనఁ బుట్టు తలంపు లేవియు లేనివాఁడై, సుప్రసన్నవృత్తిన్ = మిక్కిలి నిర్మలమయిన నడవడిచేత, ఎపుడున్ = ఎల్లప్పుడు, సచ్చిదాత్మ్నుఁడను = సచ్చిదానందస్వరూపం బగు బ్రహ్మమను అని, తన్నున్, కనువానిచిత్తంబు = చూచెడివాని మనస్సు, తనకుఁ దాన = తనంతటనే, అనింధన అనలము పగిదిన్ = కట్టెలులేని యగ్నివలె, తనయందు = తనలోపల, పొలియున్ = నశించును - నిప్పు కట్టె లున్నవఱకును గాలి యవి తీఱినదే తానును దనంత

టనే చల్లారిపోవునట్లు సత్త్వరజస్తమోగుణ వికార ప్రయుక్తము లయిన సంకల్పము లుండువఱకు మనస్సును వర్తిల్లుచుండి, యవి యెల్ల నశించి సచ్చిదానందస్వరూపము గోచరింపఁగానే తాను నశించుచున్నది. 'పాలి యుఁ దనయందఁ యింధనానలము పగిది' నను పాఠమున కట్టెనిప్పు కట్టె లున్నంతవఱకుఁ గాలి యవ్వల తనయందే తా నడఁగిపోవున ట్లని యర్థము. తక్కిన వెల్ల పూర్వమువలెనే యూహించునది. ౬౦

క. ఇనుఁ డస్తమించుతఱి నా
తనికిరణము లతనితోడఁ దగఁ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన
మునుకొని తద్గతవికారములు పొలియుఁ గడున్. ౬౧

టీ. ఇనుఁడు = సూర్యుఁడు, అస్తమించుతఱిన్ = క్రుంకెడు సమయమందు, అతని కిరణములు, అతనితోడన్ = అతనివెంటనే, తగన్ = ఒప్పునట్లు, చనురీతిన్ = పోవువిధముగా, పెనుమానసంబు = గొప్పదైన మనస్సు, పొలిసినన్ = అయింపఁగానే, మునుకొని = మునుపడి - ముందు గా ననుట, తద్గత వికారములు = ఆమనస్సునందలి సత్త్వరజస్తమోగుణ వికారములు, కడున్ = మిక్కిలి, పొలియున్ = నశించును.

తా. సూర్యుఁ డస్తమించునపు డతనికిరణము లతనివెంటనే నిలువక పోవునట్లు, మనస్సు లయింపఁగానే దాని సత్త్వాది గుణ వికారములు కూడ దానితోఁగూడనే లయించుచున్నవి. ౬౧

శా. నానాకర్మజ వాసనాన్వితమనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్డు డి
య్యానందాంబుధినోలలాడక యబాహ్యాభ్యంతరార్థానుసం
ధానోద్భూతనితాంతదుఃఖమయసంతాపంబు చల్లారునే.

టీ. నానా ... నాశంబు—నానాకర్మ=అనేకవిధములయిన కర్మములవలన, జ=పుట్టిన, వాసనా = సంస్కారములతోడ, అన్విత=కూడిన, మనః = మనస్సుయొక్క, నాశంబు=లయము, కాకున్నన్ = కానియెడల-మనస్సు తనయందలి వాసనలతోఁగూడ నశింపనియెడల ననుట. బ్రహ్మానందానుభవంబు = బ్రహ్మస్వరూప సుఖానుభవము, అనాయాసంబుగాన్ = సుఖముగా, కల్గునె = కలుగునా - కలుగదనుట - ఇప్పుడు = ఈ దేహముతో వర్తించుచున్న కాలమందు, ఈ యానందాంబుధిన్ = ఈ ఆనంద సముద్రమునందు, ఓలలాడకయ = తెప్పఁదేలక, బాహ్యా... సంతాపంబు - బాహ్య = వెలుపలివియు, అభ్యంతర = లోపలవియును, అగు, అర్థ = విషయములయొక్క - దృశ్యములయొక్క యనుట - అనుసంధాన = అనుభవించుటచేత, ఉద్భూత = పుట్టెడి, నితాంత = ఎడతెగని, దుఃఖమయ = దుఃఖస్వరూపమైన, సంతాపంబు = (ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము ననెడు) తాపము, చల్లాఱునే = ఉపశమించునా - ఉపశమింపదనుట.

తా. * ఆగామిసంచితప్రారబ్ధము లనెడు కర్మములవలన వాసనలెన్నియో పుట్టి మనస్సుతోఁ గూడియుండును. అట్టి మనస్సు నశింపనియెడల బ్రహ్మానంద మనుభవించుట యెంతమాత్రము కలుగనేరదు. ఇప్పుడీదేహమునందు లోపలను వెలుపలను నెన్నో విషయములు దోఁచి యనుభవించు చుండుటవలన నెడతెగక దుఃఖరూపములై ఆధ్యాత్మికాది తాపములు గ్రాఁచుచున్నవిగదా. ఈ తాపము బ్రహ్మానందసముద్రమునందుఁ బడి యీఁదులాడిననే కాని మఱియొకవిధమునఁ జల్లాఱదు. ఉ-౨

* ఇంతవఱకుఁ గూడఁబెట్టికొనియున్న ధనమువలె ప్రోగైయున్న కర్మములు సంచిత మనఁబడును. ఆ ధనమునం దిపుడు వెచ్చించుచున్న భాగమువలె ఆకర్మములం దిపు డనుభవింపఁబడుచున్నవి ప్రారబ్ధ మనంబడును. మీఁదటికై కూర్చుకొనుచున్న ధనమువలె, కూర్చుకొనుచున్న

వ. అని మఱియు ని ట్లనియెం, బరమభాగవతోత్తమా! నీవు దేహవ్యతిరిక్తుండ వగుటంజేసి జన్మాస్తిత్వ వృద్ధిపరిణామాపక్షయ వినాశంబులును, బాల్యకౌమారవయో జరావస్థ

---

కర్మములు ఆగామి యనఁబడును. ఆగామి ఆ సంచితముతోఁ జేరును. ఇందు ప్రారబ్ధము, ఇచ్ఛాప్రారబ్ధము, అనిచ్ఛాప్రారబ్ధము, పరేచ్ఛాప్రారబ్ధమని మూఁడు విధములు. ఇచ్ఛాప్రారబ్ధము తమ యిచ్ఛచేతఁ గలుగునది. తమయిచ్ఛచేతఁ జేయునట్టి పుణ్యపాపకార్యము లనుట. అనిచ్ఛాప్రారబ్ధము, తమయిచ్ఛచేతఁ గాక పిడుగు పడుట వ్యాధులు గలుగుట మొదలగు దైవికము లగునవి. పరేచ్ఛాప్రారబ్ధము - పరుల యిచ్ఛనుబట్టి చేయునది. జీవుఁ డి ట్లనాదిగాఁ గర్మములు చేయుచు రాఁగా బహుజన్మసుకృతము వలన తెలివి గలిగి, పిదప దానివలనఁ గామకర్మములను జేయుట మాని, భగవదర్పణముగా విహితకర్మములను జేయుచురాఁగా మనశ్శుద్ధియు భక్తియు వీనివలన సద్గురుప్రాప్తియు గురుశుశ్రూషవలన జ్ఞానమును గలుగును. ఈ జ్ఞానమువలన సంచితమంతయు నశించును. వాని ప్రారబ్ధము మాత్రము అనుభవించుటచేతనే నశించును. ఆగామిపుణ్యపాపములయందు అజ్ఞానిని భూషించువానిని పుణ్యమును, దూషించువానిని పాపమును జేరుచున్నది. ఒకనియింటికి అగ్ని తగిలినదని తలంతము. అపుడాయిల్లును దానియందున్న సకలసామగ్రులును గాలిపోవుచున్నవి. కాని, దానినుండి తప్పించుకొని వచ్చిన యింటి సొంతగాఁడు కట్టుకొన్న వస్త్రములును దొడుగుకొన్న సొమ్ములును గాలవు. ఆ కాలినయిల్లువలెనె సంచితమును 'జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున' 'జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్' అన్నట్లు జ్ఞానాగ్నిచేతఁ గాలిపోవుచున్నది. ఆ కాఁపుపయి నున్న వస్త్రాభరణములవలెనే ప్రారబ్ధములు గాలక యనుభవింపఁబడియే నశించుచున్నది. ఆ గృహస్థుఁడు పలాయితుఁ డయినపుడు వానికి రావలసిన వచ్చుబడులెల్ల ఇతరులపా లగునట్లు ఆగామిపుణ్యపాపములును ఇతరులను జెందు

లును, వర్ణాశ్రమ కులగోత్ర నామరూప దేశకాలాదికంబులును, స్థూలత్వకృశత్వ దీర్ఘత్వ హ్రస్వత్వ నీలత్వరక్తత్వాదికంబులును, నిరింద్రియుండ వగుటంజేసి వచనాదానగమనవిసర్గానంద కర్మంబులును, శబ్దస్పర్శరూప రసగంధ విషయసంగంబులు, నప్రాణుండ వగుటంజేసి చలన ధావన కంపనాకుంచన ప్రసారణాదికంబులును, క్షుత్పిపాసాదికంబులు, నమనస్కుండ వగుటంజేసి సంకల్ప వికల్పంబులును, రాగద్వేష కామక్రోధ లోభమోహ మదమత్సరేర్ష్యాసూయాదంభ దర్పాహంకారేచ్ఛా తృష్ణా విచికిత్సా లజ్జాదయా భయశోక ధైర్యాధైర్య దైన్యాదికంబులును, నిత్యానిత్యవస్తువివేక వైరాగ్య శమదమోపరతి తితిక్షాశ్రద్ధా సమాధాన ముముక్షుత్వ శ్రవణ మనన నిధిధ్యాసనజ్ఞానాదికంబులును, ధీవిలక్షణుండవు, నిరహంకారుండ వగుటంజేసి వక్తృత్వ దాతృత్వ గంతృత్వ విసర్జయితృత్వానందయితృత్వంబులును, శ్రోతృత్వ స్ప్రష్టృత్వ ద్రష్టృత్వ రసయితృత్వ ఘ్రాతృత్వంబులును కర్తృత్వ భోక్తృత్వ స్మర్తృత్వ జ్ఞాతృత్వ మంతృత్వ హంతృత్వ ప్రమాతృత్వ ధ్యాతృత్వాదికంబులును నీకు లేవు. నీవు కేవల శుద్ధచిద్రూప ప్రత్యగభిన్న బ్రహ్మచైతన్య ప్రకాశ

---

చున్నవి. ఇందులకు 'ప్రారబ్ధం బలవత్తరం ఖలువృణాం భోగేనతస్యక్షయః' 'ప్రారబ్ధం భోగతో నశ్యేత్ తత్త్వజ్ఞానేన సఞ్చితం। ఆగామి ద్వివిధం కర్మం తద్ద్వేషి ప్రియవాదినోః' అని ప్రమాణములు. ఈత్రివిధకర్మజనితము అగు వాసనలతోఁ గూడినమనస్సు నశించిననే బ్రహ్మస్వరూపానుభవమువలని నిరతిశయానందము గలిగి సకలతాపములును నశించు నని తాత్పర్యము.

మాత్రుండవు గావున "నేను శరీరేంద్రియ ప్రాణ మనో బుద్ధి చిత్తాహంకారంబులు గాను, స్వయంప్రకాశ సచ్చిదానంద స్వరూపమాత్రుండ" నని నిన్ను నీవు విలోకించు సమాధి సమయంబున సకల వికారసమన్విత మనోరహితుండవు గావే. భూత భవిష్య ద్వర్తమాన కాలంబుల నివ్విధంబునఁ బ్రకాశించుటవలన నిరతంబును నిర్వికల్పుండవై యేకరూపుండవై యుండుటగాదె సర్వవికారశూన్య సహజామనస్క రాజయోగ సమాధి యని తెలిపినం దెలిసి హనుమంతుండు సీతాకాంతున కిట్లనియె. ౬౩

టీ. అని, మఱియుఁ, ఇట్లనియెను. పరమభాగవతోత్తమ = గొప్ప భాగవతులయందు శ్రేష్ఠుఁడగువాఁడా, నీవు, దేహవ్యతిరిక్తుండవు = శరీరమునకంటె వేఱైనవాఁడవు - (ఇట త్రివిధశరీరములను గ్రహించునది) అగుటంజేసి, జన్మా...లును - జన్మ = పుట్టుట, అస్తిత్వ = ఉండుట, వృద్ధి = పెరుఁగుట, పరిణామ = ముదిమి, అపక్షయ = నవయుట - క్షీణించుట, వినాశంబులు = చావును అనెడి యీ షడ్భావ వికారములును, బాల్యకౌమారవయోజరావస్థలును = * బాల్యము, కౌమారత్వము, యౌవనము ముదిమి అనెడు అవస్థలును, వర్ణా...లును - † వర్ణ = బ్రాహ్మణాది వర్ణములును, ఆశ్రమ = బ్రహ్మచర్యము మొదలయిన యాశ్రమములును, కుల = జాతులను, గోత్ర = కాశ్యపాది గోత్రములను, నామ = గోవిందనారాయణాది నామములును, రూప=దేవతిర్యఙ్మనుష్యాది రూప

* 'పఞ్చసంవత్సరో బాలః కుమారో ద్వాదశాబ్దికః । యువాబ్దాః పఞ్చవింశత్యాః వృద్ధ స్స్యా త్తతివార్షికః' అని నారదీయము.

† ఇట వర్ణ కుల గోత్రములను, దేశకాలములను జెప్పి, స్థూలత్వాదులచేత ద్రవ్యగుణములను జెప్పినా రని వివేచన తెలియునది.

ములును, దేశ = అంగవంగాది దేశములును, కాల = భూతభవిష్యద్వర్త మానకాలములును, ఆదికంబులు = మొదలయినవియును, స్థూల...లును - స్థూలత్వ = బలియుట, కృశత్వ = చిక్కుట, దీర్ఘత్వ = నిడుద యగుట, హ్రస్వత్వ = కుఱుచయగుట, నీలత్వ = నల్లఁదనము, రక్తత్వ = ఎఱ్ఱఁదనము, ఆదికంబులు = మొదలగునవియును, నిరింద్రియుండ వగుటంజేసి = కర్మజ్ఞానేంద్రియములు లేనివాఁడ వగుటంబట్టి, వచ...లును - వచన = పలుకుట, ఆదాన = ఇచ్చుట, గమన = నడచుట, విసర్గ = మలమూత్రములను విడుచుట, ఆనంద = సంభోగాదులచే అమితసుఖము నొందుట, అనెడు, కర్మంబులును = కర్మేంద్రియ వ్యాపారములును - ఇందు వరుసగా వాక్పాణి పాద పాయూపస్థముల వ్యాపారములు తెలియునది; శబ్ద...లును - శబ్ద = వర్ణరూపములుగను ధ్వనిరూపములుగను నున్న శబ్దములును, స్పర్శ = మెత్తన బిరుసు చల్లన వేఁడి మొదలయిన స్పర్శములును, రూప = నలుపు పసుపు పొడవు మొదలుగా పదివిధము లయిన రూపములును, రస = ఉప్పు పులుసు మొదలగు రసములును, గంధ = మంచి చెడ్డవియగు వాసనలును, అనెడి, విషయ = జ్ఞానేంద్రియ వ్యాపారముతోడి, సంగంబులును = కూడికలును, ఇట్లు ఇంద్రియహీనుం డగుటంబట్టి యింద్రియ వ్యాపారముల లేమి చెప్పఁబడెను.

ప్రాణములు లేమింజేసి ప్రాణాది వ్యాపారములు లేమిని దెలుపుచున్నారు. అప్రాణుండ వగుటంజేసి = ప్రాణములు లేనివాఁడ వగుటవలన, చల...లును - చలన = కదలుట, ధావన = పరుగెత్తుట, కంపన = వడఁకుట, ఆకుంచన = ముడుఁగుట, ప్రసారణ = చాఁగుట, ఆదికంబులును = మొదలయినవియును, క్షుత్ పిపాస ఆదికంబులును = ఆఁకలి దప్పి మొదలగునవియును - మనస్సులేనివాఁ డగుటం బట్టి కలుగని వానినిజెప్పుచున్నారు, అమనస్కుండ వగుటంజేసి = మనస్సులేనివాఁ డగుటవలన, సంకల్ప వికల్పంబులును=దాని సంకల్ప వికల్ప వ్యాపారములును (మనస్సు

సంకల్పవికల్పాత్మక మైనది - సంకల్ప మనఁగా కోరుట, వికల్పమనఁగా కోరమి), రాగ...లను - రాగ = స్త్రీలవలని యనురాగమును, ద్వేష = పగయును, కామ = గృహాదులందలి కోరికయును, క్రోధ = కోపమును, లోభ = పిసినితనమును, మోహ = తెలియమియు - మదాదులచేత నిది చేయఁదగును దగదని దెలియకుండుటయు, మద = కావరమును - తాను ధనవంతుఁడుగాన చేసినవెల్ల చెల్లితీఱవలయునను తలంపును, మత్సర = మచ్చరమును - తనకంటె నొకఁడు డెక్కువగా నుండుటకు చూపోపమి యును, ఈర్ష్య = ఈసును - దుఃఖములు పరులకేకాని తనకు రావచ్చునా యను తోఁపికయును, అసూయ = పరులయందుఁ దప్పులు పట్టుటయు, దంభ = దానాదులు ఇతరుల మెప్పును గోరి చేయఁ దివురుటయు, దర్ప = తనకంటె అధికులు లేరను గర్వమును, అహంకార = తానొకఁడే సర్వ శక్తుఁడని తలంచుటయు, ఇచ్ఛా = అనిర్వాచ్యములైన అంతర్బహిశ్శౌ చాదిక్రియలు చేయవలయు నని కోరుటయు, తృష్ణా = పరధనాదులును గావలయునని మితిమీఱిన కోరికయు, విచికిత్సా = (తానే బ్రహ్మమై యుండ తాను బ్రహ్మము గాదనెడి) సందేహమును, లజ్జా = సిగ్గును - అకార్యములను జేయుటయందు సంకోచించుట యనుట, దయా = భూతములం దు కనికరమును, భయ = వెఱపును, శోక = దుఃఖమును, ధైర్య = దిటయు, అధైర్య = దిటలేమియు, దైన్య = దీనత్వమును, ఆదికంబులు= మొదలయినవియును, నిత్య...లును - నిత్య = నిత్యంబగు పరబ్రహ్మమును, అనిత్య = మిథ్యయగు ప్రపంచమును, అనెడు, వస్తు = ఈ రెండువస్తువుల యొక్క, వివేక = వేఱుపఱిచి యెఱుఁగుటయు, వైరాగ్య = ఇహపర భోగములందు విరక్తియు, శమ = అంతరింద్రియ నిగ్రహమును, దమ = బహిరింద్రియ నిగ్రహమును, ఉపరతి = విహితకర్మములను విధ్యుక్త విధాన ముగ విడుచుటయును, తితిక్షా = శీతోష్ణాది ద్వంద్వములను సహించు టయు, శ్రద్ధా = వైదికములందు విశ్వాసమును, సమాధాన = ఇంద్రియ

ములనెల్ల విషయములనుండి త్రిప్పి వేదాంతవిచారమందు నిలుపుటయును, ముముక్షుత్వ = మోక్షేచ్ఛయు, శ్రవణ = మహావాక్యార్థములను గురుముఖమున వినుటయు, మనన = గురువువలన విన్న యర్థములను యుక్తులచేత సమన్వయ మగునట్లు చింతనసేయుటయు, నిధిధ్యాసన = విజాతీయము లగు కామాదులను విడిచి సజాతీయమగు సచ్చిదానంద నిత్యపరిపూర్ణ పరబ్రహ్మమే నేననెడు స్వానుభూతి గలిగియుండుటయును, జ్ఞాన = అపరోక్షజ్ఞానమును, ఆదికంబులును = మొదలయినవియును.

ధీవిలక్షణుండవు - ధీ = నిశ్చయాత్మకమైన బుద్ధికి, విలక్షణుఁడవు= వ్యతిరిక్తుఁడవు, నిరహంకారుఁడవు = అహంభావము లేనివాఁడవు అగుటం జేసి, వక్తృ...లును - వక్తృత్వ = మాటకారితనము, దాతృత్వ = ఈవి, గంతృత్వ = నడచునోపిక, విసర్జయితృత్వ = మలమూత్రాదులను విడుచుట, ఆనందయితృత్వంబులును = రతిక్రీడాదులచేత ఆనందించుటయును, శ్రోతృత్వ = వినుట, స్ప్రష్టృత్వ = తాఁకుట, ద్రష్టృత్వ = చూచుట, రసయితృత్వ = ఆస్వాదించుట, ఘ్రాతృత్వంబులును = మూరుకొనుటయును, కర్తృ...లును - కర్తృత్వ = చేయుట - అభిమానిత్వము, భోక్తృత్వ = అనుభవించుట, స్మర్తృత్వ = తలంచుట - అనఁగా సంకల్పించుట, జ్ఞాతృత్వ = ఎఱుఁగుట, మంతృత్వ = ఆలోచించుట, హంతృత్వ = చంపుట, ప్రమాతృత్వ = కొలఁది యిడుట, ధ్యాతృత్వ = ధ్యానించుట, ఆదికంబులును = మొదలయినవియును, నీకు లేవు.

నీవు, కేవ...డవు - కేవల = ఏకమైన, శుద్ధ = నిర్మలంబగు, చిద్రూప = జ్ఞానస్వరూప మగు, ప్రత్యక్ = కూటస్థబ్రహ్మమునకంటె, అభిన్న = వేఱుకానట్టి, బ్రహ్మచైతన్య = జ్ఞానస్వరూపంబగు బ్రహ్మము యొక్క, ప్రకాశమాత్రుండవు = తేజస్సే స్వరూపముగాఁ గలవాఁడవు, కావునన్, నేను = కూటస్థుఁడనగు నేననుట, శరీర...గాను - శరీర = దేహమును, ఇంద్రియ = జ్ఞాన కర్మేంద్రియములును, ప్రాణ = పంచ

ప్రాణములును, మనః = సంకల్పవికల్పాత్మకం బగు మనస్సును, బుద్ధి = నిశ్చయాత్మకంబగు బుద్ధియు, చిత్త = చంచలాత్మకమగు చిత్తమును, అహంకారంబులును = కర్తవ్యస్వరూపకాహంకారమును, కాను = నేను గాను, స్వయం...నని - స్వయంప్రకాశ = తనంతటనే వెలుఁగుచున్న, సత్ = కాలత్రయమం దంతట నున్నట్టి, చిత్ = అపరోక్షజ్ఞానమును, ఆనంద = దుఃఖాసంభిన్నమగు సుఖమును, స్వరూపమాత్రుఁడనని = ఇవియె స్వరూపముగాఁ గలవాఁడనని, నిన్నుక్, నీవు, విలో...బునక్ - విలోకించు = చూచెదు, సమాధిసమయంబునక్ = యోగనిష్ఠాసమయమందు, సక...డవు - సకల = సమస్తమైన, వికార = గుణవికారముల తోడ, సమన్విత = కూడిన, మనోరహితుండవు = మనస్సులేనివాఁడవు, కావే = కావా - అగుదువనుట. భూత..లక్ - భూత = కడచినవియు, భవిష్యత్ = రాఁగలవియు, వర్తమాన = జరుగుచున్నవియు, అగు, కాలంబులక్ = కాలములయందు, ఇవ్విధంబునక్, ప్రకాశించుటవలన, నిరంతరంబును = ఎల్లప్పుడును, నిర్వికల్పుండవై = వికల్పము లేనివాఁడవై, ఏకరూపుండవై = ఒక్కటేరీతిగా నుండువాఁడవై, ఉండుట కాదే = ఉండుటయొకదా, సర్వ...సమాధి - సర్వవికారశూన్య = సలయవిక్షేపకషాయాది వికారములు లేనిదియు, సహజ = తనంతటఁ బుట్టినదియు, అమనస్క = మనస్సులేనిదియునగు, రాజయోగ = రాజయోగము యొక్క, సమాధి = నిష్ఠ, అని, తెలిపినక్ = బోధింపఁగా, తెలిసి, హనుమంతుఁడు, సీతాకాంతునకుక్ = శ్రీరామునకు, ఇట్లు అనియెను.

తా. హనుమంతా! నీవు దేహమునకంటె వేఱైనవాఁడవు గనుక, నీకు దేహమునకుఁ గల షడ్భావవికారములును బాల్యాదులయిన దశలను వర్ణాశ్రమాదులను దేశకాలాదులను స్థూలత్వాది ద్రవ్యగుణములను గలుగవు. ఇంద్రియములు లేనివాఁ డగుటవలన దశేంద్రియ వ్యాపారములును ప్రాణములు గానివాఁడగుటవలన మనఃప్రాణవ్యాపారములు నీకుఁ గలుగవు.

మనస్సును లేనివాఁ డగుటవలన సంకల్పవికల్పములును, రాగద్వేషాదులును వివేక వైరాగ్యాదులును గలుగవు. బుద్ధికిని అహంకారమునకు వేఱయిన వాఁడవు గాన, వక్తృత్వాదులును గలుగవు. నీవు శుద్ధంబగు చిన్మాత్ర బ్రహ్మముయొక్క తేజస్సు. ఇట్టివాఁడ వగుటంబట్టి 'నేను శరీరాదులు గాను, సచ్చిదానంద బ్రహ్మస్వరూపుండ' నని నీవు సమాధియందు నిన్ను చూచుకొనునపుడు నీకు మనస్సును దద్వికారము లన్నియును లేకపోవు చున్నవి. నీ విట్లు సర్వకాలములందు శుద్ధచిన్మాత్రబ్రహ్మంబ వై వికల్ప ములు లేక ఏకరూపుండవై ప్రకాశించుచుండుటయే వికారరహితంబై అమ నస్కం బనెడి రాజయోగసమాధి యని తెలిపెను. అప్పుడు హనుమం తుఁడు రాముని తో ని ట్లనెను. ౬౩

క. ఇది యది యనాత్మ నేఁ గా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునపుడు నె
మ్మది కలదో లేదో యిది
విదితంబుగఁ దెలియఁ జెప్పవే శ్రీరామా. ౬౪

టీ. శ్రీరామా, ఇది = ఈకనఁబడుచున్న వెలుపలి ప్రపంచమును, అది = ఆ లోనిప్రపంచమును, అనాత్మ = ఆత్మ గానిది - జడమైనది, ఈ రెండును నేను గాను, ఇది = ఈ కనఁబడుచున్నది, బ్రహ్మము = పర మాత్మ, ఇదియె, నేను అటంచున్, ఎఱుఁగునపుడు = తెలిసికొన్నపుడు, నెమ్మది = మనస్సు - దుఃఖాత్మకమును జడమునయిన మనస్సనుట, కలదో లేదో = ఉన్నదా లేదా, ఇది = ఈయడిగిన విషయము, విదితంబుగన్ = చక్కఁగా, తెలియఁజెప్పవే= తెలియునట్లు చెప్పవే, శ్రీరామా, 'ఈవెలుప లను లోపలను దోఁచుచున్న ప్రపంచము నేను గాను. ఈ పరమాత్మయె నేను' అని నాకుఁ దెలియుచున్నపుడు - అనఁగా నిట్లు నేను దత్త్వదృ ష్టితోఁ జూచునపుడు, నాకు మనస్సుకలిగి యుండునా, ఉండదా, ఈ విషయము నాకు స్పష్టముగాఁ జెప్పవలెను.

వ. సమాధియందు మనంబు గల దంటేని. ౬౫

టీ. బ్రహ్మనిష్ఠయందు మనస్సు కలిగియుండు నని చెప్పితివేని.

సీ. మనసు గల్గిన బుద్ధియును దశేంద్రియములుఁ
ప్రాణాదులును జతపడి వసించు
నవియు నీస్థూలదేహంబును విడిచి యుం
డవు గాన నదియు నుండంగ వలసె
ఘనకారణము లేనికార్యంబు లిల లేవు
గావున దాని నిల్కడయు నొప్పు
మూఁడుమేనుల నంటి మొదలును దుది లేని
సంసార మంత యచ్చముగ నుండు

తే. నట్టు లుండినచో సహజామనస్క
రాజయోగసమాధి నిరంతరంబు
నెవ్విధంబున సిద్ధించు నెంచి చూడ
జానకీరామ దేవతాసార్వభౌమ! ౬౬

టీ. దేవతాసార్వభౌమ = దేవతలకు చక్రవర్తియైన, జానకీరామ = సీతారామా, మనసు = (అనృతమై జడమై దుఃఖాత్మకమైన) మనస్సు, కల్గినన్ = సమాధియందు నిలిచియుండెనేని, బుద్ధియున్ = నిశ్చయాత్మక మగు బుద్ధియును, దశ + ఇంద్రియములును జ్ఞానకర్మేంద్రియములు పదియును, ప్రాణాదులును = ప్రాణాది వాయువులును, జతపడి = కూడుకొనియే, వసించును = మనస్సున్నచోట బుద్ధి మొదలయినవియును గూడియే యుండు ననుట, అవియున్ - *ఆ మనస్సు మొదలయినవియును, ఈ స్థూలదేహం

* ఈమనస్సు మొదలగునవి పదియేడును గూడి సూక్ష్మశరీర మగుచున్నది. కొందఱు దీనికి పందొమ్మిది చెప్పుదురు. అప్పుడు మనో బుద్ధులతోఁగూడ చిత్తాహంకారములు రెంటిని జేర్చుకొనవలెను. పదియే

బుఁ = ఈ స్థూలశరీరమును, విడిచియుండవు=వదలియుండ నేరవు, కాన, అదియుఁ = ఆ స్థూలదేహమును, ఉండంగవలసెఁ = ఉండవలసియున్నది. ఇలఁ = భూమియందు, ఘనకారణము - ఘన = ఘనరూపమైన జడప్రాయమగు దండచక్రాదులవంటి, కారణము = నిమిత్తకారణము, లేని, కార్యములు = ఘటాదులవంటివి, లేవు = కలుగవు; కనుక, దానినిలుకడయుఁ = ఆ కారణశరీరముయొక్క ఉనికియు, ఒప్పును = కారణశరీరముకూడ ఉండవలయు ననుటయె తగియున్న దనుట - నిమిత్తకారణము లగు కుమ్మరిసారె మొదలగునవి లేక కార్యములయిన కుండలు మొదలగునవి లోకమునందుఁ గనుపట్టవు. కాఁబట్టి, కార్యము లయిన సూక్ష్మస్థూలశరీరము లుండుటవలన, వానికిఁ గారణమైన కారణశరీరముకూడ నుండవలయునని భావము. మూఁడుమేనులఁ = స్థూలసూక్ష్మకారణశరీరములను పూఁటిని, అంటి = పొంది, మొదలును తుది లేని = ఆద్యంతములు లేకుండునట్టి, సంసారము అంత = అహంకారవ్యాపార మగు సంసారమంతయును, అచ్చముగఁ = కేవలముగను, ఉండును; అట్టులు ఉండినచోఁ = ఆ విధమున కేవలసంసారము కలిగియుండినయెడల, సహజ = నైజమైన, అమనస్క = అమనస్కమనెడి—లేక మనోరహితమైన, రాజయోగసమాధి = రాజయోగ మను బ్రహ్మనిష్ఠ, ఎంచిచూడఁ = తలపోయఁగా, నిరంతరంబును = ఎడతెగక - ఎల్లప్పుడు ననుట. ఎట్లు సిద్ధించును? సిద్ధింప దనుట.

---

డను మతమున మనస్సును చిత్తమును ఒక్కటిగాను, బుద్ధిని అహంకారమును ఒక్కటిగాను గ్రహింపవలెను. కొంతఱు పదియా అందురు. అపుడు, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడి యీ నాలుగింటిని అంతఃకరణ మని ఒక్కటిగా గ్రహింపవలయును. ఎట్లు గణనచేసినను తుదకు సమానమే యగుచున్నది గాని, భేదము లేదు.

తా. సమాధియందు మనస్సుండెనా దానితోఁగూడ బుద్ధియును పది యింద్రియములును ప్రాణాదు లయిదును గూడిన సూక్ష్మదేహ ముండక తీఱదు. ఆ సూక్ష్మదేహమును స్థూలదేహమును దానితోఁ గూడి యుండవల యును. నిమిత్తకారణము లేక యొకకార్యము గలుగదు గాన, కార్యము లైన స్థూలసూక్ష్మదేహము లుండుటంబట్టి వీనికిఁ గారణ మగు కారణశరీ రముగూడ నుండును. ఇట్లీమూఁడుదేహము లుండుటనుబట్టి వీనితోఁ గూడి యాదియు నంతమును లేక సంసారముగూడ నచ్చముగాఁ గలిగియుండును. ఇట్లు సంసారరూపమైన యహంకారవ్యాపారము మనోమూలముగాఁ గలిగి యుండు నేని, మనోరహితమైన రాజయోగసమాధి నైజముగా నెప్పుడును సిద్ధించుట యెట్లు? అది సిద్ధింపనేరదు గదా! ౬౬

వ. అట్లగుటంజేసి మనంబు లేదంటేని— ౬౭

టీ. అట్లగుటంజేసి = అట్లు రాజయోగసమాధి సిద్ధింపనందుచేత, మనంబు లేదంటేని = మనసు ఆ సమాధియందు లేదని చెప్పితివేని. ౬౭

మ. తనర న్నెమ్మది యంతయుం బొలియఁగాఁ దత్త్వా
త్ముఁడై యుండినఁ, బునరుత్థానము గల్గ దాతనికి నీసొం
దొప్పినన్ ధాత్రిపైఁ, గనఁ డాత్మానుభవంబు గాంచి
యమనస్కం బెంచి బోధించున, జ్ఞను లాచార్యులు గల్గ
రంచు మదిలో శంకింతు సీతాపతీ! ౬౮

టీ. సీతాపతీ = రామచంద్రా! నెమ్మది అంతయున్ = మన స్సంతయును, తనరన్ = బాగుగా, పొలియన్ = నశింపఁగా, తత్త్వా త్ముఁడై = పరతత్త్వమగు బ్రహ్మమే స్వరూపముగాఁ గలవాఁడై - పరబ్రహ్మమే తానై యనుట, ఉండినన్ = ఉండఁగా, ఆతనికిన్ = అట్టి బ్రహ్మనిష్ఠునకు, పునరుత్థానము = సమాధినుండి మరల లేచుట, కల్గదు = కలుగనేరదు. ఈ పొందు ఒప్పినన్ = ఈ మరల లేకుండుట సమకూడెనేని

ధాత్రిపైన్ = భూమిమీఁద, ఆత్మానుభవంబున్ = బ్రహ్మస్వరూపము ననుభవించు నిష్ఠను, కనఁడు = ఎవ్వఁడును పొందఁడు - పరబ్రహ్మమే తానైపోయినప్పుడు తాను వేఱైయుండి యా బ్రహ్మస్వరూపము ననుభవించుట యెట్లు గలుగు నని భావము. కనుక, కాంచి = ఆబ్రహ్మనిష్ఠను పొంది, అమనస్కంబు = అమనస్క సమాధిని, ఎంచి = పరామర్శించి, బోధించు సజ్జనులు=శిష్యుల కుపదేశించునట్టి బ్రహ్మవేత్తలగు, ఆచార్యులు= గురువులు, కల్గరు అంచున్=ఉండరని, మదిలోన్=చిత్తమందు, శంకింతున్=సందేహించుచున్నాను.

తా. సీతాపతీ! ఆసమాధియందు మనస్సంతయు నశించెనేని, అపుడు పురుషుఁడు, అఖండైకరూపంబగు పరబ్రహ్మమే తానై యుండును. కనుక, నట్టి సమాధినుండి మరల నతఁడు లేచుట గలుగదు. బ్రహ్మమే యైనవాఁడు మరల బ్రహ్మసమాధి నొందుట యేల? అతఁడట్లు లేవక యుండెనేని మరల బ్రహ్మనిష్ఠను జూచుట యెక్కడిది? అట్లు దానిని చూచుటయే కలుగఁజాల నపుడు, అమనస్కయోగమును చూచి దానిని విమర్శించి శిష్యులకు బోధించుటకు ఆచార్యులుగాని గలుగుట యెక్కడిది? ఇది సందేహముగా నున్నది.

క. బోధాచార్యులు లే రని,
సాధించిన రాజయోగిసంతతికిని ద
ద్బోధంబునకుఁ దదీయ స
మాధికి బాధకము వచ్చు మది కడులేమిన్. ౬౯

టీ. బోధాచార్యులు = బ్రహ్మజ్ఞాన ముపదేశించు గురువులు, లేరు అని = ఉండఁజాల రని, సాధించినన్=సమర్థించినయెడల, రాజయోగిసంతతికిన్=రాజయోగుల పరంపరకును, తద్బోధంబునకున్=వా రుపదేశించిన తత్త్వోపదేశములకును, తదీయసమాధికిన్=వారి సమాధికిని, మది=మనస్సు, కడున్ లేమిన్=సమాధియందు కొంచెమైనను లేకుండుటవలన, బాధకము వచ్చున్=హాని కలుగుచున్నది.

తా. ఇట్లుపదేశము సేయు గురువులే కలుగఁజాలరని నిశ్చయించిన యెడల, అపు డింతవఱకుఁ గలిగియుండినట్లు చెప్పఁబడినరాజయోగులే యుండి యుండరనియు, వా రుపదేశము సేయుటయే జరిగియుండ నేరదని యు, వారికి సమాధియే కలుగఁజాలదనియు నూహింపవలసి వచ్చుచున్నది. ఏ లనఁగా-సమాధియందు మనస్సు కొంచెముకూడ లేక పోయినయెడల రాజ యోగులును, వా రుపదేశించుటలును, వారిసమాధులు నెట్లు గలుగ నేర్చును?

వ. ఇవ్విధంబు గాక జ్ఞానవిజ్ఞానసంపన్ను లైన మహానుభావులు సమాధియందుఁ గొంత తడవు మనోరహితు లై యుండి, కొండొక సేపునకు మేల్కాని మెలంగుదు రనినఁ బరమ పదంబు నొందినవారికిఁ బునరావృత్తి ప్రాప్తించు, అట్లైన మోక్షంబున కనిత్యత్వంబు వచ్చు. ఇట్లు బహువికల్ప సమన్వితం బైనయీ సంశయంబు నిశ్శేషంబుగా నివర్తించునట్లు పరమరహస్యార్థం బుపదేశించి నిరతిశయ కరుణా కటాక్షవీక్షణంబుచేత ననుగ్రహింపవే యని ప్రార్థించిన నయ్యాంజనేయుని కుశల తీవ్ర సూక్ష్మప్రజ్ఞావిశేషంబునకు మెచ్చి, సచ్చిదానంద స్వరూపాభిరాముం డైన యాత్మా రాముండు పరమానంద భరితాంతఃకరణుండును వికసిత ముఖారవిందుండు నై సాదరంబుగా ని ట్లనియె. ౨౦

టీ. ఇవ్విధంబు గాక = ఇట్లు సమాధియందు మనస్సు కొంచెమైనను లేకయే యుండుననుట లేక, జ్ఞాన విజ్ఞానసంపన్నులు = బ్రహ్మజ్ఞానమును న్త్రీలౌకికవిజ్ఞానమును చక్కఁగాఁ గలిగియున్నవారు, అయిన, మహాను భావులు=యోగులు, సమాధియందుఁ=నిష్ఠయందు, కొంతతడవు=కొంత సేపు, మనోరహితులై=అమనస్కులై, ఉండి, కొండొకసేపునకు=మఱి కొంతసేపటికి, మేల్కాని = సమాధిని విడిచి - ప్రపంచజ్ఞప్తి గలవారై

యనుట, మెలంగుదురు అనినన్=ప్రవర్తింతురని చెప్పినయెడల, పరమపదంబున్ = ఉత్తమమగు మోక్షపదమును, పొందినవారికిన్, పునరావృత్తి = దానినుండి మరలి సంసారమునకు వచ్చుట- మరల భూమియందు జన్మమెత్తుట, ప్రాప్తించున్=కలుగును. సమాధియందు బ్రహ్మైక్యమునొంది వానికి మనస్సు కొంచెము ముండుటచే మరల బాహ్యప్రపంచరూపసంసారము గలుగునేని, మోక్షమునకుఁ బోయి మరలి జన్మము నొందుటయే యగుచున్నదని భావము; అట్లు ఐనన్=అట్లు పునరావృత్తి కలుగునేని, మోక్షంబునకున్=ముక్తికి, అనిత్యత్వంబు = నిత్యత్వములేమి-స్థిరముగా నుండుట, వచ్చున్=కలుగును, ఇట్లు బహువికల్ప సమన్వితంబు = అనేకము లయిన వికల్పములతోడ (అనఁగా నిట్లు వచ్చును, అట్లు కావచ్చునను ద్వైవిధ్యములతోడ) కూడిన, ఈ సంశయంబు=ఈ సందేహము, నిశ్శేషంబుగాన్= శాంతిగా, నివర్తించునట్లు, పరమరహస్యార్థంబు = మిక్కిలి రహస్యమైన తత్త్వార్థవిషయమును, ఉపదేశించి, నిరతి...ణంబులచేతన్—నిరతిశయ= తనకంటె ఎక్కుడులేనట్టి, కరుణా=కనికరముతోడి, కటాక్షవీక్షణంబుల చేతన్=కడకంటి చూపులచేత, అనుగ్రహింపవే, అని, ప్రార్థించినన్, అయ్యాంజనేయునియొక్క, కుశల...షంబునకున్—కుశల = నేర్పుగలదియు, తీవ్ర=ఉరవడి గలదియు, సూక్ష్మ = మిక్కిలి వాఁడియైనదియు, అగు, ప్రజ్ఞావిశేషంబునకున్=బుద్ధివైఖరికి, మెచ్చి, సచ్చిదానంద స్వరూప అభిరాముండు=సత్యజ్ఞానానందమయమైన స్వరూపముచేతఒప్పునట్టివాఁడు, ఐన, ఆత్మారాముండు=తనయందే రమించుచుండువాఁడగు శ్రీరాముఁడు, పరమ...ణుండును—పరమానంద=మిక్కుటమయిన ఆనందము, భరిత= నింపిన, అంతఃకరణుండును=మనస్సుగలవాఁడును, వికసిత...దుండునై— వికసిత=విరిసిన, ముఖ+అరవిందుండును = మోముదామర గలవాఁడునై - తామర విరిసినట్లు ముఖము వికసించినవాఁడనుట, సాదరంబుగాన్=ఆదరముతోడ, ఇట్లు అనియెను.

తా. సమాధియందు మనస్సు పోత్తిగా లేకుండునని చెప్పక జ్ఞానులగువారు సమాధియందు కొంతసేపు మనస్సు లేకుండి, సమాధి విడువఁగానే మనస్సుతోఁగూడి ప్రవర్తింతురని తలంతము. అప్పుడు మోక్షము నొందినను పునర్జన్మము కలుగఁగూడిన దగును. ఆ మోక్షమును నిత్యము గాకపోవును. ఇట్లు నానావికల్పములకు పెలు గలుగుటచేత దీనిని కలయూపు చెప్పి, తీర్పవలె నని యడుగఁగా, రాముఁ డతనిసూక్ష్మబుద్ధికి మెచ్చి యాదరముతో ని ట్లనియెను. ౭౦

క. ఇది యిది యనాత్మ యేఁ గా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునె జడమై
కదలని మది యిటు లామదిఁ
గదిసి తెలియునతఁడె స్వప్రకాశాత్ముఁ డగున్. ౭౧

టీ. ఇది=ఈ వెలుపల కనఁబడెడి జగత్తును, ఇది=ఈ లోపలి దృశ్యమును, అనాత్మ=ఆత్మకాని ప్రకృతి, ఏనుగాను=ఈ రెండును నేనుగాను, ఇది=ఈ కనఁబడు బ్రహ్మము, నేను అటంచున్, జడమై = అచేతనమై, కదలనిమది=తనంతటఁ వ్యాపారశూన్య మగు మనస్సు, ఎఱుఁగునే=తెలియఁజాలునా, ఆమదిన్=ఆ మనస్సును, కదిసి=కూడి, ఇటులు=ఇది ప్రకృతి ఇది బ్రహ్మ మని వివేచించి, తెలియునతఁడె=ఎఱుఁగనట్టివాఁడే, స్వప్రకాశ+ఆత్ముఁడు = స్వయంప్రకాశుండగు పరమాత్మస్వరూపుఁడు, అగును.

తా. మనస్సు జడమైనది. దానికిఁ దనంతటనే వ్యాపారమును జేయుటకు శక్తి గలుగదు; అట్టి మనస్సు 'ఇది ప్రకృతి యిది పరబ్రహ్మ' మని తెలియ నేర్చునా ? ఆ మనస్సుతోఁ గూడి యట్లు తెలియఁజాలినవాఁడే స్వయంప్రకాశుఁడగు పరమాత్మస్వరూపుఁ డగును. అనఁగా ప్రకృతి బ్రహ్మవివేకమునకు నాత్మకుఁగల స్వయంప్రకాశజ్ఞానమె మూలముకాని మనస్సు గా దని భావము. ౭౧

చ. మనను జడంబు దృశ్య మణుకమాత్ర మసన్నియతా వి
[తర్క్యముఁ
జననవినాశయుక్తమును * సంశయరూపము దీని యున్కిచే
తను సుఖచిత్ప్రకాశమయకతం దగు నీకుఁ గళంక మేమి చ
క్కని శశశృంగదోషములు * గల్గునె సూర్యున కెన్నఁడేని
[యున్. ౭౨

టీ. మనస్సు, జడంబు=చేతనములేనిది, దృశ్యము=(విషయరూపమై) కనఁబడునది, అణుమాత్రము = నలుసంతకొలఁది గలది, అసత్ నియత అవితర్క్యముఁ - అసత్ = అభావరూప మైనది, నియత = ఒక్కరీతిగా, అవితర్క్యముఁ = ఇట్టి దట్టిదని ఊహింపరానిది - అది యిట్టిదని యూహించుట కెప్పుడును శక్యము గాకుండు ననుట. జననవినాశ యుక్తము = ఉత్పత్తిలయములతోఁ గూడినది, సంశయరూపము = సందేహరూపముగా నుండునది, దీని యున్కిచేతను = ఇట్టి మనస్సు కలిగియుండుటచేత, సుఖ-చిత్ ప్రకాశమయతఁ = ఆనందముయొక్కయు జ్ఞానముయొక్కయు ప్రకాశమే స్వరూపముగాఁ గలవాఁడ వగుటచేత, తగు = ఒప్పుచున్న, నీకుఁ, కళంక మేమి = దోష మేమి? అట్టి మనస్సువలన ఇట్టి నీకు దోషమే కలుగ దనుట; దీనినే దృష్టాంతమూలమున నుపపాదించుచున్నారు. చక్కని శశశృంగదోషములు = అచ్చమగు కుందేటికొమ్మునకుఁ గల దోషములు, సూర్యునకుఁ, ఎన్నఁడేనియుఁ = ఎప్పుడయినను, కల్గునే = కలుగునా - కలుగవనుట; కుందేటికి కొమ్మే కలుగదు. అట్టి లేని కొమ్మునకు దోషము లుండుట మఱింత మిథ్య. అమిథ్యాభూతములగు దోషములే సూర్యునికిఁ గలుగుట ఎంతమాత్రము తలంపనుగూడఁ దలంపరానిది. అట్లే మనస్సు అసత్తు, దానిదోషములు నట్టివే; ఇట్లు అసత్తయి జడమై సంశయరూపమై యున్న మనస్సుయొక్క దోషములు సత్తయి చిత్తయి

స్వయంప్రకాశుఁడ వయిన నీకుఁ గలుగుట యెంతమాత్రము అసంభావ్య మని తాత్పర్యము. ఇచట శశవిషాణ సూర్య దృష్టాంతముచేత, మనస్సు కుందేటి కొమ్మువలె అసత్తును జడమును దృశ్యమును క్షయశీలమును నవికర్తవ్యము నని, ఆత్మ సూర్యునివలె ప్రకాశస్వరూప మనియు సకలవస్తుప్రదీపక మనియుఁ దెలియుచున్నది. ఇచట 'శశశృంగదోషములు' అని పాలపర్తి వారి వ్యాఖ్యయందుఁ బాఠము కనుపట్టుచున్నది. అపాఠమును శృంగశబ్దమునకు ప్రధానార్థమునుబట్టి కళలుగా నర్థముచేసి చంద్రునికళల దోషములు అనఁగా వృద్ధిక్షయములు సూర్యునకుఁ గలుగవని యర్థము వ్రాయఁబడి యున్నది. ఇచ్చట మనస్సు అసత్తును అణుమాత్రమును నని యును, నట్టిదాని దోషములు స్వయంప్రకాశుఁడగు ఆత్మకుఁ దగులవనియు తెలుపుటకు శశవిషాణ సూర్యదృష్టాంతమే యుపపన్నము. చంద్రకళలు మనఃస్థానీయములు; శశవిషాణమువలెఁ గానేరదు; మీఁదను మనస్థానమునందు శశవిషాణమును స్వప్నసంధ్యారాగమును జెప్పంబడియున్నవి; మీఁదఁ జెప్పఁబడిన శశవిషాణమే యిచటఁ జెప్పఁబడుట పునరుక్తప్రాయ మన్నచో యోజనాంతరమునఁ జెప్పఁబడుటచే పునరుక్తి గలుగదు. ౨౨

తే. శశవిషాణంబునకు నాకసంబునకును
గలుగునె పొసంగ సంగంబు దలఁచిచూడ
మనమునకు సచ్చిదానందమయుఁడ వైన
నీకుఁ బొందిక యెన్నఁడేనియును గలదె. ౨౩

టీ. తలఁచిచూడన్ = విచారింపఁగా, శశవిషాణంబునకున్ = కుందేటి కొమ్మునకును, ఆకసంబునకున్ = ఆకాశమునకును, సంగంబు = కూడిక, పొసంగన్ = తగునట్లు, కలుగునే = కలుగదనుట; అట్లే, మనమునకున్ = జడమైన మనస్సునకును, సచ్చిదానంద మయుఁడవు = సత్యజ్ఞానానంద స్వరూపుఁడవు, ఐన నీకున్, పొందిక = కూడిక, ఎన్నఁడేని యును, కలదె = లేదనుట.

తా. అంతట వ్యాపించియును దేనితోను సంగమము లేకయుండు నాకాశమునకును కుండేటికొమ్మునకును సంగమము కలుగదు. అట్లే సత్య జ్ఞానానంద స్వరూపుండును నిస్సంగుఁడును సర్వవ్యాపకుండు నగు నీకును నసత్తయి యణుమాత్రంబయిన మనస్సునకు నెన్నఁడుగాని సంబంధ మెంత మాత్రమును గలుగఁజాలదు. 23

తే. స్వప్రకాశుండ వగునిన్ను ◆ సన్మనో వి
కారములు పొందునే పటికంపుఁగొండ
నెన్నఁడేనియుఁ గలలోనఁ ◆ గన్నయట్టి
సంజకెంజాయ లంటునే ◆ యాంజనేయ ! 24

టీ. ఆంజనేయా! స్వప్రకాశుండవు = నీయంతటనే ప్రకాశించు చుండువాఁడవు ? అగు నిన్నుకా, సన్మనోవికారములు - సత్ = ప్రశస్తము లయిన, మనస్ = మనస్సుయొక్క, వికారములు = సంకల్ప వికల్పాదులు, పొందునే = అంటునా? పటికంపుఁగొండ = స్ఫటికపర్వతమును, కలలోనన్ = స్వప్నమందు, కన్నయట్టి సంజ కెంజాయలు = చూచిన సంధ్యాకాలపు ఎఱ్ఱని కాంతులు, అంటునే = తాఁకునా - తాఁక వనుట.

తా. ఆంజనేయా ! ఒక పటికంపుఁగొండను మనము కలలోఁ గన్న సంధ్య యెఱ్ఱనికాంతు లంటునా ? అట్లే స్వయంప్రకాశుఁడ వయియున్న నిన్ను కలలోనిదానివలె నసత్తయిన మనస్సుయొక్క వికారములును పొంద నేర్చునా ? 24

21-వ పద్యమున సూర్యదృష్టాంతముచేత స్వప్రకాశమానత్వము ను సర్వప్రదీపకత్వమును, 22-వ పద్యమున ఆకాశదృష్టాంతముచేత సర్వవ్యాపకత్వంబును నిస్సంగత్వమును, ఈ పద్యమున స్ఫటికపర్వతోపమానముచేత నత్యంత నిర్మలత్వమును, నాత్మకుఁ జెప్పంబడిన వని తెలియు నది. మనస్సునకు నట్లే వరుసగా శశవిషాణమును స్వప్నగతసంధ్యారాగ

మును సమానంబులుగాఁ జెప్పుటచే నసత్తగుటయు అవిశేష్యత్వమును అకార్యకరత్వమును సంశయరూపత్వమును బ్రతిపాదితములు.

వ. కపీంద్రా! జడ ఘటపటాదియుక్తంబు లైన ఛిద్రత్వాచ్ఛిద్రత్వ శ్లక్ష్ణత్వాశ్లక్ష్ణత్వ స్పృష్టిమత్త్వాస్పృష్టిమత్త్వాది వికారంబులు విశ్వప్రకాశకుం డైన యాదిత్యునిం బొరయ నేరని తెఱంగున నహంకార ధీ మానసేంద్రియ శరీరాది విషయగుణదోషంబులు స్వయంప్రకాశాత్మకుండ వైన నిన్నుఁ బొందవు. వాయు తేజో జల భూములును దత్కార్యంబులును దనయందుఁ గలిగియుఁ దా నన్నింటియందును వ్యాపించియు, నేమిటి నంటని మింటికరగిడిఁ జిత్తాది సర్వకారణకార్యంబులును నిన్నాశ్రయించి, నీయందు నిలిచియుండ, సర్వవ్యాపకుండ వయ్యు నసంగుండ వైన నీ వేమిటిం జెంద వట్లగుటం జేసి. ౭౫

టీ. కపీంద్రా = వానరోత్తమా - హనుమంతా! జడ ఘట పటాదియుక్తంబులు = అచేతనములైన కడవలు వస్త్రములు మొదలగువానితోఁ గూడినవి-వానియందుఁ గలవి, ఐన, ఛిద్ర...వికారంబులు - ఛిద్రత్వ = చిల్లిపోవుట, అచ్ఛిద్రత్వ = చిల్లులు లేకుండుట, శ్లక్ష్ణత్వ = సన్నముగ నుండుట, అశ్లక్ష్ణత్వ = ముదుగుగా నుండుట, స్పృష్టిమత్త్వ = తాఁకు (చేరిక) కలిగి యుండుట, అస్పృష్టిమత్త్వ = తాఁకు లేకుండుట, ఆది = మొదలయిన, వికారంబులు, విశ్వప్రకాశకుం డయిన = జగమునంతయు వెలుఁగఁజేయుచున్న, ఆదిత్యునిన్ = సూర్యుని, పొరయ నేరని తెఱంగునన్ = పొందఁజాలని విధమున, అహం...దోషంబులు - అహంకార = అహంభావము, ధీ = నిశ్చయాత్మకబుద్ధియు, మానస = సంశయరూపకమైన మనస్సును, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు, శరీర = మూఁడు

విధములగు దేహమును. ఆది = మొదలయిన, విషయ = దృశ్యముల యొక్క, గుణదోషంబులు, స్వయంప్రకాశాత్మకుండవు = తనంతటనే వెలుఁగుచుండు స్వభావము గలవాఁడవు, అగు, నిన్నుక్, పొందవు. వాయుతేజో జలభూములును = వాయువును తేజస్సును జలమును పృథ్వియును, తత్కార్యంబులును = వాని గుణములయిన శబ్ద స్పర్శాదులును, తనయందుక్, కలిగియుంక్ = కలిగియుండియు, తాను, అన్నింటియందును, వ్యాపించియు = పర్వి యుండియును, ఏమిటిక్ = ఒక్కదానిని, అంటని మింటిపగిదిక్ = స్పృశింపని యాకాశమువలె, చిత్తాది సర్వ కారణ కార్యంబులును = మనస్సు మొదలయిన సమస్తము లగు కారణములును (ఇంద్రియములును), కార్యంబులును (ఇంద్రియార్థములగు సంకల్ప నిశ్చయాదులును), నిన్నుక్, ఆశ్రయించి, నీయందుక్, నిలిచియుండక్, సర్వవ్యాపకుండ వయ్యుక్ = అంతటను నిండియున్నవాఁడ వయినను, అసంగుఁడ వైననీవు = దేనితోడను జేరకుండెడి నీవు, ఏమిటిక్ చెందవు = దేనిని అంటవు; అట్లు అగుటంజేసి = జడములగు ఘటపటాదులందలి ఛిద్రత్వాదులు వానినెల్లం బ్రకాశింపఁజేయు సూర్యునిని బొందనట్లును, భూమి మొదలగువానియందు వ్యాపించియున్నను ఆకాశమునకు వానితోడ సంగము కలుగనట్లును, మనస్సు మొదలగువాని కారణకార్యములును సూర్యుని వలె ని న్నాశ్రయించియు ఆకాశమువలె నీయందు నిలిచియు నున్నను ని న్నవియెల్ల నంట వని తాత్పర్యము. ౭౫

తే. ఇంద్రియమనంబు లటు చలియించెనేని
నేఁ జలించితి నంచు నీ వెఱుఁగఁబోవు
నిశ్చలుఁడ నంచుఁ దెలియుము నిన్నుఁ గాంచి
యవియు నతినిశ్చలము లగు నంతమీఁద. ౭౬

టీ. ఇంద్రియమనంబులు = జ్ఞానకర్మేంద్రియములును మనస్సును, అటు = ఆ విధమున, చలియించెనేనిక్ = విషయములందు ప్రవర్తించిన

గొనుటయందు, నిరతిశయ = సాటిలేనిదియు, నిర్వికల్ప = వికల్పము లేని దియు, నగు, సమాధి = ధ్యానమందు, నిష్ఠుండునై = ఉన్నవాఁడునై, జీవన్ముక్తిసుఖంబు = ఈ బొందితోనే ముక్తి పొందిన యానందమును - లేక జీవత్వములోనే బ్రహ్మత్వము ననుభవించెడి యానందమును, అనుభ వించుచున్, ఇమ్మహాత్ముండు = ఇప్పుడును, ఉన్నవాఁడు, అని పలికి, శ్రీమహాదేవుండు=పరమశివుఁడు,అప్పార్వతీదేవికిన్, ఇట్లనియెను— హనుమంతునకు మొదట రామచరణకమలభక్తియుఁ దన్మూలమున రామ నామజపప్రవణతయుఁ, దన్మూలమున రామబ్రహ్మైక్యావలోకనయుక్తం బగు నిర్వికల్పసమాధియుఁ గలుగుటయుఁ దన్మూలమున జీవన్ముక్తిత్వము సిద్ధించుటయుఁ దెలియునది. ౧౯౨

తే. మంత్ర మంత్రార్థ మంత్రాభిమాన దేవ
తా స్వరూపంబులను నీకు నే దాఁప కేను
నెఱుఁగ నుపదేశ మిచ్చితి నే నింతకంటె
ఘననిధానంబు లేదు నామనమునందు. ౧౯౩

టీ. నీకున్, ఏను = నేను, మంత్ర...రూపంబులను = రామ మంత్రముయొక్కయు ఆ మంత్రముయొక్క అభిప్రాయముయొక్కయు ఆ మంత్రమున కధిదేవతయొక్కయు కలరూపులను, దాఁపక = మఱుఁగు పెట్టక, ఎఱుఁగన్ = తెలియునట్లుగా, ఉపదేశము ఇచ్చితిని = ఉప దేశించితిని, ఇంతకంటెన్ = ఈ యుపదేశించిన దానికంటె, ఘననిధా నంబు = గొప్ప నిక్షేపము, నా మనమునందున్, లేదు. నా మనస్సునందు దాఁచిన గొప్పనిక్షేపమువంటి దిదియె. దీనికంటె ఎక్కుడయినది లే ద నుట. రామమంత్రమునకును ఆ మంత్రమునర్థమునకును ఆ మంత్రమున కధి దేవత యైన పరబ్రహ్మమునకును గల స్వరూపముల నెఱుంగుటయే పరమో త్కృష్ట మయిన దని భావము. ౧౯౩

క. నిఖిలకలుషసంక్షయకర
మఖిలాభీష్టప్రదం బనంతావ్యయచి
త్సుఖదము జగదధిపత్యభి
ముఖకర మగు మంత్రరాజము మహాదేవీ! ౧౯౪

టీ. మహాదేవి = పార్వతీ, మంత్రరాజము = మంత్రములందు శ్రేష్ఠమైన రామమంత్రము, నిఖిల కలుష సంక్షయకరము = సమస్త పాపముల యొక్క నాశనమును చేయునది; అఖిల + అభీష్టప్రదంబు = సమస్తము లయిన కోరికలను ఇచ్చునది; అనంత + అవ్యయ + చిత్ సుఖదము = తుది లేనిదియు నాశము లేనిదియు నగు బ్రహ్మజ్ఞానమువలని ఆనందమును ఇచ్చునది; జగత్ + అధిపతి + అభిముఖకరము = లోకములకు దొర యైనపరమాత్మను ఎదు రగునట్లు చేయునది, అగును.

తా. పార్వతీ! ఈ రామమంత్రము సమస్తపాపములను పోఁగొట్టునది. కోరినయన్నింటి నిచ్చునది. లోకనాథుం డగుపరమాత్మునిఁ బ్రసన్నునిఁ గావించునది. ౧౯౪

సీ. బహుజన్మసంచితపాపంబులు నశించు
విమలధర్మము లభివృద్ధి నొందు
నాయురారోగ్యంబు లధికంబులై యొప్పుఁ
బటుతరైశ్వర్యసంప్రాప్తి యగును
ధృతియును గీర్తియుఁ దేజంబు బలమును
శాంతి దాంతి క్షమార్జవము లబ్బు
ధనధాన్యపుత్త్రపౌత్త్రకళత్ర బాంధవ
పశుగజాశ్వాది సంపదలు గలుగుఁ
తే. బుడమిలో నెన్నిసద్గుణంబులు చెలంగు
నన్నిగుణములు | పాపించు నార్తితోడ

శనుఁగొనెడు (అనఁగా పఠనము చేసెడు) పండితుల సమూహమునకు, రామతత్త్వసాక్షాత్కారము = శ్రీరామునియొక్క యథార్థస్వరూపముయొక్క ప్రత్యక్షమగుట, అగును; పరమకైవల్యంబున్ = గొప్పకైవల్యమును - విదేహముక్తి యనుట, కలుగును.

తా. సుగమము.

క. ఆతతముగ నెఱిఁగించితి
సీతారామాంజనేయశచిత్సంవాదం
బీతత్త్వామృత మాని ని
రాతంకసుఖాబ్ధి నోలలాడుము గిరిజా!

టీ. గిరిజా = పార్వతీ, సీతారామాంజనేయ చిత్సంవాదంబు - సీతకును = రామునకును ఆంజనేయునకును జరిగిన జ్ఞానమునుగూర్చిన సంవాదమును, ఆతతముగన్ = సవిస్తారముగా, ఎఱిఁగించితిని, ఈ తత్త్వ అమృతమున్ = ఈ తత్త్వ మనెడి అమృతమును, ఆని = త్రావి, నిరాతంక సుఖ అబ్ధిన్ = అడ్డులేని ఆనంద సముద్రమునందు, ఓలలాడుము = క్రీడింపుము.

తా. పార్వతీ! సీతారామాంజనేయులు ముగ్గురికిని జ్ఞానముంగూర్చి జరిగిన యీసంవాదమును నీకు సవిస్తరముగాఁ దెలిపితిని. ఈ తత్త్వమును అమృతమువలె నాస్వాదించి బ్రహ్మానందమునఁ దేలుము. ౧౯-౭

వ. అని పలికి యయ్యనాదిదంపతులు రామబ్రహ్మానందామృత రసపానమద పరవశు లై యన్యోన్యాలింగనంబులు గావించి పరమసుఖైకస్వరూపు లై నిజచరణకమలసేవాసక్తు లైనభక్తుల రక్షించుచుఁ బ్రకాశించుచుండి రంత.

టీ. అని, పలికి, ఆ అనాదిదంపతులు = పురాతను లయిన ఆయాలుమగలు, రామ...పరవశులై = రాముఁ డనెడి బ్రహ్మముయొక్క ఆనంద

యెడల, నీవు, ఏను చలించితిని = నేను కదలితిని, అని, ఎఱుఁగఁబోక ము = తలంపకుము; నిన్నున్ = బ్రహ్మంబవగు నిన్ను, కాంచి = చూచి, నిశ్చలుండవు అంచున్ = కదలిక లేనివాఁడవు అని, తెలియుము; అంత మీఁదన్ = అట్లు తెలిసికొన్న తరువాత, అవియున్ = ఆ యింద్రియము లును మనస్సును, అతినిశ్చలము లగున్ = మిక్కిలియు చలింపనివగును.

తా. నీయింద్రియములును మనస్సును విషయములందుఁ జలించి ప్రవ ర్తించెనా, నీవు చలించినట్లుగాఁ దలంపవలదు. నిన్ను పరబ్రహ్మముగాఁ జూచి నిశ్చలుఁడ నని తెలిసికొనుము. అట్లు తెలిసికొంటివేని యా యింద్రి యములును మనస్సునుగూడ మిక్కిలి చలింపనివే యగునుజుమీ. ౨౧

తే. ఆత్మ తేజంబు వీక్షించునతనిమాన
సేంద్రియంబులు చేష్టల నెడలవిడిచి
యొదిఁగి చెదరక కదలక యూరకుండు
సింగములఁ గన్న గజములభంగి ననఘ! ౨౨

టీ. అనఘ = దోషరహితుఁడవగు హనుమంతా, ఆత్మతేజంబున్ = తనదైన బ్రహ్మప్రకాశమును, వీక్షించునతని = చూచునట్టి పురుషుని యొక్క, మానస ఇంద్రియంబులు = మనస్సును ఇంద్రియములును, చేష్ట లన్ = సంకల్పాదు లయిన తమ తమ వ్యాపారములను, ఎడలన్ విడిచి = పాఱద్రోచి, ఒదిఁగి = ముడిఁగి, చెదరక = కలంగక, కదలక = చలిం పక, సింగములన్ = సింహములను, కన్న గజములభంగిన్ = చూచిన యేనుఁగులవలె, ఊరకుండున్ = మిన్నకుండును.

తా. హనుమంతా! తనదయిన బ్రహ్మస్వరూపప్రకాశమును జూడఁ గల్గిన పురుషునికి మనస్సును నింద్రియములును తమ తమ వ్యాపారములను దిగవిడిచి ముడిఁగికొని చలింపక సింహములను జూచిన యేనుఁగులవలెనే యూరకుండును. ౨౨

చ. అవి యచలంబు లైనయెడ నారయ నేనచలుండనంచు నీ
ప్రవిమలదృష్టిఁ జూడకుము పావని వానిచలాచలత్వముల్
దవులవు నిన్ను నీవు సతతంబును వాని నెఱుంగుచుండు సా
క్షివి హృదయేంద్రియావిషయ కేవల నిర్గుణ మూర్తి
[వెప్పుడున్.

టీ. పావని=వాయుపుత్రా, అరయన్=విచారింపఁగా, అవి=ఆమన స్సును ఇంద్రియములును, అచలంబులు ఐనయెడన్=చలింపని వైనపుడు-విషయములందుఁ బ్రవర్తింపనివి కాఁగా ననుట, నేను, అచలుండనంచున్=నిశ్చలుఁడనని, నీ ప్రవిమలదృష్టిన్=నీయొక్క మిక్కిలి నిర్మలమైన చూపు చేత, చూడకుము; ఆ మనస్సు మొదలయినవి చలింపకుండుటను నీవే చలింప కుండుటగాఁ దలంపకు మనుట. వాని చల అచలత్వములు = ఆ యింద్రియ మనస్సుల కదలుటయు కదలకుండుటయును, నిన్నున్=ప్రత్యగాత్మస్వరూ పుఁడ వగు నిన్ను, తవులవు=అంటవు, నీవు=కూటస్థుఁడ వగు నీవు, సత తంబున్=ఎల్లప్పుడును, వాని = ఆ మనస్సును ఇంద్రియములను, ఎఱుంగు చుండు= తెలిసికొనెడు, సాక్షివి ద్రష్టవు; ఎప్పుడును, హృద... మూర్తివి— హృదయ=మనస్సునకు, ఇంద్రియ=జ్ఞాన కర్మేంద్రియములకును, అవిషయ= గోచరము కానిదియు, కేవల=శుద్ధమైనదియు, నిర్గుణ = త్రిగుణరహితమైన దియు, అగు, మూర్తివి = రూపము గలవాఁడవు, నిర్విశేషచిన్మాత్ర పర బ్రహ్మమ వనుట.

తా. ఆ మనస్సును నింద్రియములును చలింప వయ్యెనా నీవే చలింపకున్నానని భ్రమింపక నిర్మల మగుదృష్టితో నవియె యట్లున్నవని యెఱుంగుము. అవి చలించుటగాని చలింపకుండుటగాని నిన్ను సంబంధింపవు. నీవు వాని నెప్పుడును గనుఁగొనుచుండునట్టి తటస్థుఁడవు మాత్రమే కాని, వానితోడిసంబంధము నీకు లేదు. ఏలన, నీవు మనస్సునకును నింద్రియ

ములకును నగోచరమై కేవలమై త్రిగుణరహితమై యుండు పరబ్రహ్మస్వరూపుఁడవు. ఇట్టి నీకును జడము లగు సామానసాదులకును సంబంధ మేమాత్రమును గలుగదు. ౭౮

సీ. మును దండకారణ్య§మున నొక్కపుణ్యాశ్ర
మమునఁ దాపసవేష § మమరఁ దాల్చి
బ్రహ్మర్షిలోకస§భామధ్యమంబున
నురుసుఖాసీనత § నొప్పుచున్న
ననుఁ జూడఁగాఁగోరి § మునికన్యకలు సీత
ముందట నిడుకొని § ముదిత యితఁడొ
యతఁడొ నీపతి యని § యచటిమౌనులఁ బ్రీతి
విభజించి యడుగ న§వ్వేలఁది సిగ్గు
తే. కలిమి వారల నందఱఁ § గాఁదు కాఁ డ
టంచుఁ దల యూఁచుచుండి న § న్గాంచినప్పు
డొకట నోఁ గాఁ డనక యూర§కుండె నత్తె
అంగుఁ గని సంతసిల్లి రా§రమణు లెల్ల. ౭౯

టీ. మును = తొల్లి, దండకారణ్యమునన్, ఒక్క పుణ్యాశ్రమమునందు, తాపసవేషము = ఋషివేషము, అమరన్ = ఒప్పునట్లు, తాల్చి = ధరించి, బ్రహ్మర్షిలోకసభామధ్యమంబునన్ = బ్రహ్మర్షిసమూహము యొక్క గోష్ఠినడుమ, ఉరుసుఖ ఆసీనతన్ = మిక్కిలి సుఖముగా కూర్చుండుటచేత, ఒప్పుచున్న నన్నున్, మునికన్యకలు = ఋషికన్యకలు, చూడఁగాన్ కోరి, సీతను, ముందట నిడుకొని, ముదిత = సీతా, నీపతి = నీపెనిమిటి, ఇతఁడో అతఁడో, అని, అచటి మౌనులన్ = అచ్చట నున్న ఋషులను, ప్రీతిన్ = సంతోషముతో, విభజించి = వేఱుపఱిచి-వేఱు వేఱ, అడుగన్ = అడుగఁగా, అవ్వేలఁది = ఆ సీత, సిగ్గుకలిమిన్ = లజ్జ

పుట్టుటవలన, వారలర్ అందఱున్ = ఆ ఋషులనెల్లను, కాఁడు కాఁడు అటంచున్ = ఇతఁడు కాఁడు కాఁడని, తల ఊఁచుచున్ ఉండి = తల యాడించుచుండి, నన్ను, కాంచినప్డు = చూచినపుడు, ఒకటిన్ = ఏవిధమునను, ఔను కాఁడు అనక = నాపెనిమిటి ఔననియు కాఁడనియు చెప్పక, ఊరకుండెను; ఆరమణులు ఎల్లన్ = ఆ ఋషికన్య లందఱును, అత్తెఱంగున్ = ఆవిధమును- అట్లూరకుండుటను, కని = చూచి, సంతసిల్లిరి = సంతోషించిరి.

తా. పూర్వము నేను దండకారణ్యమందొక్క పుణ్యాశ్రమమున ఋషివేషముతో బ్రహ్మర్షులనడుమఁ గూర్చుండి యుంటిని. అపుడచ్చటి ఋషికన్యలు నన్నుఁ జూడవలెనని కోరి,సీతను ముందుంచుకొని,యాఋషుల నొక్కరొక్కరిని జూపి 'సీతా! నీమగఁ డితఁడా? అతఁడా?' యని యడుగుచు వచ్చిరి. ఆ సీత సిగ్గుచేత నోరఁజెప్పక తలయాడించి వారెల్లఁ గారు కారని చెప్పుచు వచ్చెను. కడపట నా ఋషికన్యలు నన్నుఁ జూపి యడుగఁగా నాబిడ ఔననియు కాఁడనియుఁ జెప్పక యూరకుండెను. అందుల కాస్త్రీ లందఱును సంతోషించిరి.

మ. స్థిరవైరాగ్య వివేకయుక్త యగు సద్ధీవృత్తి యారీతి న
ప్పరమాభాసున కాత్మచిత్సుఖరసప్రత్యక్షపర్యంతమున్
గరిమన్ దేహగ తేంద్రియాసుహృదహంకారంబులందోఁచు
నా, తన్మరతిన్ నే నది కాను గా ననిన సంతతన్ నిల్చుఁ
గాష్ఠాకృతిన్. ౮౦

టీ. స్థిర...యుక్త—స్థిరవైరాగ్య = దృఢమగు విరక్తితోను, వివేక = ప్రకృతి బ్రహ్మవివేచన రూపజ్ఞానముతోను, యుక్త = కూడినది, అగు, సత్ ధీవృత్తి = శ్రేష్ఠమైన బుద్ధివృత్తి - వృత్తిజ్ఞానము, ఆ రీతిన్ = ఆ సీతవలెనే, ఆ పరమాభాసునకున్ = శ్రేష్ఠుఁడయిన యాప్రత్యగాత్మునకు-

ఆభాసశబ్దముచే బ్రహ్మమునకు ఆభాసస్వరూప మయినవాని కనుటే, ఆత్మ...తముఁ—ఆత్మ = పరబ్రహ్మముయొక్క, చిత్సుఖరస = చిదానందరసముయొక్క, ప్రత్యక్ష పర్యంతేనుఁ = కనఁబడునంతవఱకును, గరిమఁ = గొప్పతనముతోడ, దేహగ...కారంబుఁ—దేహ = స్థూలదేహమందు, గత = పొందఁబడిన, ఇంద్రియ = కన్ను మొదలయిన యింద్రియములందును, అసు = పంచప్రాణములయందును, హృత్ = మనస్సునందును, అహంకారంబులఁ = తానసెడి అహంభావమునందును, తోఁచుఁ=కనఁబడుచుండును, ఆత్మరతిఁ = పరమాత్మయందలి ఆసక్తిచేత, నేను అది కాను కాను అనిరఁ = అదేహేంద్రియాదుఁలందు స్ఫురించెడి బుద్ధివృత్తిని, నేను గా నని నిరసింపఁగా, అంతఁ=పిమ్మట, కాష్ఠాకృతిఁ = మ్రోడువలె, నిల్చుఁ = మనోవృత్తి స్థిరమై యుండును.

తా. ఆప్రత్యగాత్మునకుఁ దనయందలి చిదానందరసము కనఁబడి లభించునంతవఱకును, వైరాగ్యజ్ఞానయుక్తమైనవాని బుద్ధివృత్తి, యాసీతకు ఋషులయందుఁ బతిత్వ మడిగినట్లు, దేహగతములయిన యింద్రియప్రాణాదులయందు నేను నే నని తోఁచుచుండును. అయినను పరమాత్మునియందలి యాసక్తిచేత నా యింద్రియాదులందలి బుద్ధివృత్తి నేను గాను గానని, సీత ఋషులయందుఁ బతిభావము నిషేధించినట్లు నిషేధింపఁగా, నంత సీత నన్నుఁ జూచి యేమియుఁ బలుకక యూరకుండినట్లు, ఆ మనోవృత్తియు లోని సచ్చిదానంద స్వరూపునిఁ * దెలియఁగానే తానును గొయ్యవలె మిక్కిలి నిశ్చలమై పోవును.    ౮౦

* ఇచట ఋషులనఁదుమ ఋషివేషముతో నున్న శ్రీరామునకును జీవులనఁదుమ ఆభాసుఁడై యున్న బ్రహ్మమునకును, వైరాగ్యవివేకయుక్తమగు ధీవృత్తికిని పతిభక్తియుక్త యగు సీతకును, దేహాగతము లయిన యింద్రియప్రాణాదులకును, బ్రహ్మర్షుల సమూహమునకును వారియందు సీపతి

తే. ఆచిదాభాసుఁ డాబుద్ధి నధిగమించి
యాత్మచైతన్యతేజంబునందుఁ దనదు
వెలుఁగు నైక్యంబుఁ జేయ ధీవృత్తి లేక
యెండలో దీప మున్నయ ట్లుండు ననఘ. ౮౧

టీ. అనఘ = పాపరహితుఁడగు ఆంజనేయా, ఆ చిదాభాసుఁడు = ఆ ప్రత్యగాత్మ, ఆ బుద్ధిన్ = ఆ వృత్తిజ్ఞానమును, అధిగమించి = పొంది, ఆత్మ...నందున్—ఆత్మ = పరమాత్మను సంబంధించిన, చైతన్య = విజ్ఞానముయొక్క, తేజంబునందున్ = ప్రకాశమునందు, తనదు వెలుఁగున్ = ప్రత్యగాత్మ యగు తన ప్రకాశమును, ఐక్యంబుఁ జేయన్ = ఒక్కటిగాఁ గూర్పఁగానే, ధీవృత్తి = బుద్ధివృత్తి, లేక = లేనిదై, ఎండలోన్ దీప మున్నట్లు, ఉండును - ఎండలో దీప మున్నను వెలుఁగక లేనిదానివలె నగునట్లు, మనోవృత్తియు పరబ్రహ్మముయొక్క చైతన్యప్రకాశమునందు లేనిదే యగు ననుట, ప్రత్యగాత్మ యాబుద్ధివృత్తిచేత తాను బ్రహ్మమునం దైక్యము నొందఁగానే యావృత్తియు నష్టప్రాయ మగు నని భావము.

---

యా యని ఋషికన్యలు పతిత్వమును బ్రతిపాదించుటకును, ఆ దేహాదుల యందు ఆత్మత్వము తోఁచుటకును, ఋషులయందు సీత పతిత్వమును నిషేధించుటకును, ఇంద్రియాదులందు ఆత్మత్వమును నిషేధించుటకును, రామునిఁ జూచినదే సీత యూరకుండుటకును, లోని చిదానందరసము గాంచినదే యా వృత్తి నిశ్చల మగుటకును, ఔపమ్యము తెలియనది. సీత దృఢభర్తృభక్తియు వివేకమును గలది గావుననే, ఋషులయందు పతిభావము నిషేధించి రామునిం జూచి యూరకుండినది. బుద్ధివృత్తియు దృఢవైరాగ్యవివేకము గలది గావుననే యింద్రియాదులందు ఆత్మత్వము నిరసించి, యాత్మస్వరూపమును జూడఁగానే నిశ్చల మైన దని భావము.

వ. ఇట్లు శరీరేంద్రియ ప్రాణ మనో బుద్ధి సమన్వితం బైన యహంకారంబుతో సహజ తాదాత్మ్యంబు గల స్వాధిష్ఠాన చిదాభాసుండు నిద్రావసరంబున సర్వవ్యాపారంబులఁ జాలించి, శయ్యాతలంబున స్థూలదేహంబు డించి, యింద్రియంబుల విడనాడి, ప్రాణంబులు డిగ్గవిడిచి, మనశ్చిత్తంబుల నహంకారంబునం దడంచి, యయ్యహంకృతిని ధీవృత్తియం దొదిఁగించి, యంతర్ముఖుం డై, యవిద్యాధిష్ఠాన చైతన్య సాన్నిధ్యంబునకు సుఖంబుగా నరిగి, ప్రియ మోద ప్రమోదాది వృత్త్యాత్మకానంద మయ కోశంబునం దనకు నుపాధిభూతం బై నానావిధ వాసనా వాసితం బగు ధీవృత్తి దిగనాడి, యనాద్యనిర్వచనీయాజ్ఞానతమోభిభూతుం డై యంతట నిత్య నిరుపాధిక నిరతిశయ బ్రహ్మానుభవసాగరమగ్నుం డైన చందంబునం బూర్ణాధికారి యై సమాధిసమయంబున మొదల నే దృశ్యంబు గాను ద్రష్ట ననియును ద్రష్టను గాను ద్రష్ట నను వృత్తియు దృశ్యంబు గావున దీనికి ద్రష్టననియు, నివ్విధంబున విజాతీయ ప్రత్యయ తిరస్కార సజాతీయ ప్రత్యయవ్యవహారాంగీకార పూర్వకంబుగాఁ గేవల నిజానందానుభవ పర్యంతం బశేష దృశ్యవృత్తి నిషేధం బొనరించుచు, ధీవృత్తి సాక్షికూటస్థచైతన్యసామీప్యంబునకుఁ జనుచుండ నెప్పు డఖండ సచ్చిదానందస్వరూపాత్మ సాక్షాత్కారం బగునప్పుడు ప్రచండాతపమధ్యనిక్షిప్త కర్పూర దీపంబు భంగిఁ బరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైత

న్యంబులతో నేకీభూతుండై యానందించుచుండు. ఇట్లుండు నతండు తప్పుఁ దాఁ గనుంగొనుచుఁ దనకు నభిముఖుండై యుండమింజేసి యమ్మనంబు జడంబు గావున నివాత దీపంబుభంగిఁ గదలకయుండియు సంకల్పరూపంబుగాఁ బరిణమింపమింజేసి, లేనియ ట్లుండు; నిదియే సహజామనస్కరాజయోగసమాధి, యిదియె జీవన్ముక్తి యని యుపదేశించునెడ నిజ ముఖారవిందంబు విలోకించుచు ముసిముసినగవులు నగు సీతాదేవి నెమ్మొగంబు వీక్షించి, వికసిత వదనకమలుండై యవ్విశుద్ధ సత్త్వబ్రహ్మాత్మైక్య జ్ఞానాకారవృత్తియె యిప్పరమపతివ్రతాశిరోమణి యగుఁ జుమ్మి. నాకు నిత్యానపాయినియు సర్వాభీష్ట ఫలప్రదాయినియు వశవర్తినియు నై యుండు నే నీ ధీవృత్త్యధిష్ఠాన విశుద్ధ చైతన్యంబు మత్స్వరూపానుభవంబు చేయు మని జ్ఞానముద్రచే నభినయించి చూపి క్రమ్మఱ ని ట్లనియె. ౮౦

టీ. ఇట్లు, శరీ...న్వితంబు - శరీర = స్థూలసూక్ష్మకారణము లనెడి త్రివిధ దేహములతోడను, ఇంద్రియ = పది యింద్రియములతోడను, ప్రాణ = దశవిధ ప్రాణములతోడను, మనస్ = మనస్సుతోడను, బుద్ధి = బుద్ధితోడను, సమన్వితంబు = కూడినది, ఐన, అహంకారంబుతోడన్ = కర్తృత్వాత్మకమైన యభిమానముతోడ, సహజ తాదాత్మ్యంబు = స్వభావ సిద్ధమైన అనన్యత్వము - స్వభావముచేత అది తానే యగుటను, కల = కలిగి యున్నట్టి, స్వాధిష్ఠానచిదాభాసుండు = తన కాశ్రయమైన జ్ఞానమునకు ప్రతిబింబరూపుఁడగు జీవుఁడు, నిద్రావసరంబునన్ = సుషుప్తివేళ, సర్వవ్యాపారంబులన్ = పదునాలుగింద్రియములయొక్క ధర్మములను, చాలించి = నిలిపి - వదలి, శయ్యాతలంబునన్ = పఱుపుమీఁద, స్థూల

దేహంబుఁ = స్థూలోపాధిని, డించి = ఉంచి, ఇంద్రియంబులఁ = జ్ఞానకర్మేంద్రియములను, విడనాడి = త్యజించి, ప్రాణంబులఁ = పంచప్రాణములను, డిగ్గవిడిచి = దిగనాడి, మనశ్చిత్తంబులఁ = మనస్సును చిత్తమునను, అహంకారంబునందుఁ = అహమభిమానమునందు, అడంచి = లయింపఁజేసి, ఆ యహంకృతిఁ = ఆయహంకారమును, ధీవృత్తియందుఁ = బుద్ధివృత్తియందు, ఒదిఁగించి = అడఁగించి, అంతర్ముఖుండై = లోపలిప్రక్క మొగము గలవాఁడై—లోచూపు గలిగి, అనఁగా బయటివ్యాపారములు లేక బ్రహ్మమున కభిముఖుఁడై యనుట. అవి...ధ్యంబునకుఁ = అవిద్యా = జీవోపాధి యైన అవిద్యకు, అధిష్ఠాన = ఆశ్రయ మైన, చైతన్య = పరబ్రహ్మముయొక్క, సాన్నిధ్యంబునకుఁ = చేరువకు, సుఖంబుగాఁ, అరిగి = పోయి, ప్రియ...కోశంబునఁ - ప్రియ = ఇష్టవస్తుదర్శనముచేతఁ గలుగునట్టిదియు, మోద = ఇష్టవస్తులాభముచేతఁ గలుగునట్టిదియు, ప్రమోద = అనిష్టవస్తువును అనుభవించుటచేతఁ గలుగునట్టిదియు, ఆది = మొదలుగాఁ గల, వృత్తి ఆత్మక = ఆనందవృత్తులే రూపముగాఁ గల, ఆనందమయ కోశంబునఁ = ఆనందమయకోశంబునందు, తనకుఁ = జీవుఁడగు తనకు, ఉపాధిభూతంబై = బాధాస్వరూపమై, నానా...తంబు - నానావిధ = బహువిధములైన, వాసనా = సంస్కారములచేత, వాసితంబు = వాసింపఁజేయఁబడినది- నానాసంస్కారములతోఁ గూడినది, అగు, ధీవృత్తిఁ = బుద్ధివ్యాపారమును, దిగనాడి = వదలి, అనా...తుండై - అనాది = మొదలులేనిదియు, అనిర్వచనీయ = ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిదియు నగు, అజ్ఞాన = అజ్ఞానమనెడు, తమః = చీఁకటిచేత, అభిభూతుఁడై = క్రిందు పఱుపఁబడినవాఁడై, అంతటఁ = పిదప, నిత్య...మగ్నుండు—నిత్య = కాలత్రయముచేత బాధింపఁబడనిదియు, నిరుపాధిక = కాలాద్యుపాధులు లేనిదియు, నిరతిశయ = సర్వోత్కృష్ట మైనదియు నగు, బ్రహ్మ = పర

బ్రహ్మముయొక్క, అనుభవసాగర = అనుభవించుట యను - అనఁగా బ్రహ్మానందమనెడు సముద్రమునందు, మగ్నుండు = మునిఁగినవాఁడు, ఐనచందంబునన్ = అయినవిధమున - ఇట నిద్రఁ జెందినవానికిని సమాధి నొందినవానికిని సామ్యము చెప్పఁబడినది - నిద్రయందుడిగి పడకపయిని బరుండి యింద్రియాదుల వృత్తులెల్ల నుడిగి యజ్ఞానతమస్సుచేత బ్రుంగుడు వడి బ్రహ్మానందమున మునిఁగియుండునుగదా. అట్లే సమాధియందును బ్రహ్మానందమగ్నతను జెప్పుచున్నాఁడు—పూర్ణాధికారి యై = సాధన చతుష్టయాదుల ననుష్ఠించుటచే నిందు అధికారము గలవాఁడై - అనఁగా బ్రహ్మవిదులందు మిన్నయై, సమాధిసమయంబునన్ = బ్రహ్మనిష్ఠాకాల మందు, మొదలన్ = మొదట, నేన్ = నేను, దృశ్యంబు గాను = కామక్రోధాదులగు లోపలి వెలుపలి దృశ్యములు గానేరను. ద్రష్టను అనియును=వానికి వట్టి సాక్షిమాత్రుఁడ ననియును, ద్రష్టను గాను=సాక్షి కూడఁ గాను, ద్రష్టను అను వృత్తియున్ = సాక్షిని అనెడు తెలివియును, దృశ్యంబు కావునన్ = దృశ్యమే యగుటంబట్టి, దీనికిన్ = ఈ ద్రష్టృ రూప దృశ్యమునకును, ద్రష్టను అనియున్ = సాక్షి ననియును, సమాధి యందు మొదట నేను దృశ్యము గాను, ద్రష్టను అని అనుసంధించును. పిదప ద్రష్టనను తలంపును దృశ్యమె కనుక నదియుఁ గాను ఆ ద్రష్టకును సాక్షిని అని యనుసంధించు నని క్రమము తెలియునది.

ఇవ్విధంబునన్ = ఈ తీరున, విజాతీయ...బుగాన్ - విజాతీయ= తనకంటె వేఱు అనెడు, ప్రత్యయ = తోఁపికలయొక్క - అనఁగా తనకంటె వేఱుగా నున్నవని గ్రహించు శరీరము ఇంద్రియములు, పుత్త్ర మిత్ర కళత్రాదులు మొదలయిన బయటిదృశ్యములయొక్క యనుట, తిర స్కార = నిరాకరించుటయు, సజాతీయ = తనకంటె వేఱుగాని - తానే యనెడి, ప్రత్యయ = తోఁపికలయొక్క - తన శరీర పుత్త్ర మిత్రాదులయొక్క, వ్యవహార = నీవు నీది నేను నాది అనెడు

ఉండమింజేసి = ఉండని కారణంబున, అమ్మనంబు = సర్వకారణమైన ఆమనస్సు, జడంబు గావునన్ = అచేతనము కాఁబట్టి, నివాతదీపంబు భంగిన్ = గాలి తగులని దీపమువలెనే, కదలక = చలింపనిదై, ఉండి యున్ = కలిగియుండియు, సంకల్పరూపముగాన్ = వృత్తిరూపముగా, పరిణమింపమింజేసి = వికారము నొందకుండుటవలన—వ్యాపింపకుండుట చేత ననుట, లేనియట్లుండును = లేనిదానివలెనే యగును—ఆమనస్సు వృత్తిమాలినపుడు ఉండినను లేనట్టిదే యగునని భావము. ఇదియె=ఇట్లుండుటయె—ప్రత్యగాత్మ పరబ్రహ్మలతోడ నైక్య మొంది మనస్సు ఉండియు లేనట్టిదై యుండు స్థితియె, సహ...సమాధి - సహజ=తనంతటఁ గలిగిన, అమనస్క = మనఃశూన్య మైన, రాజయోగసమాధి = రాజయోగనిష్ఠ, ఇదియె, జీవన్ముక్తి = జీవించియుండఁగానే ముక్తి నొందుట - అనఁగా ప్రపంచభ్రాంతి తొలఁగుట, అని, ఉపదేశించు నెడన్ = బోధించునపుడు, నిజముఖారవిందంబున్ = తన మొగముదామరను, విలోకించుచున్ = చూచుచు, మునిమునినగవులు నగు=చిఱునవ్వులు నవ్వుచుండెడు, సీతాదేవి నెమ్మొగంబును, వీక్షించి = చూచి, వికసితవదనకమలుం డై = వికసించినమోముదామర గలవాఁడై, అవ్యి...వృత్తియే - అవ్యిశుద్ధసత్త్వ= మిక్కిలి పరిశుద్ధసత్త్వ మగు, బ్రహ్మ = పరబ్రహ్మముయొక్కయు, ఆత్మ = ప్రత్యగాత్మయొక్కయు, ఐక్యజ్ఞాన = ఏకత్వరూప మగు జ్ఞానమే, ఆకార = రూపముగాఁ గల, వృత్తియె = వృత్తిజ్ఞానమే, ఇప్పరమపతివ్రతాశిరోమణి = పతివ్రతలలో మిన్నయైన యీసీత, అగుఁజుమీ = అవునుసుమా, నాకున్ = పరబ్రహ్మమగు నాకు, నిత్య అనపాయినియున్ = ఎల్లప్పుడు ఎడఁబాయక యుండునదియు, సర్వ అభీష్టఫలప్రదాయినియున్ = అన్ని కోరిన ఫలములను ఒసంగునదియును, వశవర్తినియు = లోఁబడి వర్తించునదియు, ఐ, ఉండు నేను, ఈధీవృ...బున్—ఈధీవృత్తి =ఈ వృత్తిజ్ఞానమునకు, అధిష్ఠాన = ఆధారమైన, విశుద్ధ=నిర్మలమైన, చైతన్యం

బుక్ = పరమాత్మను, మత్ స్వరూప + అనుభవంబు = నాయొక్క సచ్చిదానంద స్వరూపమును అనుభవించుటను - అనఁగా పరామర్శించి యెఱుఁగుటను, చేయుము + అని, జ్ఞానముద్ర చేత్ = ప్రజ్ఞానలక్షణము చేత, అభినయించి = బ్రహ్మభావమును నిరూపించి - బుద్ధిగోచరము గావించి యనుట, చూపి = వానిని కనఁబఱచి, పశ్చాత్ = మఱల, ఇట్లనియెను.

తా. జీవుఁడు నిద్రాసమయమునందు ప్రాణేంద్రియాదులను దిగవిడిచి యంతర్ముఖుఁడై అవిద్యాధిష్ఠానచైతన్యంబునకుఁ బోయి యజ్ఞానతమస్సునకు లోనయి బ్రహ్మానందమున మునిఁగియుండునట్లు పూర్ణాధికారి యగు యోగి సమాధిసమయంబున ఇంద్రియాదివ్యాపారములనెల్ల నుడిగి వెలుపలి దృశ్యములను మొదట నేను గాననియు, లోపలి ద్రష్టయుఁ బిదప నేను గా నని విజాతీయప్రత్యయములను నిరసించి, సజాతీయప్రత్యయముల నంగీకరించుచు, సమస్తములైన దృశ్యముల నిషేధించుచు ధీవృత్తిసాక్షి కూటస్థచైతన్యమునకుఁ బోయి అఖండసచ్చిదానందస్వరూపముం గాంచి యానందమున నోలలాడుచునుండును. అప్పుడు కదు మిక్కుటమైన యెండయందున్న కర్పూరదీపమువలె పరబ్రహ్మముతో నైక్యము నొంది యానందించుచుండును; మఱి తన్నుఁ దాను జూచుచుండును. అప్పుడు పరస్వప్రత్యగాత్మ తన కభిముఖుఁడు కానందున, జడము గాఁబట్టి గాలిలేనిచోట నున్న దీపమువలెఁ గదలకయు సంకల్పరూపముగా వర్తింపకయు నుండుటచేత, నుండియు లేనియట్టిదే యగుచున్నది. ఇదియే సహజామనస్కరాజయోగసమాధి యనియు జీవన్ముక్తి యనియుఁ జెప్పఁబడుచున్నది. విశుద్ధసత్త్వమై బ్రహ్మాత్మలమైక్యమును గుఱించిన జ్ఞానరూపం బగు వృత్తియె యీసీత. ఇది న న్నెప్పుడు వీడక నాపక్షమందే యుండును. ఈధీవృత్తికి అధిష్ఠానమగు శుద్ధచైతన్యమే నేను. నాస్వరూపము ననుభవింపు మని చూపి యిట్లనియె.

౮౨

తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ
యనుచు సతతంబు సత్స్వరూపానుభవముఁ
జేయువారలఁ దక్క నీసీత మిగుల
నెట్టివారలఁ జిక్కులఁ బెట్టు ననఘ. ౮3

టీ. అనఘ = పాపరహితుఁడ వైన హనుమంతా, ఈసీత = సీత యనఁబడు ఈ మూలప్రకృతి, ప్రేమ మీఱంగన్ = ప్రీతి అతిశయించునట్లు, శ్రీరామ రామ రామ అనుచున్, సతతంబు = ఎప్పుడును, సత్స్వరూప అనుభవము=సచ్చిదానంద నిత్య నిర్మలత్వము లనెడు పంచలక్షణములతోఁ గూడిన నాస్వరూపమును అనుభవించుటను, చేయువారలన్ తక్కన్=చేయువారిని దప్ప, ఎట్టివారలన్ = ఎంతటి గొప్పవారి నయినను, మిగులన్=మిక్కిలి, చిక్కులఁ బెట్టును.

తా. హనుమంతా! 'శ్రీరామా! రామా!' యని యెప్పుడును నా స్వరూపము ననుభవించుచుండువారిని దప్పఁ దక్కినవారలను సీత యనెడి యీమూలప్రకృతి నానాభ్రమలందుఁ బెట్టుచుండును. ౮3

సీ. ఉన్నది లే దని యూహింపఁగా నేర్చు
లేనిది కల దని యెన్న నేర్చు
నజడంబు జడమని యూగడింపఁగ నేర్చు
జడ మజడం బని చాట నేర్చు
సుఖము దుఃఖంబుగాఁ జూపి చెప్పఁగ నేర్చు
దుఃఖంబు సుఖ మనఁ దోలుత నేర్చు
నిది యది గా దని యింపుగా నన నేర్చు
నది యిది గా దని యనఁగ నేర్చు
తే. బిదపఁ గలదియె కలదు లేనిదియె లేదు
కడఁగి యజడంబె యజడము జడమ జడము

సుఖమె సుఖము తలంప నసుఖ మసుఖము
అదియె యిది యిది యది యని యాడనేర్చు. ౮౪

టీ. ఉన్నది = సత్యముగా నున్నట్టిదగు పరబ్రహ్మమును, లేదని = లేనిదని - అసత్యమని యనుట, ఊహింపఁగా నేర్చున్ = తర్కింపఁజాలును, లేనిది = అసత్తయిన జగత్తును, కలదు అనన్ = సత్యమని చెప్పుటకు, తెప్ప నేర్చును = చక్కఁగా శక్తిగలది యగును; అజడంబున్ = జ్ఞానమును, జడ మని అజ్ఞాన మని, అగడింపఁగ నేర్చున్ = వికల్పము లాడనేర్చును, జడము = అజ్ఞానమును, అజడం బని = జ్ఞానమని, చాటనేర్చున్ = ప్రక టింపఁజాలును, సుఖమున్ = బ్రహ్మానందమును, దుఃఖంబుగాన్ = సం సారరూప మగు దుఃఖముగా, చూపి, చెప్పఁగ నేర్చును, దుఃఖంబున్ = సంసారరూప మగు దుఃఖమును, సుఖ మనన్ = బ్రహ్మానంద మనుటకు, తొలుతన్ నేర్చున్ = మొదటనే నేర్చినదగును; ఇది = ఈప్రత్యక్స్వ రూపమగు చైతన్యము, అది కాదని = ఆ సర్వవ్యాపకమైన పరబ్రహ్మము కాదని, ఇంపుగాన్ = ఒప్పిదముగా, అన నేర్చును, అది = ఆపర బ్రహ్మము, ఇది గాదని = ఈకూటస్థచైతన్యము గాదని, అనఁగ నేర్చును; పిదపన్ = పిమ్మట, కలదియె = సద్రూపమగుబ్రహ్మమే, కలదు = ఉన్నది, లేనిదియె = అసత్తయిన జగత్తే, లేదు. కడఁగి = ప్రయత్నపడి, అజడంబె అజడము = జ్ఞానమే జ్ఞానము, జడమె జడము = అజ్ఞానమే అజ్ఞానము, సుఖమె సుఖము = బ్రహ్మానందమే ఆనందము; తలఁపన్ = విచారింపఁ గా, అసుఖ మసుఖము = దుఃఖమే దుఃఖము, అదియె ఇది = ఆ పర బ్రహ్మమే ఈప్రత్యగాత్మ, ఇది అది = ఈప్రత్యగాత్మయే ఆ పరబ్రహ్మము, అని, ఆడ నేర్చున్ = చెప్పఁజాలును.

తా. మూలప్రకృతియైన యీసీత, సత్యమైన బ్రహ్మమును అసత్య మని, అసత్తగు జగమును సత్తనియును, అజ్ఞానమును జ్ఞానమనియును, జ్ఞాన

మును అజ్ఞానమనియును, బ్రహ్మానందసుఖమును దుఃఖ మనియు, దుఃఖంబగుసంసారమును సుఖమనియు, ఈప్రత్యగాత్మ పరబ్రహ్మము గాదనియు, ఆపరబ్రహ్మము ఈప్రత్యగాత్మ గాదనియుఁ జెప్ప నేర్చును. కడపట బ్రహ్మమే సత్తనియు, జగత్తే అసత్తనియు, అజ్ఞానమే అజ్ఞానమనియు, జ్ఞానమే జ్ఞానమనియును, బ్రహ్మానందసుఖమే సుఖ మనియు, సంసారదుఃఖమే దుఃఖ మనియు, ఆబ్రహ్మమే యీ ప్రత్యగాత్మ యనియు, ఈ ప్రత్యగాత్మయె యాబ్రహ్మ మనియుఁ జెప్ప నేర్చును. ౨౭౪

వ. అట్లు గావున నతిదుర్ఘటకారిణియు బ్రహ్మాత్మైకత్వ విద్యాస్వరూపిణియు మదీయ యోగమాయాశక్తియు నిత్యానపాయినియుఁ బరమపావనియుఁ బ్రసన్నముఖియు నైన యీసీతాభగవతి నభిముఖిం గావించుకొనుము. నీ కతిశీఘ్రంబుగా నిత్య నిరుపాధిక నిరతిశయ నిర్మల నిజానందానుభవంబు గలుగు నయ్యుపాయంబుఁ జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. ౨౭౫

టీ. అట్లు గావునన్ = అది యట్టిది కాఁబట్టి, అతిదుర్ఘటకారిణియున్ = మిక్కిలి చేయశక్యముగానిదియును, బ్రహ్మ...పిణియున్ - బ్రహ్మ = పరబ్రహ్మమునకును, ఆత్మ = ప్రత్యగాత్మకును, ఏకత్వ = ఐక్యమును దెలిపెడి, విద్యా = జ్ఞానమే, స్వరూపిణియున్ = స్వరూపముగాఁ గలదియు, మదీయ యోగమాయాశక్తియున్ = నాయోగమాయ యనెడి చిచ్ఛక్తియు, నిత్య + అనపాయినియున్ = ఎప్పుడును నన్నెడఁబాయనిదియు, పరమపావనియున్ = మిక్కిలి పవిత్ర మయినదియును, ప్రసన్నముఖియున్ = ప్రసాదముతోఁ గూడినముఖము గలదియు - అనుగ్రహము గలది యనుట, ఐన, ఈ సీతాభగవతిని, అభిముఖిం గావించుకొనుము = ప్రసన్నురాలిని జేసికొనుము. నీకున్, అతిశీఘ్రంబుగాన్,

నిత్య...భవంబు - శాశ్వతమైనదియు, నిరుపాధిక = స్థూలసూక్ష్మకారణోపాధులు లేనిదియు, నిరతిశయ = తనకంటె నతిశయించినది లేనిదియు, నిర్మల = స్వచ్ఛమైనదియు, నిజ = స్వకీయమైనదియు, అగు, ఆనందానుభవంబు = బ్రహ్మానంద మనుభవించుటయును, కలుగును, అయ్యుపాయంబుఁ = ఆనందము లభించునట్టి ఆవెరవును, చెప్పెదను, ఆకర్ణింపుము = వినుము, అని ఇట్లనియెను.

తా. సుగమము. ౮౫

క. గౌరీశివాదు లాత్మా
కారాకారితసువృత్తిగతి నాయందుం
జేరి రమించుచు నుండుట
కారణముగ రామపదము గలిగెఁ నాకున్. ౮౬

టీ. గౌరీశివాదులు = పార్వతి శివుఁడు మొదలగు సకలస్త్రీపురుషులును, ఆత్మ...గతిన్ - ఆత్మాకార=తమ ప్రత్యగాత్మ ఆకారము చేత, ఆకారిత=రూపొందింపఁబడిన, సువృత్తిగతిన్=సంచిదృత్తి(అనఁగా అపరోక్షజ్ఞానము) యొక్క సరణిచేత, నాయందున్=అఖండసత్యజ్ఞానానందస్వరూపుఁడైన నాయందు, చేరి=ఐక్యమునొంది,రమించుచునుండుట= ఆనందించుచుండుటయె,కారణముగన్ =హేతువుగా-అట్లానందించుచుండుటనుబట్టి యనుట, నాకున్=పరమాత్మనైననాకు, రామపదము=రాముఁడను నామము, కలిగెను. 'రమన్తే అస్మిన్నితి రామః' అని వ్యుత్పత్తి.

తా. పార్వతి శివుఁడు మొదలగువారు తమ ప్రత్యగాత్మస్వరూపముగాఁ జేయఁబడిన యపరోక్షజ్ఞానమువలన నాయం దేకత్వము నొంది రమించుచుందురు. కాఁబట్టి నాకు రాముఁ డనునామము గలిగెను. ౮౬

ఆ. జగతి నిట్లు రామశబ్దవాచ్యుఁడనైన
నేను బుధులు బుద్ధి మానసేంద్రి

యాంగముల ననాత్మ యని కడఁద్రోయంగ
మిగులుదును జిదాత్మ నగుచు నెపుడు. ౮౭

టీ. జగతిన్ = భూమియందు, ఇట్లు = ఈ చెప్పఁబడిన విధమున, రామశబ్దవాచ్యుఁడు = రామనామముచేత చెప్పఁదగినవాఁడు, ఐన నేను, బుధులు = పండితులు - బ్రహ్మవిదు లనుట, బుద్ధి మానస ఇంద్రియ అంగ ములన్ = బుద్ధిని మనస్సును ఇంద్రియములను (మూఁడువిధములైన) శరీర ములను, అనాత్మ అని = ఆత్మ కానిదని - అసత్తని, కడఁద్రోయంగన్ = పరిత్యజింపఁగా, ఎపుడును, చిదాత్మ నగుచున్ = స్వయంప్రకాశమానం బగు ఆత్మస్వరూపుఁడనై, మిగులుదున్ = శేషింతును - కనఁబడుదు ననుట.

తా. బ్రహ్మవేత్త లగువారు తమబుద్ధిని మనస్సును నింద్రియములను మూఁడువిధములగు శరీరములను నాత్మ కాదనియు అసత్తనియును ద్రోసి పుచ్చఁగా, రామశబ్దవాచ్యుఁడ నగు నేను మిగతగా వారికిఁ గనఁబడు చుందును. ౮౭

అవ. 'శ్రీరామ రామ రామ' అను మూఁడునామ ములకును వ్యుత్పత్తిని దెలుపుచున్నారు.

క. సారబ్రహ్మాకారా
కారితధీవృత్తి నాకుఁ గలుగుటవలనన్
శ్రీరామనామ మొప్పెను
శ్రీరమణీబ్రహ్మవిద్య శ్రీ యనఁ దగుటన్. ౮౮

టీ. నాకున్, సార...వృత్తి - సార = సత్తామాత్రమైన, బ్రహ్మ + ఆకార = బ్రహ్మముయొక్క ఆకృతిచేత, ఆకారిత = రూపొందింపఁ బడిన, ధీవృత్తి = వృత్తిజ్ఞానము, నాకు కలుగుటవలనన్ = నాకు కలిగియున్నందున, శ్రీరమణీయ = సంపదచేత ఒప్పునట్టి - లేక నిత్య

విభూతి కధిదేవత యగు లక్ష్మీదేవిగా ఒప్పునట్టి, బ్రహ్మవిద్య = బ్రహ్మ
మును దెలుపునట్టి జ్ఞానము, శ్రీ అనన్ తగుటన్ = శ్రీ యని చెప్పఁ దగి
యుండుటచేత, శ్రీరామనామము = శ్రీరాముఁ డను పేరు, ఒప్పెను.

తా. సత్తామాత్రమగు బ్రహ్మాకారముగాఁ జేయఁబడిన వృత్తిజ్ఞానము
నా కెప్పుడు నుండును. ఆబ్రహ్మవిద్య శ్రీ యనఁబడును. కాఁబట్టి అట్టిశ్రీ
చేత రమణీయుఁడనై తత్పదలక్ష్యార్థభూతుఁడనగు నాకు శ్రీరాముఁ డను
పేరు చెల్లెను. ౮౮

తే. తలఁప ధీవృత్తి కే ప్రొద్దు ద్రష్ట నగుచుఁ
ప్రత్యగాత్ముఁడ నైన నా భావ మరసి
తెలియుటకు నొప్పు మఱి యాద్వితీయ రామ
నామము సమస్తవేదాంతధామ మగుచు. ౮౯

టీ. తలఁపన్ = విచారింపఁగా, ధీవృత్తికిన్ = ధీవృత్తిజ్ఞానము
నకు, ఏప్రొద్దు = ఎల్లప్పుడు, ద్రష్టనగుచున్ = సాక్షినై, ప్రత్యగాత్ముఁడ
నైన = కూటస్థుఁడనగు, నాభావము = నాయునికి, అరసి = విమర్శించి,
తెలియుటకున్ = ఎఱుఁగుటకు, మఱి, ఆ ద్వితీయ రామనామము - ఆ =
ప్రసిద్ధమైన, ద్వితీయ = రెండవదియైన, రామనామము = (త్వంపదలక్ష్యార్థ
భూతుండ నగు ప్రత్యగాత్మ నైననాకు) రామశబ్దము, సమస్తవేదాంత
ధామము=సకలమైన ఉపనిషదర్థములకు ఉనికిపట్టు - అనఁగా ప్రణవస్వరూ
పము, అగుచున్, ఒప్పును.

తా. నే నెప్పుడును వృత్తిజ్ఞానమునకు సాక్షి యగు ప్రత్యగాత్ముఁడ
నయి యుండుటను విమర్శించి తెలిసికొనుటకై త్వంపదలక్ష్యార్థభూతుఁడ
నగు నాకు ప్రసిద్ధమైన యా రెండవది యగు 'రామ' నామము సకలవేదాం
తార్థములకుఁ బట్టయి యొప్పుచుండును. శ్రీరామ' 'రామ' యనుచో

మొదటిది తత్పదమునకును రెండవది త్వంపదమునకును లక్ష్యార్థము లని తెలి యునది. ౮౯

తే. ఆతతప్రత్యగాత్ముఁడ నైన నేను
బ్రహ్మరూపుఁడ నని నాస్వభావ మరసి
తెలియుటకు నొప్పుమఱియాతృతీయరామ
నామము క్షరాక్షరవిలక్షణంబు నగుచు. ౯౦

టీ. ఆతతప్రత్యగాత్ముఁడను = విస్తరించి (అంతట నిండియున్న) కూటస్థుఁడను, ఐననేను, బ్రహ్మరూపుఁడను అని = సత్య జ్ఞానానంద స్వరూపుఁడనని, నా స్వభావ మరసి = నాయొక్క ఉనికిని పరిశీలించి, తెలియుటకున్ = ఎఱుఁగుటకు, మఱి = వెండియు, ఆ తృతీయనామ ము = ఆ మూఁడవ రామనామము, క్షర అక్షర విలక్షణంబున్ - క్ష = నశించెడు భూతభౌతికములకంటెను, అక్షర = ఆ భూతభౌతికములయందు వ్యాపకమైన కూటస్థ చైతన్యముకంటెను, విలక్షణంబు నగుచున్ = వ్యతి రిక్తమైనదై - 'అసి' పదమగుచు ననుట, ఒప్పును.

తా. ప్రత్యగాత్ముఁడనై యున్న నేను బ్రహ్మస్వరూపుఁడనే యగు దు నని నాస్వభావము పరిశీలించి తెలిసికొనుటకు మూఁడవదియగు రామ నామము - క్షరాక్షరములకు విలక్షణమై యొప్పుచుండును. ౯౦

తే. ప్రేమచే నిట్లు శ్రీరామ రామ రామ
యనుచు నన్ను భజించు మహాత్ములకును
మిగుల నిత్యానపాయిని యగుచు యోగ
సిద్ధిఁ గావించుచుండు నీ శ్రీవధూటి. ౯౧

టీ. ప్రేమచేత, ఇట్లు = ఈవిధమున, శ్రీరామ రామ రామ అనుచున్, నన్ను భజించు మహాత్ములకున్ = నన్నుఁ గొలిచెడు మహా

మహాత్ములకు, ఈశ్రీవధూటి = బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన యాసీతాదేవి, మిగులన్ = మిక్కిలి, నిత్య అనపాయిని అగుచున్ = ఎల్లప్పుడును ఎడఁబాయక యుండునది యై, యోగసిద్ధిన్ = ఐక్యసిద్ధిని, కావించుచుండున్ = చేయుచుండును.

తా. నన్నిట్లు ప్రేమచేత 'శ్రీరామరామరామ' యని కొలుచుచుండు మహాత్ములను బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన యాసీత యెప్పుడును విడువక వారికి బ్రహ్మముతోడిదైక్యసిద్ధిని గలిగించుచుండును. ౯౧

వ. అట్లు గావున. ౯౨

తా. సుగమము. ౯౩

మ. తలఁపం బూర్ణము నిర్వికారమగుతత్త్వంబిట్లుభాసిల్లఁగాఁ
తెలియన్నేరక మూఢులై నరులు లేకదేహేంద్రియప్రాణబు
ద్ధుల నెల్లప్పుడు నిగ్రహించుటకు నెంతోకోరక్తులై యాత్మవిం
తెలియంజూతురు వారికిం గలుగునేకధీసాక్షి నీక్షింపఁగన్.

టీ. తలఁపన్ = ఆలోచింపఁగా, పూర్ణము = నిండినదియు, నిర్వికారము = వికారములు లేనిదియును, అగుతత్త్వంబు = ఐన బ్రహ్మతత్త్వము, ఇట్లు = ఈమూఁడువిధములయిన రామనామముచేత ననుట, భాసిల్లఁగాన్ = ప్రకాశింపఁగా, మూఢులైన నరులు = అవివేకులగు మనుజులు, తెలియన్ నేరక = దీనిని తెలియ శక్తులుగాక, ఈదే... ద్ధులన్—ఈ మూఁడుదేహములను ఇంద్రియములను ప్రాణములను బుద్ధిని, ఎల్లప్పుడున్ = నిరంతరమును, నిగ్రహించుటకున్ = గెలుచుటకు, ఎంతోరక్తులై = మిక్కిలికోరిక గలవారై, ఆత్మనిన్ = పరమాత్మని - బ్రహ్మము ననుట, తెలియంజూతురు = తెలిసికొనుటకుఁ బ్రయత్నింతురు. వారికిన్ = అట్లు దేహాదులను నిగ్రహించి యాత్మను దెలియఁబూనువారికి,

ధీసాక్షిన్ = బుద్ధికి ద్రష్టయైనపరబ్రహ్మమును ఈక్షింపఁగన్ = దర్శించుటకు, కలుగునే = లభించునా - లభింప దనుట.

తా. పరిపూర్ణమును నిర్వికారము నయినపరబ్రహ్మతత్త్వ మిట్లు 'శ్రీరామ రామ రామ' యని మూఁడు నామరూపములచేతఁ బ్రకాశించుచున్నది. మూఢులు దీనిని దెలియక దేహాదులను నిగ్రహించి యాపరమాత్మునిఁ దెలిసికొనవలయు నని పాటుపడుదురు. ఆవిధమునఁ దెలిసికొనఁ గోరువానికి బుద్ధికి సాక్షి యై యుండు బ్రహ్మమును దర్శింపఁ దరముగాదు. ౯౩

క. సర్వేంద్రియములచేఁ ద
త్సర్వవిషయముల నెఱుంగుచందంబునఁ ద
త్సర్వజ్ఞు సర్వగతునిన్
సర్వమయుం దెలియవచ్చు సమరసదృష్టిన్. ౯౪

టీ. సర్వేంద్రియములచేన్ = సమస్తము లయిన కన్ను చెవి మొదలగు ఇంద్రియములచేత, తత్ సర్వవిషయములన్ = ఆ యింద్రియముల విషయము లయిన శబ్దము స్పర్శము మొదలగువాని నన్నిటిని, ఎఱుంగు చందంబునన్ = తెలిసికొను విధమున, తత్ సర్వజ్ఞున్ = ఆయింద్రియములను ఇంద్రియార్థములను అన్నిటిని దెలిసినవాఁడును, సర్వగతునిన్ = అన్నిటియందును పొందియున్నవానిని, సర్వమయునిన్ = అవి యన్నియును తనస్వరూప మైనవానిని - అనఁగా పరమాత్ముని, సమరసదృష్టిన్ = అభేద దర్శనముచేత, తెలియవచ్చున్ = తెలిసికొనవచ్చును - తనకంటె వేఱు కాదని యెఱుఁగవచ్చు ననుట.

తా. చెవి కన్ను మొదలయిన యాయాయింద్రియములచేత ఆయా విషయముల నెల్లను దెలిసికొనునట్లే, అభేదదృష్టిచేత బ్రహ్మమునుగూడఁ దనకంటె వేఱుగాఁడని తెలిసికొనవచ్చును. ఏలనఁగా బ్రహ్మము, సర్వ

జ్ఞుఁడు, సర్వగతుఁడు. సమస్తమును దానే యైనవాఁడు. కనుక నే సమస్తమును బ్రహ్మమే యని సమరసదృష్టి గలవానికి బ్రహ్మస్వరూపము, ఆయాయింద్రియములకు దానిదానివిషయములవలె నే సులభముగాఁ దెలియ వచ్చును. ౯౩

వ. అట్లు గావున. ౯౪

టీ. అట్లు అభేదదృష్టిచేత బ్రహ్మమును సులభముగాఁ దెలిసికొన వచ్చును గాఁబట్టి.

సీ. ఘటశరావాదిమృత్కార్యజాతంబుల
నెంచి మృత్తిక యని కాంచుపగిది
నమలకుండల కిరీటాది భూషణముల
స్వర్ణం బని యెఱుంగుచందమునను
నసి కుంత శూల చక్రాదికంబుల నెల్ల
నినుమని యరసి కనుఁగొనిన భంగిఁ
బొలుపారు ఫేన బుద్బుద తరంగంబుల
మంచినీ రని విలోకించురీతిఁ

తే. దనరు బహువిధపటములఁ దంతు వనుచుఁ
దెలియుకై వడి మొదలిసంగతియము విడిచి
భ్రాంతిని దొఱంగి సర్వంబు బ్రహ్మ మనుచు
సుఖముగా సంతతంబును జూడు మనఘ. ౯౫

టీ. అనఘ=పాపరహితుఁడగు ఆంజనేయా, ఘట...తంబులన్ - ఘట = కుండ, శరావ = మూఁకుడు, ఆది = మొదలైన, మృత్ కార్య జాతంబులన్ = మట్టితోఁ జేయఁబడినవానియొక్క సమూహములను, ఎంచి = విమర్శించి, మృత్తిక యని = అవియెల్ల మన్నే యని, కాంచు పగిదిన్ = కనుఁగొనునట్లును, అమల కుండల కిరీట ఆది భూషణములన్ =

నిర్మలము లయిన పోఁగులు కిరీటములు మొదలయిన ఆభరణములను, స్వర్ణంబు అని = బంగారమే అని, ఎఱుంగు, చందమునను = విధమునను, అసి... నెల్లన్—అసి = కత్తి, కుంత = ఈఁటె, శూల = శూలము, చక్ర = చక్రము, ఆదికంబులను ఎల్లన్ = మొదలగు ఆయుధములను అన్నిటిని, ఇనుము, అని, అరసి = విమర్శించి, కన్గొనినభంగిన్ = తెలిసి కొన్నవిధమునను, పొలుపారు = ఒప్పిదములైన, ఫేన = నురుఁగులను, బుద్బుద = బుగ్గలను, తరంగములన్ = అలలను, మంచినీరు, అని, విలోకించురీతిన్ = చూచువిధమున, తనరు = ఒప్పుచున్న, బహువిధ పటములన్ = నానావిధములయిన వస్త్రములను, తంతువు అనుచున్ = నూలిపోఁగని, తెలియుకైవడిన్ = ఎఱిఁగినట్లు, మొదలి సందియము = కుండ పోఁగు కత్తి నూ లనెడి మొదటిభ్రమమును, విడిచి = (అనఁగా శరీరము ఇంద్రియములు ప్రాణము లనెడి అనుమానమును) దిగవిడిచి యని యర్థాంతరము. భ్రాంతిని తొలంగి = ఘటాదు లనెడి భ్రమను వీడి, శరీరేంద్రియములు నే ననెడి మోహమును విడిచి యని యర్థాంతరము. సర్వంబున్ బ్రహ్మము అనుచున్ = (కుండ మూఁకుడు మొదలయినవాని నెల్ల ఒక మన్నుగానే గ్రహించినట్లు నానావిధనామరూపములతోఁ దోఁచు) ప్రపంచము నంతయును పరబ్రహ్మమే యని, సంతతంబున్ = ఎల్లపుడును, సుఖముగాన్ = అనాయాసముగా - లేక ఆనందముగా, చూడుము = కన్గొనుము.

తా. కుండ మూఁకుడు మొదలగువానిని మన్నుగాను, పోఁగులు కిరీటములు మొదలగు సొమ్ములెల్ల బంగారముగాను, కత్తి యీఁటె మొదలగు నాయుధముల నెల్ల ఇనుముగాను, నురుఁగు బుగ్గ అలలు మొదలగు వానినెల్ల నీళ్లుగాను, పంచె దుప్పటము కోక పయఁట మొదలగు వస్త్రముల నెల్ల నూలుగాను విమర్శించి తెలియునట్లు, పలువిధములయిన నామ

రూపములతోఁ దోఁచు ప్రపంచమందలి సమస్తవస్తువులను * ఒక్క-బ్రహ్మ మని యెప్పుడు తెలియుచు దేహాదులే నేనని భ్రాంతిని దిగ-విడుచును. ౯౫

సీ. స్థూలశరీరంబు ✽ సుస్థిరంబుగ నుండు
      సకలేంద్రియము లుపశాంతి నొందు
  సన్మనఃపవనముల్ ✽ సంచలింపక యుండుఁ
      గామాదిశత్రువర్గము నశించు
  స్ఫుర దమానిత్వాది ✽ సుగుణముల్ సమకూరు
      ఘనగుణాతీతలక్షణము నొప్పుఁ
  బోలుపారు వైరాగ్యబోధోపరతులు సం
      పూర్ణంబులై మదిఁ ✽ బొదలుచుండుఁ
తే. బరమసుఖవార్ధి యుప్పొంగి ✽ పాఱుచుండు
  ముందట వసించు మోహించి ✽ మోక్షలక్ష్మి
  సంశయము లేక దృఢముగా ✽ సంతతంబు
  సర్వమును బ్రహ్మ మని చూచు ✽ శాంతినిధికి. ౯౬

టీ. సంశయము లేక = సందేహపడక, దృఢముగాన్ = గట్టిగా, సతతంబున్ = ఎల్లప్పుడును, సర్వమున్ = సకలప్రపంచమును, బ్రహ్మము అని, చూచునట్టి, శాంతినిధికిన్ = చిత్తలయమునకు పాత్రుఁడగువానికి-బ్రహ్మనిష్ఠున కనుట. స్థూలశరీరంబు = స్థూలదేహము, సుస్థిరంబుగన్ = మ్రోడువలె నించుకేని మెదలనిదిగా, ఉండును. సకల ఇంద్రియంబులున్ =

---

* ఇచట 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'బ్రహ్మణోఽన్యం న కించన' 'పురుష ఏవేదగ్ం సర్వమ్' 'పురుషాన్న పరం కిఞ్చిత్' 'ఏకో దేవో బహుధా నివిష్టః' 'మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ' 'స దసచ్చాహ మర్జున' ఇత్యాది శ్రుతిస్మృతు లిచట అనుసంధించునది.

సమస్తము లయిన ఇంద్రియములును, ఉపశాంతిఁ బొందుఁ = తమ తమ వ్యాపారము లుడిగియుండును. సత్ మనః పవనములు = శ్రేష్ఠము లయిన మనస్సును ప్రాణాదివాయువులును, సంచలింపకయుండుఁ = మిక్కిలి కదలకుండును. కామ ఆది శత్రువర్గము = కామము మొదలయిన శత్రుసమూహము (అనఁగా కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడు అరిషడ్వర్గము), నశించుఁ = చెడును. స్ఫురత్...గుణముల్ - స్ఫురత్ = స్ఫురించుచున్న, అమానిత్వ = తన్నుఁ దానే పొగడుకొనకుండుట, ఆది = మొదలయిన, సుగుణములు, సమకూఱును, ఘనగుణాతీత లక్షణముఁ = గొప్పవి యగు సత్త్వాదిగుణములను అతిక్రమించినట్టి లక్షణమును - సత్త్వాదిగుణములకు లోపడకుండుట యనుట, లేక, ఘనగుణ = శ్రేష్ఠగుణ మైన సత్త్వమును, అతీత=కడచినట్టి - అనఁగా తుర్యాతీతమైన బ్రహ్మముయొక్క లక్షణమును, ఒదవుఁ = కలుగును, పొలుపు...రతులు- పొలుపారు = ఒప్పుచున్న, వైరాగ్య = ఇహ పర సౌఖ్యములందు రక్తి లేకుండుటయు, బోధ = ఆత్మజ్ఞానమును, ఉపరతులు = సర్వకర్మపరిత్యాగమును, సంపూర్ణంబులై, మదిఁ = మనస్సునందు, పొదలుచుండుఁ= వృద్ధిఁ బొందుచుండును. పరమసుఖవార్ధి = బ్రహ్మానంద మనెడి సముద్రమును, ఉప్పొంగి = వెల్లివిరిసి, పాఱుచుండుఁ = ప్రవహించుచుండును. మోక్షలక్ష్మి = ముక్తికాంత, మోహించి, = వలచి, ముందటఁ = ఎదుటనే, వసించును.

తా. ప్రపంచమందలి నామరూపాత్మకము లగు వస్తువులనెల్ల కుండ పోఁగు గుడ్డ యని నానా విధములుగా సందేహించి భ్రమింపక యవి యన్నియును నొకటేబ్రహ్మ మని దృఢముగాఁ గనుఁగొనుచుండు బ్రహ్మనిష్ఠునకు స్థూలదేహము మోడువలె కదలకుండును. ఇంద్రియములకు తమ తమ వ్యాపారము లుడిగిపోవును. మనస్సును ప్రాణాదివాయువులును చలింపకుండును. కామక్రోధాదులును నశించును. తన్నుఁ దాను పొగడు

కొనకుండుట మొదలయిన సుగుణము లొనగూడును. సత్త్వాది గుణములకు లోను గాకపోవును. వైరాగ్యమును జ్ఞానమును సర్వకర్మపరిత్యాగమును పరిపూర్ణముగా మనస్సునందుఁ గలుగును. బ్రహ్మానందరసము వెల్లువగాఁ బ్రవహించుచుండును. మోక్ష మెదుటనే యున్నట్లు అత్యంతసులభముగా గోచరించుచుండును. ౯౬

క. రాజత్వ మమరినంతనె
భూజనములు వానిఁ జేరి పూజించుగతిన్
రాజిలి సర్వముఁ దనుఁగా
యోజించినయపుడె పొందు నుత్తమగుణముల్. ౯౭

టీ. రాజత్వము = రాచఱికము - రాజగుట, అమరినంతనే = ఒనగూడిన మాత్రముననే, భూజనములు = లోకులు, వానిన్ = ఆ రాజత్వము కలిగిన పురుషుని, చేరి, పూజించుగతిన్ = సమ్మానించునట్లు, రాజిలి = ప్రకాశించి- ఒప్పి, సర్వమున్=సమస్తజగత్తును, తనుఁగాన్ = తన్నుఁగానే - తానే సమస్తప్రపంచ మని అనుట, యోజించినయపుడె = ఎంచినపుడే, ఉత్తమగుణముల్ = సర్వజ్ఞత్వము మొదలయిన గొప్పగుణములు, పొందును.

తా. ఒకపురుషునికి రాజత్వము కలిగినమాత్రముననే లోకు లందఱును వానికడకు వచ్చి పూజించుచుందురు. అట్లే సమస్తము తానే యనెడి యభేదదృష్టి యొకనికిఁ గలుగఁగానే వానిని సమస్తము లయిన గొప్పగుణములును వచ్చి పొందుచున్నవి. ౯౭

తే. తరుణివేషంబుఁ గైకొన్న పురుషుఁ డరయఁ
బురుషుఁ డగుఁగాక పరికింపఁ దరుణి యగునె
జీవభావంబుఁ జేకొన్న కేవలాత్ముఁ
డాత్ముఁ డగుఁగాక మఱి జీవుఁ డగునె తెలియ. ౯౮

**టీ.** అరయన్ = విచారింపఁగా, తరుణివేషంబున్ = స్త్రీవేషమును, కైకొన్న పురుషుఁడు = తాల్చిన మగవాఁడు, పరికింపన్ = వివరింపఁగా, పురుషుఁడు అగుఁగాక = మగవాఁడే యగునుగాని, తరుణి అగునె = స్త్రీ యగునా ? కాఁడనుట, తెలియన్ = విచారింపఁగా, జీవభావంబు = కించిద్‌జ్ఞత్వము మొదలగు గుణములతోఁ గూడిన జీవత్వమును, చేకొన్న కేవలాత్ముఁడు = గ్రహించినట్టి శుద్ధాత్మస్వరూపుఁడగు కూటస్థుఁడు, ఆత్ముఁడు అగుఁగాక = పరమాత్ముఁడు (పరబ్రహ్మము) అగునుగాని, మఱి, జీవుఁడు అగునె = జననమరణాదియుక్తుఁడైన జీవుఁడుగాఁ డనుట. ఘటమందున్న యాకసము ఘటజలమునందుఁ బ్రతిబింబించెడియాకాశము గాక మహాకాశమే యగును. అట్లే పంచావరణములలోపల నున్న కూటస్థబ్రహ్మము పరబ్రహ్మమే యగును గాని మఱొకటి గా దని తాత్పర్యము. ౯౮

తే. దంతిరూపంబుచే నొప్పుదారు వరయ
దారు వగుఁగాక పరికింప దంతి యగునె
విశ్వరూపంబుచేఁ దోఁచువిష్ణుమూర్తి
విష్ణుఁ డగుఁగాక పరికింప విశ్వ మగునె. ౯౯

**టీ.** అరయన్ = పరిశీలింపఁగా, దంతిరూపంబుచేన్ = ఏనుఁగురూపుచేత, ఒప్పు, దారువు = మాను - అనఁగా మ్రానితో చేయఁబడిన యేనుఁగుబొమ్మ, దారువు అగునుగాక = మ్రానే యగునుగాని, పరికింపన్ = విమర్శింపఁగా, దంతి అగునె = నిజమైన ఏనుఁగు అగునా? కాదనుట. విశ్వరూపంబుచేన్ = జగద్రూపముగా - నానానామరూపాత్మక మైనప్రపంచముగా, తోఁచు, విష్ణుమూర్తి = పరబ్రహ్మము, విష్ణుఁడు అగుఁగాక = సర్వవ్యాపకమైన పరబ్రహ్మమే యగునుగాని, పరికింపన్, విశ్వ మగునె = నామరూపాత్మక మగుజగతు అగునా ? కాఁ డనుట.

తా. మ్రానితోఁ జేయఁబడినయేనుఁగు మ్రానే యగును గాని నిజముగా నేనుఁగు గాదు. అట్లే, బ్రహ్మము నానానామరూపాత్మక మైన జగత్తుగా నయినను బ్రహ్మమే యగును గాని, నిజముగా జగత్తు గాదు.

ఉ. వారణమంచు భ్రాంతుఁడగువానికిదారువుదోఁపదాక్రియన్
దారు వటంచుఁగాంచు విహితజ్ఞునకుం బరికింపఁ గల్గునే
వారణ మట్లు సర్వ మనువానికి బ్రహ్మము గానిపింప ద
ట్లూరక బ్రహ్మమంచుఁ గనుయోగికి సర్వముగల్గితోఁచునే.

టీ. వారణ మంచున్ = ఏనుఁగని, భ్రాంతుండగువానికిన్ = భ్రమపడినవానికి, దారువు = మ్రాను, తోఁపదు = అగపడదు, మ్రానితో చేసిన ఏనుఁగును మ్రానే యని తలంపనియెడల అది నిజముగా ఏనుఁగనియే తోఁచు ననుట. ఆక్రియన్ = ఆ విధమున - అట్లు భ్రమించినవానివిధముననే, దారు వటంచున్ = మాను అని, కాంచు = చూచునట్టి, విహితజ్ఞునకున్ = తెలివి గలవానికి - లేక విహితమయినదానిని దెలిసినవానికి, పరికింపన్ = పరిశీలింపఁగా, వారణము = ఏనుఁగు, కల్గునె = ఉండునా- ఉండదనుట. అట్లు = ఆ విధముననే, సర్వమనువానికిన్ = ఇది బ్రహ్మము గాదు - నామరూపాత్మక మగు సమస్తప్రపంచమే యని తోఁచువానికి, బ్రహ్మము, కానిపింపదు = కనఁబడదు. అట్లు, ఊరక, బ్రహ్మమంచున్ = అంతయు బ్రహ్మమే యని, కను యోగికిన్ = కనుఁగొనెడు బ్రహ్మనిష్ఠునకు, సర్వము = నామరూపాత్మక మగు సకలప్రపంచము, కల్గి తోఁచునే = ఉండి కనబడునా! కనఁబడ దనుట.

తా. మ్రానితోఁ జేయఁబడిన బొమ్మను ఏనుఁగని భ్రమసినచో, నది మ్రానుగాఁ దోఁపనియట్లు, కనఁబడుచున్నయిది యంతయు జగత్తని తలంచినవానికి పరబ్రహ్మముగా తోఁపదు. అది యేనుఁగు కాదు, మ్రానే యని నిశ్చయించినవానికి ఏనుఁగు మ్రానే యైనట్లు, జగత్తు గాదు, బ్రహ్మమే యని యెంచువానికి జగ మంతయు బ్రహ్మముగానే తోఁచును. ౧౦౦

వ. అనిన విని హనుమంతుండు సీతారామున కిట్లనియె. ౧౦౧

టీ. సుగమము.

క. మీరలు నుడివినవడువున
నారసి సర్వంబు బ్రహ్మ మని కను ఘనుఁడే
ప్రారబ్ధవ్యవహారం
బేరీతిం జేయు దీని నెఱిఁగింపుఁ డనన్. ౧౦౨

టీ. మీరలు = మీరు, నుడివినవడువునన్ = చెప్పినరీతిని, ఆరసి= విచారించి, సర్వంబున్ = సమస్తమును, బ్రహ్మము, అని, కను ఘనుఁడు = చూచునట్టి గొప్పవాఁడు, ఏ ప్రారబ్ధ వ్యవహారంబున్ = ప్రారంభించి నట్టి ఏ వ్యాపారమును, ఏరీతిన్ = ఏ ప్రకారము, చేయును, దీనిన్= ఈ యర్థమును, ఎఱిఁగింపుఁడు = తెలుపుఁడు, అనన్ = అనఁగా.

తా. స్వామీ ! మీరు చెప్పినట్లు తత్త్వవిచారము చేసి సమస్తమును బ్రహ్మముగాఁ జూచునట్టి మహాత్ముఁడు ప్రారంభించిన యే పనిని ఏ విధముగాఁ జేయునో తెలుపఁగోరుచున్నాను. ౧౦౨

వ. అనిన శ్రీరామచంద్రుం డవ్వానరేంద్రుని కిట్లనియె. ౧౦౩

టీ. సుగమము.

చ. ఘట కటకోర్మికా పట నికాయములన్ సువివేకదృష్టిచేఁ
దటుకున మృత్సువర్ణ జలతంతువు లంచు నెఱింగినంతఁ ద
త్స్ఫుటతరనామరూపములు పోవమిఁ నన్నియుఁ గార్యకోటికై
ప్పటివలె వచ్చు వచ్చినను బాధకమున్న దె హేతుదృష్టికిన్.

టీ. ఘట...యములన్ - ఘట = కుండలు, కటక = కడియములు, ఊర్మికా = అలలు, పట = వస్త్రములు - వీనియొక్క, నికాయములన్ = సమూహములను, సువివేకదృష్టిచేన్ = మంచి వివేచనతోడి చూపుచేత -

తత్త్వజ్ఞానదృష్టిచేత, తటుకనన్ = అప్పుడే, మృత్ సువర్ణ జల తంతువు లంచున్ = మన్ను బంగారు జలము నూలిపోఁగులు నని, ఎఱింగినంతన్ = తెలిసికొన్నమాత్రననే, తత్ స్ఫుటాకార నామరూపములు = ఆ ఘటాదుల యొక్క చక్కఁగాఁ దోఁచుచున్న (వాని వాని) పేళ్లును రూపులును పోవమిన్ = నశింపకుండుటవలన, అన్నియును = ఆ నామరూపము లెల్లను, కార్యకోటికిన్ = కార్యసమూహమునకు - వండికొనుట తొడుగు కొనుట మొదలగు కార్యముల కనుట, ఎప్పటివలెన్ పర్వును = పూర్వము వలెనే వాడుకొనుటకు నుపయోగించుచుండును, వచ్చినను = అట్లు వాడు కొనుటకు వచ్చినప్పటికిని, హేతు దృష్టికిన్ = కుండలు మొదలగువానికి-మన్ను మొదలగునవి కారణము లని తెలిసిన చూపునకు, బాధకము ఉన్నదే = విరోధము కలదా? లేదనుట.

తా. కుండలు మొదలగువానిని తత్త్వదృష్టిచేతఁ దటాలున మన్ను మొదలగునవియే యని తెలిసికొన్నతోడనే, యా కుండలు మొదలగు వానికిఁ గల కుండలరూపును కుండయనుపేరును మఱుఁగుపడిపోవునా; కాఁబట్టి, యా కుండలు మొదలగువానిని (కలరూపు తెలిసినపిదపఁ గూడ) వండుట మొదలగు పనుల కుపయోగించుకొనుచుందురు. అట్లాపనుల వాడుచున్నను, అవియెల్ల మన్ను మొదలగునవియే యగు నని వానికారణ మును దెలిసికొని యుండుటవలన, నవి యా కారణదృష్టిని బాధింపఁజాలవు.

శా. ఆరీతిన్ సకలంబు తత్త్వమని దివ్యాధ్యాత్మయోగంబుచే
నారూఢింగనుయోగి కెయ్యెడఁ దదీయాంగేంద్రియాత్మా
ళికిం, బ్రారబ్ధానుభవంబు గల్గునటు లోకవ్యాపారంగఁ దా
ద్రష్టయై, సారోదారవిచారదృష్టి నరయున్ క సర్వంబు
బ్రహ్మంబుగాన్. ౧౦౫

టీ. ఆరీతిఁ = అట్లు, సకలంబుఁ = సమస్త ప్రపంచమును, తత్త్వము = బ్రహ్మము, అని, దివ్య అధ్యాత్మ యోగంబుచేఁ - దివ్య = అప్రాకృతమైన, అధ్యాత్మయోగంబుచేఁ = ఆత్మవిషయక మగు సమాధి చేత - లేక జీవేశ్వరైక్యజ్ఞానముచేత, ఆరూఢిఁ = నిశ్చయముగా, కను యోగికిఁ = చూచెడు యోగికి, ఎయ్యెడఁ = ఏ స్థలమునను, తదీ... శికిఁ - తదీయ = ఆ బ్రహ్మజ్ఞానిదైన, అంగ = శరీరముయొక్కయు, ఇంద్రియ = ఇంద్రియములయొక్కయు, ఆత్మ = బుద్ధియొక్కయు, ఆళికిఁ = గుంపునకు, ప్రారబ్ధ అనుభవంబు = తాత్కాలికమైన ప్రారబ్ధ కర్మముయొక్క అనుభవించుట, కల్గును; అటులు ఒప్పారంగఁ = అట్లు దేహాదులకు ప్రారబ్ధకర్మములు కల్గుచున్నను, తాను = ఆ బ్రహ్మవేత్త, ద్రష్టయై = సాక్షియై, సార ఉదార విచారదృష్టిఁ = శ్రేష్ఠమును గంభీరము నయిన వివేకజ్ఞానముచేత - ఆత్మానాత్మ విచారమును మిక్కిలి దృఢముగాను లోఁతుగాను జేయుటచేత ననుట, సర్వంబుఁ = అంతయును, బ్రహ్మంబుగాఁ = పరమాత్మగానే, అరయుఁ = ఎంచును.

తా. ఆ విధమున యోగి యగువాఁడు సకల నామరూపాత్మక ప్రపంచమును తత్త్వం బగు పరబ్రహ్మమే కాని మఱియొకటి గాదని యధ్యాత్మయోగముచే కనుఁగొనునుగాని, వాని శరీరాదులకుఁ బ్రారబ్ధము మాత్ర మనుభవించుచుండుట మానదు. అట్టి తత్త్వదృష్టి గలవానికిని ప్రారబ్ధ మనుభవమందే యుండినను వాఁడు దానిచే భ్రాంతి నొందక యాత్మానాత్మవిచారము మిక్కిలి దీర్ఘముగాను దృఢముగాను జేసి, వివేక దృష్టి నొంది సకలప్రపంచమును బ్రహ్మముగానే కనుఁగొనుచుండును.

శా. గానంబుఁ నటనంబుఁ దాళగతులం బ్రీగావించుచుం జారు
వి,ద్యాన్నై పుణ్యముఁ జూపుచుఁ శిరముమీఁదం గల్గువెం
ద్రాంతరం, బూనం గైకొను నాట్యశీలునిగతిఁ బ్రబుంఖాను

పుంఖోజ్జ్వల, న్నానార్థానుభవజ్ఞుఁ డయ్యు బుధుఁ డానం
దాత్ముఁ గాంచున్ మదిన్. ౧౦౬

టీ. గానంబున్ = పాటను, నటనంబున్ = ఆటను, * తాళ గతులన్ = ధ్రువము మొదలయిన తాళములకుఁ గల అనుద్రుతము మొదలయిన మార్గములచేత, కావించుచున్ = చేయుచు, చారువిద్యానైపుణ్యమున్, చారు = ఒప్పిదమైన, విద్యా = (జారు, నొక్కు, డాలు మొదలయిన దశవిధ గమకభేదములతోఁ గూడిన) సంగీత విద్యయందలి, నైపుణ్యమున్ = కౌశలమును, చూపుచున్, శిరముమీఁదన్ = తల పయిని, కల్గు పెన్ దొంతరన్ = ఉన్న పెద్ద కుండలదొంతిని, ఫ్రానన్ = ధరించుటను, కైకొను = చేకొనునట్టి, నాట్యశీలుని గతిన్ = నాట్యమాడు వృత్తి గలవానివిధమున, పుంఖా...డయ్యు—పుంఖానుపుంఖ = పింజ వెంట పింజగా - ఒకటివెనుక నొకటిగా ఎడతెగక, ఉజ్జ్వలత్ = ప్రకాశించుచున్న, నానా = అనేకము లయిన, అర్థ = ఇంద్రియార్థములయందు, అనుభవజ్ఞుఁ డయ్యున్ = సుఖానుభవము గలవాఁడయినను, బుధుఁడు = బ్రహ్మజ్ఞాని, ఆనందాత్మున్ = ఆనందస్వరూపుఁ డయిన పరమాత్ముని, మదిన్ = మనస్సునందు, కాంచును = దర్శించును.

---

* తాళ మనఁగా హస్తద్వయ సంయోగ వియోగంబులు గలిగి, కాల, మార్గ, క్రియ, అంగ, గ్రహ, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము లనెడు పది విధముల ప్రాణములతోఁ గూడిన ధ్రువ, మఠ్య, రూపక, జంపె, త్రిపుట, అటతాళ, ఏకతాళము లని యేడు విధములుగా నుండును. వీనిని, చతురశ్ర త్రిశ్ర మిశ్ర ఖండ సంకీర్ణము లనెడి జాతు లయిదింటిచేత ప్రస్తరింపఁగా ముప్పదియైదు విధము లగుచున్నవి. తాళముయొక్క గతులు ౧, ౨, ౪, ౮, ౧౨, ౧౬, అక్షరకాలములు వరుసగాఁ గల అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాక, పదము లనెడి అంగముల మార్గము లని తెలియునది.

తా. నిపుణుఁడయిన నర్తకుఁడు తలమీదఁ గుండలదొంతి పెద్దదిగా నిడుకొనియే యాడుచును బాడుచును దాళములు వైచుచును దన విద్యా కౌశలమును జూపుచు నానందించునట్లు, తత్త్వవేత్త యగువాఁడు, తండోప తండములుగాఁ గల పెక్కు లింద్రియార్థముల ననుసరించుచున్నవాఁ డయ్యును ఆనందస్వరూపుఁడయిన పరమాత్మని లోపల దర్శించుచునే యుండును. ౧౦౬

చ. స్వకృత విచిత్రపట్టణ మసన్మయమంచు నెఱింగి భ్రాంతినొం
దక యిల నైంద్రజాలికుఁడు దానిసృజించువిధంబునన్ నిజ
ప్రకృతికృతప్రపంచము నభావముగా వివరించి కాంచి త
ద్వికృతులఁ జెందకే ఘనవివేకియొనర్చు సమస్తకార్యముల్.

టీ. ఇలన్ = భూమియందు, ఐంద్రజాలికుఁడు = గారడివాఁడు, స్వకృత విచిత్రపట్టణము = తనచేత నిర్మింపఁబడిన వింతయైన పట్టణము, అసన్మయమంచున్ = కల్ల యని, ఎఱింగి, భ్రాంతినొందక = మోహింపక, దానిన్ = ఆ కల్లపట్టణమును, సృజించువిధంబునన్ = నిర్మించునట్లు, ఘనవివేకి = గొప్పతత్త్వవివేకము గలవాఁడు, నిజ...చనున్ - నిజ = తనదైన, ప్రకృతి = ప్రకృతివికార మగు మనస్సుచేత, కృత = కల్పింపఁబడిన, ప్రపంచమున్ = పంచభూతమయమగు జగత్తును, అభావముగాన్ = లేనిదిగా, వివరించి = విమర్శించి, కాంచి = అట్లే చూచి, తత్ వికృతులన్ = మాయాకృతమైన యాజగత్తుయొక్క వికారములను, చెందకే = పొందకయే, సమస్తకార్యముల్ = ఎల్లపనులను, ఒనర్చున్ = చేయుచుండును.

తా. గారడివాఁడు తా నింద్రజాలముచేత నొకవింతపట్టణమును సృజించి యది కల్లయనిమాత్రము తలఁచి నిజమని భ్రమియక యుండునట్లు, తత్త్వవివేచనము గలవాఁడును తన ప్రకృతిపరిణామ మగు మనస్సుచేతఁ

కల్పింపఁబడిన జగత్తును గల్ల యని తలఁచి దానివికారములకు లోనుగాకయే సకలకార్యములు చేయుచుండును. ౧౦౭

మ. శివజీవైక్యసమాధియందు విలసచ్చిన్మాత్రతత్త్వంబు దా
నవలీలం గని పూర్ణుఁడై పిదప మాయాసంసృతిం జెందినం
దవులన్ నేర్చునె యోగి పాలు పెరుఁగై క్రచ్చంగ వేఱైన యా
నవనీతం బిఁకఁ జల్లలోఁ గలయునే నానాప్రకారంబులన్.

టీ. యోగి = బ్రహ్మవిదుఁడు, శివ...యందున్ - శివ = మంగళస్వరూపుఁడైన పరమాత్మునియొక్కయు, జీవ = కించిద్‌జ్ఞత్వాదిగుణములు లేని ప్రత్యగాత్మ యొక్కయు, ఐక్యసమాధియందున్ = ఏకత్వముతోఁ గూడిన నిర్వికల్ప నిష్ఠయందు, విలసత్ చిన్మాత్ర తత్త్వంబు = ప్రకాశించుచున్న జ్ఞానైకస్వరూపమైన వాస్తవమగు బ్రహ్మమును, తాను, అవలీలన్ = సులువుగా, కని, పూర్ణుఁడై = నిండినవాఁడై - అఖండంబగు పరబ్రహ్మమై యనుట, పిదపన్ = పిమ్మట, మాయాసంసృతిన్ = మాయాకల్పితమగు సంసారమును, చెందినన్ = పొందినను, తవులన్ నేర్చునే = దానిచే కీడ్పడఁగలడా - లేఁడనుట. పాలు, పెరుఁగై = పెరుఁగైన పిమ్మట, క్రచ్చంగన్ = చిలుకఁగా, వేఱైన యా నవనీతంబు = వేఱుగా నేర్పడిన యా వెన్న, ఇఁకన్ = అటుమీఁద - వేఱుపడినపిమ్మట, నానాప్రకారంబులన్ = అనేకవిధములచేతఁగాని, చల్లలోన్ = మజ్జిగలో, కలయునే = చేరునా - చేర దని యర్థము.

తా. జీవుఁడును బ్రహ్మమును నైక్యము నొందెడి నిర్వికల్పసమాధియందు జ్ఞానైకస్వరూపమగు పరబ్రహ్మతత్త్వమును జూచిన యోగి తా నఖండైకరసబ్రహ్మం బగుచున్నాఁడు గాన, పిదప మాయాకల్పితంబయిన యీ సంసారమును బొందినను, దీనియందుఁ దగులు గలిగియుండఁడు. పాలు

పెరుఁగయినపిదప, దానిని జిలుకఁగాఁ బుట్టి వేఱుపడిన వెన్న మరల నే విధమునఁగాని యామజ్జిగలోఁ గలసిపోవనేరదుగదా. ౧౦౮

తే. ప్రజ్వలత్పావకావృతపర్వతంబు
నాశ్రయించునె మృగవిహంగాదికములు
బ్రహ్మమయుఁడై ప్రకాశించుబ్రహ్మవిదుని
నంటునే పుణ్యపాపంబు లాంజనేయ! ౧౦౯

టీ. ఆంజనేయ = హనుమంతా ప్రజ్వ...తంబున్ - ప్రజ్వలత్ = మిక్కిలి మండుచుండెడి, పావక = అగ్గిచేత - అడవినిప్పుచేత ననుట, ఆవృత = ఆవరింపఁబడిన, పర్వతంబున్ = కొండను, మృగవిహగ ఆదికములు = మృగములు పక్షులు మొదలగునవి, ఆశ్రయించునే = చేరునా, చేర వనుట; అట్లే, బ్రహ్మమయుఁడై = బ్రహ్మమే తానై, ప్రకాశించు, బ్రహ్మవిదుని, పుణ్యపాపంబులు, అంటునే = అంట వనుట.

తా. అగ్నిచేత నావరింపఁబడిన పర్వతమును మృగాదులు చేరనట్లు, బ్రహ్మస్వరూపుఁడై ప్రకాశించుచున్న యోగిని పుణ్యపాపకర్మము లంట నేరవు. ౧౦౯

కవిరాజవిరాజితము.

తరణిసమస్తరసంబులఁ గ్రోలుచుఁ దద్రసనిష్ఠవికారములం
బొరయనిచందమునన్ విషయంబులఁ బొందుచుఁ దద్గుణ
దోషములన్, నిరతము నంటక యోగివరుం డతినిర్మల
నిశ్చలమానసుఁడై, పరమసుఖామృతవార్ధిని గ్రుంకుచుఁ
బావనుఁడై విలసిల్లుఁ దగన్. ౧౧౦

టీ. యోగివరుఁడు = మేటియోగి (ఇది కర్త), తరణి = సూర్యుఁడు, సమస్తరసంబులన్ = సకలములయిన నూతులు కొలఁకులు ఏళ్లు మొదలగు వానియందలి జలములను, క్రోలుచున్ = త్రాగుచు, తత్ రసని

వికారములన్ = ఆ జలములం దున్న రుచి రొంపి నాఁచు మొదలగు వికారములను, పొరయని చందమునన్ = పొందని విధమున, విషయంబులన్ = శబ్దస్పర్శాదులను, పొందుచున్ = అనుభవించుచు, తత్ గుణదోషములన్ = వానియందలి రాగాది గుణములను ద్వేషాది దోషములను, నిరతమున్ = ఎప్పుడును, అంటక = తగులక, అతినిర్మల నిశ్చలమానసుఁడై = మిక్కిలి నిర్మలమును గదలనిదియు నగు మనస్సు గలవాఁడై, పరమసుఖ అమృతవార్ధిన్ = మిక్కిలి ఉత్కృష్టమైన బ్రహ్మానంద మనెడు అమృత సముద్రమునందు, క్రుంకుచున్ = ఓలలాడుచు, పావనుఁడై = పరిశుద్ధుఁడై, తగన్, విలసిల్లును. ఈ వృత్తమునకు 'కలయఁగ నొక్క నకారము నాఱు జకారములున్ వమునాటముగా, నలరినచో ద్విరదాచలశైలము లై త్రివిరామము లంది నిర, ర్గళ కవిరాజవిరాజిత వృత్తము రాణ జనార్దన రమ్యకథా, వళులఁ గవీశులు వర్ణనసేయఁగ వ్రాలు నజ్రసము వావిరిగన్.' అనఁగా, న, జ, జ, జ, జ, జ, జ, వ - గణములును, ఎనిమిదింట ఏడింట ఏడింట యతులును నుండవలయును.

తా. సూర్యుఁడు వాపీకూపతటాకాదులందలి జలముల నెల్లఁ గిరణములచే గ్రోలినను ఆ జలములందలి కమ్మని ఉప్పన రొంపి మొదలగు గుణములను బొందనియట్లు, గొప్పయోగి యగువాఁడు శబ్దస్పర్శాదులయిన సకల విషయముల ననుభవించుచున్నను, వానియందలి గుణదోషములను దగులక మిక్కిలి నిర్మలంబై చలింపకుండు మనస్సుతో బ్రహ్మానందసముద్రమునఁ దెప్పలఁ దేలుచుండును. ౧౧౦

తోటకవృత్తము.

చారువివేకి యశేషారమహాసం
సారముఁ జెంది యశేసంగత నుండున్
నీరజపత్రము శే నీరము నేత్రా
ద్ధారయ నంటియు శే నంటనిభంగిన్. ౧౧౧

టీ. ఆరయన్ = విచారింపఁగా, చారువివేకి = ఒప్పిదమైన తత్త్వవివేచనము గలవాఁడు, అసార మహాసంసారమున్ = నిస్సారమయిన పెద్ద సంసారమును, చెంది, నీరజపత్రము = తామరాకు, నీరమున్ = జలమును, ఏప్రొద్దున్ = ఎల్లప్పుడు, అంటియున్ అంటనిభంగిన్ = తాఁకియుఁ దాఁకకుండు విధమున, అసంగతన్ = సంగము లేనివాఁడై, ఉండును.

తా. తత్త్వముల వివేచించి లెస్సగాఁ దెలిసికొన్న జ్ఞాని, నిస్సారమయిన యీపెనుసంసారమును బొందినను, తామరాకు జలమందే యెప్పుడు నుండినను దాని నంటి యంటకుండునట్లు, తాను గొంచెమైనను తగులు లేకయే యుండును. ౧౧౧

ఆ. పావకుండు సర్వభక్షకుం డయ్యు ని
ర్దోషుఁ డైనభంగి దూరదర్శి
విషయరాగి యయ్యు వీతరాగియు నై వె
లుంగుచుండు ముక్తసంగు డగుచు. ౧౧౨

టీ. పావకుండు = అగ్ని, సర్వభక్షకుం డయ్యున్ = అన్నిటిని భక్షించువాఁడయినను, నిర్దోషుఁ డైనభంగిన్ = దోషము లేనివాఁ డయినట్లు, దూరదర్శి = దీర్ఘమగు తత్త్వదృష్టి గలవాఁడు - బ్రహ్మవిదుఁ డనుట, విషయరాగి యయ్యున్ = శబ్దాది విషయములందే రంజిల్లుచున్నవాఁ డయ్యును, వీతరాగియు నై = ఆ రంజన లేనివాఁడుగాను నయి, ముక్తసంగుఁ డగుచున్ = విడివడిన సంగము గలవాఁడై, వెలుంగుచుండును.

తా. అగ్ని సమస్తమును భక్షించుచున్నను దోషము పొందనియట్లు బ్రహ్మవిదుఁడు సకలవిషయముల ననుభవించుచున్నను వానియందు సంగము లేనివాఁడుగాన దోషము నొందకుండును. ౧౧౨

తే. తనరు సాత్త్విక రాజస తామసములఁ
బొంది పొందఁడు నిర్గుణానందపరుఁడు

మంటి నంటియు నంటక యొంటి మెలఁగు
విమలమృత్కీటకంబుచందమున ననఘ! ౧౧౩

టీ. **అనఘ** = పాపరహితా - హనుమంతా, **మంటిని, అంటి** యును అంటక, ఒంటి = ప్రత్యేకముగా, మెలఁగు = తిరిగెడు, విమల = నిర్మలమైన - మంటితో మిశ్రమములేని యనుట, మృత్కీటకంబుచంద మునన్ = కుమ్మరపురుగు విధమున, నిర్గుణ + ఆనందపరుఁడు = మూఁడు గుణములును లేని బ్రహ్మానందమందు ఆసక్తుఁడయినవాఁడు - బ్రహ్మనిష్ఠుఁ డనుట, తనరు...ములన్ - తనరు = ఒప్పుచున్న, సాత్త్విక రాజస తామసములన్ = ప్రకృత్యాత్మకము లయిన సత్త్వరజస్తమోగుణ వికా రములను, పొంది పొందఁడు = తగిలియు తగులకయే యుండును.

తా. కుమ్మరపురుగు మంటి నంటియున్నను దాని నంటక తాను నిర్మలముగానే యుండునట్లు నిర్గుణంబగు బ్రహ్మానందమునఁ జేరినట్టి వాఁడు ప్రకృతిగుణముల సత్త్వాది వికారములను దగిలినను దగులక తాను నిర్మలముగానే యొప్పుచుండును. ౧౧౩

చ. పరపురుషానురక్తి గలభామిని యెల్లపనుల్ గృహంబునం
బొరిఁబొరిఁ జేయుచుం బ్రియునిఁ బొందునుఖంబుగఁ జూచురీతి
భా, స్వర పరతత్త్వవేది నిజవర్ణ నిజాశ్రమ యోగ్యధర్మ
ముల్, నిరతము సల్పుచుం బరమనిర్మలసౌఖ్యము గాం
చు నెమ్మదిన్. ౧౧౪

టీ. **పరపురుష అనురక్తి** = ఇతరపురుషునియందు వలపు, **కల, భామిని** = స్త్రీ - అనఁగా జారిణి, గృహంబునన్ = ఇంటియందు, **ఎల్ల పనులు** = అన్ని కార్యములను, **పొరిన్ పొరిన్** = క్రమముగా, **చేయు చున్, ప్రియునిపొందున్** = ఆ జారపురుషునిసమాగమమును, సుఖముగన్, **ఎంచురీతిన్** = తలఁచునట్లు, భాస్వర పరతత్త్వవేది = ప్రకాశించుచున్న

పరబ్రహ్మము నెఱింగినవాఁడు - బ్రహ్మవేత్త, నిజ...ధర్మముల్ = తన దయిన వర్ణమునకును దన దయిన యాశ్రమమునకును దగిన, విహితకార్యములను, నిరతము = ఎల్లప్పుడు, సల్పుచున్ = చేయుచు, నెమ్మదిన్ = స్వస్థమగు మనస్సుతో, పరమ నిర్మల సౌఖ్యమున్ = మిక్కిలి గొప్పదియు ఆణవ కార్మిక మాయామలములు లేనట్టిదియు నగు బ్రహ్మానందమును, కాంచున్ = పొందును.

తా. ఒక స్త్రీకి పరపురుషునియందు వలపు గలిగి యుండుటంబట్టి, తనయింటఁ బను లన్ని చేసికొనుచున్నను వానియందు మనస్సులేక, యాపురుషుని పొత్తే సుఖముగ నెన్నుచుండును. అట్లే, పరతత్త్వస్వరూపమును నెఱింగిన యోగి, తన వర్ణధర్మములను ఆశ్రమధర్మములను అనుష్ఠించుచునే యున్నను వానియందు మనస్సు చెల్లింపక లోపల బ్రహ్మానందము నే యనుభవించుచుండును. ౧౧౪

వ. అట్టి మహానుభావుండు ప్రారబ్ధవశంబుచే స్వవర్ణాశ్రమోచితధర్మంబులయందుఁ బ్రవర్తించుసమయంబున. ౧౧౫

టీ. అట్టి మహానుభావుండు = అట్టి మహాత్ముఁ డయిన బ్రహ్మవిదుఁడు, ప్రారబ్ధ వశంబుచేన్ = పూర్వము చేసిన సంచిత కర్మము యొక్క శేషమై తా ననుభవించుచున్న కర్మములకు లోనయి యుండుటం బట్టి, స్వవర్ణాశ్రమోచిత ధర్మంబులయందున్ = తనవర్ణమునకును ఆశ్రమమునకును దగిన విహితకర్మములందు, ప్రవర్తించు సమయంబున = ప్రవర్తించుచుండఁగా - బ్రహ్మనిష్ఠుఁడు సమస్త కర్మబంధములకు దూరుఁడయినను ప్రారబ్ధము మాత్రము వదలదు గాన, వానిని దేహావధివఱకు ననుభవించియె తీఱవలయు నని తెలియునది. ౧౧౫

## ద్విరదగతిరగడ

మొదలు సరిగాఁగ నను మోదమును ఖేదమును
వదలుకొనియుండుఁ బర వాదమును భేదమును
గలఁకపడి సల్పఁడు వి కర్మమును గర్మమును
దలఁపఁ డొకయించుక య ధర్మమును ఘర్మమును
మరులుకొని చేయఁ డభి మానమును మానమును
మఱచియును మానఁ డతి మానమును జ్ఞానమును
గ్రందుకొని పొందఁడు సు కాంతలను వింతలను
జెందఁ డతిదుర్విషయ చింతలను వంతలను
సొలయక జయించు నతి సుప్తియు సుసుప్తియును
దెలిసి కను నాత్మసుఖ తృప్తియును జ్ఞప్తియును
లౌల్యమతిఁ దాల్పఁ డభి లాషమును వేషమును
దుల్యముగఁ గాంచు ఘన తోషమును రోషమును
జెలులపై నుంపఁ డిల స్నేహమును మోహమును
దెలియఁ డిది సత్యమని దేహమును గేహమును
విరసముగ నెంచు నల విత్తముల మొత్తముల
సరసముగ నెంచు మది సత్తములఁ జిత్తముల
భ్రమగొని భజింపఁ డిలఁ బౌత్త్రులను బుత్త్రులను
సమముగఁ దలంచు నురు శత్రులను మిత్రులను
గర మభిలషింపఁ డొక కల్మియును బల్మియును
సిరి యనుకొనుఁ బుధుల చెల్మియును దాల్మియును
సడలఁ డొకయింతయును శాంతియును దాంతియును
గడ కరుగనీఁడు ముఖ కాంతియును తౌంతియును

బ్రాపనుచుఁ జూచు గురుభక్తియు విరక్తియును
నోపిక నెఱుఁగు శ్రుతియుక్తియును ముక్తియును. ౧౧౬

టీ. మొదలు = మొట్టమొదట, మోదముఁ = కోరిన వస్తులాభము వలని సంతోషమును, ఖేదముఁ = అది లభింపమివలనఁ గలుగు దుఃఖమును, సరిగాఁగఁ = సమానముగానే, కనుచు; పరవాదమును = ఇతరుల తోడి కలహమును - లేక యితర మతములవారితోడి వివాదమును, భేదమును = బ్రహ్మముకంటె వేఱు కలదనెడి భేదబుద్ధియు, వదలుకొనియుండును; వికర్మమును = నిషిద్ధములగు కర్మమును, కర్మమును = విహితకర్మమును, కలఁకపడి = తబ్బిబ్బుపడి - సందేహము నొంది - అనఁగా నిది విహితమో అది విహితమో యని తెలియక, సల్పఁడు = చేయఁడు - లేక వికర్మమనఁగా కర్మపరిత్యాగమును, కర్మమనఁగా కర్మానుష్ఠానము నని గ్రహించినచో కర్మత్యాగము మేలో కర్మానుష్ఠానము మేలో యని సందేహపడి యిది యది చేయఁడనుట - రెంటిని స్వాభావికముగానే చేయుచు నుండునని భావము; అధర్మముఁ = పాపమును, ధర్మముఁ = పుణ్యమును, ఒకయించుక = కొంచెమైనను, తలఁపఁడు; అభిమానమును = పుత్త్రమిత్ర కళత్రాదులు తనవియని తప్పఁదలంచునట్టి బుద్ధివృత్తిని, మానమును= దేహమే తా ననెడి యహంబుద్ధిని (అంతఃకరణవృత్తి ననుట), మరులుకొని = మైమఱచి, చేయఁడు, అతిమానమును = నిర్వ్యాసనామానమును- కాష్ఠమానము ననుట, జ్ఞానమును = ఆత్మజ్ఞానమును, మఱచియును మానఁడు = ఏమఱుపాటునఁగూడ విడువఁడు, సుకాంతలను = సొగసుకత్తెలయిన స్త్రీలను, వింతలను = విచిత్రములయిన యితరభోగ్యవస్తువులను, క్రందుకొని = సందడిగాఁ జొచ్చి - ఇది యది యని వ్యక్తినియమమును సంఖ్యానియమమును లేక యనుట, పొందఁడు = అనుభవింపఁడు; అతి దుర్విషయ చింతలను = మిక్కిలి దుష్టము లగు నర్థములను గుఱించిన విచా

రములను, వంతలను = తక్కిన లేనిపోని చింతలను, చెందఁడు = పొందఁడు; అతిసుషుప్తియును = (ఆవరణజన్యమైన) గాఢనిద్రావస్థను, అసుప్తియును=నిదురలేమిని, విక్షేపశక్తిజన్యమైన జాగ్రదవస్థను, సొలయక = వెనుదీయక - గట్టిపూనికతో ననుట, జయించును = నిగ్రహించును; ఆత్మసుఖ తృప్తియును = ప్రత్యగాత్మయొక్క ఆనందానుభవమువలని తుష్టిని, జ్ఞప్తియును = జీవబ్రహ్మైక్యజ్ఞానమును, తెలిసి కనుక = విచారించి కనుఁగొనును; అభిలాషమును = కోర్కిని, వేషమును = ఆయా రూపమును, లౌల్యమతిని = చపలబుద్ధితోడ, తాల్పఁడు = ధరింపఁడు; ఘనతోషమును = మిక్కుటమయిన సంతోషమును, రోషమును = కోపమును, తుల్యముగాన్ = సమానముగ, కాంచును = కనుఁగొనును; ఇలన్ = భూమియందు, చెలులపైన్ = స్నేహితులయందు, స్నేహమును = చెలిమియును, మోహమును = వలపును, ఉంపఁడు; దేహమును, గేహమును = గృహమును, ఇది సత్యము అని = ఇది నిజము - కల్ల కాదని, తెలియఁడు= గ్రహింపఁడు - దేహగేహములను సత్యములుగా భావింపఁడనుట. అలవిత్తముల మొత్తములన్ = ప్రసిద్ధము లగు ధనములసమూహములను - లేక ధనములను, తక్కిన బంధుసమూహములను, విరసముగన్ = నిస్సారముగా, ఎంచును; సత్తములన్ = మిక్కిలి సత్తయినవారిని - సాక్షాత్కారానుసంధానవిష్ఠను, నరసముగన్ = అఖండైక రసస్థితిచేత, ఒక్కటే యని, మదిన్ = మనస్సునందు, ఎంచును, పౌత్త్రులను పుత్త్రులను = మనుమలను కొడుకులను, ఇలన్ = భూమియందు, భ్రమగొని = మోహపడి - నా మనుమలు నా బిడ్డ లని మమకారముతో ననుట, భజింపఁడు = పొందఁడు - చేరఁ డనుట; ఉరుశత్రులను = గొప్పపగవారిని, మిత్రులను = చెలికాండ్రను, సమముగన్, తలంచును; ఒక కల్మియును = ఒక సంపదను, బల్మియును = బలమును, కరము = మిక్కిలి, అభిలషింపఁడు = కోరఁడు; బుధుల చెల్మియును = బ్రహ్మవిదు లగువారి స్నేహమును,

తాల్మియును = ఓరుపును, సిరి అనుకొనును = తనకు ఐశ్వర్యమని తలంచును, శాంతియును = అంతరింద్రియ నిగ్రహమును, దాంతియు = బహిరింద్రియ నిగ్రహమును, ఒక యింతయును = కొంచెమైనను, సడలఁడు = వదలఁడు; ముఖకాంతియును = ముఖతేజస్సును - అనఁగా ఆత్మప్రసన్నతా స్ఫురణమును, క్షాంతియును = తాలిమియును, కడకున్, అరుగనీయఁడు = తొలఁగిపోనీయఁడు; గురుభక్తియును అపరోక్ష జ్ఞానోపదేశకునియందలివిశ్వాసమును, విరక్తియున్ = ఇహపరభోగములందు రక్తిలేమియును, ప్రాపు = దిక్కు, అనుచున్, చూచును; శ్రుతియుక్తియును = సగుణ నిర్గుణ శోధక ఘటకాది శ్రుతులకుఁ గల సామరస్యమును, లేక తత్త్వమస్యాది వేదాంత వాక్యములందు ప్రతిపాదిత మైన జీవబ్రహ్మైక్య యోగమును, ముక్తియును = జీవన్ముక్తిని విదేహముక్తిని, ఓపికన్ ఎఱుంగును = ఓపికతోఁ దెలిసికొనును. ద్విరదగతిరగడకు 'కర మొప్పఁ బంచ లఘు గణచతుష్టయముచే, విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే' అనఁగా నాల్గునలలును రెండునలలపయిని యతియు నుండవలయు నని లక్షణము తెలియునది. ౧౧౬

వ. అని మఱియు నిది శాస్త్రోక్తప్రకారం బింక ననుభవంబు వినుము. ౧౧౭

టీ. అని, మఱియును, ఇది = ఇప్పుడు చెప్పినది, శాస్త్రోక్తప్రకారంబు = ఉత్తరమీమాంసాశాస్త్రమందుఁ జెప్పఁబడిన మార్గము; ఇఁక, అనుభవంబు = ప్రత్యక్షాదులమూల మగు అనుభోగమును వినుము. ౧౧౭

మ. తలఁపన్ గాఢవిరక్తియున్ స్ఫుటతరాద్వైతాత్మవిజ్ఞానము, జ్జ్వలసర్వేంద్రియమానసోపరతియున్ సంపూర్ణమై నిత్యమున్, వెలయంగాఁ దనుఁ గాంచు కేవలునకుఁ

‡విశ్వంబు చూపట్టునే, కలలోఁ గన్నగజంబు మేలుకొనినం
‡గన్పట్టునే మారుతీ ! ౧౧౮

టీ. మారుతీ = హనుమంతా! తలఁపన్ = విచారింపఁగా, గాఢ విరక్తియున్ = (విషయములందు) దృఢమైన రక్తి లేకపోవుటయు - భేదభ్రమోపపాదకము లయిన అవ్యక్త మహదహంకారాది తత్త్వము లందలి తిరస్కారబుద్ధియు ననియు నర్థము. స్ఫుట...జ్ఞానము - స్ఫుట తర = మిక్కిలి తేటపడిన, అద్వైత = రెండవది లేకున్న, ఆత్మ = పరబ్రహ్మముయొక్క, విజ్ఞానమున్ = చక్కని యెఱుక - పరబ్రహ్మము తప్ప వేఱొక్క తత్త్వము లేదని స్పష్టముగాఁ దెలియుట యనుట, ఉజ్జ్వల...రతియున్ - ఉజ్జ్వల = మిక్కిలి వెలుఁగుచున్న, సర్వ = సమస్తములైన, ఇంద్రియ = ఇంద్రియములయొక్కయు, మానస = మన స్సుయొక్కయు, ఉపరతియున్ = తమతమ వ్యాపారము లుడిగి బ్రహ్మ మందు లయించుటయు, నిత్యమున్ = ఎల్లప్పుడును, సంపూర్ణమై = నిండి, వెలయంగాన్ = ప్రకాశింపఁగా, తనున్ = తన్ను, కాంచు కేవలునకున్ = చూచుకొనెడి శుద్ధబ్రహ్మనిష్ఠునకు, విశ్వంబు = నామరూపాత్మకమై ప్రకృతిమయమగు జగత్తు, చూపట్టునే = కనఁబడునా - కనఁబడదనుట; కలలోన్ = స్వప్నమందు, కన్నగజంబు = చూచిన యేనుఁగు, మేలుకొని నన్, కన్పట్టునే = అగపడునా - అగపడదు. కలలోఁ జూచినయేనుఁగు మేలుకొనఁగా కనఁబడనియట్లు, సంసారభ్రమమందుఁ గాంచిన జగత్తు బ్రహ్మసమాధియందుఁ గనఁబడ దని భావము.

తా. భేదభ్రమాత్మకములగు మహదాదితత్త్వములందు విరక్తినొంది యద్వైతంబగు పరబ్రహ్మ మొక్కటియే సత్తనియు తత్త్వ మనియు చక్కఁగా నెఱిఁగి, సకలములయినయింద్రియములును మనస్సును బ్రహ్మ మందు లయింపఁగా తన్నుఁ గేవలము బ్రహ్మముగా దర్శించుచుండువానికి,

కలలోఁ జూచినయేనుఁగు, మేలుకొనఁగా కనఁబడనియట్లే, నామరూపాత్మక మైన యీ పెద్దజగత్తు కనుపట్టక పోవును. ౧౧౭

వ. ఇంక నొక్క విశేషతాత్పర్యంబు వివరించెద నాకర్ణింపుము. బ్రహ్మవిదుండు బ్రహ్మవిద్వరుండు బ్రహ్మవిద్వరీయుండు బ్రహ్మవిద్వరిష్ఠుం డన మత్స్వరూపతత్త్వజ్ఞులు నలువురు గల రందు దేహేంద్రియాది కర్తృత్వంబును గర్మఫలకాంక్షయు లేక నిత్యనైమిత్తికంబు లైనయజ్ఞ దాన తపఃప్రముఖ వైదికకర్మంబుల యథావిధిగా నాచరించుచుఁ, గామ్యకర్మంబుల విడిచి, శాస్త్రగర్హితంబులు గాని లౌకిక కర్మంబుల యథోచితంబుగా నొనర్చుచుఁ బుత్త్రమిత్రకళత్ర విత్త క్షేత్రాదులయందు వైరాగ్యంబు గలిగి, యదృచ్ఛాలాభసంతుష్టుండుఁ గామ రాగ ద్వేష భయ లోభ మోహ మద మత్సరాది నానావిధ చిత్తవికార రహితుండు సతత విజిత శరీరేంద్రియ ప్రాణాంతఃకరణుండు నిరహంకారుండు నిత్యప్రసన్నచిత్తుండుఁ బరమకారుణికుండుఁ బరమశాంతుండు జ్ఞానవిజ్ఞానసంపన్నుండు నంతస్సుఖుండు నంతరారాముండు నంతఃప్రకాశుండు నాత్మరతుండు నాత్మతృప్తుండు నాత్మసంతుష్టుండు నై సంచరించునతండు బ్రహ్మవిదుండు. మఱియు సకల వైదిక లౌకిక కర్మంబుల విధిపూర్వకంబుగా సన్న్యసించి పూర్వోక్త లక్షణంబుల విలసిల్లి సంప్రాప్తదుఃఖంబులఁ ద్వేషింపక నివృత్తసుఖంబులఁ గోరక ప్రకాశప్రవృత్తి మోహంబుల నుదాసీనుని చందంబునఁ జూచుచు సుఖ దుఃఖ మోహాది కార్యాకార్యగుణంబులయందుఁ జిత్తేంద్రియాది వికార కారణ గుణంబులు

ప్రవర్తించుచుండ వానిచేతం జలింపఁజేయంబడక నిశ్చలుండు సమదుఃఖసుఖుండు స్వస్థుండు సమలోష్టాశ్మకాంచనుండుఁ దుల్యప్రియాప్రియుండు దుల్యనిందాస్తోత్రుండును దుల్యమానావమానుండు దుల్యశత్రుమిత్రపక్షుండు సంపరిత్యక్తసర్వారంభుండు నగు గుణాతీతుండు బ్రహ్మవిద్వరుం డనం దగు మున్ను వివరించిన గుణంబు లన్నియును బ్రకాశించుచుండ సంతత సహజామనస్క రాజయోగనిష్ఠాగరిష్ఠుం డై యెడనెడఁ బరులవలన మేలుకొలుపంబడి కించిదాహారంబు గొనుచు సుప్తుం డై నవాని తెఱంగున విశ్వంబు మఱచి యుండునతండు బ్రహ్మవిద్వరీయుండు. తనవలన నొరులవలనఁ బునరుత్థానంబు లేక బాహ్యాభ్యంతరంబులు మఱచి నిరంతర నిర్వికల్ప సమాధినిష్ఠుం డై పరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుం డై వెలుంగునతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డనందగు. అందు మొదటి యిరువురకుఁ బ్రారబ్ధంబు దోఁచియు మిథ్యాభూతం బై యుండు. పరీయునందుఁ గలిగియు లేకుండు. వరిష్ఠున కేమాత్రంబు లేదు గావున, నమ్మహానుభావుల యనుభవంబులు నీ వడిగినప్పటినుండి యేర్పఱచి చెప్పితిఁగాదే యని వెండియు ని ట్లనియె. ౧౧౯

టీ. ఇందు బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు మొదలగు బ్రహ్మనిష్ఠుల స్వరూపమును వివరించుచున్నారు. ఇంకను = మఱియును, ఒక్క విశేషతాత్పర్యంబుఁ = ఒక్క అతిశయమైన అభిప్రాయమును, వివరించెదను, ఆకర్ణింపుము = వినుము. బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుండు బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, అనఁ = అను పేళ్లు గల, మత్స్వరూపతత్త్వజ్ఞులు = నా స్వరూపముయొక్క కలరూపును ఎఱిఁగిన

వారు, నలువురు కలరు; అందుఁ = ఆ నలువురయందు, దేహ + ఇంద్రియ + ఆదికర్తృత్వంబును = దేహములు ఇంద్రియములు మొదలగువాని యందలి తామే కర్త యనెడి యభిమానమును, కర్మఫలకాంక్షయుఁ = విహితకర్మములయందలి ఫలమును కోరుటయును, లేక * నిత్యనైమిత్తికంబులైన = నిత్యములు నైమిత్తికములు నని రెండువిధము లగు, యజ్ఞ... కర్మంబులు = † యజ్ఞములు దానములు తపములు మొదలగు వేదోక్తము లయిన కర్మములును, యథావిధిగాఁ = విధ్యుక్త ప్రకారమున, ఆచరించుచుఁ, కామ్యకర్మంబులఁ = ఫలాపేక్షతోఁ గూడిన కర్మములను, విడిచి, శాస్త్ర గర్హితంబులు = శాస్త్రములయందు నిందింపఁబడినవి, కాని, లౌకిక కర్మంబులను, యథోచితంబుగాఁ = వేదోక్తక్రమమున, ఒనర్చుచుఁ=చేయుచు, పుత్త్ర...దులయందుఁ = కొడుకులు స్నేహితులు భార్యలు ధనములు భూములు మొదలగువానియందు, వైరాగ్యంబు = విరక్తి, కలిగి, యదృచ్ఛాలాభ సంతుష్టుండును = అప్రయత్నముగ లభించిన వస్తువులచేత సంతోషించువాఁడును, కామ...డును - కామ =

---

* 'స్నానం సన్ధ్యా జపం హోమం స్వాధ్యాయం దేవపూజనమ్ । ఆతిథ్యం వైశ్వదేవంచ సత్కర్మాణి దినేదినే' ఇవి నిత్యకర్మములు. పంచపర్వములు, ప్రతిపదేష్టి స్థాలీపాక జయంతి మన్వాది హరిపద విషువద్గ్రహణ మహాశివరాత్రి వైకుంఠైకాదశీ ప్రభృతులు నైమిత్తికములు.

† యజ్ఞములు :—భూతయజ్ఞము దేవయజ్ఞము పితృయజ్ఞము మనుష్యయజ్ఞము బ్రహ్మయజ్ఞము అని ఐదు. దానములు—'గావ స్సువర్ణ మహిషీ రత్నానిచ సరస్వతీ । తిలాః కన్యా గజాశ్వాశ్చ శయ్యా వస్త్రం తథా క్షితిః । ధాన్యంచ వేశ్యా ఛత్రంచ గృహం సోపస్కరాన్వితం । ఏతాన్యేవ మహాదేవి మహాదానాని షోడశ' అని పదియాఱు. తపస్సులు:—కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగునవి.

శోకయు, రాగ = రక్తియును, ద్వేష = వైరమును, భయ = వెఱపు, లోభ = పిసినితనము, మోహ = అవివేకము, మద = కావరము, మత్సర = మచ్చరము, ఆది = మొదలగు, నానావిధ = బహువిధములైన, చిత్త వికార రహితుండును = మనోవికారములు లేనివాఁడును, సతత...డును- సతత = ఎల్లప్పుడును, విజిత = జయింపఁబడిన, శరీరమును ఇంద్రియములును పంచప్రాణములును అంతఃకరణములు నాలుగును గలవాఁడును, నిరహంకారుండును = అహంభావము లేనివాఁడును, నిత్య ప్రసన్నచిత్తుండును = ఎప్పుడును తేటగానున్న మనస్సు గలవాఁడును, పరమకారుణికుండును = మిక్కిలి దయ గలవాఁడును, * పరమశాంతుండును = మిక్కిలి శుద్ధసత్త్వవృత్తి గలవాఁడును, జ్ఞాన = అధ్యాత్మజ్ఞానమును, విజ్ఞాన = లౌకికజ్ఞానమును, సంపన్నుఁడును = మిక్కిలి కలవాఁడును, అంతస్సుఖుండును = ప్రత్యగాత్మయైన తనయందు చెలిమి గలవాఁడును, అంతరారాముండును = తనయందే రమించుచుండువాఁడును, అంతః ప్రకాశుఁడును = తనయందే ప్రకాశించుచుండువాఁడును, ఆత్మతృప్తుండును = తనపరమాత్మస్వరూపమునందు ప్రీతి గలవాఁడును, ఆత్మతృప్తుండును = తనయందు తానే తృప్తి నొందినవాఁడును, ఆత్మసంతుష్టుఁడు = తనయందు తానే సంతుష్టి నొందినవాఁడును, ఐ, సంచరించునతఁడు = ప్రవర్తించువాఁడు, బ్రహ్మవిదుఁడు = బ్రహ్మవిదుఁ డనఁబడును. మఱియు, సకల వైదిక లౌకిక కర్మంబులను = సమస్తములయిన వేదోక్తకర్మములను లోకసంబంధములయిన కర్మములను, విధిపూర్వకంబుగాన్ = శాస్త్రప్రక్రియను మున్నిడికొని, సన్న్యసించి = దిగవిడిచి, పూర్వోక్త లక్షణం

* శాంతి యనఁగా అంతరింద్రియనిగ్రహమునకును, దాంతి యనఁగా బహిరింద్రియనిగ్రహమునకును జెప్పఁబడుచున్నవి. ఇచ్చట శుద్ధసత్త్వవృత్తిగాఁ దెలియునది.

బులన్ = ముందుఁ జెప్పఁబడిన యదృచ్ఛాలాభసంతుష్టి మొదలగు బ్రహ్మ విదుని లక్షణములచేత, విలసిల్లి = ప్రకాశించి, సంప్రాప్తదుఃఖంబులన్ = కలిగినవంతలను, ద్వేషింపక = విరోధింపక - విరోధముగా గ్రహింపక యనుట, నివృత్తసుఖంబులన్ = నివర్తించిన సుఖములను, కోరక, ప్రకాశ వృత్తిమోహంబులన్ = అహంకారవిషయము లయిన విషయచాంచల్యము లను, ఉదాసీనుని చందంబునన్ = తటస్థునివలె, చూచుచును, సుఖ... యందున్ - సుఖము దుఃఖము మోహము మొదలయిన సత్కార్యముల యొక్కయు దుష్కార్యములయొక్కయు ధర్మములయందు, చిత్త... బులు = మనస్సు ఇంద్రియములు మొదలయిన వానియొక్క వికారములకు హేతువులయిన స్వభావగుణములు, ప్రవర్తించుచుండన్ = జరుగుచుండఁ గా, వానిచేత, చలింపఁజేయఁబడక = కలఁగింపఁబడక, నిశ్చలుండును = చలనము లేనివాఁడును, సమదుఃఖసుఖుండును = దుఃఖమును సుఖమును సమముగాఁ గలవాఁడును, స్వస్థుండును = నెమ్మది గలవాఁడును, సమ లోష్ట అశ్మకాంచనుండును =మట్టిగడ్డయు రాయియు బంగారమును సమ ముగాఁ గలవాఁడును - మట్టిగడ్డ రాయి మొదలగువానియం దెట్లో యట్లే బంగారునందును ఆశలేనివాఁడు ననుట, తుల్యప్రియ అప్రియుండును = ప్రియమును అప్రియమును సమాన మైనవాఁడును, తుల్యనిందాస్తోత్రుం డును=నిందయును స్తోత్రమును సమానమైనవాఁడును, తుల్య మాన అవమా నుండును= గౌరవమును అగౌరవమును సమానమయినవాఁడును, తుల్య... పక్షుండును= శత్రుపక్షమును మిత్రపక్షమును సమానమైనవాఁడును, సం... రంభుండును = లెస్సగా దిగవిడువఁబడిన సమస్తములయిన ప్రయత్న ములు కలవాఁడును, అగు, గుణాతీతుండు = సత్త్వరజస్తమోగుణకార్య మును అతిక్రమించినవాఁడు - గుణకార్యములకు లోపడనివాఁ డనుట, బ్రహ్మ విద్వరుండు, అనఁదగును. మున్ను, వివరించిన, గుణంబులన్నియున్ = నిశ్చలత్వాదిగుణము లెల్లను, ప్రకాశించుచుండన్, సంతత...ష్టుండై -

సంతత = ఎల్లప్పుడును, సహజ = స్వభావసిద్ధమైన - లేనంతనే కలిగెడి, అమనస్క = అమనస్కము అనఁబడు, రాజయోగనిష్ఠా = రాజయోగనిష్ఠయందు, గరిష్ఠుండై = మిక్కిలి గొప్పవాఁడై, ఎడనెడన్ = నడుమ నడుమ - అప్పుడప్పు డనుట, పరులవలనన్ = అన్యులచేత, మేలుకొలుపంబడి = ప్రబోధింపఁబడి, కించిదాహారంబున్ = కొంచెపు ఆహారమును, కొనుచున్ = తీసికొనుచు, సుప్తుండైనవాని తెఱంగునన్ = నిదురించువానివలె, విశ్వంబు=ప్రపంచము (శరీర మనుట), మఱచియుండునతండు, బ్రహ్మవిద్వరీయుఁడు, అనఁబడును. తనవలనను, ఒరులవలనను = ఇతరులవలనను, పునరుత్థానంబు = మరల మేలుకొనుట, లేక, బాహ్యా అంతరంబులు = వెలుపలి లోపలి ప్రపంచములు, మఱచి, నిరం...ష్ఠుఁడై - నిరంతర = ఎడ తెగని, నిర్వికల్ప = వికల్పము లేని - వృత్తిరహిత మైన యనుట. సమాధి = నిష్ఠయందు, నిష్ఠుఁడై = ఉన్నవాఁడై, పరి...త్రుండై - పరిపూర్ణ = నిండిన - అఖండమైన, ప్రత్యక్ అభిన్న = కూటస్థునకంటె వేఱుగాని, పర = సర్వోత్కృష్టమైన, బ్రహ్మచైతన్య = చిద్రూపపరమాత్మునియొక్క, ప్రకాశమాత్రుఁడై = తేజస్సు స్వరూపముగాఁ గలవాఁడై, వెలుంగునతండు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, అనఁబడును. అందు = ఆ బ్రహ్మవిదుఁడు మొదలగువారియందు, మొదటి యిరువురకున్ = మొదటి యిద్దఱయిన బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వరులకు, ప్రారబ్ధంబు = ప్రారబ్ధకర్మము, తోఁచియున్ = కలిగియును, మిథ్యాభూతంబై = అసత్యమై, ఉండును. వరీయునందున్ = బ్రహ్మవిద్వరీయునందు, కలిగియును లేకుండును, వరిష్ఠునకున్ = బ్రహ్మవిద్వరిష్ఠునకు, లేశమాత్రంబు = కొంచెమైనను, ప్రారబ్ధము, లేదు = కలుగదు. కావునన్, ఇమ్మహా... బులు - ఇమ్మహానుభావుల = మహాప్రభావము గల యీ బ్రహ్మవిదుఁడు మొదలగువారియొక్క, అనుభవంబులు = అనుభోగములు, నీవు అడిగి

నప్పటినుండి, ఏర్పఱచి, చెప్పితినిగాదే = బోధించితినిగదా, తెలిసికొమ్ము నుట్టు, అని మరల ఇట్లనియెను.

తా. నా స్వరూపతత్త్వమును దెలిసినవారు - బ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁ డని నలువురు. అందు ఫలాపేక్ష విడిచి విహితకర్మంబు లాచరించుచు అన్నిట విరక్తుఁడై యదృచ్ఛాలాభసంతుష్టి మొదలగు గుణములు గలిగి సంచరించుచుండువాఁడు బ్రహ్మవిదుఁడు. కర్మములన్నిటిని సన్న్యసించి బ్రహ్మవిదునిలక్షణము లెల్లఁ గలిగి సత్త్వాదిగుణకార్యముల నెల్లఁ గడచి యుండువాఁడు బ్రహ్మవిద్వరుఁడు, పూర్వోక్తగుణము లెల్ల సహజామనస్కరాజయోగ సమాధియందు నెలకొనియుండి యప్పుడప్పు డితరులు మేలుకొలుపఁగా లేచి యాహారము కొంచెము గొనుచు నిదురపోవువానివలె జగత్తును మఱచియుండువాఁడు బ్రహ్మవిద్వరీయుఁడు. తనంతటఁగాక పరులచేతం గాని సమాధినుండి మేలుకొనఁబడి లోని వెలిప్రపంచములను మఱచి యెల్లప్పుడును నిర్వికల్పసమాధియందు అఖండపరబ్రహ్మతేజస్స్వరూపుఁడై యుండువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు. మొదటి యిద్దఱియందుఁ బ్రారబ్ధంబుండియు నసత్త్వముగా నుండును. మూఁడవవానియందు నది కలిగియు లేకుండును. నాలవవానియం దేమాత్రము నది యుండదు. ౧౧౯

అవ :— వైరాగ్యబోధోపరతుల తారతమ్యాదులు నిరూపించుట.

తే. అతులవైరాగ్యబోధోపరతులు మూఁడు
గలవు తారతమ్యంబుల నలువురకును
సుఖము లారీతి నించుమించులుగ నలరుఁ
గాని కేవలమోక్ష మొక్కటియె వత్స. ౧౨౦

టీ. వత్స = నాయనా - హనుమంతా! నలువురకును = ఆ బ్రహ్మవిదుఁడు మొదలగు నలుగురికి, మూఁడు, అతుల...రతులు - అతుల =

సాటిలేని, వైరాగ్య = ఇహాముత్రభోగవిరక్తి, బోధ = బ్రహ్మజ్ఞానము, ఉపరతులు = తన్మయత్వమగు స్థితియును, తారతమ్యంబులన్ = ఎక్కువ తక్కువలచేత - అంచఅకును సమానముగాఁ గాదనుట, కలవు = ఉన్నవి. అనఁగా బ్రహ్మవిదునికి విహితకర్మాచరణ ప్రవణత్వమును బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మవిద్వరునికి బ్రహ్మజ్ఞానమును పాశవైరాగ్యమును, బ్రహ్మవిద్వరీయునకుఁ శాశవైరాగ్యమును చిత్తలయమును, బ్రహ్మవిద్వరిష్ఠునకు ఈ మూఁడుగుణములును లేకయుండు నని భావము. సుఖములు = ఆనందములును, ఆ రీతిన్ = ఆ తారతమ్యముల చొప్పున నే, ఇంచుమించులు గన్ = ఒకటికొకటి కొంచె మెక్కువతక్కువలుగా, అలరుఁ గాని = ప్రకాశించును గాని, కేవలమోక్షము = అచ్చమగు ముక్తి, ఒక్కటియె = ఒక్కటే - ఒక్క రూపముగా నుండును. ఎక్కువతక్కువలు కలిగి యుండ దనుట.

తా. ఆ నలువురకును వైరాగ్యము బోధము ఉపరతి యనెడి యీ మూఁడును కొంచె మెక్కువతక్కువలుగా నుండును. వారికిఁ గలుగు ఆనందములు నట్లే యించుమించుగా నుండును. అయినను అచ్చపుమోక్ష మొక్కటే రీతిగానే యుండును. ౧౨౦

తే. వీనిలో బోధ మెక్కుడౌ జ్ఞానమునకుఁ
గడమ రెండును దనసహకారు లరయ
వరుస నీమూఁడు గలిగినవారలకును
గరతలామలకంబు మోక్షంబు వత్స! ౧౨౧

టీ. వత్స = నాయనా! వీనిలోన్ = వైరాగ్యబోధోపరతులు మూఁటిలో, బోధము = అపరోక్షజ్ఞానము, ఎక్కుడు = శ్రేష్ఠమైనది, ఆ జ్ఞానమునకున్ = ఆ బ్రహ్మజ్ఞానమునకు, కడమరెండును = తక్కిన వైరాగ్యమును ఉపరతియును, తగన్, అరయన్ = విచారింపఁగా, సహకా

రులు = తోడయినవి. వరుసన్ = క్రమముగా, ఈ మూఁడు, కలిగినవార లకున్, మోక్షంబు, కరతల + ఆమలకంబు = అరచేతిలోని ఉసిరిక కాయ - అంతస్పష్టముగాఁ దెలియున దనుట.

తా. సుగమము. ౧౨౧

క. అక్షరతత్త్వజ్ఞానము
సాక్షాన్మోక్షప్రదంబు ♩ సాంసారికదుః
ఖక్షయకర మగుఁ దక్కిన
లక్షణములు సుఖకరములు ♩ లలితాత్మలకున్. ౧౨౨

టీ. లలితాత్మలకున్ = ఒప్పిదమయిన మనస్సు గలవారికి, అక్షర తత్త్వజ్ఞానము = నాశములేని బ్రహ్మముయొక్క కలరూపును గుఱించిన యెఱుక - బ్రహ్మముయొక్క యథార్థ స్వరూపమును తెలియుట, సాక్షాత్ + మోక్షప్రదంబు = ప్రత్యక్షముగ ముక్తి నిచ్చునట్టిది; సాంసారిక దుఃఖక్షయకరము=సంసారజన్యము లగు దుఃఖముల నాశమును గలిగించు నది, అగును, తక్కినలక్షణములు = తక్కినవి యగు వైరాగ్యోపరతుల లక్షణములు, సుఖకరములు = ఆనందమును గలిగించునవి, అగును.

తా. నిర్మలాత్మలకు బ్రహ్మస్వరూపజ్ఞానము మోక్షప్రద మయినది. సంసారదుఃఖముల నెల్ల నాశము సేయునది. తక్కినవైరాగ్యాదులును నట్లే యానందకరము లయినవి. ౧౨౨

క. కారణము దోషదృష్టియె
వైరాగ్యమునకు జిహాసకవరరూపము సాం
సారికసుఖముల మరలం
గోరకయుండుటయె సుమ్ము ♩ గురుకార్య మగున్. ౧౨౩

టీ. ఇందు వైరాగ్యమునకు కారణమును స్వరూపమును కార్యమును జెప్పుచున్నారు. వైరాగ్యమునకున్ = ప్రకృతివికృతులయందు విరక్తికి,

దోషదృష్టియె = వానియందుఁ గల దోషములను కనుఁగొనుటయె - అవి జడత్వము సగుణత్వము వికారత్వము ననెడి దోషములు గలిగియున్నవని తెలియుటయే, కారణము = హేతువు; జిహాస = ప్రకృతుల రెంటిని దిగ విడువఁ గోరుటయే, పరరూపము = శ్రేష్ఠమైన యాకారము. సాంసారిక సుఖములన్ = సంసారమువలనఁ గలుగు విషయసుఖములను, తిరుగన్ గోరకయుండుటయె, గురుకార్యము = గొప్పప్రయోజనము అగును. సుమ్మీ = సుమీ.

తా. వైరాగ్యమునకు ప్రకృతివికృతులయందు దోషదృష్టియె మూలము. ఆ రెంటిని దిగవిడుచుటయె యుత్తమమయిన రూపము. అట్లు విడిచి మరల విషయసుఖములను గోరకుండుటయే గొప్పకార్యము. ౧౨౭

మ. శ్రవణాదిత్రితయంబు కారణ మసత్సంవిభాగంబు శు
ద్ధవిబోధంబునకున్ స్వరూపముననాత్మస్వాత్మతాదాత్మ్యవి
సం, భవరాహిత్యము కార్యమాయమముఖాభ్యాసాత్మధీ
నిగ్రహ,వ్యవహారతక్షయముల్ తలంప నుపరత్యాదిస్వరూ
[పార్థముల్. ౧౨౮

టీ. ఇందు బోధమునకును ఉపరతికిని కారణస్వరూపకార్యములు చెప్పుచున్నారు. శుద్ధవిబోధంబునకున్ = పరిశుద్ధమగు బ్రహ్మజ్ఞానమునకు, శ్రవణ + ఆదిత్రితయంబు = శ్రవణము - అనఁగా గురుసమ్ముఖమున వేదాంతశ్రవణము చేయుట మొదలయిన మూఁడును - అనఁగా శ్రవణ మనన నిధిధ్యాసములు మూఁడు ననుట, కారణము = హేతువు, అసత్ సత్ సంవిభాగంబు = అసత్తయిన ప్రకృతియొక్కయు సత్తయిన పరబ్రహ్మముయొక్కయు వివేచనమును, స్వరూపము = (ఆ బోధమునకు) ఆకారము, అనాత్మ...హిత్యము - అనాత్మ = ప్రకృతికిని, స్వాత్మ = పరమాత్మ యగుతనకును, తాదాత్మ్య = ఒకటియె యగుటయొక్క - ఐక్యము

యొక్క యనుట, సంభవ = కలుగుటయొక్క, రాహిత్యము = లేమి యును - ఆత్మయె తానుగా నభిమానము లేకుండుట యనుట, కార్యము= ప్రయోజనము, ఔను, యమ...క్షయముల్ - యమ = యమము మొదలయిన పంచదశ యోగములయొక్క, అభ్యాస = అలవాటును, ఆత్మ = మనస్సుయొక్క - చంచలవృత్తియొక్క యనుట, ధీ = బుద్ధియొక్క - నిశ్చలవృత్తియొక్క యనుట, నిగ్రహ = అడంచుటయును, వ్యవహార క్షయముల్ = (విద్యావిద్యలయొక్క సర్వ) వ్యాపారములు నశించుటలును, తలంపఁగ = యోజింపఁగా, ఉపరతి ఆదిస్వరూప అర్థముల్ = ఉపరతి కారణమును స్వరూపమును కార్యమును అగును.

తా. * బోధమునకు శ్రవణ మనన నిధిధ్యాసనములు మూఁడును గారణము. ఆ శ్రవణాదులచేత నిత్యానిత్యవస్తువులను వివేచించి యనిత్యములయినదేహాదులు దాను గా ననియు నిత్యమైన యాత్మస్వరూప మనియు వేఱువేఱ తెలియుటయె యీ బోధమునకు స్వరూపము. ఈ యనాత్మస్వరూపమగు దేహేంద్రియాదులకంటెఁ దాను వే ఱని నిశ్చయము గలిగియుండుటయే బోధకుఁ గార్యము. ఉపరతికి యమనియమప్రాణాయామాదులు హేతువులు. చిత్తనిరోధము స్వరూపము. సర్వవ్యవహారలయము కార్యము.

అవ. వైరాగ్యశబ్దార్థవిచారము.

క. వైరాగ్యం బింతటికిని
గారణ మానందకరము ♦ గావున నది చే
కూరిన సమస్తమును సమ
కూరుం దనుఁదాన పరమ♦గుహ్య మిది సుతా. ౧౨౫

---

* వైరాగ్య బోధోపరతులు మూఁటిలో బోధ మితరసాధనము నపేక్షింపక ప్రత్యక్షముగ మోక్షము నిచ్చునదిగాన ముఖ్యమైనది. తక్కిన

టీ. సుతా = కుమారా, ఇంతటికిని = ఈ చెప్పఁబడినదానికంతటి కిని, వైరాగ్యము, కారణము = హేతువైనది. ఆనందకరము = ఆనంద మును గలుగఁ జేయునది. కావునన్, అది చేకూఱినన్ = ఆ వైరాగ్యము సమకూడెనేని, తనుఁదాన = తనంతటనే - ప్రయత్నములేకయే, సమస్త మును = సకలమును - అనఁగాఁ దక్కినబోధోపరతులును, సమకూరును = సిద్ధించును, ఇది, పరమగుహ్యము = మిక్కిలిగోప్య మయినది.

తా. ఇంతటికిని కారణము వైరాగ్యమే. అది యానందకరము. అది యొకటి యొనగూడినయెడలఁ దక్కిన దంతయును దనంతటనే సిద్ధిం చును. ఇది పరమరహస్యము సుమీ. ౧౨౫

వ. అది యెట్లనిన వినుము. మూలప్రకృతి యాలవాలంబు, సుఖదుఃఖంబులు ఫలంబులు, త్రిగుణంబులు మూలంబులు, ధర్మార్థకామమోక్షంబులు రసంబులు, పంచేంద్రియంబు

---

రెండును దానికి తోడుపడునవి. ఈ మూఁడును గ్రమముగాఁ బడసినవాఁడే మోక్షము నొందును. వైరాగ్యోపరతులు మాత్ర ముండి బోధము లేకున్న వానికి ముక్తి కలుగకున్నను వైరాగ్యోపరతులచే తపస్సు సిద్ధించి పుణ్యలోక ములు లభించును. బోధముండియు వైరాగ్యోపరతులు లేనిచో ముక్తి సిద్ధిం పదు. వైరాగ్యోపరతులు కూడ నుండిననే ప్రత్యక్షదుఃఖమును దొలఁగిం చుటకు సహకారు లగును. వైరాగ్యమునకు బ్రహ్మలోకతృణీకారము గల్గు కాలము అవధి. అజ్ఞానావస్థయందు ఈ దేహేంద్రియాదులు నేననెడి నిశ్చ యము వచ్చినట్లు విజ్ఞానదశయందవి తోఁపక యాత్మస్వరూపము నే నను నట్టి నిశ్చయము గలుగుకాలము బోధకు అవధి. ముముక్షువు నిద్రయందు వలెనే మెలఁకువయందుఁ గూడ సకలవిషయములను మఱచుకాలము ఉపర తికి అవధి. ఇట్లు బోధోపరతుల కారణ స్వరూప కార్యములు మూఁడు నెఱుఁగునది.

లూడలు, షడూర్ములు స్వభావంబులు, సప్తధాతువులు పొర, లష్టప్రకృతులు విటపంబులు, నవరంధ్రంబులు కోట రంబులు, దశవిధప్రాణంబులు పత్త్రంబులు, శబ్దాది విష యంబులు పల్లవంబులు, రాగద్వేషాదు లుపశాఖలు, నా నావిధకర్మంబులు పుష్పంబులు, జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి, మందిరారామ క్షేత్ర పుత్త్ర మిత్ర కళత్ర బంధు మధ్యస్థ ద్వేష్యజన తీక్ష్ణ దుష్కంటక తరుగుల్మ లతా సం కీర్ణంబుఁ, గామాది చోర దుస్సంచారంబు, రోగవ్యాఘ్ర భయంకరంబు, దుఃఖదావానల సమావృతంబు, మృత్యు సింహ భయగ్రస్తంబు, జరాపిశాచ సమన్వితంబు, దైన్య పర్వత సంకటంబు, దురితరాక్షస ఘోరంబుఁ, దృష్ణాభీకర కాకోదర సమాకులంబు, హర్షావర్ష ఝంఝూనిల దూషి తంబు, స్వర్గనరక దుర్మార్గ తిరోహితాపవర్గ సన్మార్గంబు నైన మహాదుఃఖారణ్యంబునం గాడుపడి పుణ్యాపాప విధే యుండై, జీవుం డంతటం దిరిగి తిరిగి, చీకాకుపడి, యె చ్చోట విశ్రాంతిఁ గానక, విసివి, ముందరఁ గాంచి యనం తం బని, వెనుకఁ జూచిన ననాది యని, కలయం గనుంగొని యసాధ్యం బని తెలిసి, మహాగాఢదుఃఖ భయ శోక వ్యాకులిత చిత్తుండుఁ దాపత్రయాదిత్య ప్రదీప్తాతప సంత ప్తుండు నై, యంతట నిరంతర నితాంతాగమచ్ఛాయల నాశ్రయించి, ప్రస క్స్యందన వనితా ధనధాన్యపశు సంతా శయ్యా నికేతనోద్యాన ప్రముఖ విషయసంపాదన సాధ నంబు లైన కృషి వాణిజ్య సేవా యాచ్ఞాది లౌకిక కర్మం బులు పరిహరించి స్వర్గాది సత్యాంత పరలోక విషయ

సుఖసాధనంబు లైన నిత్యనైమిత్తికాది కర్మంబులు ఫల
కాంక్షచేతఁ జేయక పరమేశ్వ రార్పణంబుగా నాచరించి,
యప్పరమేశ్వ రానుగ్రహంబువలనఁ బరిశుద్ధ హృదయుం
డై, యమానిత్వం బదంభిత్వం బహింస యార్జవంబు
క్షాంతి యాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యం బాత్మ
వినిగ్రహం బింద్రియార్థంబుల వైరాగ్యం బనహంకారంబు
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనంబు,
బుత్రదార గృహాద్యనాసక్తి, యనభిష్వంగంబు, నిత్యేష్టా
నిష్టోపపత్తి, సమచిత్తత్వంబు, మదనన్యయోగ నిశ్చల
భక్తి, వివిక్తదేశ సేవిత్వంబు, జనసంగాసక్తి వివర్జనం,
బధ్యాత్మజ్ఞాననిత్యత్వంబుఁ, దత్త్వజ్ఞానార్థదర్శనం బను
వింశతిగుణంబు లెప్పుడు సంగ్రహించు నప్పు డాత్మ
బ్రహ్మైక్యసాక్షాత్కార విచారాధికారి యగు నింతవట్టుం
గూడి వైరాగ్యశబ్దంబునకుఁ దాత్పర్యార్థం; బింక బోధ
స్వరూపం బెఱింగించెద నాకర్ణింపు మని యిట్లనియె.

టీ. అది, **ఎట్లనినన్**=ఆరహస్య మేవిధ మని యడిగితివేని, వినుము. **మూలప్రకృతి** = అవ్యక్త మనెడు తత్త్వము, **ఆలవాలము** = (సంసార మనెడి వృక్షమునకు) పాదును, **సుఖదుఃఖంబులు, ఫలంబులు** = (దానికి) పండ్లు, **త్రిగుణంబులు** = సత్త్వరజస్తమోగుణములు, **మూలంబులు** = వేళ్లు, **ధర్మా...బులు** - **ధర్మ** = ధర్మమును - విహితకర్మాచరణ మనుట, **అర్థ** = వర్ణాశ్రమోచిత వృత్తిచేత ధనము సంపాదించుటయును, **కామ** = విహిత భోగాసక్తియు, **మోక్షంబులు** = ముక్తియు ననెడియీనాలుగును, **రసంబు** = తీపు మొదలయిన రసములు, **పంచ + ఇంద్రియములు**, **ఊడలు** = జడలు, **షడూర్ములు** = (ఆఁకలి దప్పి శోకము మోహము జర మరణము ననెడి) ఆ

ఆర్ద్రాః, స్వభావములు. సప్తధాతువులు = (త్వక్కు మాంసము నెత్తురు మేదస్సు మజ్జ అస్థి స్నాయువులు ననెడి) ఏడుధాతువులు, పొరలు = పయి పట్టెలు, అష్టప్రకృతులు = (భూమి జలము అగ్ని వాయువు ఆకాశము మనస్సు అహంకారము బుద్ధి అనెడి) ఎనిమిది ప్రకృతులు, విటపంబులు = కొమ్మలు, నవరంధ్రంబులు = చెవి మొదలగు తొమ్మిదిద్వారములు, కోటరంబులు = తొఱ్ఱలు, దశవిధ ప్రాణంబులు = పదివిధములయిన ప్రాణాదివాయువులు, పత్త్రింబులు=ఆకులు, శబ్దాదివిషయంబులు = శబ్దము స్పర్శము మొదలయిన యింద్రియార్థములు, పల్లవంబులు = చిగుళ్లు, రాగద్వేషాదులు = రాగము ద్వేషము మొదలయిన యింద్రియవృత్తులు, ఉపశాఖలు= చిఱుగొమ్మలు, నానావిధ కర్మంబులు = పలువిధములయిన కృత్యములు, పుష్పంబులు = పూవులు, జీవేశ్వరులు = జీవుఁడును ఈశ్వరుఁడును, పక్షులుగాన్ = పిట్టలుగా, కలిగి = కలిగిన దై, మంది...బును - మందిర= ఇండ్లు, ఆరామ = తోఁటలు, క్షేత్ర = భూములు, పుత్త్ర = కొడుకులు, మిత్ర = స్నేహితులు, కళత్ర = భార్యలు, బంధు = చుట్టములు, మధ్యస్థ=ఉదాసీనులు - శత్రుత్వమిత్రత్వములు లేనివారు, ద్వేష్యజన=విరోధులు, వీర లనెడు, తీక్ష్ణ = వాఁడి గల, దుష్కంటక = విషపుముండ్లు గల, తరు = చెట్లచేతను, గుల్మ = పొదలచేతను, లతా = తీఁగలచేతను, సంకీర్ణంబును = పెనఁగొన్నదియును, కామా...రంబును - కామ = కామము, ఆది = మొదలయిన - కామక్రోధలోభమోహ మదమత్సరాదు లనెడు, చోర = దొంగలయొక్క, దుస్సంచారంబు = చెడునడక గలదియు, రోగ...రంబు - రోగ = ఆధివ్యాధు లనెడు, వ్యాఘ్ర = పులులచేత, భయంకరంబు = వెఱపు గలిగించునదియు, దుఃఖ..తంబు - దుఃఖ=పీడ లనెడు, దావానల= కార్చిచ్చుచేత, సమావృతంబు = ఆవరింపఁబడినదియు, మృత్యు...స్తంబు - మృత్యు = చావనెడు, సింహ = సింగమువలని, భయ = వెఱపుచేత, గ్రస్తంబు = మ్రింగఁబడినదియు, జరా.. తంబు -

జరా = ముదిమి అనెడు, పిశాచ = భూతముతోడ, సమన్వితంబు = కూడి నదియు, దైన్య...టంబు - దైన్య = బీదతన మనెడు - లేక - చిన్నఁదన మనెడు, పర్వత = కొండచేత, సంకటంబు = ఇఱుకైనదియును, దురిత...రంబు - దురిత = పాపము లనెడు, రాక్షస = రక్కసులచేత, ఘోరంబు = భయంకర మైనదియు, తృష్ణా...లంబు - తృష్ణా = ఆశ అనెడు, భీకర = భయమును గలిగించెడు, కాకోదర = సర్పములచేత, సమాకులంబు = కలఁగినదియు, హర్ష...తంబు - హర్ష = సంతోషమును, అమర్ష = కోపమును, అనెడి, ఝంఝానిల = ఓడుగాలిచేత, దూషితంబులు = చెఱుపఁబడినవియు, స్వర్గ...ంబు - స్వర్గనరక = స్వర్గనరకము లనెడు, దుర్మార్గ = చెడ్డత్రోవలచేత, తిరోహితము = మఱుఁగుపడిన, అపవర్గ=ముక్తియొక్క, సన్మార్గంబును = మంచిత్రోవ గలదియు, ఐన, మహాదుఃఖారణ్యంబునన్ =గొప్పదుఃఖములు గల (సంసార మనెడి) అడవియందు, కాఁదుపడి = తెలివితప్పి - దారిచెడి యనుట, పుణ్యపాపవిధేయుండు = పుణ్యపాపములకు లోనయినవాఁడు, ఐన జీవుండు, అంతటను, తిరిగితిరిగి, చీకాకుపడి = వ్యాకులపడి, ఎచ్చోటన్ = ఎక్కడను, విశ్రాంతి గానక = బడలిక తీఱుటలేక, విసివి = విసిగి, ముందర గాంచి = ఇఁక ముందరి కాలము చూచి, అనంతం బని=అంతము లేనిదనియు - ఇంత వఱకెన్ని జన్మము లెత్తవలయునో దానికి తుదిలేదనియు, వెనుకఁ జూచి = కడచి పోయినదానిని జూచి, అనాదియని = మొదలు లేనిదియని - ఎంత కాలము మొదలుకొని జన్మము లెత్తుచువచ్చితినోయని, కలయంగనుంగొని= అంతయు విమర్శించిచూచి, అసాధ్యం బని = తుద మొద తెలియుటకు అశక్య మనియు, తెలిసి, మహా...డును - మహాగాధ = మిక్కిలి దృఢమైన, దుఃఖ = దుఃఖముచేతను, భయ = వెఱపుచేతను, శోక= వ్యసనముచేతను, వ్యాకులిత = కలఁత పొందింపఁబడిన, చిత్తుండును = మనస్సుగలవాఁడును, తాప...ను - తాపత్రయ = ఆధ్యాత్మికము మొదలగు మూఁడు

తాపము లనెడు, ఆదిత్య = సూర్యునియొక్క, ప్రదీప్త = మండుచున్న, ఆతప = ఎండచేత, సంతప్తుండును = కాఁచబడినవాఁడును, ఐ, అంత టఁ = పిమ్మట, నిరం... యలన్ - నిరంతర = ఎడతెగని, నితాంత = మిక్కిలి యైన, ఆగమ = కామికాద్యాగమము లనెడు చెట్లయొక్క = (అగమము లనఁగా చెట్లు ఆగమము లనెడి అగమము లని సంధియందు రెంటికి నంతర్భావము), ఛాయలన్ = నీడలను, ఆశ్రయించి, స్రక్చ... ములు - స్రక్ = పూదండలు, చందన = గంధము, వనితా=స్త్రీలు, ధన = విత్తములు, ధాన్య = ధాన్యములు, పశు = పశువులు, సంతాన = బిడ్డలు, శయ్యా = సెజ్జలు, నికేతన = ఇండ్లు, ఉద్యాన = పూఁదోఁటలు, ప్రము ఖ = మొదలైన, విషయ = భోగ్యవస్తువులయొక్క, సంపాదన = సంపా దించుటకు, సాధనంబులు = ఉపాయములు, ఐన, కృషి = దున్నుట, వా ణిజ్య = వర్తకము, సేవా = కొలువు, యాచ్ఞా = తిరిపము, ఆది=మొద లగు, లౌకిక కర్మంబులు = లోకవ్యవహారములను, పరిహరించి = విడిచి, స్వర్గా...లు - స్వర్గ ఆది = స్వర్గలోకము మొదలు, సత్య అంత = సత్య లోకమువఱకుఁ గల, పరలోక = పరలోకములందలి, విషయసుఖ = వస్తు భోగములకు, సాధనంబులు, ఐన, నిత్యనైమిత్తికాది కర్మంబులు = నిత్య ములు నైమిత్తికములు మొదలయిన యనుష్ఠానములను, ఫలకాంక్షచేతన్ = ఫలమందలి యాసక్తినిబట్టి, చేయక, పరమేశ్వర అర్పణంబుగాన్ = బ్రహ్మార్పణముగా, ఆచరించి, అప్పరమేశ్వరానుగ్రహంబువలనన్ = ఆ యీశ్వరుని ప్రసాదముచేత, పరిశుద్ధహృదయుం డై = నిర్మల మగు మనస్సు గలవాఁడై, అమానిత్వంబు = తన్నుఁ దానే పొగడుకొనక యుం డుటయును, అదంభిత్వంబు = తాను చేసిన ధర్మాదులను ప్రకటించు కొనకుండుటయును, అహింస = భూతబాధ సేయకుండుటయు, ఆర్జ వంబు = ఋజువర్తనమును - తిన్నఁదనమును, క్షాంతి = ఓర్పును, ఆచార్య ఉపాసనంబు = గురువును కొలుచుటయును, శౌచంబు = లోని వెలి

పలిశుద్ధియు, స్థైర్యంబు = నిలుకడయును, ఆత్మవినిగ్రహంబు = మనస్సును అడంచుటయును, ఇంద్రియార్థంబుల వైరాగ్యంబు = శబ్దస్పర్శాదు లగు విషయములందు విరక్తియు, అనహంకారంబు = గర్వము లేమియు, జన్మ...బును = పుట్టుక మరణము ముదిమి తెగులు దుఃఖ మనెడి వీనియందు, దోష = దోషములను, అనుదర్శనంబు = పలుమాఱు చూచుటయు, పుత్త్ర...సక్తి = కొడుకులు పెండ్లములు ఇండ్లు మొదలగు వానియందు ఆశ లేకుండుటయు, అనభిష్వంగంబు = తగులులేమియు, నిత్య...త్వంబు—నిత్య = ఎప్పుడును, ఇష్టానిష్ట = ప్రియాప్రియముల యొక్క, ఉపపత్తి = పొందుటలయందు, సమచిత్తత్వంబు = సమానమైన మనస్సును - సమబుద్ధి యనుట, మత్...భక్తియు - మత్ = నాకంటె, అనన్య = ఇతరము లేద నెడు, యోగ = ధ్యానమందు, నిశ్చలభక్తియుఁ = స్థిరమయిన భక్తియును, వివిక్త దేశసేవిత్వంబు = జనులు లేనిచోట నునికియు, జన...నంబును = జనులయొక్క కూడికయందు ఆసక్తిని విడుచుటయును, అధ్యా...త్వంబు = బ్రహ్మజ్ఞానమునందు ఎప్పుడును నెల కొని యుండుటయును, తత్త్వజ్ఞాన అర్థదర్శనంబు = పరతత్త్వము ఎఱుఁగుటయె ప్రయోజన మని కనుఁగొనుటయు - తత్త్వమును తెలిసి కొనుటయె పురుషార్థ మని గ్రహించుటయు నని భావము, అను వింశతి గుణంబులు = అనెడి ఇరువదిగుణములును, ఎప్పుడు, సంగ్రహించుఁ = ఒడఁగూర్చుకొనునో, అప్పుడు = ఆ క్షణమే, ఆత్మ...కార - ఆత్మ = ప్రత్యగాత్మయొక్కయు, బ్రహ్మ = పరబ్రహ్మముయొక్కయు, ఐక్య = ఏకత్వమును - ఒక్కటిగాఁ గూడుటను - లేక ఒక్కటియె యగుటను, సాక్షాత్కార = ప్రత్యక్షము సేయుటయొక్క, విచార = పరిశీలనమందు, అధికారి = యోగ్యత గలవాఁడు, అగును; ఇంతపట్టుం గూడి = ఇది యంతయును జేరి, వైరాగ్యశబ్దంబునకుఁ, తాత్పర్యంబు, ఇంకఁ, బోధ స్వరూపంబు = బోధ మనుదాని కలరూపును - బోధశబ్దార్థము ననుట, ఎఱింగించెదను, ఆకర్ణింపుము = వినుము, అని, ఇ ట్లనియెను.

తా. ఇందు సంసార మొక వృక్షముగా రూపితము. ఒక చెట్టునకు మొదటఁ బుట్టుచోటు పాదు. అందు మొదట వేళ్లును దానినుండి బోదెయు పెదకొమ్మలును ఆకులును జిగుళ్లును చిఱుగొమ్మలును పువ్వులును బండ్లును రసములును గలుగునట్లే, సంసారమునకు ప్రకృతి మొదలగు వానిని పాదు మొదలగునవిగా నుపపాదింపఁబడె నని తెలియునది. చెట్ల నెక్కి పక్షులు పండ్లు మొదలగునవి తినునట్లే, యీ సంసారవృక్షమును జీవేశ్వరు లారోహించి దానిఫలాదుల ననుభవించుచున్నారు. అట్టిసంసార వృక్షమయ మైనది యీ దుఃఖారణ్యము; అరణ్యమునందు ముండ్లు పొద రులును దొంగలు క్రూరమృగములు కార్చిచ్చు పిశాచములు పర్వతములు సర్పములు మొదలగు భయంకరవస్తువులవలెనే యీ దుఃఖారణ్యమందును పుత్త్రి గృహాదులు గలవు. అందుఁ దప్పుత్రోవలచేత సరియైనమార్గము తెలియనట్లె యిందు స్వర్గనరకములచేత అపవర్గమార్గము దెలియకుండును; దీనికి మొదలును దుదయును గలుగవు. జీవుఁ డిందు తిరిగి తిరిగి యొక్క డను హాయిగా నిలుచుచోటుఁ గానఁడు. అందు చెట్లనీడలయందు విశ్ర మించునట్లె యిం దాగమార్గములను ఆశ్రయించి యిహాభోగములకు సాధ నములైన కృషి మొదలగు లౌకికవ్యాపారములను విడిచి పరలోకసాధనము లగు నిత్యనైత్తిమికాదులను ఫలమును గోరక బ్రహ్మార్పణముగాఁ జేయుచు రావలెను. దానిచే ఈశ్వరకృప గలిగి హృదయము పరిశుద్ధ మగును. పిదప అమానిత్వము మొదలయిన యిరువదిగుణములను బొందఁగా నపుడు బ్రహ్మై త్మైక్య సాక్షాత్కార విచారమునకు అర్హత్వము కుదురును. ఇట్లు దుఃఖా రణ్యమునందుఁ దిరిగి తిరిగి యాగమార్గముల నాశ్రయించి లౌకికకర్మములు విడిచి వైదికకర్మములను ఫలరహితముగాను బ్రహ్మార్పణముగాను జేయుచు భగవదనుగ్రహముచేతఁ బరిశుద్ధహృదయుఁ డై యమానిత్వాదిగుణము లిరు వది నొంది బ్రహ్మాత్మైకమగుటను సాక్షాత్కరించువిచారమున కర్హత్వము నొందుటకొ వైరాగ్య మనఁబడు నని తాత్పర్యము. ౧౨౬

అవ. బోధస్వరూపమును వివరించుచున్నాఁడు.

తే. అట్టి సుగుణాభిరాముఁ డత్యాప్తితోడ
శాంతచిత్తుండు గారుణ్యసాగరుండు
జ్ఞానవిజ్ఞానసంపన్నుఁ డైన గురుని
వినయభయభక్తు లమర సేవించు ననఘ! ౧౨౭

టీ. అనఘ = పాపరహితా - హనుమంతా, అట్టి సుగుణ అభిరాముఁడు = అట్లు పైని చెప్పఁబడినట్టి అమానిత్వము మొదలగు సుగుణములచేత ఒప్పుచున్నవాఁడు, అత్యాప్తితోడన్ = మిక్కిలి తమకము తోడ, శాంతచిత్తుండును = రాగాదికలుషము లడంగి సత్త్వప్రవృత్తి గల మనస్సుతోఁ గూడినవాఁడును, కారుణ్యసాగరుండు = దయాసముద్రుఁడును, జ్ఞానవిజ్ఞాన సంపన్నుఁడు = జ్ఞానమును విజ్ఞానమును మిక్కిలి గల వాఁడును - తత్త్వమస్యాది మహావేదాంత వాక్యార్థజ్ఞానమును బ్రహ్మజ్ఞానమును గలవాఁ డనుట. ఐన, గురునిన్ = ఆచార్యుని, వినయ భయ భక్తులు = అడఁకువయును వెఱపును భక్తియును, అమరన్ = ఒప్పఁగా, సేవించును = కొలుచును.

తా. అమానిత్వము మొదలయిన పూర్వోక్తగుణములచేత నొప్పునట్టి పురుషుఁడు, శాంతచిత్తుఁడును మహాకరుణాత్ముఁడును జ్ఞానవంతుఁడు నగు గురుని భయభక్తులతో మిక్కిలి తమకము గొని సేవించుచుండును.

క. గురుఁ డజుఁడు గురుఁడు విష్ణుఁడు
గురుఁడు మహాదేవుఁ డఖిలగురుఁడు గురుఁడు స
ద్గురుఁడౌ పరబ్రహ్మం బని
గురుని నుపాసించు నతఁడు గురుతరభక్తిన్. ౧౨౮

టీ. అతఁడు = అమానిత్వాదిగుణములు గల యట్టిపురుషుఁడు, గురుఁడు = తాను గొల్చు ఆచార్యుఁడు, అజుఁడు = బ్రహ్మ, గురుఁడు =

గురువే, విష్ణుఁడు, గురుఁడు = గురువే, మహాదేవుఁడు = శివుఁడు, గురుఁడు = గురువే, అఖిలగురుఁడు = సమస్తమునకు గొప్పవాఁడు, సద్గురుఁడే = శ్రేష్ఠుఁడైన గురువే, పరబ్రహ్మంబు, అని, గురునిన్, గురుతర భక్తిన్ = మిక్కిలి గొప్పభక్తితోడ, ఉపాసించును = కొలుచును.

తా. అట్టిగుణములు గలవాఁడు గురువే బ్రహ్మ యనియును విష్ణువని యును శివుఁ డనియును పరబ్రహ్మ మనియును దలఁచి మిక్కిలి భక్తితో నతనిని గొలుచుచుండును. ౧౨౭

సీ. గురుపదాంభోజముల్ గొలువక కల్గునే
ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ
గురుపాదతీర్థంబుఁ గ్రోలక కల్గునే
జ్ఞానవిజ్ఞానయోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్నఁ గల్గునే
ప్రతి లేని చిత్తోపరతిసుఖంబు
గురుతత్త్వ మాత్మఁ గన్గొనకున్నఁ గల్గునే
నిరతిశయం బైన పరమపదము

తే. అట్లు గావున విద్యార్థియైనయోగి
వినయభయభక్తు లెదలోనఁ బెనఁగొనంగ
నలచతుర్విధశుశ్రూష లాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ గొలుచు ననఘ! ౧౨౮

టీ. అనఘ = పాపరహితుఁ డగుహనుమంతా! గురుపదాంభోజములు = గురువుయొక్క అడుగుతామరలు, కొలువక = సేవింపక, ప్రవిమల వైరాగ్యభాగ్యమహిమ = మిక్కిలి అచ్ఛమైన వైరాగ్య మనెడి భాగ్యసమృద్ధి, కలుగునే = కలుగునా - కలుగదనుట; గురుపాదతీర్థంబు= గురువుయొక్క పాదప్రక్షాళనజలమును, క్రోలక = త్రావక, జ్ఞానవిజ్ఞాన

యోగ అనుభవము = లౌకిక జ్ఞానముయొక్కయు అపరోక్షజ్ఞానము యొక్కయు జీవబ్రహ్మముల యైక్యజ్ఞానముయొక్కయు అనుభవము, కల్గునే? గురు సుప్రసాదంబుల్ = గురువు భుజించిన శేషము, కొనకున్నన్ = పుచ్చుకపోయినచో, ప్రతి లేని చిత్త ఉపరతిసుఖంబు = సాటి లేనిదగు మనస్సుయొక్క ఉపరతివలని యానందము, కల్గునే? గురుతత్త్వము = గురువుయొక్క స్వరూపమును - పరబ్రహ్మస్వరూపుం డనుటను, ఆత్మన్ = మనస్సునందు, కన్గొనకున్నన్ = తెలిసికొననియెడల, నిరతిశయంబు = తనకంటె ఎక్కువలేనిది, ఐన, పరమపదము = ముక్తి, కలుగునే? అట్లు కావునన్, విద్యార్థి=బ్రహ్మజ్ఞానమును గోరువాఁడు, ఐనయోగి, వినయభయభక్తులు, ఎదలోనన్ = మనస్సునందు, పెనఁగొనఁగన్ = మల్లడింపఁగా, అల చతుర్విధ శుశ్రూషలు = ఆ ప్రసిద్ధము లయిన నాలుగువిధము లగు శుశ్రూషలను, ఆచరించికొనుచున్ = అనుష్ఠించుచు, అనిశంబున్ = ఎప్పుడును, గురువులన్, కొలుచును = సేవించుచుండును. ఇందు సీసము నాలుగుపాదములందు గురువునకును బ్రహ్మమునకును, అభేదాధ్యవసాయము చేసి యర్థము చెప్పియున్నట్లు వ్రాసియున్నారు. ఎట్లన, గురుపదాంభోజముల్ = పరబ్రహ్మముయొక్క, త్వంత్వంపదము లనియు, గురుపాదతీర్థంబు = బ్రహ్మముయొక్క తత్త్వంపద వివరణకారణము లగు మహావాక్యార్థముల సారస్య మనియు, గురుసుప్రసాదంబు = పరమాత్మయొక్క అనుగ్రహ మనియు, గురుతత్త్వమున్ = పరబ్రహ్మస్వరూపము నని యర్థాంతరములచేత గురుబ్రహ్మముల కభేదాధ్యవసాయ మున్నదని వ్రాసిరి కాని, యది గౌరవగ్రస్తమును క్లిష్టమును గావున నంతగా నుపపన్నము గాదు.

తా. గురువుపాదములను గొలిచిననే వైరాగ్యమును, గురుపాదతీర్థమును గ్రోలిననే బోధమును, గురుభుక్తశేషమును భుజించిననే యుపరతియు, గురుస్వరూపమును దెలిసిననే ముక్తియును గలుగును గాన,

బ్రహ్మజ్ఞానమును గోరువాఁడు, స్థానము అంగము భావము ఆత్మ యనెడు * నాలుగువిధము లయిన శుశ్రూషలును చేసి వినయభయభక్తులతోనే యెల్లప్పుడును గురువులను గొలుచుచుండ వలయును. ౧౨౯

క. వారలయుపదేశముచేఁ
దారకసాంఖ్యామనస్కతత్త్వాత్మక మా
శ్రీరాజయోగమార్గం
బారూఢముగా నెఱుంగువి నంతట ననఘా. ౧౩౦

టీ. అనఘా, అంతటన్ = తరువాత - అట్లు గురువులకు శుశ్రూషలు చేసినపిదప ననుట, వారల ఉపదేశముచేత, తారక సాంఖ్య అమనస్కయోగతత్త్వ ఆత్మకను = తారకయోగము సాంఖ్యయోగము అమనస్కయోగము అనెడి యివియె స్వరూపముగాఁ గలదైన, శ్రీరాజయోగమార్గంబు = సంపత్కరమైన రాజయోగముయొక్క ప్రకారమును, ఆరూఢముగాన్ = నిశ్చయముగా, ఎఱుంగును.

తా. సుగమము. ౧౩౦

---

* శుశ్రూష—స్థానము, అంగము, భావము, ఆత్మ యని నాలుగు విధములు ప్రణవమందలి అకార, ఉకార, మకారములకు లక్ష్యార్థ మగు. ద్రష్టృస్థానమును ఎఱుకయు మఱపును లేని యునికితో విచారించుటయే, స్థానశుశ్రూష. సూర్య చంద్ర బ్రహ్మ విష్ణు రుద్రాదులే కన్నులు మొదలగు నవయవములని విమర్శించి తెలియుట అంగశుశ్రూష. పరబ్రహ్మము త్రికాలాబాధ్య మనియు అదియే తాననియు భావించుట భావశుశ్రూష. ఆత్మకు పుత్త్రకళత్రాదు లాత్మవలెఁ బ్రియములు గావు గనుక, కూటస్థ ప్రత్యగాత్మకు వేఱు కాని పరబ్రహ్మమగు తనయందుఁ దాను దప్పకయుండుట ఆత్మశుశ్రూష ఆత్మ 'విత్తా త్పుత్త్రః ప్రియఃపుత్త్రా త్స్వశరీరం తథాప్రియమ్.। ఇంద్రియాణి ప్రియాఃప్రాణాః ప్రాణా దాత్మా పరంప్రియః'

మ. క్రమ మొప్పార నహంపదంబునకు నీకాయేంద్రియప్రా
ణచిత్తమనోహంకృతి బుద్ధిరూపజడకూటం బెల్ల వాచ్యా
ర్థమౌ, నద్యము సచ్చిత్సుఖరూపమై తనరు శుద్ధప్రత్యగా
త్మప్రకాశము లక్ష్యార్థము వేదశాస్త్రరహస్యం బింత
నిక్కం బగున్. ౧౭౮

టీ. క్రమ మొప్పారన్ = వాచ్యార్థము యొక్కయు లక్ష్యార్థము యొక్కయు క్రమము ఒప్పునట్లు, అహంపదంబునకున్ = 'అహమ్' అను శబ్దమునకు (ఆద్యంతము లయిన అకారహకారములలోని సకలవర్ణములును, ఆవర్ణములతోఁ గూడిన శబ్దములను, శబ్దములతోఁ గూడిన వాక్యములను, వాక్యములతోఁ గూడిన శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులను సంప్రతీకరణము చేయఁగా 'అహమ్' అగుట తెలియునది). ఈకాయే...జాలంబు = ఈ దేహము ఇంద్రియములు ప్రాణములు చిత్తము మనస్సు అహంకారము బుద్ధి యనెడు అజ్ఞానవృత్తుల సమూహము, ఎల్లన్ వాచ్యార్థము, అద్యము = మొట్టమొదటిదియు, సత్+చిత్+సుఖరూపము = సత్యజ్ఞానానందస్వరూపమును, ఐ, తనరు = ఒప్పుచున్న, శుద్ధ = నిర్మలమైన, ప్రత్యక్ = విలక్షణమైన, ఆత్మప్రకాశము = కూటస్థచైతన్యము, లక్ష్యార్థము, వేదశాస్త్ర రహస్యంబు = వేదములందును శాస్త్రములందును గల గోప్యము, ఇంత = ఇదియే, నిక్కంబు = సత్యము, అగును.

తా. 'అహమ్' అను శబ్దమునకు దేహము ఇంద్రియములు ప్రాణములు మనోబుద్ధిచిత్తాఽహంకారము లనెడి యీ యజ్ఞానవృత్తు లెల్లను వాచ్యార్థమగును. అద్యమై సత్యజ్ఞానానందస్వరూపమై యున్న కూటస్థచైతన్యము

---

అన్నట్లు వీత్తాదు లన్నిటికంటెను ప్రియతమ మయినవి. ఇందు 'గురుపాదోదకం పీత్వా గురో రుచ్ఛిష్టభోజనమ్ । గురుమూర్తిం సదా ధ్యాయేత్ గురుమంత్రం సదా జపేత్' అను శ్లోకార్థమును అనుసంధింపఁబడినది.

దీనికి లక్ష్యార్థము. వేదములందును శాస్త్రములందును గల పరమరహస్యం బెల్ల నిదియె. ౧౩౧

క. సర్వము వాచ్యార్థము త
త్సర్వాధిష్ఠానశుద్ధచైతన్యము చి
త్పూర్వకలక్ష్యార్థంబు సు
పర్వవినుత ! వినుము బ్రహ్మపదమున కరయన్. ౧౩౨

టీ. సుపర్వవినుత = దేవతలచేత స్తుతింపఁబడినవాఁడా, హనుమంతా! వినుము, బ్రహ్మపదమునకున్ = బ్రహ్మశబ్దమునకు, అరయన్ = విచారింపఁగా, సర్వము = సమస్తప్రపంచమును, * వాచ్యార్థము = సంకేతితార్థ మైనది; తత్ సర్వఅధిష్ఠాన శుద్ధచైతన్యము = ఆ సమస్తమునకు ఆధారమై శుద్ధమైన (అనఁగా ప్రకృతి నతిక్రమించిన) జ్ఞానస్వరూప మగు పరబ్రహ్మము, చిత్ పూర్వక లక్ష్యార్థము = సచ్చిదానందాది లక్షణముల చేత లక్షిత మైనయర్థము.

తా. సుగమము. ౧౩౨

తే. ఉభయవాచ్యార్థములతోడ నొప్పుచున్న
యుభయలక్ష్యార్థముల కైక్య మొదవ దట్లు
గాన వాచ్యార్థముల రెంటిఁ గడకుఁ ద్రోచి
యెనయ లక్ష్యార్థ మొకటిగా నెఱుఁగవలయు. ౧౩౩

---

* వాచ్యార్థ మనఁగా ఒకపదమునకు లోకవ్యవహారమున సంకేతింపఁబడియున్న యర్థము. లక్ష్యార్థ మనఁగా ఒక పదమునకు వాచ్యార్థము పొసఁగనపుడు ఉపపత్తులనుబట్టి లక్షిత మగు మఱియొకయర్థము. అహంశబ్దమునకు దేహాదులు వాచ్యార్థము, ప్రత్యగాత్మ లక్ష్యార్థము - అనఁగా, అతద్వ్యావృత్తితటస్థస్వరూపలక్షణముచేత దృగ్రూప మైన పరబ్రహ్మమును గుర్తించునది.

టీ. ఉభయ = అహంపద బ్రహ్మపదములు రెంటియొక్క, వాచ్యార్థములతోడన్ = అభిహితార్థములతోడ - అనఁగా అహంపద వాచ్యార్థమయిన శరీరేంద్రియాంతఃకరణాదు లయిన భేదములతోడను, బ్రహ్మపద వాచ్యములైన పిండాండాది మాయాండపర్యంతము లైన భేదములతోడను, ఒప్పుచున్న, ఉభయ లక్ష్యార్థములకున్ = రెండగులక్ష్యార్థములకు అనఁగా సత్యజ్ఞానానందరూపుఁ డగు ప్రత్యగాత్మకును సచ్చిదానంద నిత్యనిర్మలాఖండరూప మైన పరబ్రహ్మమునకును, ఐక్యము = ఏకత్వము - కూడిక, ఒదవదు = కలుగదు. అట్లు గాన, వాచ్యార్థములన్ రెంటిన్ = అహంపద బ్రహ్మపదములకు వాచ్యార్థము లగు బుద్ధ్యాదులను పిండాండాది మాయాండాంతములగు దేహములను వానియందుఁ బ్రతిబింబించిన జీవేశ్వరులను, కడకుఁద్రోచి = వదలిపుచ్చి, ఎనయన్ = పొందుపడినట్లు, లక్ష్యార్థములు = అహంపద బ్రహ్మపద లక్ష్యార్థము లయిన కూటస్థపరబ్రహ్మములును, ఒకటిగాన్ = ఒక్కటియె యని, ఎఱుఁగవలయును.

తా. అహంపద బ్రహ్మపదములకుఁ గల వాచ్యార్థములు రెంటితోఁ గూడియున్న లక్ష్యార్థములు రెంటికి ఐక్యము కలుగనేరదు. ఆ వాచ్యార్థములను విడిచి యీ రెంటికిని లక్ష్యార్థ మొక్కటియె అనఁగా ఒక్క పరబ్రహ్మమే యని తెలియవలయును. ౧౩౩

వ. అది యె ట్లంటేని. ౧౩౪

టీ. ఆ రెండు పదములకును లక్ష్యార్థ మొకటిగా నెఱుఁగుట యె ట్లనినయెడల.

సీ. అద్వితీయప్రత్యగాత్మనై యుండ నగునేను
బరిపూర్ణనిర్గుణబ్రహ్మ మగుదుఁ
బరిపూర్ణనిర్గుణబ్రహ్మంబె యద్వితీ
యప్రత్యగాత్మనై యుండ నైననేన

టంచు నీరీతి నకహంబ్రహ్మపదముల
వాచ్యార్థముల నెల్ల వదలి శుద్ధ
లక్ష్యార్థములఁ గొని లక్షణచేఁ దత్త
దన్యోన్యసమరసైక్యంబు గనుట

తే. యస్మి యను పదమున కర్థ మగును గాన
నిమ్మహావాక్యతాత్పర్య మిట్లు సద్గు
రుప్రసాదమువలన నిరూఢముగ న
బాధకంబుగ నెఱుఁగుట బోధ మనఘ ! ౧౩౫

టీ. అనఘ, అద్వితీయ...డను-అద్వితీయ=రెండవది లేని, ప్రత్యగాత్మండన్ = కూటస్థుఁడను, అగు నేను, పరి...బ్రహ్మము—పరిపూర్ణ = మాయాండము మొదలుకొని పిండాండమువఱకును ఎడతెగక నిండియున్నదియు, నిర్గుణ=సత్త్వాది గుణములు మూఁడును లేనిదియును, అగు, బ్రహ్మము = పరబ్రహ్మము అగుదును, పరిపూర్ణనిర్గుణబ్రహ్మంబె = అంతటను నిండి గుణరహితమై యున్న యాపరబ్రహ్మమె, అద్వితీయప్రత్యగాత్మండను=రెండవది లేనికూటస్థప్రత్యగాత్ముఁడను, ఐన నేను=అగు నేను, అటంచున్ = అని ఈరీతిని, అహంబ్రహ్మపదములవాచ్యార్థములను ఎల్లన్ = అహంపదబ్రహ్మపదవాచ్యార్థము లయినజీవేశ్వరాదుల నన్నిటిని, వదలి, శుద్ధలక్ష్యార్థములన్ =అచ్చపులక్ష్యార్థము లయిన కూటస్థపరబ్రహ్మములను, కొని, లక్షణచేన్ = జహదజహల్లక్షణచేత, తత్తత్ = కూటస్థబ్రహ్మములయొక్క, అన్యోన్య = ఒండొంటికి, సమరస = తుల్యమైన ఆనందము యొక్క, ఐక్యంబున్= కూడికను, కనుట = పొందుటయె, అస్మి అను పదమునకు = అయితిని అనెడిశబ్దమునకు అర్థ మగును. కాన = కనుక, ఇమ్మహావాక్య తాత్పర్యము = 'అహం బ్రహ్మాస్మి' అనెడి యీమహావాక్యముయొక్క తాత్పర్యమును, ఇట్లు, సద్గురుప్రసాదంబువలనన్ = శ్రేష్ఠ

లయిన గురువుల యనుగ్రహముచేత, నిస్సంశయముగాన్ = నిశ్చితముగాను, అబాధకముగన్ = బాధకములు లేనట్లుగాను (పక్షసాధ్యహేతుదృష్టాంతములకు ప్రతిపక్షదుష్టహేతువు మొదలయినవి బాధకము లని తెలియ వది), ఎఱుంగుట = తెలిసికొనుటయె, బోధము = బ్రహ్మజ్ఞానము.

తా. 'అద్వితీయుం డగు ప్రత్యగాత్మ యైన నేనే పరిపూర్ణ నిర్గుణం బగు పరబ్రహ్మము; పరిపూర్ణ నిర్గుణపరబ్రహ్మమే యద్వితీయప్రత్యగాత్మ యగు నేను' అని యిట్లు అహం బ్రహ్మపదముల వాచ్యార్థముల విడిచి యా శుద్ధలక్ష్యార్థములను మాత్రము గ్రహింపవలయును. ఈ పదముల లక్ష్యార్థము లయిన కూటస్థబ్రహ్మములకుఁ బరస్పరము సమానమైయున్న యానంద మొక్కటి యగుటయె 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యమందలి 'అస్మి' యనుపదమునకు అర్థము. ఈమహావాక్యమునకు తాత్పర్య మిట్లున్నది. సద్గురువుల యనుగ్రహమువలన నిశ్చయముగాను నిర్బాధముగాను తెలిసికొనవల యును. ఇట్లు తెలిసికొనుటయె బోధ మనఁబడు నని తెలియునది. ౧౩౫

క. నిత్యముగా దేహాత్మ
ప్రత్యయ మజ్ఞునకుఁ గల్గుపరిపాటిఁ దగం
బ్రత్యగభిన్నబ్రహ్మ
ప్రత్యయ మొప్పార వలయుఁ బండితున కిలన్. ౧౩౬

టీ. అజ్ఞునకున్ = వివేకము లేనివానికి, నిత్యముగాన్ = ఎప్పుడును, దేహాత్మప్రత్యయము = దేహమె తా నానెడి నమ్మకము, కల్గుపరిపాటిన్ = కలుగువిధమున, పండితునకున్ = బ్రహ్మజ్ఞానికి, ఇలన్ = ఈ భూమియందు, ప్రత్యగభిన్న బ్రహ్మప్రత్యయము - ప్రత్యక్ = కూటస్థచైతన్యమునకు, అభిన్న = వేఱు కాని, బ్రహ్మప్రత్యయము = తాను బ్రహ్మ మనెడి నమ్మిక, తగన్, ఒప్పారవలయున్ = కలుగవలెను.

తా. అజ్ఞానికి దేహమె తా ననెడి నమ్మిక కలుగునట్లుగానే బ్రహ్మజ్ఞానికి తానే బ్రహ్మ మనెడి నమ్మిక యొప్పుచుండును. ౧౩౬

తే. ఇదియె బోధప్రకార మౌఁ గ నింక నీకు
నుపరతిసుఖంబు వినిపింతుఁ గొనర వినుము
ఉత్తమోత్తమ మై యొప్పుఁ జిత్తశాంతి
బ్రహ్మవిద్యాగమమునకుఁ ఫలము వత్స! ౧౩౭

టీ. వత్స = నాయనా - హనుమంతా! ఇదియె = ఈ చెప్పఁబడినదే, బోధప్రకారము = బోధముయొక్క విధము, ఔను, నీకున్, ఇంకన్, ఉపరతిసుఖంబు = చిత్తలయమువలని ఆనందమును, వినిపింతును, ఒనరన్ = చక్కఁగా, వినుము; ఉత్తమోత్తమమై = అన్నిటియం దుత్తమమై, ఒప్పు, చిత్తశాంతి = చిత్తలయమే, బ్రహ్మవిద్యాగమమునకున్ = బ్రహ్మజ్ఞానముయొక్క రాకకు - బ్రహ్మజ్ఞానము లభించుట కనుట, ఫలము = ప్రయోజనము, ఔను.

తా. హనుమంతా! బోధ మనఁగా నిదియె. ఇఁక ఉపరతి యనఁగా నిట్టిది యని చెప్పెదను వినుము. చిత్తలయమె యన్నింటియందు మిక్కిలి యుత్తమ మయినది. అదియే బ్రహ్మవిద్యాప్రాప్తికి ఫలముచుమీ. ౧౩౮

చ. ఉపకృతిదానభోగములఁ గొప్పనిమర్త్యునికల్మి శీల మె
ల్లపుడును లేనివిప్రునిగమాధ్యయనంబును నెమ్మనంబునన్
విపులశమంబు గైకొనని వీరతపస్వితపంబు నింద్రియా
ద్యుపరతిసౌఖ్యముం గననియోగివివేకమురిత్త యారయన్.

టీ. ఉపకృతి దానభోగములకున్ = ఒకరికి కరుణచేత నిచ్చుటకును జలధారా పూర్వకముగా నిచ్చుటకును అనుభవించుటకును, ఒప్పని = సరిపడని, మర్త్యునికల్మి = మనుష్యునియొక్క సంపదయును, ఎల్లపుడును, శీలము = మంచినడవడి, లేనివిప్రు = లేనట్టి బ్రాహ్మణునియొక్క, నిగ

మాధ్యయనంబు = వేదపఠనమును, నెమ్మనంబునన్ = మనసునందు, విపుల శమంబు = మిక్కిలి యైనశాంతిని- అంతరింద్రియనిగ్రహమును లేక ఓరుపును, కైకొనని = చేపట్టని, వీరతపస్వితపంబు = ఉగ్రమయిన తపముతోఁ గూడినవానియొక్క తపస్సును, ఇంద్రియ + ఆది + ఉపరతి సౌఖ్యమున్ = ఇంద్రియములు మొదలగువానియొక్క వ్యాపారము ఉడుగుటవలని సుఖమును, కనని = పొందని, యోగివివేకము - యోగి = ప్రత్యగాత్మకును బ్రహ్మమునకును ఐక్యము ననుసంధించువానియొక్క, వివేకము = ఆత్మానాత్మవివేచనము - బ్రహ్మజ్ఞానము, అరయన్ = విచారింపఁగా, రిత్త = వ్యర్థము.

తా. మనుష్యుఁడెంతధనము గలిగియుండియు దానిని బరోపకారములకును దానములకును దా ననుభవించుటకును నుపయోగింపనియెడల నది వ్యర్థమే యగును. అట్లే, బ్రాహ్మణుఁడు ఎప్పుడును సత్ప్రవర్తనము లేకయుండినచో వానివేదాధ్యయనము వ్యర్థము. తపస్వి శాంతి లేకున్నచో వాని తపస్సు వ్యర్థము. యోగి యింద్రియాదులవ్యాపారముల నుడుపుటవలని సౌఖ్యమును గాంచనిచో వానిబ్రహ్మజ్ఞానమును వ్యర్థమే యగుచున్నది. ౧౩౭

సీ. వేదశాస్త్రంబులు ♦ వివరించి బుధులచేఁ
జదివింపవచ్చుఁ దాఁ ♦ జదువవచ్చు
యజ్ఞదానతపంబు ♦ లధికారిజనముచేఁ
జేయింపవచ్చుఁ దాఁ ♦ జేయవచ్చు
నిలలోనఁ గలతీర్థములఁ గేఁగ నన్యుల
బోధింపవచ్చుఁ దాఁ ♦ బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప
దేశింపవచ్చు సాధింపవచ్చుఁ

తే. గాని యెవ్వారి కైన విజ్ఞానయోగ
గతిని దేహేంద్రియము లరికట్టి మనము
నాఁగి యంతర్ముఖముఁ జేసి యనవరతము
నిశ్చలసమాధినిష్ఠచే నిలుపరాదు. ౧౩౯

టీ. బుధులచేన్ = పండితులచేత, వేదశాస్త్రంబులన్, వివరించి= అర్థము వేఱువేఱ ఏర్పడునట్లు, తాను చదివింపవచ్చును = ఒకరిచేత చదివింపవచ్చును, తానును చదువవచ్చును. అధికారిజనముచేన్ = అధికారము గల మనుష్యులచేత, యజ్ఞదానతపంబులు, చేయింపవచ్చును, తానును చేయవచ్చును. అన్యులన్ = ఇతరులను - ఇతరుల ననుట, ఇలలోనన్ = భూమియందుఁ గలతీర్థములకు, ఏఁగన్ = పోవునట్లు, బోధింపవచ్చును = ఉపదేశింప వచ్చును, తానును పోవచ్చును. ఆర్యులకున్ = పెద్దలకు, అష్టాంగయోగ విద్యలన్ = యమ నియమాదు లయిన ఎనిమిది యంగములతోఁ గూడిన మంత్ర హఠ రాజయోగము లనెడు విద్యలను, ఉపదేశింపవచ్చును. తానును, సాధింపవచ్చును = సమర్థింపవచ్చును, కాని = ఇట్లివి యన్ని చేయవచ్చును గాని, ఎవ్వారి కైనన్ = ఎంతటివారికిఁగాని, విజ్ఞానయోగగతిని = జ్ఞానయోగ మార్గముచేత, దేహ + ఇంద్రియములు = దేహమును ఇంద్రియములనును, అరికట్టి = అడ్డగించి - నిగ్రహించి యనుట, మనమును, ఆఁగి = నిలిపి, అంతర్ముఖము చేసి = లోపలిప్రక్కకుఁ దిరిగినవి గావించుకొని - ఆత్మస్వరూపముదెస త్రిప్పి యనుట, అనవరతము = ఎల్లప్పుడు, నిశ్చలసమాధిచేన్=నిర్వికల్పసమాధిరూప మగు నిష్ఠచేత, నిలుపరాదు = నిలుపింప శక్యము గాదు. ఇచట అంతఃకరణము బహిర్ముఖమైనప్పుడు మన స్సనియు అంతర్ముఖ మైనప్పుడు బుద్ధి యనియు చెప్పఁబడును. ఈమనోబుద్ధులకు చిత్తాహంకారములు సహాయములు. కాఁబట్టి చిత్తసహాయము గల

మనస్సును విజ్ఞానస్వరూపము గావించుకొని తనయొక్క ప్రయత్నముచేతనే యనుట యే మనస్సును అంతర్ముఖము సేయుట యని యిట భావము గ్రహించునది.

తా. వేదశాస్త్రము లొకరిచేఁ గఱపవచ్చును, తాను గఱవ వచ్చును; యజ్ఞాదులును నిట్లే యొకరిచేఁ జేయింపవచ్చును, దాను జేయ వచ్చును. ఇట్లన్నియును నొకరిచేతఁ జేయింపనుగాని జేయనుగాని తెలుపనుగాని తెలియనుగాని జెప్పింపనుగాని శక్యమే కావచ్చునుగాని, విజ్ఞానయోగముచేత దేహేంద్రియములను నిగ్రహించి మనస్సును వెలికి రానీక కుండునట్లు అంతర్ముఖముగాఁ ద్రిప్పి నిర్వికల్పసమాధియం దెల్లప్పుడు నిలుపుటమాత్రము మిక్కిలి యసాధ్యము. ౧౩౯

క. చిత్తేంద్రియోపరమము మ
హత్తర మది యెల్లవారి కబ్బదు విను మ
య్యుత్తమదశ గలిగిన వి
ద్వత్తముఁ డతిదుర్లభుఁడు సదా మన్మయుఁడున్. ౧౪౦

టీ. వినుము, చిత్త + ఇంద్రియ + ఉపరమము = చిత్తముయొక్కయు ఇంద్రియములయొక్కయు ఉడుగుట అనఁగా నిగ్రహము, మహత్తరము = మిక్కిలిగొప్పది - అనఁగా చాల దుర్లభ మైన దనుట; ఇది = ఈ మనస్సుయొక్కయు ఇంద్రియములయొక్కయు లయము, ఎల్లవారికిన్ అబ్బదు, ఆ యుత్తమదశ=ఉత్కృష్టమైన ఆ యుపరతియవస్థ, కలిగిన, విద్వత్తముఁడు = గొప్ప విద్వాంసుఁడు - మేటిబ్రహ్మవిదుఁ డనుట, అతిదుర్లభుఁడు = దొరకుట మిక్కిలి అరుదైనవాఁడు, సదా = ఎల్లప్పుడును, మన్మయుఁడున్ = నాస్వరూపము గలవాఁడును (అగును).

తా. మనస్సును నింద్రియములను నుపరతి గలిగియుండుట మిక్కిలి కష్టము. అట్టి యుత్తమస్థితి కలిగినట్టి బ్రహ్మవిదుఁడు మిక్కిలియు దుర్లభుఁడు. వేయేల, పరబ్రహ్మస్వరూపుఁడే కాని, మఱొకటి గాఁడు. ౧౪౦

తే. కొంద ఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు
గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి
నుపరతిసుఖంబు గానక ♦ విపులవిషయ
రాగలోలతఁ జెడుదు రూరక మహాత్మ! ౧౮౧

టీ. మహాత్మ = గొప్పమనస్సు గలవాఁడా - హనుమంతా, కొంద ఱు, ఆత్మతత్త్వము = పరమాత్ముని స్వరూపమును, ఎఱుంగుదుము, అటంచున్, గర్వులై = గర్వము గలవారై, నిక్కి = విఱ్ఱవీఁగి, చిత్తనిగ్రహము లేమిన్ = మనస్సును అడంచుట లేనందున, ఉపరతిసుఖంబున్ = చిత్తాదులు లయించుటవలని ఆనందమును, కానక = పొందఁజాలక, విపులవిషయ రాగలోలతన్ = విస్తారమైన యింద్రియార్థములందలి రక్తివలనఁ గలుగు చాపల్యముచేత, ఊరక = వ్యర్థముగా, చెడుదురు.

తా. కొందఱు బ్రహ్మస్వరూపమును తెలియుదు మని కావరమున విఱ్ఱవీఁగుదురు గాని, మనస్సు నడంపనందున, వారికి నుపరతివలని యానందము తెలియదు. కాబట్టి, పలువిధము లయిన శబ్దాదివిషయములందుఁ దగులువడి వ్యర్థముగాఁ జెడిపోవుదురు. ౧౮౧

తే. జ్ఞానవిజ్ఞానయుతుఁ డయ్యు ♦ సంతతంబు
నాత్మభావన లేకున్న ♦ యతనియింద్రి
యంబులు మనంబు తమకు వశంబుచేసి
విషయసుఖముచవిం జూపి ♦ వెతలఁ బెట్టు. ౧౮౨

టీ. జ్ఞాన...డయ్యును = జ్ఞానముతోను విజ్ఞానముతోను గూడినవాఁడయినను, సంతతంబున్ = ఎల్లప్పుడును, ఆత్మభావన = తన్ను గురించిన చింతనము- బ్రహ్మముకంటె తాను వేఱు గాదనెడి చింతనము ననుట, లేకున్న యతని యింద్రియంబులు = లేకున్నట్టి యామనుజుని పది యింద్రియములును, మనంబున్ = మనస్సును, తమకు, వశంబుచేసి = లోపఱుచు

కొని, విషయసుఖముచవిన్ = విషయానందమునందలి రుచిని, మాఁకి = కనఁబఱచి, వెతలన్ పెట్టున్ = దుఃఖమందుఁ జిక్కించును.

తా. వేదాంతజ్ఞానముగాని లౌకికజ్ఞానముగాని కలిగి యుండినను పురుషుఁడు తానే బ్రహ్మ మని తనస్వరూపమును జింతనము సేయుచుండ వలెను. అట్టిభావన లేనియెడ వాని యింద్రియములును మనస్సును వానిని వశము చేసికొని శబ్దాదివిషయముల రుచిని జూపి చిక్కులఁ బెట్టుచుండును.

సీ. అట్లు గావున నింద్రియమనంబుల నజస్ర
మాత్మభావనచేత నాఁగఁబట్టి
యంతర్ముఖముగాఁగ నలరించి యామోదఁ
గామాదిశత్రువర్గము నడంచి
విమలబోధాకారవృత్తిచేఁ గేవల
పరిపూర్ణతత్త్వరూపంబుఁ గాంచి
యానందమూర్తి వై యఖిలంబుఁ దనయందు
సమయించి చిత్తవిశ్రాంతి నొంది

తే. యొఱుక మఱపులఁ బొరయని యొఱుక వైన
పరమపురుషుండు సుస్థితప్రజ్ఞుఁ డన గు
ణత్రయాతీతుఁ డన నమస్కరాజ
యోగనిద్రాసమేతుఁ డై యుండు మనఘ! ౧౮౩

టీ. అనఘ = పాపరహితుఁడా- ఆంజనేయా, అట్లు కావునన్ = అట్లు ఇంద్రియాదులు వానిని లోఁబఱచుకొనును గనుక, ఇంద్రియమనంబులన్, అజస్రము = ఎల్లప్పుడును, ఆత్మభావనచేతన్ = నేనే బ్రహ్మ మనెడి చింతనచేత, ఆఁగఁబట్టి = నిలువరించి - విచ్చలవిడిగా ప్రవర్తింపనీక యనుట, అంతర్ముఖము కాఁగన్ = లోనియాత్మస్వరూప మగుతనకు అభిముఖముగా, అలరించి = పొందుపఱిచి, ఆమోదన్ = అటుపిమ్మట,

కామాది శత్రువర్గముఁ = కామక్రోధలోభమోహమదమత్సరము లనెడు లోనిశత్రువుల సమూహమును, అడంచి = నిగ్రహించి, విమలబోధ + ఆకారవృత్తిచేఁ = నిర్మల మైనదియును జ్ఞానాకార మైనదియును అగు వ్యాపారముచేత - బ్రహ్మజ్ఞానముయొక్క వ్యాపారముచేత ననుట, కేవల పరిపూర్ణతత్త్వరూపంబుఁ = శుద్ధమైనదియు అఖండమైనదియు నగు యథార్థవస్తు వగు బ్రహ్మముయొక్క స్వరూపమును, కాంచి = దర్శించి, ఆనందమూర్తి యై = నిరుపాధికస్వరూపుఁడై, అఖిలంబుఁ = సకల జగత్తును, తనయందును = తనలోపలను, సమయించి = అడంచి - లయము నొందించి యనుట, చిత్తవిశ్రాంతిఁ బొంది=చిత్తముయొక్క ఉపరతి గలవాఁడై, ఎఱుకమఱపులఁ = జ్ఞానా-జ్ఞానములను - క్షరాక్షరస్వరూపు లగు జీవేశ్వరుల ననుట, పొరయని = అంటని, ఎఱుక యైన పరమపురుషుండు = జ్ఞానస్వరూపము గల పురుషోత్తముఁడు, సుస్థితప్రజ్ఞుఁ డనఁ = మిక్కిలిచలనము లేకున్న జ్ఞానము గలవాఁడు అనునట్లును, బ్రహ్మమే నే ననెడియెఱుకయే నిశ్చలజ్ఞానము, గుణత్రయ అతీతుఁడు అనఁ = సత్త్వాది గుణమును కడచినవాఁ డనునట్లు, లేక, మూలప్రకృతి మహదహంకారము లనెడి మూఁడుగుణముల నంటనివాఁ డనునట్లును, అమనస్క రాజయోగ నిద్రాసమేతుఁడు ఐ = అమనస్క రాజయోగ మనెడు నిద్రతోడ - అట్టి యోగనిద్ర యను సమాధినిష్ఠతోడఁ గూడినవాఁడై, ఉండును.

తా. ఇంద్రియములు మనస్సును, ఆత్మభావన లేనివానిని దమవశము చేసికొని విషయములందుఁ జిక్కించును. కాఁబట్టి యీరెంటిని ఆత్మభావనచేత నడఁచి వెలికి నిగుడనీక లోపలి యాత్మస్వరూపమువంక ద్రిప్పుట కామక్రోధాదులను దూలించి పరిశుద్ధజ్ఞానవృత్తిచేత నఖండపర బ్రహ్మస్వరూపమును దర్శించి యానందమయుఁడై ప్రపంచమునెల్లఁ దన యందు లయింపఁజేసికొని - అనఁగా నంతటను దా నొక్కఁడే తప్ప మఱి రెండవది లేనివాఁడై, ప్రపంచమును బుట్టించెడి మనస్సునుగూడ లయము

నొందించికొని జ్ఞానాజ్ఞానములస్పర్శము లేని పరిపూర్ణజ్ఞానైకస్వరూపుఁడై యుండును. అట్టి పురుషోత్తముఁడే నిశ్చలజ్ఞానసంపత్తి గలిగి మూఁడు గుణములను మీఱి అమనస్కరాజయోగసమాధియందు నెలకొనియుండును.

తే. ధర్మవిధి నెవ్వఁడు మనోగతంబు లైన
సర్వకామంబులను గడు సన్న్యసించి
యంచితాత్మాత్మసంతుష్టుఁ డగుచునుండు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గుమార! ౧౪౪

టీ. కుమార = పుత్త్రా- హనుమంతా! ఎవ్వఁడు, ధర్మవిధిన్ = ధర్మపద్ధతిచేత - విహితములయిన ధర్మమార్గములచేత ననుట, మనోగతంబులు = మనస్సు నంటియున్నవి, ఐన, సర్వకామంబులను = అన్ని కోరికలను, కడున్ = మిక్కిలి, సన్న్యసించి = దిగవిడిచి, * అంచిత ఆత్మ+ఆత్మసంతుష్టుఁడు = ఒప్పుచున్న తన యాత్మస్వరూపమునందే సంతోషించినవాఁడు, అగుచు నుండునో, ఆతఁడు = అట్టి పురుషుఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడు = తనయందు నెలకొన్న జ్ఞానము గలవాఁడు, అగును - అట్టివాఁడే స్థితప్రజ్ఞుం డనఁబడు ననుట.

తా. పురుషుఁ డెవ్వఁడు శాస్త్రవిహితము లయిన కర్మజ్ఞానాదులచేత మనస్సునందలి కామముల నెల్ల దిగవిడిచి తనయాత్మస్వరూపమునందే

---

*ఇట గీతయందు దర్జునుఁడు 'స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ। స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్' అని యడుగఁగా, భగవంతుఁడు చెప్పిన 'ప్రజహాతి యథాకామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్। ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే' అను శ్లోకార్థ మనుసంధింపఁబడెను.

తాను నెలకొని యానందించుచుండునో వాఁడు ఆత్మస్థితప్రజ్ఞుఁ డనఁ బడును. ౧౪౪

*తే. ప్రాప్తదుఃఖములకు భయముఁబడక యోర్చి
కొసరి యప్రాప్తసుఖములఁ గోరికొనక
వీతరాగభయక్రోధుఁడై తనర్చు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గపీంద్ర! ౧౪౫

టీ. కపీంద్ర = వానరశ్రేష్ఠా - ఆంజనేయా, ప్రాప్తదుఃఖములకున్ = కలిగిన దుఃఖములకు, భయపడక, ఓర్చి, కొసరి = ఆశించి, అప్రాప్తసుఖములన్ = కలుగని సుఖములను, కోరికొనక = అపేక్షింపక, వీతరాగభయక్రోధుఁడై = విడువఁబడిన రాగమును భయమును కోపమును గలవాఁడై, తనర్చు నాతఁడు = ఒప్పువాఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడు = తన యందే నెలకొన్న జ్ఞానము గలవాఁడు - తానే బ్రహ్మ మనెడి నిశ్చలబుద్ధి గలవాఁ డనుట, అగును.

తా. ఇంతవఱకుఁ గలిగిన దుఃఖములకు భయపడక ఇంతకును గలుగని సుఖముల కువ్విళ్లూరక యిష్టము లగువానియం దనురక్తిగాని భయంకరము లగు వానియెడ భయముగాని అప్రియకరము లగువానియందుఁ గోపముగాని లేక యుండువాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును. ౧౪౫

తే. అఖిలవిషయానభిస్నేహుఁడగుచు శుభము
నొంది మురియక యశుభంబుఁ నొంది కినియ
కుండు నెవ్వాఁడు సమత నలరప్పుండితుండు
సంస్థితప్రజ్ఞుఁ డగు సూరిజనవరేణ్య! ౧౪౬

---

* ఇట గీతయందలి 'దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః వీతరాగభయక్రోధః స్థితధీ ర్మని రుచ్యతే' అను శ్లోకార్థ మను సంధింపఁబడెను.

టీ. సూరిజనవరేణ్యా = పండితసమూహములందు శ్రేష్ఠుండగువాండా, అఖిలవిషయ + అనభిస్నేహుండు = సమస్తము లయిన శబ్దాదివిషయములందు నెయ్యములేనివాండు, అగుచున్, కావుననే, శుభము నొంది మురియక = మేలు కలిగినందులకు ఉబ్బక, అశుభంబు నొంది కినియక = కీడుం జెందినను కోపింపక, సమతన్ = శుభాశుభములందు సమబుద్ధిచేత, ఎవ్వాండు = ఏమనుష్యుండు, ఉండున్ = ఉండునో, ఆపండితుండు = ఆ బ్రహ్మవిదుండు, సంస్థితప్రజ్ఞుండగున్ = స్థితప్రజ్ఞుండనంబడును.

తా. * శబ్దాదు లగు సమస్తవిషయములయందును నాసక్తి లేనివాండై మేలు కలిగిన సుప్పొంగక, కీడు కలిగినం గోపింపక, రెంటియందును సమబుద్ధి గలిగియుండు విద్వాంసుండే స్థితప్రజ్ఞుం డనంబడును. ౧౮౬

తే. † కూర్మ మఖిలావయవములం గుదియ ముడుంచు
మాడ్కి నేయోగి యింద్రియగ్రామానసముల
నమర మరలించు నింద్రియార్థములవలన
నాతం డాత్మస్థితప్రజ్ఞుండగు మహాత్మ! ౧౮౭

టీ. మహాత్మా, ఏయోగి, కూర్మము = తాంబేలు, అఖిల అవయవములన్ = సకలము లయిన కరచరణాద్యంగములను, కుదియ ముడుంచు మాడ్కిన్ = లోపలికి అడంగునట్లు ముడుంచుకొను విధమున, ఇంద్రియ

---

* యస్సర్వత్రాఽనభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభం। నాభినన్దతి నద్వేష్టి తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా’ యను భగవద్గీతాశ్లోక మీయెడ ననుసంధించునది. ఇట గీతాశ్లోకముల ననుసరించియే యివి రచింపంబడినట్లు తోంచుచున్నది.

† ఇందును ‘యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః। ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా’ యను భగవద్గీతాశ్లోక మనుసంధేయము. ఇట తాంబేలు తన యవయవములను లోని కీడ్చుకొను నట్లు యోగి తనమనస్సును నింద్రియములను లోనికి నడంచుట చెప్పంబడినది.

మానసములను, ఇంద్రియార్థముల వలనన్ = శబ్దాది విషయములనుండి, అమరన్ = ఒప్పుగా, మరలించున్ = త్రిప్పునో, అతఁడు = అట్టియోగి, ఆత్మస్థితప్రజ్ఞుఁడు, అగును.

తా. తాఁబేలు తనయంగముల నెల్ల లోపలికి ముడుఁచుకొనునట్లు యోగి యెవఁడు తనమనస్సును నింద్రియములను వానివానివిషయములనుండి మరల్చి లోనికిఁ ద్రిప్పికొనునో వాఁడు స్థితప్రజ్ఞుఁ డనబడును. ౧౪౭

తే. * విను మొకరహస్య మెఱిఁగింతు ♦ వేయు నేల
యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు
పంచిన ట్లాజ్ఞలో నిల్చి ♦ పనులు సేయు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ ♦ డగు బుధేంద్ర! ౧౪౮

టీ. బుధేంద్ర = పండితసత్తమా, ఒక రహస్యమును, నీకున్, ఎఱింగింతును, వినుము. వేయును ఏల= పెక్కుమాట లెందులకు, ఏమహాప్రాజ్ఞునకున్ = ఏ గొప్ప బ్రహ్మవేత్తకు, మానస ఇంద్రియములు = మనస్సును ఇంద్రియములును, ఆజ్ఞలోన్ =తనపంపునందు, నిల్చి=ఉండి, పంచినట్లు = ఆజ్ఞాపించునట్లు, పనులు = సంకల్పాది కార్యములు, చేయున్ = చేయునో, అతఁడు = ఆబ్రహ్మవిదుఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడు = స్థితప్రజ్ఞుఁ డగుచున్నాఁడు.

తా. హనుమంతా! ఒకరహస్యము చెప్పెదను వినుము. ప్రజ్ఞ గలవాఁ డెవనికి మనస్సును నింద్రియములు లోనయి, యతఁ డాజ్ఞ చేసినట్లు వర్తించునో యట్టివాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును. ౧౪౮

---

* ఇట 'తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః। వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా' అను గీతాశ్లోకార్థ మనుసంధించునది.

ఆ. † ఎల్లభూతములకు నెద్ది శర్వరి దాని
యందు మేలుకని మహాత్ముఁ డలరు
నఖిలజనము దేనియందు మేల్కాని యుండు
నదియె నిశి జితేంద్రియాత్మునకును. ౧౪౯

టీ. ఎల్లభూతములకున్ = జ్ఞానశూన్యమయిన సకలజంతువులకును, ఎద్ది = ఏబ్రహ్మవిషయక మగు ప్రజ్ఞ - అనఁగా బ్రహ్మాకారాకారితవృత్తి, శర్వరి = రాత్రియగునో, గోచరము గాకుండున రాత్రివలెఁ బ్రకాశింపకుండునో యనుట, దానియందు = ఆయాత్మవిషయప్రజ్ఞయందు, మహాత్ముఁడు = గొప్పమనస్సు గలవాఁడు - మనస్సు నంతర్ముఖము చేసి యాత్మను దర్శించునట్టి మహనీయుఁడు, మేలుకని = ప్రబోధము కలిగి, అలరున్ = ఆనందించుచుండును - అనఁగా బ్రహ్మనిష్ఠుఁడై చొక్కుచుండు ననుట; అఖిలజనము = సకలప్రాణిసమూహమును, దేనియందున్ = ఏ శబ్దాదివిషయమైన బుద్ధియందు, అనఁగా ఇంద్రియవిషయాకారవృత్తియందు, మేల్కానియుండున్ = జాగ్రత్త గలిగియుండునో, అదియె = ఆశబ్దాదివిషయికబుద్ధియె, నిశి = రాత్రి - అవిద్యాస్వరూపమై రాత్రివలె ప్రకాశము లేకుండు ననుట.

తా. అజ్ఞానయుక్తము లగుప్రాణులకెల్ల బ్రహ్మస్వరూపము రాత్రియందలివస్తువులవలె గోచరింపకుండఁగా నది పట్టపగటియందువలె జ్ఞానులకుఁ దేటతెల్లముగాఁ దెలియుచుండును. ప్రాణులకుఁ బగటియందువలెఁ దెల్లముగాఁ దెలియుచున్న యింద్రియవిషయాదులు జ్ఞానికి రాత్రియందుం బోలెఁ గనఁబడక యుండును. ౧౪౯

† ఇట 'యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః' అను గీతార్థము సంధింపఁబడినది. అజ్ఞానులకు అంతఃకరణవృత్తి యింద్రియవిషయాకారముగను జ్ఞానులకు బ్రహ్మస్వరూపాకారముగను నుండు నని భావము.

క. అట్లు గావున నింద్రియమనంబుల ననాత్మనిషేధపూర్వ కాత్మావలోకనంబుచేత జయించి వశీకృతమానసేంద్రియుం డయినపుణ్యపురుషుండు, సర్వభూతాద్వేష్టయు, సర్వలోక మిత్రుండు, పరమకారుణికుండు, నిర్మముండు, సమదుఃఖ సుఖుండు, నిరహంకారుండు, క్షమావంతుండు, నిత్య సం తుష్టుండు, యోగారూఢుండు, నియతాత్ముండు, దృఢాత్మ నిశ్చయుండు, నిఖలజనాభయప్రదుం, డఖిలలోక భయ రహితుండు, ముక్తహర్షామర్ష భయోద్వేగుండు, నిరపే క్షుండు, శుచియు, దక్షుం, డుదాసీనుండు, గతవ్యథుండు, పరిత్యక్త సర్వారంభుం, డిష్టానిష్ట ప్రాప్తి హర్ష ద్వేషవిహీ నుండు, సంప్రాప్తేష్ట వియోగదుఃఖవిరహితుం, డప్రాప్తార్థ కామశూన్యుండు, యదృచ్ఛాలాభసంతుష్టుండు, శుభా శుభ పరిత్యాగియు, సమశత్రుమిత్రుండు, సమలోష్టాశ్మ కాంచనుండు, సమశీతోష్ణసుఖదుఃఖుండు, తుల్యప్రియుండు, తుల్యనిందాస్తవుండు, మానావమానతుల్యుండు, మౌన శీలుం, డనికేతనుండు, సుస్థితప్రజ్ఞుండు, గుణాతీతుండు, మద్భక్తుండు, మదర్పితమనోబుద్ధియు, మత్పరాయణుండు నై ప్రకాశించు యోగీంద్రుండు, సంతత సహజామనస్క రాజయోగసమాధియందు సూర్యుండు సముద్రసంబులం బీల్చినతెఱంగున, బడబానలంబు జలరాశిం బానంబుచేసిన కైవడి, మహాదవానలం బరణ్యంబునం గల తృణాదిస పదార్థంబులం గబళించినతెఱంగున, నావిద్యకంబు లైన యనంతగుణంబుల నశేషంబుగా మ్రింగి, కేవలపరిపూర్ణ శుద్ధ చిన్మాత్రస్వరూపకుం డై యుండు నద్దశావిశేషంబు

ఉ. పరతి యన నొప్పు; నపర్యుపరతిప్రాప్తికి యమ నియమ
త్యాగమౌన దేశకాలాసనమూలబంధ దేహసామ్య
దృక్స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమా
ధు లను పంచదశయోగాంగంబులు సాధనంబులు గావున
వానిని వేర్వేఱ విభజించెద నాకర్ణింపుము. ౧౫౦

టీ. అట్లు కావునన్ = అజ్ఞానుల నిద్ర జ్ఞానులకు మేల్కొనుటయు జ్ఞానులనిద్ర యజ్ఞానులకు మేల్కొనుటయు నగుటవలన, ఇంద్రియానుభవంబులను, అనాత్మ... చేతన్ - అనాత్మ = ఆత్మకాని శరీరమును, ఉపేక్ష పూర్వక = విడుచుట ముందుగాఁ గలిగిన, ఆత్మ = పరమాత్మయొక్క, అవలోకనంబుచేతన్ = దర్శనముచేత, జయించి, వశీకృత మానసేంద్రియుండు = వశము చేసికొనఁబడిన మనస్సును ఇంద్రియములును కలవాఁడును, న, పుణ్యపురుషుండు, సర్వభూత వ్యాప్తయున్ = సకలప్రాణులను వ్యాపించినవాఁడును, సమస్తలోక మిత్రుండును = సమస్త జనులకు చెలికాఁడును, పరమ కారుణికుండును = మిక్కిలి దయ గలవాఁడును, నిర్మముండును = నాది యను మమకారము లేనివాఁడును, సమదుఃఖ సుఖుండును = సుఖదుఃఖములు సమముగాఁ జూచువాఁడును, నిరహంకారుండును = నేను అనెడి అభిమానము లేనివాఁడును, క్షమావంతుండును = ఓర్పు గలవాఁడును, నిత్యసంతుష్టుండును = ఎప్పుడును సంతోషము గలిగి యుండువాఁడును, * యోగారూఢుండును = యోగమును బూనినవాఁ



* యోగారూఢుండును = ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానమును అతిక్రమించినవాఁడును - అనఁగా విపరీతము అనుమానము ప్రత్యక్షము నను సంశయము త్రివిధము. అందు దేహేంద్రియములు నే ననుట విపరీతము. నేను దేహేంద్రియములా ఆత్మనా యనుట అనుమానము. నేను దేహేంద్రియములు గాను ఆత్మ ననుట ప్రత్యక్షము, అదియును విడుచుట జ్ఞానము. అట్లు

డును, నియతాత్ముండును = నియమింపఁబడిన మనస్సు గలవాఁడును, దృఢాత్మనిశ్చయుండు = తానే బ్రహ్మ మని దృఢమయిన నిశ్చయము గల వాఁడును, నిఖిలజన అభయప్రదుండు = సకల జనులకు అభయప్రదానము చేయువాఁడును, అఖిలలోక భయరహితుండు = సకలప్రాణులవలనను భయము లేనివాఁడును, ముక్త...డు—ముక్త = విడువఁబడిన, హర్ష = సంతోషముయొక్కయు, అమర్ష = కోపముయొక్కయు, భయ = భయముయొక్కయు, ఉద్వేగుండు = పుట్టుక గలవాఁడు ('స్యాత్ప్రగ ఫల ముద్వేగ ముద్వేగోఽభీతి రుద్గమః' నానార్థరత్నమాల), నిరపేక్షుండు = ఇహపరభోగములం దపేక్ష లేనివాఁడు, శుచియున్ = పరిశుద్ధుఁడును, దక్షుండు = సమర్థుఁడును, ఉదాసీనుండును = తటస్థుఁడును - సుఖదుఃఖములు లేనివాఁడు ననుట, గతవ్యథుండు = పోయినవ్యథలు గలవాఁడును, పరిత్యక్త సర్వారంభుండు = విడువఁబడిన సమస్తములయిన పూనికలు గల వాఁడు, ఇష్టా...హీనుండును - ఇష్ట = ప్రియవస్తువులయొక్కయు, అనిష్ట = అప్రియవస్తువుల యొక్కయు, ప్రాప్తి = కలుగుటయందు, హర్ష = సంతోషమును, ద్వేష = విరోధమును, విహీనుండు = లేని వాఁడును, అప్రాప్త...న్యుండు...అప్రాప్త = లభింపని, అర్థ = వస్తువులయందు, కామశూన్యుండు = కోరికలు లేనివాఁడును, యదృచ్ఛాలాభ సంతుష్టుండు = తనంతటఁ గలిగినలాభముచేత సంతుష్టి నొందువాఁడును, శుభాశుభ పరిత్యాగియున్ = మేలుగీళ్లను విడిచినవాఁడును, సమశత్రు మిత్రుండును = శత్రులందును మిత్రులందును సమబుద్ధి గలవాఁడును—

---

తాను పొందిన నిశ్చయజ్ఞానముచేత నందఱియందలి భ్రమ భ్రమమాత్రమే కాని, వానిని దుఃఖమును బొందింపనేరదు. రజ్జ్వారోపితసర్పము తన్నుం గఱవక యితరులను గఱచునా యను దృఢనిశ్చయముచేత సకలదుఃఖముల నశింపఁజేసిన జ్ఞానాతీతుఁ డని యొకయర్థ మున్నది గాని, యిది గౌరవ గ్రస్తముగా నున్నది.

పగవాఁడు చెలికాఁ డను భేదము లేనివాఁ డనుట, సమలోష్టాశ్మకాంచనుండును = మట్టిపెళ్లయును రాయియును బంగారును సమముగాఁ జూచువాఁడును, సమ శీతోష్ణ సుఖ దుఃఖుండును = సమమైన చల్లఁదనమును వేఁడియును సుఖమును దుఃఖమును గలవాఁడును, తుల్య ప్రియాప్రియుండును = సమములయిన ప్రియమును అప్రియమును గలవాఁడును - వానికి ప్రియమును అప్రియమును లేవనుట. తుల్యనిందా స్తవుండును = సమములయిన నిందయును స్తోత్రమును గలవాఁడును, మానావమాన తుల్యుండును = గౌరవమునందును అవమానమునందును సమానుఁ డయినవాఁడును - ఆ రెంటియందు సమబుద్ధి గలవాఁ డనుట, మౌనశీలుండు = మౌనము స్వభావముగాఁ గలవాఁడును, అనికేతనుండును = ఇల్లు లేనివాఁడును - తలఁచిన చోట వసించువాఁ డనుట, సుస్థిత ప్రజ్ఞుండును = మిక్కిలి నిలుకడ గల జ్ఞానము గలవాఁడును, గుణాతీతుండును = మూఁడుగుణముల కవ్వలివాఁడును - గుణసామ్యుఁ డనుట, మద్భక్తుండును = నాయందు భక్తి గలవాఁడును, మదర్పిత మనోబుద్ధియుఁ = నాయందు ఉంపఁబడిన మనస్సును బుద్ధియుఁ గలవాఁడును, మత్పరాయణుండును = నన్నే ముఖ్యమయిన ప్రాపుగాఁ గలవాఁడును, నాకు లక్ష్యార్థమైన నేనే ముఖ్యమైన స్థానముగువాఁడును, ఐ, ప్రకాశించు యోగీంద్రుండు = ఒప్పుచున్న గొప్ప యోగి - బ్రహ్మవిదుఁ డనుట, సంతత...సమాధియందు—సంతత = ఎడతెగనిదియు, సహజ = స్వభావసిద్ధమయినదియు, అమనస్క = మనస్సు లేనిదియు - మనఃకార్యము లగు సంకల్ప వికల్పములు లేని దనుట, అగు, రాజయోగ సమాధియందు = రాజయోగ మను నిష్ఠయందు, నూత్యందు, సమస్త రసంబులన్ = బావులు కొలఁకులు నదులు మొదలగు సకలమయిన నీటిపట్టులయందును గల జలములను, పీల్చిన తెఱంగునన్, బడబానలంబు = బడబాగ్ని, జలరాశిన్ = సముద్రమును, పానము చేసిన కైవడిన్ = త్రాగినవిధమున, మహాదవానలంబు = గొప్ప కార్చిచ్చు, అరణ్యంబులం

గల, తృణాది సర్వ పదార్థంబులన్ = గడ్డి మొదలగు సకల వస్తువులను
కబళించిన తెఱంగునన్ = మ్రింగిన విధమున, అవిద్యకంబులు = అవి
ద్యాసంబంధములు, ఐన, అనంతగుణంబులన్ = మితిలేని రజస్సత్త్వతమో
గుణాదులను, అశేషంబుగాన్ = కడమ పడకుండునట్లు, మ్రింగి, కేవల...
కుండై — కేవల = ఏకమును, పరిపూర్ణ = అంతట నిండినదియును, శుద్ధ=
నిర్మల మైనదియును, అగు, చిన్మాత్రస్వరూపకుండై = జ్ఞానమాత్రస్వరూ
పముగాఁ గలవాఁడై, ఉండును. అద్దశావిశేషంబు = ఆయవస్థాభేదము,
ఉపరతి యనన్, ఒప్పును, అయ్యుపరతిప్రాప్తికిన్ = అట్టియుపరతి కలు
గుటకు, యమ...సమాధులు = యమము నియమము త్యాగము మౌనము
దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి
ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణము సమాధి అను,
పంచదశయోగ + అంగంబులు = పదియేను యోగములకు అంగము లయి
నవి, సాధనంబులు, కావున, వానిని= ఆ యమ నియమాదులను, వేర్వేఱ =
ఒక్కొక్కటిగా, విభజించెదను = చెప్పెదను, ఆవర్ణింపుము = వినుము.

తా. మనస్సును నింద్రియములును ఆత్మ గావని నిషేధించి తనయాత్మ
స్వరూపమును దర్శనము చేయవలెను. ఆత్మదర్శనముచేత, మనస్సును నిం
ద్రియములును వశ మగును. అట్లారెంటిని లోఁబఱచుకొన్న పుణ్యాత్ముఁడు,
సర్వభూతములను ద్వేషింపకుండుట మొదలగు గుణములు గలిగి నాకు
భక్తుఁడై నాయందు మనస్సును బుద్ధిని లయింపఁజేసి నేనే ముఖ్యస్థానము
గా నుండును. అట్టియోగికి ఎప్పుడు నెడతెగక తనంతటనే సహజముగా
మనశ్శూన్యంబగు రాజయోగసమాధి గలిగియుండును. సూర్యుఁడు సకలజల
ములను బీల్చునట్లును, బడబాగ్ని సముద్రజలమును ద్రావునట్లును, కార్చిచ్చు
అడవిని గాల్చునట్లును, ఆ రాజయోగనిష్ఠ అవిద్యాసంబంధము లయిన
గుణములనెల్లఁ బూర్ణముగా నాశముసేయును. అంతటివాఁడు తాను కేవల
మును బరిపూర్ణమును జ్ఞానైకస్వరూపము నగు బ్రహ్మమై ప్రకాశించుచుం

డును. ఇట్లుండుదశయె ఉపరతి యనఁబడును. ఈ యుపరతికి యమము నియమము మొదలగు పదియేను యోగాంగములు సాధనములు కాఁబట్టి, ఆ యమము మొదలగువానిని వేఱువేఱుగా వివరించి చెప్పెదను. ౧౫౦

అవ. పదియేనుయోగాంగములను జెప్పుచున్నారు.

మ. సమతన్ భూజలవహ్నివాయు ఖ తనూక్ సర్వేంద్రియ ప్రాణచిత్త మనోహంకృతి బుద్ధిరూప బహిరంతర్దృశ్యముల్ దృక్స్వరూపముగాఁ జూచుచుఁ దద్దృగాత్మకపరబ్రహ్మంబు దానంచు నిత్యము భావించిన నాయమం బిది యచింత్యం బంజనానందనా ! ౧౫౧

టీ. అంజనానందనా = ఆంజనేయా, సమతన్ = సమత్వముచేత - అభేదముచేత, భూజలవహ్ని...దృశ్యముల్ = భూమి జలము అగ్ని గాలి ఆకాశము దేహము సకలమయిన యింద్రియములు ప్రాణములు చిత్తము మనస్సు అహంకారము బుద్ధి - అనెడి వీనియొక్క స్వరూపమయిన వెలుపలిదియు లోపలిదియు నగు విషయములను - భూమ్యాదులు బహిర్దృశ్యములు ప్రాణాదు లంతర్దృశ్యములు, దృక్ స్వరూపముగాన్ = సర్వసాక్షిస్వరూపముగా, చూచుచున్, తద్దృగాత్మక పరబ్రహ్మంబు = ఆతని దృక్కుస్వరూపముగాఁ గల యా పరమాత్మ, తాను అంచున్ = తానే యని, నిత్యము = ఎల్లప్పుడు, భావించినన్ = తలంచెనేని, ఆయమం = యమము అనెడి యోగము, ఔను, ఇది, అచింత్యంబు = చింతింప రానిది - వాఙ్మనస్సులకు అగోచరమైనది యనుట.

తా. భూజలాదు లయిన వెలుపలివిషయములను ప్రాణాదు లయిన లోపలివిషయములనన్నిటిని నభేదబుద్ధి సర్వసాక్షి యగు దృక్కుయొక్క స్వరూపమే యనియు, నాదృక్కును పరబ్రహ్మమనియు, నాపరబ్రహ్మ

మును దానే యనియు నిత్యమును భావించుటయే యమము అనఁబడును. హనుమంతా! అది యవాఙ్మనసగోచర మయినది. ౧౫౧

సీ. వినుచు ముట్టుచుఁ గనుఁగొనుచు నానుచు మూరు
కొనుచుఁ బల్కుచుఁ బనుల్ గొనుచుఁ జనుచు
వర్ణాశ్రమోచితవ్యాపారముల నిచ్చ
సలుపుచుఁ దలఁచుచు మెలఁగునెడల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబులఁ
బూని వర్తించు నే వీని కెల్ల
సాక్షిని కేవల సచ్చిదానంద స్వ
రూపుఁడ గుణజాతిరూపనామ

తే. రహితుఁడ నటంచుఁ దెలిసి నిరంతరంబుఁ
దన్నుఁ దాఁ జూచుకొనుచు సత్యముగ నీయ
ఖండనియమంబు వదలక యుండు టరయ
నియమయోగం బనం దగు నిర్మలాత్మ! ౧౫౨

టీ. నిర్మలాత్మ = పరిశుద్ధహృదయము గలవాఁడా, వినుచును ముట్టుచును కనుఁగొనుచును నానుచును మూరుకొనుచును పల్కుచును పనుల్ గొనుచును చనుచును = శ్రోత్రము త్వక్కు చక్షువు మొదలయిన యింద్రియములచేత వినుట మొదలయిన యాయా వ్యాపారములు చేయుచును, వర్ణాశ్రమ ఉచిత వ్యాపారములు = తమతమ వర్ణములకును ఆశ్రమములకును తగిన పనులను, నిచ్చ = నిరంతరము, సలుపుచున్ = చేయుచు, తలఁచుచున్ = మనస్సుచే తలపోయుచు, మెలఁగునెడలన్ = తిరుగు సమయములందు, ఈయింద్రియములు, ఈయింద్రియార్థంబులన్ = శబ్దాదు లయిన యింద్రియ విషయములను, పూని, వర్తించున్ = ప్రవర్తించును, నేను = నేను, వీనికెల్లన్ = ఈ యింద్రియములకును ఇంద్రియార్థములకును

అన్నిటికిని, సాక్షిన్ = ద్రష్టను, కేవల సచ్చిదానంద స్వరూపుఁడన్ = శుద్ధ సత్యజ్ఞానానందములే స్వరూపముగాఁ గలవాఁడను, గుణజాతిరూపనామ రహితుఁడను = త్రిగుణములను బ్రాహ్మణాది జాతులను (పొడుగు కుఱుచ బలుపు పలుచన మొదలగు) రూపములను పేళ్లను, రహితుఁడను = లేనివాఁడను, అటంచున్ = అని, తెలిసి, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, తన్నున్, తాను = ప్రత్యగాత్మ యగు తాను, చూచుకొనుచున్ = ఏకత్వ భావముచే కనుచు, సత్యముగన్, ఈ, అఖండనియమంబున్ = సంపూర్ణమయిన యీ నియతిని, వదలక ఉండుట = విడువకుండుటె, అరయన్ = యోజింపఁగా, నియమయోగంబు = నియమయోగ మని, అనంబడును = చెప్పఁదగును.

తా. * మనుష్యుఁడు వినుట తాఁకుట చూచుట మొదలయిన యాయా యింద్రియ వ్యాపారములను తనతన వర్ణాశ్రమములకుఁ దగిన యాయా కార్యములను జేయుచు మనస్సుచేతఁ దలంపులు దలఁచుచు నుండు నపుడు 'ఆయా యింద్రియములు దానిదాని విషయములందు ప్రవర్తించుచున్నవే కాని నే నేమి చేయలేదు. వీనికెల్ల నేను కేవలసాక్షిని, నేను కేవలము సత్యజ్ఞానానందస్వరూపుఁడను గాన నాకు గుణములు జాతి రూపము నామము కలుగవు' అని తెలిసికొని త న్నెప్పు డిట్టివానినిగా నియమము దప్పక చూచుచుండుటయే నియమము అనఁబడును. ౧౫౨

తే. ప్రత్యగాత్మస్వరూపుఁ డై పరఁగుతనకు
నన్య మైనట్టి దేహేంద్రియాది దృశ్య

---

* ఇచట 'నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ । పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్ । ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి । ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్' అను గీతాశ్లోకార్థము అనుసంధింపఁబడినది.

వితతి యంతయు నొల్లక ♦ విడుచు టరయఁ
ద్యాగ మన నొప్పు నది రాజ♦యోగితిలక ! ౧౫౩

టీ. రాజయోగితిలక = రాజయోగులందు మేటియైనవాఁడా - హనుమంతా, అరయన్ = విచారింపఁగా, ప్రత్యగాత్మస్వరూపుఁడై = కూటస్థస్వరూపము గలవాఁడై, పరఁగు, తనకున్, అన్యమైనట్టి = వేఱయినట్టి, దేహేంద్రియాది దృశ్యవితతి యంతయున్ = దేహము ఇంద్రియములు మొదలయిన లోపలి వెలుపలి దృశ్యములయొక్క సమూహ మంతయును, ఒల్లక = కోరక - అనఁగా తనవి అనెడు అభిమాన ముంచక, విడుచుట యది = వదలుట యనెడి యిదియె, త్యాగము అన నొప్పును.

తా. ప్రత్యగాత్మ యగుతనకు వేఱయిన దేహము మొదలగు బాహ్యాంతర దృశ్యముల నన్నింటిని కోరక దిగవిడుచుటయే త్యాగ మనఁబడును. ఇందు ప్రాణాదులగు నంతర్దృశ్యములనుగూడఁ దెలియునది. ౧౫౩

కవిరాజవిరాజితము.

పలుకులకందక భావమునంటక♦భాసిలు బ్రహ్మము దానగుచుఁ
బలుమఱుఁబల్కక పల్కినచోనవి♦పల్కితినంచుఁదలంపక యే
తలఁపులులేక నిరంతరసౌఖ్యసు♦ధారస మానుచునుండుట ని
ర్మలమగుమౌనముమారుతనందన♦మౌనకదీనిభజింపఁదగున్.

టీ. మారుతనందన = వాయుకుమారా, పలుకులకు అందక = మాటలకు తగులక - వాక్కులచేత నిట్టిదట్టిదని వివరింపరాక యనుట, భావమున్ అంటక = మనస్సును తగులక - మనస్సుచేత ఇట్టి దట్టి దని ఊహింపఁగా రాక, భాసిలు బ్రహ్మము = ప్రకాశించుచున్న బ్రహ్మము, తా నగుచున్, పలుమఱున్ పల్కక = పలుమాఱు మాటాడక - అనఁగా మితభాషియై యనుట, పల్కినచోన్ = మాటలాడినయెడల, అవి పల్కితిన్ = ఆపలుకులు మాటలాడితిని - అంచున్, తలంపక = ఎంచక, ఏతలఁపులు

లేక = ఏ సంకల్పములును లేక - సంకల్పశూన్యుఁడై యుండుట, నిరంతర సౌఖ్యసుధారసమున్ = ఎడతెగని బ్రహ్మానంద మనెడి అమృతరసమును, అనుచున్ = త్రావుచు, ఉండుట, నిర్మలమగు మౌనము = పరిశుద్ధమైన మౌనయోగము - నిర్వాసనా మౌననిష్ఠ యుండుట, దీనిన్ = ఈ మౌన యోగమును, మానక = విడువక, భజింపఁదగున్ = సేవింపవలెను.

తా. అవాఙ్మానసగోచర మైన బ్రహ్మమే తా నని యెఱింగి మాటలాడక మితభాషియై, మాటలాడినను దాను మాటలాడినట్లుగాఁ దలంపక మఱి యేతలంపులును లేక యెడతెగని బ్రహ్మానందరసాస్వాదము ననుభవించుచు నుండుటయే మౌన మనఁబడును. ౧౫౪

సీ. ధీరులచేత నే దేశ మాచార్యోప
దేశంబుచే నర్థిఁ దెలియఁబడియెఁ
బరమపవిత్ర మై భాసిలు నేదేశ
మేదేశ మన్నింటి కెక్కు డయ్యె
నేదేశ మురుమానసేంద్రియప్రాణాది
సంచారశూన్య మై సమత నొప్పు
నేదేశమున సాధ్వసేచ్ఛామదక్రోధ
దుఃఖగంధలవంబు దోఁపకుండుఁ
తే. గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్య మానంద మగుచు నే దేశ మలరు
నదియె యేకాంతదేశ మా నాంజనేయ! ౧౫౫

టీ. ఆంజనేయా = హనుమంతా, ఏదేశము = ఏస్థానము, ధీరుల చేతన్ = పండితులచేత, ఆచార్య + ఉపదేశంబుచేన్ = గురువుల బోధ చేత, అర్థిన్ = అక్కఱతోడ, తెలియఁబడియెన్ = ఎఱుఁగఁ బడియెనో,

ఏదేశము = ఏస్థానము, పరమపవిత్ర మై = మిక్కిలి పావనమై, భాసి లున్ = ప్రకాశించునో, ఏదేశము, అన్నింటికిన్ = అన్ని పవిత్రస్థానములకంటెను, ఎక్కుడయ్యెనో, ఏదేశము, ఉరు...న్యమై—ఉరు = గొప్పవైన, మానస = మనస్సు, ఇంద్రియ = ఇంద్రియములు, ప్రాణ = ప్రాణములు, ఆది = మొదలయిన వానియొక్క, సంచార = ప్రవర్తనము చేత, శూన్యమై = లేనిదై, సమతన్ = అభేదముతోడ, ఒప్పున్ = ప్రకాశించునో, ఏదేశమునన్, సాధ్వ...లవంబు—సాధ్వస=భయము, ఇచ్ఛా= కోరిక, మద = క్రొవ్వు, క్రోధ = కోపము, దుఃఖ = దుఃఖము, అను వీనియొక్క, గంధ = వాసనలయొక్క, లవంబు = లేశమును, తోఁపకుండున్ = కనుపట్టకుండునో, ఏదేశము, కరము = మిక్కిలి, నిరుపద్రవంబు = తాపత్రయము లేనిది, నిష్కంటకంబు = క్షుద్రములయిన కామాది శత్రువులు లేనిది, నిరతిశయము = తనకంటె గొప్పది లేనిది, నిత్యంబు = శాశ్వత మయినది, నిర్మలంబు = ఆణవము మొదలైన మలములు లేనిది, దివ్యము = అప్రాకృత మైనది, ఆనందము = నిరుపాధికసుఖస్వరూప మైనదియు, అగుచున్, అలరున్ = వెలుఁగునో, అదియె = ఆదేశమే - ఏకాంతదేశము, అగును - ఈదేశము కేవలవివిక్తప్రదేశము గాదు. అట్లని, యిది యాచార్యోపదేశము చేత ధీరుల చేతఁ దెలియదఁగిన దని చెప్ప నక్కఱ లేదు. కాఁబట్టి, యిట్టిప్రదేశము తురీయాతీతమై యానందాస్పద మయిన చిదాకాశముగా గ్రహింపఁదగును. కాని, మీఁద 'సువివిక్త' మనుటచే పూర్వోక్తలక్షణలక్షిత మైన ఏకాంతదేశ మనుటయె యొప్పు.

తా. ఆచార్యులచే నుపదిష్టమై పండితులచేతనే గ్రాహ్యమై పరమపావనమై సర్వాధికమై మనస్సు మొదలగువాని సంచారములు లేనిదై భయకామక్రోధాదులవలనిదుఃఖము కొంచెమును కలుగనిదై యుపద్రవమును బాధకములును లేనిదై నిరతిశయమును నిత్యమును నిర్మలమును దివ్యమును ఆనందమయము నైనదేశమే యేకాంతదేశ మనఁబడును. ౧౫౫

తే. అట్టి సువివిక్తదేశంబు ◆ నధిగమించు
ఘనునకు నిరంతరసుఖంబు ◆ గలుగుఁ గాని
యన్యవిజనంబు నొందు దేహాత్మవాది
కబ్బునే నిర్మలానంద ◆ మనిలతనయ ! ౧౫౬

టీ. అనిలతనయ = వాయుపుత్రా, అట్టి సువివిక్తదేశంబు = అట్టి మిక్కిలి యేకాంతమైన ప్రదేశమును, వివిక్తమనఁగా 'వివిక్తం పూతవిజనౌ' అను నమరోక్తిచొప్పున పవిత్రమనియుఁ గలదు గాన, అట్టి ప్రశస్తిగలదగు మహదహంకారాది తత్త్వజన శూన్యప్రదేశ మనియు నర్థాంతరము. అధిగమించు ఘనునకున్ = పొందెడు గొప్పవానికి, నిరంతరసుఖంబు = ఎడతెగని యానందము, కలుగున్, కాని, అన్యవిజనంబున్ = మఱియొక నిర్జనమైనప్రదేశమును, ఒందు = పొందునట్టి, దేహాత్మవాదికిన్ = దేహమే ఆత్మయని వాదించువానికి, నిర్మలానందము = సంసారదుఃఖరహితమైనసుఖము, అబ్బునే=కలుగునా - కలుగదనుట.

తా. అట్టి మిక్కిలి యేకాంతమైన ప్రదేశమును పొందునట్టి మహాత్మునకు, ఎడతెగని బ్రహ్మానందము కలుగును గాని, మఱియొక నిర్జనప్రదేశమును బొందు దేహాత్మవాది కట్టి యానందము గలుగ నేరదనుట తెలియవలెను.

తే. కాల మెద్దానిచేఁ బరికల్పితంబు
యెల్లకాలంబు నొకరీతి ◆ నెద్ది వెలుఁగుఁ
గాలనియమంబు లెందేనిఁ ◆ గానిపింప
వదియె కాలం బనాది యనంత మనఘ. ౧౫౭

టీ. అనఘ = ఆంజనేయా, ఎద్దానిచేన్ = ఏ బ్రహ్మముచేత, కాలము, పరికల్పితంబు = రచింపఁబడినదో, ఎద్ది = ఏ పరబ్రహ్మము, ఎల్లకాలంబున్ = ఎల్లప్పుడును, ఒక్కరీతిన్, వెలుఁగున్ = తేజరిల్లునో,

ఎందేనిఁ = ఏబ్రహ్మమందు, కాల నియమంబులు = వేకువ పగలు మాపు అనెడి కాలనిబంధనలు, కానిపింపవు = కనఁబడవో, అదియె = ఆ పరమాత్మయే, కాలంబు = కాలము - అనఁగా మూర్తము కానిదై ఉత్పత్తి స్థితిలయములు లేనిదై యెప్పుడు నేకరూపమై పరిచ్ఛేదములు లేక యుండు బ్రహ్మమే కాలశబ్దముచేతఁ జెప్పఁబడు ననుట, అట్టి కాలము, అనాది= మొదలు లేనిది - ఉత్పత్తిరహిత మైన దనుట, అనంతము = నాశము లేనిదియు నగును. ౧౫౬

తే. అట్టి యాద్యంత రహిత కాలాత్మ కాత్మఁ
డై నిమేషాది యై ప్రళయాంత మైన
కాలమును దూలకణము నఖండదావ
శిఖిపగిది మ్రింగి యోగి భాసిల్లు ననఘ. ౧౫౭

టీ. అనఘ, యోగి = బ్రహ్మవేత్త, అట్టి...కాత్మఁడై—అట్టి, ఆద్యంత రహిత = ఉత్పత్తి లయములు లేని, కాలాత్మక = కాలస్వరూప మైన, ఆత్మఁడై = పరమాత్మస్వరూపుఁడై, నిమేషాదియై = రెప్పపాటు మొదలుగాఁ గలదై, ప్రళయాంత మైన కాలమున్ = బ్రహ్మ విష్ణు రుద్ర ప్రళయములవఱ కయిన కాలమును, తూలకణమును = దూదిపింజను, అఖండ దావశిఖి పగిదిన్ = అంతట నిండిన కార్చిచ్చువలె, మ్రింగి, భాసిల్లున్ = ప్రకాశించును.

తా. యోగి యగువాఁడు, ఆద్యంతరహితంబును కాలస్వరూపంబు నయిన యట్టి పరబ్రహ్మము తానై, నిముసము మొదలుకొని ప్రళయమువఱకుఁ గల కాలమును, దూదినలుసును పెద్దకార్చిచ్చువలెనే కబళించి వెలుంగు చుండును. ౧౫౭

క. చలనము కాయక్లేశము
నలసతయును జాడ్యనిద్రక లాయాసంబి

మ్మల నెట్టియునికివలనను
గలుగ నది సుఖాసనం బకల్పిత మనఘా! ౧౫౯

టీ. అనఘా, చలనము = కదలికయు - సూక్ష్మశరీరసంబంధి ప్రాణవాయువుధర్మమైన చలన మనుట, కాయక్లేశము = స్థూలదేహధర్మ మయిన దేహకష్టంబును, అలసతయున్ = కారణశరీరధర్మమైన బడలికయు, జాడ్యనిద్రలు = మందత్వమును నిద్దురయును, ఆయాసంబు = శ్రమమును, ఇమ్మలన్ = లెస్సగా, ఎట్టి యునికివలనన్ = ఏ పరబ్రహ్మస్వరూపముగ నుండుటచేత, కలుగవో = పుట్టవో, అది = ఆ యునికియే, సుఖ + ఆసనంబు = సుఖాసన మనఁబడును, అది, అకల్పితంబు = వేఱొకరిచే కల్పింపఁబడరానిది; తానుగాఁ గల్పించుకొనవలసిన దనుట.

తా. సూక్ష్మస్థూలకారణ శరీరముల ధర్మము లగు చలనాదులును మందత్వమును నిద్రయును నే విధ మయిన యునికిచేతఁ గలుగవో యట్టి బ్రహ్మస్వరూప మైన యునికియే సుఖాసనము. అది యన్యులచేతఁ జేయఁ బడరాదు; తానే కల్పించుకొనవలయును. ౧౫౯

ఆ. ఎద్ది సిద్ధ మగుచు నెప్పొద్దు విలసిల్లు
నరసి చూచి యెద్ది యైనయపుడె
సర్వసిద్ధు లొకట సమకూఱు నదియె సి
ద్ధాసనంబు కేవలాత్మరూప! ౧౬౦

టీ. కేవలాత్మరూప = కేవలాత్మయే స్వరూపముగాఁ గలవాఁడా, ఎద్ది = ఏపరబ్రహ్మము, సిద్ధ మగుచున్ = సిద్ధముగా నున్నదై - ఎన్నంటి కైనను స్థిరముగా నెలకొని యనుట, ఎప్పొద్దు = సర్వకాలము, విలసిల్లున్ = ప్రకాశించునో, అరసి = చూచి - అపరోక్ష జ్ఞానదృష్టిచేత పరిశీలించి చూచి, ఎద్ది యైనయపుడె = ఏపరబ్రహ్మము తా నైనప్పుడె, సర్వసిద్ధులు = సకలమైన సిద్ధులు కూడుటలు, ఒకటన్ = ఒక్క సారిగానే, సమకూ

అగుఁ = ఒనగూడునో, అదియె = ఆ పరబ్రహ్మమే, సిద్ధాసనము = సిద్ధాసన మనఁబడును.

తా. ఏది సర్వకాలము తనంతట సిద్ధమై యుండునో, ఏది తా నైనపుడే సకలమైన సిద్ధు లొనగూడునో, యదియే యా పరబ్రహ్మమె సిద్ధాసన మనఁబడును. ౧౬౦

ఆ. బంధములకు మూలబంధంబు ప్రకృతి త
ద్బంధ మెద్ది గనినఁ బాయు నపుడె
యఖిలతత్త్వములకు నాదిమూలం బెద్ది
యదియె మూలబంధ మాంజనేయ ! ౧౬౧

టీ. ఆంజనేయా, బంధములకుఁ = అష్టపాశ బంధములకు, మూలబంధము = ముఖ్యకారణ మయిన బంధము, ప్రకృతి = ప్రకృతియె - ఆణవ కార్మిక మాయామల సహిత మయిన మూలప్రకృతియె, తద్బంధము = ఆ ప్రకృతిబంధము, ఎద్ది గనినపుడె = ఏయాత్మచైతన్యము తా నని చూచినపుడే, పాయుఁ = వీడునో, అఖిలతత్త్వములకుఁ = ముప్పదియాఱు తత్త్వములకును, ఆదిమూలంబు = ముఖ్యకారణము, ఎద్ది = ఏ పరబ్రహ్మమో, అదియె = ఆ పరమాత్మయే, మూలబంధము = మూలబంధ మనెడి యోగము.

తా. అష్టపాశ బంధములకు మూలం బగు బంధము ప్రకృతి. అట్టి ప్రకృతిబంధము దేనిని జూచినంతనే తొలఁగిపోవునో, సకలమైన తత్త్వములకును నాదిమూల మెద్దియో యట్టి పరబ్రహ్మమే మూలబంధ మనఁబడును. ౧౬౧

క. వారినిధియందుఁ జెందిన
యేఱులగతిఁ జిత్సుఖమున నింద్రియవృత్తుల్

చేరి సమభావ మొందుట
యారయఁగా దేహసామ్య మగు వాయుసుతా. ౧౬౨

టీ. వాయుసుతా = వాయుపుత్త్రా, వారిధియందున్ = సముద్రమునందు, చెందిన యేఱులగతిన్ = పొందిన నదులవలె, [illegible]వన్ = బ్రహ్మానందమునందు, ఇంద్రియవృత్తుల్ = ఇంద్రియముల యొక్క రాగద్వేషాది వృత్తులు, చేరి = ఒక్కటిగాఁ గూడి, సమభావ మొందుట = సామ్యము గలిగియుండుట, ఆరయఁగాన్ = పరిశీలింపఁగా, దేహసామ్యము = దేహసామ్య మనెడుయోగము, అగును.

తా. సముద్రమునందుఁ జొచ్చిన నదులవలె బ్రహ్మానందమునందు నింద్రియవ్యాపారము లెల్ల లయించి సామ్యస్థితియం దుండుటయే దేహసామ్య మనెడియోగ మని చెప్పఁబడును. ౧౬౨

సీ. ఏచూపు సకలబాహ్యేంద్రియార్థంబులఁ
గను నది వెలిచూపు కపికులేంద్ర!
యేచూపు వివిధాంతరింద్రియవృత్తులఁ
గను నది లోచూపు కపివరేణ్య!
యేచూపు బాహ్యాంతరింద్రియార్థంబులఁ
గను నది మధ్యలక్ష్యము కుమార!
యేచూపు దగ మానసేంద్రియ షట్కంబు
గను నది షణ్ముఖి దనుజవైరి!
చూచు నేచూడ్కి యీనాల్గుచూపులను న
జస్ర మది శాంభవీదృష్టి సంగరహిత!
యిదియె యన్నింటిలో నెక్కు డిట్టు లగుటఁ
బరమగుహ్యతమం బగుఁ బవనతనయ! ౧౬౩

టీ. కపికులేంద్ర = ఆంజనేయా, ఏచూపు = ఏదృష్టి - (బాహ్య శబ్దదృశ్యములతోఁ గూడిన సవికల్పకమగు దృష్టి యనుట), సకల...ర్థంబులన్ = సమస్తము లయిన వెలుపలియింద్రియములయొక్క, శబ్దస్పర్శాది విషయములను, కనున్ = చూచునో, అది = ఆ దృష్టి, వెలిచూపు = బాహ్యదృష్టి, అగును, కపివరేణ్యా = వానరవర్యా! ఏచూపు = (అంతర శబ్దదృశ్యములతోఁ గూడి సవికల్పమైన) ఏదృష్టి, వివిధ అంతరింద్రియ వృత్తులన్=నానావిధములయిన మనోబుద్ధి చిత్తాహంకారములయొక్క వ్యాపారములను - అనఁగా సంశయ నిశ్చయ చలన కర్తవ్య వృత్తులను, కనున్ = చూచునో, అది = ఆ చూపు, లోచూపు = అంతర్దృష్టి, అగును. కుమార = నాయనా! ఏచూపు = (బాహ్యాంతర దృశ్యములతోఁ గూడి సవికల్పకమైయుండు) ఏదృష్టి, బాహ్య + అంతరింద్రియార్థంబులన్ = వెలుపలి లోపలి యింద్రియవిషయములను, కనున్ = కాంచునో, అది = ఆచూపు, మధ్యలక్ష్యము = అంతరబాహ్యములకు మధ్యమ మగు దృష్టి, ఔను, దనుజవైరి = రాక్షసులకు శత్రుఁడవగు ఆంజనేయా! ఏ చూపు, తగన్ = ఒప్పునట్లు, మానసేంద్రియ షట్కంబున్ = మనస్సును దక్కిన జ్ఞానేంద్రియము లాఱును, కనున్ = చూచునో, అది, షణ్ముఖి = షణ్ముఖీముద్ర, అగును; సంగరహిత = విషయసంగము లేనివాఁడా, ఏచూపు, ఈ నాల్గుచూపులను = బాహ్యము అంతరము మధ్యమము షణ్ముఖి అనెడి యీ నాలుగువిధము లయిన చూపులను, అజస్రము=ఎల్లప్పుడును, చూచున్=కనుఁగొనునో, అది=ఆ దృష్టి, శాంభవీ దృష్టి=శాంభవీ ముద్ర యగును - అనఁగా ఉన్మనీయవస్థ యగును, పవనతనయ = వాయుపుత్రా), ఇదియ = ఈశాంభవీదృష్టియే, అన్నింటిలో నెక్కుడు = సకల దృష్టులలోను అధికమైనది, అట్టు లగుటన్ = ఇట్లది అతిశయించినది కాఁ బట్టి, పరమ గుహ్యతమంబు = ఉత్కృష్టమైన గొప్పరహస్యము, అగును.

తా. సవికల్పకనిష్ఠయందు బాహ్యము లయిన శబ్దదృశ్యములతోఁ గూడిన చూపు వెలిచూపు - అంతరము లయిన దృశ్యములతోఁ గూడిన చూపు లోచూపు బాహ్యములును అంతరములును రెంటినిఁ గను చూపు మధ్యమ మగు చూపు. మనస్సును నింద్రియము లయిదింటిని మాత్రము గను చూపు షణ్ముఖిముద్ర. ఈ నాలుగువిధము లయిన బాహ్యాంతర మధ్యమ షణ్ముఖు లనెడి చూపుల నెప్పుడును జూచుచుండు చూపు శాంభవి యనునది. ఈ శాంభవీదృష్టియే అన్నిటియందును మిక్కిలి ముఖ్య మయినది గాన పరమంబయిన రహస్యం బగును. ౧౬౩

## మాలినీవృత్తము.

దృశ్యమె నాకము దృశ్యమె వాయువు ౯ దృశ్యమె భూజలతేజ
ములున్, దృశ్యమె దేశము దృశ్యమె కాలము ౯ దృశ్యమె
దేహము నింద్రియముల్, దృశ్యమె ప్రాణము దృశ్యమె
చిత్తము ౯ దృశ్య మహంకృతి ధీమనముల్, దృశ్యమె
విద్యయు దృశ్య మవిద్యయు ౯ దృశ్యము గానిది దృక్కర
యన్. ౧౬౪

టీ. అరయన్ = పరిశోధింపఁగా, నాకము = ఆకాశము, దృశ్యమె, వాయువును దృశ్యమె, భూమియును జలమును అగ్నియును దృశ్యములే, దేశము దృశ్యమే, కాలమును దృశ్యమే, దేహమును ఇంద్రియములును [illegible]శ్యమే, ప్రాణమును దృశ్యమే, చిత్తమును అహంకారమును బుద్ధియును [illegible]స్సును దృశ్యములే, విద్యయు దృశ్యమే, అవిద్యయు దృశ్యమే, [illegible] గానిది, దృక్కు = దృష్టి - అనఁగా ద్రష్ట యగు పరమాత్మ[illegible]డే యనుట.

తా. సుగమము. ౧౬౪

*తే. ద్రష్టృదర్శనదృశ్యవిరామ మెచట
నగు నచట దృష్టి నిలుపంగ నగును గాని
చెదరి నాసాగ్రమునఁ జూపుఁ జేర్పఁదగదు
కోరి యమనస్కరాజయోగులకు వత్స ! ౧౬౫

టీ. వత్స = నాయనా, అమనస్క రాజయోగులకున్ = మనస్సు లయించిన రాజయోగనిష్ఠ గలవారికి, ద్రష్టృ...రామము - ద్రష్టృ = చూచువాఁడు, దర్శన = చూపు, దృశ్య = చూడఁదగినది (రూపము) అను వీనియొక్క, విరామము = ఉడుగుట - లయము, ఎచటన్ = ఏ పరబ్రహ్మమునందు, అగున్ = అగునో, అచటన్ = ఆ పరబ్రహ్మమునందు, దృష్టి నిలుపంగనగును గాని=చూపు చేర్పవలయునే కాని, చెదరి= కలఁతపడి - భ్రమించి యనుట, నాసాగ్రమునన్ = ముక్కుకొనయందు - భ్రూమధ్యమునం దనుట, చూపును, చేర్పఁదగదు = నిలుపరాదు.

తా. దేనియందు ద్రష్టయును దర్శనమును దృశ్యము ననెడి యీ మూఁడును లయము నొందునో యాపరబ్రహ్మమందే దృష్టిని నిలుపవలయును గాని, యమనస్క రాజయోగులకు నాసాగ్రమునందుఁ జూపు నిలుపరాదు చుమీ. ౧౬౬

శా. ప్రాణాంతఃకరణేంద్రియాద్యఖిలసద్భావంబులన్ భూషణ
శ్రేణిన్ స్వర్ణముగా నెఱింగినగతిన్ జిన్మాత్రముంగాఁగఁ ద
త్ప్రాణాంతఃకరణాదివృత్తులునశింపంచుందన్నుఁగాఁగాంచినం
బ్రాణాయామ మనంగనొప్పు నిది సంభావ్యంబు మేధానిధీ!

టీ. మేధానిధీ = బుద్ధికి నిధానమయినవాఁడా - ఆంజనేయా, భూషణశ్రేణిన్ = ఆభరణసమూహమును, స్వర్ణముగాన్ = బంగారు-

---

* 'ద్రష్టృదర్శనదృశ్యానాం విరామో యత్రవా భవేత్ । దృష్టిస్తత్రైవ కర్తవ్యా న నాసాగ్రావలోకనమ్' అని యిందులకు ప్రమాణము.

ఎఱింగినగతిఁ = తెలిసినట్లు, ప్రాణాం...బులక్ — ప్రాణ = పంచ ప్రాణముల యొక్కయు, అంతఃకరణ + ఇంద్రియ + ఆది = లోపలి వెలుపలి యింద్రియములు మొదలగువానియొక్కయు, అఖిల = సకలము లయినవియు, సత్ = శ్రేష్ఠము లయినవియు నగు, భావంబులక్ = పదార్థ ములను, చిన్మాత్రము కాఁగ = జ్ఞానైకస్వరూప మగు పరబ్రహ్మము గాను, ఆబ్రహ్మమును, తన్నుఁగాను, కాంచినక్ = చూడఁగా, తత్ ప్రాణ అంతఃకరణ ఆదివృత్తులు = ఆప్రాణము అంతఃకరణము మొదలగువాని యొక్క సంకల్పాదివృత్తులు, నశించుక్ = క్షీణించును - అనఁగా బ్రహ్మ మందు లయించి బ్రహ్మీభూత మగు ననుట. ఇది = ఇట్లు కాంచుటయే, ప్రాణాయామము, అనంగ, ఒప్పును, సంభావ్యంబు=మిక్కిలి తెల్పఁగా ఊహింపఁదగినది, లేక మిక్కిలిగా గారవింపఁదగినది.

తా. ప్రాణము అంతఃకరణము ఇంద్రియములు మొదలగువానినెల్ల, భావములనెల్ల బంగారుగాఁ దెలిసినట్లు, జ్ఞానైకస్వరూప మగు బ్రహ్మము గాను, ఆ బ్రహ్మమును దన్నుఁగాను గాంచినపుడు ప్రాణాదులకుఁ గల వృత్తులన్నియు నశించును. అట్లగుటయే ప్రాణాయామయోగ మనఁబడును.

మ. వెలిలోఁ గన్పడునామరూపవితతిన్ వేమాఱు రేచించి యి
మ్ములసచ్చిత్సుఖరూపతత్త్వముమదింబూరించియామీఁదని
శ్చలమైతన్మయమైతగన్ మనమునన్ శాంతంబుగుంభించినన్
నలువొప్పన్ బుధసేవ్యమైతనరుప్రాణాయామయోగంబగున్.

టీ. వెలిలోన్ = మనస్సునకు బయటను లోపలను, కన్పడు నామ రూపవితతిన్ = అగపడుచున్న కామక్రోధ ఘటపటాది నామముల యొక్కయు, వాని అంతర్బహిర్ద్రవ్యముల యొక్కయు, వితతిన్ = సమూహమును, వేమాఱు = పలుమాఱు, రేచించి = వేఱుచేసి - అనఁగా నివియెల్ల ప్రకృతికల్పితములు గావున నేను గా నని నిరసించి, ఇమ్ములన్ =

చక్కఁగా, సత్ చిత్ సుఖరూపతత్త్వముఁ = సచ్చిదానందరూపమైన పరబ్రహ్మమును, మదిఁ = అంతరంగమందు, పూరించి = నిండించి - సంశయాదులులేక బ్రహ్మమే నే నని కనుఁగొనియనుట, ఆమీఁదఁ = అటు పిమ్మట, నిశ్చలమై = చలనములేనిదై, తన్మయమై = ఆ పరమాత్మస్వరూపమై, తగఁ, అశ్రాంతంబు = ఎల్లప్పుడును, మనముఁ = మనస్సును, కుంభించి నఁ = కుంభముచేసినను - బ్రహ్మమందు లయింపఁజేసిన ననుట, నలువొప్పఁ = ఒప్పిదముగా, బుధసేవ్యమై = బ్రహ్మవిదులచేత సేవింపఁదగినదై, తనరు = ఒప్పు, ప్రాణాయామయోగంబు, అగును.

తా. మనస్సులోపలను వెలుపలను దోఁచుచుండు నామములను రూపములను వెడలద్రొచ్చి సత్యజ్ఞానానందస్వరూప మగు బ్రహ్మమే తా నని భావించుచు మనస్సును చలనము లేక బ్రహ్మమయమై యుండునట్లు కుంభింపఁగా ప్రాణాయామయోగ మనఁబడును. ౧౬౭

క. సత్యానృతవిషయంబులఁ
ప్రత్యగ్బోధస్వరూపకపరమాత్మునిఁ గా
నిత్యము నవలోకించుట
ప్రత్యాహారం బనంగఁ ౯ బరఁగుఁ గపీంద్రా! ౧౬౮

టీ. కపీంద్రా = హనుమంతా, సత్య అనృత విషయంబులఁ = సత్య మగు పరబ్రహ్మముయొక్కయు అసత్య మగు ప్రకృతియొక్కయు, విషయంబులఁ = గుణములను - బ్రహ్మముయొక్క సచ్చిదానంద నిత్య నిర్మల శాంతశమదమాద్యనంత కల్యాణగుణములను ప్రకృతియొక్క కా క్రోధలోభమోహాది దుర్గుణములను, ప్రత్యగ్బోధ స్వరూప పరమాత్మునిఁ గాఁ = తన యాత్మజ్ఞానస్వరూప మగు పరబ్రహ్మముగా, నిత్యముఁ = ఎప్పుడును, అవలోకించుట = చూచుటయె, ప్రత్యాహారంబు, అనఁగన్ పరఁగును = అనఁగా ఒప్పును.

తా. సత్యం బగు బ్రహ్మముయొక్క సచ్చిదానంద శాంతత్వము మొదలగు గుణములను ప్రకృతియొక్క కామక్రోధాది గుణములను దన యాత్మస్వరూపమే స్వరూపముగాఁ గల పరమాత్ముఁడే యని నిశ్చయము సేయుచుండుటయే ప్రత్యాహారయోగ మనఁబడును. ౧౬౯

తే. మహితదేహేంద్రియప్రాణమానసాది
దృశ్యములు గాను నే వీనిఁ దెలియుచుండు
దృక్స్వరూపుఁడ ననుచుఁ జింతించు టరయ
ధ్యానయోగంబు బ్రహ్మవిద్యానిధాన! ౧౭౦

టీ. బ్రహ్మవిద్యానిధాన = బ్రహ్మవిద్యకు నిధియైనవాఁడా, మహిత... ములు—మహిత = ఒప్పిదములైన, దేహ = దేహములు, ఇంద్రియ = ఇంద్రియములు, ప్రాణ = ప్రాణములు, మానసాది = మనస్సు మొదలయిన వగు, దృశ్యములు = గోచరపదార్థములు, కాను = నేను గాను, నేను = శేవలాత్ముఁడ నగు నేను, వీనిన్ = ఈ దృశ్యములను, తెలియుచున్ = ఎఱుఁగుచు, ఉండు, దృక్ స్వరూపుఁడను = సాక్షిస్వరూపుఁడను, అనుచున్, చింతించుట = ఎంచుట, అరయన్, ధ్యానయోగంబు = ధ్యానయోగ మనఁబడును.

తా. దేహములు ప్రాణము లింద్రియములు మొదలయిన దృశ్యము లన్నియును నేను గాను. నేను వీని నెల్లఁ దెలియుచుండునట్టి సాక్షి నని తలంచుచుండుటయే ధ్యానయోగము. ౧౭౦

క. హృదయస్థుడు బ్రహ్మమని మది యె
య్యది గనుఁగొను నదియె బ్రహ్మ మను నద్గుణి నా
హృదయంబున నిలుపుట దీ
ననదయాపర పరమధారణాయోగ మగున్.

టీ. దీనదయాపర = దీనులయందు దయగలవాఁడా, మది = మనస్సు - కర్తృకరణకార్యాత్మక మైనది, ఎద్ది తలఁచున్ = దేనిని సంకల్పించునో, మది = మనస్సు, ఎయ్యది కనుఁగొనున్ = దేనిని చూచునో, అదియె = ఆ తలఁచినదియు చూచినదియు నే, బ్రహ్మము = పరమాత్మ, అను ఆ గుఱిన్ = అనెడి ఆ లక్ష్యమును, ఆ హృదయంబునన్ నిలుపుట = ఆ మనస్సునందే నెలకొలుపుట, పరమధారణాయోగము = ఉత్కృష్ట మైన ధారణ అనెడి యోగము, అగును.

తా. మనస్సుచేతఁ దలంచునదంతయు చూచునదంతయును బ్రహ్మమే యని యీ నిశ్చయమును హృదయమందు నిశ్చలముగా నుంచుకొనుటయె * ధారణాయోగ మనఁబడును. ౧౬౦

క. సర్వావస్థలయందును
సర్వంబును బ్రహ్మ మనుచు సతతముఁ గనినన్
సర్వవికృతిరహితసహజ
నిర్వాణసమాధి యగు వినిర్మలరూపా! ౧౬౧

టీ. వినిర్మలరూపా = మాలిన్యరహిత మగు స్వరూపము గలవాఁడా - ఆంజనేయా, సర్వావస్థలయందున్ = సమస్తమైన జాగ్రత్త మొదలయిన అవస్థలయందు, సర్వంబును = ఆయా యవస్థలయందుఁ దోఁచిన సమస్తభోగ భోగ్యసాధన శూన్య సాక్షాత్కారము లనెడి సకలమును, బ్రహ్మము అనుచున్, సతతమున్ = ఎల్లప్పుడును, కనినన్ = చూచె

* ఇందులకు 'యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్ । యద్యత్స్పృశతి హస్తాభ్యాం తత్త...యేత్.' 'యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్త...యేత్' (కైవల్యోపనిషత్తు). మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యైరపీన్ద్రియైః। అహమేవ న మత్తోఽన్యదితి బుధ్యధ్వ మఞ్జసా (భాగవతము).

లేని, సర్వ...మాధి—సర్వ = సమస్తములయిన, వికృతి = భోగ్యము మొదలయిన చతుర్విధ కారణములను, రహిత = లేని, సహజ = స్వాభావసిద్ధమైన, నిర్వాణసమాధి = కైవల్యనిష్ఠ, అగును.

తా. జాగ్రత్తు స్వప్నము సుషుప్తి తురీయము మొదలగు నవస్థలయం దెల్లఁ దోఁచుచుండు నానావిధ భోగ్య భోగ సాధనాదు లయిన వస్తువుల నన్నిటిని పరబ్రహ్మమే యని యెప్పుడును జూచినయెడల, సమస్త వికారములు లేక సహజమై యొప్పు నిర్వాణసమాధి కలుగును. ౧౭౧

క. ఈపదియేనంగంబుల
దీపితవిజ్ఞానసూక్ష్మదృష్టి ననిశమున్
జేపట్టి యభ్యసించు మ
హాపురుషున కబ్బుఁబరమ మగు నుపరమమున్. ౧౭౨

టీ. ఈ పదియేను అంగములన్ = యమము మొదలయిన నిర్గుణోపాసనాంగములను, దీపితవిజ్ఞాన సూక్ష్మదృష్టిన్ = వెలుఁగుచున్న బ్రహ్మజ్ఞానమువలని సూక్ష్మపుఁజూపుచేత, అనిశమున్ = ఎల్లప్పుడును, చేపట్టి = పరిగ్రహించి, అభ్యసించు మహాపురుషునకున్ = అలవాటుచేయు గొప్పవానికి - బ్రహ్మవేత్తకనుట, పరమము = ఉత్కృష్టము, అగు, ఉపరమమున్ = ఉపరతియు, అబ్బును = కలుగును.

తా. నిర్గుణోపాసన కంగము లైన యమము మొదలగు నీ పదియేను సూక్ష్మమగు బ్రహ్మజ్ఞానదృష్టిచేఁ గాంచి, యలవాటుచేయు బ్రహ్మవిదునకు నుత్తమం బగు నుపరతి సిద్ధించును. ౧౭౨

క. చిత్తోపరమము గల పురు
షోత్తముఁడు జగంబు మఱచి యుండున్ జ్ఞానో
న్మత్తపిశాచనిభుం డై
యెత్తఱి సుప్తునికరణి నిరింద్రియుఁ డగుచున్. ౧౭౩

టీ. చిత్త + ఉపరమము = చిత్తలయము, కల, పురుషోత్తముఁడు = పురుషశ్రేష్ఠుఁడు, నిరింద్రియుఁడగుచున్ = ఇంద్రియములు లేనివాఁడై - వానిని గెలిచినవాఁడై యనుట; బాల...నిభుండై = బాలునితోడను వెఱ్ఱివానితోడను భూతముతోడను సమానుఁడై, ఎత్తఱిన్ = ఏసమయమందును, సుప్తనికరణిన్ = నిద్రించువానివలె, జగంబున్, మఱచియుండును.

తా. చిత్తోపరతి గల మహాపురుషుఁడు బాలునివలెను వెఱ్ఱివానివలెను భూతమువలెను గనఁబడుచు నెప్పుడును నిదురించువానివలె లోకమును మఱచి యుండును. ౧౭౩

శా. గాలిం దూలిన వానచేఁ దడిసినన్ శ్రీ గాఢాగ్నిచేఁ గాలినన్, వ్యాళం బాత్మవిముక్తకంచుకముపై శ్రీ వ్యామోహముం దాల్పన, ట్లాలోలాంగముపై నిరూఢమమతాశ్రీహంకారముల్ లేక యా, త్మాలోకస్థితి నుండుఁ బండితుఁడు ని శ్రీత్యానందముం బొందుచున్. ౧౭౪

టీ. పండితుఁడు = విద్వాంసుఁడు - బ్రహ్మవేత్త యనుట, గాలిన్ తూలినన్ = గాలిచే కీడ్పడినను, వానచేన్, తడిసినను, గాఢాగ్నిచేన్ = తీవ్రమైన అగ్నిచేత, కాలినను, వ్యాళంబు = సర్పము, ఆత్మవిముక్తకంచుకముపైన్ = తనచేత విడువఁబడిన కుబుసముమీఁద, వ్యామోహమున్ తాల్పనట్లు = మక్కువ ఉంపనట్లు, ఆలోల అంగముపైన్ మిక్కిలి చంచలమగు దేహముమీఁద, నిరూఢ మమతా అహంకారములు నిశ్చలములైన మమకారమును అహంకారమును - ఈదేహము నాది యనికాని నేనే అనికాని అనుసంధించుట యనుట, లేక, నిత్య ఆనందమున్ = బ్రహ్మానందమును, పొందుచున్ = అనుభవించుచు, ఆత్మ+ఆలోకస్థితిన్ =

పరమాత్మదర్శనమందలి ఉనికిచేత, ఉందును - దానిని స్థిరముగా దర్శిం చుచు నుందు నని భావము.

తా. ఆత్మజ్ఞానము గలవాఁడు, తనదేహము గాలికిఁ గొట్టుబడినను, వానచేఁ దడిసినను, అగ్గిచేఁ గాలినను, పాము తాను విడిచిన కుబుసము మీఁద మక్కువ లేకుండునట్లు, తాను నాదేహముమీఁద మమకారమును నహంకారమును లేక యాత్మదర్శనము చేయుచు బ్రహ్మానందము నొందు చుండును. ౧౭౪

మ. మదిరాపానమదాంధుఁ డాత్మపటమున్ మైనుండినన్ జాఱినన్, వదులై వ్రేలినఁజూడఁడప్పగిదిజీవన్ముక్తుఁ డుద్యత్సమాధిదశాప్రాప్తసుఖామృతానుభవతృప్తిన్ మత్తుఁడై మేను నెమ్మదిఁ గూర్చుండిన లేచిన న్నడచినన్ మన్నింపఁడే నంచుఁ దాన్. ౧౭౫

టీ. మదిరా...ధుఁడు—మదిరాపాన = మద్యము త్రాగుటవలని, మద = మత్తుచేత, అంధుఁడు = కన్నుఁ గాననివాఁడు, ఆత్మపటమున్ = తన వస్త్రమును, మైన్ = దేహమందు, ఉండినను, జాఱినను, వదులై, వ్రేలినను = జీరాడినను, చూడఁడు = పాటింపఁడు; అప్పగిదిన్ = ఆవిధమున, జీవన్ముక్తుఁడు = దేహముతోనే ముక్తి నొందినవాఁడు, ఉద్య... తృప్తిన్—ఉద్యత్ = పొడముచున్న - ప్రాప్తమై వెలుఁగుచున్న, సమాధిదశా = బ్రహ్మనిష్ఠ అను నవస్థయందు, ప్రాప్త = కలిగిన, సుఖామృత = బ్రహ్మానందమనెడు అమృతముయొక్క, అనుభవ = అనుభవించుటచేతఁ గలిగిన, తృప్తిన్ = తనివిచేత, మత్తుఁడై = మై మఱచినవాఁడై - మైమఱచి యుండుట, మేను = దేహము, నెమ్మదిన్ = స్వస్థముగా, కూర్చుండినను, లేచినను, నడచినను, తాను, ఏ నంచున్ = అశరీరమే నే నని, మన్నింపఁడు = గారవింపఁడు.

తా. కల్లు త్రావి మత్తు గొన్నవాఁడు, తనవస్త్రము దేహమం దున్నను దేహమునుండి జాఱినను వదులుగా జీరాడినను బాటింపనట్లే, * జీవన్ముక్తుఁడును సమాధియందలి బ్రహ్మానందమువలనఁ జొక్కి కూర్చున్నను లేచినను నడచినను దేహమును నేనే యది యని యెంతమాత్రమును పాటింపఁడు. ౧౬౫

మ. తరుణీనందన బంధుసాధురిపు మిత్రవ్రాతముల్ తన్నుఁ బ
ల్మరు నిందించిన సన్నుతించిన మహామానావమానాదు
లన్, నెఱినొందించిననిర్వికారుఁడగుచున్ నిశ్చేష్టుఁడై యుం
డు భాస్వరతత్త్వానుభవజ్ఞుఁ డెయ్యెడలజీవత్యక్త దేహస్థితిన్.

టీ. భాస్వరతత్త్వ + అనుభవజ్ఞుఁడు = ప్రకాశించుచున్న యథార్థవస్తువగు బ్రహ్మమును అనుభవించుట తెలిసినవాఁడు, ఎయ్యెడలన్ = ఎచ్చోటనైనను, తన్నున్, పల్మరున్ = పలుమాఱు, తరుణీ... వ్రాతముల్—తరుణీ = భార్యలు, నందన = పుత్త్రులు, బంధు = చుట్టములు, సాధు = సత్పురుషులు, రిపు = శత్రులు, మిత్ర = మిత్రులు, (వీరి యొక్క), వ్రాతములు = గుంపులు, నిందించినన్, సన్నుతించినన్ = పొగడినను, మహా + మాన + అవమాన + ఆదులన్ = మిక్కిలియైన గౌర

* జీవన్ముక్తుఁడు విదేహముక్తుఁ డని ముక్తు లిరువురు. జీవన్ముక్తుఁ డనఁగా బ్రదికియున్నపుడే దేహముతోనే ముక్తినొందినవాఁడు. విదేహముక్తుఁడు = దేహము విడిచిన పిదప ముక్తి నొందినవాఁడు. మనోలయము స్వరూపలయ మని అరూపలయమని రెండువిధములు. మొదటిది జీవన్ముక్తునియందును, రెండవది విదేహముక్తునియందును నుండును. మనస్సు దగ్ధపటమువలె నుండుట స్వరూపలయము. ఆ దగ్ధవస్త్రము గాలిచే ఎగిరిపోయినట్లు ప్రారబ్ధము దేహముతో నశించుటయే అరూపలయము. ఇవి రెండును వరుసగా వారిద్దఱకు నుండు నని తెలియునది.

వము లాఘవము మొదలగువానిని, వెతికి = క్రమముగా, ఒందించినక = పొందించినను - తనకుఁ గలిగించినను, నిర్వికారుఁడు = వికారములు (అనఁగా భేద మోదములు) లేనివాఁడై, నిశ్చేష్టుఁడై = ఇంద్రియవ్యాపారములును లేనివాఁడై, జీవత్యక్త దేహాకృతిక = ప్రాణము లేని బొంది వలె, ఉండును.

తా. బ్రహ్మస్వరూపానుభవము గల పురుషుఁడు తన్ను భార్యాపుత్త్రాదులు నిందించినను స్తుతించినను, గొప్పగౌరవము గాని లాఘవము గాని కలిగించినను, సంతోషముగాని దుఃఖముగాని లేక యేచేష్టలు చేయక ప్రాణము లేని బొందివలె నుండును. ౧౭౬

ఆ. బహుళసంకటములు ప్రాప్తంబులైనచోఁ
దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు
వాయు శీత వహ్ని వర్షాతపంబుల
కించుకైన గిరి చలింపనట్లు. ౧౭౭

టీ. గిరి = కొండ, వాయు...ఆతపంబులకుక = గాలి చలి నిప్పు వాన ఎండలకు, ఇంచుకైనక = కొంచెమైనను, చలింపనట్లు = కదలని విధమున, ఆత్మతత్త్వవిదుఁడు = ఆత్మస్వరూపమును దెలిసినవాఁడు, బహుళ సంకటములు = పెక్కులు ఇక్కట్లు, ప్రాప్తంబులైనచోక = సంభవించినపుడు, తల్లడింపఁడు = వ్యాకులపడఁడు.

తా. ఆత్మస్వరూపమును జక్కఁగాఁ దెలిసి యనుభవించుచుండు పురుషుఁడు, గాలి చలి మొదలగువాని కెంతమాత్రము కొండ చలింపకుండునట్లే, సంకటము లెన్ని కలిగినను దా నెంతయును మనస్సునందుఁ దల్లడపడకయే యుండును. ౧౭౭

వ. ఇట్టి వైరాగ్య బోధోపరతి యుక్తుం డైన జీవన్ముక్తుండు, ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వ సాక్షాత్కార ప్రచండ

మార్తాండ ప్రకాశ నిరస్తానాద్య నిర్వచనీయాజ్ఞానాంధ కార పటలుండు, పరిత్యక్త వర్ణాశ్రమాచార కోలాహలుండును, నిరంతర చిత్తవిశ్రాంతి పరాయణుండు, విషయాసక్తి వివర్జితుండు, ప్రబల ప్రారబ్ధాధీన శరీర చేష్టుం డంతస్సుఖుం, డంతరారాముం, డంతఃప్రకాశుం, డాత్మ రతుం, డాత్మతృప్తుం, డాత్మసంతుష్టుండు, దూరీకృత దురితక్రియుండు, ప్రశాంత మానసుండు, విజితేంద్రియుండు, కృతకృత్యుండు, ప్రాప్తప్రాప్తవిహీనుండు, సర్వ వ్యవహారాతీతుం, డశరీరుండు, సర్వశరీరస్థుండు, నిరింద్రియుండు, సర్వేంద్రియ ద్రష్టయు, నప్రాణుండు, సర్వ ప్రాణి ప్రేరకుండు, సర్వేంద్రియోపశాంతి సుఖరసికుండు, వివేకహృత్సంగుండు, నిత్యాసంగుండు, ప్రజ్ఞాప్రౌఢసఖీ సహాయుం, డసహాయుండు, దృఢాపరోక్షాత్మ నిశ్చయ సంపన్నుండు, వర్ణాశ్రమ సదాచార దురాచార కామ క్రోధ లోభ మోహ దంభ దర్ప కుహక క్రౌర్య శౌర్య జాడ్య మాత్సర్య ద్వేష కార్పణ్య నిందా స్తుతి మానావమానేర్ష్యాసూయా దయా నైష్ఠుర్య వాక్పారుష్యాది నానా విధ చిత్త వికారరహితుండు, స్త్రీవాస నార్థవాసనా ప్రతిష్ఠావాసనా శాస్త్రవాసనా దేహవాసనా లోకవాసనా కర్తృత్వ భోక్తృత్వాది వాసనా వివర్జితుండును, విగత బ్రహ్మవేత్తృత్వాభిమాన వాసనుండు, నిత్యనిర్మలుండు, నిత్యశాంతుండు, నిత్యోదాసీనుండు, నిష్ప్రపంచుం, డవ్యక్త మహదహంకార పంచతన్మాత్రాకాశాది సర్వ ప్రపంచ మాయాగంధర్వ నగరాశ్రయుండు, నిరాశ్రయుం

ను, సర్వావభాస కేవల చిదాకాశమాత్రుండును, పరమ సుఖైకస్వరూపకుండును, దూరీకృత సంసారుండును, దేహేంద్రియ గుణాతిరిక్తుండును, దేవతా స్పృహణీయ శీలుండును, నానాపాశ వినిర్ముక్తుండును, రాజసతామసవస్తు సేవా దూరుండు, సాత్త్వికవస్తు సేవావిజిత నిద్రుం, డక్రియాత్మ పూజాపరుండు, మౌన జపపరాయణుం, డచింత్యధ్యాన నిష్ఠుం, డనిచ్ఛా సుఖ తత్పరుండు, విశ్వ వంద్యుండు, యథేచ్ఛాసంసారశీలుండు, ధీరుండు, దాంతుండు, నిత్య ప్రబుద్ధచిత్తుండు, స్వాత్మసమాధినిష్ఠుండు, జగదింద్రజాల ద్రష్టయు, విశేషప్రాప్తాశేష పురుషార్థుండు, త్యక్తాశేష విశేషదుఃఖుం, డధిగత పరమస్వాస్థ్యుండు, సంగృహీత చిత్తుండు, మితవాక్యుండు, పరమకారుణికుండు సర్వభూత మిత్రుండు, పేశలాచార మధురుండు, పాణిపాత్రే నిపతిత మాత్రాశనుండు, యోగారూఢుండు, తితిక్షుండు, పరమైకాంతికుండు, నిష్కళంకుండు, నిస్పృహుండు, ప్రారబ్ధ వశప్రాప్త దేహేంద్రియాది వ్యాపారరూప పుణ్యాపాప క్రియాకర్తృత్వాభిమాన పూర్వక ముఖవికాస దైన్య శూన్యుండును, సదాప్రసన్న చిత్తుండు, వికసిత ముఖుండు, దుష్టశిష్టజన సంగదూరుండు, సాధువిద్వజ్జన సంగుండు, సర్వపదార్థోపేక్షాబుద్ధి యుక్తుండు, కుశలాకుశలక్రియా దూరుండు, వేదాంతశాస్త్ర విచారఘోరదావానల భస్మీకృత వేదశాస్త్రాగమ పురాణగుర్వీశ్వర విధి ప్రతిషేధాది వాసనారణ్యుం, డవ్యక్తలింగుం, డవ్యక్తాచారుం, డేకచారియు, ననికేతనుండు, గిరిగుహా విహారుండు, మృత్యు

మార్తాండ ప్రకాశ నిరస్తానాద్య నిర్వచనీయాజ్ఞానాంధ కార పటలుండు, పరిత్యక్త వర్ణాశ్రమాచార కోలాహలుండును, నిరంతర చిత్తవిశ్రాంతి పరాయణుండు, విషయాసక్తి వివర్జితుండు, ప్రబల ప్రారబ్ధాధీన శరీరచేష్టుండంతస్సుఖుం, డంతరారాముం, డంతఃప్రకాశుం, డాత్మరతుం, డాత్మతృప్తుం, డాత్మసంతుష్టుండు, దూరీకృత దురితక్రియుండు, ప్రశాంత మానసుండు, విజితేంద్రియుండు, కృతకృత్యుండు, ప్రాప్తప్రాప్తవిహీనుండు, సర్వ వ్యవహారాతీతుం, డశరీరుండు, సర్వశరీరస్థుండు, నిరింద్రియుండు, సర్వేంద్రియ ద్రష్టయు, నప్రాణుండు, సర్వ ప్రాణి ప్రేరకుండు, సర్వేంద్రియోపశాంతి సుఖరసికుండు, వివేకమాత్రసంగుండు, నిత్యాసంగుండు, ప్రజ్ఞాప్రౌఢసఖీ సహాయుం, డసహాయుండు, దృఢాపరోక్షాత్మ నిశ్చయ సంపన్నుండు, వర్ణాశ్రమ సదాచార దురాచార కామ క్రోధ లోభ మోహ దంభ దర్ప కుహక క్రౌర్య శౌర్య జాడ్య మాత్సర్య ద్వేష కార్పణ్య నిందా స్తుతి మానావమానేర్ష్యాసూయా దయా నైష్ఠుర్య వాక్పారుష్యాది నానా విధ చిత్త వికారరహితుండు, స్త్రీవాస నార్థవాసనా ప్రతిష్ఠావాసనా శాస్త్రవాసనా దేహవాసనా లోకవాసనా కర్తృత్వ భోక్తృత్వాది వాసనా వివర్జితుండును, విగళ బ్రహ్మవేత్తృత్వాభిమాన వాసనుండు, నిత్యనిర్మలుండు, నిత్యశాంతుండు, నిత్యోదాసీనుండు, నిష్ప్రపంచుం, డవ్యక్త మహదహంకార పంచతన్మాత్రాకాశాది సర్వ ప్రపంచ మాయాగంధర్వ నగరాశ్రయుండు, నిరాశ్రయుం

డు, సర్వావభాస కేవల చిదాకాశమాత్రుండును, పరమ సుఖైకస్వరూపకుండు, దూరీకృత సంసారుండు, దేహేంద్రియ గుణాతిరిక్తుండు, దేవతా స్పృహణీయ శీలుండు, నానాపాశ వినిర్ముక్తుండు, రాజసతామసవస్తు సేవా దూరుండు, సాత్త్వికవస్తు సేవావిజిత నిద్రుం, డక్రియాత్మ పూజాపరుండు, మౌన జపపరాయణుం, డచింత్యధ్యాన నిష్ఠుం, డనిచ్ఛాసుఖ తత్పరుండు, విశ్వవంద్యుండు, యథేచ్ఛాసంసారశీలుండు, ధీరుండు, దాంతుండు, నిత్య ప్రబుద్ధచిత్తుండు, స్వాత్మసమాధినిష్ఠుండు, జగదింద్రజాల ద్రష్టయు, విశేషప్రాప్తాశేష పురుషార్థుండు, త్యక్తాశేష విశేషదుఃఖుం, డధిగత పరమస్వాస్థ్యుండు, సంగృహీత చిత్తుండు, మితవాక్యుండు, పరమకారుణికుండు, సర్వభూత మిత్రుండు, పేశలాచార మధురుండు, పాణిపాత్ర నిపతిత మాత్రాశనుండు, యోగారూఢుండు, తితిక్షుండు, పరమైకాంతికుండు, నిష్కళంకుండు, నిస్పృహుండు, ప్రారబ్ధ వశప్రాప్త దేహేంద్రియాది వ్యాపారరూప పుణ్యపాప క్రియాకర్తృత్వాభిమాన పూర్వక ముఖవికాస దైన్య శూన్యుండును, సదాప్రసన్న చిత్తుండు, వికసిత ముఖుండు, దుష్టశిష్టజన సంగదూరుండు, సాధువిద్వజ్జన సంగుండు, సర్వపదార్థోపేక్షాబుద్ధి యుక్తుండు, కుశలాకుశలక్రియా దూరుండు, వేదాంతశాస్త్ర విచారఘోరదావానల భస్మీకృత వేదశాస్త్రాగమ పురాణగుర్వీశ్వర విధి ప్రతిషేధాది వాసనారణ్యుం, డవ్యక్తలింగుం, డవ్యక్తాచారుం, డేకచారియు, ననికేతనుండు, గిరిగుహా విహారుండు, మృత్యు

భయ వివర్జితుండు, పరలోకభయ విరహితుండు, నిర్వ్యాజ
శాంతాత్మకుండు, బంధమోక్ష నిరాకాంక్షుండు, సర్వా
తీత సర్వపరిపూర్ణ ప్రతిద్వంద్వ బ్రహ్మచైతన్య ప్రకాశ
స్వరూప మాత్రుండు నై ప్రకాశించు మఱియును ౧౭౮

టీ. ఇట్టి యుక్తుండు = ఇట్టి వైరాగ్యముతోను బోధముతోను బ్రహ్మజ్ఞానముతోనుగూడిన, జీవన్ముక్తుండు, ప్రత్యక్...లుండు—ప్రత్యక్ = కూటస్థుఁ డైన తనకంటె, అభిన్న = వేఱు గానట్టి, బ్రహ్మతత్త్వ = తత్త్వం బగు పరబ్రహ్మముయొక్క, సాక్షాత్కార = సాక్షాత్కరించుట- అనఁగా అపరోక్షజ్ఞానము - అనెడి, అంధకార = చీఁకటియొక్క, పటలుండు = సమూహము గలవాఁడును, పరి లుండు—పరిత్యక్త = త్యజింపఁబడిన, వర్ణ = బ్రాహ్మణాది వర్ణములయొక్కయు, ఆశ్రమ = ఆశ్రమములయొక్కయు, ఆచార = ఆచారములయొక్కయు - శాస్త్రములయొక్కయు, కోలాహలుండును = కలకలము గలవాఁడును, నిరం... ణుండు—నిరంతర = ఎడతెగని, చిత్తవిశ్రాంతి - చిత్తోపరతి యనెడు, పర+అయనుండు = శ్రేష్ఠ మయిన స్థానము గలవాఁడును - చిత్తవిశ్రాంతి యందే యెడతెగక యుండువాఁ డనుట, విషయ+ఆసక్తి వివర్జితుండు = ఇంద్రియభోగములందలి ఆసక్తిని విడిచినవాఁడును, ప్రబ..ష్టుండు— ప్రబల = బలిష్ఠమైన, ప్రారబ్ధ = ప్రారబ్ధకర్మములకు, అధీన = లోనయిన, శరీరచేష్టుండును = దేహవ్యాపారములు గలవాఁడును, నిశ్చేష్టుండును = ఒక పనియు లేనివాఁడును - తనంత నొక పనియును జేయనివాఁ డనుట, అంతస్సుఖుండును = ప్రత్యగాత్మ యగు తనయందే సుఖము గలిగియుండు వాఁడును, అంతరారాముండు = తనయందే రమించుచుండువాఁడును, అంతఃప్రకాశుండు = తనయందే ప్రకాశించుచుండువాఁడును - తన ప్రకాశమును [illegible] బుచ్చుఁ డనుట, ఆత్మరతుండును = తనయందే రమించు

వాఁడును, ఆత్మతృప్తుండును = తనవలననే తనివిఁ జెందువాఁడును, ఆత్మసంతుష్టుండు, = తనవలననే సంతోషించువాఁడును, దూరీకృత దుష్క్రియుండు = దూరముగా చేయఁబడిన పాపకృత్యములు గలవాఁడును, ప్రశాంత మానసుండు - మిక్కిలి శాంతమైన మనస్సు కలవాఁడు, విజిత + ఇంద్రియుండు = జయింపఁబడిన ఇంద్రియములు గలవాఁడు, కృతకృత్యుండు = కృత్యములను చేసి తీర్చినవాఁడు - కృతార్థుఁ డనుట, ప్రాప్త అప్రాప్త విహీనుండు = దొరకినదానిని దొరకనిదానిని లేనివాఁడును - ఒకటి దొరకియున్నదనిగాని మఱొక్కటి దొరకలేదనిగాని యెంచక రెంటిని సమముగాఁ దలంచువాఁ డనుట, సర్వవ్యవహార అతీతుండును = సమస్తము లయిన దేహేంద్రియ వ్యవహారములను గాని, లేక ఘటపట రామరంగాది లౌకిక నామములను గాని, కడచినవాఁడును, అశరీరుండును = (ముదిమియును జావును లేనందున) దేహము లేనివాఁడును, సర్వశరీరస్థుండును = సమస్తములయిన దేహములం దుండువాఁడును, నిరింద్రియుండును = ఇంద్రియములు లేనివాఁడును - శబ్దాదివిషయసంగము లేనివాఁ డనుట, సర్వ + ఇంద్రియద్రష్టయున్ = అన్ని యింద్రియముల (వ్యాపారముల)ను జూచువాఁడును, అప్రాణుండును = (ఆఁకలి దప్పి మొదలగునవి లేమిచే) ప్రాణములు లేనివాఁడును, సర్వప్రాణి ప్రేరకుండు = సమస్త జంతువులను వాని వాని ధర్మములయందు వర్తించునట్లు పురికొల్పువాఁడును, సర్వేం...కుండు = సమస్తము లయిన యింద్రియములయొక్క (వెలుపలి వ్యాపారములు) ఉడుగుటవలని సుఖమును అనుభవించి యుండువాఁడును, వివేకహృత్ సంగుండును = వివేకముతోఁ గూడిన అంతఃకరణముతోడి కూడిక గలవాఁడును, నిత్య + అసంగుండును = ఎప్పుడును సంగము లేనివాఁడును, ప్రజ్ఞా...యుండు—ప్రజ్ఞా = తెలివి (జ్ఞానము) అనెడి, ప్రౌఢసఖీ = ప్రోడ యగు చెలిమికత్తెయొక్క, సహాయుండు = తోడ్పాటు గలవాఁడును, అసహాయుండును=ఇతరుల తోడ్పాటును లేని

ఇంద్రియములకును, గుణ = గుణములకును, అతిరిక్తుండును = మీఱినవాఁడును - వానికెల్ల విలక్షణుఁ డనుట, దేవ...లుండు—దేవతా = దేవతల చేత - బ్రహ్మాదులచేత ననుట, స్పృహణీయ = కోరఁదగిన, శీలుండు = శీలము గలవాఁడును, నానా...క్తుండు—నానా = అనేకములైన, పాశ = పాశములచేత—బంధములచేత ననుట, వినిర్ముక్తుండు = విడివడినవాఁడును, రాజ...రుండు—రాజస తామస = రజోగుణ తమోగుణములు గల, వస్తు = పదార్థములయొక్క, సేవా = అనుభవమునకు, దూరుండును=దవ్వయినవాఁడును *—రాజస తామసాహారాదులను అనుభవింపనివాఁ డనుట, † సాత్త్వి.. ద్రుండు—సాత్త్వికవస్తుసేవా = సత్త్వగుణము గల యాహారవస్తువులను సేవించుటచేత, విజిత = గెలువఁబడిన, నిద్రుండును = నిదుర గలవాఁడును - సాత్త్వికాహారముల భుజించువాఁడు ననుట.

అక్రియాత్మ పూజాపరుండు - అక్రియా = క్రియాశూన్యమైన, ఆత్మ = పరబ్రహ్మమును, పూజా = పూజించుటయందు, పరుండు = ఆసక్తి గలవాఁడు - మానసికపూజాపరుఁ డనుట, మౌనజపపరాయణుండు - మౌన = మౌనరూపమైన - పరావాగ్రూపమైన దనుట, జప = జపమే, పరాయణుండు = శ్రేష్ఠమయిన స్థానముగాఁ గలవాఁడు - దానినే ముఖ్య

---

* 'కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః । ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః, యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ । ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్' అను గీతావచనముచే రాజస తామసాహారములను దెలియునది.

† 'ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః । రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః' అని సాత్త్వికాహారలక్షణములు గీతయందుఁ బ్రతిపాదితములు.

ముగా ఆశ్రయించినవాఁ డనుట, అచింత్య ధ్యాననిష్ఠుండు - అచింత్య = చింతింప శక్యముగాని పరబ్రహ్మముయొక్క, ధ్యాన = ధ్యానమునందు, నిష్ఠుండు = నెలకొన్నవాఁడును, అనిచ్ఛా సుఖతత్పరుండు = ఇచ్ఛలేని సుఖమునకు ఆసక్తుఁడు గానివాఁడును - విచ్ఛలవిధిగా సుఖములందు వర్తిం పనివాఁడును - అనిచ్ఛాసుఖతత్పరుం డను పాఠమున - కోరకయే వచ్చుసుఖ ములం దాసక్తుఁ డయినవాఁ డనుట, విశ్వవంద్యుండు = సకలజనులచే పూజింపఁదగినవాఁడు, లేక, విశ్వ = ('అనుప్రవేశాదావేశాత్ బ్రహ్మ విశ్వ ఇతీరితః' అన్నట్లు) విశ్వం డగుపరబ్రహ్మమే వంద్యముగాఁ గలవాఁడు - పరబ్రహ్మమునే పూజించుచుండువాఁ డనుట, యదృచ్ఛా సంసార శీలుండు = ఇష్టముచొప్పున సంసారమునందు వర్తించు స్వభావము గల వాఁడు - సంసారము తన యిచ్ఛకు లోనయి యుండువాఁడు గాని, సంసా రమునకుఁ దాను లోపడినవాఁడు గాఁ డనుట - ధీరుండు = ధైర్యము గలవాఁడు - నిర్వికారుఁ డనుట - లేక బ్రహ్మము నే ననెడి యర్థమందు దిటవు గలవాఁడు, దాంతుఁడు = బహిరింద్రియముల నిగ్రహించినవాఁ డును, నిత్యప్రబుద్ధ చిత్తుండు = ఎప్పుడును ప్రబోధము నొంది యుండుమనస్సు గలవాఁడు, స్వాత్మసమాధి నిష్ఠుండు = తన ప్రత్య గాత్మ స్వరూపముయొక్క సమాధియందు - పరబ్రహ్మాకారవృత్తి యందు, నెలకొన్నవాఁడు, కావున నే, జగదింద్రజాల ద్రష్టయగు = జగత్తనెడి ఇంద్రజాలమునకు సాక్షియును, బ్రహ్మసమాధినిష్ఠ గలు గుటచే నే జగత్తింద్రజాలమువలె మిథ్యగాఁ దోఁచుచుండు ననియు దాని నూరక సాక్షియై చూచుచుండువాఁ డనియు భావము, ప్రాప్త... సుతుండును—ప్రాప్త = పొందఁబడిన, అశేష = సకలమైన, విశేష = శ్రేష్ఠము లయిన - అనితరసామాన్యము లయిన వనుట, పురుషార్థుం డును = పురుషార్థములు గలవాఁడును, త్యక్త అశేష విశేష దుఃఖుం డును = విడువఁబడిన సకలమైనవియు అధికము లయినవియు నగు దుఃఖ

ములు గలవాఁడును, అధిగత పరమ స్వాస్థ్యుండును = పొందఁబడిన ఉత్కృష్టమగు స్వస్థత గలవాఁడును, సంగృహీత చిత్తుండును = సంగ్రహింపఁబడిన - సంకుచితమై అడంపఁబడిన - మనస్సు గలవాఁడును- మనోమయమగు బహిరంతఃప్రపంచ మెల్ల నశించినవాఁ డనుట, మితవాక్యుండును = కొలఁదిమాటలు గలవాఁడును, పరమకారుణికుండును = మిక్కిలి దయ గలవాఁడును, సర్వభూత మిత్రుండు = సకల ప్రాణులకు స్నేహితుఁడు, పేశ . రుండు— పేశల = మెత్తని, ఆచార = నడవడిచేత, మధురుండును = ఇంపయినవాఁడును.

పాణిపాత్ర నిపతితమాత్ర అశనుండు = చేయి అనెడు భిక్షాపాత్రమునఁ బడినంతమాత్రమె ఆహారము గలవాఁడును - మితాహారి యనుట, యోగారూఢుండును = యోగమును చక్కఁగాఁ బూనియున్నవాఁడును, తితిక్షుండును = ద్వంద్వములను సహించువాఁడును, పరమ ఏకాంతికుండును = ఉత్కృష్టమైన ఐకాంతికధర్మము గలవాఁడు - లేక మిక్కిలియు విజనస్థలమందు వాసము చేయువాఁడును, నిష్కళంకుండు= కాలుష్యము లేనివాఁడు - కపటము లేనివాఁ డనుట, నిస్స్పృహుండును= ఆశ లేనివాఁడును, ప్రార...స్యుండు - ప్రారబ్ధ = ప్రారబ్ధమువలన ప్రాప్త = కలిగినట్టి, దేహ ఇంద్రియ ఆది = దేహములు ఇంద్రియములు మొదలయినవానియొక్క వ్యాపారరూపము లయిన, పుణ్యపాపక్రియా= పుణ్యపాపకార్యములయొక్క, కర్తృత్వ అభిమాన పూర్వక = నేనే కర్తను భోక్తనని తప్పఁదలంచుట మున్నుగాఁ గలిగిన, సుఖవికాస ముఖము సొంపును, దైన్య = దీనత్వమును, శూన్యుండును = లేనివాఁడును (పుణ్యపాపకార్యములు ప్రారబ్ధమువలనఁ గలిగిన దేహాదులవ్యాపారములే కాని యాత్మవి గావు. ఇది తెలియక యా వ్యాపారములు తానే చేసినట్లు తలఁచి యా పుణ్యములవలన సుఖవికాసమును పాపములవలన దీనత్వమును / మూఢుఁడు పొందుచుండును. ఇటు చెప్పఁబడుచున్న ఆత్మజ్ఞానియో యట్టి

కర్తృత్వాభిమానము లేనివాఁడు గనుక, దానివలన దుఃఖవికారము గాని దీనత్వము గాని లేకుండు నని భావము. ఇట్టి వికాసదైన్యము లేకుండుటం బట్టి, సదాప్రసన్న చిత్తుండును = ఎల్లప్పుడు నిర్మలమైన చిత్తము గలవాఁడును, వికసిత ముఖుండును = విరిసిన మొగము గలవాఁడును, దుష్టశిష్ట జన సంగదూరుండును = దుష్టులతోడియు సజ్జనులతోడియు పొత్తు లేనివాఁడును, సాధువిద్వజ్జన సంగుండు = సత్పురుషు లగు పండితుల గోష్ఠి గలవాఁడును, సర్వపదార్థ ఉపేక్షాబుద్ధి యుక్తుండు = సమస్తవస్తువులయందు (అక్కఱ లేదను) నిరసనబుద్ధి గలవాఁడును, కుశల అకుశల క్రియాదూరుండు = మేలుపనులకును కీడుపనులకును (రెంటికిని) దవ్వైనవాఁడును, వేదా... ణ్యుండు—వేదాంత శాస్త్రవిచార = వేదాంత శాస్త్ర మనెడి, ఘోరదావ అనల = భయంకరమయిన కార్చిచ్చుచేత, భస్మీకృత = నీఱు గావింపఁబడిన, సర్వ = సకల మగు, వేద శాస్త్ర ఆగమ = నాలుగు వేదములును ఆఱు శాస్త్రములును (కామికము మొదలు వాతూలము తుదగాఁ గల) ఇరువది యెనిమిది ఆగమములును, పురాణ = పదునెనిమిది పురాణములును, గురు = వీని నెల్ల నుపదేశించెడి ఆచార్యుఁడును, ఈశ్వర = గురూపదేశముచే తెలియఁబడు ఈశ్వరుఁడును, విధి = అను విధింపఁబడిన కర్మములును, ప్రతిషేధ = నిషేధింపఁబడిన కర్మములును, ఆది = మొదలయినవానియొక్క, వాసనా = సంస్కారము లనెడి, అరణ్యుండును = అడవి గలవాఁడును - వేదాంత శాస్త్రవిచారముచేత నీజగమంతయు నఖండరసైకబ్రహ్మం బని తెలియఁగా వాసన లెల్ల సమూలముగా నశించు నని భావము. అవ్యక్తలింగుండును = తెలియఁబడని వేషాది చిహ్నములు గలవాఁడును - వాఁ డిట్టివాఁ డని గుఱుతు తెలియఁబడ దనుట, అవ్యక్త ఆచారుండును = తెలియఁబడని నడవడి గలవాఁడును, ఏకచారియున్ = ఒంటరిగఁ దిరుగువాఁడును, అనికేతనుండు = ఇల్లు లేనివాఁడును, గిరిగుహావిహారుండు = కొండలగుహలయందుఁ ద్రిమ్మరువాఁడు.

మృత్యుభయవివర్జితుండు = మరణభయమును వీడినవాఁడు, పరలోక భయ విరహితుండు = స్వర్గాదులైన పరలోకములవలని భయమును లేని వాఁడు, నిర్వ్యాజశాంత ఆత్మకుండు = నెపము లేని - అనఁగా ఒక కారణమునుబట్టి కాక తనంతటనే సైజముగా సిద్ధించిన - శాంతమే (శుద్ధ సత్త్వవృత్తియే) స్వరూపముగాఁ గలవాఁడు, బంధమోక్ష నిరాకాంక్షుండు = కర్మములకు కట్టువడుటయందును వానినుండి విడివడుటయందును కోరిక లేనివాఁ డనుట - అందులకై ప్రయత్నము చేయవలసినది తనకు లేనందున దానికై యక్క ఱ లేనివాఁడనుట - లేక, బంధ = * ఆరోపమందును, మోక్ష = అపవాదమందును, నిరాకాంక్షుండును = కోరిక లేనివాఁడును, సర్వా ..డు నై—సర్వ అతీత = సమస్తమును గడచినదియు - ప్రపంచమునకు విలక్షణమైనదియు ననుట, సర్వ పరిపూర్ణ = అంతటను నిండియున్నదియు, అప్రతిద్వంద్వ = సాటి లేనిదియు, బ్రహ్మచైతన్య = చైతన్యస్వరూపమగు పరబ్రహ్మముయొక్క, ప్రకాశస్వరూప మాత్రుండు నై = తేజమే రూపముగాఁ గలవాఁడు నై, ప్రకాశించున్ = వెలుఁగును. మఱియును.

క. శాంతి వరకామధేనువు
సంతోషమె కల్పలత వివిషయవిరతి .యగున్
జింతామణి యని నెమ్మదిఁ
జింతించునతండు సుఖముఁ ౙెందు బుధేంద్రా! ౧౭౯

---

* ఒక రజ్జువును జూచి పా మనుట ఆరోపము. పాము గాదు రజ్జువే యనుట అపవాదము. అట్లే, దేహాదులె నే ననుట ఆరోపము. అవి నేను గా దనుట అపవాదము. కనుక, నీ రెండును లేనివాఁ డని బంధమోక్షశబ్దార్థములను దెలియనది.

టీ. బుధేంద్రా = పండితోత్తమా, శాంతి = చిత్తోపరమము, వర కామధేనువు = శ్రేష్ఠమైన కామధేనువువంటిది - కోరిన వరముల నిచ్చునది యనుట, సంతోషమే, కల్పలత = కల్పవృక్షమువంటిది, విషయవిరతి = శబ్దాది విషయములందలి ఉడుగుట, చింతామణి = దేవరత్నము వంటిది, అగును అని, నెమ్మదిన్ = మనస్సునందు, చింతించునతఁడు = తలంచెడిపురుషుఁడు, సుఖముఁ జెందున్ = మోక్షానందమును పొందును. కామధేనువును కల్పలతయు చింతామణియును గోరినవరము లొసంగునవిగాఁ దెలియునది.

తా. సుగమము. ౧౭౯

తే. పరమతృష్ణను భయదవైతరణి గాఁగ
గామమును ఘోరతరనరకంబుఁ గాఁగ
దారుణక్రోధమును దండధరునిఁ గాఁగఁ
జూచునాతఁడు నిర్వాణసుఖము నొందు. ౧౮౦

టీ. పరమతృష్ణన్ = మిక్కుటమైన ఆశను, భయదవైతరణి కాఁగన్ = భయంకరమైన నరకలోకమునందలి వైతరణీనదిని గాను, కామమున్ = విషయాసక్తిని, ఘోరతరనరకంబు కాఁగన్ = మిక్కిలి భయంకరమగు నరకముగాను, దారుణక్రోధమును = తీవ్రమయిన కోపమును, దండధరునిఁ గాఁగన్ = యమునిఁ గాఁగను, చూచునాతఁడు = కనుఁగొనునట్టి మనుష్యుఁడు, నిర్వాణ సుఖమున్ = మోక్షానందమును, ఒందును = పొందును, వైతరణి నరకము యముఁడు ననెడి యీ మూఁడును భయంకరయాతనాపాదకము లని తెలియునది.

తా. సుగమము. ౧౮౦

సీ. తతవియన్నీలవితానభూషిత మగ్ని
రవిచంద్రదీపవిరాజితంబు

నతులభూచక్రసింహాసనాలంకృతం
బనిలవ్యజనమరుద్వ్యాపితంబు
ధనికసేవకసేవితంబై తనర్చు జ
గత్పురంబున వివేకప్రకాశ
మానేంద్రియతురంగమానసప్రగ్రహ
బుద్ధిసారథియుక్తపురుశరీర
తే. మంజులరథాధిరూఢుఁడై మహిమతోడ
నమరుప్రజ్ఞాంగనాయుక్తుఁడగుచు నిత్య
విభవుఁడై సర్వజనము సేవించుచుండ
రాజయోగీశ్వరుం డలరారు ననఘ. ౧౮౧

టీ. అనఘ = పాపరహితుఁడా - ఆంజనేయా, తత . షితము— తత = వ్యాప్తమయిన, వియత్ = ఆకాశ మనెడి, నీలవితాన = నల్లని మేలుకట్టుచేత, భూషితము = అలంకృత మైనదియును, అగ్నిరవిచంద్ర దీప విరాజితంబు = అగ్ని సూర్యుఁడు చంద్రుఁ డనెడు దీపములచేతఁ బ్రకాశించుచున్నదియును, అతుల...కృతంబు - అతుల = సాటిలేని, భూచక్ర = భూమండలమనెడు, సింహాసన = గద్దియచేత, అలంకృతంబు= అలంకరింపఁబడినదియు, అని.. తంబు-అనిల = వాయువనెడు, వ్యజన = విసనకఱ్ఱయొక్క, మరుత్ = గాలిచేత, వ్యాపితంబు = పర్వినదియును, ధనిక సేవక సేవితంబు = ధనవంతు లనెడు బంట్లచేత కొలువఁబడుచున్నదియు, ఐ, తనర్చు జగత్పురంబునన్ = ఒప్పుచుండెడులోక మనెడు నొక పట్టణమందు, రాజయోగీశ్వరుండు= మేటిరాజయోగి యైనవాఁడు, వివేక.. రూఢుఁ డై—వివేక=తెలివిచేత, ప్రకాశమాన = వెలుఁగుచున్న, ఇంద్రియ = పది యింద్రియము లనెడి, తురంగ = గుఱ్ఱములతోడ, మానసప్రగ్రహ = మనస్సు అను పగ్గముతోడ, బుద్ధిసారథియుక్త = బుద్ధి యనెడి

సారథితోఁ గూడిన, పురుశరీర=స్థూలశరీర మనెడి, మంజులరథాధిరూఢుఁడై = సొగసైన తేరెక్కినవాఁడై, మహిమతోడన్ = కీర్తితోడ అమరు ప్రజ్ఞా+అంగనాయుక్తుఁడై=ఒప్పుచున్న అపరోక్షజ్ఞాన మనెడి స్త్రీతోడఁ గూడినవాఁడై, నిత్యవిభవుఁడై = బ్రహ్మం బనెడి శాశ్వతమైన వైభవము గలవాఁడై, సర్వజనము, సేవించుచుండన్, అలరారున్=ఒప్పుచుండును

తా. ఈ జగత్తొకపట్టణము. దీనికి పయిని గట్టిన వల్లెవ పటముపయిన మేలుకట్టు ఆకాశము. అగ్నియును సూర్యుఁడును చంద్రుఁడును అందు వెలుఁగుచున్న దీపములు. భూమండలము ఒక సింహాసనము. వాయువు విసనకఱ్ఱగాలి, ధనవంతులు బంట్లు. ఇందు రాజయోగి యను నొక రాజు, విషయయుక్తములయిన యింద్రియము లనెడిగుఱ్ఱములను బూన్చినదియు మనస్సనెడి పగ్గము గలదియు బుద్ధియనెడి సారథితోఁ గూడినదియు నగు స్థూలదేహ మనెడి రథము నెక్కి అపరోక్షప్రజ్ఞ యనెడి కాంతతోఁ గూడి బ్రహ్మాత్మైకత్వ మనెడి శాశ్వతవైభవముతో ప్రకాశించుచుండును. ౧౮౨

మ. అనపేక్షుం డనమానుఁడై ధనికదీనాలాపముల్ వీనులన్
వినకే కర్మరదేహచేష్టల నొగిన్ వీక్షింపకే నిత్యముం గే
దనుఁ దాఁ జూచుచుఁ భావనాత్మకనుతీర్థశ్రేణి నత్యంతపా
వనముంగా నొనరించుచుం జెలఁగు జీవన్ముక్తుఁ డానందుఁడై.

టీ. జీవన్ముక్తుఁడు, ఆనందుఁడై = బ్రహ్మానందము గలవాఁడై, అనపేక్షుండు = ఇహపరసుఖములందుఁ గోరిక లేనివాఁడు, అనమానుఁడై = ... లేనివాఁడై, ధనికదీన + ఆలాపముల్ = ధనవంతులయొక్కయు దీనులయొక్కయు పలుకులను, వీనులన్ = చెవులచేత, వినకే = వినకయే, కర్మర దేహచేష్టలన్ = కర్మములందు నిష్ఠ గలవారియొక్క శరీరవ్యాపారములను - అనఁగా వారి బాహ్యాభ్యంతర శౌచస్నాన సంధ్యానుష్ఠాన

జప తప వైశ్వదేవ స్వాధ్యాయ యజ్ఞాదులను, ఒగిఁ = క్రమముగా, వీక్షింపకే = చూడకయే, నిత్యమున్, తనుఁ తాను చూచుచుఁ = తన ప్రత్యక్స్వరూపమును తానే యని చూచుచు, పావనాత్మకసుతీర్థశ్రేణిఁ జపవిత్రత్వమే స్వరూపముగాఁ గల గొప్ప గంగాది తీర్థముల సమూహమును- (లేక ఇడా పింగళ సుషుమ్నాదులగు నాడు లనెడు తీర్థములను) అత్యంత పావనముగాఁ = మిక్కిలిపవిత్ర మైనదిగా, ఒనరించుచుఁ = చేయుచు, చెలంగును = వర్తించుచుండును - ఆనదులందు స్నానముచేసి వానిని పవిత్రములు గావించుచుండు ననుట. పవిత్రము లగు గంగాదిపుణ్యతీర్థములను గూడఁ బవిత్రము గావించునట్టి ప్రభావసంపన్నుఁ డగు నని భావము.

తా. జీవన్ముక్తుఁ డైనవాఁడు బ్రహ్మానందమునఁ జొక్కుచుండును గనుక, నిహపరసుఖములం దపేక్ష లేక ధనికులు మొదలగువారి మాటలను వినక, కర్మనిష్ఠులవ్యాపారమును జూడక తన్నుఁ దానే బ్రహ్మముగాఁ జూచుకొనుచు తీర్థయాత్రలు చేయుచుఁ బావనము లయిన గంగాదిపుణ్యతీర్థములను స్నానముచేత నత్యంతపావనములు గావించుచుఁ బ్రవర్తించుచుండును. ౧౮౨

సీ. ఒకవేళఁ దనయందు ఁ సకలప్రపంచంబు
కల్పితం బని యెంచి ఁ కాంచి నవ్వు
నొకవేళ సర్వభూతోపాధి తుదియందు
దనుఁ జూచి మిగుల సంతసముఁ జెందు
నొకవేళ దేహాదు ఁ లొప్పుగా విహరింప
సర్వసాక్షి నటంచు ఁ సంభ్రమించు
నొకవేళ నన్య మింకచుక లే దొకండ నే
నని నిర్వికల్పసమాధి నొందు

తే. సతులవైరాగ్యబోధోపరతులు గలుగు
నతనిమహిమలు గణుతించి యభినుతింప
హరిహరహిరణ్యగర్భుల కైనఁ దరమె
యపరిమితసద్గుణనికాయ! యాంజనేయ! ౧౮౩

టీ అపరిమిత.. నికాయ = మితి లేని మంచిగుణముల సమూహము గలవాఁడా, ఆంజనేయా, ఒకవేళన్, తనయందున్ = తనయందే, సకల ప్రపంచంబు, కల్పితంబని = కల్పింపఁబడినదని, ఎంచి = తలఁచి, కాంచి = చూచి, నవ్వును, ఒకవేళన్, సర్వభూత ఉపాధి తతియందున్ = సమస్తభూతములయొక్కయు నైన ఉపాధు లగు (వ్యష్టి సమష్టి స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములయొక్క) సమూహమునందు, లసన్ = ఉండి యున్న తన్ను, చూచి, మిగులన్, సంతసమున్ ఒందును = సంతోషించును, ఒకవేళన్, దేహాదులు = శరీరము మొదలయినవి, ఒప్పుగాన్ = చక్కఁగా, విహరింపన్ = తమతమవ్యాపారములందు వర్తింపఁగా, సర్వసాక్షిని అటంచున్ = వీని నన్నిటిని ఊరక చూచువాఁడను మాత్రమే కాని చేయువాఁడను గాను, అటంచున్, సంభ్రమించున్ = ఉబ్బును, ఒకవేళన్, అన్యము = తనకంటె వేఱయినది, ఒకండు ఇంచుక = వేఱొక్కటి కొంచె మైనను, లేదు, ఒకండ నేనని = సర్వమును నేనొక్కండనే యని, * నిర్వికల్పసమాధిన్ = నిర్వికల్పనిష్ఠను, ఒందును = పొందియుండును. అతుల వైరాగ్యబోధ ఉపరతులు = సాటిలేని వైరాగ్యమును బోధమును ఉపరతి నిని, కలుగునతని మహిమలు = కలిగినట్టి మనుజుని మహాత్త్వములు, గణుతించి = లెక్కించి, అభినుతింపన్ = పొగడుటకు, ఈ హరిహరహిరణ్య

* నిర్వికల్పనిష్ఠ యనఁగా, అంతః పూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవాంబరే, అంతశ్శూన్యో బహిశ్శూన్యో శూన్యకుంభ ఇవాంబరే' అను నట్లు ఈరీతిని భావన గలిగియుండుటయే నిర్వికల్పనిష్ఠ యని తెలియునది.

గర్భులకైనన్ = విష్ణు శివ బ్రహ్మల కయినను, తరమె = శక్యమా? శక్యము గా దనుట.

తా. వైరాగ్యమును బోధయును ఉపరతియుఁ గల బ్రహ్మనిష్ఠుఁ డొకవేళ ప్రపంచము తనయందుఁ గల్పితమైనదే కాని నిజము కాదనియు, ఒకప్పుడు సమస్తములైన దేహములందుఁ దాను వ్యాపించి యుండునట్లును ఒకప్పుడు దేహేంద్రియములు తమతమ వ్యాపారములు చేయుచున్నవి, గాని, యందులకు నేను పట్టిసాక్షి నే యనుకొనుచును, ఒకప్పుడు నేనుదప్ప మఱియొక్కటియు లేదని నిర్వికల్పనిష్ఠ నొందుచును నుండును. అతనిమహత్త్వములు త్రిమూర్తుల కయినను వర్ణింప నలవి గావు. ౧౭౩

సీ. తనపాదధూళి సోఁకినఁ జరాచరము ల
  త్యంతపావనములై యలరుచుండఁ
దనదునెమ్మేను సందర్శించి జనములు
  నిష్పాపులై కడ నెఱయుచుండఁ
దను నిరంతర ముపాసనము చేయుమహాత్ము
  లతులితైశ్వర్యంబు ననుభవింపఁ
దనయనుగ్రహము నొందినభక్తులకు ముక్తి
  కరతలామలకంబుకరణిఁ దోఁపఁ

తే. దనదువంశ్యులు మున్ముందుతరమువారు
  స్వర్గమున దివ్యసుఖ మొంది సంతసింప
నార్యులు నుతింపఁ ద్రిభువనాచార్యుఁ డగుచు
  నెలమి విహరించు రాజయోగీశ్వరుండు. ౧౭౪

టీ రాజయోగీశ్వరుండు = మేటి రాజయోగి యైనవాఁడు, తనపాదధూళి = తన యడుగుల దుమ్ము, సోఁకినన్ = తగులఁగానే, చరాచరములు = జంగమస్థావరములు, అత్యంతపావనములై = మిక్కిలి పవిత్రములై, అల

రుచుండఁగ = ఒప్పుచుండఁగా, తనదు పెన్మేను = తన దేహమును, సందర్శించి = చూచి, జనములు, నిష్పాపులై = పాపము లేనివారై, కడుఁగ = మిక్కిలి, నెఱయుచుండఁగ = పర్వుచుండఁగా, తనుఁ, నిరంతరము = ఎడతెగక, ఉపాసనముచేయు మహాత్ములు = ఆరాధించు మహాత్ములు, అతులిత ఐశ్వర్యంబులు = సరిలేని సంపదలను, అనుభవింపఁగ = పొందుచుండఁగాను, తన యనుగ్రహామునఁ = తన కృపను, ఒందిన భక్తులకుఁ = పొందిన భక్తులగువారికి, ముక్తి, కరతల ఆమలకంబు కరణిఁ = అరచేతి ఉసిరికకాయవలె - అరచేతియందలి తేటనీటివలె నవియు నత్యాంతరము, తోఁపఁగ = కనఁబడుచుండఁగా, తనదు వంశ్యులు=తన వంశమునఁ బుట్టినవారు, ముయ్యేడుతరమువారు = ఇరువదియొక్కపరంపరవారు, స్వర్గమునఁ = దేవలోకమందు, దివ్యసుఖము = దివ్యమయిన భోగము, ఒంది = పొంది, సంతసింపఁగ = సంతోషించుచుండఁగా, ఆర్యులు = పెద్దలు - బ్రహ్మవిదు లనుట, నుతింపఁగ=పొగడుచుండఁగా, త్రిభువన ఆచార్యుఁడగుచుఁ = మూఁడులోకములవారికి - అనఁగా దేవమనుష్యాసురసమూహమునకు - జ్ఞానోపదేష్టయై, ఎలమిఁ = సంతోషముతోడ, విహరించును = సంచరించుచుండును.

రాజయోగిశ్రేష్ఠుఁడు తన పాదధూళి సోఁకఁగానే స్థావరజంగమము లెల్లను బవిత్రము లగుచుండఁగా, తన యాకారమును దర్శింపఁగానే జను లెల్లఁ బాపములను దిగవిడువఁగా తన్ను నెడతెగక సేవించువారు మహైశ్వర్యముల ననుభవించుచుండఁగా, తా ననుగ్రహించిన భక్తులకు ముక్తి యత్యంతసుఖమై యొప్పఁగా, తనవంశమునఁ బుట్టిన యిరువదియొక్కతరములవారు స్వర్గమునఁ బరమసుఖ మొంది తేలుచుండఁగా పెద్దలెల్లఁ బొగడుచుండఁగా ముల్లోకములకు నాచార్యుఁడై సంతోషమున విహరించుచుండును. ౧౮౪

వ. అట్టి జీవన్ముక్తుండు ప్రారబ్ధభోగావసానసమయంబున జలంబున జలంబు క్షీరంబున క్షీరంబు ఘృతంబున ఘృతంబు దేజంబునఁ దేజం బాకాశంబున నాకాశంబు పొందిన చందంబున, భూతకార్యంబు లైన చతుర్వింశతితత్త్వంబు లాయాకారణంబులఁ గలయుచుండఁగా వానితోఁ దాదాత్మ్యంబు లేమింజేసి తమంబు దేజంబు గాక కేవలంబు తతంబు స్తిమితంబు గంభీరం బనాఖ్యం బనభివ్యక్తం బవాచ్యం బచింత్యంబు నిర్గుణంబు నిర్వికల్పంబు నిష్ప్రపంచానందమాత్రంబు సర్వశూన్యంబు సనాతనం బప్రమేయం బాదిమధ్యాంతవిరహితం బపర్యంతంబు హేతుదృష్టాంత వివర్జితంబు సర్వాధిష్ఠానం బీశ్వరావ్యాకృత హిరణ్యగర్భ విరాట్ప్రాజ్ఞ తైజస విశ్వరూప చిత్ప్రతిబింబ ప్రకాశ భూతంబు బింబప్రతిబింబ భావకల్పనా విరహితంబు పరిపూర్ణంబు నైన పరమమోక్షస్వరూపంబునం బొందు సందేహంబు లేదు. నీ విప్పు డట్టి మోక్షస్వరూపమాత్రుండవు గావే యని యానతిచ్చి వెండియు ని ట్లనియె. ౧౮౫

టీ. అట్టి జీవన్ముక్తుండు, ప్రారబ్ధ భోగ అవసానసమయంబునన్ = ప్రారబ్ధకర్మము ననుభవించుటయొక్క కడపటికాలమునందు - ఆ కర్మము ననుభవించి ముగియఁగానే యనుట, జలంబునన్ జలంబు = నీటియందు నీరును, క్షీరంబునన్ క్షీరంబు = పాలయందు పాలును, ఘృతంబునన్ ఘృతంబు = నేతియందు నేయును, తేజంబునన్ తేజంబును, ఆకాశంబునందు ఆకాశంబును, పొందినచందంబునన్ = చేరినవిధమున, భూతకార్యంబులు = పంచ భూతములయొక్క కార్యములు, ఐన, చతుర్వింశతితత్త్వంబులు = ఇరువదినాలుగు తత్త్వములు, ఆయాకారణంబులన్ =

ఆయా హేతువులచేత, కలయుచుండఁగ = కూడుచుండఁగా, ఏది ఏదేది దేనియందుఁ బుట్టెనో యది యది దానియందుఁ గలయుచుండఁగా ననుట, తాను, వానితోఁ = ఆ కార్యకారణములతో, తాదాత్మ్యంబు లేమింజేసి = ఐక్యము లేనందున - అది తాను గాకుండుటంబట్టి యనుట, తమంబు = ప్రకృతియును, తేజంబు గాక = జ్ఞానము కాక, కేవలంబు = ముఖ్యమైనదియు, శివంబు = వ్యాపించినదియు, స్తిమితంబు = నిశ్చలమైనదియు, గంభీరంబు = లోఁతయినది - మూల మెఱుంగరానది యనుట, అనాఖ్యంబు = పేరులేనిదియు, అనభివ్యక్తంబు = కన్నులు మొదలగువానికి తేటపడనిదియును, అవాచ్యంబు = పలుక నలవి గానిదియు, అచింత్యంబు=తలంప శక్యము గానిదియు, నిర్గుణంబు = మూఁడు గుణములును లేనిదియును, నిర్వికల్పంబు = సంకల్పవికల్పశూన్య మయినదియును, నిష్ప్రపంచానందమాత్రంబు = అద్వితీయమైన బ్రహ్మముయొక్క సుఖరూప మైనదియు, సర్వశూన్యంబు = ప్రకృతి లేనిదియు, సనాతనంబు = శాశ్వత మైనదియు, అప్రమేయంబు = ఇంతింతని కొలఁది యిడరానిదియు, ఆది మధ్య అంత రహితంబు=ఉత్పత్తిస్థితిలయములు లేనిది, అపర్యంతంబు = మేర మీఱినది, హేతుదృష్టాంతవివర్జితంబు = హేతువుచేతను దృష్టాంతముచేతను విడినదియు, అనఁగా అనుమానముచేతఁ దెలియరాని దనుట, సర్వ+అధిష్ఠానంబు = సర్వమునకు ఆధారమైనదియు, ఈశ్వ. భూతంబు—ఈశ్వరజీవ = సమష్టి వ్యష్టి భేదములు గల యీశ్వరజీవుల యుపాధులవలనఁ గలిగిన, అవ్యాకృతుఁడు హిరణ్యగర్భుఁడు విరాట్టు ప్రాజ్ఞుఁడు తైజసుఁడు విశ్వరూపుఁడు - అను వీరియొక్క, చిత్ = జ్ఞానప్రకాశముయొక్క, ప్రతిబింబ = ప్రతిఫలనము నకు, ప్రకాశభూతంబు = ఆధారమగు తేజస్స్వరూప మయినది - దీని తేజస్సునందుఁ బ్రతిఫలించియే యా అవ్యాకృతుఁడు మొదలగువారు తోఁచుచుందు రని భావము. బింబప్రతిబింబ భావకల్పనా విరహితంబు

బింబ = అధిష్ఠాన వస్తువును, ప్రతిబింబ = దానివలనఁ దోఁచు నీడయును అనెడు, భావ = ఈ స్థితియొక్క, కల్పనా = కల్పించుట, విరహితంబు = లేనిదియు - అనఁగాఁ దనకంటె వేఱైనది లేనిదనుట, పరిపూర్ణంబు = అంతట నిండినదియు, ఐన, పరమ మోక్షస్వరూపంబునన్ = ఉత్కృష్టమగు మోక్షగతిని - విదేహకైవల్యమును, పొందును, సందేహంబు లేదు, నీవు ఇప్పుడు, అట్టిమోక్షస్వరూపమాత్రుండవు గావే = అట్టి ముక్తిస్వరూపుఁడవు గావా, అగుదు వనుట, అని, ఆనతిచ్చి, మరలన్, ఇట్లనియెను ౧౮౫

శా. ఏవేళన్ భువి నెట్టిచోట మఱి యేయే బాధలం బొందుచున్
జీవన్ముక్తుఁడు దేహమున్ విడిచినన్ సిద్ధం బనాద్యంతమున్
భావాతీతము నిర్వికల్పము పరబ్రహ్మాత్మకం బైన యా
కైవల్యంబును బొందు సత్య మనహంకారాత్మతత్త్వా
త్మకా! ౧౮౬

టీ. అన...త్మకా—అనహంకార = అహమభిమానములేని—అహంపదవాచ్యార్థముగాని, తత్త్వ ఆత్మకా = తత్త్వం బగు పరబ్రహ్మమె స్వరూపముగాఁ గలవాఁడా - అహంపదమునకు లక్ష్యార్థ మగువాఁడా యనుట, జీవన్ముక్తుఁడు, భువిన్ = భూమియందు, ఏవేళన్ = ఏ సమయమున, ఎట్టిచోటన్ = ఏ స్థలమునందు, మఱి, ఏయే బాధలన్ = స్థూలోపాధికిఁ గలిగెడి ఏయే పీడలను, పొందుచున్ = అనుభవించుచు, దేహమున్, విడిచినన్ = వదలినను, సిద్ధంబు = నిత్యమైనదియును, అనాద్యంతమును = మొదలు తుది లేనిదియును, భావాతీతము = భావమును మీఱినదియును, నిర్వికల్పమును = వికల్పము లేనిదియును, పరబ్రహ్మాత్మకంబు = పరబ్రహ్మస్వరూప మయినదియు, ఐన, ఆ కైవల్యంబును = పూర్వోక్తలక్షణములు గల ఆ మోక్షమును, పొందును, సత్యము = నిజము.

తా. జీవన్ముక్తుఁ డగువాఁడు ఎట్టి వేళనుగాని యెట్టి చోటనుగాని యెట్టి బాధలకు లోనయికాని దేహమును విడిచినను, వానికి అద్వ్యంతరహితత్వాది లక్షణములు గల పరబ్రహ్మస్వరూప మైన మోక్షము తప్పక లభించుచున్నది ౧౮౬

వ. అని యుపదేశించి.

టీ. సుగమము

ఉత్సాహ. ఇదియె వేదశాస్త్రసార మిది యనంతసౌఖ్యదం
బిదియె రాజయోగశాస్త్ర మిదియె బ్రహ్మవిద్య మ
ద్ధృదయ మిదియె దీని నిరత మెవ్వఁడేని భక్తితో
సదమలాత్ముఁ డగుచు మిగులఁ జదువ వినిన వ్రాసినన్.

టీ. ఇదియె = ఇప్పుడు నీ కుపదేశించిన విషయమే, వేదశాస్త్రసారము = వేదములయొక్కయు శాస్త్రములయొక్కయు సార మైనది. ఇది = ఇదియె, అనంతసౌఖ్యదంబు = మితిలేనిసుఖము నిచ్చునది - బ్రహ్మానందము నొసంగునది, ఇదియె, రాజయోగశాస్త్రము, ఇదియె, బ్రహ్మవిద్య = ఆత్మజ్ఞానము, ఇదియె, మత్ హృదయము = నా తాత్పర్యము, దీనిని, నిరతము = ఎల్లప్పుడు, ఎవ్వఁడేనిన్ = ఏపురుషుఁ డైనను, భక్తితోన్, సదమల ఆత్ముఁ డగుచున్ = ప్రశస్తమైన రాగాదికలుషములు లేని అంతఃకరణము గలవాఁడగుచు, మిగులన్ = మిక్కిలిగా, చదువన్ వినినన్ వ్రాసినన్ = సకలవేదశాస్త్రసారమై రాజయోగశాస్త్రమును బ్రహ్మవిద్యయును నాహృదయము నగుటంజేసి దీనిని చదివినను వ్రాసినను—మీఁది పద్యముతో నన్వయము. ౧౮౭

పంక్తి లేక సుందరీవృత్తము.

యుక్తియు నన్న, ద్భక్తియు జీవ
న్ముక్తియు సాక్షా, న్ముక్తియుఁ గలుగున్. ౧౮౮

టీ. యుక్తియుఁ = బ్రహ్మజ్ఞానమునకుఁ దగిన యుపాయమును, అనన్యభక్తియుఁ = నాయందలి భక్తియును, జీవన్ముక్తియుఁ = దేహముతో నుండునపుడే సంసారభ్రాంతివిముక్తియు, సాక్షాన్ముక్తియుఁ = విదేహకైవల్యమును, కలుగును. పంక్తి లేక సుందరీవృత్తమునకు ఒక భగణము రెండు గురువులు నుండవలయును యతి లేదు. ౧౨౭

వ. అట్లు గావునఁ బరమేశ్వరుండై ననానెమ్మనంబునఁ బరమ నిక్షేపంబుగాఁ బ్రకాశించు సర్వోపనిషత్సారభూతం బైన యీదివ్యజ్ఞానంబును మద్భక్తుండవు మత్పూజాపరుండవు మదర్పిత మనోబుద్ధివి మత్పరాయణుండవు నగుటంజేసి నీ కుపదేశించితి నింతకంటె నతిరహస్యం బైనయర్థంబు నా డెందంబున లేద ట్లగుట నిప్పరమార్థతాత్పర్యంబు దెలిసి తమఃకూర్మంబు రజోమీనంబు క్రోధనక్రంబు గామశైవాలంబు జన్మమరణ తరంగంబు రోగబుద్బుదంబు లోభఫేనంబు మోహవేలయు దుఃఖాగాధజల ప్రవాహగంభీరం బైన సంసారపారావారంబు దరించి మోక్షపారంబు గాంచి కృతకృత్యుండ వై, మత్స్వరూప సమాధినిష్ఠుండ వై యానందింపు మని పలికిన నప్పవన నందనుండు సీతాదేవి లక్ష్మీదేవి యనియు లక్ష్మణుండు శేషుం డనియు భరతశత్రుఘ్నులు పాంచజన్య సుదర్శ నంబు లనియు సింహాసనంబు సుపర్ణుం డనియు శ్రీరామ చంద్రుం డాదినారాయణుం డనియు నిప్పు డుపదేశించిన పరబ్రహ్మ తత్త్వజ్ఞానంబు సకల వేదశాస్త్ర పురాణా మేతిహాస స్మృతిసారం బనియు నెఱింగి పరమానంద కంద ళిత హృదయారవిందుం డై, యా శ్రీసీతారామాచార్యుల

చరణారవిందంబుల కనేక వందనంబులు గావించి వినమ్రుఁ బడి కరకమలంబులు ముకుళించి నిరతిశయ వినయప్రాశ్య కంబుగా నిట్లనియె. ౧౮౯

టీ. అట్లు కావునన్ = అట్లు సాక్షాన్ముక్తి కలుగును గావున, పరమేశ్వరుండను, ఐన, నా మన్మనంబునన్ = నామనస్సునందు, పరమరహస్యంబుగాన్ = గొప్పనిధివలె, ప్రకాశించు, సర్వోపనిషత్ సారభూతంబైన = సకలములైన ఉపనిషత్తులయొక్క సారాంశమైన, ఈ, దివ్యజ్ఞానంబును = అపరోక్షజ్ఞానమును, మద్భక్తుండవు = నాయందు భక్తి గలవాఁడవును, మత్పూజాపరుండవు = నన్ను పూజించుటయందు దాసక్తి గలవాఁడవును, మదర్పిత మనోబుద్ధివి = నాయందు ఉంపఁబడిన మనస్సును బుద్ధియును గలవాఁడవు, మత్ పరాయణుండవు = నాయందే ఉత్తమ మైన స్థానము గలవాఁడవును, అగుటంజేసి, నీకున్ ఉపదేశించితిని. ఇంతకంటెన్, అతిరహస్యంబైన = మిక్కిలి గోప్య మైన అర్థంబు, నా డెందంబునన్ = నా మనస్సునందు, లేదు, అట్లగుటన్ = కాఁబట్టి, ఇప్పరమార్థ తాత్పర్యంబు = ఈ గొప్ప తత్త్వార్థముయొక్క భావమును, తెలిసి, తమఃకూర్మంబు = తమోగుణ మనెడు తాఁబేళ్లు గలదియు, రజోమీనంబు = రజోగుణ మనెడుచేఁపలు గలదియు, క్రోధనక్రంబు = కోప మనెడు మొసళ్లు గలదియు, కామశైవాలంబు = కామము లనెడునాఁచియు, జన్మమరణ తరంగంబు = పుట్టుకలు చావు లనెడు అలలు గలది, రోగబుద్బుదంబు = తెవుళ్లనెడు నీటిబుగ్గలు గలదియు, లోభతృష్ణ = పేరాస అనెడు సుడిఁగు గలదియు, మోహవేలయున్ = మోహ గట్టు గలదియు, దుఃఖ అగాధ జలప్రవాహ గంభీరంబు=దుఃఖము లోఁతయిన నీటివెల్లువచేత లోఁతయినది, ఐన, సంసారపారావారన్ = సంసార మనెడి సముద్రమును, తరించి = దాఁటి, మోక్షపా

రంబుగ = ముక్తి అనెడిగట్టును, కాంచి = పొంది, కృతకృత్యుండవై = కృతార్థుఁడవై, మత్ స్వరూప సమాధినిష్ఠుండవై = నాయొక్క స్వరూపమునొక్క అనుసంధానమందు నెలకొన్నవాఁడవై, ఆనందింపుము, అని పలికినఁ, అప్పవననందనుండు = వాయుపుత్త్రుఁడైన ఆ హనుమంతుండు, సీతాదేవి...పాంచజన్యసుదర్శనంబులు = శంఖచక్రములు..., సుపర్ణుండని యుఁ = గరుడుండనియును.., పరబ్రహ్మతత్త్వజ్ఞానంబు = పరబ్రహ్మముయొక్క కలరూపును గుఱించిన ఎఱుక, సకల ..సారంబు = సమస్తము లయిన వేదములయొక్కయు శాస్త్రములయొక్కయు పురాణములయొక్కయు ఆగమములయొక్కయు ఇతిహాసములయొక్కయు స్మృతులయొక్కయు సారమైనది, అనియును, ఎఱింగి, పరమ . విందుండై = మిక్కుటమైన ఆనందముచేత వికసించిన మనఃకమలము గలవాఁడై, ఆ, శ్రీ సీతారామాచార్యుల = శ్రీ సీతయు రాముఁడును, అనెడి ఆచార్యులయొక్క, చరణారవిందంబులకుఁ = అడుగుఁదామరలకు, అనేకవందనములు, కావించి = చేసి, నిలువంబడి = నిలిచి, కరకమలంబులు = చేతామరలు, ముకుళించి = మోడ్చి, నిరతిశయ వినయపూర్వకంబుగాఁ = సాటి లేని అడఁకువతోడ, ఇట్లనియెను

తా. సుగమము. ౧౮౫

క. శ్రీరామ రామ రామ ర
మారామామణి మనోరమా రమణా శ్రీ
నారాయణ నారాయణ
నారాయణ నిజసహస్రనామస్తుత్యా! ౧౮౬

టీ. శ్రీరామ = శ్రీస్వరూపిణి యగు బ్రహ్మవిద్యతోడ రమించువాఁడా, రామ = జగత్తు సృష్టిస్థితిలయములే క్రీడలుగాఁ గలవాఁడా, రామ = సమస్తయోగులందు నీవును నీయందు సమస్తయోగులును రమిం

చుట గలవాఁడా, రమా రామామణిమనోరమా = లక్ష్మీదేవి యనెడి కాంతారత్నముయొక్క మనస్సును రంజింపఁజేయువాఁడా - పతియైనవాఁడా యనుట, రమణా = మనోహరుఁడైనవాఁడా, శ్రీనారాయణ - శ్రీ = చిచ్ఛక్తిసమేతుఁడైన, నారాయణ = (ర అనఁగా రిఙ్ క్షయే అనుధాతువునుబట్టి రివ్యతే క్షీయతే, ఇతి రః = అనఁగా నశించునది, 'నర' అనఁగా నశింపనిది - నశింపని ఆత్మ యనుట - అనఁగా పరబ్రహ్మము. అట్టి నరము (పరబ్రహ్మము) నుండి పుట్టినవి నారములు - అనఁగా అవ్యక్తాది తత్త్వములు, ఇందులకు ('నరా జ్జాతాని భూతాని నారాణీతి విదుర్బుధాః' అని భారతము ) అవ్యక్తాది తత్త్వములకు నీవును నీ కాలత్త్వమును అయనముగా (స్థానముగాఁ) గలవాఁడా, నారాయణ = నారము అనఁగా జలములు గనుక) జలములు స్థానముగాఁ గలవాఁడా (లేక నార మనఁగా జ్ఞానము గనుక), అపరోక్షజ్ఞానమునకు స్థానమైనవాఁడా, లేక అపరోక్షజ్ఞానమే స్థానముగాఁ గలవాఁడా, నారాయణ = (రై అనఁగా శబ్దము, రాః అనఁగా శబ్దములు, రాశ్శబ్దాః అయన్తే నిర్గచ్ఛన్తే యస్మా త్సః రాయణః రాయణాదన్యః అరాయణః, అరాయణో నభవతీతి నారాయణః శబ్దగమ్య ఇత్యర్థః) = శబ్దగమ్యుఁడా, నిజసహస్రనామస్తుత్యా = తనవైన సహస్రనామములచేత స్తోత్రము చేయఁదగినవాఁడా.

తా. సుగమము. ౯౯౦

శ్లో. దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమే వాహ మితి మే నిశ్చితా మతిః. ౯౯౧

టీ. అహం = నేను, దేహబుద్ధ్యా = దేహ మనెడి తలఁపుచేత, దాసః = నీసేవకుఁడను, అస్మి = అయ్యెదను, జీవబుద్ధ్యా = జీవుఁ డను తలఁపుచేత, త్వదంశకః = నీయంశమైనవాఁడను, అస్మి = అయ్యెదను, ఆత్మబుద్ధ్యా = పరమాత్మఁ డనెడు బుద్ధిచేత, అహం = నేను, త్వమేవ = నీవే, అస్మి =

అద్వితీయుండను, ఇతి = ఇట్లని, మే = నాయొక్క, మతిః = బుద్ధి, నిశ్చితా = నిశ్చయింపఁబడినది.

తా. నేను, కేవలము దేహము నని తలఁచితినా నీకు దాసుఁడ నగుదును. దేహవిశిష్టుఁడయిన యాత్మ యగు జీవుండ నని తలఁచితినా నీ యంశ మగుదును, దేహవ్యతిరిక్తుఁడయిన కేవలాత్మస్వరూపుఁడ నని తలఁచితినా పరబ్రహ్మమగు నీవే యగుదును. ఇట్లని నేను బుద్ధియందు నిశ్చయించుకొంటిని. ౧౯౧

వ. అని పల్కి సాదరంబుగా ననుజ్ఞాతుం డై నిజాశ్రమంబున కరిగి యా హనుమంతుం డొక్క పరమైకాంతస్థలంబున సుఖాసీనుం డై శ్రీరామచరణకమలభక్తియుక్తుండును, శ్రీరామనామ జపపరాయణుండును, శ్రీ రామబ్రహ్మతత్త్వావలోకన నిరతిశయ నిర్వికల్ప సమాధినిష్ఠుండు నై జీవన్ముక్తిసుఖం బనుభవించుచు నిమ్మహార్తంబున నున్నవాఁ డని పలికి శ్రీ మహాదేవుం డ ప్పార్వతీదేవి కిట్లనియె.

టీ. అని పల్కి, సాదరంబుగాన్=ఆదరముతోఁ గూడినట్లుగా, అనుజ్ఞాతుండై = సెలవు పొందినవాఁడై, నిజ ఆశ్రమంబునకున్ = తన యాశ్రమమునకు, అరిగి = పోయి, ఆ హనుమంతుండు, ఒక్క, పరమ ఏకాంత స్థలంబునన్ = మిక్కిలి విజనమైన ప్రదేశమునందు, సుఖ ఆసీనుండై = హాయిగాఁ గూర్చున్నవాఁడై, శ్రీరామ...యుక్తుండును = శ్రీరాముని యడుగుపద్మములందు భక్తితోఁ గూడినవాఁడును, శ్రీరామనామ జపపరాయణుండును = శ్రీరామనామ మంత్రమును జపించుటయందు మిక్కిలి యాసక్తుఁడైనవాఁడును, శ్రీరామ...నై—శ్రీరామబ్రహ్మ = శ్రీ రాముఁడనెడి పరబ్రహ్మముయొక్క, తత్త్వ = కలరూపును, అవలోకన = కనుఁ

గౌడి అమృతరసమును త్రాగుటవలని మత్తుచేత నైనయుండువారై, అన్యో
న్య ఆలింగనంబులు = ఒకరి నొకరు కౌఁగిలించుకొనుటలు, కావించి = చేసి,
పరమసుఖ ఏకస్వరూపులై = మిక్కుటమైన యానందమే స్వరూపముగాఁ
గలవారై, నిజ...సక్తులు = తమ అడుగుఁదామరలను గొలుచుటయం
దాసక్తిని గలవారు, ఐన భక్తులను, రక్షించుచున్, ప్రకాశించుచుండిరి.
అంతన్ = అటుపిమ్మట. ౯౯౮

మత్తకోకిల.

నీవు నాహృదయాంబుజంబున ౯ నిల్చి భానునికైవడిం
గేవలాత్మవివేకమున్ వెలిఁగించుచున్ బరికింపఁగాఁ
బావనం బగురాజయోగము ౯ పల్కితిం దగ శ్రీమహా
దేవ! సద్గురురాయ! కావుము ౯ దీని నీయిల రంజిలన్

టీ. శ్రీమహాదేవసద్గురురాయ = శ్రీమహాదేవుఁ డను పేరు గల గురు వర్యా, నీవు, నా హృదయాంబుజంబునన్ = నా హృదయకమలమునందు, నిల్చి, భానునికైవడిన్ = సూర్యునివలెనే, కేవలాత్మవివేకము = శుద్ధం బగు బ్రహ్మజ్ఞానమును - అఖండాత్మస్వరూపముయొక్క జ్ఞానము ననుట, వెలిఁగించుచున్ = ప్రకాశింపఁజేయుచు, పరికింపఁగాన్ = విచారింపఁగా- బ్రహ్మజ్ఞానము నెడతెఁగక చూచుకొనుచుండగా ననుట, పావనంబు = పవిత్రము, అగు, రాజయోగము = రాజయోగమును, తగన్, పల్కితివి. దీనిన్ = ఈ రాజయోగమును చెప్పుట—ను నేను వివరించిన ఈ రాజయోగము ననుట, ఇయ్యిలన్ = ఈ భూమియందు, రంజిలన్ = వెలయునట్లు, కావుము = రక్షింపుము.

తా. శ్రీ మహాదేవ గురూత్తమా! నీవు నామనఃకమలమునందు నిలిచి సూర్యునివలె పరిశుద్ధబ్రహ్మజ్ఞానమును ప్రకాశింపఁజేయుచుండుటంజేసి,

నేను పవిత్రమగు రాజయోగముస్వరూపమును వర్ణించితిని. ఇది భూమి యందు వెలయుచుండునట్లు రక్షింపుము. ౧౯౯

శా. దత్తాత్రేయ గురుస్వరూప నిజభక్తస్వాంత స్తమోదీప స
చ్చిత్తానందకరానులాప ఖమరుచ్చిత్రాంశువార్భూప ధీ
వృత్తిత్యాగకలాప నిత్యసుఖ సంవిద్వ్యాప శుద్ధాత్మశ
శ్వత్తేజోభిహతాదిపాప సుజనేష్టప్రాపకా వ్యాపకా!

టీ. దత్తాత్రేయ ..రూప = అత్రిమునిపుత్త్రుఁడైన దత్తాత్రేయుని స్వరూపము గలవాఁడా—దత్తాత్రేయుని వంటివాఁడా యనుట, నిజభ... దీప = తన భక్తుల మనస్సునందలి అజ్ఞాన మను చీఁకటికి దీపమైనవాఁడా- దీపము చీఁకటిని బోఁగొట్టునట్లు వారి యజ్ఞానమును బోఁగొట్టువాఁడా యనుట, సచ్చిత్తా ..లాప = సచ్చిదానందరూపుఁడగు బ్రహ్మమును ప్రతిపాదించు సంభాషణ గలవాఁడా, ఖమరుత్ ... భూప—ఖమరుత్ చిత్రాంశు వాః+ భూప = ఆకాశము గాలి అగ్ని నీళ్లు భూమి అనెడి పంచభూతములను, ప = రక్షించువాఁడా, ధీవృత్తిత్యాగకలాప=బుద్ధియొక్క వర్తనములైన రాగాదులను వదలుటయే అలంకారముగాఁ గలవాఁడా, నిత్యసుఖ సంవిద్వ్యాప = శాశ్వతబ్రహ్మానందరూప మగు జ్ఞానముచేత వ్యాప్తుఁ డయిన వాఁడా, శుద్ధా...పాప - శుద్ధాత్మ = ప్రత్యగాత్మయొక్క, శశ్వత్ = నిత్యమయిన, తేజః = ప్రకాశముచేత, అభిహత = కొట్టఁబడిన, ఆది పాప = అనాది యగు పాపములు గలవాఁడా, సుజన ఇష్టప్రాపకా = సజ్జనులయినవారి యిష్టములను పొందించువాఁడా, వ్యాపకా = అంతటను వ్యాపించినవాఁడా!

క. ప్రణవాత్మక! సదసత్కా
రణసంపూర్ణప్రభాభిరామ! సగుణ ని

ర్గుణనిర్వికార! నారా
యణ! సీతారామగురుమహాదేవ! శివా! ౨౦౧

టీ. ప్రణవాత్మక = ఓంకారస్వరూపా, సత్ అసత్ = చేతనము నకు అచేతనమునకు—అనఁగా సకలజగత్తునకు, కారణ = కారణమైనవాఁడా, సంపూర్ణప్రభా + అభిరామ = నిండిన కాంతిచేత, మనోహరుఁ డయిన వాఁడా, సగుణ = కల్యాణగుణములతోఁ గూడినవాఁడా, నిర్గుణ = ప్రకృతి గుణములు లేనివాఁడా, నిర్వికార = వికారములు లేనివాఁడా, నారాయణ = నారాయణ స్వరూపుఁడా, శివా = మంగళస్వరూపుఁడా, సీతారామగురుమహాదేవ = సీతారామస్వరూపుఁడవైన మహాదేవగురుఁడా.

మాలిని.

ఘనతరసువివేకా! కల్పితాశేషలోకా!
వినమితబుధలోలా! విశ్వవిఖ్యాతలీలా!
జననుతగుణతంత్రా! సర్వతంత్రస్వతంత్రా!
మునిసరసిజమిత్రా! మోక్షలక్ష్మీకళత్రా! ౨౦౨

టీ. ఘన . వివేకా = మిక్కిలి గొప్పది యగు మంచిజ్ఞానము గలవాఁడా, కల్పిత అశేషలోకా = నిర్మింపఁబడిన ఎల్లలోకములు గలవాఁడా, వినమిత బుధలోలా = నమ్రు లయినపండితులయం దాసక్తి గలవాఁడా, విశ్వవిఖ్యాతలీలా = ప్రపంచమందు ప్రసిద్ధమైనవిలాసము గలవాఁడా, జననుత గుణతంత్రా = జనులచేత పొగడఁబడినగుణములకు అధీనుఁ డయినవాఁడా - అట్టిగుణములు గలవాఁడా యనుట. సర్వతంత్రస్వతంత్రా = సర్వశాస్త్రములయందు విశృంఖలాధికారము గలవాఁడా, మునిసరసిజమిత్రా = ఋషు లనెడి తామరలకు సూర్యుఁ డయినవాఁడా, మోక్షలక్ష్మీకళత్రా = ముక్తికాంతయే భార్యగాఁ గలవాఁడా. ౨౦౩

గద్య. ఇది శ్రీమన్నారాయణ మహాదేవగురు కరుణాకటాక్ష వీక్షణ విమలీ
కృత నిజహృదయ కమలకర్ణికాంత స్సందర్శితాఖండ సచ్చిదానంద
రసైకస్ఫూర్తి షట్చక్ర సీతారామమూర్తి పరశురామ
పంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతం బైన
శ్రీ సీతారామాంజనేయసంవాదం బను యోగ
శాస్త్రంబునందు సమనస్కయోగాను
భవవిచారం బన్నది సర్వంబును
తృ తీ యా శ్వా స ము
సం పూ ర్ణ ము.
ఓం శ్రీ సీతారామాంజనేయార్పణ మస్తు.





Ananda Press, Madras.

# ఆర్. వెంకటేశ్వర్ అండు కంపెనివారి

## గ్రంథరత్నములు.

---

**శృంగార నైషధము—**

శ్రీనాథ మహాకవి ప్రణీతము.

బ్రహ్మశ్రీ కే వేంకటశాస్త్రి

విరచిత

టీకాతాత్పర్యసహితము.

సవ్యాఖ్యానము, చిత్రములు గలిగిన మేలు ప్రతి

కాలికో బైండు వెల రూ. [illegible]—0—0

**మదుత్తరరామాయణము—**

కంకంటి పాపరాజప్రణీత

పద్యకావ్యము.

పంచాగ్నుల - ఆదినారాయణ శాస్త్రిగారిచే

వ్రాయబడిన చక్కని పీఠిక, క్యాలికో బైండు 2—0—0

**స్వారోచిషమనుచరిత్రము—**

పెద్దనామాత్యప్రణీతము.

టీకాతాత్పర్యసహితము, క్యాలికో బైండు వెల రూ. [illegible]—0

**రఘవపాండవీయము—**

వ్యాఖ్యాత:

విద్వాన్ ఈ - భాష్యకాచార్యులు

మంచి కాలికో బైండు వెల రూ. 2—0—0

వసుచరిత్రము—

శ్రీ రామరాజభూషణ ప్రణీతము.

కీ. శే. తంజనగరము - తేవప్పెరుమాళ్లయ్యగారిచే వ్రాయఁబడిన ఉపోద్ఘాతము. అనేక పూర్వవ్యాఖ్యానములను క్రోడీకరించి వ్రాయబడిన వ్యాఖ్యానము. దళసరి గ్లేజు కాగితములపై ముచ్చటగ ముద్రించిన గ్రంథము.

రాయల్ సైజు, క్యాలికో బైండు, గిల్టు పేరు. వెల రూ. 4—0—0

సప్తమస్కంధము—

శ్రీమదాంధ్ర భాగవతాంతర్గతము.

బ్రహ్మశ్రీ పండిత పురాణం

సూర్యనారాయణ తీర్థులవారిచేఁ

బరిశోధితము.

టీకాతాత్పర్య సహితము, పటములతో, క్యాలికో బైండు వెల రూ. 1—

డిటో పేపరు బైండు ,, 1—0—0

శ్రీభద్రాచల రామదాసు చరిత్రము—

క్రొత్తకూర్పు, పేపరు బైండు. వెల రూ. 1—0—0

క్యాలికో బైండు ,, 1—4—0

విశ్వగుణాదర్శము—

సటిప్పణాంధ్రపద్య టీకా తాత్పర్యతీకాస సహితము.

సన్నిధి పంచాంగం - దేవరాజ పెరుమాళ్లయ్యవారిచే

విరచితము.

క్యాలికో బైండు వెల రూ. 2—8—

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెని,

ఆనంద ముద్రణాలయము, లోక్ స్క్వేర్, మదరాసు.